# FOREWORD.

It is with pleasure that I respond to the invitation o/ earned translator of the *Ramayana* from the Samskr contribute a foreword to his volumes. It must always be a ma great inspiration for any Hindu to be reminded of this maste which has furnished spiritual consolation to the millions c land for the last many centuries and has won for this country place in the literature of the world. There is probably nothing rouses greater love and enthusiasm in the hearts of the pe India, than the remarkable series of episodes connected w hero of this epic. Wherever one may roam over this vast co the affection and esteem in which the name of this incarn held is noticed even by a casual observer. This writer h recollections of numerous scenes testifying to the existence widespread influence. On the heights of the Himalayan m at nights at a hill station, he has heard the hillmen g around the camp-fire and singing to themselves stories f *Ramayana* in sing-song accents. Pushing as far as Cape one November afternoon, this writer found a group of pe small house near the seashore entertaining themselves wit from the same epic. Staying amidst the ruins of Vijayan

needs of clearness and simplicity which are probably two of th fundamental qualities of all good style. On many an occasion, h has triumphed over the difficulties presented by the obscurity o Samskrit and the limitations imposed by the needs of literal translation. Figures of speech and the ordering of words, with a view to produce harmonious expression are always accomplished in the most unobtrusive manner. He retains uniformity of excellence in all kinds of composition occuring in the course of the volumes in the telling of the story, in the description of nature, in the treatment of philosophical problems and in the expression of spiritual devotion. While congratulating him on the production of such a monument of literary accomplishment, we will venture to express the hope, especially as he is still young in years, that he is destined to enrich Telugu literature by further contributions of even higher value.

It is impossible to close without a word of appreciation of the generous enthusiasm of the publishers of this monumental work who have undertaken it, as has been the case in many instances with them out of the mere love of Telugu literature. During the last few decades, it has been their privilege to add many masterpieces to Telugu literature and to revive the popularity of many more. We have no doubt that when the time comes for the writing of the full history of the literary renaissance of the Telugu people during this period, a grateful and honourable reference will be made to the numerous beneficient activities of this enlightened publishing house

THE BENARES HINDU UNIVERSITY
*Benares, 21 Sept., '24.*

P. SESHADRI,
*Head of the Department of English studies*

# పీఠిక.

శ్రీవాల్మీకిరామాయణము నాంధ్రీకరించి, శ్రీయుత జనమంచి శేషాద్రిశర్మగారు వారిగ్రంథమునకు నన్ను పీఠికను వ్రాయ నుద్దేశింప, నే నానందపూర్వకముగ నాపనికి గడంగుచున్నాను. అనేక శతాబ్దములనుండి లక్షలకొలఁది హిందూదేశ ప్రజల కాధ్యాత్మికసుఖమును గలుగఁజేయునట్టియు, భారతవర్షమునకు ప్రపంచక వాఙ్మయమునం దధిక గౌరవమును స్వీకరించినట్టియు, రామాయణమహాకావ్య స్మరణమే హైందవునిహృదయము పులకరింపఁజేయకుండును? ఈమహాకావ్యకథానాయకుఁడగు శ్రీరామచంద్రుని పవిత్రచరిత్రకంటె, నధికప్రేమయు నుత్సాహమునుఁ గలుగఁజేయునది వేఱొకటి లేదని చెప్పవచ్చును. ఈ విశాలదేశమునం దెచ్చటఁ గ్రుమ్మరిన నీయవతారమునకు ప్రజలయందుండు ప్రేమయు గౌరవమును విశదమగుచునే యుండును. విస్తీర్ణమయిన యీ ఆర్యావర్తమం దనేకప్రాంతంబుల నీ ప్రాబల్యమును దెలుపు సూచనలు గమనించియుంటిని. హిమాలయోన్నత ప్రాంత పర్వత నగరమునం దొకరేయి చలిమంటకాచుకొనుచు పాటరూపమున అమితానందముతో రామాయణకాలక్షేపము చేయుచున్న కొందఱఁ గొండమనుష్యులఁ గాంచఁ గల్గితిని. ఒకానొక మాఘమాసమధ్యాహ్నమున కన్యాకుమారి అగ్రమును జేరుచు సముద్రతీరమునొకచిన్నగృహమందు రామభక్తులు గుమిఁగూడి రామాయణము చదువుటయు గంటిని. శ్రీకృష్ణదేవరాయ సామ్రాజ్యస్థానమై ప్రఖ్యాతినొంది ప్రస్తుతము శిథిలమైన విజయనగరమున నొకరాత్రి రామదివ్య చరిత్రను ప్రభాతకాలముపఱకు పాడుచుండు టచ్చట వింటిని. దక్కను మధ్యప్రదేశశాననములం దేమి, కేరళదేశతాళపనములం దేమి, ఉత్తరహిందూస్థాన బయళ్లయం దేమి, రాజపుత్రస్థానపు సరిహద్దులచెంత నేమి, హిందూదేశపశ్చిమ సముద్రతీర ప్రాంతమునసేమి, ఘూర్జరదేశమం దేమి, వేయేల, అతిదూర సాగరాంతరసింహళద్వీపమందుఁగూడ, మానవచరిత్ర శిఖామణియైన రామావతారమం దదే ప్రేమయు నుత్సాహమును నాకన్నులారఁ జూడఁగల్గితిని.

శ్రీవాల్మీకిమహాగ్రంథము నప్పుడప్పుడు తెనుఁగు భాషయందు గ్రంథకర్త లనేకవిధముల ప్రదర్శింపఁబూను టాశ్చర్యకరమయిన విషయము గాదు. గోపీనాథ, భాస్కరరామాయణము లుండనే యున్న...

నాంధ్రీకరించిరి. అనేకవత్సరముల పాండిత్యపరిశ్రమముచే శేషాద్రిశర్మగారిచే నొనర సాగింపఁబడిన యీనవీనభాషాంతరీకరణమునకు కారణమొసంగుటకు హేతువు లేదు. కవితాకన్యను ఏరూపమున నలంకరించినను సౌందర్యవతిగనే యుండునని 'హారెసు' యనెడి 'లాటిన్' కవి వ్రాసిన వాక్యము రామాయణమునకు తప్పక వర్తింపవచ్చును. అధ్యాత్మభక్తిపరులకన్ననో రామాయణకథ నింకొకసారి ఆమూలాగ్రముగ చెప్పుకొనుటయే యొక తృప్తి.

భాషాంతరీకరణకులు ద్రోహులని 'ఇటలీ' దేశస్థులలోనొకలోకోక్తిగలదు. కాని ఈసామాన్యమగునమ్మకమునకు కొన్నిసమయములం దనేకవిరోధనిరూపణములు దృశ్యములు. ఆంధ్రగీర్వాణభాషల యత్యంతాన్యోన్యమువలనను, ఈభాషాంతరీకరణకులకు ఉభయభాషలయందుఁ గల గాఢపాండిత్యమువల్లను, ఈగ్రంథమందు రమ్యరచనయు, భాషీయసంప్రదాయమును, అర్థరూఢిత్వమును, శుద్ధశైలియు నిండియున్నవి. ఇంత పరిశ్రమముతోను, సమగ్రతతో నొనరించిన యీగ్రంథమునకు ఏపొగడ్తయు నెక్కువగాదు. ఈమహాకావ్యవిస్తీర్ణతను గమనించినపుడు గ్రంథకర్తకింకను నెక్కుడు ఘనత నియ్యవలసియుండును. పాశ్చాత్యగ్రంథకర్తలచే మిక్కిలి గౌరవముతోఁ జేర్కొనఁబడు వారికావ్యములు మనదేశపు రామాయణమహాభారతములతోఁ బోల్చినఁ దృణతుల్యములు.

పరిశ్రమపూరితమయిన యీసుందరకావ్యమువలన గ్రంథకర్తగారికాంధ్రవాఙ్మయమం దిదివఱకే యేర్పడియున్న యశస్సు మిక్కిలి వృద్ధియగుట కేమియు సందేహములేదు. గ్రంథకర్తగారికి కొలదికాలములోనే పెక్కుగ్రంథములు వ్రాయు ప్రాప్తిలభించినది. బ్రహ్మాండపురాణమును, లలితోపాఖ్యానంబును మిక్కిలి అందముగా తెనిఁగించిరి. పాండవజ్ఞాతవాసకథను నాటకరూపంబున సప్తాంకములలో ప్రచురించిరి. విరామములేని గ్రంథరచన కార్యమువలన మనదేశపు మహాకావ్యము లనేకవిధములందు వీరు జనసామాన్యమున కందునట్లు చేసియున్నారు. ఈవాల్మీకిమహాకావ్యసంపూర్ణాంధ్రీకరణభారము పూనుటకు పూర్వము రామాయణమహాభారతముల స్త్రీలకును బాలురకు నుపయోగమగునటుల సంగ్రహ

ర్థములందు గీర్వాణభాషాకాఠిన్యమును, భాషాంతరీకరణాటంకములును జయించిరి. అలంకారప్రయోగమునందును, శబ్దమాధుర్యముకొఱకు పదగుంభనముఁ జేయుటయందును, శ్రమలేకయే తమసామర్థ్యమును జూపిరి. శైలి అన్నిచోట్లను సమలాలిత్యముగానే యున్నదని చెప్పవచ్చు. ఇతిహాసవివరణమునందును, ప్రకృతివర్ణనమందును, తత్వశాస్త్రచర్చయందును, భక్తిభావప్రకాశకమునందును, ఒకే రీతిని కవిత్వముఁ జెప్పియుండిరి. వారు వ్రాసిన యీగొప్పగ్రంథమునకు వారినభినందించుచు, ఇప్పటికిని యుక్తవయస్కులు గాన, నాంధ్రవాఙ్మయమున కింకను నమూల్యమగు గ్రంథములను సమర్పింప సాహసులని విశ్వసించుచున్నారము.

ఈపీఠికను విరమించుటకు ముందు, కేవలము భాషాభిమానముచే ననేకేతరగ్రంథములవలె దీనినిఁ గూడ ప్రచురింపఁబూనిన, వావిళ్ల రామస్వామి శాస్త్రుల సుపుత్రులగు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులను పొగడకుండుట భావ్యము కాదు. గడచినకొన్నిదశాబ్దములలో నాంధ్రభాషకనేకనూతనకావ్యములఁ జేర్చియు, ననేకపురాణకావ్యముల ప్రాబల్యములను పునరుద్ధారణముచేసియు, వారు నాంధ్రుల కృతజ్ఞతకు మిక్కిలి పాత్రులయిరి. ఈకాలపు ఆంధ్రభాషోద్యమ చరిత్ర వ్రాయ సంభవించినపుడు, విజ్ఞానులయిన యీగ్రంథప్రచురకారులవా రొనరించిన సత్క్రియలకొఱకు కృతజ్ఞతతోను గౌరవముతోను తప్పక పేర్కొందురని నమ్ముచున్నాను.

హిందూవిశ్వవిద్యాలయము,
వారణాశి.

పూండి శేషాద్రి,
ఆంగ్లభాషావిభాగప్రధానుఁడు, కాశీవిశ్వవిద్యాలయము.

శ్రీ ర స్తు.

# ఆంధ్ర శ్రీమద్రామాయణకృతిసమర్పణోత్సవ ప్రశంస.



అభిరూపశేఖరులారా !

ఈశ్వరానుగ్రహము పెద్దలయాశీర్వాదము పూర్వజన్మసుకృతము ప్రోత్సాహకులయాదరము సహాయములు కాఁగా "యేన కేనా ప్యుపాయేన" యన్నయట్లు నే నాంధ్ర శ్రీమద్రామాయణమును బూర్తిచేయఁగల్గితి. సజ్జనోత్తముల సాయమున ముద్రణము పూర్తియయ్యెను. రామాయణము పఠించి యన్నశాంతి చేయుట పెద్దలయాచారము. ఇఁకఁ బలుసారులు పఠించి వ్యాఖ్యలం జదివిన నే నాయాచారము ననుసరింపఁదగినవాఁడనే కదా.

ఎట్లో వెట్టిమొట్టి యన్నట్లు పద్యములు వ్రాయఁగల్గితి. ఈకృతిని శ్రీరామచంద్రమూర్తి కర్పించుపని నే నొనరింపఁగల్గుదునా? "ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథాః" యన్నట్లు పెద్దల నొకచోటఁ జేర్చి వారి నాతిథేయసత్కారముల నర్చించి వారిసమ్ముఖమున శ్రీరామచంద్రునకు నాయీకృతిని సమర్పింప శక్తి నా కేవిధమునను లేదు కదా. ఎట్టు లీమహాకార్యము నెఱవేర్పఁగలను? అను శంక మనస్సున నంకురించి బాధింప నారంభించెను. అన్నశాంతి ప్రధానకృత్య మనునూహ స్థిరపడియె. అది ద్రవ్యసాధ్య మనునిశ్చయము గల్గె. ఇంక నే నక్కార్యమున నశక్తుఁడ ననుభావము సిద్ధాంతపదవి నధిరోహించెను. తరువాతఁ జింతాభరంబు నాపైఁ బడియె. దాన మనస్సు కలవిలపాటొంద సాగె. ఏమి చేయవలయునా యనునదియే నా కనవరతము కన్నులయెదుటఁ దోఁపసాగెను.

కొలఁదికాల మిట్లు గడచె. పరిణామ మెట్టు లనునాలోచన ముదయించె. ఇంతటికార్య మీయశక్తునిచేఁ జేయించిన భగవంతుఁడు పరమేశ్వరుఁ డీకార్యము మాత్రము చేయింపఁజాలకుండునా యనునూహయు నుదయించె. ఈరెండును గొంతకాలము క్రిందను మీఁదనుం బడుచుండెను. మొండినిబ్బరము గల్గెను. జానకీమనోనాయకునకు విన్నవింత మనునది గట్టిగా నాటెను. వేఱుగతి లేదనియుఁ దోఁచెను.

ఒక్కనాఁడు శుభముహూర్తమున శ్రీమద్రామచంద్రమూర్తిని నాచంచలమనస్సున నెట్లో నిల్పితి. భక్తిమెయి నిట్లు విన్నవించితిని.

సీ. ఆపదుద్ధారకుఁ ♦ డన్న నీవిఖ్యాతి సార్థకం బయి యిల ♦ నలరు నేని
దీనబంధువు రామ♦భూనాథుఁ డనుకీర్తి వాస్తవం బయి భూమి ♦ వఱలు నేని

యాశ్రితరక్షకుం ♦ డగు రాముఁ డఁట ఖ్యాతి సత్యపదస్థ మై ♦ సాగు నేని
తారకబ్రహ్మ మా ♦ శ్రీరాముఁ డనునుడి వేదసంసిద్ధమై ♦ వెలయు నేని
తే. కష్టదశనుండి దీనతఁ ♦ గాంచి నిన్నె, నమ్మి కడతేర్తు నీవను ♦ నమ్మికను
గనెడు నన్నిప్పు డిట్టియి♦క్కట్టునుండి, యెట్లు దరిఁజేర్తువో జాన♦కీశ! యీశ!.

ఈనాదీనాలాపంబులకు నాయల్పభక్తికి నానిస్సారకవిత్వమునకు నీనాయ శాస్త్రప్రార్థనంబునకు భగవంతుఁ డెట్లు సంతోషించునో యని నేనె వెఱగందితి. ఒరులమాట యిటఁ బ్రస్తావింపనేటికి? ఆకాలమహిమ మేమోకాని వెంటనే నాకొక్కయూహ తోఁచె. తోఁచినది స్థిరపడియె. కార్యరూపమున ఫలించునను సంతోషము గలిగె.

ఆమఱుదినము భానువార మగుట స్మృతికి వచ్చె. ఉదయమునఁ గృత్యముల నిర్వర్తించితి. ఏమి యిఁకఁ జేయఁదగునది యని యూహించితి. శ్రీరాముని బ్రార్థించితి. నీవే దిక్కిఁక వేఱుగతి లేదని బాష్పములచే నయనగోళముల నింపితి. పత్రికలు లిఖించితి. నన్ను గురువుగా భావించిన నాకన్నమంద ప్రజ్ఞుఁ డొకఁ డుండ నాతనిచేతి కిచ్చి "వత్సా!

నాయందుఁ బుత్రవాత్సల్య మునిచి నాశ్రేయస్సులం గోరుచు నాయభివృద్ధి కేవగింపక పరమానందముం బొందుచు నెట్టులేని సాయముం గోరినఁ జేయుదుమా యని యువ్విళ్ళూరుచున్న మ॥రా॥రా॥శ్రీ విదూరు పిచ్చయ్యగారికిని, కురుడి గుండురావుగారికిని, కౌకూరు శ్రీనివాసరావుగారికిని, సాధ్ఘజే సర్వోత్తమరావుగారికిని, బీ.పి. దేవరాజులునాయడుగారికిని ఇచ్చి రమ్మా" యని పంపించితి. ఈయైదుగురుమహానుభావులలో నాల్గవతడవ లెక్కింపఁదగినవారు హైస్కూలు నందుఁ బ్రధానోపాధ్యాయులు. తక్కినవారు న్యాయవాదులు.

నాపంచినపత్రిక యందగనే నాయందు వారి కెట్టికరుణయో గాని యర్ధఘటికకాలముననే నాగృహమున కరుదెంచిరి. వారిరాకచే సంతుష్టాంతరంగుఁడనై నాకార్యము నెఱవేఱినట్లే భావించి రామాయణమున ముద్రింపఁబడి నాయొద్ద నప్పుడున్న యైదుకాండములు వారియెదుట నునిచి మదీయోద్యమంబు సర్వము విన్నవించితి. వా రాక్షణముననే యీరామకార్యము నిర్వహింతు మని తమయుదారాభిప్రాయమును వెల్లడించుటయ కాక నాయెదుటనే పని యిట్లు సాగింపఁదగునని ముచ్చటించుకొనిరి ముద్రణము పూర్తికాఁగా వేసవిసెలవులు ముగిసినపిమ్మట నీయుత్సవము జరపుద మని సంతోషమున నుడివి నన్నుఁ గృతకృత్యునిం జేయ బద్ధకంకణులై తమతమనిలయంబుల కరిగిరి.

వేసవిసెలవులు గడచె. న్యాయస్థానపాఠశాలల కవాటోద్ఘాటనము చేయఁబడియె. పలుదెసలనుండి న్యాయవాద్యుపాధ్యాయాదిసద్విజసంఘము లరుదెంచి యథాపూర్వముగ స్వశాఖాపదముల నధిష్ఠించె. కొలఁదిదినములు మధురవా

క్కాలఁ గాలము గడపఁబడియె. గుసగుసలతో నించుకకాలయాపనము చేయఁ బడియె.

ఈశ్వరానుగ్రహమున వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగారు ముద్రణమును బూర్తిగావించిరి. ఆవార్త శ్రుతిపథమునఁ బడియె నావిజ్ఞప్తి నాలకించియున్న పెద్దలకు సంరంభ మధికమాయె. ఒక్కనాఁడు కృత్య మిదమిత్థ మని నిర్ణయింప సభఁ గావించిరి. కడపనగరపౌరాగ్రేసరులు పెక్కుమంది యరుదెంచిరి. ఆనాఁటి సభకు నభ్యున్నతన్యాయస్థానన్యాయవాది (హైకోర్టువకీలు) గారగు శ్రీమాన్ సి. నరసింహాచార్యులుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. ఈపని నీరీతిఁ జేయఁదగు నను క్రమము చర్చలపై సిద్ధాంతము చేయఁబడియెనని నాకుఁ దెలియవచ్చె. నా మనశ్చింత కాలూనఁజాలక పరుగిడెను. కార్యము ముగిసినంతదనుక నీకు నామన స్సునఁ జోటుగలదుండు మని తెల్పితిఁగాని యది యిఁక నిట నుండుట నాకు గౌరవముకాదని యోజించి కాఁబోలు చెప్పకయే పలాయన మంగీకరించెను.

రెండుమూఁడుసారులు చర్చింపఁబడి కార్య మిట్లు సాగింపఁ దగునను సిద్ధాంతము చేయఁబడినపిదప నాహ్వానసంఘ మేర్పఱుపఁబడియె. ఆమహాసభ యందు ఘనతవహించి పరోపకారబద్ధకంకణులై, పరశ్రేయస్సహానవిఖ్యాతికిం బాత్రభూతులై యలరారుచున్న

మ॥రా॥ శ్రీ విరూరు పిచ్చయ్యగారు, బి. ఏ., యఫ్. యం. యు.
,, పరుడి గుండురావుగారు, బి. ఏ., బి. యల్.
,, కాకూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. యల్.
,, టి. యం. నరసింహాచార్యులుగారు, బి. ఏ., బి. యల్., యం. యల్. సి.
,, సి. నరసింహాచార్యులుగారు, బి. ఏ., బి. యల్.
,, ఏ. లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., బి. ఇ.
,, సి. పి. బాబురావుగారు, బి. ఏ., బి. యల్.
,, బి. పి. దేవరాజులునాయఁడుగారు, బి. ఏ., బి. యల్.
,, యస్. సర్వోత్తమరావుగారు, బి. ఏ., ఎల్. టి.
,, వి. ప్రకాశముపంతులుగారు. బి. ఏ., బి. యల్.
,, ఏ. శఠకోపాచార్యులుగారు, బి. ఏ.
,, కే. లక్ష్మణరావుగారు, బి. ఏ., బి. యల్.
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్.
,, ఏ. నంజుండప్పగారు, బి. ఏ., బి. యల్.
,, పి. ముద్దుకృష్ణయ్యగారు, బారిష్టర్.
,, పి. వేంకటకృష్ణయ్యగారు
,, కా. వేంకటేశముశ్రేష్ఠిగారు
,, పుల్లగూరు శేషయ్యశ్రేష్ఠిగారు

మ॥రా॥ శ్రీ పత్తి. రాఘవులుశ్రేష్ఠిగారు
,, భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు
,, పైడిమఱ్ఱి వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు
,, చా. ఏకాంబరముశ్రేష్ఠిగారు
,, కృష్ణము రామలింగయ్యశ్రేష్ఠిగారు
,, కంచిరాజు నరసింహయ్యగారు
,, సుంకేసుల సుబ్బయ్యగారు
,, మంచిరాజు శేషగిరిరావుగారు
,, ఆలూరు లక్ష్మీనరసయ్యగారు
,, కందనూరు గురుమూర్తయ్యగారు
,, తిలుపుల వేంకటసుబ్బమ్మగారు
,, గోపవరము గోపాలరెడ్డిగారు
,, పేరూరు పెద్దవేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు

సభ్యులుగనుండుట కంగీకరించిరి. ఈయాహ్వానసంఘమునకు మ॥రా॥శ్రీ కాకూరు శ్రీనివాసరావుగా రధిపతులుగను, మ॥రా॥శ్రీ విరూరు పిచ్చయ్యగారు, కురుడి గుండురావుగారు, సి. పి. బాబురావుగారు ననున్యాయవాదులు కార్యనిర్వాహకులుగను నియమింపఁబడిరి. అందఱు సభ్యులు నీమహాకార్యమును జక్కఁగా నెఱవేర్ప నడుముకట్టిరి.

## విషయవిభాగము.

అన్నశాంతి ప్రధానకార్యముగానఁ దత్కార్యము మతత్రయమునకు వేఱువేఱ సాగించుట మంచిదని యూహించిరి. అందు మధ్వభూసురులకు మ॥రా॥శ్రీ కాకూరు శ్రీనివాసరావుగారును, శ్రీవైష్ణవభూమిదివిజులకు శ్రీమాన్ శఠకోపాచార్యులుగారును, స్మార్తక్షితిసురులకు మ॥రా॥శ్రీ కామిసెట్టి వేంకటేశముశ్రేష్ఠిగారు నన్నప్రదానముచేయఁ గోరికొనిరి. గ్రంథకర్తను గౌరవించుసత్కార్యము మావంతుగా నుండ నంగీకరింపుఁడని మ॥రా॥శ్రీ పత్తి రాఘవులుశ్రేష్ఠిగారును, భోగనాథము వేంకటసుబ్బయశ్రేష్ఠిగారును వాంఛించిరి. వికలాంగులకుఁ గడు బీదలకు నన్నదానపుణ్యము నాకు రానిం డని మ॥రా॥శ్రీ గోపవరము గోపాలురెడ్డిగా రభ్యర్థించిరి. ఈకార్యము లిట్లే జరగవచ్చు ననువిషయము సంఘసభ్యులచే మహానందపూర్వకాంగీకారమును బడసెను. తక్కుంగల కృత్యము లన్నియు యథామర్యాదగా జరపఁబడవలయు ననియు నది యందఱికృత్యమనియు సిద్ధాంతము చేయంబడియెను.

ఇప్పట్టున నవసరమే యైనను నాలుమాటలు చెప్పవలసియున్నది. గ్రంథకర్తృసత్కారకృత్య మొనరింపఁగోరిన శ్రేష్ఠిరత్నము లిరువురును గొంతకాలము

క్రిందట నారామాయణముద్రణమునకు సాయముచేయుదుమని నాతో మందలించిరి. ఏటికో నేనే యపు డుపేక్ష వహించితి. మ॥రా॥శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగారి కరుణ గలదను గర్వమే యట్లుపేక్షవహింపఁ జేసియుండునని తలంచెద. అట్లు నాకు సాయముచేయ నువ్విళ్లూరు నాశ్రేష్ఠిరత్నము లిరువురు నిపు డీకార్యము మావంతని యడుగుటయు సంఘసభ్యు లాకార్య మీరీతిగా జరపవలసియుండు నని నియమపూర్వకముగ నంగీకరించుటయుఁ బై నాయూహను దృఢపఱుపకపోవు. ఇట్లు సర్వవిధముల నాయశమునే తమదిగా భావించు నీసంఘసభ్యులకే నెట్లు కృతజ్ఞతను జూపఁగలనో యెఱుంగఁజాలకున్నాఁడను.

ఇట్లు చేయందగుకార్యము లిట్టి ట్లని నియతిమై నేర్పాటుచేసికొని యావలి కార్యములలోఁ బ్రధానమగు కృతిసమర్పణోత్సవసభాధిపతిని నిర్ణయించుట చర్చింపఁబడియె. ఈమహాసభకు శ్రీ వేంకటగిరిసంస్థానాధీశకుమారరత్నములై కుమారరాజవిఖ్యాతిం గాంచి శ్రీరామచంద్రచరణసరసిజనిహితసరసహృదయషట్పదులై యశఃకీర్తిసంవ్యాప్తదిగంతరులై యలరారు శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమార కృష్ణయాచేంద్రబహద్దరువా రాధిపత్యమును వహించుట సమంచితమనియు శ్రీవారియనుమతిం గొన విజ్ఞప్తిపత్రము నంపవలయు ననియు నేకవాక్యముగ నంగీకరింపఁబడియె. అచిరకాలముననే ప్రార్థనాపత్రికఁ బంచుటయు శ్రీవారందుల కంగీకరించితిమని తంత్రీవార్త నంపుటయునను నీకార్యద్వయము సాగెను.

ఆవల నీమహోత్సవ మెచ్చట జరగవలయు ననుశంక తలనూపె. కొందఱొంటిమెట్ట కోదండరామాలయమున జరపుట మేలనినట్లు తెలియవచ్చెను. కృతిపతి శ్రీరామచంద్రుఁడేయనియు, నాయాంధ్రశ్రీమద్రామాయణకృతినాయకుఁడు సర్వాంతర్యామియే యనియు, నట్లౌటఁ గడపనగరముననే సాగవలయుననియు నాహ్వానసంఘసభ్యులకు విన్నవించితి. నాయీమనవి నంగీకరించి కడపనగరమున రక్తాక్షిసంవత్సరశ్రావణమాసమున రోహిణీనక్షత్రనవమీతిథియందు శ్రీవైష్ణవశ్రీకృష్ణజయంతి యగుటయు స్థిరవారమగుటయుఁ గారణంబులుగా శ్రీరామకృతిమహోత్సవము జరపుట మేలని నిర్ణయింపఁబడియె. ఆకార్యము రెండుదినములు సాగవలయుననుటయు నిర్ణయపదవి నెక్కెను. దొరతనపులెక్క ననుసరించి పందొమ్మిదివందలయిరువదినాల్గవ సంవత్సరమున నాగష్టునెలయం దిరువదిమూఁ డిరువదినాలవ దినములందు శనివా రాదిత్యవారముల నీమహాసభ సాగునట్లు నిర్ణయము సాగె. ఈమహాసభ కొలఁదిమాసములక్రింద నిర్మింపఁబడిన ముద్దుకృష్ణనాటకశాలయందు జరగుట యుత్తమం బనియు నందుఁ బెక్కుపర్యాయములు ప్రహ్లాదహరిశ్చంద్ర కుశలవప్రముఖభగవత్కథాపవిత్రనాటకము లాడుట నాస్థలము పావనతమ మనియు, నీరామకృతి యందే వినుట ముఖ్యమనియు నీమొదలగు హేతువులంబట్టి నిశ్చయింపఁబడియె.

పిదప శుభముహూర్తమునఁ బండితులకు న్యాయవాదులు లోనగు పెద్దలకు సభనలంకరింపుఁడని యాహ్వానపత్రికలు పంపఁబడియె. జబ్బుచే రాఁజాలమని బ్ర॥శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులుగారును, కృష్ణాష్టమీప్రయుక్తోపవాసద్వయ మగుట రాఁజాల మని బ్రహ్మశ్రీ శతావధానులు కాశీ కృష్ణాచార్యులుగారును, దేవికిఁ బ్రసూతిసమయముగాన రావీలుండదేమో యని బ్ర॥శ్రీ శతావధానులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులుగారును, అనివార్యకారణములంబట్టి రాఁజాలకపోతిమని బ్ర॥శ్రీ కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారును, కార్యాంతరనిమగ్నుల మగుట రావీలులేకున్నదని బ్ర॥శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రులుగారును, దుర్భరకార్యవ్యగ్రుల మగుట రాలేమని బ్ర॥శ్రీ బులుసు పాపయ్యశాస్త్రులుగారును, జబ్బుచే రావీలులేదని వ్రాయ మనసొప్పకున్నదని శ్రీశ్రీ విక్రమదేవవర్మగారును లోనగుపండితకవిరాజులు పత్రికలు వ్రాసిరి. విఖ్యాతన్యాయవాదులగు మ॥రా॥శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యరు బి. ఏ., బి. యల్ గారు కార్యాంతరవ్యగ్రులౌట రాఁజాలమని తంత్రీవార్త నంపిరి. మ॥రా॥శ్రీ జయంతి రామయ్యపంతులు బి. ఏ., బి. యల్ గారును, మ॥రా॥శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి యమ్. ఏ. గారు రాఁజాలమని వ్రాసిరి.

ఉత్సవమునకుఁ జనుదెంచు పెద్దల కర్హరీతి నివాసాదు లేర్పఱుపఁబడియె. ఆగస్టునెల 22-వ తేది రాత్రి మదరాసునుండి శ్రీరాజా వెలుగోటి సర్వజ్ఞ కుమారకృష్ణయాచేంద్రబహద్దరువారు సపరివారముగ విజయముచేసిరి. వారింగూడియే మ॥రా॥శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారును, ఆరాత్రియే మ॥రా॥శ్రీ జి. రామేశ్వరరావుగారును, పండితకవులును, న్యాయవాదులునగు మ॥రా॥శ్రీ నాగపూడి కుప్పుస్వామి అయ్యరుగారును దయచేసిరి. అనంతపురము కళాశాలాంధ్రపండితులును, కవిరత్నములు నగు బ్ర॥శ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారును, బళ్లారి హైస్కూలునందు సంస్కృతాంధ్రపండితులగు బ్ర॥శ్రీ కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు, కవిశిరోమణి చింతలపల్లి నరసింహశాస్త్రులుగారును, దయచేసిరి. ప్రొద్దుటూరునుండి తర్కాలంకారశాస్త్రపండితులగు బ్ర॥శ్రీ రూపావతారము శేషశాస్త్రులుగారును,శతావధాని కవిసింహ డి. రాజశేఖరముగారును,బద్వేలునుండి పాఠశాలాంధ్రోపాధ్యాయులగు బ్ర॥శ్రీ విద్వాన్ రామకోటీశ్వరశాస్త్రులుగారును, కొండపేటనుండి సాహిత్యశిరోమణులును, నాకుం గొంతకాలము కావ్యములను జెప్పినకరుణామూర్తులగు బ్ర॥శ్రీ నేరెళ్లపల్లె రామకృష్ణశాస్త్రులుగారును, మదరాసునుండి కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రులుగారును, హిందూపురనివాసులై ప్రస్తుతము బళ్లారియందుండిన 'పౌరాణికకేసరి' బిరుదాంచితులై వేదాంతపండితులును సత్కవులు నగు బ్ర॥శ్రీ పక్కా రాఘవేంద్రాచార్యులుగారును దయచేసిరి.

బ్ర॥శ్రీ కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారును, వేంకటగిరి హైస్కూలు హెడ్‌మాష్టరుగారగు బ్ర॥శ్రీ అల్లాడి జగన్నాథశాస్త్రులు బీ.ఏ.ఎల్.టి గారును, 'సాహిత్యరత్న' బిరుదాభిరాములయి తర్కపండితులయి సురపురముసంస్థానపండితులు నయిన బ్ర॥శ్రీ అన్నావఝ్ఝుల సీతారామశాస్త్రులుగారును దమ యామోదమును దెల్పుచుఁ బద్యములను బంపిరి. పులివెందులనుండి నాచిరంతన మిత్రములగు మ॥రా॥శ్రీ యల్. వేంకటరమణయ్యగారు రాజాలక పద్యములం బంపిరి.

శ్రీకృష్ణజయంతియుదయమే పుష్పవిమానాధిరూఢుం డగు శ్రీజానకీనాథు నెదుట ఆంధ్రశ్రీమద్రామాయణ మునుపఁబడియె. తూర్యఘోషములతో నాగృహమునుండి దేవునికడపయందు వేంచేసియున్న శ్రీప్రసన్నవేంకటేశ్వరాలయము నకుం బోవఁ బౌరజనమహాశయులు గుమిగూడిరి. శ్రీరామకీర్తనలం బాడుచు భక్తులరుదేర శ్రీరామజయనాదములు దిక్కులఁ బ్రతిధ్వనింపఁజేయ మహోత్సవమునఁ బ్రయాణము సాగింపఁబడియె.

మార్గమధ్యమున శ్రీరాజకుమారకంఠీరవులు స్నానాదికృత్యములం దీర్చుకొని తమపాఠశాలాంధ్రపండితులగు మ॥రా॥శ్రీ యమ్. వేంకటసుబ్బయ్యగారిం గూడి బాష్పశకట మధిరోహించి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారితో నిష్టాలాపంబు లాడుచు నీమహోత్సవదిదృక్షానుయాయిపౌరబృందమును గలిసికొనిరి.

దేవునికడపపౌరప్రముఖులు మ॥రా॥శ్రీ రావిపెద్ది వేంకటరామయ్యప్రభృతులు మేళతాళములతో శ్రీరాజకుమారరత్నముల నెదుర్కొనిరి. అంత శ్రీవారు రథావతరణ మొనరించి పాదచారులై పౌరప్రముఖులతో నిష్టాలాపము లాడుచు దేవాలయమును జేరి ప్రదక్షిణపూర్వకముగఁ బ్రవేశించి శ్రీప్రసన్నవేంకటేశ్వర స్వామిపూజాసమయమున భగవంతుని సేవించిరి.

ఆసమయము చూడఁజూడ వేడుకగా నుండెను. ఆదేవాలయము ప్రాచీన శిల్పమును దెల్పును. శాలివాహనశకము ౧౪౭౭ సం॥లు కాఁగా విజయనగర రాజవంశజులగు శ్రీసదాశివరాయలుగారు శ్రీవేంకటేశ్వరుల దర్శించి యాగోపుర మును గట్టించిరి. ఆదేవాలయమున నాఁడు శ్రీకుమారరాజాగారును బండితకవులును, నుద్యోగస్థులును, న్యాయవాదులును గలిసి యుండఁగా శ్రీకృష్ణదేవరాయల యాస్థానమా యని తోఁచెను. కొందఱ టట్లే వచించిరి. ఇఁక నాంధ్రభోజులయాస్థాన మెట్లుండునో యన్న యూహ యీయుత్సవసమావేశము తోఁపింపఁజేసెను. పూజయగువఱకు శ్రీవారు నిలువంబడి భగవంతునిం గన్నులారఁ జూచుచుండిరి. ఆవల మండపమునఁ గొంతసేపు కూరుచుండి దేవాలయచరిత్రమును విని పండితకవుల నందఱిం గాంచి కరము హర్షించి మధ్యాహ్నము కాఁగా నిరవునకు దయ చేసిరి. నాఁటిమధ్యాహ్నమునకు సహస్రకంఠరామాయణాంధ్రవామనపురాణ

కర్తలగు బ్ర॥శ్రీ రామావఝ్ఝుల కొండయ్యశాస్త్రులుగా రగుదెంచిరి. ఆయుత్సవ ముతోనే శ్రీరామచంద్రమూర్తి నాటకమందిరాంతరసంస్థాపితసింహాసనోపరిభాగ మును జేర్పఁబడియె.

ఉదయము మొదలు సాయంకాలముదనుక మ॥రా॥శ్రీ గోపవరము గోపాలు రెడ్డిగారు బీదల కన్నదానము నోపికమై నొనరించిరి. ఆకార్యమే ప్రధానముగా భావించి శ్రద్ధమైఁ జేయుచుండుట సభకు రాఁజాలరైరి. పదునేనువందలమంది కడుబీద లన్నదానమున సంతృప్తులైరి. ఆయుత్సవమును జాలమంది చూచి యిట్టి పుణ్యము తమకు లభింపఁజేయక పోయిరని చింతించిరి.

మరల 3 గంటలకు సభాంగణము పౌరులతో నిండియుండెను. కడపనగర మునన్ను పెద్దమనుష్యు లందఱు దయచేసి స్థలము నించుకంతయు లేకుండఁ జేసిరి. క్రిక్కిరిసియున్న భక్తబృందముతో నాటకశాల కడు మనోహరముగ విరాజిల్లుచు నేత్రోత్సవము నొసంగుచుండెను.

శ్రీసభాధిపతిగారు సపరివారులై బాష్పశకటము నధిరోహించి తూర్యధ్వను లంబరం బగులింప విజయంచేసిరి. సభాభవనప్రవేశముతఱిఁ బౌరులయుత్సాహము వర్ణనాతీతము. కరతాళధ్వనులు మిన్ను ముట్టెను. అంత యథావిధ వముగ శ్రీశ్రీకుమారరాజావా రుపవిష్టులైరి ఆసమయము శ్రీకృష్ణదేవరాయలు కవిపండితగాయకాదివిద్వత్పరివేష్టితుండై నిండోలగంబున నుండునట్టి సమయ మిట్లే యుండు నని స్మృతికిం దెచ్చెను. మహానందమునఁ బౌరు లుల్లసిల్లుచుండిరి.

గౌతమీతీరవాసులై శ్రీరామచంద్రపీఠముం గొనివచ్చి కొంతకాలము నుండి యీయూర నుత్సవములు జరిపించు కైంకర్యము నొనరించు ఘనపాఠులు బ్ర॥శ్రీ ధవళ లక్ష్మీనారాయణావధానులుగారు తొలుదొలుత మంగళాచరణము వేదమంత్రముచేఁ గావించిరి. ఆవేదనాదము శ్రుతిమనోహరమై హృదయప్రమోదసంధాయకమై యొప్పెను అవ్వలఁ దిరుపతినుండి దయచేసిన పండితకవిరత్నము లయి న్యాయవాదులై యిపుడు పుత్రనిహితసంసారభారులై సదా పరమేశ్వర ధ్యానపరతంత్రులై కాలముం బుచ్చుచున్న బ్ర॥శ్రీ నాగపూడి కుప్పుసామయ్య బీ. ఏ., గారు స్వవిరచితములగు దేవతాస్తుతిపద్యముల గానసంయుతములుగాఁ జదివి సభ్యుల నానందాంబుధి నోలలాడించిరి. ఆపద్యగానము,

క. 'వీనులవిందై యమృతపు, సోనలపొందై యమంద♦సుమచలదళినీ
గానముక్రందై యాస్వన, మానందబ్రహ్మమైన ♦ నధిపతి సభ్యె-ల.'

అను వసుచరిత్రపద్యమును జ్ఞప్తికిం దేక వదలలేదు. పిదప శివస్తుతిరూపముననొప్పి శ్రీమదప్పయ్యదీక్షితవిరచితమగు చూర్ణికం జదివి సభ్యులమనస్సులు భక్తిరస నిమగ్నములుగా నొనరించిరి.

తర్వాత కడపపురమునఁ గలపాఠశాల(హైస్కూలు)యందుఁ దృతీయోపాధ్యాయపదవియందుండి భక్తులై వేదాంతశాస్త్రగోష్ఠి నెసంగుచు బహువిధ

నాటకముల నెఱింగి భగవత్స్తుతిరూపగానము సేయుతతి నారదుఁడే యనందగిన బ్ర॥శ్రీ జయరామాచార్యులు బీ. ఏ., గారు హయగ్రీవావతారబోధకచూర్ణిక ననర్గళధారతో శ్రావ్యముగ నర్థవంతముగఁ జదివి సభ్యులకానందముం గూర్చి ప్రభుశిరోమణుల సుస్మితమునకుఁ బాత్రులై శ్రీరామచంద్ర సేవచేసి కృతకృత్యులైరి.

అమీఁద నాహ్వానసంఘాధిపతులగు బ్ర॥శ్రీ॥మ॥రా॥శ్రీ సత్యధీర కౌకూరు శ్రీనివాసరావు బి. ఏ, బి యల్. గారు ముద్రించియున్న తమస్వాగతోపన్యాసమును జక్కఁగా సభ్యు లెల్లరు శ్రవణముల నిక్కించి వినునట్లు చదివి కడప, మండలకవులచరిత్రము నించుక వివరించి యీకృతిసమర్పణమహోత్సవము కడపమండలమున మూఁడవపర్యాయము జరగుచున్న దనుట బోధించిరి. కడప మండలఖ్యాతి నాయుపన్యాసము వేనోళ్లఁ జాటె ననుట యతిశయోక్తి కానే కాదు. అందు నాచనసోమనాథకవి, అలసానిపెద్దన్నకవి కడపమండలమువారే యని సిద్ధాంతముచేసిన భాగము ప్రభుశిరోమణులకు సైతము నిర్భరానందమును గల్పించెను. యుక్తియుక్తముగను న్యాయముగ నుండె నని యెల్లవారు నోఁదల లూఁచిరి.

తరువాత నాహ్వానసంఘకార్యదర్శులలో నొకరగు మ॥రా॥శ్రీ విరూరు పిచ్చయ్య బీ. ఏ., గారు సభాంగణమున నిలిచి యీమహాసభకు రాఁజాలక, పత్రికలువ్రాసిన మ॥రా॥శ్రీ జయంతి రామయ్యపంతులు బీ. ఏ., బి. యల్. గారు లోనగు మహాత్ములపత్రికలం జదివిరి.

ఆవల సభాధిపతిత్వనిర్ణయము వాడుకచొప్పున మ॥రా॥శ్రీ గుండురావు బీ. ఏ, బి. యల్. గారిచేతను బ్ర॥శ్రీ రూపావతారము శేషశాస్త్రులుగారిచేతను జేయఁబడి సర్వజనాంగీకృతమయ్యెను. శ్రీవారు సభాధిపత్యస్థానము నలంకరింపఁ గరతాళధ్వను లలరారె.

శ్రీసర్వజ్ఞ కుమారకృష్ణమయాచేంద్రబహద్దరువారు లేచి తమయారంభోపన్యాసమును మెల్లగా మృదుమధురశైలిని సభ్యులహృదయముల నాకర్షించునట్లు చదివిరి. తమయాస్థానకవులయి రామాయణము నాంధ్రీకరించిన శ్రీగోపీనాథము వేంకటకవిగారికవితను బేరుకొని, ఆంధ్రవాల్మీకి బిరుదాంచితులగు బ్ర॥శ్రీ వావిలికొలను సుబ్బరావుగారి రామాయణముశైలిని స్పృశించి ప్రకృతమగు నాంధ్రశ్రీమద్రామాయణరచనను విమర్శించి భాషావిషయమగు స్వమతమును వివరించి తమయుదారభావమును శ్రీరామచంద్రమహిమను గుఱించి దెలిపి యిందఱిట్లు రామాయణమునే తెనిఁగింప నేల యన్న సంశయమును దొలఁగించుప్రసంగముల విస్తరించి సభ్యుల హృష్టమనస్కులఁ గావించిరి.

ఆయుపన్యాసమే శ్రీరాజావారి భాషాభిమానమును, కవిత్వపక్షపాతమును, కవిప్రీతిని స్పష్టపఱచెను. ప్రభుశిరోమణులభావ మిట్లుండునే బళీ యని యెల్లరు మెచ్చుకొనిరి. పరమభక్తులై కృష్ణాష్టమి యాట నాఁడు శుష్కోపవాసముండి పయసునఁ జిన్నవారయ్యు బుద్ధిమహిమమున వృద్ధులై, యుదారాశయములఁ బ్రాచీనప్రభుపుంగవుల మించి యలరారు శ్రీవారి గంభీరోపన్యాస మెంతో విన విన వేడుకను బుట్టించుచుండెను.

అనంతరము ఆంధ్రశ్రీమద్రామాయణమున ఇష్టదేవతాప్రార్థనాదికముగాఁ గృతిసమర్పణమును బోధించు షష్ఠ్యంతపద్యములదనుక మ॥రా॥శ్రీ బలపనగూడూరు నారాయణరావుగారిచేతను, బ్ర॥శ్రీ ఏచూరు చెంచయ్యగారిచేతను జదువఁబడియె. అందం దుచితరీతిని బ్ర॥శ్రీ నేరేళ్లపల్లి రామకృష్ణశాస్త్రులవారిచే నర్థము చెప్పఁబడియె.

తదుపరి బ్ర॥శ్రీ నాగపూడి కుప్పుసామయ్య బి.ఏ., గారు శ్రీరామమహిమమునా నొప్పు నుపన్యాసముం జదివిరి. రామశబ్దనిరుక్తి యెవరెవ రెట్లెట్లు చేసిరో ఆవిషయము రామతాపనీయోపనిషత్తునుండియు, స్కాందాదిపురాణములనుండియుఁ దెలిపి రామాయణపఠనఫలమును వివరించి రామాయణప్రతిపాదితభరతాది పాత్రముల యనురాగభక్తివైచిత్ర్యముల వెల్లడించి జానకీపాతివ్రత్యమును తేటపఱచి రామాయణరచనాకాలమును సిద్ధాంతీకరించి రామావతారతత్త్వము నెఱింగించి సభ్యుల కమితభక్త్యుల్లాసములఁ గల్గించిరి. ఆయుపన్యాసాంతమున రామాయణషట్కాండకథాసారమును దెలుపువాక్యములు వర్ణనాతీతములు. వాని నీగ్రంథమున నింకొకచో ముద్రింతును. చూడఁదగు. వీరియుపన్యాసము ముగియునప్పటికే యేడుగంటలకు మించెను.

## బహుమానము.

తరువాత నాహ్వానసంఘమున సభ్యులై, గ్రంథకర్తనగు నన్ను బహూకరించుకృత్యమున నియతులైన మ॥రా॥శ్రీ పత్తి రాఘవులుశ్రేష్ఠి, భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు తెచ్చిన సువర్ణసింహముఖాంచితకంకణములు కాశ్మీరదేశపుజోడుశాలువలు వస్త్రములు శ్రీరాజావారిసమ్ముఖమున నునుపఁబడియె.

శ్రీరాజావా రామఱుదినము సభాధిపత్యము వహింప నవకాశము చాలదని తెలిపిరి. అనివార్యకారణములచేతనే యిట్లు చెప్పవలసివచ్చెననియు, నిందుండి యీరెండుదినములు భక్తులతో మెలఁగుట ప్రాప్తము లేదనియుఁ దమకిది విచారమునే గల్గించుచున్నను విధిలేక వెళ్లుచున్నా మనియుఁ బల్కిరి. కావున మఱుదినము జరపఁదలఁచిన బహుమాన మానాఁడే శ్రీవారిద్వారా జరపఁదగునని వెల్లడియాయె.

అంత శ్రీరాజావారు లేచి యాకంకణముల నాకుఁ గటాక్షించి శాలువలఁ గప్పి తాము రెండునూటపదార్లును జోడుశాలువలును దమసంస్థానమునుండి పంపుదు మని వాక్రుచ్చిరి.

అప్పుడు మదరాసునుండి వచ్చియున్నట్టియు నీగ్రంథముద్రణమునకుఁ జాల ధనసహాయము చేసియున్న మ॥రా॥శ్రీ బొల్లు రామయ్యశ్రేష్ఠిగారు కాశ్మీరశాలువను శ్రీరాజావారిద్వారా యిప్పించిరి. వేంకటగిరినుండి హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు మ॥రా॥శ్రీ అల్లాడి జగన్నాథశాస్త్రులు బి.ఏ.,ఎల్. టిగారుపంపిన రూప్యములు తక్కుంగలరామభక్తు లొసఁగినరూప్యములు శ్రీవారిమూలముగా నొసఁగఁబడియె.

పిదపనాకృతజ్ఞత నించుక నిస్సారవుమాటలచే విన్నవించితి. తమరుండఁ జాలమికిఁ జింతిల్లుచు శ్రీకుమారరాజాగారు 7-50 గంటలకు బసకు దయచేసిరి.

ఆరాత్రికి నీనగరమున మ॥రా॥శ్రీ బి.పి. దేవరాజులునాయడు బి. ఏ., బి.యల్ గారిచే నెలకొల్పఁబడిన దీనరక్షకసభ వారిచేఁ బ్రదర్శింపంబడు పాదుకాపట్టాభిషేకనాటకమును శ్రీకుమారరాజావారు దిలకించి యాసభవారికిఁ దమసంస్థానమునుండి యర్ధనూటపదార్లు బహుమతిగాఁ బంపుదుమని వాగ్దానమొనర్చి యారాత్రికే పయనమై దయచేసిరి.

మఱుదిన ముదయము 7 గం॥కు సభాశాలపౌరులచే నలంకృత మాయెను. ఆసభకు నధిపతిగా మ॥రా॥శ్రీ నాగపూడి కుప్పుసామయ్య బి. ఏ గారు నియోగింపఁబడిరి. వారు తమయారంభోపన్యాసము ముగించి కార్యక్రమమునకుం బూనిరి. బ్ర॥శ్రీ చింతలపల్లి నరసింహశాస్త్రులుగారు భాషాంతరీకరణపద్ధతి యనువిషయము నుపన్యసించిరి. ఆదినుండికవు లెట్లెట్లు మార్పుచు వచ్చినదియు, నిపు డీపద్ధతి యెట్లుగా మాఱినదియుఁ దేటపఱచిరి. ఆనాటిసభకు నొంటిమిట్టనుండి మ॥రా॥ శ్రీ ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావుగారు దయచేసిరి. తొలినాఁడు రాఁజాలమికి శ్రీకృష్ణజయంతియే కారణ మనిరి. అత్తఱి నుపన్యసించిన శ్రీనరసింహశాస్త్రులుగారి యుపన్యాసము చక్కనియనుభవమునఁ జెప్పినట్టిదై శ్రుతిహితముగ విహితముగ రసవంతముగ వాస్తవముగ నుండెను. సభ్యు లెల్ల మిగుల సంతోషించిరి.

పిదప బ్ర॥శ్రీ కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు ఆంధ్రశ్రీమద్రామాయణము రామాయణమున కెట్టిమార్పో యను విషయమును ముచ్చటించుచుఁ బెక్కుతావుల వ్యాఖ్యలం జదివి వానిభావములం దెల్పి యాభావము లిందుఁ జేర్పఁబడినవనియుఁ దేటపఱచి తమగంభీరోపన్యాసమును బూర్తింగావించిరి. తదుపన్యాస మించుకంతయుఁ బక్షపాతములేక సత్యపదస్థమై యొప్పారుచున్నదని సర్వజనాంగీకృత మయ్యె ననుట కరతాళధ్వనులమూలమున స్పష్టమయ్యెను.

ఆవెనుక నేతన్మండలకవిచరిత్రము హైస్కూలునందు సహాయాంధ్రోపాధ్యాయులగు బ్ర॥ శ్రీ కావ్యతీర్థ కవిభూషణ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ గారిచే నుపన్యసింపఁబడియె. ఈకడపమండలమున నేఁబదియాఱు సంఖ్యగల కవులు గలరని వారిగ్రంథనామములం బట్టియు శాసనములం బట్టియుఁ దేటపఱచుచు నాచనసోముని వాసస్థలము పెంచికలపాడనఁబడు గ్రామమను విషయము శాసనములద్వారా రూఢిపడుచున్నదను సిద్ధాంతము చేసిరి. ఆయుపన్యాసాంతమునఁ గడపమండలమహాజనులసంతోషమున కవధి లేకుండెను.కవులతో మండలము నింపవలయునన్నంత యుత్సాహము సూచింపఁబడియె.

తర్వాత నీగ్రంథమును గూర్చి పండితులు పంపినవియు, దయచేసినవారు చదివినవియు నగునీపద్యములు సభాస్తారులప్రీతికిఁ బాత్రము లయ్యెను.

కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు
పంపినపద్యములు.

శ్లో. శ్రీవెలుగోటికుమార! సభాయాం నివసత్సు పండితేంద్రేషు,
శ్రీమద్రామాయణవిషయే శేషాద్రికవిః ప్రశంసనీయః కవిభిః.

చ. జనులకు మంచివాఁ డను సశంసంబున నొప్పుట మంచివర్తనం
బునఁ బొలుపొందు చుండుట సపూర్వములైన మహాప్రబంధముల్
పొనరిచి మంచి వన్నెఁడిఁ బొందుట మంచి కవీంద్రుఁ డౌట నీ
కొనరెను శేషపండిత! మహోన్నతికై జనమంచి నామముల్. 1

ఉ. శేషుఁడువోలె విద్యల సశేషవిశేషము లెల్ల నేర్చి వా
గ్భూషణభూషితుండ వయి పొల్చి ప్రబంధము లెన్నియేని సం
తోషము పేర్పడం జదివి తోరపుఁ గీర్తినిఁ గాంచితయ్య! నీ
వేష మమానుషంబు నిను విశ్వము మెచ్చెడు శేషభూసురా. 2

మ. నవలల్ నాటకముల్ పొనర్చుకవు లీనాఁటన్ సహస్రంబు లీ
భువిరెన్ భాషలు భావగర్భితకవుల్ పుంఖానుపుంఖంబు లా
చివలల్ నాకటముల్ కవిత్వములొకో శేషాద్రిశర్మా! భవ
త్కవనంబుల్ భవదీయకావ్యములు లోకస్తుత్యముల్ బాపురే! 3

మత్తకోకిల. ఎంకిపాటలఁ బాటిచేసెడు నిట్టికాలమునందు నే
వంకఁ జూచిన నట్టికై తమ వాములై కనుపట్టు న
య్యేంకటయ్యలఁ జెప్ప నేమిటి కిప్డు నీకవితామృతం
బంకితం బయి యట్టికష్టము లంతరింపఁగఁ జేయదే. 4

క. చూచితి నీబ్రహ్మాండముఁ, జూచితి నీలలిత నిన్నుఁ జూడకయున్నన్
జూచితి నీరామాయణ, మాచార్యుఁడు వేంకటేశునాలయమందున్. 5

శా. గోపీనాథకవిత్వ మాధురికి నె♦ల్కోఁ గౌతుకం బున్న పృ
థ్వీపాలాగ్రణినందనుండు ఘనుఁ డా♦వెల్లోటి సర్వజ్ఞుఁడే
నీపాలం గలఁ డై సభాధిపతి యై ♦ నీకోర్కు లీడేర్చువాఁ
డై పంచారముసేయు నీమహిమ శే♦షాద్రీశ! సామాన్యమే. 6

తే. వింటి వావిలికొలను పృ♦థ్వీసురునకు
'నాంధ్రవాల్మీకి'నామస♦మర్పణంబు
రామకృతిసేత; నిపు డట్టి♦రామకృతియె
కాన నీ కేబిరుద మిఁకఁ ♦ గలదొ కడప. 7

ఉ. ఓజనమంచి శేషవిబు♦ధోత్తమ! నీకవితామతల్లికిన్
రాజిత మత్యసర్గళమ♦రాళము నైన ప్రచారమయ్యె న
వ్యాజఁ గడంగి నీ విపు డ♦నుత్తము లైన మహాపురాణముల్
తేజముమీఱ నాంధ్రమునఁ ♦ దీర్పుము కూర్పరు లెన్న నేర్పునన్. 8

రాజమహేంద్రవరము. 20-8-24.

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

మ॥రా॥శ్రీ అల్లాడి జగన్నాథశాస్త్రులు బీ.ఏ., ఎల్.టి.గారు
వేంకటగిరినుండి పంపినపద్యములు.

శా. శ్రీమద్వేంకటశైలనాథుఁ డలనా♦రీరత్న మంగాంబికా
ప్రేమాధారుఁడు లోకపావనుఁడు ను♦ర్వీముఖ్యసోపాననా
మామోదాత్తపురీనివాసయశుఁ డ♦త్యంతాయురైశ్వర్యస
త్క్షేమం బిచ్చుతఁ గావ్యతీర్థ జనమం♦చిఖ్యాతశేషాద్రికిన్. 1

మ. మును శ్రీభాస్కరుఁ డాదిగా సుకవు లా♦మూలంబు రామాయణం
బును దెన్గించి యశంబు నించి రనిశం♦బుం బుణ్యవాల్మీకికిన్
ఋణుతాంధ్రీకృతసానుమూలగతవి♦శ్వగ్రంథరాజంబులన్
ఘనతం గాంచుట మీర లబ్బురమె మా♦న్యవ్యాసవాల్మీకు లై. 2

. రాముని మించినదైవము, రామాయణము నిరసించి ♦ రాజిలు గ్రంథం
బీమహి లేదని సీతా, రామస్మరణమున నిహప♦రంబు లమరుతన్. 3

రామాయణఖ్యాతిఁ ♦ గ్రాలుచుండఁగ మీరు రామాయణఖ్యాతిఁ♦గ్రాలువారు
శ్రీవిద్యలను గీర్తిఁ ♦ జెందుచుండఁగ మీరు శ్రీవిద్యలను గీర్తిఁ ♦ జెందువారు
లలితాతిహితశీల♦కలితాత్మకులు మీరు లలితాతిహితశీల♦కలితమతులు
తతశేషగిరిధామ♦ధన్యాహ్వయులు మీరు తతశేషగిరిధామ♦ధన్యమతులు
నిచట సర్వజ్ఞవెల్గోటి♦కృష్ణయాచ, నృపులు సగ్రాసనాసీన♦నిరతు లగుట
నైజమగుభూపభూసుర♦న్యాయముగను,దనరు నీకీర్తి యాచంద్ర♦తారకముగ.

తే. అయ్యయీనాఁటిసభకుఁగా♦ర్యాంతరమున, రాకపోయితిమన్నించి♦గై కొనుండు
పద్యరత్నంబు లంపఁగ ♦ భక్తిమీఱ, భాస్కరున కర్పణమిడు దీ♦పంబుపగిది.

23-8-24 అ. జగన్నాథశాస్త్రి.

బళ్లారి హైస్కూలునం దాంధ్రపండితులగు బ్ర॥శ్రీ చింతలపల్లి
నరసింహశాస్త్రులుగారిచేఁ జదువఁబడినపద్యములు.

క. శ్రీరామచరణసారస, ధారాళమరందపాన♦తర్పితసుగుణా
ధారా! జనమంచి కులో,ద్ధారా! శేషాద్రిశర్మ! ♦ దర్శనసారా!. 1

మ. అలవాల్మీకిమహర్షి సంగ్రథిత మై ♦ యాద్యంపుసత్కావ్య మై
లలితం బై యమరోక్తులన్ మిగులఁ గ్రా ♦ ల్రామాయణంబున్ బుధుల్
చెలఁగన్ దేటతెలుం గొనర్చి జగతిన్ ♦ శ్రీరామచారిత్రమున్
వెలయంజేసి యశంబుఁ గంటి రసికుల్ ♦ వేమాఱుఁ గీర్తింపఁగన్. 2

ఉ. ఒక్కొకభాషకుం గలుగు ♦ నొక్కొకసొంపును నింపు పెంపునున్
జిక్కవిఁ యొక్కభాష కని ♦ సిద్ధమ యైనను నొక్కయర్థమున్
దక్కక భావమున్ విడక ♦ తద్ద రసంబులు చిప్పిలన్ బుధుల్
చొక్కఁ దెలుంగుఁ జేసితివి ♦ శోభిల సంస్కృతవాక్యమత్కృతుల్. 3

మ. తలమే యన్యుల కీదృశాలఘుకృతుల్ ♦ తర్కింపఁగాఁ బెక్కులన్
సలుపం దొల్లి రచించి తీ విటు లస♦చ్చారూక్తి బ్రహ్మాండమున్
లలితాఖ్యానము నీదుపాండితియు నీ♦నైపుణ్యముం బేర్కొనన్
వలయుం గాదె భవద్యశంబు దెసలన్ ♦ వాసించుతన్ నిచ్చలున్. 4

శా. శ్రీసీతారమణుండు స్వామలకథా♦క్షీరాంబుధిన్ సత్కవుల్
భాసిల్లంగ మథించి తొల్లి సుధ యె♦ల్లం గొన్న నిం కందు సం
వాసించుం గనుఁడంచు నాంధ్రమునఁ గా♦వ్యం బై తగన్ దత్కథల్
భాసిల్లన్ సుధ సల్పినట్టి నిను సం♦భావించుతన్ బ్రీతిమై. 5

ఉ. సారెకుఁ బీల్చి పిప్పిగను ♦ సల్పిన రామకథేక్షుదండమున్
జారురసం బపారముగ ♦ సంప్రవహింపఁగఁ బిండి నీదు వా
క్చారిమ మెల్లఁ జూపితివి ♦ సత్కవిజాలము మెచ్చ నింక నే
వారలు నీకు నీడు జన♦వంద్యము నీకృతి నీదు ప్రజ్ఞయున్. 6

క. కథయన్న రామకథయే, సుధఁ జిల్కెడుసుకథ బుధులు ♦ చొక్కెడుకథ దు
ష్పథములఁ దొలఁగించెడుకథ, కథలే తక్కినవి వృథలు ♦ గాక ధరిత్రిన్. 7

క. చవులూర రామకథలను, నవునన సత్కవులు బుధులు ♦ నాదట మెచ్చన్
బ్రవిమలవాక్కుల సత్కృతిఁ, దవిలి రచింపంగ బుద్ధి ♦ తవులుట యరుదే. 8

ఉ. కోమలశబ్దరత్నములఁ ♦ గూర్చినహారము లెన్నియేని శ్రీ
రాముల కిచ్చినాఁడవు న♦రాధిపపూజిత! నీకు నే నిదే

సోమున కొక్కపోఁగ నెడు ♦ నూక్తిని నీనవరత్నహారముల్
బ్రేముడి నిత్తుఁ గైకొనుము ♦ పెద్దగ నీశుభ వేళ మిత్రమా!. 9

24-8-24 చింతలపల్లి నరసింహశాస్త్రి.

బళ్లారిహైస్కూలునందు సంస్కృతపండితులగు బ్ర॥శ్రీ కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారిచేఁ జదువఁబడినపద్యములు.

శ్లో. దృప్యద్దానవపర్వతౌఘదళనే దంభోళిధారాయతే
సేవాసక్తజనాళితాపహరణే పీయూషసేకాయతే,
సాకూతం స్వనిరీక్ష్యమాణదయితాకంఠే సుమాలాయతే
యా దృష్టిః కమలాపతే రవతు సా శేషాద్రివిద్వద్వరమ్. 1

శ్లో. వాల్మీకిమౌనివదనేందువినిస్సృతం శ్రీ
రామాయణాఖ్య మమృతం విబుధేంద్ర ఏషః,
భాషాంతరీకృతిమిషా త్పరిపీయ తుష్టా
నన్యా న్సుధా న్య దకరో త్త దతీవ చిత్రమ్. 2

శ్లో. శ్రీదేహళీపురవరస్య సదేశభూమా, సంతిస్మత న్సుకవిపుంగవమండలస్య
శ్రీరామభక్తిరధి కేతి విలోక్యమన్యే, శేషాద్రి,వా,సు,కవిపోతన,రామభద్రాన్.

శ్లో. మహోన్నతం ముక్తిఫలప్రదం నృణాం, రామాయణాంఘ్రికరణాఖ్యసాలమ్
సమాధిరోఢుం కతమః పటు ర్భవే, త్త్యక్త్వా సుశాఖాం హరిభక్తిరూపామ్ 4

శ్లో. మూలగ్రంథే సువిహితరసోల్లాసభావార్థజాతం
నీత్వా పుష్టిం లలితమధురై రాంధ్రవాక్యై ర్వ్యతానీత్,
కావ్యం యస్మా ద్రఘువరకథాసంగతం సూరి శేష
స్తస్మా దేనం జగతి కలయే సవ్యవల్మీకసూనుమ్. 5

24-8-24 కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రి.

బ్ర॥శ్రీ కవిసింహ శతావధాని డి. రాజశేఖరముగారిచేఁ జదువఁబడినవి.

తే. అందఱకు మంచి జనమంచి♦యయ్యగారు
సరసకవిమౌళి శేషాద్రి♦శర్మ గారు
వ్రాసె రామాయణం బిట్టి ♦ పరమకృతిని
వ్రాయ నేర్తురె యిప్పు డె♦వ్వారలైన. 1

ఉ. మనముల్ రంజిలఁజేయు భావరససం♦పత్తిం దగన్ బొల్చుచున్
విసఁగా వీనులపండువై యులరు మీ♦విఖ్యాతరామాయణం
బును సందందుఁ బఠించినారము ముదం♦బుం గంటి మాంధ్రావనీ
జను లెల్లప్డు వహింత్రు మీ యెడఁ గృత♦జ్ఞత్వాతిరేకంబులున్. 2

తే. కలితసర్వజ్ఞ బిరుదవి♦ఖ్యాతు లైన, వేంకటగిరి కుమార పృ♦థ్వీవరాధి
పత్యములభించె మీా గ్రంథ♦వైభవంబు, లేమనివచింతుమోనుక♦వీంద్రవంద్య!.

ఆ. ఎంతొ శ్రమము చేసి ♦ యిట్టి యుద్గ్రంథంబు
వ్రాయుకతన మేటి♦పండితాళి
యరసి మీా కొసంగె ♦ నభినవవాల్మీకి
బిరుద మది చిరంబు ♦ వెలయుఁగాత. 4

కవిసింహ రాజశేఖర వేంకటశేషకవులు. శతావధానులు.

పదునొకండుగంటలు కాఁగా సభ ముగింపఁబడెను.

ఆనాఁడు మ॥రా॥శ్రీ కౌకూరు శ్రీనివాసరావు బీ. ఏ., బి యల్. గారు మధ్వభూసురులకు నాబాలవృద్ధముగాఁ దృప్తిమీాఱ నన్నదానమొనరించి శ్రీరామచంద్రార్పణమ స్తని కృతార్థు లైరి. శ్రీమాఁ శఠకోపాచార్యులు బీ. ఏ., గారు శ్రీవైష్ణవభూసురులకు మృష్టాన్నదాన మొసంగి దాశరథిపాదార్పణమ స్తని కృతకృత్యు లైరి. మ॥రా॥శ్రీ కామిసెట్టి వేంకటేశముశ్రేష్ఠిగారు స్మార్తవిప్రులకు,లడ్వసహితముగా నన్నదానమొనరించి యశఃపాత్రులైరి. ఆహ్వానసంఘము వారు పైగ్రామములనుండి దయచేసినవారికి యథామర్యాదగా రెండుదినములు ఫలాహారాన్నదానము లొసంగి తమవిధి నెఱవేర్చి హృష్టాంతరంగు లైరి.

ఆనాఁడు 3 గంటలకు మరల సభాభవనము ప్రేక్షకసభ్యులచే నిండియుండెను. అగ్రాసనాధిపతిగారు స్వస్థలము నధిష్ఠించిరి. పౌరమహాశయు లానాఁడు వచ్చినంతమంది యీవఱకే సభకు రాలేదని యనున ట్లాయెను.

తొలుదొలుత అనంతపురము కళాశాలాంధ్రపండితులగు బ్ర॥శ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారు రామాయణకృతిప్రశంసను గూర్చి మనోహరరీతి నభిజ్ఞానశాకుంతలాదినాటకములయందలి యుదాహరణములం గైకొని కవిభావచమత్కృతుల వెల్లడించుచు గంభీరోపన్యాస మొనరించి తమవైదుష్యము సభ్యులయానందపాత్రము గావించిరి. చక్కనిభాషయు, భావగాంభీర్యము, పూర్వోత్తర సందర్భశుద్ధి గలిగి వారియుపన్యాసము వినవిన సొంపు నింపుచుండెను. వారు తమ యుపన్యాసమును ముగించుచు నీక్రిందిపద్యములఁ జదివి సభ్యుల హృష్టాత్ములఁ గావించిరి.

శా. శ్రీమీాఱం బ్రభవిల్లి యాంధ్రమున శ్రీ♦శేషాద్రి సుద్యద్గుణో
ద్దాముప్రక్రియ సప్తశాఖల రసో♦దంచద్గతిం బాఱి శ్రీ
రామాంభోనిధిఁ జేరునీకృతినదీ♦రత్నంబు ధాత్రీజనుల్
సేమం బంద సుధీవరుల్ కవులు రం♦జిల్లఁ విరాజిల్లుతఁ. 1

(ఇది యర్థద్వయముఁగలది)

ఉ. అద్రులు లేవె యొల్లెడల • నాతతశృంగచయంబుతోడ శే
షాద్రికిఁ జెల్లుఁగాక మహ•దాదర మొందఁగ నొడ్డగొప్పునే
మాద్రికి మీఱితి సర్వజన•మానితవైభవమందుఁ దా జగ
ద్భద్రవిధాయి శ్రీహరి స•దా వసియించుట నాత్మధాత్రిలోన్. 2

మ. పరమానందము గొల్పువైభవము చె•ప్పంగాదు లోకైకసుం
దర మాకారము చిత్ప్రభావము జగ•ద్వ్యాప్తం బుపక్రాంతభా
స్కరమాహాకుల మట్టిరామవిభునే • జామాతగాఁ గాంచితౌ
తరమా, శేషసుధీంద్ర! నీసుచరితో•త్కర్షంబు వర్ణింపఁగన్. 3

ఉ. ముద్దులుగుల్కుపల్కులును • ముచ్చటగొల్పు నుదారభావముల్
దిద్ది బెడంగులౌ నడల•తీరులు నేర్పి మహార్థసంపదల్
తద్దయుఁ గూర్చి పెంచి సద•లంకృతిశోభితఁ గావ్యకన్యకన్
నిద్దపుభక్తి రామధర•ణీపతిప్రేయసిఁ జేసి తయ్యరే!. 4

మానిని. శ్రీకలితాత్మకృతీరితభావవి•శేషముల న్వివరింపఁగ వా
ల్మీకిమునీంద్రుఁడె శేషకవీంద్రుని•లీల నెసంగె నొకో కడపన్
గాఁ కలరామకథానుగతంబు న•గాధము నామహితార్థము న
స్తోకముగాఁ దెనిఁగింపఁగ శక్యమె • చూడఁగ నన్యుల కీకరణిన్. 5

శ్లో. విశ్వం శశ్వ త్ప్రభవతి యత శ్చిత్ర ముస్మేషమాత్రా
ద్వీతాతంకం తదపి సదయై ర్వర్ధతే యత్కటాక్షైః,
యస్మి న్నేతత్పున రపి జగ ల్లీయతే యన్నిమేషా
త్సోఽయం దేవ స్సతత మవతాత్సర్వశక్త స్సభార్యః.

24-8-24. ప్రయాగ వేంకటరామశాస్త్రి.

అంతనగ్రాసనాధిపతిగారు లేచి నేఁ డాంధ్రవాల్మీకిబిరుదాంచితులగు బ్ర।। శ్రీ వావిలికొలను సుబ్బరావుగారు రామాయణవిషయమై యుపన్యసింపఁబోవుచున్నారని సభ్యులకుం దెల్పిరి.

శ్రీసుబ్బరావుగారు లేచి రామాయణమహిమమును గుఱించి యించుక తెలిపి తదర్థమును దురూహమనుట వివరించి భాషాంతరీకరణకష్టములఁ దేటపఱిచి, యందలిరహస్యార్థములఁ దెలుపరాదనుభావములను స్పృశించి భాషాపోషణమునఁ గడపమండలవారు లింకను శ్రద్ధపూనవలయు నని హెచ్చరించి తమకు నీమండలముపైఁ గల పక్షపాతమును దల్లి పిల్లలకు బోధించునట్లు తెల్పిరి.

ఆవల రామాయణకృతివిషయకకవితంసాశయములఁ దెలుపునట్టిపద్యములఁ జదువ నవకాశ మిచ్చితి మని యగ్రాసనాధిపతిగారు నుడివిరి. అపుడు చదివినపద్యము లిందుక్రింద వ్రాయఁబడుచున్నవి.

మ|రా|శ్రీ. వనము కృష్ణస్వామయ్యగారు (కలెక్టరుకచ్చేరియుద్యోగులు).

క. సరసామృతగుణవర్షము, కురిసెను శృంగారముఖర♦కూటమె రసమా
బరఁగఁగఁ ద్రాక్షాపాకము, వఱలెడు మృదుమధురశైలి♦పదముల నమరెన్.

క. గంగానది స్వచ్ఛం బగు,భంగిని గవితారసంబు♦భావము లొప్పన్
మంగళమగు నీసుదినము,సంగతులఁ బురాణరామ♦సత్కథ వినఁగన్.

క. సురుచిరకవితాలంకృతి, వరరుచిఁగను మీకు నిత్తు♦ వందన మొదవన్
వఱలఁగ నాయువు సిరు లగుఁ,బరమానందంబుగాఁగఁ♦ బరఁగుత యశముల్.

---

శ్లో. శ్రీమన్! శ్రీపరదేవతాలసితమంత్రోపాసనాసాదిత
శ్రేయఃప్రాయికసంస్కృతాంధ్రకవితాసౌభాగ్య! విద్వద్ధురో!,
శ్రీమద్రామకథాపయోధిమథనే మంథానభూమీధరా!
ఽయం హస్తాంజలిబంధనం నతియుతం విజ్ఞాపయామ్యల్పకమ్.

శా. నానాజాతిసువృత్తచిత్తహృదలం♦కారాఢ్య మత్తేభశో
భానూన ధ్రియమాణసద్గణ యతి♦ప్రాసాంకిత శ్రీరమే
శానాంశాంచిత సంస్కృతాంధ్రకవితా♦సామ్రాజ్యసింహాసనా
సీనుల్ మీరలు స్వల్పవాక్కులను నా♦చే నౌనె? కీర్తింపఁగన్. 2

మ. క్షమకుం బోలఁగ లేక శేషుఁడు భుజం♦గస్థానముం జేర ధై
ర్యమునన్ సాటికి రాక యద్రియు జడ♦త్వావస్థనుం బొంద నా
శమధైర్యాత్మకనామముం గనిన మీ♦చారిత్రశక్తిన్ గణిం
చి మిముల్ సన్నుతిఁ జేయ నాతరమె శ్రీ♦శేషాద్రిశర్మా! గురూ!. 3

ఉ. ఈవిధి నాకచింత్యముగ♦నే తగియుండినదున్ "నహీంగిత
జ్ఞోవసరేవసీదతి"యు♦నుం గద న్యాయము గాన శ్రీభవ
త్పావనపాదతామరస♦భక్తి వచించెద నే యథార్థముల్
భావము లుల్లసిల్ల ఘన♦పాండితి! తాండవకృష్ణ! దేశికా!. 4

సీ. హాలాస్యమాహాత్మ్య♦మాంధ్రీకరించి భాషావృద్ధిఁ జేయంగఁ♦ జాలినారు
లలితాచరిత్రమ్ము♦ తెలిఁగించి "బాలసరస్వతి"బిరుదుచేఁ♦ గ్రాలినారు
ఆంధ్రీకరించి బ్ర♦హ్మాండపురాణంబు కవితాప్రచారమ్ము♦ గడపినారు
రామాయణగ్రంథ♦రాజమ్ము తెనిఁగించి జగతివాఙ్మయముగా♦ సలిపినారు
తే. చిన్నిపొత్తంబులను నెన్నొ♦ చేసినారు,వెదకిచూచిననింకొక్క♦విభవమున్నె?
ను,జనమంచికులాంభోధి♦సోమ! శ్రీమ, దంబికాపదసీమ! శే♦షాద్రినామ!. 5

ఉత్పలమాలిక:—
ప్రాసకు వేసటం బడఁగ♦రాదు యతిప్రతిపాదనార్థమై
గాసిని జెందరాదు గణ♦కల్పనకోసము జల్లిపల్కు ల
భ్యాసము చేయరాదు తగ♦నంతటి సొంపుగ నొక్కపద్యమేన్

వ్రాసినఁ జాలదే కవిశి♦రంబుల నుయ్యెల లూఁప నేపునన్
నా సరియైన సూరివచ♦న ప్రచుర ప్రతిపాదితార్థముల్
శాసన మంచుఁ దేటఁగఁ బొ♦సంగి యొసంగు ప్రసంగసంగతిన్
వ్రాసి విశేషితార్థముల ♦ భావవిభావనశోభ గల్గఁగాఁ
జేసి కృతిన్ రఘూద్వహుని♦చేతి కొసంగితి రింతె చాలదే. 6

మ. గురుకీర్తిం బ్రకటించి తీ రతిశయో♦క్తుల్ గావు మున్నేకవీ
శ్వరు లిన్నింటి రచించినార లిటు భా♦షావృద్ధికై లెక్కడన్
సరసాద్యాంధ్రకవిత్వకీర్తి! యిఁకనున్ ♦ భాషాభివృద్ధిం దగం
జిరకాలంబును జేయ వేఁడెదను శ్రీ♦శేషాద్రిశర్మా! గురూ!. 7

మ. అనయమ్మున్ జగమందు నెల్లెడల వి♦ద్యావృద్ధి గల్గంగ నిం
కను బద్ధాదరులై "పరోపకృతయే ♦ జ్ఞానాయ విద్యా సతా"
మ్మను వాగ్రీతి రచించి గ్రంథముల సా♦హాయ్యమ్మునుం జేయఁగన్
మనవిం జేసెదఁ 'గావ్యతీర్థ'బిరుదాం♦కా! దేశికగ్రామణీ!. 8

మ. తరమే యెంతటివారికైన రఘునా♦థశ్రీకథాంధ్రీకృతుల్
తరమే వానిమహోత్సవాచరణలీ♦లాభోగ్యభాగ్యంబులుం
బరిపూర్ణంబుగ గేహాళివురికి సం♦ప్రాప్తించె వెన్వెంట ని
వ్పురభోగంబును బౌరపాలికలుముల్ ♦ బోధింప శక్యంబు తే. 9

ఉ. శ్రేణిగ గ్రంథముల్ గొనెడు ♦ చేఁతలు నేర్చితి వమ్మ యింకనున్
రాణ గవీంద్రులం గని ప♦రంపర వాఙ్మయవృద్ధి సేసి వి
న్నాణముగా ననారతస♦నాతనకీర్తి గడించి నిత్యక
ల్యాణము పచ్చతోరణము ♦ నై తగ వర్ధిలు దత్తమండలీ!. 10

కడప.
24-8-24.

విధేయశిష్యుఁడు,
కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి.

బ్రహ్మశ్రీ పౌరాణికకేసరి బిరుదాంచితులగు పక్కా రాఘవేంద్రాచార్యులుగారు.

శ్లో. శ్రీమాన్ శేషమహీధరనిలయః శ్రీశ్శేషదేహపర్యంకః,
దాసజనదోషహర్తా కలయే చ్ఛేషాద్రిశర్మణ స్సౌఖ్యమ్. 1

శ్లో. వల్మీకసంభూతపయఃపయోధిసముత్థితం రామకథామృతం యః,
బుధైకభోగ్యం కృతవా నశేషజనోపభోగ్యం కవిరా ట్స జీయాత్. 2

శ్లో. ప్రాయో వాణీకుచద్వంద్వగ్రాహిణ స్సర్వపండితాః,
అయం తు తన్మనోగ్రాహీ భాతి శేషాద్రిసత్కవిః. 3

శ్లో. యః ప్రాగ్గీర్వాణవాణ్యాం విరచిత మమలం వామలూరూద్భవేన
శ్రీమద్రామాయణాఖ్యం విబుధజనమనోవేద్య మాద్యం సుకావ్యమ్,

త్రైలింగ్యా భాషయా ద్రాగకృత సులభయా మోదదాత్ర్యా ఽనవద్యై
ర్హృద్యైః పద్యైః కవీనామపి జగతి సదృక్కః కవే రద్య భూయాత్. 4

శ్లో. బహుభిః కవిభి ర్బహుధా రచితం శ్రీమద్రామాయణ మిద మధునా,
టీకోక్తైః ఖలు విషయై రఖిలై ర్యుక్తతయైత దనుత్తమ మాస్తే. 5

శ్లో. నిద్రాళుం దయితం విలోక్య జడధిం తాతం స్వకీయం పరా
భూతం కుంభభువా జవా న్నిజసుతం భాలానల స్యేశితుః,
భీత్వాఽనంగ ముదీక్ష్య మోహ మచిరా దుత్సృజ్య తేషు స్వయం
త్వామే హాంబుజగేహినీ కవివర! ప్రేమ్ణా ఽధునా ఽశిశ్రియత్. 6

శ్లో. పురాణం బ్రహ్మాండం రచిత మమునై వాంధ్రవచసా
తథైవోక్తం దేవ్యా అపిచ లలితాయా స్సుచరితమ్,
ఉభాభ్యా మాంధ్రాణాం పరమ ఉపకారః కిల కృతః
కథంవా న స్తుత్యః కవిరయ మిదానీం గుణమణిః. 7

శ్లో. వాణీ విలోక్య నిజకాంత మతీవ వృద్ధ
మామ్నాయపారపరిబృంహితచిత్తపద్మం,
ధ్యాయంత మచ్యుతపదాబ్జ మథాబ్జయోని
ముత్సృజ్య నృత్యతి యదాస్యసురంగభూమౌ. 8

శ్లో. ఆంధ్రావనీసురాణాం య శ్శ్రీమద్రామకథామృతమ్,
పిపాసయిషయా చక్రే గీర్భి రాంధ్రీభి రంజసా. 9

శ్లో. ఏతాదృక్కృతికరణే కలాస్య విద్యా
మారోగ్యం శ్రియమపి చాయుషోఽభివృద్ధిమ్,
అర్థాప్తిం హరిపదపద్మయుగ్మభక్తిం
దత్వాఽవ్యా ద్రఘుకులవారిరాశిసోమః. 10

సురపురసంస్థానపండితులయి సాహిత్యరత్నబిరుదాంచితు లగు బ్రహ్మశ్రీ॥ అన్నావఝ్ఝుల సీతారామశాస్త్రులుగారు తమయాశయము నిట్లువ్రాసి పంపించిరి.

ఆంధ్రశ్రీమద్రామాయణప్రశంసాముక్తాఫలమ్.

శ్లో. హిత్వా మాద్రిసుతా శశ్వ చ్ఛుశ్రావ పరమేశ్వరీ,
సై వోత్కిరతి శేషాద్రిగతా రామకథాఽమృతమ్.

(దీనికి గొప్పవ్యాఖ్య వ్రాసి పంపిరి. విచిత్రతరార్థబృంహితాశీర్వచనరూపక ముక్తాఫల మని తల ధరించితిని.)

బ్రహ్మశ్రీ నేరేళ్లపల్లి రామకృష్ణశాస్త్రులుగారు.

శ్లో. శ్రీరామః కావ్యనేతా కవి రపిచ మహా నత్ర వల్మీకజన్మా
శ్రీమాన్ శేషాద్రిశర్మా కవి రభవ దిహా ప్యాంధ్రభాషానువాదీ,
నానాశాస్త్రార్థతత్త్వగ్రహణపటుమతిః కావ్యతీర్థోపనామా

గ్రంథేఽస్మిన్ కస్య నోదే త్యఘహరణపరే భూరిచేతఃప్రమోదః. 1

శ్లో. పదలాలిత్యరసప్రపోషణగుణాలంకారసత్కల్పనా
మధురత్వాదిగుణై స్సమేతి సమతాం మూలేన భాషాంతరమ్,
అధికాంశా నధికృత్య య త్ప్రవివృతే వ్యాఖ్యాగతార్థాంతరా
నధికానందద మి త్యవేద్మి మనసా వాచాపి తోషం వహన్. 2

క. శేషాద్రిశర్మ! యుష్మ, ద్భాషామయ మైన కావ్య♦భణితిని విని ని
ర్దోషము సగుణం బని సం, తోషింపనివారు దోష♦దూషితహృదయుల్. 3

సీ. పండితోత్తముఁ డని ♦ భావింతమంటిమా రసవత్కవిత్వవి♦రాజితుండు
కవిపుంగవుం డంచు ♦ గణుతింతమంటిమా కార్తాంతికౌఘాగ్ర♦గణ్యయశుఁడు
దైవజ్ఞమణి యంచుఁ♦దలపోయుదమటన్నమంత్రభైషజ్యాది♦మహితమూర్తి
మంత్రభైషజ్యాది♦మహితుఁడన్మాత్రమే వేదలోకాచార♦విధు లెఱుంగు

తే. నిన్నివిద్యలచే నొప్పు ♦ నీకునునకు,శాస్త్రి కవి జోసి సంజ్ఞలు♦సమము లగున
ఆత్మవర్తన మెప్పు లో♦కాళి కతుల,శర్మదం బౌట శేషాద్రి♦శర్మ యగు. 4

సహస్రకంఠరామాయణ, ఆంధ్ర వామనపురాణకర్తలు బ్రహ్మశ్రీ
రామావఝ్ఝల కొండయ్యశాస్త్రిగారు పంపిన పంచరత్నములు.

ఉ. శ్రీజనమంచివంశవర♦సింధుసుధాకర! వాక్సతీకృపా
రాజితవాక్యసుందర! ని♦రంతరకీర్తిధురంధరా! మహా
రాజగణస్తవాకర! ధ♦రాసురశేఖర! పంకదూర! వి
భ్రాజితశేషగోత్రకవి♦రాజ! జయింపుము దీప్తి దిక్కులన్. 1

సీ. ధరణి వాల్మీకికృ♦తంబు వ్యాఖ్యాచతుష్టయశోభితంబు దు♦ష్కలుషరాశి
హరణంబు నైన రా♦మాయణం బందున్న యఖిలార్థములఁ గొంచె♦మైన వీడ
కతిభక్తి నిర్వచ♦నాన్వితముగ నాఱు కాండమ్ము లుత్తర♦కాండ మాంధ్ర
కావ్యంబు నిర్మించి ♦ కరుణాలవాలుఁ డౌ. రామభూపతికి స♦ర్పణ మొనర్చి

తే. కవులవలనను భూపాల♦గణమువలనఁ
గడపపురమందు మన్నన ♦ గలుగుపసిఁడి
బిరుదములఁ జెంది కీర్తితో ♦ వెలసి తౌర
నీప్రభావంబుఁ గొనియాడ ♦ నెంతవాఁడ. 2

క. ము న్నీరామాయణమును, సన్నుతిఁ గన్నట్టి కవులు ♦ సరసాలంకా
రోన్నతవాగ్యుక్తులతోఁ, జెన్నలరఁగ నాంధ్రమందుఁ ♦ జెప్పిరి కృతులన్. 3

క. ఈవరకవికై వడిఁ గా, భావంబుల నెల్ల నాంధ్ర♦పద్యములందున్
నావిరి నిమిడ్చి రహీ నా, ధీవరు లేకారణమునఁ ♦ దెనిఁగింపరొకో. 4

క. సురమునిగణ్యుఁడు రఘుకుల, సరిదధిపాబ్జుండు నిత్య♦సత్యాత్ముఁడు భా
సురమూర్తి యైన రాముం, దురుదయ నీకవికి నొసఁగు ♦ నున్నతపదవిన్. 5

శ్రీ. శ్రీ. శ్రీ.

ఇట్లుపండితకవు లాశీఃపఠనము సల్పినపిదపఁ బలువురు రామాయణముద్ర ణమునకు సాయముచేయుపొంటె స్వర్ణముద్రికలను జదివించిరి. వారిపేరు లెల్ల నిర్వాహకాదులనుగుఱించి చెప్పియున్నపద్యములలోఁ గననగు. కడపనగరము వారంద ఱీయుత్సవకాలమున నందుఁ జేరినవారని యెఱుంగనగు. శ్రీరామకృష్ణ సమాజమువా రాద్యుతిమై శ్రీరామకృష్ణపరమహంసగారియాశీస్స్వరూపమని యు త్తరీయము నమూల్యమును బ్రసాదించిరి.

ఆమీఁద "అభినవాంధ్రవాల్మీకి" యనునామము గ్రంథకర్తకు నిచ్చుట సముచితమని పండితు లుపపాదించిరి. అగ్రాసనాధిపతిగా రావిషయము సభకుం దెల్పిరి. సర్వసమ్మతమనుసూక్తి వినఁబడియె. ఇది సర్వజనాంగీకృత మయ్యెనని యగ్రాసనాధిపతిగారు తెల్పిరి.

ఈచరిత్రమంతయు మూఁడుగంటలనుండి రాత్రి యెనిమిదిగంటలవఱకు సా గెను న్యాయవాదులు, నుద్యోగస్థులు, పౌరులు గ్రామాంతరాగతసజ్జనులు నొ క్కరైనను దమస్థలముల వదల రైరి. ఇట్టి లాయుపన్యాసములు సభ్యుల నాకర్షిం పఁజాలెను.

అంత నగ్రాసనాధిపతిగారు లేచి యుపన్యాసమున కారంభింపఁ గరతాళ ధ్వను లలరారె. వారు ప్రకృతసభాక్రమము, ఆంధ్రభాష, ప్రకృతరామాయణ ము, పూర్వకాలికాంధ్రరామాయణములు, అద్యతనకాలికాంధ్రభాషాస్థితి లోన గువిషయముల విమర్శించుచు నెల్లరు పరమానందభరితు లగునట్లు గంగాప్రవా హమువలె నిష్కళంకవాగ్వైఖరి మెఱయ నొక్కగంటసే పుపన్యసించిరి. ఒక్కొ క్కవాక్యము రసవంతమై యలరారుచుండెను. సభ్యు లద్దిరే యననివారు లేరని చెప్పుటలో సంశయమే లేదు.

ఆవల నాహ్వానసంఘాధ్యక్షులగు మ॥రా॥శ్రీ కౌకూరు శ్రీనివాసరావు గారు సంఘపక్షమునఁ దమకృతజ్ఞత నెల్లవారికిం దెల్పిరి. కడపమండలమును బవి త్రముచేయ నరుదెంచిన పండితకవినికాయమునకును, సభను జక్కఁగా సాగించు పొంటె విజయముచేసిన పెద్దలకును, శ్రీకుమారరాజావారికిని, మ॥రా॥శ్రీ నాగ పూడి కుప్పుస్వామయ్య బీ. ఏ, గారగు ప్రకృతసభాధిపతిగారికిని, గడపపౌరులకును దమకృతజ్ఞతానూచకవందనము లొనరించి యిట్టిసభలు కడపనగరమున ననేకప ర్యాయములు జరగఁగలవని తమయుదారభావ మని యుపన్యసించిరి. నాటకశా లాధికారులకును, దమ కెల్లభంగులఁ దోడుపడిన దీనరక్షకసభ వారికిని దమకృతజ్ఞ తను వెల్లడించిరి. రాత్రి తొమ్మిదిగంటలు నిరువదినిముసములకు సభ చాలించుప్ర యత్నము చేయఁబడియె

ఈరీతిఁ గడపపౌరులు నాయీయాంధ్రశ్రీమద్రామాయణకృతిసమర్పణో త్సవమును విధియుతముగ నెఱవేర్చిరి. నాయందుఁ దమకున్న యవ్యాజప్రేమాతి శయమును గ్రియారూపమున వెల్లడించిరి. బ్రహ్మాండపురాణ మొనరించినతఱిని,

యిప్పుడును నాయుద్యమమునే కొనసాగించుపొంటెఁదమయౌదార్యమును, భాషాభిమానమును జూపి నిష్కళంకయశశ్చంద్రచంద్రికల నెల్లయెడల వ్యాపింపఁజేయఁగల్గిరి.

న న్నేరీతిగా నైన సత్కారపాత్రునిం జేయవలయుననియు నాభాషాసేవ యత్యల్పమే యైనను దానిని బెద్దచేయవలయుననియు భావించు నిర్మలస్వాంతులు పరశ్రేయస్సహనసద్గుణగణవిరాజితులు భాషాపోషణబిరుదాంచితులు నగు శ్రీమదాహ్వానసంఘసభ్యులకు నాహృదయపూర్వకమగు వందనశతవితతి నర్పించి కృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను. అందును విశేషించి నన్ను సువర్ణభూషణవిభూషితునిఁ జేయవలయునన్న పట్టుదలనుబూని యట్లే సువర్ణకటకాలంకృతునిఁ గావించి సిద్ధప్రతిజ్ఞులై వైశ్యరత్నములై పరోపకారతత్పరు లగు మ॥రా॥శ్రీ పత్తి రాఘవశ్రేష్ఠి, భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగార్లకు నాకృతజ్ఞత నేతన్ముఖమునఁ దెలుపుకొనుచున్నాను. స్వకృత్యముల వదలి యీకార్యము నెఱవేర్చుటయే స్వకృత్యనిర్వహణ మని సంభావించి యథాక్రమముగ నిప్పనిం దీర్చిన కార్యనిర్వాహకసంఘకార్యదర్శులకు, సంఘాధిపతులకు, నాయపారకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను. నన్ను గౌరవించుట తమ్ము గౌరవించుటగ భావించి నాయం దపారవిశ్వాసమును జూపిన పురపాలకసంఘసభ్యులకుఁ దదధిపతులకు నాకృతజ్ఞతను విన్నవించుకొనుచున్నాను.

ఎవ్వ రెఱుఁగని నన్ను నలరించుపొంటె విజయముచేసి తమయౌదార్యమును జూపి సభను నిర్వహించిన ప్రభుశిరోమణులు కరుణోదారులు కవితాప్రియులు శ్రీభగవద్భక్తిధురంధరులు నగు శ్రీ వేంకటగిరి సంస్థానాధీశ కుమారరాజావారికి నాహృదయపూర్వకకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను దేహారోగ్యము చాలకున్నను, గార్యాంతరము లెన్నియుండినను, సభ కరుదెంచి రెండవదినము సభాధిపత్యమును వహించిన పండితకవులు, న్యాయవాదులు, పరమేశ్వరచరణారవిందమరందపానాసక్తస్వాంతద్విరేఫులు నగు మ॥రా॥శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య బీ. ఏ , గారికి నాయపారకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాఁడను. నాపాండిత్యము శూన్యప్రాయ మైనను, నాకవిత్వము నిస్సార మైనను, ఆంధ్రీకరణపటిమ స్తవ్యముగాకున్నను నన్నుఁ బలువిధముల నలరించి పద్యరూపమున నన్నాశీర్వదించి 'యభినవాంధ్రవాల్మీకి'యను నామముఁ బ్రసాదించి నాపురోవృద్ధిం గోరిన పండితకవులకుం బ్రణమిల్లి 'దాసోహ'మ్మనుసూక్తిచే నాశిష్యత్వరూపవినుతిని సమర్పించుకొనుచున్నాను. గ్రామాంతరములనుండి న న్నలరించు నెపమున దయచేసిన న్యాయవాదిప్రముఖసజ్జనశిరోమణులకు నాయపారకృతజ్ఞతను విన్నవించుకొనుచున్నాను. వారు వీరన నేల సభ నలంకరించినవారికిని, రాఁజాలక నాయం దాదృతిఁ జూపినవారికిని, నాకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాఁడను.

ఇంతకన్న నేఁ జేయవలసినపని విశేషించి లేదని నానమస్కారముల సజ్జనుల కందఁజేయుచు, నాయాంధ్రరామాయణకృతిసమర్పణమహాకార్యమును సాగించిన శ్రీకడపనగరవాస్తవ్యసజ్జనప్రతతికి 'సేవకోఽహ'మ్మను నొక్కమాట విన్నవించి త్రికాలముల వారినామస్మరణ మొనరించుటకంటె వేఱుతరణోపాయము లేదని విన్నవించుచు నాయీలేఖినిని బ్రహ్మపురాణశిష్టభాగాంధ్రీకరణమున నియమించుచున్నాను.

ఓం తత్సత్.

ఇట్లు విన్నవించు సుజనసేవకుఁడు,

జనమంచి, శేషాద్రిశర్మ.

కడప.

## మఱికొన్ని పండితాభిప్రాయములు.

ఉ. శ్రీరమణుండు దేవగణసేవితపాదసరోజుఁ డార్తర
క్షారతుఁ డప్రమేయగుణజాలుఁ డచింత్యమహత్త్వభూతివి
స్ఫారుఁడు భక్తలోకపరిపాలనధుర్యుఁడు యోగిచిత్తసం
చారుఁడు శేషభూమిధరశర్మకవీశ్వరుఁ బ్రోచు నిచ్చలున్. 1

ఉ. వెల్లనిమేనిచాయమును వెల్లనినవ్వును వెల్లపూఁతయున్
వెల్లనికొండకాఁపురము వెల్లనిసొమ్ములు వెల్లవార్వమున్
వెల్లనిజాలు నొసలను వెల్లనిక్రొన్నెలపూవుఁ గ్రాలు నా
చల్లనివేల్పు శేషగిరిసత్కవి కిచ్చుత మెల్లభద్రముల్. 2

ఉ. అద్రివరప్రియాత్మజ సుధాంశుకిశోరవతంస యోగని
ర్నిద్రమునీంద్రసన్నుత విరించిముఖామరవంద్య గౌరి యు
ష్ముద్రదయాసమన్విత యకుంఠితదివ్యమహానుభావ శే
షాద్రికవీశుఁ బ్రోచుఁ బురుషార్థము లెల్ల నొసంగి సత్కృపన్. 3

సీ. వాల్మీకిమౌనిప్రవరవినిర్మిత మైన యాదికావ్యమగు రామాయణంబు
నిఖిలకిల్బిషహారం బఖిలశుభోత్కరప్రదము గావున నెల్ల భాషలందు
నీకావ్యమును సత్కవీశ్వరుల్ భాషాంతరంబు గావించి యశంబుఁ గనిరి
తెలుఁగున భాస్కరాదులు తొల్లి లోకోపకారకంబుగ ముదమార వ్రాసి
తే. రిపుడు కడపపురంబున నెసఁగువిబుధ, సఖుఁడు జనమంచి శేషాద్రిశర్మసుకవి
లలితముగనువిశేషార్థకలితముగను, వ్రాసెఁదెలుఁగునభువినెల్లవారుఁబొగడ.

క. మూలంబున కిది సరియగు, శైలి సులభ మర్థసరణి సరసత నొప్పున్
మేలిమి నీరామాయణ, మీలోకమునందుఁ గాంచి యెసలారుఁ గదున్.

ఉ. శ్రీయుతుఁ డార్యసన్నుతుఁడు శేషగిరిప్రథితాభిధుండు రా
మాయణకావ్య మాంధ్రమున మానితశైలి విశేషభావధా

రేయత మీఱ నూత్నముగు♦రీతి రచించిన సత్కవీశ్వరుం
డాయతకీర్తిఁ గాంచి యల♦రారెడు సర్వమనోరథాప్తిమైన్. 6

మ. కవిలోకస్తవనీయకావ్యకలనా♦కార్యైకదీక్షుండు కే
శవగౌరీపతిపూజనాభిరతుఁ డా♦జన్మంచి శేషాద్రిస
త్కవివర్యుండు రచించినట్టి రసవ♦త్కావ్యంబు పెంపొంది యా
రవిచంద్రర్క్షముగాఁ జెలంగుతను నీ♦రామాయణం బుర్విలోన్.

క. చంద్రునికైవడి నీకవి, చంద్రుఁడు వెలుఁగొందుతను య♦శశ్చంద్రికలం
జంద్రవతంసునిక్రియఁ గవి, చంద్రవతంసుఁడు వెలయుఁ బ్ర♦శస్తవిభూతిన్.

క. కడు వేడుక నిమ్మెయి నె, క్కుడుముదమున నాగపూడి ♦ కుప్పుస్వామ్యా
ర్యుఁడు రామాయణముం గని, కడుకొని శేషాద్రిశర్మ♦కవిత నుతించున్. 9

ఇట్లు నాగపూడి కుప్పుస్వామయ్య.

సీ. జనమంచివంశాబ్ధి♦శశధరుండవుగాఁగఁ జదివితి వెల్లశా♦స్త్రముల లెస్స
ఉభయభాషలయందు♦నురుకీర్తిగడియించి మెప్పుఁ బొందితి వౌర♦యొప్పమీఱఁ
బలుకావ్యనాటక♦ప్రతతిఁ జక్క నొనర్చి ప్రజల మెప్పొల్లెడఁ ♦ బడసినావు
కాళికాపురి కేగి ♦ కావ్యతీర్థాహ్వయ కమనీయబిరుదంబుఁ ♦ గాంచినావు
తే. ఔర! నీకీర్తి నీశాంతి ♦ యమలకరుణ, యాదరంబును బొగడంగ♦నలవిగావు
కమలనాభుండు నీపైనఁ ♦ గరుణచూపి, మెచ్చి సంపద లనిశంబు♦నిచ్చుఁగాత.

క. శ్రీరామాయణకావ్యము, నౌరా! యని బుధులు మెచ్చ ♦ నద్భుతశైలిన్
గారా మారఁగ నొనరిచి, శ్రీరాముల కొసఁగితీవు ♦ శేషాద్రికవీ!. 2

ఉత్సాహము. అందమైన నీదుప్రతిభ ♦ యాంధ్రలోక మెల్లెడన్
ఇందు నందు సందులేక ♦ యింపుమీఱఁ బర్వఁగా
యెందునైన నుండువెల్గు ♦ నేర్పడంగఁ బృథ్విలో
నందుచుండు నీదుకీర్తి ♦ యలరుచుండు నిచ్చలున్. 3

ఇట్లు ఎల్. వేంకటరమణయ్య.

పులివెందుల.

# శ్రీరామమహిమము.



ఈవిషయము బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారిచే జదువఁబడినది.

## బాలకాండము.

1 వనజభవవాసవవిశ్వామిత్రవసిష్ఠనారదాదిదేవర్షిగణస్తూయమాన సమస్త నిస్తులప్రశస్తగుణస్తోముఁడు, అరినిషూదనపరాక్రమోద్దాముఁడు.

2 పుత్త్రకామేష్టిసమాచరణసుప్రీతయజ్ఞేశ్వరానుగ్రహసంజాతవిబుధస్తుతదశరథపుత్త్రుఁడు, సకలజనమనఃకమలమిత్త్రుఁడు.

3 అమృతకరసమప్రియదర్శనుఁడు, సమధిగతాఖిలదర్శనుఁడు.

4 తాటకాది విశ్వామిత్రసురద్విషద్వధానందితవిశ్వామిత్రవిశ్రాణితసకలదివ్యాస్త్రుఁడు, తనూసౌందర్యపరాభూతకుసుమాస్త్రుఁడు.

5 గాధేయకథితగంగావతరణకార్తికేయసంభవాదిపుణ్యకథాశ్రవణప్రముదితపరిపూతహృదయుండు, సకలప్రాణికోటిసదయుండు.

6 అహల్యాశాపవిమోచనుఁడు, భవబంధమోచనుఁడు, అరవిందలోచనుఁడు.

7 హరశరాసనలీలావిభంజనపరాక్రమసముపలబ్ధజానకీపరిగ్రహణ పరితోషితస్వాంతుఁడు, అతులితనీతిమంతుఁడు.

8 సముచితమధురభాషణాఖిలపౌరజానపదానందనుఁడు, కౌసల్యానందనుఁడు.

## అయోధ్యాకాండము.

9 పితృవాక్యపరిపాలనార్థసమనుష్ఠితారణ్యవాసుఁడు, సౌభాగ్యశ్రీనివాసుఁడు.

10 నిరంతరసేవాపరాయణానుసరల్లక్ష్మణుఁడు, మహాపురుషలక్షణుఁడు.

11 అభివాదనాదిసపర్యావిశేషప్రమోదితభారద్వాజుండు, కమలినీరమణసమతేజుండు.

12 రాజ్యప్రతిగ్రహవిషయకభరతప్రార్థనావసిష్ఠానుమోదననిరాదృతిపురస్సరపితృవాక్యపరిపాలనైకనిరతుఁడు, నిజపాదుకాయుగళప్రదానానుగృహీతభరతుఁడు.

13 సత్యసంధుఁడు, దీనబంధుఁడు.

14 వాత్సల్యసమాదృతశత్రుఘ్నుఁడు, సురశత్రుఘ్నుఁడు.

ఆరణ్యకాండము.

15 విరాధఖరదూషణకబంధప్రముఖనిఖిలరక్షోనివహావక్షోదళనపరిరక్షితతాపసవృషభుఁడు, భక్తిసులభుఁడు.

16 నిబిరీసభక్తిపరతంత్రశబరీపరికల్పితనిజసపర్యాప్రహృష్టచిత్తుఁడు, భక్తజనముక్తిప్రదానాప్రమత్తుఁడు, ధీరోదాత్తుఁడు.

కిష్కింధాకాండము.

17 అగ్నిసాక్షికమిత్రీకృతసుగ్రీవుండు, మహానుభావుండు.

28 సునిశితైకసాయకనిహతవాలికపివర్యుఁడు, ధైర్యగుణధుర్యుఁడు.

సుందరకాండము.

19 అబ్ధిలంఘనసీతాన్వేషణాంగుళీయకప్రదానలంకాదహనాదినిజహితచర్యాచరణైకతానమానసపవమానసూనుండు, యోగిజనమానసాధీనుండు.

యుద్ధకాండము.

20 కపికులసాహాయ్యపరినిర్మితగభీరపారావారసేతుబంధనధురంధరుండు, వినయాదిగుణబంధురుండు.

21 విదారితకుంభకర్ణుఁడు, వృషోపలనీలవర్ణుఁడు.

22 దశకంఠకంఠవిలుంఠనపరితోషితదివిజేంద్రుండు, ధర్మాచరణనిస్తంద్రుండు.

23 శరణాగతపరిత్రాణలోలుఁడు, కరుణాలవాలుఁడు.

24 లంకాసామ్రాజ్యప్రదానపరిపూర్తమనోరథవిభీషణుఁడు, సాధులోకతోషణుఁడు.

25 సత్యపూతస్మితపూర్వమితపూర్వభాషణుఁడు, ఆశ్రితపోషణుఁడు.

26 రామేశ్వరక్షేత్రశివలింగప్రతిష్ఠానావాప్తసకలకాముఁడు, కామాద్యరివర్గభీముఁడు.

27 సకలలోకవిదారణరావణవధానంతరస్వీకృతసామ్రాజ్యపట్టాభిషేకుండు, పుణ్యశ్లోకుండు.

28 విబుధజనరంజనుఁడు, నిరంజనుఁడు.

29 ఆశ్రితాఖిలకామితార్థప్రదాయకుఁడు, తులితసురనాయకుఁడు.

30 సర్వజనప్రియంవదుఁడు, భక్తజనవశంవదుఁడు.

31 జితేంద్రియుఁడు, సతీప్రియుఁడు,

32 దనుజవ్రాతతమఃపుంజభంజనతిగ్మధాముఁడు, భక్తలోకజీవంజీవసుధాధాముఁడు, సర్వపూర్వగీర్వాణాఖర్వగర్వనిర్వాపణప్రవార్షితగీర్వరాత్మజాదిసువ్రవాచంయమిసోముఁడు, సకలనృపకులతిలకాయమానరాజలలాముఁడు, సకలకలుషవిధ్వంసనపుణ్యనిఖిలపుమర్థసంధాయకదివ్యనాముఁడు, ఆశాంతపూరితచంద్రికావదాతసుయశోభిరాముఁడు, ఆత్మారాముఁడు, రాముఁడు.

## సీత.

1 జనకమహారాజపరిపాలితావనీసంభూత, అయోనిజాత.

2 రామచంద్రపాణిగ్రహణోపజాతప్రభూతకౌతుకోపేత, అరవిందమందిరాంశసంజాత.

3 నిరంతరహృదంతరభజమానరామపదాబ్జాత, ఉత్తమసతీగుణసమేత.

4 వినయసౌశీల్యోపచితపరిచర్యాపరితోషితశ్వశ్రూప్రముఖనిఖిలబంధువ్రాత, అవలేపాద్యవగుణాపేత.

5 నిజవిశ్లేషణదూయమానప్రాణేశ్వరప్రత్యాయనార్థనిజచూడామణిప్రదానబహూకృతాంజనాతనూసంజాత, అవిగీతచారిత్రవిఖ్యాత.

6 వీతిహోత్రప్రవేశనప్రకటితనిజపాతివ్రత్యమాహాత్మ్యప్రస్ఫీత, నిరవధినిర్వ్యాజకరుణాన్వీత.

7 సర్వాభీష్టకలనసంతుష్టహనూమత్ప్రముఖభక్తజాత, భవాంబుధిపోత.

8 పరమపూత, లోకమాత.

ఇట్టిసీతయు, సీతాసమేతజనకజామాతయు మనల నందఱ రక్షించుఁగాత.

నాగపూఁడి. కుప్పుస్వామయ్య.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీః.

# ఉపోద్ఘాతము.

## శ్రీరామావతారతత్త్వము.

"సర్వచైతన్యరూపాం తా మాద్యాం విద్యాం చ ధీమహి,
బుద్ధిం యా నః ప్రచోదయాత్". (దేవీభాగవతము.)

చ. ప్రకృతినిబద్ధుఁ డౌచు శ్రుతి♦వర్ణితదివ్యతమాత్మశక్తియై
సకలవిదుండు నోంకృతివి♦శాలతనుండు విరాట్టు నాఁగ నె
న్నికఁగను నాపరాత్పరుని ♦ నిత్యము గాని జగంబు నిత్యమై
నకరణిఁ జేసి నెమ్మిఁగను ♦ నాథుని నాత్మను సంస్మరించెదన్.

సజ్జనశేఖరులారా !

ఆనందమయుండై జ్యోతిస్స్వరూపుఁడయి సకలకర్తృత్వాదిశ్రుతిపాదిత మహామహిముఁడయి స్వీయతత్త్వం బిదమిత్థమ్మని యెఱుంగరామి నుపనిషత్తులు నివ్వెఱఁబొంద, మహర్షులు దిగ్భ్రమనొంద, సురవరు లిది యేమి, ఎవ్విధి నెఱుంగ నగు నని కలంతఁ బొంద, నెవ్వారికే నేకాలమందే నీతత్త్వ మిట్టిదని యెఱుంగ ననువుపడక, జగత్కర్త, జగత్సాక్షి, జగత్స్వరూపుఁడు నయి తత్స్వరూప మిట్టిదని నిర్ణయింపఁజాలని వేదము లోంకారమయుం డని యుచ్చైర్నాదంబున నుద్ఘోషింప, "తథాస్తు" అని తక్కుంగల శాస్త్రములు తద్వాదులు తృప్తిం బొంద, నింతవఱ కెవ్వరికే నిట్టి దీతత్త్వ మని లక్ష్యలక్షణపురస్సరంబుగా సిద్ధాంతము చేయ శక్యమే కాక, యిందం దనరాక యెల్లతావుల నిండి యనిర్వచనీయశక్తియై యలరారు భగవంతుఁడు పరమాత్మ యొక్కఁడు కలండు. సత్యమని యెల్లవారు నమ్మియుండుట క్రొత్తవిషయము గాదు. దీనికిం బ్రమాణము లివ్వి యని చూపఁబూనుటకన్న వెఱ్ఱితన మింకొక్కటి యుండదు.

న హి కారణం వినా కార్య స్యోత్పత్తిః.

యను సూక్తి యెంతయు సమంజస మనక తప్పదు. 'జగత్సత్యమ్' అనుసిద్ధాంత మెంతయో సేపు నిలువఁజాలదు. నశ్వర మనశ్వర మని సిద్ధాంతీకరింపఁబూనుట యొకశక్తి కాదు. స్థావరజంగమాదిశబ్దములే యీయజ్ఞానమును దొలఁగించుచుండఁ — "మూరుపట్టుకొని వ్రేలాడె" నన్నట్లు కుతర్కయుక్తులచేఁ బ్రలాపించుచు స్వాహంకారమును జూపుటకన్న హాస్యాస్పదవిషయము వేఱుగ నుండదు.

అట్టి యనిర్వాచ్యపరతత్త్వము నుపాసించు టెట్లు? ఆయుపాసనను మానవ ముక్తి లభించు టెట్లు? అను ప్రశ్నము రాక మానదు. ఈప్రశ్నమునకు సమాధానము చెప్పుటకే యిన్ని వేదములు, ఇన్ని శాస్త్రములు, ఇన్ని పురాణములు తల్లడపడుచున్నవి. సంశయాస్పదపదములచే నర్థమును దెలుపుచున్నవి. ఎవరికిఁ దోఁచి నట్లు వారు స్వమతసిద్ధాంతమును జేసికొను నవకాశ మొసంగుచున్నవి. కాఁబట్టి యే కొందఱు మనస్సునఁ దనది యథార్థము కాదని స్ఫురించినను బైకి బింకములు మానక యడ్డుమాటలాడుచు వెఱ్ఱిమొఱ్ఱిగా మాటలాడుచుందురు. గ్రంథముల నట్లే వ్రాయుచుందురు ఏవిషయమునకైనను మూఁడునాలుగుయుక్తులు లేకపోవు వానినే పలుమాఱు త్రిప్పి త్రిప్పి వ్రాసిన నొకగ్రంథము కాకపోదు. కాని యాగ్రంథకర్త జిజ్ఞాసువే యైనచో నాయుక్తులే యాతనిచిత్తము నీటెలపోటులవలె బాధించుచుండు ననుట నిస్సంశయము.

ఈవిషయమును సిద్ధాంతమును జేయఁబూని వేదములు నోరుమూసికొని తికమకపడుచున్నవన నింక మందబుద్ధినయిన నావంటివానిమాట యిటఁ జెప్ప నేటికి? ఈవ్రాఁతవలననే నాకీవిషయమున వాస్తవము గోచరింపలేదని స్పష్టము కాక మానదు. అది సత్యమే.

గోచరముకాని విషయమును జర్చింపఁబూనుట యవివేకము కాదా? యన వచ్చును. కాని యెట్టి మందస్వాంతునకైన నేదో యొకవిషయమున నించుక జ్ఞాన ముదయింపక మానదు. కాదేని భగవదంశము నిష్ఫల మగును అట్లు కాఁగూడదు కదా.

వేదవేదాంతములు, వేదాంగములు, తదర్థప్రతిపాదకస్మృతులు, తన్మహిమానువాదకపురాణములు, తదనుసరణేతిహాసాదు లివి యివి యననేల యెల్లగ్రంథములు జగత్సృష్టిస్థితిలయాత్మకవికారములు మాయాకల్పితము లని యంగీకరించును స్పష్టముగనో యస్పష్టముగనో యీయర్థమున గ్రంథములు పప్పులోఁ గాలు వైచినవియే కాని వేఱుగాదు.

ప్రకృతిపురుషుల కవినాభావసంబంధము సజ్జనాంగీకృతము. తత్ప్రేరేపితుఁడయ్యె యోంకారరూపుఁ డగు విరాట్టు జగన్నిర్మాణాదికృత్యములకు సమ్మతించును. కాని తానుమాత్ర మాపంకమున కాలూనఁడు. కాననే సర్వసాక్షి యన్న పేరాతత్త్వమూర్తికిఁ జెల్లు.

ప్రకృతిశబ్దము స్త్రీలింగమని వ్యవహరింపఁబడును గానఁ బ్రకృతి యనఁగా స్త్రీ యని వ్యవహారము గల్గినది. ఆప్రకృతిస్థితి యెట్టిదో యొక రెఱుంగుదురు? ఎవరికిఁ దోఁచినట్టు వారు స్తుతింతురు. ఆవ్యక్తి విరాట్టువును గూడ ననఁగా నిర్గుణునిసైతము సగుణుం గావింపం జాలిన దఁట అబ్బా! ఏమి యావ్యక్తిశక్తి.

సర్వసాక్షియైన విరాణ్మూర్తి యనుమతింప నామూలప్రకృతి యాతత్త్వమును విడువఁజాలదు గాన విడిచినట్లు కనఁబడుచు స్వప్రభావమున క్షణమాత్ర

మున సకల ప్రపంచము నిర్మించెను. మహదహంకారాదులఁ గలిగించె. పృథివ్యాది మహాభూతపంచకమును నిర్మించె. ఇట్లు క్రమముగా జీవకోటిభేదములను సంఖ్యాతీతముల స్వస్వకర్మానువృత్తిగలవానిని నిర్మించెను. ఔరా! ఏమి యీపరమేశ్వరిశక్తి! అనిర్వచనీయము, అప్రతర్క్యము!, అమేయము, సర్వవ్యాప్యము, శ్రుత్యంత దురధిగమ్యము.

మూలప్రకృతి యనఁ బరఁగు నాపరదేవతనే సత్వరజస్తమఃప్రధానమూర్తులనుగ్రహించి యసమానవిఖ్యాతినలరుచున్న లక్ష్మీసరస్వతీపార్వతులనుగా భావించి పూజించుచున్నారు. వీరి నాశ్రయించియే విష్ణుబ్రహ్మశంకరులు జగత్పూజ్యులగుచున్నారు. ఈనుడి తొలుదొలుత విన్నంతమాత్రమున శ్రుతికటువుగఁ దోఁచును. కాని యిందలి తత్త్వ మెద్దిరా యని నిష్పక్షపాతబుద్ధితో నాలోచింపఁ జిరకాలమున కిదియే సత్యమని తోఁపకపోదు. మాటికిమున్మాటికి నిది యిట్లే యని తోఁచును. శ్రీమచ్ఛంకరాచార్యులవారు శ్రీమద్రామానుజాచార్యుల వారిదియే వాస్తవమని సిద్ధాంతము చేసి నట్లూహింపవచ్చు.

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవా రాప్రకృతినే శివశక్తి యనిరి. ఈమెకు లోఁబడియే త్రిమూర్తులు వర్తింపుచున్నారనిరి. ఈమెసాయము లేకున్నఁ బరమపురుషుఁడు కూడఁ గదలఁజాలఁడనిరి. సృష్టిచమత్కృతియంతయు నీప్రకృతి విలాస మనిరి.

శ్లో. శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో న ఖలు కుశల స్స్పందితు మపి,
అత స్త్వా మారాధ్యాం హరిహరవిరించాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి?.

శ్లో. తనీయాంసం పాంసుం తవ చరణపంకేరుహభవం
విరించి స్సంచిన్వ న్విరచయతి లోకా నవికలమ్,
వహ త్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం
హర స్సంక్షు ద్యైనం భజతి భసితోద్ధూళనవిధిమ్

ఈమెయే సర్వోపాస్య యనియుఁ దేటపఱచిరి.

శ్లో. తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణా మ ప్యుపరి కమలానాం తవ కలామ్,
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీమ్.

శ్లో. జగ త్సూతే ధాతా హరి రవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వ న్నేత త్స్వమపి వపు రీశ స్తిరయతి,
సదా పూర్వ స్సర్వం త దిద మనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞా మాలంబ్య క్షణచలితయో ర్భ్రూలతికయోః.

ఈపరదేవతనే బహునామముల నెల్లరుఁ బూజించుచున్నారనిరి.

శ్లో. గిరా మాహు ర్దేవీం ద్రుహిణగృహిణీ మాగమవిదో
హరేః పత్నీం పద్మాం హరసహచరీ మద్రితనయాం,
తురీయా కాపి త్వం దురధిగమనిస్సీమమహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి!. (సౌందర్యలహరి.)

ఇట్లు శ్రీశంకరాచార్యులు ఆదిప్రకృతివిలాసవిలసిత మీసర్వప్రపంచమని సిద్ధాంత మొనరించిరి. బళీ! ఆచార్యులవారి తత్త్వశక్తి యెంతయుఁ గొనియాడ ననంతున కేని శక్యమా?.

శ్రుతి నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూకవ త్తన్వీ పీతా భాస్వ త్యణూపమా.
తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,
స బ్రహ్మా స శివ స్స హరి స్సేంద్ర స్సోఽక్షరః పరమ స్స్వరాట్.

ఈశ్రుతి ప్రకృత్యగ్ర్యుఁడు పరమపురుషుఁ డని తెల్పును గదా. ఆపర మాత్మయే బ్రహ్మరుద్రహరిహయులనియు, నాదేవుఁ డక్షరుఁ డనియుఁ దేటపఱచును. కాఁబట్టి తదిచ్ఛాశక్తియే యాదిప్రకృతి తదతీతుఁడే విరాట్టు. అనుట సిద్ధాంతము గదా.

శ్రీరామానుజాచార్యులుగా రీవిషయమునే భంగ్యంతరముగా సిద్ధాంత మొనరించిరి. శ్రీప్రధానత్వమే వారిసిద్ధాంతసారము. విష్ణువు విరాట్పురుషుఁడు. లక్ష్మి ప్రకృతి. లక్ష్మీదేవిద్వారా విష్ణువు భక్తవాంఛల నొసఁగును గాని తానుగా నీయఁదలంపఁడు. అని స్పష్టముగఁ దెల్పిరి. కాఁబట్టియే శ్రీవైష్ణవులని తచ్ఛిష్యు లకుఁ బేరు గల్గెను.

ఇట్లు మహాత్ములు బ్రహ్మమును సగుణనిర్గుణభేదముగ నిరూపించిరి కారణ మేమన సగుణ ముపాస్యము. నిర్గుణ ముపాస్యము కానేరదు.

శ్లో. పూర్ణ స్యావాహనం కుత్ర? సర్వాధారస్య చాసనమ్?,
స్వచ్ఛస్య పాద్య మర్ఘ్యం చ శుద్ధ స్యాచమనం కుతః?.
నిర్మలస్య కుత స్స్నానం వాసో విశ్వోదరస్య చ?,
అగోత్రస్య త్వవర్ణస్య కుత స్తస్యోపవీతకం?.
నిర్లేపస్య కుతో గంధః పుష్పం నిర్వాసనస్య చ?,
నిర్విశేషస్య కా భూషా? కోఽలంకారో నిరాకృతేః?,
నిరంజనస్య కిం ధూపై? ర్దీపై ర్వా సర్వసాక్షిణః?.
నిజానందైకతృప్తస్య నైవేద్యం కిం భవే దిహ?,
విశ్వానందయితు స్తస్య కిం తాంబూలం ప్రకల్ప్యతే?.
స్వయంప్రకాశచిద్రూపో యోఽసా వర్కాదిభాసకః,
గీయతే శ్రుతిభి స్తత్ర నీరాజనవిధిః కుతః?.
ప్రదక్షిణ మనంతస్య ప్రణామోఽద్వయవస్తునః,

వేదవాచా మవేద్యస్య కింవా స్తోత్రం విధీయతే?,
బహి రంతశ్చ సంపూర్ణో కథ ముద్వాస్యతే విభుః?,
ఇతీయం భావనా యస్య దృఢా భవతి సర్వదా.
నైవ తస్య పరా పూజా మౌన మేవ పరో జపః,
అచింత్య మపరం ధ్యానం ధ్యానం నిర్విషయం మనః.
దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవ స్సనాతనః,
త్యజే దజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్.

ఇదియే నిర్గుణపరబ్రహ్మపూజయని పెద్దలనువదించిరి. ఇట్టి నిర్గుణము నుపాసించు టెట్లు? కాన సగుణమనునది స్త్రీవ్యక్తి నాశ్రయించి యుండఁదగినది. ప్రకృతిపురుషసంయుతియే జగత్తు. తదైక్యమే జగన్నాశము. అనునది సిద్ధాంతము.

గాయత్ర్యాదిసకలమంత్రము లేయర్థమును దెలిపినను స్త్రీలింగవాచ్యములయ్యెను. గాయత్రమంత్రమని యనరాదు కదా. తదర్థ మాలోచింప స్త్రీవ్యక్తి స్వాతంత్ర్యమును దెలుపదు. కాఁబట్టి తొలుచాలుతఁ బ్రకృతినో, తత్పరిణామవిలసితులగు హరిహరాదులనో యుపాసించి తజ్జన్యజ్ఞానంబున భగవంతునిఁ దెలిసికొనవలయు ననుటకన్న సర్వశ్రుతిసమ్మతమార్గము వేఱొకటి కానరాదు.

ఈగొడవలోఁ దిగినచోఁ బునరావృత్తియే యొదవదు. ప్రమాణవాక్యములకు యుక్తులకు మేర యుండదు. ఆమీఁద వాక్కలహములకుఁ దృప్తియే లేదు. తుదకు ముష్టియుద్ధమువఱకు నీవాదాపారపారావారము వ్యాప్తినొందక యూరక విడువదు. అట్లని యూరకుండరాదా యన్న వాక్చాపల్యమూరకుండనీయమి నిట్లు తుచ్ఛవాక్కుల నాల్గింటిని ప్రేలితిని. సమ్మతముగాకున్న క్షమింతురుగాక. క్రోధాగ్నిజ్వాలలఁ గ్రుమ్మరింపక పుత్త్రభావమున నన్ను మన్నింతురుగాక. దీనివలన నా భావ మిట్టిదని తెలిసికొంటిరి గదా. అంతియే చాలును.

ప్రకృతవిషయము శ్రీరామావతారవిషయము. శ్రీరాముఁడు విష్ణువా? శివుఁడా? చతుర్ముఖుఁడా? యన్న నీమువ్వురును గావచ్చును. మేలిమిబంగారమును వాంఛానురూపముగ గ్రహించి కటకకుండలాద్యాకృతుల విభజించి యాయాయి పేరులతో వ్యవహరించుచు నానందించునట్లు శ్రీరామచంద్రమూర్తిని దోఁచినట్లు ధ్యానించుచుఁ బూజింపవచ్చు. ఫల మొక్కవిధముగానే యుండును. భక్తి సమత నొందినచోఁ దత్ఫలము సమత్వమొందును. భక్తి భిన్నరీతి నుండెనేని ఫల మట్టిదియే. కాఁబట్టియే శ్రీరామతత్త్వవిషయమునం దాస్తికుల కెల్లరకు నభిప్రాయభేదములు లేవు. తక్కుంగల యవతారవిషయము లట్లుగాదు.

ఇఁక శ్రీరామరూపమున భగవంతుఁడు మహీస్థలమున నవతరించెనా? దాని కవకాశ మాకాలమునఁగలదా? యనునదియే ప్రధానప్రశ్నము. శ్రీరాముఁడు విష్ణువనియే యిపుడు భావింతము. విష్ణుశబ్దము వైకుంఠవాసియగు దైవపరము

కాదనియు విరాట్పురమనియుఁ జెప్పఁబూను వాద మిపుడు వలదు. ఏరూపమున నుపాసించినను బ్రకృతిద్వారా భగవంతునిం జెందును. బ్రకృతిద్వారమును దదుపాసనఁ జేయక ఛేదించుట యేరికే దుర్లభము. ఆమె కాయనకే లోఁబడు ననఁగా నిఁక రూపనామధారులమాట యిట నేటికి ?.

## శ్రీరామావతారకారణము.

కేవలయుక్తులచేతను, హస్తవిన్యాసములచేతను, వాక్చమత్కృతిచేత నగు ప్రతిపక్షిముఖపిధానముచేతను ఈవిషయము సిద్ధాంతము కాఁజాలదు. కర్మసిద్ధాంతమును నమ్మి భగవంతుఁ డొకఁడు లేకున్నఁ బ్రపంచమే లేదని నిశ్చయించి గమ్యస్థానమూ భగవంతు నొందుటయే యంతటికిఁ బ్రధాన మను దృఢవిశ్వాసము గలిగి యాలోచించినఁగాని యీవిషయము తేలదు. ఇవిగలవారలకే యీవిషయము రుచించును. కర్మ మనాది కాదన్నవారికది యనాదియేయని నచ్చఁజెప్పుట బ్రహ్మకైన శక్యముకాదు. కాఁబట్టి ముం దాస్తికత యావశ్యకము. అది యున్న నీవిషయము కరతలామలకముగాఁ దోఁచును. అదిగల మాన్యులే కృతార్థు లగుదురు.

భగవంతుఁ డవతరించునంతటి ధర్మహాని యాకాలమునఁ గలదా?

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

అను భగవద్వాక్యము భక్తులకు శరణము కదా!.

త్రేతాయుగమున నాల్గవభాగమునఁ బ్రపంచ మెట్లున్నదని తొలుత విచారింతము.

నిరంతరభగవత్పాదపరాయణచిత్తులగు మహర్షులకుండరామి పాటిల్లుటయు, దేహబలమున విఱ్ఱవీఁగు క్రూరదానవులు ప్రబలి విచ్చలవిడి సంచరించి మానవులఁ గబళించుటయు, సర్వకాలసాధారణకృత్యముగ నుండెను. పురములు, నగరములు, గ్రామములు, పల్లియలు చాలతక్కువగ నుండెను. భీకరారణ్యములు ప్రబలియుండెను. ప్రజలు నడచుమార్గములు కడు భయంకరకంటకమృగపన్నగ రాక్షసాక్రాంతములై యొంటరిగఁ జరింప నలవిగాకుండెను. అందందుఁ బురములుండినను సామాన్యముగా నడవులే యధికస్థలము నాక్రమించియుండెను. ఆహారపదార్థములు చాలినన్ని లేకుండెను. మాంసాహారమే ప్రధానముగ నుండెను. మహర్షులుకందమూలఫలములభక్షించుచుండినను రాజగృహములయం దెప్పుడో భుజించుట సంభవించినపుడు కొందఱు మేధ్యమృగమాంసమును దినుచుండిరి. సత్యమున కాకాలమున మిగుల గౌరవము వ్యాప్తియు నుండెను దేవతల నారాధించుట నేమికొఱఁతలున్నను తద్ద్వారా తొలంగునన్న నమ్మకము జనసామాన్య

మున కుండెను. భూతదయాపశ్చాత్తాపములు గలవారు కొలఁదిగ నున్నను వారికి మర్యాద హెచ్చుగా నుండెను. శ్రుతిస్మృత్యుక్తక్రియాచరణమున శ్రద్ధగలవారు మహర్షులనఁ బరఁగుచుండిరి. వారిసంఖ్య యత్యల్పముగ నుండినను వారియశస్సు విశేషముగ వ్యాపించియుండెను. ఇన్నియుండినను స్వేచ్ఛాప్రవర్తకులు, హింసాపరాయణులు, దోర్బలప్రధానులు, క్రూరాచారనిరతులు నలుదెసల వ్యాపించి సాధుజనులకు విశేషబాధను గల్గించుచుండిరి. వారి నాపఁ జాలువారుండినను వారల్పసంఖ్యాకులగుట స్వకృత్యము నెఱవేర్పఁ జాలకుండిరి. కొందఱు తత్కార్యమునం బ్రవర్తిల్లి వారిచే మృతిఁబొందిరి. క్రూరరాక్షసదృష్టిం బడక యెట్లో యే కానలలోనో, ఏకొండగుహలలోనో నివసించుచు సాధుజనులు బాధల ననుభవింపుచుండిరి వర్షములు లేక జనులు బాధపడలేదు గాని ప్రాణములకుగా, మానసంరక్షణమునకయి చాలఁ గష్టముల ననుభవించుచుండిరి ఏసత్కర్మములు చేయఁ బూనినను క్రూరగతవిఘ్నములు గలుగక సాగకుండెను. దాన వాని మాని, యూరకుండవలసివచ్చెను. అట్లుండుట మఱింత దుర్భర మయ్యెను ఇఁకఁ జేయవలసినదేమియును నూహాలే సర్వకాలసర్వావస్థలయందు వారికిఁ బ్రసరింపసాగెను. ఈకష్టములనుండి గట్టెక్కఁగలమా యను శంక పొడమెను. హాహాకారములు చెలరేఁగెను. భగవంతుఁడు తప్ప వేఱు శరణము లేదని వారికిఁ దోఁచెను.

ధర్మము నశించుటయు, నధర్మము వృద్ధియగుటయు భగవదవతారకారణములని యేదో యొకరీతిగా నందఱు అంగీకరించినట్లు చెప్పనొప్పు పైఁ బేర్కొనిన కారణములకన్న నెక్కువకారణము లేకాలమునఁగాని యుండఁ జాలవనుట నిస్సంశయసిద్ధాంతము. ఊఁహూఁ! అని యనంగీకారసూచకముగాఁ దలద్రిప్పువా రుండరని నానమ్మకము.

బాహుబలమున విఱ్ఱవీఁగు క్రూరచిత్తులగర్వమును దుర్బలులచే నడఁగించుటకు భగవంతుఁ డూహించుననని మనము నమ్మవచ్చును. అట్లు సంభవించినఁగాని లోకులకు గుణపాఠము చక్కనిది కుదురదు. మాకన్న బలవంతులే లేరనువారిని, వారిని మించినవారిని బుట్టించి వారిచేఁ జంపించుట మంచిది గాదనియు, దాన బలవంతులును క్రూరులు నగువారికి బుద్ధి రాదనియు సర్వేశ్వరుని తాత్పర్యమైనట్లూకయూహ కలుగుటలోఁ బ్రమాద మేమియు నుండదు. అట్టి యప్రధర్ష్య బలశాలురను దుర్బలులు జయించినచోఁ జూచువారును, ఆచరిత్రమును వినువారును నహంకారమును దొలంగి యీశ్వరమహిమకు సాధ్యముకాని దేదియు లేదని గ్రహించి విఱ్ఱవీఁగుట మాని సాధువులు కావచ్చుననుట దురూహ కాదు అట్టి గుణపాఠము నేర్పుటయే భగవంతుని చమత్కృతి.

ప్రకృత మనుసరించెద. రావణుఁడు సహజబలోపేతుఁడయ్యుఁ దపఃప్రభావమున బ్రహ్మదేవు నలరించి దుర్లభవరముల నొంది, దాన గర్వియై విఱ్ఱవీఁగుచు మాఱులేక దిగ్విజయ మొనరించి దుర్వారప్రతాపమున నింద్రాదిదిక్పతులజయించి

లోకము లచ్చెరువందఁ గైలాసం బగలించి శంకరుని మెప్పించి దుర్లభాస్త్రములం బడసి మారుకొన శూరుఁడు లేఁడేయని తలంచువాఁడు. కార్తవీర్యుఁడు వాలియు జయించినను మృతినొందింపఁ జాలరైరి. అట్టితఁడి నెందఱో భూపతు లాతని శరానలార్చులకు శలభప్రాయులైరి. ఇఁక సామాన్యులమాట ప్రస్తావింప నేల?.

పోనీ, రావణుఁడు శూరమారణమునఁ దృప్తినొందెనను కొందమా! లేదు. సాధ్వీతిలకములఁ జెఱఁబట్టఁ జొచ్చెను. దుర్భరదురంతఘోరసంతాప మంతకంటె వేఱొండు గలదే? సాధువులఁ జంపుట, యవమానించుట లోనగు దుష్కార్యములఁ జేయ జంకుపడకుండెను. వానిప్రాపున మఱికొందఱు క్రూరు లట్టికార్యములనే చేయుచు నాతనికి బంధువులును మిత్రులు నైరి. ఆకాలమున లోక మేకరణి నుండునో చెఱఁబట్టి తనపత్నిని గొంపోవుచుండఁ గన్నులారఁ గాంచుచు నాసాధ్వీ విలపింప నాలకించుచుఁ జేయ నేరకున్న సతులమనస్థితి యెట్లుండునో, అట్టివార్తల విన్నపరోపకారపారీణులస్వాంతము లేరీతి నుండునో, అట్టిదురాత్మకుల ఖండములు ఖండములుగా ఛేదింపఁజాలక తమప్రతాపమును దూఱుకొనుశూరుల యూహలెట్లుండునో వర్ణింప శేషునకేని దరమగునా? యనుశంక నాకుఁ గలుగుచున్నది. అక్కటా! ఆతరుణమున మరణించినవారే పురుషులు, బ్రదికియున్నవారు పురుషులనఁబడుదురా ?.

ఇట్టి ఘోరపాపముల నెన్నియో చేయుచుండ నెంతకాల మోర్చుకొని భగవంతుఁ డుండఁగలఁడు ? ఆలోచించి యాలోచించి బ్రహ్మవరములఁ దప్పింప సాధ్యము కామిం దలంచి యెట్లయిన వానిం జంపక తప్పదు. కాన నరాకృతిం దాల్చెను. తమకుఁ గావలసిన పరిజనులను ముందే పుట్టఁజేసెను. భగవదవతారమున కెన్నియో కారణము లుండవలయును అట్టి పరమపురుషుఁ డుదయింపఁదగినంత పుణ్యము చేసికొన్న దంపతు లుండవలయుఁ గదా! ఆకాలమున కవన్నియు సమకూడెను.

1. అనరణ్యభూపాలుఁడు రావణునితోఁ బోరి శరీరమును విడుచుకాలమున నావంశమున జనించినవాఁడు నిన్నుం జంపునని శపించుట.
2. వేదవతి తన్నుఁ బట్టుకొనిన రావణుని హుంకారమున నదలించి యగ్నిప్రవేశ మొనరించుచుఁ దాను విష్ణువునే పెండ్లియాడెద ననియు నిన్నుఁ జంపించుటకుఁగా నే నయోనిజనై పుట్టుదు ననియు శాప మొసంగుట.
3. రావణుఁడు బ్రహ్మను వరమడుగుకాలమున మనుష్యవానరేతరజంతువులచేఁ జావకుండ వర మడుగుట.
4 విష్ణువునకుఁ బత్నీవధకారణమున భృగుమహర్షి మనుష్యజన్మ మెత్తఁదగునని శాప మొసంగుట.
5. అహల్యకు రామపాదరజస్సంగమువలన స్వరూపప్రాప్తి గలుగునట్లు గౌతము శాపమోక్షరూపవర ముండుట.

ఈమొదలగు ననేకకారణములు, విష్ణుమూర్తి మనుష్యయోనిం బుట్టుటకు, నందు నిక్ష్వాకువంశమున జనించుటకు సహాయము లయ్యెను.

ఈవిషయము ముందే దేవతలకుఁ దెలియును గాననే తమతమయంశముల భల్లూకవానరములఁ బుట్టించిరి. వారెల్ల నయోధ్యాలంకామధ్యభాగమునఁ బర్వ తారణ్యముల నాశ్రయించియుండిరి. రామదర్శనమాత్రముననే వారెల్ల దాసులై సాయముచేయ సంసిద్ధులైరి.

ఇట్లు భగవత్సహాయము లేకున్నఁ బ్రజలు జీవింపఁజాలరు. ధర్మము కాలూన నవకాశము లేదు. క్రూరులు స్వేచ్ఛగాఁ బ్రబలిరి. అట్టికాలమునఁ గాక మఱెట్టి కాలమున భగవంతుఁ డవతరింపఁబూనును ?

ఇఁకఁ ద్రేతాయుగమానవుల మనోవృత్తి యెట్టిదని యించుక విచారించెదను. త్రేతాయుగమున నెల్లరకుఁ బరోపకృతి యొనర్చుట ముఖ్యధర్మము. సత్య భాషణము ప్రప్రధానధర్మము. ఇవి మనుష్యులు మొదలు పక్షిజాతులవఱకు వ్యాపించెను. ఆర్తులను సంరక్షింప స్వప్రాణముల విడుచుటకు సంసిద్ధముగనుండుట యాకాలపుఁబ్రాణికోటికి నైజవృత్తిగా నుండెను. బలాబలవిచారముగూడ నాలోచింపక తమ రాపని నెఱవేర్పఁ బూనునంతటి యుత్సాహ మాకాలపు జీవులకు వాడుకపడెను.

ఇవి కాక మఱికొన్ని యాకాలపు టలవాటులఁ బరిశీలింతము.

1. పెక్కుమంది స్త్రీలను వివాహమాడుట.

2. దేవతాప్రార్థనాదికములయందు హెచ్చుగా మద్యమాంసముల నుప యోగించుట.

3. పరస్పరసహాయమునఁ గృత్యముల నెఱవేర్చుకొనుట.

4. పితృమాతృగురుభక్తి.

5. రాజులు ప్రజలయనుమతి వేఁడక యేకార్యము చేయకుండుట.

6. నాణెములుగా గోవుల నుపయోగించుట.

ఈ మొదలగునవి యాకాలపుటలవాటు లని రామాయణమునుండియే తేలును. దీని కుదాహరణములు చూపుట యంతగా నవసరమని తోఁపనందున వదలితి. రామాయణకథ నెఱుంగని భారతీయుఁ డుండఁడనునదియే నాదృఢవిశ్వాసము. అదియే నన్నుదాహరణములఁ జూపకుండఁ జేసినది.

ప్రజలను హింసించునలవాటుగల స్త్రీలనైనను శిక్షించుటయో చంపుటయో పాపము కా దనుట రాజధర్మమై యుండెను. అనఁగా రాజు ప్రజాహితము నే కోరుచు, దాని నెఱవేర్ప సంసిద్ధుఁడై యుండుట యాకాలపురాజనీతులలోఁ బ్రధానమని తెలిసికొనఁదగినది. స్త్రీవధము మహాపాపమను శాస్త్రము, ప్రజాహింసాకృత్యనిరతస్త్రీవిషయము కాదనియు, ప్రజాహింసనుజూచుచు నూరకుండుటయే స్త్రీవధపాపమును మించినపాపమనియు రాజనీతిజ్ఞులసిద్ధాంతమని గ్రహింపఁ

దగును. దీనిని దృఢపఱచు నుదాహరణము లందఱకుఁ గరతలామలకములు గాన వచలవలసివచ్చెను. జనులకు నిత్యతుష్టిపుష్టులు గలవు. కాననే యారోగ్యముగలిగి యకాలమరణములు లేక దీర్ఘాయుర్దాయము గలిగి పుత్రమరణదుఃఖము ననుభవింపక యుండుటకు నవకాశము గలిగియుండెను. ఎప్పుడే నొకప్పుడు పుత్రమరణదుఃఖము కలిగినచో నది రాజనీతియం దొకలోపము కలదని వారు భావించుచుండిరి. అంతతో విడిచిరా? వెంటనే రాజుతో నిట్లుజరగినదే. ఏమిదీని హేతువు? దీని నెట్లు తొలఁగింతు వని యధిక్షేపించుటయు, రా జందులకుం జింతించి తనయం దేదియో లోపము గలదని నిశ్చయించుకొని విద్వన్మంత్రిపౌరులతో నాలోచించి దానిఁ బాపఁ బ్రయత్నించుచుండెను అంతియగాని తన్నాక్షేపించుట తప్పుగా భావింపకుండెననుటయు గ్రహింపఁదగినది. ఔరా! ప్రజాహితమునకన్న వేఱొండుపనియే తమకు లేదనియు, నదియే ముక్తిపదమనియు నాకాలపుఁ బ్రభువులు భావించి రనుటకన్న విశేషమేదిగలదు?

## ప్రజలకష్టములు.

జానపదులుగూడఁ దమకుఁ గలిగిన కష్టముల రాజుతోఁ దమరే విన్నవించుకొనుచుండిరి. ప్రతిదిన మందులకై యొకకొంతకాలము నేర్పాటుచేసి రాజు కాచుకొనియుండును. నిశ్చయముగా వారు విన్నవించుకొనుచుందురు. నీతిజ్ఞులఁ గొందఱం బిలిచి రాజావిషయ మెట్లు తీర్మానింప నగునని యోజించుచుండెను. అంతియగాని తోఁచినట్లు తీర్పుచెప్పు నాచారము లేదు. ఇట్టి యాచార మాకాలమున నుండుటకు సత్యమాతరుణమున దృఢముగ నెలకొని యుండుటగాక వేఱు కారణ మేమి యుండును? తమతప్పులను వారొప్పుకొనుచుండిరి. కాన సాక్షులతో నంత యవసరము లేకుండెను. తమపక్షవాదమును జెప్పుకొనుట కష్టము కాకుండుటచే నితరులసాయ మపేక్షణీయము గాకుండెను. దీర్ఘదృష్టి నారయ జను లాశాపిశాచి కావేశపరవశులు కాక సత్యనిరతు లగుటచే నాకాలపుఁ బ్రభుత్వ మట్లు సాగుచుండె నని గ్రహించుటయే సరసము. మనుస్మృత్యుక్తధర్మముల మించిన ధర్మము లాకాలమున నుండెననుట కావంతయు సంశయము లేదు.

## విద్యాభ్యాసము.

ఆకాలమునఁ బ్రధానముగ వేదవిద్య నభ్యసించుట వాడుకయైనట్లు కనుపట్టు. మూఁడువేదము లభ్యసించి ధనుర్వేదరహస్యములు నెఱింగి మంత్రదేవతోపాసనామూలమున నాయాయియస్త్రముల వశంగతములఁ జేసికొని గుఱియందు నేర్పఱులై యుండిరి. కాననములు దట్టముగా నుండుటచే మృగబాధ లధికముగ నుండుటచే సప్తవ్యసనములలో నొక్కటియగు వేఁట నింద్యమైనను బ్రజాహితము

ప్రధానధర్మముగఁ బరిగణింపఁబడుట రాజు లాదరణము మీాఱఁ గొంతకాల మా ఘోరారణ్యములఁ దిరిగి సింహశార్దూలాదిక్రూరమృగముల హింసించి ప్రజలయా ర్తిని బాపుచుండిరి.

శ్లో. స్వే స్వే ధర్మే నివిష్టానాం సర్వేషాం మనుపూర్వశః,
వర్ణానా మాశ్రమాణాం చ రాజా సృష్టో ఽభిరక్షితా.

అను మనుస్మృతిధర్మ మాకాలమునఁ జక్కఁగా రాజుల కెఱుకపడియుండె ననుట నిస్సంశయము. ప్రజలు రాజును బరదైవముగా భావించి తమకష్టములఁ దెలుపుకొనుచుఁ బ్రభువులకష్టములఁ దనవిగా భావించుచు నుండిరి. ఈవిషయము లన్నియు రామాయణమునుండియే తేలును.

రామాయణము కావ్యముకానఁ గల్పితములం దుండునని యొకప్రశ్నము రావచ్చును. వర్ణనాంశములు కావ్యములయం దుండుట సహజమే. కాని యేకవి యైనను బ్రపంచములో లేనియాచారములను గాని సృష్టిలో లేని వస్తువులకుఁ బేరులఁగాని కల్పింపఁ జాలఁడు. ఉన్నవానిని బెంచివ్రాయుట ప్రకారాంతముగాఁ జమత్కృతిగ వ్రాయుట కవికి శక్యమగును గాని సృష్టిలో లేని వస్తువులకు నామ ములఁ బెట్టుటకు మాత్రము వలంతికాఁడు. కావున రామాయణములోని విషయ ములు కల్పితములనుట వెఱ్ఱితనము. ఏగ్రంథముగాని యాకాలపుమనుజులయభ్యా సములఁ దెలుపుట కిసుమంతయైన జంకదు కాని లేనివానిని గల్పింపఁజాలదు. వర్ణనాంశములలోఁ దనస్వేచ్ఛను జూపు ననుట నిర్వివాదాంశము.

ఈపై కారణములను బట్టి యాలోచింప నాకాలమునఁ బ్రజలకష్టములఁ దొలఁగించుటకు భగవంతుఁ డవతరింపవలసిన యవసరము కల్గెను. రావణాదిరాక్ష సులు శివుని బూజించుచుంట శంకరుఁ డాజోలికి రా నవసరము లేదయ్యె. ఇఁక నీభారము విష్ణువు నెత్తినఁ బడియెను. జయవిజయుల గాథను బట్టియే వారిని శాప విముక్తులఁ జేయుట నారాయణమూర్తిపనియే యై యుండెను.

ఆశ్రమచతుష్టయమున గృహస్థాశ్రమము ప్రధానతను గాంచినట్లు లోక త్రయమున మర్త్యలోకము ధర్మకర్మాచరణమునఁ బ్రధానత్వముఁ గాంచెను. ఇందుఁ జేయుసత్కృత్యములద్వారా దేవతలకుఁ దృప్తి గల్గును. కాన మర్త్య లోకమునందు ధర్మమునశింపకుండ జాగరూకుఁడై యింద్రుఁడు కాపాడుచుండును. తన కశక్యమైనపుడు విష్ణువుతో మొఱ్ఱపెట్టుకొనుట యింద్రున కాచారమై యుండెను.

రావణునికాలమున మధ్యమలోకమున రాక్షసబాధ లెక్కువగ నుండిన కతన యజ్ఞాదిసత్కృత్యములుసాగకయుండెను. గాన దేవతల కాలోపముమెండుగఁ దోఁచెను. కాన రాక్షసుల మాయింపఁజేయుట వారికిం గూడ నవసరమయ్యెను. ఇంద్రాదులు భగవంతునిం జేరి భక్తిమై మొఱ్ఱపెట్టుచుండిరి. మహర్షులు ధ్యాన రూపముగా నీపనినే చేయుచుండిరి. శ్రీమన్నారాయణమూర్తియుఁ గాలమునకై

వేచియుండెను. ముందు దేవతలు స్వాంశమువలన భల్లూకవానరములఁ బుట్టించియే యుండిరి. పరికరములన్నియుఁ గుదిరినవి. కాన సమయము రాఁగా తా నవతరింపఁ గడుంగడు సంతసపడు చుండెను.

వైకుంఠమును బాడుపెట్టి విష్ణువు మర్త్యరూపమున రామనామమున నవతరించెనని కొందఱుద్ఘోషించుచుందురు. అదెంతవఱకు సత్యమో యెఱుంగఁజాలకున్నాను. ఇవు డాతర్కము నా కనవసరము.

భగవంతుఁడు తనచర్యలనుండి యితరులు నేర్చుకొనఁ జేయుచుండువాఁడు కదా! ఉపదేశకులు, భక్తులు, శ్రుతులు, స్మృతులు పురాణాదులనుగూడ ధర్మము నుపదేశించు చుండును. కాఁబట్టి మర్త్యరూపమునఁ దా నవతరించి తరువాతి ప్రజలు తనచర్యలను బట్టి సత్ప్రవృత్తి నేర్చుకొనవలయునని యూహించెను. తా నవతరించుటకు ముందే స్వాభిన్నయై స్వప్రవృత్తికి హేతుభూతురాలగు శ్రీదేవిని వేదవతివచనానురూపముగ నామెయందుఁ బ్రవేశింపఁ జేసెను స్వశక్తియవతరింపఁగనే తా నవతరింపక యుండఁజాలఁడు. గానఁ దాను నుద్యుక్తుఁడయియే యుండెను. ఇంతలో దేవతాధీశులు ప్రార్థించిరి. అనన్యగతికుల మని స్వాభిప్రాయములఁ దెల్పిరి. రావణుబాధలు పతివ్రతలకుం గూడ దుర్భరము లయ్యె ననుట యాత్మకుం దోఁచెను. ఇఁకఁ దడవుచేయుట యుక్తముకాదని భగవంతుఁడు నిశ్చయించెను.

ఇంతలోఁ బుత్రకామేష్టిఁ జేయ దశరథుఁ డుద్యోగించెను. ఇక్ష్వాకువంశము పవిత్రతమమైనది గాన దశరథపుత్రత్వము నొంద శ్రీమన్నారాయణమూర్తి యిష్టపడెను. తాటకాసుబాహుప్రముఖులగు రాక్షసులకుఁ దనచేఁ జావఁదగిన కాల మాసన్నమగుటయు, దేవతలు త్వరపడి యవతరింపుమా యని వేఁడుటయు, మహర్షులు మర్త్యరూపధారియగు తనను సేవింప నాతురపడు చుండుటయుఁ గారణములుగా శ్రీవిష్ణువు మర్త్యలోకమునకు వేంచేసెను. దశరథునికోరికలుపండెను. మహర్షులతపస్సులు ఫలించెను. దేవతలసంతాపము తుదముట్టెను. ఇక్ష్వాకుల పూర్వులగు సనకాద్యాదులవాక్యములు సత్యపూతము లయ్యెను. ధర్మరూపధేనువు కాలూన నవకాశము గల్గెను. అధర్మరూపపిశాచము నిలువ వీలుకా దయ్యెను.

ఇట్లు భక్తపరాధీనుఁడు, కరుణాశరధియగుహరి దాశరథి యయ్యెను. అనంతుఁడు లక్ష్మణుఁ డయ్యెను. శంఖచక్రములు భరతశత్రుఘ్నులైరి అయోధ్యానగరము భూలోకవైకుంఠ మయ్యెను.

ఏకారణము నుద్దేశించి జ్ఞాననిధియగు వసిష్ఠమునిచంద్రుఁడు రఘువంశమునకుఁ బురోహితుఁడయి కృత్యముల నిర్వర్తించుచుండెనో యాయుద్దేశ్యముఫలించెను. జననానంతరకృత్యములు యథావిధినిర్వర్తించి వసిష్ఠుఁడు "కృతార్థోఽస్మి" యనుకొనెను.

మనుష్యులు మనుష్యులయం దుత్తములం జూచియు, దేవతలు తదుత్త ములం జూచియు సద్వృత్తముల నేర్చుకొందురు. అనఁగా భిన్నజాత్యాచారముల నేర్చుకొన నెవరుగాని తలంపరు. కావున రాముఁడు మనుష్యుల కుదాహరణభూతుఁడై నటించెను.

## శ్రీరాముని యుత్తమప్రవృత్తి ప్రభృతులు.

1. సర్వభూతహితచర్య.
2. వేదవిద్యాభ్యాసము.
3. జనుల రంజింపఁజేయు పలుకులు.
4. గజాశ్వరథారోహణాభ్యాసము.
5. ధనుర్వేదపాండిత్యము.
6. పితృశుశ్రూషణనిరతి.
7. స్మితపూర్వకసంభాషణము.
8. కరుణాదృతి.

ఇత్యాదులు రామునకు సహజములుగ నున్నట్లుండెను. మహాపురుషలక్షణము లన్నియు మూర్తీభవించినవనియే యందఱు తలంచు చుండిరి. ఇంతియకాక శ్రీరాముని సద్గుణములయం దెల్ల

శ్లో. హ్రీమంతః కీర్తిమంత శ్చ సర్వజ్ఞా దీర్ఘదర్శినః.

అను శ్లోకోక్తమైన గుణవితతియందు, "హ్రీమంతః" అనునది 'ప్రమాదాత్ ప్రాప్తకృత్యచింతాసు లజ్జావంతః' అని వ్యాఖ్యాత లుపదేశించినసద్గుణమే. అనఁగా మనుష్యవ్యక్తికిఁ బ్రమాదమే లేకుండుట నైజము కాదు. కాన నట్టిది సంభవించినపిదప నిట్టిప్రమాదము చేసితి నని సిగ్గుపడుట. ఇంతకన్న వేఱొకటి యుండఁబోదని నానమ్మకము. ఈశ్లోకార్థమే

సీ. "సకలసద్గుణయుక్తు లోకపరి యొనరించునట్టి ప్రమాదకార్యముఁ దలంచి
సిగ్గునొందుచు"

అని తెనిఁగింపఁబడినది. ఔరా! వ్యాఖ్యాత లెట్టి యుపదేశమున మనకు దాని యర్థమును దెల్పిరి?

ఎట్టిబుద్ధిమంతుఁడైన నొకప్పుడు ప్రమాదవశమునఁ దానొకతప్పు చేసినవుడు పిదప నది తప్పని తాఁ దెలిసికొని దానినే యొప్పని సిద్ధాంతము చేయఁబూనక సిగ్గుపడఁ దగుననుట దీనినుండి గ్రహింపఁదగిన సద్విషయము. ఇట్టి సకలసద్గుణములు శ్రీరామచంద్రునియందు నైజము లయ్యెను. రాజలక్షణము లన్నియు నొక్కచో వెలసిన ట్లుండెను.

శ్లో. తీక్ష్ణ శ్చైవ మృదు శ్చ స్యాత్కార్యం వీక్ష్య మహీపతిః,
తీక్ష్ణ శ్చైవ మృదు శ్చైవ రాజా భవతి సమ్మతః.

యస్య ప్రసాదే పద్మా శ్రీ ర్విజయ శ్చ పరాక్రమే,
మృత్యు శ్చ వసతి క్రోధే సర్వతేజోమయో హి సః.

అను మనుస్మృత్యుక్తగుణములు క్షత్రియధర్మము లగుట నవి యన్నియు శ్రీరామచంద్రునియందు నెలకొనియుండె ననుట యొకవిచిత్రవృత్తాంతము కాదు.

కిష్కింధాకాండమునందు రామసుగ్రీవుల సంభాషణమున రామోక్తిగా

"మయా చ య దిదం వాక్య మభిమానా త్సమీరితమ్,
త త్త్వయా హరిశార్దూల! త త్త్వ మి త్యుపధార్యతామ్.
అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన
ఏత త్తే ప్రతిజానామి సత్యేనైవ చ తే శపే." (౭ స. ౨౨ శ్లో.)

ఈశ్లోకములు కనుపట్టు. ఆకాలమున సత్యమున కెట్టి ప్రచారము గలదో కనుఁగొనవచ్చును. రామావతారఫల మిదియే యని భక్తులు గ్రహింపఁదగు. "అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన" అను సూక్తిని మించినది మఱేముండును? అట్లు వచించినవారినుండి నేర్చుకొనఁదగిన విషయము లెన్నియుండవు? ఇట్టి యుత్తమపురుషసూక్తులు ఎన్నియో రామచంద్రునిమాటల నుండి నేర్చుకొనఁదగినవి శ్రీరామచంద్రుఁడు పరమపురుషుఁడు కాన నన్నియు లక్ష్యభూతములే. అట్టిశ్లోకముల నెల్ల నిట వ్రాసి పాఠకులఁ గష్టపెట్టఁబూనక విరమించుచున్నాఁడను. శ్రీరామచంద్రదివ్యచరిత్రమునందు నంగుళిం జూపి యిది లోపమని చెప్పఁదగినవిషయము కలదా?

'వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.'

అను సూక్తి సర్వజనసమ్మత మైనది. ఇంతియ కాక,

"చతుర్వింశతిసంఖ్యాకా గాయత్రీవర్ణసంయుతాః,
యే శ్లోకా స్సంతి తా నత్ర విలిఖామి యథాక్రమమ్.
శ్లోకే చ ప్రతిసాహస్రం ప్రథమే ప్రథమే క్రమాత్,
గాయత్ర్యక్షర మేకైకం స్థాపయామాస వై మునిః."

అను సూక్తులంబట్టి గట్టిగ నాలోచింప రామాయణము వేదసార మనియు నిరువదినాల్గువేలశ్లోకములకుఁ బ్రతివేయింటికి నాదియందు గాయత్రీవర్ణము సంఘటిత మనియుఁ దెలియ నగు. కొందఱు రామాయణమునుండి వేదమంత్రముల నన్నింటిని గనఁబఱుపవచ్చునని యందురు. అనఁగా వరుసగనో మఱియెట్లో వేదమునంతయు దీనినుండి వెలువరించవచ్చునని వారిభావము. అది యంతగా మన మాదరింపరాదు. ఒకనియమము ననుసరించి "ఇషే త్వేతి" మంత్రవర్ణములఁ జూపినచో వారు వంద్యులే. నియమములు పలువిధములఁ గల్పించుకొని వేదమంత్రాక్షరముల నపూర్వక్రమంబునఁ దెలుపఁబూనుట కేవలపక్షపాతము. నియమము తాత్కాలికపరిణామములఁ బొందునేని అమరకోశమునుండియు నాల్గువేదములం జూపవచ్చును. కాఁబట్టి వేదార్థమెట్టిదో యా శ్రీమద్రామాయణార్థ మట్టిదని

చెప్పుట న్యాయము. వేదము చతుర్విధపురుషార్థప్రదము. రామాయణ మట్టిదియే. భగవన్మహిమాప్రతిపాదితము వేదము. భగవన్మహిమాప్రతిపాదితము శ్రీమద్రామాయణ మని గ్రహింపఁదగునని నాభావము. ఈనాభావము న్యాయసమ్మతము గాదేని పెద్దలు నాకుం దెలుపవచ్చు. శిరసా వహించి గ్రహించి మనసునఁ బదిలము చేసికొనియెద.

శ్రీమద్రామాయణము రామచంద్రుఁ డశ్వమేధయాగము చేయఁబూనినప్పటికే యత్కించిచ్ఛిష్టముగా ముగింపఁబడినట్లు రామాయణమునందే కలదు కదా. శిష్టభాగము రామావతారము సమాప్తినొందినపిదప విరచితము.

కిష్కింధాకాండమున నలువదియొకటవ సర్గమున

"మేఖలా ముత్కలాం చైవ దశార్ణనగరా ణ్యపి,
అశ్వవంతీ మవంతీం చ సర్వమే వానుపశ్యత. ౧౦
విదర్భా నృషికాం శ్చైవ రమ్యా న్మాహిష్మకా నపి,
తథా వంగా న్కళింగాం శ్చ కౌశికాం శ్చ సమంతతః. ౧౧
అన్వీక్ష్య దండకారణ్యం సపర్వతనదీగుహాం,
నదీం గోదావరీం చైవ సర్వ మేవాఽనుపశ్యత. ౧౨
తథై వాంధ్రాం శ్చ పుండ్రాం శ్చ చోళా న్పాండ్యా న్సకేరళాన్."

అని చెప్పఁబడినది. ఇందే కావేరీనది మలయపర్వతము తామ్రపర్ణీనదియుఁ జెప్పఁబడినవి.

కిష్కింధాపురమునుండి దక్షిణదిక్కునకుం బంపఁదలఁచిన యంగదజాంబవదాంజనేయాదికపులకు సుగ్రీవుఁడు మార్గము నుపదేశించుఘట్టమున నీవిషయము చెప్పఁబడినది. దీనింబట్టి చూడ నాంధ్రాదిదేశము లాకాలమున నున్నట్లు స్పష్టమగును. 'మాహిష్మకాన్ విదర్భాన్ కళింగాన్ వంగాన్' అను శబ్దములను బట్టి కిష్కింధకు దక్షిణమున నీదేశములు కలవా? యనుప్రశ్నము రాకమానదు. వంగకళింగదేశములు కిష్కింధకుఁ దూర్పున నున్న ట్లిప్పటిస్థితిని బట్టి చెప్పనొప్పును అప్పటి కీదేశములపేరు లేవిగా నుండెనో యేయేదేశ మెట్లెట్లు మార్పునొందెనో యాకాలమున వంగదేశమనఁగా నేదో మనము చెప్పఁజాలము. ఈదేశనామములంబట్టి రామాయణ మిటీవలనిర్మింపఁబడినదని సిద్ధాంతీకరింపఁబూనుటమాత్రము వెఱ్ఱితనము. అప్పటిదేశవిభాగ మిపుడు లేదు. ఆంధ్రదేశ మిపు డెంతవఱకు వ్యాపించియున్నదో కొంతకాలముక్రిందట నెంతవఱకు వ్యాపించియుండెనో యాలోచించినఁ దేటపడును. అక్కజముగానుండును. కొలఁదిశతాబ్దములలో నింతటిమార్పునొందఁగా నింక నెన్నియో లక్షలసంవత్సరములక్రిందట నున్న దేశములవిభాగ మిప్పటిదేశవిభాగముతోఁ బోల్చి తప్పుగా నున్నదని చెప్ప సాహసించుట సరళమార్గము కాదు. మనమూహింపఁజాలనికార్యములను గాలము క్షణమాత్రమునఁ

చేయఁజాలును. ప్రయాగము రామాయణకాలమున భరద్వాజాశ్రమముగ నుండెను. మహారణ్యముగా నుండెను. ఇపు డరణ్యముండిన జాడగూడఁ గానరాదే.

రామాయణము రచించినకాలమునఁ గాశీనగరమువర్ణింపఁబడ లేదు. కారణమేమి? అపు డింత పత్తనములేక శ్రీవిశ్వేశ్వరక్షేత్రవిఖ్యాతినొందియుండె నని యూహింపఁదగియున్నది. ప్రయాగస్థలమున నగర ముండినచో మహారణ్య మని వర్ణింపఁబడునా? కాఁబట్టి యీప్రశ్నముల కవకాశమే లేదు. ఆంధ్రదేశముపేరుపనిషత్తులయందుఁ గన్పట్టును. మనుస్మృతియందగపడును. ఆకాలమునని దియెట్లుండునో తద్దేశవాసులకృత్య మేమో తలంచినఁ దల కంటగించుచున్నది.

'మేధాంధ్రచుంచుమద్గూనా మారణ్యపశుహింసనమ్.'

మనుస్మృతికాలమున నాంధ్రులనఁగా నరణ్యవాసులో లేక గ్రామనగరాదినివాసులో తేటపడును. ద్రావిడులు నిట్టివారే యని యందే చెప్పఁబడినది. వీనినన్నింటిని దలంచినచో దేశము లాకాలమున నున్నట్లీకాలమున నుండక వచింప వీలులేనంత మార్పు నొందెనని తోఁచెడిని. కాఁబట్టి కిష్కింధనుండి దక్షిణభాగమున నాపేరులుగల భాగములుండెనని యంగీకరించినచో నష్టము కన్పట్టదు. కాదుకూడదని యేమేమో చెప్పఁ బూనినను సిద్ధాంతము కాఁబోవునదియు లేదు. ఊహ లెపుడు నేవిషయమునుగాని తత్త్వముగ నిర్వచింపఁజాలవు. ఎవరికి వారే సంతోషించునంతమాత్రము పనిచేయఁ జాలును.

రామాయణకాలమున దేశవిభాగములు లేకపోలేదు. ఇపు డున్నట్లు మాత్రము లేవు. దండకారణ్యమునం గూడ నందందు మునులుండు తావు లుండెను. వైఖానసు లనఁబడువారు వృక్షమూలముల నివసించుచుండిరి. రామచంద్రుఁడాయాయిస్థలములను జూచుచు మునుల మొఱ లాలకించుచుఁ బోయి పంచవటీతీరమున నివసించెను.

అగస్త్యాదిమహర్షులు రాక్షసవధ మొనరింప రామభద్రుం బురికొల్పుటయే గాక దివ్యచాపాదిపరికరముల నొసంగిరి. పంచవటీతీరము నివాసార్హ మనియు సూచించిరి. ఆప్రాంత్యముననే ఖరదూషణాదిక్రూరదానవులు కాఁపుర ముండిరి. వారిబాధలు దుర్భరములుగా నుండెను. మహారణ్య మగుటను, మహర్షులతపశ్శక్తి యమేయమని తెలియుటను ఖరాదులు లోపాముద్రాపతి లోనగుమహాత్ములజోలికిఁ బోరైరి. మునితనయులం గొందఱం జంపుటయుఁ గొందఱ బాధించుటయు జరగుచుండెను రావణానుజయగు శూర్పణఖ విచ్చలవిడి నందందు దిరుగుచుండెను దానిబాధ మఱింత దుర్భర మయ్యెను. ఇట్టి దుర్భరపరితాపము మనుజులకుం గలుగఁగా భగవంతుఁ డవతరింపక యూరకుండ సాధ్యముకాదు. కావున మనుజరూపమున రావణాదిక్రూరరాక్షసవినాశార్థమా నారాయణమూర్తియవతరించెను.

రామచంద్రునిప్రవృత్తిని జూచి నేర్చుకోఁదగిన విషయము లిన్నియని చెప్పుటకంటె మనుజుఁ డుత్తముఁడు కాఁదగినవాఁ డెట్లుండవలయునో ఆసద్గుణ

ములన్నియు నేర్చుకొనఁదగిన వని వచించుట యుక్తమము. ఏకపత్నీవ్రతాది సకలసద్గుణముల లోకులకు నేర్పఁ దా మనుజత నొందె ననుట సిద్ధాంతము.

ఇంక రామాయణశ్లోకముల నెత్తి యిట వ్రాసి పెద్ద యుపోద్ఘాతమును వ్రాయఁబూనను ఈశ్లోకములు విశేషార్థములు గలవని యాయాస్థలములయందే వివరించితిని. కాన నిట ననవసరముగా నావిషయముల వ్రాయక నాకుఁ దోఁచిన ముఖ్యవిషయముల వ్రాయఁదలఁచుచున్నాను.

### రామాయణకాలము భారతకాలమునకంటె నవీనమా?

రామాయణకాలము భారతకాలమునకన్నఁ బ్రాచీనము కాదనియు భారతమునఁ గన్పట్టు రామాయణగాథ యిటీవలఁ జేర్పఁబడినదనియు, రామాయణకాలమున నీఖండమున నాగరికత గలదనియు, భారతకాలమున నదిశూన్యమనియు నొకప్రతీతి వినఁబడియెడు. ఇంతియకాక భారతమున ననేకవిషయము లిటీవలఁ జేర్పఁబడినవనియు నొకవాదము బయలువెడలి చాలకాలమైనది. నాకుఁ దోఁచిన విషయము లీవిషయములకు సమాధానములుగా వ్రాయక వదలుటకు మనసొప్పమిఁ గడంగెదను.

ఆర్యు లను నొక తెగగుంపు ఉత్తరమున నెందో యుండి పలుదిక్కులకు వెడలిరనియు నందుఁ గొందఱు దక్షిణమున కరుదెంచిరనియు, వారిద్వారా నాగరికత యీభాగమునఁ గల్గినదనియు హిమాలయదక్షిణభాగమున నున్న భాగములయందలి నాగరికత ఆగుంపుద్వారా కలిగెననియు నొకవాదధ్వని శ్రవణమార్గమును జొచ్చుచున్నది. తలతోఁక లేని యీవాదమునకు సమాధానము చెప్పుటయా మానుటయా యన్న మానుటయే మేలని తోఁచెడిని. అయినను బుద్ధి చపలస్వభావము గలది. కాన నాలుగుమాటలు వ్రాయఁబూనెద. అది సమాధానమయిననుగావచ్చును, గాకున్నను గాకపోవచ్చును. అట్లే యాక్షేపముగూడ యుక్తమో కాదో యేదో యొకటికావచ్చును. కాఁబట్టి యీ రెండును ఒక్కరీతిగనేయుండును.

### ఆర్యు లొకగుంపుగా నుండిరా?

హిమాలయప్రాంతభూముల నెందో యొకమహీభాగమున నార్యులను తెగవా రుండిరి అనుమాట విన్నతోడనే నవ్వు పొంగి పొరలి రాకమానదు. ఆర్యులను వా రెవ్వరు? ఏలోకమునుండి వచ్చిరి? పుట్టుకతో నార్యులైరా? లేక కొంతకాలమున కా? దేనిని బట్టి యీవిధము దృఢపడును? అను ప్రశ్నములు మనసునఁ దట్టక మానవు. వెఱ్ఱిమొఱ్ఱిగా నేదో యొకసమాధాన మూహలపై నూహలతో రాకమానదు. అది సిద్ధాంతమగునా? కానేరదు. వారు చెప్పినమాటల నూఁకొట్టుచు స్థాణుత్వము నొందిన నది సిద్ధాంతమగునేమో కాని యించుక నోరుకదలించిన నది పరుగెత్తిపోవును. వేదములనుండియు వేదాంతములనుండియు స్మృతులనుండియుఁ బురాణములనుండియు వారికి వలసినభాగము లుదాహ

రింపఁబడునుగాని వారివాదమును నిరసించునవిమాత్రము ప్రక్షిప్తములనఁబడును. ఇట్టి యవకతవకయనఁ జెల్లు వాదమునకు సమాధానమేమి? వృథా కాలహరణమే. అట్లని యూరకుండ నగునా? తగదుకదా!

## ఆర్యులు.

1. హిమాలయప్రాంతముల నెందో యొకకొంతకాల ముండి యందుఁ గొందఱు తిండిపోతురామన్నలు దక్షిణభాగమునకు బయలుదేరిరి. ఇంతకన్న వెఱ్ఱి ప్రసంగ ముండదు. 2. ఆకాలమున నీదక్షిణభాగముల రాక్షసాచారములు గలిగినమనుజు లుండిరి. ఇంతకంటె నసంగతప్రసంగము లేనేలేదు. 3 అప్పు డగస్త్యుఁ డనునార్యుఁ డీదేశమునకు వచ్చెను. దీనికిం గారణమైన స్కాందపురాణకథ యబద్ధమఁట. అగస్త్యముని రాకమాత్రము నిశ్చయ మఁట ఇంతకన్నఁ దలతిక్క గలదా? ఒకగ్రంథము ప్రమాణమైనచో నందుఁ గొన్నిభాగములు కావా? అట్టి వాదమున న్యాయ ముండునా? దానికిఁ గాలూన నవకాశమైనఁ గలదా? అగస్త్యముని దక్షిణభాగమునకు వచ్చినపు డీప్రాంత్యముల నెట్టిమనుజు లుండిరి? మహర్షు లుండినట్లు ప్రమాణములు లేవా? అవిప్రమాణములు కాక జల్పితములైనచో నన్నియు నట్టివే యన్నఁ దప్పుండునా?

భారతకాలమున దేశ మెట్లుండెను? దండకారణ్య
భూభాగస్థితి యెట్టిది? రామాయణకాలమున
నవియెట్లున్నవి?

అని యించుక విచారింతము. ధార్తరాష్ట్రులు పాండుపుత్త్రులు కలిసి హాస్తినాపురమునఁ గొలఁది కాలముండిరి. వారలకుఁ గలహములు పొసఁగెను. దుర్యోధనాదులప్రక్క దుష్టులు పలువురు చేరిరి. విదురాదులు పాండుపక్షపాతులే. అనఁగా ధర్మపక్షపాతులు. రాజగు ధృతరాష్ట్రుఁ డంగహీనుఁడు. కాఁబట్టి కొడుకుమాటను దిరస్కరింపఁజాలక విదురాదుల యాశయమును పీటఁబెట్ట నూహింపక త్రిశంకుస్వర్గముగా నుండెను. కాని పాండుసూనుల క్షేమమును మాత్రము కోరుచుఁ బాండురాజు మృతికై వగచుచుండెనని చెప్పుటలో జంకవలసిన యవసరము కానరాదు. కొడుకున కీవార్త మనస్సునఁదోఁచెను. పాండుపుత్త్రులు హాస్తినాపురమున నున్న భీష్మాదికురువృద్ధులు విదురాదిమంత్రులు పాండుసూనుపక్షపాతులు కాఁబట్టి వారి కొకకీడు చేయ వలనుపడదని నిశ్చయించుకొనెను. శకునిప్రభృతి దుష్టమిత్త్రబృందమును గూడి మంతనము సల్పెను. ఊరు వెడలించుట యుక్తమని తీర్మానించుకొనెను. వారాణసీనగరము హృష్టపుష్టజనాకీర్ణము. అందుఁ బాండుపుత్త్రులకు వసతిఁ గల్పించి యందుంచినఁ దాఁ జేయఁబూనిన కీడు వారికిఁ దాఁకునని యాతని యూహ. కాఁబట్టి తండ్రితో ధర్మరాజాదులను గాశీనగరమున నుంచుట యుక్తమని తెల్పెను. వీరంద ఱొకచో నుండుటకన్న భిన్నస్థలముల నుండుట కొంత

మే తే యని యాజనుపాంధుఁ డంగీకరించెను. కాని కొడుకు చేయనున్న దుడుకుఁదనము నెఱుంగఁడు. ఈఘట్టమున భారతమునఁ గాశీవిషయ మెట్లున్నదో చూడుఁడు.

ఆదిపర్వము - ౧౪౩ అధ్యాయము.

ధృతరాష్ట్రః. మ మైతే పురుషా నిత్యం కథయంతి పునః పునః,
రమణీయతమం లోకే నగరం వారణావతమ్. ౭
తే తాత! యది మన్యధ్వ ముత్సవం వారణావతే,
సగణా స్సాన్వయా శ్చైవ విహరధ్వం యథామరాః. ౮
బ్రాహ్మణేభ్య శ్చ రత్నాని గాయనేభ్య శ్చ సర్వశః,
ప్రయచ్ఛధ్వం యథాకామం దేవా ఇవ సువర్చసః. ౯

హృష్టపుష్టజనాకీర్ణమై కాశీనగర ముండెనని యీప్రమాణములనుండి తేలును. రామాయణమునఁ గాశీనగరము ప్రస్తావమే లేదు. కాని

యాని త్వ త్తీరవాసీని దైవతాని వసంతి చ,
తాని సర్వాణి యక్ష్యామి తీర్థా న్యాయతనాని చ. (అయో. ౫౨. స. ౯౦. శ్లో.)

తీర్థాని మణికర్ణికాదీని ఆయతనాని కాశ్యాదీని అనిగోవిందరాజులు. తీర్థాని ప్రయాగాదీని ఆయతనాని కాశ్యాదీని అని తీర్థులు వ్రాసిరి.

ప్రయాగకాశీస్థలములు పెద్దనగరములై యుండినట్లు చెప్ప నవకాశము కలదా? ప్రయాగవిషయమై రామాయణాయోధ్యాకాండమున నేఁబదినాల్గవ సర్గమునందు

యథా క్షేమేణ గచ్ఛ న్స పశ్యం శ్చ వివిధా న్ద్రుమా న్,
నివృత్తమాత్రే దివసే రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౪
ప్రయాగ మభితః పశ్య సౌమిత్రే! ధూమ మున్నతమ్,
అగ్నే ర్భగవతః కేతుం మన్యే సన్నిహితో మునిః. ౫
నూనం ప్రాప్తా స్స్మ సంభేదం గంగాయమునయో ర్వయం,
తథా హి శ్రూయతే శబ్దో వారిణో వారిఘట్టితః. ౬
దారూణి పరిభిన్నాని వనజై రుపజీవిభిః,
భరద్వాజాశ్రమే చైతే దృశ్యంతే వివిధా ద్రుమాః. ౭

వీనింబట్టి గట్టిగా నాలోచింప నాకాలమునఁ బ్రయాగమున భరద్వాజాశ్రమ ముండెననియు, దట్టముగ వృక్షము లుండెననియు, నాటవికులు ఛేదించిన వృక్షములు పడియున్నవనియుఁ దేలక మానదు. అనఁగా నరణ్యమధ్యమభాగమున భరద్వాజాశ్రమ మున్నట్లు స్పష్టము.

భారతకాలమున కాప్రాంతమహాభాగములు నగరములతో విరాజిల్లుచుండుట లేదా? అరణ్యములు గ్రామనగరాదు లగుట సృష్టిసహజము గాని పురము

లరణ్యము లగుట సృష్టివిరుద్ధము. కాఁబట్టి భారతకాలమునకన్న రామాయణ కాలము ప్రాచీనకాల మనుట స్పష్టము.

చిత్రకూటపరిసరభాగములు మహారణ్యభూయిష్ఠములని రామాయణమున వర్ణింపఁబడినవి. ఆభూభాగములు నగరమయములై యుండ నరణ్యములుగనున్నట్లు వర్ణింపఁబడియె ననుట హాస్యాస్పదము. స్వభావవిరుద్ధము. భారతకాలమున నా భాగము లరణ్యములుగ నున్నట్లూహింప వీలు లేదుకదా.

రామచంద్రుఁడు గుహుని వదలి గంగను దాఁటి దక్షిణతీరమును జేరి లక్ష్మణునితో

“ప్రణష్టజనసంబాధం క్షేత్రారామవివర్జితం,
విషమం చ ప్రపాతం చ వన మద్య ప్రవేక్ష్యతి.” (అ.౨. స. ౫౨. శ్లో.)

అని చెప్పెను. గంగాదక్షిణభాగము నిర్మానుష్యమగు నరణ్యమయ మని స్పష్ట మగును.

భరద్వాజముని రామునకుఁ జిత్రకూటమార్గమును దెల్పుచు

“తత్ర యూయం ప్లవం కృత్వా తరతాంశుమతీం నదీమ్,
తతో న్యగ్రోధ మాసాద్య మహాంతం హరితచ్ఛదమ్.”

అని తెల్పెను.

తౌ కాష్ఠసంఘాట మథో చక్రతు స్సుమహాప్లవమ్,
శుష్కై ర్వంశై స్సమాస్తీర్ణ ముశీరైశ్చ సమావృతమ్.
తతో వేతసశాఖాశ్చ జంబూశాఖాశ్చ వీర్యవాన్,
చకార లక్ష్మణ శ్ఛిత్వా సీతాయా స్సుఖ మాసనమ్.”

ఇట్లు యమునానదిని దాఁటుటకుఁ దమరే పడవను నిర్మించుకొనుట యెంత పూర్వ కాలపు టాచారమో తెలిసికొనవచ్చును గదా.

ప్రయాగక్షేత్రము మొదలు కిష్కింధానగరమువఱకు మహారణ్యముగా నుండుట రామాయణకాలము. భారతకాలమున నీభాగ మరణ్యమయ మని చెప్ప వీలున్నదియా? దీనింబట్టి యోజించినను రామాయణకాలము భారతకాలమున కన్నఁ బ్రాచీనమని తేలకపోదు.

దండకారణ్యమునఁ బ్రాచీనసృష్టినిం దెలుపునట్టి ప్రాణికోటి యుండినట్లు రామాయణము తెలుపును. ఇంచుకే నాగరికత లేనివారుగ నున్నట్లు స్పష్ట మగును.

“వివృద్ధ మశిరోగ్రీవం కబంధ ముదరే ముఖమ్,
రోమభి ర్నిచితై స్తీక్ష్ణై ర్మహాగిరి మివోచ్ఛ్రితమ్.
నీలమేఘనిభం రౌద్రం మేఘస్తనితనిస్వనమ్,
అగ్నిజ్వాలానికాశేన లలాటస్థేన దీప్యతా.

మహాపక్షేణ పింగేన విపులేనాఽఽయతేన చ,
ఏకే నోరసి ఘోరేణ నయనే నాశుదర్శినా.
మహాదంష్ట్రోపపన్నం తం లేలిహానం మహాముఖమ్," (ఆరణ్య. ౭౧. స.)

అని కబంధదానవరూపము వర్ణింపఁబడినది. ఇంతియకాక లంకాపురమున రాక్షసరూపములు నామములు వికృతితను దెలుపును.

"ఏకాక్షీ మేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా,
అకర్ణాం శంకుకర్ణాంచ మస్తకోచ్ఛ్వాసనాసికాం.
అతికాయోత్తమాంగీం చ తనుదీర్ఘశిరోధరాం,
ధ్వస్తకేశీం తథా కేశీం కేశకంబళధారిణీం.
లంబకర్ణలలాటాం చ లంబోదరపయోధరాం,
లంబోష్ఠీం చుబుకోష్ఠీం చ లంబాస్యాం లంబజానుకామ్." (సుందర. ౧౭. స.)

ఇట్టి రూపములుగలవారు పెక్కుమంది యాకాలమునఁ గన్పట్టుచుండినట్లు చెప్పఁబడినది. ఈలాటిసృష్టి ప్రాచీనకాలమును దెలుపదా? భారతకాలమున నిట్టివారు కలరా?

## యుద్ధములు.

రామాయణకాలమున వ్యూహాదిచమత్కృతులు లేక గుంపులు గుంపులుగాఁ గొందఱు రాక్షసులు తమయధిపతితోఁగూడిపోవుటయు, విచ్చలవిడి యుద్ధమొనరించుటయు, మాయాయుద్ధము చేయుటయు, శిలావర్షమును గురిపించుటయు, నదృశ్యులై యుద్ధముచేయుటయు, నాభిచారికహోమములు చేసి దారుణయుద్ధములు చేయుటయు నాచారములై యుండెను.

భారతకాలమున వ్యూహాదిచమత్కృతులుగలిగి సేనాధిపతి చెప్పినచొప్పున నందఱును బ్రవర్తించుచు నెక్కటికయ్య మొనరించుచు నాయుధములతోఁ బోరాడుచు మధ్యాహ్నకాలమునఁ గొన్నిముహూర్తములుపోరుమానుచు సాయంకాలమున విడుదుల కేఁగుచు యుద్ధముచేయు నాచారము లుండెను. ఇంతియకాక గదాయుద్ధమున నాభికిఁ గ్రిందిభాగమున నొప్పింపరాదను లోనగు నియమము లుండెను. నియమవిరుద్ధముగ యుద్ధ మొనరించినచో నింద గలుగుచుండెను. ఈ యుద్ధము యుద్ధశాస్త్రమున నెన్నియో మార్పులు గలిగి నియమములు పెక్కులు చేయఁబడినట్లగపడును గదా.

రామాయణభారతయుద్ధధర్మముల రెండింటిని బరిశీలించినచో మొదటిది నియమబద్ధము కాని యుద్ధమనియు, రెండవది నియమాదివిహితయుద్ధ మనియుఁ దేటపడును. ఫలితము మొదటిదానికంటె రెండవది నాగరికత గలిగినవారేర్పఱిచిన నియమములు గలదనుటయే కదా.

ఒక రిద్దఱు రాక్షసులు మాయాసంగర మొనరింపలేదా? యను ప్రశ్నము రావచ్చును. ఆప్రశ్నమే క్రూరదానవస్వల్పతను సంఖ్యను దెలుపుచుఁ బైప్రశ్నమునకు నుత్తరముఁ దెల్పును. దీనింబట్టి యోజించినను భారతకాల మిప్పటికి సమాసన్నకాలమే యని దృఢపడుచును.

## సత్యము.

రామాయణకాలమున మనుజులు సత్యపాశైకసంయుతాత్ములుగ నుండిరి. భారతకాలమున దానియందుఁ జమత్కృతి యించుక గనుపట్టు. "రామ స్సత్య పరాక్రమః." అనువిశేషణము రామాయణమునఁ బెక్కుతావుల నుపయోగింపఁ బడినది కదా! అట్లే భారతమున నుపయోగింపఁబడినదా?.

దశరథునికాలపు సత్యవాక్కును ధర్మరాజుకాలపు సత్యవాక్కును బరిశీలించిన నెంతయో భేదము కన్పట్టక మానదు. ఏదియుక్త మేది యయుక్త మను ప్రశ్నము వలదు. రెండవది సమీపకాల మనుటను జెప్పక చెప్పుచున్నదనుట నిస్సంశయము.

'సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయా న్న బ్రూయా త్సత్య మప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయా దేష ధర్మ స్సనాతనః.'

అను ధర్మసూక్ష్మము భారతసత్యమునఁ గన్పట్టు. రామాయణసత్యమున నట్టి మార్పులు లేనట్లే తెలియనగు. చమత్కృతి హెచ్చుట ప్రాచీనకాలలక్షణము కాదు.

## లాక్షాగృహనిర్మాణమును బరిశీలింతము.

"శణసర్జరసాదీని యాని ద్రవ్యాణి కానిచిత్,
ఆగ్నేయా న్యత సంతీహ తాని తత్ర ప్రదాపయ.
సర్పిస్తైలవసాభి శ్చ లాక్షయా చా ప్యనల్పయా,
మృత్తికాం మిశ్రయిత్వా త్వం లేపం కుడ్యేషు దాపయ.
శణం తైలం ఘృతం చైవ జతుదారూణి చైవ హి,
తస్మి న్వేశ్మని సర్వాణి నిక్షిపేథా స్సమంతతః
యథా చ త న్న పశ్యేర న్పరీక్షంతోఽపి పాండవాః,
ఆగ్నేయ మితి తత్కార్య మితి చాన్యేఽపి మానవాః.
... ... ... ... ...
జ్ఞాత్వా చ తా న్సువిశ్వస్తా న్శయానా నకుతోభయాన్,
అగ్ని స్త్వయా తతో దేయో ద్వారత స్తస్య వేశ్మనః.
దహ్యమానే స్వకే గేహే దగ్ధా ఇతి తతో జనాః,
న గర్హయేయు రస్మా న్వై పాండవార్థాయ కర్హిచిత్" (ఆది. ౧౪౪. అ.)

ఇట్టి కృత్రిమోపాయములు రామాయణకాలమునఁ గలవా? మాయాసీతాదిసందర్భనాదులు లేవా? యన్న నీరెండింటికిం గలతారతమ్య మూహించినచోఁ గాలభేదము బుద్ధిమంతులకుఁ దట్టక మానదు.

"పౌరేషు వినివృత్తేషు విదుర స్సర్వధర్మవిత్,
బోధయన్ పాండవశ్రేష్ఠ మిదం వచన మబ్రవీత్.
*ప్రాజ్ఞః ప్రాజ్ఞప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞ మిదం వచః,
ప్రాజ్ఞః ప్రాజ్ఞం ప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞం వచోఽబ్రవీత్. (భారత. ౧౪౫. అ.)

ఈవిషయమును బరిశీలించిన నీకాలమెంత సమాసన్నకాలమో తెలియం దగు. ఈలాటిభాషాభిజ్ఞత రామాయణకాలమున నేరికేఁ గలదా? ఇంచుక యోజింపుఁడు.

"ధామం చ బిల మద్యైవ కరవామ స్సుసంవృతమ్,
గూఢోచ్ఛ్వాసా న్న న స్తత్ర హుతాశ స్సంప్రధక్ష్యతి
వసతోఽత్ర యథా చాస్మా న్న బుధ్యేత పురోచనః,
పౌరో వాపి జనః కశ్చి త్తథా కార్య మతంద్రితైః." (ఆది. ౧౪౭. అ.)

ఇట్టి చమత్కృతిగల కృత్రిమకార్యధురీణత రామాయణమునఁ గలదా? ఇట్టివిషయముల నెన్నింటినో యెన్నివిధములం దలంచినను భారతకాల మీకాల మునకు సమాసన్నకాల మనియే తోఁచును.

### బకవధము.

ఏకచక్రపురవాసులు ప్రతిదిన మొక్కొక్కరిని బంచుటకుఁ దన యాఁకలి నంతమాత్రమున నడంచుకొనుటకు నచ్చటివారును బకాసురుఁడును నియమము గావించుకొనిరి. ఆరీతిగాఁ గొంతకాలము సాగెను. పాండుతనయులు కుంతియు నం దుండిరి. ఆనాఁడు వారున్న యింటివారి కా నియమమురీతి వంతువచ్చెను. భీముఁడు తదర్థమై తాను బోయి బకునిం జంపెను. ఇదియే కథాసారము. దీనింబట్టి యోజిం చిన రాక్షసులక్రౌర్యము కొంత తగ్గినట్టు కొన్ని నియమములకు వారు లోఁబడి నట్లు కనుఁగొనవచ్చును. ఇట్టి పద్ధతుల రామాయణకాలికరాక్షసు లవలంబించి నట్లు కన్పట్టునా? బకాదులకన్న ఖరాదిదానవులు క్రూరులు, క్రూరాచారవిహార పరాయణులని కదా కన్పట్టును. ఇద్దానిం బట్టి నిష్పక్షపాతముగ నాలోచించిన భారతకాలమున నాగరికత హెచ్చిన దని తెలియఁబడదా?

### జూదము.

ప్రభువులు పందెములు పెట్టి జూద మాడుట. దాన రాజ్యముల నోడుట, దానఁ దృప్తి చాలమి భార్యను బందెముగా నుంచుట యును నివి కేవల మనాగ

---

* ప్రాజ్ఞః బుద్ధిమాన్ ప్రకర్షేణ అజ్ఞాః ప్రాజ్ఞాః పశుప్రాయాః మ్లేచ్ఛాః తేషాం ప్రలాపం ప్రకృతిప్రత్యయవిభాగేన అనిష్పన్నత్వా దర్థానవబోధకం లుప్తాదివికృతవర్ణవ త్పదకదంబనిబద్ధం దేశభాషారూపం వచనం జానా తీతి తథోక్తః విదురః ప్రలాపజ్ఞం మ్లేచ్ఛభాషాభిజ్ఞం యుధిష్ఠిరం ప్రతి ప్రాజ్ఞః ప్రకర్షేణ అజానతః ప్రాజ్ఞం ప్రకర్షేణ అర్థానాం అనవబోధకం ప్రలాపజ్ఞః ప్రలాపం జానతః ప్రలాపజ్ఞం ప్రలాపజ్ఞాపకం ఏతాదృశం వచః వచనీయ మిదం వక్ష్యమాణం వచః అబ్రవీత్. ఇతి సంబంధః.

రికతను దెల్పును. ఇవి భారతకాలమునఁ గన్పట్టు. రామాయణకాలమున నిట్టివి లేవు. కాఁబట్టి రామాయణకాలము నాగరికతగలకాలముగా నెన్నఁదగియున్నది. దానంజేసి భారతకాలమునకంటెఁ దరువాతిది యేలకాఁగూడదను ప్రశ్నము రాక తప్పదు.

ఈప్రశ్నమునకు సమాధానము చెప్పుటయున నంతకష్టమైనదికాదు. దుర్యోధనాదుల ప్రయత్నము ధర్మవిరుద్ధమనియు, దీనఁ గులక్షయ మగుననియు విదురాదులు స్పష్టముగఁ దెల్పిరి. భీష్మాదు లీయర్థమునే యంగీకరించిరి. ఇప్పట్టున నీ శ్లోకములు గన్పట్టు.

"శ్లో. ఏవం ప్రవర్తితే ద్యూతే ఘోరే సర్వాపహారిణి,
సర్వసంశయనిర్మోక్తా విదురో వాక్య మబ్రవీత్.
మహారాజ! విజానీహి య త్త్వాం వక్ష్యామి భారత!,
ముమూర్షో రౌషధ మివ న రోచే తాపి తే శ్రుతమ్.
యద్వై పురా జాతమాత్రో రురావ గోమాయువ ద్విస్వరం పాపచేతాః,
దుర్యోధనో భారతానాం కులఘ్న స్సోఽయం వ్యక్తం భవతాం కాలహేతుః.
గృహే వసంతం గోమాయుం త్వం వై మోహా న్నబుధ్యసే,
దుర్యోధనస్య రూపేణ శృణు కావ్యాం గిరం మమ.
మధు వై మాధ్వికో లబ్ధ్వా ప్రపాతం నైవ బుధ్యతే,
ఆరుహ్య తం మజ్జతి వా పతనం వాధిగచ్ఛతి.
సోఽయం మత్తోఽక్షద్యూతేన మధువ న్న పరీక్షతే,
ప్రపాతం బుధ్యతే నైవ వైరం కృత్వా మహారథైః.
విదితం మే మహాప్రాజ్ఞ! భోజే ష్వే వాసమంజసమ్,
పుత్రం సంత్యక్తవాన్ పూర్వం పౌరాణాం హితకామ్యయా. (సభాపర్వము. ౬౧. అ.)

ఈఘట్టమునఁ బేర్కొనఁబడిన నీతులం దలంప ద్యూతము నాకాలమున నెంతగా నిందింపఁబడినదో యెఱుంగనగు. ఇట్టి యాచారమును దత్పూర్వ ముండినట్లు దీనినుండి తెలిసికొనవచ్చు.

### మానభంగము.

ద్రౌపదిని సభలోని కీడ్చి తెచ్చుట యనఁ గేవల మనాగరికత కాదా? యనునదియుఁ బై ప్రశ్నమునకుఁ దరువాతి ప్రశ్న మనవచ్చు.

దుష్టచతుష్టయమాత్రాంగీకృతమై భీష్మాదికురువృద్ధనిందిత మగు నిది యాకాలమున సర్వజనాంగీకృతమార్గము కాదనియు సభాముఖముననే యాక్షేపింపఁబడియె ననియుఁ దెలియుచుండఁగాఁ బ్రత్యేకసమాధానము సుసంగతము కాదు.

'ధి గస్తు నష్టః ఖలు భారతానాం ధర్మ స్తథా క్షత్రవిదాం చ వృత్తమ్,
యత్ర ప్రాప్తాం కురుధర్మవేలాం ప్రేక్షంతి సర్వే కురవ స్సభాయామ్. (సభా. ౬౭.అ.)

అను నీద్రౌపద్యుక్తి పై సమాధానమును స్థిరపఱచుట లేదా? ఇట్టి యాచార మా కాలమున వాడుకగా లేదనియు, ధర్మాతిక్రమణము నొనరించిన దుర్యోధనునకుఁ బ్రాయశ్చిత్తము చక్కఁగనే జరిగినదనియు నెఱుంగఁదగు.

దీనింబట్టి యిట్టి యాచారములు గలకాలము చాలప్రాచీనమని తేలుననుట మొండిపట్టు. శూర్పణఖ స్వేచ్ఛఁగాఁ దిరుగుచు రాముని గామింప దానిముక్కు చెవులు భేదింపఁబడియెఁ గదా! అది క్రూరాచారము కాదా? అట్టి యాచారము గలకాల మింతకంటెఁ బ్రాచీనము కాదన నెట్టి యవకాశము గలదు?. అట్టి శిక్ష భారతకాలమునఁ గానరాదు కదా. కాఁబట్టి యీకథను బురస్కరించుకొని ప్రాచీన నవీనకాలనిర్ణయము చేయ వీలుకాదు. జనసామాన్యాచారవ్యవహారాదులం బట్టియే నిర్ణయింపవలయు.

## పురనిర్మాణము.

ఇది ప్రాచీననవీనకాలపు టాచారములఁ దెలుపఁజాలు. ఎట్లన: పూర్వకాలమున నగరము నిర్మించినపిదప నందుఁ బ్రవేశించుట యాచారమైనట్లు కనుపట్టు. ఇప్పటివలెఁ దొలుతఁ జిన్నపల్లియలుండి యావల వరుసగా నగరము లగుట లేదు. ఉత్తరకాండమునుండి యీవిషయము తేలును.

విశ్వకర్మా తత స్తేషాం రాక్షసానాం మహాభుజః,
నివాసం కారయామాస శక్రస్యే వామరావతీమ్.
దక్షిణ స్యోదధే స్తీరే త్రికూటో నామ పర్వతః,
సువేల ఇతి చా ప్యన్యో ద్వితీయో రాక్షసేశ్వరాః.
శిఖరే తస్య శైలస్య మధ్యమేఽంబుదసన్నిభే,
శకునై రపి దుష్ప్రాపే టంకచ్ఛిన్నచతుర్దిశి.
త్రింశద్యోజనవిస్తీర్ణా శతయోజన మాయతా,
స్వర్ణప్రాకారసంవీతా హేమతోరణసంవృతా.
మయా లంకేతి నగరీ శక్రాజ్ఞప్తేన నిర్మితా,
తస్యాం వసత దుర్ధర్షాః! పుర్యాం రాక్షససత్తమాః!.
అమరావతీం సమాసాద్య సేంద్రా ఇవ దివౌకసః.

... ... ... ... ...

విశ్వకర్మవచ శ్శ్రుత్వా తత స్తే రాక్షసోత్తమాః,
సహస్రానుచరా గత్వా లంకాం తా మావస న్పురీమ్. (ఉత్తరకాం. ౫. స)

దేవేంద్రునియాజ్ఞరీతి లంకానగరము నిర్మింపఁబడెననియు, మాల్యవత్సుమాలిమాలినామకరాక్షసులు మువ్వురు బ్రహ్మదత్తవరగర్వితులై విశ్వకర్మనుబిలిచి మా కుండఁదగుతావు చూపుమా యన నాతఁడు లంకానగరము తగినదని చెప్పెననియు, నందు వారు నివసించి రనియుఁ, గొంతకాలమునకు విష్ణువు వారినోడిం

పఁగా దానిని వదలి భీతులై రసాతలమునకుం బోయిరనియు, ఆనగరము నిర్జనమై యుండెననియుఁ, గుబేరుఁడు విశ్రవసునివలనఁ గలిగి నివాస మడుగ లంకానగరమున నుండు మని చెప్పెననియు, రావణుఁడు సోదరులం గూడి వరగర్వితుఁడై లంకానగరము నాక్రమింపఁ బ్రహస్తుని దూతగాఁ బంపఁగాఁ గుబేరుఁడు ప్రహస్తునితో

దత్తా మ మేయం పిత్రా తు లంకా శూన్యా నిశాచరైః,
నివేశితా చ మే యత్నై ర్దానమానాదిసద్గుణైః. (ఉత్తరకాం. ౧౧. స)

అని చెప్పెననియుఁ గథ కన్పట్టెడు. మఱియు

ఏవ ముక్తో గృహీత్వా తు తద్వచః పితృగౌరవాత్,
సదారపౌరసామాత్య స్సవాహనధనో గతః.
శూన్యా సా నగరీ లంకా త్రింశద్యోజన మాయతా
క్షిప్రమే వాభవ ద్రామ! నిర్జనా చాథ నిర్భయా.
... ... ... ... ...
ఏవ ముక్తో దశగ్రీవః ప్రహస్తేన మహాబలః,
వివేశ నగరీం లంకాం సభ్రాతృబలవాహనః.
ధనదేన పరిత్యక్తాం సువిభక్తమహాపథామ్,
ఆరురోహ స దేవారి స్స్వర్గం దేవాధిపో యథా. (ఉ. ౧౧ స.)

కుబేరాదులు విడువఁగా నిర్జనమగు నాలంకానగరమును దశగ్రీవుఁడు ప్రవేశించినట్లందే కనఁబడును. ఆవల

ధనేశ్వర స్త్వథ పితృవాక్యగౌరవా న్న్యవేశయ చ్ఛశివిమలే గిరౌ పురీమ్,
స్వలంకృతై ర్భవనవరై ర్విభూషితాం పురందరః పుర మమరావతీం యథా. (ఉ. ౧౧. స.)

కుబేరుఁడు హిమాలయమున దివ్యభవనాలంకృతమగు నగరము నాక్రమించె ననియు నందే కానఁబడును.

ఈవిషయములనుబట్టి చక్కఁగా యోజింప నాకాలమున ముందు శిల్పులు నగరముల మంచితావుల శత్రుదుర్భేద్యములుగ నిర్మించి యుంచుట వానినుచిత రీతి బలవంతులగు వా రాక్రమించుటయు నాచారములుగ నున్నట్టు మనస్సునకుఁ దట్టును. ఇట్టి యాచారము భారతకాలమున నున్నట్లు కన నగునా?.

### అస్త్రవిద్యాభ్యాసము.

రామాయణకాలమున రాజపుత్రులు తండ్రియొద్ద శస్త్రవిద్యాభ్యాసము చేయుట యాచారమైన ట్లగపడు. ఆవల నతఁడే యస్త్రముల యథాపుణ్యముగ సంపాదింపఁ గల్గునట్లు చూపట్టు. భారతకాలమున నొకపాఠశాలయు, నందు నిపుణుఁడగు గురువు, నాతనియొద్దఁ గొంతమంది రాకొమరులు శస్త్రవిద్య నభ్యసించుటయు నాచారముగ నున్నట్లు తెల్లమగు నంతియకాక నానాభూపాలురపుత్రులు బ్రాహ్మణులు గూడ నాపాఠశాలయందుఁ జేరి విద్యాభ్యాస మొనరించు చుండు

టయుఁ గొంతకాలము కాఁగా వారిని బరీక్షించుటయు, నదిబహుజనసమక్షమున జరుగుటయు నాచారమగుట విస్పష్టమగు.

కురుకుమారులు కృపాచార్యునొద్ద నస్త్రవిద్య నభ్యసించుచుండిరి. ఇంతలో ద్రోణాచార్యుఁ డచటికి వచ్చెను. అప్పుడు భీష్ముఁ డాద్రోణునితో

అసజ్యం క్రియతాం చాపం సాధ్వస్త్రం ప్రతిపాదయ,
భుంక్ష్వ భోగాన్ భృశం ప్రీతః పూజ్యమానః కురుక్షయే.
కురూణా మస్తి యద్విత్తం రాజ్యం చేదం సరాష్ట్రకం,
త్వమేవ పరమో రాజా సర్వే చ కురవ స్తవ,
యచ్చ తే ప్రార్థితం బ్రహ్మన్! కృతం త దితి చింత్యతామ్.
దిష్ట్యా ప్రాప్తోఽసి విప్రర్షే! మహా న్మేఽనుగ్రహః కృతః. (ఆది. ౧౩౧. అ.)

అని చెప్పెను.

తత స్సంపూజితో ద్రోణో భీష్మేణ ద్విపదాం వరః,
విశశ్రామ మహాతేజాః పూజితః కురువేశ్మని.
విశ్రాంతేఽథ గురౌ తస్మిన్ పౌత్రా నాదాయ కౌరవాన్,
శిష్యత్వేన దదౌ భీష్మో వసూని వివిధాని చ. (ఆది. ౧౩౨. అ.)

ఈశ్లోకార్థములం దలంప నాకాలమున గురుగృహమే పాఠశాలగ నమర శిష్యులందఱు నచటికిం బోయి యస్త్రవిద్య నభ్యసించుచుండుట తేటపడు. కౌరవపాండుసూనుప్రభృతుల యస్త్రవిద్యాపరీక్షావిషయము నొక్కమాఱు మనసున నూహించిన నెంత చక్కని యేర్పాటు లప్పు డుండెనో తేటపడక మానవు. ఇట్టి యేర్పాటులు రామాయణకాలమున లేనేలేవు కాఁబట్టి భారతకాలము రామాయణకాలమునకన్నఁ దరువాతిదని విస్పష్టమగు.

దేశవిభాగమునుబట్టియు, అడవులసాంద్రతను బట్టియు, నగరాదినిర్మాణములఁ బట్టియు, జనసామాన్యప్రవృత్తిని బట్టియు విద్యాభ్యాసతత్పరీక్షానియమములం బట్టియు, యుద్ధనియమములం బట్టియు, క్రూరాచారములం బట్టియు, సృష్టివైచిత్రిని బట్టియు, నిట్టి వెన్నియో విషయములం బట్టి యెట్లు లాలోచించినను రామాయణకాలము భారతకాలమునకంటె నతిప్రాచీనమని స్పష్టము కాకపోదు. ఇద్దానిని దృఢపఱచు నుదాహరణముల నీరెండుగ్రంథములనుండి చూపఁబూన నిటఁ జోటు చాలదు. స్థాలీపులాకన్యాయమునఁ గొలఁదివిషయముల స్పృశించి వదలితి. బుద్ధిమంతు లాలోచింతురుగాక.

## ఆర్యులు.

ఆర్యులవిషయమున నాలుగుమాటలు వ్రాయక విరమింప లేఖిని యొప్పకున్నది. ఆర్యు లుత్తరమున నెందో గుంపుగ నుండిరి. ఆకాలమున దక్షిణమున నాటవికు లుండిరి అనునీవాదము నిస్సారము. అంతియెగాక దుస్సారము. రామ

లక్ష్మణులు పంచవటీతీరమునకు వచ్చినపుడు సుందరాకారులగునట్టివారి నంతకు ముున్ను కని విని యెఱుంగమి శూర్పణఖ మోహించెననియుఁ, దడాదిగా నార్యు లచ్చటి కనఁగా వింధ్యపర్వతయామ్యభూభాగమునకు రా మొదలిడిరని దీనివలనఁ దేటపడుచున్నదనియుఁ జెప్పెడి వాక్యములకుఁ దలతోఁక యనునవి లేవు. ఇది యొక చచ్చువాదము. మహాత్ములు, త్రికాలజ్ఞులు నగు మునివరేణ్యు లెందఱో యందుండిరి. కాన నీలాటి యూహలచే నిట్టి గొప్పవిషయములను సిద్ధాంతము చేయఁబూనుటకంటె సాహసకార్యము వేఱొకటి కానరాదు. అట్టిసిద్ధాంతములకు సమాధానము చెప్పఁబూనుటయు నంతకంటె వెఱ్ఱితనము. కాన నావిషయమై మిక్కిలి శ్రమించినట్లు వ్రాయక వదలి యింక రామాయణవిషయమై నాలుగు మాటలు వ్రాయఁ దలంచితి.

## రామాయణకాలపు భాష.

రామాయణకాలమున జనసామాన్యమునకుఁ దెలిసిన భాష సంస్కృతభాష. సంస్కృతము దేశభాషగా నున్నట్లు గానరాదు. కాని స్త్రీలులోనగువారికిం దప్ప నందఱకు సాధారణముగా సంస్కృతము తెలిసియే యుండెను. బ్రాహ్మణులు సంస్కృతభాషనే తఱచుగ మాటలాడువారు. ఇతరులు సంస్కృతభాష సామాన్యముగాఁ దెలిసినవారేయనవచ్చును. దేశభాషలు లేకపోలేదు. సంస్కృతభాషాజ్ఞానము లేనివారు కొలఁదిమందియే. దేశభాషలకంటె సంస్కృతభాష మర్యాదను బొందియుండెను. స్త్రీలు లోనగువారు దేశభాషలనే యెఱింగినవారుగా నుండిరి. సంస్కృతభాషను స్త్రీలుఁ గొంచెమైన నెఱుంగరని చెప్ప వీలు లేదు. స్త్రీలు విదుషీమణులుగ నుండిరి. స్త్రీవిద్య మర్యాదను బొందకుండె ననుట కవకాశము లేదు. రాజభాష దేశభాషయే గాని సంస్కృతభాష కాదన నవకాశము గలదు. ఈవిషయము

వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్,
యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్.
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి,
వానరస్య విశేషేణ కథం స్యా దభిభాషణం.
అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్,
మయా సాంత్వయితుం శక్యా నాఽన్యథేయ మనిందితా (సుం. ౩౦. స. ౧౭. శ్లో.)

అను నీభాగమునుండి యూహింప సాధ్యము. 'సంస్కృతామ్=ప్రయోగసౌష్ఠవలక్షణసంస్కారయుక్తామ్.' అని గోవిందరాజులు వ్రాసిరి. సంస్కృతాం గీర్వాణాం అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఇరువురిభావ మొకటియే. 'అత్రవాక్యస్య మానుషత్వం కోసలదేశవర్తిమనుష్యసంబంధిత్వం వివక్షితం తాదృగ్వాక్యస్యైవ దేవీపరిచితత్వాత్'-అని తిలకవ్యాఖ్యానకర్తలు వ్రాసిరి. గోవిందరాజమహేశ్వరతీర్థ

లేరుపు రిట్లు వ్రాయుచుండుటం జూడ 'తాదృగ్వాక్యస్యైవ' అనునీయర్థము వారికి సమ్మతము కాదని తోఁచెడి. సీతాదేవి జనకరాజాంతఃపురమునఁ బెరిఁగిన వనితామణి. ఆమెకు సంస్కృతభాషాజ్ఞానము లేదనరాదు. హనుమ సామాన్యదృష్టి నాలోచించి సంస్కృతభాషాజ్ఞానము కలదో లేదో యని సంశయించి మానుషభాషతో మాటలాడిన మేలని యూహించె నని చెప్పినను జెప్పవచ్చు. మొత్తముమీఁద దేశభాషాజ్ఞాన మెల్లరకుం గలిగియుండుట సహజము. సంస్కృతజ్ఞానము దానికన్నఁ దక్కువమంది కుండునని హనుమ యూహించె ననుటలోఁ దప్పేమియుఁ గానరాదు దేశభాష యొకభాషయే యాకాలమున నున్నట్లూహింప నవకాశము గలదని కొంద ఱందురు గాని యది యంతగా విశ్వాసార్హమైనది కాదు. ఆకాలమున సాధారణముగా సంస్కృతభాషాజ్ఞాన మెల్లరకుం గలిగియే యుండెను. కావున నితరజనపదవాసి వచ్చినపుడు నోరుకొట్టుకొని కడుపు చూప నక్కరయుండదు, దేశభాషలు పెక్కు లుండి యుండు ననుటయే సరసము. వ్యాకరణము దేశభాష కుండెనా? యనుప్రశ్నము వెఱ్ఱితనమును సూచించును. ఏలన సంస్కృతభాష ప్రాయశః ప్రచారముగ నుండెను. అదియే గౌరవస్థానము నధిష్ఠించెను. తక్కుభాషలు దేశగౌరవప్రదర్శనార్థ ముండియుండునని యూహించుట మంచిది. కాఁబట్టియే హనుమంతుఁడు సంస్కృతభాషతో మాటలాడిన వానరుఁడిట్లు మాటలాడుట సంగతముకాదు. కాఁబట్టి వీఁడు రాక్షసుఁడే యగునని సీత శంకించునని తలంచి ''మానుషం వాక్య మర్థవత్'' అని యూహించి యర్థము చక్కఁగా నగునట్లు దేశభాషతో మాటలాడెను. కోసలదేశభాష యాకాలమున నేది యుండెనో యాభాషతోఁ దనభావమును బవమానతనయుఁడు తెలిపెను. కిష్కింధకుఁ గోసలదేశము కడుంగడు దూరము. ఆ శభాష హనుమ కెట్లు తెలిసియుండెను. అనుటకు ప్రశ్నము. హనుమదాదులవిషయమున నిట్టి ప్రశ్నములు బ్రహ్మాస్త్రములవలెఁ బ్రయోగింపరాదు.

సీతకు సంస్కృతభాషాపాండిత్యము కలదనియే చెప్పవలయు. సీతకే కాక లంకానగరమున నుండు రాక్షసస్త్రీలకుం గూడ గీర్వాణభాష వచ్చియుండును. కాఁబట్టియే సీతతో మాటలాడఁ గల్గిరి. ఇవ్వి యన్నియు నూహించినచో నించుమించుగా దేశభాషవలె గీర్వాణభాష యాకాలమున జనసామాన్యమునకుఁ దెలిసియుండెననియు, దేశభాషలు గౌరవస్థానము నాక్రమింపఁజాలక యుండెననియుఁ దేటపడును. స్త్రీశూద్రాదులకుఁ బ్రాకృతాదిషడ్భాషాజ్ఞానము కలిగియుండె ననుటయు స్పష్టమగు. ఏదోయొకరీతిగా దేశభాష లుండియేయుండును గాని మరియాద నందియుండె ననుట సంశయాస్పదమే యని నాయూహ. ఈనాయూహ సరియైనది కాదన్నను జిత్ర ముండదు.

## విద్యాపఠనము, వ్రాఁత.

వేదవేదాంగాదివిద్యలు, సంగీతాదికళలు గ్రంథరూపముననుండక యొకరి

నుండి యొకరు నేర్చుకొనుటయు, నందున నవి నశింపక నిలిచియుంటయుఁ గలిగె ననుట యసంగతప్రసంగము కాదు వ్రాఁతలేనే లేదనువాదమున నేఁ జేరఁగల్గినంత బుద్ధిమంతుఁడను గాను. వ్రాఁత చాల తక్కువ యనవచ్చు. భూదానాదులు తామ్రాదిపత్రములపైఁ జెక్కఁబడుచుండెను. అక్షరములే యాకాలమున లేవు. అనువాదము మాత్రము హఠవాదము.

"రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగుళీయకమ్!,
ప్రత్యయార్థం త వానీతం తేన దత్తం మహాత్మనా.
సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి,
గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషితమ్
భర్తార మివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్." (సుం. ౩౬. స.)

అక్షరములే లేకపోయినచో రామనామాంకితత్వము సంభవించునా? "రామ" అను రెండక్షరములు చెక్కఁబడియున్న యుంగరమని కాదా దీని యర్థము? అక్షరశూన్యముగా నాపేరు నిమిడించుట యెట్లో తెలియరాకున్నది. రత్నములనే ఆగుర్తు కనఁబడునట్లు చేయఁబడినదని కొందఱు పైశ్లోకమున కర్థము చెప్పుదురు. కాని రత్నములనే 'రామ' యను వర్ణములు కనఁబడునట్లు చేయుట యనఁగా నక్షరము లున్నవనియే స్ఫురించును గదా. ఇఁక నాయర్థమున స్వారస్య మే మున్నది? మఱికొందఱు రామాయణము జరగిన చాలకాలమునకు వాల్మీకి రామాయణమును రచించి యాకాలమున నక్షరము లున్నందున నవ్వాని నాకాలమున నున్నట్లు చెప్పెను గాని రామాయణకాలమునమాత్రము లేవని చెప్పుదురు. ఔరా! ఏమి వీరిచమత్కారము. అప్పుడు రామాయణ మంతయు నబద్ధమే కావచ్చును. కుశలవులచే నశ్వమేధయజ్ఞకాలమున రామాయణము వాల్మీకి చదివించె నన్నమాటయు శిష్టభాగమును దర్వాతఁ జేసెనన్న సూక్తియు వ్యర్థములు కావలసివచ్చును. ఆమహాత్ములనే మీరిట్లు చెప్పుటకు హేతు వేమని ప్రశ్నించిన నలు దిక్కులు చూడక యేమి చెప్పఁగలరు. స్వప్నమున మాతాతలు చెప్పిరని సమాధాన మిడుదురా? కాఁబట్టి యిట్టి కుయుక్తులతో నేవిషయము సిద్ధాంతము కాఁజాలదు.

మఱికొందఱు త్రికాలవేత్తలు హనుమంతునిఁ బంపునపుడు పత్రిక వ్రాసి యీయకపోవుటయే యాకాలమున నక్షరములు లేవనుటకు దృష్టాంతమని చేతులు త్రిప్పి త్రిప్పి చెప్పుదురు. పత్రిక వ్రాసియిచ్చిన రాక్షసులు కనుఁగొనిరేని గుట్టు బయలుపడును గాన నీయభిజ్ఞానముచే నీవు నాదూతవని సీతయెఱుంగును గాఁబట్టి దీనిఁ బదిలముగఁ గొనిపొమ్మా యని హనుమతో రాముఁడు చెప్పి యుండునని యేల తలంపఁగూడదని యడిగిన వారేమియు సమాధానము చెప్పఁజాలక మినుకరింపవలసివచ్చును. కాఁబట్టి యిట్టి యూహల కవకాశమీయక, మనకుఁ దోఁచి నవే గొప్పవిషయముల సిద్ధాంతము చేయఁజాలునని భ్రమపడక ప్రాచీనగ్రంథము

లయం దుండిన భక్తివిశ్వాసములఁ జెడఁగొట్టఁ గంకణము కట్టుకొనక, యితరులు నవ్వుదురేమో యని సందేహముఁ బూని యూరకుండుటయే వారికి గౌరవము.

## ఆటవికులు, వారిమర్యాదలు.

అరణ్యములు తఱచుగా నుండుటం జేసి రాజు లాటవికులలో నొక్కని రాజుగ నేర్పఱచి యాతనినుండి మధ్వాదిపదార్థములు కప్పముగా గ్రహించుచుండిరి. వారనాగరికులన వీలులేదు. మర్యాదలు వారికిఁ జక్కఁగాఁ దెలిసియుండెను. ఈవిషయము రాముఁడు గుహుని జూచుఘట్టమువలనఁ దెలియనగు.

రాముఁడు తన దేశముం జొచ్చుటను విని గుహుఁడు వృద్ధుల నమాత్యులం గూడి రామునిం జూడఁబోవ రాముఁ డాతనికి నెదురుగఁ బోవ నానిషాదాధిపతి రాముం గౌఁగిలించుకొనియెను. ఈఘట్టమున నిట్లున్నది.

"తమార్త స్సంపరిష్వజ్య గుహో రాఘవ మబ్రవీత్.
యథాఽయోధ్యా తథేయం తే రామ! కింకరవాణి తే,
ఈదృశం హి మహాబాహో! కః ప్రాప్స్య త్యతిథిం ప్రియం.
తతో గుణవ దన్నాద్య ముపాదాయ పృథగ్విధం,
అర్ఘ్యం చోపానయ త్క్షిప్రం వాక్యం చేద మువాచ హ.
స్వాగతం తే మహాబాహో! తవేయ మఖిలా మహీ,
వయం ప్రేష్యా భవాన్ భర్తా సాధు రాజ్యం ప్రశాధి నః.
భక్ష్యం భోజ్యం చ పేయం చ లేహ్యం చేద ముపస్థితం,
శయనాని చ ముఖ్యాని వాజినాం ఖాదనం చ తే". (అ. ౫౦. స)

ఈవిషయమును బట్టి చక్కఁగా నాలోచింప నాకాలమునఁ దొలుదొలుత మిత్రబంధుసందర్శనము కాఁగా నాలింగన మొనర్చుట యాచారమై యున్నట్టు కనుపట్టు. ఆవల నర్ఘ్యపాద్యాదు లనియు స్పష్టమగు. ప్రియవాక్యములు పల్కుటయే గాక యారీతిఁ బ్రవర్తించుటయు నుండునట్లు సిద్ధాంత మగును. భక్ష్యమనఁగాఁ గూరమొదలగునవి, భోజ్యమనఁగా నన్నము, పేయమనఁగా పానకాదికము, లేహ్యమనఁగా రసాయనాదికము. ఈయాహారమే చతుర్విధాహార మనఁబడు. పిండివంటలు లోనగునవి భక్ష్యశబ్దవాచ్యాహారములోఁ జేరును. పానకాదు లనఁగా, పంచదారపానకము కాదు. వైద్యశాస్త్రప్రతిపాదితానేకారోగ్యకరవస్తువులం గలిసినది. లేహ్యమనఁగా పలచనగా నున్న యాహారవస్తువ్రాతము. పులుసు లోనగునవి యిందుఁ జేరును. ఇట్టి యాహార మాకాలమున మనుష్యప్రీతికరమని తోఁచును గదా. ఇట్టి చతుర్విధాహారములం దెచ్చితి నివిగో ఆపదార్థములని గుహుఁడు విన్నవించెను. గుఱ్ఱముల కాహారము సిద్ధపఱచితినని మనవి చేసెను. మఱియు శయనార్హాసనము లివిగో పరిగ్రహింపుమా! యని ప్రార్థించెను. ఆకాలపు మర్యాద లిట్టివని గ్రహింపఁదగును.

'అశ్వానాం ప్రతిపానం చ ఖాదనం చైవ సోఽన్వశాత్.' (అ. ౫౦. స.)

గుఱ్ఱములకు గడ్డి, ప్రతిపాన మనఁగా క్షీరములోనగునవియునిండు. అని గుహుఁడు తనసేవకుల కాజ్ఞ యిడెను. దీన నాకాలమున గుఱ్ఱములకు బడలిక లుడుగఁ బాలు త్రావు నాచార మున్నట్లు తెలిసికొనవచ్చును.

### ప్రజాప్రభుసంబంధము.

ఆకాలమునఁ బ్రజలకును బ్రభువులకు నెట్టి సంబంధములు గలవో యను నది విచారింపఁదగిన విషయము. రాముఁ డడవికిఁ బోవుచుఁ దన దేశము గడచి పోవుచుండఁగా జనులు రాముఁడు వినునట్లు

శ్లో 'రాజానం ధిగ్దశరథం కామస్య వశ మాస్థితం,
హా నృశంసాఽద్య కైకేయీ పాపా పాపానుబంధినీ,
తీక్ష్ణాసంభిన్నమర్యాదా తీక్ష్ణకర్మణి వర్తతే.
యా పుత్ర మీదృశం రాజ్ఞః ప్రవాసయతి ధార్మికమ్,
వనవాసే మహాప్రాజ్ఞం సానుక్రోశం జితేంద్రియం.
కథం నామ మహాభాగా సీతా జనకనందినీ,
సదా సుఖే ష్వభిరతా దుఃఖా న్యనుభవిష్యతి.
అహో దశరథో రాజా నిస్స్నేహ స్స్వసుతం ప్రియం,
ప్రజానా మనఘం రామం పరిత్యక్తు మిహేచ్ఛతి.
ఏతా వాచో మనుష్యాణాం గ్రామసంవాసవాసినాం,
శృణ్వ న్నతియయౌ వీరః కోసలాన్ కోసలేశ్వరః.' (అ. ౪౮. స)

ఇట్లు పలికిరి దీనిచే రామునియందుఁ బ్రజలకుం గల యనురాగము తేటపడు. చాటుచాటున గొణుగుకొనక రాముఁడు వినుచుండ దశరథు నాక్షేపించిరి. రాజు నందున్న దోషముల వెలిపుచ్చిరి. ఎన్ని సద్గుణము లున్నను దుర్గుణముల నడంపం జాల వనునీతి యిట గ్రహింపఁదగు.

రామచంద్రుఁడు పల్లెటూరులు దాఁటి పోవునపుడు కన్నీరునించుచు దాన నేత్రము లెఱ్ఱవాఱఁగా హస్త మెత్తి ప్రజల సంబోధించి

'అనుక్రోశో దయా చైవ యథార్హం మయి వః కృతః,
చిరం దుఃఖస్య పాపీ యో గమ్యతా మర్థసిద్ధయే.' (అ. ౫౦ స.)

నాప్రజలారా! న న్నాదరించితిరి. ఆరీతి దయమెయి నన్ను గారవించితిరి. నన్నుఁ జూచుటవలన మీకుఁ బెనువగ గల్గును. కాన నింక మీపనులకుఁ బొండు. అని ప్రార్థించెను.

తన ప్రజలను వదలిపోవుట రాజుల కాకాలమున నెంత కష్టముగఁ దోఁచు చుండెనో విస్పష్ట మగును. ప్రజలును

'విలపంతో నరా ఘోరం వ్యతిష్ఠంత క్వచి త్క్వచిత్.'

కన్నీరు మున్నీరు కాఁగా దుఃఖించుచు నిలువఁబడి రఁట. ఔరా! ఆకాలపు రాజ ప్రజాసంబంధ మెంతదృఢతమ మైనదియో తెలిసెను గదా.

### ఇక్ష్వాకువంశము, వారి దేవేదము?

రామునిది ఋగ్వేదమని కొందఱు, యజుర్వేదమని కొందఱు, ఈరెండును గానే కావు సామవేదమని కొందఱును గంఠశోషముగా నుద్ఘోషించుచుందురు. ఏ వేదమైన నేమి యనుమాట యటుండ నిండు. ఏ వేదము వీరు తొలుదొలుతఁ బఠించునదియని విచారించుట యధికప్రసంగముకాదు. ఈవిషయము బాలకాండమునఁ బదునాల్గవ సర్గమునఁ జెప్పఁబడిన యీశ్లోకమునుండి సిద్ధాంత మగును.

'సచిత్యో రాజసింహస్య సంచితః కుశలై ర్ద్విజైః,
గరుడో రుక్మపక్షో వై త్రిగుణో ఽష్టాదశాత్మకః.'                (౨౭. శ్లో.)

'ఉచ్యతే- త్రిగుణ ఇత్యుక్తే పంచదశాత్మకత్వం ప్రతీయతే. తైత్తిరీయకే పంచచితయో భవంతీతి విధానాత్, త దిదం వాజసనేయకపక్షావలంబనం ద్యోతయితు మష్టాదశాత్మకత్వోక్తిః.'

అని గోవిందరాజులు వ్రాసిరి.

సీ 'నేర్పులరా మేది♦నీపతి యాజకుల్ శాస్త్రోక్తరీతి నా♦స్థానమున ద
గంగ నిర్మింపఁగ ♦ గరుడాకృతిని మీఱి కనకపక్షంబులఁ ♦ గ్రాలి యాఱు
ప్రస్తారములకన్న ♦ భావింపఁ ద్రిగుణమై యష్టాదశాత్మక♦మై చెలంగ
జననాథుఁ డతఁడు వా♦జసనేయశాఖుఁడ జేరి యుండుట ♦ నట్లు చేయఁబడియె
నవ్వానియందు శా♦స్త్రానుసారంబుగ నాయాయిదివిజుల ♦ కర్హములగు
తే పశువులు భుజంగమత్స్యులఁ ♦ బక్షులును ని, యుక్తములయి కనుంగొన ♦ నొప్పియుండె
వాని వధియించు తఱి రాఁగ ♦ వాజిమేధ, మునకుఁగా విధి నిర్ణయిం♦చిన హయంబు.'

అని తెనుఁగున వ్యాఖ్యానార్థము స్పష్టమగునట్లు వ్రాయఁబడినది.

ఈపై ప్రమాణమును బట్టి రామచంద్రునిది శుక్లయజుర్వేదమని తేటపడినది

'యజుర్వేదవినీత శ్చ వేదవిద్భి స్సుపూజితః,
ధనుర్వేదే చ వేదేషు వేదాంగేషు చ నిష్ఠితః'                (సుం. ౩౫. స. ౧౩. శ్లో.)

'వేదేషు యజుర్వ్యతిరిక్తవేదేషు, అనేన స్వస్య యజుర్వేదత్వమ్ సూచితమ్'

అని గోవిందరాజులు. యజుస్సనఁగాఁ గృష్ణయజుర్వేదమా, శుక్లయజుర్వేదమా యన్న సందేహ మశ్వమేధయాగవిషయమునుండియే తేలెను.

వ్యాఖ్యానకర్తలే యీవిషయము వ్రాయక యూరకున్నచో నెవరెట్లు గంతులు వైచినను జెల్లుచుండును. వాజసనేయకపక్షావలంబుల కశ్వమేధమునఁ బదునెనిమిది చితులని శ్రుతి యుద్బోధించుట నెఱింగి మహాత్ములు గాన వ్యాఖ్యా

తలు వ్రాసిరి. అంతియే కాని తోఁచినట్లు కాదు. కృష్ణయజుశ్శాఖావలంబులకుఁ బదునేను సంఖ్యయని వేదము శాసించును. కావున రాముఁడు శుక్లయజుశ్శాఖగల వాఁ డనునది సిద్ధాంతము. ఈసిద్ధాంతము స్వేచ్ఛాప్రవక్తల వాక్కులను బంధింపక మానదు. కాశ్యపగోత్రమని కొందఱును, వసిష్ఠగోత్రమని కొందఱును, గౌతమగోత్రమని కొందఱు రామునిగోత్ర మనుచున్నారు. రామాయణమునుండి యీ విషయము స్పష్టముగా సిద్ధాంతము చేయ వీలులేదు.

రామాయణమునుండి వేదములను ముక్కుకుఁ ద్రాడు గట్టి లాగవచ్చునా?

ఇక్కాలమునఁ గొందఱు పుణ్యజనులు రామాయణమునుండి వేదత్రయము నేర్పఱుపవచ్చుననియు, దాని కిది మార్గమనియుఁ జెప్పుచుఁ దోఁచిన ట్లెల్ల నియమముల విధించి వంకరటెంకర యున్నట్లు వర్ణములను లాగి లాగి యిదిగో వేదమంత్ర మొక్కండైనది. ఇఁక రెండవ దిదిగో యని యుపన్యసించుట వినఁబడి యెడు. ఇట్లు చేయుటకుం గారణము

'వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.'

అను వాక్యమని వా రందురు. ఇట్లు వారు చెప్పుట వారికిం గల భక్త్యతిశయమును దెలుపును. అది ప్రశంసార్హమే కావచ్చును. కాని సభాముఖమున నిలిచి వేదములు రామాయణమున నిమిడియున్నవియా? యని ప్రశ్న మెవ్వరే నొనరించిన సమాధానము నిజమే యని చెప్పుట సాహసము.

ఎచ్చటనుండికాని యొకతావున నారంభించి యిన్నవి యిన్నవ యక్షరముల రీతి లెక్కపెట్టఁగా నేవేదముగాని యాదినుండి యంతమువఱకు నగునని చెప్పి నచో నది సిద్ధాంతమే. అట్లుగాక నియమములఁ బలుభంగుల నేర్పఱచి తద్రీతి లెక్కించిన రామాయణమునుండియే కాదు, ఏసద్గ్రంథమునుండియైనను వేదత్రయమంత్రములు బయలువెడలవచ్చును. అది పరిహాసాస్పదము.

ఇంతమాత్రమున నీవిషయమై చర్చపూనరాదు.

'ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదై శ్చ సమ్మితమ్,
యః పఠే ద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే.' (బా. ౧ స ౯౮. శ్లో.)

'వేదై శ్చ సమ్మిత మితి. సర్వవేదసదృశ మిత్యర్థః. ఇదం రామచరితం సంక్షేపరూపం యః పఠేత్. వేదవత్ సనియమం ప్రతిదినం పఠేత్ సర్వపాపైః పూర్వోత్తరాఘైః ప్రముచ్యతే.' అని గోవిందరాజులు.

'వేదై శ్చ సమ్మితం తుల్యం సర్వవేదార్థప్రతిపాదకత్వా త్తుల్యత్వమ్' అని మహేశ్వరతీర్థులు.

'వేదై స్సమ్మితం సకలవేదార్థరహస్యప్రతిపాదకత్వా ద్వేదతుల్యమ్.' అని తిలకవ్యాఖ్య.

వ్యాఖ్యాతలభావములను దిలకించితిరి కదా! వేదతాత్పర్యబోధకమని వివరింపఁబడియె. 'వేదైః' అను తృతీయావిభక్తి తుల్యార్థమును దెలుపును గదా. వేదములవలెఁ బరమార్థమనియుఁ, జతుర్విధపురుషార్థప్రదమనియుఁ దాత్పర్యము తోఁచును గాని యీరామాయణమున వేదము లన్నియు నిమిడియున్నవనియు లాఁగినచోఁ బైకి వచ్చుననియు భావము కాదు. ఇట్లు లేనిపోని యర్థములం జెప్పిన గొలఁదిని మొదటికి మోసము వచ్చునేమో యని సందియ ముదయించెడిని.

ఈవిషయమునఁ గొందఱు గాయత్రీమంత్ర మిం దిమిడియున్నయది. ఆ మంత్రము పాదత్రయనిబద్ధము. ఆపాదత్రయము వేదత్రయోద్ధృతము. కాఁబట్టి వేదసంయుత మని యర్థము చెప్పుచున్నారు. ఈవాదము చక్కఁగనే యుండును. గాయత్రీమంత్రము రామాయణమున వరుసప్రకారమే యున్నయది. ఆరీతి నాలోచించినను వేదసారాన్వితమగునే కాని దీనినుండి వేదమంత్రములు వెలువడనేరవు కదా. ఆభావమే వ్యాఖ్యాతలు తేటపఱచిరి ఇంతకన్న నెక్కువ చర్చ యీవిషయమున వలదు. వేదము లిం దిమిడినవన్నను లేదన్నను ఫల మొక్కటియే రామాయణమునకు గౌరవము హెచ్చుటగాని తగ్గుటగాని లేదు. అనుపమానమగు నీపుణ్యకావ్య మిహపరసాధనము కాన నెవ రెవ రెన్నియెన్ని యర్థములు గలవని యూహించి భక్త్యతిశయమునఁ బఠించినను మేలే. ఆవిషయమున భిన్నాభిప్రాయము లుండవని నాభావము.

## రామాయణమహిమము.

ఇఁక రామాయణమహిమమును గూర్చి యించుక వ్రాయవలసి యున్నయది. రామాయణమాహాత్మ్యమును వ్యాఖ్యాతలే వేనోళ్లఁ గొనియాడి యున్నవారు. ఆవిషయమునే యిట వ్రాసిన గ్రంథబాహుళ్య మగును. ఐనను గొలఁది విషయములు వ్రాయకుండరాదు.

బాలకాండమున నమరప్రార్థనము నంగీకరించి తాఁ జేయఁదగుపని కిది సుసమయమని భావించి యవతరించుటచే నవతారప్రయోజనము, తాటకాసంహరణాది మహాద్భుతకృత్యములచేత సజ్జనాభయదానము, హరధనుర్భంగాద్యమానుషకృత్యప్రదర్శనమున దుష్టరాక్షసభీతియు లోనగువిషయములు చెప్పఁబడినవి.

అయోధ్యాకాండమునందు నిరవధికాసమానవేదవినుతసత్యవాక్పరతియు, సదుపదేశము, పితృవాక్యపరిపాలనరూపధర్మాచరణము, తుచ్ఛతరమానుషభోగవిరక్తియు, సత్యవాక్పాలనమే సర్వధర్మాచరణ మనుమహోపదేశము లోనగు నుత్తమవిషయము లుక్తములు.

ఆరణ్యకాండమున భగవదవతారప్రయోజనమగు విరాధాదిముక్తియు మహర్షుల కభయదానము, రావణహననరూపమంగళకృత్యనాందీముఖరూపశూర్పణఖావమానము, అజేయఖరదూషణాదిక్రూరనిశాచరవధరూపభగవచ్ఛక్త్యతిశయ

ము, శబరీముఖభక్తవారముక్తిప్రదానరూపకరుణాపరతంత్రతయు మొదలగు విషయములు ప్రతిపాదితములు.

కిష్కింధాకాండమున నాశ్రితసంరక్షణరూపప్రతిజ్ఞయు, హనుమదాది స్వకీయపరివారమునకు దర్శనాదు లొసంగుటయు, సప్తతాళనిపాతనాద్యద్భుతకృత్యప్రదర్శనము, పరాక్రమగర్వమున వీఁగువాలివధము మొదలగునవి సూక్తములు.

సుందరకాండమున స్వభక్తప్రతిరూపమున స్వమహిమాప్రదర్శన మనువదింపఁబడినది.

యుద్ధకాండమున శరణాగతత్రాణము, సేతుబంధనరూపదుష్కరకార్యకరణము, దుష్టరాక్షసవధరూపభగవదవతారప్రయోజనము, అగస్త్యప్రేరణమున నాదిత్యుని బ్రార్థించుటచే దేవతాప్రార్థన మవశ్యాచరణీయ మాపత్పరిహార మద్దానఁ గలుగునను కర్మాచరణసదుపదేశము, ప్రజావిశ్వాసము పరమధర్మమను నీతిని సీతాపరీక్షారూపమునఁ దెలుపుటయు, స్వవాగ్దానమురీతి నయోధ్య కరుదెంచి భరతుని గౌఁగిలించుటచే సత్యవాఙ్నిరతియు భ్రాతృవాత్సల్యము ముఖ్య మనుటయు లోనగు సద్విషయములు వివృతములు.

ఉత్తరకాండమున నీమట్కాండవిషయసంగ్రహరూపమున నవతారప్రయోజనము, దనుజపశ్వాదులకుం గూడ ముక్తి నొసంగుటచే భగవత్కరుణాగుణము ప్రోక్తము.

ఇట్లు రామాయణమున భగవదవతారప్రయోజనము వివిధభంగులచే వివరింపఁబడినది. ఇట్టి ధర్మము లవశ్యానుష్ఠేయములని తెలుపనుండ నవి శ్రీరామచంద్రుని ధర్మాచరణరూపమున నుపదేశింపఁబడినవి. ఇంత యేల పురుషుఁ డీరూపమునఁ బ్రవర్తించినఁ గాని యుత్తముఁడు కాఁడని తెలుపుటయే రామాయణకావ్యప్రయోజనము. ఇంతకంటె నేకావ్యము, ఏపురాణము, ఏయితిహాసము, మఱి యేయితరగ్రంథములు నీతుల నుపదేశింపఁ జాలవు. 'కావ్యాలాపాం శ్చ వర్జయే' త్తను న్యాయము రామాయణమువైపునకుఁ గన్నులఁ ద్రిప్పనైనఁ జాలదు. ఈకావ్యము సకలపురాణేతిహాసధర్మసారమును దెలుపఁజాలును. ఇంత యేల పఠనపాఠనాదులచే నిహపరముల నీయంజాలును. సకలాపత్తులఁ దొలఁగింప సమర్థము ఇట్టి యుత్తమకావ్యము వేఱొండు లేదని చాటవచ్చును ఉచ్చైర్నాదమున దిక్కులఁ బ్రతిధ్వనింపఁ జేయవచ్చు. రెండుబాహువు లెత్తి యిది సత్య మిది సత్య మిది సత్య మని భూనభోవివరములు నిండ నుద్ఘోషింపవచ్చు. గాయత్రీమంత్రసంయుత మగుట నిది సకలపురుషార్థప్రద మని శపథము చేయవచ్చు. వేదసారరూపధర్మప్రకాశక మని నడుము కట్టుకొని వక్షస్థలమున హస్త మునిచి నిబ్బరముగాఁ బలుకవచ్చు. ఉత్తమోత్తమమను నొక్కమాట చెప్పుటకన్న నింకేమి చెప్పవలయునని సభాముఖమున సుస్మితవక్త్రమున ననువదింపవచ్చు. దీని నమ్మితి.

నీవే గతి. అని భగవంతుని సర్వగుణసంపన్నుని శ్రీరామచంద్రునిఁ బ్రార్థించి తరింతు నిఁక భయము లేదని నమ్మియుండవచ్చు. భక్తుల కెల్ల నిదియే నేఁ బ్రార్థించి తెలుపు మాట యని మూఁడుసారు లుచ్చరించి యిఁకఁ జెప్పు మాటలు లేవని ధ్యాననిష్ఠను బొందవచ్చు.

ఈరామాయణమున ననేకరహస్యార్థము లిమిడియున్న వనుచున్నారు. ఏ గ్రంథమునకుఁ గాని ఫలస్తుతి ననువదించునపుడు హెచ్చుగాఁ జెప్పుట వాడుక. మహాత్ము లట్లు వ్యర్థోక్తులఁ జెప్పుదురా యని ప్రశ్నింపవచ్చు. దృఢభక్తిమైఁ బఠించిన నట్లగు నేమో వచింపఁజాలను. కాని ప్రాయశః ఫలస్తుతి యతిశయోక్తికి లక్ష్యమయియే యుండును. ఒక్కొక్క విషయమును విచారింతము.

ఖరదూషణాదియాతుధానులం జంపి రామచంద్రుఁడు నిలిచి యుండఁగాఁ జెంత నున్న గుహనుండి లక్ష్మణుఁడు సీతయు వచ్చిరి. అపుడు సీత సంతుష్టురాలై కన్నులారఁ బ్రాణేశ్వరునిం జూచెను. ఆస్థలమునందు

'తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహం,
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే.' (అర. 30 స. 38. శ్లో.)

దీనికి గోవిందరాజుమహేశ్వరతీర్థు లిరువురు పందెములు వేసికొన్నట్లు సముచితముగా సీత యీభావములు గలదయి శ్రీరామమూర్తిని గాంచె నని వ్యాఖ్యలు వ్రాసిరి. ఇంతచాలక మఱికొందఱు సాంప్రదాయకార్థము లని గొన్నింటిని జెప్పుచున్నారు.

ఎట్లనఁగా, "ఇందు రాముని ప్రతిజ్ఞ గలదు.

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే '

అను భగవద్గీతాశ్లోకమే యిటఁ జెప్పఁబడినది. ఇందు శత్రువులఁ జంపి శిష్టరక్షణము చేయుదునని వెనుకముందులు చేయఁబడినది. కాఁబట్టి యిది భగవంతుని యాశయము తెలుపు శ్లోకము. దీనిం బఠించిన శత్రుక్షయ మగును. మనోరథసిద్ధి యగును." అని.

'శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్'

అను పదములను బట్టి యిది యొక మంత్రముగా భావించునెడలఁ బ్రతిశ్లోకము మంత్రమే యగును. శ్లోకముగాని అర్థముగాని పాదముగాని పఠించినను జాలునన్న శ్లోకముచే నీయర్థము చరితార్థ మగును. ఇట్లు చెప్పుట గ్రంథప్రాశస్త్యమును బొగడుట యనఁబడును.

### మారణప్రయోగము.

'ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్.' (యుద్ధ. 90. స 63 శ్లో.)

లక్ష్మణుఁ డింద్రజిత్తును వధించుటకుఁగా బాణమును సంధించి యిట్లు ప్రతిజ్ఞను జేసెను. దీనికి గోవిందరాజమహేశ్వరతీర్థులు వ్యాఖ్యకూడఁ జేయక వదలిరి. ఈపాటివిషయము వారికిఁ దెలియకపోయి యుండదు. ఈశ్లోకమును బఠించిన మాత్రమున శత్రువులు నశింతురనియు నిదియొక మంత్రమనియు వచించుట సాహసము. అట్టి యవకాశమును లేదు. లక్ష్మణుఁ డాగ్రహోదగ్రుండై శ్రీరామమూర్తిం దలంచి తద్గుణములు కీర్తించి యివి రామునియం దుండుట సత్యమేని యోబాణమా రావణపుత్రు నింద్రజిత్తుం జంపుమా యని పలికి బాణమును బ్రయోగించెను. దీనితరువాతనే

'ఐంద్రాస్త్రేణ సమాయోజ్య లక్ష్మణః పరవీరహా.'

అని యున్నది. ఐంద్రాస్త్రమంత్రముతో నభిమంత్రించి ప్రయోగించెను. దీనిచేత నది మంత్రము కాదని తేలక మానదు. కాఁబట్టి యిట్టివిషయములు తెల్పుట యుక్తము గాదు. ఈశ్లోకము లక్ష్మణుని సత్యనిష్ఠతను, శ్రీరామచంద్రునియం దాయనకుఁ గల భక్తిని దెలుపును. ఆకాలమున సత్యమే సర్వాతిశయమై భువమున నలరారుచున్నదని దీనినుండి గ్రహింపఁదగు. ఇంతియేగాని యిదియొక ప్రయోగమని కల్పించినచోఁ బామరు లిద్దానిని నమ్మి శత్రువధము సులభముగా నగునని దీనిం బఠింతురు ఫలింపకున్న నిది యబద్ధ మందురు దాన మొదటికే మోసము. కాఁబట్టి యిట్టి ఫలములను గల్పింపరాదు. గాయత్రీమంత్రసంఘటిత మన్న కారణముచేతనే యీమహాకావ్యమున కసమానవిఖ్యాతియు, వేదసారత్వము ప్రకటితములు గాకమానవు. అంత చాలక పామరజనమోహకములుగా నిట్టి ఫలస్తుతులం గల్పించి యుద్ఘోషింపరాదు.

ఇఁక నిట్టివిషయములు వదలి వేఱొకవిషయమై లేఖినిం ద్రిప్పుచున్నాను. రామాయణమునుండి ముఖ్యముగా నేర్చుకొనఁ దగినవిషయ మొక్కటికలదు. అదియే ప్రధానము. ఏదనఁగా రామచంద్రుఁడు సుగ్రీవునిని వాలిని వధింపఁ బంపి యాతఁడు దెబ్బలు తిని రాఁగా రెండవపర్యాయ మాయుర్కసూనమున నొక పుష్పహారము నిచ్చి యాతనిసందియములు పాపఁ గోరి

'అనృతం నోక్తపూర్వం మే వీర! కృచ్ఛ్రేఽపి తిష్ఠతా,
ధర్మలోభపరీతేన న చ వక్ష్యే కథంచన.' (కిష్కింధా. ౧౮. స. ౧౮. శ్లో.)

చ. 'అనృతము పూర్వ మెట్టిసమ♦యంబున నైనను ధర్మలోపభీ
తిని బలుకంగ లేదిఁకను ♦ దెంపునఁ బల్కను జుమ్ము.'......

సుగ్రీవా! వీరోత్తమా! నే నిదివఱకసత్య మెట్టి యిక్కట్టునందును జెప్పలేదు. ధర్మలోభపరీతుఁడనై ముందును జెప్పఁ దలంపను. అని దీనిసారాంశము. ఇదియే శ్రీరామచంద్రుని హితోపదేశము. సుగ్రీవసంభాషణముద్వారా లోకుల కిది యనుష్ఠేయ మని శ్రీరామమూర్తి యుపదేశించెను. ఈయుపదేశమే భక్తులు

గ్రహింపఁదగినది. రామావతారముల నుపదేశము లన్నియు నిట్లే యుండును. రామభద్రుఁడు తా నాచరించి తన్మార్గమున మార్గదర్శకుఁ డయ్యెను.

ఇట్టి సదుపదేశముల నెన్నింటినో యెత్తి చూపవచ్చును. ఆపని చేయుట కొకసారి గ్రంథమంతయుఁ బఠించిన మేలని ప్రార్థించుటయే యుక్తతర మని తోఁచెడిని.

రామాయణమున రామచంద్రునివయస్సు మొదలగువానిలోఁ బూర్వాపరవైషమ్యములు కొన్ని యున్నట్లు తోఁచును. వానిని వ్యాఖ్యాతలే సమన్వయము చేసిరి. ఆవిషయముల నిట వ్రాసిన సంస్కృతమును దెనుఁగునకు మార్చిన ట్లగును. ఇంతదనుక నే వ్రాసినవిషయము బుద్ధికి స్ఫురించినంతయే వ్రాసితిని గాని వ్యాఖ్యాతల భావములను దెనుఁగునఁ బరివర్తనము చేయ లేదని విన్నవించుచున్నాఁడను. ఏదే నట్టి దుండినఁ బ్రమాదమని క్షమింతురుగాక.

## శ్రీరామచంద్రజననము.

‘తత శ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ,
నక్షత్రే ఽదితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు.
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ,
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతమ్.
కౌసల్యా ఽజనయ ద్రామం సర్వలక్షణసంయుతమ్,
విష్ణో రర్ధం మహాభాగం పుత్ర మైక్ష్వాకవర్ధనం. (బా. ౧౮ స.)

చైత్రమాసమున శుక్లపక్షమునఁ బునర్వసూనక్షత్రమున సూర్యాంగారక గురు శుక్ర శను లను నైదుగ్రహములు మేష మకర కర్కాటక మీన తులా రాసులనఁబడు తమ యుచ్చస్థానములయం దుండఁగా బృహస్పతి చంద్రునితోఁ గూడి యుండుతఱి గురు వుదయించుచుండఁగాఁ గౌసల్యాదేవి పరమేశ్వరుం డగు రామునిం గాంచె నని దీనిసారాంశము చంద్రుఁడు గురుయుక్తుఁ డయ్యె ననుట, గురు వుచ్చయం దుండె ననుట యను నీకారణద్వయమునఁ బునర్వసూనక్షత్ర చతుర్థపాద మని తెలియఁదగు. బుధుఁడు వృషభరాశియం దున్న ట్లూహించుట సమంజసము. వృషభరాశియందు బుధుఁ డుండినఁ గాని యాయుర్దాయము పూర్ణాతిశయము గాదని భావము. ఇట్టి గ్రహసంపత్తిగల కర్కాటకలగ్నమున భగవంతుఁ డవతరించెను.

| | | | |
|---|---|---|---|
| శు | ర | బు | |
| | రాశిచక్రమ్ | | ల చగు |
| కు | | | |
| | | శ | |

సూర్యుఁడు మేషరాశియం దుండఁగాఁ జైత్రశుక్లనవమియందుఁ బునర్వసూనక్షత్ర ముండునా? యనుట విచారింపఁదగినది. అది పొసఁగదు. సూర్యుఁడు మీనమం దుండఁగాఁ బునర్వసూనక్షత్రము చైత్రశుక్లనవమియందు వచ్చునే కాని మేషమం దుండఁగా రాదు. ఇప్పటిసిద్ధాంతములను బట్టి యీయాక్షేపము సుసంగతము. అట్లైన వాల్మీకి యసంగతమగు నీవిషయ మేలాగు చెప్పెను? అను ప్రశ్నము రాకమానునా? వ్యాఖ్యానకర్త లీవిషయమును విమర్శింపఁబూనలేదు. కారణ మేమో తెలియదు. ఈవిషయ మంత ముఖ్యమైనది కాదని వారి భావమై యుండుననను నూహ జనించును. వారి కీవిషయము తెలియ దనుట యజ్ఞానము.

అసంగతమగు నీవిషయమును సమర్థించు టెట్లు? ఊరక జారవిడుచుట న్యాయమా? అన విమర్శించుటయే మేలు ప్రారంభస్థానమునకుఁ జలనము గలదని యిటీవల ననఁగా శాలివాహనశకమున నాల్గువందలు కాఁగా గుఱుతించిరి. అయనగతి యని దానికిఁ బేరు పెట్టిరి. శా॥ శ. ౪౭౯ అని కొందఱు, ౪౨౦ అని కొందఱు, ౪౪౪ అని గణేశదైవజ్ఞులు తమభావముల వెల్లడించిరి. తదాదిగా అయనమని సంక్రమణమని రెండు భాగములుగా సూర్యరాశిప్రవేశమును విభజించిరి. ఇట్లు చేయక తప్పకపోయెను. ఎంతకాలమునకు ముందో యది జరగెను. దానిని బ్రకృతహేతువులంబట్టి యూహించిరి. సూక్ష్మమతులుగాన భాస్కరాదు లొకరీతి సిద్ధాంతము చేసిరి. ఎంతకాలము క్రిందటనో ప్రారంభస్థానము గతిమంతమయ్యెనని యెఱింగి వేఱుగ మార్పు వీలులేక తదాదిగా అయనమని సంక్రమణమని రెండు పేరులం బెట్టిరి. ఈ రెండును ముఖ్యకాలములే యనిరి. తరువాతిధర్మశాస్త్రకర్తలు గూడఁ దదనుసారముగాఁ గర్మాచరణకాలములను దత్ఫలములను దెల్పిరి. కాలమాధవీయమునందు, వృద్ధవసిష్ఠః

"అయనే కోటిపుణ్యం చ సహస్రం విషువే ఫలమ్,

షడశీత్యాం సహస్రం తు ఫలం విష్ణుపదేషు చ." ఇతి.

"మేషాదిసంక్రాంతయో యస్మిన్ దినే భవంతి. తతః ప్రాక్పశ్చా ద్వా తాత్కాలికదృగ్గణితాగతసంఖ్యాకదినే మేషాయనం వృషభాయన మిత్యేవం తత్తత్సంక్రాంతినామాంకిత మయనం భవతి. తస్మిన్నయనే స్నానాదిపుణ్య మాహ జాబాలిః 'సంక్రాంతిషు యథా కాల స్తదీయే ష్వయనే తథా, అయనే వింశతిః పూర్వా మకరే వింశతిః పరా' ఇతి. మకరవ్యతిరిక్తైకాదశసంక్రాంతిసంబంధిష్వయనేషు తత్సంక్రాంతివ త్పుణ్యకాలో ఽవగంతవ్యః. మకరే సంక్రాంతిసంబంధిన్యయనే తత్సంక్రాంతివైలక్షణ్యం, తథా మకరాయనే ప్రాచీనా వింశతిఘటికాః - మకరసంక్రాంతౌ తు పాశ్చాత్యా వింశతిఘటికాః పుణ్యాః. ఏతేన దృగ్గణితా గత మయనం సిద్ధాంతగణితా గతా సంక్రాంతి శ్చేతి పృథ క్పుణ్యకాలా వర్థా త్సిద్ధౌ.

ఇట్లయనసంక్రాంతులకు వేఱువేఱు పుణ్యకాలములు చెప్పఁబడినవి. ప్రాచీనస్మృతులయం దీభేదము కానరాదు. కావున నీభేదము రమారమి పదు

నాల్గువందలసంవత్సరములనుండి కల్గినది. తత్పూర్వ మీభేదము గుఱుతింపఁబడ లేదని విస్పష్ట మగును.

మేషతులాయనప్రవేశదినములందే యహోరాత్రప్రమాణము సమముగా నుండును. మేషతులాసంక్రమణదినములందు నహోరాత్రప్రమాణము సమముగ నుండ వీలులేదు. కాఁబట్టి అయనమే ప్రధానమని తెలియఁదగు. దానియందలి భేదము కనుఁగొనఁబడక చాలకాలము జరగెను. కనిపెట్టినప్పటినుండియు రెండును గర్హాచరణయోగ్యము లని సిద్ధాంతీకరింపఁబడినవి. కావున రామావతారసమయమునం దయనమే ప్రధానమని లెక్కించినచో నీభేదము రాదు. మీనసంక్రమణానంతరము తొమ్మిదిదినములకుఁ బైన పదునొకండుదినముల లోఁగా మేషాయన మగును. ఆరీతి మన మాలోచించినచో మేషాయనముతర్వాతఁ జైత్రశుక్లనవమి పునర్వసూనక్షత్రముతోఁ గూడఁగలదు.

వేదాంగజ్యోతిషమునందు గ్రహగతులు లోనగునవి యిప్పటిసిద్ధాంతములలో నున్నట్లు లేవు. అహోరాత్రప్రమాణాదు లిప్పటివానికంటెఁ జాలవ్యత్యయముగా నున్నట్లు చెప్పఁబడినవి. వీని నన్నింటిని బరిశీలించినచో రామావతారసమయమునఁ జెప్పఁబడిన గ్రహస్థితి తప్పు గాదనియు నది తప్పనుటయే తప్పనియుఁ దేటపడును. ఋతువులు పంచసంఖ్యగ నుండెను. అవి యిపు డాఱుగ లెక్కింపఁ బడుచున్నవి. అనఁగా హేమంతము రెండుభాగములుగాఁ జేసి శిశిరర్తువను పేరిడిరని కొందఱందురు. ఏది యెట్లున్నను త్రేతాయుగమునకు నిప్పటికిని మార్పులు గ్రహచారమునఁ జాలఁ గల్గినవి కాఁబట్టి యిప్పటిస్థితిని బురస్కరించుకొని యప్పటిస్థితి తప్పనుట యంత సమంజసము గాదని నాభావము.

కొందఱు రామాయణమహిమము నెన్నియో పద్ధతులుగాఁ గొనియాడుదురు. ఈరామాయణమే సాంఖ్యమనియు నిదే యోగమనియు నిదియే వేదాంతమనియు నెన్నియో రీతులఁ దోఁచినట్లు తలతోఁకలేనిచందముగా ఘోషింతురు. వాని నెల్ల నిట వెల్లడించుట యుక్తముకాదు పరమపవిత్రకావ్య మనుటచేతనే దానిమహిమము వెల్లడియగును. ఇదియే సకలశాస్త్రము లనుటకన్న వెఱ్ఱితనము వేఱుగ నుండదు. భక్తిమైఁ బారాయణముచేసిన శ్రీరామచంద్రకరుణచే సఫలమనోరథుఁడగుననుట నిర్వివాదాంశము. సకలాపదలు తొలఁగుననుట ఫలస్తుతియే. తొలంగవా యన్న ప్రశ్నము రావచ్చును. రామాయణపారాయణముచేత సకలాపదలు తొలంగినచో "ప్రారబ్ధ మనుభోక్తవ్యమ్" అను న్యాయ మేటఁగలియును. సకలపాపములు భస్మములగునన్న విశ్వాసము గలిగియుండినచో నామనుష్యుఁడు మఱిపాపములు జేయుఁడు. పాపములను జేయుచు రామాయణపారాయణము చేయుచుండినను నవి నశించునన్న విశ్వాసముగల భక్తుల కిది ఫలము నీయఁజాలదు. నిర్మలమనస్సు గలిగి నిష్కపటభక్తియొప్పర శ్రీరామమూర్తిని

ధ్యానించి తచ్చరితమును పారాయణమును జేసినచో నతఁడు భగవత్కరుణా పాత్రుఁ డగుననుట యీఫలస్తుతుల సారాంశ మనుటకన్న నతిశయముగఁ జెప్ప వీలుపడదు. "సకలవేదములు రామాయణమునుండి పుట్టును" అను వాదము సరసమనీషులకు రుచించునదికాదు. వేదపారాయణఫలము నిచ్చునన్నచో నావాక్యము గ్రాహ్యము. భక్తజనసురతరువగు హరి రామరూపమున నవతరించుటచే నామహామహుని దివ్యచరిత్రము పరమపావనము కాదని యేపుణ్యజనుఁ డనఁగలఁడు? అన్నచో నాతఁడు పుణ్యజనుఁడే యనఁదగు.

సుందరకాండము రామాయణమునఁ బ్రధానత్వమును బడయుట కనేక కారణములు గలవు. హనుమ సీతాసందర్శనముచేఁ గృతకృత్యుఁ డయ్యెను గాన నాకాండమును పారాయణముచేసిన నట్లే కృతకృత్యు లగుదు రని కొందఱిభావము. అది నిశ్చయమే. హనుమంతునంతటి భక్తునకుఁ గృతకృత్యత గల్గుటలో లోప ముండదనియే నాభావము. అట్టిభక్తుఁడు కాకున్న యథాశక్తి న్యాయమే శరణము. చాలమంది యాపత్సమయముల దానినే పారాయణము చేయుదురు. ఇతరకాండము లట్టివి కావని కాదు. అది యుత్తమోత్తమ మని వారిభావము. కారణము పై నుదాహృతమే. శ్రీరామజననసత్కథాభూషితమగు బాలకాండ మట్టిది కాదా? యని ప్రశ్నింపరాదు. గతానుగతికన్యాయము మఱుపునకు రాఁగూడదు. హనుమన్మంత్రములలో సుందరహనుమన్మంత్రముగలదు. ఆమంత్రము హనుమన్మంత్రములలోఁ బ్రధానము. ఆమంత్రము నుపాసించుచుఁ దత్పౌరుష చిహ్నమగు నాసుందరకాండమును పారాయణము చేసినచో శీఘ్రఫలప్రద మని పెద్దలభావము. మంత్రమును వదలి కాండమును పారాయణము చేయుచున్నారు. భక్తి గలిగినచో నాహనుమంతుఁడే శ్రీరామచంద్రునానతి సకలపురుషార్థముల నీఁజాలును.

ఈరామాయణమును గుఱించినగాథ యొకటి కలదు. అది రామాయణ వ్యాఖ్యాతలచేఁ జెప్పఁబడలేదు. గాని యొకచో వ్రాయఁబడియున్నది. అది ముఖ్య మని యిట వ్రాయుచున్నాఁడను.

భక్తుఁ డొకఁడు కుటుంబపోషణక్షేపమున శ్రీమద్రామాయణమునే పురాణము చెప్పుచు జీవించుచుండెను. ఆతఁ డొకతఱి సంసారబాధ లధికముగా మనస్సును బాధింపఁగా వేసరి రామాయణము నెత్తుకొని కిష్కింధకుం బోయి యందుఁ దుంగభద్రానదీపరిసరమునఁ జక్రతీర్థముచెంతనున్న శ్రీరామాలయమునఁ గూరుచుండి పురాణము చెప్పుచుండె నఁట. వానరము లన్నియు వచ్చి యాపరిసరతరువులపైఁ గూరుచుండి వినుచుండె నఁట. పట్టాభిషేకము రేపనఁగా నాఁడాభక్తుఁడు రామచంద్రా! రేపు పట్టాభిషేకము కావలయు. నాయొద్ద నేమియు లేదు. ఏమి చేయుదును? అంతయు నీభారమని మనవిచేసి కన్నీరు నించుచుం జని యాచుట్టు

నున్న పల్లియులకుం బోయి పదార్థములను నైవేద్యమునకుఁగా సంపాదించి తెచ్చె నఁట. ఉదయ మాభక్తుఁ డచ్చటికి వచ్చుసరికిఁ బచ్చనియాఁకులతో దేవాలయ మలంకృతమై కన్నులపండువుగా నుండెనఁట ఆభక్తుఁ డానందపరవశుండై తెచ్చిన పదార్థముల వండి భగవంతునకు సమర్పించి పట్టాభిషేకసర్గము చదివి పురాణము చెప్పె నఁట. ఆసర్గము పూర్తియగునప్పటికి వానరము లన్నియుఁ జెట్లకొమ్మల నుండి దిగివచ్చి యాయనపైఁ బాషాణముల వైచి పోయె నఁట. ఇదియేమి గ్రహ చారమో యని యాయన రామునిసేకాగ్రమనస్సునఁ బ్రార్థించి తిరిగి చూడఁగా నాపాషాణము లన్నియు బంగారుముద్దలై కన్పడియె నఁట. ఆభక్తుఁ డాయద్భుత మును గొనియాడుచు రామమహిమమును వేనోళ్లఁ బొగడుచుం బోయె నఁట.

ఇట్టిగాథలు పెక్కులు గలవు. వాని నన్నింటిని వ్రాయుట కవకాశము లేక వదలితి. రామమహిమమును దెలుపుసంతటి పాండిత్యమును నాకు భగవంతుఁ డీయ లేదని విచారించుచున్నాఁడను ఇంక నీచర్చ మాని రామాయణమును జదివి శ్రీరా మమూర్తి యుపదేశించినట్టు లెఱుంగఁదగు నొకటి రెం డుదాహరణములఁ జూపెద.

"దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః,
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః." (యు. ౧౦౨. స. ౧౨. శ్లో.)

లక్ష్మణుఁడు రావణుశక్తిచే మూర్ఛిల్లఁగా వగచుచు రామమూర్తి వచించినవాక్య మిది. రాముని భ్రాతృవాత్సల్య మెంతయుఁ గొనియాడఁదగినదనుట యంతప్రశస్త వాక్యము కాదు. శ్రీరామమూర్తి యిట్లుపదేశించె నన్నవాక్యమే ప్రశస్తతమ ము ఇదియే నేర్చుకొనఁదగినది. సోదరవాత్సల్యముగలవాఁడే మనుష్యుఁ డన్న నీతి నీరూపమున భగవంతుఁ డుపదేశించెను. సోదరుని వైరినిగా భావించుట రాక్షస కృత్యమని పరమపురుషుఁడు నొక్కి చెప్పెను. సోదరునికన్న నెక్కుఁడగు బంధువే లేఁడని యెత్తి చెప్పెను. భార్యను బురస్కరించి సోదరుల విడనాడుట మిగుల నన్యాయ మనునీతి యిటనుండి గ్రహింపఁదగు. ఇట్టి నీతు లెన్నియో రామాయ ణమునుండి చూపవచ్చును.

"కన్యాపితృత్వం దుఃఖం హి సర్వేషాం మానకాంక్షిణామ్." (ఉ. ౯. స. ౯. శ్లో.)
కన్యకుం దండ్రియాట నిక్కముగ దుఃఖ
కరము మర్యాదఁ గాంక్షించుపురుషులకును.

సుమాలి తనపుత్రికయగు కైకసినిగూర్చి చెప్పిన శ్లోక మిది. ఈయది యీకాల మునందేకాక యాకాలమందు ననఁగా రామజననమునకన్నఁ బూర్వమే యను భవసిద్ధమైనట్లు కనుపట్టు.

ఇట్టి విషయముల నెత్తి చూపఁ బూనినచో రామాయణమంతయు నెత్తి వ్రాసిన ట్లగును. కాన మానితి. నావంటి యల్పమతి కాపని శక్యమైనదియుఁ గాదు. మహాత్ము లాపనికిం బూని నామనోరథము లగుదురుగాక.

## భాషాంతరీకరణవిషయము.

ఇఁక దీని గుఱించి నాలుగుమాటలు వ్రాసి యీవిషయమును ముగించెదను. రామాయణమును బలువు రాంధ్రీకరించిరి. భాస్కరకవితల్లజుఁడు తొలుత రామాయణమును దెనిఁగించెను. కథాభాగమును గ్రహించి స్వేచ్ఛగా వ్రాసెను. ఆవల రంగనాథాదులు క్రొత్తకథలు చేర్చియు వర్ణనాంశములను దోఁచినట్లు వ్రాసియు రామాయణమును బూర్తిచేసి "ధన్యాస్మః" యని సంతసించిరి. వారి భావము రామాయణకథ యందఱకుఁ దెలుపుటయే యని కనఁబడును. రంగనాథరామాయణమునందు కాలనేమివృత్తాంతము సులోచనాసహగమనము లోనగుకథలు క్రొత్తగాఁ జేర్పఁబడినవి. పంపాసరోవరవర్ణనము లోనగుఘట్టముల యందించుకంతయు మూల మనుసరింపఁబడక యిష్టానుసారము కల్పనలు కల్పింపఁబడినవి. అయ్యలరాజు రామభద్రకవి మొల్ల లోనగువా రీపద్ధతినే యవలంబించిరి. ఈగ్రంథములద్వారా రామాయణపవిత్రచరిత్రము లోకులకు విస్పష్టమైనది.

శ్రీగోపీనాథము వేంకటకవివరేణ్యులు యథామూలముగాఁ దెనిఁగింపనారంభించినవారిలో మొదటివారని నాయెఱింగినంతవఱకుఁ దెలుపఁగలను. వారిగ్రంథము నేఁ జదువలేదు. అందందుఁ బదిపద్యములు చదివితిని. మూలార్థము వదలకుండఁ దెనిఁగించినట్లగపడియెను. అది భారతాదులం బోలి పద్యగద్యాత్మకముగా నలరారెడు. దానిం జదివి లోకులు చాలమంది సంతోషించిరి. శ్రీ వేంకటగిరి సంస్థానకవీశ్వరులై వారు పెక్కుగ్రంథముల రచించిరి. వీరు రామాయణమున నాఱుకాండములను మాత్రమే రచించిరి. ఉత్తరకాండమును వదలిరి. కారణ మేమో.

ఆవల శ్రీవావిలికొలను సుబ్బారావుగారు యథామూలముగా దెనిఁగించిరి. నిర్వచనముగా వ్రాయుటయే వారిభావ మైనట్లు కనుపట్టు దానినింగూడ నేఁ జదువలేదు. నాలుగైదుపద్యముల నెందైనఁ జదివియుందు నేమో. వీరుత్తరకాండమునుగూడఁ దెనిఁగించి సఫలమనోరథులైరి. వీరొంటిమెట్ట శ్రీరామభద్రుని యాస్థానవిద్వద్భక్తులు. శ్రీరామమూర్తియే వీరిని బిలుపించుకొని తమయాస్థానమున నుంచుకొని రను కింవదంతి కలదు.

నేనును రామాయణమును మిత్రప్రేరణముననే రచించితి. శ్రీరామమూర్తి కరుణ నాయందుఁ గలదు గదా యనియే నానమ్మకము. రామమూర్తియాజ్ఞఁ గొని యీకావ్యరత్నమును దెనిఁగింపఁ బూనలేదు. మ॥రా॥శ్రీ వావిళ్ళ. వేంకటేశ్వరశాస్త్రులుగారు తొలుదొలుత నన్నుఁ బ్రోత్సహించిరి. ఈసంగతి గ్రంథమునందే వ్రాసితి. ఆవల మ॥రా॥శ్రీ అల్లముపాటి పోలిరెడ్డిగారు నాయూహను దెలిసికొని మిగులఁ బ్రోత్సహించిరి వీరు నెల్లూరుజిల్లా ఆత్మకూరుతాలూకా మంగుపల్లెవాస్తవ్యులు. నాశ్రేయస్సును గోరి బ్రహ్మాండపురాణముద్రణమునకు సర్వవిధ

ముల సాయమును జేసిరి. ఈరామాయణమునకు మూఁడువేలరూప్యము లిప్పింతు మని వాగ్దానమును జేసి యారీతిగాఁ దమబంధువులు మిత్రులు నగువారలతోఁ జెప్పి వాక్కును సూనృతనిమగ్నముగా నొనరించిరి. వారిపేరు లన్నియు గ్రంథము ననే యగపడును. ఈప్రయత్నమునకు వారింగలిసి నిర్వహించినవారు మ॥రా॥శ్రీ అల్లంపాటి పెంచెలురెడ్డిగారును, గునిసెట్టి రోశయ్యశ్రేష్ఠిగారును, బొల్లు రామయ్య శ్రేష్ఠిగారును లోనగువారు. వారినామము లన్నియు గ్రంథోద్ధారకులు లోనగువారి చరిత్రమునఁ గననగు. మ॥రా॥శ్రీ వావిళ్ళ. వేంకటేశ్వరశాస్త్రులుగారు ముద్రణ ప్రయత్నమున సర్వవిధములఁ దోడ్పడిరి. నే ద్రవ్య మిచ్చిన నీయకున్నను గార్య మును నిలుపక సాగింతునని వాగ్దాన మొనర్చి దానిని నెఱవేర్చిరి.

రామాయణము నెందఱో వ్రాసియుండ మరల నీప్రయత్నమేల? అని ప్రశ్న మొకటి కలదు దానికి నుత్తరముగా నాలుగుమాటలు వ్రాయఁదలఁచితిని. సావధానముగా నాభావముం బరిశీలించి పండితమహాశయులు మన్నింతురుగాక.

రామాయణమునకు భక్తులు పెక్కుమంది వ్యాఖ్యలు చేసిరి. ఏల? వాల్మీకి ముని రామాయణమును రచించి యిట్టి మహోపకారమును జేసిరని యందఱికిఁ దెలుపుటయే వారిభావము. మూలమున కివి యర్థము, ఈశ్లోక మీవిషయమును దెలుపును అని వారు వెల్లడించిరి. శ్రీరాముఁ డొకరితో నొకరు సంభాషించు తఱి నీయుద్దేశ్యము మనస్సునం దుంచుకొని యీమాట చెప్పిరని సందర్భశుద్ధి నెఱింగించిరి. భక్తిని బోధించు నీశ్లోకమని తెల్పిరి. ఈభావమున నీతఁ డీకార్య మును జేసెనని సప్రమాణముగా సయుక్తికముగా వ్యాఖ్య చేసిరి. విశేషార్థము లివి యని తేటపఱచిరి. ఎన్నియో యపూర్వవిషయములను సామాన్యదృష్టికి గోచరింపనివానిని బోధించి మహోపకార మొనరించిరి. వారివ్యాఖ్యలచేతనే శ్రీమద్రామాయణ మింత విఖ్యాతినొందెను గాని లేకున్న నేమూలనో పడి యుండును. కావున వా రేయర్థమును దెల్పిరో యాయర్థమును విస్పష్టముగా నాకుం దెలిసినంతవఱకుఁ దెలుపుటకే నాయీప్రయత్నము. కవిత్వగర్వముచేతఁ గాదు. పూర్వకవులలో నే నెవ్వరిపాదధూళికిని సముఁడను గాను. పాండిత్య మేవిషయ మందును లేదు. అట్టి నే నిట్టిపనికిం బూని యెట్లు నెఱవేర్చితినో యీక్రిందిమా టలద్వారా మహాశయులకుఁ దెలుపుకొనుచున్నాను. ఇం దధికపాఠశ్లోకములఁ దెనిఁగించుతఱిఁ గుండలీకరణ మొనరించితి.

## బాలకాండము.

దేవతలు విష్ణుమూర్తితోఁ దమకష్టములం దెలుపుకొనుతఱి

"రాజ్ఞో దశరథస్య త్వ మయోధ్యాధిపతేః ప్రభోః,
ధర్మజ్ఞస్య వదాన్యస్య మహర్షిసమతేజసః.
తస్య భార్యాసు తిసృషు హ్రీశ్రీకీర్త్యుపమాసు చ,
విష్ణో! పుత్రత్వ మాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్." (౧౫. స. ౧౯. శ్లో.)

సీ. సకలధర్మజ్ఞుఁడై ♦ సమధికదాతృత్వగుణముల నలరారి ♦ ప్రణుతిఁ గాంచి
మునివర్యసమతేజ♦మునఁ దేజరిల్లుచు నయ్యయోధ్యకుఁ బ్రభు ♦ వై యొసంగి
దశరథుఁ డనుపేరఁ ♦ దనరురాజునకు హ్రీ శ్రీ కీర్తు లనుపేరఁ ♦ జెల్వుఁ గాంచు
దక్షకన్యకలతోఁ ♦ దలఁప సామ్యముఁ జెప్పఁ జాలిన ముప్వురు ♦ సాధ్వు లొప్ప
తే. వార, లవ్వారలందు నో♦వారిజాక్ష!, నినుఁ జతుర్భాగములు చేసి ♦ నీవె రావ
ణుని దదాత్మజగంధర్వ♦లను లవణునిఁ, బొలియఁజేయఁగఁ బుత్రత్వ♦మును వహింపు.

అని తెనుఁగు.

'హ్రీశ్రీకీర్తయో దక్షకన్యా స్తా ఉపమా యాసాం తా స్తథా, చాతుర్విధ్యవిధానం రావణ రావణి లవణ గంధర్వ వినాశాయ.'

అని గోవిందరాజులు.

'చాతుర్విధ్యవిధానం రావణేంద్రజిల్లవణ గంధర్వవధాదీనాం దేవకార్యాణాంసద్భావాత్.'

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

హ్రీశ్రీకీర్తులను కన్యకలు ముప్వురు దక్షునికుమారిత లని తెల్పుటయు, నాల్గుభాగములుగా నిను నొనరించుకొని యవతరింపుమా, అనుచోట రావణు నింద్రజిత్తును లవణ గంధర్వులను వధించుటకొఱ కని వ్రాయుటయు ముఖ్యములు. లవణగంధర్వ లని వ్యాఖ్య యుండఁగా గంధర్వ లవణుల నని పద్యమున వ్రాయుట రాముఁడు రావణుని, లక్ష్మణుఁడు రావణాత్మజుఁడగు నింద్రజిత్తును, భరతుఁడు గంధర్వుని, శత్రుఘ్నుఁడు లవణుని జంపి రను క్రమమును దెలియఁజేయుటకును, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను క్రమము ననుసరించియు నని తెలియందగు. ఇంతియుకాని పద్యము కుదురక చేసిన యుపబంధమని మహాశయు లూహింపగని నావిశ్వాసము.

ఇందు వ్యాఖ్యాతలు హ్రీ శ్రీ కీర్తులు దక్షకన్యక లని తెలుపకున్నచో, నాల్గువిధములుగ విభజించి యనుచో రావణాదులను సంహరించుటకై యని బోధింపకున్నచో వీ రెవరని, ఇ దెందులకని సందేహము లుదయింపక పోవు. వానిని వారు తీర్చిరి. ఆవిషయమునే యిందుఁ జేర్చితిని. మఱియు

"న చ పుత్రకృతస్నేహం కర్తు మర్హసి పార్థివ,
అహం తే ప్రతిజానామి హతౌ తౌ విద్ధి రాక్షసౌ.
అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్." (౧౩౫. శ్లో.)
"వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః." (౨౦ స. ౧౮. శ్లో.)
'నేతి. పుత్రకృతం స్నేహం పుత్రత్వేన కృతం స్నేహం కర్తుం నార్హసి'

అని తీర్థులు. దీనితరువాతిశ్లోకమునకు

'రామస్య పరబ్రహ్మత్వం సూచయ న్నాహ.'

అని గోవిందరాజులు వ్రాసిరి. ఆవ్యాఖ్యను, ఈయవతారిక ననుసరించియే

చ నరవర! గోముఖం బెఱిఁగి♦నాఁడు కుమారుఁ డటంచు స్నేహవి
స్ఫురణము నొందఁబోకు, దను♦జాసులఁ జంపఁగఁ జాలునంచు నే
నరసి ప్రతిజ్ఞ చేసెద ర♦ణావనిలో హతు లైనయట్టు ల
య్యిరువుర నిశ్చయింపు మిది♦ యెట్టు లెఱింగితి నన్నఁ జెప్పెదన్.

అను నీపద్యము వ్రాయఁబడినది. అవతారికయర్థమును జేర్చినచో రసపుష్టి తగ్గక మానదు.

"అహం వేద్మి" అను శ్లోకమునకు

'అహం బహుగురూపాసనేన లబ్ధజ్ఞానః యద్వా యోగబలసాక్షాత్కృతపరాపరతత్త్వయాథాత్మ్యః.'

అని గోవిందరాజు లనేకభంగుల వ్యాఖ్య వ్రాసిరి. నేను దెలియుదు ననఁగాఁ బెక్కుమంది గురువుల సేవించి విజ్ఞానము గలిగి మోక్షమార్గమును గనఁజాలు తపోనియమములను బూనిన నే నని తెలుపకున్నఁ జప్పిడిగా నుండును. కాఁబట్టి యర్థపుష్టి నిచ్చు నీవ్యాఖ్యానసారము నే గ్రహించి

సీ. పెక్కండ్రు గురుల సే♦వించి జ్ఞానము నంది యపవర్గమును బొందు♦నట్టి కృత్య
ములఁ జేసి మునినయి♦ వెలయు నే నీరాము సత్యపరాక్రమ♦శాలి యనుచు
మఱి మహాత్ముం డని♦ గుఱుతింపఁ జాలుదు నేనె కాదు వసిష్ఠ♦మౌనిపతియు
నెఱుఁగంగఁ జాలు మ♦హితతేజుఁ డౌటచే...... ...................

అని తెలిఁగించితిని. 'అహమ్' అనుదానికిఁ బెక్కండ్రుగురువుల సేవించి యని యర్థము వ్యాఖ్యాతలు చెప్పిరి. కాని వాల్మీకిభావ మేమో యెవరికిఁ దెలియునన్న ప్రశ్న మసంగతము. అట్లన్నచో నింక వాల్మీకియే వచ్చి నాయర్థ మిది చూఁడీ యని తలంచినపు డెల్ల నందఱకు నర్థము చెప్పవలసివచ్చును.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్." (౨ స ౧౫ శ్లో)

క వినుమా నిషాద క్రౌంచమిథునమున నీ వేటి కొకఁడు♦ దునిమితొ కామం
బున మోహము నొందుచుఁ గడుఁ, దనరఁగ నిలఁగనుమశాశ్వ♦తముగు ప్రతిష్ఠన్.

ఇటుఁ బెంచి పెద్దపద్యముగా వ్రాయ వీలుకాదు కాన నట్లే వ్రాయఁబడినది.

## అయోధ్యాకాండము.

"ఏత న్మే ప్రియ మాఖ్యాతుః కిం వా భూయః కరోమి తే. (౭. స. ౩౪. శ్లో.)
రామే వా భరతే వాహం విశేషం నోపలక్షయే" (౩౫. శ్లో.)

చ. మనమున కింపుఁబెంపఁ దగు♦మాటను జెప్పిన నీకు నేమి యి
య్యను గలదాన; నీసవతి♦యాత్మజుపై నిటు ప్రీతి యేలొకో
యనియెద వేమొ? రాఘవుని♦యందును నా సుతునందు భేదమున్
గనుఁగొనఁ జాల నిద్దఱును♦ గాదిలిపుత్త్రులె నాకుఁ గావునన్.

కైక మంథరకు నుత్తరము చెప్పుచున్నది. మంథరా! రామచంద్రునకుఁ బట్టాభిషేకమహోత్సవ మనుసువార్తఁ జెప్పితివి. నీకు దీనికిఁగా నే నేమీయఁగలదాన. అని పలికి నాకు రామభరతులలో భేద మేమియుఁ గానరా కున్నదనియె. గోవిందరాజులు—

"నను సపత్నీపుత్రే కథం త్వై తాదృశీ ప్రీతి రిత్యత ఆహ."

అని యవతారిక వ్రాసిరి. ఈయవతారికభావము తెనుఁగునఁ జేర్చిన నెంతరసపుష్టి కనఁబడుచున్నదో పరికింపుఁడు. మంథరకు సవతిపుత్త్రుఁడగు రామునియం దేల యిట్టి ప్రీతియను దుర్భావము గలదు. దానిం బోఁగొట్టఁదగునను భావము నూహించి యనునర్థ మెంత సరసముగ నున్నదో పాఠకు లూహింతురుగాక. ఇట్టి వ్యాఖ్యాతలయభిప్రాయము చేర్పుట వాల్మీకిభావము కాదనవచ్చునా?

ఇట్టి తావులసంబంధమును గల్పించుభావము తెనుఁగునఁ జేర్చితి. "రామం దశరథం విద్ధి" యను మొదలగుశ్లోకములఁ దెనిఁగించునపు డాయర్థముల నెఱుంగు రీతి క్రింద వ్రాయఁబడినది. కావున వాని నెల్ల నిట వ్రాయ లేదు.

## ఆరణ్యకాండము.

"తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహం,
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే." (౩౦. స. ౩౯ శ్లో.)

ఈశ్లోకమునకు సీసమాలిక వ్రాయఁబడినది. ఏల యనఁగా మూలమునం దున్న తచ్ఛబ్దమునకు సీత యెన్ని యెన్ని విధములుగా నూహించియుండునో యన్ని రీతుల వ్యాఖ్యాతలు దానియర్థమును దేటపఱిచిరి. ఆయర్థముల సారమును దెనిఁగింపకున్న నది తెలుఁగే కాదేమో యని తత్సారము నిటఁ జేర్చితి. ఇన్నియర్థములు వాల్మీకి యూహించి యుండునా? యని కొందఱు ప్రశ్నింతురు. ఊహించి యుండఁగూడదా? యనునదియే దానికిం బగునుత్తరము. వాల్మీకిభావ మిది కావచ్చును గాకపోవచ్చు ననువారు కొందఱు గలరు. వాల్మీకిభావ మిది యని చెప్పువారే లోకమున నుండరే యనునదియే వారికి సమాధానము.

## సుందరకాండము.

"దదర్శ చంద్రం స హరిప్రవీరః పోప్లూయమానం సరసీవ హంసమ్."(౧. స. ౫౭. శ్లో)

తే. సరసునం జనుచున్నట్టి ♦ సన్మరాళ, మట్లు వనచరకుంజరుం ♦ డమలశశిని
గాంచి లంకఁ బ్రవేశించి ♦ కార్యసరణిఁ, దీర్ప మది నెంచె; రామభ♦క్తిని జెలంగి.

ఇందు నాల్గవపాదమున నున్న "రామభ♦క్తిని జెలంగి" అనునది ప్రకృతార్థమును బోషించును గాన నెక్కువగఁ జేర్పఁబడినది.

"న వీరసేనాగణశో చ్యవంతి న వజ్ర మాదాయ విశాలసారమ్,

న మారుత స్యాస్య గతేః ప్రమాణం న చాగ్నికల్పః కరణేన హంతుమ్."

(౪౮. స. ౧౨. శ్లో.)

సీ. పరునిమర్దింపుమా; ♦ సురపతినిజయించినట్టి వీరా! విను ♦ మాతఁ డొకఁడె
శత్రుబలౌఘంబు ♦ సహియించు చున్నాఁడు కనుక నాతనిపయిఁ ♦ జనుతరుణము
నందు సైన్యములు స♦హాయము చేయంగఁ జాలవు; మఱి యల్ప♦సారమైన
వజ్రముఁ గొని కపి♦వరుపైకిఁ బోవుము వాయువుకంటె జ♦వంబుమిన్న
తే. గాఁగ నాతని కుండును ♦ గాధవహ్ని, కల్పుఁడగుఁ గాన ముష్ట్యాది♦కములఁ జంప
నలవి గాకుండు; నేఁ జెప్పి♦నట్టి విషయ,ముననె చక్కఁగఁ బరికించి ♦ పనిని దీర్పు.

అనునది పై శ్లోకమునకుఁ దెనుఁగు. శ్లోకమునకు వ్యాఖ్యాతలే యర్థమును వ్రాయ కున్నచో నెట్లుగా నర్థము చెప్పుదురో 'ఎవరికి వారే యమునాతీరే' యున్నట్లగును. కాన వ్యాఖ్యాతల యభిప్రాయము ననుసరించినఁ గాని మూలార్థ మిది యని తేలదు. ఆయర్థసారమే యీనాభాషాంతరీకరణమని గ్రహింపందగు

ఇంక నుదాహరణములం జూపి యుపోద్ఘాతమును బెద్దది చేయఁదలంపను. ఎందెందు వ్యాఖ్యానాభిప్రాయము చేర్పఁబడినదో, ఎందెందుసమానార్థకవిశేషణ ద్వితయము కనఁబడునో, ఎందెం దవతారికభావము కూర్పఁబడినదో, ఎందెందు మూలార్థమును బోషించుపొంకె నెక్కువగ వ్రాయఁబడినదో, ఎందెందు సంద ర్భోచితవ్యాఖ్యానోదాహృతగాథలు వ్రాయఁబడినవో యాయాయితావుల "ఇద మిత్థ" మ్మని తేటపడుటకై క్రింద వ్రాసితిని. పాఠకక్లేశములఁ దొలఁగించుటకే యట్లు వ్రాసితిని. గాని గ్రంథము పెద్దదిగాఁ గనఁబడవలయునని కాదు.

భాషాంతరీకరణమున మూలార్థమును వ్యాఖ్యానకర్తలు వ్రాసినదంతయుఁ జేర్పరాదనియు దానఁ బెక్కుకీడులు మూఁడుననియు వాల్మీకి యుచితజ్ఞుఁడుకాఁ డని తేలుననియు లోనగు ప్రశ్నముల నొనరించువారి కందందు నాభావ మిది యని తేటపడునట్లు వ్రాయఁబడియే యున్నయది. దాని నిట వివరింపఁబూనను.

వేఁడినీరు పోసిన నిండ్లు కాలిపోవునని భయంపడునట్లు మూలార్థమును దేట పఱిచిన వ్యాఖ్యాతలుచితజ్ఞులు కారను సంశయ మొందుట యంతగా సమంజ సము కాదు. వాల్మీకివంటి మహాకవిశిరోమణి యంత యాలోచన లేనివాఁడును గాఁడు. వ్యాఖ్యానకర్తలభావము వాల్మీకిది కాకపోవచ్చుననుశంక నొంద నవ సరము లేదు. వాల్మీకి యుచితజ్ఞుఁడే. వ్యాఖ్యాతలు రసికులే. శంక నొందువారికే యీకష్టములు గలిగినవి.

ఈకావ్యమునకు మహోపాధ్యాయాదిబిరుదాంచితులయిన బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులుగారే ఆంధ్రశ్రీమద్రామాయణమని పేరిడిరి. కృతిపతి శ్రీరామచంద్రమూర్తియే యని నాకు హిత ముపదేశించిరి. ఈపద్ధతిని రచించిన బాగని హెచ్చరించిరి. రెండు మూఁడు స్థలముల నాపద్యముల విని హర్షించిరి. "రామం దశరథం విద్ధి" యను శ్లోకమునకు నే వ్రాసిపంపిన కందమును గాంచి పర మానందము నొందితి మిది బాగున్నదని లిఖించిరి. సర్వవిధముల నన్నాశీర్వదించి శంకావిరహితునిం గావించిరి.

## కృతజ్ఞత.

గ్రంథరచనకుం బ్రోత్సహించి యుభయ మొసంగిన, ఆంధ్రగ్రంథోద్ధారకులు భాషాభిమానులు దానజితకర్ణులు కరుణానీరధులు నగు మ॥ రా॥ శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికిని, రామాయణాంధ్రీకరణమునకుఁ బాండవులకు శ్రీకృష్ణమూర్తివలె సాయపడి శక్తికిమించినసాయము స్వహస్త పరహస్తరూపమున నొనరించిన సద్వృత్తులు దేవతాభక్తులు ఆశ్రితపోషకులు నగు మ॥ రా॥ శ్రీ అల్లముపాటి పోలిరెడ్డిగారికిని, ద్రవ్యవిషయమున నేలోపము లున్నను సాయమొనరింతుమని నాభీతిం బాపిన పరోపకారతత్పరులు పరమాస్తికులు నగు మ॥ రా॥ శ్రీ గునిసెట్టి రోశయ్యశ్రేష్ఠి, అల్లంపాటి పెంచెలరెడ్డి, బొల్లు రామయ్యశ్రేష్ఠి ప్రభృతులకును, అచ్చుప్రతిని వ్రాసియిచ్చి యోపికమెయి మరలం బఠించి నా కుపకృతి నొనరించిననామిత్రులగు బ్ర॥ శ్రీ కావ్యతీర్థ ముద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, కావ్యతీర్థ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారికిని నా కృతజ్ఞతం దెలుపుకొనుచున్నాఁడను.

## ప్రార్థన.

కార్యము నాదృష్టికిఁ గడుంగడుం బెద్దది. పాండిత్యమో చాల తక్కువ. ముద్రణ మారంభించుతఱినే సరిచూచుట. ఇట్లగుటంజేసి పెక్కుతావుల యతిప్రాసాదిదోషము లుండవచ్చు. ఉండవచ్చునను సంశయ మేల? ఉండకతప్పదు. ఇఁక వ్యాకరణదోషముల లెక్కింప శక్యము కాదేమో. ఇన్ని తప్పులుగా వ్రాయకున్న నేమనిమాత్రము ప్రశ్నింపరని నమ్మెదను. భక్తి నొండె, ప్రతిష్ఠఁ గోరి యొండె ఎట్లో రచించితి. ఇది తప్పు. దీని నిట్లు సవరించిన బాగని తెలిపెడు సత్పురుషుల పాదారవిందముల శిరసావహించెద. గురువులని సంభావించెద. ఒక్కతావున నుత్తరకాండమున నాహ్వమని పడినది. ఆహ్వశబ్దము స్త్రీలింగమని యెఱుంగుదును. ఎట్లో పడినది. క్షమింతురుగాక.

"కిం వా ప్రార్థనయా పరోపకృతిషు స్వాభావిక స్తద్గుణః."

అన్న సూక్తి గట్టిగా వల్లించితి.

శ్లో. నిందతు నందతు వా స న్నసూయయు రనసూయయు రత్ర కిం తేన,
య త్స్నానసగమునారై వేదం మమ తు పాథేయమ్.

అను సద్వాక్యమును మఱువలేదు. పండితకవుల కింతకంటె నెక్కువ విన్నవింపనక్కఱలేదు. ఇందలి తప్పు లన్నియు రెండవసారి ముద్రించు నదృష్టము నాకు సజ్జనులయాశీఃప్రభావమునఁ గల్గినచో సవరించుకొందును. శ్రీరామచంద్రకరుణయు గురువరేణ్యుల యాశీర్వాదములు, పండితకవుల యాదృతియు నాయందుండుఁగాక యని నమ్ముచున్నాను.

ఇట్లు విన్నవించు సజ్జనపాదసేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.

# ప్రశంస.

ఆంధ్రశ్రీమద్రామాయణమునకు సహాయముచేసిన పుణ్యాత్ములు ఉద్ధారకనిర్వాహకపోషకనామంబుల నిందుఁ గ్రిందఁ బేర్కొనంబడుచున్నారు.

## ఉద్ధారకులు.

మ॥రా॥రా॥శ్రీ, శ్రీ మహారాజా రావు వేంకట కుమారమహీపతి సూర్యారావు బహదూర్ గారు.

| | | | |
|---|---|---|---|
| ,, | అల్లంపాటి పోలిరెడ్డిగారు | మంగుపల్లె | (నెల్లూరుజిల్లా) |
| ,, | అల్లంపాటి పెంచెల్ రెడ్డిగారు | ,, | ,, |
| ,, | గునిసెట్టి రోశయ్యశ్రేష్ఠిగారు | కుల్లూరు | ,, |
| ,, | బొల్లు రంగయ్యశ్రేష్ఠిగారు | పార్లపల్లె | ,, |
| ,, | బొల్లు రామయ్యశ్రేష్ఠిగారు | మదరాసు | |
| ,, | గోపవరము గోపాలురెడ్డిగారు | గోపవరము | (కడపజిల్లా) |
| ,, | చల్లా చెంచుపాపిరెడ్డిగారు | చంద్రపల్లె | ,, |
| ,, | ఏచూరు చెంచుసుబ్బయ్యగారు | శేషమాంబాపురము | ,, |
| ,, | అల్లాడి జగన్నాథశాస్త్రులుగారు బి ఏ ఎల్ టి | వేంకటగిరి | (నెల్లూరుజిల్లా) |
| ,, | జి. రామేశ్వరరావుగారు బి ఏ బి ఎల్ | అనంతపురము | ,, |
| ,, | పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు | కడప | |
| ,, | భోగన్నాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు | ,, | |
| ,, | శ్రీమతి. తలుపుల వేంకటసుబ్బమ్మగారు | ,, | |
| ,, | వేలమూరు రామిసెట్టిగారు | ఓబులాయపల్లె | (నెల్లూరుజిల్లా) |
| ,, | శ్రీమతి. తోట నరసమ్మగారు | కుల్లూరు | ,, |
| ,, | దీనరక్షకసభ | కడప | |
| ,, | శ్రీమతి. సముద్రాల లక్ష్మమ్మగారు | ,, | |

## నిర్వాహకులు.

| | | | |
|---|---|---|---|
| ,, | విరూరు పిచ్చయ్య బి ఏ గారు | కడప | |
| ,, | మరూడి గుండురావు బి ఏ బి యల్ గారు | ,, | |
| ,, | కాకూరు శ్రీనివాసరావు బి ఏ బి యల్ గారు | ,, | |
| ,, | టీ. పి. దేవరాజులునాయుడు బి ఏ బి యల్ గారు | ,, | |
| ,, | సాఘ్షడే సర్వోత్తమరావు బి ఏ బి ఎల్ టి గారు | ,, | |
| ,, | పాటూరు వీరమరాజుగారు | కలువాయు | (నెల్లూరుజిల్లా) |
| ,, | లోకా సుబ్బయ్యగారు | సోమశిల | ,, |
| ,, | పాపుతిప్పు కొండారెడ్డిగారు | రామపురము | (కడపజిల్లా) |
| ,, | చిట్లూరు వేంకటయ్యకుమారుఁడు రాచయ్యశ్రేష్ఠిగారు | మంగుపల్లె | (నెల్లూరుజిల్లా) |
| ,, | వేములపాటి పోలయ్యగారు | అమానుచిరువెళ్ల | ,, |

| | | | |
|---|---|---|---|
| మ॥రా॥రా॥ | శ్రీ యాదాళ్ల శేషయ్యశ్రేష్ఠిగారు | బెడుసుపల్లె | (కడపజిల్లా) |
| ,, | మురుకూటి కొండారెడ్డిగారు | చాపురాళ్లపల్లె | (నెల్లూరుజిల్లా) |
| ,, | మన్నా లక్ష్మీనారాయణశ్రేష్ఠిగారు | చుంచులూరు | ,, |
| ,, | పప్పూ వేంకటసుబ్బారెడ్డిగారు | బమ్మవరము | ,, |
| ,, | బుట్టి బ్రహ్మారెడ్డిగారు | కామిరెడ్డిపాడు | ,, |
| ,, | రాపూరు వేంకటసుబ్బారెడ్డిగారు | గార్లదిన్నెపాడు | ,, |
| ,, | పర్నా వెంగయ్యశ్రేష్ఠిగారు | పెనుబర్తి | ,, |
| ,, | చల్లా వేంకటనరసారెడ్డిగారు | కలువాయ | ,, |
| ,, | నాగిరెడ్డి కొండారెడ్డిగారు | ,, | ,, |
| ,, | భూమా సుబ్బయ్యశ్రేష్ఠిగారు | దుల్లూరు | ,, |
| ,, | చల్లా పెంచెలరెడ్డిగారు | ,, | ,, |
| ,, | చెమర్తి చిన్నపుల్లమరాజుగారు | దుల్లూరురాచపాళెము | ,, |
| ,, | చింతలపల్లె వేంకటనరసారెడ్డిగారు | మహిమలూరు | ,, |
| ,, | వాకాటి నారసింహారెడ్డిగారు | ,, | ,, |
| ,, | గుండ్రా శేషారెడ్డిగారు | ,, | ,, |
| ,, | కొండూరు వేంకటసుబ్బరాజుగారు | ముస్తాపురము | ,, |
| ,, | గంగవరపు నరసపునాయడుగారు | గవరవరము | ,, |
| ,, | మల్లు వేంకటరెడ్డిగారు | కంపసముద్రము | ,, |
| ,, | నారపురెడ్డి నరసారెడ్డిగారు | ,, | ,, |
| ,, | కాలువ ముసల్ రెడ్డిగారు | జేతాయపల్లె | (కడపజిల్లా) |
| ,, | గంజాము నరసింహాచార్యులుగారు | మహిమలూరు | (నెల్లూరుజిల్లా) |
| ,, | స్వామి వేంకటాచలముశ్రేష్ఠిగారు | యమ్. యల్. సి. మదరాసు | |
| ,, | ఐడ్డమాను లక్ష్మయ్యగారు | కమలకూరు | (కడపజిల్లా) |
| ,, | మద్దిసెట్టి కొండయ్యశ్రేష్ఠిగారు | చాపురాళ్లపల్లె | (నెల్లూరుజిల్లా) |

## పోషకులు.

| | | | |
|---|---|---|---|
| ,, | కంచిరాజు నరసింహయ్యగారు | కడప | |
| ,, | సుంకేసుల సుబ్బయ్యగారు | ,, | |
| ,, | కందనూరు గురుమూర్తయ్యగారు | ,, | |
| ,, | మాడుగుల సుబ్బయ్యగారు | ,, | |
| ,, | నూకల వేంకటసుబ్బయ్యగారు | అప్పారావుపేట | (కడపజిల్లా) |
| ,, | పోచంపల్లె ఆత్మారామయ్యగారు | బద్వేలు | ,, |
| ,, | తల్లము మునయ్యశ్రేష్ఠిగారు | కొండాపురము | ,, |
| ,, | కలిసెట్టి పెంచెలుశ్రేష్ఠిగారు | చిల్లమానుచేను | (నెల్లూరుజిల్లా) |
| ,, | శ్రీకాకుళము రామయ్యశ్రేష్ఠిగారు | కడప | (కడపజిల్లా) |
| ,, | మంచిరాజు శేషగిరిరావుగారు | ,, | ,, |
| ,, | మంచి రాఘవయ్యగారు | మందపల్లె | ,, |
| ,, | సంబటూరు వేంకటసుబ్బయ్యగారు | చంద్రపల్లె | ,, |

| | | | |
|---|---|---|---|
| మ॥రా॥రా॥ | శ్రీ, మాలెపాటి సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు | మంగుపల్లె | (నెల్లూరుజిల్లా) |
| ,, | దొమ్మరాజు ఎరికెలరాజుగారిఓబుల్ రాజుగారు | గుడిగుంట | ,, |
| ,, | పందేటి సుబ్బరాజుగారు | ,, | ,, |
| ,, | సంగరాజు వేంకటసుబ్బరాజుగారు | ,, | ,, |
| ,, | మునగపాటి వెంగమరాజుగారు | చిలకలమర్తి | ,, |
| ,, | మునగపాటి వేంకటసుబ్బరాజుగారు | ,, | ,, |
| ,, | మునగపాటి నల్లమరాజుగారు | ,, | ,, |
| ,, | అమరా సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | అమరా సుబ్బరాయులుశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | సన్నపురెడ్డి శేషారెడ్డిగారు | చాపురాళ్లపల్లె | ,, |
| ,, | కంచి సుబ్బయ్యగారు | ,, | ,, |
| ,, | పాబోలు శేషయ్యశ్రేష్ఠిగారు | గోగులపల్లె | ,, |
| ,, | వేమన రామిసెట్టిగారిసింగయ్యశ్రేష్ఠిగారు | చుంచులూరు | ,, |
| ,, | వేమన పిచ్చయ్యశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | సుద్దపల్లె గిడ్డయ్యశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | గ్రంధె చెన్నయ్యశ్రేష్ఠిగారు | పరమటినాయనిపల్లె | ,, |
| ,, | మన్నె కొండారెడ్డిగారు | ,, | ,, |
| ,, | సోమిసెట్టి కృష్ణమశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | కలువాయ రామిరెడ్డిగారు | బమ్మవరము | ,, |
| ,, | పప్పు పిచ్చిరెడ్డిగారు | ,, | ,, |
| ,, | బుట్టి వేంకటరామిరెడ్డిగారు | కామిరెడ్డిపాడు | ,, |
| ,, | మెటుకూరు చెంచురామిరెడ్డిగారు | ముత్తుకూరు | ,, |
| ,, | దరిసి కృష్ణమశ్రేష్ఠిగారు | కుల్లూరు | ,, |
| ,, | పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | వడ్లపూటి రామయ్యశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | సుంకర నరసయ్యశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | తోట పాపిశ్రేష్ఠిగారు | ,, | ,, |
| ,, | మేకపాటి చిన్ననరసారెడ్డిగారు | మద్దులేటిగడ్డ | (కడపజిల్లా) |
| ,, | కాకే నాగరెడ్డికుమారుఁడు శేషారెడ్డిగారు | ,, | ,, |
| ,, | కాకే సుబ్బారెడ్డికుమారుఁడు శేషారెడ్డిగారు | ,, | ,, |
| ,, | మడకల యెల్లారెడ్డిగారు | ,, | ,, |
| ,, | గోపిరెడ్డి నారపురెడ్డిగారు | మంగుపల్లె | (నెల్లూరుజిల్లా) |
| ,, | నందిమండలము సుబ్బరాజుగారు | ముస్తాపురము | ,, |
| ,, | చల్లా శేషిరెడ్డిగారు | మంచేలపల్లె | ,, |
| ,, | రూపిరెడ్డి కొండారెడ్డిగారు | ,, | ,, |
| ,, | పల్లకొండ వేంకటనరసయ్యగారు | పాతళ్లపల్లె | ,, |
| ,, | గంగవరపు రామానాయుడుగారు | గవరవరము | ,, |
| ,, | గంగవరపు వెంగమనాయుడుగారు | ,, | ,, |
| ,, | సిద్దు శేషయ్యగారు | చేతాయపల్లె | (కడపజిల్లా) |
| ,, | కనుమళ్ల గురునాథముశ్రేష్ఠిగారు | చంద్రపల్లెపేట | ,, |
| ,, | పాబోలు చిన్నరామయ్యశ్రేష్ఠిగారు | గోగులపల్లె | (నెల్లూరుజిల్లా) |

## ఉద్ధారకులు.

ఉ. సూనృతవాక్కు పాండితియుఁ ♦ జొక్కపునీతియు భావశుద్ధి పెం
పూనినసత్ప్రవర్తనము ♦ నూహలమించిన కార్యరీతియుం
మానితరావు వేంకటకుమారమహీపతి! సూర్యరాయ! భూ
జానిమణీ! మనోజ్ఞగుణ♦సార! తగుం గద నీకు; సత్కవీ
శానవరాశిమంబులను ♦ శంకరుసత్కృప నార్యసంఘ మెం
తే నొనరించు దీవనల ♦ నెంతయు నిద్ధరఁ బెంపు నొంది సం
తానసమృద్ధిఁ గాంచి గురు♦ధర్మరతిం గని భూమి నేలుమా
శ్రీనిధియా పరాత్పరుఁడు ♦ సిద్ధుల నీ కిడుఁగాత మాదృతిం.

---

సీ. తనహారికీర్తిప్ర♦తానని ర్ఝరతరువరంబుల నల్లి ♦ తమి వహింపఁ
దనదానజీవనం ♦ బనుపమకలశాబ్ధిపూరణదక్షతఁ ♦ బొలుపునొందఁ
దనసద్గుణవ్రాత♦ఘనతరకుసుమంబు లై వాత్మజనితోడ ♦ సరసమాడఁ
దనదైవభక్తిర♦త్నస్ఫారహారంబు నారదవీణాన♦నమునఁ బెనఁగ

తే. నర్థిజనకల్పకంబయి ♦ యార్తిహరణ, దక్షుఁ డై సాధుశీలుఁడై ♦ తగి కులావ
తంసుఁ డై పండితాదృతి ♦ ధన్యుఁ డగుచు, భూతలంబున వెలయును♦బోలిరెడ్డి.

క. అల్లంపాటి కులార్ణవ, మల్లన సుపోంగ హిమక♦రాభుం డయి తా
నుల్లసిలుం సుయశోగురు, మల్లిక లాశాకరీంద్ర♦మండనములు గాం.

చ. ఋతమె వచించి యాశ్రితుల ♦ నెల్ల యథోచితగౌరవంబునం
సతతము దన్పుచుం సుగుణ♦శాలి యితం డనుసాధుసూక్తి యీ
క్షితిఁ గడు నావరింప పర♦శీలము భూషణ మై రహింప న
చ్యుతనిజధర్మబుద్ధి యయి ♦ శోభిలు నెప్పుడు పోలిరెడ్డి తాం.

సీ. రామాయణంబు నాం♦ధ్రంబుగ నొనరింపఁ బూనఁగాఁ దగునని♦పోలఁ దెల్పి
యచ్చుఁగూర్పఁగఁ ద్రిస♦హస్రరూప్యంబుల నిత్తు నిప్పింతు నీ ♦ కేమిగాఁ జింత
మొదలిడుమా యని ♦ ముద మొప్ప వచియించి చెప్పినచొప్పును ♦ దప్పకుండ
సాయ మొనర్చి య♦జస్రము ప్రీతిచే గారవించుచు ధన్యుఁ♦గా నొనర్చి

తే. నన్నుఁ బ్రోచిన సాధుగు♦ణవ్రజైక, భూషణుని దీనపోషకు ♦ భూతదయను
మించు శ్రీపోలిరెడ్డిని ♦ మేటికరుణఁ, బ్రోచుఁగావుత శ్రీహరి ♦ పూజ్యభంగి.

సీ. నిస్వభూసురులకు ♦ నెమ్మి సుద్వాహముల్ ధన మిచ్చి చేయించెఁ♦దగువిధమున
వనతటాకారామ♦వసుమతీత్రిదశోపవనయునాదినిత్యసం♦తతుల నిలిపె
నుత్తమర్ణుం డయి ♦ యొప్పుగా నధమర్ణులను గట్టపెట్టక ♦ ఘనతఁ గాంచె
బీదసాదల నెల్లఁ ♦ బ్రియమారఁ బోషించి కృతకృత్యుఁ డనుభూరి♦కీర్తిమించెఁ

తే. గాశికాముఖసుక్షేత్ర♦గణముఁ గొలిచి
ధన్యుఁ డయ్యెను భూరివ♦దాన్యుఁ డయ్యె

నట్టి యెల్లముపాటిపం♦శాబ్ధివిధుఁడు
పోలిరెడ్డి యజస్రంబు ♦ పోలుచుఁగాక.

---

చ. ఘనగుణమే విభూషణము ♦ గాఁ దగు ధర్మమె తోడునీడఁగా
వినయమె యాశ్రయంబుగ సు♦వృత్తమె సంప్రమదాస్పదంబుగాఁ
గనదురుసద్యశంబున ని♦కామము విస్తృతిఁ గాంచి మించు స
ద్వినుతుని సాధుమానసుని ♦ బెంచెలరెడ్డిని శ్రీశుఁ డోముతన్.

తే. తన్ను మాలినధర్మంబు♦తగ దటన్న, సూక్తి లక్ష్యంబు చేయక♦యొప్పిదముగ
ద్రవ్య మొసఁగుచుఁ గీర్తిసం♦తతినిబడసి, దైవభక్తిని జెలువారు♦ధన్యతముఁడు.

ఉ. ఊడుగని దానసంతతుల ♦ నొప్పుగఁ జేయుచు సజ్జనాదృతిం
బడయుచు నుత్తమర్ణుఁ డయి ♦ బ్రాహ్మణసంతతికల్పకంబు నాఁ
గడు వినుతిం జెలంగుచు న♦ఖండయశంబునఁ జాల మించుచున్
విడువని శ్రీల నొప్పుతను ♦ బెంచెలరెడ్డి తనూజసంయుతిన్.

---

చ. వినయము సాధువర్తనము ♦ విద్యయు భూతగణానుకంప స
జ్జనహితచర్య దేవగురు♦సంతతభక్తి పరోపకారమే
యొనరుచునూహ పాపమున ♦ కొప్పనిచిత్తము భూషణంబులై
తనరఁ గృతజ్ఞుఁ డీతఁడను ♦ ధన్యయశంబునఁ జెన్నుమీఱుచున్.

క. గునిసెట్టివంశమౌక్తిక, మనఁదగు రోశయ్యశ్రేష్ఠి ♦ యాపరమేశాం
ఘ్రినియతచిత్తుఁడు సంతత, మనుసంపద లంది సుయశ♦మునఁ దగుఁగాతన్.

చ. పరమదయన్ జనుం గనుచు ♦ భవ్యమతిన్ మృదుభాషణంబులన్
నిరతము దన్పుచున్ ధనము ♦ నెమ్మిని సద్వ్యయమే యొనర్చుచున్
నిరుపమరామసత్కృతికి ♦ నిశ్చలభక్తిని ద్రవ్య మిచ్చి యు
ట్లూరులను బ్రోత్సహించిన గు♦ణోత్తరు నీశుఁడు బ్రోచుఁగావుతన్.

చ. గరువమొకింత లేదు తనుఁ ♦ గానఁగ వచ్చిన దీనులన్ మహా
దరణము మీఱ శక్తికిని ♦ దద్దయు నర్హముగాఁగఁ బ్రోవ నా
తురపడుఁ గాని నీ యనుట ♦ దా నెపుడే నెఱుఁగండు భూస్థలిం
బరఁగెడు లక్ష్యభూతుఁ డయి ♦ భవ్యగుణాఢ్యుల నీఘనుం డొగిన్.

తే. ఆయురారోగ్యభాగ్యంబు ♦ లాదియైన, సకలసంపద లొసఁగి శ్రీ♦శంకరుండు
వాసుదేవుండు బ్రోవంగ♦వఱలుఁగాత, సాధుగునిసెట్టి రోశయ్య♦క్ష్మాతలమున.

---

సీ. యుక్తధనవ్యయ ♦ మునుతరసద్బుద్ధి శ్రీరామపదసర♦సీరుహైక
భక్తి విద్యాగోష్ఠి ♦ పండితాదరణంబు దీనజనావన♦దీక్ష సాధు

జనహితచర్యయు ♦ సహజవాత్సల్యంబు మర్యాద నెన్నుచు ♦ మాటలాడు
నేర్పు వాఙ్నియమంబు ♦ నీతిజ్ఞతయు లోనుగాఁగలసద్గుణ♦గణము సహజ
తే. భూషణంబులుగాఁ దగ ♦ బొల్లువంశ, దీపకుం డయి రామ ప్ర♦తిష్ఠఁ జక్కఁ
జేసినట్టి శ్రీరంగయ్య♦శ్రేష్ఠిఁ గాచుఁ, గాత శ్రీరామమూర్తి స♦త్కరుణ నెప్పుడు.

---

సీ. పెద్దలఁ బొడఁగన్న ♦ భృత్యునిరీతిఁగా వర్తింపఁజాలిన ♦ భవ్యశక్తి
యాచకులను గన్న ♦ నర్హరీతిని వారి గౌరవింపఁగఁ జాలు ♦ కమ్రబుద్ధి
యాశ్రితులను గన్న ♦ యంతనే వారల కష్టముల్ తొలఁగింపఁ ♦ గల్గునేర్పు
దీనులఁ బొడఁగన్న ♦ మానితకరుణ వారలఁ గావఁ బూనెడు ♦ నలఘుధైర్య
ఆ. మాదినుండి యలర ♦ నవని యశస్సున, వెలయుచున్న బొల్లు♦కులపయోధి
చంద్రుఁడగుచు రామ♦చంద్రభక్తుండగు, రామయార్యు నేలు♦ రాముఁ డెపుడు.
సీ. కట్టించె నెంతొ వే♦డ్కను బొర్లపల్లెయన్ స్వగ్రామమున రామ♦చంద్రమూర్తి
నర్హరీతిని బూజ ♦ నాదృతిఁ దన్పంగఁ దగిన దేవాలయ♦తల్లజంబు
వాహనాదుల నిల్పి ♦ వార్షికోత్సవ మొప్ప సాగుపద్ధతులను ♦ జక్కఁ జేసె
బీదల కర్హమౌ ♦ విధిని సాయము చేసె హరిభక్తివితతుల ♦ నాదరించె
తే. నట్టి రామయ్యశ్రేష్ఠిని ♦ ననవరతము
పుత్రపౌత్రాభివృద్ధియు ♦ భూరిభాగ్య
మతులభక్తియు వెలయంగ ♦ నరసి ప్రోచుఁ
గాత శ్రీరామమూర్తి వి♦ఖ్యాతకీర్తి.

---

సీ. గోపవరాన్వయ♦దీపకుఁడై ప్రభుశక్తి యొప్పారఁగ ♦ సాధుపోష
ణాదృతి వెలయంగ ♦ యాచకబృందాళిఁ గాంచిన సంతోష♦కలితమైన
స్వాంతపంకజ మొప్ప ♦ సతతవిద్వద్గోష్ఠి నెసఁగుచు దీనుల♦నే తలంచి
వారికష్టమ్ములఁ ♦ బాపంగ నెంచుచు సత్కవులం జాల ♦ సంతసిల్లఁ
తే. జేయుచు దయాగుణంబు ని♦స్సీమమైన
ధైర్యమును బొల్పుమీఱ న♦త్యంతరాజ
మానుగోపాలరెడ్డి న♦నూనకరుణఁ
బ్రోచుఁ గావుత లక్ష్మీవి♦భుండు చక్రి.

---

చ. ధనముఁ బరోపకారమునఁ ♦ దప్పక ప్రీతి వ్యయించుచున్ సతం
బును మృదుభాషణంబులఁ గ♦వుల్ ముదమందఁగ నాడుచున్ మనం
బునఁ గులదైవచింతనమె ♦ పూనికఁ జేయుచు దుష్టసంఘభీ
తిని గలిగించు పౌరుషము ♦ ధీవిభవంబును విస్తృతిం దగన్.
క. చల్లాఖ్యాన్వయవారిధి, కుల్లాసముఁ గూర్చుచంద్రు♦నోజను గనఁగా

నెల్లెడలఁ గీర్తి రాజిల, నుల్లమునం గరుణ సతత ♦ మొప్పుచు నుండన్.
తే. పెద్దలను జూడ భక్తియుఁ ♦ బ్రీతియుఁ గడు, నలర నాశ్రితరక్షణ ♦ మరసి చేయు
చున్న శ్రీచెంచుపాపిరె ♦ డ్డి న్నరహరి, పరమపురుషుండు ప్రోచుతఁ ♦ బరమకరుణ.

---

సీ. పరహితవృత్తియుఁ ♦ బరశివసేవయు నిరతాన్నదానంబు ♦ నిశ్చలమతి
శక్తికి మించిన ♦ చందంబుగా దాన మిచ్చుట భూదేవ ♦ తేంద్రహితము
చేయుట పెద్దల ♦ సేవచేయుఁగ మతి యలరుట యనుమొద ♦ లైనసుగుణ
పుంజ మొప్పారఁగాఁ ♦ బొలుచు నేచూరువంశజనితుండయి సాధు ♦ సంఘయుక్తుఁ
తే. డైన శ్రీచెంచుసుబ్బార్య ♦ నమలశీలు, భూతహితచర్యుఁ బర్వత ♦ భూరిధైర్యుఁ
బ్రోచుఁగావుత శ్రీపతి ♦ పుత్రపౌత్ర, చిరతరాయుస్సు వాంఛాళి ♦ సిద్ధు లలర.

---

సీ. సగసకవిత్వంబు ♦ సాధుమనీషయు నుచితజ్ఞతయు దుహూ ♦ హోరువిషయ
విజ్ఞాననిష్ఠయు ♦ విమలశీలము గురుసఖిజనభక్తవా ♦ త్సల్యనియతి
దూరదృష్టియు మహో ♦ దారనీతియు సాంఖ్యతత్త్వ మెఱుంగుము ♦ దము గభీర
భావము నను నివ్వి ♦ ప్రాక్సుకృతంబున సహజగుణంబుల ♦ చంద మొంద
తే. ధార్మికుం డయి మిత్రసం ♦ తతహితాచ
రణపటిష్ఠుండు గ్రంథక ♦ రణసుముఖుఁడు
నగుచు నల్లాడిసాధువం ♦ శాబ్ధిచంద్రుఁ
డగు జగన్నాథశాస్త్రిని ♦ హరి మనుచుత.

---

చ. మితహితభాషణంబు గురు ♦ మిత్రహితాచరణంబు నూనృత
వ్రతరతి యుక్తరీతిని బ్ర ♦ వర్తనముం గనఁ జేయునేర్పు స
న్మతివిభవంబు పాండితియు ♦ మంచియె చేయుతలంపు నార్జవం
బతిశయనీతి సంప్రమద ♦ మారయ నీకె తగున్ మహాత్మునం
దతిశయభక్తి గల్గినకృ ♦ పాలయు యాచకకల్పభూజు న
చ్యుతపదపంకజాతయుగ ♦ శోభితచిత్తమదద్విరేఫునిన్
సతతము గార్లదిన్నెకుల ♦ జాతుని రామపదేశ్వరుం గృపన్
క్షితితనయామనోహరుఁడు ♦ శ్రీరఘునాయకుఁ డోముఁగావుతన్.
క. శ్రీరామేశ్వరరాయని, సారమతిం బ్రోచుఁగాక ♦ క్ష్మాజాత కృపా
వారాశి సకలసంప, ద్భూరితరాయుస్సు లొసఁగి ♦ భూస్థలి వెలయన్.

---

సీ. భాగవతాదిక ♦ పారాయణాసక్తి దేవభూదేవభ ♦ క్తిహితచర్య
లామోదమునను ధ ♦ ర్మాచరణంబును జేయునేర్పును మన ♦ స్థిరత న్యాయ
పరమాదృతియు మిత్ర ♦ పరిపాలనాభినివేశంబు బాంధవ ♦ ప్రీతి దీన
మానవదర్శన ♦ మాత్ర సాయముచేయు పూనిక పండిత ♦ పోషణైక

తే. నియతి యనునిట్టి సద్గుణ♦నిచయమె తన
యశము దిక్కుల నింపఁగా ♦ నవనిఁ బొలుచు
పత్తి రాఘవశ్రేష్ఠిని ♦ బరమకరుణఁ
బ్రోచుఁగావుత శ్రీరామ♦మూర్తి సతము.

---

సీ. భాషాభిమానంబు ♦ భక్తియుక్తస్వాంత మాశ్రితావనదీక్ష ♦ యాచకాళి
సమ్మతింపఁగఁ జేయు♦సాధుదానము మతశ్రద్ధ దేవార్చనా♦సక్తి హితము
గనె మాటలాడునేర్పును గులదేవతాభక్తివిశ్వాసముల్ ♦ పరహితాచ
రణమునఁ బూనిక ♦ ప్రజలరంజిలఁజేయు శక్తియు ననునివ్వి ♦ సహజగుణము
తే. లగుచు వెలయంగ భోగనా♦థాఖ్యవంశ్యుఁ
డైన వేంకటసుబ్బాఖ్యుఁ ♦ డైనశ్రేష్ఠి
రత్నమును బ్రోచుఁగాత శ్రీ♦రాముఁ డెలమిఁ
బుత్రవృద్ధియు భాగ్యంబు ♦ పొలయునట్లు.

---

సీ. పరమేశ్వరునియందుఁ ♦ బరిపూర్ణభక్తియు రామాయణాదిస♦ద్గ్రంథపఠన
సంశ్రవణాసక్తి ♦ సంతతసత్పాత్రదానంబు భూసుర♦తల్లజాళి
యందు విశ్వాసంబు ♦ ముందు తెల్పక భక్తిమెయిదానమిచ్చుట♦మితవచనము
లలరఁ బల్కుట భర్త♦యందు దైవతబుద్ధి పరిశుద్ధనిర్మల♦వర్తనంబు
తే. తనయశంబును గొనియాడఁ ♦ దలువులాన్వ
యమును వెలయంగఁ జేయుచు ♦ నమలచిత్త
మలరు వేంకటసుబ్బాంబ ♦ నాపరేశుఁ
డరసి కాపాడుఁగాక య♦త్యంతకరుణ.

---

తే. వేలమూరు వంశంబున♦వెలసి సాధు, వినుతినిం గాంచి సత్కీర్తి♦వెలయుచున్న
రామశ్రేష్ఠికి శ్రీరఘు♦రామమూర్తి,యశమునొసఁగునుగాతనె♦య్యంబుమీఱ.

---

సీ. ధర్మగుణంబునఁ ♦ దనరారి సత్కార్యకరణంబునన్ ఖ్యాతిఁ ♦ గాంచి మించి
యాడితప్పనిసూక్తి ♦ యలరార నుపకృతిఁ జేయుటే కృత్యమై ♦ చెలఁగ దుష్ట
జనులఁ గన్నులనైనఁ ♦ గనక సజ్జనగోష్ఠిఁ గాలంబుఁ బుచ్చుచుఁ♦గాంచనాంబ
రునిసేవచేయుచుఁ ♦ దనశక్తి నంతయు దేవతాకృతికయి ♦ తివిరి వ్యయము
తే. చేయుచును దోట వంశంబు ♦ స్థిరయశంబుఁ
గనఁగ నొనరించు నరసమాం♦బను రఘూత్త
ముండు కరుణార్ద్రదృష్టిని ♦ బూని ప్రోచుఁ
గాక యేకీడు గానని♦కరణి ధరణి.

సీ. బహువిధరూపక♦ప్రకటశాఖల మించి సత్పాత్రపల్లవ♦సమితిఁ జెలఁగి
నీతిప్రదాయక♦నియతిపుష్పాఢ్యమై యుపకృతిఫలముల ♦ నొప్పు మిగిలి
జనరంజనాభిఖ్య ♦ ఘనతచేఁ బెంపొంది సజ్జనావృతిరూప♦చారుతఁ గని
నటరాజయోగాభి♦నయభృంగముల మీఱి సాధుప్రకాశైక♦సరణిఁ జేరి
తే. దేవరాజాధిపత్యసం♦దీప్తి మెఱయు, సరసకవిరాజసద్ద్విజ♦సంఘ మొలయఁ
గడపపురి మించు దీనర♦క్షకసభాసు,రద్రుమము వృద్ధిఁ గాంచుత♦రాముకరుణ.

సీ. వరసముద్రాలాన్వ♦వాయార్ణవంబునఁ గల్పవృక్షంబు నాఁ♦గన్ జనించి
పాత్ర మపాత్రమన్ ♦పరమభేదంబునఁ బ్రజ్ఞఁగాంచి కృపాంబు♦రాశియగుచుఁ
బరులవాక్కుల సుంత ♦ పాటింప కాదృతిఁ దనబుద్ధిరీతిగా ♦ దానమిచ్చు
నియతిచే వెలయుచు ♦ నిశ్చలశ్రీరామభక్తిచే నొప్పుచు ♦ బ్రాహ్మణగురు
తే. దేవతాసముదయమందు ♦ దృఢతరంపుఁ, బ్రీతి వెలయులక్ష్మమ్మను♦ శ్రీరఘుకుల
వంశవార్తిక మనియెడు♦ భవ్యయశము, గన్నరాముండు బ్రోచుతఁ♦గరుణ మీఱ.

నిర్వాహకులు.

తే. ఇంగితజ్ఞత యర్థిజ♦నేష్టసిద్ధి
చేయునేర్పుచితజ్ఞత ♦ న్యాయబుద్ధి
యోగ్యతను గుర్తెఱుంగఁగ ♦ నొప్పుశక్తి
యివ్వి తగుఁ బిచ్చయార్యన ♦ కెన్నిచూడ.
చ. సరసమనీష యొప్పఁగ వ♦చస్తతిగౌరవ మెంతొ చక్కఁగాఁ
బరఁగఁ బరోపకారమును ♦ బాగుగఁ జేయుతలంపు రాజిలన్
నిరతము పండితాదృతియు ♦ నెమ్మిని గల్గఁగఁ జేయఁగా విరూ
ర్వరకులసంభవంబుఁ గని ♦ వర్ధిలునూరిని బిచ్చయార్య నీ
శ్వరుఁడు పరాత్పరుండు సుఖ♦సంపద లిచ్చుచుఁ బ్రోచుఁగావుతన్.

చ. కురుడికులాబ్ధిసోమనిభుఁ ♦ గుంభితవాగ్విభవున్ సదార్థిభా
సురనిజసౌధు దానజిత♦సూర్యతనూభవు సత్కవీంద్రవా
క్పరినుతసద్యశున్ విపుల♦వైభవు భూతదయాభిరామహృ
త్సరసిజు గుండురాయనిఁ బ్ర♦సంగవిశారదు సర్వసంపదల్
పరమకృపాబ్ధి రాఘవుఁడు ♦ పాయ కొసంగుచు నేలుఁగావుతన్.

క. కౌకూరువంశజలనిధి, రాకాశీతాంశుసముఁడు ♦ రాఘవపాదా
బ్జాకలితహృన్మధుకరుఁడు, శ్రీకలితుఁడు సాధువర్య♦చిత్రేష్టుఁడున్.

ఆ. సకలసుగుణరాశి ♦ శాంతధనుండును, యాచకామరతరు ♦ వౌర! యనఁగ
వాసి గన్న శ్రీని♦వాసరాయని సత్య, ధీరు నోముఁగాక ♦ శ్రీరమణుఁడు.

---

చ. వినయము సాధుసంఘనుత♦వృత్తము దీనజనావనాదృతిం
గను మతి దైవభక్తి కల♦కాలము యాచకబృందముం గడుం
దనువుస్వభావముం దనకుఁ ♦ దప్పని భూషలుగాఁ జెలంగ నొ
ప్పిన బి. పి. దేవరాజు లను♦విశ్వహితుండగునాయునిన్ ముదం
బును గనఁ బ్రోచుఁగాతఁ బరి♦పూర్ణదయన్ రఘురాముఁ డెప్పుడున్.

---

క. వినయంబె భూషణంబుగ, ఘనవిద్యయె మూలధనము♦గా నుపకృతిఁ దా
నొనరుచుటయె కృత్యము గాఁ, గను రాజులునొక్కనూరి ♦ కడపపురమునన్.
తే. సాద్ఘుడాన్వయపాథోధి♦చంద్రుఁ డగుచు
రహిఁ జెలంగు సర్వోత్తమ♦రాయనిఁ గృప
శ్రీహరియు నాపరాంబయు ♦ శ్రీసమృద్ధిఁ
జేసి రక్షింత్రుగావుత ♦ వాసిమీఱ.

---

తే. మిత్రబంధుసమాదృతి ♦ మితహితవచ
నము దయాయుక్తచిత్తము ♦ విపులదీర్ఘ
యోజనయు సుముఖత్వము ♦ నొప్పుచున్న
వీరయామాత్యుఁ డలరుఁ బా♦టూరుకులుఁడు.
తే. సకలసద్గుణమణిఖని♦సరసుఁడుఖిల,యుక్తిదూరుఁడుసత్కార్య♦మొప్పఁ జేయు
నియతిగలవాఁడుసూనృత♦నిర్మలుండు,నైన శ్రీవీరయామాత్యు♦హరిమనుచుత.

---

క. నిరతాన్నదానరక్తియు, గురుసఖియాచకుల కెల్లఁ ♦ గూర్చుమతియు ని
ర్భరపౌరుషంబు నీతియుఁ, గరము విరాజిల్లుచుండఁ♦గా నిపుణుండై.
క. హరపూజారతచిత్త, స్ఫురణము తనరార సుకవి♦పూగవిహితకా
ర్యరతుండై లోకాన్వయ, గురుతరవార్ధ్యబ్జుఁ డనఁగ ♦ క్షోణి వెలయుచున్.
క. హితకృత్యనియతిఁ గనుచున్, సతతము ధర్మంబునందె ♦ స్వాంతము వెలయన్
క్షితిఁ దగు సుబ్బార్యుని శ్రీ, పతి ప్రోచుతఁ బుత్రపౌత్ర♦భాగ్యము లలరన్.
క. వినయము భారతముఖగ్రం,థనికరపఠనంబు వంశ♦దైవతపూజా
దినిఖిలకృత్యసమాదృతి, తనరంగాఁ బావుతిప్పు ♦ ధన్యకులజుఁ డై.
ఆ. అవనిఁ గీర్తిఁ గాంచి ♦ యాశ్రితరక్షణ, మలర యుక్తమైన ♦ మతిశయిల్ల
భూసురైకభక్తిఁ ♦ బూనుకొండారెడ్డి, సరసమతిని సాధు♦సంఘవినుతు.
తే. గర్వశూన్యుని నియతస♦త్కార్యనిరతు
భూతదయయుఁ బశ్చాత్తాప ♦ మాతతముగఁ

గలిగి యలరారు సజ్జనుఁ ♦ గాంచనాంబ
రుండు నిత్యంబు పోషించు ♦ చుండుఁగాక.

సీ. చిట్లూరువంశంబు ♦ చెలఁగి వర్ధిల్లఁగా వేంకటశ్రేష్ఠికి ♦ విమలమతికిఁ
దనయుఁడై వినయాది♦ఘనగుణమణియునై దేవతాగురుభక్తి ♦ తేజరిల్లఁ
గాశ్యాదికక్షేత్ర♦గణము నుపాసించి దానంబులొసఁగి ని♦త్యమును నియతిఁ
గులదేవతోపాస♦నలఁ గాలముం బుచ్చుచును దురాచారమ్ము♦లను నెఱుంగ
తే. కాశ్రితాదృతి పెంపార ♦ నర్హకీర్తిఁ
గాలముం బుచ్చుచున్ నీతి♦కలితుఁడు నగు
నట్టి రాచయ్యశ్రేష్ఠిని ♦ నరసి ప్రోచుఁ
గాత శ్రీరఘురాముండు ♦ కరుణ సతము.

---

ఉ. శ్రీమహితాత్ము నాశ్రితుల ♦ సిద్ధమనస్కులఁ జేయుదాత ను
ద్దామగుణాఢ్యు సూరినుతుఁ ♦ దత్త్వవిదుత్తమభక్తితత్పరున్
వేములపాటి వంశమున ♦ విస్తృతిఁ గాంచిన పోలయార్యునిన్
శ్రీమహితుండు కీర్తిఁ గనఁ♦ జేయును గాక దయాంతరంగుఁడై.

---

తే. అలరుయాదాళ్లవంశప♦యస్సముద్ర, చంద్రు శేషయ్యశ్రేష్ఠిని♦జలజనయనుఁ
డన్వయము వృద్ధినొందెడు♦నట్లు కరుణ, నేలుఁగావుతనిత్యంబు♦నెంతొకూర్మి.

సీసమాలిక:—

మురుకూటివంశస♦ముద్రంబు వెలయింపఁ జింతామణియనంగ ♦ వింతపుట్టి
చేతనైనంత సం♦సిద్ధమతిన్ సాయమునె చేయఁ గంకణ♦మును ధరించి
స్మితభాషణంబులఁ ♦ జెలఁగుకొండారెడ్డి నార్తరక్షకుఁడు సూ♦ర్యాన్వయాబ్ధి
శశియగు శ్రీరామ♦చంద్రుండు కాపాడుఁ గాక; నున్నావంశ♦కమలవనము
వెలయింపఁ బుట్టి ని♦స్తులదానదక్షుఁడై పోలుచులక్ష్మీశబ్ద♦పూర్వుఁడైన
నారాయణశ్రేష్ఠి ♦ నరహరి కాపాడుఁగాక; పప్పుకులంబు ♦ క్ష్మాతలమున
నెగడఁజేయఁగఁ దాను ♦ నిల్చి ధీరుండయి పెద్దలమాటలఁ♦బ్రియము మీఱ
వినఁగఁజాలినయట్టి ♦ వేంకటసుబ్బాఖ్యరెడ్డిని గావుత ♦ శ్రీరఘుపతి
బుట్టివంశంబునఁ ♦ బుట్టి కీర్తిని గాంచి దాతయై సత్కవి♦తతికి మోద
మలరంగఁ జేయుచు ♦ వెలయు బ్రహ్మారెడ్డిఁ గాపాడుఁగావుతఁ♦గంజనయనుఁ;
డమలరాపూరువం♦శాబ్ధికి నుత్పలమిత్త్రుఁడై సుజనుఁడై ♦ మేటికీర్తి
యలరార విద్యల ♦ నాదృతి వెలయింపఁ జేయుచుఁ గవులకు ♦ న్యాయరీతి
సాయ మొసఁగుచు ♦ సతతపండితగోష్ఠిఁ దగినమాన్యుని బహు♦ధర్మచిత్తు
వేంకటసుబ్బాఖ్య♦వినుతిఁ గాంచినరెడ్డి నీశుఁ డోముతఁగృప♦ యొసఁగుచుండఁ;
బర్మాన్వయముఁజాలఁ♦బ్రఖ్యాతి వెలయింప నవతరించినమేటి♦యనఁగ నలరు

వెంగయ్యశ్రేష్ఠిని ♦ విబుధభక్తుని హరి కాపాడుఁగావుతఁ ♦ గమ్రకరుణ;
సాధుచల్లాన్వయ ♦ శరధి నుప్పొంగఁగాఁ జేయునుత్పలమిత్రుఁ♦డే యనఁదగి
చారుశీలత నొప్పి ♦ శాంతభూషణుఁ డయి యుపకృతిఁ జేయఁగా♦నూహలెపుడు
ప్రవహింపుచుండ ధ♦ర్మారెడ్డిపుత్రుఁడై పాత్రత వెలసిన ♦ ప్రజ్ఞ యలర
గ్రంథశోధకుఁ డయి ♦ కరుణాత్ముఁ డైన వేంకటనరసారెడ్డి♦ క్ష్మాతనూభ
వాధవుం డోముత ♦ భద్రంబు లొసఁగుచుఁ గంటికి రెప్ప నాఁ♦గ నిరతంబు;
నాగిరెడ్డికులంబు♦నం బ్రభవిల్లి నిత్యంబును భోగభా♦గ్యముల నొప్పి
పౌరుషం బలరారఁ ♦ బరఁగుకొండారెడ్డిఁ గంజలోచనుఁ డెప్డు ♦ గాచుఁగాక;
భూమాన్వవాయంబుఁ ♦ బూతంబుగాఁ జేయ శాంతగుణంబె యొ♦సంగుచుండఁ
జెలఁగుసుబ్బయ్యశ్రే♦ష్ఠిని బుత్రపౌత్రాదు లొప్పఁ గాపాడుఁగా ♦ కుర్విజాత
ధవుఁ డగు శ్రీరామ♦తారకబ్రహ్మంబు కల్యాణమూర్తి యు♦త్కంఠ మెఱయఁ;
జల్లాన్వయంబున ♦ జనియించి విఖ్యాతయశమునఁ జెలఁగుచు♦నసముఁ డైన
యట్టి పెంచెలరెడ్డి ♦ నాయురారోగ్యంబు లలరఁ గావుత రఘు♦కులవిభుండు;
సాధుచెమర్తివం♦శంబున విఖ్యాతి యలరఁగా జనియించి ♦ యమలధర్మ
బుద్ధియై తగుచిన్న ♦ పుల్లమరాజును శ్రీవిభుఁ డోముత ♦ సిరుల నొసఁగి;
చింతలపల్లినాఁ ♦ జెలఁగువంశాంబుధిశశి ధర్మబుద్ధి ని♦స్తంద్రకీర్తి
కమనీయగుణుఁడు వేం♦కటనరసారెడ్డి వర్ధిల్లుఁగాక శ్రీ♦వాసుదేవు
కరుణచేఁ బుత్రాది♦కలితుఁడై బహుధనధాన్యసంపద లెప్డు ♦ తనరుచుండ;
వాకాటిసద్వంశ♦భవుఁ డయి త్యాగియై నిత్యదానంబుల ♦ నియతిఁ జేయు
చును న్యాయవర్తన♦మునఁ గీర్తిఁ గాంచుచు నర్థిచాతకమేఘుఁ♦డై చెలంగు
నారసింహారెడ్డి ♦ నయనిధి నీశుండు గాపాడుఁగావుత ♦ క్షమ దనరఁగ;
గుండ్రాన్వయంబు నీ♦క్షోణి వర్ధిల్లంగ భాసురకీర్తియై ♦ ప్రభవ మొంది
భక్తుఁడై నీతిసం♦సక్తుఁడై నిరతాన్నదానతర్పితదీన♦తతియు నగుచు
నలరు శేషారెడ్డి ♦ నారఘురాముండు కాపాడుతం గల♦కాల మెలమి;
రాజవంశంబును ♦ రమణ వర్ధిలఁ జేయ జనియించి కొండూరు♦ఘనకులంబు
పరిపూతముగఁ జేయు ♦ పట్టుదలను బూని పాత్రదానంబున ♦ భవ్యయశము
గాంచి మించినయట్టి ♦ ఘనుని వేంకటసుబ్బరాజును శ్రీరఘు♦రాముఁ డెపుడు
ధనధాన్యపుత్రపౌ♦త్రనికరముల నిచ్చి కాపాడుఁగావుతఁ ♦ గరుణమీఱి;
గంగవరపువంశ♦కలశపాథోరాశినీహారరశ్మియై ♦ నెగడి శక్తి
కెంతో మించిన యట్లు ♦ తెల్లదానంబులఁ జేయుచుఁ జాల నా♦శ్రితులు గ్రాలఁ
బరమకీర్తిని మించు♦నరసపునాయని శ్రీహరి కాపాడు ♦ సిద్ధు లొసఁగి
మల్లువేంకటరెడ్డి ♦ సల్లలితగుణాఢ్య వ్యవహారదక్షు వి♦భవవిశాలు
నాశ్రితరక్షకు ♦ నమలవిఖ్యాతిని మించుసజ్జను నేలుఁ ♦ గాంచనాంబ
రుఁడు చక్రి సతతంబు ♦ బుడుతల నొసఁగుచు సిరులమించఁగ ఫల♦సిద్ధి యలర;

నారపురెడ్డియ♦న్వయుని శ్రీయుతు దాత నయగుణవిఖ్యాతు ♦ సుయశు సుజను
సాధుభక్తుని నర♦సారెడ్డిఁ గాపాడుఁగాత మెప్పుడు రఘు♦కాంతుఁ డెలమి;
గాలువయనుసట్టి ♦ ఘనవంశభవునిఁ గీర్త్యన్వితు సుముఖత్వ ♦ మలరువాని
తే. ఘను ముసల్ రెడ్డిఁ గాపాడుఁ♦గాక సతత
మాయురారోగ్యభాగ్యంబు ♦ లలరునట్లు
రఘుకులాంభోధిచంద్రుండు ♦ రామమూర్తి
కరుణ వెలయుచు నుండ ని♦క్కంపుఁబూన్కి.

---

క. నిరుపమమతి వైద్యుఁడు స, త్కరుణానిధి సాధుమతియుఁ ♦ దప్తసువర్ణాం
బరపదభక్తుఁడు శాంతుఁడు, నరసింహాచార్యుఁ డెన్న ♦ నయహితుఁ డలరున్.
ఆ. బీదజనుల మిగులఁ ♦ బ్రేమించుగంజాము, వంశమందు రత్న♦వర్య మెసఁగు
నట్లు పుట్టి ద్రవ్య♦మందు నాసక్తి లే, కలరు నతని భక్తు ♦ నరయు నృహరి.

---

సీ. స్వామివంశంబునఁ ♦ జారుమార్తిక మున రాజిల్లి సద్గుణ♦రాజి యలర
నిరుపమానప్రభఁ ♦ బరఁగి విఖ్యాతిని మించి దాతయు నౌచు ♦ నంచితమగు
పద్ధతిఁ బ్రాపించి♦వ్యవహారవిదుఁ డయి సరసుఁ డై యాచక♦చాతకముల
కాహ్లాద మొనరించు ♦ నబ్దము నాఁ దగి సద్భాషణముల ని♦శ్చలపరేశ
తే. భక్తి సజ్జనసంఘసం♦సక్తి మించు
వేంకటాచలశ్రేష్ఠిని ♦ విపులశుభస
మృద్ధునిం జేయుఁగాత ల♦క్ష్మీశుఁ డఖిల
శరణదుఁడు చక్రి సత్కృపా♦సాంద్రుఁ డెవుడు.

---

సీ. వర్ధమానన్యన్వయ♦భవుఁడు చిదానందపుత్రరత్నము సాధు♦పూతచిత్తుఁ
డనపకారి వదాన్యుఁ ♦ డతిమితభాషణుం డపగతగర్వుండు ♦ హారపదాంబు
జాతభక్తుఁడు పితృ♦చరణదాసుండును వేంకటసుబ్బాఖ్య ♦ వెలయు సుజను
ననుజాతుఁ డాదృతి ♦ నర్థుల నలరించు మేటి వాఙ్మధురిమ ♦ మించుఘనుఁడు
తే. బహువిధాగ్రహారంబులఁ ♦ బరఁగునీశుఁ, డెట్టిచో మాటఁ దప్పని♦యింగితజ్ఞుఁ
డైన లక్ష్మయ్య నాహరి♦యాయురతుల, భాగ్యయుక్తునిఁ జేసి కా♦పాడుఁగాత.

---

తే. మద్దిసెట్టికొండయశ్రేష్ఠి ♦ మానధనుఁడు
సాయమును జేయఁ జేయింపఁ ♦ జతురుఁ డెల్ల
కాల మీశ్వరభక్తుండు ♦ కరుణగలుగు
వాఁడు శ్రేయస్సహానమునఁ ♦ బరఁగుఘనుఁడు.
తే ప్రియముగలవాఁడు బాంధవ♦ప్రియుఁడు భూరి
బుద్ధి యాశ్రితులం గృప ♦ బొలయఁ గాచు

సరసుఁ డాఘను శ్రీరఘు♦వరుఁడు కరుణఁ
గాచుఁగావుత మభివృద్ధిఁ ♦ గాంచునట్లు.

---

పోషకులు

సీ. అనయమ్ము వినయమ్ము♦ను నయమ్ము వెలయంగ నలరారు నెవ్వాని♦యాత్మసీమ
అనిశమ్ము భూతద♦యాలతాంకూరమ్ము వర్థిల్లు నెవ్వాని♦భావసీమ
అసమానదైవభ♦క్త్యతిశయమ్మున కాలవాల మా నెవ్వాని♦స్వాంతసీమ
దానదాక్షిణ్యాద్య♦నూనసద్గుణములు చెన్నారు నెవ్వాని♦చిత్తసీమ
తే. అట్టి సద్బ్రాహ్మణకులీనుఁ ♦ డైనయట్టి, కంచిరాజు నృసింహార్యుఁ ♦ గాచుఁగాత
మాయురారోగ్యపుత్రపౌ♦త్రాభివృద్ధి,గలుగ రాముండు నిండోల♦గంబుగాఁగ.

---

ఉ. ధీసముదంచితుం డయి సు♦ధీవరులం దలిభక్తిభావవి
శ్వాసవిశేషుఁ డై తెలుఁగు♦బాసకుఁ బోషకుఁ డై చెలంగుసుం
కేసుల సుబ్బయార్యుఁ దిల♦కించుచు గాత ననుస్తసంపదు
ల్లాసవిలాసముల్ వెలయ ♦ లాలసలీల రఘూత్తముం డొగిన్.

---

శా. దైవబ్రాహ్మణభక్తి సత్యరతియున్ ♦ దాక్షిణ్యభావంబు శ్ర
ద్ధావిశ్వాసము లర్థవృత్తులు గడుం ♦ దళ్కొత్త నొప్పారుభా
వావేశోజ్జ్వలుఁ గందనూరుగురుమూ♦ర్త్యాఖ్యున్ సదా ప్రీతిమైఁ
బ్రోవుంగావుత నిండువైభవమునన్ ♦ భూపుత్రికానాథుఁడున్.

---

సీ. అమితాన్నదానవ్ర♦తాచారధీరుండు బ్రహ్మవిద్యాజ్ఞాన♦వైభవుండు
దీనజనాలోక♦నానూనకరుణుండు కరుణోల్లసద్దాస♦కంకణుండు
దేవతాబ్రాహ్మణ♦దివ్యభక్తినిదాన మతిపరోపకృతిప్ర♦థితయశుండు
సత్కార్యదీక్షిత♦స్వాంతుండు నిత్యంబు ననుపాలితాతిస♦త్యవ్రతుండు
తే. నైన శ్రీమాడుగుల సుబ్బ♦యార్యవర్యు
విమలవిజ్ఞానసంపదల్ ♦ వెలయఁ జేసి
కరుణ నెల్లప్పుడును బ్రోచుఁ♦గాత రామ
చంద్రుఁ డప్రమేయకరుణా♦సాంద్రుఁ డగుచు.

---

ఉ. ప్రాకటదైవభక్తియును ♦ బ్రాహ్మణభక్తియు సత్యరక్తియున్
జేకురఁ జేసి వాసిగ న♦శేషవిశేషసుసిద్ధభోగభా
గ్యాకరుఁ జేయుఁగాతఁ దను♦పార నపారకృపార్ద్రదృష్టితో
నూకలసుబ్బయార్యుని ఘ♦నున్ రఘునాథుఁడు సర్వకాలమున్.

---

తే. ధనము ధాన్యమ్ము ధర్మమ్ము ♦ దాన సత్య
శౌచము లొసంగి శ్రీరామ♦చంద్రుఁ డెలమి
సతము పోచముపల్లివం♦శజనితుఁ డగు
నాత్మరామయ్య నామధే♦యార్యు నోము.

---

క. ఎల్లప్పుడు శ్రీనాథుం, డుల్లాసం బుల్లసిల్ల ♦ యుక్తశ్రీసం
పల్లాభంబు లొసంగుతఁ, దల్లముమునినామునకు ను♦దారగుణునకున్.

---

తే. ప్రోచుతన్ దశరథరాజు♦ముద్దుపట్టి, పరమకల్యాణముల పరం♦పరలు గట్టి
కరము నానందముం గలు♦గఁ దలపెట్టి, క్షితిని గలిసెట్టి పెంచెలు♦సెట్టి జెట్టి.

---

మ. క్షితి శ్రీకాకుళవంశజాతు గురుభ♦క్తిప్రౌఢభావున్ ద్విజ
ప్రతతిప్రాంచితభక్తిసంయుతుని శ్రీ♦రామయ్యశ్రేష్ఠిన్ బహు
స్థితిఁ గారుణ్యతరంగితాక్షిసరణిన్ ♦ శ్రీరాముఁడుం బ్రోచుతం
దతకళ్యాణపరంపరావిభవవి♦జ్ఞానప్రదానుండు నై.

---

చ. వినయము సాధుశీలమును ♦ విశ్రుతకీర్తియు దైవభక్తియున్
ఘనకరుణాంతరంగము న♦ఖండవిభూతియు నొప్పుమీఱఁగాఁ
దనకు నలంకృతిత్వము ని♦తాంత మొసంగఁగ మంచిరాజపా
వనకులజాతుఁ డై తనరు♦వర్ణ్యగుణున్ గరుణాలవాలు స
జ్జనసుతు ధీరు శేషగిరి♦సాధుమతిన్ హరి ప్రోచుఁగావుతన్.

---

చ. అతులితమంచినామకుల♦మందు జనిం గని యన్నదానమున్
సతతము చేయుచున్ దివిజ♦సత్కృతులందె యొసంగు వేడ్కతో
క్షితిసురవర్యుఁ డై పొలిచి ♦ శ్రీశివభక్తుఁడు నొచు రాఘవా
ఖ్య తగ నెసంగుసూరిని గు♦ణాకరు నేలుత దేవదేవుఁడున్.

---

తే. సంబటూరుకులంబున ♦ సాధుశీలుఁ
డుదయ మందెను నెఱదాత ♦ యొప్పుమీఱఁ
బల్కునేర్పతి సజ్జన♦పాళిఁ గూర్మిఁ
గాచుసన్మతి హరికృపఁ ♦ గన్నఘనుఁడు.

క. నందవరీకబ్రాహ్మణుఁ, డందఱకుం గోర్కి చెలఁగు♦నట్లుగ సాయం
బుం దమిఁ జేయుచుఁ గాలం,బుం దగఁ బుచ్చెడు మనీషఁ♦బొల్చునతండున్.

తే. అర్థిజనకల్పభూరుహం ♦ బన్నఖ్యాతిఁ, గన్నవేంకటసుబ్బార్యుఁ ♦ గాచుఁగాత
మాయురారోగ్యపుత్రపౌ♦త్రాభివృద్ధి, నందునట్లుగ శ్రీరాముఁ ♦ డాదరమున.

సీసమాలిక.—

కాశీముఖక్షేత్ర♦గణము సందర్శించి పెద్దలఁ బొడఁగన్నఁ♦ బ్రియము నొంది
యుచితదానంబున ♦ నొప్పు మాలేపాటి సుబ్బరామశ్రేష్ఠి ♦ శుభచరిత్రుఁ
గాపాడుఁగాక శ్రీ♦కాంతుఁడు కరుణాబ్ధి సర్వాంతరంగవ♦సతి సతంబు;
దొమ్మరాజుకులంబు ♦ నిమ్మహి వర్ధిల్ల రహిఁ జేయు నెరికల♦రాజుగారి
యోబులరాజున♦భ్యుదయంబునొందంగఁగాచుఁగావుతరమా♦కాంతుఁడెలమిఁ;
బందీటి యన ధాత్రిఁ ♦ బరఁగువంశంబున కెంతొకీర్తిని దెచ్చి ♦ హితమితవచ
నములఁ బల్కెడు భూరి♦నయహితు శ్రీసుబ్బరాజును గావుత ♦ రామమూర్తి;
సంగరాజుకులాబ్ధి♦శశి యీవి గలమేటి సాధుసంగతిఁ గోరు♦చతురుఁడాంధ్ర
భాషాభిమాని యు♦ర్వరఁ గీర్తిఁగన్న వేంకటసుబ్బరాజును ♦ గాచు శౌరి;
మునగపాటి యనంగఁ ♦ బొలుచు కులంబునఁ బుట్టి వేలోకజోలిఁ♦బోక తనదు
కృత్యంబె చేయుచుఁ ♦ గీర్తి గన్నట్టి యావెంగమరాజును ♦ విమతహరుఁడు
శ్రీరఘుపతివృద్ధిఁ ♦ జేయుత మాయుర్సుఖము లిచ్చుచుం గల♦కాల మెలమి;
మునగపాటిసువంశ♦మునఁ బేరు ప్రఖ్యాతి గాంచి నీవాఁడ నేఁ ♦ గరుణఁ గావు
మన్నచో నుపాంగి ♦ మన్నించి కాపాడు సద్గుణంబునఁ బొల్చు♦సరసబుద్ధి
శోభితు వేంకట♦సుబ్బరాజును రామమూర్తి కాపాడుత ♦ మూర్తిఁ బాపి;
నల్లమరా జను♦నామంబు వెలయంగ మునగపాటిసువంశ♦మును వెలయఁగ
జేయుచుఁ బెద్దల ♦ సేవించుమాన్యుని రక్షించుఁగాత శ్రీ♦రఘువరుండు;
వైశ్యకులంబున ♦ వఱలెడునమరాన్వవాయుంబునం బుట్టి ♦ వాసిఁగాంచి
సుగుణభూషితుఁడైన ♦ సుబ్బరామశ్రేష్ఠి రక్షించుఁగాక శ్రీ♦రామమూర్తి;
యమరాహ్వ మించిన ♦ యల్లవంశంబున విఖ్యాతినిం గాంచి ♦ వెలసినట్టి
సుబ్బరాయశ్రేష్ఠి ♦ శుభముల వర్ధిల్లఁ జేయునుగావుత ♦ శ్రీవిభుండు;
సన్నపురెడ్డిశే♦షారెడ్డి ద్విజపక్షపాతిని మేల్దాతఁ ♦ బరమపురుషుఁ
డఖిలసంపద లిచ్చి ♦ యన్వహంబును బ్రోచుచుండునుగాక యెం♦తొ కరుణను;
గంచ్యన్వయంబునఁ♦గమ్రగతిం బుట్టి సుగుణమండితుఁడైన♦సుబ్బయాఖ్యు
ననవరతంబు నా♦హరిపుణ్యఫల మబ్బఁజేయునుగాక వి♦స్తృతకరుణను;
సరసుఁ బాపోతుశే♦షశ్రేష్ఠినిఁ భోగభాగ్యవిభూతిసం♦భరితుఁ గాఁగ
శ్రీరామమూర్తిసం♦సిద్ధకృపాసింధు వెలమిఁజేయుచు నిష్ట ♦ మిడెడుఁ గాక;
వేమనవంశంబు ♦ వెలయింపఁగాఁ బుట్టి పెద్దలయందు సం♦ప్రీతి గలిగి
తనరుసింగయశ్రేష్ఠి ♦ దశరథపుత్రుండు గాపాడుఁగాక ని♦క్కంపుఁగరుణ;
వేమనసద్వంశ♦విమలమార్తికమగు పిచ్చయ్యశ్రేష్ఠిని ♦ విపులదాన
తర్పితయాచక♦తతిని శ్రీరాముండు కాపాడుఁగావుతఁ ♦ గరుణమెఱయ;
సుద్దపల్లెకులాబ్ధి♦సోముఁడై ధని యయి యాశ్రితవాత్సల్య ♦ మలరుచుండఁ
జెలఁగుగిడ్డయ్యశ్రే♦ష్ఠిని రామచంద్రుండుకరుణమించఁగఁగాచుఁ♦గాకసతము;

గ్రంధివంశంబునఁ ♦ గడుధర్మమూర్తి యై జన్మించి విమలయ♦శంబుఁ గాంచి
చెన్నమశ్రేష్ఠినాఁ ♦ జెలఁగుధర్మాత్మునిఁ గాంచనచేలుండు ♦ కాచుఁగాత;
మన్నెకులంబున ♦ మహితయశం బొప్పఁగా జన్మమొంది వి♦ఖ్యాతి మించ
ధర్మకార్యంబులఁ ♦ దాఁ జేయ నూహించు నట్టికొండారెడ్డి♦నారఘుకుల
వంశపాథోధిజై ♦ వాతృకుండు కృపాబ్ధియునగు రాముండు బా♦గొప్ప నేలు;
సోమిసెట్టిసువంశ ♦ మీమహి రాజిల్లునట్లు చేయుచును ధ♦ర్మాత్ముఁ డగుచు
నలరుకృష్ణమశ్రేష్ఠి ♦ నారఘురాముండు కాపాడుఁగావుతఁ♦గరుణ మెఱయఁ;
గలువాయకులము ని♦క్కంబుగా వెలయించు ధర్మచిత్తుని నిత్య♦నిర్మలయశు
రామిరెడ్డిని రఘు♦రాముండు కాపాడుఁగాక భాగ్యాదులఁ ♦ గరుణ నొసఁగి;
పప్పువంశంబునఁ ♦ బ్రభవిల్లి సాధు వై ధర్మాంతరంగుఁ డై ♦ నిర్మలయశ
మునఁ దగుపిచ్చిరె♦డ్డిని గాచుఁగాక శ్రీరామచంద్రుండు క♦రంబు కరుణ;
బుట్టికులంబును ♦ నెట్టన వృద్ధియై ధాత్రి నెసంగ ను♦ద్దామకీర్తి
యుతముగా నొనరింప ♦ నుంకించు వేంకటరామిరెడ్డిని నోము ♦ రామమూర్తి;
మెటుకూరుసత్కుల♦మిత్రుఁ డై దాత యై సద్గ్రంథపోషణా♦చతురుఁ డగుచు
రంజిల్లు శ్రీచెంచు♦రామిరెడ్డిని గాచుఁగావుతఁ గాంచన♦కమ్రచేలుఁ;
డలఘుగుణాఢ్యుని ♦ హర్షప్రదాలాపు దరిసికృష్ణయశ్రేష్ఠి ♦ నరసి రాముఁ
డఖిలభాగ్యము లబ్బ♦న ట్లన్వహంబును గాపాడుఁగావుతఁ ♦ గరుణఁబూని;
పత్తికులాబ్ధికు♦వలయమిత్రుం డయి సత్కార్యనిరతుఁ డై ♦ సతత మాత్మ
కులదైవతంబులఁ ♦ గూర్మిఁ బూజించుచు నర్థుల కర్థంబు ♦ లాదరమున
నుచితరీతి నొసంగి ♦ యొప్పెడుగురుమూర్తిశ్రేష్ఠిని గావుత ♦ శ్రీవిభుండు;
వడ్లపూటిసువంశ♦వరమౌక్తికంబును రామయ్యశ్రేష్ఠిని ♦ రామపాద
భక్తుని సుస్వాంతుఁ ♦ బరహితమతి రాముఁ డాదృతిఁ గాపాడు ♦ నన్వహంబు;
సుంకరవంశజు ♦ శుభగుణనిలయుని నాశ్రితవత్సలు ♦ నపగతేర్ష్యు
నరసయ్యశ్రేష్ఠిని ♦ నరహరి పెనుశిలస్థలవాసి గావుత ♦ దయ చెలంగ;
ధర్మగుణంబునఁ ♦ దద్దయు రాజిల్లి తోటవంశంబును ♦ బాటవముగ
యశమున నలరించు ♦ నాపాపిశ్రేష్ఠిని గవిని గావుత రఘు♦కాంతుఁ డెపుడు;
మేకపాటికులంబు ♦ మించఁగఁ జేయుచు మాట దప్పక సాగు♦మాడ్కిఁ జేయు
చిననరసారెడ్డి ♦ ఘనుని గాపాడుత భోగభాగ్యము లిచ్చి ♦ భుజగశయనుఁ;
డలఘుకృపాఢ్యుఁ డై ♦ యలరు కాకేనాగిరెడ్డికుమారు స♦ద్వృత్తిభాజు
మాన్యు శేషారెడ్డి ♦ క్ష్మాపుత్రికానాథుఁ డనుకంప నేలుత ♦ మన్వహంబు;
ధరణిఁ గాకేవంశ♦తల్లజుఁ డైనసుబ్బారెడ్డి కాత్మజుఁ ♦ డై రఘూత్త
మునిభక్తుఁ డై నిత్య♦మును ధర్మ మొనరించుచున్న శేషారెడ్డి ♦ నోము శౌరి;
మడకలవంశంబు ♦ మహి వర్ధిలం జేసి దేవతాభక్తిని ♦ దేజరిల్లు
నట్టి యెల్లారెడ్డి ♦ ననయంబు శ్రీరఘుకాంతుండు గాపాడుఁ♦గాతఁ బ్రీతి;

గోపిరెడ్డికులాబ్ధి♦కువలయాప్తుఁడు ధీరుఁ డైననారపురెడ్డి ♦ నాదరమున
బహుపుత్రపౌత్రాళి♦భాగ్యయుక్తుని జేయుఁగాక శ్రీహరికల♦కాల మెలమి;
నందిమండలము నా ♦ నిందుతుల్యకులంబు నుద్ధరింపఁగఁ బుట్టి♦యురుతరగుణ
విభవుఁ డై దాత యై ♦ వెలయుధీరుని సుబ్బరాజును గావుత ♦ రాఘవుండు;
చల్లాహ్వయకులంబు ♦ నుల్లసిల్లఁగఁ జేయుఘనుఁ డైనశేషి రె♦డ్డిని సుతాళి
ధనధాన్యసంయుతుఁ♦గను జేయుఁగావుత శ్రీరఘురాముండు ♦ గారవమున;
గూపిరెడ్డిసువంశ ♦ మేపగిదిఁ వృద్ధి నొందునో యట్టిగు♦ణోన్నతిఁ దగి
వెలయుకొండారెడ్డి ♦ సులలితవచనుని రఘురాముఁ డోముత♦రమణ సతము;
పల్లకొండాన్వయ♦భవుని వేంకటనరసయ్య నుదారగు♦ణాఢ్యు ధీరు
నరసి శ్రీరాఘవుం ♦ డాకరుణాఢ్యుండు కాపాడుఁగావుతఁ ♦ గాంక్షమీఱ;
గంగవరాన్వయ♦కంధిశీతాంశుండె యైనరామానాయుఁ ♦ డఖిలబంధు
హితుఁడు సజ్జనుఁడు వి♦హీనగర్వుఁడు రామకరుణావర్ధిలుఁగాక ♦ కడుసిరులను;
గంగవరకులంబుఁ♦గడఁగి వృద్ధిని బొందఁగాఁ బెంపుమీఱి స♦త్కార్యములను
జేయువెంగనునాయుఁ ♦ డాయపారకృపాబ్ధి రామునికరుణచే ♦ రహిఁ జెలఁగుత;
సిద్ధుశేషయ్య ప్ర♦సిద్ధకీర్తియుతుండు రాఘవపాదైక♦రతుఁడు ఘనుఁడు
శ్రీరామకరుణచేఁ ♦ గోరిక లొప్పంగ నభివృద్ధి నొందుత ♦ మన్వహంబు;
కనుమర్లకులజునిఁ ♦ గమ్రగుణాఢ్యుని సద్గుణసాంద్రుని ♦ సాధుభక్తుఁ
డనుఖ్యాతినొందిన ♦ యట్టియాగురునాథశ్రేష్ఠిని గావుత ♦ శ్రీవరుండు;
పాబోతుకులమును ♦ బరమకీర్తియుతంబుగాఁ జేయునూహచేఁ ♦ గ్రాలి దాత
యగుచిన్నరామయ్య♦యనుశ్రేష్ఠి శ్రీరాముఁ డాదృతి నోముత♦మన్వహంబు;
వీరెల్ల దృఢబుద్ధి ♦ నారాముకార్యంబు సాగింపఁగా నాకు ♦ సాయ మొప్పఁ

తే. జేసి రీధర్మమతులను ♦ శ్రీరఘుపతి
నిత్యభోగభాగ్యంబుల ♦ నిర్మలతర
యశము నాయుస్సు నొసఁగి ని♦త్యంబు గాచుఁ
గాత భక్తేష్టదాత నా ♦ ఖ్యాతి మిగుల.

# విషయసూచిక.

| విషయము. | | పుట. |
|---|---|---|

## అయోధ్యాకాండము.

శ్రీరస్తు.

## ఆంధ్ర

# శ్రీమద్రామాయణము

## ఇష్టదేవతాస్తుతి.

### సపరివారకృతిపతిస్తుతి.



మాన్యంబు కృపాకరంబు విమల♦శ్రేయఃప్రదానంబు సు
త్రామాదీశ్వరపూజితంబు శ్రుతిసం♦తానైకవేద్యంబు ని
త్యామోదప్రద మోంకృతిస్థిరపదా♦యత్తంబునై పొల్చు శ్రీ
రామబ్రహ్మముఁ గొల్తు నవ్యహము భ♦ద్రప్రాప్తికై భక్తిచేన్. 1

మ. కనకచ్ఛాయ తగన్ మనోజ్ఞతరమై ♦ గాంగేయరూపస్రగా
[1]ళిని జెన్నొందుచుఁ జంద్రశీతలత బా♦ళిన్ మించఁగా దివ్యకాం
తిని జెన్నారుచు హాటకౌఘమయమై ♦ దీపించురూపంబుతోఁ
గననౌ లక్ష్మిసమాఖ్య సీతఁ దలఁతుం ♦ గాంతాళి సిద్ధింపఁగన్. 2

సీ. పావకాననమున ♦ భక్తులకాంక్షల వెలయించి యామ్నాయ♦వినుతిఁ గాంచి
[2]క్షీరసాగరజనిఁ ♦ జిత్రంబుగా నొంది కనకమయాంగవి♦ఖ్యాతిఁ జెంది
శ్రీబీజసంయుక్త♦సిద్ధమంత్రస్థయై మించి మహోన్నతి ♦ మెళగించి
నిత్యపుష్టాహ్వయ ♦ నిర్మలకీర్తిని దనరారి యోగిచి♦త్తములఁ జేరి
తే. ధర్మసరసీరుహాంతర♦వసతిఁ జెలఁగి, నిర్మలాత్ములసహవాస♦నియతి మెలఁగి
యాశ్రితాళికి సురతరు♦వై యొసంగు,లక్ష్మి మా కిచ్చు నిత్యక♦ల్యాణములను.

మ. ధర నవతార మెత్తి ఖల♦దైత్యుల మ్రందఁగఁ జేసి ధర్మమున్
[3]స్థిరతరమై చెలంగునటు ♦ చేయఁగ లక్ష్మివిభుండు పూన న
త్తరుణమునందు నొంటిగను ♦ దాను వసించుట కష్టమంచు సో
దరుఁడయి లక్ష్మణాఖ్యఁ గని ♦ తద్దయుఁ గొల్చు ననంతు నెన్నెదన్. 4

---

1 శ్రీసూక్తప్రథమఋక్ప్రతిపాదితశ్రీదేవీరూప మిటఁ జెప్పఁబడినది. 2 శ్రీసూక్తప్రతిపాదితసమష్టిరూప మిట ననువదింపఁబడియె. 3 శ్రీరామావతారము విష్ణ్వవతారసర్వస్వభూతమను మతము నిది దెలుపును.

క. నరుఁడయి విష్ణువు పుట్టఁగ, భరతుఁడు శత్రుఘ్నుఁ డనఁగఁ ♦ బరఁగి నిరతిఁ ద
చ్చరణయుగంబును గొల్చెడు, దరచక్రములన్ సతంబు ♦ దలఁచెద భక్తిన్. 5

చ. జనిఁ గనినంతనే రవిని ♦ సత్ఫలమంచును మ్రింగఁబోయె నే
ఘనుఁ డవలీల నంబునిధిఁ ♦ గ్రన్నన దాఁటె మహాత్ముఁ డెవ్వఁ డో
య్యన గిరిఁ దెచ్చి లక్ష్మణుని ♦ నాదృతిమై బ్రదికించె నెవ్వఁ డా
యనిలజు రామభక్తుని గృ♦పాకరునిన్ హనుమంతుఁ గొల్చెదన్. 6

## శివస్తుతి.

చ. అనుపమచంద్రరేఖ విమ♦లాభరణంబయి మౌళి నొప్పఁ జ
క్కనిమణిభోగిహారములు ♦ కమ్రతరాంగమునం జెలంగ వే
దనికరసంస్తుతిం గనుచు ♦ దైవము తా నయి భక్తవారమున్
ఘనకృప నేలు శంకరు జ♦గత్పతిఁ గొల్చెద నిష్టసిద్ధికై. 7

## పరదేవీస్తుతి.

సీ. [1]తనదివ్యమహిమంబుఁ♦గనలేక మౌనులు విస్మయంబున వేద♦వితతిఁ బొగడఁ
దనమహత్తరశక్తి♦తత్త్వమెఱుంగలేకమరులు నీవె ది♦క్కనుచు వేఁడఁ
దనవైభవము నెన్నఁ ♦ దరముగాక రమాసరస్వతుల్ వరచామ♦రముల వీవఁ
దనవిక్రమం బింత ♦ యని యెఱుంగకహరిశతధృతిప్రముఖులు♦సతముగొలువ
తే. జగములకుఁ దల్లి శ్రీదేవి ♦ సర్వశక్తి, యనుచు సిద్ధులు భక్తిచేఁ♦దను నుతింప
వెలయు శంకరురాణి ని♦స్తులఘృణాఢ్యఁ, గొలుతుశివకామసుందరి♦లలితభక్తి.

చ. జగముల సృష్టిచేయ సుఖ♦సంపద వానిని బెంప నొక్కటం
[2]దగ నడఁపం ద్రిమూర్తులను ♦ దా వెలయించి విరాట్టుఁ గూడి సొం
పుగ విధివిష్ణుశంకరులు ♦ పూని యొనర్చెదు కృత్య మెంతొ ప్రీ
తిఁ గనుచుఁ జెన్నుమీఱు పర♦దేవి మహేశ్వరి నన్నుఁ బ్రోవుతన్. 9

మ. కలఁడే యొక్కఁడు నీకృపంగనక లో♦కంబందు వర్ధిల్ల ని
[3]స్తులశక్తిం దగు నావిరాట్పురుషుఁడే ♦ శుంభద్భవచ్ఛక్తిచేఁ
జలనంబుం గను లేకయున్న నొకటన్ ♦ స్థాణుత్వముం బొందఁడే
లలితా! యిట్టి నినున్ సదా దలఁచెదన్ ♦ లక్ష్యంబుగా నాత్మలోన్. 10

---

1 సర్వతంత్రప్రతిపాదిత శ్రీపరమేశ్వరీస్వరూప మిటఁ జెప్పఁబడినది. 2 సకలామ్నాయప్రోక్తమయి, యనాదియయి, సకలజగత్కారణత్వవిలసితమయిన యాదిశక్తిస్వరూప మిటఁ బ్రతిపాదితమని యెఱుంగనగు. 3 శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యప్రతిపాదితానాదిత్వవిభాసురలలితారూప మిటఁ బ్రతిపాదితమని గ్రహింపవలయు.

## బ్రహ్మస్తుతి.

చ. ఉరువదనాంబుజాతముల♦నుండి శ్రుతుల్ వెడలంగ వానిను
స్థిరవరభావముం దలంచి ♦ దేవమునుల్ కృతకృత్యులై నిరం
తరము మహత్త్వముం గనఁగఁ ♦ దాని జగంబుల కెల్లఁ గర్తయై
పరమకృపాబ్ధియై యలరు ♦ బ్రహ్మ చిరాయు వొసంగి ప్రోవుతన్. 11

## వాగ్వాదినీస్తుతి.

సీ. వాఙ్మన్మథపరాఖ్య♦వర్ణంబులే దేవి దివ్యమంత్రాకృతిఁ ♦ దెలుపుచుండు
[1]శ్రుత్యాగమౌఘముల్ ♦సొంపుగ నేయంబ భవ్యమహత్త్వంబుఁ♦బలుకుచుండుఁ
దుంబురునారదా♦దులు భక్తి నేతల్లి వాగ్వైభవంబును ♦ బాడుచుండు
రమరులు సిద్ధసా♦ధ్యాదులే జనయిత్రి కరుణైకదృష్టికై ♦ కాచియుండు
తే. రట్టి లోకైకపూజిత ♦ యబ్జభవుని, రాణి బంభరసమనీల♦వేణి వాణి
సరసపావనకవిత నొ♦సంగి నన్నుఁ, గరుణ చెలువారుచుండంగఁ♦గాచుఁగాత.

## గణపతిస్తుతి.

మ. ప్రత్యూహాచలతీక్ష్ణవజ్రనిభు భా♦స్వద్దంతివక్త్రున్ ముని
స్తుత్యప్రాభవు దేవతార్చితపదా♦బ్జుం గాంక్షితార్థప్రదున్
నిత్యోద్యద్భాసితతేజునిన్ గణపతిన్ ♦ నృత్యద్ద్విరేఫౌఘసం
యుత్యుత్తేజితగండభాగు మహనీ♦యుం గొల్తు నిష్టాప్తికై. 13

## గురుస్తుతి.

క. కరుణాకరునిన్ రాజ్ఞీ, వరకులపాథోధిచంద్రు ♦ బహువిధశాస్త్రో
త్కరపారంగతు యజ్వను, నరసింహాహ్వయుని సుకవి♦నాథుని గొలుతున్. 14

సీ. తనశిష్యులకు విద్య ♦ ననువుగ నేర్పుటే కృత్యంబుగా మది ♦ నెన్నుఘనుని
శాస్త్రౌఘచర్చ య♦జస్రము చేయుటే ధన్యంబటం చెంచు ♦ తత్త్వవేత్తఁ
బరులకు నుపకృతిఁ ♦ బాటించుచుంటయే పుణ్యంబటం చెంచు ♦ పూతచిత్తు
నంబికాంఘ్ర్యంబుజ♦ధ్యానం బొనర్చుటే పరమార్థమని యెంచు♦పండితేంద్రుఁ
తే. గరణరత్నాదిసద్గ్రంథ♦కర్త నన్ను, వేదచతుర్విదుని జేసి ♦ వెలసినట్టి
రమ్యతోపల్లివేంకట♦రామదైవ,విదుని గురువర్యుఁ బ్రార్థింతు ♦ మది సతంబు. 15

1 సర్వతంత్రప్రతిపాదితవాగ్వాదినీమంత్రరూప మిటఁ గనఁబఱుపఁబడినది.

## ⁜ సంస్కృతకవిస్తుతి. ⁜

సీ. ఆదిఁ గవిత్వంబు ♦ నవతరింపఁగఁ జేసినట్టి వాల్మీకిసం♦యమిని గొలిచి
శ్రుతుల విభాగించి ♦ శుభపురాణంబుల నొనరించినట్టి వ్యా♦సుని నుతించి
నీవె నేనని కాళి ♦ నెమ్మిఁ బల్కించిన కాళిదాసుని సాధు♦కవిని బొగడి
సురుచిరసత్పద♦స్ఫూర్తికవిత్వంబుఁ జక్కఁ జెప్పిన దండి ♦ సత్కరించి
తే. కాళిదయఁ గన్న భవభూతి♦కవినిదలఁచి, భామనంతయుఁ గ్రక్కుస♦బాణు నెన్ని
కల్పనానల్పుఁడైనమా♦ఘకవి నెంచి,యితరసంస్కృతకవులను♦ నెలమిఁ గొలుతు.

## ⁜ ఆంధ్రకవిస్తుతి. ⁜

చ. సరసపదార్థసంయుతిని ♦ జక్కఁగ భారత మాంధ్రభాష నె
వ్వరును రచింప రుచ్యమయి ♦ భాసిలునో యటు నిర్ణయించి యా
దరమున మూఁడుపర్వములు ♦ తత్క్రియ మెప్పు రచించి వ్యాకృతిన్
ధర వెలయించినట్టి కవి♦తల్లజు నన్నయభట్టుఁ గొల్చెదన్. 17

చ. తెనుఁగున నిట్టిదే కవిత ♦ తీర్చినయట్లుగ నుండునంచుఁ జ
క్కనిగతి శిష్టభారతముఁ ♦ గమ్రపదంబులఁ గూర్చి యజ్వయై
తనవరకీర్తిచంద్రుని స♦దా వెలయంగను జేసినట్టి తి
క్కనకవిధాత నామది స♦ఖండతరప్రతిభున్ స్మరించెదన్. 18

చ. ఇరువురుసత్కవుల్ వెలసి ♦ రీతఁడు మూఁడవవాఁ డటంచుఁ దన్
వరమతులెన్నఁగాఁ గృతుల ♦ బాగుగఁ గూరిచి భారతంబునన్
వరకవి చేయ శిష్టమగు♦భాగముఁ దెన్గొనరించి కీర్తిని
ధరణిని నిల్పినట్టి కవి♦తల్లజుఁ గొల్చెద శంభుదాసునిన్. 19

మ. మనుజేంద్రార్చితుఁడై మహామహిముఁడై ♦ మంత్రిప్రధానుండునై
ధనభోగంబులఁ బెంపుమీఱి కవిసం♦తానేంద్రుఁడై శైవుఁడై
ఘనకీర్తిప్రతిభాభిరాముఁడయి ని♦క్కం బీతఁడే యాంధ్రవా
ణిని గాపాడె నటంచు ఖ్యాతిఁ గనువా♦నిం గొల్తు శ్రీనాథునిన్. 20

సీ. తనకవిత్వముఁ గాంచి ♦ ఘనమతుల్ మేల్మేలటంచు నౌదలలూఁచి♦యాదరింపఁ
దనసాంద్రభక్తిని ♦ గని సుధీజను లెల్ల నానందసాగర♦మందు మునుఁగఁ
దనదునిర్మోహిత్వ♦మును గని యోగులు తా రభ్యసింపంగఁ ♦ దత్తఱపడఁ
దనదుస్వచ్ఛందజీ♦వనమును గని ధీరు లంద ఔరౌర యం ♦ చనుసరింప
తే. సుకవి భక్తుండు సుజ్ఞాని ♦ శుభచరిత్రుఁ
డగుచు భాగవతంబుఁ దెన్గుగ నొనర్చి

యొంటిమెట్ట శ్రీరామున ♦ కొసఁగినఘనుఁ
బోతనామాత్యుఁ దలఁతు నె♦ప్పుడు ముదమున. 21

క. హరిహరనాథపదాంబుజ, నిరతమనోబంభరుండు ♦ నృపపూజ్యుఁడునై
పరఁగు కవీశుని నాచన, వరకులజుని సోమనాథుఁ ♦ బ్రార్థింతు మదిన్. 22

చ. తనకవితారసాంబుధిని♦తాంతనిమగ్నమనస్కుఁడై తనం
తన కవిగండపెండెరము ♦ ధన్యుఁడ నైతి నటంచు సంఘిప్రీఁ జ
య్యన నలరించి భూమిపతి ♦ "యాంధ్రలసత్కవితాపితామహా"
యని పొగడంగఁ బెంపలరి♦నట్టి మహాత్ముని నెంతుఁ బెద్దనన్. 23

ఉ. ముద్దులు మూట గట్టునటు ♦ మోదమునించు నుడుల్ చెలంగఁ ద
న్బెద్దనఁ బోలె భూమిపతి ♦ వేడుకమై నుతిచేయఁగాఁ గృతుల్
తద్దయుఁ బాండితిన్ వెలసి ♦ తా నొనరించి యశంబునన్ దెసల్
దిద్దిన ముక్కుతిమ్మనను ♦ దివ్యకవీంద్రునిఁ బ్రస్తుతించెదన్. 24

సీ. ప్రతిపక్షవిద్వద్ద్వి♦రదసింహు నయ్యలరాజాన్వయుని నెన్ని ♦ రామభద్రు
సుకవివతంసుఁడై ♦ శోభిల్లు శ్రీరామరాజభూషణు మదిఁ ♦ బ్రస్తుతించి
యసదృశమహిమచే ♦ నాదిశంకరుని మెప్పించిన ధూర్జటిఁ ♦ బ్రీతిఁ దెలఁచి
రసవార్ధిగఁ గవిత ♦ రంజిల్లఁ జేసిన యలరామలింగని ♦ నభినుతించి
తే. మఱియుమహితాత్ములై గ్రంథ♦మండలముల, వెలయఁ జేసియశంబును♦నిలిపినట్టి
యాంధ్రసత్కవివర్యుల ♦ నాదరింతుఁ, బావనంబయిమత్కృతి♦వఱలు కొఱకు.

చ. కృతిపతి నిర్ణయించి కృతి ♦ నొల్లవిధంబులఁ బెంపునొందు నీ
క్షితి నని యాశిషంబు లిడి ♦ శీఘ్రమె రాముకృతిన్ రచింపు మీ
వితమున నంచుఁ బద్ధతుల ♦ వేడుకఁ దెల్పిన సత్కవీంద్రు, స
ద్వ్రతతినుతుం దలంచెదను ♦ వేదము వేంకటరాయశాస్త్రినిన్. 26

ఆ. పూర్వపద్ధతులను ♦ బోనాడ కాంధ్రభాష నిలఁ బెంపుఁ జేయు ♦ సంతసమున
గ్రంథరాజిఁ జేయు♦కవిపుంగవుల నెల్లఁ, దలఁతు సాధుమతుల ♦ నెలమిమీఱ.

ఉ. ఎవ్వరికేఁ బ్రమాదమును ♦ నేర్పడియుండును దాని మానియే
యివ్వసుధం జెలంగునరుఁ ♦ డేయెడఁ గన్పడఁ డెన్నిచూడ నే
నెవ్విధిఁ గాను బండితుఁడ ♦ నింకఁ బ్రమాదము లొందకుండునే
యివ్వి పొసంగినం గరుణ ♦ నారసి సత్కవులార! ప్రోవరే. 28

ఉ. భారత మాంధ్రభాషఁ గల ♦ భవ్యకృతీంద్రములందు నాద్యమై
సారపదప్రయోగగణ♦సాంద్రముగాఁ గనుపట్టు; నాసుధా

ధారలఁ గ్రోలునట్లు సుప♦దప్రయుతంబగు తద్రసంబునున్
సూరిజనుల్ ముదంబలర ♦ సొంపుగఁ ద్రావుదు రెల్లకాలమున్. 29

తే. భాస్కరుండును శ్రీనాథ♦పండితేంద్రుఁ, డల్లియొనరించినారు గ్రం♦థాళి శాస్త్ర
విహితమై తగ నవ్వాని ♦ విశ్వసించి, కవిత చెప్పిన ధాత్రిలో ♦ గణన కెక్కు.

ఉ. వారల సత్ప్రయోగముల ♦ భంగిని మీఱఁగ రాదు మీఱినన్
గౌరవ మింత లేదు కల♦కాలము నిందయె కల్గుఁ గావునన్
సారతదుక్తిధోరణుల ♦ చందము నెన్ని కృతుల్ రచించుచే
ధారణి సద్యశంబుఁ గను♦దారి మఱొక్కవిధంబుఁ జెల్లునే?. 31

చ. అని తలపోసి దేవతల ♦ నాత్మఁ దలంచి గురువ్రజంబునున్
మనమున సంస్తుతించి కవి♦మండనులం గొనియాడి వారిగ్రం
థనికరసత్ప్రయోగములఁ ♦ దద్దయుఁ బూనిక సంగ్రహించి చ
క్కనికృతిఁ జేయఁగాఁ దలఁచి ♦ గ్రంథములం దలపోయు చుండఁగన్. 32

సీ. వావిళ్లసద్వంశ♦వరమౌక్తికంబయి వేంకటేశ్వరశాస్త్రి ♦ విశ్వవినుత
విఖ్యాతినిం గాంచి ♦ వెలసెఁ; దదగ్రజుం డనఘుఁ డనంతనా♦రాయణార్యుఁ
డఖిలశాస్త్రజ్ఞుఁడై ♦ యాది, మహాశూరసంస్థానపండిత♦సత్కృతిఁ గని
మాతృభాషాసేవ ♦ మహితరీతిని జేయు కౌతూహలంబును ♦ గాంచి యాంధ్ర
సద్గ్రంథముద్రణ♦సమధికకృత్యంబు నిర్వహింపఁగఁ బూనె♦నేర్పు మెఱయ;

తే. వేంకటేశ్వరశాస్త్రికి ♦ వినుతవాద,ఖండనోద్దండునకు సయ్యెఁ ♦ గాంత మంగ
మాంబనీతివిభూషణ♦మాయిరువుర, కాత్మజుఁడు గల్గె విద్వదా♦రాధ్యుఁడగుచు.

క. ఘనమతి భాషాద్వయవిదుఁ, డనుకంపానీరరాశి ♦ యాశ్రితసుజనా
వనచతురుఁడు క్షితి వెలసెను, వినుతమహాకీర్తి యగుచు ♦ విబుధేంద్రుండై.

క. తను రామస్వామిసమా,ఖ్యను బిల్వఁగ సూరివినుతుఁ♦డై పరమేశాం
ఘ్రినిహితమతియై చెలఁగెను;, ఘనమతి కాపండితేంద్ర♦గణవినుతునకున్. 35

చ. పతిహితచర్యయే తనకు ♦ భద్రవిభూషణమై చెలంగ ను
న్నతిమతి నర్థిబృందము ల♦నారత మెంతయు వేడ్కరాఁగ నా
దృతిమెయి నన్నదానమున ♦ నేర్పడఁ దన్పుచు సాధుశీలయై
సతి యలరారె భూతదయ ♦ చాలఁగ నొప్పఁగ సద్గుణాఢ్యయై. 36

క. జ్ఞానాంబ యనెడు నాహ్వయ, మూని సతీరత్న మామె ♦ యొప్పి కనియె న
త్సూనునిఁ గుమారునిఁ బార్వతి, తా నెలమిం గన్నయట్లు; ♦ తత్తనయుండున్.

చ. తననుగుణప్రసూనము న♦తంబు మనోహరరీతిఁ బొల్చి స
జ్జననుతిఁ గాంచి దిగ్యువతి♦చారుశిరోరుహభూషణంబుగా
దనరి యతుల్యమై తగువి♦ధంబున నొప్పఁగ నర్థిచాతకా
వనఘనుఁడై మహానుగుణ♦వారమనోహరుఁడై చెలంగుచున్. 38

సీ. వావిళ్లసద్వంశ♦వార్ధిసుధాంశుఁడై భాషాప్రపంచస♦త్పాలనైక
నిరతుఁడై యచ్ఛిన్న♦నియతిసమాదృతి నెసఁగి పండితసత్క♦వీశ్వరాళి
బహువిధంబుల; గౌర♦వంబున నలరించి యానందపరవశుం♦ డగుచు వెలయు
వేంకటేశ్వరశాస్త్రి ♦ వేడుక నొకనాఁడు తనపంక్తి భుజియించు♦ననుసమాదృ
తే. తినిగనుంగొని బ్రహ్మాండ♦ఘనపురాణ, మునురచించితి వాంధ్రభా♦షనుదగంగ
నాదికావ్యముఁ దెనిఁగింప♦వయ్యెభవ్య, భణితిసత్కృత్యమిదియని♦పరమనియతి.

చ. అని పురికొల్ప నయ్యనఘు♦నానతి కీర్తికరంబు పుణ్యదం
బునగునటన్న యాశయముఁ ♦ బూని మహాత్మక! యట్లె రాముగా
థను దెనిఁగింతు నన్నఁ బ్రము♦దంబున వేగ రచింపు మెప్పుడో
యనకు మటంచు నన్నలరు♦నట్లుగఁ జేసె ననూనమైత్రితోన్. 40

ఉ. అంతియకాక ముద్రణస♦హాయముఁ జక్కఁగఁ జేయువాఁడ నీ
వింతయుఁ జింతనొందఁ దగ ♦ దేఁ గలుగంగ నటంచు నాదృతిం
బంతము మీఱఁ బల్కి తన♦వాక్కు ఫలింపఁగఁ జేసె సత్యమా
వంతయుఁ దప్పకుండ సుజ♦నావనదక్షత పెంపుమీఱఁగన్. 41

చ. అనుజునియట్లు నన్నుఁ గన ♦ నాదృతి మీఱఁగఁ బిల్వఁబంచు నేఁ
గనఁబడ సంతసించుఁ గల♦కాలము నాదగు చెంతనుండుమా
యని మృదుభాషణంబు లొగి ♦ నాడును, వీడుట కాత్మనోడు నా
యనఘుని నెన్నఁగా వశమె ♦ యల్పతరోక్తుల నించుకేనియున్. 42

చ. కపట మొకింతలేని దయ ♦ గన్పడ రాముకృతిన్ రచింపుమా
యిపుడని భుక్తికాలమున ♦ నెంతయు నాదృతిఁ బల్క సంతసం
బపరిమితంబుగాఁ బొలయ ♦ నైతిని ధన్యుఁడ నేఁటి కంచు రా
ముపదసరోరుహంబులకు ♦ మ్రొక్కి "తథాస్తు"ని వారిచెంగటన్. 43

సీ. పని విని కడపకుఁ ♦ జనుదెంచి శ్రీగార్లదిన్నెకులాంబుని♦ధిన్ విధుండు
నా నుద్భవంబంది ♦ నయహితవృత్తియై న్యాయవాదియు నౌచు♦నలరుచున్న
రమ్యసద్గుణసాంద్రు ♦ రామేశ్వరామాత్యు సౌధంబున వసించి ♦ సంతసమున
నాయనమన్నన ♦ లందుచు నాంగ్లేయపాఠశాలఁ దెనుంగు♦భాష నేర్పు

వృత్తిచే సంసార ♦ మెట్లో సాగించుచు రామాయణంబు నాం♦ధ్ర మొనరింపఁ
బూనితి; పావన♦మానంబునన్ నాదు వయసుముప్పదియైద♦వ దగుచుండఁ
బెద్దలయనుమతిఁ ♦ బ్రియమార మొదలిడి వర్షత్రయంబు నా♦పైని మాన
దశకంబు లెక్కింపఁ ♦ దగునంతకాలంబునను బూర్తి నొందించి♦తిని బరేశు

తే. కరుణ; నిట్టులు సజ్జనుల్ ♦ నిరుపమప్రి,యంబునం బ్రోత్సహింపది♦వ్యతమగాథ
యనుయశంబును గాంచిన♦యట్టిరాము, చరితమును జేయ నెంచిన♦స్వాంతమలర.

సీ. హాలాస్యమాహాత్మ్య ♦ మనుస్కాందభాగంబు నాంధ్రీకరించితి ♦ నాదియందు
నవ్వీలలలితాంబ ♦ దగునుపాఖ్యానంబుఁ దెనిఁగించినాఁడను ♦ దేశికాజ్ఞఁ
బండితేంద్రానుజ్ఞఁ ♦ బాటించి బ్రహ్మాండమనుపురాణముఁ జేసి♦తిని దెనుంగు
వీనియంతరముల ♦ విమలగాథలఁ గొని చిఱుతగ్రంథములుగఁ ♦ జేసినాఁడ

తే. నాదికావ్యంబునాఁగ వి♦ఖ్యాతిఁ గాంచి
యిహపరసుఖంబుల నొసంగు ♦ నీపవిత్ర
రమ్యరామాయణంబు నాం♦ధ్ర మొనరింతు
శ్రీరఘూత్తముఁ గృతిపతిఁ ♦ జేసి యిపుడు. 45

రా మా య ణ ప్ర శం స.

ఉత్పలమాలిక:—

ఎందఱో తెన్గొనర్చి రిపు ♦ డేలొకొ? యిట్టిప్రయత్నమంచు న
న్నందురుగాక నిశ్చయము ♦ యీా నొకభంగిఁ దలంపఁ, గాని నా
ముందటివార లిట్టి విధ♦ముం గయికొన్నయెడన్ జగంబునన్
బృందముగాఁగ రామకథ ♦ లిన్నివిధంబుల నుండకుండుఁగా;?
యిందఱె తెన్గుఁ జేయుఁదగు ♦ నీకృతిసంచు నియామ మున్నదే?
యెందఱు రామచంద్రుని య♦హీనకథాసుధఁ గ్రోలి తృప్తినిం
బొందెడుపుణ్యముం గనుచుఁ ♦ బొల్తురొ వారల కిట్టి కావ్య మిం
పొందఁగఁ జేయుభాగ్య మిల ♦ నొక్కవిధంబునఁ గల్గు; మానిరా
డ్బృందవరుండు వాల్మికియు ♦ విస్తృతసారతరార్థయుక్తిచే
సుందరమైన యీాకృతిని ♦ శోభిలఁ జేసె జగంబునందు; నే
మందుఁడుగాని దాని నొక♦మాఱు తలంచిన సాధుచిత్తుఁడై
పొందును విష్ణులోకమును; ♦ బూనిక మీఱఁ దెనుంగుసేయుఁ బూ
నందగు భాగ్యమే గలిగి♦నన్ మఱి చెప్పఁగనేల? కాన నె
ల్లందఱు తత్ప్రయత్నముల ♦ నింపుగఁ జేసిన నంతమేలె యాఁ;
జందరు నెందఱేఁ గనిసఁ ♦ జాలు నటంచుఁ దలంతురే? జగ
త్సుందరు రామునిం బొగడు♦చున్ మదిని స్మరియించుచుండినన్

బొందును బుణ్యరాసులును ♦ బూజ్యతరంబగు ముక్తి; కావునన్
డెందములోఁ దలంచుచుఁ గ♦డిందిముదంబునఁ దత్కథన్ సతం
బుం దమి వ్రాయుచున్ మఱియుఁ ♦ బూజ్యతదర్థము నెంచుచుండుటే
యందము, తృప్తినిం గనఁగ ♦ నౌనౌకా? యెవ్వరి కైన నిద్ధరన్. 46

క. అనుచుం దలఁచుచు రామా,యణమును బఠియించి దాని♦వ్యాఖ్యలఁ జక్కం
గను బాఱఁజూచి నెమ్మన,మునయందున్ వానియర్థ♦మును గైకొనుచున్. 47

తే. పెక్కు వ్యాఖ్యలు భావముల్♦పెక్కుగతులఁ, దెల్పనరిపడకుండుమ♦దిందలంప
నొక్కదానికి వేఱొకఁ♦డొక్కచోట,నన్నియునుగూర్చి తెనిఁగింప♦నగునె?సరిగ.

క. జననీభావముఁ గనఁబఱచు నొక్కవిద్వాంసుఁ డట్టి♦చోటనె జక్కం
గను భార్యయనెడు భావముఁ, గనఁబఱచుమఱొక్కసూరి♦కడుఁబాండితిచేన్.

ఆ. అట్టితావులందు ♦ నయ్యర్థములు రెండు, సరిగ నన్వయించు♦చందమునను
దెనుఁగుచేయుటనఁగఁ ♦ జనదె? కష్టం బన, దీని నెఱుఁగరొక్కొ? ♦ ధీరులెల్ల.

సీ. గోవిందరాజొక్క ♦ గూఢార్థమును లాగు నట మహేశ్వరతీర్థుఁ ♦ డర్థమొండు
దెలువు నట్లే యిత♦రులు వేఱుభావంబుఁ గనఁ బఱతురు వానిఁ♦ దెనుఁగునందుఁ
బలుక శక్యముగాదు ♦ పలుతావులం దట్లు కనఁబడుఁగాన నే♦నును శ్రమించి
వ్యాఖ్యామహార్థంబు ♦ బాగుగ గ్రహియించి సందర్భశుద్ధిని ♦ జక్క నెఱిఁగి
తే. తనదుపైత్యంబుకొంతయుఁ♦దాళ్లపాక,వారిపైత్యంబుకొంతయున్ ♦భంగినిర్వ
రనువదించినయర్థంబు♦గనఁబడునటు,కూర్చినాభావమునుగొంత♦చేర్చిమఱియు.

క. మునివాక్కులఁ గల యర్థం
బును వ్యర్థముచేయ కొక్క ♦ పోలికను దెనుం
గునఁ గూర్చితి; వ్యాఖ్యాద్వయ
మునఁ గల్గిన యర్థయుగము ♦ మునుకొని యొకచోన్. 52

క. తెలియంగ లలితపదములఁ, బలికితి మూలార్థమునకు ♦ భంగమ దెట్టుల్
గలుగంగనీక పాండితి, గలిగినయందాఁకఁ గూర్పఁ ♦ గల్గితిఁ జుండీ!. 53

శా. పారావారముభంగి నిమ్నమగు తా♦త్పర్యంబునం బొల్చుచున్
పారస్పారపదార్థయోగమున మిం♦చం జాలి చెన్నారుచున్
శ్రీరామాయణ మొప్పు దానిఁ దెనుఁగుం ♦ జేయంగ నర్హుండనే?
శ్రీరాముండె సహాయుఁ డన్న నియతిం ♦ జిత్తంబు తృప్తిం గనన్. 54

మ. పరదేవీకరుణైకదృష్టి పొలయన్ ♦ భవ్యంబుగాఁ జేయ నా
తరమే? యంచుఁ దలంచి మానక యనం♦తంబైన భక్త్యున్నతిం
బరమంబై తగు రాముగాథఁ దెనిఁగిం♦పం బూనితిన్ సత్కవీ
శ్వరులారా! కరుణింపుఁ డీకృతి సభా♦స్తారాదృతిం బొందఁగన్. 55

క. అనుచున్ శ్రీమద్రామా,యణమును దెనిఁగించు నాశ♦యం బిది యనుచున్
మనమున సిద్ధాంతముఁ జ,క్కనిభంగి నొనర్చుకొని ని♦కామముదమునన్. 56

తే. పెద్ద లుపదేశ మిచ్చి రీ♦ ప్్రియతమంపుఁ
గృతిని రామాంకితము చేయు ♦ మీవటంచు
మేలు మేలిది దీనిని ♦ మించుశుభము
గలదె? జగమందు వెదకినఁ ♦ గాని యెపుడు. 57

క. కృతి యాదికావ్యమఁట శ్రీ,పతి రాముం డిట్టికృతికిఁ ♦ బతియగునఁట పం
డితులాజ్ఞ చేసిరఁట ఫల, మతిశయమఁట కొదువయేమి ♦ యగు నా కింకన్. 58

సీ. శాంతశృంగారాది♦సకలరసంబులే యాభరణాళిగా ♦ నలవరించి
నిరుపమాలంకార♦నియతిఁ బెంపొందించి శాస్త్రపద్ధతులను ♦ సంస్కరించి
గంభీరభావముల్ ♦ గలుగంగ వెలయించి పాకశయ్యాశుద్ధిఁ ♦ బ్రౌఢఁ జేసి
గతివిశేషములఁ జ♦క్కనిరీతిగాఁ బెంచి సందర్భసంశుద్ధి ♦ సంతరించి
ఆ. కృతికుమారి దీని ♦ జతనంబు మీఱంగ, సకలవిధములను నె♦సంగఁ జేసి
రామచంద్రునకును ♦ రమణ నర్పించితిఁ, బరమమంగళంబు ♦ బడయఁ గోరి.

తే. ఏకపత్నీవ్రతుండ నా ♦ కేల యిట్టి, కృతినితంబిని యనఁబోకు ♦ క్షితిపతీంద్ర!
ధరణితనయ యయోనిజ♦తనరు నెట్లొ, యట్టి దేసుమ్ము స్థిరతర♦ఖ్యాతినిదియు.

క. ఇసుమంతయైన దోసము, పొసఁగదుగద దీనియందుఁ ♦ బూజ్యయశమునన్
దెసలెల్ల నానరించును, ననమతరాకృతిని వెలయు ♦ నవని సతంబున్. 61

చ. అనిరఘురామచంద్రు, విన♦యంబున వేఁడి మహాత్ములాజ్ఞ యి
చ్చినవిధ మెల్ల నామదిని ♦ జేర్చి సునిశ్చలమానసుండనై
తను విది కల్గినందులకు ♦ ధన్యుఁడనైతిని నేఁటికంచు నెం
చి నియతి; నింక నాకథను ♦ జెప్పెద నించుక మూఁడుమాటలన్. 62

### కృతికర్తృవంశము.

తే. ఎందు సుకవులునద్యశం♦బొందియుండి, నారొకవిధాతయగుతిక్క♦నయుజనించి
ప్రథితకీర్తిని మించి భా♦రతముఁదెన్గుఁ, జేసెనో మండలం బది♦క్షితిఁజెలంగు.

తే. అదియె నెల్లూరుమండలం ♦ బందునున్న
వారు నెఱజాణులనఁగఁ బే♦ర్వడసి యుంట
యెల్లరికిఁ దెల్లమే కద ♦ యల్లపురికిఁ
బశ్చిమంబునఁ దగుఁ గలు♦వాయ యనఁగ. 63

క. జననంబందితిఁ దత్పురి, మును పచ్చటఁ గొంతకాల♦ము వసించిరి నా
జనకునిపూర్వు లదేటికొ, చనుదెంచిరి వారు కడప♦సన్నిధి నుండన్. 64

సీ. చారుపినాకినీ♦తీరమ్మునం దగి ఖ్యాతినొందినయట్టి ♦ కడపపురికి
నీశాన్యమున నాలు♦గే యామడలమేర రంజిల్లు నగ్రహా♦రం బొకండు
తృణకాష్ఠజలసమృ♦ద్ధిని గాంచి వేంకటరామపురంబు నా ♦ రమ్యమగుచు
నలరారు నప్పురి ♦ వెలసిరి మావారు జనమంచివారన ♦ దెనుఁగునాటి
తే. ధాత్రిసురు; లింక మత్ప్రపి♦తామహుండు
సూరుభట్టన వెలసెను ♦ శ్రుతివిదగ్ర్యుఁ
డతని తనయుండు వేంకటే♦శావధాని
యతనికిని బేరమాంబ భా♦ర్యయయి వెలసె. 65



క. పతిభక్తియె తనకున్నత,గతి యను నిశ్చయము తనరఁ♦గాఁ దత్పతి యీ
క్షితిఁ గీర్తనీయసుగుణా,కృతియగుచుం బేరమాంబ ♦ యెసఁగె ననమతన్.

సీ. ఆదంపతుల కిద్ద♦ఱాత్మభవుల్ గల్గి రందు సుబ్రహ్మణ్యుఁ ♦ డగ్రజన్ముఁ
డతనిసోదరుఁడు శే♦షాహ్వయుం డీయిర్వు రమలచిత్తులు భవ్య♦యశులు దేవ
దేవాంఘ్రిపంకజా♦ధీనమానసులునై వెలసిరి; శేషార్యుఁ ♦ డెలమిఁ గాంచె
బుత్త్రు లక్ష్మీశబ్ద♦పూర్వకనారాయణాహ్వయు; నగ్రజుం ♦ డైన యట్టి
తే. భూరికీర్తి సుబ్రహ్మణ్య♦బుధవరేణ్యుఁ
డఖిలజననుతశీల భ♦వ్యగుణజాల
నుభయకులకీర్తిదాయిని ♦ నురుదయార్ద్ర
హృదయఁ గామాక్షి యనుసతి ♦ నెలమిమిగుల. 67



క. పెండిలియై సద్గుణగణ,మండితుఁ డాభూసురుండు ♦ మహిమం జేసెన్
ఖండేందుధరప్రియము ల,ఖండఫలప్రదములు నగు ♦ కార్యములఁ దగన్. 68

ఆ. అట్టిదంపతులకు ♦ నాత్మజ లిర్వురు, తనయుఁ డొక్కఁ డగ్ర♦తనయ సుబ్బ
మాంబ యన్నపూర్ణ ♦ యనుజాత శేషాద్రి,యనెడు నేను వారి ♦ కవరజుండ.

క. జని నేఁ గలువాయపురం,బునఁ గాంచితి నన్నుఁ బ్రీతిఁ ♦ బూనినమదిఁ బెం
చెను మేనమామ ఖ్యాతిం, గని వేంకటసుబ్బయాఖ్యుఁ ♦ గనిన మహితుఁడే.

సీ. పిన్నతండ్రియు నన్నుఁ ♦ బ్రియమునరక్షించె మాతులుం డప్పు డ♦మర్త్యలోక
మున కేగియుంట న ♦ న్ననునయంబున గౌరిపెద్దివంశ్యుఁడయి ♦ విమలచిత్తుఁ
డలరి కాపాడె రా♦మయ్య రెండవబావ జననిలేనికొఱంత ♦ గనఁబడనటు;
లంతియకాక వి♦ద్యార్థినై కాశ్యాదిదూరస్థలంబులఁ ♦ దోఁచునన్నుఁ
గనఁజాల కార్తిని ♦ గనునాదుతండ్రికిఁ దగుసహాయ మొసంగి ♦ దయ చెలంగ
నన్నును ద్రవ్యదా♦నంబున నలరించి యుద్వాహమున కెంతొ ♦ యుపకరించి
పిన్నవాఁడనైయైనఁ ♦ బెద్దగా నను నెంచి చెప్పినచొప్పును ♦ దప్పకుండ
వర్తించె; నీవిధి ♦ బంధుపోషణమునఁ ♦ దనరారి గురుపాద♦వనరుహముల

తే. గొలిచి శ్రీదేవి సంప్రీతిఁ ♦ దలఁచి పెద్ద, లనుమతింపఁగ నాదికా♦వ్యమునుదీని
దెలుఁగొనర్చిమహాఫల ♦ మెలమిఁ గోరి, యమలభక్తిని శేషాద్రి♦యనెడు నేను.

## ✥ కృతి సమర్పణము. ✥

క. ఓంకారరూపునకుఁ బటు, హుంకారప్రశమితారి♦యోధునకు మన
స్సంకటహరునకు విగతశ, శంకునకున్ సుగుణగణవి♦లాసయశునకున్. 72

క. అండజవిభువాహునకు, ఖండితశివచాపునకును ♦ ఖరముఖ్యమహో
ద్దండాసురయమునకుఁ బ్ర,హ్మాండగణాధీశ్వరున క♦హార్యబలునకున్. 73

క. ఉద్యద్దినేశబింబ, ప్రద్యోతాంగునకు యోగి♦రాడున్నతహృ
ద్విద్యోతమానరూపున, కాద్యునకున్ సర్వదేవ♦తాధీశునకున్. 74

క. కరుణాపారావారున, కరుణాన్వయవార్ధిశశికి ♦ హరిహయముఖని
ర్జరసంఘార్చితపదునకు, హరికిన్ శ్రీపతికి దశర♦థాత్మజమణికిన్. 75

క. ధారాధరరూపునకు గ, భీరాశయునకును భక్త♦భీతిహరునకున్
మారుతిసేవితపదునకు, శ్రీరామున కఖిలమాని♦చిత్తవసతికిన్. 76

తే. భక్తవాంఛాప్రదుండను ♦ పరమకీర్తిఁ, గన్నపరమేశునకు శ్రుతి♦గమ్యునకును
నర్పణంబుగఁ దెనిఁగించి♦నట్టి యీమ, హాకృతికి నెవ్విధంబున ♦ నాది యనిన.

శుభమస్తు.

# ఆంధ్ర శ్రీమద్రామాయణము.

## బాలకాండము - ౧ సర్గము.



క. మునివరుఁడు తపస్స్వాధ్యా,యనిరతుఁడై పండితాళి♦యం దుత్తముఁడై
తనరెడు నారదుఁ బ్రశ్నిం,చెను వాల్మీకి యనుతపస్వి♦చిత్తం బలరన్. ౧ 1

క. ఈవసుధాస్థలి నిత్తఱి, నేవాఁడు ప్రతాపశాలి ♦ యెవఁడు గుణయుతుం
డేవాఁడు సత్యవచనుం, డేవాఁ డగు ధర్మవేత్త ♦ దృఢనిశ్చయుఁడున్. ౨ 2

తే. సర్వభూతహితుండును ♦ సచ్చరిత్ర
యుక్తుఁడును బ్రియదర్శనుం ♦ డురుతరజ్ఞుఁ
డతిసమర్థుఁడు జితకోపుఁ ♦ డాత్మవిదుఁడు
కాంతియుతుఁడు కృతజ్ఞుఁడై ♦ క్రాలు నెవఁడు. ౩ 3

క. అనసూయుం డెవ్వాఁ డగు, జనసంక్షయకాలమందు ♦ జాతామర్షం
బున నొప్పు నెవని కమరులు,నయము భయ మందుచుందు♦రాత్మలయందున్.

తే. ఇద్ది నే వినఁ గోరఁగ ♦ నెంతొ కౌతు,కంబు గలవాఁడ నోముని♦కాంత, యిట్టి
నరు నెఱుంగ సమర్థుండ♦వరయ నీవె,యనెడు వాల్మీకిప్రశ్నవా♦క్యము విని తగ.

తే. మూఁడులోకంబుల నెఱుంగు ♦ మునివరుండు
నారదాహ్వయుఁ డోముని♦నాథ, వినుము
యనుచు నామంత్రణముచేసి ♦ హర్ష మెంతొ
యతిశయంబుగఁ బొంగ ని ♦ ట్లనియె నపుడు. ౬ 6

చ. విను మునివర్య! నీ విచటఁ ♦ బేర్కొనినట్టి గుణంబులెల్ల మే
దినిఁ గడు దుర్లభంబులు మ♦దిం దలపోసి వచింతు నిట్టివా
ఘనగుణముల్ కలట్టినరు ♦ గాఢపరాక్రమశాలి రాముఁ డం
చును జనముల్ తనుం బిలువ ♦ శోభిలు; ధీరుఁడు రశ్మిమంతుఁడున్. ౭ 7

సీ. ఇక్ష్వాకు వనఁబడు ♦ పృథ్వీశకులమున జనియించి, వశియయి ♦ శత్రుసూద
నుఁడు, వాగ్మి, బుద్ధిమం♦తుఁడు నీతిమంతుఁడు నర్థవంతుఁడు నియ♦తాత్మకుండు

N. B.—పద్యాంతమున నున్న తెనుఁగుసంఖ్య మూలశ్లోకమును గుర్తింపఁజేయు.

విపులాంసకుండును◆వితతబాహువు,సుహాహనువు, కంబుగ్రీవుఁ◆డరియముండు
దీర్ఘతూణీరుండు ◆ దీర్ఘవక్షుండు, గూఢశత్రు, వాజానుహ◆స్తద్వయుండు

తే. చారుశీర్షుండు, విక్రమ ◆ సంయుతుండు
హారిఫాలుఁడు, సమవిభ◆క్తాంగుఁడు, సముఁ
డతులసుస్నిగ్ధవర్ణుండు ◆ నతివిశాల
వక్షుఁడు, విశాలదృశుఁడు సు◆లక్షణుండు. ౧౧ 8

క. అతిశయలక్ష్మీవంతుఁడు, ప్రతాపఖని, ధర్మవిదుఁడు ◆ ప్రజలకు హితసు
సతతముగోరెడుపుణ్యుఁడు,ఋతవాక్ప్రియుఁడునుయశస్వి◆యాస్యఁగశుచియున్.

తే. జ్ఞానసంపన్నుఁడు సుబుద్ధి◆సంయుతుండు
వశ్యుఁడు ప్రజాధినాథుఁడు ◆ ద్వంద్వసముఁడు
శ్రీయుతుఁడు, ధాత, రిపుహర్త ◆ జీవలోక
రక్షకుండును, ధర్మసం◆రక్షకుండు. ౧౩ 10

క. తనధర్మము రక్షించుచుఁ, దనప్రజలను గాచి వేద◆తత్త్వ మెఱిఁగి వే
దనికరమున సంగము లై, తన రెడు [1]శిక్షాదిషట్క◆తత్త్వజ్ఞుం డై. ౧౪ 11

క. వెలయు ధనుర్వేదంబున, సలఘుతరప్రౌఢిమమున ◆ నలరుచు శాస్త్రం
బులయర్థతత్త్వమెఱుఁగుచు,నిలఁ[2] బ్రతిభానంబుస్మృతియు◆నెసఁగుచునుండన్.

తే. సర్వలోకప్రియుండయి◆సాధువగుచుఁ,గడునదీనాత్ముఁడయివిచక్ష◆ణుఁడునయి తగి
సింధువులచే సముద్రంబు◆సేవితమగు, నట్లుపుడు సజ్జనౌఘుస◆మావృతుఁడయి.

క. ఎపు డేకప్రియదర్శనుఁ, డు పూజ్యతముఁ డఖిలసుగుణుఁ◆డును, గోసల దే
శపుఁబతి యనుంగుఁబత్నికి, నపరిమితానందవృద్ధి ◆ నలరించి తగున్. ౧౬ 14

తే. సర్వసముఁ డై ప్రకాశించి ◆ క్షమ నతండు
సారగాంభీర్యమున వార్ధి ◆ సరణి మించి
ధైర్యమున హిమవంతుఁ డై ◆ తనరి, వీర్య
మునఁ దగఁ విష్ణుతుల్యుఁడై ◆ ఘనత మీఱి. ౧౭ 15

క. సోమునివలెఁ బ్రియదర్శనుఁ, డై మేదినితోడ నోర్పు◆నందును, గిన్క
భీమానలుతో,ఋతమునఁ, దామాఱట ధర్మతోడఁ◆దగ నమునఁగుచున్. ౧౮

తే. అలధనదుతోడఁ ద్యాగంబు◆నందు సాటి
నంది యేవంవిధగుణగ◆ణాభియుక్తుఁ
డగుచు సత్యపరాక్రముం ◆ డగుచు, జ్యేష్ఠుఁ
డగుచు శ్రేష్ఠగుణాన్వితుం ◆ డగుచు వెలసి. ౧౯ 17

1 శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, జ్యోతిషము, ఛందస్సు. ఇవి వేదాంగములు.

2 ప్రతిభానము=వ్యవహారకాలమునందుఁ బ్రాగశ్రుతశ్రుతార్థము స్ఫురించుట. అదిగలవాఁడు.

క. తనరారెడు శ్రీరామునిఁ, దనప్రియసుతు దశరథుండు ♦ తమిఁ బ్రకృతిజనా
వన మెప్పుడు కోరెడువాఁ, డని ప్రకృతిప్రియసువాంఛ♦నాత్మం గనుచున్. ౨౦

తే. యౌవరాజ్యపదంబున ♦ నతనిఁ గూర్పఁ, బ్రీతిచే నిచ్ఛయించె నా ♦ భూతలపతి;
యతని యభిషేకసంభార♦మంతఁ గాంచి, రాజు ప్రియపత్ని కేకయ♦రాజపుత్రి.

క. మును వరములఁ బతివలనం, గొని యున్నదిగాన దేవి♦కోరిక యాచిం
చెను భర్త నిట్లు రాముని, వనమున వాసం బొనర్పఁ♦బనుపు జవమునన్. ౨౨

క. భరతున కభిషేకంబును, జరపుము నాధర్మపాశ♦సంయుతుఁడై యా
నరపతి ఋతవచనుఁడు గను,క రాముని బ్రియకుమారుఁ ♦ గానకుఁ బంపెన్.

క. పితృనిర్దేశమువలనన్, బ్రతిజ్ఞనుం గావ వీర♦వరుఁ డగు రాముం
డు తరలి కేకయపుత్రీ, హితకారణ మగుటవలన ♦ నేగెన్ వనికిన్. ౨౪ 22

చ. వని కిటు లేగు నాతనిని ♦ భ్రాతకుఁ గూర్చెడు రాము మైత్రిచేఁ
దనజనయిత్రి కెంతయు ము♦దం బొనఁగూర్చెడు లక్ష్మణుండు ప్రీ
తిని వినయాన్వితుం డగుచుఁ ♦ దృప్తి సహోదరధర్మ మన్నిటం
గనఁబడఁ జేయుచున్ సఖుఁడు ♦ గావున రాముని వెంట నేగెఁ దాన్. ౨౫ 23

సీ. జనకునికులమున ♦ జనియించి, దేవమాయవలె నిర్మింపంగ ♦ నైనసుదతి
సర్వలక్షణయుక్త ♦ సాధ్వీమణులలోన నుత్తమనారి నా ♦ నొప్పు గన్న
చారుశీలయు నిత్య ♦ మారామునకుఁ బ్రాణపద మైన ప్రియతమ♦పత్నిసీత
యును రాము ననుసరిం♦చెను,జంద్రు రోహిణి యనుసరించు న దెట్టు♦లట్లు;పౌరు
ఆ. లనుఁగుఁదండ్రి దశర♦థావనీపతియు దూ,రంబు తన్నుఁగూడి ♦ రాఁగ నరిగి
యంత శృంగిబేర ♦ మనుపురమ్మున సూతు, గంగ యొద్దఁ జేరఁ♦గానె విడిచె.

తే. బోయలకు రాజు ప్రియుఁడునై ♦ పొలుచు గుహుని
ధర్మమతి యగు రాముండు ♦ తాఁ జని కని
యతనితోడను సతితోడ ♦ ననుజతోడఁ
గలిసి వనినుండి వనమున ♦ కెలమి నరిగి. ౨౯ 25

క. జలభారపూర్ణశైవలి, నుల దాఁటుచుఁ బోయి యచట ♦ నూత్నవిభూతిన్
వెలయు ఘనచిత్రకూటము,న లలి భరద్వాజు శాస♦నంబున గృహమున్. ౩౦

క. మనము నలరించునట్లుగ, ననువొందఁగఁ జేసికొని మ♦హాహర్షమునన్
వనితాలక్ష్మణసంయు, క్తిని గాలముఁ గడిపె దేవ♦దేవుం డచటన్. ౩౧ 27

తే. దేవగంధర్వసంకాశు ♦ లై వసించెడు
వార లచ్చట సుఖముగ ♦ వాస మొప్పఁ
జేయఁగాఁ బురి దశరథుం ♦ డాయనుంగుఁ
దనయుఁ దలపోసి సుత శోక♦మునఁ గృశించి. ౩౨ 28

క. హితమతి రాముఁడు పర్వత, పతియందు వసించె నపుడు ♦ పతి యపుడె పురికిన్
సుతుఁ దలఁచి యేఁగి స్వర్గ, క్షితిఁ బొందెను; భరతుఁ బట వ♦సిష్ఠప్రముఖుల్.

చ. జనపతి స్వర్గ మొందె నిఁక ♦ క్ష్మాతలరక్షణ మీవె చేయుమా
యని తనకాజ్ఞ చేయఁగ మ♦హాబలుఁ డా సతఁ డిచ్ఛగింపఁ డ
య్యెను దనయన్న రాజ్యము; మ♦హానపరాక్రమశాలి యప్పుడే
చనియెను రాఘవాంఘ్రుల ప్ర♦సాదముఁ గోరి యరణ్యభూమికిన్. ౩౪ 30

తే. అడవి కేగి మహాత్ముని♦నన్న సత్య, విక్రముని రాముఁ గాంచి య♦విహ్వలుఁ డత్తి
నార్యభావపురస్కృతుం ♦ డగుచుఁ గోరె, రాజ్యమున కీవె పతివి ధ♦ర్మజ్ఞుఁడ వని.

క. పరమోదారుఁడు సుముఖుఁడు, పరమయశస్కుండు నగుచు ♦ భాసిలు రాముం
డరిభీకరబలుఁ డప్పుడు, పరిగ్రహింపఁ డిఁక సనియె ♦ వసుమతి నురలన్. ౩౬ 32

తే. తండ్రి యానతి మీఱంగఁ ♦ దరము గామిఁ
దెలుప భరతుఁ డవ్వార్తను ♦ దెలిసి యన్న
పాదుకలయందె యారాజ్య♦భార ముంచి
మరల మరలను ధర్మంబు ♦ మందలించి. ౩౭ 33

క. తనుఁ బంప జ్యేష్ఠుఁడగు రా,ముని యానతి మీఱఁ గామి ♦ మునుకొని వాం
ఛను బొందకయే భరతుఁడు,ఘనరామాంఘ్రుల స్పృశించి♦ తనదారి నరిగెన్.

తే. జ్యేష్ఠు నాగమనంబె కాం♦క్షించి భరతుఁ
డాయయోధ్యకుఁ జనక త♦దంతికమున
నలరుచున్ననందిగ్రామ ♦ మునఁ జెలంగు
దానిఁ దాఁ బొంది రాజ్యంబుఁ ♦ బూని యేలె. ౩౮ 35

మ. భరతుం డేగిన నిర్జితేంద్రియసుహా♦వ్యాపారుఁడుం డు సత్యవ్రతా
దరుఁడున్ శ్రీమహితుండునై తనకు నా♦ధాత్రీశుఁ డెంచె న్మదిన్
మరలం బత్తనవాసులో జనులు ప♦ల్లాఱుల్ నన్నుం జూచి వ
త్తురు నే నిచ్చట నుంట న్యాయమునకున్ ♦ దూరంబు గాకుండునే. ౩౯ 36

తే. అనుచు నేకాగ్రమనము స♦నను వుమెఱియ, నెంచి తానందకాటని♦ కేగుటయె స
మంచితంబని తలపోసి ♦ యపుడెపోయె; భీమరూపంబుగానది♦ వెలయుచుండు.

క. సరసిజనయనుఁడు రాముఁడు, విరాధుఁ డను క్రూరదనుజ♦ విపు నణఁచి యా
శరభంగముని సుతీక్ష్ణునిఁ, బరమాత్ము నగస్త్య *సహోదరుని♦ భ్రాతను గనియెన్. ౪౧

చ. సురపతి యాయగస్త్యవచ♦నంబున నక్షయసాయకంబుగా
బరఁగు నిషంగయుగ్మమును ♦ భాసురఖడ్గము నైంద్రచాపమున్

---

* అగస్త్యుని భ్రాత సుదర్శనాహ్వయుఁడు. శ్లో. యవీయా నేష మే భ్రాతా సుదర్శన ఇతి స్మృతః. అని సనత్కుమారసంహిత.

పరమముదంబునం గొనియె; ♦ వచ్చెను మౌనిగణంబు రాక్షసా
సురుల వధింపఁ గోరుటకు ♦ క్షోణివిభుండు వసించుచోటికిన్. ౪౩ 39

చ. వనచరయుక్తుఁడై యటవి ♦ వాసముచేయురఘుప్రవీరుఁడా
మునివరభాషణంబులను, ♦ మూర్ఖులు రాక్షసు లందు నుంటఁ దా
విని యపు డగ్నికల్పులయి ♦ భీతులునై తదరణ్యవాసులౌ
మునులు వినన్ బ్రతిజ్ఞఁ దగఁ ♦ బూనె సురారులఁ ద్రుంతు నంచనిన్. ౪౫

తే. అందె నివసించి రాఘవుఁ ♦ డసురనారిఁ
గామరూపిణి శూర్పణ♦ఖను వికార
రూపయుతఁ జేసె నాయింతి ♦ పాపబుద్ధి
యై జనస్థానమున నుండు♦నది మునీంద్ర. ౪౬. 41

క. తరుణి యదిపోయి చెప్పిన, నురుబలమున యుద్ధమునకు ♦ నుద్యుక్తులుగా
గరువమున రాఁగఁ ద్రిశిరుని, ఖరునిన్ దూషణుని వారి ♦ కాల్బలము ననిన్.

క. తునుమాడె; జనస్థానం, బునఁ బదునాలుగుసహస్ర♦ములు రాక్షసు లే
పున నున్నవారు నుడిసిరి, వనిఁ గాపురమున్నరాము♦వలనం బెలుచన్. ౪౭ 43

క. తదనంతరమున జ్ఞాతులు, పదునాలుగువేలు తెగుటఁ ♦ బరమాగ్రహ మూ
ర్ఛ దశగ్రీవుఁడు గని య,య్యదనున మారీచునిన్ స♦హాయము గోరెన్. ౪౮

ఉ. వైరము గూడ దెప్పటికి ♦ బాహుబలుం డగు రాముతోడ నీ
వూరక యుండుటే తగిన ♦ దోదనుజేశ! యటంచు నెన్నియో
సారులు బుద్ధిచెప్పినను ♦ సైరణలేక తృణీకరించి దే
వారియుఁ గాలచోదితుఁడె ♦ యాటను వాఁడును దోడరా వెసన్. ౫౧ 45

ఆ. రామునాశ్రమంబు ♦ రయమునఁ జేరె మా, యావియైన నిర్జ♦రారిచేత
రాకుమారు లిరువు ♦ రేకడకో కొని,పోవఁ బడిన యపుడ♦పోయి యతఁడు. ౫౨

చ. జనకజ రాముపత్నిఁ గొని ♦ సత్వర మేగుచుఁ ద్రోవ కడ్డమై
తనుఁ జలమొప్ప మార్కొనినఁ ♦ దాన జటాయువుఁ బక్షిఁ ద్రుంచి వే
చనియెను; గృధ్రరాజుఁ గని ♦ జానకివార్త నెఱింగి యేడ్చె నొ
య్యన ఘనశోకతప్తుఁ డయి ♦ వ్యాకులితేంద్రియుఁ డౌచు రాముఁడున్. ౫౩

తే. ఆజటాయువుదహించి♦యంతశోక, యుక్తుఁడగుచును వెదకుచు♦నురుతరాట
విని గబంధుని ఘోరద♦ర్శనుని రూప, వికృతుఁ గాంచెను రాక్షస♦వీరు నొకని.

క. ఆరక్షోవీరుని సీ,తారమణుఁడు త్రుంచి కాల్చెఁ ♦ దత్తనువు విధిన్
జేరుచు స్వర్గము నార, క్షోరమణుఁడు తెల్పె శబరి♦చొప్పుం బతికిన్. ౫౬

తే. రాఘవా! ధర్మచారిణి♦శ్రమణి ధర్మ, నిపుణఁ గనఁబొమ్ము నావిని♦నిఖిలశత్రు

పావనుండును బృథులతే♦జుండు నైన, జానకీనాయకుం డేగ ♦ శబరిఁ జూచె.

తే. శబరి చక్కఁగఁ బూజింప ♦ జానకీశుఁ
డరిగి పంపాసరస్తీర ♦ మందు నాంజ
నేయుఁ డను వానరునిఁ గూడి ♦ నెమ్మి నతఁడు
తెలుప సుగ్రీవుఁ డనువానిఁ ♦ గలిసికొనియె. ౫౧ 51

చ. అతిబలశాలి రాముఁ డపు ♦ డాతనికిం దెలియంగఁ జెప్పె నే
నితమునఁ జెల్లె వార్తయట ♦ స్వీయము జానకినాగ్గ; కోసల
క్షితిపుని గాథనంతయును ♦ జెప్పి వినం గఠినంబునేటి నా
వృతి దగునట్లుగా విని సు♦దిం బ్రియసుందుచు వానరేశుఁడున్. ౫౨ 52

ఆ. అగ్నిసాక్షికముగ ♦ నారాఘవునితోడ, సఖ్య మొగి నొసగి ♦ సర్వమును స్వ
చరిత మెఱుకపఱచె ♦ జానకీపతికి దుఃఖమున స్నేహమునను ♦ గడఁక నంత.

చ. ప్రతిన యొనర్చె రాఘవుఁడు ♦ వాలి వధించెద నంచు; వాలి య
ప్రతిమబలుం డటం చపుడు ♦ వానరరాజు వచించి రామునం
దతిశయశక్తి గల్గునొకొ ♦ యం చనుమానము చెంది రాఘవ
క్షితిపునకుం గనంబఱచెఁ ♦ జిత్రకళేబర మొక్కదానినిన్. ౫౩ 54

తే. అదియు దుందుభిసంబంధ♦మయి మహాద్రిఁ
బోలియుండు, నాయెమ్మును ♦ భూవిభుండు
గాంచి చిఱునవ్వు మోమునఁ ♦ గ్రాలఁ గాలి
బొటనవ్రేలను జిమ్మెనఁ ♦ బోయి యదియు. ౫౪ 55

క. కడువడి దశయోజనములఁ, బడియె మహాబలుఁడు దీర్ఘ♦బాహువు నగు న
ప్పుడమిపతి సప్తసాలము, లడఁగంగా నొక్కవాడి♦యమ్మున నేసెన్. ౫౫ 56

క. శర మది యా సాలంబుల, వరుసం దునుమాడి యంతఁ ♦ బర్వతమును దూ
ఱి రసాతలమునకుం జని, త్వరఁగాఁ జనుదెంచి చొచ్చెఁ♦దన నగుపదమున్. ౫౬

సీ. సంప్రీతచిత్తుఁడై ♦ నరగ వానరపతి నెమ్మనమ్మున రాము♦నమ్మి యతనిఁ
గూడి వే కిష్కింధ♦కును బోయి యటగుహఁ గని శాతకుంభపిం♦గళితనుండు
హరివరుండును నయి ♦ యలరు సుగ్రీవుండు పోయి గర్జించిన ♦ భూరినినద
మును దానివిని వాలి♦తన భార్యఁ దారాఖ్య నాఙలించుచు నవస♦హాదనునయిఁ

తే. గవిసినం గని రాముఁ డా♦క్క శరనిహతి
నతనిఁ బొలియించె సుగ్రీవు ♦ సనుమతి నిట్టు
వాలి వధియించి తద్రాజ్య♦వరపదమున
నిలిపె సుగ్రీవు వానర♦నికరవిభుఁగ. ౭౦ 58

ఉ. వానరనాథుఁ డాత్మపరి♦వారము నెల్లను బిల్వఁ బంపి యా
జానకినిం దగన్ వెదకి ♦ సర్వదిశల్ కలయంగఁ జూచి యెం
దేని మహీజవార్తఁ గని ♦ యెంతొ త్వరం జనుదెందు నాఁగ వా
రానినశక్తిఁ బోయి రట ♦ నొక్కఁడఁ గొందఱు వానరోత్తముల్. ౭౧ 59

తే. ఘనను సంపాతి యనెడు నా♦మమునఁ బరఁగు
గ్రద్ధ యొక్కటి సీత వా♦ర్తను వచింప
నలరి రంతట బలవంతుఁ ♦ డైనహనుమ
యుప్పుసంద్రము లంఘించె ♦ నొప్పుమెఱయ. ౭౨ 60

క. శతయోజనవిస్తీర్ణము, నితరాసాధ్యంబు నగుచు ♦ నెసఁగు జలధి దాఁ
టి తగన్ రావణపాలిత, మతిశయవిభవమును లంక♦యను పురవరమున్. 61

క. కని యం దశోకనామక, వనమునఁ బతిఁ దలఁచుచున్న♦వనితన్ సీతన్
గనులారఁ గాంచి గుఱుతును, గనఁబఱచి ప్రవృత్తిఁ దెలిపి ♦ గారవ మలరన్.

ఆ. సీత నూఱడించి ♦ యాతఁడేఁ దోరణ, మును గడంకఁ బెఱికి ♦ తనుఁ జెనకఁగ
వచ్చు పంచసైన్య♦పతులను వధియించి, సప్తమంత్రిసుతులఁ ♦ జావ నణఁచి.

క. శూరవరుఁ డైనయక్షుని, మారుని బడనేసి యస్త్ర♦మహిమకుఁ జిక్కన్
మారుతి యంతట శతధృతి, గారవమున నొసఁగిన వర♦కలితుం డౌటన్. ౭౬

క. పైతామహాస్త్రముక్తుం, డై తను బంధించు నిర్జ♦రారులవీరుం
డై తఱి గాదని యోరిచి, యాతీరున స్వేచ్ఛనుండి♦యంతటఁ గినుకన్. 65

క. జానకిని విడిచి యట లం, కానగరముఁ గాల్చి నృపతి♦కాంతునకుఁ బ్రియం
బూని యొసరింపఁ జేరెను, వానరవీరుండు మరలి ♦ స్వపురమ్మునకున్. ౭౭ 66

తే. రామచంద్రమహాత్మునిఁ♦గామితార్థ,దాయకునిఁగాంచివలగొని♦తత్త్వమొప్పఁ
జూచినాఁడను జనకుని♦సుతనటంచు, విన్నవించెను మారుతి ♦ విమలబుద్ధి. ౭౮

చ. అనిలకుమారుమాట విని ♦ యంతట వానరరాజుఁ గూడి యా
జనకకుమారికాధవుఁడు ♦ సాగరతీరముఁ జేరి పద్మమి
త్రనిభములౌ శరంబులఁ ని♦తాంతము క్షోభిలఁ జేసె నంబుధిన్;
అనునయమొప్ప సంద్రమపు ♦ డాత్మశరీరముఁ జూపె తేనికిన్. ౭౯ 68

చ. జలనిధి చెప్పినట్లు నలు♦సాగరబంధముఁ గట్టఁబంచి య
వ్వలికిని దాఁటి లంకఁ గని ♦ పంక్తిగళున్ బవరానఁ గూల్చి ని
ర్మలగుణధుర్య సీతఁ గొని ♦ రాముఁడు లజ్జను బొంది క్రూరతం
బలికెఁ గఠోరరీతిఁ గ స♦భం దగువారలు చింత నొందఁగన్. ౮౧ 69

తే. శీలవతి యైన యాసీత♦చాలఁగుంది, యోర్వఁజాలకచొచ్చె న♦య్యుగ్రదహను
నంతజ్వాలనునిమాటచే♦నపగతాఘ,జానకియటంచు నెఱిఁగియా♦చానఁగొనియె

సీ. రాముఁ డొనర్చు కా♦ర్యమ్మది దుర్భర మాటచేతఁ జరాచ♦రాన్వితంబు
నైన లోకత్రయ♦ముసురర్షిగంధర్వసహితంబు సంతోష♦సాంద్రమయ్యె;
నిర్జరు లతిభక్తి ♦ నెమ్మితోఁ బూజింప సంప్రహృష్టుండయి ♦ జానకీశుఁ
డలరారె; నంత న♦య్యసురేంద్రుని విభీషణుని లంక కభిషిక్తు ♦ నొనరఁజేసి
తే. రాముఁ డంతటఁ గృతకృత్యుఁ♦డై మనోజ్వ
రంబు లేకయె ముదమందె; ♦ రమణదివిజు
లపుడు వరములు దయచేయ ♦ ననుమతించి
వానరావళి బ్రదికించి ♦ మానవపతి. ౭౧ 71

క. వరపుష్పకమున మిత్రుని, కరయుక్తి నయోధ్య కేగఁ♦గాఁ దరలి మనో
హరసత్యపరాక్రముఁ డగు, ధరణీశుఁడు మార్గమందుఁ♦దను మునిఁ గనియెన్.

క. అతఁడె భరద్వాజుం డన, క్షితిఁ దగుఁ దత్పర్ణశాలఁ ♦ జేరి యటవసిం
చి తగన్ భరతునిచెంతకు, మతిమంతుని వానరవరు ♦ మారుతిఁ బంపెన్. ౭౨

క. భరతుని తత్త్వచరిత్రము, వరుసన్ దెల్పుచును గీశ♦వర్యసహితుఁడై
తరలెను బుష్పకమున నా, పరాక్రమధనుండు చాలఁ ♦ బరితుష్టుండై. ౭౩

క. ఘనమగు నందిగ్రామము, బును జేరి జటాళి విడిచి ♦ పొదలుచు భ్రాతల్
తనుఁగూడి రాఁగ ననఘుఁడు, జనకసుతం గూడి రాజ్య♦సత్పద మొందెన్. ౭౪

సీ. పరిహృష్టమై మోద♦పరవశమై తుష్టమై పుష్టమై లోక ♦ మపుడు ధర్మ
సహితమై యామయ♦శబ్దవిహీనమై క్షామరోగభయంబుఁ ♦ గాంచ కలరెఁ
బురుషు లొకప్పుడు ♦ పుత్రమృతిం గన రతివలు విధవలై ♦ యార్తిఁ గుంద
కయె పతివ్రతలయి ♦ నయమున వర్తింతు; రగ్నిభీతియు నలి♦లార్తిఁ గనక
తే. జంతువులు ప్రాలుఁ బవమాన♦జాతభయము
జ్వరభయము క్షుద్భయంబుఁ ద♦స్కరభయంబుఁ
గలుగ దొక్కప్పుడైన న♦గరములెల్ల
నలరు ధనధాన్యసహితంబు ♦ లగుచు నవని. ౭౬ 76

క. క్షితి రాష్ట్రంబులు నివ్విధి, నతిశయితం ప్రాలు నెల్ల ♦ రతిమోదములం
గృతయుగమునందు వలె న,ప్రతిము లగుచు వఱలుచుండ్రు♦వరధర్మములన్.

తే. వాజిమేధశతంబుల♦బహుసువర్ణ,కముల నొనరించి యయుతకో♦ట్యమలధేను
వుల నొసంగి శతానందుఁ♦డలరులోక,మొందువాఁడు సుకీర్తుల♦నొందువాఁడు.

క. ధరణీసురులకు లెక్కిం,పరానిదిగ ధనమొసంగి ♦ భాసురయశుఁడై
నరనాథాన్వయశతములఁ, బరఁగన్ స్థాపించువాఁడు♦బహుధర్మయుతిన్. ౭౯

తే. వర్ణముల నాలుగింటిని ♦ స్వస్వధర్మ,మందు నిలుచు విధంబున ♦ నలరఁజేయు
నవని నేకాదశాబ్దస♦హస్ర మేలి, బ్రహ్మలోకంబునకు నేగు♦రాఘవుండు. ౮౦

తే. ఇది పవిత్రము పాపఘ్న♦మిద్ది పుణ్య, మిద్ది శ్రుతిసమ్మితంబునౌ♦నెవఁడు దీని

రాముచరితంబుఁ జదువు స♦ర్వకలుషముల
నుండి నిర్ముక్తుఁ డయి ము క్తి ♦ నొందువాఁడు. ౯౮ 81
క. ఈయాఖ్యానంబును రా,మాయణమును జదువు నాతఁ ♦ డాయుర్యుతుఁడై
పాయక సుతపౌత్త్రాదుల, నాయుత్తమమైన స్వర్గ♦మందు వసించున్. ౯౯ 82
తే. బ్రాహ్మణుఁడు దీనిని బఠించి ♦ వాక్పవిత్ర
తను గనున్, రాజ్యహీనుఁడౌ ♦ ధరణివిభుకు
లుండు భూపతి తను, నూరు♦జుండు ధనప
తిత, మహాత్త్వంబు శూద్రుండు ♦ తృప్తిగఁ గను. ౧౦౦ 83

మొదటిసర్గము సంపూర్ణము.

---

## ౨ - వ సర్గము.

### బ్రహ్మ వాల్మీకికిఁ బ్రత్యక్షమగుట.

క. అనినచియించిన నారద, ముని దగువాక్యంబు వినుచుఁ ♦ బూజించె మహా
ముని, వాక్యవిశారదుఁడై, తనరెడు వాల్మీకి శిష్య♦తతిసంయుతుఁడై. ౧ 84
తే. ధర్మమతియైన వాల్మీకి♦తన్నువిధిని, బూజ నలరంగఁ జేయ వి♦బుధముని యగు
నారదుండును జనవేఁడి ♦ నాకపథము,నందనుజ్ఞాతుఁడై పోయె ♦ నంత నచట.
క. మునిపతి ముహూర్తమాత్రం,బున నిర్జరలోకమునకుఁ ♦ బోయిన గంగా
ధునికిం జేరువఁ దమసా,ఖ్యనదీతీరమున కేగి ♦ యాతీరమునన్. ౩ 86
మ. తనపార్శ్వంబున నున్న శిష్యుఁగని తీ♦ర్థంబంద పంకంబుగాఁ
దనరం జూపి యతఁడ్దమం బిది భర♦ద్వాజా! మనోజ్ఞంబు స
న్మనుజస్వాంతముఁ బోలియున్నది ప్రస♦న్నంబైనపాథస్సుచే
విను మిందుం గలశంబు నిల్పి యిడుమా ♦ వే వల్కలం బిప్పుడే. ౪ 87
తే. ఉత్తమం బీనదీతీర్థ ♦ మిత్తఱి నిట
స్నాన మొనరింతు ననిన నా ♦ చ్ఛాత్రుఁ డమల
బుద్ధి, నియతుండునై వల్క♦మును నొసంగె
మునికి గురువునకున్ మోద♦మునఁ జెలంగి. ౫ 88
తే. ఛాత్త్రహస్తమునందుండి ♦ సరగ వల్క
లమ్ము నియతేంద్రియుండగు ♦ నమ్మునిగొని
విపులవనమును నెల్లెడ ♦ వేడ్కఁ గనుచు
సంచరించుచు సన్నికృ♦ష్టస్థలమున. ౬ 89
క. అనపాయంబుగ నిచ్చఁగ, వనమునఁ జరియించు క్రౌంచ♦వాజి మిథునమున్

గాంచి యిట్టిరీతి నిది సమా♦క్షరముఁ బాద
బద్ధము నయి తంత్రీలయ ♦ భాసురమయి. ౧౭ 97

క. తనరారె నిద్ది శోకా, స్తుని విషయకమా ప్రవృత్తి♦తోఁ దగుఁ గానన్
జను శ్లోకమనఁగ వేఁబోక, పన్నికై యిది కావటంచుఁ ♦ బల్కఁగనంతన్. ౧౮

క. అనుమోదంబున శిష్యుఁడు, మునివర్యప్రోక్తవాక్య♦మున నుత్తమమున్
దనవాగ్వశమగు నట్లుగ, నొనరిచె సంహృష్టుఁడయి గు♦రూత్తముఁ డలరెన్.

చ. మునిపతి యంత శాస్త్రవిధ♦మున్ విడనాడక నిర్మలంబుగాఁ
దనరెడి యానుతీర్థమునఁ ♦ దత్పరబుద్ధి మునింగి యీశ్వరే
చ్ఛను దనయంత వెల్వడిన ♦ చారుతరార్థము దానినే మనం
బునఁ దలపోయుచున్ మరలెఁ ♦ బూజ్యతరాశ్రమసీమ కంతటన్. ౨౦ 100

క. మునివలన శాస్త్రముల నేర్చిన మేటియు వినయధనుఁడు ♦ శిష్యుఁడు నగున
మ్మునియు జలపూర్ణకలశం,బును గైకొని వెంటనంటి ♦ పోయెం గడఁకన్. 101

చ. తనదగు నాశ్రమస్థలముఁ ♦ దానును శిష్యుఁడు చేరి దేవపూ
జనములు లోనుగాఁగలుగు ♦ సద్విధులన్నియుఁ దీర్చి యాసనం
బున నుపవిష్టుఁడై మునియు ♦ బుద్ధిఁ బ్రయత్నము లేకయే జనిం
చినదగు శ్లోకమే మొ యను♦చింతను బొంది యనేకగాథలన్. ౨౨ 102

క. మనమునఁ దలంచె నవ్వేళఁ, జనుదెంచె స్వయంవిభుండు ♦ జగముల నిర్మిం
చిన మేటి మహాతేజుఁడు, మునిపతిఁ గన బ్రహ్మ నాల్గు♦ముఖము లలరఁగన్.

చ. వనజజు రాకఁ గాంచి ముని♦వర్యుఁడు వేగమ లేచి యంజలిం
బొనరిచి నారదాగమన♦ముఖ్యవిచిత్ర విధిప్రయత్న మే
మని మది విస్మయంపడి ప్ర♦యత్నమునన్ నియతాంతరంగుఁడై
యనఘుని మ్రోల వాఙ్నియమ ♦ మూరఁగ నిల్చి నితాంతభక్తిమై. ౨౪ 104

తే. అబ్జసంభవు నతనిఁ బా♦ద్యార్ఘ్యములను
నాసన స్తుతిముఖముల ♦ నర్చనంబు
సలిపి శాస్త్రోక్తముగ నమ♦స్కారము లిడి
యవ్యయంబగు కుశలంబు ♦ నడిగె నంత. ౨౫ 105

చ. తనకయి పూజితంబగుచుఁ ♦ దద్దయు రమ్యమునైన యాసనం
బునఁ దగఁ గూరుచుండి ముని♦ముఖ్యుని వాల్మికిఁ గూరుచుండు మా
సనమున నంచు నాజ్ఞయిడె ♦ సారససూతియు షడ్విభూతులన్
దనరెడు బ్రహ్మ, యమ్మునియు ♦ ధాతృననుజ్ఞ వసించె దానిపై. ౨౬ 106

తే. ఎలమి లోకపితామహుం ♦ డెదుటఁ దోఁచి
యాసనంబునఁ గూర్చుండ ♦ నయ్యదనునఁ

బక్షివాహనంబు నొందెద స్వ స్వాంత మొలయ
ధ్యానమును జేయుచుండె స ద్మాసనవరుఁడు. ౨౭ 107

సీ. రతిలాలసంబును రమ్యకూజితమును నగు మగపులుఁగును స ల్లకార
ణముగఁ జంపెను విరోధమునదానినిబట్టుకొనుబుద్ధియును బాపమనసుగలుగు
వ్యాధుండు కుత్సితమగును నాతనికృత్యమని శోకపరవశుండగుచుఁ బెంటి
పులుఁగును దనసుసంబున నెంచి చింతించి పలుమాఱులిట్టు లుప్పరమహాని

తే. శోకమునెపొందిముందటిశ్లోకమాత్మ, (జదివె,సజుఁడంతనమ్మునీశ్వరునిఁగాంచి
తత్త్వమెఱుఁగమి మది నిట్లుతర్తఅపడె, ననుచుఁబెద్దగనవ్వియిట్లనివచించె.

క. మునివర! శ్లోకమె నీచే, నొనరింపం బడియె దాని నొగి వనమున నీ
వనుపన మేలొకొ చింతిం,ప, నిఁక మానంగవలయుఁ బరమార్థ మదా.

క. వినుమీ మదభిప్రాయం, బునను సరస్వతి యిదిట్లు పొందెద న్నినుఁ గా
వున మునిపుంగవ! రాముని, ఘనతరచరితంబు నీవు గావింపు మిఁకన్. ౩౦

తే. ధర్మచిత్తుండు పండితేఁ దనగువాఁడు
జగతి సుగుణాఢ్యుఁ డతిధైర్యశాలి రాముఁ
డతని చరితంబు నారదుండను మునీంద్రు
వలన విని నట్లు రచియింపు మలరి నీవు. ౩౨ 111

సీ. సౌమిత్రిసహితుఁడై ధీమంతుఁడగు నలరాముని చరితంబు రావణాది
రాక్షసగణచరిత్రంబు సీతాదేవి చారిత్రమును రహస్యంబు సర్వ
విదితమావృత్తంబువిబుధమునీంద్రుఁడౌ నారదువలన సంతయును నీకుఁ
దెలియకయుండినఁదెల్లమౌఁ జుమి సర్వవృత్తాంత మింక నీ విపులం చేయఁ

తే. దగిన యట్టికావ్యంబునఁ దవ్వచన, మ
దెయ్యెడలఁ గొంచెమైన నన్నృతము గాక
బాధితార్థంబు గాక సర్వహితమగుచు
వెలయఁ గలదని తెలియుమా విప్రవర్య! ౩౪ 112

క. ఒనరింపు శ్లోకబద్ధము, మనోహరము పాపహరము మంజులమును నై
తనరారు రామచరితం, బును నీవు ధరామరర్షిపుంగవ! యెలమిన్. ౩౫ 113

చ. ధరణితలంబునన్ శిఖరి తల్లజముల్ నదులెంతదాఁక సు
స్థిరములుగాఁ జెలంగునొ, విశీర్ణము గాకయె రాముగాథ సం
చరణము సేయు లోకముల; సాధునుతిం గనుచున్ మునీంద్ర! త్వ
ద్విరచితమైన రామకథ నెల్లునొ యెంతటిదాఁక నీధరన్. ౩౬ 114

తే. అంతదాఁక సన్నిర్మిత మగుచుఁ బైనఁ
గ్రింద నలరారు నాలోక బృందమందు
నిచ్చఁ జరియింపఁ జాలుదు వెపుడు కోర్కి
పుట్టునో యప్డు మోక్షంబుఁ బొందఁగలవు. ౩౭ 115

క. అనిపలుకుచు భగవంతుఁడు, వనజజుఁ డచ్చటనె స్వీయ♦వర్ష్మ మితరదృ
ష్టినిచయమునఁ బడకుండం, గను జేసెను దద్విధంబుఁ ♦ గాంచి మనమునన్.

ఆ. శిష్యసహితుఁడగుచు ♦ జెలఁగుచు భగవంతుఁ
డైన మౌని విస్మ♦యంబు నొందె
నవల నతని శిష్యు ♦ లందఱుఁ బలుమఱు
సంతసమునఁ బొదలి ♦ వింతపడుచు. ౩౭ 117

ఆ. మరల మరల మున్ను ♦ మౌని వచించిన, శ్లోకమును బఠించి ♦ సొరిది నొకరి
కొకరు చెప్పుకొనుచు♦నొకచోటఁ జేరి వి,స్మయము మీఱఁ బొదల♦సాగిరంత.

చ. అనఘ మునీశుచే నెది స♦మాక్షరమై తగి నాల్గుపాదముల్
తనరఁగ జూడఁగాఁబడియె ♦ దానినె శ్లోకము శిష్యసంఘ మొ
య్యనఁ బఠియించుటన్ మరల ♦ నందెను శ్లోకత; నంత నెమ్మనం
బునఁ బరమేశు నెన్ను ముని♦బుద్ధిని నివ్విధిఁ దోఁచె యోచనల్. ౪౧ 119

సీ. ఇట్టి శ్లోకంబుల ♦ నెల్ల రామాయణ కావ్యంబు విరచింతుఁ♦గడఁగి యనుచుఁ
దనబుద్ధి నెంచి యు♦దారచిత్తము గల్గి యశమున నలరారు♦నట్టి మౌని
వరుఁ, డుదారంబులై ♦ వఱలు వృత్తంబుల ద్రాక్షాదిపాకవి♦రాజితార్థ
ములుగల పదములఁ♦బొలిచి సుందరములునై సమాక్షరముల ♦ నలరుచున్న

తే. శ్లోకశతముల సద్యశ♦శ్శోభితుఁడగు
రాముచరితంబుఁ గీర్తిక♦రంబుగాఁగఁ
బొలుచు కావ్యంబు రచియించెఁ ♦ గలుషహరము
నగుచు నయ్యది సంధుల ♦ నందమగుచు. ౪౨ 120

చ. మనమునకింపుఁ గూర్చెడు స♦మాసములన్ రసవత్పదంబులన్
దనరుచుఁ దూఁచినట్లు సమ♦తన్ దగుచున్ రసవంతమైన య
ర్థనియతి గల్గున ట్లమరి ♦ ధన్యతఁబొల్చు రఘుప్రవీరు పా
వనచరితంబు మౌనివృష♦భ ప్రతిపాదిత మొప్ప నెంతయున్. ౪౩ 121

తే. అదియు రావణుమరణంబు ♦ ననువదించు,
దాని వాల్మీకిశిష్యవి♦తానమునకు
నెఱుక పఱచెను దానినే ♦ యెసఁగు మోద
మున నిరీక్షింపుఁడీ యది ♦ ముక్తి నొసఁగు. ౪౩ 122

రెండవ సర్గము సంపూర్ణము.



## 3-వ సర్గము.

—శ్రీరామాయణవిషయసంగ్రహము.—

ఆ. ధర్మశీలుఁడైన ♦ తాపసి ధర్మయుతము సమగ్రమా సు♦నమునిక్షిత
మునగు చరితమెల్ల ♦ వినియు ధీమంతుఁడా, రాముచరితవిస్త♦రంబుగాఁగ. ౧ 123
క. విరచింపఁదలఁచి యమ్ముని, పరుఁడట శాస్త్రోక్తగతిని ♦ వారిచి దర్భా
త్కరమును బ్రాగగ్రంబుగఁ, బరఁగంగాఁ జేసి దానిఁ ♦ బయిఁ జేరి తగన్. ౨ 124
చ. తనగురువుం దలంచి కయి ♦ దమ్ములు మోడ్చి యాజ్యప్రసాదల
బ్ధనిరఘురామవృత్తము సు♦దిక్ వెదుకంగను రామలక్ష్మణా
వనితనుజాచరిత్రములు ♦ భార్యలతోఁ దశరాజు రాజు సా
వనచరితంబు రాష్ట్రమున ♦ భాసిలువృత్తము చెల్లినట్లుగన్. ౩ 125
తే. కాన నయ్యెను మఱియు న♦క్కాలమందు
వారి నవ్వులు మాటలు ♦ వారి గతులు
వారి చేష్టలు నబ్బగ♦వంతు కరుణ
జరగినట్లుగఁ దోఁచె న♦న్వరముని మది. ౪ 126
క. తనతమ్మునితోఁ సతితోఁ, జని వనమున రాఘవుండు ♦ సత్యశపథుఁ డా
య్యనఁ దిరుగునప్పుడట జరగినదంతయుఁ జూచెఁ జాలెఁ ♦ గృతితప్పుఁ జెప్పుటన్.
తే. ధర్మమతియైన వాల్మీకి ♦ తత్సమస్త
చరితమును యోగమున మున్ను ♦ జరగినట్టి
దాని జరగంగఁ బోయెడు♦దానిఁ గనియెఁ ౭
గరతలామలకంబును ♦ గాంచినట్లు. ౬ 128
సీ. ఉన్నది యున్నట్లు ♦ లోగి మహోద్యుతియైన ముని యభిరాముగా♦మునిచరిత్ర
మును నెల్లఁగాంచిదా♦నిని జేయఁబూనె; నయ్యదియు ప్రధానకా♦మార్థగుణయు
తంబయి కేవల♦ధర్మార్థగుణవిస్తృతంబయి రత్నయు♦తంబగు తగు
సాగరమన నొప్పి ♦ సర్వజనంబుల వీనులవిందుగా ♦ నెలసి చిత్త
తే. మోదదంబయి తనరారె ♦ మున్ను నార
దముని యెవ్విధిఁ జెప్పె నం♦తయును రాము
చరిత మల్లె రచించె ద్వి♦జప్రవరుఁడు
మాని షడ్గుణవిభవుండు ♦ మానితముగ. ౭ 129

—రామాయణకథాసంగ్రహము—

చ. జనకునిదౌ తపఃఫలము ♦ చక్రవతారము నైనయట్టిరా
ముని జననంబు, భూరిబల♦ముల్, జనతాప్రియవర్తనంబు, స
జ్జనులప్రియంబుఁ బొందఁదగు♦చందము గల్గినయున్కి, యోర్పునం
దవరుట, యుగ్రభావరహి♦తంబుగ నుండుట, సత్యశీలముల్. ౧౦ 130

చ. అనుజుఁడు లక్ష్మణుండు తను ♦ నాదరమొప్పఁగఁ గొల్చి రాఁగఁ దా
మునిపతియైన గాధిసుత♦ముఖ్యమహాధ్వర కృత్యరక్షణం
బును నొనరింపఁబోవుతఱి ♦ మోదమునన్ బహుచిత్రగాథలన్
జనువున మాని చెప్పుటయు ♦ శంకరు చాపవిఖండనంబునున్. ౧౧ 131

తే. సీత మొదలగునట్టి యా♦చెలువల దగు
పరిణయము రామరామవి♦వాద మవల
దాశరథిసద్గుణౌఘకీ♦ర్తనము రాముఁ
బట్టభద్రునిఁ జేయంగఁ ♦ బాటుపడుట. ౧౨ 132

ఉ. దానికి నంతరాయమును ♦ దా నొనరింపఁగఁ బూని కైక యొం
తేనిప్రయాసమూనుటయు ♦ నేర్పడనట్టులె విఘ్నమాటయున్
గానల కా రఘూద్వహుఁడు ♦ కైకనెపంబునఁ జేసి పోవుటల్
సూనునికై యజాత్మజుఁడు ♦ శోకముమై విలపించుటల్ తగన్. ౧౩ 133

చ. తనయునిదౌ వియోగమునఁ ♦ దాళఁగఁజాలక వృద్ధరాజు భూ
మిని విశనాశి పోవుటయు, ♦ మిక్కిలి దుఃఖము తమ్ము నేఁచఁగా
జనులు తపించి వెంటఁజనఁ ♦ జయ్యన వారిని రాఘవుండు వం
చనమునఁ బాసి యేగుట, ని♦షాదవిభుం గని రాఘవుం డొగిన్. ౧౪ 134

తే. మాటలాడుటయుఁ, బట సు♦మంత్రుఁ డెడను
సూతుఁడా రాఘవుల వీడి ♦ శోక మడరఁ
బురమునకుఁ బోవుటయు, నంత ♦ సురతటినిని
దాఁటుటయు నవ్వలన్ భర♦ద్వాజుఁ గనుట. ౧౫ 135

సీ. అవల భరద్వాజు ♦ నాజ్ఞచేఁ జిత్రకూ
టాద్రిని గనుటయు ♦ నచట వాస్తు
శాస్త్రరీతిఁగ నొక్క ♦ సదనంబు నిర్మించి
యందునుండుట, భర♦తాగమనము
నతఁడు రామునిఁ దేర్చి ♦ యభిమతమును దీర్ప
మని వేఁడుటయుఁ, దండ్రి ♦ కచట సలిల
కృత్యంబు దీర్చుట, ♦ కీర్తనీయములయి,
వరములై తనరారు ♦ పాదుకలకుఁ
బట్టంబుఁ గట్టుట ♦ భరతుఁ డవ్వాని నం
దిగ్రామమునయందు ♦ నిల్పుటయును,
తే. రాఘవుండట దండకా♦రణ్యమునకుఁ
జనుటయు, విరాధుఁ డనువాని ♦ జంపుటయును
నవల శరభంగదర్శనం ♦ బట సుతీక్ష్ణ
మునిసమాగమమును భూమి♦తనయ యెలమి. ౧౬ 136

క. అనసూయతోఁ వసించుట,యును నామెయు నంగరాగ♦మొసఁగి యిచ్చుటయుఁ
ఘనుఁడైన యగస్త్యుని దర్శన లాభ జటాయుపక్షి ♦ సందర్శనముల్. ౧౭ 137

తే. పంచవటి కేగుటయును శూ♦ర్పణఖఁ గనుట,
దానితోడి సంవాదము ♦ దానినొగి వి
రూపిణిగఁ జేయుటయు, ఘోర♦రూపులగు ఖ
రత్రిశిరసులు మొదలగు ♦ రాక్షసులను. ౧౮ 138

క. తునుముట, సీతహరించెడు, పనికై రావణుఁడు తాను ♦ వచ్చుటయును, న
వ్వని మారీచునిఁ జంపుట,యును, సీతాహరణమంత ♦ నుగతాపమునన్. ౨౦

తే. రాముఁడట శోకమంది య♦రణ్యమెల్లఁ
దిరుగుట, జటాయుమృతియుఁ. ద♦త్పరిసరమున
నున్నయట్టి కబంధము♦హోగ్రదనుజ
దర్శనముఁ, బంప నాఁబడు ♦ నగనుఁ గనుట. ౨౧ 140

క. చనిచని యవ్వని శబరిం, గనుటయుఁ బవమానసూనుఁ ♦ గాంచుటయును, న
వ్వనినుండి ఋశ్యమూకం,బును జూడఁగ వారు సఖ్య♦మును జేయుటయున్.

తే. అందు సుగ్రీవుఁడను వాన♦రాధిపతి స
మాగమంబును, సాలభే♦దాదికృత్య
ములను వానికి విశ్వాస♦మును జనింపఁ
జేయుటయు, వానితోఁ జెల్మి ♦ సేయుటయును.. ౨౩ 142

చ. జనకసుతాధవుండప్పుడు ♦ సాధ్వివసించిన చోటెఱుంగఁగా
మనమునఁ గోరి వాలికి స♦మానుమవిక్రమశాలికిన్ సవి
త్రునకును నైనవైరమును ♦ రూఢిగ సూర్యసుతుండు చెప్పఁగా
వినుటయు, వారియుద్ధమును; వింతగ వాలివధంబు నవ్వలన్. ౨౩ 143

తే. ఎలమి సుగ్రీవునకు రాజ్య ♦ మిచ్చుటయును
దార విలపించుటయు భూమి♦తనయ వెదుకఁ
గా శరత్కాల మది ముఖ్య♦కాల మగుటఁ
గీశములఁ బంప రామసు♦గ్రీవు లొకట. ౨౪ 144

తే. సమయమును జేసికొనుట వ♦ర్ష దినము లొగి
మిన్నకుండుట, మఱి యూర♦కున్నవాన
రావనీశుని పయి రాముఁ ♦ డలుగుటయును
బలములను గూర్చుటయును ది♦క్కులకనుపుట. ౨౫ 145

చ. బలముల నన్నిదిక్కులకుఁ ♦ బంపెడువేళను గీశభూధవుం
డిలఁగల ద్వీపసింధువుల ♦ నెల్లను జెప్పుట, వాయుసూనుపైఁ

గల కరుణావిశేషమున ♦ క్ష్మాపతిచంద్రుఁడు స్వాంగుళీయకం
బలరి యొసంగుటయ్యనిలు ♦ నాత్మజుఁ డందఱుఁ గూడిపోవుచున్. ౨౫ 146

తే. దక్షిణంబున నలరారు ♦ స్థలములందు
సీతఁ గలయంగ వెదకుట, ♦ చిత్రరీతి
జాంబవంతుండు బిలమొక్క ♦ చక్కఁ గనుట
యచట నందఱు మృత్యువు ♦ నందఁ దలఁచి. ౨౬ 147

సీ. కూరుచుండుట, యందు ♦ ఘోరరూపంబగు సంపాతి యను ఖగ ♦ స్వామి, వారి
కనులకుఁ దోఁచుట ♦ కడలి దాఁటెడు పూన్కిఁ బర్వతంబెక్కుట ♦ పవనతనయుఁ
డంబుధి దాఁటుట ♦ యబ్ధిమాటను విని వచ్చెడు మైనాక ♦ పర్వతంబుఁ
గాంచుట, యటసింహి ♦ కావధంబునులంక యంతికంబున నున్న ♦ యట్టి మలయ
తే. పర్వతంబును గాంచుట ♦ పత్తనమున
రాత్రిఁ జొచ్చుట, యటఁ గీశ ♦ రాజభటుఁడు
నొంటిఁ జింతించుటయు, నందు ♦ నొక్కచోటఁ
బంక్తిగళుఁ గాంచుటయును, బు ♦ ష్పకముఁ గనుట. ౨౭ 148

క. ఆపానభూమి నచ్చుట, నాపవనాత్మజుఁడు గనుట ♦ యంతఃపురమున్
ఓపికఁ గనుఁగొంటయు మఱి, యాపత్తనమం దశోక ♦ మను వనమలరన్. ౨౮

క. కనుఁగొన నచటికిఁ జనుటయు, జనకసుతం గనుట, రామ ♦ చంద్రుఁడు దయచే
సినయుంగరమునుగుఱుతుగ, వనజాక్షికి నొసఁగుటయును ♦ వాయుజుఁడచటన్.

క. సురవైరినాథు రావణుఁ, దరుణీమణి సీతఁ గాంచి ♦ తా భాషింపన్
అరుదెంచిన వానిం గను, టరయక దానవుల కాంత ♦ లాభూజాతన్. ౩౦ 151

క. పలుకుల నదలించుటయును, గలనటఁ ద్రిజటాఖ్యవనిత ♦ కాంచుట, సీతా
లలన మణి హనుమ కొసఁగుట, లలితాశోకవనతరువు ♦ లన్ శౌర్యమునన్.

తే. భంగపఱచుటయును, దైత్య ♦ భామలెల్లఁ
బాఱిపోవుట, రావణు ♦ భటుల వాయు
తనయుఁ డడరి వధించుట ♦ యును, గపీంద్రు
నింద్రజిత్తు గ్రహించి తా ♦ నేగుటయును. ౩౧ 153

క. హనుమంతుఁడు లంకాపుర, మును గాల్చుట, నచటివారు ♦ మొఱ్ఱో యని రో
దనము లొనర్చుట, సాగర,మును మరలన్ దాఁటి కీశ ♦ ముఖ్యుఁడు చనుటల్.

క. వానరు లెల్లను మధురస, మానుటయును రామచంద్రు ♦ నతిశుభవార్తా
నూనోక్తి నలరఁజేయుట, జానకి మానికముఁ బతి కొ ♦ సంగుట మఱియున్.

క. సరిదధిపతితోఁ గలియుట, యురుతరజలనిధి నళాఖ్యుఁ ♦ డొగి సేతువు ని
ర్భర శౌర్యంబునఁ గట్టుట, తరించి యద్దాని రాత్రి ♦ దైత్యపురంబున్.౩౨

క. అరికట్టుటయు, విభీషణుఁ, డరుదెంచిన నతనిఁ బ్రీతి ♦ నాదృతి మీఱం
బరిరక్షణంబు సేయుట, సురవైరుల నని వధించు♦చొప్పు నతండున్. ౩౮౪ 157

తే. తెలుపుటయుఁ, గుంభకర్ణుండు ♦ దెగుట, మేఘ
నాదుఁ డనిఁ గూలుటయు, దైత్య♦నాథునిధన,
మవల జానకిఁ గొనుటయు, ♦ నరిపురమున
నవ్విభీషణు శుభగుణు ♦ నాదరమున. 158

తే. పట్టభద్రునిఁ జేయుట ♦ భాసమాన
పుష్పకంబును గనుట, స్వ♦పురముఁ గానఁ
జనుట, భరతునిఁ గలియుట ♦ జానకీశు
భవ్యపట్టాభిషేకోత్స♦వము జరుగుట. 159

సీ. సైన్యంబు నెల్లను ♦ సాగనంపుట (స్వీయ రాష్ట్రంబు ననుధిక ♦ రంజనముగఁ
బాలించుటయు, భూమి♦పట్టిని బాయుటయును,) బూర్వకాండాళి♦నొనరఁ జెప్పె
భూతలంబున రామ♦భూనాథుఁ డొనరింపఁ బోవు కృత్యావళిఁ♦బూజ్యుఁ డాచు
భగవంతుఁ డయి వెల్గు♦వాల్మీకి యుత్తరకాండమ్మున వచించె; ♦ భూసురసుతు
తే. జీవితునిఁ జేసి హయమేధ ♦ పావనమఖ
మును నొనర్చుట మొదలగు ♦ ఘనకథాళిఁ
బొలుచు నుత్తరమా కాండ♦మునఁగ నదియు
దివ్యవాల్మీకివచన సం♦భావ్యమారి ! ౩౯ 160

మూఁడవ సర్గము సంపూర్ణము.

-o-o-o-

౪-వ సర్గము.

-o- కుశలవులు రామాయణమును బాడుట. -o-

ఉ. *స్వీకృతరాజభావుఁడయి ♦ చెల్వువహించెడు రామచంద్రు న
స్తోకచరిత్రమున్ విమల♦సుందరచిత్రపదోత్తమంబు వా
ల్మీకిమహర్షి సత్కృతికి ♦ మిక్కిలి యత్నము సేయువాఁడు భా
షాకమలేక్షణాధిపతి ♦ సత్కరుణాత్తవరుం డొనర్చెఁ దాన్. ౧ 161

ఆ. ఏడు కాండములుగ ♦ నిరువది నాలుగు, వేల శ్లోకములుగ ♦ విపులరీతి
బ్రహ్మమునివరుండు ♦ పంచశతంబులౌ, సర్గములుగఁ జెప్పెఁ ♦ జారుగాథ. ౨

* శ్రీరామచంద్రుఁడు రాజ్యము పూజ్యశంగి నేలుచుండ వాల్మీకి రామాయణమును రచించెనని "ప్రాప్తరాజ్యస్య రామస్య" అనిమూలము. స్వీకృతరాజభావుఁడయి యనుదానింబట్టి తేలుచున్నది. రామావతారమునకు ముందే వాల్మీకి రామాయణమును రచించెనను విపరీతప్రవాదము దీనిచేఁ దిరస్కృతమని తెలియునది,

చ. ఒనరిచి ప్రాజ్ఞవర్యుఁడయి ♦ యొప్పెడు వాల్మికి యశ్వమేధయా
గనిరతి కష్వలన్ జరుగు ♦ కార్యయుతంబు సహోత్తరంబుగాఁ
దనరెడు దాని నెవ్వఁ డిఁక ♦ ధాత్రి సమర్థుఁడగుం బఠింపఁగా
నని మది నూహచేసె, నపు ♦ డయ్యటవిన్ వసియించి పాత్రులై. ౩ 163

క. మునివేషులయిన కుశలవు, లనువారలు, భావితాత్ముఁ♦డై యెవ్వఁడో దీ
నిని జదువునంచు నెంచెడు, మునివర్యుని పాదములకు ♦ మ్రొక్కిరి భక్తిన్.

చ. తనదగు నాశ్రమస్థితులు ♦ ధర్మవిదుల్ ధరణీశపుత్రకుల్
ఘనయశముం దగన్ రుచిర♦గానము సేయఁగఁ జాలు నాదమున్
దనరఁగ నొప్పువారలు, సు♦దారులు నౌ సహజాతులన్ దమిన్
గనుఁగొనియెం గుశున్ లవుని ♦ త్మాసురమౌని మహేంద్రుఁ డాతఱిన్. ౫

తే. గ్రహణధారణపటువులై ♦ గ్రాలి వేద
ములను నేర్చిన వారల ♦ మునివిభుండు
వేదముల యర్థమెల్ల సు♦వ్యక్తముగను
జేయఁగా నెంచి గ్రహియించెఁ ♦ జిత్తమలర. ౬ 166

క. చరితవ్రతుఁడౌ వాల్మికి, ధరణిసుతా చరితమెల్ల ♦ దశకంఠునిదౌ
మరణంబుఁ గూడఁ గావ్యము, నరుదౌ రామాయణంబు♦ననువునఁ జేసెన్. ౭

సీ. ఉచ్చరించినయప్పు♦డొగిఁ బాడినప్పుడు మధురంబునై త్రిప్ర♦మాణములనఁ
బరఁగు గానంబును, ♦ ధ్వనిపరిచ్ఛేదంబు లనెడువీనింగూడి ♦ యందమొంది
షడ్జాదికములైన ♦ జాతుల నేడింట బద్ధమై సుహితమౌ♦వల్లకీల
యాన్వితంబయి, తగి ♦ యనులమై శృంగారహాస్యకారుణ్య భ♦యానకములు

తే. వీరరౌద్రాదికంబులై ♦ వెలయు నవర
సములతోఁ గూడి పెంపొంది ♦ సాధులైన
కావ్యమును దీనిఁ బాడి ర♦క్కసలు (మౌని
భణితి నెవ్విధిఁ దగునట్టి ♦ భంగి మీఱ.) ౮ 168

సీ. గానతత్వజ్ఞులై ♦ మానితమూర్ఛనా స్థానజ్ఞులై, యన్న♦దమ్ములగుచుఁ
గంఠరమ్యస్వర♦కలితులై నరవేష మూనిన గంధర్వ♦లో యనంగఁ
గ్రాలుచు రూపల♦క్షణముల నలరారి మధురభాషణముల ♦ మాన్యులగుచు
రామచంద్రునిశరీ♦రము నుండి తీసిన యపరబింబంబులో ♦ యనఁగఁ దనరి

ఆ. నిందనీయవృత్తి ♦ నెగడక నృపసుతు, లయ్యు మానివేష ♦ మంది వెలసి
పాఠశుద్ధి నెఱిఁగి♦భవ్యాత్ములై మహా,భాగులగుచుఁ బూన్కిఁ♦బరఁగిమఱియు.

తే. జగతిఁ గల సర్వశబ్దల♦క్షణము లెఱిఁగి
యలరు కుశలవు లపుడు ధ♦ర్మ్యంబుఁ బూర్వ

వార్తలను దెల్పు నుత్తమ♦భవ్యకావ్య
మెల్లఁ గంఠస్థముగఁ జేసి ♦ యెలమి మీఱ. ౧౩ 170

క. మునులయు సాధుద్విజులయు, ఘనసభలం దొప్పు మీఱఁ♦గాఁ బాడిరి య
మ్మునియుపదేశించిన గతి,విని వారలు సమ్మదమున ♦ వింతగఁ బొగడన్. ౧౪॥ 171

తే. వారు రామాశ్వమేధంబు ♦ వఱలుచుండ
నిశ్చితస్వాంతులై మునుల్ ♦ నెమ్మిఁ గూడి
సుఖముగాఁ గూరుచుండిన♦చోటఁ జేరి
భవ్యకావ్యంబు దానిని ♦ బాడి రెలమి. ౧౫॥ 172

క. విని దాని యమ్మునీంద్రులు, ఘనముల విస్మయము బొదల ♦ మంజులభణితిన్
గనులొలయ బాష్పపూర్ణతఁ, గని వారిని మెచ్చుకొనిరి ♦ కమ్రాక్షులచేన్.

ఆ. మోదచిత్తులగుచు ♦ మునులు నిర్మత్సరుల్
మెచ్చుకొనఁగఁ దగిన ♦ మేటి గాయ
కులను గవల వారిఁ ♦ గుశలవులను సాధు
భాషణములఁ బొగడి ♦ పల్కిరిట్లు. ౧౬॥ 174

క. ఔరౌర! గీతమధురిమ, హారా! శ్లోకముల నలరు ♦ నతిమాధుర్యం
బౌరయఁ జిరనిష్పన్నం,బే రహి నిది చూచినట్లు♦లే తెలుపఁబడెన్. ౧౭॥ 175

చ. స్వరగణసంపదల్ గలిగి ♦ చారుతరంబయి రాగయుక్తమై
పరఁగఁగఁ బాడిరక్కవలు ♦ భావముఁ జక్కఁగఁ దోఁపఁజేయుచున్
వనుస, లయాదియుక్తిఁ గని ♦ ప్రౌఢముగాఁ దనరారునట్లు మా
నిరమణు లీర్ష్యఁ బోవిడిచి ♦ నిర్మలబుద్ధుల నొప్పుచుండుటన్. ౧౮ 176

తే. వారి శ్లాఘించిరట్టి స♦భాస్థలమున
నెంతయును హృద్యమౌ రాగ♦మెసఁగునట్టు
లతిశయస్వాదుతరముగా ♦ నలరునట్లు
కుశలవుల్ పాడిరప్పుడు ♦ కోర్కు లలర. ౧౯॥ 177

చ. ముని యొకఁడా కుమారులకు ♦ మోదమునన్ వడి లేచి దా నొసం
గెను గలశంబు, నొక్కముని ♦ కీర్తిధురంధరతన్ బ్రసన్నుఁడై
ఘనతరవల్కలంబొసఁగెఁ ♦ [గాంతముగాఁ దగు లేడిచర్మమి
చ్చె, నొకమునీంద్రుఁ డొక్కముని ♦ చెల్వగు మౌంజినొసంగె హృష్టుఁడై.

క. ఒక మౌనిపతి కమండలు, వొకముని యుపవీత మొసఁగె ♦ నొగి నిచ్చెను వే
ఱొకఁ డౌదుంబరమై మా,నికి నాసనమైనదాని ♦ నెమ్మి బొదలఁగన్. ౨౦॥ 179

తే. ఒకఁడు జపమాలనిచ్చె నిం♦కొక మునీశుఁ
డాయువభివృద్ధియౌ నన ♦ నందఱప్పు
డతుల సంతోషమున మీకు ♦ నాయువధిక
మౌననుచు నాదరించిరి ♦ యాశిషముల.] ౨౦॥ 180

చ. మునిసుతులార! యద్భుతము ♦ ముఖ్యము వాల్మికిమానికీర్తితం
బును వరగాథ గల్గి సుక♦వుల్ కృతులన్ రచియింప మూలమై
తనరెడు దాని దీనిని య♦థాక్రమమొప్ప సమాప్తినొంది పెం
పును గని గీతముఖ్యమయి ♦ పొల్చెడుదానిని మీరలింపుగన్. ౨౦౪ 181

తే. పాడితిరి గాన శాస్త్రిక♦పటుమనీషు
లౌదు రిది పుష్టిజనకమై ♦ యందఱికిని
వినఁగ నింపయి యాయువు ♦ వృద్ధిచేయు
నట్టిదయి పొల్చుఁ గాదె యీ♦యమని నెపుడు. ౨౨ 182

క. అని మానులు పొగడఁగ నా, మునివేషకుమారు లొకట ♦ బుధజనులెల్లన్
దనివార రాజమార్గా,ది నిఖిలసుస్థలములందుఁ ♦ దృప్తిమెఱయఁగన్. ౨౩ 183

తే. ఎల్లవారల చిత్తంబు ♦ లెలమిఁ బొదలఁ
బాడుచుండి యొకప్పుడు ♦ భరతునను మ
తిని మహీధవు శ్రీరాముఁ ♦ గనెడు వేడ్కఁ
బోవ వారలఁ గనియె నా♦భూధవుండు. ౨౩౪ 184

చ. అరిజనకాలుఁడై తనరు♦నట్టి రఘూద్వహుఁ డాత్మదివ్యమం
దిరమున నన్నదమ్ములను ♦ దేవసుతోపము లర్చనార్హులై
పరఁగెడు వారిఁ జేర్చి మృదు♦వాక్కులచే నలరించి తత్త్వక
ర్బురమయ మాచు దివ్యమయి ♦ పొల్చెడు నర్హతమాసనస్థలిన్. ౨౫ 185

తే. జగములకు నీశుఁడౌ రామ♦చంద్రుఁడెలమిఁ
గూరుచుండి యమాత్యులఁ ♦ గూర్మితమ్ము
లను దగం గూడి యరి జనా♦ర్దనుఁడు నియతుఁ
డగుచు నలరారి మది మోద ♦ మతిశయిల్ల. ౨౬ 186

తే. చక్కఁదనమున నొప్పిన ♦ సహజులఁ గని
భరతు లక్ష్మణు నతని సో♦దరునిఁ జూచి
పలికెఁ జిత్రపదార్థైక♦లలితమైన
గాథ దీనిని వినఁదగుఁ ♦ గడు ముదమున. ౨౭ 187

క. సురతేజస్సహితుల న,య్యిరువుర గాయకుల నిట్టు ♦ లెలమిఁ గులుకువా
క్సరణిని బ్రేరేపించెను, ధరణీవరుండంత నన్న♦దమ్ములు మిగులన్. ౨౮ 188

చ. పలుకులచేత గీతమున ♦ భవ్యము రాగయుతంబు పూజితం
బలఘుతరస్వనంబునయి ♦ యందము నింపుచు వల్లకీ లయం
బులగతి విశ్రుతార్థమయి ♦ పొల్చెడునట్టులు పాడిరంత వా
రల దగు గీతమాసభను ♦ రాజిలె సర్వజనానుకూలమై. ౨౯ 189

చ. ఘనసభఁ జేరి యున్నముని♦కాండశరీరములన్ మనంబు హ్రా
ద్వనజములన్ సుఖైకరతి♦భాసిలఁ గర్ణసమాశ్రయంబుగాఁ
దనరు సుఖంబు నిచ్చుచును ♦ దద్దయు రమ్యముగాఁ జెలంగె ని
మ్మునులు నరేంద్రలక్షణతఁ ♦ బొల్చుచు భూరితపఃప్రభావులై. ౩౦ 190

తే. పరఁగుదురు నాకుఁగూడ సం♦పత్కరము మ
హానుభావంబునై తగు ♦ నౌర! చరిత
మిద్ది గావునఁ దెలియంగ ♦ నిపుడె కోరు
వాఁడ నని బుద్ధిఁ దలఁచి భూ♦వరుఁడు నెమ్మి. ౩౦౪ 191

తే. వారి కనుమతి చేయ నా♦బాలకులును, మార్గనిర్వాహసంపద ♦ మానసముల
నలరఁ జేయుచుఁ బాడి ర♦య్యవనిపతియు, దివ్యసింహాసనమునుండి ♦ భవ్యరీతి.

తే. మెల్లమెల్లన దిగి సభ ♦ మిగుల వేడ్కఁ, గూరుచుండి శ్రుతిద్వయా♦స్తోకసుఖము
ననుభవింపఁగ నాసక్తి ♦ నలరుమనము, గలిగి యుండె సభాస్థలి♦గ్రాలె నపుడు.

నాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౫ - వ సర్గము.

—రామాయణ కథా ప్రారంభము.—

సీ. ద్వీపసప్తకమున ♦ దీపించు నీభూమి జయశాలురైన యే♦క్ష్మాపతులకు
నమ్మనుప్రభృతిగ ♦ నవనీశ్వరేంద్రుల కౌరులకు దుర్లభం ♦ బరయ నన్న
యట్టుల దీనత ♦ నందెనో, తనపేర రాజిల్లఁగా సము♦ద్రము నెవండు
త్రవ్వించె దండయా♦త్రకుఁ బోవ నఱువదివేల కుమారులు ♦ విహ్వలతనైరు

తే. లనుసరించిరో యానగ♦రావనీశుఁ
డే మహీనాయకులలోన ♦ నెసఁగు మేటి
యగుచు; నిక్ష్వాకువంశ్యులై ♦ యమలచిత్తు
లైన యారాజవర్యుల ♦ యన్వయమున. ౨౪ 194

తే. అలరు రామాయణంబను ♦ యశముఁ గాంచి
పూజ్యమై యొప్పు నీగాథ ♦ పుట్టె రామ
విషయమును దెల్పుచున్; దాని ♦ విధి యనుగ్ర
హమున నుత్పన్నమయి యొప్పు ♦ నట్టిదాని. ౩౪ 195

క. పరఁగంగఁ జేయువాఁడను, వరరామాయణము దాని♦వరుస సకలమున్
గరమనసూయను వినఁదగు, స్థిరతరధర్మార్థకామ♦సిద్ధిద మగుటన్. ౮ 196

—అయోధ్యాపురవర్ణనము.—

చ. ధననిచయంబు ధాన్యసము♦దాయము గల్గి ప్రమోదయుక్తిమై
జను లలరన్ సమృద్ధమయి ♦ సన్నుతమౌ సరయూతటంబున

గనుఁగొనఁగా విశాలతయుఁ ♦ గల్గిన కోసలనామధేయమౌ
జనపద మొక్కడుండుఁ బుర♦సత్తను మొక్కటి వెల్గు దానిలోన్. ౫ 197

క. పురమద్ది యయోధ్యాఖ్యం, బరఁగు ధరన్ విశ్రుతమయి♦ప్రజలకుఁ దా భూ
వరుఁడైన మనువు దా న,ప్పురవరమును సుప్రసిద్ధ♦మును నిర్మించెన్. ౬ 198

సీ. పదియు రెండామడల్♦వైశాల్యమునవెడల్పునమూఁడు యోజనం♦బులుదగంగ
నిది మూలనగరి, నా♦నెన్నికఁ దగఁ గాంచి శ్రీయుతమ్మై తగి ♦ రెండుపార్శ్వ
ములయందువృక్షముల్♦పొల్చుట సువిభక్తమయి యొప్పు భూరిమా♦ర్గాళి గల్గి
విస్తృతి సొగసున ♦ వెలసి, విచ్చిన పూలు చల్లియు నెప్పుడు ♦ జలమునిండఁ
తే. జల్లియును సొంపుగావింప ♦ జానుమీఱు
రాజవీథిని దగు నప్పు♦రంబు వర్ణ్య
మగుచు, నలరారు, నాయయో♦ధ్యను వసించి
ధర్మముల భూరిరాజ్యంబుఁ ♦ దనర మనిచి. ౭ 199

క. అలరెడు దశరథుఁడను భూ,తలపతి యమరావతిని శ♦తక్రతుఁ డెట్లు
జ్జ్వలభంగి వెలయఁ జేసెనొ, పలుభంగుల నట్లు వృద్ధి♦పఱచె నయోధ్యన్.

సీ. పురబహిర్ద్వారముల్ ♦ పొలుచునట్టి కవాటములఁ దగు;నంగడు♦లలరునొకటి
కొకటికిఁ దగులక♦యుండ; యంత్రంబులు నాయుధంబులునెల్ల♦నలరుచుండుఁ
జిత్రకారాదులు♦చెలఁగుచు నుందురు, సూతులు మాగధుల్ ♦ సొరిది, నుంద్రు
ధనధాన్యసంపదల్ ♦ దనరారు, నిరుపమ కాంతి సమృద్ధియుఁ ♦ గ్రాలుఁ బెద్ద
తే. కోటబురుజులు ధ్వజములుఁ ♦ గొమరు మిగులుఁ
బెక్కులు శతఘ్నులును దగు ♦ నెక్కడఁ గనఁ
బోయినను స్త్రీల కాటలు ♦ పోలనేర్పు
చున్న తావులు సొగసుగ ♦ నుండు నందు. ౧౧ 201

తే. మించు తోఁటలు తియ్యమా♦మిళ్ల నలరు
వనములందందుఁ గనుపట్టుఁ ♦ బట్టణమును
జుట్టియున్న ప్రాకారము ♦ శోభిలుఁ గడు
విఱివి లోఁతును దనరార ♦ వెలయుఁ బరిఖ. ౧౨ 202

క. స్థలదుర్గభూతమై పుర, మలరుట శాత్రవసమూహ♦మందుఁ జొరఁగలే
దలఘారు హస్తిహయగో,వులు ఖరములు నుష్ట్రములును♦బోడిమిమీఱన్. ౧౩

సీ. కప్పముల్గొనివచ్చి♦కాచియున్నట్టి సామంతరాజావళి ♦ మలయుచుండుఁ
గొనఁగ నమ్ముంగను ♦ గోరి వచ్చిన బహుదేశవర్తకసంత♦తియుఁ జెలంగు
బహురత్నచిత్రిత ♦ ప్రాసాదములు క్రీడకయి కైచేసిన ♦ కమ్రగిరులు
చంద్రశాలలుఁ బెక్కు♦చంపమ్ములమహేంద్రుపురమునుబోలున♦ప్పురినిబరఁగు
తే. రాజగృహములు, జూదంబు ♦ రసుణనాడఁ
గట్టినప్రదేశములు నందుఁ ♦ గానఁబడును

సోయగంబున నలరారు ♦ సుదతులుం ద్రు
మణుల గమియు విమానస♦ద్మములుఁ దనరు. ౧౬ 204

క. నిందింపఁదగని దగుచున్, సుందరగృహసంఘయుక్తి ♦ శోభిల్లుచు హె
చ్చుం దగ్గు లేక సమతల,మం దెవినిర్మితము నగుచు ♦ నప్పుర మలరున్. ౧౭

చ. పురమున నందుఁ దెల్లఁగను ♦ బొల్చెడు బియ్యము; నీరుచూడ ని
క్షురసముఁబోలు, భేరులును ♦ సొంపగు వీణియలున్ మృదంగముల్
పరఁగెడు మర్దళాదులును ♦ ధ్వానముసేయుచు నుండు నెంతయున్
ధరణిని సాటిలేక పుర♦తల్లజ మయ్యది సర్వశ్రేష్ఠమై తగున్. ౧౮ 206

తే. ఆకసంబునఁ దపమున ♦ నలరి పడసి
నట్టి సిద్ధులదౌ విమా♦నాళి యట్లు
తగిన భంగి నమర్చిన ♦ సొగసు గులుకు
గృహములం దగి శ్రేష్ఠమై ♦ యెసఁగుఁ బురము. ౧౯ 207

సీ. విద్వాంసు లవ్వీట ♦ వెలయుచు నుందురు; శస్త్రాస్త్రవిద్యావి♦శారదులయి
నేర్పఱులును నగు♦నృపవరు, లసహాయుఁ, దల్లిదండ్రులుగాని♦తనయులు మొద
లైనట్టి వారలు ♦ గాని లేకయె యుండు వానిని, వంచించి ♦ బాణవితతి
నేయంగఁ దగువాని ♦ నెద భయంబు జనింపఁ బాఱెడు వానిని♦బాణహతునిఁ

తే. జేయనొల్లక యుండియు ♦ సింహములును
బులులుఁ బందులు మత్తిల్లి ♦ భూరిరవము
లడర స్వీయవనంబుల♦యందుఁ దిరుగఁ
దెంపుఁ జేతులబలమును ♦ దేటపడఁగ. ౨౦ 208

క. శితశరములఁ బొలియింతురు, హితులు మహారథులునగుచు ♦ నెసఁగుమహీభృ
త్సుతవరు లట్టింద్రులరఁగ, క్షితి నెలసిన యప్పురంబు ♦ చెలఁగుచునుండున్.

తే. ఆహితాగ్నులుశమదమా♦ద్యఖిలసుగుణ,భూసురులు వేదవేదాంగ♦పారగులును
సత్యరతులు మహాత్ములు ♦ సకలదులు మ,హర్షికల్పులుఁ గేవలా♦భ్యాసపరులు.

క. కేవలమునులునునై తగు, భూవిబుధోత్తములచేతఁ ♦ బొలుపారు పురిన్
భూవిభుఁడు దశరథాహ్వయుఁ, డావాసంబొప్పఁజేసె ♦ నందం బలరన్. ౨౩

ఐదవ సర్గము సంపూర్ణము.

---

౬-వ సర్గము.

—దశరథుని రాజ్యపాలనము.—

చ. శ్రుతులనెఱింగి పండితుల ♦ శూరుల సత్కృతి నాదరించి, యం
చితముగ వారిలోఁ గొనుచు ♦ సిద్ధసుతేజము మీఱి, భావిసం
గతవిషయంబులన్ దెలియఁ♦గాఁ దగుశీలము గల్గి, పౌరసం
తతికిని గ్రామవాసులకుఁ ♦ దాఁ బ్రియుఁడై మఖరాజిఁ జేయుచున్. ౧ 212

సీ. ఇక్ష్వాకుకులమున ♦ నెసఁగు రాజులలోన నతిరథుఁడై ధర్మ♦తతినిరతిని
బ్రబలి యెల్లరను లోఁ♦బఱచుశక్తి నెసంగి, వరముని కల్పుఁడై ♦ వసుమతీశ
తనువొప్పుబుషియయి♦తనరారి, భూర్భువస్స్వర్లోకములయందుఁ♦బ్రస్తుతిఁ దగఁ
గాంచుచు, సైన్యసం♦కలితుఁడౌట హతారియై, సుప్రశస్తమి♦త్రాళి గల్గి,

తే. నిర్జితేంద్రియుఁడై, ధన♦నిచయయుక్తి
నింద్రుతోఁ దులఁదూఁగుచు; ♦ నెసఁగు నిధులు
గలిగియుండుటచే యక్ష♦కాంతుతోడ
నుపమఁ గాంచుచు భూస్థలి ♦ నొప్పు మెఱసి. ౩ 213

ఆ. దశరథాభిధాన♦ధరణీశుఁ డుర్వర, నతుల తేజమునను ♦ ఖ్యాతి నలరు
మనువులోక మెట్లు ♦ మనిచె ధర్మంబున, నవ్విధమున నేలె ♦ న్యాయరీతి. ౪

సీ. అమరావతీపురి♦హరిహయుఁ డేరీతి రక్షించె నట్లు ధ♦ర్మంబు నర్థ
కామమ్ములను త్రివ♦ర్గమ్ము నూని సత్యాభిసంధుండగు ♦ నవనినాథుఁ
డయ్యయోధ్యాపుర ♦ మత్యుత్తమంబును బాలించె నప్పురిఁ ♦ బ్రజలుమిగుల
నావాససుఖముల ♦ నందుట హృష్టులై ధర్మాత్ములగుచు శా♦స్త్రముల వినికిఁ

తే. బొంది స్వస్వధనంబుల ♦ భూరితృప్తి
నంది లోభంబు విడనాడి ♦ యాచకులకు
దానమొసఁగుచు నెపుడు స♦త్యంబె పలికి
యలరుచుండురు మఱియును ♦ నప్పురమున. ౬ 215

చ. ధనమును గోవులశ్వములు ♦ ధాన్యము లేనినరుండు స్వల్పమా
ధనమును గల్గు మానవుఁడు ♦ ద్రవ్యముఖంబులఁ గోరికల్ ఫలిం
పనిమనుజుండుగాని యొక♦పట్టునఁ జూచిననైనఁ గంటికిం
గనఁబడకుండుఁ, గాముకుఁడు ♦ గాని నృశంసుఁడు, నాస్తికుండునుర్. ౭ 216

తే. తల్లిదండ్రుల దారపు♦త్రప్రముఖులఁ
బీడ సేయంగఁ దలఁచు లో♦భియును, బండి
తుండు గానట్టివాఁడును ♦ నుండఁ డందు
వెదకి చూచినఁ గాని యే♦వేళలందు. ౮ 217

చ. పురుషులు కాంతలెల్లరును ♦ బోల జితేంద్రియులై స్వభావమై
పరఁగెడు శీలవృత్తయుతి♦భాసిలి ధర్మపరాయణాత్ములై
వరమును లట్లు, స్వచ్ఛమగు ♦ స్వాంతము గల్గి యొసంగుచుందు ర
ప్పురమునఁ గుండలంబులను ♦ బూననివారలు లేరు చూచినన్. ౯ 218

ఆ. మకుటధారిగాక ♦ మైఁ బూలదండలు, దాల్పకున్నవారు ♦ తలఁప లేరు
అల్పభోగయుక్తుఁ ♦ డభ్యంగవిధి శుద్ధి, నందకున్నమనుజుఁ ♦ డచట లేఁడు. ౯

సీ. గంధంబుఁ బూయక ♦ కస్తూరికాది చర్చల మించకున్నవ♦ర్ష్మములు గల్గి
కడుపార భుజియింప♦గా నన్నమే లేక, యన్నంబుఁ బెట్టక ♦ యంగడముల
హృదయభూషణముల ♦ నెల్లను దాల్పక హస్తభూషణ కంక♦ణాదికములఁ
దాల్పక నిర్జితాం♦తఃకరణుండును గాక యుండెడువాఁడు ♦ కానరాఁడు

తే. యజ్ఞమును జేయనట్టి వా♦రరయ లేరు
విడువ కగ్నిముఖంబున ♦ వేల్వనట్టి
వారు లేర,ల్పవిద్యను ♦ వైభవాల్ప
తను, గనంబడు వారు త♦ద్ధరణి లేరు. ౧౧ 220

తే. వర్ణసంకరములఁ జేయు♦వారు లేరు
తస్కరులు లేరు సుమ్మయో♦ధ్యాపురమున
నొక్కరేనియు, నప్పురి ♦ నున్న విప్రు
లాత్మనియతకర్మ్ముల ♦ నాచరించి. ౧౨ 221

క. అనయము విజితేంద్రియులై, ఘనభక్తి జపించి శిష్య♦గణమున కెలమిన్
దనరుచు విద్యనుఁ జెప్పుచు, గనకాదిపరిగ్రహముఁ ♦ గడునిస్పృహులై. ౧౩

క. వెలఁగుచు నుందురు, జానపదులలోపల నాస్తికుండు ♦ దోఁపఁ డసత్యం
బులఁ బల్కువాఁడు శాస్త్రావళి విననియతండు గానఁ♦బడఁడు వెదకినన్. ౧౪

తే. పండితుఁడు గాని మనుజుఁ, డో♦ర్వంగ లేని
యతఁడుఁ బురుషార్థసాధన♦ మం దశక్తుఁ
డైన వాఁ డొక్కఁ డేని న♦య్యవనినాథు
పాలనంబును గన్నట్టి ♦ వసుధ లేఁడు. ౧౫ 224

సీ. వేదాంగషట్కసం♦వేత్తగాని యతండు చాంద్రాయణాదులఁ ♦ జరపనియతఁ
డఖిలదానంబుల ♦ నర్థుల కియ్యని వాఁడు దీనుండగు ♦ వాఁడు చపల
చిత్తుండు వ్యాధుల♦చేతఁ బీడింపఁగఁ బడిన యాతఁడు లేఁడొ♦కఁడునునైన
నప్పురంబున నరు♦లందు భామలయందుఁ గాంతి సౌందర్యముల్♦గలుగకున్న

ఆ. వారు లేరు రాజ♦వరునందు భక్తి లే,నట్టి వాఁడొకండు ♦ పరయఁ గానఁ
బడఁడు బ్రాహ్మణాది♦వర్ణసంజనితులు, పూజ సేయుదురు వి♦బుధుల నెప్పుడు.

చ. అతిథులఁ బూజలం దనిపి ♦ యర్థులఁ దన్పుచు దానశౌండులన్
వితతయశంబుఁ గాంతు ర♦ల విప్రులు, విద్యల శూరులై పర
ప్రతతికి వాదకాలమునఁ ♦ బాయక శౌర్యముఁ జూపుచున్ గృత
జ్ఞతను జెలంగుచుందు; రిఁక ♦ క్షత్రియముఖ్యులు నట్టివారలే. 226

చ. పురమున నందు మానవులు ♦ పూనిక ధర్మము సూనృతంబునున్
జరపుటఁ జాలయాయువును ♦ సాధ్వులఁ బుత్రులఁ బౌత్రులన్ గనో

హారగతిఁ గూడియుండు రెప్పు ♦ డంవలి క్షత్రియజాతి బ్రాహ్మణో
త్కరము ప్రధానమంచుఁ గల ♦ కాలము వారల యాజ్ఞవర్తిలున్. ౧౮ 227

తే. అనుసరింతురు వైశ్యులు ♦ య్యవనిపతులఁ
బాదజులు విప్రబాహుజ ♦ వైశ్యులఁ దగ
ననుసరించుచు స్వీయధ ♦ ర్మాళి నిరతి
నొంది కాలంబుఁ ద్రోయుచు ♦ నుండు వారు. ౧౯ 228

సీ. మానవేంద్రుండును ♦ మతిమంతుఁడును నగు మనువు మున్ గాచిన ♦ మాడ్కి నిప్పు
డిక్ష్వాకుకులజుఁడై ♦ యెసఁగెడు రాజుచేఁ గాపాడఁబడియె న ♦ గరమదియును
శౌర్యాతిశయమున ♦ జ్వలనసంకాశులై యకుటిలవర్తను ♦ లగుచు రుచిర
వర్చస్సులలర న ♦ భ్యస్తవిద్యావళి తనరార నొప్పు వీ ♦ రనికరములు

తే. గలిగి యప్పురి సింహాసం ♦ కలిత మగుచుఁ
దగిన గుహయట్లు వెలిఁగి దు ♦ ర్ధర్ష యయ్యెఁ
బోలుచు సింధు, వనాయు, కాం ♦ బోజభవము
లట్లె బాహ్లీకజములగు ♦ నశ్వము లొగి. ౨౧ 229

క. హరిహయు నశ్వవరంబును, సరిపోల్పఁగ నొప్పి పురిని ♦ జానుగ వెలయున్ ;
గిరులకు సరివచ్చుచుఁ గుంజరములు మదయుక్తిఁ బొల్చుఁ ♦ జంచద్గతులన్.

సీ. అవి కొన్ని వింధ్యనా ♦ నలరుపర్వతమున జనియించినవియుఁ, దు ♦ హినశిఖరిని
బుట్టినయవియు నై ♦ భూరిబలంబుల నలరుచు నైరావ ♦ తాఖ్యహస్తి
వంశంబునను, మహా ♦ పద్మగజాన్వయమున, నంజనాన్వయ ♦ మునను వామ
నాఖ్యదంతీంద్రాన్వ ♦ యము నందును జనించినవియునునై పుర ♦ మందు నెసఁగు

తే. భద్ర, మంద్ర, మృగాఖ్యలఁ ♦ బరఁగు మూఁడు
జాతులను బుట్టినట్టి గ ♦ జములు భద్ర
మంద్ర మృగ సుప్రసిద్ధనా ♦ మముల మూఁటిఁ
దనరి సంకీర్ణమగు కుల ♦ మున జనించి. ౨౪ 231

తే. భద్రమృగములు మృగమంద్ర ♦ భద్రమంద్ర
ములును నను రెంట సంకీర్ణ ♦ ములగు జాతు
లందుఁ బుట్టి మదించిన ♦ యట్టి శైల
సమగజంబుల నాపురి ♦ సతము గ్రాలు. ౨౫ 232

చ. ఒనరఁ బురోత్తమంబునకు ♦ యోజనయుగ్మము దాఁక సైన్యముల్
తనరుటచే నయోధ్య యన ♦ ధాత్రి నెసంగెడు పేరు సార్థకం
బని తెలుపంగ వెల్గు, నది; ♦ యందు వసించి యజాత్మజుండు ధ
ర్మనిరతచిత్తుఁడై మనిచె ♦ రాజ్యము సౌఖ్యయుతంబుగాఁ దగన్. ౨౬ 233

క. అతిశయ తేజుఁడు దశరథుఁ, డతివిక్రమశమితవైరి ♦ యగుచును నక్ష

త్రతతిని శీతాంశుఁడు వలెఁ, బ్రతి లేని విధంబు మెఱయఁ ♦ బాలన సేసెన్.

చ. పురమది సార్థకాహ్వయముఁ ♦ బూని దృఢార్గళతోరణౌఘమై
పరఁగి విచిత్రగేహముల ♦ భాసిలి మంగళమూలమై నిరం
తరమును బూజ్యమానవగ♦ణంబులచేఁ జెలువారు, దానిని౯
హరిహయతుల్యుఁడైన మను♦జాధిపుఁ డాతఁడు ప్రోచె నేర్పున౯. ౨౮॥ 235

ఆఱవ సర్గము సంపూర్ణము.

---

## ౭-వ సర్గము.

మంత్రిప్రముఖవర్ణనము.

తే. అతని కిక్ష్వాకు కులజున ♦ కమలమతికిఁ
గార్యగతుల నెఱుంగఁగాఁ ♦ గలిగి, యింగి
తజ్ఞులై, ప్రియనృపహిత ♦ తత్పరులయి
సాధుగుణతతిరాజిల్లు ♦ సచివులుండ్రు. ౧ 236

క. ఎనమండ్రు కీర్తిసంయుతు, లనిశము నృపకార్యసాధ♦నాదరులును రా
జున కపకృతి సేయ నెఱుం,గని మంత్రులు వీరుఁడైన ♦ క్ష్మాకాంతునకున్.

తే. వెలయు దృష్టి జయంతులు ♦ విజయనాముఁ
డవల సిద్ధార్థనామకుఁ ♦ డర్థసాధ
కాహ్వయుఁ, డశోక మంత్రపా♦లాఖ్యు లష్ట
ముఁడు సుమంత్రాఖ్యుఁడగు, వీరు ♦ భూరిబలులు. ౩ 238

చ. చెలఁగెడు వామదేవుఁడు, వ♦సిష్ఠుఁడు నాఁ దగు ఋత్విజుల్ మునీ
శులగమి మేటులై యలరు♦చున్ సచివోత్తములైరి యింకనున్
గలరు సుయజ్ఞముఖ్యముని♦కాంతులు రాజహితుల్ సుమంత్రము
ఖ్యులగు ప్రధాను లెల్లగును ♦ గుప్తితకార్యములం ద్రపాన్వితుల్. ౪ 239

సీ. విద్యలఁ గడు నేర్చి ♦ విమలాత్ములై విజితేంద్రియులై లక్ష్మి ♦ యెంతయుఁ దమిఁ
దమ్ము నావేశింప♦ధాత్రిని వెలయుచుఁ గుశలులై శాస్త్రముల్♦కొఱత నొంద
కుండ నేరిచి కీర్తి ♦ యొప్పార దృఢవిక్రమాధికులై మంత్ర♦మందు నేర్పు
గలుగుట సత్కీర్తిఁ ♦ గాంచి భూపాలన మందప్రమత్తులై ♦ యాడినట్లు

ఆ. చేయఁ గలిగి యోర్పు♦చేఁ దేజమున ఖ్యాతిఁ,గాంచి సుస్మితంబు♦గ్రాలుచుండ
మాటలాడ నేర్చి ♦ మఱి క్రోధకామార్థ,హేతువుల ననత్య♦మే పలుకక. ౫ 240

తే. అలరు మంత్రుల కవ్వారి ♦ కపుడు తమవి
పరులవియు నైన యజ్జన♦పదములందుఁ
గలుగు చరితము త్రైకాలి♦కమ్ము చార
ముఖమునన్ విదితంబయ్యె ♦ పొలుచుచుండు. ౬॥ 241

సీ. వ్యవహారములను నే♦ర్పరులయి సుపరీక్షితములైన మిత్రభా♦వములు గలిగి
యపరాధ మొనరించు ♦ నతఁడు పుత్రుఁడైయైన దండించునట్టి మ♦తంబు గలిగి
ధనరాశి నొడఁగూర్పఁ ♦ దగిన రీతి ధనంబు వెచ్చించి సైన్యంబు ♦ విస్తరింప
జాగరూకులు నయి ♦ శత్రువునైనను నపరాధ మొనరింప ♦ నట్టివాని
తే. దండనము సేయఁబూనక ♦ దస్యుతతిని
వారణక్షమశౌర్యంబు ♦ వఱల శత్రు
విజయమందు నుత్సాహంబు ♦ వెలయ నీతి
శాస్త్రములఁ గూడియుండెడు ♦ స్వాంతము దగ. ౧౦ 242
మ. తమదేశంబున నున్న సాధుజనసం♦తానంబు నెల్లప్పుడు
ద్యమ మొప్పారఁగఁ బ్రోచి విప్రనృపవి♦త్తంబుల్ హరింపంగ నే
సమయం బందుననేఁ దలంప రొకఁడే ♦ చందంబునన్ గాని నే
రము సేయన్ బెనుపూన్కి దానిదగు సా♦రం బేర్పడం గాంచుచున్. ౧౧ 243
ఆ. తప్పు నిజమటంచుఁ ♦ దమ మదులం దోఁపఁ, దగిన విధము గాఁగ♦ దండనంబు
నెరపి, బొక్కసమును ♦ నిండించి యామంత్రు, లలరు చుండు వార ♦ లర్హరీతి.
క. పరిశుద్ధత్రికరణులై, పరఁగుచు వారైకమత్య♦భాసురు లగుచున్
వరరాజ్యతంత్రరక్షణ, పరులౌటఁ దదీయరాజ్య♦పాలన నులరెన్. ౧౨ 245
ఆ. వారి పురమునందు ♦ వారి రాష్ట్రంబున, సత్యవాది గాని ♦ జనుఁడు, దుష్టుఁ
డొరుని పత్నిఁగోరు♦నరుఁ డొక్కఁడైనను, దడవి చూచినను బు♦తంబు లేఁడు.
క. పురవరమది తద్రాజ్యముఁ, గరము ప్రశాంతముగ నుండుఁ♦గానియొకటియున్
విరహితశాంతంబై తగ, దరయఁగ నమ్మంత్రు లెల్ల ♦ నమలాకృతులై. ౧౩
చ. సురుచిరదివ్యవస్త్రముల ♦ శోభిలి, సన్నుతవృత్తులై, నరే
శ్వరహితకాంక్షులం జెలఁగి ♦ భాసురనీతియుతార్థసృష్టితో
నిరతము జాగరూకులయి, ♦ నేర్పరులై గురునందు సద్గుణో
త్కరమునె సంగ్రహించుచును ♦ గ్రాలుదు రెంతయు సద్గుణోన్నతిన్. ౧౪
తే. శౌర్యమున ఖ్యాతిఁ గాంచుచు ♦ సర్వవిషయ
ముల నెఱింగెడు సూక్ష్మబు♦ద్ధులు నెసంగు
చుండుట విదేశముల యందు ♦ నొప్పి యుంద్రు
విస్తృతఖ్యాతులన్ గడు ♦ వెలసి వారు. ౧౫ 249
సీ. సంధివిగ్రహముఖ ♦ సమధికతత్వంబు నెఱిఁగి సంపత్తుచే ♦ నెసఁగు చుండి
నను దనభావంబు♦నను నొక్కరీతిఁగా వర్తించునట్టి స్వ♦భావము దగ
నలరుచు, రాజకా♦ర్యాలోచనమ్ముల దాఁచి యుండెడు శక్తిఁ ♦ దనరి సూక్ష్మ
బుద్ధివిశేషముల్ ♦ పొలుపొంద వెలయుచు నీతిశాస్త్రవిశేష♦నియతి నెఱిఁగి
తే. ప్రజలఁ గాచుచు మానవ♦పతిహితంబుఁ, గోరి మాటాడ నేరిచి ♦ వారలుండు
వార, లిట్లు సమర్థులై ♦ వఱలి సుగుణ, భాసురులగు నమాత్యులు ♦ పరిఢవిల్ల.

క. అనిశము వ్యసనావళిఁ దన, మనమునఁ జొరనీక సకల ♦ మాన్యుండగుచున్
జనపతి దశరథుఁ డేలె న,వని న్యాయము తప్పకుండ ♦ వైభవ మలరన్. ౧౮

ఉ. చారులఁ బంపి రాష్ట్రముల ♦ చర్యల వే గతిగాఁ దెలంగునో
భూరమణుండు దా నెఱిఁగి ♦ పూజ్యగతిన్ బ్రజలన్ సుఖాత్ములన్
గారవ మొప్పఁ జేయుచు న♦ఖండముగాఁ దగు ధర్మయుక్తి న
వ్వారలు మోదయుక్తులయి ♦ వర్ధిలఁ జేయుచుఁ బ్రోచె నేర్పునన్. ౧౯ 252

తే. మఱియు నాతఁ డధర్మంబు ♦ మాని నైజ
విక్రమాదులఁ ద్రైలోక్య♦వినుతిఁ గాంచి
దాతయై సత్యవాదియై ♦ తనరి పురుష
వర్యుఁడై పాలనము సేసె ♦ వసుధనెల్ల. ౨౦ 253

మ. నతసామంతుఁడు మిత్రవంతుఁడగు భూ♦నాథోత్తముం డాతఁ డ
ప్రతిమానంబగు శౌర్యసంగతి నమి♦త్రవ్రాతముం ద్రుంచి యు
న్నతిచే మించుటఁ దత్సముం డయిన భూ♦నాథుండు నుత్కృష్టభూ
పతియుంగానఁగ రాఁడు శత్రువులలోఁ ♦ బల్లాఱు యోజించినన్. ౨౧ 254

క. ధరణీశుఁ డతఁ డయోధ్యా,పురమున వసియించి సకల ♦ భూఖండములన్
సురపురి నింద్రుఁడు వలె ధ,ర్మరతిం బాలించె సుజన♦మండల మలరన్. 255

మ. హితకార్యాళినియుక్తులై కుశలులై ♦ యేకార్యమైనన్ సమా
హితచిత్తంబులఁ జక్కఁజేయఁదగి యెం♦తే ప్రీతి యొప్పార సు
స్థితిచే మించినమంత్రు లెల్లరు దనున్ ♦ సేవింపఁ దేజోమయ
ద్యుతులన్ గూడిన బాలభానుగతి న♦య్యుర్వీశుఁ డొప్పెన్ గడున్. ౨౩

ఏడవ సర్గము సంపూర్ణము.

౮ - వ సర్గము.

దశరథుఁడు పుత్రకామేష్టిఁ జేయఁ బ్రయత్నించుట.

తే. ఇట్టి మహిమల వెలయుచు ♦ నెల్లధర్మ
తతుల నెఱిఁగి మహాత్ముఁడై ♦ సుతులకొఱకు
నై తపంబొనరించు న♦య్యవనిపతికిఁ
గులము నిలిపెడు తనయుండు ♦ గలుగఁడయ్యె. ౧ 257

చ. తనయులఁ గాంచు టెట్లనుచు ♦ దాఁ దలపోయుచు నున్నతాత్ముఁడై
తనరెడు నమ్మహీపతికి ♦ దైవవశంబున నశ్వమేధ మి
ప్పనికయి యేల చేయనొకో ♦ బాపురె యంచు మనీషఁ దోఁచె; న
మ్మనుజవిభూత్తముండు మతి♦మంతుఁడు గావున నొక్కనాఁ డొగిన్. ౨ 258

తే. సకలకార్యములందుఁ బ్ర♦శస్తమైన
యుద్యమంబున నలరారు♦చున్న మంత్రి

సత్తముల నందఱం గూర్చి ♦ సప్తతంతు
నొనరుపన్ నిశ్చయము సేసి♦కొనుచు నపుడె. ౩ 259

సీ. ధర్మాత్ముఁడైన యా♦ధరణీశ్వరుఁడు మంత్రిమండలమున నుత్త♦ముండు గాఁగ
నొప్పు సుమంత్రుని ♦ నిప్పుడ పోయి తోడ్కొని రమ్ము మామక♦గురువరులను
మఱియుఁ బురోహిత♦మండలమ్ము ననుచుఁ బలికె సత్వరగతి ♦ నలరు నాతఁ
డప్పుడె పోయి వే♦దాంగపారగులైన వారలను సుయజ్ఞ♦వాసుదేవ
తే. మునుల జాబాలికాశ్యపు♦లను బురోహి
తుని వసిష్ఠుని మఱియుఁ ద♦క్కిన ద్విజోత్త
ములను నందఱఁ గొనిరాఁగ ♦ నలరి ధర్మ
బుద్ధియగు నాజి యవ్వారిఁ ♦ బూజఁ దనిపి. ౬౪ 260

చ. వినయము భక్తియుం గదుర ♦ వీనులఁ బండువుసేయు నర్థముం
గనఁబడ ధర్మయుక్తమయి ♦ కాంతమునై తగు వాక్యపంక్తి ని
ట్లనియె మహాత్ములార! తన♦యార్థము నందురుచున్న నాకుఁ ద
త్తనయసుఖంబు గల్గ దిఁక ♦ దానికినై హయమేధమున్ విధిన్. ౭౪ 261

క. చేయంగ బుద్ధి పుట్టెడు, నాయజ్ఞము శాస్త్రదృష్ట♦మైన క్రమమునన్
జేయుట సత్ఫలదం బసి, పాయక నద్దానిఁ జేయ♦వాంఛింతుఁ దమిన్. ౮౪ 262

క. కావున నేఁ గోరెడు సుఖ,మే వడువునఁ జేయఁ గలనొ ♦ హితమతులన్ మీ
రావిధికిఁ దగు నుపాయము, వావిరిఁ దలపోయుఁ డనుచుఁ♦బ్రార్థించుటయున్.

చ. అలరి వసిష్ఠముఖ్యులగు ♦ నయ్యవనీసురులెల్ల మేదినీ
శలలితవక్త్రవిచ్యుతముఁ ♦ జారుతరంబును నై చెలంగు న
ప్పలుకును మేలు మేలనుచు ♦ బాగుగ మెచ్చి ప్రమోద మందుచున్
బలికిరి రాజుఁ గాంచి నర♦పాలక కూర్పుము వస్తుసంతతిన్. ౧౦౪ 264

ఆ. యాగహయము విడువు ♦ మాత్మజప్రాప్తికై, ధర్మయుక్తమగుచుఁ♦దగు మనీష
యట్లు గలిగెఁ గాన ♦ నిఁక సర్వభంగులఁ, గొడుకు లుద్భవింత్రు ♦ కోరినట్లు.

చ. అనుటయుఁ దద్విజోక్తులకు ♦ నాతఁడు ప్రీతిని బొంది హర్షసం
జనితజలాకులేక్షణుఁడు ♦ జ్యావిభుఁ డంత నమాత్యసంఘముం
గనుఁగొని పల్కె నిప్పుడె మ♦ఖక్రియకుం దగు వస్తుజాతమున్
గొని యొకచోటఁ జేర్పఁగఁద♦గున్ గురువర్యుల వాక్యరీతిగన్. ౧౩౪ 266

తే. మఱియు ముఖ్యర్త్విజులతోడ ♦ మఖహయమును
దానిఁ గాపాడఁగా నర్హు♦లైన యట్టి
సైన్యములతో విడుచునది, ♦ సరయు వనఁగఁ
బ్రథితమా నది కుత్తర♦భాగమందు. ౧౮ 267

క. క్రతుభూమిని నేర్పఱుపుఁడు, క్రతువిఘ్ననివారణార్హ♦కర్మంబుల నే
గతి శాస్త్రము చెప్పునొ యా,గతి సక్రమముగ నొనర్పఁ♦గాఁ దగుఁ జుండీ.

చ. వినుఁడొక మాట యజ్ఞ మిది ♦ విశ్రుత మిందు ననర్థదంబుగాఁ
జను, నపరాధమేఁ గలుగఁ ♦ జాలక యుండునయేని యందఱున్
జనపతు లిమ్మహాక్రతువు ♦ సంతసమొప్పఁగఁ జేయ నర్హులే
యనఁ దగుఁ గాదె, యిమ్మఖము♦హత్త్వమెఱింగిన బ్రహ్మరాక్షసుల్. ౧౬ 269

తే. యజ్ఞకృత్యంబునం దెద్ది♦యైన రంధ్ర
ముండునా యని వెదకుచు ♦ నుండు వార
లద్ది గల్గి యాయజ్ఞకా♦ర్యంబు సెడిన
నపుడె తత్కర్త నాశంబు♦నందుఁ జుండీ. ౧౭ 270

చ. నిరతము యజ్ఞకృత్యములఁ ♦ నేర్పఱులై తగు మీర లెట్లుఁ యీ
ధ్వరమిది శాస్త్రసమ్మతిని ♦ బాగుగఁ బూర్తిని గాంచునట్లుగా
నరసి ప్రయత్నమున్ సలుపుఁ ♦ డంచు వచించిన మంత్రులెల్ల న
న్నరపతి మాటలన్ విని యె♦నర్తుము దేవరయాజ్ఞచొప్పునన్. ౧౮ 271

క. అని పలికి వృద్ధికరవా, క్యనికరమున ధరణినాథ♦కాంతుఁ దనిపి నె
మ్మనమున నలరుచు ధర్మ,మ్మునెఱింగిన విప్రవరులు ♦ పోవలఁచి తగన్. 272

క. నరపతిచే ననుమతులై, గురుకార్య స్సిద్ధి సాగఁ ♦ గోరిన రీతిన్
నరనాథా! యని పలుకుచు, ధరణిసురులు వచ్చినట్లై ♦ తమి నేగుటయున్.

చ. నరపతి యంత విప్రులు చ♦నంగనె ఋత్విజు లెట్టు లానతి
చ్చిరొ యటుసర్వవస్తువుల ♦ సిద్ధము చేయుఁడు మంత్రులార! య
ధ్వరమును జక్కఁగా నొనరు♦పం దగినట్టులుగా మెలంగుఁ డీ
నిరత మటంచుఁ బల్కి తన ♦ నిశ్చయమెల్లను దెల్పి వేడుకన్. ౨౦ 274

తే. చెంతనున్నట్టి సచివుల ♦ క్షితిపతీంద్రుఁ
డనిపి సంతోషమునఁ దన ♦ మనము పొంగఁ
దేజరిల్లుచుఁ దనదగు ♦ దివ్యసౌధ
మునకుఁ బోయి గృహాంతర♦మున నతండు. ౨౧ 275

చ. మనమున కింపుఁ బెంచు తన♦మానినులం గని పల్కె నే నిఁకం
దనయులఁగోరి యజ్ఞము, ను♦దారమనీషుల తోడుపాటుచే
నొనరుతు మీరలెల్ల మది ♦ నూనిన భక్తిని దీక్షఁబూనుఁడీ
యనుటయుఁ జాల నిష్టమగు ♦ నప్పలుకుల్ విని సంతసమ్మునన్. ౨౩ 276

తే. అలరుచున్న సువర్చస♦లైన వారి
ముఖపయోజాతములు హిమ♦ము చన నవలఁ
దామరలు వోలె శోభిల్లెఁ ♦ దనయవృద్ధి
కలుగు నను నాశతోఁచిన ♦ కారణమున. ౨౪ 277

ఎనిమిదవ సర్గము సంపూర్ణము.

## ౯-వ సర్గము.

### ఋశ్యశృంగుని చరిత్రము.

చ. క్రతువొనరింతు నేననిన ♦ ధ్మాపతి వాక్యము నాసుమంత్రుఁడర్
మతివిభవంబునం దనరు ♦ మంత్రి, మనంబున నెంచి యొంటిగా
క్షితిపతి యున్నసౌధమును ♦ జేరి వచించెను ఋత్విజుల్ దయన్
సుతతతి యుద్భవించుటకుఁ ♦ జూపిన యజ్ఞవిధంబు నంతయున్. ౧ 278

క. వినుమీ యితిహాసంబుగ, మునునే విని యున్నవాఁడ ♦ మునుల పరిసరం
బున నాభగవంతుండగు, సనత్కుమారుండు చెప్పె♦సరసోక్తులతోన్. ౧ 279

క. తనయులు నీకుదయించెదు, ఘనగాథను దాని విధముఁ ♦ గడుముదమున నే
వినిపింతు భూమిపాలా!, యని సూతుఁడు చెప్పఁదొడఁగె ♦ ననువొంపంగన్.

క. మునిపతి యగు కాశ్యపునకుఁ, దనయుండు విభండకాఖ్యుఁ♦డగు వాఁడు జనిం
చెను ఋశ్యశృంగనామక, తనయు నతఁడు గాంచు విస్తృ♦తఖ్యాతియుతున్.

క. అతఁడు వనస్థలి యందే, సతతముఁ బెరుగుచు నరణ్య♦చరుఁడై యెపుడున్
బితరుని గూడియె తిరుగుట, క్షితిసురవరుఁ డెఱుఁగఁడేమి ♦ క్షితిపైఁ గలదో.

క. వనమొండు తక్క నితరం,బును నేమియు నెఱుఁగకుండు ♦ మునిపతికి మహా
త్మున కనికిని ద్వైవిధ్యము, దనగారును బ్రహ్మచర్య♦తతనియమమునన్. ౪

ఆ. అద్ది యెట్టులనిన ♦ నవనీసురప్రోక్త, మయి ప్రసిద్ధినొందు, ♦ నదియుఁ బెండ్లి
యగుటకన్న మున్న ♦ యగు నొక్కరీతిగ, దానివెనుక వేఱు♦గానెసంగు. ౫

క. జ్వలనునకు యశోనుహిమల, నలరెడు తండ్రికిని దగిన♦యట్లుపచారం
బులఁ జేయుచు వర్తిల్లెడు, నల మానికిఁ గొంతకాల ♦ మాగతి గడచున్. ౬

క. తొలి బ్రహ్మచర్యమున న,య్యలఘుగుణుం డుండునట్టి ♦ యవసరమున దో
ర్బలమున, శౌర్యంబున, నుజ్జ్వలుఁడై తనరారు రోమ♦పాదుం డనినన్. ౭ 286

క. ఆరాజె యంగదేశ, శ్రీరంజితుఁడై పొగడ్తఁ ♦ జెందఁ గలఁడు త
ద్భూరమణుఁడు ధర్మంబును, గారవమునఁ బ్రోవకుంటఁ ♦ గఱవు జనించున్.

క. భూతౌఘభయంకరమై, యాతఱి ఘోరంబుగాఁగ ♦ నది చిరకాలం
బాతతబాధాస్పదమగుఁ, జూ, తద్దేశంబు నందుఁ ♦ జూడఁ గఠినమై. ౮ 288

క. మనుజేంద్రుఁ డనావృష్టియుఁ, దనదేశంబునఁ జెలంగఁ ♦ దా దుఃఖితుఁడై
ఘనశాస్త్రవేత్తలగుచున్, వినుతింగను విప్రవరులఁ ♦ బిలిపించి తగన్. ౯ 289

తే. సర్వధర్మంబుల నెఱింగి ♦ యుర్విఁ దనరు
చున్నయాచారముల రీతు ♦ లన్ని యెఱిఁగి
యలరుదురు మీర లిప్పుడీ ♦ యిలను క్షామ
మనఁగఁ దగినట్టి నాపాప♦మునకు ముక్తి. ౧౦ 290

తే. ఎట్టి నియమంబు సేసిన ♦ నిది తొలఁగునో
యట్టి పాచితమును గృప ♦ నానతిచ్చి
కావరే యంచు నడుగు; నా♦త్మానురేంద్రు
లఖిల వేదాబ్ధిపారగు ♦ లాట వలన. ౧౦౪ 291

పంచచామరము. ధరాధిపా! విభండకాఖ్య ♦ ధాత్రి వెల్గు మానిశా
వరాత్మజాతుఁడుండు నేయు♦పాయమైనఁ బన్ని నీ
ధరాతలంబుఁ జేర్పు వాని ♦ దైవతుల్యుఁ గాఁగ హృ
త్సరోజమందు నెంచి యాత్మ♦జాత నిచ్చి భక్తితోన్. ౧౧౪ 292

తే. నిర్విచారంబుగాఁ బూజ ♦ నెఱపి ఋశ్య
శృంగు నలరింపుముని వారు ♦ చెప్ప వినుచు
నియతమగు బ్రహ్మచర్యంబు ♦ నెఱపుచున్న
యతని రప్పింప నేయుపా♦యంబు గలదొ. ౧౨౪ 293

క. అని యారాజు విచారం,బును బొందియు మరల, నతఁడు ♦ బుద్ధివిశేషం
బునఁ బొలుచుఁగాన మంత్రులఁ, గని విప్రులఁ దోడి తేరఁ♦గా ద్విజులెఘనుల్.

క. అని నిశ్చయించి యాతఁడు, తనమంత్రిపురోహితులను ♦ దమి సత్కృతులన్
దనిపి యటఁ బంపఁగలఁ డా, జనపతి మాటలను వినుచు♦సచివాదు లొగిన్.

తే. ఖిన్నులై తలవంచి యో♦క్షితిపతీంద్ర
పోవఁగాఁ జాల మచటికిఁ ♦ బూజ్యుఁడౌ వి
భండకున కేము వెఱతుము ♦ పలుకులేటి
కనుచు వారలు రాజేంద్రు ♦ ననునయించి. 296

చ. మునిసుతుఁ దోడి తేరఁదగు ♦ బుద్ధివిశేషము లొప్ప వారిన
ప్పునికి నుపాయముల్ తలఁచి ♦ వారునచింతురు రాజుతోడ నా
తనిఁ బిలిపింతు మేము నృప ♦ దానను దోషము బ్రహ్మచర్యని
ష్ఠను దగు వాని నించుకయుఁ ♦ జాలదు పొంనగఁ జింతమానుమీ. ౧౬ 297

క. అని పలుకుదు రని యాగతి, సనత్కుమారుండు చెప్పె ♦ జగతీవర! య
మ్ముని నట్లె వారవనితలఁ, బనిపియె పిలిపించె నృపతి ♦ పత్తనమునకున్. ౧౬౪

చ. ముని యరుదేర మబ్బులగ♦ముల్ తగు వృష్టి నొసంగ *శాంతనాఁ
దనరు కుమారి నాతనికిఁ ♦ దద్దయుఁ బ్రీతినొసంగి పెండ్లిచే
సె నతఁడు నీకు నల్లుఁడగు ♦ సిద్ధము నీకు సుపుత్రసిద్ధియా
నని వరమిచ్చునంచు ముద♦మార సుమంత్రుఁడు చెప్పి క్రమ్మఱన్. ౧౭౪ 299

* దశరథునకు శాంత యౌరసపుత్రిక. ఆమెను రోమపాదునకు దశరథుఁ డొసంగెను. కావున నాతనికి దత్తపుత్త్రిక. శాంతభర్త యగుఋశ్యశృంగుఁడు దశరథరోమపాదులకు నల్లుఁడని తెలియఁదగు.

తే. మండలేశ ! సనత్కుమారుండు చెప్పి
నట్టి వృత్తాంతమును మీకు ♦ ననువదించి
నాఁడ నన విని ముదమందె ♦ నాకుఁ జెపుమ
యతనిఁ దోడ్కొని వచ్చిన ♦ యవ్విధంబు. ౧౯ 300

తొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦-వ సర్గము.

వేశ్యలు ఋశ్యశృంగుని దోడ్కొనివచ్చుట.

చ. అని నరనాయకుండడుగ ♦ నా సచివోత్తముఁ డిట్లు పల్కె నో
మనుజవరేణ్య ! యమ్మునికుమారుని రాకకు మంత్రులెల్లఁ జే
సినవిధమెల్ల నీకుఁ దమిఁ ♦ జెప్పెద నంతఁ బురోహితుండు మం
త్రినికరయుక్తుఁడై నరప ♦ తిం గని యిట్టులు పల్కె నేర్పుతోన్. ౧ 301

క. నిరపాయమగు నుపాయము, నరసితి మాఋశ్యశృంగుఁ ♦ డటవీస్థలిలోఁ
దిరుగుఁ దపస్స్వాధ్యాయన, నిరతుండగుఁ జూ పురాణ ♦ నికరమునైనన్. ౨

క. ఇతిహాసంబులనైనన్, మతి నెఱుఁగఁడు గాన స్త్రీల ♦ మాట యెఱుఁగఁడా
గతి శబ్దాదివిషయ సం,తతి సౌఖ్యము నెఱుఁగఁ డతఁడు ♦ తథ్యము సుమ్మీ. 3

క. మనుజుల చిత్తాళిఁ గలం,ప నభిమతములై చెలంగఁ ♦ బ్రాథములుగ దా
కన నింద్రియార్థములు మా, నిని వానిని వశునిఁ గాఁగ ♦ నేర్తు మొనర్పన్.

తే. అట్లు లొనరించి మనవీటి ♦ కమ్మునిసుతుఁ
డెలమి నేతెంచునట్లుగా ♦ నేమొనర్తు
మిపుడ నిశ్చయమొనరించి ♦ నృపవరేణ్య !
యాజ్ఞదయసేయుఁడీ మాకు ♦ నని మఱియును. ౪ 305

చ. సురుచిరరూపసంపదల ♦ శోభిలి యాభరణాళిచే సునో
హరలయి మన్ననంబడసి ♦ యందఱి చిత్తములం గలంచు చా
తురిఁ దగు వేశ్య,లమ్మునిని ♦ దోడ్కొని రాఁజనరౌ; నటన్ మునీ
శ్వరుఁ బలుమాయలూని దగ ♦ వంచన సేయుచుఁ డోడితేఁదగున్. ౫ 306

తే. అట్లు సేయుట కావేశ్య ♦ లర్హలనిన
భూపతి పురోహితునిఁ జూచి ♦ యాపనిదినె
చేయుఁడని చెప్పె, నట్లె యా ♦ క్షితిసురుండు
మంత్రులకుఁ జెప్పెఁ, జేసి ర ♦ మ్మాడ్కి వారు. ౬ 307

చ. జనముల సత్కృతిం బడయఁ ♦ జాలిన వేశ్యలు మంత్రివాక్యమున్
విని, యట నామహావనము ♦ వేడుకఁ జేరి ఋషీంద్రపుత్రుఁడై

తనరుచు, నాశ్రమంబున సతతంబు వసించుచు ధీరుఁడైన య
మ్మునిసుతుఁ జూడ యత్నమును బూనికఁ జేసిరి నేర్పు పెంపునన్. ౭ 308

ఆ. ఆశ్రమంబు చెంత నతివలు నివసించి, రామునీంద్రపుత్రుఁ డనవరతము
తండ్రి కడనె నిలిచి తగినట్లు శుశ్రూష, సేసి దానివలన సిద్ధిఁ గాంచి. ౮

క. తన పర్ణశాల వీడి యొ,కనిముసమైనను మఱొండు కడ కేగక యుం
డును వాఁడు జననమాదిగఁ,గని యెఱుఁగఁడు స్త్రీలఁబురుష కాంతులనెచటన్.

తే. నగరములయందు గ్రామగణములయందుఁ
గలిగిన పదార్థమును దేనిఁగాని చూచి
యెఱుఁగఁడా విప్రసుతుఁ డంత నఱకు, నంత
విధిగతి విభండకసుతుండు వేడుకలర. ౯ 311

చ. వనితల సంగతిం దనరు భవ్యవనంబున కొక్కనాఁడు న
చ్చెను వనినందుఁ గన్గొనియెఁ జెల్వుసురం బగు వారకాంతలన్
ఘనుఁ డతఁ; డావధూమణులు కమ్రగళస్వన మొప్పఁ బాడుచున్
గనదురు చిత్రవేషములఁ గ్రాలుచు నమ్మునిఁ గాంచి ప్రీతితోన్. ౧౦ 312

క. చేర నరుదెంచి యంతలు, భూరిగుణా! యెవరికీవు పుత్రుఁడవో యీ
ఘోరవని విజనముగఁ దన, రారఁగ నీవొంటిఁ దిరుగు క్రమమిది యేమో.

క. తెలియంగ మాకుఁ గోరిక, కలిగెన్ వచియింపవయ్య! కరుణననిన న
ప్పలుకులకు నలరి యటవీ, స్థలిసం బెన్నండు మున్ను నరసాకృతులన్. ౧౨

ఆ. కోరఁదగిన యట్టి చారులావణ్యంబు
కలిగినట్టి సతుల గాంచి యెఱుఁగఁ
డట్టులోట మనసు సందూహ జనియించెఁ
దండ్రిఁ దన్నుఁ జెప్పఁ దగునటంచు. ౧౩ 315

సీ. కౌతూహలమున నక్కాంతలఁ గని యిట్లుపల్కె మాతండ్రి విభండకాఖ్యుఁ
డతనికే నౌరససుతుఁడను ఋశ్యశృంగాఖ్యచేఁ దగువాఁడ నటవి నిందు
మత్తపోహపకర్మము ఖ్యాతమౌ; శుభదర్శనులార! యీధరణికెన్న
సన్నికృష్టమున నాశ్రమమస్మదీయంబు గలదందు విధియుక్తిగాను మీకుఁ

తే. బూజ చేసెద రండనఁ బూవుబోఁడు, లతని యాశ్రమదర్శనమందు బుద్ధి
పొడమ నాతని వెంబడిపోయిరచటి; కచట నామౌనిపుత్రుఁ డభ్యాగతులకు.

క. ఇదె యర్ఘ్య మిదియె పాద్య, మ్మిది మూల మ్మిదె ఫలౌఘ మెలమిని గొనుఁడీ
నవమలమతులారా! యని, ముదమునఁ బూజలనొసఁగెఁ బూబోఁడులకున్.

చ. వనితలు మౌనిపూజల నవార్యముదంబుమెయిన్ గ్రహించి యా
తని మృదుభాషణంబులకుఁ దద్దయుఁ బొంగి విభండకాఖ్యుఁడౌ

మునిఁ దలపోసి భీతిలుచు ♦ బుద్ధుల నెంచిరి సత్వరంబుగాఁ
జనుటయె మేలటంచు ముని♦సత్తముతోడ వచించి రంతటన్. ౧౮ 318

ఆ. ఆర్య ! మే మొసంగు♦నట్టి యీఫలముల
త్యుత్తమములు గొనుము ♦ యురుశుభములు
గలుగు నీకు, నింకఁ ♦ గాలంబుఁ బుచ్చక
భక్షణంబు చేయ♦వలయు వీని. ౧౯ 319

చ. అని మునిఁ గౌఁగిలించి విన♦యంబున వేఁడుచు హర్షయుక్తలై
వనిత, లనేకరీతులగు ♦ భక్ష్యము లాతని కిచ్చి మోదుకా
దినిఖిలరమ్యవస్తువులఁ ♦ దృప్తిగ నిచ్చి రతండు నిత్యమున్
వనమున దివ్యతేజమున ♦ వాసముసేసెడి వాఁడు గావునన్. ౨౦ 320

క. మును చవియోఁ జూచి యెఱుం,గని యాభక్ష్యముల నెల్లఁ ♦ గైకొని తాన
వ్వని రుచిఁజూడనిఫలములె, యని వానిం దలఁచి ప్రీతి ♦ నాస్వాదించెన్. ౨౧

ఆ. అపుడు వారకాంత ♦ లాతనితో నొక్క, వ్రతము నాచరింప ♦ వలయునన్న
వ్యాజమూని చనిరి ♦ యాతనితండ్రికి, భీతినొంది యతని ♦ ప్రీతిఁ బాసి. ౨౨

ఉ. అంతటఁ గాశ్యపాత్మజని ♦ యాగణికల్ చనినంత దుఃఖము
త్యంతము తన్ను నేఁప హృద♦యంబు సుఖస్థితి నుండి వీడి తన్
వంతలఁ బెట్టఁగా సుఖని♦వాసము మాని చరించుచుండి య
క్కాంతలు చారుభూషలని♦కామతనూరుచులన్ వెలుంగుచున్. ౨౩ 323

క. తనకుఁ గనంబడిన వనం,బున కేగెను మఱుదినంబె ♦ పోలఁ దపోవీ
ర్యనిబద్ధుఁడయ్యు నతఁడిటు, వనమున కేతెంచుచున్న ♦ వైఖరిఁ గనుచున్. ౨౪

క. వనముల మోదము చెలఁగం,గ నెదుర్కొని పలికిరిట్లు ♦ గణికలు సౌమ్యా !
మునివర ! మా యాశ్రమపద,మును జూడఁగ రమ్ము యందు♦మోదముగలుగున్.

ఆ. మాస్వదేశమందు ♦ మంజులఫలమూల, భక్షణాదివిధులు ♦ వఱలుచుండు
నింతకంటె నెంతొ ♦ హెచ్చుగ ననిపల్క, మనసు గరఁగఁ జేయు♦మాటలు విని.

సీ. వారితోఁ గూడి పో♦వంగఁ దలంచె నాతఁడు వానిఁ గొనిపోయి♦తరుణులపుడె
నావపై నెక్కించి ♦ పావనగంగను దాఁటించి చేర్చిరి ♦ తమజనపద
మున కిట్టులస్సహా♦త్ముఁడు భూసురుఁడు రాఁగ జగములకుల్లాస♦మొగి నొసఁగుచు
నప్పుడె పర్జన్యుఁ ♦ డధికవృష్టి నొసంగె వర్షముతోఁ గూడి♦వచ్చు విప్రు

తే. స్వీయదేశంబు నొందుచుఁ ♦ జెలఁగు వాని
జనపతియుఁ గాంచి వినతుఁడై ♦ సరసఁజేరి
భూమిఁ వ్రాలి నమస్కార♦ములు నొసర్చి
యర్ఘ్యపాద్యాదులను సల్పె ♦ న్యాయరీతి. ౨౫ 327

చ. మునిపతి నిట్లు పూజలఁ బ్ర♦మోదితచిత్తునిఁ జేసి వేశ్యలా
తనిఁ గొని తెచ్చినందులకుఁ ♦ దండ్రికి "సూనుని మోసగించి తో
డ్కొని చన నొంటిఁజిక్కి తన♦కూరిమిపుత్త్రునిఁ జూడకున్న నె
మ్మనమునఁ గుందుఁ బొందు జన♦మాన్యునకుం గ్రుధగల్గకుండఁగాన్". ౩౦
తే. నీప్రసాదంబు కాంక్షింతు ♦ నేనటంచు
వేఁడె; నారోమపాదుండు ♦ విపుల మౌని
నంతిపురమునకుం గొని ♦ యరిగి యాత్మ
జాతసాధుగుణవ్రాత ♦ శాంత నిచ్చి. ౩౧ 329
చ. నరపతి శాంతచిత్తమున ♦ న్యాయవిధిం దమిఁ బెండ్లి సేసి హృ
త్సరసిజమందుఁ దృప్తిఁగనె; ♦ శాంతనుగూడి విభండకాత్మజుం
డురుతరసర్వకామముల ♦ నొందుచుఁ దేజముతోడ వెల్గుచున్
బురమున నందె యుండెఁ బరి♦పూర్ణమనంబుల నందఱున్ గనన్. ౩౨ 330

పదియవ సర్గము సంపూర్ణము.

## ౧౧ - వ సర్గము.

దశరథుఁడు ఋశ్యశృంగుని దోడ్కొనిపిచ్చుట.

చ. క్షితిపతిసత్తమా! మఱియుఁ ♦ జెప్పెను దేవవరుండు సాధుస
మ్మతుఁడు సనత్కుమారుఁడు స♦మంజసరీతిఁ గథన్ దదుక్తమై
హితమగునాదుపల్కు విను ♦ మేమన సూనృతవాక్యమొప్ప న
ప్రతిమవదాన్యుఁడై తనరు ♦ రాజిలఁబుట్టగలండు ధీరుఁడై. ౧ 331
తే. ఆతఁడిక్ష్వాకుకులకల♦శార్ణవాబ్జుఁడగుచు దశరథుఁ డనుపేర ♦ నలరి సిరులు
తనరఁగా నంగదేశభూ♦ధవునితోడఁ, జెలిమి యలరార వర్తిలు♦క్షితితలమున.
సీ. అంగదేశాధినా♦యకునకు రోమపాదుండనునొకతన♦యుండు గలుగు
నతనికి శాంతనా ♦ నలరు మహాభాగ తనయజనించు, స♦ప్యశమునఁ దగు
దశరథుఁ డాయంగ ♦ ధరణీశు కడకేగి ధర్మాత్మ! నేను సం♦తానహీనుఁ
డను, నాదుయజ్ఞంబు ♦ ననువొంద నెఱవేర్చు నాకులంబునకు సం♦తానసిద్ధి
తే. కొఱకు నీయనుమతిని నీ♦కూఁతు మగఁడు,
నాఁగవిని యాత్మవంతుఁ డ♦నంగఁ దనరు
నట్టి యంగేశుఁడూహించి ♦ యతనిఁ బుత్త్ర
వంతు నీయంగలండు భూ♦వరున కెలమి. ౩ 333
చ. కలవిలపాటులేక మది ♦ గ్రాలఁగఁ బంక్తిరథుండు మౌనిని
శ్చలమతిఁ గూడి హృష్టమయి ♦ స్వాంతము రాజల నన్మఖంబు వి
ప్రుల కృపఁ జేయఁగాఁ గలుగు ♦ భూసురమౌనికుమారునిం గృతాం
జలియును ధర్మవేత్తయు య♦శస్స్ఫురణుండును నైనరాజొగిన్. ౪ 334

తే. పుత్రకామేష్టి నొనరింపఁ ♦ బుత్రులఁ గన,
దాన స్వర్గము నొందఁగఁ ♦ దావరించు
నాద్విజశ్రేష్ఠువలనఁ గా♦మ్యక్రతువును
జేయఁగల్గును గోర్కెలు ♦ సిద్ధినొంద. ౯ 335

క. అతనికి నలువురు కొడుకు, ల,మితవిక్రము, లన్వయమ్ము ♦ మిగులఁ బ్రతిష్ఠా
కృతినొందఁ జేయు వారలు, హితులును లోకప్రసిద్ధి ♦ నెసఁగిన వారల్. ౧౦

క. కలుగంగఁ గలరటంచును, బలికెను నిర్జరవరుండు ♦ భగవంతుఁడునై
చెలఁగెడు సనత్కుమారకుఁ, డలరుచు మును కృతయుగంబు ♦ నందీగాథన్.

చ. తనయులఁగోరు నీవె చని ♦ ధారణిపాలక ! పూరుషోత్తమా !
వినయము మీఱఁ బూజలను ♦ వేడుక నందఁగఁ జేసి యమ్మహా
త్మునిఁ గొనిరమ్ము సైన్యముల♦తోఁ దగువాహనపంక్తితోడనం
చని, తనమంత్రిచెప్ప విని ♦ సద్గురువైన వసిష్ఠునంతటన్. ౧౨ 338

ఆ. పిలువనంపి పూర్వ♦వృత్తంబుఁ జెప్పించి, యవ్వసిష్ఠమౌని ♦ యనుమతింపఁ
బూర్ణమానసమున ♦ భూపతిశాంతతో, నతనిఁ దోడ్తేర♦ నరుగఁదలఁచి. ౧౩

క. కులసతులు మువ్వురును మంత్రులు తోడనరాఁగ వేడ్క♦తోడఁ గదలి యు
జ్జ్వలవైభవంబు మెఱయఁగ, నిలాధిపతి యేగె మౌని ♦ యెసఁగెడు పురికిన్.

చ. వనముల నిమ్నగావళుల ♦ వైభవమొప్పఁగ మెల్లమెల్లఁగాఁ
గనుఁగొనుచున్ విభండకుని ♦ గాదిలిపుత్రకుఁ డున్న దేశమున్
గని యటఁ జొచ్చి యానృపతి♦కాంతుని చెంగట నుండి మందు న
య్యనలునిరీతి వెల్గు ముని♦నాతనిఁ గన్గొనియెన్ ద్విజోత్తమున్. ౧౫ 341

చ. తనచెలికానిరాకకు ము♦దంబున స్వాంతము పొంగ నంగరా
జును విధిరీతి హెచ్చుగనె ♦ సొంపుగఁ బూజలొనర్చి మౌనిరా
ట్తనయుని సన్మనీషుఁ గని ♦ దావచియించెను శాంతతండ్రి ! యీ
జనవిభుఁడే తలోదరి నొ♦సంగెను నాకును గూర్మిఁ బెంపునన్. ౧౬ 342

తే. కన్నకూఁతునుగా శాంతఁ ♦ గడు ముదమునఁ
బెంచుకొన్నాఁడ నీతండు ♦ ప్రియతమసఖుఁ
డనుచు సఖ్యసంబంధము♦లను వచించె
మునియు మామకుఁ బూజల ♦ నొనరిచెఁ దమి. ౧౭ 343

చ. మనుజమృగేంద్రుఁడై పరఁగు ♦ మండలనాథుఁడు రోమపాదుచే
తను మునిచేతఁ బూజఁ గొని ♦ తత్పురవర్యమునన్ వసించె నే
డెనిమిది వాసరంబు లట ♦ నెంతయుఁ దృప్తినిఁ బొంది రోమపా
దునిఁ గని యిట్లనున్ దశర♦థుండు మనోరథభంగి యేర్పడన్. ౧౮ 344

చ. సరసమునీశ! నీదుహిత ♦ శాంత నిజేశ్వరుతోడ వేడ్క ను
త్పురికిని రాఁదగున్ జరపఁ ♦ బోలును గార్య మొకండు వారు; నా
ధరణివిభుండు మోదమునఁ ♦ దద్గమనంబున కొప్పి యమ్మునీ
శ్వరుఁగని భూధరాధిపతి ♦ సంగతి భార్యనుగూడి పోఁదగున్. ౨౦ 345

చ. అనుటయు నావిభండకుని ♦ యాత్మజుఁ డీకొని వీడుకోలుఁ గై
కొని తమి భార్యఁగూడి చను ♦ కోరిక నొందె; నరేంద్రులిద్దఱొ
య్యనఁ దమవక్షముల్ దగులు ♦ నట్టివిధంబునఁ గౌఁగిలించి స్నే
హానిరతి నంజలుల్ సలిపి ♦ యప్పుడు మోదరసాబ్ధిఁ దేలుచున్. ౨౧ 346

క. చెలికాని సెలవుగొని రఘుకులతిలకుఁడు దశరథుండు ♦ కుతుకంబు మెయిన్
దెలుపం దను రాకను దూతలఁ బంపెను శీఘ్రగతులఁ ♦ దనపురమునకున్.

తే. పరిమళము చల్లునట్టి ధూ♦పములు వేసి
యవలఁ గలయంపి చల్లుచు ♦ నంత నూడ్చి
కదళికాకాండములఁ బతా♦కలను గట్టి
పురముఁ గై సేయఁ దగునని ♦ భూపుఁ డనుప. ౨౩ 348

చ. క్షితిపతి రాక దూతలొగిఁ ♦ జెప్పినఁ బౌరులు సంతసిల్లి య
ద్భుతముగ నప్పురోత్తమము ♦ భూపతి యానతి యిచ్చిపంపిన
ట్లు తగ నలంకరించి రపు♦డెంతయు వేడుక విప్రసంఘ్యఁ ద
త్పతినిఁ దగంగఁ దోడుకొని ♦ శంఖముఖస్వనముల్ చెలంగఁగన్. ౨౪ 349

క. సమలంకృతమైన పురోత్తమమును దరవసుఁడు, చొచ్చెఁ ♦ దత్పౌరవరుల్
సముచితపుతుల్యుఁడయి తగు, తను దోడిటు సత్కరించి ♦ ధాత్రీసుతునిన్.

క. కొని రాఁగ నతనిఁ గనుఁగొని, జనముల సంతసిలి; రంత ♦ మనుజేంద్రుం డ
మ్మునినంతిపురముఁ జేరిచి, తని పొందని భక్తి విధియు♦తంబుగ మునికిన్. ౨౬

తే. పూజలొనరించి యాతనిఁ ♦ బురికిఁ దోడు
కొనుచు వచ్చిన కారణ♦మున నె తనను
దలఁచెఁ గృతకృత్యుఁగా నంత ♦ ధరణివిభుని
పత్నులెల్లను సంతోష♦భరితలగుచు. ౨౭ 352

క. పతిఁ గూడి యిట్లు వచ్చిన, సతిని విశాలాక్షిఁ జూచి ♦ శాంతను మోదా
ప్రతిమానజలధి మునిఁగిరి, క్షితినాథుఁడు సుతులుఁ దను వి♦శేషప్రీతిన్. ౨౮

తే. పూజలను దన్పుచుండ న♦ప్పూవుబోఁడి
శాంత ఋత్విజుఁడౌ ప్రియ♦కాంతుఁ గూడి
సౌఖ్యమునఁ దేలుచున్ బుర♦సత్తమమునఁ
జెలఁగు వేడుకతో నివ♦సించె నంత. ౩౦ 354

పదునొకండవ సర్గము సంపూర్ణము.

## ౧౨-వ సర్గము.

—దశరథుఁడు యజ్ఞము సేయఁబూనుట.—

క. చిరకాలము గడువ మనో,హరతమము వసంతసమయ ♦ మరుదేరఁగ భూ
వరునకు న త్తఱి మనమున, హరిమేధ మొనర్ప వలయు ♦ నని స్ఫురియించెన్.

క. సురతేజంబున వెల్గెడు, ధరణీసురుఁ గాంచి దశర♦థక్షితిపతియున్
శిరము ధర సోఁకఁగా మ్రొ,క్కి రహిం బ్రార్థించి భక్తిఁ♦గీర్తించి తగన్. ౧

తే. సుప్రసన్నునిగాఁ జేసి ♦ సుతులనాత్మ
వంశవృద్ధికరులను దాఁ ♦ బడయఁ గోరి
యజ్ఞమొనరించుటను దెల్పి ♦ యమ్మునీంద్ర
తనయు వరియించె నిట్లు స♦త్కారమంది. ౨ 357

చ. మునిపతి యట్లె యౌననుచు ♦ భూపతితో వచియించి యజ్ఞవ
స్తునికరమెల్లఁ గూర్పనగుఁ ♦ దోషనె యజ్ఞహయంబుఁ బంపనౌ
ననవుడు మంత్రివర్యుఁడగు ♦ నట్టి సుమంత్రునిఁ గాంచి భూపుఁ డి
ట్లనియెను బిల్వనంపు మిఁక ♦ యజ్ఞము సేయఁగ విప్రవర్యులన్. ౩ 358

తే. వేదపారగులైన ఋ♦త్విజుల ఘనుల
వామదేవ సుయజ్ఞ జా♦బాలి కాశ్య
పాహ్వయులను బురోహితుఁ♦డైన యల వ
సిష్ఠమునిచంద్రు, నితరుల ♦ క్షితిసురులను. ౪ 359

చ. అనుటయు నాసుమంత్రసచి♦వాగ్రణి సత్వరమేగి తోడి తె
చ్చెను శ్రుతిపారముంగనిన ♦ క్షిత్యమరోత్తములన్; సమస్తధ
ర్మనియతులన్ జెలంగిన ధ♦రావరుఁ డంతట వారిఁ జూచి పూ
జనములఁ దన్పి యుక్తనుయి ♦ చారుతరార్థము గల్గి ధర్మ్యయు
క్తిని దగియున్న వాక్కుల నొ♦గిం బలికెన్ బుధులెల్ల నౌననన్. ౫ 360

ఉ. భూసురులార ! పుత్త్రులను ♦ బొందుటకై విలపించుచున్న నా
కాసుతలాభసౌఖ్యము వి♦యత్పథతుల్యముగాఁ జెలంగె, నే
నీసమయంబునన్ మదిని ♦ నింపెసలారెడు కాంక్ష దీరఁగాఁ
జేసెద నశ్వమేధమును ♦ జిత్తము తోడ్పడె దీనికెంతయున్. ౬ 361

తే. శాస్త్రదృష్టవిధిం బూని ♦ సప్తతంతు
వొనరుపం గోరెదన్ మౌని ♦ తనయుఁ డైన
ఋశ్యశృంగుని సాహాయ్య♦రీతిఁ జేయు
నీక్రతుమహత్త్వమున నిష్ట♦మేను గనుడు. ౭ 362

క. అనిరాజు తనంతన చెప్పినమాట వసిష్ఠముఖులు ♦ పృథ్వీసురులె

ల్లను మేలు మేలటంచును, ఘనముగ శ్లాఘించి భూమి♦కాంతునితోడన్. ౧౦

క. పలికిరి విభండకసుతా,దులు, విడునందగును వేగ ♦ తురగవరము, కా
వలసిన మఖసంభారం,బులు సిద్ధము సేయవలయుఁ ♦ బూనిక మెఱయన్. ౧౧

ఆ. అమితవిక్రముఁడ ♦ నలఘు నల్వురు కొడు
కులను నీవు పడయుఁ♦గలవు నిజము
సుతులకొఱకు నీకు ♦ నతుల ధార్మికబుద్ధి
యీవిధమున నిప్పు♦డెసఁగెఁ గాన. ౧౨ 365

చ. అనుటయు, బ్రాహ్మణోక్తులకు ♦ హర్షము నొంది యమాత్యులం గనుం
గొని శుభవర్ణసంతతిని ♦ గూడిన పల్కుల నిట్లు చెప్పె నీ
ఘనమతు లాడినట్టులె మ♦ఖక్రియకుం దగు వస్తుజాతమున్
గొని యొకచోటఁ జేర్పఁదగు ♦ ఘోటకవర్యము నంపఁగాఁ దగున్. ౧౩ 366

తే. మఱియు ముఖ్యర్త్విజులతోడ ♦ మఖహయమును
దానిఁ గాపాడఁగా నర్హు♦లైన యట్టి
సైన్యములతో విడుమనది ♦ సరయువనఁగఁ
బ్రథితమా నది కుత్తర♦భాగమందు. ౧౪ 367

క. క్రతుభూమిని నేర్పఱుపుఁడు, క్రతువిఘ్ననివారణార్హ ♦ కర్మములనే
గతి శాస్త్రము చెప్పునో యా,గతి సక్రమముగ నొనర్పఁ♦గాఁ దగుఁ జుండీ.

చ. వినుఁడొకమాట యజ్ఞమిది ♦ విశ్రుత మిందు ననర్థదంబుగాఁ
జనునపరాధమేఁ గలుగఁ ♦ జాలక యుండునయేని యందఱున్
జనపతు లిమ్మహాక్రతువు ♦ సంతసమొప్పఁగఁ జేయనర్హులే
యనఁ దగుఁ గాదె; యిమ్మఖమ♦హత్వ మెఱింగిన బ్రహ్మరాక్షసుల్. ౧౬ 369

తే. యజ్ఞకృత్యంబునం దెద్ది♦యైన రంధ్ర
ముండునా యని వెదకుచు ♦ నుండువార
లద్ది గల్గి యాయజ్ఞకా♦ర్యంబు సెడిన
నపుడె తత్కర్త నాశంబు♦నందుఁ జుండీ. ౧౭ 370

చ. నిరతము యజ్ఞకృత్యముల ♦ నేర్పఱులై తగు మీరలెట్టుల
ధ్వరమిది శాస్త్రసమ్మతిని ♦ బాగుగఁ బూర్తిని గాంచునట్లుగా
నరసి ప్రయత్నమున్ సల్పుఁ ♦ డంచు వచించిన మంత్రులెల్ల న
న్నరపతిమాటలన్ విని యొ♦నర్తుము దేవర యాజ్ఞచొప్పునన్. ౧౮ 371

క. అని పలికి రాజు మోదం,బును బొందఁగఁ జేసి కార్య♦మును భూపతి చె
ప్పినభంగి నొనర్చిరి వి,ప్రనికరమా ధర్మవిదునిఁ ♦ బార్థివవర్యున్. ౧౯ 372

క. అనఘాత్మ ¹ వృద్ధికరవా,క్యనికరమున నలరునట్లు♦గా నొనరిచి యా
తని యనుమతిఁ గైకొని వచ్చిన యట్టులె పోయిరట్లు ♦ క్షితిసురముఖ్యుల్.

క. అరుగంగ మంత్రివరులకు, నరపతి సెలవిచ్చిపంపి ♦ నైజనుహితసుం
దరహర్మ్యము దేహద్యుతు, లరుదుగఁ గన్పట్టఁజొచ్చె ♦ నామోదమునన్.

పండ్రెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౩-వ సర్గము.

అశ్వమేధయాగసంభారములఁ గూర్చుట.

చ. మరల వసంతమంతట స♦మంచితరీతిని రాఁగ నొక్కవ
త్సరము గతించె వీర్యమునఁ ♦ జాలఁ బ్రసిద్ధిని గన్న యమ్మహీ
వరుఁడు తురంగమేధమును ♦ భక్తి నొనర్పఁగఁ బూనె నాత్మజో
త్కరమును గాంతు నన్న, కుతు♦కంబు మనంబునఁ బొంగి పాఱఁగన్. ౧ 375

చ. తొలుదొలుతన్ వసిష్ఠునకుఁ ♦ దోరపుభక్తిని మ్రొక్కి న్యాయమొ
ప్ప లలితపూజలన్ సలిపి ♦ బ్రాహ్మణవర్య ! మునీంద్ర ! పుత్రకుల్
గలుగుట కేను జేసెడు మ♦ఖంబు యథాక్రమమొప్ప సాగి రా
జిలఁదగునట్లు చేయుఁడని ♦ చెప్పి యడంకువమీఱ నిట్లనున్. ౨ 376

తే. క్రతువు సంగము లెల్ల వి♦ఘ్నములపాలు
గాకయుండంగఁ జేయుఁడీ ♦ నాకు మీరు
ప్రియతరస్నిగ్ధులే కారె ? ♦ ప్రియతము గురు
వులు గదా నాడు క్షేమంబె ♦ తలఁచువారు. ౩ 377

క. మునివర ! నేఁజేయఁగఁ బూనిన యీమఖభారమెల్ల ♦ నీవె భరింపన్
గను దగుదు వనిన నీప్రార్థనమంతయుఁ దీర్చువాఁడఁ ♦ దప్పక భూపా! ౪ 378

చ. అని ద్విజసత్తముం డవల ♦ నధ్వరకృత్యముఁ దీర్ప వస్తువుల్
ఘనముగ సేకరింప మును ♦ క్ష్మాపతిచేత నియుక్తులైన స
జ్జనులను భూరిధార్మికుల ♦ సర్వజనస్తుతిఁ గాంచి పెద్దలై
తనరెడు శిల్పకారకులఁ ♦ వర్ధకులన్ భృతకవ్రజంబునున్. ౫ 379

తే. వాపికూపంబులను ద్రవ్వ ♦ వారి, గణకు
లను, మఱియుఁ జిత్రకారకు♦లను, సమర్థ
తముల నట నర్తకుల శుచి♦తను వెలంగి
నిఖిలధర్మంబులను విని ♦ నెగడు వారి. ౬ 380

తే. శాస్త్రముల నేర్చి వఱలెడు ♦ సత్పురుషులఁ
గాంచి వచియించె మీరెల్ల ♦ క్ష్మాతలపతి
యాజ్ఞ మఖకార్యముల నెల్ల ♦ నరసి నిర్వ
హింపవలయును బెక్కు వే♦లిష్టకలను. ౭ 381

సీ. సంగ్రహింపఁగఁ దగు ♦ సత్వరంబుగ రాజసదనముల్ వైభవ♦సహితములుగ
నాయామవి స్మృతు♦లనురంగఁ బెక్కుగుణములతోఁ గూడి ♦ సుసహితములు
గా నొనర్పఁబడు శుభ♦కలితంబులై బహు భక్ష్యాన్నపాన సం♦పదలు గలిగి
వర్షాతపాదుల♦వలన, నేబాధలు పొందకుండెడు నట్లు ♦ సుందరముగఁ

తే. పెక్కుశాలలు గృహములు ♦ ద్విజులకొఱకుఁ
గట్టఁ బట్టులై పురజన♦కాండమునకు
భక్ష్యముల నొప్పి విడిదియై ♦ భవ్యపుష్ప
హారచందనముఖముల ♦ నమరి మఱియు. ౧౧ 382

క. కోరినవస్తువులందు న, నారిగ నలరారునట్లు ♦ వసతుల నెల్లన్
మీరలు నిర్మింపుఁడు మఱి, చారుతరగృహంబులెల్ల ♦ జానపదులకున్. ౧౨

తే. పెక్కు నిర్మించి వారలఁ ♦ బేర్మిఁ గాంచి
విధియుతిని సత్కరించి యే♦విధమునను ని
రాకరింపక యన్నంబు ♦ రమణఁ బెట్ట
వలయు, నెల్లరు సత్కార♦ములను బొంది. ౧౨ 384

చ. అలరుచు నుండఁగా వలయు ♦ నర్హులు సత్కృతి నొంద నందఱున్
బలుకులు వేయునేల ప్రియ♦భావముతోడనె సత్కరింపఁగా
వలయును గాని మైత్రిఁ గ్రుధ♦వారి కవజ్ఞ నొనర్పరాదు ని
ర్మలమగు నశ్వమేధమున ♦ మందమనీషులు గాక పూనికన్. ౧౩ 385

తే. కృత్యములఁ దీర్చువారల ♦ కెల్ల నట్లె
శిల్పివరులకు హెచ్చుగఁ ♦ జేయవలయుఁ
బూజలొగి ద్రవ్యమున నన్న♦మునను వారి
యంతరంబులఁ గాంచి య♦ర్హమగు విధిని. ౧౪ 386

చ. ధనమున నన్నదానమునఁ ♦ దాము నిరంతరతృప్తిఁ గాంత్రు, శ్రే
మను జెలువారు చిత్తములు ♦ మంచిగ నన్నిపనుల్ యథాక్రమం
బున నెఱవేర్పఁగావలయుఁ ♦ బొందఁగ రాదు కొఱంత లేశమె
య్యనఁగడు జాగరూకులయి ♦ యామఖకార్యములం గనంబడున్. ౧౫ 387

చ. అనుచు వసిష్ఠమౌనివరుఁ ♦ డాడిన పిమ్మట వారలాతనిం
గనుఁగొనవచ్చి శాస్త్రవిధి♦ గాఁ దనరుండఁగ లోపలేశముం
గనఁబడకుండఁ జెప్పితిరి ♦ గాదె విధించినయట్లె చేయఁగా
మనమున నిశ్చయించితిమి ♦ మాపనులందుఁ గొఱంతరాదిఁకన్. ౧౬ 388

సీ. అవల సుమంత్రుని ♦ నచటికి రావించి పలికె వసిష్ఠుఁడీ ♦ యిలఁ జెలంగి
ధార్మికులైనట్టి ♦ ధాత్రీపతుల నెల్లఁ బిలిపింపు మట్టులె ♦ పృథ్వి, నన్ని

భాగంబులందున్న ♦ బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులఁ బిల్వఁ♦బంపు మర్హ
సత్కారములతోడ ♦ సరగునఁ బెక్కు వేలను; మిథిలాధినా♦థునిని సత్య

తే. విక్రముని శాస్త్రసంతతి ♦ వేదములను
బాండితిని గాంచి మేటియై ♦ పరఁగువాని
శూరవశ్యుని జనకుని ♦ శుభచరితుని
బిలువుమా యమ్మహాభాగుఁ ♦ బ్రియము మీఱ. ౨౦ 389

క. అతిశయ సత్కారంబుల, నతనిం బ్రియ మందఁజేసి ♦ యలరుచు నీవే
మతిమంత! పోయి ప్రార్థించి తగఁ దోడ్కొనుచు రమ్ము ♦ శీఘ్రమిచటికిన్.

క. చిరకాలమిత్ర,మా జన, వరుఁడీ దశరథున కౌటఁ ♦ బలికితి మునుపే
నరసరు నాతని ముందుగఁ, బురికిం దోడ్కొనుచు రమ్ము ♦ పూజ్యుఁడతఁడు సూ.

క. హితమధురోక్తులె పల్కుచు, సతతము దశరథుని మిత్ర♦సత్తముఁడగు భూ
పతిఁ గాశీపతి నతిస, త్కృతిఁ దోడ్కొనిరమ్ము నీవె ♦ యేగు మచటికిన్. ౨౨

ఆ. మిగుల ధార్మికుండు ♦ మిక్కిలి వృద్ధువు
మన ధరాధిపతికి ♦ మామ యగుచుఁ
దనరు కేకయాహ్వ♦యునిఁ బుత్రయుతు నీవె
పోయి దోడి తెమ్ము ♦ పూజ్యుఁడతఁడు. ౨౩ 393

సీ. అంగదేశేశు మ♦హాభాగుఁ గీర్తిమంతుని మనరాజవ♦యస్యునకు మిత్రు
బహుమానముల రోమ♦పాదుని నలరించి యిటఁ దోడి తెమ్ము నీ♦వేగి యతనిఁ
దూరుపుదిక్కునఁ ♦ దోఁచు సౌవీర సౌరాష్ట్రరాజుల సింధు♦రాజునట్లె
దక్షిణదిక్కునఁ ♦ దనరారు రాజులనందఱఁ బిలిపింపు ♦ మవని మనకు

తే. మిత్రులయి యున్నరాజులఁ ♦ బుత్రమిత్ర
బాంధవాదియుతంబుగఁ ♦ ద్వరగఁ బిల్వఁ
బంపుమనుచు వసిష్ఠుండు ♦ పలుక, విని య
తండు వే దూతలం బంపఁ♦దలఁచి యపుడు. ౨౪ 394

క. ధరణీశులఁ దోడ్కొని స,త్వరముగ రాఁ గుశలులగుచుఁ ♦ దగు దూతలఁ బం
పి రయమున మౌని యానతిఁ, బరికించి సుమంత్రుఁ డలరి♦పయనం బయ్యెన్.

తే. రాజవరులను దోడ్కొని ♦ రాఁగ సూతుఁ
డరుగ నంతట ముని మౌని ♦ యాజ్ఞనంది
యజ్ఞకృత్యంబు నెఱవేర్ప ♦ ననుమతించి
యున్న శిల్పిప్రముఖులెల్ల ♦ నొప్పు మెఱయ. ౨౬ 396

క. పనులను దా నొనరింపఁగ, ననువుపడినవానిఁ దీర్చి ♦ యమ్మునికడకుం
జనుదెంచి నివేదించిరి, పనుల తెఱంగెల్ల, మౌని ♦ పార్థివుఁడంతన్. ౨౭ 397

చ. పరమమునంబు నొంది పని♦వాంఛ్రను గాంచి వచించె నిట్లు, ల
ధ్వరమున నెవ్వరేమడుగ ♦ వారికి దానిని లీలనే ననా
దరమున నేని యీవల, దు♦దారమతిం దమి నియ్యనే; ననా
దరమున నీయఁగా నదియె ♦ దాతకు గీడొనరించి తీఱుదున్. ౩౦ 398

క. అనుమానము లేదని యమ్ముని యాడెను; బిదప రత్న♦ములఁ బెక్కంటిం
గొని కొన్నిదినములకు, రాజనికర మేతెంచె నా ద♦శరథునిఁ జూడన్. ౩౧

చ. క్షితిపతిఁ జూచి పల్కెను వ♦సిష్ఠుఁడు చాలఁ బ్రమోదమంది యు
న్నతభవదీయశాసనము♦నన్ నరపుంగవ! వచ్చినారు భూ
పతులు, యథార్హరీతి నృప♦వర్యుల నాదృతి సత్కరించితిన్
గ్రతువునిమిత్తమౌ పరిక♦రంబుల నెల్లను జెప్పినట్లుగన్. ౩౩ 400

తే. భూధవా! హెచ్చరికతోడఁ ♦ బురుషులెల్ల
సేకరించిరి చక్కఁగ ♦ సిద్ధపఱుపఁ
బడియె నయ్యజ్ఞభూమి స♦ర్వపరికరము
లను బ్రవేశింపు మద్ది చెం♦తనె చెలంగు. ౩౪ 401

తే. మనసుచే నిర్మితంబగు ♦ మాడ్కి నద్ది
వెలయు రాజేంద్ర! చూడంగ♦వలదె యనియె
నవ్విధినె ఋశ్యశృంగుండు ♦ ననియె నట్టు
లిరువురును జెప్ప భూనాథుఁ ♦ డెలమి మిగుల. ౩౫ 402

చ. తనరెడు పుత్రకాంక్ష ముని♦తల్లజులెల్లను దోడరాఁగ శో
భనతిథితారకల్ చెలఁగ ♦ వైభవమొప్ప మఖంబు చేయఁగాఁ
జనియె వసిష్ఠముఖ్యులగు ♦ భూసురసత్తములెల్ల శాంతభ
ర్తననుసరించి పోయి మఖ♦ధామముఁ జేరి యథావిధిం దగన్. ౩౬ 403

తే. శాస్త్రమున నెట్టు లధ్వర♦సరణి చెప్పఁ
బడియెనో దానిలోన ల♦వంబు దప్ప
కశ్వమేధంబు నొనరింప ♦ నపుడు మొదలు
పెట్టిరాఖండలాదులు ♦ ప్రీతినొంది. ౩౭ 404

పదమూడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౪-వ సర్గము.

దశరథుం డశ్వమేధము చేయుట

చ. జనపతిముక్తవాజిసుఖ♦శాలకు వత్సరమొండు పూర్ణమై
తనరినవచ్చె నాదశర♦థక్షితిపాలుని యశ్వమేధమున్
గన నరుదైనయట్లు విధి♦గా సరయూనదిసౌమ్యతీరమం
దునఁ జెలువారఁ జొచ్చె ద్విజ♦ధూర్జటులెల్లను బూన్కి మీఱఁగన్. ౧ 405

ఆ. ఋశ్యశృంగు ముందు ♦ నిడుకొని పరిశుద్ధ, బుద్ధియైన రాజ♦పుంగవుని సు
ఖంబునకును దగిన♦కర్మమ్ము నొనరించి; రంత వేదసార ♦ మంత యెఱిఁగి. ౭

సీ. ఋయాజకులగు విప్రు♦లపుడు యథావేదముగ యథామీమాంస♦ముగను గల్ప
సూత్రానుసారిగ ♦ శుభతమరీతిగ వర్తిల్లు విధినిఁ బ్ర♦వర్గ్యమన్లె
యుపసదంబను పేర ♦ నొప్పు నిష్టి నొనర్చి యుపదేశ శాస్త్రోక్తి ♦ నొగి నధికము
గాఁగఁ బ్రాప్తించెడు ♦ కర్మమ్ముల నొనర్చి రించు కేనియు విధి♦మించకుండఁ

తే. బిదప మునివరులందఱు ♦ ముదము నంది
కర్మదేవతలను భక్తి ♦ గదురఁ బూజ్య
భంగిఁ బూజించి ప్రాతస్స♦వనముఖములఁ
గర్మముల నాచరించిరి ♦ క్రమముమెఱయ. ౯ 407

క. శతమఖుని హవిర్భాగ, మ్మతులితవిధి మీఱ నిచ్చి ♦ రనఘుంబగుచున్
క్షితివెలయు సోమలతనున్, స్తుతిశస్త్రకదంబములను ♦ స్తుతియించి రొగిన్.

సీ. సవిధి మాధ్యందిన♦సవనంబు నడిపించి రవల మహాత్ముఁడై ♦నట్టిరాజ
వరునిమిత్తము శాస్త్ర♦పద్ధతుల నెఱింగి వరుసఁ దృతీయస♦వనముఁ జేసి
రంద మంత్రకముగ ♦ నగ్నివేల్చినయది వేల్వఁ దప్పినయది ♦ వెదకినఁ గనఁ
బడకుండె నంతయుఁ ♦ బ్రత్యూహములు లేక మంత్రయుక్తంబుగ♦మమతఁ జేసి

తే. రాదినంబులఁ దప్పిగొ♦న్నట్టివాఁడు
గాని యాఁకలి గొనువాఁడు ♦ గాని చూడఁ
బడకయుండెను శతశిష్య♦వరులు లేని
పండితుం డొక్కఁడును. గానఁ♦బడఁడు ధ్రువము. ౧౦ 409

చ. క్షితిదివిజుల్ తదర్హమగు ♦ సేవనొనర్చెడి శూద్రముఖ్యులా
క్రతువున దాపసుల్ యతులుఁ ♦ గామిను లర్భకు లట్లె వ్యాధిబా
ధితులును వృద్ధులున్ సతము ♦ తేఁకువ మీఱ భుజించి రైనన
ప్రతిరుచిగల్గి యుంటఁ గన♦రాదుగదా పరితృప్తి వారికిన్. ౧౧ 410

క. పెట్టుఁడు పెట్టుం డన్నము, కట్టను గప్పుకొన వేఁడఁ♦గా బహుళతఁ జూ
పట్టు వసనముల నిండీ, పట్టుననని రాజవరుఁడు ♦ పరమప్రీతిన్. ౧౧½ 411

క. పురికొలిపినఁ దత్సేవకు, లరుదుగ నీయుదురు బహువి♦ధాదరముల న
ధ్వరమున శాస్త్రము రీతి రు,చిరముగ నొనరింపఁ బడిన ♦ సిద్ధోదనముల్. ౧౨½

తే. పర్వతంబులఁ బోలి య♦న్నహము వెలసె
వివిధ దేశంబునందుండి ♦ వేడ్కఁ జూడ
వచ్చినట్టి స్త్రీపురుషు ల♦వ్వారి గాఁగ
నన్నపానంబులను దృప్తు ♦ లైరి మిగుల. ౧౪ 413

తే. అన్నముపచార సంయుక్త♦మై యొసంగఁ
బడియె సుస్వాదువుగ నది ♦ వఱలె నౌర!
తృప్తిఁగాంచితి మేము క్షి♦తిపతివర్య!
భద్రముగుఁగాక నీకని ♦ బ్రాహ్మణు లొగి. ౧౫ 414

చ. పలుకుచు నుండఁగా వినియె ♦ భానుకులాభరణంబు రాజు, వి
ప్రులకు సుభాషితాంగులగు ♦ పూరుషులెందఱో భక్ష్యభోజ్యముల్
పలుమఱుఁ బెట్టుచుండి రట ♦ భవ్యరుచిం దగు రత్నకుండలం
బులఁ జెలువారు కొందఱల ♦ భూసురవర్యులఁ గొల్చిరెంతయున్. ౧౬ 415

చ. మతివిభవంబు గల్గి స్ఫుట♦మంజుల వాక్కుల నొప్పు ఋత్విజుల్
క్రతువునఁ గొన్నివేళలఁ బ♦రస్పరమున్ జయమంద, యుక్తి వా
దతతులఁ జేయుచుండిరి య♦థావిధి యజ్ఞమునందు నిత్యమున్
క్షితిసుర లర్హ్యకృత్యములఁ ♦ జేసిరి వృద్ధుల యాజ్ఞ చొప్పునన్. ౧౭ 416

తే. నేర్పుగలిగిన సద్విజుల్ ♦ నిత్యమిట్లు, సర్వకర్మముల నొనర్ప ♦ జన్నమందు
నలరు విప్రులలోన ష♦డంగములను, దెలియకున్నట్టి విప్రుండు ♦ గలుగఁడయ్యె.

క. ఒకఁడేని బ్రహ్మచర్యా,దికముల నొనరింపకున్న ♦ దీనుఁడు గలుగం
డకలంక శాస్త్రముల నెఱుఁగక యున్న జడుండు చూడఁ♦గా రాఁడయ్యెన్.

సీ. ధరణిపతీంద్రు స♦దస్యులలో వాద
కుశలుఁడు గానట్టి ♦ క్షోణిసురుఁడు
గలుగఁడొక్కండైనఁ ♦ గాని యూపస్తంభ
ముల నిల్పఁదగు కాల♦ము చను దేర
బిల్వవృక్షంబులఁ ♦ బ్రియమారఁ జేసిన
యూపంబు లాఱు నా♦యూపములకుఁ
జెంతఁ జంద్రవి యాఱు ♦ వింతగ మోదుగు
యూపంబు లాఱు స♦ట్లొప్పు మెఱయు

తే. విరిగి యను పేరఁ బరఁగెడు ♦ వృక్షశాఖఁ
దెచ్చి చేసిన దొక్కటి ♦ దేవదారు
యూపములు రెండు నిలిపి ర♦య్యూపములకు
నంతరము రెండు బారల ♦ యంత సలయు. ౨౦ 419

తే. సమత రెండేసి బారల ♦ చాఁచి గాని
రెండు చేతుల యూపంబు ♦ లుండుచోటు
లందుకొనఁ జాలనట్టి ♦ యభ్యంతరములు
గలిగి యున్నట్లు వానిని ♦ నిలిపి రపుడు. ౨౧ 420

మ. క్రతుశాస్త్రంబులఁ దప్పియోగముల ద♦క్షత్వంబునం బొల్చి య
ప్రతిమానంబగు బుద్ధిచే వెలయు న♦ధ్వర్యు, ప్రభృత్యుత్తముల్

క్రతుశోభార్థము యూపజాలము సువ♦ర్ణప్రాంచితంబై తగఁ
జతనం బొప్పఁగఁ జేసి నిల్పి రది య♦జ్ఞస్థానస్థలిన్ రాజిలెన్. ౨౨ 421

చ. ఇరువదియొక్క యూపముల ♦ వెన్నఁగ నున్నతి వేఱువేఱుగా
నిరువదియొక్క మూరలుగ ♦ నేర్పఱుపం బడియుండె నవ్వియున్
వరుస నొకొక్క భవ్యమగు ♦ వస్త్రమునన్ సమలంకృతంబులై
సరిగొలతం జెలంగి బల♦సంగతదోషగణోజ్ఝితంబులై. ౨౩ 422

తే. ఎనిమిదంచులతో నొప్పి ♦ నునుపుగలిగి
నట్టి యాకృతులం దగి ♦ యాగమోక్త
విధిని శిల్పులచేత స్థా♦పింపఁబడియె
మఱియు నాభవ్యతమ యూప♦మండలంబు. ౨౪ 423

క. పరిమళసుమచందనములఁ, బరితస్సమలంకృతమయి ♦ వసనావృతమై
సురపథమున దీప్తులచేఁ, బరఁగెడు సప్తర్షులట్లు ♦ భాసిలుచుండెన్. 424

తే. యజ్ఞకృత్యంబునన్ నేర్పు ♦ లలర వెలయు
బ్రాహ్మణులు, శాస్త్రచోదిత♦పథము నరసి
యుక్తపరిమితి నిష్టక♦లొప్పఁ గూర్చి
యగ్నివేదిక గట్టి రా♦కార యనఁగ. ౨౬. 425

సీ. *నేర్పఱులౌ మేది♦నీపతి యాజకుల్ శాస్త్రోక్తరీతి నా♦స్థానమును ద
గంగ నిర్మింపఁగ ♦ గరుడాకృతిని మీఱి కనకపక్షంబులఁ ♦ గ్రాలి యాఱు
ప్రస్తారములకన్న ♦ భావింపఁ ద్రిగుణమై యష్టాదశాత్మక♦మై చెలంగె
జననాథుఁడతఁడు వా♦జసనేయశాఖకుఁ జేరియుండుట నట్లు♦చేయఁబడియె
నవ్వానియందు శా♦స్త్రానుసారంబుగ నాయాయి దివిజుల ♦ కర్హములగు

తే. పశువులు భుజంగమ్ములుఁ ♦ బక్షులును ని
యుక్తములయి కనుంగొన ♦ నొప్పియుండె
వానివధియించు తఱిరాఁగ ♦ వాజిమేధ
మునకుగా విధి నిర్ణయిం♦చిన హయంబు. ౨౮ 426

* సచితో్య రాజసింహస్య సంచితః కుశలైర్ద్విజైః, గరుడో రుక్మపక్షో వై త్రిగుణోఽష్టాదశాత్మకః. ౩౭. అని మూలము. "జననాథుఁ డతఁడు వాజసనేయశాఖకుఁ జేరియుండుట నట్లు చేయఁబడియె" నన్నది వ్యాఖ్య ననుసరించి తెనిఁగింపఁబడినది. దశరథుని వేదశాఖయేది ? అని ప్రశ్నము రాఁగాఁ బలువురు పలువిధములఁ దోఁచినట్లు పలుకుచుందురు. ఆసందేహము తీర్ప నెంచి వ్యాఖ్యకర్త "తదిదం వాజసనేయశపక్షావలంబనం ద్యోతయితు మష్టాదశాత్మకత్వోక్తిః" అని వ్రాసెను. అష్టాదశప్రస్తారములు గలదిగా ననుటచే వాజసనేయులకే పదునెనిమిది శాఖలని నియమము కాఁబట్టి యీరీతిఁ జెప్పఁబడియె.

క. జలచరములు మఱి గ్రామ్యం, బులు యాజకవితతిచేతఁ ♦ బోల వధింపన్
వలసినవి యన్ని నిశ్చిత,ములు నయ్యెన్, యజ్ఞకర్మ♦మున ననువుతగన్. ౨౯

ఉ. అత్తఱి యూపసంఘముల♦యందు నిబద్ధము లయ్యె జంతువుల్
ఉత్తమయజ్ఞకార్యమున ♦ నొప్పినయట్లవి మూఁడునూఱుల
శోత్తసురత్నమా నృపుని ♦ దొప్పెఁ గనుంగొన నట్లు వింతయై
చిత్తము పొంగ; నానృపుని ♦ జ్యేష్ఠసతీమణి వేడ్క బెంపునన్. ౩౦ 428

చ. తురగము దానిఁ జుట్టి తన♦తోడను దక్కినరాజపత్నులా
దరమున రాఁగ వారల ము♦దంబునఁ గూడి సువర్ణసూచికల్
గరమునమూఁడనుర్చి హయ♦కాంతుని జీలిచె నంతనామె సు
స్థిరమగు బుద్ధిధర్మఫల♦సిద్ధిని గోరి హయోత్తమంబుతోన్. ౩౧ 429

తే. ఒక్కదినము వసించె న♦య్యుర్విపతియు
*దక్షిణనొసంగ హోతయ♦ధ్వర్యుఁ డవల
నల్లె యుద్గాత బ్రహ్మయు ♦ నధిపు నగ్ర
పత్నిఁ బరివృత్తిఁ, గొనిరి వా♦వాత నెలమి. ౩౨ 430

తే. మఱియుఁ బాలాకలినియను ♦ మహిళవీరి
నల్వురను హస్తములచేత ♦ నాథులు వలె;
నంత యాజకులర్థంబు ♦ లధిపువలనఁ
గైకొనుచు వారినిచ్చిరి ♦ కడురయమున. ౩౩ 431

సీ. విజితేంద్రియుండయి ♦ వెలసి ప్రయోగచాతుర్యము నర్థ్యమై♦తోఁప నలరు
నధ్వర్యుఁ డప్పుడ♦య్యశ్వము క్రొవ్వును గైకొని శాస్త్రమా♦ర్గమునఁ బూని
వండె నంతటి భూమి♦వగుఁ డాత్మపాపముల్ నాశమొందింపఁగ♦న్యాయయుక్త
మగునట్టి చొప్పున ♦ నాహోమకాలంబు తప్పకయుండఁగఁ ♦ దద్వప వగు

తే. ధూమవాసనఁ బ్రియభక్తి♦తోడ నాసి
కములు సఫలత నొందుచుఁ ♦ గ్రాలఁ గ్రోలె
మంత్రముల నేర్చియున్న బ్రా♦హ్మణులు యాజ
కులు పదార్వురు శాస్త్రంబు ♦ పలికినట్లు. ౩౪ 432

క. తురగాంగంబులు వైశ్వా,నరునం దన్నింటి వేల్చి ♦ నైజంబగు నా
పరమక్రియ నెఱవేర్చిరి, తరయజ్ఞంబుల హవిస్సు ♦ తగ సంస్కృతమా. ౩౫

---

* రాజు మున్ను కామించి పిదప నుపేక్షించినది పరివృత్తి యనంబడు. రాజుంచుకొన్న వేశ్య వావాత రాజునకుఁ బాత్రయిచ్చునది పాలాకలి. ఈనలువురను హోతకు, అధ్వర్యువునకు, ఉద్గాతకు, బ్రహ్మకు వరుసగా రాజు దక్షిణగా నీఁదగినది. ఆఋత్విజులు రాజువలన నా స్త్రీలకుఁ బ్రతినిధిగా ద్రవ్యమును గ్రహించి వారల మరల నీవలయు. "పశ్చా త్ప్రతినిధిద్రవ్యదానేన నివర్త్యేరన్" అని సూత్రము.

తే. జువ్వికొమ్మలయందు నీ♦శుభతరాశ్వ
మేధమున నన్ననో నప ♦ మిగులశ్రేష్ఠ
మైన ప్రబ్బలి చాఁపయం♦దాగమోక్త
ముగను సంస్కారముం జేయఁ♦జగియె యుండు. ౩౮ 434

సీ. కల్పసూత్రములను ♦ క్ష్మాసురవాక్యంబులను హయమేధాఖ్య ♦ మనువదింపఁ
బడియెను త్రిదినస♦వనమని, యందాద్యదినము, చతుష్టోమ♦మనియు నవల
ద్వైతీయదివస, ము♦క్థ్యంబని మూఁడవదిన మతిరాత్రాఖ్య♦మనుచు నందు
నితరయాగములు వి♦హితములు చేయంగనని యన్యశాస్త్రంబు♦లనువదించు

తే. చుండుఁ గావున భూపాలుఁ ♦ డుద్యమమున
వానిఁ జెక్కింటిఁ జేసె న♦వ్వాని పేరు
లలరుఁ బూజ్యంబులై మహా♦ఫలదములయి
గాన వాని నొనర్చె నా♦క్ష్మావిభుండు. ౩౯½ 435

సీ. అవ్వి జ్యోతిష్టోమ ♦ మనియు, నాయుర్యాగ, మతిరాత్ర, మభిజిత్తు♦ నట్లె విశ్వ
జిత్తు నప్తోర్యామ ♦ ముత్తమోత్తమమయి తనరు మహాక్రతు♦వనియు నలరు
నం దతిరాత్రమ్ము ♦ నగు ద్విరావృత్తులు సేయ నవ్విధి, శాస్త్ర♦సిద్ధమయ్యె
నవ్వి నాలవదిన♦మాదిగాఁ గ్రమమునఁ జేయంగఁ బడియె నా♦క్షితిపతీంద్రుఁ

తే. డీవిఁ బ్రఖ్యాతి నంది యీయా♦యిలఁ జెలంగు
నట్టి యిక్ష్వాకుకులమును ♦ నలరఁ జేయు
వాఁడు గావున హోతకుఁ ♦ బ్రాక్తటమున
నెసఁగు దేశము భక్తిమై ♦ నొసఁగెఁ బ్రీతి. ౪౦½ 436

క. ఘనుఁ డయి తగు నధ్వర్యున,కును పశ్చిమదిక్కు, బ్రహ్మ♦కును దక్షిణది
క్కును నుత్తర ముద్గాతకు, మనమార నొసంగె శాస్త్ర♦మార్గముఁ గనుచున్.

చ. వనజజుఁ డశ్వమేధమఖ♦వర్యము నందిటు దక్షిణన్ ముదం
బున నొసఁగన్ విధించె ముని♦పూరుషవర్యుఁడు రాజు న్యాయరీ
తిని గ్రతువున్ ముగించి తమి ♦ దీఱఁగ భూతలమెల్ల, వారికిన్
గొనుఁడని ధారపోయ నఘ♦కూటవిదూరుని గాంచి ఋత్విజుల్. ౪౩ 438

ఉ. మానవనాథ! నీవె క్షితి♦మండలమెల్లను బ్రోవ నర్హ్మతం
బూనినవాఁడ వొక్కఁడవె ♦ భూమియిదేటికొ మాకుఁ జెప్పుమా
దీని భరించి పాలనముఁ ♦ దృప్తిగఁ జేయఁగ నేరమేల యం
చూని వచింతువేమొ విను ♦ మెయ్యన మాదగు కృత్యమంతయున్. ౪౪½

చ. శ్రుతులఁ బఠించు నాదృతియు ♦ గూఢము మాకెపుడట్టులౌటనో
క్షితివర! దీనిఁగైకొనుము ♦ ఉత్తము రంజిల దీనిమాఱుగాఁ
బ్రతికృతి మూల్యమిమ్మదిఁ ♦ స్వల్పమె యైనను దృప్తిఁగాంతు మ

ప్రతియగు రత్నమైనను సు♦వర్ణమయ్యైనను గోవులైనను౯. ౪౯ 440

తే. మఱియు నేవస్తువిష్టంబో ♦ మానవేశ!
సిద్ధముగనుండునో నీదు ♦ చెంతదాని
నొసఁగుమా నిష్ఫలంబు మా♦కుర్విఁ గొనుట
వలసనని ఋత్విజులు తగఁ ♦ బలుకుటయును. ౪౯౹ 441

చ. అనఘులు వేదపారగులు ♦ నైన ద్విజోత్తము లిట్లు పల్కఁగా
విని దశలక్ష గోవులను ♦ వేడుకతోఁ బదికోట్ల హేమము౯
గనకచతుర్గుణంబగుచుఁ ♦ గ్రాలెడు వెండిని భూసురాళికి౯
జనపతి యిచ్చె ఋత్విజులు ♦ సర్వధనంబును జేర్చి యొక్కచో౯. ౫౦ 442

ఆ. ఋశ్యశృంగునకును ♦ నెల్ల ధీమంతుల, యందు మేటియైన ♦ యావసిష్ఠ
మునికి నొసఁగి భాగ♦మును బంచియిండని, పలికిరంత శాస్త్ర♦పద్ధతి నొగి.

క. మునులిట్టులు వారలకును, ధనము విభాగించి యిమ్మఁ♦దగఁ గొని మోదం
బునఁ బొదలి తృప్తిఁ గాంచితి, మని పలికిరి, పిదప ఱేఁడు♦హర్షమునిండ౯.

చ. క్రతువును జూడవచ్చిన ధ♦రాసుర వర్యులకెల్లఁ దృప్తి స
మ్మతిఁబడ నేరకోటిగల ♦ మంజులహేమము గోటిసంఖ్యగా
జతనము మీఱ నిచ్చె నొక ♦ త్యాగుఁడు వెంతయు నిస్వుఁడైన సూహ
పతికరకంకణం బడుగ ♦ భానుకులాభరణంబు ప్రీతితోన్. ౫౧౹ 445

చ. కరమున వెల్గుచున్న మణి♦కంకణ మిచ్చె ననంతరంబ యా
ధరణిసురోత్తముల్ సకల♦దానములం బరితృప్తినొంద భూ
సురులను బ్రేమతోఁ గనెడు ♦ సూర్యకులాంబుధి శీతభానుఁ డు
బ్బురమగు హర్షయోగమున ♦ బొల్పెసలారెడు మ్రొక్కుచొప్పున౯. ౫౩ 446

క. వారలకభివందన మిడ, భూరమణుఁ డుదారుఁ డయిన ♦ పూజ్యుఁడు త్రిజగ
ద్వంద్యుండిల బండి నమస్కారము లొనరింపఁ బ్రీతి ♦ గడలుకొనంగ౯. ౫౪

క. శ్రుతులెల్లఁ బలికినట్లుగ, నతనికి భూసురవరేణ్యు ♦ లాశీర్వచన
ప్రతతి యొసంగిరి యాభూ,పతి నారి యమోఘ వచన♦భంగి కలరుచు౯.

క. నరనాథులకైనను దు,ష్కరమును బుత్త్రులను బొందఁ♦గా బంధకమై
పరఁగెడి పాపమ్ములు వే, హరించునది యుత్తమంబు ♦ నగు నధ్వరము౯. ౫౪౹

తే. మఱియుఁ దనయుమూలంబున ♦ సుహితమైన
స్వర్గము లభింపఁ జేయంగఁ ♦ జాలునదియు
ననుపమానంబు నగునట్టి ♦ యశ్వమేధ
మాతఁ డొనరిచి సంప్రీతి ♦ నలరి యంత. ౫౬ 450

క. నరవిభుఁడు ఋశ్యశృంగునిఁ, బరికించి వచిం ♦ నాదు♦వంశము వృద్ధిం

బొరసెడు కృత్యము నీవ యొ, నరుపఁగ నర్హుఁడవు మానినాథ! సుశీలా! ౫౮

చ. అనవుడు నాద్విజప్రవరుఁ ♦ డప్లె యొనర్చెన రాజచంద్రమా
తనయులు నల్గు రన్వయ, ము♦దారయశంబును వృద్ధిఁ జెంద నీ
కనయముఁ దృప్తిఁ గూర్పఁ గల ♦ యట్టిమహామతు లుద్భవించువా
రనియె (మనోహరంబయిన ♦ యప్పలుకుల్ విని రాజు హృష్టుఁడై. ౫౯ 452

క. వినయమున మ్రొక్కి యింతని, యనరాని ముదంబు నొందె♦నంత మహాత్ముం
డనఘుఁడు నగు నమ్మానియు, మనుజాధిపుతోడఁ బల్కె ♦ మరలం బ్రీతిన్.)

పదునాల్గవ సర్గము సంపూర్ణము.

---

౧౫-వ సర్గము.

దేవతలు బ్రహ్మతో సంభాషించుట.

చ. తనయుల నల్వురం గనుదు ♦ తప్పక నీవనుచుం బ్రతిజ్ఞచే
సిన పిదపన్ విభండకుని ♦ చిన్నికుమారుఁ డతీంద్రియార్థముల్
గనుఁగొనువాఁ డధర్వము, న♦ఖండముగాఁగ నెఱుంగునట్టివాఁ
డనునయమొప్ప నంత మది ♦ ధ్యానముచేసి తదర్థవేత్తయై. ౧ 453

చ. మనుజవరేణ్యుఁ గాంచి బహు♦మానము మీఱ వచించె. నిట్లు స
త్తనయులు నీకుఁ గల్గుటకు ♦ ధారణినాయక! యాగమొండు పు
త్రనికర లాభహేతువయి ♦ రాజిలుచుండును దాని నిప్పుడే
నొనరుతు శాస్త్రయుక్తమయి ♦ యొప్పువిధానమునన్ ముదంబునన్. ౨ 454

తే. వినుమధర్వశిరస్సున ♦ వెలయు మంత్ర
ములను సంసిద్ధమయి యది ♦ పొలుచు ననుచుఁ
బలికి సుతలబ్ధిహేతువై ♦ పరఁగు దాని
విధియుతంబుగ నగ్నిని ♦ వేల్చె నతఁడు. ౩ 455

మ. వరతేజంబునఁ బొల్చు మౌని యొనరిం♦పం బూని వేల్వంగ న
ధ్వరమం దిచ్చెడు నంశముల్ గొనఁగ సి♦ద్ధస్తోమగంధర్వని
ర్జరులున్ బ్రహ్మమునుల్ విరించియును శా♦స్త్రప్రక్రమం బొప్ప వ
చ్చి రహిం గూడిరి సత్సభాస్థలమునం ♦ జేతోముదం బొప్పఁగన్. ౪ 456

క. ఒగుల కగోచరులై నిర్జరు లివ్విధి వరుసగాఁగ ♦ సభఁ గూడి యజున్
బసు లోకకర్తఁ గని పల్కిరి ఘనతర వాక్యమొండు ♦ కేల్మోడ్పులతోన్. ౫

మ. వినవయ్యా, భగవంత! రావణుఁడనం ♦ బేరొందు క్రవ్యాదుఁ డేఁ
చెను మమ్మందఱఁ ద్వత్ప్రసాదమున నే ♦ సిద్ధించె వీర్యంబు నా

తనికిన్, వానిని నోంపఁజాల మిఁక స♦త్యం బిద్ది; ప్రీతుండవై
మును పవ్వానికి నీవె యిచ్చితి వరం♦బుల్ దేవదేవా! ప్రభూ! ౬౫ 458

తే. నీదువరముల నెల్ల స♦న్నించి మేము
వాఁ డొనర్చెడి బాధల ♦ వరుస సైచు
చున్నవారము మాచేత ♦ యుద్ధమందుఁ
బడఁడు నీవర మట్టిదై ♦ వఱలుచుంట. ౭ 459

చ. ఖలమతియైన, వాఁడు త్రిజ♦గంబుల భీతిలఁ జేయుచున్నవాఁ
డలరుచు సన్నుతిం గనిన ♦ యట్టి మహోన్నత లోకపాలురన్
జలముమెయిన్ విరోధులుగ ♦ సాధ్వసహీనతఁ జూచు వాఁడు స్వ
గ్గలితరాజ్యమేలు సుర♦రాజు నె తా నిరసించు వాఁడొగిన్. 460

చ. సురపతిస్థానవిచ్యుతుని ♦ ఘోరతఁ జేయఁగఁ జూచుచున్నవాఁ
డరయుము నీవరంబులనె ♦ యాతఁడు దేహమెఱుంగ కెల్లభూ
సురముని యక్షరాహుముఖ♦ఘోరమహాసురులం బ్రతాపవి
స్ఫురణము పొంగ మార్కొనెడు♦ఘోరులు లేమిఁ గలంచెడుం గటా. ౯ 461

తే. మఱియు గంధర్వపుంగవ♦మండలముల
నొంచుచున్నాఁడు క్రీడార్థ ♦ ముఱుధరాధ
రంబులఁ జరించువేళ నా♦రాక్షసునకు
నోడి కడు నెండ గాయక ♦ యుండు రవియు. ౯౫ 462

ఉ. వేడుకమీఱ రావణుఁడు ♦ భీరువులం దమి మీఱుచుండఁగాఁ
గూడి విహార మెంతయును ♦ గోరిక సల్పెడువేళ వీచినన్
బోఁడిమిఁ గూర్చుచున్నసుమ♦ముల్ క్షితిరాలునో యేమొ యంచుఁ దన్
గూడిన భీతి వాయునటఁ ♦ గుందుచు నూరకయుండుఁ బ్రక్కనన్. ౯౫ 463

క. చలదూర్మిమాలియై తగు, జలనిధి రావణునిఁ గాంచి ♦ చలన ముడిగి ని
శ్చలుఁడగు; ఘోరాకృతితోఁ, జెలఁగి గనన్ రాని యతని♦చే మాకెపుడున్.

ఉ. భీతి జనించె నెక్కుడుగ ♦ వీరుని నాతని రూపుమాపఁగాఁ
నీతఱి నేయుపాయ, మమ♦రేష్టముఁ దీర్పఁగఁ జాలియుండునో
భీతశరణ్య! దానిఁగని ♦ వేగమ వానివధింపఁ జెప్పుమా
ప్రీతుల మాదు మంచన వి♦రించి సురావళి దీనభావులన్. ౧౧ 465

చ. విని మది నూహచేసి సుర♦బృందములం గని పల్కె నక్కటా
దనుజుని నాదురాత్మకుని ♦ దారుణరూపునిఁ జంపునట్టి యో
జన యిదె నాకుఁ దోఁచె సుర♦సత్తములార! వచింతు దానినిన్
మును పతఁ డాశరామరస♦మూహముచే మఱి యక్షపంక్తిచేన్. ౧౨ 466

క. దానవగంధర్వులచే, నే నిహతుఁడఁ గాక యుండ ని♦మ్మావరమం
చూని, నను బ్రార్థించెను, గాని మ్మట్లనుచు నంటిఁ ♦ గా ప్రీతిమెయిన్. ౧౩

క. వరమడుగు నవసరమ్మునఁ, బరిభవమగుఁ దనకటంచుఁ ♦ బలుకఁడు రక్షో
వరుఁ డతఁడు నరులఁ గావున, నరులే మృతికరులు దివిజ♦నాయకులారా! ౧౪

క. నరులన్ మానిన వాని నో, కరుఁ డితరుఁడు చంపలేఁడు ♦ గా, యని కరుణా
కరుఁ డాడిన ప్రియవచనం, బరుదుగ విని దేవమునులు ♦ హర్షము పొంగన్.

చ. దనుజునిచావు నిశ్చయము ♦ తప్ప దిఁకంచుఁ దలంచుచుండఁగా
మనమున దేవవాంఛితము ♦ మాధవుఁ డెంచి సుగాళిరక్షసే
యనుసమయంబు వచ్చుటకు ♦ నాత్మముదంబును బొంది కాంతిపెం
పున నసమానరూపమునఁ ♦ బొల్చినసమ్మతము నందుఁ దానయై. ౧౫½ 470

క. సురమాని రక్షణోచిత, పరికరముల శంఖచక్ర♦పటుగదలఁ దగన్
గరములఁ దాలిచి పీతాం,బరమ్మును ధరియించి లోక♦పతి యాసభకున్. ౧౬

క. అరుదెంచి యచట నుండిన, సరసిజసంభవునితోడ ♦ స్వాంతమ్మున ని
ర్జరరక్షణంబు సేయఁగఁ, బరిపరివిధములఁ దలంచి ♦ వసియించెఁ దమిన్. ౧౬½

దేవతలు భగవంతునితో రావణుని క్రూరకృత్యములను జెప్పుట.

చ. అసురులఁ గీటడంచి తము♦నాదృతిఁ గావఁ దలంచుచున్నయా
బిసరుహలోచనుం ద్రిదశ♦బృందవరుల్ స్తుతియించి మ్రొక్కి దే
వ! సరసిజాస్య! లోకహిత♦వాంఛలఁ బూనిన మేము నిన్ను లో
కసమితిఁ గావ వేఁడెదము ♦ కార్యమదేమన నాలకింపుమా. ౧౭½ 473

సీ. సకలధర్మజ్ఞుఁడై ♦ సమధిక దాతృత్వగుణముల నలరారి ♦ ప్రణుతిఁ గాంచి
మునివర్యసమతేజ♦మునఁ దేజరిల్లుచు నయ్యయోధ్యకుఁ బ్రభు♦వై యెసంగి
దశరథుఁడనుపేరఁ ♦ దనరు రాజునకు హ్రీ శ్రీకీర్తులనుపేరఁ ♦ జెల్వుఁ గాంచు
దక్షకన్యకలతోఁ ♦ దలఁప సామ్యముఁ జెప్పఁ జాలినమువ్వురు ♦ సాధ్వులొప్ప

తే. వారలవ్వారలందు నో ♦ వారిజాక్ష!
*నినుఁ జతుర్భాగములుచేసి ♦ నీవె రావ
ణుని దదాత్మజ గంధర్వ♦లను లవణునిఁ
బొలియఁ జేయఁగఁ బుత్రత్వ♦మును వహింపు. ౧౮½ 474

క. వనజాక్ష! యాజిసతులకుఁ, దనయుఁడవై పుట్టి మనుజ♦తం బొంది, బలం
బున వీర్యాదుల నసమతఁ, దనరి సురావధ్యుఁడగుచు ♦ దర్పము మెఱయన్.

---

* నినుఁ జతుర్భాగములు చేసి ♦ నీవె......అనుచోట మూ. 'విష్ణో పుత్రత్వ మాగచ్ఛ కృత్వా త్మానం చతుర్విధమ్.' చాతుర్విధ్యవిధానం రావణేంద్రజిల్లవణగంధర్వవధాదీనాం ప్రత్యేకం దేవకార్యాణాం సంభవాత్. అనువ్యాఖ్య ననుసరించి తెనిఁగింపఁబడినది.

ఆ. అఖిలలోకవైరి ♦ యయి యున్నరావణు, సమరమున వధింపు ♦ చక్రహస్త!
వీర్యగర్వమునసె ♦ వెలసి మూర్ఖుండగు, పంక్తికంఠదనుజ♦పతి చెలంగి. ౨౧

క. మునివరులను గంధర్వుల, ననుజారుల సిద్ధగణముఁ ♦ దా బాధింపం
గనుఁగొనుచు ననుభవించుచు, వనజోదర! యిట్టులున్న♦వారము దేవా!

తే. మునివరేణ్యుల నందన♦వనమునందు
విహరణము సల్పు గంధర్వ♦విబుధవనిత
లను మహాక్రూరుఁడై, బాధ♦లను గలంచెఁ
గాదె, యాతనిఁ జంపుట ♦ కార్యమభవ! ౨౨ 478

సీ. మునులును గంధర్వ♦లును సిద్ధయతులు మేమును నీచెంత ♦ కోమహాత్మ!
వచ్చి నీశరణంబుఁ ♦ జొచ్చితిమో దేవ! పరవిదారణ నీవె ♦ పరమగతి; ది
విజులగు మాకెల్లఁ ♦ ద్రిజగంబులకు దేవవరులకుఁ బగతురై ♦ నజలు క్రూర
కర్ములు వధియింపఁ ♦ గా నరలోకంబు నందవతారంబు ♦ నొందఁ గోర్కి

ఆ. నందవయ్య! యనుచు ♦ నమరులు ప్రార్థింప
దేవపుంగవుండు ♦ దేవపతియు
నైన విష్ణుమూర్తి ♦ యఖిల లోకనమస్కృ
తుఁడు విరించి ముఖులఁ ♦ గను గయఁగని. ౨౪ 479

క. తనుశరణుఁ జొచ్చి రావణుఁ, దునుమఁగఁ బ్రార్థించుచున్న ♦ దోషాచరవై
రి నికాయముతోఁ బల్కెను, వనజాక్షుఁడు దివిజులార! ♦ భయము వదలుఁడీ.

తే. క్షేమమగు మీకు నే నిఁక ♦ భూమి నవత
రించి క్రూరు దురాత్ముఁ బ్ర♦పంచనాశ
కరుని దేవమునీంద్ర భీ♦కరుని రావ
ణుని రణంబున మీహిత♦మును దలంచి. ౨౬ 481

చ. తనయులతోడ బాంధవవి♦తానముతోడను జ్ఞానమిత్రపౌ
త్రనికర మంత్రి ముఖ్యసము♦దాయముతోడ వధించివైచి మే
దిని బదునొక్క వేల్ సమలు ♦ దివ్యగతిన్, వసియింతు ధర్మవ
ర్ధనమును జేయ నీక్షితిని ♦ రక్షణసేయుచు నీజగంబునన్. ౨౭ 482

తే. అనుచు సర్వాత్మశేషిమై ♦ యలరు దేవుఁ
డమరులకు నిట్లు వర మిచ్చి ♦ యంత స్వీయ
జననభూమిని జింతించె ♦ మనుజలోక
మందు నిర్జరహితమునె ♦ యాత్మనెంచి. ౨౯ 483

చ. సరసిజనేత్రుఁ డిట్లు మను♦జత్వము నొందఁగనెంచి యంత స
త్వరముగ నాల్గుగాఁ దనదు♦వర్ష్మము నేర్పునఁ జేసి తండ్రిగా

నరసి నృపేంద్రుఁడౌ దశరథాహ్వయు నెమ్మది నిశ్చయించె న
ప్పురుషవరేణ్యునిన్ మధుని ♦ పొంక మడంచిన దేవదేవునిన్. ౩౦ 484

తే. అప్పు డచ్చరలును రుద్రు ♦ లమరవరులు
గరుడగంధర్వముఖులెల్లఁ ♦ గ్రాలు భక్తి
దివ్యరూపంబులైన స్తుతి♦ప్రబంధ
ములను నిట్లని వినుతించి ♦ రెలమి మిగుల. ౩౧ 485

చ. జననము తోటిగర్వమును ♦ సాధ్వసముం గలిగించు తేజమున్
వనజజలబ్ధసద్వరవి♦వర్ధిత దర్పము గల్గి పాకశా
సనునకు దీర్ఘశత్రువయి ♦ సర్వజగంబుల నేడిపించుచున్
వనిఁ దపమూను మౌనులకు ♦ వైరియు భీతిదుఁడై చెలంగుచున్. ౩౨ 486

క. ఖలుఁడై తనరెడు రావణుఁ, బొలియింపుము వాఁడు, లోక♦ములఁ గాఱించున్
బలమునఁ బౌరుషమున ని,స్తులుఁడై తగుఁ గాన రాక్ష♦సుని రావణునే. 487

చ. బలములతోడ నెయ్యురగు ♦ బాంధవవీరులతోడ నేపునం
బొలియఁగఁజేసి దేవవర♦పూజ్యము రాగముఖాఘహీనమై
వెలయుచు సన్మదాదుల ప్ర♦వేశము గాంచక శాశ్వతంబునై
చెలఁగెడు నీదులోకమును ♦ జెందుము మానసతాపమాఱఁగన్. ౩౩ 488

పదునైదవ సర్గము సంపూర్ణము.

---

౧౬-వ సర్గము.

దేవతలు ప్రార్థింప విష్ణువు మనుష్యావతారమెత్తుట కొడంబడుట.

క. అని సురలు నల్కు నంతట, వనజదళాక్షుండు దేవ♦వర్యనియుక్తుం
డనువొంద మధురముగ ని, ట్లను సకలమెఱుంగువాఁడె ♦ యైన సురలతోన్.

క. సురలార! కుమతియును ఋషి,విరోధియును నైన దనుజ♦వీరుని ననిలో
మరణం బొందింపఁగనే, దరయ నుపాయంబొ చెపుఁడ ♦ యద్దానిఁ దగన్. ౧

తే. ఏయుపాయంబుఁ బూనిన ♦ నేను దనుజుఁ
జంపుటకు నేర్తునని యిట్లు ♦ చక్రి యన్య
యుండు పలుకంగ దేవత♦లొగి వచించి
రని వధింపుమసురు నర♦తనువుఁ దాల్చి. ౩ 491

చ. వినుము మహాప్రభూ! కుజన♦బృందనిషూదన! వానివార్తలన్
దనుజుఁడతండు పద్మజునిఁ ♦ దామదినిల్పి తపంబు ఘోరభం
గిని జిరకాలమొర్పుమెయిఁ ♦ గేవలభక్తిని సల్పె బ్రహ్మయున్
దనమది సంతసిల్లె నతి♦దారుణమై తగు దానికెంతయున్. ౩౫ 492

తే. లోకముల కెల్ల మును పుట్టి ♦ లోకకర్త
యగుచుఁ బ్రభుఁడయి యొప్పుట ♦ నజుఁ డితండు
దనుజునకు నిచ్చె వరమును ♦ మనుజజాతి
దప్ప నిన్నొరులనిఁ జంపఁ ♦ దగరటంచు. ౫ 493

క. నరులెంతవారలని ని,ర్జరవైరి గణింపఁడయ్యెఁ ♦ జక్రధరా! త
ద్వరదానకాలమున ని,ష్కరుణిఁ బితామహునివలనఁ ♦ గాంచె వరంబుల్. ౬

చ. వరములఁ బొంది దర్పమున ♦ వాఁడు జగత్త్రయముం గలంచుచున్
దరుణులఁ బల్మిఁ బట్టుకొని ♦ తత్పరతం జనుచున్నవాఁడు భీ
కరపరనాశకా! యదియె ♦ కారణమై తగుఁగాన వానికిన్
మరణము గాన నయ్యెడిని ♦ మానవవీరులచేత నాజిలోన్. ౭ 495

తే. అనుచు దేవతల్ సెప్ప ♦ నాత్మవేత్త
విష్ణువా మాటలన్ విని ♦ పితను గాఁగ
దశరథక్షితినాథునిఁ ♦ దలఁచె లోక
హితము గావుత మని మది ♦ నెసఁగు వేడ్క. ౮ 496

చ. అతులమహాప్రకాశుఁ డభి♦యాతి నిషూదనుఁడై యజాహ్వయ
క్షితిపతి సూనుఁడౌ నృపతి♦శేఖరుఁ డాత్మజహీనుఁడౌటచే
సుతులను గాంచ వాంఛఁగొని ♦ సూనుదమౌ నొకయిష్టిఁ జేసె దే
వతలకు విష్ణుదేవునకు ♦ వాదము చెల్లెడుకాలమందునన్. ౯ 497

క. గరుడధ్వజుఁడును మానుష, శరీరమును దాల్చి పనిని ♦ సాధించెదనో
సరసిజభవ! యని పలుకుచు, సురమును లర్చించుచుండ ♦ శుభగతి నేగెన్. ౧౦

దశరథునకు ప్రాజాపత్యపురుషుఁడు పాయసము నిచ్చుట

చ. హరియిటు లేగ నంత మను♦జాధిపునాహవనీయనామక
స్ఫురదురువహ్నినుండి పెను♦భూతము వెల్వడె నిస్తులప్రభల్
ఉగ్రతరవీర్యమద్భుత బ♦లోన్నతియుం దనరారుచుండఁగా
నరుణము నీలవర్ణమును ♦ నౌ వసనంబును దాల్చి వేడ్కతోన్. ౧౧ 499

క. భేరీనాదోపమమౌ, నారవము నీస్వనమటంచు ♦ ననఁగాఁ దగు గం
భీరగళస్వనమొప్పఁగ, నారాజవరేణ్యు మ్రోల ♦ నది గానఁబడెన్. ౧౨ 500

సీ. పంచాస్యదేహసం♦భవములై నున్నట్టి రోమములంబోలు ♦ లోమములును
నలవెండ్రుకలు, మీస♦ములును జెల్వమరంగ శుభలక్షణములెల్ల ♦ శోభిలంగ
సురుచిరాభరణముల్ ♦సొంపునీనుచునుండ భూధరశృంగంబుఁ♦బోలెఁ బొడవు
తనరారఁగా మదిం♦చిన పెద్దపులివంటి విక్రమము దనరంగ ♦ వేఁడి వెలుఁగు

తే. ననుకరించు నాకారంబు ♦ నలర దీప్త
వహ్నిశిఖవోలె మెఱయుచు ♦ వఱలు వెండ్రి

మూఁతపై భాగమున నొప్పు ♦ మోదమొసఁగు
తప్తజాంబూనదమయ పా♦త్రంబుఁ బూని. ౧౪ 501

చ. కనఁబడియెం దదీయమగు ♦ కాంచనపాత్రము దివ్యపాయసం
బునఁ బరిపూర్ణమై వెలసి ♦ పోలఁగ నద్భుతమెద్దియో యటం
చనఁదగి వింతగొల్పుచుఁ బ్రి♦యాకృతివోలెఁ బ్రియంబు నింపుచున్
గనదురుమూర్తియాచు నది ♦ గ్రాలె నతండును బూన్కిమీఱఁగన్. ౧౫

క. కరములు రెంటిం దాలిచి, ధరణీశునిఁ గాంచి పలికె ♦ దశరథ! యుష్మ
త్పరిసరమున కేతెంచిన, పురుషుఁ బ్రజాపతి సముద్భ♦వునిగ, నెఱుఁగుమా.

ఆ. అతని యొద్దనుండి ♦ యరుదెంచినాఁడ నే
ననఁగ నపుడె క్షితిపుఁ ♦ డనియెఁ జేతు
లొగ్గి భక్తితోడ ♦ నో భగవానుఁడా!
నీకు స్వాగతముగుఁ ♦ గాక యిపుడు. ౧౭ 504

క. నేనేమి నీకుఁ జేయం, గానగునో యానతీయఁ♦గాఁ దగునను న
బ్జాభనాయకుతో నాతఁడు, మానితముగ నిట్లు పలికె ♦ మరలన్ దయతోన్.

ఉ. భూతలనాథ! దేవతలఁ ♦ బొల్పుగ యజ్ఞయుగంబుచేత ని
ట్లీతఱి సర్చనల్ సలిపి ♦ యెంతయుఁ దృప్తులఁ జేసితీవు సం
ప్రీతినిఁ బొందఁజాలితివి ♦ వృద్ధిదమై తగు దీనిఁగాన వి
ఖ్యాతచరిత్ర! రాజవర! ♦ యప్రతిమంబగు పాయసంబిదా. ౧౮ 506

తే. ఇది సరోజాక్షునిర్మిత ♦ మిది ధనదము, సంతతిప్రద మారోగ్య ♦ సమభివర్ధ
నమ్ము గావున నీవు కై♦కొమ్ము దీని, దశరథ! క్షితిపాలచం♦ద్ర! గుణసాంద్ర!.

ఆ. సకులజాతులయిన ♦ సాధ్వీజనంబుల, కిమ్ము దివ్యపాయ♦సమ్ము దీని
భక్తిఁ దినుడటంచుఁ♦బలుకుచు రాజేంద్ర!, కనుదు వంత సుతులఁ♦గాంతలందు.

క. ధరణీశ! యేతలంపునఁ, బరమేశ్వరుఁ గూర్చి యాస♦వన మొనరిచితో
వరసుతుల నట్టివారిని, సురుచిర సుగుణప్రకాండ ♦ శుభులఁ గనుదు సూ!

చ. అని పలుకంగ నాన్నృపతి, ♦ యాదల, భక్తిని వంచి యట్లయా
నని తపనీయపాత్రమును ♦ హరిరమేశ్వర నిర్మితోదనం
బునఁ బరిపూర్ణమై తనరె ♦ పూజ్యసురేశ్వరుచేతఁ బ్రేరితం
బును నయి యొప్పుదానిఁగొని ♦ మోదముపొంగఁగఁ దృప్తిఁబొందఁగన్. ౨౧

తే. అద్భుతము ప్రియదర్శనం♦బై తనరెడు
భూతమున కట్టిదానికిఁ ♦ బుడమి మేను
సోఁకఁ బ్రణమిల్లి కడుఁ దమి ♦ భూకళత్రుఁ
డపుడు భక్తిఁ బ్రదక్షిణ ♦ మాచరించె. ౨౨ 511

క. క్షితిపతి యట దేవవిని, ర్మితపాయసలాభమునకు ♦ మిగులముదమున
ప్రతిమమును బొందె నిర్ధనుఁ, డతిశయ ధనలాభ మొందు ♦ నప్పుడు వోలెన్.
సీ. అద్భుతాకారమై ♦ యతులకాంతిని మించు నాభూతమంతఁ బా ♦ యస మొసంగు
కృత్యంబు నెఱవేర్చి ♦ కృష్ణవర్త్మునియందు నందె, యదృశ్యత ♦ నందె నంత
సంతోషభరమున ♦ వింతకాంతుల రాజు భార్యాళి వికళంక ♦ భాసుఁ డగు
శారదచంద్రుని ♦ స్వచ్ఛకాంతుల వెల్గు నంబరంబునుబోలె ♦ నంబుమీఱె
తే. క్షితిపుఁ డంతఃపురంబును ♦ జేరి కోరి
మహిషియైన కౌసల్యతో ♦ మమతఁ బలికెఁ
బాయసంబిది యాత్మజో ♦ త్పత్తికరము
నాకుఁ గావున గ్రహియింపు ♦ నళిననేత్ర. ౨౮ 513
మ. అని కౌసల్యకుఁ బూర్ణపాయసమునం ♦ దర్ధంబొసంగెన్ సుమి
త్రను బ్రీతిం గని పాయసార్ధమున న ♦ ర్ధంబిచ్చెఁ బాదాంశమై
గననా పాయసమందు నర్ధమగు భా ♦ గంబిచ్చెఁ గైకేయికిన్
దనయోత్పత్తినిమిత్తమై పరఁగునా ♦ దాత్పర్యమేపారఁగన్. ౨౯ 514
సీ. అవశిష్టమా నష్ట ♦ మాంశంబు, నసమృతోపమంబును భూపా ♦ లమండనుండు
ముదితలలో రెండ ♦ వది సుమిత్రయె మూఁడవదియగు కైకేయి ♦ యంశమందు
సమతపేరలు పొంద ♦ శాస్త్రమొప్ప రటంచుఁ దనమది నూహించి ♦ తగ మిగిలిన
యష్టమాంశము సుమి ♦ త్రాంగనకే యిచ్చె మరల నివ్విధి రాజు ♦ మానినులకుఁ
తే. బాయసము వేఱువేఱుగఁ ♦ బంచి యిచ్చె
రాజు నుత్తమకాంతలు ♦ రమణుఁ డొసఁగి
పెద్దపిన్నలఁ గ్రమమున ♦ విహితరీతి
నానఁగెఁ బాయసమును హర్ష ♦ మెసఁగుచుండ. ౩౦ 515
క. దానిం గైకొని మది సన్మానముగాఁ జూచె భూప ♦ నందనుఁ డని యా
మ్మానినులు తలఁచి యంతట, దానిం బాయసముఁ గుడిచి ♦ తమి వేఁడ్వేలన్.
తే. హుతవహాదిత్య తేజస్సు ♦ లొప్పుచుండుఁ
గొంతకాలము గడువంగఁ ♦ గోమలాంగు
లెల్ల గర్భంబులను దాల్చి ♦ రెసఁగు వేడ్క
నంత భూపతివధువులు ♦ కాంత లిట్లు. ౩౧ 517
తే. చూలు తలసూపఁగాఁ గడు ♦ శోభిలుటను
గాంచి సుస్వస్థచిత్తుఁడై ♦ గరుడసిద్ధ
సురమునిగణార్చితుం డయి ♦ సొంపుమీఱు
నింద్రువిధమున సంతోష ♦ మెసఁగ వెలసె. ౩౨ 518

పదునాఱవ సర్గము సంపూర్ణము.

## ౧౭-వ సర్గము.

—దేవతలయంశముల వానరులు పుట్టుట.—

చ. హరియిటులన్మహాత్ముఁ డగు ♦ నాజికిఁ బుత్త్రుఁడుగా జనింపఁగా
దొరఁకొనుటల్ దలంచి యల♦తోయజ సూతియు భావికార్యవి
ద్వరుఁడు సురావళిం బిలిచి ♦ పల్కె సురోత్తములార! సర్వస
త్వపరహితంబుఁ గోరి సుర♦పూజ్యుఁడు చక్రధరుండు భూస్థలిన్. ౧ 519

ఉ. ఆడినమాటఁ దప్పక మ♦హత్తరశౌర్యముమీఱఁ బుట్టెడున్
వీడని పూన్కిమీఱ లల♦వీరునకున్ సుసహాయులైన, బల్
వాడిమగండ్రఁ బెక్కురను ♦ వైఖరిమీఱెడు కామరూపులన్
బోడిమితోఁ సృజింపుఁ డిఁక ♦ మూర్ఖులఁ జంపఁగఁ జాలువారలన్. ౨ 520

సీ. మఱియు నవ్వారలు ♦ మాయావిదులు శూరులనిలాభవేగులు ♦ హరిసమాన
మగుపరాక్రమమున ♦ నలరంగఁ దగువారు నీతిశాస్త్రజ్ఞులు ♦ నిర్మలాత్మ
లోపలచేఁ జావక ♦ యుండంగఁ దగువారుఁ జతురుపాయజ్ఞులు ♦ సకలశస్త్ర
శక్తియుక్తులు సింహ♦సమదేహయుతులును నమృత మాస్వాదించి♦నట్టివారు

తే. వోలె మరణంబు నొందక ♦ గ్రాలువార
లప్సరఃకామినీమణు♦లందు మఱియు
నమలగంధర్వకాంతల♦యందు యక్ష
వనితలందును బుట్టింప ♦ వలయు మీరు. ౩ 521

తే. ఋక్షవిద్యాధరాదుల ♦ యింతులందు
వానరస్త్రీలయందును ♦ జానుమీఱ
కిన్నరాబ్జాక్షులందును ♦ సన్నుతులను
వానరాకారముల నొప్పు ♦ వారిఁగనుఁడి. ౪ 522

చ. తనయులు వారు శౌర్యమునఁ ♦ దమ్ము సృజించిన యట్టివారితో
నెనయని చెప్పఁగాఁ దనరి ♦ యే, క్షితిఁ గ్రాలుచునుండఁగావలెన్
వినుఁడిఁక భల్లుకోత్తముని ♦ వేడుక మున్నె సృజించినాఁడ నా
ఘనుఁడిల జాంబవంతుఁ డనఁ♦గాఁ దనరారుచు నున్నవాఁడొగిన్. ౫ 523

క. నేనొకట నావులింపం,గా నావదనంబునుండి ♦ కడువడి వెడలెన్
సూనుఁడని బ్రహ్మ పలికిన, నానిర్జరు లాలకించి ♦ యజునాజ్ఞ మెయిన్. ౬ 524

క. సురలెల్లఁ గీశరూపుల, ధరఁ బుట్టఁగఁజేసి రల్లె ♦ తనయుల, విద్యా
ధరులును సిద్ధులుఁ జారణు, లురగులు వానరుల సుతుల ♦ నుర్వీస్థలిపై. ౭ 525

తే. పుట్టఁ జేసిరి మహిమలఁ ♦ బోల్చు ఋషులు
వనచరులఁ బుట్టఁజేసిరి ♦ వాసవుండు
ధర మహేంద్రాద్రిఁ, బోలిన ♦ ధైర్యయుతుని
వాలి యనువాని సృజియించె ♦ వానరేంద్రు. ౧౪ 526

సీ. సూర్యుఁడు సృజియించె ♦ సుగ్రీవు, రిపులను దమియింపఁ జేసెడి♦ధైర్యఘనుని
నదితిసంభవగురు ♦ వఖిలవానరముఖ్యులందును మతిమంతుఁ ♦ డైనయట్టి
వానరవరుఁ దారు♦వసుధపైఁ బుట్టించె నతఁడు త్వమోత్తముఁ ♦ డై చెలంగ
ధనదాత్మజాతుండు♦ధనవంతుఁడగు గంధమాదనుఁడనువాఁడు♦మహిఁ జెలంగ

తే. విశ్వకర్మయు నలుఁడను ♦ వీరవాన
రుని సృజించెను, బావకుం♦డును సృజించె
నగ్నిసదృశాభు శ్రీమంతుఁ♦డైన నీలు
నలరెఁ దేజోయశోవీర్య♦ముల నతండు. ౧౨ 527

క. జ్వలనసుతుండగు నీలుఁడఖిల వానరపతుల మించెఁ ♦ గీర్త్యాదుల ని
ర్మలమహాద్రవిణయుతిన్, జెలఁగెడు నయ్యశ్వులాగి సృ♦జించిరి సుతులన్.

క. అలవారలు మైందద్వివి,దులనం బ్రఖ్యాతులైరి ♦ తోయప్రభుఁడున్
గలిగించె, సుషేణుండన, నిల నాతఁడు పరఁగి వాన♦రేశుండయ్యెన్. ౧౩౪

సీ. శరభు నతిబలుఁ బ♦ర్జన్యుండు సృజియించె మారుతాత్మజుఁడు శ్రీ♦మంతుఁడైన
హనుమంతుఁడయ్యె న♦య్యనఘుఁడు వజ్రసమానాంగుఁడై గరు♦త్మత్సమాన
వేగవంతుండయి ♦ వెలసి వానరముఖ్యులందును, మతిమంతుఁ♦డై బలయుతుఁ
డై చెలంగెను, మఱి ♦ యమరులు పెక్కువేలను సృజించిరి రావ♦ణుని వధింపఁ

తే. గోరి యావానరులు మదిఁ ♦ గోరినట్టి
యాకృతులఁ బొందఁ గల్గి య♦హార్యబలము
తనర వీరత్వమేపాఱ ♦ ధైర్యమలర
శౌర్యసారము చెలఁగ ధ్రా♦స్థలిఁ బరఁగిరి. ౧౬ 530

క. అతిదృఢకాయులు గురుబల,యుతులు సుమేర్వద్రిమంద♦రోర్వీధర తు
ల్యతఁ గనువారలు నగుచున్, క్షితిఁ బరఁగిరి దైవమహిమ♦చెలువారంగన్.

తే. కొండముచ్చులు నెలుఁగులుఁ ♦ గోఁతు లట్టి
మనుజసృష్టినిఁ బుట్టిరే♦మాత్రిఁ జనరు
నెవ్వఁ డాతని తనయుండు ♦ ననఁగ నట్టి
వేషరూపపరాక్రము ♦ వృద్ధులందు. ౧౭ 532

క. మొగమొండు వానరాకృతి,గఁ గనంబడు చుండుఁగాని ♦ గాత్రంబెల్లన్
వగియుండుఁ బితృసమానం,బుగ నిట్లు సృజించిరమర♦ముఖ్యులు సుతులన్.

సీ. వానరుల్ కొందఱు ♦ ప్రభవిల్లి రలకొండమచ్చు చేడియలందు ♦ భూరిశౌర్య
ములతోడ; భల్లూకం♦బులయింతులందుఁగిన్నరకాంతలందుఁగొం♦దఱుజనించి
రతులకీర్తులఁ గన్న♦యట్టి దేవమహర్షి గంధర్వ యక్షులు ♦ గరుడ నాగు
లురగులు సిద్ధ కిం♦పురుష విద్యాధరు లింక ననేకులు ♦ హృష్టచిత్తు
లయి వేలకొలఁదిగ ♦ నప్సరోమణులందు విద్యాధరాంగనా ♦ వినుల నాగ
ఆ. కాంతలందు మఱియు ♦ గంధర్వవనితల,యందు విష్ణుమూర్తి ♦ యవతరించు
సమయమునందు విపిన♦చరులగు క్రోఁతులఁ, గల్గఁజేసిరతుల ♦ కాయఘనుల.
ఉ. కోరినయట్టి రూపములఁ ♦ గోరికకుందగు దోర్బలంబులన్
గోరికకుద్దియౌ గతులఁ ♦ గోఁతులకుం దగియుండె నింకనున్
భూరిబలైకదర్పములఁ ♦ బొల్చుట నవ్వితతక్షుసింహగం
భీరత నొప్పుచుండును; గ♦పిప్రముఖుల్ పని గల్గు చోటులన్. ౨౩ 535
చ. శిలల ధరించి యుద్ధమును ♦ జేయఁగఁ జెట్లను దాల్చి వేసి యా
కులపడునట్లు శత్రువులఁ ♦ గోరియొనర్పఁగ నేర్చిరందఱున్
బలువిడి గోళ్లఁ గోఱలును ♦ బ్రాఘతరాయుధసంక్తులౌను వా
రలకొగి నస్త్రసంక్తుల, న♦రాతులువైవ నుపాయమొప్పఁగన్. ౨౪½ 536
తే. వారు తప్పించుకొనెడును♦పాయమలర
నొప్పుచుందురు దేవతాం♦శోద్భవులగు
టను మఱియు నందఱును గొండ♦లను జలింపఁ
జేయఁ బెనుమ్రాఁకులఁ గదల్ప ♦ సిద్ధబలులు. ౨౪½ 537
చ. ఉరవడిచే సరిత్పతిని ♦ నుద్ధతునిం గడలిం గలంపఁగా
ధరణిని వ్రక్కలింపఁగఁ బ♦దంబులఁ జుల్కఁగఁ గంధి దాఁట నం
బరమును బ్రాఁకె మేఘముల ♦ బాహుబలంబునఁ జిక్కఁబట్టఁగాఁ
గరులు మదించి పాఱ వనిఁ ♦ గ్రన్ననఁ బట్టఁగ నేర్తురందఱున్. ౨౬½ 538
క. పులుఁగుల బొబ్బల నాదం,బులఁ గూల్పఁగ నేర్తురిట్లు ♦ పొలుపారెడు కోఁ
తులమూఁక కధిపులిలపైఁ, గలిగిరి శతలక్షసంఖ్యఁ ♦ గడిఁది మనములన్. ౨౭
తే. వారలింకను గామరూ♦పముల వెలసి
రట్టి వానరసంఘంబు♦నందు వాలి
ముఖుల సేనాధిపతులు చ♦మూవిభూర్త
ములుగఁ జెలఁగిరి విక్రమం♦బుల నెసఁగుచు. ౨౯ 540
క. వారును గాంచిరి శూరకు,మారులఁ జెక్కంద్ర నాదు ♦ మహితోత్సాహం
బారంగ ఋక్షవద్ధర, చారుప్రస్థములఁ జేరి ♦ సల్పిరి గ్రీడల్. ౨౯½ 541
ఉ. కొందఱనేకభూమిధర♦కూటములన్ బలుకాననంబులన్
జెందిన వేడ్క నుండిరి కు♦శేశయమిత్రుని పుత్రు నింద్రపు

త్తుం డగనీటునిన్ నలు మరు♦త్సుతు నింకను ముఖ్యులైన వా
రిం దగుకీర్తిఁ గొల్చి హ♦రిప్రవరుల్ వినయంబు మీఱఁగన్. ౩౧౪ 542

ఉ. వానరులెల్లఁ దార్క్ష్యబల♦వర్ధితులై రణకృత్యమందు నే
ర్పూని మహోగ్రశౌర్యమున ♦ నొప్పుచు బెబ్బులులన్ మృగేంద్రసం
తానము ఘోరసర్పసము♦దాయము బాధలపాలు సేయుచున్
బూనిక సంచరించి రతి♦మోదము పొంగఁగ స్వేచ్ఛమీఱఁగన్. ౩౨౪ 543

ఆ. అమితవిక్రమమున ♦ నలరి మహాబాహు, వైన వాలి యట్టి♦వానరములు
నెలుఁగుబంట్ల నట్టి♦తే కొండముచ్చులఁ, బోషణంబు సేసె ♦ భుజబలమున.

సీ. వనములఁ గొండల ♦ వార్ధితీరంబుల దీవులయందెల్లఁ ♦ దెంపుమెఱయఁ
బలువిధంబుల దేహ♦ములు గ్రాలఁగాఁ దమ్ము గుఱుతింపఁ దగినట్టి♦గుఱుతులెన్నొ
యమరంగ నాక్రొంతు ♦ లలరుచు నిండుగ నుండిరి మఱియు న♦త్యుగ్రరూప
ములును శరీరముల్ ♦ చెలఁగ బబ్బులి గములో, కొండకూటమ్ము♦లో యనంగఁ

తే. గనుఁగొనంబగి భుజబల♦మున మెఱయుచుఁ
దనరు కపిసైన్యనాయకుల్ ♦ ధరణి రామ
చంద్రునకు సాయ మొనరింపఁ ♦ జాలునట్టి
హేతువున సంచరించిరి ♦ యెల్లయెడల. 545

పదునేడవ సర్గము సంపూర్ణము.

---

౧౮-వ సర్గము.

శ్రీమద్రామచంద్రావతారఘట్టము.

చ. సుమహితమైన యాగ్యయుతి ♦ శోభిలు నయ్యజపుత్రు వాజిమే
ధము తన యిష్టిరీతి విధి ♦ నప్పక యుండ సమాప్తినొంద న
య్యమరులు భాగముల్ గొని గృ♦హంబులకున్ దమవచ్చినట్టి చొ
ప్పమరఁగఁబోయి; రన్నర♦భావనిపాలుఁ డుదారయుక్తుఁడై. ౧ 546

తే. యజ్ఞదీక్షానిమిత్త, ని♦యమములను నాగిఁ
జక్కఁగాఁ బూర్తి నొందించి ♦ సకలభృత్య
సైన్యవాహనయుక్తుఁడై ♦ స్వపురవరముఁ
దమిఁ బ్రవేశించె నంతే య♦జ్ఞమునుజూడ. ౨ 547

క. చనుదెంచిన పృథివీశుల, జనపతి పూజించె న్యాయ♦సమ్మతముగ వా
రును ముదితులగుచుఁ బోయిరి, జనపదములు; కేలుబ్రమ్ముక్కి ♦సంయమిపతికిన్.

చ. క్షితిపుఁడయోధ్యయందు కడు♦శ్రీయుతులై స్వపురాళికేగు భూ
పతులసమస్తసేనలకు ♦ వస్త్రములన్ దగు భూషణంబులున్

గుతుకము మీఱ నిచ్చెఁ దమ♦కుం బతిసేసిన గౌరవంబుచే
నతిముద మంది తృప్తిఁ గని ♦ యాభటులేగిరి శుభ్రరీతిఁగన్. ౪ 549

చ. జనపతులుం దదీయమగు ♦ సైన్యము సంతసమంది యేఁగ న
మ్మనుజవిభూత్తముండపుడు ♦ మానిపురస్సరుఁడై పురోత్తమం
బును గురువైభవంబు దగఁ ♦ బొందె మునీశుఁడు ఋశ్యశృంగుఁడున్
దనసతి శాంతఁగూడి ప్రమ♦దంబున రాజొగిఁ బూజసేయఁగన్. ౫ 550

ఆ. మోదమంది రోమ♦పాదుండు ధీమంతుఁ, డాత్మసైన్యయుక్తి ♦ ననుగమింప
నత్తవారి యింటి ♦ కరిగె నంతట రాజు, నఖిలబంధుముఖుల ♦ ననిపి పురిని.

క. తనకోరిక లీడేఱెడు, నని నిండుమనంబుతోడ ♦ నాత్మజులను గాం
తునో యెప్పుడనుచు నెంచుచు, ఘనసౌఖ్యములొదవనుండెఁ♦గాంతలతోడన్.

*తే. వాజిమేధంబు నెఱవేఱి ♦ వర్షమొండు
గడచెఁ బండ్రెండవదగుచుఁ ♦ గ్రాలుమాస
మందు నరుదెంచె నది చైత్ర ♦ మనఁగ నలరె
నందు నవమి యనెడు తిథి ♦ యరుగుదెంచె. ౮ 553

సీ. అదితియేతారకు♦నగు నధిదైవత మది పునర్వసునామ ♦ మలర నెసఁగు
నట్టినక్షత్రంబు♦నందు రవ్యంగారకులు గురుశుక్రశ♦ను లనఁబడెడు
నైదుగ్రహంబులు ♦ నాత్మోచ్చరాసుల యందుండఁ గర్కాట♦కాఖ్యలగ్న
మందుఁ జంద్రునిఁ గూడి♦యమరగురుం డుండ లోకనమస్కృతు♦లోకవిభుని

తే. సర్వలక్షణయుక్తుని♦నిక్ష్వాకువంశ
వర్ధనుని సుమహాభాగ్య♦వంతు విష్ణు
నందు నర్ధాంశమునునైన ♦ యట్టిరాముఁ
గనియెఁ గౌసల్య పుత్రునిఁ ♦ గడుముదమున. ౧౦ 554

చ. తనయుని వజ్రలక్షణయు♦తస్ఫురదాయతపాణి భూరితే
జునిఁగని కోసలేశుసుత ♦ సొంపుగ వజ్రము కేలఁ దాల్చునా
త్తనయు నుపేంద్రుఁ గాంచి ప్రమ♦దంబును గాంచిన దేవమాతచా
డ్పున మెఱసెన్ మహీపతియుఁ ♦ బొంగుచుఁ గేకయపుత్రియందొగిన్. ౧౧

తే. వాజిమేధంబు...అనుపద్యమునకు మూలము. "తతో యజ్ఞే సమాప్తేతు ఋతూనాం షట్సమత్యయుః, తతశ్చ ద్వాదశేమాసే చైత్రే నావమికే తిథౌ" రా అని. అశ్వమేధసమాప్తి మొదలుగాఁగాని, పాయసము నుపయోగించినది మొదలుగాఁగాని సంవత్సరమని యర్థము. ఆమొదలు వైశాఖమాసమున నయ్యెను. దానికిఁ బండ్రెండవనెల చైత్రమాసమనిభావము గ్రహింపవలయు. ఈయర్థమునకే ద్వాదశే=పండ్రెండవదియైన అని పూరణార్థకశబ్దప్రయోగము చేయఁబడియె. ఆసంవత్సరమునఁ గడపటిదగు చైత్రమాసమున శుక్లపక్షనవమియందని యర్థము గ్రహింపఁదగు.

తే. తనయునిం గాంచెఁ బ్రత్యక్ష♦వనజనయను
నందు నాల్గవభాగంబు ♦ నఖిలసుగుణ
ములఁ దదీయంబులనుగూడి ♦ యలరువాని
భరతు సత్యపరాక్రము ♦ భవ్యతనుని. ౧౨॥ 556

క. తనయుల వీరుల సర్వా,స్త్రనిపుణులను జక్రధరుని ♦ చతురష్టసుభా
గనిమిత్తులఁ గనె లక్ష్మణు,నిని శత్రుఘ్నుని సుమిత్ర ♦ నెమ్మిం బిదపన్. ౧౩॥ 557

తే. పుష్యనక్షత్రమున యందుఁ ♦ బుట్టె మీన
రాశిని ప్రసన్నబుద్ధి భ♦రతుఁడు, రవి ప్ర
వృద్ధినొందఁ గటకమందు ♦ వెలసి యురగ
భమున లక్ష్మణ శత్రుఘ్ను ♦ లమితబలులు. ౧౪॥ 558

క. అనురూపులు గుణవంతులు, తనురుచిఁ బ్రోష్ఠపదతుల్య♦తం బొందుచు నా
మనుజేంద్రసుతులు నలువురు, తనరారిరి వేఱువేఱఁ ♦ దత గురుమతులై.

క. తనయులు పుట్టఁగ గంధ,ర్వనికరనుతి మధురముగను ♦ బాడెను, దివిజాం
గనలాడిరి సురదుందుభి, నినదంబులు చెలఁగి దెసల ♦ నిండెం బెలుచన్. ౧౬॥

తే. కుసుమవర్షంబు దివినుండి ♦ కురిసె నపు డ
యోధ్యయందు మహాజను♦లొగిఁ జెలంగి
యుత్సవంబులవైభవ ♦ మొప్పఁ జేసి
రమ్మహాత్ములు జనియించు ♦ నవసరమున. ౧౭॥ 561

చ. జనములు క్రందుగాఁ దిరుగ ♦ జానగుభావరసంబులొప్ప న
ర్తనములు సేయున ర్తకవి♦తానము నిండఁ జెలంగ గాయకుల్
మనమున కింపుఁగూర్చుగతి ♦ మంజులరీతిని బాడ వాద్యశి
ల్పినికరమెల్ల వాద్యములఁ ♦ బెల్లుగ మ్రోయఁగఁ జేయ రాజమా
ర్గనిచయ మప్పు డారవ వి♦రాజితమై తనరెన్ మనోజ్ఞమై. ౧౮॥ 562

తే. వందిమాగధసూతుల ♦ పఱిఁ జేసెఁ
బారితోషికముల ధరా♦వరుఁడు మఱియు
భూసురులకిచ్చె గోధనం♦బును గనకము
వేలకొలఁదిగ సంతోష♦విహితబుద్ధి. ౧౯॥ 563

సీ. ఎలమి లక్ష్మణుఁ డుద♦యించిన దినము మొదలుగ లెక్కించిన ♦ ద్వాదశదిన
మేగ నామకరణ♦మెంతయు వేడుకఁ జేయంగ నెంచి యా♦క్షితివిభుండు
ప్రార్థింపఁగా ముని♦వరుఁడౌ వసిష్ఠుండు సంప్రీతుఁడౌచు జ్యే♦ష్ఠతనయునకు
నమ్మహాత్మునకు రా♦మాహ్వయంబిడె, భరతాఖ్యనిచ్చెను గై క♦యనుఁగుసుతున

తే. కవ్వల సుమిత్రకొమరుల ♦ యందు నొకని
కిడిరె లక్ష్మణుఁడను నామ ♦ మితరునకును

బెట్టె శత్రుఘ్నుఁడను పేరుఁ ♦ బ్రీతినొంది
పౌరులకు జానపదులకు ♦ బ్రాహ్మణులకు. ౨౦½ 564

క. కరమరుదగు భోజనమిడె, ధరణీపతి మఱియు వేడ్క ♦ ధరణీసురులకున్
వరరత్నతతి నమితముగఁ, బరితృప్తిం గను నునమునఁ ♦ బల్మఱు నిచ్చెన్. ౨౧

క. తనయులకు జాతకర్మాదినిఖిల కర్మముల నాక్షి♦తిపతి మునిముఖం
బునఁజేయించెను రాముఁడు, తనయులయందెల్ల జ్యేష్ఠ♦తంగని కడఁకన్.

మ. తనవంశంబు ధ్వజోత్తమంబు కరణిన్ ♦ ధాత్రిం బ్రకాశింప నా
య్యనఁ దాఁజేయుచుఁ దండ్రికెంతయు మనో♦హర్షంబునుం గూర్చుచున్
వనజోద్భూతుని భాతి భూతహితుఁడై ♦ వర్ధిల్లుచున్ వెల్గె నా
తనయుల్ శూరులు వేదవేత్తలును నై ♦ ధాత్రీహితాచారులై. ౨౩ 567

తే. జ్ఞానసంపన్నులయి దయా♦సత్యముఖము
లైన సద్గుణములు గల్గి ♦ యలరుచుండి
రాతనూజులలో రాముఁ ♦ డతులతేజ
మలరఁ జెలఁగి యమోఘవీ♦ర్యమున వెలసి. ౨౪ 568

ఉ. అంకములేని చందురుని ♦ యట్టులు నిర్మలుఁడై జనాళికిన్
బొంకముగాఁగఁ జూడఁదగి ♦ పొల్చెడు నేన్గులమూఁపులెక్క ని
శ్శంకహయంబులెక్క రథ♦సత్తమముం గడునేర్పుమీఱఁగా
సంకటకారి యుద్ధములఁ ♦ జయ్యనఁ దోలఁగఁ దా సమర్థుఁడై. ౨౫ 569

క. జనములచేఁ బొగడంబడి, ధనురామ్నాయమున శక్తిఁ ♦ దనరి నిరతమున్
జనకుని శుశ్రూషారతిఁ, గని యసదృశకీర్తిరమను ♦ గాంచి వెలింగెన్. ౨౫½

క, సేవాసంపదఁ బెంపుం, గావించుచు బాల్యమాది♦గా లక్ష్మణుఁడున్
భావుకదానపరాయణు, నే వేళను జ్యేష్ఠసహజు ♦ నెలమి యమరఁగన్. ౨౬

క. కొలుచుచు జగదభిరాముని, నలరించుచు సేవనముల ♦ నర్హావిధములన్
జెలఁగెను మఱియును సంపత్కలితుఁడు సౌమిత్రి తనదు♦గాత్రము కంటెన్.

తే. రామునే ప్రీతిమైఁ జూచి ♦ రామచంద్రు
నకుఁ బ్రియంబులఁ గూర్చి, య♦న్నకుఁ దలంపఁ
దనువు వెలుపలిప్రాణమో ♦ యనువిధమున
వర్తనము సేయుచుండు వి♦ద్వాంసులలర. ౨౭½ 573

చ. అనుజుని లక్ష్మణున్ విడిచి ♦ యప్పురుషోత్తముఁడైన రాముఁడుం
గనఁడు సుషుప్తి; రుచ్యముగఁ ♦ గ్రాలెడు నన్నము తల్లి దెచ్చియుం
చిన భుజియింప నొల్లఁడల ♦ చిన్నిసహోదరుఁ బ్రాణమిత్రముం
గనుఁగొన; కొంటిమై నృపుని ♦ గాదిలి పెద్దకుమారుఁ డొక్కటన్. ౨౮½ 574

మ. తురగం బెక్కి మహాటవీస్థలికి సం♦తోషంబునన్ వేఁట సే
యురతిన్ బోవఁగ లక్ష్మణుం డపుడె, న♦త్యుగ్రోరుకోదండముం
గరమం దొప్పఁగఁ గూడఁబోవు సహజున్ ♦ గావంగనో నన్న యా
తురతన్; లక్ష్మణు తమ్ముఁడై పరఁగు శ♦త్రుఘ్నుండు నారీతిఁగన్. 575

చ. భరతుని గొల్చుచుండు గుణ♦భాసురుఁడై తగు కైకపట్టి క
ప్పుమలలాముఁ డెంతొ యను♦మోదముఁ గూర్చుచుఁ బ్రాణరాశికం
టె రమణుఁడయ్యె నట్లగుట ♦ నెమ్మి నతండును దమ్ముఁ జూచుచున్
బరమసఖుండునై మెలఁగె ♦ నల్వుర నుత్తమభాగ్యయుక్తులన్. ౩౧ 576

చ. తనయులఁ గాంచి యద్దశర♦థక్షితిపాలుఁడు నాల్గుదిక్కులం
బనివడి ప్రోచు దేవతల ♦ భాసురులం గను బ్రహ్మవోలె నె
మ్మనమున సంతసిల్లెను; కు♦మారులు వారలు తండ్రికిష్టులై
తనరిరి తండ్రి తమ్ముఁ గని ♦ తద్దయుఁ బొంగఁగ జ్ఞానయుక్తులై. ౩౨ 577

సీ. సకలసద్గుణయుక్తు ♦ లోకపరి యొనరించునట్టి ప్రమాదకా♦ర్యముఁ దలంచి
సిగ్గునొందుచుఁ గీర్తిఁ ♦ జెల్వొంది సర్వకార్యమ్ములు నొనరించు♦నట్టివిధము
నెఱిఁగి దూరమ్ముగ♦ నెసఁగెడు కృత్యంబుఁ దెలియునంతటి సుబు♦ద్ధియు వెలయఁగ
నసదృశ తేజులై ♦ యసమానమహిమల, నలరుచుండఁగఁ జూచి♦ యాక్షితీశుఁ

తే. డబ్జజుని లోకమునకుఁ దా ♦ నధిపుఁడైన
యట్లు సంతోషమునఁ బొంగె; ♦ నక్కుమారు
లాత్మజనకోపలాలితు♦లయ్యుఁ బొగరు
వడక పురుషోత్తములు గానఁ ♦ బట్టుదలను. ౩౪ 578

చ. స్మృతులఁ బురాణముఖ్యముల ♦ శీఘ్రమునేర్చుచు నప్రమత్తులై
పిత, కొగి సేవసేయుచుఁ బ్ర♦వృద్ధిని బొందుచుఁ జాపవిద్యయం
దతిశయపాండితిం గనెడు ♦ నట్టిప్రయత్నము సేయుచుండి, రా
క్షితిపతి కాల్యకృత్యముల ♦ సిద్ధి నెఱింగిన వాఁడు కావునన్. ౩౫ 579

తే. సుతులకుం బెండ్లివయసు వ♦చ్చుట యెఱింగి
దారలను వారికిం గూర్పఁ ♦ దలఁచి యవ్వి
షయము బంధుపురోహిత ♦ సమితిఁ గూడి
మంతనము చేయుచుండె; న♦మ్మాడ్కి నచట. ౩౬ 580

దశరథునికడకు విశ్వామిత్రుఁడు వచ్చుట.

చ. అనుచరమంత్రులం గలిసి ♦ యమ్మహితాత్ముఁడు పెండ్లిసేయు యో
జన తమిఁ జేయుచుండ ముని♦సత్తముఁడై గురుతేజమొప్ప మే
దిని దనరారు కౌశికుఁడు ♦ దివ్యమనీష నెసంగుఁగాన వ
చ్చె నజుని పుత్రదర్శనము ♦ సేసెడుకోరిక పొంగుచుండఁగన్. ౩౭ 581

క. చనుదెంచి ద్వారపాలురఁ, గని గాధికుమారుఁడైన ♦ కౌశికుఁ డరుదెం
చెను యుష్మద్దర్శనమున, కని మీరాజునకు దెల్పుఁ ♦ డతివేగమునన్. ౩౮౹

చ. అనవిని వారలందఱు మ♦హాతురులై పెనుభీతినొంది య
మ్మునివరు సారవాక్యము ద♦ముం గడఁకం బురికొల్ప నప్డు భూ
పునిదగుసౌధసీమ కొగిఁ ♦ బోయిరి వేగమె; యంతవారల
జ్జనపతి యిల్లుసొచ్చి ముని♦సత్తమురాకను గోర్కి మీఱఁగన్. ౩౯౹ 583

తే. విన్నపము సేసి రిక్ష్వాకు♦విమలవంశ
భూషణుండగు దశరథ ♦ భూమిపతికి
వారివాక్యంబు విని భూమి♦వరుఁడు మోద
మెనయ సపురోహితుండు సమా♦హితుఁడు నగుచు. ౪౦ 584

క. మునివర్యు నెదురుకొనియెన్, వనజాసను నింద్రుభంగి ♦ వాకిట వానిన్
గనియెన్ గాంతి వెలుంగుచు,మునిపతియయి ఘోరనియమ♦ములఁదగువానిన్.

క. క్షితిపతి యివ్విధి నమ్ముని, పతినిం గని సంతసమున ♦ వదనమలరఁ గా
జతనంబు మీఱఁగఁ బురో,హితముఖ్యునిచేత నర్ఘ్య ♦ మిప్పించె విధిన్. 586

చ. క్షితిపతి శాస్త్రయుక్తముగఁ ♦ గేవలభక్తినొసంగు నర్ఘ్యము
ప్రతిమముదంబునం గొని ధ♦రాపతిఁ జూచి నరేంద్ర ! క్షేమమా !
హితమతి నేమికోరిన న♦దెట్టిదియైనఁ గొఱంతలేక నీ
కతిసులభంబ సేకురునె ♦ యంచు దయామతిఁ బ్రశ్నసేయుచున్. ౪౩౹ 587

తే. ధార్మికోత్తముఁడా ముని♦తల్లజుండు
కౌశికుం డిట్లు వచియించెఁ ♦ గ్రమ్మఱ క్షితి
పతివసంతమ ! పుర, జన♦పద, ధన, సఖ
బంధు జనములకెల్లను ♦ భద్రమె కద. ౪౪౹ 588

క. జనవర ! నీసామంతులు, మనమున వినయమున నాజ్ఞ ♦ మన్నింతురె, శ
త్రునికరమును గెలిచితివే, ఘనపౌరుషశాలివగుచుఁ ♦ గడుఁ బూన్కి దగన్.

తే. యజ్ఞముఖరూపముగ నున్న♦యట్టి దైవ,కర్మజాలమ్ము నతిథిస♦త్కారముఖము
గాఁ దనరుచున్న మానుష♦కర్మవితతిఁ,జక్క నొనరించినాఁడవే♦క్ష్మాతలేంద్ర!.

సీ. అని క్షేమవార్తల ♦ నడిగి వసిష్ఠునిఁ జేరి యామునివరు ♦ క్షేమమడిగి
యచ్చటనున్న మ♦హాభాగులౌ మునివరులనెల్లను న్యాయ♦పథమురీతి
క్షేమవార్తలను బ్ర♦శ్నింప వారెల్లను సంతోషమును బొంది ♦ రంత వారు
క్షితిపతిసభఁ బ్రవే♦శించి పూజితులయి యర్హపీఠంబుల ♦ నధివసించి

తే. రంత మిగుల నుదారత ♦ నలరువిభుఁడు
హృష్టమానసుఁడగుచు ము♦నీంద్రుఁడైన

గాధినందనుఁ బూజించి ♦ కడుముదంబు
గడలుకొనఁబల్కెఁ సద్భక్తి ♦ కలితుఁ డగుచు. ౭౭ 591

చ. తనయుల పెండ్లిమాటల ము♦దంబున మేమిటఁ జెప్పుకొంచునుం
డినతఱి నీవెవచ్చితివి ♦ నీదగురాక తగన్ మరుస్థలం
బునఁ బెనువృష్టి వారిదస♦మూహము లిచ్చినరీతిఁగా సుధా
ఘనతరలాభమబ్బినటు♦గాదె? మునీశ్వర! యెంచిచూచినన్. ౭౮ 592

తే. మఱియును సజాతియయి పొల్చి ♦ మహితవృత్తి
నలరు సహధర్మచారిణి ♦ యందపుత్ర
కుఁడు తనూజునిఁ గాంచిన ♦ వడువున, నిధి
పోయి మరలఁ గనంబడు ♦ పోల్కినయ్యె. ౭౯ 593

సీ. ఉద్వాహముఖములౌ♦నుత్సవములయందు సంతోషముప్పొంగు♦చాడ్పునఁదగె
సంచుఁ దలంచెద ♦ నార్యోత్తమా! నీకు స్వాగతమ్మగు భవ♦దాత్మయందు
నేగొప్పవాంఛిత ♦ మెసఁగు సంతసమున నేనెట్లు దీర్పనో ♦ దాని, నాదు
ప్రాగ్జన్మ సుకృతైక ♦ పరిణతి గలయదృష్టవశంబున మదీయ♦సదనమునకు
తే. వచ్చినాఁడవు సద్దాన♦పాత్రతముఁడ
వవని దేవోత్తమా! యిట్టు♦లౌట నాదు
జని సఫలమయ్యె నాదుజీ♦వనము మదిని
దలఁపఁగ సుజీవనంబయ్యె ♦ ధన్యమయ్యె. ౮౦ 594

తే. తొలుత రాజర్షివగుచును ♦ బొలిచి పిదపఁ
దపము పెంపున నుద్దీపి♦తప్రభలను
వెలసి బ్రహ్మర్షితను బొందఁ ♦ గలిగితివటు
కనుకఁ బెక్కుగతులఁ బూజఁ ♦ గొనఁ దగుదువు. ౮౧ 595

క. నీరాక యద్భుతావహ, మౌరా! యిఁకనింతకన్న ♦ నవనిఁ బవిత్రుం
గా రహి ననుఁ జేయంగా, నారయ నొండెద్దిగలుగు ♦ నవనిసురమునీ! ౮౨

తే. దర్శనం బిచ్చితివి వచ్చి ♦ ధన్యమయ్యె
మఱియుఁ బుణ్యాలవాలమై ♦ మహితమైన
క్షేత్రమయ్యె నాగృహము సు♦క్షేత్రగతుఁడ
నైతి, మునిరాజ! లోకవి♦ఖ్యాతకీర్తి!. ౮౩ 597

చ. మునివర! యేమికోర్కి మన♦ముం ద్వర పెట్టఁగ వచ్చినారలో
విని ప్రియమందఁ గోరెడిని ♦ వీనులు, మీరలెఱుంగవేగ తె
ల్పిన ముదమొప్ప దాని నెఱ♦వేర్పఁగఁ గోరెదఁ గౌశికా! మదు
క్తిని నెఱవేర్చునే యని మ♦దిం బెనుసందియమందఁ బోకుమీ. ౮౪ 598

క. విను నీవు నాకు దైవము, వనుమానము మాని తెల్పు ♦ మప్పనికొఱఁతం

గనకుండఁగ నెఱవేర్చెద, మునివర! భవదాగమనము ♦ బుద్ధిఁదలంపన్. ౫౩

తే. అగుమహాభ్యుదయంబు నా♦కరయ నీదు
రాకచే నుత్తమతమ ధ♦ర్మంబు గూడ
నిపుడు లభియించె నని యర్థ ♦ మేర్పడంగఁ
బలుక హృదయసుఖంబయి ♦ యలరి మఱియు. ౫౪ 600

తే. మృదువగుటఁ గర్ణసుఖమయి ♦ యొసఁగె, బుద్ధి
మంతుఁడగు నాధరాధిప♦మండనుండు
వినయమునఁ జెప్పినట్టియ♦ వ్విపులవచన
మును గ్రమంబున నాలించి ♦ మునివరుండు. ౫౫ 601

క. నుతగుణయుతుండు సద్గుణ, వితతిజనితయశుఁడు నగుచు ♦ వెలయు కుశికసం
తతిజుఁడు విశ్వామిత్రుం, డతిశయముగ మానసమున ♦ హర్షమునందెన్. ౫౬

పదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౯-వ సర్గము.

రాముని దనతోఁగూడఁ బంపుమని విశ్వామిత్రుఁడు దశరథునడుగుట.

సీ. అద్భుతావహమగు♦నట్టి యవ్వాక్యంబు నవనీశపంచాస్యుఁ ♦ డాడఁగ విని
భూరితేజంబునఁ ♦ బొలుచు నాబ్రహ్మర్షి పులకితదేహుఁడై ♦ పొలిచి పలికె
భూపాలవర్య! యీ♦భూలోకమున మహాకులమున జనియించి ♦ యలఘుకీర్తి
యైన వసిష్ఠుని♦దగు నుపదేశంబు మిగులఁగాంచిన నీకుఁ ♦ దగును గాదె;

తే. గాని వేఱొక్కనికిది త♦గదు నిజమ్ము
నాదుహృద్గతమౌ వచ♦నమును జేయ
నిశ్చయము సేయుమో నృప♦నిచయవర్య!
సత్యవచనుండవగుము, నా♦చరితవినుము. ౩ 603

చ. పురుషవరేణ్య! భూరిఫల♦ముం దగఁబొందఁగఁగోరి యొక్క య
ధ్వరమును జేయుకాంక్షను వ్ర♦తంబును బూనితి దాని శ్రద్ధమై
జరపుచునున్నవాఁడ నొక♦సంగతిఁజెప్పెదఁ గామరూపులౌ
నిరువురు రాక్షసుల్ చెలఁగి ♦ రెంతయు దానికి విఘ్నకర్తలై. ౪ 604

మ. క్రతుకార్యంబిసుమంతయే కొఱఁతఁగాఁ ♦ గావించి తచ్ఛిష్టముల్
జతనంబొప్ప ముగింప నున్నతఱిఁ జం♦చద్బాహువీర్యంబునం
బ్రతిలేకొప్పుచు నారితేఱి జగతిన్ ♦ వర్ధిల్లునాయిద్దఱు
ద్ధతమారీచసుబాహునాములు, నితాం♦త క్రోధదుర్వారులై. ౫ 605

తే. యజ్ఞవేదికనిండ మాం♦సాన్వితముగ
రక్తవృష్టిని గురిపింత్రు ♦ రాజవర్య!

నియమనిశ్చయమైన యా♦నిర్మలమఖ
మిట్లు విఘ్నయుతంబయి ♦ యేపుచెడిన. ౫౹ 606

క. శ్రమపడి యొనరించియుఁ గా,ర్యము నిష్ఫలమగుట నిర్గ♦తాత్మోత్సాహం
బమరఁగ వచ్చితి నిద్దే,శమునకు వాసంబుసేయఁ ♦ జనదంచు నృపా! ౬౹ 607

మ. క్రతుభంగం బొనరించుదానవుల బో♦కార్పంగ, శాపంబును
ద్ధతి నీవేల యొసంగనైతి నన నో♦ధాత్రీశ్వరా! చెప్పెదన్
దితిజధ్వంసమునీఁన నాగ్రహము బు♦ద్ధిందోఁప దాచార మీ
గతి యజ్ఞీయముగాఁ జెలంగుఁ గనుకం ♦ గాదయ్యె శాపంబిడన్. ౭౹ 608

చ. అవితథవిక్రముండయిన ♦ యగ్రతనూజుని రాము, శూరు, భూ
ధవనిబుధేంద్ర! కూఁకటిని ♦ దాల్చినవాఁ డనియెంచ కాత్మసం
భవుని నొసంగుమీ; యితఁడు ♦ బాలుఁడు శత్రుల నెట్లడంచునో
బవరము సంకటంచు బహు♦భంగుల నెంచకుమీ, మనంబునన్. ౮౹ 609

శా. ప్రాపై నేను మెలంగ స్వీయమగు ది♦వ్యస్ఫార తేజంబుచే
నా పాపాత్ముల నట్టిదానవుల ను♦ద్యద్యజ్ఞకార్యారులన్
రూపుల్ మాపఁగఁ జాలునీతఁడు సుపు♦త్రుంగంటి వీపట్టికిన్
క్ష్మాపాలా! బహుభంగులన్ శుభములం ♦ గల్గింతు సత్యంబుగన్. ౧౦ 610

తే. దేనిచే లోకముల మూఁట ♦ దివ్యమైన, ఖ్యాతినందునో సీతని♦కట్టిశుభముఁ
గల్గఁ జేసెద సందేహ♦కలితచిత్తుఁ, డవుగఁ గావలదింకఁ గ♦డంగి వినుము. ౧౦౹

మ. అని మారీచసుబాహునాయకులు, వీ♦ర్యాధిక్యముంగన్నరా
మునిఁ బేరుక్కునఁ దాఁకి నిల్వఁగలరే ♦ భూపాల యానంతయున్;
మనుజుం డన్యుఁడు మేటిశూరుఁ డయినన్ ♦ మర్దింపఁగా లేఁడు నీ
తనయుం డొక్కఁడు తక్క, వీర్యమున ను♦ద్యద్గర్వితుల్ దానవుల్. ౧౧౹ 612

చ. అతిశయపాపులౌటఁ జటు♦లాంతక పాశవశంగతాత్ములై
క్షితిస్థితిఁ గాంచినారు జయ♦సిద్ధిని గాంచఁగలేరు సుమ్ము నీ
సుతుఁడు మహాత్ముఁడౌట దను♦సూనుల లెక్కగొనండు రాణ్మణీ!
వితతసమిద్ధబాణతతి ♦ వీరుల వారల రూపుమాపుఁ జూ. ౧౨౹ 613

చ. నరవర! గోమునం బెరిగి♦నాఁడు కుమారుఁడటంచు స్నేహవి
స్ఫురణము నొందఁబోకు, దను♦సూనులఁ జంపఁగఁ జాలునంచు నే
నరసి ప్రతిజ్ఞ చేసెద ర♦ణావనిలో హతులై నయట్టుల
య్యిరువుర నిశ్చయింపుమిది ♦ యెట్టు లెటింగితివన్నఁ జెప్పెదన్. ౧౩౹ 614

*సీ. పెక్కండ్ర గురుల సే♦వించి జ్ఞానమునంది యపవర్గమును బొందు♦నట్టికృత్య

---

* సీసపద్యమునకు మూలము. "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్, వసి
ష్ఠోఽపి మహాతేజాః యే చేమే తపసి స్థితాః." ౧౮౹. ఇది గోవిందరాజవ్యాఖ్య ననుసరించి విశే

ములఁ జేసి మునినయి ♦ వెలయునే నీరాము సత్యపరాక్రమ♦శాలి, యనుచు
మఱి మహాత్ముండని ♦ గుఱుతింపఁ జాలుదు నేనె కాదు వసిష్ఠ♦మౌనిపతియు
నెఱుఁగంగఁజాలు మ♦హిత తేజుఁడౌటచే సతతతపోనిష్ఠ ♦ సలుపుచున్న

తే. వామదేవాదులైన యి♦శ్వరమునీశు
లును నెఱుంగుదురో భూప! ♦ వినుము ధరణిఁ
బరమయశమును ధర్మలా♦భంబు స్థిరము
గాఁ జెలంగఁగవలె నను♦కాంక్షయేని. ౧౫ 615

చ. తనయుని రామునీయఁదగు ♦ ధర్మమెఱుంగు వసిష్ఠుఁ డాదిగాఁ
దనరెడు నీదుమంత్రులు ము♦దంబున నిప్పనికొప్పి రేని యో
జనవర! పిమ్మటం దనయు♦సమ్మతిఁ బంపుము పద్మపత్రలో
చనుఁడగు రామునిన్ దశని♦శల్ మఖరక్ష యొనర్ప నిల్పుదున్. ౧౬ 616

తే. కాన ముద్దులకొమరుని ♦ మానసమున, నేవిచారము సేయక♦ యీయఁదగును
యజ్ఞకాలంబు మీఱక ♦ యలరునట్టు, లట్టులీ రామునిం బంపు ♦ నవనినాథ!.

క. వినమున నిసుమంతయుఁ జిం,తను బూనకు మంగళములు ♦ తనరెడు నీకున్
జననాథ! యనుచు ధర్మం,బున నొప్పు మనంబు గల్గు ♦ మునిపలికెన్.

మ. వరతేజంబునఁ బోల్చి మౌనివరుఁడై ♦ భాసిల్లు గాధేయుఁడా
ధరణీశాగ్రణితోడ ధర్మయుత మ♦ర్థస్ఫూర్తిమంతంబుగాఁ
బరఁగం బల్కుచు నూరకుండెఁ; బతి వి♦శ్వామిత్రవాక్యంబు స
త్వరినుత్యంబు శుభప్రదంబు విని తీ♦వ్రంబైన శోకంబునన్. ౨౦ 619

ఆ. భీతినొంది మోము♦వెలవెల వాఱంగ, మనసుపట్టు హృదయ♦మును గలంచు
మునివరోక్తి విని య♦వనిపతి కడునొచ్చి, యాసనమ్మునుండి ♦ యపుడు వడఁకె.

పందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౨౦ - వ సర్గము.

విశ్వామిత్రునివెంట రాముని బంపుటకు దశరథుఁడు చింతించుట.

క. నరపతి శార్దూలుఁడు ముని,వరుపల్కుల విన్నమాత్రఁ ♦ బ్రాణరహితుఁడా
కరణిని ముహూర్తకాలము, జరపి తగం దెల్వినొంది ♦ చయ్యనఁ బలికెన్. ౧

---

పార్థములు గలుగునట్లే తెలిఁగింపఁబడినది శ్రు. "వేదాహమేతంపురుషం మహాంతమ్, యః ఆత్మ నితిష్ఠన్." స్మృ. "నతస్యప్రాకృతామూర్తిః." ఇత్యాది శ్రుతిస్మృతుల ననుసరించి విశేషార్థము కల్పింపఁబడినది. ఆయర్థ మీపద్యమున సంగ్రహముగ విస్తృతము. కాన మూలమున కవిరుద్ధమే యని తెలియఁదగు.

*మ. మునినాథా! నళినచ్ఛదాంబకుఁడు రా♦ముం డిట్టి నాపుత్త్రునం
దనిలోనన్ దనుజాళినోర్వఁదగు శౌ♦ర్యంబుండునం చేనెఱుం
గను నింకం బదునాఱువత్సరములుం ♦ గాలేదు ఘోరాకృతిం
గను రక్షఃప్రకరంబుతో సమరముం ♦ గావింపనె ట్లర్హుఁడో. ౨ 622

ఉ. ఊహలు వేఱుసేయకు మ♦హోద్యమమొప్పనిదే కనంగ న
క్షౌహిణిసేన సిద్ధముగ ♦ నున్నది నావగు నాజ్ఞసేయు స
న్నాహముతోడ దీనికిని ♦ నాథుఁడ నేనకదా, జవంబును
త్సాహము మీఱ దీనిఁగొని ♦ జన్యముచేసెద నేను వారితోన్. 3 623

ఆ. నాదుభటులు వీరు ♦ నానాస్త్రశస్త్రవిశారదులును శూర♦సత్తములును
బీఱువోనియట్టి ♦ వీర్యంబునం దగు, వారు పగఱతోడఁ ♦ బోరఁ గలరు. ౪ 624

చ. కనుక మదాత్మజున్ సుఖముఁ ♦ గాఁగఁ దోడ్కొనిపోవనేల యో
మునివర! నేన సేనలకు ♦ ముఖ్యుఁడనై పరిపాలకుండనై
ధనువును గై ధరించి ప్రవి♦దారణ సీమను నిల్చి ప్రాణముల్
తనువున నుండుదాఁకఁ బటు♦దానవవీరులతోడఁ బోరెదన్. ౫ 625

చ. వ్రతమును గావనచ్చుటికి ♦ వచ్చెద దానవసన్ముఖంబు ర
క్షితమయి యంతరాయములఁ ♦ జెందక సాగునుగాన నార్య! సు
త్సుతుఁ గొనిపోవఁగాఁ దగదు ♦ సూనుఁడు వీఁ డరయంగ బాలకుం
డతిశయశక్తి వైరుల బ♦లాబలముల్ గనలేఁడు చక్కఁగన్. ౬ 626

క. విలువిద్యయందుఁ జక్కని, యలవాటును గాంచియుండఁ ♦ డస్త్రబలంబుం
గలవాఁడు కాఁడు యుద్ధం,బుల నేర్పఱితనము సుంత♦పొందఁడు సుమ్మీ. ౭

చ. బలముల మీఱి కూటరణ♦పద్ధతులం దగ నారితేఱి శ
త్త్రులభయమందఁ జేయఁదగు ♦ రూపములం గనుపట్టుచుండు రో
యలఘుతపస్వి! యయ్యసుర ♦ లట్టి బలాఢ్యులతోడఁ బోరఁగా
గలఁడె మదాత్మజుండు కను♦గాయగదా తలపోయు మాత్మలోన్. ౮ 628

* "మునినాథా-అను పద్యమునకు మూలము. "ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః" అని. ఇచట గోవిందరాజవ్యాఖ్యలో నాక్షేపసమాధానములు బహుప్రకారములుగా విమర్శింపఁబడినవి. పదాఱు వత్సరములకుఁ గొన్నియేండ్లు తక్కువగా ననుటచేఁ బండ్రెండేండ్లని గ్రహించుట మేలు. ఆరణ్యకాండమున మారీచుఁడు రావణునితో "బాలో ద్వాదశవర్షోఽయమ్" అని విశ్వామిత్ర యాగసంరక్షణము చేయవచ్చిన తఱిఁ దాఁ జూచితిననియు, నపుడు ద్వాదశవర్ష వయస్కుఁడే యనియుఁ జెప్పుటంజేసి నాలుగేండ్లు తక్కువఁగాఁ బదాఱువత్సరముల వయస్సని యర్థమే గ్రహింప సముచితము. దశరథు నభిప్రాయ మేమనఁగాఁ బదాఱేండ్ల ప్రాయముగల క్షత్త్రియకుమారుఁడే యుద్ధార్హుఁడని ప్రమాణము కాన నంతవయస్సు లేదన్న విశ్వామిత్రుఁడు వదలునని యూహించి యుద్ధార్హుఁడు కాఁ డనుటకై 'ఊనషోడశవర్షః' అని చెప్పినాఁడు.

చ. తనయుని శక్తిశౌర్యములఁ ♦ దాపసివర్య ! యటుండనిమ్ము నా
మనవిని జిత్తగింపు సుకు♦మారుని రామునిఁ బాసియుండనో
ప నొకముహూర్తమైన మఱి♦ప్రాణములన్ భరియింపఁజాల స
త్యనియత మిద్ది కావున మ♦దాత్మజునిం గొనిపోవ మానవే. ౮౪ 629

చ. మునివర ! నాతనూజు రఘు♦ముఖ్యునిఁ దోడ్కొనిపోవఁ గోర్కి నీ
కనువుగఁ దోఁచెనేని చతు♦రంగబలంబులతోడ నన్నునుం
గొని చనుమా ? మఱొక్కపలు♦కున్ విను మర్వదివేల వర్షముల్
చనిన యనంతరంబ బహు♦సద్వ్రతముల్ సలుపంగ నంతటన్. ౯౪ 630

తే. నాదువ్రతముల ఫలమున ♦ నాయసృష్ట
మనఁగ నొప్పెడు వీఁడు గ♦ల్గెను మునీంద్ర !
యింతమాత్రము తలఁచియో♦యేని రాముఁ
దోడుకొని పోవఁ దగదని ♦ వేఁడుకొనుదు. ౧౦ 631

చ. నలువురుసూనులం దరయ ♦ నాకు రఘూద్వహునందె ప్రీతి మి
క్కిలి యధికంబు ధార్మికుఁడు ♦ కీర్తిని గల్గఁగఁ జేయఁజాలెడుం
దొలికొడు కట్టి రాఘవుని ♦ దోడ్కొని పోఁదగదో మునీశ్వరా !
యలరిపు వీరు లెవ్వనికి ♦ నాత్మజు లెట్టి పరాక్రమాధికుల్. ౧౨ 632

ఆ. వారిపేరులెవ్వి, ♦ వారల యాకృతు,లెట్టివయి చెలంగు ♦ నెవరు వారి
కధిపులో మునీంద్ర ! ♦ యతిదంభసమరులొ, వారిచర్యలెట్టి ♦ వరుసనుండు.

తే. నాదుసేనలు నేనును ♦ నాకుమారుఁ
డలమహారాక్షసుల కెట్టి♦దై పొసంగు
ప్రతికృతిని జేయఁ దగుఁ జెప్పు ♦ వారిచరిత
నంతయున్ భగవంతుఁడ ♦ వైన నీవు. ౧౩౪ 634

క. ఏరీతి వారి మార్కొని, పోరందగు దుష్టభావ♦ముల బొల్చెడు నా
ఘోరాత్ముల బలమత్తుల, దారుణరణమందు నిల్వఁ♦దగు విధమెటులో. ౧౫

చ. అని నరపాలుఁ డన్నవిని ♦ యమ్మునిచంద్రుఁడు గాధిసూనుఁ డి
ట్లనియెఁ బులస్త్యవంశకుల♦మందు జనించిన రావణుండు దే
వనికరవైర యొక్కరుఁడు ♦ వర్ధిలు, వాఁడు పితామహుం దపం
బున నలరించి పెక్కువర♦ముల్ గొనియుండిన కారణంబునన్. ౧౬ 636

మ. బలసంపన్నుఁడు భూరివీర్యుఁడును నై ♦ పాపాత్ములౌ రక్కసుల్
పలువుం డ్రెప్పుడు తన్నుఁగూడుకొని రాఁ ♦ బంతంబు మీఱంగ మి
క్కిలి బాధించుచు నున్నవాఁ డిటఁ ద్రిలో♦కిన్ విశ్రవసపుత్త్రుఁ డు
జ్జ్వలతేజుండు కుబేరసోదరుఁ డఖ♦ర్వస్ఫారవీర్యుండొగిన్. ౧౭౪ 637

తే. రాక్షసుల నాయకుఁడునైన ♦ రావణుండు, పేరుగన్నట్టి వాఁడొటఁ♦బృథ్వినాథ!

నీవు వినియుండు వేకదా ♦ దేవవైరి, బలసముగ్రుం డతండు తా ♦ వచ్చి కడఁక.

క. నాయజ్ఞమునకు విఘ్నము, సేయం దట్టులైన వాని♦చే దనుతనయుల్
మాయావులు ప్రోత్సాహితు,లై యిద్దఱు భూరిబలస♦మాయతులుగుటన్.

తే. యజ్ఞవిఘ్నంబుసేయుదు ♦ రందు నొక్కఁ
డొప్పు మారీచుఁ డన సుబా♦హు వన నొక్కఁ;
డనఁగ దశరథుఁ డనియె మ♦హాత్మ! యాదు
రాత్ము మారొక్కని యనినిల్వ ♦ నలవిగాదు. ౨౦ 640

క. దనుజుని రావణు మారొక్కని, యనిలో నిల్వంగ శక్తి ♦ యలఁగునె నాకున్
వినుసీవు ధర్మవిద్విషుఁ,డన లోకంబులను ఖ్యాతి ♦ నందితివి సుమీ. ౨౧ 641

తే. దైవతంబవు గురుఁడవు ♦ తలఁప నీవె
యట్లు గావున రాముని♦యందు, మంద
భాగ్యఁడనఁదగు నాయందుఁ ♦ బరమకరుణ
నునుపవే యండితప్పితి ♦ వనక మౌని!. ౨౨ 642

సీ. అమర గంధర్వ యక్ష♦దానవాసుర పన్నగ పతగముఖ్యులు మహా♦బలుని, బంక్తి
కంఠుని మారొక్కని ♦ కదనంబునన్ నిల్వరన నింక మానవు ♦ లనఁగ నెంత?
వాఁడు బలాఢ్యులఁ♦బంతంబు మీఱంగఁ బొలియించుఁగాదె; య♦ట్లలరుచున్న
వానితో నేఁగాని ♦ బలములతోఁగూడి కాని, పుత్రులఁ గూడి♦గాని దురము

తే. సేయఁగాఁ జాల మునివర్య! ♦ చెప్పవాఁడ
నతనిసేనలతో నైన ♦ జతన మొప్ప
మారొక్కనఁగఁ జాల, సమరుల♦మాడ్కి నొప్పి
బాలుఁడగు రాము నెట్లియ్యఁ♦జాలువాఁడ. ౨౩ 643

క. తనయుఁడు సమరము చేయుం, గనుజాలెడు నైపుణంబుఁ ♦ గాంచఁడు పున్నా
మనరకము నుండి ననుఁ గడ,చను నట్లొనరించు వాని ♦ నాయంబియ్యన్. ౨౪

క. మనసొప్ప దెన్నివిధములఁ, గనిన్ భయమొందితిన్ సు♦ఖంబును జెఱుపన్
బనివూని యడరువారు శ,మనునిం బురుడించువారు ♦ మారీచాదుల్. ౨౫

తే. వారు సుందోపసుందుల ♦ వారసుఁ గలిగి
నారు బలవంతులై మీఱి♦నారు కాన
వారితో నని సేయఁ గు♦మారు ననుపఁ
జాల నిక్కము; మఱియు రా♦క్షసులు వారు. ౨౬ 646

సీ. వీర్యంబులం బొల్చి ♦ విగ్రహా మొనరించు నట్టి కౌశలముస ♦ నమరియున్న
వారు, నేనును మిత్ర♦వారంబుఁ గలిసియు సందొక్కరునితోడ ♦ నైనఁ బోరఁ
గలనె యంచాడిన ♦ యలయసంగతవాక్యముల వినుచున్న య♦మ్మునివరేణ్యు
నందుఁ బ్రవేశించె ♦ నధికతరక్రోధ; మంత నమ్ముని యజ్ఞ♦మందు హుతము

తే. సేయఁగాఁ బడి తరువాత ♦ నేయివో యు
బగ్గునగ్ మండు నగ్నినాఁ ♦ బ్రజ్వరిల్లె
నాడితప్పిన యావిభుఁ ♦ డప్పుడచట
నెదుటఁ గూర్చుండి కనఁబడ ♦ మదికలంగ. ౨౭ 647

ఇరువదవ సర్గము సంపూర్ణము.

---

౨౧-వ సర్గము.

-- వసిష్ఠుఁడు విశ్వామిత్రునిమహిమ రాజునకుఁ జెప్పుట. --

మ. తనయస్నేహసమాకులాతురముగా ♦ ధాత్రీశ్వరుం డప్డు చె
ప్పినవాక్యంబుల నాలకించి క్రుధచే ♦ భీష్మాకృతిం దాల్చి య
మ్మునివర్యుండు వచించెఁ దోర్ద్రోలుత నో♦భూపాలకా! నాదుప్రా
ర్థనముం జేయఁ బ్రతిజ్ఞసేసి యిపుడ♦ద్దానిగ్ విసర్జించితే. ౧ 648

తే. రఘుకులంబున కిటులాడ♦రాదు వంశ
మునకు గల్గినమర్యాద ♦ చనదె దీన
నిట్టులాడ నీకొప్పిద ♦ మేఁ జనియెద
వచ్చినట్టి మార్గంబును ♦ బట్టి భూప! ౨ 649

తే. అలరు కాకుత్స్థసంతాన ♦ మందుఁ బుట్టి
నాఁడవో భూమిపాల! నీ♦వాడినట్టి
పలుకు వృథసేసితివి ప్రియ♦బంధుజనులఁ
గలిసి సుఖముండుమని మాని ♦ పలుకుటయును. 3 650

క. మతిమంతుఁడైన యమ్ముని,పతి రోషాక్రాంతుఁ డగుడు ♦ వడఁకె సమస్త
క్షితితలము దేవతానం,తతులను భయమంకురించి ♦ తత్తఱపడఁ జెగ్. ౪ 651

క. జగమంతయు నీవిధమున, బెగడొందు టెఱింగి మాని♦బృందేశుఁడు నాఁ
బొగడొందు సువ్రతుఁడు ధీ,రగుణుండు వసిష్ఠుఁ డనియె ♦ రాజేంద్రునితోగ్.

క. విను నీవిక్ష్వాకుకులం,బునఁ బుట్టితి వేఱురూప♦మును దాల్చిన యా
ఘనధర్మమ్మే సాక్షా,త్తని చెప్పందగినవాఁడ ♦ వగుదువు రాజా! ౬ 653

క. సిరిగలవాఁడవు సువ్రత, పరాయణుఁడ వధికధైర్య♦వంతుండవు భూ
వర! ధర్మంబును దప్పుట, సరియే యటులైన జగతి ♦ సత్యము చెడదే. ౭

తే. రాఘవా! ముజ్జగముల ధ♦ర్మస్వరూప
మైన యాత్మగలాఁడని ♦ ఖ్యాతి గన్న
వాఁడ వాత్మీయధర్మంబు ♦ వదలుకొనక
దానినే యాచరింపుము ♦ మాననగునె. ౮ 655

తే. అవనిపాల ! యధర్మంబు ♦ నాదరింప
కుము; జగంబున నెవఁడేని ♦ కోర్కినిట్లు
చేయువాఁడను నేనని ♦ చెప్పి యట్లు
సేయఁడేఁ దత్ఫలంబు న♦చింతు వినుము. ౭॥ 656

మ. మునుదాఁ జేసిన సన్మఖంబులఫలం♦బున్ గూపముఖ్యంబులో
ఘనధర్మంబుల పుణ్యమున్ జెడు; మహీ♦కాంతా ! యిఁకం బల్కఁలం
బనిలేదిప్పుడె రామునిమ్ము మునికిన్ ♦ బ్రాహ్మాస్త్రశస్త్రాళినే
ర్చినమున్ నేర్వకయున్న నీతనయు వం♦చింపంగలేరెవ్వరున్. ౮॥ 657

క. మునివరుఁ డీతఁడు నీప్రియ,తనయుని రక్షించుచుండఁ ♦ దరమే చెనకన్
మనుజేశా ! జ్వలనావృత,మును బీయూషంబుభంగి ♦ ముజ్జగములలోన్. ౯

సీ. ఉర్వీశ ! మూర్తిమ♦త్పొందిన ధర్మమే యిక్ష్వాకుకుఁడు చూడ♦నెల్ల వీర్య
వంతులలో మేలు♦బంతి బుద్ధిని లోకమందీతఁడెక్కుఁడై ♦ యలఁగుచుండుఁ
దపమునకుఁ బరమ♦స్థానమీతఁడు సచరాచరలోకంబు♦లందు మూఁట
నలరునే యస్త్రంబు ♦ లవ్వానినన్నింటి నెఱుఁగు నిమ్మానిశుఁ ♦ డెఱిఁగినన్ని

తే. యస్త్రముల నెవ్వఁడెఱుఁగఁడీ ♦ యవని నింక
మీఁద నెఱుఁగంగఁ జాలఁడు ♦ మిగుల నుక్కు
పొదల నలరారు దేవతల్ ♦ మును, లసురులు
రక్కసులునైన నెఱుఁగరు ♦ నిక్క మిద్ది. ౧౧॥ 659

క. ఉరగులు గంధర్వులుఁ గి, న్నరులును యక్షులును దీవ్ర♦నానాస్త్రము లీ
వరమానిమాడ్కి నెఱుఁగరు, ధరణీశా ! యెఱుఁగు నెట్టి♦తండనియనినన్.

తే. పరమధార్మికులౌ భృశా♦శ్వసుతులెల్ల
నగుదు రస్త్రంబులుగఁ దొల్లి ♦ జగము నేతఁ
డేలునపుడు భృశాశ్వుఁడా ! ♦ యెల్లయస్త్ర
ముల నొసంగినవాఁడు ని♦ర్మలమనీష !. ౧౩ 661

క. మునుదక్షుఁడన్ ప్రజాపతి, తనయలు గలరట్టివారి ♦ దారలఁగాఁ గై
కొనియెన్ భృశాశ్వుఁ డపుడా, వనితలకుం బుట్టినారు ♦ వారు మహీశా !

సీ. బహురూపములవారు ♦ పరఁగుదు రతిపీనల్య లతిశయదీప్తుల ♦ నమరువారు
వారు జయంబు ల♦వ్వారిగ నొసఁగుదు రలదక్షునకు దను♦జలు సుమధ్య
మలు గల్గిరిరువురు♦మానితాచారలు జయయు సుప్రభయు న♦స్త్రములశస్త్ర
ముల నతిభాస్వరం♦బుల నూటినిం గాంచి రందు మున్ముందు జ♦యాఖ్యయిట్టి

ఆ. దనఁగరానిమహిమ ♦ నలరుచుఁ గామరూ
పములఁ బొల్చి మేటి ♦ పౌరుషములఁ

దనరుసుతులఁ బడసెఁ ♦ దమి నర్ధశతసంఖ్య
వఱలు వారి ససుర♦బలము నణఁప. ౧౮ 663

సీ. అంతసుప్రభయు సం♦హారనామకులను శత్రుభీకరులఁ జం♦చద్బలాఢ్యు
లనమోఘవీర్యులఁ ♦ దనయుల నేఁబండ్రఁ గాంచె; నవ్వాని నీ♦కౌశికుండు
చక్కఁగ నెఱుఁగునా♦శస్త్రంబుల నెకాదు సకలాస్త్రవిదుఁడౌట ♦ జగతి నెవ్వ
రెఱుఁగని యస్త్రాళి ♦ నెంతయు వింతగఁ బుట్టింపఁ జాలును ♦ భూరితేజుఁ

ఆ. డమలకీర్తి నలరు ♦ నట్టి విశ్వామిత్రు
వీర్యమిట్టిదగుచుఁ ♦ బృథివిఁ బరఁగు
భూతలేశ ! రాఘ♦వునిఁ బంప ననుమాన
మొందఁదగదు పనుపు ♦ డెందమలర. ౧౯ 664

చ. దనుజులగాధినందనుఁడు ♦ తా నెవధింప సమర్థుఁడయ్యు నీ
తనయునకున్ హితంబును ము♦దంబునఁ జేయఁగఁగోరి యిట్లు నిన్
గనుఁగొనవచ్చి సాయమును ♦ గావలె నీసుతుఁ బంపవే యటం
చనునయమొప్పఁగా నడిగె ♦ నంచు వసిష్ఠుఁడు పల్క నత్తఱిన్. ౨౦ 665

తే. రఘువృషభుఁడాననంబునఁ ♦ బ్రమదమలర
స్వాంతముం బొంగ శ్రీరామ♦చంద్రు గమన
మునకు నీకొని తనయుని ♦ మునికి నీయ
నాత్మఁదగ నిశ్చయించె స♦ద్యశముఁ గోరి. ౨౧ 666

ఇరువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౨౨-వ సర్గము.

—రామలక్ష్మణులు విశ్వామిత్రునివెంట నరుగుట.—

చ. మునిపతియా వసిష్ఠుఁడు ప్ర♦మోదము మీఱఁగ నిట్లుపల్క న
జ్జనపతి యాననాబ్జమున ♦ సంతసమొప్ప సలక్ష్మణుండుగాఁ
దనరెడు రామునిం బిలువఁ ♦ దానపు డానతియిచ్చె; నంత రా
మునకు సుమంగళాచరణ♦ముం దమిసల్పిరి తల్లి, దండ్రియున్. ౧ 667

తే. అపుడు రాముఁ బురోహితుం ♦ డగు వసిష్ఠ
మునియు మంగళసూక్తంబు♦లను బఠించి
దీవనలఁ దన్పె నంతఁ బృ♦థ్వీవరుండు
మూర్కొనియె ముద్దుకొమరుని ♦ మూర్ధమెలమి. ౨ 668

చ. తనయుని ముద్దుపెట్టుకొని ♦ ధారణినాథుఁడు ప్రీతినొందు నె
మ్మనము తగంగమానికి, న♦మానుషశక్తికొసంగె; నంతటన్

వనజదళాక్షు మౌనివశ♦వర్తను రామునిఁగాంచి స్వచ్ఛతం
గని ముఖమందు స్పర్శమును ♦ గ్రాలఁగఁజేసె సమీరుఁడల్లనన్. ౩ 669

క. సురదుందుభినిస్వనములు, వరుసఁగ దివి మ్రోగెఁ బుష్ప♦వర్షము మిగులన్
గురిసె మహోత్సుకుఁడు రాముం, డరుగంగా శంఖరవము ♦ లనుదుగఁ జెలఁగెన్.

తే. దుందుభులు మ్రోసె గాధిసు♦తుండు ముందు
నడువఁగాఁ జాపముం దాల్చి ♦ పుడమితేని
తనయుఁ డారామచంద్రుఁడు ♦ చనియె నతని
వెనుక లక్ష్మణుఁ డరిగె, వి♦ల్లును ధరించి. ౫ 671

క. కూఁకటులు భాలభాగముఁ, గ్రైకొని యట నాట్యమాడఁ♦గా లక్ష్మణుఁడున్
వీకఁ బోలుపారు దనుజా,నీక మడంపంగఁ జనియె ♦ నిర్జగు లలరన్. ౬ 672

చ. ఇరువురు సోదరుల్ తగ మ♦హేషుధియుగ్మముఁ దాల్చి యప్డు భీ
కరముగ హస్తకత్రయముఁ ♦ గ్రాలఁగఁ బొల్చెడుపాములట్లుగా
వరుసఁ జెలంగి చాపముల ♦ బాహువులొప్ప దిశాష్టకంబునం
బరమును భూమియున్ మెఱయు♦భంగి నొనర్చెడు తేజమొప్పఁగన్. ౭ 673

క. బలవీర్యాదు, లభంగుర,ములుగాఁ దగ సర్వదేవ♦ముఖ్యుం డగు స
జ్జలజజుని నశ్విదేవత, లలరుచు వెనుకొనినయట్లు ♦ లరిగిరి భక్తిన్. ౮ 674

సీ. చాపంబులందాల్చి ♦ చారువేషంబుల నలరారి యుడుముస ♦ నవనిఁ బరఁగు
నట్టి జంతువు చర్మ♦మనువొందు నంగుళీ కవచంబుగను హస్త♦కవచమునుగ
నొసరించి యవ్వాని ♦ నొప్పుగ ధరియించి ఖడ్గంబులం బూని ♦ కడునరుదగు
కాంతిచే వెలయుచుఁ♦గమనీయ దేహముల్ లలిమీఱఁదగుగామ♦లక్ష్మణులు,కు

తే. మారులు సహోదరులు ప్రీతి ♦ మౌనివెంటఁ
జనుచు నసదృశమహిముఁడౌ ♦ శంభుఁ గూడి
చనెడు సగ్నికుమారులై ♦ ఘనులయి తగు
నట్టి స్కందవిశాఖుల ♦ యట్లు పొల్చి. ౯ 675

క. ఇనుమంత కందు నొందని, యసమాన శ్రీప్రభాయు♦తాంగంబులతో
దెసలన్ భాసిలఁ జేయుచు, వెనవరిగిరి మౌనివెంట ♦ విబుధు లలరఁగన్. ౧౦

విశ్వామిత్రుఁడు రామునకు బలాబలనువిద్యల నిచ్చుట.

తే. సార్ధయోజన మరిగి యా♦యానమడఁపఁ
గోరి సరయువు దక్షిణ♦తీరమందు
నిలిచి రంత విశ్వామిత్రుఁ ♦ డలరి మధుర
వాణి మీఱ రామా! యని ♦ వలికె నిట్లు. ౧౧ 677

క. జలము గ్రహియింపు వత్సా!, వలదిఁకఁ గాలంబు గడుప ♦ వరగుడుమంత్రా
వళిసారభూతవిద్యల, బల యబల యనంగఁ బరఁగు ♦ వానిం గొనుమా. ౧౨

క. వాని న్నీవు గ్రహించితి, వేని శ్రమంబేని దాప♦మేని గలుగ దీ
మేనును మాఱుపునొందక, యే నిలుచును దత్ప్రభావ♦ మిట్టిది సుమ్మీ. ౧౨

క. విను మేమఱుపాటునన్నై, నను సుప్తునినైన నిన్ను♦ నైఋతు లెదిరిం
ప నశక్తులై తొలంగుదు, రనఘా! వీనిన్ జపించు♦ నవసరమందున్. ౧౩ 680

తే. బాహుబలమున నెవ్వండు♦ వసుధ, నీకు
సాటిగారాఁడు; మఱియు నీ♦జగములందు
మూఁట నేగుణమందైనఁ♦ బోలనెన్న
నీసమానుఁడు లేకుండు♦ నిక్కమిద్ది. ౧౪ 681

సీ. సామర్థ్యమునయందు♦ సౌందర్యమున జ్ఞానమందిదికృత్యమి♦దా నకృత్య
మని నిర్ణయించెడు♦ నట్టి బుద్ధిని, మఱి యుత్తరంబునను బ్ర♦త్యుత్తరమున
నీకుసమానుఁడీ♦ లోకంబునందుండఁ డనఘ! యీరెండు వి♦ద్యల గ్రహించి
తేని నీసంకాశుఁ♦ డిప్పుడు లేఁడు ముం దెప్పటికిని నుండఁ♦ డిది ధ్రువంబు

తే. జ్ఞానములకెల్ల నివ్వియే♦ స్థానములుగఁ, దనరు; వీనిఁ బఠించుచు♦ మనుజవర్య!
శ్రోవనడచిన నీకు క్షు♦త్తును బిపాస, యును గలుగకుండునింకను♦ వినుము వత్స!.

క. ఈరెండువిద్యలను నిం, పారఁగ గ్రహియించితేని♦ యసమానయశం
బోధ్యాను! నీకుఁగలుగున్, నీరేజభవుండు వీని♦ నిర్మించెఁ దగన్. ౧౬ 683

ఆ. కాన సుప్రభావ♦కలితంబులై వెల్గు, వరకకుత్స్థవంశ♦భవుఁడ వధిక
ధార్మికుఁడవు నౌటఁ♦ దగినపాత్రము వీవె, వీనినొసఁగ నొరుఁడు♦ గానరాఁడు.

సీ. సౌభాగ్యముఖములౌ♦ సద్గుణంబులు పెక్కునీయందె మిక్కిలి♦ నెగడియుండు
సంశయంబేలేదు♦ సాంద్రతపంబున లభియించె నీవిద్య♦లను సభక్తి
నుపదేశమును గొను♦మో రాఘవా! యివ్వి భూరిఫలమ్ములఁ♦ బొందఁజేయు
నిన్నుఁ; దారును భువి♦ నున్నతరీతిని బెక్కువిధంబుల♦ విస్తరిల్లు

ఆ. నని వచించె మౌని; ♦ యంతట రాఘవుఁ, డాచమించి శుద్ధుఁ♦డై ప్రహృష్ట
వదనుఁడగుచు భక్తి♦భావితాత్ముండగు, బ్రహ్మమౌనివలనఁ♦బడసె వాని. ౨౦

చ. మునివలనం బ్రతిగ్రహణ♦ముం దమిఁజేసినయంతనే శర
త్తున భగవంతుఁడై తనరు♦ తోయజమిత్త్రుఁడు వేవెలుంగునాఁ
దనరుచు భూరివిక్రమము♦ తద్దయు వర్ధిల రాముఁడొప్పి యం
తనిజగురూత్తముం డలరఁ♦ దత్పదసేవలొనర్చెఁ బ్రీతితోన్. ౨౧ 686

క. గురువునకు సేవలొనరిచి, సరయూతీరమున మౌని♦చంద్రునితో దా
శరథులు మిక్కిలిసుఖముగ, జరపిరి యారాత్రి మాన♦సంబు లలరఁగన్. ౨౨

చ. ఇరువురు సోదరుల్ గలిసి♦యే తృణశయ్యను బవ్వళించి యా
దరమున గాధినందనుఁడు♦ తద్దయు లాలనమొప్పఁజేసి సుం

దరముగఁ బొల్చు వాక్యసము♦దాయము పల్కఁగఁ బొంగుచుండ శ
శ్వరి సుఖరీతిఁగాఁ గడచె ♦ వారికిఁ దోఁపదు లోటు నుంతయున్. ౨౩½ 688

ఇరువది రెండవ సర్గము సంపూర్ణము.

---

## ౨౩-వ సర్గము.

అంగదేశవృత్తాంతము రామలక్ష్మణులకు విశ్వామిత్రుఁడు చెప్పుట.

ఉ. యామిని తెల్లవాఱఁ గుశి♦కాత్మజుఁ డాతృణపర్ణశయ్యపై
నేమియుఁ గష్టమే యెఱుఁగ ♦ కింపుగ నిద్దురపోవుచున్న యా
రాము సహోదరుం గనుచు ♦ రాక్షససంఘము నొంచుకోర్కి యు
ద్దామముగా మదిన్ వెలయఁ ♦ దానిటు యోజనచేసె నెంతయున్. ౧ 689

తే. ఇతనిఁ గన్నట్టి కౌసల్య♦యే తలంప
సుప్రజావతి సౌభాగ్య ♦ శోభితాంగి
యనుచుఁ దలపోసి మెల్లన ♦ ననియె; రామ'
యిదిగొ ప్రాక్సంధ్యవర్తిల్లె ♦ నింకలెమ్ము. ౧½ 690

క. మనుజవరా! దివమందున, నొనరింపం దగినయట్టి ♦ యురుదేవారా
ధనకృత్యము నెఱవేర్పం,గను లెమ్మా; గాలమిదియె ♦ గా యప్పనికిన్. ౨

క. అనుటయుఁ బరమోదారము, మునివచనము నాలకించి ♦ భూమీశ్వరచం
ద్రునితనయులు సలిలంబుల, మునింగి రవి కర్ఘ్యమొసఁగి ♦ మోదంబలరన్.

తే. పరమ గాయత్రిమంత్రజ♦పంబు సేసి
భక్తి సంధ్యనుపాసించి ♦ బ్రహ్మయజ్ఞ
మగ్నికార్యము మొదలైన ♦ యట్టికృత్య
ములను జక్కఁగ నెఱవేర్చి ♦ రెలమి మిగుల. ౩ 693

సీ. వీర్యాతిశయులుగా ♦ వెలయు రాకొమరులు తపమె, ధనంబుగాఁ ♦ దనరునట్టి
మౌనికి విశ్వామిత్రుఁ♦డను గురునకు మ్రొక్కి ప్రోవను నడచు సం♦తోషమలర
సంసిద్ధులై రిట్లు ♦ శౌర్యసారంబునఁ బొలుచు కుమారులు ♦ మునియు నడచు
చుండి యొక్కట సర♦యూసంగమంబు శుభప్రదంబుగను జూ♦పట్ట నందుఁ

తే. గనులకింపగు దివ్యగం♦గాభవానిఁ
గాంచి పరమతపంబందు ♦ గాఢనిష్ఠఁ
బెక్కువేలేండ్లు సల్పి సం♦వృతమహాప్ర
భావమున నొప్పు మునుల, స♦త్పదముఁ గనిరి. ౪ 694

క. మునివర పుణ్యాశ్రమమును, గని మిక్కిలి ప్రీతినొంది ♦ క్ష్మాకాంతుని స
త్తనయుల్ మహాత్ము గాధే,యునిఁ జూచి వచించి రిట్టు♦లొప్పెడు వేడ్కన్. ౫

క. ఎవ్వనిదీ పుణ్యాశ్రమ, మెవ్వాఁడు వసించుచుండు ♦ నిందో మౌనీ!
యివ్వార్త వినఁగఁ గ్రమకము, నివ్వటిలెన్ మామనముల♦నెమ్మిం జెపుమా. ౮
క. అనుటయు వారల ప్రశ్నం,బును విని కుశికాత్మజుండు ♦ మోదమున హాసం
బునుఁ బొందఁ బలికె రామా!, వినుమిది మున్నెవరి దగుచు ♦ వెలయునొ దానిన్.
సీ. కాముఁడంచు వచింపఁ♦గాఁ బడు నెవఁడు విద్వాంసులచేతఁ గం♦దర్పుఁ డతఁడె
తనుధారియై యుండె ♦ మునుపాదురాత్ముండు నియమయుతుండయి♦నిశ్చలమతిఁ
బర్వతపుత్రికా ♦ పరిణయవాంఛచే నలరారి తపమును ♦ సలుపుచు దివి
జావళితోఁ గూడి ♦ హరుఁ డేఁచ్చటికి రాఁగ నమరాధిపతియగు♦నతనిఁ బూన్కి
తే. మీఱి నెదిరించె శివుఁడంత ♦ మిగులఁ గోప
చిత్తుఁడై హుంకృతినిజేసె ♦ శివుని కంటి
మంటచేఁ గాలె నవ్విధి ♦ మాడినట్టి
యద్దురాత్మునివౌ నవ♦యవము లిందు. ౧౧॥ 698
క. తనుసంగతి విడనాడి య,ననిఁబడియె మహాత్ముఁడైన ♦ భర్గుండిటు కా
ముని నీఱుచేయ రూపఱి,యె నతం డివ్విధిని, నిర్జ♦రేశుని క్రుధచేన్. ౧౨॥
ఆ. దేహహీనుఁడై య♦దిమొద లనంగుఁడన్
ఖ్యాతి నెల్లయెడలఁ ♦ గాంచె స్మరుఁడు
వాఁడు స్వాంగములను ♦ వదలెనో యెచ్చట
నదియె, యంగదేశ♦మునఁగ నలరె. ౧౪ 700
క. సిరులెసఁగ నలరు రాఘవ!, హరునాశ్రమ మిదియె, స్థాణు♦నాశ్రమ మనఁగాఁ
బరఁగునిది పుణ్యదము, ముని,వరు లిందున్నట్టివారు ♦ పాపవిదూరుల్. ౧౪॥
క. శితికంఠశిష్యులై యు,న్నత ధర్మపరాత్ములగుచు ♦ నైజతపఃసం
తత కృత్యులగుచు నుందురు, హితముగ నీరేయిఁ బు త్త♦మేయిట రామా!. ౧౫
సీ. సత్ఫలదంబులౌ ♦ సరయూవియన్నదీమధ్యంబునందొప్పు ♦ మౌనియాశ్ర
మమున నీరేయిఁ బు♦త్తమె శుభదర్శనా! రాఘవా! యెల్లి త♦రంగిణీవ
తంసమౌ గంగను ♦ దాఁటుదమిచ్చట స్నానకృత్యము సల్పి ♦ జపముచేసి
యగ్నికార్యముఁ దీర్చి ♦ యత్యంతశుద్ధులమై పావనంబగు ♦ నాశ్రమంబుఁ
తే. గాంచఁబోవుద మందఱ♦మంచు వారు,చెప్పుకొనుచుండ నందున్న♦సిద్ధమునులు
స్వీయమైన తపశ్శక్తి♦చేత దూర, గతవిషయముల నెల్లను ♦ గాంత్రు గాన. ౧౬॥
క. వారల రాకయు దానికిఁ, గారణమును జ్ఞానదృష్టిఁ ♦ గాంచి ముదమునన్
వారల కడకేగి శుభ, ప్రారంభులఁ గాంచి కుశిక♦వరపుత్రునకున్. ౧౮ 704
తే. ప్రథమమున నర్ఘ్యమవ్వేళఁ ♦ బాద్యమొసఁగి
వరుస నాచమనీయ పూ♦ర్వకము గాఁగ
భోజ్యవస్తువుల నొసంగి ♦ పూజఁ దీర్చి
యాతిథేయంబుఁ బిదప న♦య్యర్భకులకు. ౧౯ 705

చ. హితసుతులొప్పఁ జేసి ముద♦మేర్పడ నిల్చినఁ జూచి గాధిన
త్సుతుఁడును వారి క్షేమమును ♦ సుస్మితమొప్పఁగఁ బ్రశ్నచేసె నీ
గతి మునులర్హకృత్యముల ♦ గాధికి బాలురకుం బొసర్చి సం
స్తుతిఁగనఁజాలు గాథలను ♦ జొక్కఁగఁ జేసిరి వారిచిత్తముల్. ౧౯ 706

క. మునులందఱవల దశరథ, తనయులతో నేకరీతిఁ ♦ దగు సుసములతో
నొనరించిరి సంధ్యావం,దనము యథాశక్తి జపముఁ ♦ దద్దయు భక్తిన్. ౨౦

మ. పరమంబౌ వ్రతమూని, కాముపదమున్ ♦ ప్రఖ్యాతిఁగన్నట్టి యా
ధరణిన్ వాసముచేయు మౌనులు ప్రమో♦దంబొప్పఁ బ్రార్థింప ము
ప్పురనున్, వారలఁ గూడిపోయి సుసుఖం♦బుం గూర్చునం దా నిశిన్
జరపం గల్గిరి మౌనిపుంగవుఁడు వి♦శ్వామిత్రుఁ డత్యాదృతిన్. ౨౧ 708

తే. రాఘవుని లక్ష్మణుని సభ♦రాసములగు
పెక్కుగాథల నీతులఁ ♦ గ్రక్కుచున్న
వానిఁ జెప్పుచు నలరించె ♦ వారు వాని
వినుచు ముదమంది సుఖసుప్తిఁ ♦ గనిరి పిదప. ౨౨ 709

ఇరువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౨౪ - వ సర్గము.

—మలయ కరూశదేశ వృత్తాంతము.—

చ. తెలతెలవాఱ సంతసఁ గుల♦దీపకులై యరివీరహంతలై
చెలఁగెడు రామలక్ష్మణులు ♦ చెల్వవహించెడు కామునాశ్రమ
స్థలమునఁ గాల్యకృత్యములు ♦ సల్పి మునీంద్రుని గాధిపుత్రునిం
గలిసి వియన్నదీతటముఁ ♦ గానఁగ నేగిరి వేడ్కమీఱఁగన్. ౧ 710

తే. కష్టసాధ్యవ్రతంబులఁ ♦ గడఁగి పూని
ఘనసుతులు వెల్గుచున్నయ♦మ్ముని నృపభులు
పదిలమగు నోడఁ దెప్పించి ♦ పలికి రెలమి
నోడ నెక్కుము వీరితోఁ ♦ గూడ మౌని!. ౨ 711

క. అనపాయముగా మార్గ,మ్మునఁ బయనము గమ్ము, కాల♦మును జరపుట, యే
లనఁ గౌశికుండు వల్దే, యని వారల గౌరవించి ♦ యర్భకయుతుఁడై. ౩ 712

క. సరిదధిపతిగామిని నా, సరిద్వరము దాఁటు చుండు ♦ సమయంబునఁ బు
ష్కరమధ్యమమున కేగఁగఁ, దరంగ సంఘట్టజనిత ♦ దారుణరవముల్. ౪ 713

క. వినవచ్చె వరుస వృద్ధిం, గనుచున్ దద్రావమిట్లు ♦ కడు భీకరరీ
తిని బరఁగ వినియె రాముం, డనుజునితోఁ గూడ సంత♦సవ్విధ మెఱుఁగన్. ౫

చ. మనమున నెంచి రాఘవుఁడు ♦ మౌనికౌశికునిం గాంచిపల్కె ని
ట్లని యితరేతరంబొగి మ♦హాత్మ ! జలంబులు బిట్టుదాఁకఁగా
ఘనముగఁ బుట్టునట్టి ధ్వని♦గాఁదగునో యిది వేఱుశబ్దమో
యనుటయు రాముపల్కు విని ♦ హర్షయుతుండయి మౌని యిట్లనన్. ౬॥

చ. నినదము పెద్దగా నిటు జ♦నించుటకుం గల కారణంబులె
ల్ల నిఖిలధర్మవేత్తగఁ జె♦లంగు మునీంద్రుఁడు నిశ్చయించి చె
ప్ప నెదఁ దలంచి యిట్లనియె ♦ బాలక ! శంకరవాసభూతమై
ఘనముగ నొప్పుగోత్రమునఁ ♦ గంజభవుండు చమత్కృతుల్ దగన్. ౭॥ 716

తే. మానసంబున సృజియించె♦మనుజవర్య !, యందుచే మానసంబను♦నాఖ్యగల్గె
నాసరస్సునఁ బుట్టిన ♦ యట్టినదియె, సున్మయోధ్యాపురమ్మును♦జుట్టిపాఱు. ౮॥

ఆ. బ్రహ్మసరసునుండి ♦ ప్రభవిల్లినది యౌట, సరయువనెడిపేరఁ ♦ బరఁగి పుణ్య
నదియటంచు వినుతిఁ♦బొదలెడు నది గంగ, కెదురువచ్చి కలియు♦సదమలాత్మ. ౯

సీ. ఉన్నతస్థలమున ♦ నుండి యీసరయువు వచ్చి గంగానదిఁ ♦ బడుటవలన
నాజలంబులు దాఁకు ♦ నవసరమునఁ బుట్టు పెను నినాదమ్మిదె ♦ వినఁగనయ్యె
నియతాంతరంగుండ♦వయి రామ! యీనదీ ద్వయమునకున్ భక్తి♦వందనంబు
సలుపుమంచివ్విధిఁ ♦ బలికిన ధర్మాత్ము లిరువురు వందన ♦ మెలమిఁ జేసి

తే. దివిజనది దాఁటి దక్షిణ♦తీర మొంది, యవల మెలమెల్లనంబో♦యి♦రంత రాముఁ
డతిభయంకర రూపంబు♦నందినట్లు, గానఁబడుచున్న నిర్జనం♦బైన వనము. ౧౦॥

క. కనుఁగొని విశ్వామిత్రున, కనియె సెబాసీవనంబు ♦ కడు దుర్గమమై
పెనుపొందు నీలపురుగుల, ధ్వనులెల్లెడ నావరింపఁ ♦ బరఁగెడుఁ గంటే. ౧౨॥

శా. భీతింబుట్టఁగఁజేయు క్రూరమృగముల్ ♦ పెంపొంది యిందందు ని
ర్భీతిన్ సంచరణంబుచేసెడిని వే♦వేపక్షిసంతానముల్
చేతోవృత్తిఁ గలంపఁ జాలురుతముల్ ♦ సేయంగఁ బూనెన్ ద్విజ
వ్రాతంబుల్ మఱియెన్నియో భయదని♦స్వానంబులన్ గూసెడిన్. ౧౩॥

సీ. పంచాస్యశార్దూల♦పటలంబును వరాహసముదయంబును, భీతి♦దముగ శబ్ద
ములు సేసెడిని, గజం♦బులు గ్రాలు నాయాయిస్థలముల నినుమద్ది♦చండ్రచెట్లు
కలిగొట్టు లేరుమ♦ద్దులు గంగరేఁగులు మోరేడుతుముకులు ♦ మఱియు నెన్నొ
భూజాతములు నిండుఁ ♦ బొదలు దట్టముగాఁగ నివ్వననామంబ♦దెద్ది! యనిన

తే. రామువాక్యంబులకు ముని♦రాజు మిగులఁ
గాంతి నలరారుచున్న యు♦కౌశికుండు
వత్స ! కాకుత్స్థ ! దారుణ♦వనమిదెవరి
దో వచించెద వినవయ్య ! ♦ యుద్యమమున. ౧౬ 722

చ. వనమిది దేశయుగ్మముగఁ ♦ బ్రాక్సనుయంబున నుండెఁ దద్వయిం
గనియెఁ "గరూశ" నామము నొ♦కండు మఱొక్కటి యాహ్వయంబుఁ గాం
చెను "మలదం"బునా, నవియు ♦ శ్రీపరివృద్ధిని ధాన్యవృద్ధనిం
గని సురలోకతుల్యములు ♦ గాఁ జెలువారుచు నుండె నెంతయున్. ౧౭ 723

క. విను రామ! పేరులవి యా,జనపదముల కెట్లువచ్చె ♦ సంతసమిడు దా
నిని విన్నయింత మునుపౌక, దనుజుని వృత్రాఖ్యుఁజంపె♦ దర్పము పొంగన్. ౧౮

చ. శతముఖుఁ డిట్లు దానవునిఁ ♦ జంపినతోడనె బ్రహ్మహత్య యిం
ద్రతనువునొందె దాన విబు♦ధప్రభునందశుచిత్వమబ్బె, య
త్యతిశయమైన యాఁకలియు ♦ సంతటఁ బైకొనియెన్ తపోధన
ప్రతతియు దేవతావరులు ♦ పాకహరుంగని యప్డు జాలిచేన్. ౧౯. 725

తే. గంగమొదలగు తీర్థోద♦కంబులందు, స్నానమును జేయఁగాఁ బంచి♦సకలమంత్ర
పూతకలశోదకంబుల ♦ నాతని కభి, షేకమొనరించి రయ్యశు♦చిత్వమేగ. ౨౦

సీ. మునులు ప్రాయశ్చిత్త♦మొనరింప నశుచిత్వ మాఁకలియు నశించె♦నంత నింద్ర
తనువుననుండి పు♦ట్టిన యామలంబును "గారూశమును" దేవ♦కాంతులెల్ల
నీదేశముననుంచి ♦ యెంతయు ముదమంది రంత దేవేశ్వరుం ♦ డపగతమల
"కారూశుఁడై" తాను♦గడుఁ బరిశుద్ధుఁడై వెలయుట కెంతయు♦వేడ్కనొంది

తే. దేశయుగము నుద్దేశించి ♦ దృఢమనస్కుఁ
డగుచుఁ బలికె నీదేశము ♦ లస్మదీయ
తనుమలంబును గారూశ♦మును ధరించెఁ
గాన ధనధాన్యపరివృద్ధిఁ ♦ గాంచుఁ గలవు. ౨౧ 727

క. మలమును ఖండించుటచే, "మలదం" బని నాకరూశ♦మారణమును జే
సి లలిన్ ధరియించుటచే, నలరుఁ గరూశం బటంచు ♦ నస్మత్కృపచేన్. ౨౨

క. ఈపేరున నీదేశము, లేపారు జగంబునందు ♦ నెంతయు ఖ్యాతుల్
దీపింప ననుచు నుత్తమ,మై పరఁగెడు వరము నొసఁగె ♦ ననఘమునీపా!. ౨౨

క. ధీమంతుఁడైన వాసవుఁ, డీమాడ్కిని గౌరవింప ♦ నెంతయు సురల
త్యామోదంబున మెచ్చె,లో మఘవా! యని నుతించి♦రో రఘువర్యా!. ౨౩

తే. దేశగౌరవ మిమ్మాడ్కి ♦ దేవనాథు
కరుణ నలరారె నిటు బహు♦కాలము ధన
ధాన్యవృద్ధులనివియొప్పెఁ ♦ దాటకయను
కాంత జనియించె నొక కొంత♦కాలమునకు. ౨౪ 731

క. ఆపడఁతి యక్షకన్యక, యై పుట్టుకతో సహస్ర♦హస్తిబలముచే
నేపారి కామరూపిణి,యై పరఁగెన్ శుభము నీకు ♦ నగుఁగాత మిఁకన్. ౨౫

క. ధీమంతుఁడైన సుందుం, డామానినిఁ బెండ్లియాడె ♦ నయ్యతివ సుతుం

డో మారీచుఁడు హరిహయు, డేమాడ్కిఁ బరాక్రమమున♦నితఁ డల్లెసఁగున్.

క. దనుజుఁ డతఁడు వత్రువలగు, ఘనభుజములు నోర్వనలవి♦గాని సువీర్యం
బును విపులాస్యము నట్టిదె, తనువును వెలయంగఁ దిరుగు ♦ ధైర్యముతోడన్.

తే. భైరవాకారుఁడై వాఁడు ♦ ప్రజలసతము
దిగులుపడఁ జేయుచున్నాఁడు ♦ పొగరుపట్టి
నట్టి మారీచునకుఁ దల్లి♦యైన దుష్ట
చర్యగల తాటకయు శౌర్య♦సారమలర. ౨౬ 735

క. జనపదముల నివ్వానిని, వినాశనము చేయుచుండు ♦ వేడుకవోలెన్
విను రామ! సార్ధయోజన,మునఁ గలదీ వనమునందె♦ముందొకచోటన్. ౨౭

ఆ. మార్గమావరించి ♦ మనుజులకొఱకయి, కాచియున్నదద్ది ♦ కాన రామ!
యదివసించియున్న♦యట్టి వనంబున, కరుగుమార్గమున నె♦యరుగవలయు. ౨౮

క. మానుగ నిజబాహుబలం, బూనుచు దుష్టప్రచార ♦ మొప్పఁగ నిట్లీ
కానం దిరిగెడు తాటక, దానవిఁ బరిమార్పవయ్య! ♦ దశరథతనయా!. ౨౯

క. నాయానతి నీదేశముఁ, జేయుము నిష్కంటకముగ ♦ జిష్ణువరముచే
నీయవి ముందున్నట్లన, పాయమ్ముగ నలరవలయు ♦ భద్రములలరన్. ౩౦ 739

సీ. జనపదం బిది పుణ్య♦సారవంతంబయ్యు ఘోరాకృతిని గాంచి ♦ యేరికైన
నోడింపరాని య♦ట్లుద్ధతిఁ బొల్చు యక్షిణి నిర్జనంబుగఁ ♦ జేయ దీని
నేరుఁ బ్రవేశింప ♦ నేరక యున్నారు, వనమిద్ది భయదమై ♦ కనఁబడియెనో
మనుజవిహీనమే♦మాడ్కి నయ్యెనో నేఁటిదనుక నవ్విధముగ ♦ దారుణాకృ

తే. తిని ధరించియె యున్నదో ♦ తెలిపినాఁడ
నివ్వనంబు వృత్తాంతంబు ♦ నెల్ల నీకు
ననుచు గాధేయుఁడాడిన ♦ నప్రమేయ
మహిమనుగల మాని యత్యుత్త♦మవచనంబు. ౩౨ 740

ఇరువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౨౫-వ సర్గము.

### తాటకావృత్తాంతము.

క. విని పురుషసింహుఁ డమ్మునిఁ, గనుఁగొని శుభవాక్యమలరఁ ♦ గా నిట్లనియెన్
వినఁబడుఁగా లఘువీర్యము, గనఁబడు యక్షాళికంచు ♦ గాధితనూజా!. ౧

తే. అట్టి యక్షులలోఁ బుట్టి♦నట్టి యబల
వేయి యేనుంగుల బల, మే♦విధి ధరించి
యున్న దవ్వార్తఁ దెల్పవే! ♦ యన్నఁ గుశిక
వంశమౌక్తిక మిట్లనె ♦ బలికెఁ బ్రీతి. ౨ 742

చ. వనిత యదేల భూరిబల♦వైభవముం గనియుండు దానికే
ననువగు కారణంబు మన♦మార వచించెద దానికిన్ వరం
బునొసఁగుటన్ సహస్రగజ♦ముఖ్యబలం బలరారె దానిచే
త, నబలయయ్యు భూరిబల ♦ దర్పితయై వెలుగొందు రాఘవా!. ౩ 743

చ. మునుపు సుకేతుఁడన్న యశ♦ముం గని వీర్యముతోడఁ బొల్చి స
జ్జనమతిఁ గన్న యాచరణ♦సంగతిఁ గాంచిన యక్షుఁడుండె; నా
ఘనుఁ డనపత్యుఁడై సుతులఁ ♦ గాంచఁగ భూరితపంబొనర్చె నా
తనిపయిఁ బ్రీతినుంచిన వి♦ధాతసుతామణినిచ్చె రాఘవా!. ౪ 744

తే. దానికి సహస్రదంతిస♦త్త్వంబు నొసఁగె
నదియె తాటక యనుపేరు ♦ నందియుండుఁ;
దనయ నిచ్చెను గాని పి♦తామహుండు
భూరియశునకుఁ బుత్త్రునీఁ ♦ బూనఁడయ్యె. 745

చ. పరువము రూపముం దనర ♦ భామిని వృద్ధినిబొందెఁ జాల సుం
దరియను కీర్తిఁ గాంచి జన♦నంబును గాంచిననాటనుండి, యా
తరుణిని ఝర్ఝసూనుఁడయి ♦ దర్పమునం దగు సుందు నెన్ని య
య్యెరువురకున్ వివాహమును ♦ నెంతయు వేడుకఁ జేసెఁ దండ్రియున్. ౫

తే. పెండ్లి చేసి సుకేతుండు ♦ ప్రియకుమారి
ననిపె నొకకొంతకాల మ♦ట్లరుగ నామె
కనియెఁ బుత్త్రుని మారీచుఁ ♦ గడు నజయ్యు
వాఁడు రాక్షసుఁడయ్యె శా♦పంబువలన. ౬ 747

-మారీచుఁడు శాపమువలన రాక్షసుఁ డగుట.-

చ. వినుమిఁక శాపకారణము ♦ వీనులవిందుగ రామచంద్ర! సుం
దుని నొకనాఁ డగస్త్యముని ♦ తోయజవైరియుఁ ద్రుంచె నందుచేఁ
గనలి తనూజుఁగూడి వడి ♦ గర్జిలుచున్ మునినాథుఁ జంపఁగాఁ
జను నని యెంచి తాటకయు ♦ శౌర్యము పొంగఁగ మ్రింగఁ బాఱెనన్. ౯౪

తే. పైఁ బడం బఱతెంచు న♦ప్పాపచిత్త
దానికొడుకును భగవంతుఁ ♦ డౌ నగస్త్యుఁ
డాగ్రహమ్మునఁ జూచి ముం♦దాకుమారు
నడవఁగా నెంచి రాత్రించ♦రుఁడవు గమ్ము. ౧౦౪ 749

మ. అని మారీచు శపించి తాటకను గ్రో♦ధాక్షుల్ తగన్ జూచి యో
వనితా! యీవిధి నొప్పుమీఱుతనువున్ ♦ వర్జించి నీవింతటన్
మనుజాళిందినుచున్ వికారమగు వ♦ర్ష్మమ్మొప్పఁగా మోము భీ
తిని బుట్టించి మహావికారమగు రీ♦తిం గూడఁగా నుండుమీ!. ౧౨ 750

క. దారుణరూపము నీకగుఁ,బో రక్కసి! యని శపించె ♦ భూరిక్రుధ నా
దారుణశాపము తనకతి, భారంబుగఁ దోఁప సుంద♦పత్నియు నందున్. ౧౭

తే. ఓర్వఁజాలక మూర్ఛిల్లి ♦ యుగ్రరీతి, నీవనంబున నమ్ముని ♦ యెపుడు తిరుగు
చుంట శుభతరమై పొల్చు♦చుంట దీనిఁ, బాడుసేయుచు నున్నది ♦ పాపబుద్ధి.

చ. అతితర దారుణాకృతిని ♦ నట్టిదియై తగు శౌర్యయుక్తి ని
య్యతివయు నీచవృత్తిని న♦హర్నిశముల్ వనమెల్లఁ జెండుచున్
జనమునన్ జగంబునకు ♦ సాధ్వసముం గలిగించుచున్న దు
ర్గతి; నిఁక, గోధరామరహి♦తంబునకై వధియింపు రాఘవా!. ౧౮ 753

ఆ. శాపమొంది యున్న ♦ యీపడంతిని మూఁడు
జగములందు నెవఁడుఁ ♦ జంప, సాహ
సింపఁ డీవు దక్క ♦ క్షితిపతి పుత్త్రకా!
యింక దీనిఁ జంపు ♦ మేపు మీఱ. ౧౯ 754

క. తరుణిని వధించు టెట్లని, నరవర! దయఁ బూనఁ బోకు ♦ నాలుగుజాతుల్
పరఁగుఁ దదీయహితార్థము, లరసి యొనర్పంగఁ దగు నృ♦పాత్మజునకిలన్. ౧౬

సీ. ప్రజలను రక్షించు ♦ పార్థివునకు వారిఁ గాపాడు పనికగు ♦ కర్మమద్ది
క్రూరమ్ముగాని య♦క్రూరమ్ముగాని పాతకముగానీ పుణ్య♦దానివలన
నపకీర్తి గలుగనీ ♦ యద్దానిఁ జేయంగ వలయు సుమీ! రాజ్య♦భారమూను
వారల కిద్దియే ♦ వఱలు సనాతన ధర్మమై కాకుత్స్థ! ♦ తాటక యిది

తే. కన నధర్మపరాయణ ♦ గాన దీనిఁ, జంపు; మిద్దానియందు దో♦షంబెకాని
ధర్మమనునదియే లేదు♦దగువధింప, వినఁగఁ దగుదీవు తద్గాథ♦లను గుమార!.

చ. మునుపు విరోచనాత్మజను ♦ భూమిని నాశముసేయఁ బూనుదా
నిని గ్రుధ మంథరాహ్వయను ♦ నిర్జరనాథుఁడు చంపినట్లుగా
వినమె భృగుండు నాఁ దనరు ♦ విశ్రుతమానికిఁ బత్ని శుక్రమా
తను బురుహూతుఁ జంపఁగ ని♦తాంతదృఢవ్రతమూను దానినిన్. ౧౯-౪ 757

క. వనితయని తలఁప కొక్కట, వనజాక్షుఁడు చంపలేదె! ♦ వసుధేశసుతా!
వినుమెంతయో నృపాత్మజు,లనుకంపను మాని నీతి ♦ నలరింపంగన్. ౨౦ 758

తే. ధర్మహాని యొనర్చు కాం♦తల వధించి, రట్టివారు మహాత్ములు ♦ నఖిలధర్మ
ముల నెఱింగిన వారలై ♦ వెలయువారు, కాన నీవును జేయు మ♦క్కరణినింక.

ఇరువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౬. - వ సర్గము.

### తా ట కా వ ధ.

క. మునిపతి యిటు సార్థకముగ, వినిపించినవానినెల్ల ♦ విని రఘుకులవ
ర్ధనుఁడు దృఢవ్రతుఁడును నై, తనరెడు రాముండు గాధి♦తనయునిఁ గనుచున్.

తే. అంజలి ఘటించి యుత్తరం ♦ బతనికీయఁ, దలఁచి తలపోసె నిట్లని♦తండ్రి పలికెఁ
గాదె కౌశికుఁ డెబ్భంగి ♦ గా వచించు, నట్లు సేయంగఁ దగునని ♦ యందువలన.

క. జనకమహాజ్ఞాగౌరవ,మున నీమహిమాఘ్యుఁడైన ♦ మునియు వచించెన్
గనుకను నిశ్శంకముగా, నొనరుపఁ దగు నాకటంచు ♦ నుల్లములోనన్. ౨

క. తలపోసి కౌశికునితోఁ, బలికెన్ గురుమధ్యమమున ♦ భవ్యాత్ముండై
వెలసెడు మజ్జనకుఁడు మీ, పలికిన యటుసేయుమనుచుఁ ♦ బలికెం గాదే. ౩

చ. జనకుని యానతిం గడువ ♦ శక్యము గాదు తదీయవాక్యమున్
విని యిట బ్రహ్మవాదియయి ♦ విశ్రుతధర్మవిదుండునై జగం
బున యశమొందియున్న ముని ♦ ముఖ్యుని యాజ్ఞను బొందియున్న నే
ననువుగఁ గృత్యమిద్దియని ♦ యవ్వనితన్ వధియించెనన్ గురూ!. ౪ 764

తే. అప్రమేయప్రభావుఁడ ♦ వయిన నీదు
నానతిని జేయఁ బూనితి ♦ దీన గోధ
రామరులకు హితంబు నీ♦యమలజనప
దంబునకు సౌఖ్యవృద్ధియుఁ ♦ దనరు ననుచు. ౫ 765

క. అనిపలికి శత్రుబలసూ,దనుఁడౌ రాఘవుఁడు స్వీయ♦ధనువునడుమ ము
ష్టి నమర్చి నారి మ్రోయిం,చెను తీవ్రము గాఁగ దాని♦చే దెసలెల్లన్. ౬ 766

ఆ. మాఱుమ్రోసె; నట్టి ♦ మహితనిధ్వానంబు, నాలకించి తాట♦కాలయమున
నొప్పువనవనమున ♦ నున్నట్టి వారెల్ల, భీతినొంది రల సు♦కేతుతనయ. 767

సీ. అతికోపచిత్తురా ♦ లాట నాశబ్దంబు విని యేమిచేయుట♦కును మనమునఁ
దోఁచక యంత నా♦లోచించి క్రోధవిస్ఫూర్తిచే మూర్ఛిల్లి ♦ భూరినినద
మే భాగమునుండి ♦ యేతెంచెనోయని దానిఁ జక్కఁగ విని ♦ యానిశాచ
దారగన యాదెస ♦ కతివేగమునఁ బరువెత్తె నంతటఁ గ్రోధ♦మెసఁగ వికృత

తే. మైన యాకారమును వికృ♦తాననంబుఁ
గలిగి మిక్కిలి పొడవుగఁ ♦ జెలఁగు తనువు
భయదమై యొప్పఁగా నది ♦ వచ్చుచుండఁ
గాంచి రాముఁడు పల్కె ల♦క్ష్మణునితోడ. ౭ 768

క. అనుజా! లక్ష్మణ! భీకర,మును వికృతమునైన కాయ♦మును జూడుము దీ
నిని గాంచునపుడె భయపడు, మనుజులహృదయములుఁ శకల♦మాత్రమ్ములగున్.

క. మాయాబలమ్ము గలిగిన, యాయింతిని దలపఁ జంపఁగ ♦ నెటు సులభంబౌ
నోయనుజ! ముక్కుఁజెవులును, గోయంజనునట్లొనర్చి ♦ క్రూరనునీషన్. ౧౧

చ. మరలి భయాతిరేకమున ♦ మాయఁదొలంగి చనంగఁ జేసెదన్
దరుణిని జంపఁగాఁ దగదు ♦ దానిస్వభావముచేతనే దయా

పరతను గావఁగాఁ జనును ♦ బాలక! దీనిని సాహసంబునన్
మరణము నొందఁజేయుటకు ♦ మానుకమానసమొప్పదేమియున్. ౧౧ 771

చ. కరములఁద్రుంచి శౌర్యమును ♦ గాళ్లను గొట్టి గతిన్ నశించున
ట్లురుతరశక్తిఁ జేయఁదగ ♦ నుల్లమునందుఁ దలంచువాఁడ సో
దర! యని యిట్లు పల్కుతఱిఁ ♦ దాటక క్రోధనిమగ్నచిత్తయై
కరములఁ బైకిఁ జాఁచి కడు♦గర్జిలుచున్ రఘువీరుపైఁ బడన్. ౧౩ 772

క. పరుగెత్తి రాఁగఁ గని భూ,సురమౌనివరుండు గాధి♦సుతుఁ డద్భుతభీ
కరరామశక్తి నెఱిఁగియుఁ, దరుణీ క్రౌర్యమును గాంచి ♦ తలఁకె మనమునన్.

ఉ. హుంకృతిచేత దానిదగు ♦ నుద్గతినాప నదల్చి రాఘవే
ణాంకులకున్ శుభంబగు ♦ నంచు జయంబును గల్గునంచు ని
శ్శంక వచించెఁ దాటక ర♦జఃపటలం బెగఁజల్లుచున్ వడిన్
బంకజబంధువంశ్యులను ♦ భాసురతేజుల నొంచువేడుకన్. ౧౪ 774

తే. ధూళిచే గాఢతమసును ♦ దోఁపఁజేసి, సొమ్మసిలఁ జేసె దశరథ♦సుతవరులను;
సుంతకాలమ్ము పిదప జ♦తుస్సులకుఁ గ,నంబడని యాకృతిందాల్చె ♦నైజశక్తి.

క. మఱుఁగుననుండియె వారలఁ, గఱకు శిలావృష్టి ముంచెఁ ♦ గనలి రఘువరుం
డఱవఱలుగ నొసరించెఁ బె,నుఱాల వర్షమును దేవ♦నుతశరవృష్టిన్. ౧౬

సీ. ఇట్లు శిలావృష్టి ♦ నెంతయు శక్తిచే నాపి మీదికివచ్చు♦నట్టి దుష్ట
బుద్ధి యా తాటక ♦ భూరిహస్తంబుల ఖండించె నతితీక్ష్ణ♦కాండములను
ననిత యంతటనేమి♦యును జేయఁ జేతులుపోవుట శ్రమమును♦బొంది ముందు
నిలుచుండియఱచుచుం♦డినఁజూచిసౌమిత్రికోపంబునొందిము♦క్కును జెవులను

ఆ. గోసి వైచె నంత ♦ నాసురి కామరూ,పంబు గలది గాన ♦ బహువిధాకృ
తులను దాల్చి నేత్ర♦ములకుఁ గానఁగరాక, శిలలవృష్టి నిగుడఁ♦జేయుచుండె.

క. తన మాయవలన దశరథ, తనయుల మోహింపఁజేయు ♦ తలఁపున భీతిం
గనునట్లఱచుచుఁ దిరుగుచు, ననితయు నుండంగ మౌని♦వర్యుండంతన్. ౧౯

తే. తనువులెల్లఁ బాషాణవృ♦ష్టిని మునుంగ
నున్నరాఘవులను జూచి ♦ యొప్పు మెఱయఁ
బలికె దయఁజూపుటిఁకఁజాలుఁ ♦ బాపబుద్ధి
గలది యిది రామ! దుష్కార్య♦ముల నొనర్చు. ౨౧ 779

తే. మఱియు నీయక్షతనయ దు♦ర్మార్గములగు
పనులు నిజమాయచేఁ జేయుఁ ♦ బంతమూని
యజ్ఞవిఘ్నంబు నొనరుచు ♦ నట్లు గానఁ
బ్రొద్దుపోవక యుండఁ జం♦పు మిఁక వత్స!. ౨౨ 780

క. ఇనుఁ డస్తమింపఁ బోయెడి, ననుచిహ్నము లొప్ప నట్టి♦తఱి నదనుజు లె
ల్లను జెలరేఁగుదు రప్పుడు, వినుమది వారలకు శౌర్య♦వృద్ధిదము సుమీ. ౨౨।

చ. అనుటయు కాలవృష్టి గురి♦యం జరియించుచు నార్చుచున్నయ
ఘనసినుతఁ దాటకం గనెడు ♦ చొప్పుఁ దలంచి తదీయరావముల్
విని, యిది యీ దెసం దిరుగు ♦ వింతగ నంచు నెఱింగి దానికిన్
దనదగుశబ్దవేధితను ♦ దప్పక చూపఁగఁ బొంగి పూన్కితోన్. ౨౩। 782

క. శరములచే దానిని నిలు,వరించె నయ్యక్షతనయు ♦ వదలక మాయా
స్ఫురణమున నెలుఁగుపడి యా,శరజాలము చుట్టుముట్టి ♦ శాంబరి నడఁపన్.

తే. మాయఁ బోనాడి రాముల♦క్ష్మణు లపైకిఁ
బాఱుతెంచెను ఘోరని♦స్వనముతోడ
నివ్విధిని విక్రమించుచు ♦ నెంతొ వడిగఁ
బిడుగువలె వచ్చుదాని రా♦ముఁ డెటఁ గాంచి. ౨౫ 784

క. ఉరమును గాడఁగ నొకఖర, శరమును వైచుటయుఁ దీవ్ర♦శరఘాతమునన్
దరుణి యది నేలఁ బడి స,స్వరముగఁ బ్రాణముల వదలెఁ ♦ దత్సమయమునన్.

చ. అనిమొననిట్లు తాటక భ♦యంకరమూర్తి మృతింగనంగ దా
నిని గని నిర్జరేశ్వరుఁడు ♦ నిర్జరులుం గుమిగూడి బాగు బా
గని రఘువంశదీపకుని ♦ నాదృతిమైఁ గొనియాడిరంత న
మ్మునిఁగని మోదమొప్ప సుర♦ముఖ్యుఁడు నిర్జరసంఘయుక్తుఁడై. ౨౭। 786

క. పలికెం గౌశిక! మునివర!, కలకాలము నీకు శుభము ♦ గలుగుత దేవా
వళియును నేనును ముదమున, నలరితి మీకార్యమునకు♦ నంచను మఱియున్.

క. కనఁబఱపుము స్నేహము రా,మునియందొక మనవి వినుము ♦ మునినీవు భృశా
శ్వునకు జనించి మహోన్నతి, గనెడు పరాక్రమము మీఱఁ♦ గ్రాలెడువానిన్.

క. అతిలోకతపోబలమున, జతనము మీఱంగ నస్త్ర♦సముదయములఁ బొం
దితి గాదె? వాని దశరథ, సుతవర్యున కితనికిమ్ము ♦ శుభకరుఁ డితఁడౌ. ౨౯।

సీ. స్థిరబుద్ధితో నీకు ♦ సేవలుచేయుటఁ బాత్రుఁ డీతఁడు నీకు ♦ బ్రహ్మమౌని!
విబుధనిమిత్తమీ ♦ వీరుండు చేయంగఁ దగు గొప్పకార్యంబు ♦ దానఁ గలుగు
విమలయశంబంచు ♦ విబుధులు వచియించి హృష్టమానసముల♦ నెంతొ భక్తిఁ
గౌశికుఁ బూజించి ♦ క్రమ్మఱి వచ్చినయట్ల స్థానంబుల ♦ కరిగి రంత

తే. సంధ్యయును దోఁచెఁ, దాటక ♦ సంహరించు
టకుఁ బ్రమోదము నొందుచు ♦ నకలుషమతి
రాముఁ గనుఁగొని యతనిమూ♦ర్ధమును బుణికి
మూరుకొని పల్కె నివ్విధి ♦ మునివరుండు. ౩౨। 790

ఉ. కన్నులపండువయ్యె నినుఁ ♦ గాంచిన నాకు రఘూద్వహా! మదు
క్తిన్నెఱవేర్చి చేసితివి ♦ దేవతలున్ ముదమొందు కార్యమున్
మన్ననఁ గాంచితీవు బహు♦మానము మీఱఁగ నేఁటిరేయి యా
సన్నుతిపాత్రమై వెలయు ♦ స్థానమునన్ వసియించి వేకువన్. ౩౩ 791

ఉ. నాదగు నాశ్రమంబును గ♦నంజను టొప్పగు నంచు నాతప
శ్శ్రీదయితుండు కౌశికుఁడు ♦ చెప్పినవాక్యము నాలకించి స
న్మోదముతోడ రాఘవుఁడు ♦ పుచ్చెను దన్నిశి నావనంబునం
దాదినమందె యావనము ♦ హాయినిజెందెను తాటకామృతిన్. ౩౪ 792

క. నిరుపద్రవమై గుహ్యక, వరుఁడైన కుబేరునకు ని♦వాసార్హంబై
పరఁగెడు చైత్రరథంబును, బురుడించుచు నావనంబు ♦ పొలుపారెఁ గడున్.

చ. సురగణసిద్ధసంఘములు ♦ స్తోత్రముసేయఁగఁ దాటకాహ్వయన్
మరణమునొందఁజేసి ముని♦మండనుతో రఘురాముఁడానిశిం
బరమముదంబునన్ గడిపె ♦ బ్రహ్మమునీంద్రుఁడు తెల్లవాఱఁగా
ధరణివరాత్మజన్ములను ♦ దానొగి మేల్కొలిపెన్ యథావిధిన్. ౩౬ 794

ఇరువదియారవ సర్గము సంపూర్ణము.

## ౨౭ - వ సర్గము.

రామునకు విశ్వామిత్రుఁడు దివ్యాస్త్రము లిచ్చుట.

చ. అమలినకీర్తియైన కుశి♦కాన్వయదీపకుఁ డచ్చటన్ నిశా
సమయమునంతయున్ గడపి ♦ సస్మితుఁడై మధురాక్షరాళి యు
క్తముగ వచించె రాఘవునిఁ ♦ గాంచి, కుమారక! కీర్తిరాశి! నా
కమితముదంబుగల్గె శుభ♦మయ్యెడు నీకొకమేలు చేసెదన్. ౧ 795

క. నీవొనరించిన పనికై, భావంబున నలరినాఁడఁ ♦ బరమాస్త్రములన్
వేవేగ నీకొసంగెద, రావయ్యా! వానిమహిమ ♦ రాఘవ! వినుమా! ౨ 796

క. క్రతుభుజులనైన గంధ,ర్వతతులనైనన్ ఫణీంద్ర♦వారమునైనన్
బ్రతిపక్షు నెవనినైనను, హృతశౌర్యునిఁగా నొనర్తు ♦ వీయస్త్రములన్. ౩

ఆ. కదనమందు శత్రు♦గణముల నీకు లోఁ
బడెడు నట్లొనర్చి ♦ కడువిజయము
గలుగునట్లు సేయుఁ♦గాన నీదివ్యాస్త్ర
ములనొసఁగుదు నీకుఁ ♦ గలుగు శుభము. ౪ 798

సీ. చారుతరము దండ♦చక్రంబు నీకిత్తు ధర్మచక్రాఖ్యసా♦ధనము గాల
చక్రము మఱి విష్ణు ♦ చక్రమత్యుగ్రంబు నైంద్రాస్త్రమనునట్టి ♦ దైన వజ్ర

మును, శైవమగు శూల♦మును మేటిదై తగు బ్రహ్మశిరస్సనఁ ♦ బరఁగు నస్త్ర
మును రామ! యైషీక♦మును నీకొసంగెద నిరుపమానంబుగ ♦ నెగడుచుండు

తే. నట్టి బ్రహ్మాస్త్రమొసఁగుదు ♦ నవనినాథ
తనయ! మోదకి శిఖరి నాఁ ♦ దగు గదలొగి
మెఱయుచున్నవి నాచెంత ♦ మేలటంచు
వాని నీకిత్తునో రఘు♦వంశతిలక!. ౭॥ 799

సీ. ధర్మపాశము మఱి ♦ దారుణంబగు కాలపాశము నిరుపమ♦వరుణపాశ
దారుణాస్త్రమ్ముల ♦ వత్స! నీకొసఁగెద నార్ద్రాశనియును, శు♦ష్కాశనియును
గలవు వానింగొను ♦ మలరి యొసంగెదఁ బైనాకమనఁబడు ♦ పాశుపతము
నారాయణాస్త్రంబు ♦ నరనుత! నీకిత్తు నగ్నికిఁ బ్రియమైన♦యట్టి శిఖర

తే. మనెడు నస్త్రంబుఁ బ్రథనాహ్వ♦యంబునఁ దగు
నట్టి వాయవ్యశరముఁ గ్రౌం♦చాస్త్రవరము
హయశిరస్సనఁ బరఁగెడు ♦ నస్త్రముఁ గొను
విష్ణురుద్రాఖ్యశక్తులఁ ♦ బ్రీతి నిత్తు. ౧౧॥ 800

తే. అసురవర్యులు ధరియించు♦నట్టి ముసల
కంకణంబులఁ గాపాల♦కమును ఘోర
మైన కంకాళమును మఱి♦యసురులెట్టి
వాని ధరియింతు, రవ్వాని ♦ వరుస నిత్తు. ౧౨॥ 801

క. విను విద్యాధరదైవత,ము, నందనాహ్వయముతోడఁ ♦ బొల్చెడు నస్త్రం
బును నసిని నరవరాత్మజ!, కొనుమిచ్చెద నవ్వి కోర్కెఁ ♦ గొనసాగించున్.

సీ. గంధర్వులకుఁ బ్రీతి ♦ కరములౌ మానవ ప్రస్వాపనంబులఁ ♦ బ్రశమనమును
నొసఁగెద నివ్వియే ♦ యొప్పుగాంధర్వాస్త్రములను, విఖ్యాతిని ♦ వెలయునట్టి
సౌరాస్త్రమును, మహా♦సంతోషమున నిత్తు సంతాపనమ్ము, శో♦షణమునట్లె
తనరు విలాపన ♦ దర్పణంబులను గందర్పప్రియంబు దు♦ర్ధర్షమునగు

తే. మదనమును నస్త్రమును నొసం♦గుదును, రామ!
సభ్యశోభూషణా! పిశా♦చప్రియంబు
నగుచు మోహనమనుపేర ♦ ఖ్యాతమైన
యస్త్రమిచ్చెదఁ బురుషపుం♦గవాస్య! నీకు. ౧౬॥ 803

సీ. తామస, సౌమన ♦ సంవర్ధములను, దుర్ధర్షమౌ మౌసల♦దారుణాయు
ధమునట్లె మాయాధ♦రమును, సత్యాస్త్రంబు బరుల పౌరుషనిరా♦కరణచణము
గాఁదగి ఘోరంబు♦గానొప్పు తేజః ప్రభాస్త్రంబు, శిశిరాహ్వ♦యమగు సౌమ్య
శరమును, ద్వష్టనాఁ ♦ బరఁగు దేవత, పతి యేయస్త్రమునకట్టి ♦ తెసఁగు నస్త్ర

తే. మును సుదామననామక♦మును, భయంక
రమగు శీతేషువను భగా♦స్త్రమును, మాన

వమును, గ్రహియింపు మీలాటి ♦ వరశరమ్ము
లెన్నియోగల వవ్వాని ♦ నెన్నఁదరమె. ౧౯ 804

ఉ. కోరినయట్టి రూపములఁ ♦ గూడి మహాబలసంయుతంబులై
యారయ నత్యుదారములె♦యై యలరారెడు నీమహాస్త్రముల్
భూరమణాత్మజుండవయి ♦ భూరిభుజాబలశాలివైన నీ
కో రఘువర్య! యివ్వి తగు ♦ నొప్పిదమొప్పఁగ వే గ్రహింపుమా. ౨౦ 805

చ. అని వచియించి తూర్పుమొగ♦మై శుచియై నిలుచుండి ప్రీతుఁడై
మునివరుఁ డప్డు రామునకు ♦ ముఖ్యతమంబగు నస్త్రమంత్రసం
క్తినొసఁగె; వానినన్నిఁటిని ♦ దేవతలైన నెఱుంగఁ జాల ర
ట్లనితరసాధ్యమంత్రముల ♦ నమ్ముని రామునకిచ్చి యంతటన్. ౨౨ 806

తే. మంత్రములఁ జెప్పి యయ్యస్త్ర♦మంత్రదేవ
తలను రాముని వశమున ♦ మెలఁగఁ జేయఁ
దలఁచి జపియించె జ్ఞానియై ♦ వెలయుమౌని
యాజ్ఞ నర్హాతమంబులై ♦ యలరు నవియు. ౨౩ 807

చ. ద్యుతిమయదేహముల్ చెలఁగఁ ♦ దోఁచి రఘూద్వహు ముందునిల్చి స
మ్మతిమెయి దోసిలొగ్గి బహు♦మానము మీఱవచించెఁ జాల ను
న్నతిఁ దనరారు మేము, రఘు♦నాయక! కింకరవృత్తి నిన్నుఁ గొ
ల్చి తగినయట్ల యుందు మని♦చెప్పిన రాముఁడు సంతసంబునన్. ౨౪ 808

క. పరమోదారములగు న,వ్వరమంత్రము లొగి వచించు ♦ భంగిని సేవన్
గరుణించి వాని నన్నిఁటిఁ, గరమున స్పృశియించి ప్రీతిఁ ♦ గాంచి వచించెన్.

చ. మనసు నెఱింగి వర్తిలుఁడి ♦ మంత్రములార! యటంచు నాజ్ఞ చే
సెను దరువాత రాఘవుఁడు ♦ చిత్తముమోదమునన్ మునుంగ న
మ్మునిపతికిన్ యథావిధిగ ♦ మ్రొక్కి ప్రయాణము సేయనుండె; నా
ఘనతర తేజుఁడై వెలయు ♦ క్ష్మాపతి యుగ్రతనూజుఁ డంతటన్. ౨౬ 810

ఇరువదియేడవ సర్గము సంపూర్ణము.

---

౨౮ - వ సర్గము.

ఉపసంహారముల రామున కుపదేశించుట.

తే. సకల శస్త్రాస్త్రలాభంబు♦నకు మొగంబు
సంతసంబునఁ జెలువార ♦ స్వాంత మెంతొ
శుద్ధమై తగఁ బయనంబు ♦ శుభతరాశ్ర
మమునకుం జేయుచుండి, య♦మ్మౌని కనియె. ౧ 811

క. సకలాస్త్రంబులఁ బొందితి, నిఁక నిర్జరులైన నన్ను ♦ నెదిరింపఁగఁజా
లక యుండ్రు తదుపసంహృతి, యొకదా తెలియంగఁ దగిన♦దిప్పుడు నాకున్. ౨
క. ఆవిధముఁ దెలుపవే యనఁ, గా విశ్వామిత్రమౌని♦కాంతుఁడు శుచియై
భావం బలర దృఢవ్రతుఁడై పలికె౯ ధృతిచెలఁగ ♦ నావిధమెల్ల౯. ౩ 813

సీ. సత్యవంతము, ధృష్ట, ♦ సత్యకీర్తి, రభస ప్రతిహారతరముల ♦ వాఙ్ముఖంబు
నట్టి పరాఙ్ముఖ ♦ మన్వల విషమ, సునాభకంబులు, దృఢ♦నాభ మట్టి
దైన లక్షాలక్షాహ్వ♦యంబు, దశాక్షంబు, దశశీర్షమును, శతో♦దరము, మఱియుఁ
బద్మనాభము, శత, ♦ వక్త్ర, మహానాభములు దుందునాభాఖ్య♦మును సునాభ
తే. కంబు, జ్యోతిషమును గృశ♦నంబు, విమల
మట్లె నైరాశ్య, యౌగంధ♦రాహ్వయములు
ప్రశమనము, దైత్యమును హారి♦ద్రమును శుచియు
బాహు, నిష్కలులును, మహా♦బాహువు నొగి. ౭ 814

సీ. విరుచి, సార్చిర్మాలి♦వృత్తిమంతము, ధృతిమాలియు, రుచిరంబు♦మకరము పిత్ర్య
సౌమనస, విధూత♦నామముల్, కరవీర కర, ధన, ధాన్యముల్ ♦ కామరూప
కామరుచులు, మోహ♦నము, మావరణంబు సంతాన, వరణముల్♦సర్వనాభ
జృంభకాహ్వయముల♦వెలయువీనిని భృశాశ్వనికుమారత్వంబుఁ♦గనిన వానిఁ
తే. గామరూపంబులను భక్తిఁ ♦ గైకొనుమివి
భాస్వరములై వెలుంగునో ♦ వత్స! రామ!
నీకు మంగళమగుఁగాక ♦ నాకు నీవు
పాత్రభూతుండవని, మౌని ♦ పల్కుటయును. ౧౦ 815

చ. మనమున హర్షమొప్ప రఘు♦నందనుఁడట్లు గ్రహించువాఁడ స
జ్జననుతశీల! యంచు ఋషి♦సత్తమునుండి పరిగ్రహించె మం
త్రనికరమెల్ల (వానియధి♦దైవతముల్ రఘురాముఁగొల్చె ది
వ్యనుతశరీరముల్ మెఱయు♦వాని ధరించి సుఖప్రదంబులై.) ౧౦౪ 816

సీ. అందుఁ గొన్ని చెలంగె ♦ నగ్నిరీతిని గొన్ని యలరె ధూమాకృతు♦లై నయట్లు
కొన్ని చంద్రార్కులై ♦ యన్నట్లు పొల్చుచు నొకకొన్ని యంజలు ♦లొప్పనంగి
యును, నిట్లునిలిచి యి♦ట్లనియెఁ బ్రాంజలిబంధమలరార మధురమౌ♦పలుకులొప్ప
నిదె వచ్చి నిల్చితి ♦ మిఁక నరశార్దూల! యాజ్ఞ యిమ్మేమిసే♦యఁదగుననిన
తే. నారఘూద్వహుఁ డిచ్ఛాను♦సార మరుఁగుఁ
డేను కార్యంబు గలిగిన♦మానసమునఁ
దలఁతు నప్పుడ చనుదెంచి ♦ తగినసాయ
మును దగంజేయుఁడీ యన ♦ విని యవియును. ౧౮ 817

క. పలికినయట్టులె చేసెద, మలఘుగుణా! రామ! యనుచు ♦ ననుమతిఁ గొనుచు౯

వలగొనివచ్చినయట్టులె, చెలఁగుచుఁ బోయిన మునీంద్ర♦శేఖరుఁ డంతన్.౧౫

క. (అనుమతి సేయఁగ రాముం, డనుజున కుపదేశ మొసఁగె ♦ నవ్వరమంత్రా
ళిని సాంగంబుగ నెంతయుఁ, దనయాత్మప్రమోదమొంది ♦ దైవాఱంగన్.)

తే. అంత రఘువంశవర్ధనుఁ ♦ డమ్మహాస్త్ర
సంతతిని సాంగముగ నిట్లు ♦ సంగ్రహించి
పయనమై పోవుచుండి సు♦వ్యక్తముగను
బలికె మధురోక్తులను, మౌని♦వర్యుతోడ. ౧౬ 820

ఉ. అల్లదె కొండచెంతను, మ♦హాద్రుమపంక్తి కనంగనయ్యె నా
యుల్లము చాలసంతసము ♦ నొందె నదెన్నఁగ గొప్పమేఘ మ
ట్లల్లెడఁ దోఁచె దట్టముగ ♦ నిద్ది మృగాఢ్యమునై మనోజ్ఞమై
నల్లలితోక్తు లొప్పఁ దగు ♦ సర్వశకుంతయుతిన్ వెలింగెడున్. ౧౭ 821

క. వినవేడుకయ్యె నాకీ, వనచరితముఁ దాటకాని♦వాసము భయదం
బును నగు వనమును దాఁటితి, మనఘమతీ! దేశమిద్ది♦యతిసుఖకరమౌ. ౧౮

తే. కాన నిదియొక యాశ్రయం ♦ బౌనటంచుఁ
దలఁపఁ దగుఁగాదె యెవరిదీ♦స్థలము దెలుప
వయ్య! దీనిచరిత్రంబు♦నంతయు మఱి
తెలుపు, మీయాశ్రమమదెందు ♦ నలరుచుండు. ౧౯ 823

తే. బ్రహ్మఘాతుక దుశ్శీల ♦ పాపబుద్ధు
లగుచు దుర్మతులైన యా♦యసురులోలి
నీదుయజ్ఞముఁ జెఱచుట♦కై, దురూహఁ
దిరుగుచుందురొ? చెపుమ యా♦దేశమెద్ది!. ౨౦ 824

చ. దనుజుల వారలం దునిమి ♦ తావకయజ్ఞమవంతరాయముం
గని చెడకుండఁగావఁదగుఁ♦గాదె యదెందుఁ జెలంగు నివ్విధం
బును సకలంబునుం దెలుపు ♦ పూనిక నే వినఁగోరినాఁడ నా
విని యవి, చింత్యమానముగ ♦ వెల్గు మహత్త్వము గల్గి యోగతిన్. ౨౧ 825

ఇరువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౯ - వ సర్గము.

### వామనమూర్తి చరితము.

చ. తెలియనివానిచందమునఁ ♦ దీయనిపల్కుల వేఁడు వాఁడటం
చలరుచు మౌనిదివ్యమహి♦మాధికతన్ వెలుఁగొందుచుంట న
య్యలఘుతరోక్తికు త్తరము ♦ నల్లనఁ జెప్పఁగఁ బూని యోగతిం
బలికెను లోకనాయకుఁడు ♦ వారిజనేత్రుఁ డొకప్పు డవ్వనిన్. ౧ 826

తే. పెక్కునూఱులయుగములు ♦ ప్రీతి మీఱఁ
దపము యోగంబునుం బూని ♦ దనరఁజేయఁ
గా నివాసంబుసేసె న♦క్కాననంబె
యలరు వామనదేవు పూ♦ర్వాశ్రమంబు. ౩ 827

చ. తపమొనరించుకార్యమున ♦ ధాత్రిని ఖ్యాతిని గాంచియున్న క
శ్యపుఁడనుమౌని యవ్వనిని ♦ సల్పెఁ దపంబును సిద్ధిఁబొందె న
త్తపమున నట్టులౌట నిది ♦ ధాత్రిని సిద్ధమహాశ్రమంబుగా
నిపుడును సన్నుతింగనెడు ♦ నిట్లు రమాపతి యోగనిష్ఠుఁడై. ౪ 828

చ. వనమున నిందునున్నతఱి ♦ వాసవుఁ గెల్వఁగఁ బూని యవ్విరో
చను ప్రియసూనుఁడైన బలి ♦ శక్రుని దేవమునుద్గణంబు నొం
చిన దివిజుల్ పలాయనము ♦ సేయఁ ద్రిలోకములందు విశ్రుతిం
గని సురరాజ్యమేలుచు న♦ఖండవిభూతిసుఖంబుసేయఁగన్. ౫ 829

క. తలపోసి యజ్ఞనిష్ఠల, సలుపుచు నుండంగ నగ్ని♦సహితంబుగ భీ
తిలిన దివౌకసులందఱుఁ, గలసి తగన్ వచ్చిరల్ల ♦ కాననమునకున్. ౬ 830

క. చనుదెంచి తపము సల్పెడు, వనజాక్షునిఁ గాంచి భక్తిఁ ♦ బల్కిరి విష్ణూ!
వినుమా బలియొక యధ్వర, మొనరించెడు నది సమాప్తి ♦ నొందకయుండన్.

క. మనకార్యము నెఱవేఱెడు, పనిఁ జూడుము బలియు నర్థి♦పటలమ్ములు కో
రిన దెద్దియైన నొసఁగును, గనుకన్ యాచకులు పోయి ♦ కాంచెదరతనిన్. ౮

క. తనుఁజూడవచ్చు యాచకు,లను సత్కారమ్ము మీఱ ♦ లాలించు విరో
చన తనయుఁ డింక వామన,తను మాయాయోగమూని ♦ తాల్పుము దేవా!.

క. సురకార్యము నెఱవేర్పుము, గురుతరభవదీయమాప♦గోపనమున ని
ర్జరవర్య! మంగళము మా,కరసి తమిం గూర్పు మనుచు ♦ నర్థించి రొగిన్. ౯

ఆ. అట్టియవసరమున ♦ నదితిని గూడి కా,శ్యపుఁడు జ్వలనుకాంతి ♦ నలరువాఁడు
వాసుదేవుఁ గూర్చి ♦ భార్యాసహాయుఁడై, తపము సలిపె నిష్ఠ ♦ దనరునట్లు.

సీ. వేయిదివ్యాబ్దముల్ ♦పాయక నియమంబుతపము సల్పుచు జనా♦ర్దనునిఁ దృప్తి
నందించి చాలించె ♦ నప్పుడు వరదుఁడౌ కమలాక్షుఁడెలమి సా♦క్షాత్కరింపఁ
గనులపండువు గాఁగఁ ♦ గాంచి నుతించె నో పరమాత్మ! నీవు త♦పస్స్వరూపుఁ
డవు సత్తపోమయుం♦డవు తపోరాశివి తపమె నీయాత్మగాఁ ♦ దనరుచుండఁ

తే. గడిఁది నిష్ఠచేతఁ ♦ గావించు తపమునఁ, గాంచినాఁడ నిన్నుఁ ♦ గమలనాభ!
పురుషవరుఁడవీవు ♦ పుండరీకాక్ష! నీ,తనువునందె కాంచె♦దన్ జగముల. ౧౨

క. ఆదియు నంతము లేకయె, యోదేవా! వెల్గుచుండు ♦ వాఁగి నిట్టి దయా
నీదగు మహిమ మటంచెవ,రేఁ దలఁపఁగ రాకయుండు ♦ వీవు మహాత్మా!. ౧౩

తరళము. శరణుఁజొచ్చితి నట్టిఁడౌనిను ♦ సారసాయతలోచనా !
పరమపూరుష ! యంచు నివ్విధిఁ ♦ బల్కినన్ విని ప్రీతుఁడై
హరివచించెను ధూతపాపుని ♦ నమ్మునిం గని నీవికన్
వరము లొందఁగఁ బాత్రుఁడౌదువు ♦ వరమదెట్టిదొ యిచ్చెదన్. ౧౮ 838

క. నీకున్ శుభమెప్పుడు నగుఁ,గాక యటంచనినఁ దమిని ♦ గాశ్యపుఁడను ని
ట్లో కమలాక్షా ! దేవా, నీకమునకు నదితి యనెడు ♦ నెలఁతకు నాకున్. ౧౯

క. వర మొసఁగఁదగుదు భక్తుల,నరయుచు రక్షింతువో ద♦యామయ ! కావున్
బరికింపు మద్ది యేదన, సురరిపు హననంబుసేయ ♦ సుతుఁడవు గమ్మా !. ౧౯౪

తే. నాకు నదితికి నీవు సం♦తానమైనఁ,గాని నాకోర్కి కొనసాగ♦దో నతార్తి
భంజనా ! దేవపతియైన♦వాసవునకుఁ, జిన్నితమ్ముఁడ వగుమయో♦కన్నతండ్రి !.

క. సురవర్యున కనుజుఁడవై, శరణాగతులగుచు శోక♦సంతప్తులు నా
సురలకు సాహాయ్యముఁ జే,యరతిం గొనవయ్య ! దాన♦వాంతక ! విష్ణూ !.

తే. నీకరుణ నిందు ఫలియించె ♦ నాకుఁ దపము
గాన సిద్ధాశ్రమంబను ♦ ఖ్యాతినందఁ
గలదు, దేవేశ ! యిచ్చోటు ♦ కమలనాభ !
యిఁక నవతరింపఁగా లెమ్ము ♦ ప్రకటశక్తి. ౧౬ 843

సీ. అంతమహాతేజుఁ♦డౌ విష్ణువారీతి వామనరూపంబుఁ ♦ బరమసమ్మ
దమ్మునఁ దాల్చి త్రి♦దశమాతయై పొల్చు నదితికిఁ దనయుఁడై ♦ యంత బలిని
గానఁగాఁ జని యభి♦మానంబు విడనాడి మూఁడుపాదమ్ముల ♦ భూమినిమ్ము
దానవేశ్వర ! యని ♦ తగ బిచ్చమడిగి లోకాత్మకుండగుట లో♦కాళి నాక్ర

తే. మించి భూతాళికి హితంబు ♦ నెంచి మూఁడ
వదగునడుగును గొలువంగ ♦ వసుధ లేమిఁ
దేజమున బలిదైత్యుబం♦ధించి లోక
ములను మరల మహేంద్రున ♦ కెలమి నొసఁగె. ౨౦౪ 844

క. శతముఖువశమున నె జగ,త్త్రితయము వెలయంగఁ జేసె ♦ దేవాధిపుఁ, డు
ద్ధతినిట్లు దేవకార్యము, చ్యుతినొందక యుండఁ జేసి♦యొప్పె హరియుఁదాన్.

తే. వామనుఁడు తొల్లి సంసార♦బాధలడఁచు, నీమహాశ్రమమున వసి♦యించె నేను
భక్తిని దదాశ్రమమున ని♦వాసమొప్పఁ, జేయుచున్నాఁడ, సత్తప♦స్సిద్ధిఁగోరి.

క. క్రతువిఘ్నకరులు దైత్యులు, జతనము మీఱంగ నిటకె ♦ చనుదెంతురు నీ
వతి దుష్టులవారల, నుద్ధతిఁ జంపఁగఁ దగును బురుష♦తల్లజ ! రామా !. ౨౩

క. అనుపమసిద్ధాశ్రమమున,కును బోవుదమిప్పుడే ర♦ఘుప్రవర ! తగం
గనఁబడు నాశ్రమ మది నా,కును బోలె న్నీకు ధనమ♦గున్ గద యనుచున్.

-ఀ రామాదులు సిద్ధాశ్రమమును జేరుట ఀ-

కవిరాజవిరాజితము.

ఇరువురఁ దోడ్కొని ♦ యెంతొ ముదంబున ♦ నేగిక నెంబడ♦మిల్లు మునీ
శ్వరుఁడు పునర్వసు♦భంబులఁ గూడి తు♦షారము మాసినఁ♦జాల మనో
హరశశిఁ బోలుచు ♦ నప్పుడు వెల్గిన ♦ నాతనిఁ గాంచి త♦దాశ్రమనుం
దిరులగు మౌనులు ♦ నెమ్మినెదుర్కొని ♦ దృష్టిగ సల్పిర♦తిప్రియముల్. ౨౬

తే. సత్వరంబుగఁ జనుదెంచి ♦ జ్ఞానిదైన
కౌశికుని భక్తిఁ బూజించి ♦ క్ష్మాపతిసుతు
లకును విధియుక్తముగఁ బూజ♦లనొనరించి
రతిథులకుఁ జేయఁదగునట్టు ♦ లాదరమున. ౨౭ 850

క. అరిజన శిక్షకులౌ రఘు,వరు లొక్కముహూర్తమందు ♦ వసియించి మునీ
శ్వరుఁ జూచి కేలుమోడ్చిచి, గురువర ! మఖదీక్షఁగొనుము♦కోరిక నేఁడే. ౨౮

సీ. అంతరాయములు లే ♦ కయ్యది నెఱవేఱు; యజ్ఞ మీయది సిద్ధి♦నందుఁగాన
సిద్ధాశ్రమం బిద్ది ♦ చెలఁగును గాత సార్థకనామమయి దుష్ట♦దనుజులిందు
విధ్యలంచనిన నీ♦వచనం బమోఘమై వెలయుగాతనుటంచుఁ ♦ బలుక నిద్ధ
తేజుఁడై యొప్పు గా♦ధేయుండువిజితేంద్రియుఁడునియతుండునై ♦హోమకృత్య

తే. మునకుగా దీక్ష నప్పు పూ♦నినఁ గుమారు
లిర్వురును జాగరూకులై ♦ జరపి నిశిని
దెల్లవాఱినఁ దొలిసంధ్య ♦ నుల్లసులరఁ
గా నుపాసించి రవికి న♦ర్ఘ్యంబు లొసఁగి. ౩౦ 852

క. పరిశుద్ధములగు నంతః,కరణంబులు గలిగి నియతి ♦ గాయత్రి జపిం
చి రయమున మ్రొక్కి రమ్ముని,వరునకుఁ గృతహోమునకు స♦వప్రియమతిక్కిఁ.

ఇరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౦ - వ సర్గము.

-ఀ రాముఁడు మారీచాది రాక్షసుల జయించుట. ఀ-

చ. పరులనడంచు శక్తి పరి♦పాటిగ నొప్పఁగ దేశకాలవి
ద్వరులగు రామలక్ష్మణులు ♦ పల్కిరి తత్సమయానుకూలమై
పరఁగఁగ దేశముందెలిసి ♦ బ్రహ్మమునింగని యోమునీంద్ర ! య
ధ్వరమున నెప్పుడా దనుజ♦వారము నొంపఁదగుక్ పచింపుమా !. ౧౮ 854

తే. వారిబాధలఁ బడక య♦ధ్వరము సాగ
వలయు నందొక్కక్షణమైన ♦ వ్యర్థముగను

జరపరాదు గదా యని ♦ సమరవాంఛ
లలరఁ బల్కెడు నక్కుమా♦రులను గాంచి. ౨౫ 855

క. మునులెల్లఁ బల్కి రిట్లీ, దినమారంభముగ నాఱు ♦ దినములు దీక్షం
గని మౌని పలుకఁ డటు గా,వున మీరలు గావవలయుఁ ♦ బూనిక మీఱన్.

చ. అనవిని రాజపుత్త్రులు మ♦హాయశమొప్పఁగ నొప్పుచుంట నే
పున గతనిద్రులై తగఁ ద♦పోవనముద్ధతి నాఱురాత్రులున్
ధనువులఁ దాల్చి శత్రువుల ♦ దండనచేయఁగ సిద్ధయత్నులై
మునిపతిఁ గాచుచుండిరిటు ♦ ముప్పును బొందకయుండఁ గావఁగన్. ౬ 857

క. చనియెను బంచాహస్సులు, చనుదెంచెను షష్ఠమదివ♦సంబు రఘువరుం
డనుజన్ముతోడ నపుడి, ట్లనియెను సిద్ధముగ నుండ♦నగు హెచ్చరికన్. ౭ 858

చ. అనుజునితో వచించి యిటు ♦ లాతఁడు సంగరకాంక్షునుండ; నా
ఘనమఖవేది ఋత్విజుల ♦ కాండముతో మునితోడఁగూడి చూ
పునకనువై స్రుగన్వితము ♦ పూజ్యసమిచ్ఛమసాన్వితంబుఁ బా
వన కుశపుష్పముల్ నిగమ ♦ వాక్సముదాయము నొంచు నంతటన్. ౮౫ 859

తే. మండె నమ్మఖవర్యము ♦ మంత్రవంత
మగుచు శాస్త్రోక్తకృత్యంబు ♦ నగుచు సాగు
చుండఁగ భయంకరంబయి ♦ వ్యోమమందు
శబ్దమొక్కండు వీతెంచె ♦ సరభసముగ. ౧౦ 860

క. వినువీథిఁ గ్రమ్మి వర్షం,బునకుం దగు కాలమందు ♦ భూరిధ్వనితో
డను బయలువెడలు మేఘము,లనమాయంబూని యసురు♦లార్చుచుఁగడఁకన్.

క. కడువడి వచ్చిరి మారీ,చుఁడును సుబాహుండు వారి♦శూరభటులుఁ బెం
పడరఁగ భీమాకృతులై,ల్లెడఁ గనువారలకు భీతి ♦ యెంతయుఁ గలుగన్. ౧౨

క. చనుదెంచి రక్తవర్షం,బును గురియింపంగ వేది ♦ పూతస్రుజ్ఞు
ఖ్యనిఖిల వస్తువిరాజిత,ము నయ్యె నారక్తవర్ష♦మునఁ గడుమండెన్. ౧౨౫

క. (మునివేది యిట్లు మండుటఁ, గని క్రోధావేశమొప్పఁ♦గా రఘువరుఁ డ
య్యనుజన్ముతోడఁ బరుగిడి), కనుఁగొనియెన్ దివిని ఘోర♦కర్బురులనొగిన్.

చ. సరసిజనేత్రుఁ డయ్యసుర♦సంఘము పూనికఁ దన్ను మార్కొనన్
దురుసుగ వచ్చుచుంటఁ గని ♦ తోడనపల్కె సుమిత్రపుత్రుతో
సరగున మానవాస్త్రమిదె ♦ సాధువిరోధుల మాంసభక్షకా
దరులను దూలఁగొట్టెడి స♦దాగతి మేఘమునట్లు చూడుమా. ౧౪ 865

క. అని పలికి మెఱుఁగు లీనుచు, ఘనమగు నయ్యస్త్రమును ని♦కామక్రోధం
బున మారీచుని రొమ్మును,జని గాఁడఁగ నేసె బాణ♦*సత్తమ మదియున్. ౧౬

* గాయత్రీద్వితీయసహస్ర ప్రథమాక్షరారంభము.

చ. ఉరమును దాఁకి వాని శత♦యోజనముల్ గొనిపోయి సాగరాం
తరమున వైచె శీతతర♦తల్లజబాధితుఁడై విసంజ్ఞుఁడై
దిరుగుచుఁ బోయిపోయి జల♦ధింబడినట్టి సురారి నెన్నిసో
దరుఁ గని పల్కెఁ జూడుమదె ♦ ధర్మయుతంబగు మానవాస్త్రముల్. ౧౭

క. (తనమహిమవలన రాక్షసుఁ, గొనిపోయెఁ గాని జంపఁ♦గోరదు మూర్ఛన్
మునుగంగఁజేసె) మిగిలిన, దనుజుల నిర్ఘృణుల దుష్ట♦తం గను వీరిన్. 868

క. అతిపాపకర్మనిరతులఁ, గ్రతుహంతల రక్తపాన♦కాంక్షులనెల్లన్
బితృపతి పురమున కనిపెద, నితరాస్త్రములనె యటంచు ♦ నెంతయు శక్తిన్.

తే. అద్భుతంబగు నాగ్నేయ♦మను మహాస్త్ర
మును ధనుస్సునఁ గూరిచి ♦ మునులలరఁగ
నేఁచెడి సుబాహువక్షంబుఁ ♦ జూచివైచె
నద్ది నాటఁగ భువిఁ గూలె ♦ నసురవైరి. ౨౦ 870

క. వాయవ్యాస్త్రము దొడిగి మ,హాయశుఁడు నుదారుఁడు నగు ♦ నారఘువీరుం
డాయసురుల మృతశిష్టులఁ, బాయక వధియించె మౌని♦వరు లలరంగన్. ౨౧

మ. క్రతువిఘ్నంబును జేయు రాక్షసుల నా♦రాముండు చక్కాడ ను
ద్ధతులన్ రక్కసులన్ వధింప సురసం♦తానంబు దేవేంద్రు, నే
గతిఁ బూజించిరో యట్టులే మునులసం♦ఘంబప్డు పూజించె నా
క్షితినాథాత్మజు నంత నధ్వరవిధుల్ ♦ చెల్లంగ గాధేయుఁడున్. ౨౨ 872

క. నిరుపద్రవమౌ దిక్తతిఁ, బరికించి రఘుప్రవీరుఁ ♦ బలికె రఘుకులా
భరణా! నీదోర్బలమున, జరగెను యజ్ఞంబు శాస్త్ర♦సమ్మతమగుచున్. ౨౩

క. గురువచనం బొనరించితి, వరయఁగ సిద్ధాశ్రమంబు ♦ సార్థకమగుచున్
ధరణి నెసంగఁగఁ జేసితి, వురుతర తావకయశంబ♦దొప్పు స్థిరంబై. ౨౪ 874

ముప్పదియవ సర్గము సంపూర్ణము.

---

## ౩౧ - వ సర్గము.

-ஃஃ విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులం దోడ్కొని మిథిలకుఁ బ్రయాణము సేయుట. ஃஃ-

చ. పితృవచనానుసారముగ ♦ విశ్వహితుండగు నమ్మునీంద్రు న
త్క్రతువునఁ దారుచేయఁదగు ♦ కార్యములన్ నెఱవేర్చి మానసం
బతిముదమంద వీరులగు ♦ నారఘుపుంగవులందు రేయి న
మ్మతి దనరారఁ బుచ్చి రవి♦మండలచిహ్నము లంకురింపఁగన్. ౧ 875

క. ఉదయంబునఁ దామొనరుపఁ,గఁ దగిన కృత్యములఁ దీర్చి ♦ కలిసి యిరువురొ
ప్పు దలిర్పఁగ విశ్వామి,త్రదర్శనము చేయ, మౌని♦తల్లజులఁ గనన్. ౨ 876

చ. చనియటఁ బ్రజ్జ్వలద్దహను♦చాడ్పున తేజము వెల్గ మించు న
మ్మునికిఁ బ్రదక్షిణంబుగను ♦ మ్రొక్కి మృదూక్తులఁ బల్కిరిట్లు మీ
యనుమతిఁ దీర్చివచ్చితిమి ♦ యానతి యిండికఁ గార్యమేమి మే
మొనరుప నర్హమో? మదికి ♦ నొప్పినరీతిఁ దలంచి కౌశికా!. ౫ 877

ఆ. మీకుఁ గింకరులము ♦ మీరు పంచినయట్లు
చేయువారమనుచుఁ ♦ జెప్ప మధుర
భాషణులగు వారి ♦ పల్కులు విని గాధి
తనయు నాజ్ఞయెల్ల ♦ మునులు ప్రీతి. ౫ 878

క. మనుజవరా! మిథిలాపతి, జనకుఁడు ధర్మిష్ఠమైన ♦ జన్నము సేయం
గను బూని యున్నవాఁడది, కనుఁగొనఁబోయెదము నీవు♦క్రతువును జూడన్.

ఆ. మమ్ముఁ గూడివచ్చి ♦ మైథిలు గృహమున, నచ్చెరువుగఁ గాంచ ♦ నర్హమైన
మేటిచాపమొండు ♦ మెఱయు నద్దానిని, గాంచవలయు దాని♦కథను వినుము.

క. పరశంకరుండు దక్షా, ధ్వరమాచాపమును బూని ♦ ధ్వంసము చేసెన్
సురలంత సోమశంకరుఁ, బరితుష్టునిగా నొనర్చి ♦ పడసిరి దానిన్. 881

ఆ. దేవరాతుఁడనెడు ♦ భూవిభుండధ్వర,మందు సురలమోద♦మందఁజేయ
దాని దివిజులా స♦దస్సున నిడి చని, రదియె జనకునింట ♦ నలరుచుండు. ౭౪

క. వినుమింతనరాని బలం,బునఁ దగి భీతిదమునగుచుఁ ♦ బొల్చెడు తేజం
బున వెల్గుచుండు నెక్కిడఁ,గనేర రద్దాని దివిజ♦కాంతులు దనుజుల్. ౮ 883

క. రక్కసులును గంధర్వులు, నెక్కిడఁ జాలరన నింక ♦ నెవ్విధిమనుజుల్
అక్కార్యమునకుఁ జాలుదు, రిక్కాలపుఁ జర్యవినుమ♦హీనబలాఢ్యా!. ౯

చ. ధరణివరాత్మజన్ములు ని♦తాంతబలాఢ్యులు వచ్చి యమ్మహా
త్తరధనువందుఁ గల్గు పటు♦తంగనఁ బూనియు నెక్కుపెట్టనే
రరు నరపుంగవా! జనక♦రాజగృహంబునఁ జూడ నొప్పి య
చ్చెరువుగఁ దోఁచు నాధనువు ♦ శ్రీకరముం గను మాత్మరంజిలన్. ౧౧ 885

తే. మఱి యచటికీవు వచ్చిన ♦ మఖముఁజూడ
నౌ నదియు నద్భుతంబుగ ♦ నగపడు రఘు
వంశముక్తామణీ! చాప♦వర్య మద్ది
శుభతరాయత లస్తక♦శోభితంబు. ౧౧౪ 886

సీ. యజ్ఞఫలంబుగా ♦ యాచించె దానిని జనకుండు సుప్రీత♦శంకరాది
దేవవర్యులు మున్ను ♦ పావనంబగు దాని వారొసంగిరి నర♦వరుని యింట
నమ్మేటికోదండ ♦ మాయుధోత్సవముల యందెల్ల వివిధగం♦ధాదికముల
నగరుధూపంబుల ♦ నర్చింపఁబడుచుండు నని రామునకుఁ జెప్పి; ♦ రవల మౌని

తే. మునిసమూహము దశరథ♦తనయులు దన
వెంటరాఁగఁ బ్రయాణమై ♦ వెడలుతఱిని
నచటివనదేవతలఁ బిల్చి ♦ యనియె మీకు
భద్రమగుఁగాత మోవన♦వాసులార!. ౧౮ 887

క. సిద్ధించెఁ గార్యమిట నీ, సిద్ధాశ్రమవసతి వదలి ♦ చేరెద నిపుడే
యుద్ధతమ జహ్నుతనయా,పద్ధతిఁ జని యుత్తరమునఁ ♦ బ్రాలేయాద్రిన్. ౧౯

చ. అని వచియించి వారిఁ గొని♦యాడుచు వీడ్కొని సిద్ధనామమై
తనరెడు నాశ్రమంబునకుఁ ♦ దాను బ్రదక్షిణ మొప్పఁజేసి పా
వనమగు నాస్థలిన్ విడిచి ♦ వారలతోఁ బయనంబుచేసె న
మ్మునిపతి; యుత్తరంబునకుఁ ♦ బోయిరి యాతనివెంట రాఘవుల్. ౧౬ 889

ఆ. మఱియు బ్రహ్మవాది♦మండలంబాత్మీయ, వహ్నిముఖ్యయాగ ♦ వస్తువితతి
శకటశతమునిండఁ ♦ జయ్యనఁగొనిపోయెఁ, బ్రాయికముగ మౌని♦వరుని వెంట.

చ. వనమునఁనందు నుండు మృగ♦వాజిగణంబులు దివ్యచిత్తుఁడౌ
మునిపతితోడ భక్తిమెయిఁ ♦ బోయె నతండు మరల్చె వానిసం
తనతఁడు వారితోఁ జనియెఁ ♦ దవ్వయి దూరము సూర్యుఁ డప్పుడ
స్తనగము చెంతకేగఁగ న♦దంబగు శోణను గాంచి యందఱున్. ౧౯౪ 891

తే. దానితటమున వసియించి ♦ తానమాడి
రవియుఁ గ్రుంకిన నగ్నిహో♦త్రముల వేల్చి
యమితతేజంబులం బోల్చి ♦ రపుడు కౌశి
కుని దమింగూడి కూర్చుండి ♦ రనఘసుతులు. ౨౦౪ 892

క. రాముండును సోదరయుతుఁ, డై మౌనులకంజలి యిడి ♦ యటమునిపతియై
ధీమంతుఁడైన యవ్విశ్వామిత్రుని నికటమందు ♦ సమధికభక్తిన్. ౨౧౪ 893

క. ఉపవిష్టుఁడగుచుఁ దేజం, బపరిమితముగాఁ జెలంగ ♦ నమ్మునిచంద్రుం
దపనాభతేజుఁ గని మో,దపరాయత్తాత్ముఁ డగుచుఁ ♦ దాఁ బ్రశ్నించెన్. ౨౨౪

తే. వనసమృద్ధులచేఁ జాల ♦ భాసిలుచు న
యనములకుఁ బండువుగనున్న ♦ యట్టి దేశ
మిదెవరిదో వినఁగోరెద ♦ నెఱుఁగఁ జెప్ప
వయ్య, గురువర్య! మీకు శ్రే♦యస్సు వెలయు. ౨౩౪ 895

క. అని యడిగిన నారాము వ,చనములకు సదుత్తరంబు ♦ సంపూర్ణముగా
మునిమధ్యస్థితుఁడై తప,మునఁ జాలప్రసిద్ధిఁగన్న♦మునియిటుచెప్పెన్. ౨౪౪

ముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

## ౩౨ - వ సర్గము.

కుశ కుశనాభుల వృత్తాంతము.



తే. బ్రహ్మపుత్త్రులలో మేలు♦బంతి తపసి
కుశుఁడు నిర్బాధకవ్రత♦కుశులుఁ దక్షుల
ధర్మవిదుఁడొప్పు సుజనసం♦తతిని బూజ
నలరఁ జేయుచు సుగుణాఢ్యుఁ♦డగుచు మున్ను. ౧ 897

క. అతఁడును రూపకులగుణా,న్వితయగు వైదర్భియందు ♦ విపులసుగుణసం
తతినొప్పి తనకు నీడగు, సుతులను నల్వురను బడసె ♦ సుతులవ్వారల్. ౨

సీ. యశమొప్పఁగఁ గుశాంబ♦కుశనాభులాధూ ర్తరజసుఁడువసువుమా♦ర్తాండ తేజు
లసదృశవిక్రము♦లయి భూస్థలంబునఁ దనరుచుండఁగ మహో♦త్సాహులైన
తనయవర్యుల మహా♦ధర్మిష్ఠులను సత్యవాదులఁ గని తండ్రి ♦ స్వకులధర్మ
మగు ప్రజాపాలన ♦ మ్మనువొందఁజేయంగఁ గోరి పుత్త్రకులార ! ♦ మీరలలోక

ఆ. పాలనంబుసేసి ♦ పడయుఁడీ పుష్కల, ధర్మముల నటంచుఁ ♦ దండ్రియిట్లు
పలుక లోకసమ్మ♦తులగు నానల్వురు, పురనివేశములను ♦ బుద్ధి నెన్ని. ౩ 899

సీ: నిర్మించుకొని రందు ♦ నిర్మలగుణుఁడు, కుశాంబుఁడు గట్టెఁ గౌ♦శాంబిపురము
ధర్మాత్ముఁడనుకీర్తిఁ ♦ దనరెడు కుశనాభుఁ డలవరించెమహోద♦యాఖ్యపురముఁ
గట్టె ధర్మారణ్య♦కమ్మునా ధూర్తరజసుఁడు గిరివ్రజ♦సత్పురంబు,
వసువు నిర్మించె నీ♦వసుమతి మతిమంతుఁడైన యవ్వసురాజు ♦ దగును జుమ్ము



తే. పర్వతశ్రేష్ఠములివియే ♦ పంచసంఖ్య
నవనిఁజుట్టి ప్రకాశించు ♦ నల్లనదియ
మాగధియను నుతింగని ♦ మగధదేశ
మును ప్రవేశించి యలరారుఁ ♦ గనుము రామ !. ౪ 900

క. ధరణిధరపంచకము, నం,తరమున మాగధియుఁ బూల♦దండవిధమునఁ
గరమురుదుగఁ జెలఁగెడు దా,శరథీ ! యిది వసుమహీశ♦చంద్రుని దెసుమా. ౫

క. ఇరుప్రక్కల సుక్షేత్రము, లరుదగు పైరులును వెలయ ♦ నానది కను దా
శరథీ ! పడమర కేగెడు, సరగునఁ దూరుపుననుండి ♦ చతుర్హితమై. ౧౦ 902

తే. ధర్మబుద్ధియు రాజర్షి♦తల్లజుండు
నైన కుశనాభుఁడను భూపుఁ♦డా ఘృతాచి
యందు నుత్తమకన్యల ♦ సుందరాంగ
ములను దగువారి నూర్వుర ♦ నెలమిఁ బడసె. ౧౧ 903

చ. పరువము రూపముం దనర ♦ భాసురభూషణరాజిఁ దాల్చి య
త్తరుణులు చందనంబు సుమ♦దామములం గయిసేసి కొంచుఁ దో

క్కురిమెఱుపుల్ చెలంగుగతిఁ ♦ గాయము లొప్పఁగఁ బుష్పవాటికాం
తరమును జొచ్చి యందుఁగల ♦ నాదము లొప్పఁగఁ బాడి యాడుచున్. ౧౨౪

తే. వీణియల మీటుచుం జిత్త♦వృత్తి కొలఁదిఁ
బరమసన్మానమునఁ దేలి ♦ వఱలుచుండి
రిట్లు సకలాంగసౌందర్య ♦ మెసఁగుచుండ
ననుపమానంబు తనరార ♦ నలరుచుండి. ౧౩౪ 905

ఉ. ఆయెలదోఁటలో నిబిడ♦మై తనరారెడు వృక్షపంక్తిలో
నాయెలనాగ, లంబుదగ♦ణాంతరమందు వెలుంగు చుక్కల
ట్లాయెడఁ బొల్పమీఱి సుగు♦ణావళి మించుచు నందమొప్పఁగాఁ
బ్రాఁకుము చెల్వమీఱ నల♦రంగని వాయువు సంతసంబునన్. ౧౪ 906

తే. తాను సర్వాత్మకుండౌటఁ ♦ దగుణ లచట
వెలయుచుండుటఁ గాంచి యో♦ వెలఁదులార!
కోర్కి మీపైనఁ గలిగె నా♦కు నిఁక మీర
లెల్ల భార్యలు గండు నా♦యుల్లసములకు. ౧౪౪ 907

చ. మనుజులకున్ దివౌకసుల ♦ కుం జలికెట్లు వివాహసిద్ధియౌ
నని మది శంకనొందవల♦దంబుజహాసనలార! మీరలీ
మనుజత వీడి నిర్జరస♦మంబగు నాయువుఁ గాంత్రు యౌవనం
బనునది చంచలంబు గన ♦ యయ్యది మర్త్యులయందు నెన్నఁగన్. ౧౬౪

క. అతిచంచల మటుగాన వ,నితలారా! నన్ను మీరు ♦ నెమ్మి దలిర్పం
బతిఁగా జేకొనినంత నె, చ్యుతినొందని యౌవనంబు ♦ చొప్పడు మీకున్. ౧౭

తే. అంతమాత్రమె కాదు మీ♦రమరవనిత
లగుదురని చెప్పఁ జెప్పిన♦యట్లె చేయు
శక్తిగల వాయుదేవుని ♦ సరసవచన
పటలముల్ విని కాంతలు ♦ పరిహసించి. ౧౮ 910

చ పలికిరి నిర్జరోత్తమ! ప్ర♦పంచమునం గల భూతపంక్తిలోఁ
పలఁ దగఁ బ్రాణరూపమున ♦ వర్తిలుచుందువు నీవటంచు ని
మ్ములఁ నెఱుఁగంగఁ జాలెదము ♦ ముం బవనా! యవమానమొందఁగాఁ
బలుకఁగనేల? మమ్ముఁ దలఁ♦పం జనుశక్తిధురీణులంచెదన్. 911

తే. ఎఱుఁగుమా? కుశనాభుని♦కేము పుత్రి
కలమటంచుఁ బ్రభంజన! ♦ కాన నిన్ను
నీకుఁ బ్రభువగు దేవేంద్రు♦నిం దగ నధి
కారమునుండి తొలఁగింపఁ ♦ గలము సుమ్ము. 912

క. వినుమప్పని మే మొనరిం,చిన నన్నదుర్భరితపము ♦ చెడుఁ గావున దా
నిని గాప నూరకున్నా,మని మఱియును వార్గలనిరి ♦ యవ్వాయువుతోన్,

క. జనకుఁడు నీయీ దుర్బుద్ధి నెఱుంగునయేని నీకుఁ ♦ దీక్ష్ణాంతకుఁడౌ
జనకుండట్టిఁడు కాకుం,డనుగాక మఱొక్కపల్కు ♦ మఁక విన వయ్యా .. ౨౦

ఆ. సత్యవాదియైన ♦ జనకుని దుర్బుద్ధి, చే నగౌరవంబు ♦ చెందునట్లు
పలుకకుండవయ్య ! ♦ యెలమి నెవ్వని కతఁ, డిచ్చు నతనిఁబతిఁగ ♦ నెంతుమేము.

క. జనకుఁడు కన్యాదానం,బును జేయుట ధర్మ మట్లు ♦ తండెవనికి నరి
మ్ము నొసంగునొ యవ్వరుని నె,గనుఁగొన నెమ్మనములందుఁ ♦ గాంక్షింతుము సూ.

తే. తండ్రియే ఱేఁడు పరదైవ ♦ తంబు మాకుఁ
గాన నతఁడెవ్వనికి మమ్ముఁ ♦ గాంక్షనొసఁగు
నతఁడె మాకగు భర్తయం ♦ చనిన వాయు
వతిసమర్థుఁడు గాన న ♦ త్యాగ్రహమున. ౨౧ 917

సీ. వారలయవయవ ♦ వారంబులం జొచ్చి గుజ్జురూపంబులఁ ♦ గూడునట్లు
గాఁ జేసె; (నప్పుడా ♦ కాంతలరత్నిమాత్రాంగముల్ గలిగి గ ♦ ర్వాతిరేక
మునుమానియతిభయం ♦ బునఁగుంది) పవమానకృతనాపనతతమ ♦ కెంతొయా
నింపఁగాఁ గుశనాభు ♦ నిలుసేరి కన్నీరు కాలువలై పాఱఁ ♦ గాఁ దపించి [త్రి

తే. సిగ్గుఁ దత్తఱపాటును ♦ జెంది భూమిఁ
బడిరి కుశనాభుఁడెంతయు ♦ భాసమాన
♦ తనువులం బొల్చు తనముద్దు ♦ తనయలిట్లు
భంగముం గాంచి దీనత ♦ వచ్చుటఁ గని. ౨౨ 918

క. తనమనముత్తలపాటును, గని సంచలతం గనంగఁ ♦ గన్యకలారా!
కనఁ జోద్య మిద్దియేమొకొ, యనుమానము వీడి తెల్ప ♦ నగు నాకెల్లన్. ౨౩

క. అవమానపఱచె ధర్మము, నెవఁడివ్విధి వామనత్వ ♦ మేర్పడఁ జేసెన్
అవమతి గుంపుగ నొకమా,ట పచింపక యూరకుండు ♦ టకు గతమేమో. ౨౪

తే. అనుచుఁ గుశనాభభూపాలుఁ ♦ డాత్మజలను
గాంచి పరితాపమునఁ బల్కి ♦ కన్యలేమి
చెప్పుదురొ దానివిను వేడ్క ♦ చేత నుండె
మనసు నిలుకడ నొందిన ♦ మాడ్కినంత. ౨౫ 921

ముప్పది రెండవ సర్గము సంపూర్ణము.

---

## ౩౩ - వ సర్గము.

### బ్రహ్మదత్తుని చరిత్రము.

క. మతిమంతుఁడు కుశనాభ, క్షితినాథుఁడు ప్రేమమీఱఁ ♦ జెప్పిన వాక్య
ప్రతతిన్ విని స్వశిరంబుల, నతనిపదంబులకు మ్రొక్కి ♦ యతిభక్తిమెయిన్. ౧

క. పలికిరి నివ్విధి కన్యక, లిలాధినాయకునితోడ ♦ నిట్లని తండ్రీ !
కలఁడుగదా సర్వాత్మకుఁ, డలఘుబలుండనిలుఁడతఁడె ♦ యవమానించెన్. ౧౪

క. వినుమది యెవ్విధమన్నన్, గనందు బలవంతపఱుపఁ♦గా ధర్మముగా
దను దాని, నదియు మంగళ, మనియును బలవంతుఁడౌట ♦ నాతఁడు తండ్రీ !.

ఆ. అట్టి యశుభమార్గ♦మందుఁ దా నిరతుఁడై
ధర్మమును రవంతఁ ♦ దలఁపఁ డయ్యె
నతనితోడ నంటి ♦ యప్పుడు తండ్రి మా
కున్నవాఁడు; జనకు ♦ నుజ్జగించి. ౨౪ 925

క. పతిఁ గోరెడునట్టి స్వతంత్రతఁ బూనఁగలేదు మేము ♦ తండ్రిఁగని సదా
గతి! నీవె వేఁడికొమ్మా, యతఁడొసఁగిన మము గ్రహింప♦నర్హతగలుగున్. 3

తే. నీకుఁ బవనా! శుభంబగుఁ♦గాక యనుచుఁ
బలుకు మామాటలను విన♦కలఘుపాప
మనుసరింపఁగ నమ్మల్ల ♦ నాతఁడిట్లు
నవనతిం బొందఁ జేసెనో♦యయ్య! యనిన. ౮ 927

క. గురుపౌరుషమున నొప్పియు, ధరణీపాలకుఁడు పరమ♦ధార్మికుఁ డగుటన్
దరుణులవాక్యములన్ విని, మరుత్తుపై నలుగకనియె ♦ మహిళలతోడన్. ౯

క. ఓరుపుఁగలవారలు తమ, కేర్పడనను గీడుసేసి♦రేని ప్రతికృతిన్
వారికిఁ జేయక యెంతయు, నోరుపు నొందుటయె యప్పు♦డొప్పుం జుండీ. ౯౪

ఉ. కావున మీరలిత్తఱిని ♦ గార్యము గొప్పగఁ జేసినారలో
పావనచిత్తలార! యొకే♦భంగిన నందఱుఁగూడి వంశముం
గావఁగఁ జేయఁగాఁదగిన♦కార్యమొనర్చితిరింతె చాలు నో
ర్పే పరభూషణంబుగద ♦ యెంచఁగ స్త్రీలకుఁ బూరుషాళికిన్. ౬౪ 930

క. క్షమ చూపుటయే కష్టము, సుమహిత రూపాత్తవిభవ♦శోభితులగు న
య్యమరులు తప్పొనరించిన, సమయంబునఁ గష్టతరము ♦ క్షమనుం బొందన్.

ఆ. అంతకంటె మీర♦లందఱు నొకరీతి
క్షమను జూపుటధిక♦కష్టమగును
యజ్ఞ, దాన, సత్య, ♦ యశముల, ధర్మంబు
వలనఁగలుగు ఫలము ♦ గలుగు క్షమను. ౭౪ 932

సీ. కానఁ బుత్రికలార! ♦ క్షమయె యశస్సత్య, యజ్ఞదానంబుల♦ట్లమలధర్మ
మునగు; నోరుపుగల్గు♦టనె చరాచరజగంబును భూమిపైనుండు ♦ ననివచించి
యమరవిక్రముఁడైన ♦ యక్కుశనాభుండు కొమరితల నివ్వడఁ♦గొలిపి యంతఁ
గార్యమాలోచింపఁ ♦ గడుఁ గుశలుండౌటచేతఁ గన్యాదాన♦మే తెఱఁగునఁ

తే. జేయఁదగు సత్కాలంబును ♦ బ్రాయముమొద
లైన గుణములుఁగల్గిన ♦ వానికెవని
కీయఁదగు వీరినంచని♦యెంచి మంత్రి
వరులతోఁగూడి యోజించెఁ ♦ బ్రజ్ఞమెఱయ. ౯౪ 933

సీ. ఏ దేశమునయందు ♦ నేకాలమున వీరి నీయంగఁ దగునంచు ♦ నెన్నికమదిఁ
బుట్టఁగా మంత్రిస♦మూహమ్ముతోఁగూడి కార్యమాలోచించు ♦ కాలమందు
నూర్ధ్వరేతస్కుఁడై ♦ యురుతరమంగళాచారుఁడై చూళియన్ ♦ పేరఁబరఁగు
మునివర్యుఁ డొక్కఁడు ♦ మోదంబునన్ వేద, సమ్మతతపము ని♦ష్ఠ నొనరించు

తే. చుండె నక్కాలమునయందు ♦ నూర్మిళయను
దానికూఁతురు సోమద♦మాననీయ
చరితగంధర్వవనిత య♦చ్చటికి నేగి
యతనిసేవించె రామ! నీ♦కగు శుభంబు. ౧౨ 934

క. మునిపతికి మ్రొక్కి ధర్మం,బున నిరతింగల్గు నాతి♦మునియాశ్రమమం
దెనివాసము చేసి మహో, వినయమునన్ గొల్చుచుండె ♦ వేడుకమీఱన్. ౧౨౪

క. కొలఁది దినంబుల కమ్ముని, కలరెన్ సంతుష్టి దేవ♦తాంగనయెడ నా
యెలనాగచేయు సేవా, ఫలమగు కాలంబు రాఁగఁ ♦ బ్రమదము మీఱన్.

క. సురకన్యం గని సేవా, నిరతికి సంతుష్టి గలిగె ♦ నీకు శుభంబౌఁ
దరుణీ! నీకుం బ్రియముగ, జరపందగు కార్యమెద్ది ♦ చయ్యనఁ జెపుమా. ౧౮

క. కోరినకోరికఁ దీర్చెద, నారీమణి! యనిన మౌని♦నాథుని మదిలోఁ
గూరిమిగలిగెఁ గదాయని, చారుగళస్వనము తనరు♦చాన యెఱింగెన్. ౧౮౪

క. మాటలనేర్పునఁ దనరెడు, బోటి! యిదే సమయమనుచుఁ♦బొంగి వచించెన్
మాటలయందసదృశమగు, పాటవమున నలరు మౌని♦పాలకుతోడన్. ౧౫

తే. బ్రహ్మవర్చస్సుచే నెల్ల♦వారి మించి, బ్రహ్మతుల్యుఁడవై తపో♦రాశివగుచుఁ
దనరుచుందువు ధార్మికో♦త్తమ మహాత్మ!, యట్టి నీవిగదే నాకు♦నాత్మజన్మ.

క. తనయుండు బ్రహ్మశక్తిని, గనువాఁడుగ నుండవలయు ♦ త్మౌనుఽరమౌనీ!
విను భర్తలేని నన్నుం, గని యెంచకుమయ్య! విధవఁ♦గా నీమదిలోన్. ౧౬౪

తే. నీకు శుభమగు మునివర్య! ♦ నాకునింత
దనుకఁ బురుషుండు లేఁడిపు♦డును దలంప
భార్యగానేరికైన నే♦బ్రహ్మచారి
ణిగనె యుండుదు నిష్ఠచేఁ ♦ దగి మహాత్మ!. ౧౬౪ 942

క. మునివర! శరణుం జొచ్చితిఁ, గనుకఁ దపశ్శక్తి నాకుఁ ♦ గరుణింపు మీఁకం
తనయునన్ బ్రహ్మర్షియుఁ, దనయుఁ బ్రసన్నుఁడయియిచ్చెఁ♦దనమానసజున్.

ఆ. బ్రహ్మదత్తుఁ డనఁగ ♦ బరఁగెఁ జూళికుమారుఁ
డన్ను రాజకులజ ♦ యాట నాతఁ
డట్టివాఁడె యయ్యె ♦ నటఁ గుశనాభుండు
దనయులను నొసంగఁ ♦ దలఁచునపుడు. ౧౮ 944

సీ. సోమదాంబకు నాత్మ♦జుండగు నాబ్రహ్మదత్తుండు స్వర్గప♦త్తనమునందు
నతిశయిల్లు విభూతి ♦ నలరు నింద్రునిబోలి కాంపిల్యపురమునఁ ♦ గడుసమృద్ధి
నివసించియుండె సు♦నీతిచే మించు నాకుశనాభభూపాల♦కుండు బ్రహ్మ
దత్తునికిం దన♦తనయల నూర్వుర నియ్యఁదలంచి యా♦నృపవరేణ్యుఁ

తే. బిలువఁగాఁ బంచి నెమ్మది ♦ ప్రియమునొందఁ
దనదు తేజంబు దీపింప ♦ ధర్మబుద్ధి
నొసఁగె శక్రసమానుఁడౌ ♦ యుర్విభుఁడు
వారిఁ బెండ్లాడె గ్రమము త♦ప్పక ముదమున. ౨౨ 945

చ. తమకరముల్ మహీవిభుఁడు ♦ తాఁకినయంతనె వారు కుబ్జభా
వమును ద్యజించి తాపమును ♦ బాసి యెసంగెడు కాంతియు క్షేమ
సమున్నత గానుపింపఁ జెలు♦వారిరి వాయువిముక్తలైన యా
ప్రమదలఁ గాంచి తండ్రి గుణ♦వర్ణ్యని నాథునిఁ బొందిరంచెదన్. ౨౩౪ 946

మ. పరమామోదము నొంది యెంతయును సం♦భావించి జామాతనున్
దరుణీసంఘముతోడ ఋత్విజులతో ♦ దాఁబంపెఁ గాంపిల్యమున్
• పురికిన్ సోమద యంత సంతసమును♦ప్పొంగంగఁ గోడండ్ర సా
దరమొప్పం దగు భంగిఁ గాంచెఁ దనయున్ ♦ దాత్పర్యమేపారఁగన్. ౨౫

క. అనుహూపదారలం దో,డ్కొని వచ్చుటఁ జూచి యంత ♦ కోరికఁ గాంచెన్
వినుతించెం గుశనాభుని, వినుమో రఘువర్య! యవలి♦వృత్తాంతంబున్. ౨౬౪

ముప్పదిమూడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౪ - వ సర్గము.

విశ్వామిత్ర కౌశికీనదుల వృత్తాంతము.

క. అల బ్రహ్మదత్తుఁ డిటు పెం,డిలియై తనపురికినేగ ♦ నెలఁతలతోడన్
గులమును నిలుపఁగఁ గొడుకులు,గలుగుటకై యిష్టిఁ జేయఁ♦గడఁగెన్ విధిగన్.

క. తనయవిహీనుం డగుట గు,శనాభుఁ డక్కాలమంత దీర్పఁ♦జాలెడు, నొకయి
ష్టిని జేయుచుండ బ్రహ్మకుఁ,దనయుఁడు దారుఁడగు కుశుఁడు♦తనయునకనియెన్.

మ. తనయా! ధార్మికుఁడౌ తనూభవుఁడు తా♦తంబోలు వాఁడుద్భవిం
చును నీకాతఁడు గాధినామమున మిం♦చుంజుమ్ము తత్ప్రాప్తిచే

ఘనమై శాశ్వతమైనకీర్తియలరం ♦ గాంకించు బోధించి తాఁ
జనియెన్ శాశ్వతధాత్రులోకమున కం♦చద్వ్యోమమార్గంబునన్. ౮ 951

క. మతిమంతుఁడు కుశనాభ,క్షితివిభుఁడు ఘృతాచియందు ♦ స్థిరధర్మగుణ
ప్రతతియగు గాధినామక, సుతునంతటఁగాంచె నతఁడె♦సూ ననుఁగనియెన్. ౯

తే. వఱలె ధర్మాత్ముఁడై గాధి♦వసుమతిపతి, కుశునికులజుండనౌటఁ గా♦కుత్స్థనేను
గాశికుఁడనైతిఁ జాల వి♦ఖ్యాతిఁగన్న, సత్యవతి యక్కయగునాకు♦సరసధిషణ.

సీ. ఆమె ఋచీకుఁడన్ ♦ ఖ్యాతిఁజెందిన మునిఁ బెండ్లాడిపతికెద్ది ♦ ప్రియమొ దాని
నాచరించుచును దే♦హంబుతోఁగూడ స్వర్గమునొందె నంతమా♦త్రంబె కాదు
వినుము కౌశికి యను♦పేర మహానదియై పూజ్యచారిత్ర♦యై వెలుంగు
నట్లుండనేలన ♦ నైహికాముష్మికములు గల్గుటకు శ్లాఘ్య♦మును బవిత్ర

తే. జలముగల రమ్యనదియయి ♦ యలహిమాద్రి
నాశ్రయించె స్వర్గమునుండి ♦ యవతరించి
యామెపెద్దక్కగావున ♦ నామెయందు
గలుగు నెయ్యంబువలననే ♦ నెలమి మీఱ. ౯ 954

క. హిమవత్పార్శ్వంబున సౌ,ఖ్యముగా నివసించుచుందుఁ; ♦ గౌశికియును నా
హిమవత్పార్శ్వంబున నే, సుమహితగతిఁ దనరుచుండుఁ ♦ జుమ్ము రఘువరా !.

చ. ఋతమున ధర్మమందుఁ దగి ♦ యెంతయుఁ బావనరూపయై పతి
వ్రతయయి యొప్పుమీఱుచు స్ర♦వంతులలోపల మేటియౌచు సం
స్తుతిగను సద్ది నేనును గ్ర♦తుక్రియఁజేయఁగ దానిమాని యీ
క్షితికరుదెంచి యిందుఁ గృత♦కృత్యుఁడనైతిని జుమ్ము రాఘవా !. ౧౧ 956

తే. నీదు తేజంబునంజేసి ♦ నేను బూని
నట్టి యజ్ఞము నెఱవేఱె ♦ నయ్య ! రామ !
యిదియె నాదగునుత్పత్తి ♦ యిదియె యస్మ
దన్వయోత్పత్తి, చరితమ♦హార్యతేజ !. ౧౨ 957

క. అప్పటి నీప్రశ్నమునకుఁ, జెప్పితి నీదేశవిభవ ♦ సిద్ధుల రామా !
యిప్పటిగాథల నీకేఁ, జెప్పుటచే రాత్రికొంత ♦ చెల్లెను సుమ్మీ !. ౧౩ 958

క. నిదురింపుమింక నీక,భ్యుదయంబులు గల్గుఁగాత ♦ మోకాకుత్స్థా !
నిదురను మానిన, గతి సా,గదు పథులు తిరుగకునికిఁ ♦ గదలవు ద్రుమముల్.

చ. పులుఁగు లరణ్యజంతువులు ♦ భూరుహభాగములందు నిద్రతో
మెలఁగెడు నన్నిదిక్కులను ♦ మిక్కిలి చీఁకటు లావరించెడున్
మెలమెల సంజయేగె నదె ♦ మింటఁ దురంగముఖంబులైన తా
రలుమవులొప్పఁ జూడఁబడె ♦ రాజిలు నేత్రము లొప్పునట్లుగన్. ౧౬ 960

క. చలివెలుఁగులు గల శశి తమ,ములఁ జెందుచుఁ బ్రాణిచి త్త♦ముల కాత్మకరం
బుల నుల్లాసముఁ గూర్చుచు, నలరుచు నుదయించెఁ దూర్పు♦నందురఘువరా!
తే. నిశిఁ జరించెడు ఘూకాది♦నీచజములు
తిరుగుచున్నవి యిటునటు ♦ తీక్ష్ణరూపు
లగుచు మాంసాశనులు నగు ♦ యక్షరాక్ష
సులగణము సంచరించెడి ♦ నలుదెసలను. ౧౮ 962
చ. ఉరుతరనైజతేజమున ♦ నొప్పుమహాముని యిట్లుపల్కి - ని
ద్దురఁ గన నూరకుండ ముని♦ధూర్జటులందఱు మేలుమేలటం
చరుదుగ సన్నుతించి కుశి♦కాన్వయ మీయది గొప్పదౌచు ధ
ర్మరతిఁ జెలంగుచుండుఁ గుశ♦రాజకులోద్భవులందఱు త్తముల్. ౧౯ 963
మ. చతురాస్యుం బురుడించువారు లసద♦చ్ఛఖ్యాతిఁగన్నట్టి నీ
వు తగన్ గాధిసుతా! మహాత్ముఁడవు త♦ద్భూపాలసంఘంబులో
క్షితి నీవంశముఁ జక్కఁగా వెలుఁగఁగాఁ ♦ జేయున్ సరిద్వర్యయుం
చతిసంతోషమునన్ నుతింప నతఁడు♦ద్యన్మోదమగ్నాత్ముఁడై. ౨౧ 965
తే. అస్తమించిన సూర్యుని♦యట్లు నిద్రఁ,బొందె లక్ష్మణుతోడ రా♦ముండు నిదుర
వలన నించుక విస్మయ♦మొలయ మౌని,దివిజవర్యునిఁ బొగడి ని♦ద్రించెనంత.

ముప్పదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౩౫ - వ సర్గము.

గంగాపార్వతుల జన్మవృత్తాంతము.

సీ. ఆనదీతీరంబు♦నందు మౌనులఁగూడి రాత్రిశేషమును ని♦ద్రాభరమున
గడిపి గాధేయుండు ♦ క్రన్నన మేల్కని తెలతెలవాఱుట ♦ తెలిసి రామ
చంద్ర! రాత్రిగతించె ♦ జరగుచున్నది తొలుసంధ్య, లేలెమ్మిఁక ♦ సత్వరముగ
నీకు శుభంబగుఁ ♦ గాక ప్రయాణంబు సేయఁబూనుమటన్నఁ ♦ జిన్నిసోద
రునితోడ లేచిప్రా♦ద్దునఁ జేయఁ దగినట్టి కార్యంబులం దీర్చి ♦ గమనమునకు
తే. సమ్మతించి మునీంద్రుతో ♦ క్ష్మాసురేంద్ర!
పావనజలంబు గల్గు నీ♦భవ్యనదియు
నల్పజలమును బులినత♦లాభిరామ
మును నగుచు నొప్పుచున్నది ♦ కనహితముగ. ౩ 966
క. ప్లవసాహాయ్యములేకయె, స్రవంతి దీనిందరింపఁ ♦ జాలుదుమిపుడె
ట్టివిధమున నిందు దాఁటం,గవచ్చునో తెల్పుమన్నఁ ♦ గౌశికుఁడు తమిన్. ౪
క. ఈదారి దాఁటవలెనని, యేఁ దలఁచితి మున్నె మదిని ♦ నీపథముననే
పోదురు మహర్షులనఁగా, నాదారిననే ప్రయాణమయి ♦ యందఱొగిన్. ౫

చ. చనుచు వనౌఘముల్ గనుచుఁ ♦ జయ్యన దూరము పోయిపోయి యా
దినమున సర్గమేగఁగ, స♦దీవర నాఁ బృథుకీర్తిఁగాంచి స
న్మునిగణసేవితాంగియయి ♦ పొల్చినగంగను జూచి రద్దిపా
వనజలమొప్ప హంసముఖ♦వారి పతత్త్రియుతిన్ వెలుంగుచున్. ౭౪ 969

క. కనుఁగొనఁగాఁ దగునాగం,గను గాంచి మునీంద్రగణము ♦ క్ష్మాపతిసుతులున్
మనములఁ బొంగెడు మోదం, బున నాతీరమున విడియఁ♦బోలునటంచున్.

ఆ. నిశ్చయంబుసేసి ♦ నిల్చి యవ్వల జల,కంబులాడి వారు ♦ క్రమము దప్ప
కుండఁబితరులకును♦నొగి ఋషులకుఁ దర్ప,ణమునొనర్చి వేల్చి♦రి ముదమొప్ప.

ఆ. యజ్ఞశిష్టమగుట ♦ నమృతతుల్యంబగు, నాహవిస్సు మెక్కి ♦ యతిముదంబు
పొదలునట్టి చిత్త♦ముల నిర్మలంబగు, గంగ యొడ్డుఁజేరి ♦ కలిసి వారు. ౧౦

సీ. ఆగాధితనయు మ♦హాత్మునిఁ గొల్చుచుఁ గూరుచుండిరి చుట్టు ♦ కుతుకమలర
నంత నప్పుడు రాముఁ ♦ డాకౌశికునితోడఁ బలికె నీగంగ త్రి♦పథములందుఁ
బ్రవహించినట్టి య♦వార్తను వినుపింపు మద్ది ముజ్జగముల ♦ నావరించి
నదనదీపతి యగు ♦ నుదధి నెవ్విధిఁ జెందె వినఁగోరువాఁడ నే♦ననిన నతని

తే. ప్రశ్నమాత్మను బరికొల్ప ♦ బ్రహ్మమౌని
దానియుత్పత్తివృద్ధులఁ ♦ బూనిచెప్పఁ
దలఁచి యిట్లను గైరిక♦ధాతునిలయుఁ
డైన తుహినమహీధ్రనా♦యకుఁడు తనరు. ౧౩౪ 973

చ. అతనికి లోకమందెచట♦నైనను జక్కఁదనంబునందుఁ దు
ల్యతగలదంచుఁ జెప్పఁదగ♦నట్టికుమారికలిద్దరై రి మే
రుతనయయా మనోరమ సు♦రూప సుమధ్యమ యైనతన్వి యా
క్షితిధరవర్యుపత్నియయి ♦ చెల్వమరం, గనె, గూఁతులం దమిన్. ౧౫ 974

చ. ఇరువుర యందు శైవలిని ♦ యీమెయె పెద్దది యీమెచెల్లలై
పరఁగు నుమాఖ్యయే; త్రిపథ♦వాహినియై తగునట్టి గంగని
మ్మరుదుగ దేవకార్యమును ♦ సార్థకమై తనరంగఁజేయ భూ
ధర యనిదేవతల్ పలుక ♦ ధర్మమటంచు హిమాద్రి, ప్రీతితోన్. ౧౭౪ 975

ఆ. ఇచ్ఛవచ్చినట్లు ♦ లెందేని ప్రవహింపఁ, జాలి లోకములకు ♦ మేలిపావ
నత్వమొసఁగు గంగ ♦ నైజపుత్రికనిచ్చె, ముజ్జగములకు హిత♦మును దలంచి.

క. సురలు త్రిలోకహితంబును, నిరతము గోరుదురు గాన ♦ నింగికి హిమవ
ద్వరకన్యక గంగను స,త్వరగతిఁ గొని చనిరి పండెఁ ♦ దమ పనియనుచున్.

సీ. తుహినభూధరుని కూఁ♦తులలోన రెండవదగు నుమ యుగ్రమౌ♦నట్టి వ్రతముఁ
గొని తీవ్రతపమె యా♦ధనమని భావించి పరశివుంగోరి త♦పంబు సలిపె
లోకనమస్కృత♦యౌ కూఁతు నుమను సమానరూపుండయి ♦ మాన్యుఁడైన

శంకరునకు నిచ్చె ♦ శైలవర్యుండిట్లు గంగానదియు నుమా♦కాంతయునిల
తే. సర్వజనపూజనీయలు ♦ చారుగమన !
వత్స! ముమ్మార్గములను బో♦వంగఁ జాలు
గంగ యెటు తో త్రపాఱెనో ♦ గగనమందు
నావిషయమును దెల్పితి ♦ నవలవినుము. ౨౩ 978
ఆ. దూరితాఘ యగుచుఁ ♦ దోయప్రవాహాసం
పూర్ణయగుచు నలరు ♦ భూధరేంద్ర
తనయగంగ, దేవ♦తానదియయి దేవ
లోకమునకుఁ దానె ♦ ప్రాఁకె రామ !. ౨౪ 979

ముప్పదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౬-వ సర్గము.

-ooo పార్వతీ వృత్తాంతము. ooo-

చ. అనియతఁడిట్లు చెప్పుటయు ♦ నారఘుపుంగవు లిద్వరాకథన్
విని ముదమంది యిట్లనిరి ♦ వేడుక మీఱఁగ మౌనివర్య! గో
త్రనృపతి పెద్దకూఁతురయి ♦ రంజిలు శైవలినీచరిత్రమున్
వినుతము ధర్మయుక్తమును ♦ వింటిమి మీ రిసుమంతచెప్పఁగన్. ౧౫ 980
చ. సకలమెఱుంగువాఁడవు వి♦శాలతరంగిణిదైన గాథనుం
బ్రకటముగాఁగ భూస్థలిని ♦ స్వర్గమునందగు దానినెల్ల గా
శిక ! యెఱిఁగింపుమా కడుఁ బ్ర♦సిద్ధినిగాంచిన శైలరాజక
న్యక త్రిపథంబులం జనియె♦నంటిరి దానికి హేతువెద్దియో. ౩౫ 981
క. సరిదుత్తమ గంగ యదే, కరణిం ద్రిపథగ యటన్న ♦ ఖ్యాతింగనియెన్
అరుదగు కృత్యము లెయ్యవి, జరపి నదీవర్య యనెడు ♦ సత్కీర్తిఁగనెన్. ౪
క. అని యడిగిన రాకొమరులఁ, గనుచుఁ దపోధనుఁడు, గంగ♦గాథను మీకే
వినిపించెద నంతయునని, మునిమధ్యస్థలి వసించి ♦ ముదమునఁ బల్కెన్. ౫
సీ. కాకుత్స్థ! మును నీల♦కంఠుండు పార్వతిఁ బెండ్లియాడి తపస్సు♦పెంపుఁగల్గు
వాఁడయ్యు మన్మథ♦బాణాగ్నులఁ దపించిపార్వతిఁ గని మోహ♦పరవశుఁడయి
కామకేళింగూడఁ ♦ గా నమర్త్యుల నందపురవర్షసహస్ర♦మట్లె గడచెఁ
గాని కుమారుఁడా♦కాంతయందతనికిఁ గలుఁగఁడయ్యెను సుర♦గణము బ్రహ్మ
తే. మొదలుగా నీసుదంతకుఁ ♦ బుట్టు భూత
మును సహింపఁగ నెవ్వఁడ♦గును సమర్థుఁ
డని భయంబునుబొంది య♦య్యమరనాథు
కడకె చని సాగిమ్రొక్కి య♦ప్పుడిటులనిరి. ౬౫ 981

ఉ. నీవు జగద్ధితంబు మది ♦ నిల్పి తదాచరణాదరుండవై
దేవవరుండవై తగుదు ♦ దేవతలిప్పుడు నీమహాంఘ్రిరా
జీవములాశ్రయించిరిదె ♦ చెల్వమరం గరుణింపవే మహా
దేవ! భవత్సుతేజమున ♦ దివ్యసుతుండుదయింప నాతనిన్. ౯½ 985

క. ధరియింపలేవు లోకము, లరయుము తద్విధము మదిని ♦ నామ్నాయోక్తం
బురుశాంతమునౌ యోగము, గిరిజాయుక్తముగఁ జేసి ♦ కీర్తింగనుమా. ౧౦½

తే. మూఁడులోకమ్ములకు హిత♦మ్ము నొనరించు
పనికిఁ దేజోమయంబగు ♦ తనువునందె
నీదు రేతస్సును ధరింపు ♦ (నిఖిలలోక
ములను గావుము తన్నాశ♦ము హితమగునె.) ౧౧ 987

చ. అనియిటులాడుచున్న దివి♦జావళివాక్యము లాలకించి లో
కనిచయశాసకుండు శితి♦కంఠుఁడు దేవతలార! యట్లయా
ననిమతియుక్ వచించె నిఁక ♦ నట్టులె దీనిధరించువాఁడ నా
తనువున శైలరాట్సుతయుఁ ♦ దాల్చును శోణితమాత్మయందునన్. ౧౨½ 988

క. సురలును లోకంబులు సుస్థిరసౌఖ్యము నొందుఁ గాక ♦ చెప్పెద వినుఁడీ
సురలార! మునుపె జాఱిన, వరమామక తేజమును నె♦వండు ధరించున్. ౧౩½

ఆ. అద్ది నిరుపమాన ♦ మగుట స్వస్థానమ్ము, నుండి జాఱియుంట ♦ బెండువడక
తాల్పఁ జాలువానిఁ ♦ దలఁపోసి చెప్పుఁడీ,యనిన శివునితోడ♦నమరులనిరి.౧౪½

క. చలనము నొందిన తేజము, నిల యిది తాల్చునన శంభుఁ ♦ డిల విడువఁగ, న
య్యలఘుతమ తేజమప్పుడ, కలయన్ వ్యాపించె సగిరి♦కాననభూమిన్. ౧౬

సీ. ఇట్లు భూభాగంబు ♦ నెల్లను లోఁగొను నావీర్యమును జూచి ♦ యమరులెల్ల
భయఁపడి తమవలెఁ♦భయమునొందినయగ్నిఁగని భీతియేలాకో♦గంధవహునిఁ
గలిసి ప్రవేశింపు ♦ మలరెడు శివవీర్యమున నఁజొచ్చి దా♦ని, ననలుండు
వ్యాపించెనందున ♦ వాయువుతోఁగూడ నది శ్వేతపర్వత ♦ మప్పుడయ్యెఁ

తే. గాలపరిపాకవశమునఁ ♦ గమ్రశరవ
ణముగ నదిమాఱె సూర్యాగ్ని♦సమముగాఁగ
వెలిఁగె నయ్యది యద్దాని♦వలనఁ గలిగె
నగ్నిజుఁడు కార్తికేయుండు ♦ నైనసుతుఁడు. ౧౮½ 992

చ. అతఁడురు తేజుఁడై వెలసె ♦ నంతట మానులఁగూడి దేవతా
ప్రతతివ్యవాయముం జెఱుచు ♦ పద్ధతిఁబూనిన దానఁ గోపమా
శితిగళశైలజాతలను ♦ జెందెనో? యెమొకో? యంచు వారియా
ధృతిఁ గనఁ గోర్కెనర్చనల ♦ నెంతయుఁ దన్పెను సంతసంబునన్. ౧౯½ 993

క. తదనంతర మాపార్వతి, త్రిదశులఁ గని యిట్లు పల్కెఁ ♦ (బ్రియసంగమభం

గదకృత్యము చేసితిరి గద దానికిం బ్రతిఫలంబు ♦ తప్పక గలుగుగా. ౨౦ 994

ఆ. దాని ననుభవింపఁ♦దగు మీకునని భాస్క, రాభ గ్గను గిరిజ♦యప్పుడె జలముఁ
గొని) సకోపచిత్త♦మును రక్తనయనంబు,లమర శాపమిచ్చె♦నమరుల కిటు. ౨౧

చ. తనయునిఁ గాంచఁగోరి ప్రమ♦దంబున భర్తను గూడువేళ న
ప్పునికి విఘాతముం గలుగు♦పద్ధతిఁ బూనితి రట్టులౌట నిం
కను బడయంగ నేరరు స్వ♦కాంతలయందుఁ దనూజులన్ భవ
ద్వనితలు నేఁటినుండియును ♦ వంధ్యలె యౌదురు నిశ్చయంబుగన్. ౨౨ 996

క. అని సురులకు శాపంబిడి, తనశాపమహోగ్నిబాధ ♦ ధరణికిఁ గల్గిం
పను దలఁచి యోసి ధరణీ!, విను నీవిఁక నానారూపాది ♦ వివిధవిధములన్. ౨౪

తే. చూడఁబడుదువు పెక్కు రా♦జులకు భార్య
వగుదు, వో దుష్టబుద్ధి! నా♦కాత్మజుండు
గలుగుటకు నోర్వవైతివి ♦ గాన నాదు
శాపమున నీదుప్రకృతి చం♦చలతనొందు. ౨౫ 998

క. తనయజనితసంతసమును, గనకుందువుగాక నీవిఁ♦కన్ భూదేవీ!
యని శపియించెను; శాపం, బును గని సిగ్గొంది, రావి♦బుధు;లట మీఁదన్.

చ. హరుఁడు గిరీంద్రపుత్రి యిడి♦నట్టి మహోగ్రశాపపావకున్
మరలుపరామి నాదివిజ♦మండల మార్తినపించుచుండ నె
వ్వరునను జూడరామిఁ దన♦స్వాంతమునం దలపోసిపోయె న
వ్వరుణుని యాధిపత్యమున ♦ వర్ధిలు దిక్కున కాత్మదేవితోన్. ౨౭ 1000

క. చనిచని హిమవత్పార్శ్వం,బున నుత్తరనందు దాని ♦ మూర్ధంబున దే
వినిఁగూడి తపమొనర్పం,గను సంకల్పించె నీల♦కంఠుఁడు వత్సా!. ౨౮ 1001

తే. రామ! విస్తరముగ గిరి♦రాజపుత్రి
చరితమును జెప్పినాఁడ ల♦క్ష్మణుఁడు నీవు
గంగమహిమము, స్కందుండు ♦ గలుగుటయును
దెలుపువాఁడ వినందగు ♦ నెలమి దీని. ౨౯ 1002

ముప్పదియాఱవ సర్గము సంపూర్ణము.

---

32-వ సర్గము.

—కుమారస్వామి జననము.—

సీ. తొల్లి మహేశ్వరుం ♦ డుల్లమేకాగ్రముగాఁ దనరారంగఁ ♦ గడుఁదపమ్ము
సేయుచుండఁగ సురల్ ♦ క్షితిసురమానులు సేనాపతిని గోరి ♦ సృష్టికర్త
కడ కేగి వీతిహో♦త్రుఁడు శక్రుఁడాదిగాఁగలుగు దేవతల్లె ♦ గాఢభక్తి
భగవంతుఁడైన యా♦బ్రహ్మకుఁ బ్రణమిల్లి మును మాకు సేనాప♦తినిని మీర

తే. లోనఁగి యుంటెరి గాదె [యా♦యుగ్రశత్రు
సూదనుండగునట్టి త్రి♦శూలి యిప్పు
డట్టికృత్యంబునకు నిల్వఁ♦డయ్యెఁ దండ్రి
యగు నతండిప్డు తుహినాచ♦లాగ్రమందు]. ౨౪ 1003

చ. పెనుతపమూని పార్వతిని ♦ ప్రేయసిఁ గూడియె దానిసల్పుచున్
మనమున దేవకార్యమును ♦ మంతనమైనను జేయకున్నవాఁ
డన నిఁకఁజేయఁగాఁదగిన♦యట్టి జగద్ధితకృత్యమెద్ది? యో
వనజభవా! ఘటింపఁదగు♦వాఁడవు నీవెకదా మహాప్రభూ!. ౩౪ 1004

క. అంతయు నెఱిఁగినవాఁడవు, చింతించిన మాకు నీవె ♦ జీవమనుచు ని
ట్లెంతయు నాడిన సురవా, క్సంతతి విని లోకకర్త ♦ సకలమెఱుఁగుటన్. ౪౪

చ. హరుఁడు మహోగ్రమౌ తపము ♦ నందినవాఁడు మరల్పరాదదే
వరుసను దత్ప్రియత్నమగు ♦ వట్టిది యంచుఁదలంచుచున్ మనో
హరతరవాక్యముల్ పలికి ♦ యయ్యమరావళి నూఱడించి యో
సురవరులార! శైలసుత♦సూనులఁ గాంచకయుండ మిమ్ములన్. ౫౪ 1006

క. శపియించెఁగాన నిఁక మీరు స్వసంతులవలనఁ బ్రజను ♦ రూఢిగఁ గనలే
రు పతివ్రతయగు పార్వతి, శపథమమోఘమ్ము మీకు ♦ సంశయమేలా!. ౬ 1007

చ. ఋతము వచించినాఁడ గతి ♦ యేమిఁక నందురయే న్వచించెదన్
హుతవహుఁడీ మహామహిమ ♦ నొప్పెడు నభ్రసరిత్తునందు న
త్పుతుఁగను నాతఁడుద్ధతుల ♦ శూరులవైరులఁ ద్రుంప శక్తుఁడౌ
నతఁడగు దేవసైన్యపతి ♦ యాతని నగ్నితనూజుఁ బ్రేమచేన్. ౭ 1008

ఆ. శైలరాజతనయ ♦ సరిదుత్తమఖ్యాతి, నలరు గంగ గాంచు; ♦ నప్పువలని
ప్రీతిచేత నుమయు ♦ నాతనిఁ గైకొను,నలరుఁ డింక సంశ♦యంబు లేదు. ౮

క. చతురాస్యుం డిటు పల్కన,గృతార్థులుగఁ దమ్ముఁ దలఁచి♦యెంతయు భక్తిన్
శతధృతికి మ్రొక్కి పూజించి తరలి గని రంత ధాతు♦చిత్రితశిఖరిన్. ౯ 1010

తే. అద్ది కైలాసమనుపేర ♦ నలరు నచట
హరుని తేజంబునందు మూ♦ర్త్యంతరమున
నున్న యగ్నినిఁ జూచి యో♦హుతవహా! త్రి
దశులకార్యంబు ఘటియింపఁ ♦ దగును నీకు. ౧౦ 1011

చ. విను మది యెట్టులన్న గురు♦వీర్యము గల్గినవాఁడవీవు కా
వునఁ, దుహినాద్రిజాతయయి ♦ పొల్చెడు నాకధునీలలామ యం
దున శివవీర్యమున్ విడువు ♦ తూర్ణముగా నని యాజ్ఞసేయ న
య్యనలుఁడు నట్లెయౌననుచు ♦ నాదృతి వారలఁబంపి యంతటన్. ౧౧౪ 1012

క. గంగకుఁజని యతఁడిట్లనుఁ, బొంగారెడు చూలుఁ దాల్పు ♦ పొలఁతీ యిదియు

త్తుంగామోదదమా సుర,పుంగవులకు ననుచు నగ్ని♦పూన్కి-వచించెన్. ౧౨

చ. అనలుని మాటలన్ విని, యొ♦యారము మీఱఁగ నొక్క-లేమయై
తనరెడు గంగఁజూచి మహి♦తంబగు రూపవిలాసమెన్నికా
మనియత బద్ధచిత్తుఁడయి ♦ మానిత శంకరవీర్య మంత నా
య్యనఁ దనదేహభాగముల♦యందలరారెడు దాని నగ్నియున్. ౧౩ 1014

ఆ. విడిచి గంగఁబట్టి ♦ తడవుసేయక దాని, యవయవములయందు ♦ హరునివీర్య
మపుడు కొఱఁతలేక ♦వ్యాపించునట్లుగాఁ,నడిపె నద్దిచెలఁగెఁ♦దనువునిండ.౧౪

సీ. దహను తేజము తన్ను ♦ దహియింప నతిదుఃఖతాత్త్వయగంగయ♦య్యమరవరుల
కెల్లఁబురోహితుం ♦ డీప్యుండునగు నగ్నిఁ గనిపల్కె- నీ తేజ♦మును ధరింపఁ
జాల నయ్యది వృద్ధి♦నేలాగునం గనుననిన హుతాశనుం♦డనియె నిదియె
హిమవదద్రీశ్వర ♦ మిద్దానిపాదంబునందె ... గర్భంబు ♦ సుందరాంగి

తే. యునుపుమన గంగ యమ్మాట ♦ విని యెసంగు
కాంతి నలరారుచున్నయా♦గర్భమచటఁ
దనదు నవయవములనుండి ♦ తడయక విడి
చెను, దరంగిణినుండి వ♦చ్చి ధరఁబొంది. ౧౮ 1016

చ. తనరెడు రుద్ర తేజమది ♦ తప్తహిరణ్యనిభంబునై లస
త్కనకము మేలివెండియును♦గా నలరారెను గృష్ణవర్ణమౌ
నినుమును రాగియున్ గలిగె ♦ నెంతయు నందలి తీక్ష్ణయోగతన్
గనఁబడె సీసముం ద్రపువు♦గా నటఁ దన్మల మిట్టిఱంగునన్. ౧౯ 1017

ఆ. గంగనుండి వెడలు ♦ ఖండపరశువీర్య,మిలను వివిధధాతు♦వులుగఁ బరఁగె
నట్లుగర్భమునుప ♦ నా శ్వేతపర్వత, జనితమైన తెల్లు ♦ వనము మిగుల. ౨౦

క. దానివెలుంగున మెఱయుచుఁ, దానాపర్వతముతోడఁ ♦ దపనీయమయం
బై నెఱిఁ గన్పడియెన్ రఘు,భూనాథకులాబ్ధిచంద్ర! ♦ పూనిక వినుమా!.౨౧

తే. నాటఁగోలె సువర్ణము♦నలసమాన
కాంతిఁ దగి జాతరూపమన్ ♦ ఖ్యాతిఁ బడసెఁ
బురుషశార్దూల! యావనం♦బునఁ గలతృణ
తరులతాగుల్మములు స్వర్ణ♦తం జెలంగె. ౨౨ 1020

ఆ. గంగ తెల్లునందు ♦ గర్భంబు విడిచిన, యంత శిశువు పుట్టె ♦ సమరవిభుఁడు
మొదలు గల్గు దేవ♦ముఖ్యులు కృత్తిక,లకుఁ గుమారునిచ్చి♦లలితభణితి. ౨౩

సీ. క్షీరప్రదానంబు ♦ సేసి యాతనిఁ బెంపుఁడని నియోగింప న♦య్యతివలెల్ల
మాకెల్లఁదనయుఁడౌఁ ♦ గాక యీతఁడటంచు సంచిసంకేతమ♦మరులతోడఁ
గావించుకొని యప్డు ♦ గల్గిన శిశువున కెలమిఁబాలొసఁగ మొ♦దలిడిరంతఁ
గార్తికేయుఁడటన్న ♦ ఖ్యాతిజగత్త్రయంబునఁ బొందు నీశిశు♦వనుచు నంది

తే. యంబు లేదనుచును బల్కి ♦ రమరులెల్ల
వారిపల్కులు విని యల్ల ♦ వనిత లగ్ని
భంగి గురుకాంతి నొప్పి గ♦ర్భజలమందు
మగ్నుఁడై యున్న ముద్దుకు♦మారుఁ గాంచి. ౨౬. 1022
క. ముదమున గర్భస్రవమెల్లఁ దొలంగెడునట్లుగా జ♦లకమార్చిరి యా
త్రిదశులు స్కందుండనువే, రొదవును పీనికినటంచు♦నొయ్యనఁబల్కన్. ౨౬౹
తే. స్కందుఁడను ఖ్యాతినింగాంచెఁ ♦ గార్తికేయుఁ
డపుడు గర్భస్రవమునుండి ♦ యవనిఁబడిన
కారణంబున, నంతన♦కాంతలెలమి
స్నానకృత్యంబు చక్కఁగ ♦ జరపి యవల. ౨౭ 1024
చ. జ్వలనసమాను స్కందుని సు♦బాహుని గాంచి ముదంబు మీఱఁగా
నలరుచుఁ బాలుచేఁపఁ దమి ♦ నంగనలాతనికిచ్చి రాతఁడున్
వెలఁదుల నార్వురం దనుప ♦ వేధరియించి షడాననంబులన్
బొలుపుగఁ బాలుఁద్రాగి సుర♦భూషణుఁడై తనరారె నంతటన్. ౨౮౹ 1025
క. ఒకదినమె పాలుద్రావఁగ, సుకుమార శరీరుఁడయ్యు ♦ శుంభదభంగ
ప్రకటమహావీర్యంబున, సకలాసురవరుల గెలువఁ ♦ జాలెను రామా!. ౨౯౹
క. అనలపురోగములై సుర, లనూనకాంతిని వెలుంగు ♦ నాస్కందుని దే
వనికరసేనాధిపుఁగా, ఘనతరసంతోషమొప్పఁ ♦ గావించిరి సూ!. ౩౦౹ 1027
తే. గంగజననంబును వినంగఁ ♦ గాంక్షగల్గి
యడిగితివి స్కందజననంబె ♦ యట్టికథకు
విస్తృతినొసంగుఁ గావున ♦ విస్తరించి
చెప్పినాఁడఁ బవిత్రమై ♦ చెలఁగు నిద్ది. ౩౧౹ 1028
తే. ధన్యమగు నిద్ది యెవ్వఁడు ♦ ధరణి స్కంద
భక్తుఁడగు నాయువుం బుత్ర♦పౌత్రసహితుఁ
డై చెలంగుచు నంతమం♦దాకుమారు
తోడి లోకంబు నతఁడు పొం♦దుఁ జుము రామ!. 1029

ముప్పదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౮-వ సర్గము.

### సగరచక్రవర్తి చరిత్రము.

చ. అనికుశికాత్మజన్ముఁడిటు ♦ లారఘువర్యునకభ్రగంగ గా
థను దెలియంగఁ జెప్పి మమ♦తన్ వచియించెను వెండియుం బ్రజా
వననిపుణుండు ధర్మమతి ♦ వర్ధిలుచుండె నయోధ్యకీశుఁడై
మును సగరుండు శూరుఁడయి ♦ భూపతి సంతతిలేమి దానికై. ౧ 1030

క. మనమున నువ్విళ్లూరుచు, జనపతి సంతతిని బొందఁ ♦ జను నీఁక ననియో
జనసేయుచుండె నాభూ,పునకిర్వురు భార్యలందు ♦ బుధనుతయగుచున్. ౨౪

తే. సత్యవాదిని ధర్మసం♦సక్తచిత్త
నైన కేశిని తొలిభార్య ♦ యగు; విదర్భ
రాజపుత్రిక యామె; య♦ప్రతిమరూప
సుమతికాశ్యపతనయయౌ ♦ సుందరాంగి. ౩౪ 1032

సీ. సగరు రెండవపత్ని ♦ సత్కీర్తి రాజిల్లె వారితోఁగూడి య♦వ్వసుమతీశుఁ
డలతుహిమాద్రికి ♦ నరిగి తత్ప్రత్యంతపర్వతంబగు భృగు♦ప్రస్రవణము
నందుఁ జేసెఁదపంబు ♦ నంతనూఱేఁడులు,నిండ నూన్ఱవాది ♦ మండలమున
నాద్యుఁడై తగు భృగు♦వను మహాముని వారితపమునకుం బ్రీతి♦నపుడుపొంది

ఆ. సగరుఁ గాంచి పల్కె ♦ సంతతి మెండుగఁ
గలుగఁగలదు నీకుఁ ♦ గడుయశంబు
దాన భూతలమునఁ ♦ దగుఁబురుషర్షభా!
వంశకరునిగాంచు ♦ వనిత, యొకని. ౭౪ 1033

క. అఱువది వేవురు పుత్త్రుల, మఱి యొకసతి గనునటంచు ♦ మౌనివచింపన్
నెఱినొప్పు పడఁతులాయి, ద్దఱు నారాధించి మౌని♦తల్లజు భృగునిన్. ౮౪

తే. అతిశయంబగు సంతసం♦బంది కేలు
మొగిచి పల్కిరి మౌనీంద్ర ♦ ముఖ్య! యెవతె
యొకకుమారునిఁ బెక్కండ్ర ♦ నొగి నెవర్తు
గాంచు వినఁగోరెదము చెప్పు♦మెంచి మదిని. ౧౦ 1035

క. ఎవ్విధినీవు వచింతువొ, యవ్వనితకు నట్లె ఫలము ♦ నగుసూనృతమౌ
నివ్వచనమునిన ధార్మికుఁ, డవ్వరమునిచంద్రుఁడనియె ♦ నాతరుణులతోన్.౧౦౪

క. వనితామణులారా! మీ, మనములఁగల యిష్టమెదియొ ♦ మఱుఁగుపఱుపకో
య్యనఁ దెల్పుఁడు వంశకరుం,దనయు నొకనిఁగోరనొక్క♦తనయుఁడెకలుగున్.

క. అతిబలులు కీర్తిమంతులు, సుతులు మహోత్సాహయుతులు♦శుభతనురూపుల్
మతిమంతులు పెక్కండ్రు సు,దతులారా! గల్గుదురు ము♦దంబునఁ గోరన్.

ఆ. ఎవతె యెద్దిగోరు ♦ నీరెండు వరముల, లోన నదిన నంత ♦ మౌనివచన
మాలకించి పెద్ద♦దగు కేశినియు వంశ, కరునిఁ దనయుఁ గోరె♦వరుని మ్రోల.

తే. గరుడసోదరి సుమతి ప్ర♦ఖ్యాతి గల్గు
తనయులఱువదివేవు, రు♦త్సాహయుతులు
గల్గఁదగునని కోరె రా♦ఘవ! నృపుండు
దారలంగూడి మునికి సం♦తసము మీఱ. ౧౮ 1040

చ. వలగొని యుత్తమాంగమిల ♦ భాసిలునట్లు నమస్కరించి భా

ర్యలు తనవెంటరాఁగ స్వపు♦రంబునకేగె ననంతరంబ ని
ర్మలమతియై చెలంగు నస♦మంజునిఁ గేశిని పెద్దభార్య కాం
చె, లలినృపుండు పొంగె గుణ♦సింధువతండగుఁజుమ్ము రాఘవా!. ౧౮ 1041

సీ. సుదతియు నవ్వేల ♦ సొరకాయవలె గుండ్ర,మౌ గర్భపిండంబు♦నపుడు గాంచె
నద్దాని భేదింప ♦ నందుండి యఱువది వేవురు పుట్టిరి ♦ వింతమీఱ
ఘృతకుంభముల రాజ♦సుతుల దాదులు నిల్పి పెనుపొందఁజేసిరి ♦ పెద్దకాల
మునకు, వారెల్ల యౌ♦వనమునుబొందిరి చిరకాలమారీతి, ♦ జెల్ల సగర

తే. భూపతికి రూపయౌవన♦ములఁజెలంగు
తనయు లఱువదివేవురు ♦ తనరి రంత
సగరపుత్రులయందు, జ్యే♦ష్ఠత నెసంగు
నట్టి యసమంజుఁ డనువాఁ డ♦హరహరమొగి. ౧౯ 1042

క. పురమునఁగల బాలకులను, సరయూనదియందు వైచి ♦ జలముల మునుఁగన్
గరము ముదంబుననవ్వుచుఁ,దిరుగుచునుండె నిటుదుర్మ♦తిని గొనియతఁడున్.

క. పాపసమాచారుండై, యాపురమున నున్నసజ్జ♦నాళికహితముం
బ్రాపింపఁజేయుచుండుట, భూపతి వెడలంగ నడచె ♦ పురినుండిసుతున్. ౨౦

క. వానికొడు కంశుమంతుఁడు, నా నలరుచు నెల్లరకుఁ బ్రి♦యంబు వలుకుచున్
మానితవీర్యుండై బుధ, మానవ సమ్మతుఁడునగుచు ♦ మహినొప్పారెన్. ౨౧

మ. చిరకాలంబిటులేగె నంతఁ గ్రతువున్ ♦ జేయంగఁ జిత్తంబు త
ద్ధరణీశాగ్రణికిన్ జనించె దృఢమై ♦ దైవారె నావాంఛ య
ధ్వరకృత్యంబును నిశ్చయించి శ్రుతివి♦ద్వర్యుండు గానన్ సమా
దర మొప్పంగను ఋత్విజుల్ బలసిరాఁ ♦ దాఁబూనె దీక్షం దగన్. ౨౩ 1046

ముప్పదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౩౯-వ సర్గము.

సగరుని యజ్ఞాశ్వము నింద్రుఁ డపహరించుట.

క. అనివిశ్వామిత్రుఁడు చెప్పిన గాథను రాఘవుండు ♦ విని దానితుదన్
మనమునఁబ్రముదమునొందుచు, ననలునివలె వెల్గుచున్న♦యమ్మునికనియెన్. ౧

తే. బ్రాహ్మణోత్తమ! మీకు శు♦భంబుగల్గుఁ
గాక, యీయజ్ఞగాథను ♦ గడువినంగ
నిచ్చపొడమెడి యజ్ఞమ ♦ దెట్లుసేసె
మాకుఁ బూర్వుఁడు సగరక్షి♦మావిభుండు. ౨ 1048

చ. అనవిని చెప్పఁబూను విష♦యంబునె తానడిగెన్ సమస్తముం
దనమదిచే నెఱింగియును ♦ దాను నెఱుంగనిపోల్కిఁ బ్రశ్నచే

సెను గదయంచు, సుస్మితము ♦ చెందిన పోల్కి ముఖంబు గ్రాలఁగా
ననియెను రామచంద్ర! వినుమా ♦ సగరక్షితినాథు వార్తలన్. ౩ 1049

తే. విస్తరించి వచించెద ♦ వృషభకేతు
శ్వశురుఁడౌ హిమవంతుండు ♦ శైలవిభుఁడు
వింధ్యగిరికిని దాపయి ♦ వెలసి నడుమఁ
బెనుగిరులు లేమిఁ దామొగిఁ ♦ బెద్దవగుట. ౪ 1050

క. ఇతరేతరంబు చూచెడు, గతినుండును, వానినడుమఁ ♦ గల దేశమునం
గ్రతువద్దానిం జేసెను, క్షితిపాలకుఁ డతఁడు, సుప్ర ♦ సిద్ధము గాఁగన్. ౫ 1051

క. ఆపర్వతముల నడుమనె, యేపారెడు దేశముద్ది ♦ యేమఖ దీక్షం
జూపట్టు ముఖ్యతమమై, భూపతి యూదేశమందె ♦ పూనె, నొనర్పన్. ౬ 1052

క. జనకుని యాజ్ఞను మదిఁ గై, కొని యజ్ఞతురంగమును న ♦ కుంఠ గాపై, తాఁ
జనె నంశుమంతుఁ డొకపెను, ధనువును గైఁ దాల్చి మిగుల ♦ దర్పముపొంగన్. ౭

చ. క్షితిపతి యంత నధ్వరము ♦ చేయుచు నుండఁగ నుక్థ్యనామమై
నతిథిని యజ్ఞవిఘ్నకర ♦ ణప్రథితాసురదేహమొప్పఁగా
శతముఖుఁ డధ్వరాశ్వమును ♦ జయ్యన దొంగిలె నద్దిపోవు న
స్థితి నెఱుఁగంగఁ జాలకల ♦ ధారణినాథునిఁ గాంచి ఋత్విజుల్. ౮ 1054

తే. పలికిరిట్లు మహాత్మ! య ♦ శ్వంబు నిట్టి
యుక్థ్యదినమందు యజ్ఞంబు ♦ నొప్పఁ జెఱుప
దొంగిలించె న దెవ్వఁడో ♦ శోధనె చని
వాని వధియించి తేఁ బంపు ♦ దాని నిటకు. ౯ 1055

క. మనకెల్లను గ్రతువిఘ్నం, బున దీన నమంగళంబు ♦ పొసఁగుంగానన్
మనుజేశ! విఘ్నమేదియుఁ, గనకుండఁగఁ జేయవయ్య ♦ క్రతువున నిందున్. ౧౦

క. అనిన నుపాధ్యాయోక్తుల, విని సభలో నలరుచున్న ♦ పృథివీపతియున్
దనయుల నఱువదివేవురఁ, గనుఁగొని యోసూనులార! ♦ క్రతువిధి ఘనమై. ౧౧

ఆ. మంత్రపూతులగుచు ♦ మహనీయులగు నుపా
ధ్యాయవరులు జరుప ♦ నలరుచున్న
దట్లుకాన రాక్ష ♦ సాగమనము నాకుఁ
గానరాదు ఘోట ♦ క మెటు చనెనొ. ౧౨ 1058

క. తెలియక యున్నది యెల్లెడఁ, గలయఁగ వెదకుండు మీకుఁ ♦ గల్గు శుభంబుల్
జలనిధివలయితమగు భూ, స్థలమున నెందైన వెదకఁ ♦ జనుఁడిఁక మీరల్. ౧౩

చ. ధరణి విశాలమైనయది ♦ దానిని బుత్రకులార! మీరలున్
వరుసఁగ నొక్కయోజనము ♦ వంతున నొక్కరుఁ డిట్లు చక్కఁగా
నరయుఁడి యశ్వచోరకుని ♦ నంతటఁ గన్పడుదాఁక జూడుఁడీ

దొరకఁడయేని యాతఁడల ♦ దొంగ కనంబడుదాఁక మేదినిన్. ౧౪౫ 1060

క. పనిఁ బూని త్రవ్వుఁడీ నా,సనువున; నే యజ్ఞదీక్షఁ ♦ బట్టితిఁ గానన్
జనరా దెచ్చటికైనం, గనుక నుపాధ్యాయపౌత్ర♦కలితుఁడ నగుచున్. ౧౯

చ. తురగము వచ్చునెప్పుడని ♦ త్రోవలు చూచుచు నిందె యుండెదన్
ద్వరగఁ జనుండు మీకగుచు ♦ భద్రములంచు నృపుండు పల్కె నా
ధరణిపపుత్త్రులందఱు ని♦తాంతబలాధికులౌట మోదసా
గరమునఁ దేలి తద్వచన♦గౌరవమెంచెడువారు గావునన్. ౧౬ 1062

క. జనకుని మాటకు లోనై, ఘనతరసంరంభ మొప్పఁ♦గా భూస్థలముం
గనఁబోయిరి యో దశరథ,తనయా! యటమీఁది చరిత♦తగుఁజిత్రముగన్. ౧౬౫

సీ. ఒక్కొక్కఁ డొక్కొక్క♦యోజనమంతదా వెడలుపు నిడుపును♦విక్రమమునఁ
ద్రవ్వఁగాఁ దగునని ♦ తాఁపు వంతులు పెట్టుకొని వజ్రసమములౌ ♦ గోళ్ల చేత
నశనికల్పములగు ♦ నట్టి శూలంబుల హలముఖంబుల భూమి♦నంతఁ బగులు
నట్లుగా భేదింప ♦ నశనిసంస్పర్శంబు గలిగినయట్లుగ ♦ క్ష్మాతలంబు

తే. పగిలి ఘోషించె, నప్పుడు ♦ పన్నగములు
బలివసతినున్నయసురులు ♦ బలయుతులగు
రాక్షసులుఁ దక్కు జంతువుల్ ♦ రాజపుత్త్రు
లేఁచ నార్వ దుర్ధర్షమ♦య్యె, నల రవము. ౧౭౫ 1064

చ. అఱువదివేల యోజనము ♦ లాసగరాత్మజవీరు లట్టిలన్
బిఱుసుదనంబుతోఁ దగిన♦బింకమునన్ బెకలించి క్రిందుగా
వఱలెడు లోకమట్లు గరు♦వంబునఁ జేయుచుఁ బర్వతాళిఁ గ్రి
క్కిఱిసిన జంబువుంజదిపి ♦ కేళిఁ జరించిరి నాల్గుదిక్కులన్. ౨౧౫ 1065

సీ. అంతట గంధర్వ ♦ లమరులు నసురులుఁ, బన్నగావళియు సం♦భ్రాంతచిత్త
ముల నందఱుంగూడి ♦ జలజాసనునిపాలి, కరిగి మహాత్ముని ♦ నతనిఁ జాల
వినుతించి దీనవ♦దనములు గన్పడ మితిలేని భయమున ♦ శతధృతీ! మ
హాత్మ! యా సగరుని♦యాత్మజుల్ భూమి,నంతయుఁ ద్రవ్వియటరసా♦తలనివాసు

ఆ. లై మహాత్ములైన ♦ యందఱ వధియించు, చున్నవారు వీఁడె ♦ యెన్న యజ్ఞ
హర్త, యిదె గొని చను ♦ నశ్వమునని భూత, కోటినెల్ల వారు ♦ కొట్టువారు.

ముప్పదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

## ౪౦-వ సర్గము.

—సగరపుత్త్రులు కపిలునిచేఁ జచ్చుట.—

చ. శతధృతి, దేవతావచన♦సంతతి నెంతయు నాలకించి ప్రా
ణితతిని జంపుచున్న ధర♦ణిప్రభుపుత్త్రులదా భుజాబలో

ద్ధతికిఁ భ్రమించి భీతిఁ గని ♦ త త్తఱపోవుచు నున్నయట్టి దే
వతలను గాంచి పల్కె నిల ♦ పన్నగశాయిది నిశ్చయంబుగన్. ౧౪ 1067

ఆ. అతఁడు కపిలరూప♦నుండి యెల్లప్పుడు, భూతలంబునెల్లఁ ♦ బూని తాల్చు
దానిఁగొనిరయేని ♦ తత్క్రోధపావక, దగ్ధదేహులగుట ♦ దప్పదింక. ౨౪ 1068

క. ప్రతికల్పంబును దప్పక, క్షితి ద్రవ్వంబడును స్వల్ప♦జీవితులగుభూ
పతిసుతులనాశనము మును,పె తగన్నిశ్చితము నుండి♦యిలఁ ద్రవ్వుటయున్. ౩౪

క. అనినఁ బితామహువాక్యము,విని ముప్పదిమూఁడుకోట్ల ♦ విబుధులు మోదం
బున మిగులఁ బోవలి మును వచ్చినచొప్పునఁ బోయిరంత♦క్షితిపతిసుతులున్.

చ. ధరణిని ద్రవ్వుచుండ నిన♦దం బొకఁ డుద్భవమందె నద్ది భీ
కర కులిశారవప్రతిమఁ ♦ గాంచుచు నొప్పఁ దదీయనాశనం
బరసి వచించుమాడ్కిని, ధ♦రాధిపునాత్మజులెల్ల నార్చుచున్
ధరఁ బెకలించి యెల్లెడఁ బ్ర♦దక్షిణముం బొనరించి చూచుచున్. ౫౪ 1071

చ. తురగము నెందుఁగానక స్వ♦తుక్రియఁ బూనిన తండ్రిచెంతకే
ల్లరుఁ జని విన్నవించిరి యి♦లాపతివర్య! ధరాతలంబునన్
దిరిగితి మెల్లెడన్ బలముఁ ♦ దెంపును గల్గిన దానవాళి ని
ర్జరులను నాగకిన్నరపి♦శాచమహోద్ధత రాక్షసావళిన్. ౬౪ 1072

చ. తునినిమితి మెందుఁజూచినను ♦ దోఁపదు వాజివరంబు దానినిం
గొనిచనినట్టివాఁడెచటఁ ♦ గొంకెనొ కాని కసంబడండ్రిఁకే
పనినొనరించువారము, శు♦భంబగుభంగిని బుద్ధినెంచి మా
కనుమతినిం డటంచడుగ ♦ నప్పలుకున్ విని క్రోధయుక్తుఁడై. ౭ 1073

చ. చని వెదకుండు కార్యమును ♦ జక్కనగున్ శుభముల్ ఘనంగు మీ
కని వచియించి యాసగరుఁ ♦ డంతటఁ జూచి ధరిత్రిఁ ద్రవ్వి వా
జిని గొనిపోవుచోరుని, బ్ర♦సిద్ధభుజాబలమొప్పఁ బట్టితెం
డని, కృతకృత్యులై మరలుఁ ♦ డంచును బల్కిన నాకుమారకుల్. ౧౦౪ 1074

చ. గురుమతియాగుగుండు కడుఁ♦గ్రోధము మీఱఁగ నిట్లుచెప్ప సా
గరులు రసాతలంబునకు ♦ గాఢజవంబునఁ బాఱి దాని భీ
కరముగఁ ద్రవ్వుచుండి యట ♦ క్ష్మాధరతుల్యముగా నెసంగుచున్
ధరణితలంబుఁ దాల్చెడు మ♦తంగజవర్యముఁ గాంచి రంతటన్. ౧౨౪ 1075

తే. అది విరూపాక్షనామమై ♦ యలరు రామ!
గజవరంబది పర్వత♦కాననసహి
తమగు భూతలమంతయుఁ ♦ దలధరించు
నమ్మహాగజ మాయాస ♦ మపనయింప. ౧౨ 1076

చ. మనమున నెంచి ఖేదమున ♦ మస్తకముం గదలించు నప్పు డు
ర్వినిఁ దగుఁ గంపనంబు రఘు♦వీర ధరాధిపపుత్రు లాదిశా
వనత నెసంగు హస్తికిని ♦ భక్తిఁ బ్రదక్షిణ మాచరించి మ
న్ననమెయిఁ బూజసల్పి యట ♦ నాగనివాసము వ్రక్కలించుచున్. ౧౫॥

క. చని తూఁర్పుదిక్కుఁ ద్రవ్వుచుఁ, గనఁజాలక యశ్వము నటఁ ♦ గ్రమ్మఱ నారా
త్తనయులు దక్షిణదిక్కును, గొనకొని భేదించి యందుఁ ♦ గుంజరమలరన్.

క. కని రద్దిమహాపద్మం, బను మహిమను గాంచి గొప్ప ♦ యద్రినిభంబై
తనరారి భూమిచక్రం,బును దాల్పఁగ నచ్చెరువును ♦ బొందిరి మిగులన్. ౧౭॥

క. దానికి నలువదివేవురు, భూనాథాత్మజులు విధిని ♦ మ్రొక్కి పశ్చిమరన్
గాన నగునంచుఁ జనిచని, దానిని భేదించి కనిరి ♦ దంతావళమున్. ౧౮॥ 1080

క. బలమున నెంతయుఁ దగు న, య్యిలాధిపతి పుత్రులందు ♦ నెసఁగెడు పృథులా
చలమున కీడగు దంతా,వళమును దిక్పాలకమును ♦ భాసిలుదానిన్. ౧౯॥

క. సౌమనస మనెడు దానిని, దామెల్లం గాంచి భక్తి♦తత్పరులగుచున్
క్షేమమునడుగుచు వలగొని, హైమవతీ దిశను ద్రవ్వ ♦ నవుడుద్యతులై. ౨౦॥

క. పనిఁబూని త్రవ్వి శోభన, తనువునఁ దగి భద్ర మనఁగ ♦ ధరణీతలమున్
ఘనశక్తిఁ దాల్చుచున్ హిమ,మును బోలుచుఁ దెల్లనైన ♦ భూరిగజంబున్.

క. కనుఁగొని వలఁగొని యాగజ,మును దాఁకి ధరేశతనయ♦ముఖ్యులనల మే
దిని ద్రవ్వ పూన్కి మెఱయుం,గను ద్రవ్విరి తురగవరము ♦ గనరై రెండున్.

క. ప్రాగుత్తరదిక్కును నా, సాగరులు గనంగఁ బోయి ♦ సమధికరోష
ప్రాగల్భ్యంబున భయకృ,ద్వేగంబునఁ ద్రవ్విరంత ♦ వీరులొకయెడన్. ౨౩॥

సీ. భీమకాయులు బల♦విక్రమసంపన్ను లతిశయమతులునై ♦ యలరువారు
వాసుదేవునిఁ బరా♦త్పరుని సనాతనుఁ గపిలావతారునిఁ ♦ గాంచి యతని
పరిసరముననె సం♦చరణమ్ము సల్పెడు యజ్ఞాశ్వమును గాంచి ♦ యతులహర్ష
మును బొంది వారలె♦ల్లను రఘునందనా! యతని యజ్ఞీయాశ్వ♦హారునిగాఁగఁ

తే. దలఁచి క్రోధాకులేక్షణ♦ములఁ జెలంగి
లాంగలముల ఖనిత్ర శి♦లలను బెక్కు
వృక్షములఁ దాల్చి పఱతెంచి ♦ యేపుమీఱ
నిలునిలుమని యదల్చుచుఁ ♦ బలికి రిట్లు. ౨౪ 1086

సీ. మాయధ్వరాశ్వంబు♦ మాయచేఁ గొన్నాఁడ, వోరి దుర్బుద్ధి! నీ♦వున్నయెడకు
వచ్చిన మము భూప♦వర్యుఁడౌ సగరునితనయులఁ గాఁగ నీ♦మనమునందుఁ
దెలిసికొమ్మనవారి ♦ పలుకులు విని రామ! కపిలుండు పృథురోష♦కలితుఁడగుచు
హుంకార మత్తఱి ♦ నొనరింప నసదృశవిభువుఁడౌ నమ్ముని♦వీరుచేత

తే. నాకుమారకులందఱు ♦ నచట భస్మ
రాసులై పడి, రట నగ♦రక్షితీశుఁ
డాత్మజులు చని బహుకాల ♦ మగుట యెఱిఁగి
కాంతి నలరారు మనుమనిఁ ♦ గాంచి పలికె. ౩౦ 1087

నలువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౪౧ - వ సర్గము.

యజ్ఞాశ్వము నంశుమంతుఁడు తెచ్చుట.

క. శూరుండవు కృతవిద్యా, సారపరిశ్రముఁడవీవు ♦ చంచత్తేజ
స్స్ఫారమునఁ బూర్వతుల్యుఁడ, వారయుమా! నీదు పితరు♦లరిగిన తెఱఁగున్.
క. తురగముఁ గొనిపోయిన త,స్కరు తెఱఁగుఁ బరీక్షసేయు ♦ క్ష్మాబిలముల ని
ర్భరవీర్యంబులఁ బొల్చెడు, నురుజంతువులుండు వాని ♦ నొప్పఁ జెఱుపఁగన్.
క. వాలును విల్లును గరములఁ, దాలిచి వంద్యులకు నెరఁగి ♦ తత్తురగమ్మున్
లీలఁ గొనినట్టి దుర్గుణ, జాలులఁ గ్రతువిఘ్నకరులఁ ♦ జంపుము వత్సా. ౩
క. కృతకృత్యుఁడవై నాదగు, క్రతువును నెఱవేర్ప రమ్ము ♦ కడు వే యనుచున్
క్షితిపతి నొక్కి వచించిన, మతిమంతుం డైన యంశు♦మంతుం డపుడే. ౪ 1091

చ. ధనువు ధరించి ఖడ్గమును ♦ దాలిచి శీఘ్రగతుల్ దగంగ భూ
పుని మనుమండు సన్నుతులఁ ♦ బొల్చెడు తండ్రులు నాధరిత్రిఁ ద్ర
వ్విన గురుమార్గముం గని వి♦భీతిని దానిని జొచ్చె రాజు నా
జ్ఞనుఁ దలఁదాల్చి యందొకటఁ ♦ గాంచెను దిగ్గజమున్ మనోజ్ఞమున్. ౬
తే. దైత్యదానవరక్షస♦త్పత్త్రిభోగి
గణముచేతఁ బిశాచ ని♦కరముచేతఁ
బూజితం బగుచుండు నా♦భూరిగజము
గాన గురుతేజుఁ డాతఁడు ♦ గాఢభక్తి. ౮ 1093

చ. వలగొని మ్రొక్కి దానిదగు ♦ భద్రముఁ బ్రీతిని బ్రశ్నసేసి తం
డ్రులదగురీతి నశ్వమును ♦ డొంగిలినట్టి దురాత్మచొప్పు ని
ర్మలతరభాషణంబులను ♦ బ్రశ్నమొనర్ప దిశాగజంబు స
ప్పలుకుల నాలకించి యిటు♦పల్కెఁ, గుమారక! నీకు మేలగున్. ౯ 1094

ఉ. వచ్చినకార్యముల్ సుఫల♦వంతములౌ ముఖవాజిఁగొంచు వే
యిచ్చటనుండి పోవఁగల ♦ వీవనిపల్కిన నాలకించి యా
సచ్చరితుండు దక్కినది♦శాగజసంతతి చెంతకేగుచున్
ముచ్చటలార న్యాయవిధి♦మున్ గ్రమమున్ దగఁ దప్పకుండఁగన్. ౧౦ 1095

క. వినయమునఁ బ్రశ్నసేయం,గను వాక్యము లెఱుఁగఁ జాలి ♦ క్రమ్రభణితిఁ దా
మును మాటలాడఁగా, నేర్చిన యాదిగ్గజము లతనిఁ ♦ జెల్వమరంగన్. ౧౧

తే. పూజలను దన్ని మఖవాజి♦తోఁ జనెదవు
గాక యని పల్కి పురికొల్పఁ♦గా నతండు
వడిగఁ జని పిన్నతండ్రులు ♦ భస్మరాశి
గా నొనర్పంగఁబడిన య♦క్కడకుఁ జేరి. ౧౨ 1097

మ. మునుపే వారిఁ గనంగఁ జాలక వగం♦బొందంగనై యున్నయా
తని చిత్తం బపు డచ్చటన్ నిపుణు బృం♦దంబై ధరంబొంది, యుం
డినచందంబు నెఱుంగుటన్ వగల నిం♦డెం దండ్రులిట్లాట నిం
తనఁగా రాని మహార్తి నేడ్చి యతఁడం♦తన్ దత్సమీపంబునన్. ౧౩ 1098

చ. తిరుగుచునున్న యశ్వమును ♦ దివ్యమఖీయముఁ గాంచెఁగాని య
ప్పురుషవరుండు శోకమును ♦ బొంది తపించె ననంతరంబ యా
ధరణివరాత్మజన్ములకుఁ ♦ దర్పణముం బొనరింప నెంచి పు
ష్కరమును గోరుచున్ వెదకెఁ ♦ గన్పడదయ్యెఁ దటాకమెద్దియున్. ౧౪ 1099

క. గురుతేజుఁడైన యాతం, డురుతరదూరమ్ముగనుట ♦ కొప్పెడు చూడ్కిన్
బరికించి వాయువేగుని, గరుడుని బితృమాతులుని ఖ♦గప్రభుఁ గనియెన్. ౧౫

చ. అతఁడు మహాబలుండు ప్రియ♦మారవచించెను బూరుషోత్తమా!
పితరులదౌ వధం బిది ప♦విత్రజనాదృతిఁ గాంచినట్టిదై
హితమయి యొప్పునట్లగుట ♦ నింక విచారముఁ బొందనేల? య
ప్రతిమమహత్వశాలియయి ♦ భాసిలు నక్కపిలుండు వారలన్. ౧౬ 1101

మ. గురుకోపాగ్ని దహించె బ్రహ్మముని రా♦ట్కోపాగ్నిదగ్ధాంగులౌ
ధరణీశాగ్రణి పుత్త్రరత్నములకున్ ♦ ధాత్రీస్థలింగల్లు పు
ష్కరముం గైకొని తర్పణంబొనరుపం ♦ గారాదు తన్నీరమున్
సురమార్గంబుననే నశించును గదా ♦ క్షోణీశపుత్త్రాత్మజా!. ౧౭ 1102

తే. ప్రాజ్ఞుఁడవు నీవు గాన నీ♦వార్త నీకుఁ
దెలియనిది గాదు హిమనగా♦ద్రితొలికూఁతు
రగును గంగాభవాని మ♦హాభుజా! త
గంగ నద్దానియందె సే♦యంగవలయు. ౧౮ 1103

క. గంగాజలములఁ దర్పణ,ముం గడు భక్తిని నొనర్చి ♦ మునుకొని సంతృ
ప్తిం గనఁగూడదు సజ్జన, సంగా! యాభస్మరాశి ♦ స్వర్ణది దయతోన్. ౧౯

ఆ. తడుపవలయు నద్ది ♦ తగ లోకపావని, గాన నట్లొనర్చి♦నేని లోక
కాంతయై చెలంగు ♦ గంగాభవాని సం, స్పర్శముననె నీదు ♦ జనకులెల్ల. 1105

సీ. అఱువదివేవురు ♦ హతపాపులై స్వర్గ మొందువారవ్విధి ♦ నొనరుపంగఁ
దగినది యాగంగ ♦ యగుఁ బురుషర్షభా ! కడుభాగ్యయుతుఁడవు♦గాన నశ్వ
మును గొని సగరునిఁ ♦ గనఁబోయి తాతదా యజ్ఞంబుసంపూర్ణ♦మౌవిధంబు
గా నొనరింపుము ♦ కన్నగుణోత్తమా! యనిన సుపర్ణు వా♦క్యంబును విని

ఆ. శౌర్యశాలి యతఁడు ♦ సరగ నశ్వముఁగొని
భూరిమైన జయశము ♦ పొదలుచుండ
మరలి వచ్చి యజ్ఞ♦మండపమున దీక్ష
నున్నరాజుఁ గాంచి ♦ ఖిన్నుఁడగుచు. ౨౩ 1106

క. తనదు పితృవ్యోదంతం,బును గరుడుఁడు చెప్పినట్లు ♦ పోవిడువక చె
ప్పిన నంశుమంతు వాక్య,మ్మును భయదమువినినృపుండు♦పొగులుచుఁబిదపన్.

ఆ. క్రమము దప్పకుండఁ ♦ గ్రతువును శాస్త్రాను,సరణిఁ బూర్తిసేసి ♦ స్వపురమునకు
యజ్ఞసిద్ధి జనిత♦మైనట్టి సిరి దగ, నరుగుదెంచి సగరుఁ ♦ డంత నాత్మ. ౨౪

క. సురనదిఁ దెచ్చుటకెంతయు, నరసియు నయ్యుపముదోఁప ♦ కలజడిఁబడి యా
నరపాలమణియు నవ్విధిఁ, జిరకాలము మంతనమ్ము ♦ సేయుక యవలన్. ౨౫

ఆ. చింతఁ బూని భూమి ♦ కాంతుఁడు ముప్పది,వేల వత్సరములు ♦ విశ్వమెల్లఁ
బాలనంబు చేసి ♦ పరమమౌస్వర్గంబు, నందె నాత్మవాంఛ ♦ యంతరింప.

నలుబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౪౨ - వ సర్గము.

—భగీరథుఁడు గంగకై తపం బొనర్చుట.—

క. సగరుఁ డిటు కాలగతి నొం,దఁగ మంత్రులు నంశుమంతు ♦ ధార్మికవరు రా
జుగఁ గోరి రతఁడు కీర్తిం, బొగడొందుచు రాజనివహ♦పూజ్యుండయ్యెన్.

క. అతనికి దిలీపుఁడను నొక, సుతుఁ డుద్భవమందెఁ గీర్తి♦శోభితుఁడగు నా
సుతునందు రాజ్యమిడి యు,న్నత కీర్తియతండు మాని♦నాయకయుతుఁడై.

ఆ. అతిపవిత్రమైన ♦ యాహిమవచ్ఛిఖ,రమున ఘోరతపము ♦ రమణ సలిపి
భూరినియతి నాత♦పోవని ముప్పది, రెండువేలయేం డ్లతండు పిదప. ౩౫ 1113

క. తనమదిఁగోరిన గంగా, జననముఁ గనులారఁ జూడఁ ♦ జాలకయె తపో
ధనుఁడైన యంశుమంతుఁడు, చనియెను స్వర్గమున; కంత♦జనపతి యగుచున్.

క. అతిశయ తేజుండగుచున్, మతిమంతుండగు దిలీప♦మానితనాముం
డతిదుర్భర పైతామహ, గతిఁదలఁచుచుఁ దండ్రి తత్పు♦గతిలబ్ధికినై. ౪౫ 1115

సీ. చాల దుష్కరమనఁ ♦ జాలుతపంబును జేసియు నుగతిసం♦సిద్ధి వారు
పొందునట్లుగఁజేయు♦పుణ్యంబు నొందఁగాఁజాలఁడక్కటయని♦స్వాంతమందుఁ

దలఁచి చింతించుచుఁ ♦ గలఁగిన మనమున నేయుపాయము నిశ్చ♦యింపఁజాల
కెట్లుగంగను దెచ్చు♦టెట్లు వారికి జలక్రియలాచరింపనౌ♦రీతిదేన

తే. వారిఁ దరియింపఁ జేయనౌ♦వారకనుచు
నతఁడు చింతాపరుండయ్యె ♦ నంతధర్మ
మున నతం డిట్లు సతతచిం♦తను మునింగి
యాత్మవిదుఁడయ్యునుండ, న♦య్యవనిపతికి. ౮ 1116

క. తనయుండు ధార్మికోత్తముఁ, డనఁబడెడి భగీరథాఖ్యుఁ ♦ డంత జనించెన్
ఘనతేజుఁడౌ దిలీపుం, డొనరిచె బహుసత్క్రతువుల ♦ నురుదక్షిణలన్. ౯

తే. విమలపథమున ముప్పది♦వేలవత్స,రములు రాజ్యంబుసేసి, ధ♦రావరుండు
సాగరుల నుద్ధరింపనౌ ♦ సరణిఁ గాన, కధికచింతామయవ్యాధి ♦ యావరింప.

చ. క్షితిపతి యాదిలీపుఁడు భ♦గీరథు రాజుగఁ జేసి తాను స్వా
ర్జితమగు పుణ్యకర్మమునఁ ♦ జెందెను స్వర్గము; నిట్టులా మహీ
పతిమృతుఁడైనఁ దత్తనయ♦వర్యుఁడు క్షత్రియమానినాఁగ వి
శ్రుతుఁడయి ధార్మికుండగుచు ♦ శోభిలియున్ సుతహీనుఁడౌటచేన్. ౧౦

క. సంతతిఁ బడయఁగఁ దనదగు, స్వాంతంబునఁ దలఁచె నంత ♦ సమధిక తేజో
వంతుండాతఁడు రాజ్యము, సంతానము లేమి నునిచె ♦ సచివుల పైనన్. ౧౧

క. సురనదిఁ దెచ్చుటయందా, పరమున గోకర్ణమనఁగఁ ♦ దనరు తుహినభూ
ధరపాదమ్మున కరిగి ద,శరథాత్మజ! దీర్ఘతపము ♦ సల్పెన్ భక్తిన్. ౧౨ 1121

క. తన నాల్గుపార్శ్వముల న,గ్నిని బ్రజ్వరిలంగఁ జేసి ♦ నింగిని సూర్యుం
గనుచున్ విజితేంద్రియుఁ డూ,ర్ధ్వనిహితబాహుండునయి త♦పంబొనరించెన్.

తే. ఒక్కమాసంబునందుఁ దా ♦ నొక్కపూటఁ
గుడుచుచుం బెక్కువేలేండ్లు ♦ ఘోరతపము
సలుపుచుండ సుప్రీతుఁడై ♦ సకలలోక
పతియు నీశ్వరుఁడౌ భగ♦వంతుఁ డజుఁడు. ౧౪ 1123

క. సురగణసమన్వితుండయి, సరసిజభవుఁ డరుగుదెంచి ♦ సాంద్రతపమునన్
నిరతుండైన భగీరథ, ధరణీశు మహాత్ముఁగాంచి ♦ తమి నిటుపలికెన్. ౧౫ 1124

సీ. ఓభగీరథ! వైభ♦వోన్నత, సువ్రతంబున నీవు చక్కఁగ ♦ ఘనతపంబు
చేసితి ప్రీతినిఁ ♦ జెందితి నీయెడ వరము వేఁడుమునాఁగఁ ♦ బరమనియతిఁ
దగు నాత్మతపమునఁ ♦ దనరెడు తేజంబు సొంపారవెల్గు నా♦క్షోణివిభుఁడు
భాగ్యరాశి నచించె ♦ భక్తిఁ గృతాంజలియై పితామహుమ్రోల ♦ నట్టె నిల్చి
యోభగవంతుఁడా! యొప్పుగ నేఁజేయు తపమునఁ బ్రీతచి♦త్తమున నలరు

ఆ. వాఁడవేని, నాత♦పంబునకున్ ఫల, మొద్దియైనఁ గల్గు♦నేని సగర
తనయులెల్ల మత్కృ♦తంబగు జలతర్ప,ణమ్మునందు నటు వ♦రమ్ము నిమ్ము. ౧౬

తే. వినుము నాకు ముత్తాతలా♦వీరి భస్మ
మల్ల గంగాంబుసంసిక్త ♦ మయ్యెనేని
శాశ్వతంబయి తనరారు ♦ స్వర్గమొందు
వారు వారెల్ల మఱియొక్క ♦ వాంఛగలదు. ౧౯ 1126

క. వనజజ ! యిక్ష్వాకుకులం,బునఁ బుట్టిన నాకునిమ్ము ♦ పుత్త్రైశ్వర్యం
బును మావంశము కృశతం, గనఁ గూడదుగా స్వధర్మ♦కలితంబగుటన్. ౨౦

క. వరమిది రెండవదని యా, ధరణీశుఁడు పల్కఁగాఁ బి♦తామహుఁడు మనో
హరపద తాత్పర్యంబు న,ధురము శుభంబునగు వాక్కు♦తో నిట్లనియెన్.

క. ఓరాజ ! మహారథ! నీ, కోరిక యిది ఫలయుతంబ♦గున్ శుభమగునీ
కారయ నిక్ష్వాకుకులో, ద్ధారకుఁడవె యాదువీవు ♦ తనయప్రాప్తిన్. ౨౨ 1129

చ. హిమగిరి దాపునం దనరు, ♦ నీనది జ్యేష్ఠతనూజయాఁ జుమీ !
హిమగిరికోధరారమణ ! ♦ యీనదిఁ దాల్ప శివుండె శక్తుఁడౌఁ
బ్రమథగణాధిపుండగు క♦పర్దిని వేడుము గంగ, దేవలో
కమునుద్యజించి క్రిందఁబడు ♦ కాలమునందగు దానియుర్వడిన్. ౨౩౪ 1130

చ. ధరణి సహింపఁజాల దల ♦ దానిధరింప శివుండు దక్క నిం
కొరుని సమర్థునిం గనఁగ ♦ నోపనటంచు నచించి గంగతోఁ
దరుణి, యితండు వేఁడుతఱిఁ ♦ దప్పక పీని ననుగ్రహింపుమా !
నరవర ! పోయివత్తునని ♦ నాకముకుద్గణుఁడై విరించియున్. 1131

నలువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౪౩-వ సర్గము.

### గంగావతరణము

క. సురనదితో నరపతితో, సరసిజభవుఁ డిట్లు పలికి ♦ స్వస్థలి కేగన్
ధరణి బొటనవ్రేలూనుచు, ధరణీశుఁడు నిలిచి చేసెఁ ♦ దపముతిభక్తిన్. ౧

తే. (కరములను బైకిఁ జాఁపి ని♦ర్గతనిజాశ్ర
యుఁడు నిరాలంబకుఁడయి వా♦యువు భుజించి
కదల కచ్చట స్థాణువు♦గతిని నిలిచి
రేయుఁ బవలును దపమొన♦రించె రామ !.) 1133

సీ. ఒకవత్సరం బిట్టు ♦ లుగ్రతపంబును జేయ నబ్దమునిండ ♦ శివుఁడు సర్వ
విశ్వవంద్యుఁడు తన♦వెలఁదిమిన్నను గూడి వచ్చి రాజును గాంచి ♦ పలికె నిట్లు
నరనాథ ! ముదమొంది♦నాఁడ నీయెడ; నీకు హితమొనరించెద ♦ హిమవదద్రి
తనయయా గంగను ♦ దలధరియించెద నని శంకరుఁడు పల్కె ♦ నంత మంచు

తే. మలకుఁ దోలిపట్టి లోకన♦మస్కృతయగు
గంగ యప్డు మహారూప♦కలితయగుచు
దుస్సహంబగు వేగంబు ♦ దోఁప శుభ్ర
భవశిరస్సునఁ బడియె న♦భంబు నుండి. ౪ 1134

చ. హరునిశిరంబునం బడుచు ♦ నప్డు తలంచె మనంబులోన నా
సురనది నన్నుఁ దాల్పఁదగు ♦ శూరులు లేరుగదా జగంబులన్
హరుఁ డితఁ డట్టి కృత్యమున ♦ కల్లనఁ బూనెఁ బ్రవాహయుక్తిశం
కరుఁగొని యారసాతలముఁ ♦ గానఁగఁ బోయెద సత్వరంబుగన్. ౫ 1135

ఆ. త్రిణయనుండు సురన♦దీ గర్వము నెఱింగి
యాగ్రహించి దాని ♦ నాత్మశిరసు
నందె యడఁప వలయు ♦ నవ్వలఁ బోనీక
యనుచు బుద్ధినెంచె ♦ నపుడు రామ!. ౬ 1136

తే. పెనుజడలగుంపు గహ్వర ♦ మనఁగ వెలయు
హిమగిరికి సామ్యమై పవి♦త్రము నయి తగు
శంకరుని మూర్ధమునఁ బుణ్య♦శైవలినియుఁ
బడియె దుర్భరవేగంబు ♦ పరిఢవిల్ల. ౭ 1137

క. ధుని యది యెట్టి ప్రయత్నము, లొనరించియు శివశిరంబు♦నుండి యిలఁ బడం
గను జాలకయు జటలగుం,పుననే చిక్కుపడి వెలికిఁ ♦ బోవఁగనైనన్. ౮

క. సామర్థ్యము లేకయె యో, రామా! యానదియు శివశి♦రంబుననే తా
వేమాఱు తిరిగె వర్ష,స్తోమము; రాజేంద్రుఁడచట ♦ సురశైవలినిన్. ౯ 1139

క. కనఁజాలక పరమతపం, బును బూనిన దానికిన్ శి♦వుండెంతయు నె
మ్మనమున సంతోషంబును, గని బిందుసరంబునందు ♦ గంగను విడిచెన్. ౧౦

క. సరసిజభవ నిర్మితమగు, సరసది యద్దానియందు ♦ శంకరుఁ డపుడా
సురనది విడువఁగ నది యా, సరణిన్ సప్తాకృతులుగఁ ♦ జనియెన్, రామా!.

సీ. మంగళజలములై ♦ మంగళకరములౌ హ్లాదిని పావని ♦ యన్లై నళిని
యనునివి మూఁడు తూ♦ర్పునఁ బ్రవహించెను శుభజలములగు చ♦క్షువును సీత
సింధువునను మూఁడు♦చెలఁగి పశ్చిమదిక్కుగాఁ బ్రవహించె; త్క్ష్మా♦కాంతుఁడైన
యాభగీరథువెంట ♦ నరిగె నేడవదైన గంగ యారాజర్షి ♦ కమ్రదివ్య

తే. రథముపైఁ గూరుచుండి వి♦రాజితనుగు
కాంతి యలరారఁ దాముందు♦గాఁ జనంగ
గంగ యాతనివెనువెంటఁ ♦ గదలిపోయె
గగనమునుండి హరమస్త♦కమునఁ బడుట. ౧౨ 1142

క. హరునితలనుండి విశ్వం, భర కేతెంచుటయు నందు♦వలనఁ గలుగు న

య్యురవడి బెడిదపుఁ జప్పుడు, పరఁగఁగఁ దజ్జలము భూమి♦పై వ్యాపించెన్.

క. జలములతోఁ బడు మత్స్యకం,బులచేఁ గూర్మములచేత ♦ మొసళుల, గుమిచే
నిల యన్ని జంతువులచే, నల రె నపుడు చిత్రభంగి ♦ నంత సురవరుల్. ౧౬

క. ముని యక్ష సిద్ధ గంధ,ర్వనికరసంబరమునుండి ♦ వసుధకు దిగు గం
గనుఁ జూచు కౌతుకంబునఁ, జనుదెంచిరి యాత్మలందు ♦ సంభ్రమమలరన్.

సీ. సంభ్రమంబులుమీఱఁ♦జనునగరములట్లు విపులవిమానముల్♦వెలయహయము
లమలకుంజరసమూ♦హములొప్ప నవ్వానిపై నెక్కి యానదీ♦పాతనతలము
నకు వచ్చి నిల్చిరి ♦ నైజాద్భుతౌజస్సు లలర నత్యుత్తము♦లై వెలుంగు
గంగాపతన మిప్పు ♦ గాంచనౌ, నత్యద్భుతంబుగనని దేవ♦తాగణంబు

ఆ. లరుగుదెంచె వారి♦యాభరణప్రభ, లమిత తేజములును ♦ నపుడు వెలయ
నబ్బుచాటులేని ♦ మార్తాండశతము వె,లుంగు భాతిగాఁ జె♦లంగె నపుడు.

చ. ఉరగఝషాళినక్రతతి ♦ యొప్పుగ నందుఁ జలించుచుండె నం
బరము తటిత్కదంబమున ♦ వ్యాప్తముగాఁ దనరారుచుండె న
త్వరగతి వేయిమార్గములఁ ♦ బాఱు ప్రవాహములందుఁ బొల్చు పె
న్నురుగులు హంసముల్ వెలయ ♦ నూత్నశరద్ఘనయుక్తిమీఱు న
ట్లరుదుగ నొప్పె నభ్రతల; ♦ మంత సురాపగ, కొన్నితావులన్. ౨౨ 1147

క. ఉపతరజవమునఁ బరుగిడు, ధరణీతల మునసురీతిఁ ♦ దగఁ గుటిలముగాఁ
బరఁగున్ దద్భాగంబుల, ధరసమముగ నొప్పు నాయ♦తంబుగ నిగుడున్. ౨౩

తే. తగ్గుభూములు గన్పడ ♦ డిగ్గిపాఱు
శిలలు తాఁకిన నెగురు, మి♦ట్టులగుతావు
లందు మెలమెల్లనం బోవు ♦ నరయనొక్క
విధముగాకది పాఱను ♦ వివిధగతుల. ౨౩ 1149

ఆ. ఒక్కచోట సలిల♦ముద్ధతి నూర్ధ్వము
ఖంబుగాఁగ నేగి ♦ కరుడులగుమి
గలుగు నీటితోడఁ ♦ గడఁగి మార్గోని మఱి
యెగసి క్రిందఁబడును ♦ సొగసుమీఱ. ౨౪ 1150

క. సురపథమునుండి యీశ్వరు, శిరస్సునం బచటినుండి ♦ క్షితిపైఁ బడి యా
సురనది సలిలము నిర్మల,తరముగ గతకల్మషముగఁ ♦ దా భాసిల్లెన్. ౨౫

క. సురగంధర్వమహర్షులు, ధరపై నివసించునరులు ♦ తత్తోయము శం
కరు శిరసునుండి జాఱుటఁ, బరమపవిత్రంబటంచుఁ ♦ బలుకుచు భక్తిన్. ౨౬

సీ. స్పృశియించి రంతట ♦ నిలకు శాపంబున నంబరంబుననుండి ♦ యరుగుదెంచి
నట్టివారలు స్నాన♦మాడి శాపమువీడి భాసురతజ్జల♦స్పర్శమునను

నిర్ధూతపాపులై ♦ నింగి త్రోవ మరల స్వీయలోకంబులఁ ♦ జెందిరట్లు
సుప్రకాశంబగు ♦ సురనదీజలములఁ గని మోదమంది లో♦కంబు స్నాన
తే. కృత్యమును సల్పి యపగత♦క్లేశమగుచు
రహిఁ దనర్చె; భగీరథ♦రాజమౌని
దివ్యరథమెక్కి తేజంబు ♦ దీటుకొనఁగ
ముందు చనుచుండ వెనువెంటఁ♦బోయె గంగ. ౩౦౹ 1153

సీ. దేవర్షిగణములు ♦ దితిజరాక్షసదానవులును గంధర్వయ♦క్షులును గిన్న
రులును మహోరగ♦ములు నచ్చరలు నందఱు భగీరథుని ర♦థానుగ యగు
గంగను గనుఁగొని ♦ కడుఁ బ్రీతులై వెంటఁ జనిరి; యారీతిని ♦ జలచరమ్ము
లరిగె; సరిచ్ఛ్రేష్ఠ♦యయి పాపబృందంబు నిర్మూలనముచేయు ♦ నేర్పుగలిగి
తే. దివ్యయశమునఁ గ్రాలు నా♦దివిజనదియు
నాభగీరథుఁ డెందెందు ♦ నరుగు దానుఁ
బోయె నాతని వెంబడి ♦ పోవు చోట
మార్గమున నొక్కచో మహా♦మహిమఁ గాంచి. ౩౩౹ 1154

క. అతిచిత్రకర్మకరణ ని,రతుఁడై తగు జహ్నుమౌని ♦ క్రతువరమును స
న్మతిఁ జేయుచుండ సురనది, యతివేగము ముంచె దాని♦నంతయుఁ గడఁకన్.
ఆ. జహ్నుమౌని యప్డు ♦ సరిదవలేపంబు, నెఱిఁగి కోపమడర ♦ నేపు మీఱ
దానిజలము నెల్లఁ ♦ ద్రాగెఁ జిత్రతరంబు, గాఁగ నంత దివిజ♦కాండ మెఱిఁగి.
సీ. అతివిస్మయంబున ♦ నమ్మహాత్ముని మనుజవరేణ్యుఁ బూజించి ♦ శైవలినిని
నమ్మహాత్ముని పుత్రి ♦ యగునట్లు కావింప నద్దానికాతఁడు ♦ హర్షమొంది
పావనములు గాఁగఁ ♦ బరిగణింపంబడు చెవులనుండి నదిని ♦ సృష్టిచేసె
నద్దానిచే గంగ ♦ యయ్యె జాహ్నవి మఱి; జహ్నుపుత్రిక యన♦జగతిఁ బరఁగె
ఆ. నంత దివిజగంగ ♦ యాభగీరథరథ, వరము ననుసరించి ♦ పాఱి యతని
కార్యసిద్ధిఁ జేయఁ♦గా సంద్రమును జేర, వచ్చెనపుడు బలి ని♦వాసమునకు.
క. క్షితిపతిమౌని భగీరథుఁ, డతియత్నముమీఱ గంగ ♦ నటఁ గొని చని యా
క్షితినున్న భస్మరాసిని, మతిఖేదము నొంది చూచె; ♦ మౌనితనదియున్. ౪౦౹
తే. తనజలంబుల నుత్తమ♦తరముల సగ
రక్షితీశ్వరసుతభస్మ♦రాశిఁ దడిపె
దాన గతపాపులై శాశ్వ♦తమగు స్వర్గ
మును గనంబోయిరెంతొ స♦మ్మదము మీఱ. ౪౧౹ 1159

నలువదిమూడవ సర్గము సంపూర్ణము.

## ౪౪ - వ సర్గము.

-బ్రహ్మ భగీరథుని కడకు వచ్చుట.-

చ. క్షితిపతి యిట్లు గంగ తన♦చెంతనె వచ్చుచునుండఁగా నరి
త్రుతిఁ గనఁబోయి సాగరులు ♦ భస్మతనొందినచోటికంత, ను
ద్ధతజవమొప్పఁగాఁ జనియెఁ ♦ దత్సలిలంబు నరేంద్రపుత్రసం
తతిపయిఁ బాఱఁగా నపుడు ♦ ధాత, జగత్పతితేనికిట్లనున్. ౧ 1160

చ. పురుషవరేణ్య! యాసగరు♦పుత్రకు లఱ్వదివేవురిప్డు ని
ర్జరులవిధంబునం గనిరి ♦ స్వర్గముఁ బ్రేతత నుత్తరించి; సా
గరజలమెంతకాలము జ♦గంబున నుండునో యంతదాఁక భూ
వర! సగరాత్మజుల్ సురల♦భంగి దివంబున నుండువారొగిన్. ౨ 1161

తే. గంగ యిది జ్యేష్ఠపుత్రి, కాఁ♦గలదు నీకు
నీవు తండ్రిగ నుండుట♦చే వఱలెడు
పేరితో భూతలంబున ♦ విశ్రుతయయి
తనరు; దివమున సంభవిం♦చిన కతమున. ౩ 1162

క. కనుఁ ద్రిపథగ యనునామం,బును; భాగీరథియనంగఁ ♦ బొల్చును నీపే
రున; నీనామవ్యయమునఁ, దనరారును దివ్యగంగ ♦ ధరణీనాథా!. ౪ 1163

క. సుర, నర, ఫణి, లోకంబులఁ, దరంగిణి విలాసమొప్పఁ ♦ దాఁ బాఱుటచేఁ
బరఁగును ద్రిపథగ యని యో,ధరణివరా! వినుము నీపి♦తామహులెల్లన్. ౫

క. పరితృప్తిఁ బొందునటులీ, తరంగిణీ సలిలములను ♦ దర్పణమున్ భ
క్తిరతి నొనర్చి ప్రతిజ్ఞను, సరిగా నెఱవేర్పవయ్య! ♦ సాంద్రఖ్యాతిన్. ౬

చ. తనరిన ధార్మికోత్తముఁ, డు♦దారమనీషుఁడు నై చెలంగు న
జ్జనపతి నీకుఁ బూర్వుఁడయి ♦ సాగరసంతతికెల్లఁ దండ్రియై
ఘనుఁడయి యొప్పి యిప్పనికిఁ ♦ గాఁ దమిఁ బూనెను గాని యిష్టసి
ద్ధిని గనఁజాలఁడయ్యె; నతి♦తీవ్రపరాక్రముఁ డంశుమంతుఁడున్. ౭ 1166

చ. సురనదిఁ దెచ్చుకార్యమును ♦ ఘోరతఁ బూనియు స్వప్రతిజ్ఞ, న
ద్ధరణివిభుండు చెల్లెడు వి♦ధంబునఁ జేయఁగఁజాలఁడయ్యె; భూ
సురగుణమండితుండనఁగ ♦ శోభిలి మానివరప్రభావతం
బరఁగిన యాదిలీపుఁడు నృ♦పాలకమానిగదా? భగీరథా!. ౧౦ 1167

చ. జనకుఁడు నీకుఁ బౌరుషము ♦ చాలగఁ గల్గిన వాఁడు క్షత్రధ
ర్మనిరతి నుండువాఁడు మఱి ♦ మత్సముఁడై తగువాఁడు సత్తపం
బున నదిఁ దెచ్చుకార్యమును ♦ బూనఁదలంచెనుగాని దానికై
యనువగుకృత్యమించుకయు ♦ నాతఁడు చేయఁ దలంపఁడయ్యెఁ జూ!. ౧౧

తే. అనఘ! పూరుషసత్తమా! ♦ యట్టిప్రతిన
నీవు చెల్లించినాఁడవు ♦ కావున నతి
పావనము సమ్మతంబునై ♦ వఱలు యశము
జగమునం బొందినాఁడవు ♦ శత్రుదమన!. ౧౨ 1169

సీ. గంగావతరణమ్ముఁ ♦ గావించితివి నీవు గావున దీన, జ♦గత్ప్రపూజ్య
ధర్మప్రతిష్ఠ ని♦తాంతము పొందితి వీనది నరవర ♦ యితరనదుల
వలెఁగాక సర్వదా ♦ భవ్యమై స్నానార్హ మగుఁగాన నీ♦తటిని జలము
లనుస్నానమొనరింపు♦మను జేశ. యద్దానఁ బరిశుద్ధుఁడవు,పుణ్య♦ఫలయుతుఁడవు

తే. కమ్ము; నీతాతలకు నుద♦కక్రియలిట
నాచరింపుము నీకు శు♦భాధికంబు
గలుగుఁగాత నరేశ యిఁ♦కన్ మదీయ
పదమునకు నేగెదన్ నీవు ♦ స్వపురికరుగు. ౧౫ 1170

చ. అనియిటుపల్కి దేవవరుఁ♦డై తగు లోకపితామహుండు పా
వనయశమొప్పువాఁడు తన♦వచ్చిన చొప్పునఁబోయె దేవలో
కనివసనార్థియై; యశము ♦ గ్రాలఁగ నొప్పు భగీరథుండు రా
జ్ఞునియుఁ గ్రమంబుగా స్మృతిస♦మూహము చెప్పినచొప్పు నెన్నుచున్. ౧౬

క. తనపూర్వులైన సగరుని, తనయులకుం దర్పణంబుఁ ♦ దగనొనరిచి త
క్కిన వారికర్లె యొనరిచి, తన పురికేగెం బవిత్ర♦తనుఁడై యతఁడున్. ౧౭

చ. పురమునకేగి సంపదలు ♦ పొంపిరి పోవఁగ రాజ్యమేలె; నో
తరణికులాబ్ధిచంద్ర! వసు♦ధావిభుఁడై యతఁడుండఁగా నరో
త్కరము వినష్టశోకమయి ♦ కమ్రసదర్థములున్ సమృద్ధిగం
బరఁగుచునుండ రోగములఁ ♦ బాసి ముదంబునఁ దేలె నెంతయున్. ౧౮

క. రామా! నీవడిగిన గం,గామహిమము విస్తరంబు♦గాఁ దెల్పితిఁగా
దే!, మహితశుభము లొందుము, శ్రీమమతను నిన్నుఁ బొందు ♦ శీఘ్రమె పతా్స!.

ఆ. సందెవేళ మించి ♦ చనసున్నయది నన్నిఁ
కేమి యడుగవలవ♦దెల్ల విప్రు
లందు ధరణిపతుల♦యందు నితరులందు
గంగ యిలకు వచ్చు ♦ క్రమమె వందు. ౨౦ 1175

సీ. ధన్యమై కీర్తిసం♦ధాయకంబయి యాయు వీయంగఁ జాలి యెం♦తేని వెలసి
పుత్రపౌత్రాదిక ♦ భూరిఫలప్రాప్తిదంబునై స్వర్గఫ♦లంబు నొసఁగు
నట్టిదై తగు దీని ♦ ననువొంద వినిపించునోవాని పితృగణ♦మురుముదంబు
నొందుదురు శుభమై ♦ యొప్పు నీయాఖ్యాన మవ్యగ్రచిత్తుఁడై ♦యాదరమున

ఆ. నెవ్వఁడు వినునో వాని♦కెల్లయిష్టంబులు, సిద్ధినొందు కీర్తి ♦ వృద్ధినొందు
నాయువెసఁగునఘము♦లన్నియు నశియించు, రఘుకులాబ్ధిచంద్ర!♦రామచంద్ర!.

నలువదినాలవసర్గము సంపూర్ణము.

---

## ౪౫-వ సర్గము.

విశాలాపుర వృత్తాంతము.

చ. అని యిటు మౌనిపల్కిన స♦హానుజుఁడౌ రఘువర్యుఁ డాదృతిన్
విని పరమాద్భుతంబుఁ గని ♦ వేడుకఁ బల్కె మునీంద్ర! నీవు చె
ప్పిన సురనిమ్నగాగమన♦వృత్తము, సంద్రము ద్రవ్వి పంచి రా
ట్తనయులు గాంగనీరమున ♦ దానిని నింపుటయున్ వినన్వినన్. ౨ 1177

ఆ. అద్భుతంబు పుణ్య♦మతిపావనంబుగా, నలరుచున్నయవి మ♦హాత్మ! యనుచు
మునివచించినట్టి ♦ ఘనపుణ్యగాథలఁ, దలఁచుచుండ రేయి ♦ తగ గతించె. ౩

చ. తెలతెల వేగినంత రణ♦ధీరుఁడు శత్రునిబర్హణుండు నా
జలజసఖాన్వయుండపుడు ♦ సాంధ్యవిధుల్ నెఱవేర్చి యంత ని
ర్మలమతినొప్పు కౌశికుని ♦ మౌనివరుం గని యోతపోధనా!
యెలమి దగంగ మీరు వచి♦యించినదంతయు వింటి శ్రద్ధతోన్. ౪ 1179

తే. అనుపమంబుగఁ బరగా రె ♦ నదియు దాని
వినుటచే నీనిశీథిని ♦ విమలమయ్యె
నట్టి గాథలవిని వాని ♦ నాత్మయందు
నెంచుచుండుట క్షణమట్లు ♦ తేగె రాత్రి. ౫ 1180

సీ. పుణ్యకర్మములను ♦ బొలుపార నొనరించినట్టి మానులకెక్క ♦ నర్హమగుచు
సుఖతరాస్తరణ, సం♦శోభితంబయి తగు నీయోడ మౌనీంద్ర!♦యిటకు మీరు
వచ్చుట నెఱిఁగి స♦త్వరముగ నిచ్చిన దిదె దీనిపై నెక్కి ♦ యెల్లనదుల
యందెక్కుడైన పు♦ణ్యామరనది దీని దాఁటుదమనుచు న♦య్దశరథసుతుఁ

తే. డాడినంత మహాత్ముఁడౌ ♦ నతనిమాట
విని మహాద్యుల భూపతి ♦ తనయయుగముఁ
గలిసి కౌశికుఁడప్పుడా ♦ గంగదాఁటి
దానియుత్తరతీరంబు ♦ గానఁబోయి. ౬ 1181

క. తనవెంట నదిని దాఁటిం, పను వచ్చిన మౌనివితతి ♦ బహుమానమునన్
దనిపి మరలించి తీరం, బున నించుక గూరుచుండి ♦ పురి యొంపలరన్. ౭

క. కనిరది విశాలయనుపే,రునఁదగు; నాపిదప మునివ♦రుండు దశరథా
వనిపాలసుతులఁ దోడ్కొని, చనియెన్ సత్వరముగా, వి♦శాలాపురికిన్. ౮

క. సురపురికిఁ దుల్యము మనో,హరమునునై యొసఁగు, నగర♦మది; యంత ధరా
వరసుతుఁడు ప్రాజ్ఞుఁ డమ్ముని, సురపతిఁగని చేతులొగ్గి ♦ శుభతమభణితిన్.౧౦॥
తే. పలికె మౌనీంద్ర! యాదివ్య♦పత్తనంపు
మహిమ యెయ్యది, యేరాజ♦మండనుండు
దీనినిప్పుడు పాలించు ? ♦ వానియన్వ
యం బదెయ్యది? విన మోద♦మలరె నాకు. ౧౨ 1185
క. వినిపింపు, నీకు శుభమగు, నన విని యమ్మౌనివర్యుఁ ♦ డానగరపురా
తనవృత్తాంతముఁ జెప్పం, గను బూనివచించె; నగర♦కథ నిఁక వినుమా!. ౧౩
ఆ. ఇందు జరగినట్టి ♦ వృత్తాంతమును మఱి
దానికనుగుణముగఁ ♦ దగినయింద్రు
చరితఁ దెల్పువాఁడఁ ♦ బరమశుభంబగు
నింక వినుము మున్ను ♦ కృతయుగమున. ౧౪ 1187
క. దితిసుతులతిబలవంతు, ల,దితిసుతులతిధార్మికులును ♦ ధీరులు బలసం
యుతులు నయిరంతవారల, మతులం దొకయూహతోఁచె♦మహితగుణమణీ!.
క. మనకెల్ల ముదిమి రోగని, ధనములు లేకుండుటెట్లో ? ♦ తగనట్టి విధం
బున నుండవలయునని చిం,తన సేయఁగ మార్గమొండు ♦ తనరె విధిగతిన్.౧౬॥
ఆ. పాలకడలిఁ జిలికి ♦ భాసమానామృత
మును గ్రహింపవలయు ♦ ననెడు నూహ
మనములందుఁ దోఁపఁ ♦ గను వారలద్దాని
నిశ్చయించి కార్య♦నిరతి మెఱయ. ౧౭ 1190
తే. అమితతేజులు గావున ♦ నహిపతియగు
వాసుకినిఁ జిల్కుత్రాడుగ ♦ భాసురమగు

—పాలసముద్రమును మథించుట.—

మందరాద్రిని గవ్వము ♦ మాడ్కిఁ జేసి
పాలకడలిని జిల్కిర ♦ వ్వారలెలమి. ౧౮ 1191
సీ. (వేయివర్షములంతఁ ♦ బోయిన వాసుకి శిరములు చాల భీ♦కరగతిఁ దగు
విషములఁ గ్రక్కుచు ♦ వెసఁ గొండశిలలను గోఱలఁ గరువంగఁ♦గొండఱాలు
జ్వలనసంకాశమై ♦ వెలయు హాలాహల విషమయి యొసఁగె న♦వ్విషముచేత
మనుజామరాసుర♦మండిత జగమెల్ల దహియింపఁ బడియె నం♦త సురలెల్ల
తే. నమ్మహాదేవుఁ బశుపతి ♦ నాదిదేవు
శంకరుని రుద్రుఁ గనఁబోయి ♦ శరణుఁ జొచ్చి
కావవే! కావవే! మమ్ము ♦ కరుణ ననుచుఁ
బ్రస్తుతింపఁగ దేవాధి♦పతియగు హరి, 1192

చ. కరముల శంఖచక్రములు ♦ గ్రాల నటం బొడసూపి పల్కె, సుం
దరముగు సుస్మితం బొలయ ♦ నాకవరేణ్య! త్రిశూలి! నీవు ని
ర్జరగణమందు నాద్యుఁడవు ♦ సర్వసుపర్వులు పాలసంభ్రముం
దరువఁగఁ దొల్తఁ గల్గినది ♦ తావకమై తగుఁగాదె గావునన్. 1193

తే. అగ్రపూజగ నెంచి యీ♦హాలహలము
నెమ్మి గ్రహియింపుమా! దేవ♦నికరమందు
నగ్రజుఁడవౌట దేవేశ! ♦ యనుచు నచట
హరి యదృశ్యతనొందె న♦య్యవసరమున. 1194

చ. హరిహయముఖ్యులెల్ల భయ♦మందుటఁ జూచి రమేశువాక్యముల్
వరుసఁ దలంచి యప్డు భగ♦వంతుఁడు హాలహలంబునుల్ భయం
కరము సుధారసంబువలెఁ ♦ గ్రన్నన లోఁగొని, వారి వీడి శం
కరుఁడు యథేచ్ఛగా నరిగెఁ ♦ గ్రమ్మఱ దేవతలెల్ల సంబుధిన్. 1195

చ చిలుకుచునుండ మంథరము ♦ చెందె నధోభువనంబు దేవతా
వళి మధుసూదనుం దలఁచి ♦ భక్తినుతించెను భూతరాశికిన్
జలరుహనేత్ర! నీవెగతి ♦ సర్వసుపర్వులకీవె దిక్కు నాఁ
బలుకఁగనేల మమ్మలమిఁ ♦ బర్వఁగఁ, గావవె కొండ నెత్తవే. 1196

చ. పనియిది దుర్లభంబగుట ♦ భద్రభుజాబలసార! నీవు ద
క్క నొరుఁడు శక్తుఁడే, యనినఁ ♦ గాంచనచేలుఁడు కూర్మతాకృతిం
గొని తనవీఁపునన్ నిలిపి ♦ క్షోణిధరంబును, క్షీరనీరధిన్
దనరఁగఁ బవ్వళించె మఱి ♦ దానవవైరి మహీధరాగ్రమున్. 1197

తే. హస్తతలమున ధరియించి ♦ యసురవరుల
నడుమ నిలువంగఁబడి గిరి♦నాయకుని ద
గంగఁ దరువంగఁ జొచ్చె లో♦కమయుఁడౌట
నాటఁగా దేవతలు ముద♦మంది చూడ.) 1198

ధన్వంతరి పుట్టుట.

సీ. అబ్దంబులొక్క స♦హస్రంబు గడువంగ దండకమండలు ♦ ధారియగుచుఁ
దొలుత ధన్వంతరి ♦ తోఁచె నవ్వలరూప మలరారు నచ్చరల్ ♦ గలిగి రమసు
లంబువుఁ జిలుకుట ♦ నలపురసంబును దానినుండియె వని♦తలు జనించి
రట్లుగావున నె యా♦యంగన లప్సరసలటంచుఁ బరఁగిరి ♦ చారుకాంతిఁ

తే. గ్రాలువారలువదికోట్లు ♦ గా గణింపఁ
బడిరి; తత్పరిచారికల్ ♦ వగున నింద
అంచు లెక్కింపఁదరమౌనె ♦ యప్సరసలు
తమకుఁ బతియెవ్వఁడగునని ♦ తారరయుమి. ౨౧౪ 1199

క. సురదానవులందెవరా, తరుణుల గ్రహియింపరైరి ♦ దానను వారల్
పరఁగిరి సాధారణలనఁ, దరువాతన్ వరుణపుత్రి ♦ తాఁ దోఁతెంచెన్. ౨౨

తే. భాగ్యశాలిని యానారి ♦ వారుణి యనఁ
గడలినుండియె యట వెలు♦వడి గ్రహించు
వారలెవ్వరో ? తనునని ♦ వరుస నరసెఁ
గాని దితిజులు గ్రహియింప ♦ మానిరంత. ౨౩ 1201

క. వారుణి, ననిందిత నసుర, వారముమాత్రము గ్రహించె ♦ వారుణిఁ గొనమిన్
బేరొంది రసురు, లన దివి,జారులు; సురవైరి యసురు ♦ లద్దానిఁ గొనన్. ౨౪

చ. సుర గ్రహియింప నంతదివి♦జుల్ పులకాంచితదేహులౌచు ని
ర్భరమగు సమ్మదంబుఁ గని ♦ భాసిలి రాఁగటఁ గౌస్తుభంబునాఁ
బరఁగెడురత్నమంత నర♦పాలకుమారక! యుత్తమామృతం
బరుదుగఁ బుట్టె సంభ్రమున ♦ నశ్వవరంబుదయించె ముందుగన్. ౨౬ 1203

తే. ఖ్యాతినది నొందె నుచ్చైశ్శ్ర♦వాఖ్య రామ !
యమృతమునకయి పోరాడి ♦ యసురదనుజ
వంశములు పెక్కుమడిసె, దే♦వతలు మీఱి
దానవులఁ ద్రుంచి వైచిరి ♦ దారుణగతి. ౨౭ 1204

చ. దనుజులు స్వీయమా బలము♦దారత నొందఁగ రాక్షసోత్కరం
బు నొకటిగాఁగఁ గూడ జగ♦ముల్ వెతఁజెందఁగఁ జేయుయుద్ధమ
య్యెను బహుఘోరరీతి నపు♦డే ప్రళయంబగు నట్టులౌటయున్
దనుజనిషూదనుండు బల♦దర్పసమగ్రుఁడు చక్రి యంతటన్. ౨౮ 1205

క. జగముల మోహింపఁగఁ జే,యఁగఁజాలిన మాయఁబూని♦యట మోహినినాఁ
దగు నాఖంబున నద్దను, జగణంబుననుండి సుధను ♦ సరగ గ్రహించెన్. ౨౯

తే. అక్షయుఁడు పురుషోత్తముం ♦ డాదివిష్ణు
వతిబలుండంత నెదిరించి♦నట్టి యసుర
లను నడఁచి తను శరణుసొ♦చ్చిన దివిజుల
బలసమగ్రులఁ గావించె ♦ భవ్యకరుణ. ౩౦ 1207

క. దనుజామర యుద్ధంబపు, డనూనభయదంబు వెలయ ♦ నమరులు శౌర్యం
బునఁ బొలిచి దితితనూజా,తనిచయమును ద్రుంచి రవలఁ ♦ దమి నింద్రుండున్.

తే. దితితనూజులఁ దునిమి ము♦దితుఁడయి ముని
సంఘచారణగణసుధా♦సహితముగను
నలరి లోకవ్రజంబు న♦హార్యశౌర్య
మమరఁ బాలించెఁ బరమేశు ♦ నాదృతిఁ గని. 1209

నలువదియైదవ సర్గము సంపూర్ణము.

౪౬-వ సర్గము.

—పుత్త్రశోకాతురయైన దితి తపంబు సేయుట.—

క. తనకొడుకు లీగతిని మృతిఁ, గనుటకుఁ బరితాపమంది ♦ కశ్యపుమారీ
చుని దితి, తనభర్తను గని,యనియెను, భగవంత ! నీదు♦నాత్మజులెల్లన్. ౧

క. బలమధికముగం దనరుట,వలన మదీయాత్మభవుల ♦ వధియించిరి సు
మ్మిల హతపుత్త్రికనైతిని, గలుషహరా! యింక దీర్ఘ♦కాలతపమ్మున్.౧౹ 1211

చ. ఒనరిచి దాని పెంపున స♦ముజ్జ్వలతేజుని నింద్రహంతయౌ
తనయునిఁ బొందఁగోరెదను ♦ ధర్మవిదుత్తమ ! యట్టి నేఁ దపం
బును సలుపంగఁబూనెదను; ♦ బుత్త్రుని శక్రుని జంపఁజాలి లో
కనికరనాయకుండునయి ♦ గ్రాలెడువాని నొసంగఁగాఁదగున్. ౩ 1212

తే. [మఱియు నాతనుజాతుఁడు ♦ మహితచాపుఁ
డతిబలుండును నాస్తిక♦సంతతియు నెఱఁ
గి సమవర్తియునై కీర్తి ♦ నెసఁగువాఁడు
గావలయు నట్టివానిని ♦ గనఁగ నిమ్ము.] 1213

క. అందులకై తపమొనరిచెదం దగ సిమ్మా! యనుజ్ఞ ♦ దయమెయి ననునా
నుంవరి పలుకులకు మరీచిం దంత్రీ యనెడు మౌని♦శీతకరుఁడొనన్. ౩౹ 1214

క. అలరుచుఁ గాశ్యపుఁ డిట్లని, పలికె మహాతేజుఁ డప్పు♦డరిమితదుఃఖా
కులయైన దితినిఁ గని యో, యలనా! నీకోరిక సఫ♦లంబగుఁ జుమ్మీ!. ౪ 1215

తే. నీకు శుభమగుఁ దపమె పెం♦న్నిధిగ నెంచి
సుతుఁడు ప్రభవిల్లునందాఁక ♦ శుచిగ నుండు
మట్టులుండిన ననిని శ♦క్రాంతకుండగు
తనయుఁ గనుదువు; వేయివ♦త్సరము లిట్లు. ౫ 1216

మ. పరిశుద్ధిం దనరారి యుండుదువ, యేఁ ♦ బద్మాక్షి ! లోకత్రయ
వముఁ జో పుత్త్రుఁడు గల్గు నన్ననుకం♦పన్ నీకునంచాడి, ని
ర్భరతేజుం డపుడాత్మహస్తమున, భా♦ర్యాదేహముం దాఁకి దుః
ఖరతిం బొందిన చిత్త మూఱడిలఁగాఁ ♦ గాంతో సరంబంటుచున్. ౬౹ 1217

తే. ఊఱడించుచు నల్లన ♦ నురుశుభమ్ము
నీకుఁ బ్రాపించునని పల్కి ♦ నిజతపోవ
నంబునకుఁ బోయె, భర్త వ♦రంబొసంగి
చనఁగ దితియును బరమహ♦ర్షమ్ము నొంది ౭౹ 1218

సీ. తనయుఁ గాంచెడు వేడ్క♦దనర విశాలాఖ్యపురికిఁ బూర్వస్థాన♦ముగఁ జెలంగు
చున్న కుశప్లవ♦నోన్నతస్థానంబుఁ జేరి తీవ్రతపంబు ♦ చేసె; దితియుఁ

దపమిట్లు సల్ప శ♦తక్రతుఁడు వినయాద్యమలగుణంబుల ♦ నతిశయిల్లి
పరిచర్యయొనరించె ♦ ఫలమూలకుశసమిజ్జలముల మఱియును♦జ్వలను నింక

తే. నెద్ది యాదితికోరున♦వెల్లఁ దెచ్చి
యొసఁగుచు నొడలుఁ పిసుకుచు ♦ నురుతరశ్ర
మముఁ దొలంగించునట్టి వీ♦వనలు విసరు
చును మఱియుఁ బెక్కుపరిచర్య♦లను నొనర్చె. ౧౦ 1219

క. ఏకాలమ్మున నాదితి, యేకార్యము సేయఁబనుచు ♦ నింద్రుండపుడే
యాకృత్యము నెఱవేర్చుచు, నీకరణిఁ సేవచేసె ♦ నెంతయు శ్రద్ధఁ. ౧౧

ఆ. వేయివత్సరములు ♦ వెలసెను బదియేండ్లు
కొఱఁతగాఁగ నపుడు ♦ కోమలాంగి
యింద్రుసేననెంచి ♦ యెంతయుఁ బ్రీతయై
పలికెఁ గపటహీన♦భాషణముల. ౧౨ 1221

చ. తనయుఁడు వేయివర్షములు ♦ దాఁటఁగఁ గల్గునటంచు నాదుప్రా
ర్థనమునఁ బ్రీతుఁడై త్రిదశ♦రాజ! భవజ్జనకుండు నాకు ని
చ్చెను వరమాకుమారుఁగనఁ ♦ జేయుచు నుందుఁ దపంబు నేను నిం
కను బదియేండ్లు తక్కువఁగఁ ♦ గన్పడుచున్నవి వీరసత్తమా!. ౧౩ 1222

తే. భద్రమగు నీకు నింద్ర! యా♦పదియుఁ జెల్లె
నేని సోదరుఁ జూచెద ♦ వెల్లకాల
మతఁడు నిన్నుజయింపఁగ ♦ నాత్మనెంచు
నతని నొడఁబఱచెదను నీ♦కై కుమార!. ౧౪ 1223

ఉ. వైరముఁబాసి నాకొడుకు, ♦ వాసవ! నీపయి భ్రాతృమైత్రిఁ బెం
పారఁగఁ గూడియుండుగతి ♦ నాదృతిఁజేసెదఁ జింతఁబాసి నా
కూరిమిపుత్రు నాతనిని ♦ గూడి జగత్త్రయిగెల్చి తజ్జయో
దారఫలంబు నీవతి ము♦దంబునఁ బొందుదువంచు వేడ్కతోఁ. ౧౫ 1224

తే. పలికె నాతనిసేవచే ♦ లలన మఱచి
యంత, నాదితి గగనమ♦ధ్యంబునందు
భాస్కరుఁడు వెల్గ నిద్ర లోఁ♦బఱుప నపుడు
తలనునుపఁ దగుచోటఁ బా♦దములుఁ జేర్చి. ౧౬ 1225

సీ. శయనించె నిట్టులా♦చాన, శీర్షస్థలిఁ బాదములను నిల్పి ♦ పాదయుగము
నునుపఁగాఁ దగుచోట♦నుత్తమమూర్ధజంబులనుంచి నిద్రించు♦పొలఁతిఁగాంచి
యశుచి యాట నెఱింగి ♦ యమరేశుఁడీ దితి గర్వించినదటంచుఁ♦గడఁగి నవ్వ
తనవైరి వధియింప ♦ ననువగు సమయము దొరకె నటంచుబ్బి ♦ తరుణిదేహ

తే. వివరమును జొచ్చి ధైర్యంబు ♦ వెలయ గర్భ
మేడు తునకలుగాఁ దెగ♦నేసె రామ!

యవ్విధంబున నూఱించు ♦ లపురునట్టి
కులిశమున గర్భమును, దెగఁ ♦ గొట్టునపుడు. ౧౯॥ 1226

తే. గర్భమది సుస్వరమ్ము త♦గంగ నేడ్చె
దాన దితియును మేల్కాంచె ♦ దనుజవైరి
యేడువకు యేడువకు మంచు ♦ నెనఁగు తేజ
మునరఁ బలుకుచు సదియేడ్వ ♦ నతఁడు దునిమె. ౨౦ 1227

చ. శతమఖుతోడ నాదితియుఁ ♦ జంపకు చంపకు! మంచుఁ బల్కె దై
వతపతి యంతఁ బల్లిదగు ♦ వాక్యమునుం దమి గౌరవించి యు
ద్ధతి కులిశంబు కేలఁ దగఁ ♦ దానటనుండక వచ్చి తల్లి నా
దృతిఁ గని పల్కెఁ గేల్మొగిచి ♦ దేవి! వచించెద నాలకింపుమా!. ౨౧ 1228

తే. అశుచివై తలవెండ్రుక ♦ లంఘ్రులుండ
ప్రక్కనునిచి నిద్రించితి ♦ వాసవాంత
కుని ద్వదాత్మజు నవకాశ♦మును గని వధి
యించితిని నేను నేడుగా ♦ నిపుడు తల్లి. ౨౨॥ 1229

నలువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౪౭ - వ సర్గము.

### సప్తమరుత్తుల చరిత్రము.

క. క్షమియింపఁదగుదు వీవని, యమరేంద్రుఁడు పల్కె నంత ♦ నాదితి గర్భం
బమరేశునిచేతన్ భాగము లేడుగఁ జేయఁబడుటఁ ♦ గని మదిలోనన్. ౧

మ. అతిదుఃఖాకులయయ్యుఁ దుర్జయుని, దే♦వాధీశునిం గాంచి హృ
ద్గతశోకంబునడంచి యాఱడిలి ప♦ల్కంజొచ్చె నింద్రా! బలా
హిత! నాతప్పునఁ జేసి గర్భమిది య♦య్యెన్ సప్తధా ఛేదితం
బు తగం జూచిన నీదుతప్పిటు, లవం♦బున్ లేదు నిక్కంబుగన్. ౨ 1231

క. తునియలుచేసిన గర్భం, బునకుం బ్రియమొసరుపంగఁ ♦ బోలును దానిన్
మనమునఁ గోరెదనిక నీ, తునియలు సప్తానిలులప♦తుల్ గావలయున్. ౩

సీ. ఈనాకుమారకు ♦ లేడ్వురు నింకవాతస్కంధ పతిపా♦లంబు గలుగు
దేవతలయి మఱి ♦ దివ్యరూపంబుల మారుతాఖ్యలను వ్యో♦మమునఁ దిరుగు
దురు గాక; యొక్కఁడం♦దుఁజరింపఁదగు బ్రహ్మలోకంబునం దింద్ర♦లోకమందు
నితరుఁడు తార్తీయుఁ ♦ డెనఁగు కీర్తిని వాయువనుపేర నభమున♦నల్లె తిరుగఁ

తే. దగును; తక్కిననల్వురు ♦ తనయులమర
పాలకా! నీదునాజ్ఞ దే♦వత్వమొంది

దిశల నాల్గింటి నిచ్ఛమైఁ ♦ దిరుగవలయు
నీకు శుభమగుఁగాక యో♦పాకవైరి. ౬ 1233

క. "మారుద" యని యప్పుడు బల, వైరీ! నీవనుటచేత ♦ వారు జగముల౯
మారుతు, లను విఖ్యాతి౯, గారవమునఁ గాంతురనుచుఁ ♦ గాంతవచింప౯.

క. బలసూదనుఁడు పురందరుఁ, డలరుచు దితిపల్కినట్టి ♦ యమ్మాటల, కం
జలి చేసి పల్కె నీదగు, పలుకు ప్రకారంబె యగును ♦ బద్ధతులెల్ల౯. ౮ 1235

క. అనుమానము లేదించుక, యును నీకొడుకులు సురత్వ♦మొంది తిరుగు వా
రనయము నీకు శుభంబగు, నని వారిటులాతపోవ♦నాంతరమందు౯. ౯ 1236

ఆ. నిశ్చయంబుచేసి ♦ నెమ్మిఁ గృతార్థులై
యాత్మపదము నొంది ♦ రనుచు వింటి
మెచటఁ దావసించి ♦ యింద్రుండు తపమును
జేయు దితికి సేవ♦చేసె మున్ను. ౧౦ 1237

క. తనరారు దేశమది యిదె?, వినవయ్యా రామచంద్ర! ♦ విషయంబున నిం
దును బొల్చు రాజవంశ,మ్మును దెల్పెద మీకులమునఁ ♦ బూర్వుండగుచు౯.

తే. యశమునం దగు నిక్ష్వాకు♦వలరె నతని
యంగనయగు నలంబుస♦యందుఁ బరమ
ధార్మికుండు విశాలాఖ్య ♦ తనయుఁ డలరె
నతఁడె నిర్మించె నీవిశా♦లాఖ్యపురము. ౧౧ 1239

సీ. అతనికిఁ గల్గె మ♦హాబలుండగు హేమచంద్రుఁ డాతనికి సు♦చంద్రుఁ డలరె
నతనికి ధూమ్రాశ్వుఁ♦డనుసుతుండుదయించె, నతనికిసృంజయుం♦డాత్మజుండు
వానికి శ్రీప్రతా♦పంబులుగల సహదేవుండు తనయుఁడై ♦ తేజరిల్లె
వానికిఁ గొడుకయ్యెఁ♦బరమధార్మికుఁడయి యలరుకుశాశ్వుఁడ♦య్యనఘమతికిఁ

తే. దేజమున నొప్పి శౌర్యంబు ♦ దేజరిల్ల
నలరుచున్నట్టి సోమద♦త్తాహ్వయుండు
కలిగెఁ; గాకుత్స్థుఁ డతనికిఁ ♦ గలిగె నతని
తనయుఁడైనట్టి సుమతి ప్ర♦తాపశాలి. ౧౬ 1240

క. సురసంఘప్రతిమానుం, డరాతిదుర్జయుఁడు నౌచు ♦ ననువొందఁగ నీ
పురమున వసించుచున్నాఁ, డరయఁగ నీసమయమందు ♦ నమలగుణాఢ్యా!.

సీ. ఇక్ష్వాకుకులమున ♦ నిపుడు పేర్కొనినట్టి వీరలే ప్రఖ్యాతి ♦ వెలయువార
లాయని సందియ♦మందకు మిక్ష్వాకుకరుణవిశాలాన♦గరమునకధి
పతులైన నరపతి ♦ వరులెల్ల దీర్ఘాయు రతిశౌర్యములు వెల♦యంగఁ బరమ
ధార్మికులయి మహా♦త్మ్యంబునఁ జెలువారు చుందురీ రాత్రియిం♦దుండుదమును

తే. ఖముగ, రేపుదయంబునఁ ♦ గడలి జనకుఁ
గానఁ జనవచ్చునని యొ; న♦క్కాలమందు
విమల తేజుఁడు సత్కీర్తి ♦ వెలయువాఁడు
నైన సుమతియు మునిరాక ♦ నాలకించి. ౨౦ 1242

క. తనబంధులు ఋత్విజులును, వెనువెంటఁ రాఁగ మౌని ♦ వృత్రారిఁ గనం
జని మిగులఁ బూజలొనరిచి, వినీతుఁడయి కేలుమోడ్చి ♦ పృథ్వీశుఁ డనున్.

తే. కుశలమే మీకు మౌనీంద్ర! ♦ కోరి మీర
లరుగుదెంచుట ధన్యుండ♦నైతి మీయ
నుగ్రహమునొందితిని సమా♦నుండు నాకుఁ
గలఁడె యింతటి పుణ్యంబు ♦ గలుగువాఁడు. ౨౧ 1244

నలుబదియేడవ సర్గము సంపూర్ణము.

## ౪౮-వ సర్గము.

### అహల్యావృత్తాంతము.

క. సుమతియు, విశ్వామిత్రుఁడు, తమతమ క్షేమంబు లొప్పి♦దము నెఱంగా
సుమతం దెలుపుకొనిరి యా,సుమతియు నవ్వేళ మునీంద్రుఁ♦జూచి మహాత్మా!.

సీ. మాకు శుభంబగుఁ♦గాక; కుమారకుల్ వీరిద్దరెవ్వరు? ♦ వీరియాకృ
తుల విధంబునుఁ జూడఁ ♦ దోఁచె విష్ణునిఁబోలునట్టి పరాక్రమం ♦ బలరువార
లనినాకు; దంతిసిం♦హములట్లు గాంభీర్య పౌరుషగమనముల్ ♦ ప్రబలుచుండ
వ్యాఘ్రవృషంబుల♦యట్లు భయంకర సవిలాసగతులు నె♦సంగుచుండఁ

తే. బొలిచిరీ వీరవర్యులు ♦ లలితపద్మ, పత్రసువిశాలనయనులై ♦ ప్రకటఖడ్గ
భూరితూణీరచాపముల్ ♦ పూని యశ్వి, దేవతలఁ బోలు రూపంబు ♦ తేజరిల్ల.

క. తను సుందరతకు నీశగు, మనూనయౌవనము వెలయ ♦ నలరారిరి వీ
రనిమిషు లిచ్చను క్షితినిం, గన దివమునుండి దిగిన♦గతి నుందురు మా!. ౩

సీ. మృదుపదంబులు కంద ♦ మిగులఁ గఠినమార్గముల నిటవచ్చిరి ♦ యేలరు వీరి
గాత్రసౌందర్యంబుఁ ♦ గాంచినఁగోరిక లన్నియు నెఱవేఱె ♦ యున్నమాడ్కి
కనఁబడుచున్నది ♦ క్షత్రరూపులు వీర్లెవరి పుత్త్రకులన్న ♦ యెఱుఁగుదీవు
కానఁ జెప్పుము దివా♦కరశీతకరు, లభ్రమునుబోలె నీదేశ♦మును నలంక

తే. రించుచున్నారు వీరు శ♦క్తిరమాన,మునను నింగితచేష్టితం♦బులఁ బరస్ప
రము సమానముగాఁ బొల్తు ♦ రమలశస్త్ర,ధారులౌ వీరు హేతువె♦ద్దానిఁబూని.

క. అతికఠినమార్గముల దాఁ, గతమేమొకో? తత్త్వమెల్లఁ ♦ గౌశిక! వినఁగో
రితినని యిట్లా ధరణీ,పతి యడిగిన మౌనివరుఁడు ♦ భవ్యోక్తులతోన్. ౫

క. తామందఱు సిద్ధాశ్రమ, సీమఁ నివసించుటయుఁ బ్ర♦సిద్ధముఖము, ను
ద్దామపరాక్రమమొప్పఁగఁ,దామై చెఱుపంగఁదోఁచు ♦ దనుజుల లీలన్. ౭

క. తునుముట జనకునియాగముఁ, గనఁబోవుట మొదలుగాఁగఁ ♦ గలవృత్తాంతం
బును విడువకుండఁ జెప్పిన, మునిపల్కుల నాలకించి ♦ భూమీశ్వరుఁడున్. ౮

మ. పరమోత్సాహము మీఱఁగా విధిగతిం ♦ బ్రాప్తించి నక్షత్రమహీ
వరసత్పూనుల భూరిబాహుబలులన్ ♦ భవ్యాతిథేయాస్పదులన్
బరమాభ్యాగతులన్ యథావిధిగ నొ♦ప్పం బూజఁ గావించె దా
శరథుల్ భూపతిపూజలంగొని తమి♦స్రంబుచ్చిరందాదృతిన్. ౯ 1252

చ. మునిపతితోడ రాఘవులు ♦ భూపతియింటను రేయిఁబుచ్చి వేఁ
గిన మిథిలాపురీగమన♦కృత్యమునం దమిమీఱఁ బోయి రం
త నిఖిలమానులా దశర♦థప్రియసూనుల కర్హపూజచే
సిన సుమతిన్ నుతించి మదిఁ ♦ జెందినసంతసమొప్ప నంతటన్. ౧౦ 1253

క. జనకునిపురమును శుభకర,మును మిథిలను గాంచి దానిఁ ♦ బొగడిరి మేల్మే
లని రాముఁడు మిథిలకు దా,పునఁ దగు వని నాశ్రమంబుఁ ♦ బూర్వతరంబున్.

తే. రమ్యమై నిర్జనంబయి ♦ రాజిలంగఁ
గాంచి గాధేయుతో మౌని♦కాంత!, శ్రీస
మృద్ధి గలయిది యాశ్రమ♦మే యనఁదగి
యున్న, దిటలేదు మౌనీంద్రు ♦ లున్నజాడ. ౧౨ 1255

క. ఏమిది యిట్లుండుట మును,పే, మునియాశ్రమమొ యిద్ది♦యే వినఁదలఁతున్
నామహితవాక్యకుశలుం,డౌ మునిపతి భూరితేజుఁ ♦ డపుడిటుపలికెన్. ౧౩

తే. సంతసంబయ్యె రామ! యా♦శ్రమమిదెవరి
దో? మహాత్మకుఁ డెవఁడు కో♦పోగ్రుఁ డగుచు
దీని శపియించెనో దీని♦తెఱఁగదెల్ల
నున్నరూపున వచియింతు ♦ నోకుమార!. ౧౪ 1257

క. మునుపిద్ది మహాత్ముండై, మునినాయకుఁడైన గౌత♦ముని యాశ్రమమో
యనఘా! దివ్యంబై యిది, తనరారుట దేవపూజి♦తంబగుఁ జుమ్మా!. ౧౫

క. అనులయశుండగు నాగౌ,తముఁ డిందు నహల్యఁగూడి ♦ తపమొనరిచె న
బ్దము లెన్నెన్నియొ యాతఁడే, నసురేశుఁడు మౌనిలేని ♦ యదనెఱిఁగి తగన్.

క. మునివేషంబును దాలిచి, చని యందు నహల్యఁ జూచి ♦ చపలాక్షీ! కా
మనిబద్ధచిత్తులగు వా, రనయము క్రీడించుచుందు ♦ రాత్మేచ్ఛమెయిన్. ౧౭

క. ఋతుకాలనియమమును స,న్మతిఁ జూడరు బ్రహ్మ నిన్ను ♦ మదిఁగోరి చమ
త్కృతిఁ జూపి సృష్టిచేసె; సు,దతి! నీతో సంగమంబుఁ ♦ దమిఁ జేయంగన్.

ఆ. మదిని గోరినాఁడ ♦ మహిళామణీ! రతి
యొకటె వాంఛ నాకు ♦ నొప్పఁ బుత్ర
వాంఛ లేదు నిజము ♦ పంచాస్యమధ్యమా!
యని సహస్రనయనుఁ ♦ డలరిపలుక. ౧౮॥ 1262

చ. మనమున నిట్టులెంచె సతి♦మానినివరుండితఁడు వేఁడఁడెన్నఁడున్
గనుక నొసంగ యీ నితఁడు ♦ కామవిమోహితుఁడై సురేశుఁడో
య్యాస ననుఁగోరుచుంట వెలి♦యంబడి యుండెనుగాదె యిప్పుడీ
తని మునినాథువేషమును ♦ దాల్చిన యింద్రునిఁగాఁ దలంచెనే". ౧౯ 1263

చ. అని యిటులా యహల్యమది ♦ యందు వినిశ్చయ మొప్పఁజేసి యా
తనిపయి నున్న ప్రేమమెయిఁ ♦ దద్రతముం దగఁ దీర్చె దుష్టబు
ద్ధినిగొని; యంత, వాంఛితము ♦ తీరఁ గృతార్థత నొందు సంతరా
త్మను సురపుంగవుఁ గాంచి వని♦తామణి యివ్విధిఁ బల్కె నేర్పునన్. ౨౦ 1264

ఆ. నేఁ గృతార్థనైతి ♦ నిర్జరేశ్వర! ప్రభూ!, బాగుసేయకిచట ♦ వేగపొమ్ము
మానదుంపవీవు ♦ కాన నిన్నును నన్ను, నెఫుడు కావవలయు ♦ నిటు నిలువక.

చ. అనుచు నహల్య పల్క సురనా♦థాధిపుడెంతయు నవ్వి యోనితం
బిని! పరితుష్టినొందితిని ♦ వేగమ వచ్చినదారిఁ బోయెదన్
మనమున శంక మానుమని ♦ మానిని నూఱడఁ బల్కి నాతిఁ గ్రొ
మ్మనసిజకేళిఁ దేలి యిఁక ♦ మౌనివరుం డరుదెంచునేమొకో?. ౨౨॥ 1266

తే. అనుచు ననుమానమొంది భ♦యంబు గదురఁ
బదయుగము తొట్రుపడఁగ, జ♦వంబు మీఱఁ
బర్ణశాలను దాసిని ♦ వదలి వెడలె
నింద్రుఁ డీరీతి వెడలి, మునీంద్రుఁ డపుడు. ౨౩ 1267

సీ. పుణ్యతీర్థోదకం♦బుల స్నానమొనరించి సమిధలు దర్భలు ♦ సంగ్రహించి
ప్రజ్వలజ్జ్వలనుని ♦ పగిది వెలుంగుచు భూరితపోబలం♦బునఁ బొదలుచుఁ
ద్రిదశదానవులచే ♦ నెదిరింపఁగారాక యప్రతిమప్రభా♦వాధికుఁడయి
తనదు గౌతమముని♦తల్లజుం డాశ్రమమును బ్రవేశింపంగఁ ♦ గని సురేశుఁ

ఆ. డతిభయంబునొంది ♦ యంతమ్ముతప్పిన, మోముతోడ నుండ ♦ మునివరుండు
తనదు రూపమొంది ♦ తగనిపనికిఁ జొచ్చి, నట్టి యమరనాథు ♦ నచటఁ గాంచి.

క. శీలమె యాభరణముగాఁ, గ్రాలెడు గౌతముఁడు రోష♦కలితుండయి యో
బాలిశ నాదూపమ్మున్, దాలిచి చేసితివె చేయఁ♦దగనట్టి పనిన్. ౨౫ 1269

తే. కాన నీయండకోశంబు ♦ కడువడిఁ బడుఁ
గాక యని శాపమిడె ముని♦కాంతుఁ డిట్లు

కోపమునఁ బల్కె శక్రుండ♦కోశపుడై
పృథివిపైఁబడె నిట్లు. శ♦పించి యతని. ౨౯ 1270

తే. అమ్మహాత్ముండు శపియించె ♦ నతివ నిట్లు
పెక్కు వేలేండ్లు నివసింపు ♦ మిక్కడఁ బవ
మాను భక్షించు మను భూత♦మండలమున
కగపడక భస్మరాశి శ♦య్యగఁ దగంగ. ౩౦ 1271

సీ. ఆహారములు లేక ♦ యధిక తాపంబున నీయాశ్రమమునందె ♦ యింక నిలువు
మరిదుర్జయుండైన ♦ యట్టి శ్రీరాఘవుం డతిఘోరమైన యీ♦యడవి కెపుడు
వచ్చునో యపుడు త♦ద్భవ్యపాదపరాగ సంపర్కమున గత♦శాపవగుచుఁ
బరిశుద్ధవౌదువు ♦ పరమాత్ము నాతని నాతిథేయంబున ♦ నలరఁ జేసి

తే. యంత లోభ మోహంబుల ♦ నవలఁ ద్రోలి
నాదు చెంగటఁ బమిమీఱ ♦ నీదు తనువుఁ
దాల్తువని దుష్టచారిణిఁ ♦ దనదు భార్యఁ
దిట్టి శాపంబునకును ము♦క్తిని వచించి. ౩౩ 1272

తే. అమ్మహాతేజుఁడీ యాశ్ర♦మావని విడ, నాడి చారణసిద్ధసం♦తతని షేవి
తము పవిత్రము నై తగు♦హిమవదద్రి, శిఖరముననను దపంబును♦ జేయుచుండు.

నలువది యెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౯-వ సర్గము.

రాముఁ డహల్యకు శాపవిముక్తి ననుగ్రహించుట.

చ. శతముఖుఁడుండ కోశమట ♦ జాఱి ధరం బడ నంత మోము దీ
నతఁ గన నగ్నిముఖ్యులగు ♦ నాకులఁ, జారణులన్ మహాముని
వ్రతతిని గాంచి పల్కెను సు♦పర్వపదంబుల నొప్పఁ గూల్పఁ దీ
వ్రతపము గౌతముండు ముని♦వర్యుఁడు చేయుచునుండ నేనునున్. ౧ 1274

క. అతనికిఁ గోపముఁ బుట్టించి తపమ్మును గూల్పఁబూని ♦ చేసితి దానిన్
హితమిద్ది కాదె? నిర్జర, తతి కాముని దీవ్ర మహా క్రు♦ధన్ శపియించెన్. ౨

తే. దానవిగతాండకోశుండ ♦ నేను నైతి
నాయహల్యను శపియించి ♦ యంతవిడిచె
మమ్ము శపియించుటం జేసి ♦ మానితపము
తగ్గఁ గాన హరించితిఁ ♦ దపసితపము. ౩ 1276

చ. సురవరులార! మానిగణ ♦ శోభితచారణులార! మీరలే
తరుణమునందు నిర్జరహి♦తంబును జేసిన నాకు ముష్కముల్

చ. మనమున నెంచి సుభ్రువు న♦మానుషరూపవిలాసయుక్తగా
నొనరిచి యుంట మాయఁగొని ♦ యొప్పుగఁ జేసిన భంగిగాఁ గనుం
గొనఁదగి పూవుఁదీవియల ♦ గుంపుమఱుంగున నుంట మంచుగ్ర
మ్మిన మెఱుఁగుల్ పయిన్ బెరయ ♦ మేదురచంద్రునిరీతి వెల్గుచున్. ౧౮ 1287
ఆ. [ధూమమావరింపఁ ♦ దోఁచువైశ్వానర
శిఖయుఁ బోలె మిగులఁ ♦ జెన్నుమీఱి]
జలమునడుమ వేఁడి ♦ సమసియు దుర్నిరీ
క్ష్యమగు సూర్యకాంతి ♦ గతి వెలుఁగుచు. ౧౯ 1288
క. మునివాక్యంబున రామునిఁ, గనుదాఁక జగత్త్రయమునఁ ♦ గలవారికిఁ గ
న్గొన రాకయుండి యప్పుడు, దనశాపంబంతమొందు ♦ తరుణమగుటచేన్.
క. మునికిని రాఘవులకుఁ దా, గనఁబడియెన్; దాశరథులు ♦ కాంతామణి నా
మెను గని పాదములంటుచుఁ, దనివారఁగఁ బూజసల్పఁ ♦ దరుణీమణియున్.
చ. తనపతివాక్యముల్ స్మృతికి ♦ దబ్బునరాఁగ సమాహితాత్మయై
ఘనులగు వారికర్హ్యవిధి ♦ గాఁ దగుపాద్యము నర్ఘ్యమిచ్చి యిం
కను నొనరింపఁగాఁ దగిన ♦ కార్యములన్నియు భక్తిమీఱఁ జే
సిన గ్రహియించె రాఘవుఁడు ♦ చిత్తము మోదరసంబు నందఁగన్. ౧౭
క. సురదుందుభినిస్వనములు, మొరసెన్ సుమవృష్టి దేవ♦ముఖ్యులు గురిపిం
చిరి; గంధర్వాప్సరసలు, సురపథమున నాడిపాడి ♦ శోభిలి రెలమిన్. ౧౮
క. అలరి యహల్యయు స్వతపో,బలమునఁ బరిశుద్ధదేహ♦భాసురయయి యి
మ్ముల రామాగమనమ్మును, దెలిసియె గౌతముఁడు రా, మ♦దిందమి పొదలన్.
చ. పెనిమిటి చెంతఁ జేర సుర♦బృందము మంచిదిమంచిదంచు న
వ్వనిత బహూకరించిరి త♦పఃపరిపాకము నొంది తేజమున్
ఘనమయి గ్రాలుచుండఁ దగు ♦ గౌతముఁ డప్పుడహల్యతో సుఖం
బున గని రామచంద్రునకుఁ ♦ బూజలొనర్చి యథాక్రమంబుగన్. ౨౧ 1294
తే. అందె నివసించి తపము సే♦యంగఁబూనె
రాముఁడంతట మౌనివి♦రచితపూజ
లర్హముగ నొంది యటనుండి ♦ యమ్మిథిలకుఁ
బోవసమకట్టి యాశౌన్య♦మునకు నరిగి. ౨౨ 1295

నలువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౫౦-వ సర్గము.

రామాదులు మిథిలఁ జేరుట.

క. అనుజునితోడను గౌశిక, మునివర్యునితోడ రాజ♦ముఖ్యుండగు న
జ్జనకుని మఖవాటము మౌ,నిని ముస్నిడుకొనుచుఁ జేరె ♦ నెమ్మి దలిర్పన్. ౧

క. క్రతుశాలంగని లక్ష్మణ, యుతుఁడై రాముండు పల్కె ♦ నో మునివర్యా!
మతిమంతుఁడైన జనక, క్షితిపతి మఖవస్తువితతి ♦ చెలువు వహించెన్. ౨ 1297

చ. కనుఁడిదె వేదపాఠకులు ♦ క్ష్మాసురవర్యులు వేనవేల సం
ఖ్యను బొలుపొందువారలు మ♦ఖక్రియకై బహుదేశవాసు లి
య్యనుఁ జనుదెంచినారు; మును♦లుండెడి తావులివో, హుతాశనా
దినిఖిలవస్తుభారములఁ ♦ దీరినబండ్లు శతంబు లొప్పఁగన్. ౩। 1298

తే. అడుగు వెట్టను సందులే ♦ కలరుచున్న
విట్టి సంకులమఖశాల ♦ నెందునైన
స్థలము గన్పడ దుండంగఁ ♦ దగినస్థలము
మనకుఁ గా నేర్పఱింపుఁడీ ♦ యనిన మౌని. ౪ 1299

క. విని రాముని వాక్యంబుల, జనసంకులరహితమౌచు ♦ జలయుతమౌ పా
వనమైనచోటు వాసం,బున కేర్పఱచె నపుడటకు ♦ మునివరు రాకన్. ౫ 1300

క. జనకుండు విని శతానం,దుని జనవినుతుం బురోహి♦తుని ముందుగఁ దో
డ్కొని వినయంబున వేగం,బున నెదురుగఁ బోయె నంత ♦ మునివరు లెల్లన్.

తే. క్రతువు నెఱవేర్పవచ్చిన ♦ కారణమున
జనకు వెంబడి చని యర్ఘ్య♦మును సమంత్ర
కముగ ధర్మమ్మునన్ ముని♦కాంతునకిడి
యవలఁ జేయంగఁ దగిన పూ♦జాదికంబు. ౭। 1302

చ. హితముగఁ జేసిరంతట ము♦నీంద్రుఁడు పూజ గ్రహించి మేదినీ
పతి కుశలం బవిఘ్నముగ ♦ భద్రముగాఁ జెలువారి సాగునే
క్రతువని ప్రశ్నసేసి ముని♦రాజుల ఋత్విజులన్ దమిం బురో
హితునిని క్షేమమారయుచు ♦ నెంతయుఁ బ్రీతిలెఁ దత్సమాయుతిన్. ౮।

చ. జనకమహీశుఁ డంత ముని♦సత్తముఁ గౌశికుఁ గాంచి యిట్లు హో
మునులను గూడి మీరిచటఁ ♦ బొల్చెడు నాసనసంఘమందు నిం
దును దమిఁ గూరుచుండుఁడని ♦ దోసిలియొగ్గి వచింప నాతఁడున్
మునులును గూరుచుండిరట ♦ భూపతి చెప్పినరీతి నవ్వలన్. ౧౧ 1304

క. జనకుఁడుఁ బురోహితుఁడు నిం,కను గల్గిన మంత్రివరులుఁ ♦ గ్రమముగ నాయా
సనముల నలంకరించిరి, కని యీవిధమెల్ల భూమి♦కాంతుం డంతన్. ౧౨ 1305

తే. గాధినందను మునిచంద్రుఁ ♦ గాంచి నేఁడు
గా, మదీయాధ్వరము సమ♦గ్రఫలకలిత
మయ్యె దానను సురసత్య♦మయ్యె దాని
నుండనిం డట మీరును ♦ నిండువేడ్క. ౧౩ 1306

క. చనుదెంచినారు మీదర్శనముననే యజ్ఞఫలము ♦ సమధికముగఁ గాం
చినయట్టులయ్యె నీవీ, మునివర్యులఁ గూడి యజ్ఞ♦మును గను దమితోన్. 1307

సీ. క్రతుశాలకును రాఁగఁ ♦ గడు ధన్యుఁడనె నైతిఁ
దమకృప కేను బా♦త్రంబునైతి
బ్రహ్మ మునీంద్ర! "యఋ♦ధ్వర్యులు యజ్ఞంబు
నకును బండ్రెండుది♦నములు కొఱఁత
యనివచించిరి" యని ♦ చనినంత దేవత
లాత్మభాగంబుల ♦ నందుకొనఁగ
వత్తురప్పుడు మీరు ♦ వారిదర్శింపనో
ననిపల్కి మోమున ♦ నధికసంత

తే. సమ్ము నాట్యమ్ము సల్పఁగా ♦ నమ్మునీంద్రు
మరలఁ గన్గొని వినతుఁడై ♦ మనుజవిభుఁడు
జనకుఁ డాధృతిమీఱ నం♦జలి ఘటించి
యబ్బురము వెల్లిగొనఁబల్కె ♦ నార్యవర్య!. ౧౬ 1308

కౌశికుఁడు రామలక్ష్మణులవృత్తాంతము జనకునకుం దెల్పుట.

సీ. మీకు శుభంబగుఁ ♦ గాక! కుమారకుల్ వీరిర్వు రెవ్వరు ♦ వీరియాకృ
తుల విధంబును జూడఁ ♦ దోఁచె విష్ణునిబోలునట్టి పరాక్రమం ♦ బలరువార
లనినాకు; దంతిసిం♦హములట్లు గాంభీర్య పౌరుషగమనముల్ ♦ ప్రబలుచుండ
వ్యాఘ్రవృషంబుల ♦ యట్లు భయంకర సవిలాసగతులు నె♦సంగుచుండఁ

తే. బొలిచిరీ వీరవర్యులు ♦ లలితపద్మ, పత్రసువిశాలనయనులై ♦ ప్రకటఖడ్గ
భూరితూణీరచాపముల్ ♦ పూని యశ్వి, దేవతలఁబోలు రూపంబు ♦ తేజరిల్ల.

క. తనుసుందరతకు నీడగు, ననూనయౌవనము వెలయ ♦ నలరారిరి వీ
రనిమిషు లిచ్చను క్షితినిం, గన దినముననుండి దిగిన ♦ గతినుందురు సూ!. ౧౯

సీ. మృదుపదంబులు గంద ♦ మిగులఁ గఠినమార్గముల నిటవచ్చిరి ♦ యలరు వీరి
గాత్రసౌందర్యంబుఁ ♦ గాంచినఁ గోరికలన్నియు నెఱవేఱి ♦ యున్నమాడ్కి
కనఁబడుచున్నది; ♦ కమ్రరూపులు వీర లెవనిపుత్రకులన్ని ♦ యెఱుఁగుదీవు
కానఁ జెప్పుము దివా♦కరశీతకరు, లభ్రమును బోలె నీదేశ♦మును నలంక

తే. రించుచున్నారు; వీరు శ♦రీరమాన
మునను నింగితచేష్టితం♦బులఁ బరస్ప
రము సమానముగాఁ బొల్తు ♦ రనులశస్త్ర
ధారులౌ వీరు హేతువె♦ద్దానిఁ బూని. ౨౧ 1311

ఆ. చిన్నిజుట్టుతోడఁ ♦ జెలఁగుచు నుండియు, వచ్చినారు వీరు ♦ సచ్చరిత్ర!
దీనికారణంబుఁ ♦ దెలియంగఁ గోరెదఁ, గరుణఁ జెప్పుఁడన్నఁ ♦ గౌశికుండు.

చ. విని, జనకక్షితీశమణి ♦ వేడుకఁ బల్కె నసల్కు తెల్ల ని
ట్లనియె మహామతీ! దశర♦థావనిపాలకు నాత్మజన్ము లీ
ఘనులు మదాశ్రమంబునకుఁ ♦ గారణముండియె తోడి తెచ్చితిక్
దనుజులఁ జంపి రందుఁ గ్రతు♦తంత్రవిఘాతకులన్ దురాత్ములన్. ౨౨౪ 1313

సీ. అని యటనుండి యు♦గ్రాసురసంకుల భయదాటవులను ని♦ర్భయముగాఁగ
వారువచ్చుటవిశా♦లాభిఖ్యనగరంబుఁ గాంచుటయు నహల్యఁ♦గనుఁగొనుటయు
గౌతమముని సమా♦గమనంబు నటనుండి పెనువింటిసారంబు ♦ గనఁగ నచ్చి
నట్టి వృత్తాంతంబు ♦ ననువొందఁగా సుహాతేజుఁడా జనకధా♦త్రీవిభునకు
తే. సర్వమును జేర్చి మునిజన♦సత్తముండు
తపమునందగు తేజంబు ♦ దనర వెలయు
నట్టి గాధేయుఁ డెఱిఁగించి ♦ యంతనూర
కుండె నవ్వల జనకరా♦ణ్మండనుండు. ౨౫౪ 1314

ఏబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౫౧ - వ సర్గము.

### విశ్వామిత్ర చరిత్రము.

చ. మనమునఁ బొంగె; ధీవిభవ♦మండనుఁడై తగు కౌశికుండు చె
ప్పిన వచనంబులన్ విని ప♦విత్రమహత్తరతేజుఁడైన య
జ్జనకు పురోహితుండు కడు♦సంతసమంది ప్రహృష్టరోముఁడై
తనరెను గౌతమాత్మజుఁ డ♦తండగు జ్యేష్ఠుఁడు తత్సుతావళిన్. ౧౪ 1315

తే. గొప్పదనమునఁ దేజంబు ♦ కొమరుమిగుల
వెలయు నాశతానందుండు ♦ విస్మయమును
బొందెఁ దనతల్లిశాపంబుఁ ♦ బోవనడఁచి
నట్టి శ్రీరాముఁ గనుఁగొన్న ♦ యంతమాత్ర. ౨ 1316

క. తనముందట సుఖముగ నాసనములఁ జెలువారుచున్న ♦ క్ష్మాపతి సుతులన్
గని కౌశికమునివరుతోఁ, ననియె శతానందమౌని ♦ యనఘ! మునివరా!. 3

మ. చిరకాలంబు తపంబు సేయుచు యశ♦స్సిద్ధిన్ మదిన్ గోరి సు
స్థిరచిత్తంబున నొప్పు నాజనని నీ♦చే నీధరాధీశపు
త్రరమాకాంతున కందుఁ జూపఁబడెనే ♦ రాజిల్లు తేజంబునం
బరఁగుంగావున నామె పూజ్యుఁడగు నీ♦భద్రాత్ముఁ బూజించెనే. ౪౪ 1318

తే. కందమూలఫలప్రము♦ఖముల నితఁడు
సర్వదేహిపూజ్యుండని ♦ స్వాంతమందు

నెఱిఁగి పూజించెనే మహా♦ర్షీంద్ర! మున్ను
జిష్ణు వాగ్వాగురాళికిఁ ♦ జిక్కి యతివ. ౬ 1319

చ. ఒనరుపరానికృత్యమున ♦ కున్ముఖురాలగుటాదిగాఁగఁ గ
ల్గిన చరితంబు నెల్ల నెఱిఁ♦గించితివే కద యీనృపాలనం
దనునకు; నీకు భద్రమగు ♦ నాజనయిత్రియు రామదర్శనం
బునఁ గృతకృత్యయై పిదపఁ ♦ బూజ్యుని భర్తను గూడెనే మునీ. ౭ 1320

క. జనకుండు రాముఁ బూజిం,చెనె; హిమవంతంబునుండి ♦ చెచ్చెఱఁ జనుదెం
చిన నాతండ్రికిఁ బూజం, బొనరించెనె! యితఁడు దారఁ ♦ బొందునటు తగన్.

ఆ. నాగురుండు మనసు♦నం గోపమును మాని
యాశ్రమమ్ముఁ జేరి ♦ నపుడు రాముఁ
డంతరంగభక్తి ♦ నభివాదనముసేసె
నే? మునీంద్ర! నాకు ♦ నెఱుఁగఁ జెపుమ!. ౯ 1322

తే. అని శతానందుఁ డడిగిన ♦ నతనివాక్య
సరణికిని మెచ్చి వాక్యవి♦శారదుండు
కౌశికుండు వచించె నీ♦కరణి మాని
చంద్ర! వినవయ్య యచ్చటి♦చరితమెల్ల. ౧౦ 1323

క. ఒనరింపఁ దగిన కృత్యం, బున నించుకయైనఁ గాల♦మును వ్యర్థముసే
సిన వాఁడఁగాను జక్కఁగ, నొనరించితి సమయమెఱిఁగి ♦ యుద్యమములరన్.

క. నీతల్లి యా యహల్యయుఁ, జేతోమోదమున భర్తఁ ♦ జేరెను మును వి
ఖ్యాతుండగు జమదగ్నిని, బ్రీతిని రేణుకయుఁ గూడు ♦ విధమున మానీ. ౧౧

చ. అనిమునిపల్క సంతసము ♦ నంది మహత్తరతేజుఁడైన యా
జనకపురోహితుండు గుణ♦సాంద్రుని రామునిఁ జూచి పల్కె రా
ట్తనయ! మహాత్మ! స్వాగతము ♦ దైవవశంబున సాటిలేని యో
గనియతి నొప్పుచున్న ముని♦కాంతుని నీతనిఁగూడి వేడుకన్. ౧౩ 1326

క. చనుదెంచితి విచ్చటి, కి, మ్మునివర్యుఁ డచింత్యకృత్య♦ములనెల్లను జే
సినవాఁడు తపము కలిమిన్, గనియెన్ బ్రహ్మర్షితన్ సు♦కాంతిమహితుఁడై.

క. గురుతేజుఁడైన యిమ్మునిఁ, బరమహితము నీకుఁ జేయు♦వాఁడని మది, నీ
వరయుము; భూరితపో భా,సురుఁడగు కుశికాన్వయాబ్ధి♦సోముఁడు నీకున్. ౧౪

తే. రక్షకుండై చెలంగుట ♦ రామచంద్ర!
ధాత్రి నీకంటె నరసిన ♦ ధన్యుఁడెవఁడు
కలఁడు మహితాత్ముఁడైన యీ♦కౌశికుని త
పోబలంబెట్టిదో విను ♦ పూన్కిమీఱ. ౧౫ 1329

తే. మఱియు నీతని చరితంబు ♦ నెఱి వచింతు
ధర్మమతియైన యట్టి గా♦తండు చాల
కాల మవనీశుఁడై యుండి ♦ కడఁగి స్వారి
సంతతిని ద్రుంచి ధర్మంబుఁ ♦ జక్క నడిపి. ౧౯. 1330

క. కృతవిద్యాపరిచయుఁడై, హితుఁడై మనుజాళికెల్ల ♦ నెంతయు నలరెన్
ఇతనిదగు నన్వయపు వి, స్తృతిఁ జెప్పెదఁ; గుశుఁడు వెలసె ♦ నెంతయుఖ్యాతిన్.

సీ. కుశుఁడు బ్రహ్మకు నగుఁ ♦ గొడుకు వానికి మహాబలధర్మశాలియై ♦ పరఁగుచున్న
కుశనాభుఁడుదయించెఁ ♦ గుశనాభునకుగాధియనువాఁడుకొడుకయ్యె ♦ నతనికతుల
తేజస్సునం దగి ♦ దివ్యకీర్తివెలుంగు నీముని పుత్త్రుఁడై ♦ యొనఁగె; నితఁడు
పౌరుషంబున నొప్పి ♦ బహువత్సరంబులు రాజ్యంబు పాలించెఁ ♦ బూజ్యభంగి

ఆ. నొక్కతఱి నితండు ♦ నుగుతరచతురంగ
బలములును జెలంగి ♦ గొలుచుచుండ
నవనితలముఁ జూడ ♦ నక్షౌహిణీసేన
వెంట బలసి రాఁగ ♦ వెడలె నంత. ౨౦ 1332

చ. జనపతి సంతతిన్ నగర♦సంఘము శైవలినీవ్రజంబు గో
త్రనికరపావనాశ్రము వి♦తానముఁ గాంచుచు సంచరించుచున్
ఘనుఁడగు నవ్వసిష్ఠముని♦కాంతునియాశ్రమముం గనంగఁ బో
యె; నది బహుద్రుమానళుల ♦ నెంతయు దట్టముగాఁ జెలంగుచున్. ౨౧

తే. వివిధమృగసంఘనిబిడమై ♦ విబుధసిద్ధ
చారణోరగగంధర్వ♦సంఘములును
గిన్నరులు సంచరింపంగ ♦ సన్నుతింపఁ
దగినదై పావనంబయి ♦ తనరి మఱియు. ౨౩ 1334

క. మనుజులపరిచయమున నొప్పిన సారంగములఁగూడి ♦ పెంపొందుచుఁ బా
వనపక్షిసేవితంబయి, కనుఁగొనఁగాఁ దగినదగుచుఁ ♦ గడు సన్నుతమై ౨౪

సీ. మఱియు వసిష్ఠాశ్ర♦మము భూసురర్షి దేవమునిసేవితమయి ♦ వఱలుచుండుఁ
దపమొనరించి య♦ద్దాని ఫలంబొంది నట్టి వారలు, జ్వల♦నాభులౌ మ
హాత్ములు, జలపవ♦నాహారు, లతిజీర్ణపర్ణాశనులు మూల♦ఫలములఁ దిను
వారలు, నిర్మల♦స్వాంతులు, జితదోషులును, నిర్జితేంద్రియు♦లును, నయి తగు

ఆ. మునులు సతతహోమ♦ముఖకృత్యనిరతులౌ
వాలఖిల్యమునులు ♦ వాసుదేవ
వరనఖములఁ బుట్టి ♦ వఱలు వైఖానస
ముఖులు చేరియుండఁ ♦ బొలుచుచుండు. ౨౫ 1336

తే. మఱియు నయ్యాశ్రమము పితా♦మహుని లోక
మింకొకటి దోఁచినట్లుగా ♦ నెసఁగుచుండఁ
గా మహాబలుఁడైన యీ♦గాధిసుతుఁడు
దానిఁ గాంచెను సంప్రీతి ♦ దనరుచుండ. ౨౮ 1337

ఏబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౫౨ - వ సర్గము.

చ. బలమున మీఱి వీర్యమున ♦ భాసిలి కీర్తిని గాంచియున్న యీ
యలఘుమనీషుఁ డెంతయును ♦ హర్షమునుం గని లోనికేగి యం
దలరు వసిష్ఠమౌని దివి♦జాధిపుఁ గాంచి నమస్కరించె ని
స్తులవినయంబునన్; మునియుఁ ♦ దోరపు వేడుక తొంగలింపఁగన్. ౧-౪ 1338

క. మీకెల్ల స్వాగతంబగుఁ, గాక యనుచుఁ బల్కి మౌని♦కాంతుఁడు తమినీ
భూకాంతున కిప్పించెను, బ్రాకట దివ్యాసనమును; ♦ రాజవరుండున్. ౫ 1339

సీ. మునిపతి దర్శితా♦సనమునఁ గూర్చుండె; నంత వసిష్ఠుండు ♦ న్యాయరీతి
ఫలమూలములనిచ్చెఁ♦ బార్థివుండవ్వాని మునిసత్ప్రసాదమం♦చును గ్రహించి
నిర్విఘ్నముగఁ దపో♦నియతి వర్తిల్లునే యగ్నికృత్యంబు ల♦భ్యంతరముల
నొందకయే! సాగు♦చున్నవే, శిష్యులకెల్ల క్షేమముగదా ♦ యెల్లవృక్ష

తే. ములు సమంచితవృద్ధిని ♦ బొలుచుచుండుఁ
గాదె! యని రాజతేజంబు ♦ గ్రాల నడుగ
నన్నివిషయంబులన్ క్షేమ ♦ మలరు ననుచు
మునియుఁ బ్రత్యుత్తరమొసంగి ♦ మోదమలర. ౯ 1340

చ. వనజజు నాత్మజుండు, ముని♦వర్యుఁడు దివ్యతపోమహాత్త్వమున్
గని వెలుగొందువాఁడిటుల ♦ క్ష్మాపతిక్షేమము ప్రశ్నసేసి యా
సనమునఁ గూరుచున్నఁ గని ♦ శాంతవచస్సుల రాజవర్య! నీ
కును గుశలంబె! ధర్మమునె ♦ గోరినవాఁడవు నీవు కావునన్. ౧౦-౧౪ 1341

*చ. ధనమును శాస్త్రచోదితప♦థంబుననే గణియించి పెంచి పా
లనమొగిఁ జేసి పాత్రము చె♦లంగినచోఁ దమి దానమిచ్చి యిం
పున నలరార నౌననెడి ♦ భూపతి వృత్తము తప్పకుండఁగా
జనులను ధర్మమార్గమునఁ ♦ జక్కఁగ రంజిలఁజేసి యేలుదే!. ౧౫ 1342

---

* చ. ధనమును శాస్త్రచోదితపథంబున...అనుపద్యమునకు మూ. 'ప్రజాః పాలయసే వీర రాజవృత్తేన ధార్మిక.' రాజవృత్త మనఁగా "శ్లో. న్యాయేనార్జనమర్థస్య వర్ధనం పాలనం తథా, సత్పాత్రే ప్రతిపత్తిశ్చ రాజవృత్తం చతుర్విధమ్." అను వ్యాఖ్యానాభిప్రాయము ననుసరించి తెనిఁగింపఁబడినది.

క. భృత్యుల కష్టసుఖంబుల, నిత్యస్మరయుచును వారి◆ నెమ్మి మనుతువే!
కృత్యంబని నీయాజ్ఞను, భృత్యులు తలఁదాల్చుచుందు◆రే కద! భూపా!. ౭॥

క. జితవైరి! నీశాత్రవ, వితతిఁ నిర్జించితి గద! ◆ వినుతుల శౌర్యో
ద్ధతి నడఁచువాఁడ వీవో, క్షితిపా! చతురంగములును ◆ జెన్నారుఁ గదా!. ౮

క. ధనమునకుఁ మిత్రులకుఁ, దనయులకుం బౌత్రులకును ◆ దగక్షేమమెగా
మనుజేశ్వర! యని యడిగిన, మునికిఁ వినయమునఁ గుశల◆మును వినిపించెఁ.

క. ముని నాయకుండు ప్రశ్నిం,చినవానికి నెల్లఁ జాల◆క్షేమమె యని యొ
య్యనఁ జెప్పి మహాతేజుం, డన ఘనుఁడగు మునిచంద్రుఁడుఁ మ◆హాహర్షమునఁ.

ఆ. కాంత సేసుముదముఁ ◆ గూర్చెడు కథలతోఁ
గుశలవార్తతోడఁ ◆ గోర్కి మీఱఁ
గాలమును గడిపిరి ◆ కడుఁ బరస్పరచిత్త
ములు చెలంగఁగా న◆రుఁడు మునియును. ౧౧ 1347

శా. సల్లాపంబులు తీర నుస్మితము లా◆స్యంబందుఁ జెల్వారఁగా
నుల్లాసంబున రాజుతోఁ బలికె ని◆ట్లో రాజవర్యా! సము
ద్యల్లక్ష్మీయుతి నొప్పు నిన్ను బలసం◆తానంబునుఁ స్వల్పసం
పల్లాభంబున నాతిథేయమునఁ ద◆ర్పంబూనితిఁ గావునఁ. ౧౨॥ 1348

ఆ. నేను జేయుపూజ ◆ నీవు గ్రహింపు నా, ప్రార్థనంబు నెల్ల ◆ సార్థకంబు
గా నొనర్పవయ్య! ◆ క్ష్మాపతి వీవాట, నతిథివర్యుఁడవు మ◆హామునీశ!. ౧౩॥

సీ. యత్నపూర్వముగ నీ◆కాతిథ్యమొనరింపవలయు ననుచు పచించు ◆ బ్రహ్మవాని
మాటల విని మహా◆మతిమంతుఁడా గాధితనయుఁ డిట్లనిపల్కె ◆ మునివరేణ్య!
యాతిథ్యమొనరింతు ◆ మని ప్రీతిఁబల్కినయంతనె యదిచేసి◆నట్లయయ్యె
భవదాశ్రమమ్మున ◆ వఱలు మూలంబుల ఫలసమూహంబులఁ◆బాద్యమునను

ఆ. నీదు దర్శనమున ◆ నెమ్మి నాచరించు,మునను సర్వవిధము◆లను దగంగఁ
బూజ సేసితిరి సు◆పూజ్యులు నాకు మీ,రాట నింతమాత్ర ◆ నలరినాఁడ.

చ. చనియెద మీయనుజ్ఞఁగొని ◆ సంయమివర్య! నమస్కరింతు నఁ
ఘనకరుణార్ద్రదృష్టిఁ గనఁ◆గాఁదగునంచు వచించు కౌశికుం
గనుఁగొని మాటిమాటికిని ◆ గాదిలిప్రేమ నుదారచిత్తుఁడా
ముని తనపూజఁ గైకొనఁగఁ ◆ బోలునటంచు బహూకరించినఁ. ౧౬॥ 1351

తే. ఎన్నిసారులు వేఁడిన◆యేని మరల
నాతిథేయముఁ గైకొని ◆ యరుగు మనుచుఁ
బ్రార్థనము సేయ భూపతి◆వర్యుఁ డట్లె
నిలిచెద నటంచు మునితోడఁ ◆ బలికె మఱియు. ౧౭॥ 1352

క. మునివర్యా! తమచిత్తంబున కెయ్యది ప్రియమొ, యట్ల ♦ పూనితిఁ జేయం
గ నటంచుఁ బల్కె నవ్వా,క్యనికరమున కెంతొ యలరి ♦ యనఘుం డంతన్.
ఆ. చిత్రవర్ణములను ♦ జెలఁగెడు తనదగు, కామధేనువుఁ దమిఁ ♦ గడఁగి పిలిచి
సత్వరమునరమ్ము ♦ శబలా! మదుక్తిని, నాలకింపు, చేయు♦మట్లె నీవు. ౨౦౹
క. మనుజేశర్షికి సేవక, జనులకు భోజనము పెట్ట ♦ సమకట్టితి నీ
వనుపమ పదార్థములనొ, య్యనఁ గూర్పఁగవలయు నర్హ♦మై తగుభంగిన్.
సీ. కామధుక్కను పేరు ♦ గలదు నీకయ్యది సార్థకమై చను ♦ నట్టులగుట
షడ్రసంబుల నెట్టి ♦ జనుఁడెద్ది కోరిన నద్దాని సమకూర్పు ♦ మతనికిఁ దగి
నట్టులిప్పుని నాకు ♦ నభిమతమని చేయు, మనుపమతర రసా♦యనము లమల
భక్ష్యపానీయముల్ ♦ భవ్యమధ్వాదిలేహ్యంబులు చోష్యంబు ♦ లన్నరాశి
ఆ. వలసి యున్నయంత ♦ లలితగతిం గూర్పు
మెల్లపనుల వేగ♦మే యొనర్పు
వలయుఁ జుమ్ము రాజ♦వర్యుఁడు భృత్యులు
సంతసమునఁ గుడిచి ♦ చనఁగవలయు. ౨౩౹ 1356

ఏబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౫౩-వ సర్గము.

కామధేనువు నిమ్మని విశ్వామిత్రుఁడు వసిష్ఠు నడుగుట.

చ. అరిగణసూదనా! రఘువ♦రాన్వయకంధిశశాంక! యమ్మునీ
శ్వరుఁ డిటుపల్కినన్ శబల; ♦ వాంఛితవర్షిణిగాన నెవ్వరే
వరుసను గోరినన్ బిదికె ♦ వారికివారికిఁ దృప్తియెట్టు ల
క్కరణిని; దేనె లిక్షువులు ♦ కమ్రమధూక సుమాసవంబులున్. ౧౹ 1357
సీ. మేలి పానకములు ♦ పేలాలు బహువిధభక్ష్యముల్ గురిసె శ♦బలమఱియును
వేఁడి యన్నపురాశి ♦ చూడఁ బర్వతమట్లు వెలసె మృష్టాన్నమ్ము♦లలరె సూప
ములు పర్వెఁ దీయనై ♦ పొలుచు దధిప్రవాహములలరారె; రు♦చ్యమ్ములగుచు
నాఱురసంబుల ♦ ననువొందఁ జేసిన పాడబాహ్వయములౌ ♦ సరసవస్తు
తే. వులును బెల్లముతోఁ జేయఁ ♦ గలిగినట్టి
వస్తువులు పాత్రములనిండ ♦ వఱలుచుండె
ఫేనవేలుగ; నప్పుడా♦విందుఁ గుడిచి
సంతసముఁ బుష్టియుం గల్గి ♦ సైన్యవితతి. ౪౹ 1358
క. మునివరు నాధేనువు నొ,య్యనఁ బొగడుచు సంతసమున ♦ నలరారిరి ఱేఁ
డును నంతఃపురకాంతా, జనములును బురోహితులును ♦ క్ష్మాసురవరులున్,

క. ఆవిందుఁ గుడిచి సంతస, మావహిలఁగ బొలిచిరంత ♦ నవనీశుఁడు సం
భావించి మౌని తన్నును, సేవకులను మంత్రివరులఁ ♦ జిత్తములలరన్. ౬

తే. తృప్తినొందించె విందుచే ♦ నెంతొ శక్తి
ననుచు మిక్కిలిసంతోష ♦ మంది మౌనిఁ
గాంచి యోమానిచంద్ర ! మీ♦రంచితముగఁ
బూజనీయులు మాకెల్ల ♦ నీజగమున. ౭ 1361

క. వినవయ్య ! యట్టి మీరిటు, ననుఁ బూజించితిరి ముదము♦నం బొంగెను నా
మనము, బహుసత్కృతులఁ జే,సినమీకు నమస్కరింతు ♦ క్షితిసురవర్యా !. ౮

ఉ. మాటలపొందెఱుంగుదువు ♦ మౌనివరా ! వచియింతుఁగాన నే
మాట యొకండు, ధేనువుల ♦ మంచివిగా నొకలక్ష నిచ్చెదన్
సాటియెలేని యీశబల ♦ సంతసమొప్ప ననుగ్రహింపుఁడీ
పాటి మహోపకారమును ♦ బాత్రుఁడఁ బొందఁగ నెట్టులన్నచోన్. ౯ 1363

క. తనజాతియందు శ్రేష్ఠం, బనఁదగు నదికాన రత్న♦మగుఁ గాదె మునీ!
జనవిభుఁడు రత్ననిచయం,బును గొనువాఁడౌట, రత్న♦మును నాకిమ్మా !. ౧౦

తే. ధర్మమ్ముఁ దలంచి చూడ ర♦త్నమిది నాది
కాని భూసురవర ! నీది ♦ కాదటంచు
భూపతి వచింపఁగా ముని♦పుంగవుండు
ధర్మమతి పల్కె మేదినీ♦ధవునితోడ. ౧౧ 1365

క. ఒకలక్షగోవులొసఁగిన, నీఁకనుం గోకోటిశతము ♦ లిచ్చిన రాజా
ప్రకటరజతరాసుల ని,చ్చి కడుం గోరిన నొసంగ ♦ సిద్ధము శబలన్. ౧౨

క. పరిపంథివినాశక ! యో, ధరణీశా ! నన్ను విడువఁ ♦ దగ దియ్యది, నా
పరిసరము విడువఁ జాలదు, పరికింపుము దీనినెల్ల ♦ స్వాంతమునందున్. ౧౩

సీ. ఆత్మవేత్తకుఁ గీర్తి ♦ యనువునఁ దపమును జేయునాకిద్దియే ♦ స్థిరముగాఁగ
నుండంగ దగినదై ♦ యొప్పునిర్జరులకు నిచ్చుహవ్యములఁ బి♦తృవరులకు నొ
సంగుకవ్యంబులు ♦ జ్వలనకృత్యంబులు భూతబలియు సమా♦పూర్ణిమాది
కర్తవ్యహోమముల్ ♦ కడకుఁ జెప్పెద నాదుప్రాణయాత్ర యునీశ♦బలసహాయ
ముననె చెల్లుచునుండు♦వినుముస్వాహాకారమును వషట్కారంబు♦ననెడుమంత్ర

తే. ములును వేదాది వివిధవి♦ద్యలును దీని
సాయమున సాగుచుండును ♦ సంశయంబు
లేదు సత్యంబు వచియింతు ♦ మేదినీశ !
యిదియె సర్వస్వరూపమై ♦ యొసఁగు నాకు. ౧౪ 1368

క. నిరతము సంతోషము నా, కరుదుగ నిచ్చునది యిదియె ♦ యవనీశ్వర నేఁ
బరికించి యిపుడు చెప్పిన, వరుస నితరకారణముల ♦ వలనన్ దీనిన్. ౧౫

క. ఇయ్యంగఁ జాల నీకని, యయ్యవనీత్రిదశమౌని ♦ యాడిన భూపుం
డయ్యావుఁ గొనఁగనక్కఱ,యొయ్యనఁదనుఁదొందరించు♦చుండఁగ వేడ్కన్.

క. పలుకులఁ నేర్పుటితన మవు, డలరారఁగఁ బలికె హాట♦కాంచితములుగాఁ
జెలఁగెడు నడిత్రాడులుమెడ,గొలుసులునంకుశములొప్పఁ♦గొమరు గజములన్.

తే. పదియు నాలుగువేల ని♦చ్చెదను; నాలు
గేసి తెల్లనిహాయముల ♦ నెసఁగునట్లు
పూన్చి హాటకమయములై ♦ పొలుచు చిన్న
గంటలన్ దగు రథములఁ ♦ గడుముదమున. ౧౮ 1372

క. ఎనిమిదివందల నొసఁగెద, ఘనకుల దేశములఁ బుట్టి ♦ గాఢబలములన్
దనరారు గుఱ్ఱముల నో,మునివర! పదునొక్క వేలు ♦ ముదమున నిత్తున్.౧౯ 4

సీ. స్వచ్ఛంబులౌ తను♦చ్ఛాయలు వేర్వేఱఁ జెలువార వయసును ♦ గలిగియున్న
గోవుల నీకొక్క♦కోటి నొసంగెదఁ గామధేనువు నిమ్ము ♦ కాంచనమ్ము
వరరత్నముల నెన్ని ♦ వాంఛింతువో వాని నిచ్చెద శబల నా ♦ కిమ్మటంచుఁ
బ్రార్థించు భూపతి♦పల్కుల వినుచును బూజ్యతముండైన♦మునియు, రాజ!

ఆ. యెట్టులైనఁగాని ♦ యీయ నీగోవును, రత్నమిదియె నాకు ♦ ద్రవ్యమిదియె
తలఁప నాకు జీవి♦తంబిదె సర్వస్వ,మిదియె పున్నమయగు ♦ నిది యమవస.౨3

చ. ఘనతరదక్షిణాన్విత మ♦ఖంబులు సత్క్రియలున్ దలంప గో
వుననె ప్రవృత్తిఁగాంచు విను ♦ భూవర! నే నొనరించునట్టి క
ర్మనిచయమెల్ల దీనినె స♦మస్తవిధంబుల సాగుచుండు నిం
కను బలుమాటలేల యొసఁ♦గంగను జాలను కామధేనువున్. ౨౪ 1375

ఏబదిమూడవ సర్గము సంపూర్ణము.

---

౫౪ - వ సర్గము.

—కామధేనువు విశ్వామిత్రు బలంబులఁ దునుమాడుట.—

చ. అనుచు వసిష్ఠమౌని తన♦యావునొసంగక యుంటఁగాంచి గో
వును బలవద్విధిం గొనఁగఁ ♦ బోలునటంచుఁ దలంచి యట్టులే
గొని చనుచుండ; నాశబల ♦ క్రూరభటుల్ తనునీడ్చుచుంటకున్
దనమది శోకముం బొదలఁ ♦ దానసె స్రుక్కుచు నేడ్చె బోరునన్. ౧ 1376

మ. తనలో నంతట నెంచె నివ్విధిఁ గటా ♦ ధర్మాత్ముఁడౌ మౌనిరా
జు ననున్ నిర్ఘృణుఁడై తగన్ విడిచెనే ♦ క్షోణీశ్వరా! దీనినిం
గొనుమంచిట్టుల యయ్యెనేమొ; యిపుడీ ♦ క్రూరాత్ములౌ రాడ్భటుల్
ననుఁగొంపోవుచు నున్నవారు గద దీ♦నన్ దుఃఖితాత్మం దవ్వరన్. 3 1377

ఆ. పావనాత్ముఁడైన ♦ బ్రహ్మర్షి కేనేమి, యొగ్గు సేయ లేది ♦ దేల యితఁడు
తలఁపకున్నవాఁడు? ♦ ధార్మికుఁడమ్ముని, యూరకున్నవాఁడు ♦ వీరిఁ జూచి. ౬
క. అనురక్తను నపరాధం,బును జేయని నన్ను విడిచె ♦ బుధనుతుఁ డాతం
[డని చింతించుచుఁ బలుమఱు, ఘన నిశ్వాసముల విడిచి] ♦ కడుఁగోపమునన్.
సీ. తన్నీడ్చుకొనిపోవు ♦ చున్న యాభృత్యులఁ బలువుర విదలించి ♦ వాయువేగ
మునఁ జని యమ్మహా ♦ త్ముని పాదముల చెంత కేగి వసిష్ఠుని ♦ యెదుట నిలిచి
ఘనదుందుభిస్వాన ♦ మును జేయుచును రోదనము సేయుచును, నా ర్త ♦ నాదమడర
జలజాసనాత్మజ! ♦ షడ్గుణైశ్వర్యసంపన్న! మహాత్మ యో ♦ బ్రహ్మతేజ!
తే. నన్ను నోమునివర! విడ ♦ నాడినావె?, యట్లు లేకున్న నృపభటు ♦ లిట్లు నన్ను
బలిమిఁ గైకొనిపోవంగఁ ♦ గలరె నీదు, సన్నిధానమునుండి యూ ♦ చందమునను.
చ. అనవిని బ్రహ్మమానియు మహా ♦ హాత్తరదుఃఖవిత ప్త చిత్తయా
చును దనచెల్లెలట్లు గడు ♦ శోకమునం దెడు కామధేనువుం
గని యిటుపల్కె నోశబల! ♦ కామితదాయిని వొచునున్న ని
న్నును విడనాడ, నెయ్యెడల ♦ నుర్ బొనరింపవు కీడు నాకుఁ జూ. ౮ 1381
చ. బలమునఁ జాలనుత్తుఁడయి ♦ పార్థివుఁ డీతఁడు నిన్ను నిప్డు దో
ర్బలము గలాఁడనంచు తన ♦ పత్తనసీమకుఁ గొంచుఁ బోవఁగాఁ
దలఁచెను నాకు నీనృపుని ♦ దర్పమడంచు బలంబు సాటిగాఁ
గలుగదు; నాతపోబలముఁ ♦ గన్పఱుపంజనునే నృపుండు మా!. ౯ 1382
చ. కలహమునం జయింతుననఁ ♦ గాదు బలాన్వితుఁ డుర్విపాలుఁడై
వెలయుటచేతఁ జంపినను ♦ విస్తృతపాపము నన్ను నంటునే
నెలమి సపర్యచేసితిని ♦ నింతకుఁ బూర్వమె యెన్నిభంగులం
దలఁచినఁ జంపరాదనుట ♦ తథ్యము వేఱొకపల్కు చెప్పెదన్. ౧౦ 1383
సీ. గుఱ్ఱముల్ రథములుఁ ♦ గుంజరముల మీఁది
ధ్వజములు నిండి క ♦ న్పడెడినిదియె
యక్షౌహిణీసేన ♦ యలరారు దీనిచే
బలవత్తరుండయి ♦ పార్థివుండు
దుష్కార్యమొనరించెఁ ♦ దోఁచదేమి యొనర్ప
నని పల్కఁగ విని వా ♦ క్యంపుసొంపుఁ
దెలిసిన యాకామ ♦ ధేనువు వినయంబు
తనరుచుండఁగ నమి ♦ తప్రకాశుఁ
తే. డయిన బ్రహ్మర్షి నింగాంచి ♦ యనియె నార్య!
క్షత్రియబలంబు స్వల్పమా ♦ త్మోనురుండె
బలమునం దెక్కుఁడగు; ద్విజ ♦ బలము నృపుని
ధగు బలంబునకన్న ది ♦ వ్య మధికమగు. ౧౩ 1384

క. అనిపెద్దలు పచియింతురు, మునివర! నీబల మచింత్య♦ముగదా నీకం
టెను విశ్వామిత్రుండును, ఘనవీర్యుండయ్యు మించఁ♦గాలేఁడు సుమీ!. ౧౩౪

క. నీవంటి తేజమందఁగ, నే వారికి శక్యమా, మ♦హీసురవర్యా!
నీవిపుడు బ్రహ్మబలము ప్ర,భావంబున నన్నుఁ జేయు ♦ బలవత్తరఁగాఁ. ౧౪౪

తే. బ్రహ్మబలమున నాకుఁ బ్ర♦భావవృద్ధిఁ
గలుగు నట్టులసేసి యి♦కార్యమునకు
నను నియోగింపుమా నర♦నాథు దర్ప
బలము ద్రుంతు దురాత్ముఁడై ♦ ప్రబలె నితఁడు. ౧౫ 1387

చ. స్థిరయశుఁడై చెలంగెడి వ♦సిష్ఠుఁడు గోవిటులాడ దానితో
నరిబలసారముం జెఱచు♦నట్టి బలంబు సృజింపుమన్న నా
ధరణిసురేంద్రువాక్యమును ♦ దా విని యాతని యాజ్ఞచొప్పునన్
సురభి సృజించె నత్తఱిని ♦ శూరభటాన్విత సైన్యసంతతిన్. ౧౬౪ 1388

తే. దానిహుంభారవంబున ♦ దారుణాకృ
తులను బప్లవముఖ్యజా♦తులు జనించి
రెండఱో నూఱులకొలంది ♦ యేపుమీఱి
నంతఁ బరసైన్యములఁ ద్రుంచి ♦ రధిపునెదురు. ౧౭౪ 1389

చ. తనబలమెల్ల నీగతిని ♦ దాఁ గనుచుండఁగ నాశమొందఁగాం
చినరవరుండు చాలఁ గ్రుధఁ♦జెంది మహత్తరరోషవిస్ఫుర
ద్ఘననయనాంచితుం డగుచుఁ ♦ గ్రన్ననస్యందనమెక్కి యావరిం
చి నిఖిలశస్త్రముల్ పఱపి ♦ చెండెను మ్లేచ్ఛగణంబు నెంతయున్. ౧౮ 1390

సీ. అంతవిశ్వామిత్ర ♦ హతులయి పప్లవులెల్ల నశించుట ♦ యెఱిఁగి శబల
కోపంబు పూని శ♦కుల యవనుల సృజియించెను మరల వా♦రెల్లశౌర్య
ములమీఱి, రుచిరకాం♦తులనొప్పి చంపక కేసరవర్ణముల్ ♦ భాసిలంగ
నెందుఁ జూచినను దా♦మే యయి నిడుదలౌ ఖడ్గపట్టిసములు ♦ గ్రాలఁ గనక

తే. వర్ణవస్త్రంబులంగట్టి ♦ వచ్చి మండు
చున్నహుతవహునిం బోలి ♦ యుర్వినాథు
బలము శీఘ్రముఁ గాల్చిరి ♦ పార్థివుండు
తనబలంబెల్ల నశియింపఁ♦గని జవమున. ౨౨ 1391

క. తనశౌర్యము మెఱయఁగ న,స్త్రనికరమును వైచె యవన♦సైన్యము కాంభో
జనికాయముపప్లవులును, గని రాకులభావమిట్లు ♦ కదనమునందున్. ౨౩ 1392

ఏబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౫౫ - వ సర్గము.

—విశ్వామిత్రుఁడు తపంబున కరుగుట.—

చ. ధరణిపు నస్త్రపావకుని♦తాఁకున దీనతనొందు పహ్లవో
త్కరమును గాంచి బ్రహ్మముని♦కాంతుఁడు యోగబలంబు మీఱఁగా
సురభి! సృజింపుమా! భటుల ♦ తొరగులనన్న మునీంద్రుసంపునన్
బరువడిఁ బుట్టఁజేసె భట♦నర్యులు శత్రునిహంతలన్ దగన్. ౧౫ 1393

సీ. హుంభారవంబున ♦ నుద్గతకాంభోజు లర్కసన్నిభ తేజ ♦ నులయువారు
పొదుగునుండియె పహ్ల♦వులు శస్త్రపాణులు యోనిప్రదేశము♦నుండి యవను
లును, మలంబున శకు♦లును రోమకూపమ్ములను మ్లేచ్ఛహారీతు♦లును, గిరాతు
లుద్భవించిరి వార♦లొగి వేలు వేలుగా గజరథాశ్వపదాతి♦కలితమైన

తే. కౌశికుని సైన్యముం జుట్టి ♦ క్షణములోనఁ
జంపివైచిరి; తమదగు ♦ సైన్యమిట్లు
మునిమహిమ నాశమౌటను ♦ గని నరేంద్రు
శతతనూజులు బహువిధా♦స్త్రములఁ దాల్చి. ౧౬ 1394

క. జపమొనరించెడు వారి క్రధిపుడై యతికోపముడర ♦ దివ్యమహిమ ను
న్నపుడమిదివిజు వసిష్ఠుని, నపుడే చంపంగఁ బోటి ♦ రమ్మునివరుఁడున్. ౧౭ 1395

మ. ఘనహుంకారముచేత వారలఁ దురం♦గస్యందనస్ఫీతసై
న్యనికాయంబుగఁ గ్రోధమొప్ప మృతినం♦దం జేసె నొక్కింతలోఁ
దనయుల్ నూఱువురు సైన్యయుక్తముగ నా♦ధాత్రీసురప్రోథశ
క్తిని బోకాడుటఁగాంచి కౌశికుఁడు స♦త్త్వోగ్రస్థుల్ కొలంతంగనన్. ౧౮ 1396

చ. తనమది లజ్జదోఁచుటయు ♦ దానసె చింతయు నావరించి నె
మ్మనముఁ గలంప నుద్ధతిని ♦ మాని కనంబడు సంద్రనట్లుగా
నని యొనరింపఁగాఁ దగు ప్ర♦యత్నముఁ బాసి విభగ్నదంష్ట్రమై
కనఁబడు కాలసర్పగతిఁ ♦ గార్యమొసర్ప నశక్తుఁడై వగన్. ౧౯ 1397

తే. సింహికాతనయుండు గ్ర♦సింపఁగాన
నైన సూర్యునిభంగి న♦మ్మానధనుఁడు
తనదు తేజంబు నశియింపఁ ♦ దాటరాని
దుఃఖసింధువున మున్గి ♦ దొరలి మఱియు. ౨౦ 1398

చ. హతసుత వాహినీవితతి♦యై గతపక్షఖగంబుమాడ్కి దీ
నతఁగని దర్పహీనుఁడయి ♦ నాశమునొందినపూన్కి యొప్పఁగా
సతతము దుఃఖమొందుచును ♦ సంపద నిష్ఫలమయ్యెనంచు నెం
చి తనకుమారు యుద్ధస్మృతిఁ ♦ జెందకయుండెడివాని నొక్కనిన్. ౨౧ 1399

శా. చేరంబిల్చి సమస్తరాజ్యమహితా ♦ శ్రీనాథుఁగావించి నీ
వీరాజ్యంబును క్షత్రధర్మముననే ♦ యేలంగనౌ ధర్మవి
స్తారంబౌ గతిచేఁ బ్రజావితతి సం♦తానమ్ము చందంబునన్
గారాబంబునఁ బ్రోవుమంచు హితవా♦క్యంబుల్ తగన్ జెప్పుచున్. ౧౨
ఆ. రాజ్య మప్పగించి ♦ రాజవర్యుఁడు కాన, కరిగి కిన్నరోర♦గాది సేవి
తమగు తుహినభూమి ♦ ధర సమీపంబున, శితిగళ ప్రసాద ♦ సిద్ధిఁగోరి. ౧౩
క. ఘనతపముఁ జేయుచుండఁగఁ, జనియెన్ గాలంబు గొంత ♦ శంకరుఁ డంతన్
గనఁబడియె వృషధ్వజలాం,ఛనుఁ డాశ్రితవర్యుఁడెలమి ♦ క్ష్మాపతిమునికిన్.౧౪
క. తనదర్శనం బొసంగి య,వనినాథునితోడఁబలికెఁ ♦ బార్థివ! నీవే
పనిఁ గోరి తపము చేసెదు?, మనమునఁ గలవాంఛితముస♦మస్తముఁజెపుమా!.
చ. వరదుఁడ నేను భక్తులకు ♦ వాంఛలు గల్గినఁ దీర్చువాఁడ నీ
వరసి మనంబు దేనిపయి ♦ నాసవడున్ బరికించి చెప్పుమా!
ధరణిప! దాఁచకేయనినఁ ♦ దాపసియై తగు కౌశికుండు శం
కరునకు భక్తి మ్రొక్కి పలు♦కన్ దొడఁగెన్ బరితృప్తచిత్తుఁడై. ౧౬ 1404
సీ. దేవదేవా! మహా♦దేవ! పాపవిదూర! ప్రీతుఁడవేని యో♦వృషభవాహ!
యాధను ర్వేదంబు♦నద్దానియంగముల్ తదుపాంగములును,మం♦త్రములుగోప్య
ములు, నుపదేశంబు♦వలననే తెలియంగ ననువైన యారహ♦స్యార్థములును
దయచేయుమా నాకు♦దనుజనిర్జరమౌని గంధర్వయక్షర♦క్షఃప్రముఖుల
తే. యందు వెలుగొందు నేయేమ♦హాస్త్రములవి
నాకు నలవడునటు సేయు♦మా కపర్ది!
దేవదేవుఁడవౌ దీవు ♦ తావకకృప
వలన నావాంఛలీడేర♦వలయు ననిన. ౧౭ 1405
చ. విని పరమేశుఁడా తపసి ♦ వేఁడిన వాంఛలనెల్ల నిచ్చి నీ
మనమునఁగోరినట్టులగు ♦ మాటికి మాటికి నంచుఁబల్కి వే
చనియె స్వకీయసుస్థలికి ♦ క్షత్రియమౌని మహాబలుండు గా
వునఁ బెనుగర్వమొంది యిలఁ ♦ బొల్చెడు వాఁడగుటం దపంబునన్. ౧౯
తే. హరుని నలరించి దివ్యమ♦హాస్త్రవితతి
నంది నందున గర్వపూ♦ర్ణాంతరంగుఁ
డయ్యె; నాదటఁ బర్వంబు♦లందు జలధి
పొంగినటు వీర్యమునఁ జాల ♦ పొంగి మదిని. ౨౦ 1407
క. మునిసత్తముని వసిష్ఠునిఁ, దనచేతం జచ్చినటులె ♦ తలఁచి యపుడె య
మ్మునియున్న పర్ణశాలకుఁ, జని దివ్యాస్త్రములముంచె ♦ సరభసమొప్పన్.
చ. అమల మహాస్త్ర తేజమున ♦ నాతని తేజమునన్ వసిష్ఠు నా
శ్రమమదియెల్ల హవ్యవహు♦జ్వాలల కాహుతియయ్యె నట్లురా

జు మతివిభూతిమైఁ బఱవు ♦ శుంభదదభ్రఘనాస్త్రసంక్తిఁ గాం
చి మునిశతంబు భీతిమెయిఁ ♦ జేరెను దిక్కులకెల్ల నవ్వలన్. ౨౩ 1409
క. మునిశిష్యులు నయ్యాశ్రమ, మునఁగల పక్షులును భీతి♦మునుకొనఁగా దా
నిని బాసి వేనవేలుగఁ, జనియెను నల్దిక్కులకును ♦ సత్వరగతులన్. ౨౪ 1410
తే. అమ్మహాత్ముని యాశ్రమం ♦ బపుడు ప్రాణి
రహితమాటను నిస్స్వన ♦ రహితమగుచుఁ
జవుటినేలను బోలుచు ♦ క్షణములోన
శూన్యమయ్యెను దనదగు ♦ సొంపు దూల. ౨౫ 1411
చ. తనదగు నాశ్రమంబటు ని♦తాంతము పాడగుటం దలంచి య
మ్మునిపతి మాటిమాటికిని ♦ మూర్ఖమహీశుని గాధిసూను పి
నినిపుడె మృత్యువుంగనఁగ ♦ నేనొనరించెదఁ దీవ్రరశ్మి మం
చును బలె భీతిఁ బాయుఁడని ♦ ఘోరతఁ బల్కుచు నుగ్రతేజుఁడై. ౨౬ 1412
తే. మునులలో మేటి గావున ♦ ముందు నిలిచి
యున్న గాధేయునిం గోప ♦ ముప్పలింపఁ
గాంచి యిటుపల్కె నోరోరి ♦ క్షత్రియాధ
మా మదీయాశ్రమంబిది ♦ శ్రీసహితము. ౨౭ 1413
క. చిరసంవృద్ధము నుదిలోఁ, గటుణాను బాటించకీవు ♦ గాల్చితి కానన్
ధరనింక మనఁజాలవు, కరము దురాచారుఁడవె యిఁక♦కం జ్యోతిఁగనుమా.
ఆ. అనివచించి, చాల ♦ నాగ్రహంబడరంగ
వే విధూమకాల ♦ వీతిహోత్ర
పగిది మఱొకయముని ♦ పటుదండమట్లుగా
నొప్పు బ్రహ్మదండ ♦ మూని నిలిచె. ౨౯ 1415

ఏబదియయిదవ సర్గము సంపూర్ణము.

---

౫౬ - వ సర్గము.

క. బలవంతుఁడైన కౌశికుఁ, డలమానియు నిట్లు పలుక ♦ నాగ్నేయాస్త్రం
బలఘుతరమెత్తి మునిఁ గని, నిలునిలుమని పలుక భూమి♦నిర్జరుఁ డలుకన్. ౧
చ. కరమున బ్రహ్మదండమును ♦ గాలునిదండముతో సమానమై
పరఁగెడు దాని నెత్తుకొని ♦ పార్థివనీచతరా! త్వదీయమా
స్థిరబలముం గనంబఱవు ♦ చేరితి నిందిదె చూడు గూల్తు వి
స్ఫురదురుశస్త్రదర్పమును ♦ బొంగెడు నీదగు దర్పముల్ త్వరన్. ౩ 1417
తే. క్షత్రియాన్వయపాంసనా! ♦ క్షత్రియుఁడవు
గాఁ జెలంగెడు నీబల♦గర్వమేడ?

మహితభూసురబలమేడ ? ♦ మామకప్ర
శంస్యమా బ్రహ్మబలమును ♦ సరగఁగనుమ. ౮ 1418

క. అనిపలికి భూమిపతి వైచిన యుగ్రాగ్నేయశరముఁ ♦ జెచ్చెఱ శాంతిం
గనఁజేసె బ్రహ్మదండం, బున హుతవహు దీప్తిజలము ♦ పోకార్చుగతిన్. ౯

సీ. గాధినందనుఁ డంతఁ ♦ గడుఁ గోపమడరంగ వారుణరౌద్రైంద్ర ♦ పాశుపతము
లను మఱియైషీక ♦ మును వైచె; మానవ మోహనగాంధర్వ ♦ ములను నల్లె
స్వాపన, జృంభణ ♦ సంతాపన, విలాపనముల, మాదన శోష ♦ ణముల, దార
ణమును, దుర్జయముగా ♦ నమరువజ్రాస్త్రంబు, బ్రహ్మపాశముఁ, గాల ♦ పాశనామ

తే. కమును, బైనాకమనెడు న ♦ స్త్రమును, దయిత
ము, మఱి వారుణపాశంబు ♦ ను, సుహితముగ
నమరు శుష్కార్ద్రశనిఁ దగ నా ♦ ర్ద్రాశనిని భ
యంకరమగు దంష్ట్రాస్త్రము ♦ నతనిమీఁద. ౧౦ 1420

సీ. మఱియుఁ బైశాచ నా ♦ మకముఁ గ్రౌంచాస్త్రముమథనశరంబును, ♦ సుహితధర్మ
చక్రమునుం, గాల ♦ చక్రము విష్ణుచక్రమును వాయవ్యనా ♦ మమగునస్త్ర
మును,హయగ్రీవాస్త్ర ♦ మునుశక్తియుగళంబువైచెను మునివర్యు ♦ పై మఱియును
గంకాళశరమును ♦ గాలాస్త్ర, ముసల, వైద్యాధరాస్త్రంబుల ♦ నటు త్రిశూల

తే. కంకణములను గాపాల ♦ కమును ఘోర
నామకము దారుణమ్ము, సు ♦ ద్దామదివ్య
శరములన్ వీనినెల్లను ♦ సరగవైచె
రఘుకులాంభోధిచంద్ర! యో ♦ రామచంద్ర!. ౧౧ 1421

క. మునివర్యుపైఁ బ్రయోగించిన యస్త్రములెల్లఁ జూడఁ ♦ జిత్రమ్ముగనే
పనిఁ జేయఁజాలఁ డాతఁడు, ఘనతపసులలోన మేటి ♦ గానఁ గుమారా!. ౧౨

క. శరములనెల్లను వానిని, సరసీరుహసూనుకొడుకు ♦ చంచత్కాంతిన్
గరమునఁదగు దండంబున, మరలించెన్ రాజు చూచి ♦ మది వగపొందన్. ౧౩

క. తనయస్త్రములెల్లను శాంతిని బొందిన గాధిసుతుఁడు ♦ తెగి బ్రహ్మాస్త్రం
బును వైచె నద్ది యడరుటఁ, గని యగ్నిప్రముఖదేవ ♦ కాంతులు మునులున్.

క. ఉరగులు గంధర్వులు నా, తురపడి దిగులొంది రట్లు ♦ తోఁచిన తద్భీ
కరశరమునకుఁ ద్రిలోకము, లురుభీతిం బొంది వడఁకె ♦ నొగి నాపిదపన్. ౧౫

తే. ఘోరమైన బ్రహ్మాస్త్రముఁ ♦ గూడ బ్రహ్మ
విద్య నభ్యాసమును జేసి ♦ విమలతేజ
మునఁ జెలంగు మునీంద్రుండు ♦ తనదు తేజ
మున వెలుఁగు బ్రహ్మదండంబు ♦ నన గ్రహించె. ౧౬ 1426

సీ. అట్లమ్మహోత్కుఁ డ♦య్యస్త్రంబును నడంచు నప్పుడాతనిరూప ♦ మధికదారు
ణముగా వెలుంగుచు ♦ సమరి రౌద్రంబుగా ముల్లోకములకును ♦ భూరిభయద
మై వానిమూర్ఛలు ♦ సంచఁగాఁ జేయుచు నమరె; నమ్మహానీయు ♦ నఖిలరోమ
కూపమ్ములఁ గాఢ♦కోపానలజ్వాల లెగసె ధూమసముతోడ ♦ నెగయు నగ్ని

తే. మిడుఁగురులఁ బోలి; యతనికై ♦ మించు బ్రహ్మ
దండము విధూమకాలహు♦తవహురీతి
నపరయమదండమట్లు భ♦యంకరముగఁ
గ్రాలె నంతట నమ్ముని♦కాంతుఁజూచి. ౧౯ 1427

క. మునులెల్ల బ్రాహ్మణోత్తమ, యని పిల్చి నుతించి పల్కి ♦ రల్లన నీదౌ
వినుత బ్రహ్మబలం బిది, తనరె నమోఘముగ నిఁక వి♦ధాతృశరంబుల్. ౨౦

తే. నీదు తేజోబలంబున ♦ నిష్ప్రభావ, ముగ నొనర్చె నధికతప♦మును నొనర్చి
యున్నవాఁడయ్యు నీచేత♦నిన్నరాధి, పతితిరస్కృతుఁడయ్యె నో♦బ్రహ్మతనయ!

క. నీకోపము శాంతిల్లెడుఁ, గాక ప్రసన్నుండవగుము ♦ క్ష్మాసురమానీ!
లోకులకు దుఃఖశాంతియుఁ, జేకూరఁగఁ జేయుమయ్య ♦ చెచ్చెఱ ననినన్. ౨౧

మ. ఘనతేజంబున సత్తపోనియతి నిం♦కన్ శాంతిచే వెల్గు న
మ్మునినాథుండును శాంతికోపుఁ డగుడున్ ♦ భూమీశుఁ డమ్మౌనిచేఁ
దనకైనట్టి పరాజయంబు మదిలోఁ ♦ దర్కించి నిశ్శ్వాసపం
క్తినివే పుచ్చుచుఁ బల్కె నిట్లు తనదా♦దీనత్వముల్ దూఱుచున్. ౨౨ 1431

తే. ఇస్సిరో క్షాత్రమౌ బల♦మేటి కెన్న, బ్రహ్మతేజస్సమార్జిత♦బలమె బలము
బ్రహ్మదండమొక్కండె నా♦బాణసంతతి, నడఁచెఁ గావున నాబల♦మల్పతరమె.

తే. ఇట్టిదౌ తారతమ్యమే ♦ నెఱిఁగి సుప్ర
సన్నచిత్తేంద్రియుఁడనయి ♦ సాంద్రతపము
సలిపి బ్రహ్మత్వమొందెద ♦ క్షత్రియత్వ
మింకఁ జాలును దీనమే♦లేమి లేదు. ౨౪ 1433

ఏబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౫౭ - వ సర్గము.

—విశ్వామిత్రుఁడు రాజర్షి యగుట.—

చ. అనితలపోసి గాధినృపు♦నాత్మజుఁ డాత్మపరాభవంబు నె
మ్మనమున సంస్మరించి పలు♦మాఱులు నూర్పులు పుచ్చి చిత్తశాం
తిని గనలేక తప్తమతి♦దీనము సౌహృదయంబుతోడ న
మ్మునివరుతోడ వైరమును ♦ బూని తపంబు సలింప నంతటన్. ౧ 1434

క. పెనుతపమున సామర్థ్యం,బును సంపాదింపనెంచి ♦ పూబోఁడియుఁ దో
డన రాఁగ దక్షిణాశకుఁ, జని చేసెను ఘోరతపము ♦ శాస్త్రనియతిమై. ౨ 1435

క. [ఫలముల దుంపలఁ దిని ని,ర్మలచిత్తమ్మలరఁగా ద♦మము గల్గి మహో
జ్జ్వల తపముచేసెఁ గౌశిక, కులపారావారపూర్ణ♦కువలయపతియున్.] 1436

సీ. సత్యసంధులు ధర్మ♦సరణి నెఱింగిన వారలౌ పుత్రులౌ ♦ ధారణీశు
నకు నవ్వేళన్ గల్గి ♦ రకుటిలచిత్తుఁడై యలరు హవిష్యందుఁ ♦ డనఁగ నట్టిఁ
డైన మధుష్యందుఁ♦డన, దృఢనేత్రుండు నాఁగ మువ్వురు; లోక♦నాథుఁడైన
బ్రహ్మయు వేయుసం♦వత్సరములు నిండఁ దపమె ధనంబుగాఁ ♦ దలఁచి యున్న

తే. కౌశికునిఁ జూచి మధురవా♦క్యములఁ బల్కె
వినుము రాజర్షి లోకంబు♦లను జయించి
తివి తపమ్మునఁ గౌశికా! ♦ దీన నిన్ను
నింక రాజర్షి నిగ గ్రహిం♦యింతు మేము. ౫ 1437

క. అనిపలికి మహాతేజం,బున నొప్పు జగద్గురుండు ♦ వోయె స్వలోకం
బున కతనివెంటఁ జనుదెం,చినసురలు త్రివిష్టపంబుఁ ♦ జేరిరి పిదపన్. ౬ 1438

చ. వనజభవుండు తన్గుఱిచి ♦ పల్కినవాక్యము నాలకించి సి
గ్గునఁ దలవాంచి సుంత దన♦కోరికతీరమిఁ జాల దుఃఖమున్
గని యతిదీనుఁడై తలఁచెఁ ♦ గౌశికుఁ డిట్లని గొప్పగాఁ దపం
బును బొనరించినాఁడ సుర♦ముఖ్యులు మానులు నన్నుఁ గాంచుచున్. 1439

క. తలఁచిరి రాజర్షి నిఁగాఁ, బలికిరి యారీతి నాత♦పంబున కిదియే
ఫలమగునే నాతపమా, నలఘుతరం బట్లుగాన ♦ నల్పఫలమిదా. ౮ 1440

చ. అనిమది నిశ్చయించుచుఁ బ్ర♦యత్నము మీఱఁగఁ దొల్లి తాను జే
సిననియమంబుకంటె ఫల♦సిద్ధిని గొప్పగఁ బొందఁజాలు రీ
తిని దపముం బొనర్చె నతి♦తీక్ష్ణముగా రఘువంశభూషణా!;
వినుమిఁక నట్టికాలమునఁ ♦ బృథ్విని బొల్చెఁ ద్రిశంకువెంతయున్. ౯౼౫ 1441

సీ. ఇక్ష్వాకువంశంబు ♦ నెంతయు వర్ధిల్లఁ జేయుచు సత్యంబె ♦ చెప్పుచున్ జి
తేంద్రియుండయి యతఁ ♦ డెంచె మనంబున యజ్ఞమొనర్చి దే♦హంబుతోన
నమరుల కత్యుత్త♦మమగు స్థానమ్మెద్దియగు, నట్టి స్వర్గంబు ♦ నందవలయు
నని యంతఁ గులగురు ♦ వౌ వసిష్ఠుని భక్తిఁ బిలిపించి తనమదిఁ ♦ దలఁచినట్టి

తే. కార్యమెఱిఁగింప నిది యశ♦క్యమ్మటంచుఁ
దెలిపె నమ్మహానీయుండు ♦ కలఁగినమది
ధరణిపతియును యజ్ఞంబు ♦ తగదటన్న
మునిపలుకుచేత నుత్సాహ♦ము నశియింప. ౧౨౫ 1442

క. మునివరుని యాశమాని య,తనితనయులు తనదు వాంఛి♦తమ్మును దీర్పం

గను జాలువారలని రవి, తనయుని దిక్కునకుఁ బోయి ♦ తత్పుత్రకులన్. ౧౩
చ. కనుఁగొనె నందు వారలు న♦ఖండతపంబును సల్పుచుండి కీ
ర్తిని వెలయించుచుండి రల ♦ దీర్ఘతపస్వుల నూర్వురన్ లస
ద్ఘనతరతేజులన్ ధరణికాంతుఁడు తేజము వెల్గఁ గాంచి భ
క్తిని గ్రమమొప్ప నంజలిని ♦ గీల్కొనఁజేసి నమస్కరించుచున్. ౧౪ 1444
చ. గురుని నిరాకరించి తన♦కోరికఁ దీర్చుకొనంగఁ దత్పుర
స్కరమును గానవచ్చుటకుఁ ♦ దా మదిఁ బొందిన లజ్జఁ బెంపునన్
శిరమును సుంత వంచి ఫల♦సిద్ధిని గోరినవాఁడు గావునం
గరములు మోడ్చి యిట్లనియెఁ ♦ గావరె, మీశరణంబుఁ జొచ్చితిన్. ౧౫
క. శరణన్నవారిఁ గాచెడు, బిరుదుగదా మీకుఁ గరుణ ♦ పెంపున నన్నున్
శరణాగతుఁ గాపాడుఁడు, గురునిన్ శరణంబు ముందె ♦ కోరితిఁ జుండీ!. ౧౬
తే. అస్మదుపాధ్యాయుఁడు నాకోర్కి ♦ నట నిరాక
రించె మీకెల్ల సత్కీర్తి ♦ మించు నాదు
వాంఛితంబును వినుఁడు సు♦హాధ్వరంబుఁ
జేయఁబూనితి సనుమతి ♦ నీయఁగఁ దగు. ౧౭ 1447
క. గురుపుత్రులైన మీకెల్లరకును వందనముచేసి ♦ లాభము దానిన్
బరముమును బొందఁగోరితి, శరణాగతరక్షకులు ప్ర♦సన్నతఁ గనుఁడీ!. ౧౮
సీ. బ్రాహ్మణోత్తములఁ ద♦పంబె ధనంబుగాఁ బరికిం[illegible] శిరము ధరణి
తలము సోఁకఁగ మ్రొక్కి ♦ శమి వేఁడుకొనియెద [illegible] స్వర్గమునకుఁ
బోవునట్లుగఁ జేయు ♦ పూజ్యమా క్రతువును జే[illegible] సిద్ధిఁ బొందఁ
జేయరే. గురుతిరస్కృతినందినట్టి నా కరయఁగా[illegible] నన్ను
ఆ. లైన మీరు దక్క ♦ నన్యులు కలరె యొ,వ్వారు [illegible] ర వేఱు
గతియు లేదు నాకుఁ ♦ గావున నిక్ష్వాకు, కులజనిత[illegible] కొండె.
క. ధరణీశులు విద్వాంసులు, పురోహితులె యుద్ధరింత్ర[illegible] గు మీ
గురుఁడు దిగవిడిచె నాతని, తరువాతన్ మీరె కా[illegible] న్. 1450

ఏబదియేడవ సర్గము సంపూర్ణము[illegible]

---

## ౫౮-వ సర్గము.

వసిష్ఠపుత్రులు త్రిశంకుని నిరాకరించుట.

తే. అవ్వసిష్ఠుని శతపుత్రు ♦ లాత్రిశంకు, పల్కులను విని య[illegible]
యతనితోఁ బల్కిరిట్లని ♦ యవనినాథ!, దుష్టబుద్ధివి నీవని ♦ తోఁచుట[illegible]
క. ఋతవాదియైన యమ్మునిని, పతి మజ్జనకుండు నీస♦వనమును దనస

మ్మతిఁ జేయింపంబూనక, ప్రతిపల్కి నిరాకరించెఁ; ♦ బరమ మునీంద్రుల్. ౧½

చ. అతనిఁ బరిత్యజించి యెటు♦లన్యుని నీవిపుడాశ్రయింపఁ బూ
నితి వల మానిచంద్రుఁడె వి♦నిర్మలసూర్యకులప్రసూతులా
క్షితిపులకెల్ల దేశికుఁడు ♦ చెప్పెడిదేమి పురోహితుండు, సూ
నృతవచనుండు నెట్టు లతఁ♦డే వచియించినమాట దాఁటనౌ. ౩ 1453

ఉ. అంతటిమానియే పలికె ♦ నధ్వరమిద్ది యశక్యమంచు భూ
కాంత! మఱెట్లు నీకొఱకుఁ♦గా మముబోఁటులు దానినెంతయుం
బంతముమీఱఁ జేయుటకుఁ ♦ బాల్పడువార లశక్యమద్ది నీ
వెంతయు రాజపుత్రకుల ♦ కెల్లను మేటివిగాఁ జెలంగియుల్. ౪ 1454

సీ. ఇట్టి కార్యముసేయ ♦ నెట్లు పూనితి వింక మరలిపురంబున ♦ కరుగవయ్య
యతఁడె యజింపఁ జే♦యంగ సమర్థుఁడౌ నెల్లవారిని గాన ♦ నెట్టు లమ్మ
హాత్మున కేమెల్ల ♦ నవమతి సేయంగఁ జాలుదు మంచమ♦ర్షను గలంగు
నక్షరములు గల్గు ♦ నట్లు పల్కిన విని మఱియు వారలతోడ♦మహిపుఁడనియె

ఆ. గురువు మొదట విడిచె ♦ గురుపుత్రులట్టులె, విడిచి రింకనేను ♦ వేఱుగతిని
బొందఁగోరితిని ద♦పోధనులార! మీ, కగుశుభమ్ములెల్ల ♦ ననుచుఁ బలుక. ౫½

చ. కులగురువై విరించికిని ♦ గూర్మికుమారకుఁడౌ వసిష్ఠు ని
ర్మలమతి మాని యింకొరుని ♦ రాజు గ్రహింపఁగ బూనె ఘోరమా
తలపిది గల్గఁగాఁ దగునె ♦ తాళఁగవచ్చునె యింక నంచు మి
క్కిలియును గోపమూని పరి♦కించి శపించిరి వారలీవిధిన్. ౬ 1456

తే. నీవు చండాలుఁడవు గమ్ము ♦ భూవరా! య
టంచు శపియించి వేగ మ♦హాత్ములైన
మునికుమారులు స్వాశ్రమం♦బునకుఁ జనిరి
శ్వపచుఁడయ్యె నారాతిరి ♦ చనిన నృపుఁడు. ౭½ 1457

సీ. చండాలతను గన్న♦జనపతి పీతాంబరంబద్ది నీలవ♦స్త్రముగ మాఱె
నతనిదేహమున ము♦న్నలరెడు రాజతేజము చూడ నల్లని ♦ చాయయయ్యె
సకలసౌఖ్యముల ల♦క్ష్యంబగునాతని యంగమ్ము కఠినత ♦ నందియుండె
సొగసైన తళుకుచే ♦ శోభిల్లు నునుఁగురు లప్పుడె కుఱుచలై ♦యార్తినొసఁగె

తే. లలితపరిమళసుమహార♦ములును మంచి
గంధమును బోయి యట వల్ల♦కాటికిఁ దగు
నట్టి పూదండలుగను భ♦స్మాంగరాగ
ముగను మాఱెను దచ్ఛాప♦మున క్షణమున. ౧౦ 1458

క. రతనపుహారంబులు నా, క్షితిపతిదేహంబునందుఁ ♦ జెచ్చెఱ నన్యా
కృతిఁ దాల్చి యాయసములై, యతి దారిద్ర్యంబుఁ బూని♦నట్లుగనఁబడెన్,

చ. నరపతి యివ్విధంబుగఁ గ♦నంబడ నాతనిఁ బాసి మంత్రులున్
పురజనులందఱుం గలిసి♦పోయిరి దూరముగాఁగ నంత నా
క్రూరుఁడె మహీశుఁడుండియును ♦ గాఢమనోవ్యథ నొక్కరీతి రా
త్రిరియుఁ బగల్ దగం గనుచుఁ ♦ దెంపునుమాత్రము వీడకంతటన్. ౧౨ 1460

తే. అవ్వసిష్ఠున కరిదైన ♦ యట్టి గాధి
పట్టి చెంతకుఁ బోయెఁ ద♦పఃప్రభావ
కలితుఁ బంచుఁ దలంచి భూ♦కాంతుఁ డిట్లు
తనదు చెంతకు రాఁగ నా♦తనిని గాంచి. ౧౩ 1461

చ. గురువును దత్తనూజులును ♦ గోరికఁ దీర్పక ద్రోహికాదులన్
ధరణివరుండు భ్రష్టుఁడయి ♦ తత్తఱపాటు గనంగఁ జేయ నీ
కరణి శ్వపాతకం గని ని♦కామమనోవ్యథఁ గుంది వచ్చె నం
చరసి మనంబునం గరుణ ♦ నత్యధికంబుగ నొంది యంతటన్. ౧౩౪ 1462

ఆ. పరమధార్మికుండు ♦ గురుతర తేజుండు, నైన కౌశికుండు ♦ మౌనివినుతుఁ
డవనినాథు నప్పు ♦ డతిఘోరరూపునిఁ, గాంచి భద్రమగు న♦టంచుఁ బలికె.

సీ. ఓ రాజపుత్ర! య♦యోధ్యాధిపా! మహాబలుఁడవు వీర్యంబు ♦ గలుగువాఁడ
విట్టి నీకి త్తఱి ♦ నెట్లు శాపంబున శ్వపచత యలవడె ♦ నిపుడు నాదు
పరిసరమున కేల ♦ వచ్చితివని మాట పొందెఱింగిన మౌని♦పుంగవుండు
పలుకంగ శ్వపచత♦గలుగుభూపాలుండు వాక్యముల్ పలుకనే♦ర్పఱియెఁ గాన

ఆ. గేలుదోయి మోడ్చి ♦ జాలి గల్గ వచించె
వాంఛితమును దీర్ప♦వలయు ననుచు
గురుని నతనిపుత్ర♦కూటంబుఁ గోరితి
నది నిరాకృతంబె ♦ యయ్యె మౌని!. 1464

చ. మనమునఁ గల్గు వాంఛితము ♦ మాట యటుండఁగ నిమ్ము మీఁద నా
తనువు శ్వపాకతంగనియె ♦ ధార్మికసత్తమ! యీవిపర్యయం
బును గనినాఁడ; సౌమ్య మదిఁ ♦ బుట్టిన కోర్కె మఱేమిగాదు నా
తనువును గూడియే త్రిదశ♦ధామముఁ జేరఁగ నెంచితిం జుమీ!. ౧౮ 1465

ఆ. నిష్ప్రియత్నమునను ♦ నేనిట్టి కోరికఁ, గోరినాఁడఁగాను ♦ భూరిదక్షి
ణల నొసంగి యజ్ఞ♦ములను నూఱింటిని, జేసినాఁడ నిష్ట♦సిద్ధిఁ గనఁగ. ౧౮౪

*క. క్రతుశతమతిభక్తిని జేసితిఁ గాదే దానిఫలము ♦ క్షితిని శరీర
చ్యుతిఁగానక యాస్వర్గస్థితి చేకూరుటయె గాదె ♦ స్థిరసుగుణమణీ!. ౧౮౪

క. అదిమాత్రము నాకుం గలుగదు మౌనీ! యన్నృతమాడఁ ♦ గ్రతుఫలము నశిం
పదొకో? యందురో? యేమో, యది నేనెన్నండుఁ జెప్పి♦నది లేదు సుమీ!.

* వ్యాఖ్యాన్నాభిప్రాయమున కీ పద్యము.

తే. ఇంక ముందెన్నఁడేని నే♦నేమి యనృత
మాడ నెట్టట్టి యాపదల్ ♦ గూడిన నని
నీదుసన్నిధి శపథంబు ♦ నేనొనర్తు
క్షత్రధర్మంబె దీనికా ♦ సాక్షి సౌమ్య!. ౧౯ 1469

మ. పలుజన్నంబు లొనర్చినాఁడఁ బ్రజలం ♦ బాలించితిం బూన్కి ని
స్తులధర్మంబున, సన్నతింగ గురు♦స్తోమంబు నచ్ఛీలవృ
త్తుల సంతోషము నందఁజేసితిఁ గ్రతు♦స్తోమంబు ధర్మాభిలా
షలఁ జేయంగను బూనినాఁడ నిపుడ♦స్మద్దేశికుల్ దానికై. ౨౦ 1470

క. పరితుష్టి నొందరో ముని, వర! యింకెందులకుఁ దృప్తి ♦ వారొందుదురో
యరయఁగ దైవమె యధికము,పురుషహితాహితముఁగూర్పఁ♦బోయదియొకటే.

తే. కాన దైవమె యధికమం♦చేను దలఁతుఁ
బురుషయత్నము వ్యర్థము ♦ బుద్ధిఁ దలఁప
నిద్ది దైవము నిరసింప ♦ నెవ్విధమున
నర్హుఁడుగుఁ; గాదటంచు నా♦యాత్మఁ దోఁచె. ౨౨ 1472

సీ. దైవంబె యధికమై ♦ తనరుచు నన్నింటిని దిరస్కరించెడి♦ని బరమగతి
యదియె; కావున నిప్పు ♦ డద్దానిచేఁ దూలి పరమదుఃఖితుండనై ♦ బడలి నీప్ర
సాదముఁ గనెడు వాం♦ఛను వచ్చినాఁడను నీకు భద్రంబగుఁ♦గాక నన్నుఁ
గరుణను వీక్షింపఁ♦గాఁదగు నాకొండు గతి లేదు వేఱొండు♦కడకుఁ బోవ

ఆ. నీవుదక్క శరణ♦మే లేదు నాగురు, లింకఁ బలిచెనేని ♦ యేనుఁ బోవఁ
దత్ప్రసాదముననె ♦ ప్రతికూలదైవంబు, నడఁచి మేలుసేయ♦వయ్య నాకు.

ఏబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౯ - వ సర్గము.

త్రిశంకునిమిత్తము విశ్వామిత్రుఁడు యజ్ఞప్రయత్నము చేయుట.

చ. శ్వపచుని చిహ్నముల్ వెలయ ♦ క్ష్మాపతి యవ్విధి తన్ను వేఁడఁగా
నృపమునియైన కౌశికుఁడు ♦ నెమ్మి యెసంగ మృదూక్తులొప్పఁగాఁ
దపనకులాబ్ధిశీతరుచి ♦ ధర్మవిదుత్తమ! స్వాగతంబు ని
న్నిపుడె తరింపఁజేసెదఁ ద్వ♦దీప్సితముర్వి నెఱవేర్తుఁ బూన్కిచేన్. ౧౫ 1474

తే. భయముఁ బొందకు మింకనో♦వత్స! నిన్నుఁ
బరమధార్మికునిగను నా♦స్వాంతమందు
నెఱిఁగియే యున్నవాఁడ నీ♦వింకఁ జేయు
యజ్ఞమునకు సహాయులై ♦నట్టి వారి. ౨ 1475

సీ. పుణ్యకర్మిష్ఠులఁ ♦ బోలుపారఁ జేసిన యట్టి మహాత్ముల ♦ నందఱిం బ్రి
యంబునఁ బిలిపింతు ♦ నవనీశ ! నిర్గతతాపుండవగుచు న♦ధ్వరము నీవు
చేయంగవచ్చు; దే♦శికుని శాపంబునఁ దవ్వ్రేహమునఁగల్గు ♦ శ్వపచభావ
మిద్దానిఁ దొలఁగింప ♦ నెవ్వరు నేరరయ్యాజుఁడైన నేగఁడ♦గ్గైన నేమి

తే. యిట్టిశాపంబుతోన నీ♦వేఁగువాఁడ
వమరనగరంబునకుఁ గుశి♦కాన్వవాయు
నన్ను శరణంబు చొచ్చితి ♦ వన్న నేను
శరణుఁ జొరఁదగువాఁడను ♦ క్ష్మాపతీంద్ర !. ౮॥ 1476

క. కావున నీకరగతమగా, దేవపురంబంపుఁ దలఁతుఁ ♦ దెల్లముగా నో
భూవర ! యంచును తేజం, బావిశ్వామిత్రమౌని ♦ యలరిపలుకుచున్. ౯

క. పరమప్రాజ్ఞులు ధార్మిక, వరులొ తనయులను బిల్చి ♦ నైశము గూాయ
ధ్వరమునకుం దగు నప్పరి, కరములనొడఁగూర్పఁ బంచి♦క్రమ్మఱఁ బూనిక౯.

క. తనశిష్యులఁ బిల్చి జనం,బున మీరో వత్సలార ! ♦ పోయి మదాజ్ఞం
గొని బుత్విక్సంశిత శి,ష్యనికరయుక్తముగఁ బిల్వుఁ ♦ డమలమునితతి౯. ౭

తే. పిలిచి తోడ్కొనిరండు వా♦రల, సుహృదుల
తోడ నావాక్యబలమును ♦ గూడి మీరు
పోయి పిలువ ననాదృతిఁ ♦ బూని యెవ్వ
రేమిపల్కిననుం జెప్పఁ ♦ డిచట నాకు. ౧ 1480

తే. ఒక్కమాటయు మఱువరా♦దొగి వచింపుఁ
డనిన నమ్మునివచనంబు ♦ వినినయపుడె
యఖిల దిక్కులకుంబోయి ♦ యతని యాజ్ఞ
బ్రహ్మవాదులనుంబిల్చి ♦ వచ్చిరంత. ౯॥ 1481

సీ. సకలదేశస్థిత ♦ క్ష్మాసురమానులు బ్రహ్మవాదులు తమ♦వటుముఖులను
గలిసి వచ్చిరి, మౌని♦కాంతుని శిష్యులు జ్వలితతేజంబున ♦ భాసిలు గురు
వర్యుచెంతకు వచ్చి ♦ బ్రహ్మవాదులు పల్కినట్టి మాటలఁ జెప్పి ♦ రప్పు డిట్లు
గాధితనూజ ! వే♦గమ వచ్చుచున్నారు బ్రహ్మవాదులు పరి♦వారయుతము

తే. గాఁగ మీమాటలాలించి; ♦ కడుముదమున
నందఱిదిగో; మహోదయుం♦డను మునిపతి
యును వసిష్ఠాత్మజులు నూర్వు♦రును మునీంద్ర !
తప్పఁ దక్కినమౌని బృం♦దమ్ము వచ్చె. ౧౧॥ 1482

క. వినవయ్య ! రాకనిలిచిన, మునులెల్లను గోపవేగ♦మునఁ దొట్రిలఁ బ
ల్కినమాటల వచియింతుము, మునివర ! యాజకత విప్ర♦ముఖ్యునకె తగున్.

తే. క్షత్త్రియుండు యాజకుండట ♦ సవమొనర్చు
వాఁడు చండాలుఁడంట సె♦బాసుర యిది
మఱియు నందు విశేషమే ♦ మహిమవెలయు
నమరవరులు మునీంద్రులా ♦ యాగమందు. ౧౩ 1484

క. ఏరీతి నాసదస్సునఁ, దారందఱుఁ గూడి హవిసుఁ ♦ దచ్ఛిష్టమునుం
గోరి భుజింపందలఁచిరో ?, భూరమణుఁడు కౌశికుండు ♦ భూమీసురలన్. ౧౩½

క. ప్రేమంబునఁ బాలించిన, నేమాయెను శ్వపచునన్న ♦ మెట్లు గుడిచి యు
ద్దామగతి స్వర్గసీమకుఁ, దా మేగుదు రాత్మమహిమఁ ♦ దనరెడు వారల్. ౧౪½

క కనులెఱ్ఱఁజేసి యామునితనయులును మహోదయుండు ♦ తగనిష్ఠురవా
క్యనికరముల నాడిరి, యో, మునిశార్దూలా! యటన్న ♦ మునుల నుడువులన్.

చ. విని కనులెఱ్ఱఁజేసి పృథి♦వీపతి కోపము పైకొనంగ ని
ట్లనియెను బండ్లుగీటుచు మ♦హాత్ముల తేజముచేత భంగమున్
గనదను న్యాయముండదొకో ? ♦ గాదనకట్టివిధిన్ గ్రహించి నీ
తని గ్రతుసిద్ధిఁబొందునటు ♦ తప్పకచేసెద నట్లుకావునన్. ౧౬½ 1488

తే. నేను దుష్టుఁడనగుదునే ♦ మానితోగ్ర
తపము నొనరించువాఁడ మం♦దమతిఁగాను
ఇట్టివన్నియు నెఱుఁగక ♦ యే దురాత్మ
కులు నన్ను నిందసేయుదు ♦ రల కుమతులు. ౧౭ 1489

సీ. భస్మరూపము నొంద♦వలసినవారౌదు రిందు సందేహమే♦మేని లేదు
వారెల్లరుం గాల♦పాశంబుచే నీడ్వఁబడి యమునగరికి♦ప్పుడు చనంగఁ
దగువారు; సప్తశ♦తజననముల దాఁక నెందుఁజూచినయేని ♦ నింపుమీఱ
శవభక్షకులగుచు ♦ సంచరింతురు మఱియును ముష్టికులను జా♦తిని జనించి

తే. కఠినులై వాక్యచేష్టాంగ♦కములు వికృతి
గాఁ గనంబడ నియతంబు♦గాఁగఁ గుక్క
మాంసముం దిని సతతమ్ము ♦ మహిని నిందె
తిరుగుచుంద్రు; మహోదయ♦ధరణిసురుఁడు. ౧౮½ 1490

క. దూషింపఁ దగని నన్నే, దూషించినవాఁడు గాన ♦ దుర్మతి యతఁడే
దూషితుఁడై లోకంబుల, నైషాదజనిం గనున్ మ♦నంబు చెడంగన్. ౨౦½

క. బలవంతంబుగఁ బ్రాణం, బులఁ దూలించుచును గరుణ♦పోవిడిచి సదా
కులమతియై నాక్రుధ భీ, తిలి చిరకాలంబు దుర్గ♦తిని బొందుఁ జుఁడీ. ౨౧½

ఆ. అనుచుఁ బలికి యప్పు ♦ డమిత తేజంబున
సత్తపోమహిమను ♦ సంయమీంద్రుఁ

డగుచు నలరుచున్న ♦ యట్టి విశ్వామిత్రుఁ
డఖిలమునుల నడుమ ♦ నటుల శపించి. ౨౨ 1493

ఏబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - వ సర్గము.

—త్రిశంకువుకొఱకు విశ్వామిత్రుఁడు స్వర్గమును నిర్మించుట—

క. విరమించె నిట్టి తేజః స్ఫురణమునం దగిన గాధి♦సుతుఁడు మునిసుతో
త్కరము మహోదయు స్వతపో, నిరతిఁ శపియించి వారి♦నిహతులఁ జేసెన్.

సు. హతులం జేసి వచించె నమ్మునులతో ♦ నంతం ద్రిశంకుక్షమా
పతి యిక్ష్వాకుకులోద్భవుం డితఁడు గన్ ♦ భావింప ధర్మాత్ముఁడై
యితఁ డర్థిం ద్రజకల్పకంబగుఁ జూడీ ♦ యీతండు శ్లాఘ్యకనం
గత చండాలతనొందు నీతనువుతోఁ ♦ గాంక్షించె స్వర్లోకమున్. ౨ 1495

క. ఆకోరికఁ దీరుచుకొన, నాకడ కేతెంచి శరణ♦మందెను నన్నుం
జేకొంటి నితఁడు రక్షస్యుఁడు, గా కేమని యితని స్వర్గ♦కాంక్షితుగునిన్. ౩

క. ఈతనువుతోనె సురపురి, కీతఁడు చనునట్లు యజ్ఞ♦మేనును మీరల్
ఖ్యాతిగఁ జరపంగఁ జూడి, యీతరుణమునందె యనిన ♦ నెల్లమహర్షుల్. ౪

క. మునిపల్కిన యామాటలు, విని ధర్మమునీషులగుచు ♦ వెలయుట వారి
ట్లని పల్కిరి తమలోఁ దా, రె నయంబుగ నొకటఁగూడి♦హితముతలఁచుచున్.

క. ఈతఁడు కుశికాన్వయనం, జాతుం డతికోపుఁడగుటఁ ♦ జక్కఁగఁ గృత్యం
బేతీరున వచియించునొ, యాతీరున నే యొనర్ప ♦ నర్హము సుండీ. ౫ 1499

క. ఇందులకణుమాత్రమ్మును, సందేహము లే దితండు ♦ జ్వలనాభుఁడుగా
నం దగ నొనర్పకుండిన, నందఱ శపియించుఁ గోప♦మందున యేనిన్. ౬

చ. క్రతువొనరింపఁగా వలయుఁ ♦ గార్యముఁ గొప్పది వింటిరే మహీ
పతి స్వశరీరయుక్తుఁడయి ♦ స్వర్గముఁ జేరఁగ గాధిసూను వి
చ్యుత మహిమం జనంగఁ దగు ♦ నోపిక నట్లొనరింప నిల్వుఁడీ
క్రతువునకున్ సహాయమొనఁ♦గం దగు పద్ధతి నూనుఁడీ త్వరన్. ౭ 1501

సీ. ఇతరేతరంబువా ♦ రిట్లు సంభాషించి యాయాయికార్యంబు ♦ లందు శ్రద్ధ
నూని కావింపంగ ♦ నూల్కొని; రమ్మఖ మందురు తేజుఁడై ♦ యలరు గాధి
పట్టి యాజకుఁడయ్యె; ♦ నట్టులే మంత్రజ్ఞులగు ఋత్విజులు క్రమ♦ముగ సమస్త
కార్యంబులను మంత్ర♦కలితంబులుగఁ గల్పసూత్రోక్తమైనట్టి ♦ చొప్పు తప్ప

తే. కుండ విధియుక్తముగ దాని ♦ నొనరఁ జేసి
రంతఁ గౌశికుఁడయ్యజ్ఞ♦మందొసంగు

భాగములఁ గొన దేవతా♦వరులఁ బిలిచె
మంత్రముల స్వీయమహా తపో♦మహిమ వెలయ. ౧౦౪ 1502

సీ. ద్విత్రివారంబులు ♦ దివిజుల మంత్రాళిఁ బిలిచిన దమభాగ♦ములఁ గొనంగ
నమరులెవ్వరును రా♦రైరి; మహాముని యతికోపపరవశుఁ♦డై స్రువంబుఁ
బైకెత్తి రోషంపుఁ ♦ బలుకుల భూపతిఁ గని పల్కె నీదుయా♦గంబటుంచ
నిమ్మింక మదుపార్జి♦తమ్మగు సత్తపోబలమును గను మిత♦రులకుఁ బడయఁ

ఆ. గా నశక్యమైన ♦ కన్రునిర్జరపురి, నిదిగొ తనువుతోడ ♦ నే కనంగఁ
జేయువాఁడఁబొమ్ము ♦ స్థిర దేవపురికీవు, తనువు దీనిఁ గూడి ♦ మనుజనాథ !.

చ. విను మొకమాట భూమివర ! ♦ వీర సుదార్జితసత్తపఃఫలం
బున నినునంతయే మిగిలి ♦ పొల్చెడు గావునఁ దత్ప్రభావముం
గొని స్వశరీరయుక్తి సుర♦కూటము పొల్చెడు లోకముం గనం
జనుమని మానిపల్కుటయు ♦ క్ష్మాతలనాథుఁడు తత్తనూయుతిన్. ౧౨ 1504

క. మునులందఱుఁ దనుఁ గనుఁగొనఁ, జనియెను సురపురికి నటఁ ద్రి♦శంకువుస్వర్గం
బున కరుదెంచుటఁ గని యి, ట్లని రమరులు శతముఖుండు ♦ నబ్భూపతితోన్.

తే. ఓత్రిశంకుమహీపాల ! ♦ యుండఁ దగవు
స్వర్గమున నీవు మరలిపో♦వలదగుఁ జుమ్ము
మూఢుఁడా ! సద్గురువు శాప♦మున హతుండ
వైతి తలక్రిందుగాఁ బడు ♦ మవని నీవు. ౧౭౪ 1506

క. అనిపల్కిన నతఁడు తపో, ధనుఁడగు కౌశికుని గుఱించి ♦ తమిఁ గావు మిఁకన్
మునివరయని మొఱలిడుచున్, జనపతియిలఁబడియెమరల♦నరభసమునఁదాన్.

తే. కుశికసూనుఁడు వాని యా♦క్రోశవాక్య
ములను విని రోషముంబొంది ♦ నిలునిలుమని
పలుకుచున్ మానినరమధ్య♦పథము నుండి
యపరచతురాననుండన ♦ నరుగుదెంచి. ౨౦ 1508

సీ. తేజముప్పొంగ ధా♦త్రీపతికొక స్వర్గమును బూని నిర్మింప♦గను దలంచి
యామ్యమార్గంబున ♦ యందు సప్తర్షుల నవ్వుల నిర్మించి ♦ నైజకోప
పరవశత్వమున నా♦బ్రాహ్మణమధ్యమునందుండి తనదగు♦యశము వెలుఁగు
యామ్యదిక్కునఁ దార♦కావళిఁ బంక్తులుఁ గా సృజియించి యా♦కౌశికుండు

తే. కోపకలుషీకృతుండయి ♦ యాపగిదినె
బహుళనక్షత్రగణములఁ ♦ బ్రబలఁ జేసి
యపరశతముఖుఁ బుట్టింతు ♦ నిపుడొనర్చు
క్రొత్తలోకంబునకుఁ ద్రిశం♦కునె సురపతి. ౨౨౪ 1509

చ. అనితలపోసి యానృపతి ♦ కర్హముగాఁ బరివారదేవపం
క్తిని సృజియింపఁబూనె నతి♦తీవ్రగుడావిలమానసంబునన్

గని యల మానియత్నమును ♦ గ్రన్నన మాని సురాసురుల్ కటా
మనకిదె మాఱుగాఁ ద్రిదశ♦మండలిఁ జేయఁగఁ జూచుటొప్పునే. ౨౩౪ 1510

క. అనితలఁచి సంభ్రమంబునఁ, జనుదెంచి మహాత్ముఁ గుశిక♦సత్కులజాతుం
గని యనునయోక్తులను ని, ట్లనిరి మహాత్మా! వినంగ ♦ నగు మాపలుకుల్.

క. గురుశాపవినిహతుం డీ, ధరణీశుండో మహాత్మ ♦ తాపసివర్యా!
సురపురి కేగఁగ నెట్టులు, పరికించినను వగండు ♦ పాతకుఁడగుటన్. ౨౫ 1512

చ. అన, సురవాక్యముల్ విని మ♦హాముని, దేవవరేణ్యులార! మీ
కనయము మంగళంబగుత ♦ మారయుఁడీ యిఁక నామకోక్తి నీ
తనిని శరీరయుక్తముగఁ ♦ దప్పక స్వర్గముఁ జేర్చువాఁడనం
చని శపథంబుసేసి యిపు♦డప్పలుకుల్ వృథసేయు టొప్పునే. ౨౭ 1513

చ. పలికినపల్కు వ్యర్థమగు ♦ పద్ధతి నేనొనరింపఁజాల నే
స్థలమున నిమ్మహీపతియొ♦సంగునొ యిప్పుడు, తత్ప్రదేశమే
యలరుత శాశ్వతంబగు సు♦రాధిపవాసముగాఁగ; నిజ్జగం
బులు నివసించుదాఁకఁ బా♦లుపుం గనుఁగాక మదీయతారకల్. ౨౮ 1514

తే. స్థిరములై నే సృజించిన♦పరమతార
కలు చెలంగెడు నట్లొప్పఁ♦గఁ దగు మీర
లిట్లు మీరొప్పుదురయేని ♦ యిపుడు సేయఁ
బూనుపని మానుదునటంచు ♦ మౌని పలికె. ౨౯ 1515

సీ. అమ్మాట లాలించి ♦ యమరులెల్ల వచించి రతనితో నట్లులే ♦ యగు మునీంద్ర!
నీకు భద్రంబగుఁ ♦ గాక; నీవు సృజించినట్టి యాతారక♦లన్నియును ది
వమున జ్యోతిశ్చక్ర♦పథమునకున్ వెలుపలను శాశ్వతముగ ♦ నిలిచియుండుఁ
గాత, మీతారకా♦గణముల మధ్యభాగమ్మున నమ్మహీ♦కాంతుఁడును గగు

తే. పునకు నపకారమొనరించి ♦ పొందినట్టి
యఘమునం దలక్రిందుగా ♦ నమరియును స్వ
తేజమున దేవతలతోడ ♦ దీటుగాంచి
వెలయుచుండును మఱియొక్క♦పలుకువినుము. ౩౧౪ 1516

చ. ఇతఁడు కృతార్థుఁడై దివికి ♦ నేగినవానివలెన్ యశంబుఁ గాం
చి తనరుచుండు; నీవిట సృ♦జించిన జ్యోతులివెల్ల నిమ్మహీ
పతి నగుచెంతఁ బాయకయె ♦ భాసిలుచుండునుగాక; యన్నదే
వతల సువాక్యముల్ విని ప్ర♦భావము పెంపును గన్న మౌనియున్. ౩౨౪ 1517

తే. ధర్మమతియాట వారెల్లఁ ♦ దన్నుఁ బొగడి
పల్కినంత "తథాస్తు" ని ♦ పలికె, జన్న

మును ముగించి మహాత్ములౌ ♦ మునులు సురలు
వచ్చినట్టులె పోయిరి ♦ స్వగృహములకు. ౩౮౪ 1518

అఱువదియవ సర్గము సంపూర్ణము.

---

౬౧ - వ సర్గము.

శునశ్శేఫు నంబరీషుఁడు పశువుగాఁ గొనుట.

క. తనపంపున నరుదెంచిన, మునులందఱు స్వగృహములకుఁ ♦ బోవుట గని య
మ్మునిపతి మహాత్ముండవ, వ్వనమునఁ గల మునులతోడఁ ♦ బలికె నిటుతగన్.

వ. ఒనరుపఁ బూనినట్టి తప♦మొందెను విఘ్నము నేను దక్షిణం
బున కరుదెంచుటం గనుకఁ ♦ బోఁదగు నింకొక చోటికందుఁ బో
యినఁ దపమంతరాయముల ♦ హీనముగాక చెలంగుఁ బోదమే
వినుఁడికఁ బశ్చిమంబునఁ బ్ర♦వృద్ధతపోవనరాజి యొప్పెడిన్. ౨౪ 1520

తే. అందుఁ బుష్కరతీర్థతీ♦రాళి, సుఖము
గాఁ దపమ్మును జేయుద ♦ మోదయామ
నీషులార ! తపంబును ♦ నిశ్చలముగఁ
జేయఁదగిన వనంబద్ది ♦ యే యటంచు. ౩ 1521

క. పలికి యెసంగెడు కోరిక, గలకౌశికుఁ డపుడె పోయి ♦ కావించె మహో
జ్జ్వల తేజమలరఁ దపమును, ఫలమూలాశనుఁడు నౌచు ♦ భవ్యస్థలులన్. ౩౪

క. కర మాతప మనివార్యము, పరభయదముగాఁ జెలంగెఁ ♦ బట్టుదలను భూ
వరముని తపమొనరుచు న, త్తరుణమునన యోధ్యయందుఁ♦దాఁ బ్రభువగుచున్.

సీ. అంబరీషుండు వి♦ఖ్యాతిచేఁ దగువాఁడు సవమొనరుపఁ బూని ♦ జరపుచుండ
యజ్ఞపశువు నింద్రుఁ ♦ డపహరించెఁ బురోహితుం డంబరీషుని ♦ తోడఁ బలికె
నీ ప్రమాదంబున ♦ నీయజ్ఞమునఁ బశు విట్లపహృతమయ్యె ♦ నెవరిచేత
నో; యది కానరా♦కున్నది; చక్కఁగఁ బశువును గావని ♦ ప్రభువును బశు

తే. నాశనాదిక దోషగ♦ణంబు లార్తి
నొందఁజేయును మఱి చంపు ♦ నుర్వినాథ !
వినుము దీని ప్రాయశ్చిత్త♦విధియు దుష్క
రమని భావింపుమీ యధ్వ♦రమున మనము. ౭౪ 1524

క. జరపంగఁ దగిన విధులను, జరపకమున్నే హయంబు ♦ సరగునఁ దెమ్మా !
తురగము దొరకనిచో నొక, పురుషుని నేఁ దేరఁబంపు ♦ భూపవతంసా !. ౮

క. అనినఁ బురోహితువచనము, విని యాభూపతివరుండు ♦ విమలమనీషం
గనుటన్ ధేనుసమూహం, బునునైన నొసంగి నృపశు♦వును దేఁ జనియెన్.౯

క. జనపదముల దేశమ్ముల, వనముల నగరములఁ బుణ్య♦భవ్యాశ్రమసం
క్తిని నెల్లవెదకి యెందును, దనవాంఛను బొందకతఁడు ♦ తత్తఱపడుచున్.

తే. ఒక్కచో భృగుతుంగ నా♦మోరుశైల
మున ఋచీకునిఁ గనియె న♦మ్మునియుఁ బుత్ర
యుక్తుఁడై భార్యతోఁగూడి ♦ యుండ నృపతి
యతులతేజంబు వొంగఁగ ♦ నచటి కరిగి. ౧౧ 1528

క. ధరణీసురమౌనికి ని, ర్భరతపమునఁ దేజరిల్లెడు♦వానికి స్వీయ
స్ఫురదురుకాంతులు వెలయఁగ, స్థిరసాగిలి మ్రొక్కి సుముఖుఁ♦జేసి యిట్లనున్.

తే. కుశలమే సర్వథా మీకు ♦ క్షోణిదివిజ!
మునివరా! మామకీయమౌ ♦ మనవి వినుము
లక్షగోవుల నీకు వె♦లకు నొసంగు
వాఁడ వానిని గొని యాత్మ♦భవుని నిమ్ము. ౧౩ 1530

క. క్రతుపశువు గాఁగ నీఁదగు, సుతు నమ్మెడు వేని నాదు♦సుకృతము పండున్
గృతకృత్యుఁడ నయ్యెద నీవు తగన్ భృగుకులమునందుఁ ♦ బుట్టితివి మునీ!.

ఉ. నే నొనరించు ప్రార్థనము ♦ నెమ్మిని సార్థకమై చెలంగ నీ
సూనుని నిమ్ము దేశములఁ ♦ జుట్టితిఁగాని మనోరథంబు నెం
దేని ఫలింపదయ్యె విను ♦ మీ తనుజాతులలోన నొక్కనిన్
మానిగణేశ! మూల్యమును ♦ మామకమున్ గొని యీయవే దయన్. ౧౫

చ. అనిన ఋచీకుఁ డిట్లనియె ♦ నాత్మజులందగు పెద్దవాని న
మ్మను, జుమి! మూల్యమెంతయిన ♦ మానవనాయక! యంచుఁబల్కె నా
తని సతి సత్తపోనియతి♦తం దగు నింతియు భర్తృవాక్యమున్
విని నరపుంగవుం గని ప♦విత్ర భృగూద్వహుఁ డాత్మజావళిన్. ౧౬ 1533

తే. పెద్దవాని నొసంగను ♦ వెలకు ననియె
నాకుఁ జిన్నిసుతుండౌ శు♦నకుని యందుఁ
బ్రేమ యధికంబుగాన నా♦ ప్రియతనూజుఁ
జిన్నికొమరుని నీఁజాల ♦ క్షితిప! నీకు. ౧౭ 1534

చ. తనయులలోన జ్యేష్ఠుఁడగుఁ ♦ దండ్రికి మోదము నిచ్చువాఁడు, వే
డ్కనొసఁగుచుండుఁ దల్లులకుఁ♦గాను గనిష్ఠుఁడు ప్రాయికంబుగా
గనఁదగుఁ గాదె యివ్విధము ♦ క్ష్మాపతిచంద్ర! ధరిత్రిఁగాన నా
తనయులలోఁ గనిష్ఠుని ము♦దంబును గూర్చెడువానిఁ గాచెదన్. ౧౮ 1535

సీ. అనుచుఁ దండ్రియుఁ దల్లి♦యును నరాధిపుతోడ నాడినమాటల ♦ నాలకించి
యప్పుడు మధ్యముం♦డౌ శునశ్శేఫుండు పలికె తనంత నో♦పార్థివేంద్ర!

పెద్దవానిని దండ్రి ♦ వెలకీయననిపల్కెఁ దల్లియుఁ గడపటి♦తనయు నీయ
ననియె మధ్యముఁడనౌ ♦ తనయుననే నీకు నమ్మిరంచుఁ దలంతు♦నాత్మఁగాన
తే. నన్నుఁ గొనిపొమ్ము నీవింక ♦ నన్న రాజు
నమ్మతమ్మున ధేను ల♦క్షనొగి నిచ్చి
యతని రథమున నెక్కించి ♦ యతిజవమున
యశముఁ దేజంబు బొంగఁగ ♦ నరిగెఁ బురికి. ౨౩ 1536

అఱువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౬౨-వ సర్గము.

చ. విను మటమీఁదివార్త రఘు♦వీర! మహాయశుఁడైన యంబరీ
షనృవరుఁ డక్కుమారకుని ♦ సంగతిఁబాయకపోయి పుష్కరం
బనఁబడు తీర్థమందు రవి ♦ యాకసమధ్యమమందునుండఁ దా
ననువుగ నిచ్చె నప్పుడు మ♦హామతి మానికుమారుఁ డంతటన్. ౧౪ 1537
క. నరవిభుఁడు విశ్రమించుటఁ, బరికించి తదంతికమున ♦ వసియించిన భూ
వరమాని గాధిసుతుముని, వరసంయుతిఁ దపముసేయు♦వానిం గనియెన్. ౨
తే. అతఁడు తనమాతులుండౌట ♦ నార్తిఁగన్న
తన్నుఁ గరుణించుననియెంచి ♦ తత్తఱపడు
స్వాంతమునఁ దప్పిచేతఁ ద్రో♦వబడలికను
మోము వెలవెలఁ బాఱంగ ♦ మామఁ గనియె. ౩ 1539
క. దీనుండై ప్రాణంబుల, పై నాశ యెసంగఁ దొడల♦పై వ్రాలుచు మా
మా! నను: గాపాడఁగ నే, మానవులును లేరు సుమ్ము ♦ మాటలిఁ కేలా. ౩౪
క. జననీజనకులు జ్ఞాతులు, మనసున దయగల్గు బంధు♦మండలమును లే
రనుమాట నిక్కమయ్యెం, గనుకన్ సౌమ్యుఁడవు నీవు ♦ కావుము నన్నున్.
చ. అరయుము ధర్మసూక్ష్మముల ♦ నాదృతి నగ్గరుణించు పద్ధతిన్
ధరణిపు నధ్వరంబుకొఱ♦తం గనకుండెడి మార్గమున్; మునీ
శ్వర! ననుఁ జూడు మెల్లరకుఁ ♦ బ్రాణము లిచ్చెడువాఁడవీవె నీ
కరుణకుఁ బాత్రభూతుఁడను ♦ గావునఁ బ్రోవఁగదయ్య మాతులా. ౫ 1542
క. జగతీపతి! కృతకృత్యుం, డగు మాడ్కిని నేనుఁజాల ♦ నాయుష్యముఁ బొం
దఁగ; నంతరాయహీనం, బగు తపమున స్వర్గమంద ♦ నరయుము మదిలోన్.
ఆ. అరసి యెట్టులైనఁ ♦ గరుణఁ గాపాడుమీ, దిక్కులేని నాకు ♦ దిక్కుగమ్ము
భవ్యమైనమదిని ♦ బరికించి పాపవి, పత్తినుండి గావు♦మిత్తఱి నను. ౬౪ 1544
క. జనకుఁడు సుతుఁగాచెడు వడువున నన్గావంగవలయుఁ ♦ బూజ్యమనీషా!

యనినన్ విశ్వామిత్రుఁడు, తనగొప్పతనంబువలని ♦ ధైర్యమువలనన్. ౭

చ. తనరెడు గాఫునన్ బహువి♦ధంబుల నాతని నూఱడించుచుం
దనయులఁ జూచి మేలరయు ♦ తండ్రులదేపనికై కుమారులం
గనుదురొ!; యీ ప్రయోజనము ♦ కాదనకాదృతిఁ బైతృవాక్యముం
గొనకొని చేయుటే గద య♦కుంఠితభక్తిని దానిఁ జేసినన్. ౮ 1546

తే. మీకు నాకును దగఁ బర♦లోకహితముఁ
గలుగఁజేసెడు ధర్మమ్ము ♦ వెలయు; నట్టి
పద్ధతిని మీరు పూనంగ ♦ వలసినట్టి
కాలమరుదెంచె వినుఁడు త♦త్కారణంబు. ౯ 1547

క. మునితనయుఁడు బాలుండిదె, నను నార్తిని శరణు సొచ్చె; ♦ నాప్రీతికి మీ
రనుమానింపక ప్రాణయుతిని పీడలరారు నవ్వి♦ధిని బూనఁదగున్. ౧౦ 1548

క. మీరందఱుఁ బుణ్యాత్మకు, లారయ ధర్మైకనియతి ♦ నందినవారల్
భూరమణు యజ్ఞపశువుగ, నేరైనం బోయి యగ్ని♦తృప్తి నెఱపుఁడీ!. ౧౧

ఆ. ఇట్లు మీరుచేయ ♦ నీశునశ్శేఫుండు, బ్రతుకఁజాలు నాదు ♦ ప్రాపుగల్గి
యంతరాయమొంద♦కధ్వరమును సాగు, దివిజవితతిగాంచుఁ♦దృప్తి మఱియు.

క. జనకుని మాటను మీఱక, తనయులు మీరెల్ల జరపి ♦ ధన్యులగుటయున్
గన నగునన మునివచనము, వినిన మధుష్యందముఖులు ♦ విముఖతఁగనుచున్.

క. పరిహాసముగాఁ బల్కిరి, గరువమునన్; వినుము తండ్రి!♦కడుఁబ్రియసుతులన్
బరిపాలింపక పరసుతుఁ, గరుణన్ రక్షింపఁబూను ♦ కారణమేమో. ౧౩ 1552

క. ఎక్కడి ధర్మంబో యిది, కుక్కలమాంసంబుఁ దినఁగఁ ♦ గోరుట గాదే?
నిక్కముగ రుచికరాన్నం, బొక్కట లభియింపమాని ♦ యో ప్రియజనకా!.

క. కనుఁగొనఁగ నిది యకార్యం, బనితలఁచెద మనుచుఁ గొడుకు♦లాడినపల్కుల్
విని తీవ్రకోపమునఁ దన, కను లెఱ్ఱంబాఱపల్కెఁ ♦ గఠినాత్మకుఁడై. ౧౫ 1554

మ. జనకుండాడినమాటకున్ బదులిఁకే♦చందంబునం గాని చె
ప్పినఁ బాపంబనునీతిఁ బోవిడిచి ని♦ర్భీతిన్ మదోక్తిన్ జవం
బుననే దాఁటి, మహాకఠోరమగుచున్ ♦ బుద్ధి న్విచారింప నిం
కను రోమాంచవికారముం గలుగఁ జ♦క్కంబల్కినారందుచేన్. ౧౬ 1555

క. మీరందఱును వసిష్ఠుకు, మారులచందమునఁ గుక్క♦మాంసముఁ దిని ని
స్సారత ముష్టికజాతిం, జేరి సహస్రాబ్దములను ♦ క్షితిఁ బరఁగుఁడీఁకన్. ౧౭

క. అని శపియించి శునశ్శే, ఫుని దుఃఖనిమగ్నుఁ గని వి♦భూత్యాదిపదా
ర్థనిచయముమంత్రయుతముగ,నొనరిచిభయముందొలంగ♦నొసఁగియిటులనున్.

సీ. మునిపుత్ర! పావన♦ములగు దర్భలత్రాళ్ల బంధింపఁబడి రక్త♦వర్ణగంధ
సుమమాలికలఁ దాల్చి ♦ శుభ్రయూపస్తంభమున విష్ణుదైవతం♦బునను గట్టఁ

బడినపిమ్మట నిదె ♦ వక్ష్యమాణమ్ములౌ వాక్యములను హుతవహున కభిము
ఖుండవై పలుకుమీ ! ♦ రెండుగాథలు దివ్యములివె నీకుపదేశ♦మును దగంగ
ఆ. జేసినాఁడ నిందు ♦ జిష్ణుని కొకటి, యు
పేంద్రునకు నొకటియు ♦ నెసఁగు వీని
నంబరీషు యజ్ఞ♦మందుఁ బాడుము దానఁ
బ్రాణసిద్ధిగలుగుఁ ♦ బ్రమదమలరు. ౨౦ 1558
క. అనిపల్క నంత నమ్ముని, తనయుండు సమాహితుండయి ♦ తద్గాథల రెం
టినిఁ సంగ్రహించి ప్రముదం, బున వే నృపుసన్నిధికినిఁ ♦ బోయి యతనితోన్.
తే. ఓమహాసత్వ ! రాజేంద్ర ! ♦ యొప్పమీఱ
సత్వరమ్ముగఁ జనుదము ♦ సదసునకును
దీక్ష నూనుము యజ్ఞసి♦ద్ధిని గనంగ
వలదె యనవిని మోదంబు ♦ వెలయ నపుడె. ౨౨ 1560
సీ. జాగరూకుండయి ♦ సవమండపముఁజేరి యందు సదస్యుల♦యనుమతిఁ గని
పశుపీతుఁడని గుర్తు ♦ పడుటకుఁ బావన దర్భరజ్జువులనా♦తనిని గట్టి
రక్తాంబరంబుల ♦ రాజిల్లఁగాఁ జేసి యూపంబునం గట్టె ♦ నీపగిదిని
బద్ధుఁడై శ్రేష్ఠతం ♦ బరఁగు గాథలభక్తిఁ బశుభోక్తయౌ దేవ♦పతిని యూప
తే. దేవతయగు నుపేంద్రుని ♦ బావనవిధి
తప్పకుండ నుతించె నం♦త ముదమంది
శతమఖుఁడు తనస్వామియౌ ♦ చక్రధరుని
నతఁ డటు రహస్యముగను సం♦స్తుతి సలుపుట. ౨౩ 1561
క. మనమున నెంతయుఁ దృప్తిం, గని దీర్ఘాయుస్సునిచ్చెఁ ♦ గరుణను మునిరా
ట్తనయున కమరేశునికృపఁ, గనియెన్నృపుఁడధికముగను♦గ్రతుఫలమచటన్.
క. మురలన్ ధర్మాత్ముండనఁ, బరఁగెడు గాధేయుఁడుం ద♦పంబును దమిఁ బు
ష్కరముల వేయిశరత్తులు, నిరతిం గావించె శాస్త్ర♦నిష్ఠ మెఱయఁగన్. ౨౬

అఱువది రెండవ సర్గము సంపూర్ణము.

---

## ౬౩ - వ సర్గము.

విశ్వామిత్రుఁడు మహర్షి యగుట.

క. ముని యిట్లు వేయివర్షము, లనూనమౌ తపమొనర్చి ♦ యవభృథమును స
ల్పినఁ గాంచి యెల్లదివిజులు, చనుదెంచిరి తత్ఫలమ్మొ♦సంగెడుకాంక్షన్. ౧
చ. సుమహిత తేజుఁడౌ కమల♦జుండు మనోహరవాక్కులొప్పఁ బ
ల్కు మునిని గాంచి మంగళమ♦గున్ గుశికాన్వయ ! బాహుజర్షివై

తపముఁ జెలువారి తింతదను♦కన్ శుభరీతి గడించినట్టి క
ర్మముల ఋషిత్వముం గనుము ♦ మానితరీతినిఁకన్ దపోధనా!. ౨ 1565

క. అనిపలికి యంతఁ బ్రహ్మయుఁ, దనలోకంబునకుఁ బోయెఁ ♦ దానంత, నతృ
ప్తిని *విశ్వామిత్రుండును, ఘనతేజము వెలయఁ దపముఁ ♦ గ్రమ్మఱ సలిపెన్.

మేనక విశ్వామిత్రుకడకు వచ్చుట.

క. చిరకాలము జరగఁగ న, చ్చరలకు మిన్నయయి దేవ♦సంఘూజ్ఞను బు
ష్కరముల జలకములాడఁగ, నరుదెంచెను మేనకయను ♦ నతివ యొకతఱిన్.

ఆ. అతులమైన రూప ♦ మమరఁ బుష్కరముల, జలకమాడనున్న ♦ జలజనేత్రఁ
గనియె మేఘపంక్తిఁ ♦ గ్రాలువిద్యుల్లత, వలెను భూరితేజ♦మలరు మౌని. ౫

చ. స్మరవశమైన చిత్తమునఁ ♦ జంచలనేత్రను గాంచి స్వాగతం
బు, రమణి! నీకగున్ ముదిఁ బ్ర♦మోదమునన్ సుఖయుక్తినుండుమా
యరుదగుమామకాశ్రమము♦నందున; దర్పక మోహితున్ ననున్
గరుణ ననుగ్రహింపు; కల♦కాలము నీకు శుభంబు వర్ధిలున్. ౬౹ 1569

చ. అని తనువేఁడ మేనకయు ♦ నాతనిప్రార్థనమున్ గ్రహించి యు
మ్మునిపతి యాశ్రమంబునఁ బ్ర♦మోదమునన్ వసియించె నట్టుల
వ్వనితను గూడి మౌని దశ♦వత్సరముల్ సుఖయుక్తినుండె నం
త, నతఁడు దానిసంగతిని ♦ దర్పకమోహితుఁడై వసించుటన్. ౭౹ 1570

క. తన తపము చెడుటకై సి, గ్గును బొంది దురంతచింతఁ ♦ గుందుచు దుఃఖం
బును గాంచి తలఁచె నాతప, మును జెఱుపఁగఁ జేసిరమర♦ముఖ్యులు దీనిన్.

సీ. ఇది దేవతల కృత్య♦మే యగు నాతపం బెల్ల నశించె ని♦ట్లేప్పుడకట
పదివత్సరము లేగెఁ ♦ బరఁగ నహోరాత్ర మట్లు మన్మథవశ♦మందుఁ జిక్కి
తిని గాన నాతపం♦బున కిట్లు విఘ్నంబు సంప్రాప్తమయ్యె నీ♦సరణి ననుచు
నిట్టూర్పులను బుచ్చి♦నిజమోహమునకుఁ బశ్చాత్తప్తుఁడై కుందె♦జలజనయన

తే. నను నితండేమి చేయునో ♦ యనుచు భీతి
వడఁకుచుం గేలుమోడ్చి ని♦ల్వఁ గని లేమ!
నాదె యపరాధమియ్యది ♦ నీదికాదు
భయమిఁకేలని మధురోక్తిఁ ♦ బల్కి విడిచె. ౧౨౹ 1572

చ. వనితను బాసి యుత్తరపు ♦ భాగమునం దగు నాహిమాద్రికిం
జని విజితేంద్రియవ్రతముఁ ♦ జక్కఁగఁ బూని వ్రతంబు పూర్తియౌ
దనుక దృఢంబుగా మనసుఁ ♦ దత్పరతం జెలువారఁ జేయనొ
నని వనిపూని కీర్తియు ది♦శావళి నిండఁగ భక్తిమీఱఁగన్. ౧౩౹ 1573

* విశ్వామిత్రశబ్దములోని వి అను అక్షరము గాయత్రి తృతీయాక్షరము.

తే. కౌశికీనదితీరంబుఁ ♦ గాంచి యందు
దారుణంబగు తపమును ♦ దాను జేసె
భక్తి నతఁడిట్లు వేయిసం♦వత్సరములు
తపము ఘోరమ్ముగాఁ జేయ ♦ నపుడు సురలు. ౧౮౪ 1574

క. హిమవంతంబున నధిక భ,యమునొంది మహర్షి యుక్తు♦లై పోయి యజుఁ
దమకెల్లఁ బ్రాపుగాఁ గని, కమలజనీ! గాధిసుతుఁడు ♦ కడు నిష్ఠమెయిన్.౧౫౫

ఆ. తపము సల్పువాఁడు ♦ దారుణంబుగ నింకఁ
దామహర్షి యనుచు ♦ ధరణిఁ బిలువఁ
బడునుగాక; రమ్ము ♦ పద్మజా! యందుకై
తత్సమీపమునకుఁ ♦ ద్వరగ ననిన. ౧౬ 1576

చ. సురగణవాక్యపద్ధతిఁ బ్ర♦చోదితుఁడై యట కేగి యాతపో
నిరతునిఁ గౌశికుం గని వి♦నిర్మలవాక్కుల నోమహర్షి! ని
ర్భరతపమిట్లుచేసితివి ♦ బాలక! నీకగు స్వాగతంబు నా
కరుదుగఁ దోఁచె నుగ్రతప♦మాత్మను మెచ్చితి నీదు నిష్ఠకున్. ౧౭౫ 1577

క. నీవెల్ల బురుషులలోనన్, భావింపఁగ ముఖ్యుఁడవయి ♦ పరఁగు మహత్త్వం
బీవచ్చితిఁ గైకొను మన, నావాక్యము నాలకించి ♦ యమ్ముని యంతన్. ౧౮౫

సీ. సర్వలోకేశుఁడౌ ♦ జలజసూతి వచించె నని విషాదము గాని ♦ యట్లు సంత
సముఁ గాని పొందక ♦ సర్వలోకపితామహునకు నమస్కార ♦ మొప్పఁజేసి
ప్రాంజలియై నిల్చి ♦ యనియె విశ్వామిత్రుఁ డోలోకనాయకా! ♦యొగి నిజార్జి
తశుభకర్మములఁ జిం♦త్యముగాని విఖ్యాతిఁ బరఁగు మహర్షిశ♦బ్దమ్ము నాకుఁ

తే. గలదనుచుఁ బల్కితేని నిం♦కను జితేంద్రి
యుండనైతిఁ గదా; యన ♦ నూహ చెలఁగ
మునివరా! చిత్తవికృతులఁ ♦ గనఁగఁజేయు
హేతువులుగల్గు నత్తఱి ♦ నించు కేని. ౨౧ 1579

క. మనసున వికృతిని బొందక, ఘనధైర్యముతోడ నుండఁ ♦ గలపర్యంతం
బును నీవు నిర్జితేంద్రియుఁ, డనఁబడ వద్దానికై ప్ర♦యత్నముఁ గనుమీ!.

చ. అని వచియించి యంతఁ జతు♦రాననుఁ డాత్మపదంబుఁ జేరఁగాఁ
జనియె సుపర్వులెల్లరును ♦ స్వర్గతలంబున కేగ గాధినం
దనుఁ డపుడూర్ధ్వబాహుఁడు స♦దాగతిభక్షుఁడు నిస్సహాయుఁడై
పెనుతపమాచరించెఁ దన♦పెద్దప్రయత్నముఁ దీర్చు వేడుకన్. ౨౩ 1581

తే. అట నిరాలంబుఁడై తప♦మాచరించి
మఱియు నమ్మౌనివరుఁడు, ఘ♦ర్మసమయముల
యందుఁ బంచాగ్నిమధ్యము♦నందు నిల్చి
వానకాలంబునన్ బట్ట♦బయల నిలిచి. ౨౩౫ 1582

క. చలివేళ నహర్నిశలును, జలముల నివసించి యట్టి♦చందమ్మున ని
శ్చల భక్తి వేయి వర్షం, బులు ఘోరతపంబు సేసెఁ ♦ బూనిక మీఱన్. ౨౪౻
చ. మునివరుఁడైన కౌశికుఁడు ♦ భూతభయంకరమౌ తపంబు ని
ట్లొనరుప దేవతాళి పురు♦హూతుఁడు భీతి వడంకి రంతనా
తని నియమంబునుం జెఱుపఁ ♦ దాను శతక్రతుఁ డాదితేయపం
క్తిని గని యెన్ని రంభఁ బరి♦కించి వచించె సురార్తివాయఁగన్. ౨౬౻ 1584

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౬౪ - వ సర్గము.

విశ్వామిత్రుఁడు రంభను శపించుట.

క. ఓరంభా! యీకౌశికుఁ, జేరి మరులు గల్గునట్లు ♦ చేసి కలఁచి నీ
చారుతరరూపసంపదఁ, గోరెడుగతిఁ జేయవలయుఁ ♦ గువలయనేత్రా. ౧
మ. సురకార్యంబిది గొప్పదౌఁ దరుణి! నీ♦శుంభచ్చమత్కారమున్
ధరణిం గ్రాలఁగఁజేసి కృత్యమును మో♦దంబొప్ప సాధింపఁగాఁ
దరుణం బియ్యదియే కదా యనుచు నిం♦ద్రాణీవిభుం డాడ, ని
ర్జర నారీతిలకం, బసాధ్యమగు, కా♦ర్యంబిద్దియౌ నంచెదన్. ౧౻ 1586
క. తలపోసి సిగ్గు పెంపునఁ, బలికెం గేల్దోయి మోడ్చి ♦ పాకరిపునితో
బలసూదన! యక్కౌశికుఁ, డలఘుతపోబలుఁడు కడు, భ♦యంకరుఁడు సుమా!.
తే. అతనిచెంతకుఁ జని యేమి ♦ యైననాచ
మత్కృతిని జూపుదునయేని ♦ మౌని తనదు
భయదకోపమ్ము నాపై నిఁ ♦ బడఁగఁజేయు
నిందులకు సందియము లే ద♦హీన తేజ!. 3 1588
క. కావునఁ బోవఁగ వెఱచెద, దేవా! ననుఁ బంప కనుమ♦తింపుము కరుణా
భావంబున నని యత్తఱి, నావెలఁదియు పలుకుచుం గృ♦తాంజలి తగఁగన్. ౪
క. తన యెదుటనున్న రంభను, గని నిర్జరవిభుఁడు వల్కెఁ ♦ గాంతా! భయముం
గనఁ బోకుము తప్పక నా, పనుపును నెఱవేర్చు నీకు ♦ భద్రము గలుగున్. ౫
చ. మనసిజుఁగూడి యందమగు ♦ మ్రానున భావము తెన్నెఱుంగు చ
క్కనిదగు కోకిలంబనయి ♦ గామిని! నేను ద్వదీయపార్శ్వ సీ
మ నిలిచి యుండువాఁడ బహు♦మానము పొందఁగఁ జాలుచేష్టలం
గనుచుఁ బ్రకాశమానమగు ♦ కాయము పొంగఁగ నీవు నేర్పునన్. ౬౻ 1591
చ. మునిపతి చెంతకేగి తప♦ముం జెడునట్టి విధంబుగాఁగ నో
య్యన మనసుం గలంపు మన ♦ నవ్వనితామణి యింద్రుఁడిట్లు ప

ళ్కన రమణీయవాక్యములఁ ♦ గేవల భక్తిభయంబు లొప్పఁగా
విని యటుసేయ నెంచి కడు♦వింత తనూరుచి వెల్గుచుండఁగన్. ౮½ 1592

క. మురిపెంపునవ్వు లొప్పఁగఁ, దరుణీమణి మౌనిఁ జేరి ♦ తనదేహరుచిన్
స్మరతాపము నొందెడు గతిఁ, జరియించె మునీంద్రుఁడున్న♦స్థలమున నంతన్.

క. సునమున కింపు జనింపం, గను నొనరుచు పికరవంబుఁ ♦ గర్ణామృత రీ
తిని వినఁబడ సంతోషం, బున నెంతయు వివశుఁడగుచు ♦ మునివరుఁడచటన్.

క. తనయెదుటఁ దోఁచు రంభను, గని కోకిలరవము వినియుఁ ♦ గాంతామణి పా
డినముద్దుపాట విని య, వ్వనితం గనియుం దపస్వి♦వర్యుం డాత్మన్. ౧౦

చ. తరుణి తనంత వచ్చెనొ ? శ♦తక్రతుఁ డిచ్చటి కంపెనో ? యటం
చరుదుగ సందియంబుఁ గని ♦ యాలలనాపరిగీతగానమున్
సురుచిర మౌ నటంచెఱిఁగి ♦ సుందరి దీని సహస్రనేత్రుఁ డీ
కరణిని నన్ను భ్రాంతిఁ గనఁ♦గా నొనరింపఁగఁ బంచె నంచెదన్. ౧౦½ 1596

ఆ. నిశ్చయించి కోప♦నిర్నిద్రహృదయుఁడై, కౌశికుండు రంభఁ ♦ గాంచి పలికెఁ
గామమును నమర్షఁ♦గడముట్టఁ బోకార్చి, నొగి వ్రతంబు సల్పు♦చున్ననన్ను.

క. కలఁచి స్మరార్తిని బొందం, గలుషపుఁ బూనిక జెలంగఁ♦గాఁ జేయఁగనో
లలనా ! వచ్చితివే! త, త్ఫలముగఁ బదివేలయేండ్లు ♦ వనమున నిందున్. ౧౧½

సీ. ప్రస్తరప్రతిమవై ♦ పడియుండుమని శపియించి యారంభ దే♦వేంద్రునాజ్ఞ
దాఁటఁజాలక వచ్చెఁ ♦ దరుణిదేమపరాధ మని తలపోసి యి♦ట్లనియె నాదు
కోపలక్ష్యంబవై ♦ కుందుచుండెడినిన్ను భవ్యతేజుఁడు తపో♦బలయుతుండు
నగు నొక్కవిప్రుండు♦నగువరో! యుద్ధరించును గృపనని శాప♦మునునొసంగె

ఆ. భూరితేజమెసఁగఁ ♦ బొలుచు నమ్మునియిట్లు
క్రోధమార్పలేక ♦ కోమలాంగిఁ
దిట్టి యవల తనమ♦దిం దలపోసి సం
తాపమందె, నంతఁ ♦ దరుణి యపుడె. ౧౨ 1599

చ. మునిపతిఘోరశాపమున ♦ భూరిశిలాకృతిఁ దాల్చె శాపమున్
వినఁబడి నప్పుడే విబుధ♦వీరుఁడు మారుఁడు భీతిఁబాసి ర
వ్వనమును; భూరితేజమున ♦ భాసిలుమేటి తపస్వి గాధిరా
ట్తనయుఁడు స్వీయకోపమునఁ ♦ దత్తపమెల్ల నశించు టెంచుచున్. ౧౩½ 1600

తే. తాను విజితేంద్రియుఁడు గామిఁ ♦ దపము చెడుట
వలన మనమునఁ గలిగిన ♦ యలఘుచింతఁ
బాపుకొనఁజాలఁడయ్యెఁ గో♦పమునఁ దపము
చెడుట నిట్లని చింతించెఁ ♦ జిత్తమందు. ౧౪½ 1601

చ. మనమునఁ గోపమూన నిఁక♦మాటలు వెల్వడ నీక మౌనమే
గనియెద నెట్టులేనియు, నిఁ♦కన్ బహువత్సరముల్ వసించెదన్
వనమున నూర్పులన్ విడుచుఁ ♦ బద్ధతి మాని; యమర్ష ముఖ్యముల్
జననము నొందు నూర్పులనె ♦ చక్కఁగ వానినడంచెదన్ మదిన్. ౧౯ 1602

సీ. తపమున భూవిబు♦ధత్వమే నార్జించు నటకు నింద్రియములు ♦ వశగతముల
నొనరించి నాగాత్ర♦మును బూని శోషింపఁ జేసెద, నూర్పులఁ♦జిక్కఁబట్టి
యాహారమును మాని ♦ యంత పర్యంతంబు నుండెద నంగంబు ♦ లుగ్రరీతి
నేఁ జేయు తపమున ♦ నే భుక్తిలేమిచేఁ దఱుగకుండెడునని ♦ తలఁచి యిట్లు

తే. స్థిరమతిని నిశ్చయంబును ♦ జేసికొని స
హస్రవత్సరములు ముని ♦ యతఁడు నియతి
దీక్షఁ దాలిచి చేసియే ♦ తీఱవలయు
నని ప్రతిజ్ఞను ఘనతర♦మును నొనర్చె. ౨౦ 1603

అఱువదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

౬౫ - వ సర్గము.

విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యగువిధము.

మ. హిమవంతంబున నుత్తరాశను మనం♦బెంతే వ్యథంబూనఁ బా
సి మహామౌనియుఁ దూర్పుఁ జేరి యచటం ♦ జెప్పంగ సాధ్యంబు గా
ని మహాఘోరతపంబుఁ జేయఁ దొడఁగెన్ ♦ నిర్ణీతమౌనంబును
త్తమమై యొప్పఁగ వేయివర్షములు, చి♦త్తస్వాస్థ్యముం బొందఁగన్. ౧

తే. పరమదుష్కరమై భయం♦కర మనుత్త
మంబునై రాఘవా! యత్త♦పంబు వెలసె
నంత వేయేండ్లు పరిపూర్తి ♦ నందు దనుక
నంతరాయంబులెన్నియో ♦ యలముకొనియె. ౨ 1605

క. ఐనను మనమున నించుక, యైనన్ భ్రమనొందకుండ ♦ నటదాఁకువునా
మౌని వినిశ్చలుఁడై తగఁ, గా నాతనిమది నమర్ష♦కనఁబడదయ్యెన్. ౩ 1606

మ. చ్యుతినేమాత్రము నొందకుండ ముని య♦త్యుగ్రవ్రతంబూని యా
గతిఁ జేసెం దప మస్మహావ్రతుఁడు సాం♦గప్రక్రమం బొప్ప నా
వ్రత మారీతిని వేయివత్సరములన్ ♦ వ్యాపించి పూర్తింగనన్
గృతకృత్యుండయి యన్నముం గుడువఁగా ♦ నెంచెన్; బలారాతియున్. ౪

సీ. ధాత్రీసురాకృతిఁ ♦ దాల్చి వచ్చి మునీంద్రు యాచించెఁ బరిపక్వ♦మైనయన్న
మును బెట్టుమా నాకు ♦ నని; యంత నమ్ముని పారణకొఱకుఁ దా♦వండుకొన్న

యన్నము నావిప్రుఁ ♦ డడుగుట కాత్మలో ననుమానమేమాత్ర ♦ మంద కట్టి
తపము సిద్ధింపంగఁ ♦ దా నన్నదానంబు చేయంగఁ జనునని ♦ చిత్తమందు

తే. నిశ్చయము చేసి యన్నంబు ♦ నెమ్మిమీఱ
మిగులకుండఁగఁ బెట్టి తా♦ను గుడువకపు
డూరకుండి ధరాసురు ♦ నొక్కమాట
యైనఁ బలుకక మౌనంబు ♦ నందియుండె. ౬౹ 1608

క. పరమాత్ముఁ గూర్చి మరలన్, వరముని యుచ్ఛ్వాసములను ♦ వదలక వేవ
త్సరములు తపమొనరించెన్, గరమరుదుగ నతని మస్త♦కస్థలినంతన్. ౭ 1609

క. పొగయొండు పుట్టె దానఁ ద్రి,జగములు దహియింపఁబడిన♦చందమ్మునఁ బెన్
బెగడొందె నంతఁ ద్రిదశో, రగ గంధర్వాసురులును ♦ రాక్షసులెల్లన్. ౮౹

చ. మునివరు సత్తపోజ్వలన♦మోహితులై విగతాత్మతేజులై
మనముల దుఃఖముల్ దగ, న♦మందరయంబున బ్రహ్మపాలికిం
జని మొఱపెట్టి రిట్లు జల♦జాతజనీ! కుశికాన్వయుండు పా
వనతప మూర్జితంబుగను ♦ వారక చేయుచు నున్నవాఁడొగిన్. ౯౹ 1611

తే. రంభ మొదలగు దేవతా♦రమణులను ద
గంగఁ బనిపి పేరాసను ♦ గనఁగఁ జేసి
తిమి వ్రతాంతమ్మునందు న♦న్నమును వేఁడి
యాగ్రహముఁ బుట్టఁ జేసితి ♦ మైన నతఁడు. ౧౦౹ 1612

క. పలువిధముల మాచే బా, ధల నొందింపంగఁబడియుఁ ♦ దపమున, కేకీ
డులు గల్గకుండ నియతిన్, గలిగి చెలంగెడు రవంత ♦ గనఁబడ దఘముల్. ౧౧

క. వనజాసన! యమ్ముని వాం,ఛ నొసంగనిచో నతండు ♦ జగములమూడిం
టిని సచరాచరముగ నో,య్యనఁగూల్చున్ దపముకలిమి♦నరయుముమదిలోన్.

సీ. కలఁకనొంది వెలుంగ♦కయె దిక్కులున్నవి సంద్రముల్ క్షోభిల్లె♦శైలగణము
క్రుంగుచునున్నది ♦ క్షోణి కంపించెడి నపసవ్యగతి భ్ర♦మనంది వీచు
చున్నవాఁ డనిలుఁ డి♦ట్లుండ దీనికిఁ బ్రతీకారమేయదియొకో? ♦ కానరాదు
పరికింప నిట్టి యా♦పత్తులవలననే నిత్యకర్మమ్ములు ♦ నెగడకడఁగ

తే. జనులు నాస్తికతుల్యులై ♦ సంచరించు
వారలని తోఁచుచున్నది ♦ పద్మయోని!
ముజ్జగమ్ములు సంక్షోభ♦మును గను. మన
ములను మూఢమ్ములైనవి ♦ విలయమిదియె. ౧౪౹ 1615

క. మునివరు నుదృత్తేజం, బున భానుఁడు వెలుఁగఁ డిపుడు ♦ మునియూతం డ
గ్నిని బోలువాఁడు కాంతిని, దనకు సమానంబు లేక ♦ ధరణిం బరఁగున్.

క. కానఁ ముల్లోకంబుల, మానియు నాశనముచేయ ♦ మది నెంచక ము
న్నే నళినసంభవా! త,న్మానసవాంఛలనొసంగి ♦ మన్నింపఁ దగుఁ. ౧౬ 1617

మ. ప్రళయాగ్నుల్ వలె లోకజాలము దహింపఁ వచ్చు నిక్కౌశికుం
డలఘూత్సాహమునఁ, సురాళిదగు రాజ్యంబంతయుం బొందఁ గో
ర్కులు చిత్తంబునఁ బుట్టెనేని నటులే ♦ కోరుఁ మహామౌని కి
చ్ఛలు తప్పంగని గల్గకుండఁ దదభీష్టంబుండఁగఁ దీర్పుమా!. ౧౭ 1618

చ. అని పలుకంగఁ బద్మజని ♦ యాదివిజాళిని గూడి పోయి మా
నిని మహనీయచిత్తుఁ గని ♦ నేర్పుగ స్వాదుతరోక్తులఁ ముదం
బున నను, నీకు స్వాగతము ♦ భూసురమౌని! భవత్తపంబునుం
గని కడు మెచ్చినారము ని♦కామము ఘోరతపంబిదాఁ జుమీ. ౧౮ 1619

తే. దీన నీవు బ్రాహ్మణ్యసి♦ద్ధిని దగంగఁ
బొందినాఁడవు నేను వి♦బుధవరులును
జాల యాయుస్సు నిచ్చితి ♦ మోలి నీకు
సుఖము లలరారు భద్రముల్ ♦ సొరిదిఁ గలుగు. ౧౯ 1620

క. మనమున నెమ్మిని బొందఁగఁ, జనుమా యిచ్ఛానుకూల♦సరణి ననుచుఁ బ
ల్కిన బ్రహ్మమొదలు గాఁగల, ఘనమతులాడినవిధంబుఁ♦గడుఁదమి వినుచుఁ.

ఆ. వందనములొనర్చి ♦ వారలతోఁ బల్కె
బ్రాహ్మణత్వసిద్ధి ♦ పరఁగునేని
యాయువధికమగుచు ♦ నలరునే నాయందు
వినుఁడు నాదుమాట ♦ విబుధులార. ౨౧ 1622

సీ. ఓంకారమును శ్రుతు ♦ లొప్పు వషట్కారమును దమంతనవచ్చి ♦ ననువరించుఁ
గాక యవ్వానిని ♦ నాకిచ్చువచ్చిన గతి నుపయోగింపఁ ♦ గలుగునట్టి
యర్హతనుండనొ ♦ నమరులారా! క్షత్త్రవేదములను విప్ర♦వేదములను
దెలిసినయట్టి ధా♦త్రీసురులకు ముఖ్యుఁడై బ్రహ్మపుత్త్రకుఁడై ♦తనరెడి

ఆ. యవ్వసిష్ఠమౌని ♦ యందఱు వినఁగ బ్ర
హ్మర్షివైతి వనుచు ♦ ననఁగ వలయు
నిదియె ముఖ్యవాంఛ ♦ యిద్దాని సిద్ధింపఁ
జేయవలయు మీరు ♦ శీఘ్రముగను. ౨౩ 1623

క. సురలారా! యీవాంఛా, పరిపూర్తిని బొందనే స♦ఫలయత్నులుగాఁ
బరిగణితులు మీరెల్లా,దురు? నావిని నిర్జరులును ♦ దోయజజనియుఁ. ౨౪

ఆ. అవ్వసిష్ఠు కడకు ♦ నరిగి ప్రార్థింపఁగ
నతఁడు సుప్రసన్నుఁ ♦ డగుచుఁ గుశిక

వంశ్యతోడఁ జెలిమి ♦ వాటించి బ్రహ్మర్షి
యయ్యె నీతఁడనుచు ♦ నపుడు పలికె. ౨౬ 1625

క. సురలిట్లని పల్కిరి భూ, సురమానిత నొందితీవు ♦ క్షోణీదివిజుల్
జరపెడి యాజనముఖముల, జరపందగువాఁడ వీవు ♦ సంశయమేలా!. ౨౭

క. అని పలికి దేవతలు వచ్చిన రీతిని బోయిరంత ♦ [క్షితిసురభావం
బును బొంది ధర్మవిదుఁడై, తనరుట యతఁ డవ్వసిష్ఠుఁ ♦ దమిఁ బూజించెన్.

ఆ. ఇట్లు మునివరేణ్య ♦ నెంతయుఁ బూజించి
సఫలయత్నుఁ డగుచు ♦ సాధువృత్తి
దపము సేయుచును న♦తండు ధరాస్థలి
నెల్ల సంచరించె ♦ నిచ్చకొలఁది]. 1628

క. ఓరామా! యమ్మునివరుఁ, డీరీతిని ధరణిదివిజ♦వృత్తిం గనియెన్
సారమతి యితఁడు మునులం, దారయ వర్యుండు ధర్మ♦మందు నిరతుఁడున్.

క. తనువొందిన తపమే యితఁ, డనవలయున్ వీర్యమునకు ♦ నగుఁ బ్రాపని య
మ్మునివరుఁడు శతానందుం, డని యూరకయుండె ♦ జనకుఁ డప్పుడు ప్రీతిన్.

తే. ఆశతానందుఁడు వచించి♦నట్టిమాట
లను ముదంబున విని రామ♦లక్ష్మణుల ప
రిసరమునఁ గౌశికుం జూచి ♦ యెసఁగు భక్తి
కరయుగము మోడ్చి యోముని♦కాంత! నీవు. ౨౯ 1631

సీ. కాకుత్స్థులను గూడి ♦ క్రతువున కేతెంచుటను నేను ధన్యుండ♦నను సనుగ్ర
హింపుఁడీ మునులకు ♦ నెల్లమేటివి గాఁగఁ దనరు నీదర్శన♦మునఁ బవిత్ర
మతినైతి భూసుర♦మానిమండనుఁడవై యతిశయమహిమచే ♦ నలరు దీవు
భవదీయదర్శన ♦ భాగ్యంబున న్నాకు బహువిధసుగుణసం♦పత్తి గలిగె

ఆ. నీవు చేసినట్టి ♦ నిర్మలతపమెల్ల
విస్తరించి చెప్పె ♦ విమలబుద్ధి
యీమహర్షి నేను ♦ నీమహాత్మ్యఁడు రాముఁ
డాదరమున వింటి ♦ మంతయు నిట. ౩౦ 1632

క. ఈసభ కరుదెంచిన యీ, భూసురులెల్లరును నీదు ♦ పూజ్యగుణములం
దాసపడి వినిరి నీతప, మా సంస్తవనీయ మింత ♦ యనరానిదియున్. ౩౧

తే. నీబలమ్మప్రమేయమై ♦ నెగడు నీదు, సద్గుణంబుల లెక్కింపఁ ♦ జాలరెవరు
సరసిజాసన గిరిజాత్మ♦జాపతులకుఁ, బోలె సద్గుణతతి నిన్నుఁ♦బొంది వెలసె.

సీ. ఆశ్చర్యకరములై♦నట్టి నీకథలనే నెంతయు వినిన న♦త్యంతతృప్తి
గలుగదు మనమున ♦ ఖరకరుబింబ మస్తాద్రిచెంతకుఁ జేర ♦ నరుగుచున్న

యది మౌనివర్య ! సాయంకాలకర్మ్ము లొనరింప సమయమిదో సమీప
మయ్యె రేపటియుదయంబున మరలనన్ గాంచఁగ రాఁ గరుణించవలయుఁ

**తే.** దాపసేంద్రోత్తమా ! స్వాగతమగు మీకు
నాకు సెలవిండటంచు జనకమహీశుఁ
డాదరంబునఁ బల్కిన ♦ నాలకించి
పురుషవర్యుని జనకునిఁ ♦ బొగడి యంత. ౩౫ 1635

**క.** మనమున సంతోషంబును, గని యాతని వీడుకొలిపెఁ ♦ గౌశికుఁడపుడా
జనకుఁడు కుశితాత్మజునిన్, వినయమ్మున నివ్విధమున ♦ వేఁడి ముదమునన్.

**చ.** వలగొని మంత్రిముఖ్య పరి♦వారయుతుండయి పోయె ధర్మయు
క్త లలితచిత్తుఁడైన కుశి♦కప్రభువంశవిభూషణుండు మా
నులు తనుఁ బూజసేయఁగ ఘ♦నుల్ రఘువంశసముద్రశీతర
శ్ములు తనవెంటరానరిగె ♦ మోదము పొంగ వసించుచోటికిన్. ౩౭ 1637

అఱువదియైదవ సర్గము సంపూర్ణము.

---

౬౬ - వ సర్గము.

—శివధనుః ప్రభావమును జనకుఁడు చెప్పుట.—

**ఉ.** బల్లునఁ దెల్లవాఱ విధి♦వంతముగాఁ గృతకృత్యుఁడై మహీ
వల్లభుఁడంతఁ గౌశికునిఁ ♦ బార్థివపుత్రయుతంబుగాఁగ సం
ఫుల్లమనస్సరోజుఁడయి ♦ పూనికఁ జేఁ బిలువంగఁబంచె వా
రల్లన వచ్చి; రప్పుడు ధ♦రాధిపుఁ డాదృతి మీఱ వారలన్. ౧ 1638

**తే.** ధర్మమతిగాన శాస్త్రోక్త♦తంత్రమమరఁ
బూజలం దన్పి యమ్మౌని♦పుంగవునిని
గాంచి సుస్వాగతంబగుఁ ♦ గాక మీకుఁ
జేయఁదగినట్టి పనినాకుఁ ♦ జెప్పవలయు. ౨ 1639

**చ.** మునివర ! మీయనుజ్ఞను బ్ర♦మోదము మీఱఁ దలంధరించి చే
య నిదిగో యున్నవాఁడను మ♦హాత్ములయాజ్ఞను దీర్పనౌఁ గదా
యని మహితాత్ముఁడౌ జనకుఁ♦డాడిన ధర్మవిదుండు కౌశికుం
డనియెను మాటనేర్పు దగు♦నట్లు ధరాధిప ! వీరలిద్దఱున్. ౪ 1640

**సీ.** దశరథరాజపు♦త్రకులు, క్షత్రియకుల జాతులు లోకవి♦ఖ్యాతయశులు
త్వద్గృహంబుననున్న ♦ ధనువును మేలైన దానిఁ జూడంగఁ ద♦ద్దయును గోరె
దరు; దానిఁజూపుమో ♦ ధాత్రీశ! శుభమగునీరాజపుత్రకు ♦ లిపుడు ధనువుఁ
గాంచినయంతనే ♦ కామితార్థము నొంది యిచ్చవచ్చినరీతి ♦ నేగువార

తే. లనిన జనకుండు పలికె మ♦హర్షివర్య !
చాపమియ్యది యేటిక♦స్మద్గృహమున
నున్నదో దానిఁ దెల్పెద ♦ నున్నతయశుఁ
డైన నిమికూటపురుషుఁడై ♦ యలరుమాకు. ౭ 1641

క. ఆతని కాఱవవాఁడై, ఖ్యాతింగనె దేవరాతుఁ ♦ డతనికరమునన్
భూతేశుఁడు నిధిగా నిడెఁ, బ్రీతిన్ జాపమును దీనిఁ ♦ బృథురూపంబున్. ౮

చ. వినుఁ డిఁక నిద్ది యీశ్వరుని ♦ విల్లెటులైనదొ చెప్పువాఁడ నో
మునివర ! మున్ను దక్షు మఖ♦ముం జెఱుపందగఁ గోరి కృత్యమున్
బొనరుచు నప్పుడీధనువుఁ ♦ బూనిక నెక్కిడి రోషమూని దే
వనిచయముం గనుంగొనుచుఁ ♦ బల్కెఁ దృణాకృతిఁగాఁ దలంచుచున్. ౯

క. సురలారా ! నేనీయ,ధ్వరమున భాగములఁ గోర♦వానిని సమకూ
ర్పరు గాదె? కాన మీవర, శిరముల నీచాపముననె ♦ చెండెదఁ గనుఁడీ!. ౧౦

చ. అనవిని దీన్కులై త్రిదశు ♦ లాదివిజేశుని వేఁడి సుప్రస
న్నునిగ నొనర్ప శంకరుఁడు♦నున్ దివిజాళియెడం బ్రసన్నుఁడై
ధనువు నతిప్రియం బలరఁ ♦ దానె యొసంగెడు వారికెల్లఁ బా
వనమతులైన యయ్యమర♦వర్యులు శంకరచాపవర్యమున్. ౧౧ 1645

క. హరుఁ డొసఁగఁ బడసి మఱి దే,వరాతుఁడను మాకుఁ బూర్వ♦పార్థివునకు ని
చ్చిరి యిల్లడఁగా నే న,ధ్వరమునకై భూమి దున్ను♦పనిఁ జేయు నెడన్. ౧౨

క. నాఁగటిచాలునఁ గన్నియ, యో గాధిసుతా ! మదక్షి♦యుగళికిఁ దోఁచెన్
యాగక్షేత్రమునన్ నా, కా గజగామిని లభించె ♦ నద్భుతరీతిన్. ౧౩ 1647

ఆ. సీతయనెడి పదము ♦ చెల్లునాఁగటి చాలు,నకును దానఁ బుట్టె ♦ నారిగాన
సీతయనఁగ సుప్ర♦సిద్ధిఁ గాంచినదయ్యె, భూమిజనితయైన ♦ పూవుఁబోఁడి.

క. భావంబున నాతనయఁగ, భావించియె నేను వృద్ధి♦పఱిచితి మౌనీ
శా! వినుమిద్ది యయోనిజ, యై వఱలును గాన నిర్మ♦లాంగి యగుటచేన్.

సీ. వరుఁ డెవ్వఁ డగునని ♦ భావించి దీనికి వీర్యమే శుల్కమా ♦ భీమరూప
మా, శంకరునిచాప♦మాఁ బందె మిద్దాని నెవ్వఁడెత్తునొ వాని♦కిచ్చి వేయఁ
దలఁచి యెవ్వనికీయఁ ♦ దలఁపక యుంచితిఁ బుడమి జనించిన ♦ పొలఁతి దీని
నాదు కూఁతుంగోరి ♦ నాయింటి కరుదెంచి యవనీశు లెందఱో ♦ యడిగి రేను

ఆ. వీర్యశుల్క యిద్ది ♦ విక్రమస్ఫూర్తికి
నిచ్చువాఁడననుచు ♦ నెన్నిపలికి
నాఁడఁ బిదప భూమి♦నాయకుల్ నానాము
ఖములనుండి యిచ్చఁ ♦ గదలి వచ్చి. ౧౬ 1650

చ. ధనువుబలంబుఁ గాంచెదు ము♦దంబున నీమిథిలాపురీవరం
బున కరుదెంచి రంత శివ♦పూజ్యశరాసనసారకాంక్షులై
తనరుచెఱింగి వారలకు ♦ దానిని దేరఁగఁ బంచి చూపితిం
గని గ్రహియింప నెత్తనయి♦నం మనుజేశులు చాలరైరొగిం. ౧౭ 1651

తే. వారు బలవంతులైన న♦భవశరాస
నము విషయమున బలహైన్య♦మనురె ననుచుఁ
దలఁచి యీకన్య నీయక ♦ తరలుఁ డనుచుఁ
బలికితి నెఱుంగుఁడీ తరు♦వాతికథను. ౧౮ 1652

చ. మనుజపులాత్మవీర్యమును ♦ మానసుటంచు నెఱింగి దానిచే
తను బడయంగరాదు వని♦తామణినంచుఁ దలంచి యందఱుం
ఘనతరకోపముంగని య♦కార్య మొనర్పఁగఁ గోరి నాపురం
బును దగ నావరించి రిటు♦పూన మఱొక్కటి హేతువుండనో. ౨౦ 1653

ఆ. వెట్టరానియట్టి ♦ పెద్దపందెముపెట్టి, యితఁడు మనుజపతుల ♦ నెల్ల మమ్ముఁ
దాఁ దిరస్కరించెఁ♦దగునె యంచుఁ, దలంచి,చాలఁ గోపమున నె♦సంగివారు.

క. నాపురము నావరించిరి, యీపగిదిం బీడసేయ ♦ నేగెను వర్షం
బో పరమమునీ! యంతట, నీపురరక్షకయి యున్న ♦ యేపరికరముల్. ౨౨ 1655

తే. మిగులకుండ నశించె నే ♦ మిగులవగలఁ
గుందితిని దాన నంత నే♦నుం, దపమున
దేవతలఁ బ్రీతులంజేయఁ ♦ దేజరిల్లు
నట్టి చతురంగమైన సై♦న్యమునొసఁగిరి. ౨౩ 1656

సీ. ఆబలంబుల రాజు♦లందఱుఁ దఱుమంగఁబడి భంగమొంది పా♦ప ప్రయత్ను
లగుట వీర్యమ్ములు♦హతములౌటను గాంచి యిఁకవీర్యముల్ ఫలి♦యింపవనుచు
ననుమానమొందుచు ♦ నా పుత్రులతోఁగూడఁ బాఱిరి మునిచంద్ర!♦భవునిచాప
విధమిద్ది నీవును ♦ వింటివిగద సుప్రకాశమైనట్టి యీ♦కార్ముకమును

ఆ. గనఁబఱచెద వీరి♦కిని రాముఁడీ శరా,సనము నెక్కుపెట్టఁ ♦ జాలునేని
తనయ నీయయోని♦జను సీత నీదాశ, రథికొసంగువాఁడ♦రమణ! నేను. ౨౪

అఱువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౬౭ - వ సర్గము.

రామచంద్రుఁడు శివుని విల్లు విఱుచుట.

చ. అని జనకావనీశవరుఁ ♦ డాడినఁ గౌశికమౌనిచంద్రుఁ డి
ట్లనియె మహీశ! రామునకు ♦ నాశివుచాపముఁ జూపుమన్న న

జ్జనకుఁడు మంత్రులంగని సు♦చందనమాల్యవిభూషితంబుఁ బా
వనమును నైన చాపము స♦భాస్థలికిన్ గొనితెండటంచనన్. ౨ 1658

క. నరపతి యాజ్ఞన్ మంత్రులు, పురము ప్రవేశించి పార్థి♦వుఁడు చెప్పిన య
ట్లె రయమునం జాపముతోఁ, బురవరమును వెడలి చనిరి ♦ భూపతి సభకున్.

సీ. ఆయతదేహులౌ ♦ నట్టి పంచసహస్ర బలశాలి పురుషులు ♦ చెలఁగి యష్ట
చక్రయుతంబయి ♦ శకటంబువలె నొప్పు శివధనుఃపేటికఁ ♦ జేతులారఁ
బట్టి ప్రయత్నపూ♦ర్వకముగ లాగిరి; సచివులంతట శివ♦చాప మున్న
యినుపపెట్టెను దానిఁ♦గొనివచ్చి సురతుల్యుఁ డైన యజ్జనకునిఁ♦గాంచఁ బోయి

తే. సకలభూపాలపూజిత ♦ శైవచాప
మిదియె మిథిలాధినాయకా! ♦ యెలమి మీరు
గానఁగోరిన ధనువు ని♦క్కడకుఁ దెచ్చి
నారమని విన్నవింప, న♦న్నరపతియును. ౬ 1660

క. మనమునఁ బొంగుచు నవ్వా, క్యనికరమాలించి తగఁ, గృ♦తాంజలియై మా
నిని రామలక్ష్మణులనుం, గని పలికెన్ మహితుఁడైన ♦ కౌశికుతోడన్. ౭ 1661

చ. ధనువిది యుత్తమంబగు బు♦ధప్రవరా! మహితాత్మ! మత్కులం
బున జనియించి రాజ్యమును ♦ బూనికనేలిన ధర్మసంధులౌ
జనకులచేతఁ బూజితము ♦ క్ష్మాపతు లుత్తమవీర్యులీ ధను
స్సును గని యెత్తఁజాలకయె ♦ స్తోత్రము చేసిరి పెక్కుభంగులన్. ౮ 1662

సీ. మౌనీశ! రాజుల ♦ మాట యింకేటికి సురగణంబులు రాక్ష♦సులు నసురులు
గంధర్వులును యక్ష♦గణములుఁ గిన్నరుల్ ఫణివర్యులును దీని ♦ వంపఁజాల
రల్లె మోపెట్టంగ ♦ నస్త్రంబు సంధింప జ్యావల్లిఁ గూర్పంగఁ ♦ జాపభార
మును బరీక్షింపంగ ♦ మునుకొని కదలింప నిందొక్కకార్యంబు♦నేని చేయఁ

తే. జాలరింక మనుష్యుల♦జోలియేల
వారికిట్లొనరించెడి ♦ భూరిశక్తి
యెట్లు లభియించు నవ్విధి ♦ నెసఁగుమేటి
ధనువుఁ దెప్పించినాఁడ దీ♦నిని మునీంద్ర!. ౧౦౪ 1663

క. మానుగ దశరథభూపతి, సూనుల కిర్వురకుఁ బ్రీతిఁ ♦ జూపుమనిన న
మ్మౌనియు ధర్మవిదుత్తముఁ, డై నెగడును గాన రాము ♦ నాదృతిఁగనుచున్.

తే. వత్స! శ్రీరామ! యీధను♦ర్వరముఁ గనుము
యనిన బ్రహ్మర్షి యనుమతిఁ ♦ గొని తదీయ
పేటికను దీసి యందున్న ♦ వింతధనువుఁ
గని మునీంద్రునితో రాముఁ♦డనియె నిట్లు. ౧౨ 1665

క. ధరణీసురమునివర్యా!, కరమున ముట్టెదను దీనిఁ ♦ గదలించెద ని

క్కరణినె మోపెట్టఁగ యత్నరతిని బొందెదనటన్న ♦ నరపతిమానుల్. ౧౪
క. ఆరీతినె కావింపుము, భూరమణకుమార ! యనిరి ♦ మునియానతిచే
శ్రీరాముఁడు లీలాగతి, సారశరాసనము నడుము ♦ సరభస మొప్పన్. ౧౫
చ. కరమునఁబట్టి పెక్కుజన♦కాంతులు చూచుచునుండ (లీలచే
నగుడుగ వంచెఁ దద్ధనువు) ♦ నయ్యది యున్నతమయ్యెఁ దానె య
చ్చెరువుగ వంగె రాముఁడును ♦ జిన్నివయస్సున నొప్పునైన వి
స్ఫురదురుశక్తి యాతనికిఁ ♦ బొల్చుఁగదా పరమేశుఁ డౌటచేన్. ౧౬ 1666
క. శ్రీరాముఁడు ధర్మాత్ముం, డీరీతిం బట్టి లాగ ♦ నెల్లదిశలఁ ద
ద్భూరి యశస్సులు నిండం, గా రయమున నడుము విఱిఁగెఁ ♦ గౌశికుఁడలరన్.
చ. ధనువిటు ప్రద్ధమైన తఱిఁ ♦ దద్ధ్వనము న్నతమై మహోత్తరా
శనిపతనారవంబువలెఁ ♦ జాలఁగ నొప్పెను; ప్రద్ధలయ్యెనో?
ఘనగిరు లన్నచందమున ♦ త్క్ష్మాస్థలమెల్లవడంకె తద్ధ్వనం
బున నవశత్వమొందిపడి ♦ పోయిరి తత్సభ నున్నయందఱున్. ౧౮ 1670
క. జనకుఁడు మౌనియు దశరథ, తనయులు నిశ్చలతఁ గనిరి ♦ తగువాత సభా
జనులుం దెప్పిఱి లేవఁగ, జనకుఁడు నిర్భీతుఁ డగుచు ♦ సరసోక్తులచేన్. ౧౯
క. మునితోఁబలికెంగరయుగ, మును మోడ్చి మహాత్మ! రాము♦భుజములబలమున్
గనినాఁడ నిది మహాద్భుత, మును నెందును గననిదియును ♦ మున్నెన్నండున్.
క. మనమునఁ దలఁపను గూడన్, జననిది యేమనుజులకును ♦ సాధ్యంబగునే·
కనుకన్ మదినిట్లగునని, మునివర! యోజింపనైతి ♦ మోదం బెసఁగన్. ౨౦
*సీ. నాతనూజాతయై ♦ ఖ్యాతిఁగన్న యయోనిజయగు సీతయు నద్ద♦శరథుముద్దు
తనయుఁడై చారుసౌం♦దర్యరంజకుఁడైన రాఘవు భర్తగా ♦ రమణనొంది
జ్ఞానవై భవము, స♦న్మానంబుగా నొంది నా పూర్వులైన జ♦నకకులము
నకుఁ గీర్తి విస్ఫూర్తిఁ♦బ్రకటింపఁగలదిఁక,వీర్యశుల్కముఁగొని♦ప్రియకుమారి
ఆ. కను నొసంగువాఁడ ♦ విను నాదు ప్రతినయు
సత్యమయి చెలంగె ♦ సాధువర్య !
యమునివహము కంటె ♦ నధికయౌ నాసుత
యీకుమారకునకు ♦ నీయఁదగును. ౨౧ 1674
చ. అరదములెక్కి నాసచివు ♦ లార్యవరా! భవదాజ్ఞఁబొంది స
త్వరముగ నయ్యయోధ్యకు ము♦దంబున వేచని రాజుతో మనో

* నాతనూజాతయై... అనుసీసపద్యమునకు మూలము. జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా, సీతా భర్తార మాసాద్య రామం దశరథాత్మజమ్ ౨౧౹

దీనికి గోవిందరాజవ్యాఖ్య ననుసరించి సీసపద్యము వ్రాయఁబడినది ప్రతిశబ్దమునందుఁగల యర్థచమత్కృతి సంగ్రహించి యిం దిమిడింపఁబడినదని తెలియవలయును.

హరవినయోక్తులాడి మిథి♦లాహ్వయమై తగు నస్మదీయ పూ
ర్వరమున కమ్మహీధవుని ♦ వైభవమొప్పఁగఁ దోడి తేఁదగున్. ౨౮ 1675

ఆ. నీకు శుభము గల్గుఁ♦గాక నామంత్రులు, త్వరగ నచటి కేగి ♦ తనయులెలమి
గాధితనయురక్షఁ ♦ గలిగి క్షేమంబుగ, నున్నవారలిచట ♦ నన్నవార్త. ౨౯

ఆ. వీర్యశుల్కయైన ♦ వెలఁదిని జానకి, నేనొసంగుటయును ♦ నిదియెమొదలు
గాఁగఁ గల్గునట్టి ♦ కడు వింతవార్తలఁ, జెప్పి నృపునిఁ బ్రీతిఁ ♦ జెందఁజేసి.

చ. త్వరితముగాఁగ బాంధవయు♦తంబుగఁ దోడ్కొని రాఁదగున్ మునీ
శ్వర! యన నాతఁడియ్యకొన ♦ క్ష్మాపతి మంత్రులఁ బిల్చి యమ్మనో
హరశుభపత్రికన్ మఱియు ♦ నందలివార్తలఁ దెల్పు పత్రికన్
గరము ముదంబుతో నొసఁగి ♦ క్ష్మాపతి పజ్జకుఁబోయి మీరొగిన్. ౩౧

క. జరిగిన వార్తలఁదెల్పుచు, ధరణీశునిఁ దోడుకొనుచుఁ ♦ ద్వరగా రానోఁ
బురికిచటి కంచు మిథిలే, శ్వరుఁ డాజ్ఞ నొసంగె స్వీయ♦సచివుల కెలమిన్.

అఱువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౮ - వ సర్గము.

జనకభూపతి యయోధ్యకు దూతలఁ బంపుట.

చ. జనకనృపాలు నాజ్ఞఁగొని ♦ సైంధవముల్ శ్రమనొంద దూతలుం
బెనువడితోఁ బ్రయాణమయి ♦ వింతలు గాంచుచు మార్గమధ్యమం
దునఁ ద్రిదినంబులన్ గడిపి ♦ ధూతరిపుప్రజసైన్యయుక్తమై
తనరు నయోధ్యఁ జేరిరది ♦ తద్దయు నొప్పుచునుండె శ్రీయుతిన్. ౧ 1680

చ. [కనుఁగొని దానిఁ జొచ్చి రిపు♦కాలుఁడు రాజు వసించు ధామముం
గనియట ద్వారపాలక ని♦కాయముతో జనకుండు పంప వ
చ్చిన మము దూతలన్ దెలియఁ ♦ జేయఁగనోఁ బతికిప్పుడే యటం
చన విని వారలేగి తెలి♦యన్ వినిపించిరి వారి వార్తలన్.] 1681

తే. దశరథుండును వేగ దూ♦తలను దోడి
తే ననుజ్ఞ నొసంగె; రా♦జానుమతిని
ద్వారపాలకులను గూడి ♦ వారుపోయి
యమరనిభు వృద్ధు దశరథు ♦ నచటఁ గనిరి. ౨ 1682

క. మనుజేశుని సౌజన్యం, బును గని నిర్భీతులగుచుఁ ♦ బొలుపుగఁ గేల్ మో
డ్చి నిలిచి వినయమ్మునఁ ది, య్యని పల్కులఁ బల్కిరిట్లు ♦ లవనీశునితోన్. 3

సీ. ఓ రాజవర! మిథి♦లోర్వీశుఁడైనట్టి జనకుండు స్నేహసం♦సక్తమైన
మధురవాక్యమ్ముల ♦ మాటికి మాటికి మీనిత్యకుశలమ్ము ♦ మీరు నడుపు

నగ్నిహోత్రములయు♦నధ్యాపకపురోహితులయుమీ ప్రియబంధు♦వులయు క్షేమ
ములను బ్రశ్నించె; ని♦ట్లలరి క్షేమప్రశ్నమును జేసి గాధినం♦దను ననుమతి

ఆ. నిట్లు చెప్పుమనియె ♦ నేమన వీర్యమే, శుల్కముగ గ్రహించి ♦ శోభనాంగి
యగు కుమారినిత్తు ♦ నన్న నాప్రతిన మీ,కెల్లఁ దెలిసినట్టి♦దే కద మును. ౬

చ. ధరణివిభుల్ ప్రతిజ్ఞవిని ♦ తద్దయు రోషముతోడ వచ్చి భీ
కరధనువెక్కుపెట్టుటకుఁ ♦ గాదని యెన్ని బలంబుహీనమై
పరఁగుట నస్త్రవక్త్రముల ♦ వచ్చిన త్రోవను బోయి యుంట భూ
వర! విదితంబకాదె యిటు♦వంటి వధూమణి నాతనూజయే. ౭ 1685

తే. గాధినందనుతోడ ని♦క్కడకు నాయ
దృష్టవశమున నీపుత్త్రుఁ ♦ డేగుదెంచి
గెలిచె నీనాకుమారిక ♦ బలము మెఱయ
నవ్విధములను వినఁదగు ♦ నవనినాథ!. ౮ 1686

మ. మును దక్షాధ్వరనాశకాలమున న♦మ్ముక్కంటిచే నంది శ
త్త్రునికాయంబును దోలినట్టి ధనువుర్ ♦ దోరంపు బాహాబలం
బున స్వీయాధికశక్తి నా పెను సభా♦భూమిన్ విభగ్నంబు చే
సెను దస్మద్భృతలంబుఁ బట్టి సుజనుల్ ♦ చిత్రంబుగాఁ జూడఁగన్. ౯ 1687

ఆ. వీర్యశుల్కగానఁ ♦ బ్రియపుత్త్రికను నీమ,హాత్మునకు నొసంగు♦ట ర్హమగును
జేసినట్టి ప్రతినఁ ♦ జెల్లింప వాంఛింతు,దాని కనుమతింపఁ ♦ దగుదువీవు. ౧౦

క. ధరణీశ! యుపాధ్యాయులు, పురోహితులు ముందునడువఁ ♦ బొలుపారఁగ స
త్వరగతి రమ్మా! శుభమగుఁ, బురినిట రాఘవులఁ జూడఁ♦బోలును జుమ్మీ!.

క. నిను దర్శించి మదాత్మజ, ననుపమగుణ సీతనిచ్చి ♦ యానందింపం
గను గోరువాఁడ దానిని, గను భాగ్యము నాకుఁగల్గఁ♦గాఁ జేయనగున్. ౧౨

తే. నీదు పుత్త్రద్వయముఁ గాంచి ♦ నాదుకొమరి
తలకు వారికి నుద్వాహ ♦ మెలమిఁ జరుగఁ
గాంచి నే సంతసించెడి ♦ కరణి నీవు
నెంతయుఁ బ్రమోదమందు ము♦ర్వీశవర్య!. ౧౩ 1691

క. అని జనకుఁడు కౌశికముని, యనుమతిఁగొని యందు నలరు♦నట్టి శతానం
దుని దగుననుమతియుం గై,కొని తమ కీమధుర వాక్కుఁ ♦ గూర్చి వచింపన్.

క. [పనిచెన్ మన్మని తెల్పి య,వనీశగౌరవముచేతఁ ♦ బలుపల్కుల ని
ప్పను సభఁ బల్కఁగరాదిఁక, నను శంకం బల్కకుండి♦రా దూతలొగిన్.]

సీ. రాజేంద్రుఁడట్లు వా♦ర్తాహరులాడిన వాక్కుల విని మదిఁ ♦ బరమహర్ష
మును బొంది యవ్వసి♦ష్ఠుని వామదేవునిఁ దక్కిన మంత్రిస♦త్తములఁ గాంచి

కౌసల్య కానంద♦కారణుండగు రాముఁ డా గాధితనయుఁ డ♦త్యాదరమున
సంరక్షణముచేయ ♦ సహజునితోడ విదేహ దేశమునఁ బ♦దిలముగ నిపు
తే. డున్నవాఁడు మహాత్ముఁ డై ♦ యొప్పుఁ గాన
జనకుఁ డస్మత్తనూజుని ♦ శౌర్యమెఱిఁగి
తనకుమారిక నియ్యంగఁ ♦ దలఁచె నతని
పల్కుమీ కభిమతమేని ♦ త్వరగ మనము. ౧౬ 1694
చ. జనకుని పత్తనంబునకు ♦ జా గొనరింపక పోవుటొప్పు నా
విని సచివుల్ మహర్షులును ♦ వేఁడుకమీఱఁగ మంచిదంచుఁ జె
ప్పిన నతిమోదమంది నృప♦వీరుఁడు రేపె ప్రయాణమంచు మం
త్రనికరముం గనుంగొనుచుఁ ♦ దెల్పె, విదేహనృపేంద్రమంత్రులున్. ౧౭
తే. సచివగణనీయ సద్గుణ♦సహితులగుట
నందు దశరథుఁ డొనరించు♦నట్టి సత్కృ
తులకు ముదమంది సంతోష♦కలన రాత్రి
యంతయును బుచ్చి రిష్టక♦థాదికముల. ౧౮ 1696

ఆఱువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౯ - వ సర్గము.

### దశరథుఁడు మిథిలాపురికిం బోవుట.

ఉ. అంతటఁ దెల్లవాఱిన ధ♦రాధిపుఁడాత్మపురోహితర్త్విజుల్
ఎంతయుఁ గూర్చు బంధుజను♦లెల్లను గొల్వ సుమంత్రుఁ గాంచి య
త్యంతముదంబునం బలికె ♦ నర్థపతుల్ వరరత్నవిత్త సం
క్రాంతరథంబులెక్కి పరి♦రక్షితులై చనుటొప్పు ముందటన్. ౧ 1697
క. వైవాహికపరికరముల, నేవరుసం గూర్పఁదగునొ ♦ యేర్పడ నట్లే
గావించి పోవఁగాఁ దగు, సేవకులెల్లరును వారి♦సేమము కొఱకై. ౨ 1698
సీ. చనుటొప్పు వారల ♦ సంగతి, నాయాజ్ఞ యైనవెంటనె చతు♦రంగబలము
లెల్లెడ బలయుచు ♦ నేగఁ గాఁదగు శిబికలుఁ బల్లకీలు నిం♦కను గలిగిన
యానమ్ములును స్యంద♦నాదియుగ్యమ్ములు వేగప్రయాణమై ♦ వెడలవలయు
నవ్వసిష్ఠుఁడును గా♦శ్యపుఁడు జాబాలియు వామదేవుఁడు బెక్కు♦వత్సరములు
బ్రతుకుమార్కండేయ♦వరముని, కాత్యాయనాహ్వయుండునునను♦నవనిసురులు
తే. ముందుగాఁ బోవవలయు నా♦స్యందనమును
జాగుసేయకఁ గట్టింపు ♦ సాధుఘోట
కముల, దూతలు నన్నిదె ♦ కదువడిఁ జన
వలయునని త్వరపెట్టెడు ♦ వారలనుచు. ౩ 1699

క. మునులను గూడి మహీపతి, చనుచుండఁగ నతనియాజ్ఞఁ ♦ జతురంగములాఁ
తని వెంటఁబోయె నాలుగు, దినములు చని యవ్విదేహ ♦ దేశముఁ గనియెన్.

క. కని యద్దానిఁ బ్రవేశిం, చిన దశరథురాక నెఱిఁగి ♦ శ్రీమంతుండా
జనకుఁడు పూజాద్రవ్యం, బును సిద్ధముసేయఁ బంచి ♦ మోదంబలరన్. ౭

తే. వృద్ధుఁడై నట్టి దశరథో ♦ ర్వీశుకడకు
వచ్చి యాతని దర్శించి ♦ ముచ్చటగ వి
వాహమా వేగయంచుఁ డాఁ ♦ బ్రమదమంది
దశరథునితోడఁ బల్కె సం ♦ తసము పొంగ. ౮౫ 1702

సీ. రఘుకులాంబుధి చంద్ర! ♦ రాజేంద్ర! మాభాగ్యవశమున నిచటికి ♦ వచ్చితీవు
నెఱి శివధనువును ♦ విఱుచుట లోనగు త్వత్పుత్రశౌర్యకృ ♦ త్యముల వలన
సంతోషమొంది యా ♦ సత్పుత్రకులఁ జూచి ప్రీతిసౌఖ్యంబును ♦ బృథుతరముగ
ననుభవింపుము; మహా ♦ ముని భూరితేజుండు నగువసిష్ఠుండు బ్రా ♦ హ్మణవరులను
తే. గూడి మాభాగ్యవశమున ♦ నేఁడు వచ్చె
దేవతలఁ గూడి వచ్చిన ♦ దేవవిభుని
మాడ్కి నిట్టి మహాత్ములు ♦ మద్గృహమును
గనఁగఁ జేసిన నాభాగ్య ♦ మున నృపేంద్ర!. ౧౦౫ 1703

క. కలుగంగఁ బోవు విఘ్నం, బులు విలయంబందె వీర్య ♦ మున శ్రేష్ఠులు ని
ర్మలహృదయులు నై తగు రఘు,కులజులతో వియ్యమందఁ ♦ గూడినకతనన్.

తే. నాకులము పూజ్యమయ్యె ని ♦ క్ష్వాకువంశ
మాద్య,మందు జనించితి ♦ వట్టులగుట
నే నరేంద్రులకింద్రుండ ♦ వీవు రేపు
ప్రొద్దున బెండ్లిమాటలఁ ♦ బొంకమలర. ౧౨ 1705

క. జరుపందగుదువు నాయ,ధ్వరము చతుర్దివసములకుఁ ♦ బరిపూర్ణంబౌఁ
దరువాత వివాహోత్సవ, మరుదుగ ఋషిసమ్మతంబు ♦ నగు నెఱవేర్పన్.

చ. పలుకుల పొంకముం దెలియు ♦ వారలలో రఘువంశ్యుఁడాద్యుఁడై
యలరును గాన నద్దశర ♦ థావనిపాలకుఁ డవ్విదేహరా
ట్కులమణి చెప్పినట్టి పలు ♦ కుల్ విని మానులు చుట్టునుండఁగాఁ
బలికెను దానమన్న యది ♦ వర్తిలు దాతృవశంగతంబుగాన్. ౧౩౫ 1707

ఉ. కావున దాత యిచ్చుతఱిఁ ♦ గాంచియె కైకొనువాఁడు చేకొనం
గావలయుం బ్రతిగ్రహము ♦ కాఁదగు దాతయధీన మిప్పుడో
భూవర వీర్యశుల్కములఁ ♦ బూన్కినొసంగ్చెడు దానమిద్ది ముం
దే వినియున్నవాఁడ నిఁక ♦ నీవెటు చెప్పిన నట్లచేసెదన్. ౧౮ 1708

ఆ. ఇచ్చువాఁడవీవు ♦ పుచ్చుకొనందగు, వారమేము గాన ♦ వసుమతీశ !
చెప్పినట్లె మేము ♦ చేయువారము నీకుఁ, దెలియనట్టి ధర్మ ♦ మిలను లేదు.

సీ. సత్యవచస్కుఁడౌ ♦ జనపతి దశరథుఁ డతిశయధర్మిష్ఠ♦మై యశస్క
రమునయి తగునట్లు♦తమిమీఱఁ బల్కిన పలుకులు విని నృప♦వరుఁడు జనకుఁ
డతివిస్మయమునొందె;♦నంతమానులు పరస్పరసమాగమముత♦త్సభనుగలుగఁ
గా హర్షముంబొంది ♦ కడుసుఖంబుగ రాత్రిఁ గడపిరి తనయులఁ♦గాంచిరాజు

ఆ. సంతసంబు నొంది ♦ జనపాలుఁ డొనరించు
పూజలకుఁ గరంబు ♦ పొంగె నంతఁ
దత్వవేత్తయగుచుఁ ♦ దనరి మహాతేజుఁ
డైన జనకుఁ డధ్వ♦రాంగసమితి. ౧౭॥ 1710

తే. పూర్తినొనరించి యంతటఁ ♦ బుత్రికలకు
నంకురారోపణము మొద♦లైనయట్టి
కార్యములఁ బెండ్లికిఁ ముందు♦గా నొనర్పఁ
దగినవానిఁ జేయించి, శు♦భఁ గడపెఁ దగ. ౧౮॥ 1711

అఱువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౭౦ - వ సర్గము.

ఇక్ష్వాకువంశక్రమమును వసిష్ఠుఁడు జనకునికిఁ జెప్పుట.

క. జనకుండంతఁ బ్రభాతం, బున మానులఁ గూడి యజ్ఞ♦మునఁ జేయంగా
ననువగు క్రియలంబొనరిచి, తనదు పురోహితుని గాంచి ♦ తగునట్లనియెన్. ౧

తే. ఓశతానంద ! నాదు స♦హోదరుఁ డతి
ధార్మికుం డురుతేజుఁడు ♦ నిర్మలయశుఁ
డలరుచుండుఁ గుశధ్వజుం ♦ డనెడు నామ
మమర సాంకాశ్యమను పుర♦మందుఁ బ్రీతి. ౨ 1713

సీ. అద్ది మంగళకర♦మగు దానిచుట్టును బరిఖాకృతిని మీఱి ♦ బలసియున్న
యిక్షుమతియనెడు ♦ నేటిజలంబునఁ గోటను రక్షించు♦కొఱకు శూల
ములు నాటియుండుట♦వలన దుర్గమునయి తనరి పుణ్యమురీతిఁ ♦ దన్నెనమ్మి
నివసించుజనులకు♦నిఖిలవాంఛలొసంగుచును, బుష్పకవిమాన♦మనఁగనొప్పు

తే. చుండు సాంకాశ్యనగరమం♦దొగి వసించి
తన్నదీసలిలంబును ♦ ద్రావి సుఖము
గాఁగ నుండు నాతమ్ముఁడు ♦ క్రతువునకును
వలయుపరికర నికరంబుఁ ♦ బంపినాఁడు. ౩॥ 1714

ఉ. కావున యజ్ఞరక్షకుని ♦ గాఁ దలపోసెదఁ జూచుకోర్కి నా
భావమునం జెలంగెడి వి♦భాసురతేజుఁడు సోదరుండు సొం
పావహిలంగఁ బెండిలిని ♦ హర్షసుఖంబుల నన్నుఁగూడి యో
పావనచిత్త! పొంకఁ దగు♦వాఁడు గదా పిలిపింపఁగాఁ దగున్. ౮ 1715

తే. [ఆశతానందు నెదుట ధ♦రాధినాథుఁ
డిట్లు పల్కిన జవమున ♦ నేగఁ జాలు
భటులు వచ్చిరి రాజును ♦ వారితోఁ గు
శధ్వజునిఁ బిల్చుకొనిరండు ♦ సత్వరముగ.] 1716

క. అని పంచిన వేగంబుగఁ, జను నశ్వంబులను నెక్కి ♦ శత్రునిదాసం
పున విష్ణుఁ బోలె నాతనిఁ, గొని తేరం జనిరి సేవ♦కులు రాజాజ్ఞన్. ౫ 1717

క. [చనివారు కుశధ్వజునిం, గని సాంకాశ్యంబునందు ♦ క్ష్మాపాలుఁడు చె
ప్పిన మాటలెల్లఁ దెల్పిన, విని యావృత్తమ్ము సుభట♦వీరులవెంటన్]. 1718

క. నరవరునాజ్ఞఁ గుశధ్వజుఁ, డరుదెంచి మహాత్ముఁడైన ♦ యన్నను [illegible]
దరునింగని తొలుదొలుతం, బురోహితున్ మ్రొక్కి పిదప ♦ మ్రొక్కె న్నృ[illegible]కిన్.

క. వారలచే ననునుతుఁడై, భూరమణార్ఘ్యంబుఁ బరమ♦పూజ్యమునగుచున్
దా రాజిలు పీఠంబునఁ, జేరెను వారిద్దఱిట్లు ♦ చెలఁగెడు కాంతిన్. ౭౪ 1720

తే. ఆసనంబుల నుపవిష్టు♦లయి సుదాముఁ
డనెడు సచివాగ్రణిం బిల్చి ♦ యతిజవమునఁ
గదలి మంత్రివరేణ్య! యి♦క్ష్వాకుకులుని
నతులతేజుని దుర్ధర్షు♦నాత్మజయుతు. ౮౪ 1721

క. సచివాన్వితునిం బ్రియమున, నిచటికిఁ దోడ్కొనుచు రమ్ము ♦ యిపుడే యన నా
సచివుండు రఘుకులాంభోధిచంద్రుఁడు వసించి యున్న♦ధిష్ణ్యమ్మునకున్. ౯౪

క. చని యతనిఁ గాంచి శీర్షం, బును వంచి నమస్కరించి ♦ పొల్చెడు శౌర్యం
బునఁ దగిన యయోధ్యాధిప, జనకుండు విదేహనృపతి♦సత్తముఁ డెలమిన్.

క. సోపాధ్యాయపురోహితు, భూపవరున్ మిమ్ముఁ జూడఁ ♦ బూని పనిచె నా
భూపాలుఁడు విని మానిగణోపేతుఁడు బంధువితతి ♦ యుక్తుఁడు నగుచున్.

క. జనకుండలరారు గృహం, బునకుం జని మంత్రి బంధు♦వులును నుపాధ్యా
యనికరము బలసి యుండఁగ, సనియోగవాక్యములపొంక♦ములర నృపునితోన్.

క. జనకా! యిక్ష్వాకుకులం, బునకున్ దైవతము సర్వ♦పూజ్యుఁడు మాకే
పనినలసిన దానిం జెప్పను దగిన వసిష్ఠు వితఁడె ♦ పరముని నితనిన్. ౧౮

తే. ఎఱిఁగి యున్నాఁడవే కదా! ♦ యీమహాత్ముఁ
డఖిలధర్మజ్ఞుఁ డీకౌశి♦కానుమతిని

మునుల నందఱఁ గూడి నీ♦ముందు నాదు
వంశమును గ్రమముగఁ జెప్పు♦వాఁడు నేఁడు. ౧౫ 1727

క. (అనుచుఁ మహనీయన రేంద్రనిచయముల నడుమఁ బలికి) ♦ దశరథుఁడవలన్
మునివృత్తినుండెఁ బూజ్యుం, డనఘుండు వసిష్ఠమౌని ♦ యంతట సభలోన్.

క. పలుకుల నేరుపు చాలఁగ, నలరఁగ జనకక్షితీంద్రు ♦ నతని సమీప
స్థలమున నున్న పురోహితు, నలఘు శతానందుఁ జూచి♦యనియెం బెలుచన్.

సీ. అవ్యక్తమగును బ్ర♦త్యక్షప్రమాణాదికాగోచరుండగు ♦ నాదివిష్ణు
వతనినుండియె బ్రహ్మ ♦ యావిర్భవించెను బహుకాలముండెడు ♦ వాఁడు కాన
శాశ్వతుండనియు నా♦శము పరార్థద్వయము వఱకు లేకుండఁ ♦ బొలిచియుండు
టను నిత్యుఁడనియును♦వినియతిఁ బ్రతికల్పమునునుంట నవ్యయుం♦డనియు నాతఁ

తే. డలరు నా బ్రహ్మకాత్మజుం ♦ డయ్యె మౌని
వర్యుఁడైన మరీచియన్ ♦ వాఁ డతనికిఁ
గాశ్యపుఁడు, సూర్యుఁ డతనికిఁ ♦ గలిగె మనువు
రవికిఁ బుత్రకుఁ డాతండె ♦ రాజమున్ను. ౧౮ 1730

క. అతనికి నిక్ష్వాకుండను, సుతుఁ డుద్భవమందె యతఁడె ♦ సుండి యయోధ్యా
పతులందు మొదటివాఁడని, యె తెలియఁగా వలయు నాతఁ♦డే కుక్షిఁగనెన్.

క. శ్రీమంతుఁడా వికుక్షియు, నామాన్యుని తనయుఁడయ్యె ♦ నతనికి వీరో
ద్దామా సమ తేజుండై, శ్రీమహితుఁడు బాణుఁడనెడు♦క్షితిపతి గలిగెన్. ౨౦

క. అతనికి ననరణ్యుండను, సుతుఁడు మహాతేజుఁ డధిక♦శూరుఁడు గలిగెన్
సుతుఁ డతనికిఁ బృథునామకుఁ, డతనికిని ద్రిశంకుఁడనెడు ♦ నాత్మజుఁడలరెన్.

సీసమాలిక.— [లువఁ

అతనికిదుందుమా♦రాహ్వయుం, డురుయశుఁడాతఁడె యువనాశ్వుఁ♦డనియుఁబి
బడును; మాంధాతయ♦వ్వసుమతీపతిసుతుఁ డతనికి శ్రీమంతుఁ♦డా సుసంధి
గలిగె నాతనికిఁ బు♦త్రులు ధ్రువసంధి ప్రసేనజిత్తులు నాఁగఁ ♦ జెలఁగి రందు
ధ్రువసంధికిని భర♦తుండు కీర్తియుతుండు తనయుఁడయ్యెనువాని♦కనుపమాన
తేజోయుతుండయి ♦ తేజరిల్లెడునట్టి యసితుండు కలిగె; న♦య్యసితుఁ డవనిఁ
బాలించునప్పుడు♦బలయుతుల్ హైహయుల్ శశిబిందువులుఁదాల♦జంఘులతని
వైరులై యెప్పుడు ♦ బాధించుచుండి యొకప్పుడు పైకి రా ♦ నాతఁ డంత
వారల మార్కొని ♦ పోరాడి యపజయమొంది స్వరాజ్యము♦నుండి వారు
తఱుమంగఁ గొలఁదియౌ♦తన సైన్యమును గూడిమంత్రులతోడ హి♦మశిఖరికిని
జనియందు భృగుమహా♦ముని వసియించెడు సెలయేటిచెంగట ♦ నిలిచె; నతని
భార్యాద్వయంబు, గ♦ర్భములఁదాలిచియుండి రనివినంబడువారి♦యందొకతుక
సవతిదా గర్భంబు ♦ సమసి పోవఁగఁగోరి దానికి విషసహి♦తమగుభక్ష్య

మును బెట్టె; భృగువంశ♦మునఁ గల్గినట్టి చ్యవనుఁడను మునియసి♦తుని నివాస
మాత్మ నెఱింగి సీ♦యప్రదేశంబున నున్నవాఁడని ప్రీతి♦నొంది రమ్య
హిమవన్నగంబున ♦ కేతెంచె వరమీయ; నంతవిషంబు తి♦న్నట్టి యతివ
పద్మపత్రాక్షి స♦ద్భాగ్యంబుఁ బొందఁగ నప్పూరాలాటచే ♦ నాత్మభవునిఁ
బడయఁగాఁ గోరి దే♦వసమాన తేజుఁడౌ భార్గవునకు భక్తి ♦ నందనంబు
నల్పె; నామెకును వి♦షంబును బెట్టిన కాళిందియును మ్రొక్కెఁ♦గాంతయెవతె
ప్రతిబంధములు లేక ♦ సుతుఁడు గల్గఁగఁగోరి తొలుదొల్త మ్రొక్కె నా♦తోయ
గని యదృష్టమ్మునఁ♦గ్రాలెడు నో సాధ్వి! నీకుక్షిలోపల♦నిర్మలోగ్ర [జాతిఁ
తేజుండు బలశాలి ♦ దీప్తప్రతాపుండు శ్రీలలితుండయి ♦ చెలఁగు సుతుఁడు
గరళముతోనుండుఁ♦గడు వేగమునఁ బుట్టఁగలఁడు సూనుఁడు నీవు♦గరళయుక్తఁ
డయి పుట్టునేయని ♦ యార్తినొందకు మేలుగల్గు నాతనికని ♦ కరుణ మాని
పల్కె నమ్మౌనికిఁ ♦ బట్టపుదేవియా నాసాధ్వి మ్రొక్కెడె ♦ నంత నసితుఁ
డచిరకాలముననె ♦ యాత్మఁ జాలించినఁ బతివియోగజ దుఃఖ♦పరవశయగు
నాసాధ్విఁ గాంచెను ♦ నాత్మజన్ముని; గర్భవిచ్ఛేదనము సేయ ♦ విషమును సవతి
పెట్టెఁ; దత్సూనుఁడు ♦ విషముతోడనె పుట్టెఁ గావున సగరుఁడన్ ♦ఖ్యాతి గల్గె
నతనికి నసమంజుఁ ♦ డాత్మజన్ముఁడు తత్సుతుండయ్యె నంశుమం♦తుండు వాని
కాత్మజుండు దిలీపుఁ ♦ డతనికి సూనుఁడై తనరె భగీరథుం ♦ డనెడు నృపతి
యతనికయ్యెఁ గకుత్స్థుఁ ♦ డాత్మజన్ముఁడు రఘువతనికిఁ బుత్రకుఁ ♦ డెలమి తేజుఁ
డగు ప్రవృద్ధుండు నాఁ ♦ దగువాఁడు రఘుపుత్రుఁ డతఁడు నాశాపంబు♦నంది
సత్వమ్ము నొందియు♦శాపంబు నాకీయఁ దలఁచి నీరముఁగొని♦తనదుభార్య [రాతు
వలదని పల్కుచు ♦ వారింప శాపోదకంబుల నాత్మపా♦దంబులందె
విడిచె; నల్లాటచేఁ ♦ బుడమిలోఁ గల్మాషపాదుఁడనంబడె ♦ వానికి సుతుఁ
డయ్యె శంఖణుఁడు త♦దాత్మజుండు సుదర్శనాహ్వయుం, డగ్నివ♦ర్ణాఖ్యుఁడతని
తనయుండు శీఘ్రగుం♦డనఁబడుఁ దత్సూనుఁ డయ్యెను మరువు త♦దాత్మభవుఁడు
తనరెఁ బ్రశుశ్రుకుఁ ♦ డనువాఁడు వానికి నంబరీషుఁడు నహు♦షాఖ్యుఁ డతని
*తనయుఁడయ్యె యయాతి♦తత్సుతుండయ్యె నాభాగుండు తత్సూను♦భవుఁడు వాని
కజుఁడు జన్మించె న♦య్యజునకిఁ దశరథుఁ డాత్మజన్ముఁడు పుట్టె ♦ నట్టి యవని
పతికి నీతనికి నీ ♦ భ్రాతలు రామలక్ష్మణులు జన్మించి రి♦క్ష్వాకువంశ

తే. జనితులౌ రాజులాదివం♦శంబునుండి, శుద్ధవంశంబు గలవారు ♦ శుభచరితులు
ధార్మికులు శూరులును యథా♦ర్థప్రవచనులట్టి సద్వంశమున వీరు♦పుట్టినారు.

---

* ఈపద్యమునందుఁ జెప్పఁబడిన నహుష యయాతినృపులు చంద్రవంశ్యులు గాక వేఱని తెలియవలెను.

చ. సుగుణులు రామలక్ష్మణులు ♦ సుమ్ము! మహీధవ! వీరికై వరిం
పఁగ నిట వచ్చినాఁడను భ♦వత్తనుజాతల; వీరికెన్ననా
మగువలు వారికీపురుష♦మండనులే సరినత్తు రిట్లు తు
ల్యగుణమహత్త్వయుక్తిఁ దగు♦టారసి యీయఁగ నీకు యుక్తమౌ. ౪౨ 1735

డెబ్బదియవ సర్గము సంపూర్ణము.

---

## ౭౧ - వ సర్గము.

జనకుఁడు వసిష్ఠునితోఁ దనవంశక్రమమును జెప్పుట.

చ. అనుచు వసిష్ఠుఁ డద్దశర♦థావనిపాలకు వంశరీతిఁ జె
ప్పిన జనకుండు కేల్మొగిచి ♦ విశ్వనుతుల్ మునిఁగాంచి పల్కె నో
మునివర! నీకుఁ గల్గు శుభ♦ముల్ పరికీర్తితమైన మాకులం
బును వచియించెదన్ వినఁగఁ ♦ బోలును మీకది యానుపూర్విగన్. ౧ 1736

తే. సత్కులంబునఁ బుట్టిన ♦ జనుఁడు కన్య
కను నొసంగెడు నప్పుడు ♦ తనకులంబు
నానుపూర్విగ వర్ణింప ♦ నర్హమౌట
వంశచరితంబు మీ మ్రోలఁ ♦ బల్కువాఁడ. ౨ 1737

ఉ. తా నొనరించినట్టి సుకృ♦తప్రదకృత్యములన్ జగంబులన్
మానితకీర్తిఁగాంచి నృప♦మండనుఁడై నిమియొప్పె నమ్మహీ
జాని బలాధికాధికుఁడు ♦ సంతతధర్మమనీషుఁ డీడ్యుఁడై
సూనునిఁ గాంచెఁ జారుగుణ♦శోభితునిన్ మిథినామధేయునిన్. ౩ 1738

తే. అతఁడు నిర్మించె నీపుర ♦ మతఁడె మొదటి
జనకుఁడయ్యెఁ దదాదిగ ♦ జనకనామ
మలరుచున్నది మాకుల♦మం, దుదావ
సువు తనూజుఁడు మిథికి నా♦క్షోణివిభుఁడు. ౪ 1739

సీసమాలిక.—
ధర్మమనీషుఁడై ♦ తగు నందివర్ధనుఁ గనియె నాతనికిఁ బ్ర♦ఖ్యాతిఁగన్న
యట్టి సుకేతాఖ్యుఁ ♦ డాత్మజుం డతనికి బలధర్మముల నిలఁ ♦ బ్రబలు దేవ
రాతుండు పుత్త్రుండు ♦ రాజర్షియా నాతనికి బృహద్రథుఁడు జ♦న్మించెఁ గొడుకు
వానికి శూరుఁడై ♦ వఱలు మహావీరుఁ డనువాఁడు సుప్రతా♦పాధికుండు
గలిగెను; ధృతిమంతుఁ♦డలఘుధీరుఁడు సత్యవిక్రముండై కీర్తి♦వెలయు సుధృతి
యను నాత్మసంభవుం ♦ డమ్మహావీరునకయ్యె ధర్మమ్ముల ♦ నాచరించు [గనియె
దృష్టకేతువు నాఁగ ♦ నెసఁగు సూనుఁడు వానికయ్యె రాజర్షియా ♦ నతఁడు
హర్యశ్వుఁడనువాని ♦ నతనికి మరువును, ధీరుఁ డంతండు ప్ర♦తీంధకాఖ్యుఁ

గాంచెఁ గీర్తిరథుండు ♦ గలిగె వానికి ధర్మబుద్ధియౌ వానికిఁ ♦ బుట్టె దేవ
మీఢుఁ డాతనికిని ♦ మేటి శూరుండైన విబుధుండు గలిగె న♦వ్విబుధతనయుఁ
డయ్యె మహీంధ్రకుం ♦ డతనికిఁ గీర్తిరాతుండు మహాబల♦మండితుండు
సుతుఁడు రాజర్షికి ♦ నతనికిఁ బ్రథితుండు పుట్టె మహారోమ♦భూమివిభుఁడు
స్వర్ణరోముఁడు ధర్మ♦వర్ధనుం డవ్వాని కాత్మజుండయ్యెను ♦ హ్రస్వరోముఁ
డతనికి సుతుఁడయ్యె ♦ నతిశయధర్మజ్ఞుఁ డగు నాతనికిఁ బుట్టి ♦ రాత్మజన్ము
లిరువురు వారిలో ♦ నేఁ బెద్దవాఁడను శౌర్యాఢ్యుఁడైన కు♦శధ్వజుండు
తమ్ముఁడౌ నాకు; మా♦తండ్రి జ్యేష్ఠుండనౌ నాకు రాజ్యంబిచ్చి ♦ యాకుశధ్వ
జుని రక్షణముసేయు♦పనియందు నియమించి తపము సేయఁగఁ బుణ్య♦ధామమైన
వని కేగె; ముదుసలి ♦ జనకుండు సురపురి కరిగిన నేను దే♦వాభుఁడైన
యనుజుఁ గుశధ్వజు♦ననుపమప్రేమతోఁ గనుచు భూభారంబుఁ♦గడఁగి దాల్చి
ధర్మమార్గంబును ♦ దప్పక పాలించుచుండితి నంతట ♦ నొక్కకొంత
కాలంబు జరగ సాం♦కాశ్యనగరపురినుండి వీర్యాధికుండయి ♦ వెలయుచున్న
యట్టి సుధన్వుండు ♦ ముట్టడించెడు కాంక్ష మిథిలకే తెంచి య♦మితబలంబు
తనరుచునుండంగ ♦ ననుపమశివచాపమును, పద్మనేత్ర సీ♦తను దనకు నొ
సంగఁగా వలెనంచు ♦ సచివముఖంబునఁ జెప్పిపంచెను నాకు ♦ క్షితిసురేంద్ర!
నేను భూజాతను ♦ గాని చాపముగాని తనకీయమికిఁ గ్రోధ♦మునఁ జెలంగి
నన్ను మార్కొనియె భం♦డనమున మార్కొన్న యతనిఁజంపితి నిట్టు♦లవనివి
నాతనిఁ బరిమార్చి ♦ యరివీరదుర్జయు ననుజుఁ గుశధ్వజు ♦ నతనిపురికిఁ [భుని
బట్టభద్రునిఁ జేసి♦పంచితి నీతండు నుదనుజాతుఁడు బ్రహ్మ♦మౌనివర్య!
యేఁ బెద్దవాఁడ నీ♦విపుడడిగినయట్టు లిద్దఱఁగూఁతుల ♦ నిత్తునీకు
నతిశయప్రీతితో ♦ నందు రామునకు సీతను నూర్మిళను లక్ష్మ♦ణునకు నిత్తు
నీకు భద్రంబగుఁ♦గాక వీర్యమె శుల్కముగ నొప్పు సురకన్య♦కఁగ నెసంగు
సీతను, రెండవ♦కూఁతురై తగునట్టి యూర్మిళ ముమ్మాటి ♦ కొసఁగువాఁడ

తే [దశరథోర్వీశ! నాప్రియ♦తనయలను నొ
సంగువాఁడఁ గోదండ్రగ ♦ సముధికముద
మలర] గోదానమునెడు కా♦ర్యమును రామ
లక్ష్మణులకుఁ జేయింపుము ♦ లలితమతిని. ౨౨ 1740

క. పితరులు నాందీముఖమున, నతిముదముం బొందునార ♦ లద్దానిక్ సన
మ్మతముగఁ జేయింపుము నీ, కతులశుభములొప్పుచుండు ♦ నవనీనాథా!. ౨౨౪

మ. పితృకార్యం బొనరించి యూపిదపనే ♦ పెండ్లిం దమిం జేయుమా
క్షితినాథా! భుజసారమండిత! యిఁకం ♦ జెలొప్పఁగాఁ బెండ్లి స

మ్మతి శీఘ్రంబ యొనర్పఁగాఁ దగుఁ జుమీ! ♦ మౌనీంద్రసంఘంబులా
దృతిఁ జూపంగ, మఘాఖ్యతారగద నేఁ ♦ డెంచంగ నల్లాటచేఁ. ౨౩ 1742

తే. మూఁడవదినంబునందునఁ ♦ జూడఁదనరు
భూప! యుత్తరఫల్గుని ♦ శ్రీపదమ్ము
సుమ్ము గావున నప్పుడె ♦ శుభకరమగు
కాలమునఁ బెండ్లిచేయంగఁ ♦ గడఁగఁ దగును. ౨౩౪ 1743

క. శ్రీరామలక్ష్మణులకుఁ, భూరిశుభావహములైన ♦ భూధేనువులం
గోరి యొసంగుము తిలలు మ,హారజతముఖంబులొసఁగు♦మా విప్రులకుఁ.

డెబ్బదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౭౨ - వ సర్గము.

దశరథుఁడు గోదానాదులు చేయుట.

చ. అనియిటు పల్కుచున్న మిథి♦లాధిపుఁ గాంచి వసిష్ఠయుక్తుఁడై
మునిపతి గాధిసూనుఁడను ♦ భూపతిపుంగవ! యుష్మదన్వయం
బును నజపుత్రువంశమును ♦ భూరివిచిత్రము లప్రమేయముల్
గనుకనె వీని కింకొకటిఁ ♦ గానము తుల్యముఁ గన్నవంశముఁ. 1745

సీ. భూతనూజాతయౌ ♦ సీతను నూర్మిళ రామలక్ష్మణులకు ♦ శ్రీమహితుల
కెలమి ధర్మంబున ♦ నిచ్చు నీసంబంధ మనురూపకులముల ♦ కర్హమయ్యెఁ
గన్యావరులకును ♦ గలరూపసంపద నరసినఁ దగియున్న ♦ దవనినాథ!
యింక నొక్కటి చెప్ప ♦ నెంచితి నామాట దానివినందగు ♦ ధర్మవేత్త

ఆ. యీకుశధ్వజుండు ♦ నీకుఁ దమ్ముఁడు గాన
నితనితోడ వియ్య♦ము తగియుండు
సాటిలేనిరూప ♦ సంపదగల సుతా
ద్వయ మితనికిఁ గలదు ♦ దానినిపుడు. ౮౪ 1746

క. వరియించుచున్నవారము, తరుణుల నాయిరువురను ని♦తాంతప్రీతిఁ
ధరణీశపత్నులుగ నె, వ్వరికన నవ్విధము తెలియఁ♦బల్కెద వినుమా!. ౫

క. భరతుండును శత్రుఘ్నుఁడు, ధరణీపతి కితనికనుఁగుఁ ♦ దనయులు గలర
య్యిరువురును బుద్ధిమంతులు, వరియించుట వారికొఱకె ♦ వనితామణులఁ.

సీ. దశరథసుతులెల్లఁ ♦ దగినరూపంబున వయసున నొప్పెడి♦వారు లోక
పాలురకైనయైన♦వారు నిర్జరతుల్య శౌర్యవంతులును వి♦శాలయశులు
గా నొప్పుదురు పుణ్య♦కర్ముఁడవగు నీదు కులము, నిర్దుష్టమై ♦ చెలఁగుసట్టి
యిక్ష్వాకుకులము మీ♦యిరువురసంబంధమున నొక్కటిగఁగూడి♦తనరుఁగాత

తే. మనిన గాధేయువచనముల్ ♦ విని వసిష్ఠు
ననుమతిని బొంది జనకుండు ♦ ప్రాంజలియయి
యమ్మునులతోడఁ బల్కె మ♦హాత్ములార!
సదృశసద్వంశసంబంధ♦సరణినాకు. ౯ 1749

క. మీరై యాజ్ఞాపించితి, రారయ నట్లాట నస్మ♦దన్వయమెంతో
గౌరవపాత్రంబయ్యెను, మీరానతియిడినరీతి ♦ మెలఁగెద నింకన్. ౧౦ 1750

ఆ. మీకు శుభము గల్గుఁ♦గాక యీనాతమ్ము, బాలికలను, జంట ♦ పాయకున్న
ధరణినాథసుతులు ♦ భరతశత్రుఘ్నులు, గోరి పెండ్లియాడు ♦ వార లెలమి.

క. ఒక నగటియందె యీరాజ కూర్మి పుత్రికలు సుబల♦శోభితులెల్లన్
సుకుమార రాజసుతలన్, బ్రకట ముదంబున గ్రహింత్రు♦భార్యలుగాఁగన్.

క. మునివర! యుత్తరఫల్గుని, యను తారకకౌభగాఖ్యుఁ ♦ డధిపతి యటులౌ
టను దానఁ గరగ్రహణ, మ్మును జేయఁగవచ్చుఁ బగలు ♦ మోదదమగుటన్.

క. ఉత్తరఫల్గుని శుభదం, బెత్తఱిఁ బెండ్లికని యార్యు♦లెల్లఁ జెపుదు ర
య్యుత్తర రానై యున్నది, యుత్తరదినమునుండె పెండ్లి ♦ యొప్పును గాదే. ౧౩

క. అని మధురభంగిఁ బలుకుచు, జనకుఁడు కై మోడ్చి లేచి ♦ సంతసమున ని
ట్లనియెన్ మునులన్ వారిం, గని కన్యాదానపరయఁ ♦ గడుఁ బుణ్యదమౌ.

క. అది నాకుఁ గల్గఁ జేసితి,రి దయన్ శిష్యుఁడను నెల్ల♦రీతుల మీకున్
గద యీసింహాసనముల,నె దగన్ గ్రహియించి యేలుఁ♦డీ రాజ్యములన్.

సీ. మాసోదరుల ధరా♦మండలముల నయోధ్యారాజ్యమును నేలఁ♦దగుదు రరయ
దశరథురాజ్య మీఁ♦దగునె నీకని యందు రేమి యీమిథిలయా♦నెట్టు లతని
కాత్మపురం, బట్టు♦లతని యయోధ్యయు నాకు స్వీయంబె య♦నంగఁ జనును
గాన నీనృపురాజ్య♦మీనప్పుఁడనునైతి; మామూఁడురాజ్యముల్ ♦మానులార!

తే. మీవెయగు రాజ్యమును జేయ♦మీరె తగుదు
రెంతమాత్రము సందియ ♦ మిందు లేదు
మాకు హితముపదేశించి ♦ మాకుఁ దగిన
యట్టులేకార్యమును జేయ ♦ నౌను మీరు. ౧౭ 1757

చ. అనుచు విదేహనాథుఁడగు ♦ నజ్జనకుండు వచించుచుండ నె
మ్మనమున సంతసిల్లి రఘు♦మండనుఁ డయ్యజసూనుఁ డాతనిం
గనుఁగొని పల్కె సోదరు, ల♦ఖండమ్ములై తగు సద్గుణంబులం
దనరెడువారు మీరు, విత♦తంబగు ఖ్యాతిగలార లిమ్మహిన్. ౧౮ 1758

తే. ఇట్టివారలు గాన నె ♦ య్యిమ్మునీశు
లీధరాధీశు లీరీతి ♦ నిందుఁ బూజ

వడసి యెంతయు సమ్మోద♦వార్థిఁ దేలి
రెల్లసుఖములఁ బొందుమో♦హితగుణాఢ్య!. ౧౮౪ 1759

సీ. నీకు మంగళమగుఁ♦గాక నేనింటికింబోయి నాందీశ్రాద్ధ♦ముఖములైన
కార్యంబులన్ విధి♦గా నొనరించెద ననిపల్కి సద్యశుం♦డైన దశర
థావనీశుఁడు మిథి♦లాధిపుననుమతి నొంది మునీంద్రుల ♦ ముందిడుకొని
సత్వరంబుగఁ బోయి ♦ జరపఁగాఁ దగినట్టి నాందీముఖంబు నొ♦నర్చి యవలఁ

తే. దెల్లవాఱిన లేచి వి♦ధివిహితముగఁ
దానొనర్పఁగఁ దగిన గో♦దానకర్మ
ముత్తమంబును జరపి యం♦దొప్పమీఱు
బ్రాహ్మణోత్తములం బిల్చి ♦ భక్తి మీఱ. ౨౧ 1760

చ. తనయుల మేలుగోరి నియ♦తంబుగ ధర్మము రీతిగా నొకొ
క్కనికిని లక్షగోవులను ♦ గా నపుడిచ్చి నరేశ్వరుం డొగిం
దనయులపైఁ జెలంగెడు ని♦తాంతదయన్ మఱియుం దదుత్సవం
బున గుణమాన్యులై తగిన ♦ భూసురులం బిలిపించి వేడుకన్. ౨౨ 1761

సీ. బంగారుకొమ్ముల ♦ రంగారి వైభవ యుతములౌ గోవుల ♦ నుత్తముల
నాలుగులక్షలఁ ♦ బాలుపిండఁగఁ గంచుచెంబుల, దూడలఁ ♦ జెలఁగి కూడి
యుండిన యవ్వాని ♦ నుత్తమభూసురులకు దానమును జేసి ♦ ప్రకటవిత్త
మవ్వారిగానిచ్చె ♦ నప్పురుషర్షభుం డంతసమావర్త♦నాఖ్యకర్మ

తే. మొనరించిన పుత్త్రులు ♦ తనదుచుట్టు
బలసియుండఁగ దిక్పాల♦పరివృతుఁడయి
సుప్రసన్నాంతరంగుఁడై ♦ సొంపుమీఱ
బ్రహ్మవలెఁ జెలువారె న♦పార్థివుండు. ౨౩ 1762

ఇరువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౨౩ - వ సర్గము.

### సీ తా క ల్యా ణ ము.

క. ఏదినమున నుత్తమమగు, గోదానవ్రతముఁ జేసెఁ ♦ గోరిక, శూరుం
డై దనరారు యుధాజి,త్తా దశరథుకడకు వచ్చె ♦ నాదినముననే. ౧ 1763

క. ఆతఁడు కేకయరాట్తను, జాతుండగుఁ గైక, కరయ ♦ సాక్షాత్సహజుం
డై తగుట భరతుమాతులుఁ, డాతతయశుఁడై చెలంగు ♦ నతఁ డపు డెలమిన్.

క. నరపతిఁగని క్షేమం బడి,గి రాజవర! నెయ్యమలరఁ ♦ గేకయపతి మి
మ్మరసి కుశలమడుగుమనె నె,వరిక్షేమము గోరుదట్టి♦వారము మేమున్. ౨౪

క. ఆరోగ్యభాగ్యముం గల,వారము, నాభాగినేయు ♦ భరతునిఁ గనఁగాఁ

గోరెడుఁ గేకయపతి యో, భూరమణా! భరతునిఁ గొని♦పోయెడు కాంక్షన్.

క. అరిగితి నయోధ్యకట భూ,వర! నీవును సుతులు జనకు♦సత్త్రమునకున్
దరలి వివాహార్థము పో,యిరనన్ విని భరతుఁ జూడ♦నెంతయుఁ ద్వరతోన్.

క. చనుదెంచినాఁడ నిచ్చటి, కనినన్ విని దశరథుఁడు ప్రి♦యాతిథియై వ
చ్చిన పూజ్యయుధాజిత్తును, ననుపమసత్కారములనె ♦ యర్చించెఁ దమిన్.

సీ. అంతట నృపతి మ♦హాత్ములౌ తనయులఁ గలిసి యారాత్రిని ♦ గడపి, తెల్ల
వాఱఁగ లేచి య♦ప్పటికిఁ జేయందగు కార్యంబులను నెల్లఁ ♦ గర్మవేత్త
కావున నొనరించి ♦ క్ష్మాసురవరానుల ముందిడుకొని యజ్ఞ♦మునకుఁ దగిన
యట్టులు కట్టిన ♦ యట్టిశాలకు సమీపమునందు శుభముగ ♦ సమరుచోటు

తే. నకుఁ దగంబోయె రాముండు ♦ సకలభూష
ణాభిశోభితులై యున్న♦యట్టి సోద
రాళితోఁగూడి భూషితుం♦డగుచు సూత్ర
మును ధరించెడు మంగళ♦మును నొనర్చి. ౮౫ 1769

చ. మనమున కౌతుకంబలర ♦ మానివరుండగు నవ్వసిష్ఠుఁ డ
క్కినమునులన్ మహామతులఁ ♦ గేవలతత్త్వవిభూషితాత్ములన్
దనమును పోవఁజూచుచు ను♦దారమతిన్ విజయావహంబుగాఁ
దనరు ముహూర్తమందుఁ జనెఁ ♦ దన్మఖవాటిసమీప భూమికిన్. ౯౫ 1770

క. [చని సోదరాన్వితుండై, జనకుని చెంగట వసించె] ♦ సత్వరగతితో
మునిపతి వసిష్ఠుఁ డప్పుడు, జనకుని గానంగఁ బోయి ♦ క్ష్మాపతివర్యా!. ౧౦

సీ. దశరథభూపుఁ డు♦ద్వాహమంగళములఁ గయికొన్నపుత్త్రులఁ ♦ గలిసి యిపుడు
కన్యాప్రదాతలా♦కకు వేచియున్నాఁడు దాతచేతఁ బ్రతిగ్ర♦హీతచేతఁ
గార్యముల్ నెఱవేర్పఁ♦గాఁ బడునన్నియుఁ గాననిప్పుడొనర్పఁ ♦ గాఁగఁదగిన
కన్యాప్రదానంబుఁ♦గడుఁ బూన్కి నొనరించి ప్రతినఁదీర్పుము సధ♦ర్మమ్మునుత్త

తే. మమును నెఱవేర్పు మీవివా♦హమునటన్న
నురుతరంబగు తేజంబు ♦ నొంది సరమ
ధర్మవిద్వర్యుఁ డయి మహా♦దాత యయిన
జనకుఁ డమ్మునిసత్తము ♦ చాయఁ జూచి ౧౩ 1772

ఉ. మీరిటు రాఁగ నష్టపడి ♦ మిమ్మును నిల్పిన యట్టిఁడా ప్రతీ
హారుఁడు ద్వారమందుఁ గలఁ ♦ డా యొకఁడైన నదేల రాక యు
న్నారొకో? యేరియాజ్ఞను గొ♦నంగను వేచెదరో మహామునీ!
యీరమణీయరాజ్యమన ♦ నెన్నఁగ నీదె కదా త్రిశుద్ధిగన్. ౧౩౫ 1773

తే. రాజ్యమిదినీదెయాముని♦రాజ! యింక,నాగృహమునీగృహంబెయ♦నంగవలెనె
స్వభవనమ్మున మీకు వి♦చారమేల, వేచియున్నారమంటిరి ♦ వినుమ! యిపుడె.

సీ. నిర్వర్తితవివాహ ♦ నియమితాచారులై జ్వలితాగ్నిదీప్తుల ♦ వలె వెలయుచు
నిదిగో! నాపుత్రిక ♦ లీవివాహంపు వేదికమూలతలము నొం ♦ది యటనున్న
వారు నే నీవేది ♦ వసియించి కృతసర్వకార్యుండనై మౌని ♦ కాంత! మీస
మాగమనమునకై ♦ యర్థించియున్నాఁడ నిర్విఘ్నముగఁ బెండ్లి ♦ నృపుఁడు చేయుఁ
తే. గాక యాలస్యమేల నాఁ ♦ గ ముని యపుడె
దూతనంపిన దశరథ ♦ భూతలేశుఁ
డతనియనుమతి రీతి మ ♦ హర్షినికర
మును దనూజులనందఱఁ ♦ గొని ముదమున. ౧౭ 1775

క. చని యాగశాల నొందెను, జనకుండు వసిష్ఠమౌని ♦ చంద్రుంగని యి
ట్లనియెను ధార్మిక! నాకాజ్ఞను జేయఁగఁ దగుదువీవు ♦ సరగున నింకన్. ౧౮

క. రామునకు లోకరంజకుఁ, డై మహిమను వెలయు నతని ♦ కాదృతిఁ బెండ్లిన్
సేమంబునఁ గావింపు, మ,హామౌనులఁ గూడి చేయ ♦ నగువానిఁ దగన్. ౧౮౹

క. అనవిని వసిష్ఠముని యౌ, నని జనకునితోడఁ బల్కి ♦ యపుడు శతానం
దుని ధార్మికుఁ గౌశికముని, ఘనునిన్ ముందిడుకొనుచు ని ♦ కామప్రీతిన్. ౧౯౹

సీ. అభినవనారికే ♦ ళాదిపత్రరచిత మండపాంతరమున ♦ మానితమగు
వేదిని నిర్మించి ♦ విధియుతంబుగ దాని నలుప్రక్కలను విని ♦ ర్మలసుగంధ
పుష్పాళి నంకురం ♦ బుల నొప్పు సౌవర్ణపాలికలను; నంకు ♦ రాళి నొప్పు
ఛిద్రకుంభంబులఁ ♦ జిత్రవర్ణంబులు సంకురంబులతోడ ♦ నలరునట్టి
తే. మూఁకుళులు, ధూపములతోడఁ ♦ బొలుచునట్టి
ధూపపాత్రములను, శంఖ ♦ రూపములగు
పాత్రల, ఘృతంబు వేల్వఁగా ♦ వలసినట్టి
స్రుక్స్రువములను నిల్పెను ♦ సొంపుమీఱ. ౨౦ 1779

సీ. అర్ఘ్యమ్ముకొఱకు జ ♦ లాభిపూరితములౌ పాత్రములను లాజ ♦ పాత్రములను
నిలిపి వానికి నక్ష ♦ తలహారిద్రంబున సంస్కారమును జేసి ♦ చారుతరము
గాఁగ శోభిలఁజేసి ♦ కడుఁ దపశ్శాలియౌ మునివరేణ్యుఁడు సమ ♦ ముగ నెసంగు
దర్భల మంత్రయు ♦ క్తంబుగాఁ బఱచి శాస్త్రంబునఁ జెప్పిన ♦ చందముననె
తే. యగ్నినందుఁ బ్రతిష్ఠించి ♦ యందు మంత్ర
పూర్వకమ్ముగ హోమమ్ముఁ ♦ బూనిచేసె
నంత జనకుండు సీత స ♦ ర్వాభరణ వి
భూషితను దెచ్చి యగ్నికి ♦ ముందునిల్పి. ౨౧౹ 1780

క. రాముని యగ్రతలంబున, భూమితనూజయు నెసంగఁ ♦ బొలుపారఁగ నా
రాముని గౌసల్యకు సత, తామోదముఁ గూర్చువాని ♦ నటఁ గని పలికెన్. ౨౨౹

క. వినుమీ సీత మదాత్మజ, వనితామణి నీకు ధర్మ ♦ పత్నియగును గై

కొనుమా నీకుఁ శుభములు, తనరఁగ బాణిని గ్రహింపు♦తరుణి కరమ్మున్.

*సీ. సౌందర్య మత్యాభి♦జాత్యమును యోనిజత్వము మొదలగు లక్ష♦ణముల మిగులఁ
జెన్నారి యసమాన♦శివచాపఖండన మొనరించినప్పటి♦నుండి యెపుడు
కనుఁగొందునా? యను ♦ కౌతూహలంబును గలుగునట్లొనరించి ♦ కళల నీను
విద్యుత్ప్రకాశంబు♦విధమున రూప మియ్యదియని తెలుపుట ♦ కనువుపడని
యట్లుగాఁ జేయుచు ♦ నాత్మసంతతభావనా ప్రకర్షమున నం♦తటను దనువు
కనఁబడువిధమునఁ ♦ దనరు నామెను జూపి సల్లక్షణముల లక్ష్యమయి ప్రౌఢ
మైనట్టి గుణమణి ♦ మానినీరత్నంబు నైన యీసీత ను♦దాత్మజాత
బహువిధాయతతపః♦ఫలభూత నీకగు సహధర్మచారిణి ♦ సతతశుభద

తే. దీనిని బ్రతిగ్రహింపుమా ♦ మాననీయ
చరిత! శ్రీరామ! నీకును ♦ సకలశుభము
లొదవు నీదు కరమ్మున ♦ నువిద కరముఁ
బ్రమదమొప్పారఁగా గ్రహిం♦పుము జనమున. ౨౬ 1783

క. నిను ననుసరించి యుండును, వనితామణి ఛాయపోల్కి ♦ భాగ్యాధిక్యం
బున నొప్పు సతీతిలకం, బని దశరథు నగ్రతనయు ♦ హస్తమునందుఁ. ౨౭

తే. మంత్రపూతజలంబు స♦మ్మదము మీఱ
విడిచె జనకక్షితీశుండు ♦ విబుధులు ముని
వరులు మేలని మేలని ♦ పల్కి రపుడు
దేవతల దుందుభులు మ్రోసె ♦ దిక్కులలరె. ౨౮ 1785

సీ. కుసుమవర్షంబప్డు ♦ కురిసె గొప్పగ మంత్రజలపూర్వకముగ నా♦జలజనేత్ర
సీత సమర్పించి ♦ భూతలపతి హర్షమున నోలలాడి చెం♦తను జెలంగు
సౌమిత్రిఁ గాంచి లక్ష్మణ! రమ్ము నీకగుఁగాక మంగళములు ♦ నీకు నూర్మి
ళ నొసంగ నేనెంచి♦తిని నీవు గ్రహియించి పాణిగ్రహము సేయ♦వలయు జాగు

తే. సేయవలదింక ననుచును ♦ జెప్పి భరతుఁ
గాంచి రఘుసుత! మాండవి ♦ కమలనేత్ర
కరము గ్రహియింపుమా నీదు ♦ కరముచేత
ననుచు వచియించి శత్రుఘ్ను ♦ నంతఁ జూచి. ౩౦ 1786

క. జనకుఁడు ధర్మునిభుం, డనియెఁ గ్ శ్రుతకీర్తి యైన ♦ హస్తమ్మును గై
కొనుమా! నీహస్తంబున, ఘనబాహూ! మీరలెల్లఁ ♦ గమ్రగుణాఢ్యుల్. ౩౧

* ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ, ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా. ౨౬ ఈశ్లోకమునకు గోవిందరాజమహేశ్వరతీర్థు లిరువురు పెక్కురీతుల నర్థములఁ జెంచి వ్రాసిరి వాని సారమును గ్రహించి సీసపద్యము రచింపఁబడినదని గ్రహింపనగును. తనిశ్లోకి యభిప్రాయముగూడ గోవిందరాజవ్యాఖ్యనే యించుమించుగా ననుసరించును.

క. మీరెల్ల సుచరితవ్రతు, లీరమణీమణులఁ గూడి ♦ యెంతయు ముదముం
గూరుపుఁడీ మీకెల్లర, కో రాఘవులార! జాగిఁ♦కొప్పదు సుండీ!. ౩౩½ 1788

చ. అనవిని యాకుమారవరు ♦ లప్పుడు నల్వురు మానికాంతుఁడై
తనదు వసిష్ఠుసమ్మతి ను♦దారకరంబులఁ దత్కరంబులం
జనకముఖుల్ గనుంగొన నె♦సంగుముదంబునుబొందఁ దాఁకి య
య్యనలున కగ్నివేదికి మ♦హామునివర్యుల కెంతొ భక్తితోం. ౩౫ 1789

క. జనకునకును భార్యలతోఁ, జని వలగొని రామభరత♦సౌమిత్రులు నె
మ్మిని విధిని గల్పసూత్రం,బునఁ జెప్పినయట్లు కార్య♦మును సల్పి రొగిం. ౩౬

సీ. అమ్మహామతులిట్టు ♦ లర్హకృత్యంబులఁ గావించి భార్యల♦కమ్రకరము [సుంద
లను బట్టుకొనిన యం♦తనె యంబరమునుండి కుసుమవర్షము చాలఁ ♦ గురిసె
రమ్ముగ దుందుభుల్ ♦ రంజిల్ల మొరసె గీతములు వాద్యధ్వను♦లమరె నచ్చ
రలు గుంపుగాఁ జేరి ♦ లలితమ్ముగా నాడి రంత గంధర్వ లా♦హాయనంగఁ

తే. బాడిరా పెండ్లికొడుకులు ♦ పావనరఘు
వంశముఖ్యులు గానఁ గ♦న్పడియె నిట్టి
యద్భుతంబులు గీతవా♦ద్యాదులిట్టు
లెసఁగఁ బ్రతినాదములు పుట్టె ♦ నెల్లదెసల. ౩౭½ 1791

క. రామాదులు విలసద్ఘన, ధామాన్వితులపుడు మూఁడు♦వరుసలు భక్త్యు
ద్దాములయి స్వీయవహ్నుల, కామోదమునం బ్రదక్షి♦ణార్చనలిడుచుం. ౩౮

క. తరుణుల నల్వుర విధియుత, పరిణిం బెండ్లాడి; రంత ♦ జాయాయుతులై
ధరణీశుతనూజులు న,ల్వురు విడిదిగృహంబునకును ♦ బోయిరి వేడ్కం. ౩౮½

తే. దశరథక్ష్మాపతీంద్రుం డు♦దారయుక్తు
లైన నల్వురఁ గొడుకుల ♦ నాదరమునఁ
గనుఁగొనుచు వారివెంటను ♦ మునుల బంధు
జనులనుం గూడిపోయె, ను♦త్సాహ మలర. ౪౦ 1794

డెబ్బదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౭౪ - వ సర్గము.

దశరథాదు లయోధ్యకుఁ బోవుట.

క. ఆరాత్రి గడువ జనకమ,హీరమణుని దశరథావ♦నీశుని నెంతో
గారవమున వీడ్కొని ముని, భూరమణుఁడు కౌశికుండు ♦ పొంగెడు మదితోం.

క. మును తానుత్తరమున నెం,దు నివాసము చేసె నట్టి♦తుహినాద్రికిఁ బో
యెను [రామాదుల వారల, వనితల దీవనలఁ దన్పి ♦ పరమనియతికై.] ౧½

చ. మునిపతి కౌశికుం డరుగ ♦ భూపతియున్ మిథిలేశుఁడైన య
జ్జనకుని వీడుకోల్పడసి ♦ చయ్యన స్వీయపురంబుఁ జేరఁగా
జనఁ బయనంబుసేసె నృప♦సత్తముఁ డేగుచునుండ నాతనిన్
వెనుకొనియేగె విదేహపృథి♦వీరమణుం డనుబంధుయుక్తుఁడై. 1797

సీ. అత్తవారింటికి ♦ నరుగుపుత్త్రికలకు నరణమీయఁగ నది ♦ తరుణమగుటఁ
దలపోసి పెక్కుల♦క్షల గోవులను దివ్యకంబళములను ల♦క్షలను బట్టు
వస్త్రములను దివ్య♦వసనంబులను సుందరాలంకృతంబులై ♦ యందములగు
దంతివాజిరథప♦దాతులదాసదాసీజనంబుల నిచ్చెఁ ♦ జెలఁగునట్లు

తే. మఱియు నారాజు సంతుష్ట♦మానసుఁడయి
స్వర్ణరజతంబులను మంచి♦పవడములను
ముత్తెములఁ బెక్కులక్షల ♦ నుత్తమములగు
కన్యకావిత్తముగ నసం♦ఖ్య ధనమిచ్చె. ౽ 1798

క. ధనమిట్లొసఁగి దశరథ, మనుజేశు ననుజ్ఞను గొని ♦ మైథిలుఁ డంతం
దననెలవు సేరె రాఘవుఁ, డనుమతుఁడై మహిమ వెలయు♦నట్టి కుమారుల్.

క. మునులును జతురంగబలం,బును సేవకులును నితాంత♦మోదము నొందం
జనియె నయోధ్యకు ముందుగ, మునులరుగుచునుండ నట్లు♦భూపతి యెలమిన్.

పరశురామ సందర్శనము.

సీ. తనయులతో మహా♦మునులతో నరుగంగ నాతని కెదురయి ♦ యంబరమున
నశుభసూచకముగ ♦ నతిభయదంబుగఁ బక్షులు గూసె వి♦శ్వంభరాత
లమున మృగంబులె♦ల్లను శుభమును జాలఁ గనఁబఱచెడునట్టు♦గాఁ బ్రదక్షి
ణముగఁ బోయెను భూమి♦నాయకుం డాశకునాళిఁ గన్గొని పల్కె ♦ నట వసిష్ఠుఁ

తే. గాంచి క్రూరఖగంబులు ♦ కడుభయంక
రార్భటులఁ గూయుచున్నవి♦యవియె మృగము
లెల్లను బ్రదక్షిణమ్ముగ ♦ నేగుచున్న
వశుభములు శుభశకునమ్ము ♦ లగపడియెడి. ౧౦౪ 1801

చ. మునివర! యిద్దియేమనుచు ♦ బుద్ధిచలించెడు; నివ్వి మంగళం
బు నొసఁగునో? యమంగళముఁ ♦ బుట్టఁగఁ జేయునో? యన్ననిశ్చయం
బును గనలేక నామనము ♦ పూనెడు దుఃఖముఁ జెప్పవయ్య నా
కను నృపవాక్యముల్ విని మ♦హాముని మంజులవాక్కులొప్పఁగన్. ౧౧౪

చ. నరవరుతోడ నిట్లను; వి♦నం దగు వీనిఫలంబు ఘోరమౌ
కరణిని గల్గనున్న భయ♦కారణముల్ దెలియంగ నయ్యె నం
బరమున నున్న పక్షిగణ♦వాక్కుల భీతి యడంగునంచు నీ
ధరమృగముల్ గనంబఱచెఁ ♦ దాల్పకుమీ! పరితాపమో విభూ!. ౧౩ 1803

క. అనివారు పల్కుసమయం,బున భూమిఁ గదల్చుచుఁ బెను♦భూరుహానారం
బును బడఁద్రోయుచువీచెం బ,వనుఁ డప్పుడు చీఁకటులును♦భాస్కరుఁగప్పెన్.

సీ. ఆశాసమూహంబు ♦ లప్రకాశములయ్యె భస్మసంవృతమయి ♦ పార్థివేంద్ర
సైన్యసమూహ ము♦త్సాహహీనంబయ్యె; నవ్వసిష్ఠుఁడుఁ దక్కి♦నట్టి మునులు
రాజు నాతనిపుత్ర♦రత్నంబులును దెల్విగల్గియుండిరి యంతె♦కాని తక్క
వారెల్లఁ దెల్విని ♦ బాసియుండిరి యంత నా చీఁకటులు గ్రమ్మ ♦ నచటిసైన్య

తే. మపుడు బూడిద గప్పిన♦యట్టులుండి
కనుఁగొనియె భీమరూపునిఁ ♦ గడుజడలగు
మిని ధరించిన జామద♦గ్న్యుని మహాత్ముఁ
బరశురాముని మర్దిత ♦ పార్థివేంద్రు. ౧౯ 1805

సీ. కైలాసభూధ్రంబు♦గతి దురతిక్రముఁ డాతఁడు కాలాగ్ని♦యట్లు దుస్స
హుఁడు భూరికాంతుల♦నొప్పుచుండుటఁ బామరాళికి దుర్నిరీ♦క్ష్యాకృతియును
నయి గొడ్డలిని మూఁపు♦నందిడుకొని తటిద్గణతుల్యమై తగు♦కాంతులలరఁ
గార్ముకంబును దీవ్ర♦కాండంబు ధరియించి త్రిపురంబులంగాల్చి ♦ తేజరిల్లు

తే. పరశివుండో యనంగఁ జూ♦పట్టె నంత
నతని జపహోమనిరతులై ♦ యలరు నవ్వ
సిష్ఠముఖులైన భూసురుల్ ♦ శిఖివిధమున
వెలుఁగు భయదాకృతిని గాంచి ♦ వెఱఁగుపడుచు. ౨౦ 1806

సీ. ఒక్కచోఁ గూడి వా♦రొకరితో నొకరిట్లు చెప్పుకొనిరి యితం ♦ డెప్పుడున్నృప
వితతిపైఁ గోపముఁ ♦ బెంచుచుండును దనతండ్రిని జంపె నీ♦ధరణిపతిని
కాయమంచును మును ♦ గడఁగి దానింజంపె; నక్కారణంబున ♦ నైననిపుడు
వారిఁ జంపఁడుకదా♦వసుధేశులన్ మున్నెచంపి కోపము మనో♦జ్వరముఁ బాసి

తే. యున్నవాఁడొట ననియిట్లు ♦ లోక్కమొగిని
వారు ప్రస్తావనలు సల్పి ♦ భార్గవునకు
భయదమూర్తికి నెదురేగి ♦ పరమభక్తి
నర్ఘ్యపాద్యంబు లొసఁగి తీ♦యనిపలుకుల. ౨౧ 1807

క. రామా! రామా! యని యిం,పౌమాడ్కిని బిలిచి మిగుల ♦ నర్చింపఁగ ను
ద్దామపరాక్రమయుతుఁడౌ, రాముండా పూజలఁగొని ♦ రాఘవుతోడన్. ౨౨

డెబ్బదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౭౫ - వ సర్గము.

### శ్రీరాముని పరశురాముఁడు తిరస్కరించుట.

క. పలికెను దీవ్రక్రోధో,జ్జ్వలుఁడై యోరామ! రామ! ♦ భవదీయంబై
వెలసెడు శౌర్యంబు జగం,బులనెల్లెడ నద్భుతముగఁ ♦ బొల్చి వినఁబడున్. ౧

చ. వినఁబడుచున్న వెంతయును ♦ వింతగ నీవటఁ దాటకాహ్వయన్
దునుముట శంభుచాపమును ♦ ద్రుంచుట లోనగువార్తలెల్ల నీ
వు నపరిచింత్యసారమునఁ ♦ బోల్చెడు నీశ్వరుకార్ముకంబుఁ ద్రుం
చిన ఘనవార్త యచ్చెరువు ♦ సెందఁగఁ జేసెడి నెన్నశక్యమే. ౧౪ 1810

చ. విని యలవార్త నేను బలు♦విల్లును వేఁటొకదానినిప్డు గై
కొని యిట వచ్చినాఁడ నతి♦ఘోరముగాఁ దగునద్దె యిద్ది దీ
నిని జమదగ్ని నాకొసఁగె ♦ నిర్మలకీర్తి యతండు నాకునో
జనకుఁడు దీనియందు నొక♦సాయకవర్యముఁ గూర్పు మాపయిన్. ౩ 1811

క. నీబలముఁ జూపఁగాఁదగు, నీబలువింటను శరంబు ♦ నీవు దొడిగినన్
నీబలముఁ దెలిసికొని యాపై బలశాలివగు నీకు ♦ ద్వంద్వాహవమున్. ౪

క. నేనొసఁగువాఁడనని యా, మానినరేణ్యుండు పలుకు♦మాటలు విని యా
భూనాథుఁడు దశరథుఁడపు, డానసమున దీనభావ ♦ మధికమ్ముగుటన్. ౪౫

క. వెలవెలఁ బాఱుచు నిట్లని, పలికెం జేతులు మొగిడ్చి ♦ వసుధేశులపైఁ
గలిగిన ప్రాక్క్రుధ విడి మిక్కిలి శాంతుఁడ వైతి వార్య! ♦ క్షితిసురవర్యా!.

చ. అతులితకీర్తిశాలివి మ♦హాత్మక! యీపసికూనపైన నా
సుతులఁ గటాక్షదృష్టులను ♦ జూచుచు వే యభయంబొసంగ నీ
వు తగుదు వెల్ల వేదములఁ ♦ బూన్కిఁ బఠించుటలోనుగాఁగ స
ద్వ్రతములఁ జేసి పెంపలరు ♦ భార్గవవంశభవుండ వారయన్. ౬౪ 1815

క. శతమఖునిచెంత భార్గవ!, ప్రతిజ్ఞనొనరించి శస్త్ర♦పటలి విసర్జిం
చితివీవు ధర్మపరతన్, క్షితిఁ గాశ్యపమునికిఁ జెందఁ ♦ జేసితి వారా!. ౭౪ 1816

ఆ. ధరణి దారవోసి ♦ తరలి మహేంద్రాద్రి, కేగి యటనివాస ♦ మీవు సేసి
యున్నవాఁడ విప్డు ♦ దుర్గతి మమ్మెల్లఁ, జంపవచ్చితిటకు ♦ సాధుమాని!. ౮౪

క. రామునికొఱకే వచ్చితి, రాముని వధియింతునని ప♦రశుధర! యనుదో
రామునినే చంపినచో, నేమెల్లం బ్రదుకఁజాల ♦ మిది నిక్కము సూ!. ౯ 1818

క. అని దశరథుండు పల్కఁగ, ఘనశౌర్యుఁడు భార్గవుండు ♦ కడునిర్లక్ష్యం
బున వానిలెక్కసేయక, యనియెన్ శ్రీరాముతోడ ♦ నబ్దధ్వనితోన్. ౧౦

సీ. దివ్యమ్ములై విశ్రు♦తిని గాంచి లోకమందెల్లెడ శ్రేష్ఠత ♦ నెసఁగియున్న
కోదండములు రెండు ♦ కొమరారునవి దృఢసారమ్ములై ధను♦ర్వారమందు
ముఖ్యమ్ములగు; వాని♦మును విశ్వకర్మ యత్నంబున నిర్మించెఁ♦దద్ద్వయమునఁ
ద్రిపురాసురులతోడఁ ♦ ద్రిణయనుఁ డనిసేయఁ దలఁచినతఱి దేవ♦దత్తనుయ్యొ

తే. నొకటి; యద్దియె యారాక్ష♦సోత్కరంబుఁ
జంపె, విఱిచితివీవు త♦చ్చాపమునె మ

దీయకరగతధనువును ♦ దీనిహరికి
నమరులొసఁగిరి రెండవ♦దందునిద్దీ. ౧౨ 1820

క. పరమప్రకాశమై తగు, నిరుపమ కోదండ మిద్ది ♦ నీరజనాభా
దరణార్హము సుము, రామా! హరచాపసమానసార♦మగుఁ గాకుత్స్థా!.

క. హరచాపతుల్యసారము, శరాసనముగాన నిద్ది ♦ నరకేయను దో
ధరణీశపుత్ర!, విఱిచితి, హరుచాపము వికలమగుట ♦ నద్దాని సభన్. ౧౩

సీ. త్రిపురాసురుల నెల్లఁ♦దెగటార్చి హరుఁడొప్పఁ దఱినిర్జరులునప్పి♦తామహుఁగని
వారాహముఖ్య శ♦రీరంబులం దాల్చి యుపకృతులను నెన్నొ♦యొనరుచుటను
హరి యెక్కుఁడగు నని ♦ యంటివి నీవిప్డు హరిని సాధనముగ ♦ నంది శివుఁడు
తానె ముఖ్యుండయి ♦ దానవసంహారమును జేసెఁ గాదె? కా♦వున శివుండె

తే. యధికుఁడని మాకుఁదోఁచెడి ♦ నరయ వీరి
యందు నధికుండెవండు బ♦లాబలములఁ
దెలియఁ గోరితిమో దేవ! ♦ తెలుపవయ్య!
సందియము వీడఁగా నన ♦ శతధృతియును. ౧౪ 1823

క. సురల యభిప్రాయముఁ దా, నరసి యథార్థమునెఱుంగు ♦ నట్లొనరుచు స
త్పురుషవరేణ్యుఁడు గావున, హరిహరులకుఁ బగను గూర్ప♦నౌనని తలఁచెన్.

చ. మనమున నిట్టులెంచి సుర♦మాన్యుఁడు విష్ణువుఁ గాంచి "ధన్వివై
దనుజులఁ ద్రుంచినాఁడ విట ♦ దైత్యవిరోధియు సాధనంబుగాఁ
దనరుటచే నముఖ్యుఁడగు ♦ దానవయోధవధంబునందు ము
ఖ్యునిగ ననుం దలంపుఁ" డని ♦ యొప్పుగఁ బల్కె శివుండు చూచితే!. ౧౫

క. అనిపలికి శివునిపైఁ బగ, వనజాక్షున కెనఁగఁ జేసి ♦ ప్రమథాధిపునిం
గని "చక్రిశరాగ్రమ్మునఁ, దనరి జయించితిని గాన ♦ దైత్యవధమునన్. ౧౫।

తే. నేనె ముఖ్యుండ నంతియ♦గాని శివుఁడు
కాఁడ" టంచనె నని యిట్లు ♦ కిడఁగి వారి
కిరువురకుఁ బగఁ బుట్టించె ♦ నిట్లు పగయుఁ
గలుగఁగా యుద్ధమును జేయు♦కాంక్షఁ బూని. ౧౫॥ 1827

చ. హరిహరు లొండొరుల్ గెలువ ♦ నాత్మల నెంచి తదిచ్ఛచేత గ
గ్గురు గదురంగ మార్కొనిరి ♦ క్రోధములన్ భయదంబుగాఁగ; శం
కరుని శరాసనం బపుడు ♦ గాంచె విసంజ్ఞతఁ జక్రి హుంకృతి
స్ఫురణను భీతిదంబగుచుఁ ♦ బొల్చెడు శక్తిని గల్గియుండియున్. ౧౬ 1828

క. తనకార్ముకంబు దూలినఁ, గని స్తంభితుఁడయ్యె నచటఁ ♦ గామారియుఁ; జ
య్యన సురచారణమానులు, చనుదెంచి నచింఛిరంత ♦ సంగ్రామ మిఁకన్.

తే. వలవదుడుగుఁడు ♦ మీరని ప్రార్థనమ్ము
సేయ శాంతిని బొందిరి ♦ శివ జనార్ద
నులు; మునీంద్రాదులప్పుడు ♦ జలజనయను
శౌర్యమున నీశుచాపంబు ♦ జడతఁ గనుట. ౧౮౫ 1830

చ. హరియె బలాధికుండనుచు ♦ నాత్మల నెంచిరి, కోపమొంది శం
కరుఁడు మహాయశుండు తన♦కార్ముకమిట్టులసారమాట ని
ర్జరులకు నీఁ దలంపఁగ సు♦రల్ గ్రహియింప భయంబు నొంది భూ
వరుఁడగు దేవరాతునకు ♦ బాణముతోడ నొసంగ వేఁడిరన్. ౧౮౬ 1831

క. సురలడిగి నట్టులే దేవరాతుని కరంబునందు ♦ బాణముతోడన్
హరుఁడిడియె శరాసనమును, బరపురభంజనమిదాను ♦ వైష్ణవము మునీ!.

తే. నాకరంబున వలరాము♦ నీకడింది
కార్ముకము రాఘవా! దీనిఁ ♦ గనులలోచ
నుండు ఋచీకునకిచ్చె నీ♦కడనె యుంచు
మున్ స్వయం బిదియుంచుఁ ద♦త్కార్ముకమున. ౨౧ 1833

తే. అప్పుడా తేజుఁ డప్రతి♦హతసమస్త
కార్యుఁడగు జమదగ్నికిఁ ♦ గరుణ నాత్మ
జుఁ డొసంగె మహాత్ముఁడై ♦ శోభిలు నతఁ
డగుఁ జుమీ! నాకు జనకుఁ డ♦య్యనఘుఁడంత. ౨౨ 1834

సీ. సాధుతపోబల♦శక్తులనొప్పు మజ్జనకుఁ డాయుధములఁ ♦ గొనుట మాని
తపము సల్పుచునుండ♦ధరణివిభుండైన కార్తవీర్యుండు ని♦ష్కరుణుఁడగుచుఁ
దామసబుద్ధియై ♦ నగవని యెంచక చంపె నీవిధమగు ♦ చావు లోక
మందెందుఁ గలుగునే?♦యతిదారుణముగదా యద్దాని విని దోష♦మడరనేనుఁ

ఆ. పాపజాతియైన ♦ పార్థివకులమని, తలఁచి చంపి మరల ♦ నిలఁ గలుగఁగ
దానిఁ బెక్కుమారు ♦ లేను జంపుచుఁ దద,ధీనమౌ ధరిత్రిఁ ♦ బూనుకొంటి.

క. ధరణి సమస్తంబును నా, కరతలమున నునిచికొని సు♦కర్ముఁడు గాని
ద్ధరఁ బరఁగు కాశ్యపున క,ధ్వరమందు నొసంగినాఁడ ♦ దక్షిణగాఁగన్. ౨౪

క. క్రతుపూర్తి సమయమున నీ, క్షితి నీవిధి నొసఁగి నేను ♦ జేరి మహేంద్ర
క్షితిధరమదియే నిరతో వ, సతిగాఁ దప మొప్పఁ జేసి ♦ శక్తిఁ జెలఁగితిన్. ౨౫

క. [సురసేవితమై తగు న, ద్ధరణీధ్రమునందు నేను ♦ దపముల్ సౌఖ్యా
కరముగ సల్పుచు నొక్కట, సరువగు వీర్యమున నీవు ♦ హరుశరవరమున్.]

క. తునిమితివని వింటినిగా, వున వేగమ వచ్చినాఁడ ♦ బో రామా! నా
జనకుఁడుఁ దత్పిత యాతని, జనకుఁడు పూజింప వెలయు ♦ చక్రిధనువిదా.

ఆ. కాన దీని నీవు ♦ క్షత్త్రియకులజుండ, వౌట విప్రబాలు ♦ సట్లశక్తుఁ
డ నగుదునని పల్కి. ♦ క్ష్వ్రామహా క్షత్త్రియ, ధర్మమూని పట్టఁ ♦ దగును జుమ్మి.

క. పరపురభంజకమగు నీ, శరాసనమునందుఁ గూర్పు ♦ శరమును శక్తిం
బరఁగుదువే, నవ్వలరఘు,వర! ద్వంద్వాహవము సల్పు ♦ వాఁడను నీతోన్.

డెబ్బదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౭౬ - వ సర్గము.

### పరశురాముని గర్వభంగము.

చ. అను జమదగ్నిసూనుని మ♦హోత్తరవాక్యముల నాలకించుచున్
జనకుని చెంతనుంట రఘు♦సత్తముఁ డప్పుడు తండ్రియందుఁ గ
ల్గిన మరియాదచే నెలుఁగు ♦ లీలఁగఁ బోవఁగనీక చాలస
న్నని గళనాదమొప్ప ముని♦నాథునితో వచియించె నీగతిన్. ౧ 1842

సీ. తండ్రిదౌ ఋణమును ♦ దగినట్లు తీర్పంగఁ బలుమాఱు క్షత్త్రియ♦వంశమెల్లఁ
జెండాడి నీవు చే♦సిన కృత్యములనెల్ల వింటి శూరుఁడు పర♦వీరుఁ దునిమి
పగఁ బాపుకొనుట చే♦యఁగఁ దగుపని గదా కాన దానికిఁ బ్రతీ♦కార మీవు
చేయఁబూనితివి నీ♦చేష్టితమును నేను నంగీకరించితి ♦ నైన వీర్య

ఆ. హీనుఁగాఁ దలంచి ♦ యెంతయు నృపధర్మ, పద్ధతిని ధనుస్సుఁ ♦ బట్టఁ జాల
నట్టి వానిఁగాఁగ ♦ నవమానమును జేయు, చున్నవాఁడ విపుడు ♦ నన్నునీవు.

క. పరులు సహింపఁగఁ జాలని, యురుతేజశ్శౌర్యముల మ♦హోద్యమమున నీ
వరయుమటంచని పల్కుచు, గురుకోపము ప్రజ్వలింపఁ ♦ గోదండంబున్. ౩౪

క. శరమును భార్గవరాముని, కరమ్మునుండియె గ్రహించెఁ ♦ గడుఁ జులకనఁగా
శరచాపమ్ములతోడనె, *వరవైష్ణవకళను దుర్ని♦వార్యముఁ గొనియెన్. ౫ 1845

చ. ధనువున బాణముం దొడిగి ♦ దానిని లీలఁగ నెక్కుపెట్టి రా
ముని భృగువంశజుం గని ప్ర♦భూతమహోత్తరరోషమొప్పఁగా

---

*మూలము. ఇత్యుక్త్వా రాఘవః క్రుద్ధో భార్గవస్య శరాసనమ్,
శరంచ ప్రతిజగ్రాహ హస్తా ల్లఘుపరాక్రమః. ౫. శ్లో.

ఈశ్లోకమున రామచంద్రుఁడు పరశురాముని హస్తమునుండి కోదండము బాణమును గ్రహించినట్లు చెప్పఁబడినది. మహేశ్వరతీర్థులవారు వ్యాఖ్య వ్రాయుచు "చాత్ భార్గవనిష్ఠాం వైష్ణవీం శక్తించ జగ్రాహ. తదుక్తం పాద్మే, ఇత్యుక్త్వాదేవి వైష్ణవ్యాశక్త్యా తద్గతయాసహ, జగ్రాహ వైష్ణవం చాపం వినయేనచ లీలయా ఇతి" అని వ్రాసిరి. గాన దాని ననుసరించి యీవిషయ మీపద్యమునఁ జేర్పఁబడినది. దీనిని సార్థకముచేయు శ్లో. 'నిర్వీర్యోజామదగ్న్యో ఽసౌ' అను శ్లోకము ముందున్నది కానఁ బైయర్థము సార్థకమే యని తెలియఁదగును.

ననియె రఘూద్వహుండిటు ధ♦రామరవర్యుఁడవౌట, గాధినం
దనుపయి నాకు స్నేహము ని♦తాంతము గల్గుటచేత నీవొగిన్. ౭ 1846

తే. పూజ్యుఁడవు గాన నీ యసు♦పుంజముఁ గొను
బాణమును వైవఁ జాల నీ♦పాదగమన
శక్తినైనఁ దపోబల♦సమధికార్జి
తాప్రతిమలోకజాలంబు ♦ నైన నిపుడు. ౮ 1847

క. తునిమెద దేనిం గోరుదు, పని మఱియుం బలికె నీ మ♦హాశర మురిప
త్తిన భంజకంబు వైష్ణవ, మును దివ్యమునౌను గా య♦మోఘం బగుచున్.

తే. నీబలంబును దర్పంబు ♦ నీఱు సేయఁ
జాలు వీర్యంబు గలదియౌ ♦ స్వీకరణీయ
మగు పనిని జేయ కూరక ♦ మగుడ దనుచుఁ
బలికె నప్పుడు మునులు, దే♦వతలు మఱియు. ౧౦ 1849

సీ. అచ్చరల్ చారణుల్ ♦ యక్షులు సిద్ధులు గంధర్వకిన్నరౌ♦ఘంబు రాక్ష
సులు నాగములును గుం♦పులుగఁ జతుర్ముఖు ముందిడుకొని వచ్చి♦భూరివైష్ణ
వంబగు దివ్యచా♦పంబును ధరియించి యలరారు రాముని ♦ నద్భుతమగు
తత్కృత్యమును జూడఁ♦దమినిల్చిరంబరస్థలమున రాముఁడా♦ధనువుఁ దాల్పఁ

తే. గాఁ బ్రపంచమ్ము మ్రాన్పడి ♦ కదలకల్లె
నిలిచె వైష్ణవతేజంబు ♦ వెలికిఁ బోవ
వీర్యహీనతచే భృగు♦వర్యుఁడపుడు
రాము వీక్షించె దశరథ♦రాజతనయు. ౧౧ 1850

క. రాముని తేజంబిటు లు, ద్దామపరాక్రమము నొంపఁ ♦ దా జడతనుఁడై
తామరసదళాక్షుని నా, రామునిఁ గన్గొనుచుఁ బరశు♦రాముం డంతన్. ౧౨

క. మెలమెల్లగ నీరీతిం, బలికెం గాశ్యపున కేను ♦ వసుధాతలమె
ల్లలి నొసంగితి మును ప,య్యిలామరుఁడు నన్నుఁ గాంచి ♦ యిట్లని పలికెన్.

క. ఇది నా దేశం బయ్యెం, గద నీవిఁక నుండఁ దగదు♦గా నాభూమిన్
బద యన్న నతని వచనం,బు దగం బాలింపఁ బ్రతిన ♦ పూనితి రామా!.

క. గురువాక్య మవశ్యంబుగఁ, గరణీయం బౌట రాత్రి♦కాలమ్మున నీ
ధరణి వసియింపఁ గాశ్యప, నరమునికై భూమియిద్ది ♦ వఱలుటచేతన్. ౧౪

తే. కాన రాఘవ! నాపాద♦గమనశక్తిఁ
జంపఁ బూనకు మే మనో♦జవము మీఱఁ
గా మహేంద్రాద్రికిని బోవఁ♦గాఁ జనుఁ గద
వినుము నాప్రార్థనముఁ దపో♦వీర్యశక్తి. ౧౫ 1855

సీ. అసదృశమైన లో♦కావళి నార్జించితిని వాని నీబాణ♦మున నడంపు
కాలనిలంబన ♦ మేల? పరంతపా! యీమహాచాపంబు ♦ నేచి యిట్లు
ధరియించుటం జేసి ♦ పరులచే నోడింపఁ బడని శౌర్యంబున ♦ వఱలువాఁడ
వనియు సురేశుండ ♦ వనియు శ్రీపతి వనియు నెఱింగితిని నేను ♦ ఘనుని నిన్ను
ఆ. నీకు శుభసమృద్ధి ♦ నెగడును గాక దే,వతలు గుంపుగూడి ♦ వచ్చి యిదిగొ
సమరభూమియందు ♦ సాటిలేక చెలంగు, నిన్ను వీరె కాంచు♦చున్నవారు.

క. ఎనలేని వీరకృత్యం,బును నీవొనరించుటరయఁ ♦ బోలుననుచు నిం
గిని నిలిచి యున్నవారిఁక, విను నాకిట సిగ్గు దోఁచె ♦ వింతగ రామా!. ౧౬

క. నాకిది తగునే తలఁపం,గాకుత్స్థా! నీవు ముజ్జ♦గంబుల పతివై
యీకరణి నన్ను గెలిచిన, నాకీ సిగ్గేల? దేవ ♦ నాథా! రామా!. ౧౭ 1858

సీ. అసదృశదివ్యసా♦యకమును వదలుమా సువ్రతా! రామ! యీ♦శుభశరంబు
విడువఁగాఁ గని యేను ♦ వెడలెద నమ్మహేంద్రాద్రివరంబున ♦ కనుచుఁ బరశు
రాముండు పలుకంగ♦రాఘవుండు ప్రతాపవంతుండు మఱియు శ్రీ♦మంతుఁడప్పు
డద్దివ్యమైనసా♦యకముఁ బ్రయోగించె భార్గవతపంబునఁ ♦ బడసినట్టి
ఆ. లోకపంక్తులట్లు ♦ ప్రాకటశరమున, హతములై నఁగాంచి ♦ యతిజనమున
నరిగెఁ బరశురాముఁ ♦ డమ్మహేంద్రాద్రికి; నంతఁ దెలివి నొందె♦నఖిలదిశలు.

ఆ. మఱియు విదిశలెల్ల ♦ నెఱిఁ బ్రకాశించె దే
వతలు మునులు చాప♦వరముఁదాల్చి
యున్నరాము మిగుల ♦ నెన్నిరి; వలనొని
రాముఁ గొలిచి పరశు♦రాముఁ డరిగె. ౨౮ 1860

డెబ్బదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౭౭ - వ సర్గము.

దశరథాదు లయోధ్యకరుగుట.

చ. పరశుధరుండు రామునకు ♦ వందనముం బొనరించి యేగ భూ
వరతనయుండు రాముఁడు వి♦వర్జితకోపుఁడు శాంతచిత్తుఁడై
పరఁగి యదృశ్యుఁడై తగు న♦పాంపతిచేతికొసంగి చాపముఁ
శరమును నంత మానిగణ♦సత్తములం గని మ్రొక్కె భక్తతోఁ. ౧ 1861

క. గురువందన మిటులొనరిచి, కరము భయంబున మనంబు ♦ గలఁగంగా నా
తురుఁడై తగు తండ్రింగని, పరశుధరుం డేగె నాత్మ♦వసతికి నిపుడే. ౨ 1862

క. జనకా! నీపరిపాలన,మునఁ దగు చతురంగసైన్య♦ము నయోధ్యకునిం
కను బోవఁగాఁ దగుంగద, యని మఱియుం దండ్రి కిట్టు♦లనియెఁ భక్తిఁ. 3

క. జలమును జాతకముల నుం,డలమాశించెడు విధంబు నగ్ సైన్యము నీ
యలఘుతరాజ్ఞం గోరెడి,నిలాధిపా! యాజ్ఞ యిమ్ము! యింకం బోవంగన్.

చ. అని రఘురాముఁడాడిన నిలాధిపుఁ డల్లన నాలకించి వే
తనయుని దీర్ఘబాహువులఁ దద్దయుఁ బ్రేమను గౌఁగిలించి మూ
ర్కొనియె శిరస్సు నిట్లు నృపకుంజరుఁ డివ్విధి భార్గవుండు పో
యిన గతిఁ జెప్పఁగా మొదట నెంతయు భీతిని గుందియుండుటన్. ౩ 1865

క. వినకుండి చక్కఁగా మఱి,యును రాముండొత్తి చెప్ప నురుముదమునఁ ద
న్నును బుత్త్రుల ధర మరలన్, జనించినట్లెంచె నంత సైన్యమునెల్లన్. ౪

క. పురికేగ నాజ్ఞ యిడె భూ,వరు నాజ్ఞం దలధరించి భటవారము స
త్వరగతి నడువం జేరెను, బురమున్ ధరణీశుఁ డాత్మఁ బొంగెడు వేడ్కన్. ౫

సీ. ఆయయోధ్యాపుర మప్పు సుందరపతాకాన్వితంబయి యొప్పి యలరుచున్న
భూరిధ్వజంబులఁ బొలుపొంది మంగళతూర్యఘోషంబులతోఁ జెలంగి
పన్నీరు చల్లి పుష్పములు పెల్లుగ నైచి రాజమార్గంబులు రంజిలంగఁ
జేయఁగా నెంతయుఁ జెలువారుచుండె; నంతట రాజురాక ముదంబునింప

తే. మోముదమ్ములు వికసిల్ల ముఖ్యములగు
మంగళధ్వను లలరార మనుజులెల్ల
యెడల నిండుగ నిలిచిరి గడుమనోజ్ఞ
ముగ జనాకీర్ణమగు పురమ్మును నృపుండు. ౬ 1868

క. తనయులతోడఁ బ్రవేశిం,చెను బురమున వెలయుచున్న క్షితిసురులును ద
క్కిన పౌరులు దూరమునన్, మనుజేశ్వరు నెదురుకొనిరి మనము లలరఁగన్.

తే. అమ్మహాయశుఁ డతుల మహావిభూతి
నలరి శ్రీమంతులౌ తనయాత్మజన్ము
లెల్లఁ గొలువఁ బ్రవేశించె హిమవదద్రి
వలె వెలింగెడు సౌధంబు భాసురంబు. ౮ 1870

క. జనులెల్ల నంతిపురమున, ఘనతరమోదంబు మీఱఁ గ్రాలిరి నృపుఁడున్
దనయంతఃపురమునఁ గలి,గిన కామపదార్థవితతిఁ గీల్కొను మదితోన్. ౯

తే. మోదమందుచునుండె నాభూదయితు క
ళత్రములగు కౌసల్యా సుమిత్రలును సు
మధ్యమయగు కైకేయియు మఱియుఁ గలుగు
నృపునికాంతలుఁ గోడండ్రకెల్లఁ బ్రీతి. ౧౦ 1872

సీ. ఉపచారములు చేసి యొప్పు నంతఃపురమునకుఁ గొంపోవంగఁ బూనిభాగ్య
గరిమచేఁ గ్రాలెడు ధరణికుమారిక సమున్నయశస్విని యైన మూర్తి

ళను గుశధ్వజుకూఁతు♦లను మాండవీశ్రుతకీర్తులఁ గొని లోని♦కిని జనంగ
నాకాంతలెల్ల న♦త్యంతమంగళవేషములఁ జెలువారుచు ♦ లలితములగు
తే. క్షౌమవస్త్రంబులను గట్టి ♦ సకలగేహ, దేవతాలయములకు భ♦క్తిని సపర్య
లెల్ల నొనరించి యంతట ♦ నుల్లమలర, వంద్యులకు వందనమ్ములు♦వరుస సలిపి.
క. [ధనద భవనోపమస్వీ,య నికేతనములనుజేరి ♦ యవనీసురులన్
ధనధాన్యగోప్రదానం,బునఁ దృప్తిం బొందునట్లు ♦ పూజించి రొగిన్.] 1874
క. సతులంతటఁ దమతమప్రియ, పతులం గూడుకొని మోద♦వార్ధి మునిఁగి య
ప్రతిమసుఖంబులఁ గాంచిరి, హితముగ నేకాంతమందు♦నిచ్ఛానుగతిన్. ౧౩౫
చ. క్షితిపతిపుత్రులెల్లరును ♦ స్వీయపరాక్రమ మీ ధరిత్రి న
ప్రతిమఁ జెలంగ రూపగుణ♦రాజితలై ప్రియపత్నులొప్ప; న
స్తృతతివిలాసముం గని వి♦శాలధనం బలరారఁగా సుహృ
ద్వితతిని గూడి తండ్రికిని ♦ వేడుక సేవల సల్పిరెంతయున్. ౧౫ 1876
తే. [మఱియుఁ గాలానుసరణిగ ♦ మంచినీతి
నెఱిఁగి స్వీయగుణంబుల ♦ నెంతొ సంత
సంబు నొనగూర్చుచుండిరి ♦ జనకునకును
బురుషసింహులునాఁ గీర్తిఁ ♦ బొల్పుమీఱి.] 1877
సీ. దశరథుండట్లు మో♦దంబున నొకకొంత కాలమేగంగఁ గే♦కయతనూజ
యందుఁ దాఁ గన్నట్టి♦యాత్మజు భరతునిఁగని పల్కెఁ బుత్ర! కే♦కయధరిత్రి
పాలకు ముద్దుల ♦ పట్టియు నీమేనమామయునై బహు♦మాన్యుఁడైన
యీయుధాజిత్తుని ♦ న్నెలమిఁ దోడ్కొనిపోవ వచ్చియున్నాఁడు (వి♦వాహవేళ
తే. మిథిలకేతెంచి ననుఁ గాంచి♦మేదినీసు,రేంద్రమధ్యమునం బంప♦వే! మదీయ
భాగినేయుని నంచని ♦ ప్రార్థనంబు,చేసె ధర్మజ్ఞ! యతనికిఁ ♦ జేయు ప్రీతి.)
క. అని దశరథుండు పల్కిన, విని కైకసుతుండు భక్తి ♦ వినయంబులచే
(జనకునకు మ్రొక్కి శ్రీరా,ముని లక్ష్మణుఁ గౌఁగిలించి ♦ మోదంబలరన్.)
క. తనతమ్ముఁడైన శత్రు,ఘ్నునితోఁ బయనంబు సేయఁ♦గోరి యపుడు తం
డ్రిని, దుఃఖరహితకృత్యం,బును చేయు మహాత్ము రాఘ♦వుని వీడ్కొనుచున్.
క. నరపుంగవుఁడై తనరెడు, భరతుఁడు తల్లులను వేఁడి ♦ వారియనుమతిన్
యరిగెం గేకయరాట్పుర, వరమున; కిటు సోదరుండు ♦ పయనము సేయన్.
క. సౌమిత్రియును బలాఢ్యుఁడు, రాముండమరాళితోడఁ ♦ బ్రతియై తగు న
బ్భూమండలపతిఁ దండ్రిని, నేమనంబునఁ బూజసేసి ♦ నిశ్చలభక్తిన్. ౨౦
ఆ. మోదమొందఁ జేసి ♦ రాచటరాముండు, ధర్మవేత్తగానఁ ♦ దండ్రియాజ్ఞఁ
బురజనులకు హితము ♦ లరయఁ బ్రియమ్ములు, నైన పనులనెల్ల ♦ నాచరించె.
క. శ్రుతులను స్మృతులను నెఱింగిన, మతివిభవము గల్గియున్న♦మాన్యుఁడు గానన్

హితముగఁ దల్లులకును గురువితతికిఁ దాఁ జేయఁదగిన ♦ పృథుకృత్యములఁ.

సీ. కాలంబులనెఱింగి ♦ కావించుచుండెఁ; నాతనివైన శీలవృ♦త్తముల నరసి
దశరథుండును భూమి ♦ దైవతంబులుఁ బౌరు లతనిదేశంబున ♦ నలరు ప్రజలు
ప్రీతులైరంత స♦ద్వృత్తశీలంబులనేకాక తక్కిన♦యెల్ల సుగుణ
ములను మహాయశం♦బున సత్యశౌర్యంబు ననునొప్పుభూపాగ్ర♦తనయుఁ డఖిల

తే. భూతములకు బ్రహ్మదేవుండు ♦ వోలె నెల్ల
వారికిం బ్రియతముఁడయి ♦ వారిలో గు
ణాధికుండయి తనరారె ♦ సవ్విధమున
నెల్లవారికిఁ బ్రియగతి ♦ నుల్లసిల్లి. ౨౮ 1885

*సీ. తండ్రికి శుశ్రూషఁ ♦ దాఁ జేయుచుండియుఁ గామవశుండయి ♦ క్రమ్ర భోగ
రసమాస్వాదన ♦ రతచిత్తుఁడై సదా జానకీపరతంత్ర ♦ మానసుఁడయి
లలితస్వకృత్యజా♦లముల జానకి తనవశము గావించిన ♦ స్వాంతముగల
దగుట నెప్పుడు నామె ♦ యందె యాసక్తుఁడై నవనవాకృతిమీఱి♦నైజకామ

తే. మలరఁ జిరకాల మవిరత♦లలితభోగ
ములను సీతాసమేతుఁడై ♦ మోదమలర
ననుభవించుచు విహరించు♦చును జెలంగ
జానకియు రామునకు సంత♦సంబుఁ గూర్చె. ౨౯ 1886

ఆ. అతనితండ్రి గూర్చి♦నట్టి యిల్లాలుగా
వున మహీజపతికి ♦ ఘనతర ప్రి
యయయి వెలసె; మఱియు ♦ నామె శుశ్రూషచే
నందమునను భూమి ♦ నతులయగుట. ౩౦ 1887

సీ. రాముండు ప్రీతుఁడై ♦ రంజిల్లఁజేసె నావనితను భర్తపై ♦ నినుమడిగ, నె
సంగుప్రీతిని బొంది ♦ జానకి యలరారె భార్యచిత్తంబున ♦ వఱలునట్టి
యనురాగమును గూఢ♦మగు దానిరాముండు ననుభావములచేత ♦ నరసి తెలిసి
కొనుచుండె జనకనం♦దనయగు మైథిలి సూక్ష్మజ్ఞురాలౌట ♦ సురవనితల

తే. మించురూపంబు గలదౌట ♦ మేటి లక్ష్మి
వలె వెలుఁగునదియౌటచే ♦ భర్తమనసు
నతనికంటెను మిక్కిలి ♦ యరసి యెఱుఁగ
నిట్టు లొండొరుమనసుల ♦ నెఱిఁగి రొకట. ౩౧ 1888

*మూలము. రామస్తు సీతయా సార్ధం విజహార బహూన్ ఋతూన్, మనస్వీ తద్గత స్తస్యా నిత్యం హృది సమర్పితః. అనువాదానికి వ్యాఖ్యాతలుచేసిన విశేషార్థములనుబట్టి సీసపద్యము వ్రాయఁ బడినదని తెలియునది.

క. ధరణీశర్షి కుమారుఁడు, వరపార్థివసుతయు రూప♦వైభవయును నై
పరఁగు మహీసుతతో శ్రీహరి లక్ష్మినిగూడి వెల్గు♦నట్టులు వెలసెన్. ౨౯ 1889

డెబ్బదియేడవ సర్గము సంపూర్ణము.

---

కాండాంతపద్యము.

చ. హరిహయముఖ్యనిర్జరగ♦ణార్చిత దివ్యపదాంబుజా! మనో
హరతనువైభవా! భవము♦ఖాదినిరంతరసంస్తుతా! మునీ
శ్వరపరిగీయమానవర♦శాశ్వతముక్తిపదప్రదాహ్వయా!
నిరుపమనీలనీరద వి♦నిర్మల దివ్యతనూలతోజ్జ్వలా!. 1890

సీ. ఇది మహీసురకుల♦విదితకాశ్యపమౌనిగోత్రజాపస్తంబ♦సూత్ర, శ్రీత్రి
పురసుందరీవర♦కరుణాత్తసంస్కృతాంధ్రకవిత్వవైభవ♦ప్రథితకీర్తి
జనమంచివంశాబ్ధి♦చంద్రసుబ్రహ్మణ్యవిబుధవర్యసుపుత్ర, ♦ వినుతిపాత్ర
పండితగురుభక్త, తాండవకృష్ణాపరాభిధేయార్యజ♦నాళిభజన

తే. నిరతశేషాద్రిశర్మప్ర♦ణీతమైన
యాంధ్రరామాయణంబున ♦ నతిమనోజ్ఞ
పుణ్యకళ్యాణకథలచే ♦ భువిని బాల
కాండ మాచంద్రరవితార♦కముగ వెలయు.

బాలకాండము సంపూర్ణము.

---

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ ర స్తు.

# ఆంధ్ర శ్రీమద్రామాయణము

## అయోధ్యాకాండము - ౧-వ సర్గము.

క. శ్రీకంఠమంత్రజపరత, రాకాశీతాంశువక్త్ర ♦ రమ్యా విబుధా
నీకార్చిత పదకమలా, శ్రీకలితమనోజ్ఞ నామ ♦ శ్రీరఘురామా. 1
క. (వినిపింతు సర్వలోక జర, గినగాధను రామచంద్ర ♦ కృతినాథా, యె
ట్లన], మేనమామయింటికిఁ, జనువాఁడై భరతుఁడపుడు ♦ సహజు ననఘునిన్.౪
క. సతతారిసూదనునిన్, హితునిం గొనిపోయె నన్న ♦ యెడ నెంతయుఁ బ్రీ
తి తనరువాఁడౌట సతం, డతనిన్ సేవించు చరిగె ♦ నట భరతుండున్. ౧ 3
తే. మేనమామ యుధాజిత్తు ♦ మేటిఘోట
కములు వస్త్రాదులిచ్చి నె ♦ య్యమునఁ దన్ను,
సత్కరించుచుఁ దనయాత్మ ♦ జన్ము మాడ్కి
లాలనము సేయుచుండ ను ♦ ల్లమున నలరి. ౧౪ 4
క. తన తమ్ముఁడైన శత్రు, ఘ్నునితో నివసించె నందుఁ ♦ గోరినరీతిన్
గన నగు నుపచారంబుల, ననయము లాలింపఁబడుచు ♦ నందుచుఁ దృప్తిన్.
చ. అలరుచు నిట్టులుండియును ♦ నా సహజన్ములు వీరు లాత్మలోఁ
దలఁచిరి వృద్ధుఁడై పరఁగు ♦ తండ్రిని బల్మఱు; నెట్లు మోయఁగా
గలఁడొకో భూభరంబిఁక ని ♦ కామముదంబున రామచంద్రును
జ్జ్వలతర యౌవరాజ్యపద ♦ భారముఁ బూనఁగఁ జేయు టొప్పుఁగా. ౩ 6
క. ముదిసిన తండ్రికి శుశ్రూ, షఁ దగన్ సల్పంగఁ దగిన ♦ సమయ మరిగెడిం
గద దాన ధర్మలోపం, బౌదవుఁ గదా యనుచుఁ జింతఁ ♦ బూనిరి వారల్. ౩
సీ. సత్పుత్రలాభైక ♦ సంపన్నితాంత తేజస్కుఁడౌ దశరథ ♦ క్ష్మావిభుండు
మనమునఁ బెఱదేశ ♦ మున నున్నవారి మహేంద్రవరుణులు నా ♦ నెసఁగు ప్రీతి
గల యట్టివారల ♦ గాదిలితనయుల భరతశత్రుఘ్నుల ♦ నిరువురను ద
లంచుచుఁ దనయులు ♦ చెంత లేకుండుట యే లోప, మేమున్న ♦ నేమియనుచుఁ
తే. దలఁచుకొనుచుండె నతనికి ♦ నలువురు సుతు
లరయఁ బురుషర్షభులు గాన ♦ నాత్మదేహ

జనితబాహుచతుష్కంబు ♦ నరణిని బ్రియు
లైరి కాని భేదం బిసు♦మంత లేదు. ౮ 8

—రామగుణవర్ణనము.—

క. భూతములలోన శతధృతి, యేతీరున వెలయునట్టు ♦ లే రాముండున్
క్ష్మాతలపతిపుత్త్రులలో, ఖ్యాతగుణుం డధిక తేజుఁ♦డై చెలఁగుటచేన్. ౯ 9
క. జనకున కెంతయుఁ బ్రీతిని, జనింపఁగాఁ జేసె మఱియు ♦ ననధికగర్వం
బున విఱ్ఱవీఁగు రావణు, నని మొనఁ బొలియింపఁ గోరి ♦ యమరులు భక్తిన్.
మ. తనుఁ బ్రార్థింపఁగ నిత్యవస్తువగుచుం ♦ దా నొప్పు శ్రీచక్రియే
మనుజుల్ వాసము చేయు లోకమున రా♦మఖ్యాతనామంబునం
జనియించెం గద భూరితేజు సుతుఁ గౌ♦సల్యాంబ దాఁ గాంచి జి
ష్ణుని వజ్రాయుధుఁ గన్న యయ్యదితి నా ♦ శోభిల్లె నత్యంతమున్. ౧౧ 11
సీ. రామచంద్రుండును ♦ రమణీయలావణ్యసౌదార్యముఖములై♦నట్టిగుణము
లలర నొప్పెడు; వీర్య♦కలితుండుఁ బరగుణ మందు దోషముఁ జూప♦నరయునట్టి
దగు ననసూయయె లేని♦దగు చిత్తమున నొప్పు నటుగాన భూస్థలి♦యందు వెదకఁ
గౌసల్యయొక్కతె♦గాని తాదృశపుత్త్రుఁ గన్నవేఱొకకాంత ♦ గానరాదు
ఆ. సకలగుణములను ద♦శరథునితోఁ సాటి
యై చెలంగు మఱియు ♦ నతఁడు శుద్ధ
శాంతచిత్తుఁ డగుచు ♦ నెంతయు మృదువుగఁ
బల్కుఁ; బల్కఁ డెపుడు ♦ పరుషముగను. ౧౨ 12
క. తనతోఁ నెవరేఁ బరుషవచనములు వల్కినను వారి♦చందంబునఁ బ
ల్కను దలఁపఁడు మృదువుగనే, మనములరెడునట్లు బదులు♦మాటలు పల్కున్.
తే. [1]ఎవ్వరే నొకయుపకార ♦ మెట్టులేని
చేయనది యెంతయున్ స్వల్ప♦మే యయినను
సంతతామోదమును గను; ♦ శతములయిన
యపకృతులఁ జేయ స్మరియింపఁ ♦ డాత్మయందు. ౧౪ 14
సీ. దీనికి హేతువే♦దా నన మనమును స్వవశీకృతమ్ముగఁ ♦ జంకమునను
నర్చిన జ్ఞానిగా♦నం దలంపకయుండు నపకారశతముల ♦ నైన మఱియు
నస్త్రశస్త్రంబుల ♦ నభ్యాసమును జేయు సమయంబునందును ♦ సజ్జనులగు
దేఱఁగా వంశంబు ♦ నూరునే వేవని యరయక వారల♦యందు శీల
తే. వృద్ధులగు వారితోడనె♦న్నేని సూక్ష్మ
ములగు నాచారములను, జ్ఞా♦నులగు వృద్ధ

1 ఈసద్గుణములుండుట మహాపురుషలక్షణమని స్మృతికలదు.

వితతితోడ వేదాంతస♦ద్విషయములను
[1]జెప్పుచుండును బ్రీతిమై ♦ శ్రీరఘుపతి. ౧౨ 15

తే. సంతతపరంపరాగత♦సంప్రదాయ
విషయములను వయస్సుచే ♦ వృద్ధులయిన
వారితోఁ బల్కుచుండును ♦ బండితులను
విడిచి యొక క్షణమైనను ♦ విరతిఁగనఁడు. ౧౨ 16

సీ. మతిమంతుఁ డగుటచే ♦ మనమున లోకరక్షణచింతఁ బూనును♦స్వాంతమందు
మధురంబుగా నెప్డు ♦ మాటాడు; నీచునితోనైనఁ దానె ముం♦దుగనుబల్కుఁ
బ్రియముగ నేపల్కు;♦వీర్యవంతుఁడు నయ్యుఁ దనగొప్పవీర్యంబుఁ♦దలఁచి విస్మ
యంబు నొందక గర్వ♦మందక యిది యెంత యనియెతలంచు,స♦త్యములుగాని

తే. కథలఁ బలుకఁడు, మును పలు♦కంగఁబడిన
వృద్ధులరు దేర వారల ♦ కెదురుగఁ జని
పూజలందన్నుఁ, బ్రజలనుఁ ♦ బూని యలరఁ
జేయుఁ గావునఁ బ్రజలు రం♦జిల్లి యుంద్రు. ౧౮ 17

క. అనురాగము ప్రజలకు నా,తనియందును గల్గియుండు ♦ దయతో విప్రా
ళిని బూజించును, క్రోధం,బును జంపి చెలంగుచుండు ♦ బుధజననుతుఁడై.

ఉ. దీనులఁ గాంచి ప్రేమను మ♦దింగని వారల కోర్కెఁదీర్పఁగాఁ
బూను నసుస్తధర్మములఁ ♦ బోలనెఱుంగును; నెల్లవారికిన్
దాన భయంబొసంగు నియ♦తంబును సంతతమూని శుద్ధుఁడై
మానసమందునే నితర♦మానవవిత్తము గోరకే తగెన్. ౧౯ 19

సీ. [2]ఇక్ష్వాకుసద్వంశ ♦ వృత్తికిఁ దగినట్టి దాక్షిణ్యదీనాభి ♦ రక్షణాది
ధర్మమునం దెప్పుడు ♦ దగిలియుండెడు బుద్ధి గలవాఁడు, దుష్టని♦గ్రహము శిష్ట
పరిపాలనమ్ముగ ♦ భాసిల్లు తనదగు క్షత్రధర్మమునె ప్ర♦శస్తముగను
భావించువాఁడు; త♦త్కృవభూరికీర్తిచే భవ్యమౌ స్వర్లోక♦ఫలము గలుగు

తే. ననియెఱింగినవాఁడు, ఫ♦లాప్తిలేని, కర్మములయందు నాసక్తి♦గలుగకుండు
వాఁడు విద్వాంసుఁడై ధర్మ♦పదవిరుద్ధ,కథలయం దాదరము లేక♦క్రాలువాఁడు.

సీ. మఱియు నాభూపకు♦మారుండు లౌకిక, వైదికవిషయముల్ ♦ వాదమందుఁ
జర్చింపఁదగినట్టి ♦ సమయంబునం దుత్తరోత్తరంబుగ మంచి♦యుక్తిమీఱ
భవ్యమౌవాక్కులఁ♦బల్కుఁ బ్రమాణమ్ములను బృహస్పతి భంగి;♦ననవరతము
నారోగ్యముంగల్గి ♦ యతఁడుండు యౌవన మతులమౌ వాక్కును♦హారి దేహ

తే. మునుగలిగి దేశకాలమ్ము♦లను నెఱింగి
యలరుచుండును, నొక్కప♦ర్యాయ మొరులఁ

---

1 చెప్పుచుండును—కథయన్ అనిమూలము అనఁగాఁ జర్చించుచుండునని తాత్పర్యము.

2 కులోచితమతిః-అనిమూలము, దానివ్యాఖ్య కిది తెనుఁగని గ్రహింపవలయు.

గనినవారల హృత్సార♦మును నెఱుంగు
నంతటితఁ డొక్కఁడే సాధు ♦ వని యెఱిఁగిరి. ౧౮ 21

మ. పరమానేక గుణాభియుక్తుఁ డగుచున్ ♦ భాసిల్లు నప్పార్థివే
శ్వరసూనుండు, స్వకీయసద్గుణములన్ ♦ సర్వప్రజామోదకా
ర్యరతుండై వెలినున్న ప్రాణమునలన్ ♦ రాజించుచున్ స్వప్రజో
త్కరమెంతో ప్రియ మొప్పఁ జిన్నఁ గనుచం♦దానం బ్రవర్తిల్లెఁ దాన్. ౧౯

సీ. వ్రతవిద్యలన్ శాస్త్ర♦పద్ధతిగాఁ దీర్చి స్నాతకత్వంబుల ♦ జరపి సాంగ
వేదార్థమును సాధు♦బృందముఖంబున నెఱిఁగి [1]సమంత్రము లేక♦యే ప్రయోగ
మునకుపయోగించు ♦ ఘనత రేషువులను సమంత్రయుక్తాస్త్ర♦సంచయముల
దశరథభూపతి ♦ తల్లజునిన్ మించి భరతాగ్రజుండు తా ♦ వసుధ నెలసె

తే. మఱియు మంగళతరపితృ♦మాతృవంశ
భాసురుండు నిర్దోషియుఁ ♦ బరిచలనము
నొందనట్టి మనస్సున ♦ నొప్పువాఁడు
సత్యవచనుండు సద్వృత్త♦శాలి ఘనుఁడు. ౨౦॥ 23

సీ. [2]వయసునఁ బెద్దలై ♦ బహుధర్మవేత్తలై తగుభూసురులచేతఁ♦దాను శాస్త్ర
పద్ధతిశిక్షింపఁ♦బడి ధర్మకామార్థములను నాయాకాల♦ములనుఁ జేయఁ
దగినరీతి నెఱింగి ♦ తనమది మఱువను మది లేక; యుపు డపు♦డభినవముగ
వికసించు బుద్ధిచే ♦ వెలసి లోకంబున సంకేతితములు నా♦చారములను

తే. దనరు న్యాయంబుఁ దెలిసి య♦ద్దానిఁ జేయు
శక్తి నలరారి వినయంబు ♦ చాలఁగల్గి
మనములందలి విషయంబు♦లను దెలిసెడు
నట్టి వికృతుల నొందక ♦ యలరు నతఁడు. ౨౨॥ 24

క. తనయూహా ఫలము నొందిన, ననుకం దెలియంగఁ బరగ ♦ దైన్యాఱిగ నా
ఘనుఁడలరు, మంత్రివశ్యులు, తనుఁగొలువఁగ వెలయు చుండు♦దశరథసుతుఁడున్.

తే. అతనికోపంబు హర్షంబు ♦ సార్థకములె
గాని ఫలమును బొందక ♦ క్రమ్మఱంగఁ
జనవు; దానార్జనములరీ♦తి నతఁడెఱుఁగు
సురగురువులందుఁ దద్భక్తి ♦ కరము దృఢము. ౨౩ 26

1 ఇష్వస్త్రేషు చ పితుః శ్రేష్ఠః - అని మూలము. ఇషువులనఁగా బాణములు, అస్త్రములనఁగా బ్రహ్మాద్యస్త్రములు.

2 ధర్మకామార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్, లౌకికే సమయాచారే కృతకల్పో విశారదః - అని మూలము. దీనియర్థమును వ్యాఖ్యాత లిట్లు వివరించిరి. విస్తారమున కీపద్యమును జూడఁ దగు.

సీ. దృఢభక్తిజనితమౌ ♦ దివ్యవిజ్ఞానంబు స్థిరముగ నాతనిఁ ♦ జెందియుండు
నీచులయర్థంబు ♦ నీచసాంగత్యంబుఁ గైకొనఁ డాతఁడే♦కాలమందుఁ
బరుషంబుగా నేరిఁ ♦ బల్కఁడలసతలే కెప్పుడు శాస్త్రాళి♦నేచదువుచు
నప్రమత్తుఁడుగాక ♦ యాత్మదోషంబులఁ బరదోషములరీతి ♦ నరసి యెఱిఁగి
తే. తగినరీతిని శాస్త్రార్థ♦తత్వంబుఁ దెలిసి
యొరులుచేసిన యుపకృతి ♦ నొగి నెఱింగి
వారియెడఁ బ్రీతిఁ గలిగి యె♦వ్వారినేని
గనినఁ దద్గతభావంబు♦లను దెలియుచు. ౨౭ 27

సీ. పండితుండయి శాస్త్ర♦పటలి చెప్పినరీతి సఖులఁ గైకొనుటయు ♦ ననుతవారిఁ
బాలించుటయును నీ♦పద్ధతులందు నత్యంతచాతురిగల్గి ♦ యాతఁడలరు
సజ్జనవర్యుల ♦ సంగ్రహించుటయందు నవ్వారిఁ బాలించు♦టందుఁ జతురుఁ
డిట్లె దుష్టులనిగ్ర♦హించుటయందును గలిగిన యవకాశ♦ముల నెఱుంగఁ
తే. జాలు శ్రీరామచంద్రుండు ♦ పూలనుండి
తేనెఁ గైకొను భ్రమరంబు♦తీరునఁ దన
ప్రజలనుండి న్యాయంబుగ ♦ నసువు గొనెడు
నట్టి యుపముల నెఱుఁగుమ♦హాత్ముఁ డతఁడు. ౨౮ 28

క. ధనమెట్లు వ్యయము చేయుఁగఁ, జనునో శాస్త్రోక్తమైన ♦ సరణినెఱుఁగు నిం
కను వేదములను వేదాం,గనికరములఁ దెలిసి యతఁడు ♦ గ్రాలుఁ ధరలోన్.

తే. సంస్కృతప్రాకృతాది భా♦షామయమ్ము
లైన కావ్యమ్ములను నాట♦కాదులను న
తండు తెలియును వాని తా♦త్పర్యములను
దద్విదులలోన శ్రేష్ఠుఁడై ♦ తనరుచుండు. ౩౦ 30

క. కామప్రధానుఁడేగా, కామహితగుణుండు ధర్మ♦మర్థము న్యాయం
బౌ మాడ్కి సంగ్రహించి ని,కామసుఖంబనుభవించుఁ ♦ గడునిచ్ఛమెయిన్.

సీ. కర్తవ్యములయిన♦కార్యములను జేయునుత్సాహమునఁబొల్చు♦చుండుమఱియు
లలితవిహారార్థ♦ములగు సంగీతాది శిల్పంబులను నేర్పుఁ♦జెందు నతఁడు [యు
ధనము వ్యయించు ప♦ద్ధతిఁ గార్యములయందుఁ జక్కఁగఁదెలియునా♦సరసమతి
హాస్త్యశ్వముల నెక్కు♦నట్టి కృత్యంబున వానిశిక్షించెడు ♦ పద్ధతులను
తే. మిగులసామర్థ్యములు గల్గి ♦ మించు మర్మ
సహితముగను ధనుర్వేద♦సరణి నెఱిఁగి
నట్టి వారలలో శ్రేష్ఠుఁ♦డై చెలంగు
నతిరథుల చేతఁ బూజితుం♦డై తనర్చు. ౩౨ 32

క. ధరణికిఁ బ్రభుఁడై, యభిషేకరమాయుతుఁడగుచు నుండఁ♦గా నెప్పుడు ని
ర్భరముదమునఁ జూతునో? వాఁ,డరయఁగ లోకాభివృద్ధి ♦ నాత్మంగోరున్.45

క. భూతౌఘసతతకరుణో,పేతుఁడు తలపోసిచూడ ♦ వృష్టిదుఁడయి వి
ఖ్యాతింగను పర్జన్యుని,భాతిన్ సంతాపహరుఁడు ♦ బహుదాతయునౌ.౩౬ 46

క. లోకులకెల్లం బ్రియుఁడగు, నాకంటెను; యమను రాఘు♦నాథులతో శా
స్త్యాకలనఁ దుల్యుఁడేయగుఁ, బ్రాకటమతియందు దేవ♦పతిగురుసముఁడౌ.౩౭

క. గిరితో ధీరత్వంబున, సరియగు; నాకంటె సుగుణ♦సంపద వెలయన్
ధరనొప్పు నిట్టి సుగుణో,త్కరసుతుఁడీ వసుసునందె ♦ క్ష్మాభరమూనన్.౩౮

క. కనులారఁ గాంచి స్వర్గం,బును బొందఁగఁ జాలునట్టి ♦ భూరిసుకృతమొ
ప్పునె నాకు ననుచుఁ జింతిం,చెను దశరథభూమిపాల ♦ జిష్ణుం డాత్మన్. ౪౦

చ. ఇతరనరేంద్రదుర్లభము ♦ లెన్నఁ బ్రసిద్ధము లెల్లలోకసం
తతవినుతంబు లారయఁగ ♦ నైజములున్ గణనాప్రమేయముల్
హితములు శిష్టసంస్తవము ♦ నే గనియుండు గుణంబులొప్పఁగా
క్షితిపతిభూషణంబనుచుఁ ♦ జెప్పఁగ నర్హుని నాత్మసంభవున్. ౪౧ 50

తే. రామచంద్రుని జూచి యా♦రాజు మంత్రి
వరులతోఁగూడి యోజించి ♦ భవ్యయౌవ
రాజ్యమున కర్హునిం జేయ ♦ రమణ నెంచె
నంత నుత్పాతములు దోఁచె ♦ నవని దివిని. ౪౨ 51

సీ. అంతరిక్షమ్మున ♦ నప్పుడు గల్గిన యుత్పాతములఁగాంచి ♦ యురుభయంక
రములౌటమతివైభ♦వమునఁ గ్రాలును గానఁ దనదేహమందుఁగా♦ననుజరను
దలపోసి వేగంబ ♦ తలఁచినపనిఁ దీర్ప నౌనని మంత్రుల ♦ కాత్మనిశ్చ
యంబును జెప్పి; యు♦య్యదనునఁ దోఁచునుత్పాతభయంబును ♦ బాపఁజాలి

తే. పూర్ణచంద్రాననుండయి ♦ పొలిచి లోకు
లకును మిక్కిలిప్రియుఁడయి ♦ లలిఁ జెలంగు
రాముఁ దలపోసి యిఁక యువ♦రాజుఁజేయ
వలయు నీసుహాయమతినని ♦ పార్థివుండు. ౪౪ 52

చ. తనమది వేగిరింపఁగను ♦ ధర్మవిదుత్తముఁడౌట నాతఁడున్
జనకును లోకసంతతికిఁ ♦ దప్పకమేలును బ్రీతియుం జెలం
గను దగినట్టి కాలమునఁ ♦ గాదిలిసూనుని బట్టభద్రుఁజే
యను ద్వరనొందె నంత నతఁ ♦ డప్పురవాసులఁ బెద్దవారలన్. ౪౫ 53

చ. జనపదవాసులౌ సునుజ♦సత్తములన్ మఱియుం బ్రధానభూ
షనిచయభూమిపాలకులఁ ♦ బార్థివవర్యుఁడు వేఱువేఱఁ బ్రీ

తే. భంగి నాపూర్వులౌ రఘు♦ప్రభువు మొదల
యిన ధరేంద్రులచేతఁ బ్రీ♦తిని దగంగఁ
బాలనము సేయఁబడుట మీ♦భవ్యహృదయ
ములకుఁ దెలిసినయదె గద ♦ సులలితముగ. ౪ 63

చ. ఘనతరతత్కులోద్భవుఁడఁ ♦ గావున నేనును నాకుఁ బూర్వులై
తనరెడు రాజశేఖరులు ♦ ధర్మపథంబునఁ బ్రోవఁగా సుఖం
బునకిరవైన యీయమల♦భూతలరాజ్యము చాలసౌఖ్యముం
గనఁదగునంచు దీనికి సు♦ఖంబును గూర్పఁగఁ గోరితిం జుఁడీ. ౫ 64

క. అరయుచు నేనును బూర్వులు, చరియించిన మార్గముననె ♦ చరియించి ప్రమా
దరతింబొందక శక్త్యను,సరముగ రక్షించితిని బ్ర♦జలను సతతముఁ. ౬ 65

ఆ. అడ్గగింపరాని♦యట్టి శౌర్యమ్మునఁ, దెలిగొడుగును దాల్చి ♦ నిలిచి యేక
రీతి రాజ్యమేలి ♦ భూతలమునకెంతొ, హితముఁ గూర్చుచునె వ♦హించినాఁడ.

క. చిరకాలము జనులకు హిత,కరముగఁ బాలించినాఁడఁ ♦ గావునె కళే
బరమాఛత్రచ్ఛాయనె, జరఁ బొందెం బూర్వపటిమ ♦ చనె దూరముగ. ౭

తే. పెక్కువేలేఁడు లాయుస్సు ♦ పెఱుగ బ్రదికి
నాఁడ దాననె తనువు జీ♦ర్ణత్వమొందెఁ
బని యొనర్పఁగఁ జాలదు ♦ గనుక నేను
నింక విశ్రాంతిఁ గోరెద ♦ నీడ్యులార. ౮ 68

మ. ధరణీశార్హములైన శౌర్యము మహా♦ధైర్యంబు లోనౌ గుణో
త్కరముం గల్గియె రాజ్యమేలవలయుం ♦ గాకవ్వి లేకున్నచో
సరిగా; దింద్రియనిగ్రహం బొదవదే ♦ శౌర్యాదులుం గల్గవే
కరణిం దాల్పగనౌ మహీభర; మదాఁ♦గా దుర్భరం బెన్నఁగన్. ౯ 69

క. జరనొందినాఁడఁ గావున, ధరణీభారంబుఁ బూని ♦ తాల్ప నలసితిన్
బరికించి నాదుతనయుని, ధరకొడయనిఁ జేసి నరహి♦తంబును గూర్పన్. ౯౧

ఆ. అంతరంగులైన♦యట్టి యీభూసుర, వర్యు లనుమతించు ♦ భంగిఁ జేసి
భూమిభారవహన♦మును మాని విశ్రాంతి, నొంద నేను గోరు♦చున్నవాఁడ. ౧౦

ఉ. రాముఁడు నాకు జ్యేష్ఠసుత♦రత్నము శౌర్యమునందు సాటి సు
త్రాముని తోడ, వైరులపు♦రంబుల గెల్వ సమర్థుఁడౌ మహో
ద్దామగుణాళి నాదు సమ♦తం గని గల్గినవాఁడు పూరుష
స్తోమబలాముఁడీ జగతిఁ ♦ దోఁచెడు ధార్మికులందు మేటియౌ. ౧౧ 72

క. వినుఁడీ పుష్యర్క్షయుతిం, గను శీతమయూఖుగతిఁ బ్ర♦కాశించెడు రా
ముని యౌవరాజ్యమునఁ బ్రీ,తిని నిల్పఁగ నేను గోరి♦తిన్ బ్రజలారా. ౧౨

సీ. [1]బహునాయకంబులై ♦ పరఁగు ముజ్జగములెవ్వానిని బ్రభువుగాఁ♦బడసియధిక
ముగ నాథవంతమ్ము ♦ లగునో యట్టిసు తేజసుఁడు లక్ష్మణాగ్రజ♦మ్మ్యుఁడునయి తగు
నల రామచంద్రుండె♦యగుమీకుఁదగునాథుఁ; డేఁజాలకాలమీ♦యిల భరంబు
ధరియించి యుంటి స♦ద్ధాని నగ్రాత్మజునందుంచి యిట్టి మే♦లవని కొనరఁ
తే. గూర్చి క్లేశము విడనాడఁ ♦ గోరువాఁడ
ధరణిభారంబుఁ దాల్చి వా♦ర్ధకమునొంది
యలసియున్నట్టి నాకు రా♦మాభిషేక
కార్యమనురూపఫలదమై ♦ క్రాలు నేని. ౧౭౪ 74

క. నేనికార్యముఁ జక్కఁగ, మానసమునఁ దలఁచి చేయ ♦ మ్మొకొనుటయు నిం
పైనగతి మీకుఁదోఁచున, యే నాకనుమతినొసంగుఁ ♦ డిప్పుడు మీరల్. ౧౭౫

క. అనుకూలమైనదే ని,ప్పని నాకు మఱొక్కదాని♦వలన గునే చే
యను; మీయనుమతిఁ గైకొన,క నేనుమాత్రమిటుచేయఁ♦గలుగుదుఁ జెప్పుఁడా.

క. [2]ఎదినీకుఁ బ్రియమొ యయ్యది, యెడగుం జేయంగ నందు♦రేని సుతుఁ న
త్పదమం దభిషేకింపఁగ, నుదితప్రీతుండనైన ♦ నొగి మీరెల్లన్. ౧౭౭ 77

క. హితకార్యము వేఱొక్కటి, మతులం దోఁచినను జెప్పు ♦ మానక మఱి యీ
క్షితిఁ బక్షపాతియగు తా,నె తగన్ యోజించి చేయు ♦ కృత్యముకంటెన్.

తే. పక్షపాతంబు లేనట్టి ♦ పరమచిత్త
ములను దనరారు మధ్యస్థు ♦ లోలసి చేయు
నూహ యింకొకవిధముగ ♦ నుండునది వి
చారచర్చను సత్ఫల♦సారమొసఁగు. ౧౭౯ 79

క. అని దశరథుండు పల్కఁగ, విని యాసభనున్ననృపులు ♦ వృష్టిఁగనుఁడగు మే
ఘుని గని నెమిళ్లు కేకలఁ, బొనరించెడుగీతి నతనిఁ ♦ బొగడిరి యిటులన్. ౧౮౦

చ. జను లట నున్నవారు నృప♦స్వముఁ జూచినవాక్కులన్ మునం
బునఁ బెనుపొంది మించిదని ♦ పోలవచింపఁగఁ దద్ధ్వనంబునై
త్రినిఁ జెలువారఁ దెల్పుచుఁ, బ్ర♦తిధ్వని కల్గఁగఁ జేయుచున్ గద
ల్చునొకొ సభావిమానమున ♦ శోభిలె నొక్కమొగిం బ్రవృష్టము. ౧౮౧ 81

సీ. తావృద్ధుఁడౌట నా♦త్మజు యువరాజుగా స్థాపింపఁదగునను ♦ ధర్మము మఱి
మనుజుల కర్థసా♦ధనమును దెలిసిన యవనీపతి వచించి♦నట్టిభావ
ము నెఱింగి బ్రాహ్మణుల్ ♦ మనుజేంద్రులును బౌరజానపదులతోఁడ♦సాధ్వసాధు
వులను యోజించి యి♦మ్ములనైకమత్యంబు నొందుచుమనముల♦నొక్కమాఱు

1 అనురూపస్సనైనాథః-అనిమూలము. దీనివ్యాఖ్యననుసరించి సంగ్రహించి యిట వ్రాయఁ
బడినది.

2 వ్యాఖ్యలోని అవతారికభావ మింగుఁ గనఁబడు.

తే. నిశ్చయము చేసికొని వృద్ధ♦నృపుని గాంచి
పల్కిరిట్లని రాజేంద్ర ♦ బహుసహస్ర
వత్సరంబులు జీవించి ♦ వార్ధకంబు
బొందితివి గాన నీజ్యేష్ఠ♦పుత్త్రునింక. ౨౦½ 82

క. యువరాజుగ నభిషేకో,త్సవమున నలరింపు మేము ♦ స్వాంతమ్ముల భూ
ధవవర్య, మహాబాహు, ర,ఘువరు నుహాబలునిఁ బెద్ద♦కొడుకున్ రామున్.

చ. ద్విరదవరంబుపై నలరి ♦ తెల్లనిఛత్త్రము నీడ మోము సుం
దరముగ నొప్పిరాఁగఁ గను♦దమ్ముల విందుగఁ జూడఁజూడ ని
ర్భరమగు కాంక్షఁ గోరెదము ♦ పార్థివసత్తమ! యంచు సభ్యు,లా
దరమునఁ బల్క నానృపతి ♦ తద్హృదయప్రమదం బెఱింగియున్. ౨౨½ 84

చ. తెలియనివాఁడు వోలెఁ బలు ♦ తీయనిమాటలఁ బల్కె నాశయం
బుల మఱి తన్ముఖంబుననె ♦ పొంకముగాఁ దెలియంగఁగోరి భూ
తలపతులార! మత్తనయు ♦ ధాత్రిని బూనఁగఁ జేయఁగోర్కె నా
కలరెడినన్న యంతనె ధ♦రాధిపుఁగా సుతు మీరుఁగోరుటల్. ౨౩½ 85

[1]సీ. హింసకుండైన యీ♦పృథివీశు పెనుబారి తప్పి మేమెల్లర ♦ మెప్పుడింక
రామునిదగు సుఖ♦రాజ్యపాలనమును గనుదుమా యనుచుఁబ♦ల్కినటునాకుఁ
దోఁచెడి; నేలముం♦దును వెన్కలెన్నక పల్కితి రిటు మీరు ♦ పల్కుటరయ
మత్పాలనం బంత♦మంచిది గాదని యో, రాఘవుఁడు సుగు♦ణోత్కరుఁడయి

తే. నన్ను మీఱెడు ననియొ, నే ♦ నెన్నఁజాల
సందియము నాకుఁ గల్గెడి ♦ డెందమందు
నేల రామాభిషేకంబు ♦ నిచ్చగించి
తిరో యథార్థంబు యోజించి ♦ తెల్పవలయు. ౨౮ 86

క. నేనఱువదివేలేఁడులు, మానితసుఖమన్నమాట ♦ మఱచుచు ధర్మం
బూనియొ, పాలింపఁగ నా,సూనుని యువరాజుగాఁగఁ ♦ జూడఁగమీరల్. ౨౯

[2]క. కోరితిరో యపరాధము, చేరెనొ నాయందదెట్లు ♦ చెపుఁడా? నాకున్
మీరన్న నాధరేశులుఁ, బౌరులు జానపదులెల్లఁ ♦ బల్కి రతనితోన్. ౨౯½

తే. ఓమహాత్మ! నృపాల! బ♦హుశుభగుణము
లెన్నియో తేజరిల్లు నీ♦కన్నకొడుకు
నందు, దేవ, ప్రశస్తగు♦ణాళి గల్గి
దేవసంకాశుఁడయి సుబు♦ద్ధిం జెలంగి. ౨౬½ 89

1 తనిశ్లోకిభాసము ననుసరించి యిందుఁ గొంత వ్రాయఁబడియె నని తెలియునది. 'రాజా నస్సంశయోఽయం మే కిమిదం బ్రూత తత్త్వతః' ౨౮. అని మూలము.

2 ఈపద్యము గోవిందరాజవ్యాఖ్యలోని సారాంశముగ వ్రాయఁబడినది.

తే. సవిధిగా వేదములనేర్చి ♦ స్నాతకంబు
చేసికొని సంప్రదాయసం♦సిద్ధవేద
ములఁ దదంగాళితోఁగూడఁ ♦ గలయనెఱిఁగె
గీతమున నెల్లరకు మించు ♦ క్షితితలమున. ౩౪౹ 96

క. జననీజనకులకులములు, జనసంస్తవనీయములగు ♦ సంతతిమాత్రం
బునఁగాక తనంతనపా,వనుఁ డెట్టి కలంతలందు ♦ భవ్యాత్ముఁడె యా. ౩౫ 97

క. మతిమంతుఁడు ధర్మార్థ, ప్రతిపాదనచతురులైన ♦ బ్రాహ్మణవర్యుల్
హితగతి శిక్షింపఁగ సం,స్తుతశీలము గల్గియుండు ♦ క్షోణీశవరా. ౩౫౹ 98

క. పురముల కేనియు గ్రామో,త్కరమున కేనియును మేలు ♦ గలుగుటకై సం
గరకృత్యము గల్గిన సో,దరు లక్ష్మణుఁగూడి యేగి ♦ తత్కార్యమునన్. ౩౬౹ 99

క. గెలుపొందియె మరలును, జయ,కలితుండయి పురికి వచ్చు ♦ కాలంబున ని
స్తులకరినే నరదమునే, నలంకరింపంగ నెక్కి ♦ యరుదెంచి తమిన్. ౩౭ 100

క. పురవాసులఁ దనజనముల, కరణిం గనుగొనుచుఁ, దండ్రి ♦ కన్నకొడుకులం
బరికించి కుశలవార్తల, నరసెడుగతిఁ బ్రశ్న చేయు ♦ నవనీశవరా. ౩౭౹ 101

చ. "తనయులకెల్ల సేమమె? స♦తంబును పావకకృత్యమెల్ల సా
గునె? ప్రియకాంతలెప్పుడును ♦ గూరిమినుందురె? భృత్యశిష్యులా
జ్ఞను జవదాటకే నడుపఁ ♦ జాలుదురే?" యని గౌరవక్రమం
బునఁ గుశలంబు నారయును ♦ బూరుషవర్యుఁ డతండు భూవరా. ౩౮౹ 102

ఆ. మమ్ముఁ గాంచి యడుగుఁ ♦ జుమ్ము "మీశిష్యులు
మీరు పనుప నరిగి ♦ మీకు హితము
లైనపనులఁ దీర్చి ♦ యనవరతము గొల్చు
చున్నవారె చదువు♦చుందురె" యని. ౩౯౹ 103

*చ. మనుజవిభూత్తమా! పురుష♦నుండనుఁడౌ రఘురాముఁ డెప్పుడున్
ధనికుఁడు బీదవాఁడు ద్విజ♦శ్రేష్ఠుఁడు శూద్రుఁ డన్న భేదముల్
మనమున నెంచకే యెడల ♦ మానవపంక్తుల కేరికేని యా
ప్పని యనుమంతకీడొదవ ♦ వారలకంటెను దుఃఖితుండగున్. ౪౦ 104

తే. ఎవరికేఁ బుత్రజననాదు♦లెల్ల యుత్స
వములు గలిగినఁ బుత్రోత్స♦వముల కలరు
తండ్రిపోలిక నెంతో మో♦దంబునొందు
సత్యవాదినుమాత్తర♦చాపధారి. ౪౦౹ 105

* వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః - అని మూలము. గోవిందరాజవ్యాఖ్య ననుసరించి యిది వ్రాయఁబడినదని తెలియఁదగు.

సీ. విజితేంద్రియుండును ♦ వృద్ధసంసేవియు స్మితపూర్వముగ మాట♦చెప్పు మేటి
సర్వభంగుల ధర్మ♦సరణి నుపాసించి కష్టంబు లెన్నియేఁ ♦ గాని రాఁగ
దానిని విడువక ♦ తానుండఁజాలును శ్రేయస్సు నొసఁగూర్పఁ ♦ జెప్పఁడెట్టి
కలహవాక్యమ్ములఁ ♦ గాని జల్పంబులఁ గాని యట్టివి యింపు ♦ గావు, వాద

తే. ముల నొనర్పంగ సమయంబు ♦ గలిగెనేని
నుత్తరోత్తరయుక్తుల ♦ నొగి సురేజ్యు
కరణిఁ బలుకును; సొగసైన♦కనుబొమలును
నలర నాయతతామ్రాక్షుఁ♦డై చెలంగు. ౮౩ 106

తే. శౌర్యవీర్యపరాక్రమ♦శాలియైన
విష్ణువే మర్త్యతం బొంది ♦ వెలసెనో యన
రాముఁడెంతయు, లోకాభి♦రాముఁ డగుచుఁ
జెలఁగుచున్నాఁడు దశరథ♦క్షితిపమౌళి. ౮౪ 107

చ. మనుజుల రక్షణార్థమగు ♦ మానితధర్మములుంగుఁ జక్కఁగాఁ
గను నిజితేంద్రియత్వము జ♦గంబుల మూఁటిని నేల శక్తుఁడై
తనరు నొకండె; యెంతయని ♦ ధాత్రిని దీనిని గాచు కార్యమా
తనికి; సమర్థ యుం గృపయుఁ ♦ దత్తదనూనఫలంబు లిచ్చెడిన్. ౮౫ 108

ఆ. సార్థకములుగాక ♦ యవి చన వొక్కప్పు, డైనఁగాని; మఱియు ♦ న్యాయరీతిఁ
జంపఁ దగినవారిఁ ♦ జంపి యేలినన, వధ్యజనులఁ గోప♦వశతఁ గనఁడు. ౮౬

క. కోరినదంతయు నొసఁగును, భూరమణా, యెవనియందుఁ♦బొందునొ మోదం;
బారాముఁ డతనికెల్లరుఁ, గోరంగాఁ దగినయట్టి ♦ గుణము లలవడెన్. ౮౭

క. శాంతప్రధానములునై, యెంతయుఁ బ్రీతిదములౌన♦వెల్లజనుల క
త్యంతగ్రీష్మంబున రవి,కాంతులచేఁ బోలె సుగుణ♦గణమున వెలుఁగున్. ౮౮

క. ఏతాదృశ్యగుణగణో,పేతుని దిక్పాలకాభు ♦ వీర్యాధికు వి
ఖ్యాతుని రాముని బ్రభువుగ, భూతరుణి చెలంగి కోరె ♦ భూపాలమణీ. ౮౯

క. మనుజేశ నీయదృష్టం,బున మా శ్రేయస్సుకొఱకుఁ ♦ బుట్టెను నీకున్
దనయునకు వలయుగుణములఁ, గననో మారీచుఁడైన ♦ కాశ్యపుకరణిన్. ౯౦

సీ. సురలు మానులు రాక్ష♦సులును గంధర్వులు సర్పమ్ము లితరదే♦శముల జనులుఁ
బౌరులంతఃపుర♦వాసంబు సేసెడివారుఁ, దక్కినచోట్ల ♦ వఱలువార
లీపురంబుననున్న ♦ యెల్లరు మనదేశముననున్నయందఱు ♦ ననఘశీలుఁ
డైనరామునకు బ♦లారోగ్యముల నాయువును సమకూడనో ♦ యనుచు వేఁడు

తే. చుందు రింకను వార్ధక♦మొందినట్టి
స్త్రీలుఁ బ్రాయములో మించు ♦ చిగురుఁబోఁడు

లిష్టదులగు దైవంబుల♦కెల్ల రాము
యశమునుం గోరి మ్రొక్కుడు ♦ రహరహంబు. ౫౨ 114

క. వారలు ముదమునఁ గోరెడి, శ్రీరామునిఁ బట్టభద్రుఁ ♦ జేయు మహాత్మా
భూరమణా! నీకరుణా, సారమునన్ వేగిరంబ ♦ సఫలంబగుతన్. ౫౨౫ 115

చ. కలువలరీతి నల్లనయి ♦ గాత్రము మీఱఁగ శత్రుహంతయై
వెలసెడు నీకుమూరు రఘు♦వీరుని రాముని యౌవరాజ్యసం
స్థులలితరూపుఁ బ్రీతిమెయిఁ ♦ జూతుము, భూవరమౌళి, నీవు కో
ర్కులఁదమిఁ దీర్చువాఁడవిదె ♦ కోరిక లోకహితంబుఁ గూర్పఁగన్. ౫౩౫ 116

చ. ధరణి జనించి నిర్జరవి♦తానవిభుండగు విష్ణుమూర్తికిన్
సరియయి, గొప్పబుద్ధియు, నె♦సంగఁగ నొప్పు భవత్కుమారునిన్
గరమనురాగమొప్పఁ ద్వర♦గా యువరాజుగఁ జేయవయ్య, మా
కరయ హితంబుగాఁ దగుట ♦ నయ్యభిషేకముఁ జేయఁగాఁదగున్. ౫౪౫ 117

రెండవ సర్గము సంపూర్ణము.

---

## 3 - వ సర్గము.

పట్టాభిషేకమునకు వలయువస్తువులం గూర్చుట.

క. సరసిజముకుళాకృతులం, బరఁగెడు నంజలులు మీఱఁ ♦ బ్రజలును ధాత్రీ
శ్వరులును జేయు నమస్కృతు, లరహిన్ గ్రహియించి వార♦లంగాంచితమిన్.

క. హితమును బ్రియముగా నా,క్షితిపతి దశరథుఁడు వల్కె ♦ జ్యేష్ఠుండగు నా
సుతునిం బ్రియయువరాజుగ, హితకరుఁ గోరితిరి ప్రీతి♦యెంతయుఁ దనరెన్.

తే. ఔర! నాభాగ్యమసమాన ♦ మాఁగద యని
సభ్యులౌ బ్రాహ్మణులవారి ♦ సరసవచన
ములనె యలరించి యాబ్రాహ్మ♦ణులు వినంగ
వామదేవు వసిష్ఠము♦హామునీంద్రు. 3 120

చ. [1]కనుగొని చైత్రమాస మిది ♦ కమ్రసుఖాకరమై సమస్తపు
ష్పనికర శోభితాటవిగ ♦ భాసిలి మంగళవాద్యసంతతిం
బొనరుచ నర్హమై మిగులఁ ♦ బుణ్యదమై తగియున్నదింపు రా
ముని ఘనయౌవరాజ్యమునఁ ♦ బూన్పఁగ నర్హము మీర లిత్తఱిన్. ౪ 121

క. వలసినయట్టి పదార్థం,బుల సమకూర్పుఁడని పలికి ♦ భూపతి విరమిం
ప లలిన్ జనఘోషమ్ములు, నెలసెన్ నిర్భయములగుచు ♦ వింతగ నంతన్. ౪౫

---

1 చైత్రశ్శ్రీమానయంమాసః పుణ్యః పుష్పితకాననః-అనిమూ. దీనివిశేషార్థము లిందు సంక్షి
ప్తములు.

క. జనఘోషము మెల్లఁగ శాంతిని బొందిన దశరథుండు ♦ నెమ్మి వసిష్ఠున్
మునిచంద్రు వామదేవునిఁ, గని యిట్లనిపల్కె వేడ్క ♦ గదలుకొనంగన్. ౫

క. మునివర్యులార! శ్రీరాముని యభిషేకార్థకర్మ♦ముల నెవ్వానిన్
బొనరుపఁ దగునో వానికి, ననువౌ పరికరము లేవొ ♦ యావిధ మెల్లన్. ౬

తే. ఆనతియ్యంగవలయు నా♦కనిన రాజు
పల్కు లాలించి బ్రాహ్మణ♦వర్యుఁడౌ వ
సిష్ఠుఁ డిట్లనిపల్కె నా♦క్షితిపుమ్రోల
నిలిచినట్టి సుమంత్రము♦ఖ్యులను గాంచి. ౭ 125

సీ. అవనీశు కార్యంబు ♦ లాచరింప నియుక్తు లౌట వారలు రాజు ♦ నాజ్ఞ రీతి
మెలఁగంగఁ దగునని ♦ నిలిచి యుండిరిగాన వారల కనియె బం♦గారులోను
గాఁగలవానిని ♦ గ్రస్తరత్నంబుల వ్రీహిముద్గాదుల ♦ విమలములగు [ను
నుపహారములఁ బూజ ♦ కొప్పెడు వస్తువులను శ్వేతమాల్యంబు♦లను మఱియు
తే. లాజలను వేఱువేఱుగ ♦ లలితమధువు, నెయ్యి నొక్కొంతయుదికిన♦నిర్మలనవ
వస్త్రములు స్యందనమ్ము ది♦వ్యమ్ములైన, యాయుధంబులఁ జతురంగ♦మైన సేన.

ఆ. మంచిలక్షణములు ♦ మించిన నేనుఁగుఁ, జామరాకృతుల నె♦సంగు వీవ
నలను శ్వేతవర్ణ♦ములు; ధ్వజంబును, సితచ్ఛత్ర మతిరుచిప్ర♦శస్తతరము. ౧౦

చ. అనలుని రీతిగా మెఱయు ♦ నట్టిహిరణ్మయకుంభముల్ శతం
బును; నవహేమశృంగములఁ ♦ బొల్పగు నెద్దును; వ్యాఘ్రచర్మమున్
దనయుఖిలాంగముల్ గలుగు ♦ దాని; మహీపతి యగ్నిమందిరం
బునఁ దగఁ జేర్పుఁ డిన్నియును ♦ బూర్వగిరిన్ రవి చేరునంతలోన్. ౧౧ 128

చ. పరిమళగంధపుష్పముఖ ♦ భవ్యసువస్తువులన్ మఱివ్వికా
ర్యరతిని బొందునట్టి సమ♦యంబునఁ గోరఁగనౌనొ వానినిన్
వరుసఁగఁ గూర్పుఁడీ నృపుని♦భాసురసౌధమహాంగణంబులన్
సురుచిరగంధపుష్పముల ♦ శోభిలఁ జేయుఁడు ద్వారపంక్తులన్. ౧౨ 129

క. నగరద్వారంబుల నుంచిగంధముం జిల్కరించి ♦ చెచ్చెఱ సుమహా
రగణములం గట్టింపుఁడు, సొగసగు వాసనలు గల్గి ♦ మాడ్కులవిందై. ౧౩ 130

క. తనరారు ధూపముల నెల్లను వేయం బనుపుఁడాన్య♦లన్ భూసురులన్
ఘనులన్ లక్షలుగా వచ్చిననైనన్ భక్తిఁబూజ ♦ చేయింపఁదగున్. ౧౪

సీ. మఱియు వారలకెల్ల ♦ మనసులు తృప్తియౌ కరణిఁగా స్వాదుతఁ♦గ్రాలి మిగుల
నందమై తగినట్టి ♦ యన్నంబు దధిపయస్సంస్కృతంబుగఁ జేసి ♦ సరసములగు

---

* అహతాని చ వాసాంసి-అని. మూ. ఈషద్ధౌతం నవం శ్వేతం సదశం యన్న ధారితం, అహతం తద్విజానీయాత్ ద్వైవే పిత్ర్యే చ కర్మణీత్యుక్త జలప్రక్షాళనాదిసంస్కారయుక్తాని. అను వ్యాఖ్యకిది తెనుఁగు.

వ్యంజనంబులఁ గూర్చి ♦ వైళంబ యెల్లియే పెట్టింపుఁడీ నెయ్యి ♦ పెరుగు,లాజ
లధికదక్షిణలను ♦ హర్షంబుఁ బొందంగ నిండు రేపు విభాక♦రుండు తూర్పు

తే. శైలయోగంబుఁ గాంచిన ♦ స్వస్తివాచ
నము జరగుఁ, గాన బ్రాహ్మణో♦త్తములఁ బిలువ
నంపుఁ డవ్వారికిందగు ♦ నాసనముల
నర్హతమములఁ గూర్పుఁడీ ♦ యతిరయమున. ౧౬ 132

క. కెక్కెంబులఁ గట్టింపుఁడీ, యొక్కొక్క గృహంబునందు ♦ నొగి జనములచేఁ
గ్రిక్కిరిసిన రాణ్మార్గం, బొక్కమొగిం దడుపఁబనుపుఁ ♦ డురుజలధారన్. ౧౬౹

క. మనుజపుసౌధాంతఃకక్ష్యను [1]భూమీత్రిదశులెల్ల ♦ నభిషేకముచే
యను బూనియుందు రటుగావున రెండవకక్ష్యయందుఁ ♦ బొలుపగురీతిన్.

తే. నటులు గాయకులును వార♦నారులును ద
గంగఁ గై చేసికొని వచ్చి ♦ కాచియుండ
వలయు; నన్నముఁ బిండివం♦టలను బెట్టు
వారి దక్షిణలిచ్చెదు♦వారి మఱియు. ౧౭౹ 135

సీ. పూలహారములీయఁ ♦ బూనినవారిని వేఱువేఱుగఁ బంపి ♦ వివిధదేవ
తాలయంబులయందు ♦ నాలుగుత్రోవలు కలియు తావులయందు♦లలితరాజ
మార్గమందలి వృక్ష♦మండలమ్ముల కడ నిలిపి, వచ్చెదు బ్రాహ్మ♦ణులకు నితర
జాతులవారికిఁ ♦ బ్రీతిదక్షిణలిచ్చి యన్నము మొదలగు♦నట్టి భక్ష్య

ఆ. వస్తువుల నొసంగు ♦ భంగిఁ జేయఁగదగు
నిడుద ఖడ్గములను ♦ నడుమునందుఁ
గట్టి సుప్రయత్న♦కలితులై, ధౌతాంబ
రములఁ దాల్చి భటులు ♦ తుముల మడప. ౧౮౹ 136

క. రాముని యభిషేకోత్సవ, మామోదము మీఱ జరగు♦నట్టి దశరథ
క్ష్మారమణ లేశు గృహావర, సీమలఁ జొరవలయు నట్లు ♦ చేయుఁడు మీరల్.

చ. అని దృఢనిశ్చయంబు గల♦యట్టి వసిష్ఠుఁడు వామదేవుఁడో
య్యనఁ దమయాశయంబులకు ♦ నాదృతిఁ బొందఁగఁబల్కి యందుఁ దా
మును నొనరింపఁగాఁ దగిన ♦ భూరిశుభావహకృత్యరాశి నె
ల్లను సచివాళికిం దెలియు♦లాగునఁ జెప్పి యనంతరంబునన్. ౨౦౹ 138

క. మిగిలిన కార్యంబుల నా,జగతీశున కెఱుకపఱచి ♦ చయ్యనఁ జేయం
దగినట్టివాని నొనరిచి, జగతీశునిచెంత కరిగి ♦ సంతసమొప్పన్. ౨౧ 139

1 భూమీత్రిదశులు - భూమీశబ్ద మీకారాంతముకలదు. కృదికారాదక్తినః ఇతిజీష్. అని శబ్దకల్పద్రుమము.

తే. చేయఁదగువాని నెల్లను ♦ జేసినార
మనుచు మనమునఁ బొంగెడు ♦ హర్షమునను
గలుగు రోమాంచములతోడఁ ♦ బలికె మీఁయ
నుమతి చొప్పున నైనద♦నుచు వచింప. ౨౧౪ 140

చ. మునివరులాడు పల్కులను ♦ మోదమునన్ విని యాసుమంత్రునిం
గనుగొని సంతసంబున వి♦కాసముఁ బొందిన మేనుతోడ ని
ట్లనియె సుశిక్షితాత్ముఁడగు♦నట్టి మనోహరరూపు రాముఁడో
డ్కొని త్వరితంబ రమ్మిటకుఁ ♦ గోరిక పుట్టెడుఁ బుత్త్రుఁ జూడఁగన్. ౨౨౪ 141

క. అన నట్లే యని మంత్రియు, జనపతి యనుమతిని బోయి ♦ స్యందనమున రా
ముని రథికవర్యుఁ దోడ్కొని, చనుదెంచెను రాజుకడకు ♦ సరభసమొప్పన్.

సీ. సచివుండు రాముని ♦ సదనంబునకు నేగ నాసభలోనున్న♦యట్టి తూర్పు
దేశవిభుల్ యామ్య♦దిఙ్నరపతులు పశ్చిమదేశవిభు లుత్త♦రమున నున్న
దేశపతుల్ మ్లేచ్ఛ♦దేశవిభుల్ మఱి వనపర్వతస్థలు♦లను వసించు
నాటవికులు నంద ♦ అమరులు దేవేంద్రుఁ గొలిచెడురీతి న♦క్కునలమపతి

తే. దశరథునిఁ గొల్చి రంతఁ ద్రి♦దశులనడుమ
వఱలుచున్నట్టి వాసవు♦భంగి వారి
యంతరమ్మున వెలయుచు♦న్నట్టి నృపుఁడు
మేడపై నుండి యరదంబు ♦ జాడఁ గనియె. ౨౬౪ 143

క. తరువాత స్యందనమ్మున, నరుదెంచెడు రామచంద్రు ♦ నాత్మజుఁ గాంచెన్
వరరూపవేషముల సుందరుఁడౌ గంధర్వపతికిఁ ♦ దా సముఁ డగుచున్. ౨౭

చ. తనరుచు రామచంద్రుఁడును ♦ ధాత్రిఁ బ్రసిద్ధిని గన్నపౌరుషం
బునఁ దగి దీర్ఘబాహువుల ♦ భూషితుఁడై సుసుమార్దవంబునం
దనరియు గాఢసత్త్వమునఁ ♦ దద్దయుఁ జూడఁగనొప్పి, గర్వియు
క్తిని దగు హస్తివోలె నతి♦ధీరతఁ గాంచు గతుల్ చెలంగఁగన్. ౨౭౪ 145

చ. హిమకరు బింబమో యనఁగ ♦ నెంతయుఁ గాంతిని బెంపుమీఱుచు
న్న మొగముతోడ నొప్పుచు న♦నారతముం గనినన్ మఱింత చి
త్రముగఁ గనుంగొనం దగు వి♦ధంబునఁ గ్రాలుచు, రామచంద్రుఁ డొ
ప్పు మహితరూపసద్గుణ వి♦భూతులదాతృతఁ జెల్వుమీఱుచున్. ౨౮ 146

తే. పూరుషులఁగూడ మోహిత♦బుద్ధులైన
వారిగాఁ జేసి దృష్టుల ♦ వారి మనసు
లను హరించి చెలంగెను; ♦ జనుల ఘర్మ
తప్తులను సేదదేర్చు వ♦బ్దంబు భంగి. ౨౯ 147

క. జనులకుఁ జల్లందనమును, వనయము గల్గించువాని ♦ నారాముని స్యం

దనముపయి వచ్చువానిని, గని తృప్తిం గాంచఁడయ్యె ♦ ధాత్రీవిభుఁ డంతన్.

క. అరదంబునుండి రామునిఁ, గరదండ మొసంగి దించి ♦ గాదిలితండ్రిన్
బరమాదృతిని గనంబో,వ్రురాము వెనువెంట మంత్రి♦పోయె వినతుఁడై. ౩౦

సీ. కైలాసశిఖరంబు♦కరణి శ్వేతాభమై పరఁగు రాజౌసధంబు ♦ పైకినెక్కి
సూతునితోఁ బోయి ♦ చేతులు ముకుళించి తండ్రిచెంతకుఁ జొచ్చి ♦ తగినరీతిఁ
బ్రాంజలియై, రాముఁ ♦ డాత్మనామము వర్మశబ్దాంతముగఁజెప్పి ♦ చరణములకు
వందన మొనరించె ♦ వసుమతీశుఁడు తన కంజలిఁ బూని సా♦ష్టాంగవంద

ఆ. నమ్ము చేసి ప్రక్క♦న న్నిలుచున్నట్టి, ప్రియకుమారుఁ గాంచి ♦ ప్రీతినతని
యంజలిని గ్రహించి ♦ యతివేగ చేరంగఁ, దిగిచి కౌఁగిలించి ♦ దృప్తిమీఱి.

క. హారితరం బున్నతము మ,హారజత*మణీఖచితము ♦ నతిరుచిరము నౌ
భారంజిత దివ్యాసన, మారాముస కొసఁగె నాతఁ♦డటఁ గూర్చుండన్. ౩౨

క. కనకాసనమున నొప్పుచుఁ, దనకాంతుల మేరుపర్వ♦తము రవియుదయం
బునఁ బొంది వెలయఁజేసెడు, ననువున స్వప్రభను దాని ♦ నట నలరించెన్.

క. శారద నిశ నమలగ్రహ, తారాన్వితమౌ నభంబు ♦ తారానాథుం
డేరీతిన్ వెలయించునో, యారీతిన్ సభను దాని ♦ నతఁడలరించెన్. ౩౪

తే. తానలంకృతుఁ డగుచు న♦ద్దమున స్వీయ
బింబమును గాంచి ముదమందు ♦ విధమునఁ దన
ప్రియతనూజుని గని వృద్ధ♦విభుఁడు మదిని
నురు ముదమ్మందెఁ దనవలె ♦ నుండు ననుచు. ౩౫ 154

చ. అరయఁగ బుత్రవంతులగు♦నట్టి మనుష్యులలోన నెక్కుడై
పరఁగు మహీధవుం డతఁడు ♦ బాలక! రామ! యటంచు సుస్మితం
బు రమణఁ గ్రాలఁ బిల్చి సుర♦పూగవిభుండగు వజ్రితో మునీ
శ్వరుఁడగు కాశ్యపుండు మును ♦ వల్కినరీతి వచించె నివ్విధిన్. ౩౬ 155

క. రామా నాకనురూపిణి, యౌ మానిని పెద్దభార్య ♦ యలరుఁగదా యా
రామామణియందు నిను్న్, నామాఢ్యుం జెలఁగువాని ♦ నాభాగ్యవిధిన్. ౩౭

క. కనినాఁడ నీవు సుగుణా, ళిని శ్రేష్ఠుఁడవైతి మఱి ల♦లితమతివి తనూ
జనికరమునఁ బ్రియుఁడవు నీ,వు నిజగుణావళిని బ్రజల♦భూరిముదంబున్. ౩౮

క. కనఁజేసితి; మేమెల్లను, మనసుల రంజిలితి మింక ♦ ధాత్రీభారము పూ
ననగు సమయంబువచ్చెను, గనుకన్ యువరాజ్యపదముఁ ♦ గైకొనవలయున్.

తే. పుష్యనక్షత్రమును గూడు ♦ పుణ్యదివస
మందునన్ యౌవరాజ్యంబు ♦ నొందు; మీవు

* మణిశబ్దము గలదు. శబ్దకల్పద్రుమమునం దిట్లున్నది. మణీ. ఈ. స్త్రీ. కృదికారాదక్తినః
ఇతిఙీషే జీష్.

నైజముగ వినయగుణంబు♦నం దనరుదు
వింకనుఁ గుణవంతుఁడ ♦ వెన్నిచూడ. ౮౧ 159

సీ. సరసగుణావళిఁ ♦ బరగుదు వటుకాన నుపదేశమొనరింప ♦ నొకటియుఁ గలు
గదుగాని స్నేహంబు♦గలుగుట నీకొక్క హితము చెప్పెద విను♦మెలమిఁబుత్ర
యింకను వినయంబు ♦ నేపొంది యెప్పుడు నింద్రియాళిజయించి♦యే చరింపు
కానుగుణంబునఁ♦గలుగు స్త్రీద్యూతమ్ములను వేఁటయును, బాన♦మును ద్యజింపు

తే. పరుషవాగ్దండనాదులఁ ♦ బ్రబలములగు
వ్యసనములఁ గ్రోధజమ్ముల ♦ వెసఁ ద్యజింపు
మీవు సామాన్యులయినట్టి ♦ సేవకులకుఁ
గానరాక పరోక్షము♦గా వసించి. ౮౨ 160

ఆ. మంత్రిముఖ్యులైన ♦ మానితాధికృతుల
మూలముననె యాజ్ఞఁ ♦ బోలనొసఁగి
పనులనెల్లఁ జేయఁ♦బనుపుము సచివాదు
లకును గాన నొచ్చుఁ ♦ బ్రకటమైత్రి. ౮౩ 161

క. కలిసియె వర్తింపుచు నీ, పలుసిన కార్యములఁ దగిన♦భంగిం జేయం
గలయట్లు చేయుచుఁ బ్రకృతులు మెల్లగు సానందముండు♦రీతి మెలఁగుమా. ౮౪

తే. ప్రజలు సధికారులును బర♦స్పరము మైత్రి
గలిగి యుండెడురీతిని ♦ మెలఁగవలయుఁ
గాన నారీతి నూల్కొని ♦ గడుఁ జనప్రి
యను మెలంగుము గాదిలి♦తనయ ! నీవు. ౮౫ 163

చ. పలువిధధాన్యరాసులను ♦ బాగుగఁ గొట్టులు, నాయుధాలయం
బులు వివిధాయుధావళులఁ ♦ బ్రోగుగఁ గూరిచి దానిచేఁ బ్రజా
వళికి ముదంబుఁ గూర్చుచును ♦ వారనురక్తులుగా నెసంగ ని
య్యెల నెవఁడేలువానిఁ గని ♦ యెంతయు సంతస మొందుచుందు ర
క్షవేళసుధఁగన్న దేవతల♦భంగిని మిత్రులు గాన నీవొగిన్. ౮౬ 164

ఆ. మనసు నిగ్రహించి ♦ మానుగ నటుచేయు
మనియె; రామునకుఁ బ్రి♦యంబుఁ గూర్చు
సఖులు దానిని విని ♦ సరగఁ గౌసల్యను
గానఁ బోయి యచట ♦ కార్యరీతి. ౮౭ 165

క. తెలిపిరి యానారీమణి, యెలమిని బుట్టించువార్త ♦ నెఱిఁగించిన వా
రల కొసఁగె హేమరత్నం, బుల గోవుల సంతసంబు ♦ పొంగుచు నుండన్.

క జనకున కంతట రాముఁడు, వినయంబున మ్రొక్కి జనులు ♦ వేడుకఁబూజల్
తనకు నొసఁగ స్యందనము నెక్కి తనదివ్యసౌధ♦మునకుం జనియెన్. ౮౮

చ. పురజను లవ్విధిం బలుకు ♦ భూవిభువాక్యము లాలకించి ని
ర్భరహృదయేచ్ఛలం గనిన♦భంగిని మోదమునొందుచుక్ నరే
శ్వరవరునొద్ద నాజ్ఞఁగొని ♦ సత్వర మాత్మగృహాళిఁ జేరి ని
ర్జరులను బూజఁదన్పిరి ప్ర♦శస్తముగా నభిషేక మాటకుక్. ౪౯ 168

మూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౪ - వ సర్గము.

దశరథుఁడు రాము నభిషేకమునకుఁ బ్రోత్సాహపఱచుట.

క. పౌరులు చనినంతన యా, భూరమణుఁడు మరల మంత్రి♦పుంగవ యుతుఁడై
కోరికమెయి యోజించెఁ గు, మారున కభిషేకరూప ♦ మహము నొనర్పక్. ౧

తే. కార్యనిశ్చయకుశలుండు♦గాన నృపతి
యెల్లియే పుష్యనక్షత్ర ♦ మేగుదెంచుఁ
గాన రాజీవతామ్రాక్షు♦సూను రేపు
యౌవరాజ్యంబునం బూన్ప♦నగును జుండి. ౨ 170

క. అని నిశ్చయించి మంత్రులుఁ, చన నంతఃపురముఁ జొచ్చి ♦ సచివు సుమంత్రుం
డను సూతుఁ గాంచి శ్రీరా, ముని మరలం దోడితేరఁ ♦ బొమ్మా యిటకుక్. ౩

మహాస్రగ్ధర. అని యాజ్ఞాపింప సూతుం♦డధిపుని దగువా♦క్యంబు మన్నించి శ్రీరా
మునిఁ దోడ్తేరంగ వేగం♦బునఁ జనె మరలక్ ♦ బూన్కిఁ దత్సౌధరాజం
బున కంతక్ ద్వారదేశం♦బునఁ గల సుభటుల్ ♦ పోయి యవ్వార్త చెప్పం
గనె సూతుం డేలవచ్చెం ♦ గడువడి మరలం ♦ గారణం బేమియుండుక్. ౪

చ. అని యనుమానమొంది మది ♦ నప్పుడ సూతునిఁ బిల్వఁబంచి యా
తనిఁగని రాముఁ డిట్లనియె ♦ దాఁపక చెప్పుము యంతయుక్ జవం
బున మరలక్ ద్వదాగమన♦ముక్ దగ సూత యటన్న రాముని
గని వచియించె రాజు నినుఁ ♦ గాంచఁ దలంచినవాఁడు రాఘవా. ౫ 173

క. అనిపలికి సూతుఁ డవనీ, శుని వాక్యము వింటి వీవు ♦ శుభగుణధామా
చనుటకుఁగానీ మఱి దే, సిని జేయుటకై నఁగాని ♦ నీవె పతివి సూ. ౬ 174

క. అని యిటు కర్తృత్వంబును, దనపై నిడి యాతఁడు పలుక ♦ దాని న్విని చ
య్యనఁబోయె మరల రాజుం, గనుటకు రాముండు పిదపఁ ♦ గావలివారల్. ౭

క. లోపలికిం జని రాముఁడు, భూపాలక వచ్చి ద్వార♦భూమి నిలిచె నా
వే పిలువనంపెఁ దనయుని, క్ష్మాపతి ప్రియవార్తఁ దెలుపు♦కాంక్షఁ బాలయుఁగక్.

క. సిరులలర నొప్పు రాముం, డురుభక్తిం దనదుతండ్రి ♦ యున్నగృహము స
త్వరగతిని జొచ్చుచునె యా, ధరణీశున కెరఁగి సుంత♦దవ్వున మఱియుక్. ౧౦

క. కరయుగము మోడ్చి వినయము, కరంబు వెలయుంగఁ దండ్రిఁ ♦ గాంచెను బ్రీతిన్
ధరణీశుఁడు తనచేరువ, కరుదెంచి నమస్కరించు ♦ నాత్మజు నపుడే. ౧౦౪

ఆ. ఎత్తి కౌఁగిలించి ♦ యెంతయు సుచిరమౌ,పీఠ మొసఁగి మరలఁ ♦ బ్రియకుమారు
తోడఁ బలికె వేడ్క ♦ తో నాయనా! నేను, బ్రదికినాఁడ బెక్కు ♦ వత్సరములు.

క. జరనొందితి భోగంబుల, వరుసగ నేననుభవించి ♦ వాంఛానుగతిన్
బరితుష్టి నొందితిని న,ధ్వరశతముల శాస్త్రసరణి ♦ దప్పకయుండన్. ౧౧౪

క. నిరతాన్నదానముల ని,ర్భరతృప్తిని బొందఁజేయు ♦ బహుదక్షిణలన్
ధరణీసురు లలరఁగ ని,ర్జరులాదృతిఁ జూపుచుండ ♦ సాగించితిఁ జూ. ౧౨ 181

చ. తనయుఁడ వీవు గల్గితివి ♦ ధాత్రి సమానము లేనివాఁడ విం
కను బహుభంగి దానములఁ ♦ గాంక్షలరీతిని జేసినాఁడ వి
ద్యను గ్రహియించినాఁడను సు ♦ ఖాఃవలి నిష్టమురీతి శాస్త్రనిం
దను గనకుండఁ బొందితిని ♦ ధాత్రిఁ గొఱంతయె లేదు నాకిఁకన్. ౧౩౪ 182

సీ. క్రతుకరణంబునఁ ♦ గ్రతుభుజులఋణంబు నధ్యయన మొనర్చి ♦ నందుచేత
మునులఋణంబును ♦ నినుఁ గన్నకారణంబునఁ బితరులఋణ ♦ మును బహూప
యుక్తదానంబుల ♦ నొనరించినందున బ్రాహ్మణులఋణంబుఁ ♦ బాసె; నింక
భూరిసుఖంబులఁ ♦ బొందితిఁ గావునఁ దనువునకగు ఋణ ♦ మును దగంగఁ

తే. బాసె నన్నియు నెఱవేఱెఁ ♦ బట్టభద్రుఁ
గాఁగ నినుఁ జేయుటొక్కటి ♦ గాక తక్కు
కార్యములఁ జేయు టేమియుఁ ♦ గానరాదు
కాన నేనేమి చెప్పిన ♦ దానినీవు. ౧౫ 183

క. నాకొఱకుఁ గానె చేయుము, గాక కుమారా! ప్రజాని ♦ కాయము నిన్నున్
త్మాకాంతునిగాఁ గోరెడి, నాకారణమునను నిన్ను ♦ నభిషేకింతున్. ౧౬ 184

క. నిను యువరాజును జేయం,గ నున్నవాఁడన్ మఱొక్క ♦ కారణమును గ
ల్గినయది యిప్పుడు స్వప్నం,బునఁ దోఁచుచు నున్నవశుభ ♦ ములగు శకునముల్.

సీ. భయదంబులైన యు ♦ త్పాతముల్ గనుపించుచున్నవి దివమున ♦ నుండి యంబు
దములేని నిర్ఘాత ♦ తతులతో నిర్గతజ్వాలలతోడ ను ♦ ల్కాళి గొప్ప
చప్పుడుతోఁ బడ ♦ సాగె నాజన్మర్క్షమును గ్రూరతరులైన ♦ యినకుజులును
రాహువునెడి యీ ♦ గ్రహములు మూఁడాక్రమించియున్నవియని ♦ యెంచిదైవ

తే. విదులు వచియించెదరు రాము ♦ వినుము యిట్టి
యపశకునములుగల్గిన ♦ నధిపుని మృతి
కల్గుఁ బ్రాయికముగ; నట్లు ♦ కాకయున్న
నెద్దియో గొప్పయాపద ♦ యేనికలుగు. ౧౮ 186

మ. వినుమా ప్రాణులబుద్ధి చంచలము నా♦వృత్తాంత మిట్లుండుఁగా
వున నిన్నిప్పుడు యౌవరాజ్యపదవిం ♦ బూన్పంగ నాబుద్ధి యొ
ప్పెను నాకుంగలయూహ యిద్ది, తనయా ♦ భేదం బిటం బొందకుం
డనె ముందే యభిషేకసంపదను, బూ♦నంగాఁ దగుఁ నీవొగిన్. ౨౦ 187

ఆ. పుష్యపూర్వమగుచుఁ ♦ బొలుచు పునర్వసు
వందు నేఁడు వెలయుఁ ♦ జందురుండు
మనము నిశ్చయించు♦కొనిన పుష్యర్క్షయో
గమ్ము రేపటంచు ♦ గణకు లనిరి. ౨౧ 188

సీ. కావునఁ బుష్యన♦క్షత్రంబునం దభిషిక్తుండ వగుము నా♦చిత్తమె నను
త్వరపెట్టునట్లున్న♦దరయఁ బరంతపా! యౌవరాజ్యంబున♦యందు రేపు
నిన్నభిషేకింతు ♦ నేను గావున నియతాత్ముండవై యిపు♦డాదిగాఁగ
దర్భసెజ్జఁ బరుండి ♦ దారతో నీరాత్రి యంతయు నుపవాస ♦ మాశ్రయించి

తే. యుండవలయును శ్రేయస్సు ♦ నొసఁగు నిట్టి
గొప్పకార్యంబులకు నెన్నఁ ♦ దప్పకుండఁ
బలువిధములను విఘ్నముల్ ♦ గలుగుఁగాన
నీదుసఖు లప్రమత్తులై ♦ నేఁడు నిన్ను. ౨౨ 189

క. నలువంకల నుండుచును స,కలవిధములఁ గాచుచుండ్రు ♦ గాక కుమారా
పలుకొక్కటి విను భరతుం, డలరుచు దేశాంతరమున ♦ కరిగెంగాదే. ౨౩

తే. ఈపురికి వాఁడు రాకుండు♦ నెంతవఱకు, నంతదనుకనె యభిషేక♦మాచరింపఁ
దగినకాలము నీకని ♦ తలఁచువాఁడ, నిపుడు తోఁచెడి నామది ♦ నిట్లు రామ!.

*చ. అని మును తాను కేకయధ♦రాధిపుకూఁతును బెండ్లియాడ నెం
చినతఱి రాజ్యమానృపతి ♦ జిష్ణున కొలిగ నిచ్చి కైకనుం
గొనియెను భార్యఁగాఁగఁ దన♦కోరికపెంపున నట్టిమాట నె
మ్మనమునఁ దోఁప నిట్టు లను♦మానము నొందుచు నాడి వెండియున్. ౨౪

చ. తనయునకేమి తోఁచునొకొ ♦ తండ్రియె యిట్లనుటేటికంచు దా
నిని వెసఁ గప్పిపుచ్చఁదగు ♦ నేననిపల్కెను రామచంద్ర నీ
యనుఁగుసహోదరుండు భర♦తాహ్వయుఁ డెంతయు సజ్జనాళి మ
న్ననఁగను వృత్తమందునె మ♦నంబును నిల్పుచు నాచరించెడిన్. ౨౫ 193

క. తనకంటెఁ బెద్దయగు ని,న్ననవరతము ననుసరించు ♦ నతిశయకరుణన్
గనువాఁడు నిర్జితేంద్రియుఁ, డనఁబడఁదగు ధర్మమతియు ♦ నగును గుమారా!

* ఈపద్యమందలివృత్తాంత మిటఁ జెప్పఁబడకున్నను గోవిందరాజులవ్యాఖ్య ననుసరించి వ్రాయఁబడినది. ఈవిషయ మీకాండమున నూటయేడవసర్గమున మూఁడవశ్లోకమున "పురాభ్రాతః పితానస్స మాతరం తే సముద్వహన్." అనుదానిచేఁ జెప్పఁబడినదని గ్రహింపఁదగు.

క. ఐనఁ జాలసామాన్యముగా, మానవులమనంబు నొక్క ♦ మార్గము గనకే
నానాభంగులఁ జపలము, గా నుండునటంచు నమ్మ ♦ కము నాకెపుడున్. ౨౬

సీ. ధర్మమ్మునందె ని ♦ త్యమ్ముఁ బ్రవర్తించు సజ్జనవశ్యుల ♦ స్వాంతమెన్నఁ
గాఁ బరస్పరముప ♦ కారము చేయుట దానినే తలపోయుఁ ♦ గాని భేద
మేమాత్రమే నొంద ♦ దీవు రఘువంశజనితుండవౌట దీ ♦ ని నెఱుఁగుదువ
టంచు రేపటిదగు ♦ నభిషేకమునుగూర్చి యనుపదించి నరేంద్రుఁ ♦ డతనికింక

తే. నింటికిం జనుమని యాన ♦ తీయ రాముఁ
డతనికభివందనముచేసి ♦ యాత్మసదన
మునకుఁ జని సౌధమును జొచ్చి ♦ తనజనకుఁడు
చేయఁదలఁచిన పట్టాభి ♦ షేకగీతి. ౨౭ 196

క. తనతల్లికి తెలిపింగింపం, జనుమని తత్క్షణము కదలి ♦ జననీసౌధం
బున కేగె నంత నట న,వ్వనితానారియుత్ దుకూల ♦ వస్త్రలలితయై. ౨౮ 197

ఆ. దైవగృహమునందు ♦ ధ్యానంబున నభీష్ట, దైవమును వలంచి ♦ తద్గతాత్మ
యగుచు మౌనమూని ♦ యాత్మజునకు సిరి,గలుగఁ బ్రార్థనంబు ♦ సలుపుచుండె.

మ. రాముఁడు రాకమున్నె యువ ♦ రాజుగ నాతనిఁ జేయువార్త నెం
తో ముదమొప్పుచుండ విని ♦ తొయ్యలిమిన్న సుమిత్ర యప్పుడే
యామహిళామణిం గనఁగ ♦ నచ్చటి కొయ్యనవచ్చె లక్ష్మణుం
డామెయువచ్చెఁ జేసి యల ♦ నంపినవచ్చెను భూమిపుత్రియున్. ౩౦ 199

సీ. అపుడు కౌసల్యపు ♦ ష్యమియందుఁ దనపుత్త్రుయౌవరాజ్యాభిషే ♦ కాఖ్యమహము
జరగునంచని విని ♦ జానకియు సుమిత్రయును లక్ష్మణుండును ♦ దను గొలువఁగఁ
బూనిక్కఁ బ్రాణాయామ ♦ పూర్వకంబుగ భక్తిఁ బురుషసూక్తోక్తునిఁ ♦ బురుషశబ్ద
వాచ్యనారాయణు ♦ వనుసధ్యానించుచుఁ గనునమ్మలనుమూసి ♦ కొనియుండె

తే. నట్లు శుభనియమంబున ♦ నలగు తల్లి
యొద్దకుంబోయి శ్రీరాముఁ ♦ డుర్వి మీను
పోఁకఁ బ్రణమిల్లి యామె క ♦ ష్టోక్తి మోద
మును గలుగఁజేయుచుంబల్కె ♦ జనని వినుము. ౩౪ 200

క. జనకుండు ప్రజారక్షణ, ఘనకృత్యమునందు మోఁగఁ ♦ గాఁ దగునని నా
కనుమతినిడె నాతనియాజ్ఞను రేపభిషేకమహము ♦ జరగఁగలదు సూ. ౩౫

క. జనకుని పుత్త్రియు నుపవా,సనియతి నీరాత్రిఁ బూనఁ ♦ జను నాతోడన్
జనకుఁడె బుత్విగుపాధ్యా,యనికరయుతుండై వచించె ♦ నమ్మా! నాతోన్. ౩౬

1* ప్రాణాయామేనపురుషం-అనిమూ. పురుషశబ్దమునకు గోవిందరాజవ్యాఖ్య ననుసరించి
యీయర్థము వ్రాయఁబడినది

తే. జనని! రేపటి యభిషేక♦మునకుఁ జేయఁ
దగిన మంగళకార్యబృం♦దంబు నాకు
జానకికిని జేయింపు మీ♦సమయమందె
యనినఁ గౌసల్య చిరకాల ♦ మాత్మలోన. 32 203

క. కోరుచునుండిన యీశుభ,సారసమాచారమును ని♦జశ్రుతిహితముఁ
దా రయమున వినినంతనె, యారామునిఁ జూచి యనియె ♦ హర్షాశ్రువులన్.

క. తీయనిపలుకులు తగ నో,నాయన! రామా! ధరిత్రి ♦ నాదీవన, దీ
ర్ఘాయుష్యమలర బ్రదుకుము, నీయరితతి యడఁగుఁగాక ♦ నిను సిరిఁబొందున్.

క. ఈరాజ్యలక్ష్మితోఁ దన,రారుచు నాబంధువులను ♦ నలరించి సుమి
త్రారమణిబంధుజనులన్, గారవమున సంతసిల్లఁ♦గాఁ జేయుమికన్. 206

క. తనయా! శుభనక్షత్రం,బున నాకుదయించినాడ♦వుగదా నీవే
మనియెంతు నాప్రమోదం,బును, వినయాద్యములనుగుణ♦ముల నీతండ్రిన్.

క. అలరించినాఁడ; విష్ణ్వా,కులలిత వంశీయరాజ♦కూటాగ్రముగా
నలరెడు రాజ్యేందిరను,జ్జ్వలగతినినుఁ బొందఁగలదు♦సరగునఁ దనయా!.౭౦౪

తే. కాననేఁ బుండరీకాక్షుఁ ♦ గనకచేలు, నాదినారాయణునిగూర్చి ♦ యాచరించి
నట్టి యుపవాససాధువ్ర♦తాదులందు, నోర్చినట్టి శ్రమంబిపు♦డొందె ఫలము.

క. ఔరా! యని సంతసమున, నారామామణి వచింప ♦ నంత రఘుకులో
ద్ధారుఁడు చేతులుమొగిడిచి, చేరువనున్నట్టి సుగుణ♦సిద్ధుని ననుజున్. 210

క. వినయాన్వితు లక్ష్మణునిం, గని మోమున సుస్మితంబు ♦ గ్రాలఁగ ననుజా
ననుఁగూడి యీధరార్థం,మును నీవును నేలుమికఁ బ్రమోదమువీరున్. ౭౨౪

క. తగుదువు రెండవప్రాణం,బుగ నాకున్ నీవుగానఁ ♦ బొందెదుగాదే
జగతీరమ యిఁక నిష్టం,బగు భోగనికాయమొందు ♦ మా సౌమిత్రీ. ౭౩౪

ఆ. రాజ్యఫలములైన ♦ రత్నాభరణముఖ,ములను ననుభవింపు ♦ మెలమి నీకుఁ
గానె నాదురాజ్య♦కమలాలయను జీవి,తమును గోరువాఁడఁ ♦ దథ్యమిద్ది. ౭౭

క. అని తల్లుల కభివాదన,మొనరిచి తనభార్యనంప ♦ నూల్కొనుఁడని వా
రిని వేఁడి సీతఁగూడియె, చనియెను రాముండు స్వీయ♦సౌధంబునకున్. ౭౪

నాల్గవ సర్గము సంపూర్ణము.

---

౫ - వ సర్గము.

వసిష్ఠుఁడు రాము నుపవాసముండుమని చెప్పుట.

తే. రేపు కానున్న యభిషేక♦రీతికిఁ దగి,నట్టి యుపవాసమాది కా♦ర్యములఁ జేయ
నాజ్ఞనిడ రామునకునంత♦నవనిపతి వ,సిష్ఠునిఁ బురోహితునిఁబిల్చి♦చెప్పెనిట్లు.

క. సిరియును రాజ్యముఁ గీర్తియు, దొరకొనఁగాకుత్స్థు సువ్ర♦తుని భూమిసుతన్
బరమమునీంద్రా! మీరిపు, డరుగుం డుపవాస మునుపుఁ♦డని పలుకుటయున్.

క. శ్రుతివిద్వాస్యం డామునిపతి వల్లే యనుచుఁ బలికి ♦ వసుధేశుని స
న్మతినొంది రామునగరికి, నతిశయమోదమునఁ బోన ♦ సఫుడు వ్యతుఁడై. 3

తే. మంత్రకోవిదుఁ డాట న♦మ్మౌనిరాముఁ
డర్థగతి నుపవాసంబు ♦ నాచరించు
నట్లు సేయంగఁ బూని బ్రా♦హ్మణులకర్హ
ముగనె తురగాళిఁ బూన్చిన ♦ దగురథంబు. ర 218

సీ. ఎలమి నారోహణంగనెక్కి ♦ యేగె వృత్తవ్రతుఁ డౌకరిఁబంపకతానె ♦ యున్నమునఁ
దెల్లనిమేఘము♦ల్లెల్లసిల్లెడు కాంతి నలరారు రాముని ♦ హార్మ్యమునకుఁ
బోయి కక్ష్యాత్రయం♦బును రథమెక్కియే దాఁటిన నమ్ముని♦ తెల్లజుండు
మానసీయుఁడు రాఁగఁ♦ దాను గనుంగొని రాముఁ డంతట సత్వ♦రముగ నతనిఁ

తే. బూజలం దృప్తినొందింపఁ ♦ బూని సంభ్ర
మంబున గృహంబునుండి యే ♦ మౌని కెదురు
గాఁగ వేగను చని ముని♦ కాంతుఁ డున్న
యరదమును జేరి యాతని♦ కలరు భక్తి. ౬౪ 219

క. కరము నొసంగి వసిష్ఠుని, నరదము దిగుపట్లు చేసె ♦ నమ్మౌనియు నా
వరమును వినయముఁ జూపుడుఁ, బరఁగెడు శ్రీరాముఁ గాంచి ♦ పరమప్రీతిన్.

తే. ప్రియముమునకుఁ దగువాఁ డని ♦ విశదగతి, త్వేను వాత్సల్యమెల్లఁ బ్ర♦శ్నించి సుప్ర
సన్నునింజేసి పలికె నీ♦ జనకునకును, గలిగె నీయెడ సత్కృప ♦ గానసీవు. ౮

క. పూనుదువు యౌవరాజ్యము, జానకితోఁ గూడి గాను♦ చంద్రా! యుపవా
సానూనవ్రతమును నీ, వూనుము నీ గండ్రి దశర♦థోర్వీపతియున్. ౮౪ 222

క. ప్రాతఃకాలమ్మున నె య,య్యాతికి సహాయుఁ డొసంగి ♦ నట్టులె తగ నీ
కే తాను యౌవరాజ్యముఁ, బ్రీతిగ నీఁ దలఁచె మనుజ♦ వినుతము గాఁగన్. ౯

సీ. అభిషేకమగు రేపె♦ యనిమౌని యా రాము నియతవ్రతుని భార్యా♦ సయనుమంత్ర
యుక్తంబుగా నంత ♦ నుపవాసముండంగఁ జేసె రాజగురుండు ♦ శ్రీరఘుకుల
వర్యుచేఁ బూజలఁ ♦ బడసి యథావిధిఁ బయనమ్ము వెంబడి ♦ వచ్చుచున్న
యాకుమారుని నిల్చు♦నట్లాడంబఱచి సీవ్వయని కేతనమ్మున ♦ కరిగె నచట

తే. రాముఁ డెంతయుఁ బ్రియులయి ♦ రంజిలునటు
పల్కు మిత్రులతోఁ గూడ ♦ వైభవమునఁ
గూరుచుండి యవ్వారలఁ ♦ గోర్కెదీఱ
నన్నివిధముల సంతృప్తి ♦ నలవరించి. ౧౩ 224

క. సెలవంది మిత్రసంతతి, వలనన్ సౌధంబుఁ జేరెఁ ♦ బ్రమదలు నరులుం
గలకలమాటల నెంతయు, నలరారుటఁ జూడ సౌధ ♦ మాతరుణమునన్. ౧౩½

తే. మత్తపతగావృతంబయి ♦ మానితముగఁ
బూచియున్నట్టి తామరల్ ♦ పొదలుచుండ
నింపుసొంపారుకొలను నా♦నెంతయు నుతి
పాత్రమై యలరారె న♦బ్భంగి సచట. ౧౪ 226

క. మునిపతి వసిష్ఠుఁ డారా,ముని సుందరదివ్యసౌధ♦మును వెల్వడి త్రో
వను గాంచెను జనసంవృత,మునుగాఁ జూపట్టుదాని ♦ మోదముపొదలన్. ౧౫

క. రామాభిషేకమును దమ, రామోదమునం గనంగ ♦ నౌనను త్వరతో
నామెయి గుంపులుగుంపులు, గా మలసినప్రజలతోడఁ♦గడునిబిడముత్రై. ౧౫½

సీ. అప్పురమునఁ గల్గు♦నట్టి ఘంటాపథములు గ్రిక్కిఱిసియుండె ♦ బలుఁబురుజను
లందందుఁ గెరటమ్ము ♦ లట్లు పైపయివచ్చి యొరసికొనుటచేత ♦ నురుముడమున
ఘంటాపథంబులఁ ♦ గల్గిన యాధ్వని సాగరభూరిని♦స్వనముఁ బోలి
యుండె; నయోధ్యయం♦దొప్పుమార్గమ్ములజనులూడ్చి జలమును♦జల్లి; యరఁటి

తే. స్తంభములఁ బోకమ్రాఁకులఁ ♦ జాలుతప్ప
కుండఁగాఁ గట్టి యింటింట ♦ నొగి ధ్వజంబు
లెత్తిరందున్నవనితలు ♦ నెల్లబాల
వృద్ధులును మొదలగుజను♦లేచిన తమి. ౧౭½ 229

క. ఎపుడభిషేకోత్సవమగు, నెపుడతులు మోదమంద ♦ నింపుగఁ గననౌ
నెపుడొ సూర్యోదయమని, యపరిమితోత్సాహ మలర ♦ నందుండి రొగిన్.

ఆ. అప్పురంబునందు♦నగు నభిషేకోత్స,వంబు జనులకెల్లఁ ♦ బరమహర్ష
వర్ధనంబు మఱియు ♦ వరతరాలంకార, భూతమయ్యెఁ; జూడఁ♦బూని ప్రజలు.

సీ. ఆతురపడుచుండి ♦ రవ్వసిష్ఠుండిట్లు జనసంకులంబగు ♦ ఘనపథంబుఁ
గాంచుచు వేర్వేఱు♦గా జనవ్యూహంబు నొసరింపఁ బూనిన♦ట్లొప్పుగఁ జని
మెల్లమెల్లనఁ జెంత ♦ మేదినీశుని సౌధమును సితాభ్రమురీతి ♦ గనఁదగి సిత
పర్వతశిఖరంబు ♦ భాతిఁ జెలంగుచుఁ గన్పట్టుదానిని ♦ గడఁగి యెక్కి

తే. దేవగురుఁ డింద్రునిం జేరఁ ♦ బోవునట్లు
తాను దశరథుకడ కేగె ♦ మానిరాకఁ
గాంచి సింహాసనమునుండి ♦ క్ష్మాపతీంద్రుఁ
డప్పుడే లేచి యిట్లని ♦ యడిగె మునిని. ౨౨½ 232

క. తనయుని నుపవాసవ్రత,మును బూనఁగఁ జేసినారె ♦ మునివర, యన న
ట్లొనరించితిన నె, యర్ధా,సనముల నృపుతోడనున్న ♦ సభ్యులు వడిగన్. ౨౩½

క. నరవరుతోడనె లేచిరి, పురోహితునిఁ బూజసేయ ♦ భూపతి యంతన్
గురువరుని యాజ్ఞఁ గైకొని, పరిషత్తును వీడుకొలిపి ♦ ప్రాసాదంబున్. ౨౮౪

చ. [1]హరి, ధరణీధ్రకందరము ♦ నంతరమొందెడురీతిఁ జొచ్చె; నె
ల్లరమణు లగ్ర్యభూషణ వి♦లాసములం గనుపట్ట నింద్రమం
దిరమున కుద్దియౌ గృహము ♦ నెమ్మిని దారలతోఁ జెలంగు నం
బరమును జంద్రునట్లు ద్యుతి♦భాసురుఁడై ధరణీశుఁ డచ్చటన్. ౨౮౬ 235

ఐదవ సర్గము సంపూర్ణము.

---

౬. - వ సర్గము.

రామపట్టాభిషేక ప్రయత్నము.

సీ. తనపురోహితుఁ డిట్లు♦చనిన శ్రీరాముండు స్నాతుఁడై నిశ్చల♦స్వాంతుఁడగుచు వి
శాలాక్షి యైనట్టి ♦ జనకజతోడ [2]శ్రీరంగనాయకుని బ♦రాత్పరుని ను
పాసించె శాస్త్రోక్త♦పద్ధతి చొప్పున సతిఁదను హవిఃపాత్ర ♦ మధికభక్తి
శిరసున గ్రహియించి ♦ శిఖిముండుచుండంగ నందు దేవోత్తముఁ ♦ డైన విష్ణు

ఆ. దైవతంబుకొఱకుఁ ♦ దగ నేయితో హోమ
మాచరించె హోమ♦మందు మిగిలి
నట్టి యాహవిస్సు ♦ నాత్మప్రియంబుగాఁ
గొని భుజించి యిష్ట♦మును దలంచి. ౨౫ 236

క. శ్రీనారాయణమూర్తిని, మానుగ ధ్యానించి దర్భ♦మహిఁ బఱచుకొనెం
దానే యంతట నందున్, మానముతో నిశ్చలముగు ♦ సుదతి జానకితోన్. ౩౪

క. సిరి నెలయఁగఁ దనదగుమం, దిరమునఁ బూజగొని నిర్గ♦తిం జేసిన శ్రీ
హరి దేవాలయమున భూ, వరతనయుఁడు నివసించె ♦ భద్రాస్థితిన్. ౪ 238

సీ. ఒకజాము రాత్రియుం♦దుండఁగ మేల్కని తనయింట నెల్లెడఁ ♦ దగినయట్లు
గా నలంకారవి♦ధానంబు చేయించి సుఖకరంబుగఁ బల్కు ♦ సూతవంది
మాగధవాక్యము ♦ లాలించుచును వినుచునంతటఁ బూర్వసంధ్యావి♦ధి వమయిన
భాను నుపాసించి ♦ పరవిమలోత్తమును గాని మానసం♦బున జపించి

తే. త్రిపదగాయత్రి; లోకేశు ♦ దేవదేవు, శ్రీహరిని బ్రస్తుతించుచు ♦ శిరసు భూమి
సోఁక నంతప్రణామంబు ♦ శుభకరంబుఁ, జేసిమరల నుస్నానంబు♦ సేసియుతఁడు.

క. అగుడైన పట్టువస్త్రము, ధరియించి మహీసురప్ర♦తతిచేతన్ మం
దిరమందు స్వస్తివాచన,ము రమణఁ జేయించె; విప్ర♦ముఖ్యులు శ్రద్ధన్. ౭

1 హరి=సింహము. అగ్ర్యము=శ్రేష్ఠము 2 సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్-అనిమూ. ఇట గోవిందరాజవ్యాఖ్య గృహీతమని యెఱుంగవలయు.

తే. స్వస్తివాచనమంత్రముల్ ♦ చదువఁ, దన్ని
నదము గంభీరమధురమై ♦ యుదయమొందె
వాద్యఘోషంబులనుగూడి ♦ వరుసఁ జెలఁగి
యయ్యయోధ్యాపురంబెల్ల ♦ నావరించె. ౮ 241

క. పురమండలిజనబృందము, ధరణిజతో నుపవసించెఁ ♦ దా రాముఁడు నా
నరుదుగ విని ముదమందెను, దరువాతం బౌరులెల్లఁ ♦ దమిమీఱంగన్. ౯

క. రామాభిషేకవార్తను, దా నరుదుగ వినియె యుంటఁ ♦ దన్నిశగడువం
గా మోములు వికసిల్లన్, శ్రీమహితముగాఁ బురంబుఁ ♦ జేయఁ దలఁచుచున్.

క. సులలితపట్టణవీథుల, నలికించియుఁ దోరణముల ♦ నలరించి యనం
టులు గట్టించియుఁ జక్కఁగ, నలంకరించిరి గనంగ ♦ నందముగాఁగన్. ౧౦

సీ. *తెల్లమేఘంబుల ♦ తీరునఁ బర్వతశిఖరంబులట్టులు ♦ చెల్వమీఱు
దేవాలయములందు ♦ దివ్యచతుష్పథములయందు రాజవీ♦థులను రచ్చ
ప్రాఁకులయందును♦నుఱి బురుజులయందుఁ బలువిధంబుల వస్తు♦వులుసమృద్ధి
గానున్నయట్టి యం♦గళ్లను, సంపత్తు లలరఁ గన్పడెడు గృ♦హస్థులవగు

తే. భవనముల నన్నిటన్ సభా♦భవనములను
నలుఁదెఱంగులఁ గన్పడు ♦ లలితవృక్ష
ములను భూమీశ్వరునిచిహ్న♦ములు గలిగిన
ధ్వజములెత్తిరి చిత్రప♦తాకలనొగి. ౧౩ 245

క. మనసునకుం గర్ణంబుల,కును సౌఖ్యము గలుగ న ర్తకులు నటులును జ
క్కనిపాట పాడి రాడిరి, ఘనగానము చేసి రెల్ల♦గాయకు లచటన్. ౧౪ 246

క. జను లాంపాటల నాటల, విని కని పట్టాభిషేక♦విషయకథలనె
ల్లను జెప్పుకొనఁ దొడఁగిరి, జనితోత్సాహముల నిండ్లఁ ♦ జత్వరములలోన్.

తే. ఉత్సవంబు సమీపింప ♦ నువిదలెల్ల
నిండ్లలోపల నిలుచుండి ♦ యెలమిఁ బల్కఁ
గాఁ దొడంగిరి గుంపులు♦గాఁ జెలఁగుచు
బాలకులు నాడుకొనుచును ♦ బల్కిరిట్లు. ౧౬ 248

చ. పురజనులెల్ల సంతసము ♦ పొంగఁగ రాముని యుత్సవంబునన్
ధరణివిభుండు పోయెడుప♦థంబులఁ బుష్పములెల్లఁ జల్లి సుం

---

* చతుష్పథేషు రథ్యాసు చైత్యే ష్వట్టాలకేషు చ-అని మూ., ఇట చైత్యేషు అనుపదమునకు "బౌద్ధాలయేషు" అని గోవిందరాజు లర్థమును వ్రాసిరి. ఇట బౌద్ధశబ్దమునకు సిద్ధులని యర్థము చెప్పవలెనని కొందఱనుచున్నారు. బుద్ధమత మప్పటికిఁ గలదా యని శంకగలుగవచ్చు. పాషండులకు బౌద్ధశబ్ద ముపయోగింపఁబడు. ఇందు రచ్చప్రాఁకులయందని తెనిఁగింపఁబడినదని తెలియ నగు.

దరముగఁ జూడజేసిరి ని♦తాంతసుఖావహగంధధూపని
ర్భరతరవాసనల్ వెలయ ♦ వైభవయుక్తము లయ్యె నవ్వియుౙ్. ౧౯ 249

సీ. పట్టాభిషిక్తుఁడై ♦ భాసిల్లి రాముండు కరి నెక్కి వెడలెడు ♦ కాలమందు
నతనియలంకార♦మంతయుఁ గన్పడ నొకవేళ రాత్రియా♦నొకో యటులగు
నేని యారాముని ♦ యెల్లభూషణములు గన్పడఁ దగియుండుఁ♦గాన నెల్ల
రాజమార్గంబుల ♦ రంజిలు వృక్షంబులట్లు దీపములస్తం♦భాళిఁ గట్టి

తే. రాపురంబున నున్నట్టి ♦ యఖిలజనులు, చక్కఁగా నగరంబును ♦ సంస్కరించి
యావరాజ్యాభిషేకసు♦హోమహంబు, నెదురుసూచుచునుండిరి♦పొదలు వేడ్క.

చ. జనులు గృహాంగణంబులను ♦ జాదుసభాస్థలులందు నిల్చి యీ
జనపతి సూర్యవంశమణి ♦ సాధుమనీషుఁడు తాను వృద్ధతం
గనుట నెఱింగి, రాజ్యమును ♦ గావఁగ రాముని బట్టభద్రుఁ జే
యను దలపోసె దైవకృప♦నందితి మెల్లర మిప్పు డద్దిరా. ౨౧ 251

సీ. రామచంద్రుం డింక ♦ రాజగు నాతండు సకలవస్తువులవౌ ♦ సాధ్వసాధు
గుణముల నెఱిఁగిన ♦ గురుబుద్ధి; యిట్టిఁడు ప్రభువు గావలెనని♦వాంఛ నొందు
చుంటిమి మనమిప్పు ♦ డోదవె నాతండె పుణ్యంబున విభుఁడుగా;♦ నతనిమదిని
గర్వంబు పొడసూపఁ ♦ గారాదు విద్వాంసుఁ డన్మహనీయుఁ డ♦త్యమలధర్మ

తే. నిరతచిత్తుండు సోదర♦నిచయమందుఁ
గరుణ గలవాఁడు వారల ♦ కరణి మనల
నెయ్యమునఁ జూచు; దశరథుఁ ♦ డియ్యనఘునిఁ
బట్టభద్రునిఁగాఁ జేయ ♦ వాంఛ నొందె. ౨౩ 252

చ. తనయుని రాజుఁ జేసి తన♦ధర్మము వే నెఱవేర్పఁబూనె న
స్మనుజవిభుండు తన్మహము ♦ మానుఁగఁ జూతుముకాదె యిట్టి య
జ్జనపతి పాపదూరుఁడు ని♦జప్రియనందనుఁ జూచుచుౙ్ సుఖం
బునఁ జిరకాల మాయుషముఁ ♦ బొంది యెసంగెడుఁగాక యిద్ధరౙ్. ౨౪ 253

క. అనుచుం బొగడిరి నానా, జనపదములనుండి రామ♦చంద్రుని యభిషే
కనిమిత్తోత్సవమగునని, వినివచ్చిన జనులు వినిరి ♦ పీరలపలుకుల్. ౨౫ 254

తే. జానపదులెల్ల రామను♦త్సవముఁ జూడ
నాయయోధ్యకుఁ జనుదెంచి ♦ రఖిలదిశల
నుండి; మఱి నార లప్పురి ♦ నిండియుండి
రాత్మలం దుల్లసిల్లెడు ♦ నాదరమున. ౨౬ 255

చ. జనులరుదెంచువేళల వి♦శాలరవం బొకఁ డుద్భవిల్లి ప
ర్వనికరమందుఁ బెల్లెసఁగు ♦ రత్ననిధిధ్వనిపోలె మ్రోఁగె; నిం

ద్రనిభవనంబు తీరునఁ గ♦నుంగొన నొ పుర మాయయోధ్య రా
మునియభిషేకవైభవముఁ ♦ బోలఁ గనుంగొనవచ్చు వారిచేన్. ౨౭ 256

ఆ. నిండియుండె జనులు ♦ నిఖిలమార్గంబులఁ, దిరుగుచుంట నపుడు ♦ తిమితిమింగి
లాది జంతువితతి ♦ నార్భటింప ధ్వనించు,నుదధివోలె వెలసి ♦ యుండె నంత.

ఆఱవ సర్గము సంపూర్ణము.

---

౭-వ సర్గము.

కైకను మంథర దుర్బోధనము చేయుట.

*చ. కల దొకదాసి కైకకది ♦ కాలము పుచ్చుచునుండు నామెతోఁ
గలసియె, జ్ఞాతిదాసి యగుఁ♦గాని వివాహపువేళ బంధువుల్
వెలయఁగ నిచ్చియుండి రెట ♦ వింతఁగఁ బుట్టెనొ చెప్పరాదు త
త్కుల మెఱుఁగంగరాదు నృప♦కుంజర దారకుఁ బ్రీతిపాత్రమా. 258

క. తనయంతన శశివలె నొ,ప్పిన సౌధం బెక్కె నొకట ♦ వింతగఁ బురమె
ల్లను సిక్తరాజపథమై, తనరారి ప్రకీర్ణసుమవి♦తానంబగుచున్. ౧ 259

క. అలరుచు నుండఁగ సౌధం, బెలమి నధిష్ఠించి దాని♦నెల్లెడఁ గనియెన్
విలసిల్లు దివ్యకేతన,ములచే ధ్వజపంక్తిచే వి♦భూషిత మగుచున్. ౨ 260

చ. పురమది యమ్మహోత్సవముఁ ♦ బొల్పుగఁ జూడఁగవచ్చు సజ్జనో
త్కరములు స్వేచ్ఛఁగాఁ దిరుగఁ♦గాఁ దగినట్టులు చిన్నత్రోవలన్
వరుస రచింప నొప్పె; జన♦వారములుం దలయంటుస్నానమున్
బురపి యయోధ్య యంతటను ♦ సాంద్రముగాఁ దనరారె వెండియున్. ౩ 261

సీ. కానుకలర్పింపఁ♦గాఁ గుసుమంబుల హారముల్ భక్ష్యముల్ ♦ హస్తతతుల
ధరియించి బ్రాహ్మణో♦త్తము లందుఁ దిరుగుచు సంతోషపూర్వని♦స్వనము లెల్లఁ
జేయఁగా, సున్నము ♦ పూయఁ దెల్లఁగ దేవతాలయములు ప్రాల♦నఖిలతూర్య
నాదముల్ వర్ధిల్ల ♦ మోదమ్మునన్ జను లందందు నిండుగ ♦ నలముకొనఁగ

తే. వేదపారాయణధ్వనుల్ ♦ విస్తరిల్ల
సంతసంబున నలరారు ♦ సామజములు
వాజివరములు చెలువార ♦ బలసియున్న
యట్టియాఁబోతు లందందు ♦ నార్భటింప. ౪ 262

క. కనుగొనఁగ నయ్యయోధ్యయుఁ, గనుపండువు చేయుచుండెఁ♦గడుసంతోషం

---

* జ్ఞాతిదాసీ యతోజాతా కైకేయ్యాస్తు సహోషితా" అనియు. యతోజాతా ఎచ్చటనో పుట్టినదనుటచే దానిపుట్టుక యెరికిం దెలియదు. దాని దేవతలే పంపిరనునర్థ మిట సూచితమని దొఱుంగునది. ఈయర్థము ఒకదాసి యనుమాటయం దిమిడియున్నది.

ఆ. భర్తనన్నుఁ బ్రీతి♦పాత్రగాఁ దలపోయుఁ, గాన నేనె భాగ్య♦కలిత ననుచుఁ
బొగడుకొనుదు వీవు ♦ పోయె నీసౌభాగ్య, మెండలం బ్రవాహ ♦ మింకురీతి.

క. అని యీగూనిది పాపం,బును గాంచు స్వభావమున నె ♦ పోలుచు రోషం
బునఁ బరుషంబుగఁ బల్కిన, విని మిగుల విషాదమంది ♦ వే యిటు పలికెన్.

తే. మంథరా! యేమి యిద్ది, త్వే♦మం బెగాదె
నాకు, నీమోము విన్నఁద♦నంబు గనుట
చూడ నేదియొ దుఃఖంబు ♦ గూడె నీక
టంచుఁ దలఁచెదఁ దెలుపుమా ♦ యవ్విధంబు. ౧౭ 277

చ. అనియిటు కైక యెంతొ మధు♦రాక్షరముల్ దగ మాటలాడఁగా
విని యిది యేమి యీవనిత ♦ విన్నదికాదొకొ రామువార్తయం
చును మది నెంచి యాగ్రహముఁ ♦ జూపుచు మాటల నేర్పు చాలఁగ
ల్గినయదికాన నిట్లనియెఁ ♦ గేకయరాజతనూజఁ గాంచుచున్. ౧౮ 278

సీ. కైకేయికి హితంబె ♦ కాంక్షించునదిగాన నభిషేకమును విన్న♦యంతనే వి
షాద మధికమాట♦చేఁ దాను సిరి జ్ఞాతివశమాటఁ దెల్పి య♦వ్వనితకెంతొ
దుఃఖమ్ముఁ గల్గింపఁ ♦ దొడరి యామెకుఁ గలతనయవాత్సల్యంబు♦ఘనతరంబు
వేఱుపఱచి మది ♦ వేగ విరోధంబుఁ గల్గింపఁగా నెంచెఁ ♦ గాన దేవి

ఆ. నిను నశింపఁజేయు ♦ ననువగు యత్నంబు, జరగుచున్నదద్ది ♦ సాగకుండఁ
బ్రతికృతిని నొనర్ప ♦ రానియట్టిది యయ్యె, వినుము తద్విధంబు ♦ విన్నవింతు.

క. నీనాథుండగు దశరథ,భూనాథుఁడు యౌవరాజ్య♦మున శ్రీరాముం
బూని యభిషేకమొనరుపఁ, గా నున్నాఁడెల్లి వింటెఁ ♦ గా యవ్వార్తన్. ౨౦

క. సిరి రామునకుం దక్కెన్, ధరణీశుని కరుణ ననెడు ♦ తలఁపున దుఃఖం
బురుతరరాజ్యము తప్పెన్, భరతునకను శోకమును మ♦నంబునఁ గలుగన్.

క. పెనుభీతి మునిఁగి యిపుడే, ననలునిచేఁ గాల్పఁబడిన♦యట్లు బడలి నీ
కనయంబు మేలుఁగోరుచుఁ, జను దెంచితి నిటకు మనలఁ ♦ జనునే నాకున్. ౨౧

*ఉ. ఏలొకొ నాకు నార్తి జని♦యించిన నీకును దుఃఖమందు వే
మోలలితాంగి! నీదుమది ♦ నొయ్యన దుఃఖము నుంతకల్గె నా
తాళఁగరాని దుఃఖమతి♦దారుణరీతి జనించు నద్రియుం
బోలె పదాత్మ యందనుచు ♦ బుద్ధిఁ దలంపుము కేకయాత్మజా. ౨౧౪ 283

క. నీకుం బెంపు సెలంగిన, నాకున్ వృద్ధియె యొసంగు ♦ నారీమణిరో
యీగాకరణి ననంశయమని, యోకొమ్మా తలఁపవమ్మ ♦ యొక్కటి వినుమా. ౨౨

* నను మనుష్యాదిహేతౌ సతి కుతస్తే దుఃఖప్రసక్తి రిత్యతఆహ-అనుదాని కిది తెనుఁగని యూహింపవలయు.

చ. నరపతివంశమందు జన♦నంబయి యస్మదిలేశపత్నులం
దరయఁగ నుత్తమాఖ్యఁగని ♦ యైనను భూపతిధర్మముల్ నిరం
తరమును గ్రూరతం గనియె ♦ ధాత్రిఁ గనంబడుచుండునంచు నో
తరుణి యెఱుంగవేమి; పతి ♦ ధర్మనచస్కనిరీతిఁ దోఁచెడున్. ౨౩ 285

*సీ. అరసినచో నృపుఁ ♦ డతిరహస్యంబుగ విప్రియకారియై ♦ వెలయుఁజుమ్ము
రసనాగ్రమున నతి♦రమణీయముగఁ బల్కుఁ గార్యంబులందును♦గనినఁ గ్రూరుఁ
డతివరో పరిశుద్ధ♦మైన స్వభావంబు గలదానవౌట నీ♦కాంతునట్లు
నమలినచిత్తుగా ♦ నరసెద వక్కటా! యతనిచే నంచిత♦నైతి వీవు

ఆ. నీదుచెంతఁ జేరి ♦ నీకు హితంబుగ, నిచ్ఛకములు పలుకు ♦ నేమిగానైన
నుపకృతులను జేయఁ ♦ డొక్కస్పుడైనను, బుజ్జగించుచుండుఁ ♦ బోలఁతి నిన్ను.

చ. వినుమిఁక నిష్ఫలోక్తులను ♦ వేఁడుచు నిన్నును బుజ్జగించుచుం
దనితొలిభార్య కిప్పుడు ము♦దంబును గూర్చుచు నర్థవంతమౌ
ఘనమగు గొప్పకార్యమును ♦ గాంతగొ కూర్పఁగ నున్నవాఁడు నా
కనిన విధంబునం బలుకఁ♦గాఁ దగు; వంచన యొట్లు లన్నచోన్. ౨౪ 287

చ. భరతుని దుష్టబుద్ధి నర♦పాలుఁడు మాతులుతోఁడఁబంపెఁ ద
త్పురికిని బంధుదర్శనముఁ ♦ బోలును జేయునటంచుఁ బల్కి యు
బ్భరతుఁడె కంటకుండుగద ♦ పాఱఁగఁదోలెను వాని నీ మగం
డరసియొ బేల! రేపె తన♦యాత్మజు నగ్ర్యుని రామచంద్రునిన్. ౨౪౹ 288

తే. విగతకంటకమై, పెను♦వృద్ధి గలిగి
యున్న యీరాజ్యమునకుఁ దా ♦ నెన్ని ప్రభువు
గా నొనర్పఁగ నున్నాఁడు ♦ చాన నీవు
భావ్యసర్థముల నెఱుంగు ♦ ప్రౌఢి గనవు. ౨౬ 289

చ. మగఁడని పేరుపెట్టుకొని ♦ మానిని నీకనున్న శత్రునే
యగుఁగద నీదుభర్త; యొక♦యంగన భోగికి లో విషంబునుం
డుఁగద యటంచెఱుంగక య♦నూనహితంబును దానికే యొన
ర్పగఁ దలపోసి తల్లివలెఁ ♦ బాముఁ బోషం గదియించి ప్రేమ పెం
చ్చఁగఁ దగఁ బెంచుభంగి నతి♦సాధ్వివి గావున నీవు నాథునిన్. ౨౭ 290

క. అంతశ్శాత్రవుఁడని నీ, వింతయుఁ దలఁపకయె మదికి ♦ హితముగఁ దొడపై
నెంతయుఁ దమి లాలించెద, వింతీ! యిఁకనైన విడుమ♦వేనినతండున్. ౨౭౹ 291

క. కాకోదరమును శాత్రవు, భీకరగతిఁ జంపకెలమి ♦ విడిచినచో నె
ట్లేకరణిఁ జేయునో యటు, నీకొడుకును నిన్నుఁ జేసె ♦ నృపుఁ డిపుడబలా.

* ధర్మవాదీ శఠోభర్తా శ్లక్ష్ణవాదీచ దారుణః- అనిమూ ఇందలి విశేషణములు వ్యాఖ్యాతలు చెప్పినయర్థ మిందనువాదితముకాని స్వకల్పితముకాదని యెఱుంగఁదగు.

క. కలకాలము సుఖముగ మనఁ, గలదానవు తెలివిలేని ♦ కాంతవు గావే
ఖలబుద్ధి నీవుగండని, తెలియవుగా నీవు, దానిఁ ♦ దెల్పెద వినుమా. ౨౮½
సీ. ఇంతకాలము నిన్ను ♦ నిచ్చకములతోడ బుజ్జగించుచు నగ్ర♦పుత్త్రుఁడైన
రామునకెలమిమై ♦ రాజ్యముగట్టి నిన్నును నీదు సంబంధు♦లను గడంగి
పాడుచేసెను గదే ♦ పడఁతి నీ విపుడైనఁ దగినరీతిఁగ నీ హి♦తమును జూచు
కొనుము నేనెట్టుల♦ప్పనిఁ జేయఁజాలుదు ననఁబోకు నీతెల్వి ♦ యద్భుతంబు
తే. దాని నుపయోగపఱచి పు♦త్త్రకుని నిన్ను
నన్నుఁ గాపాడుమా యింక ♦ నన్నుఁ జారు
వదన శయనించి యుండియె ♦ యది వచించు
నట్టిమాటల విని హర్ష ♦ మతిశయిల్ల. 30½ 294
ఉ. శారదచంద్రరేఖవలెఁ ♦ జాన చెలంగుచు లేచి నెమ్మదిన్
స్ఫారముదంబు విస్మయము ♦ సారెకుసారెకుఁ బొంగుచుండ నా
నారికి గూనిదానికి మ♦నంబునఁ గుందెడుదాని కిచ్చె నం
భోరుహనేత్ర యాభరణ♦మున్ బరితోషఫలంబుగా వెసన్. 3౨ 295
తే. గూనిదానికి నిట్టులా ♦ కోమలాంగి
యాభరణమిచ్చి మరల న♦య్యతివఁ జూచి
మంథరా! నిర్భరమగు స♦మ్మదముఁ గూర్చు
నిట్టివార్తను దెల్పితి ♦ వీవు నాకు. 33½ 296
*చ. మనమున కింపుఁ బెంపఁదగు ♦ మాటను జెప్పిన నీకు నేమి యి
య్యను గలదాన; నీసవతి♦యాత్మజుపై నిటు ప్రీతి యేలొకో
యనియెదవేమొ రాఘవుని♦యందును నాసుతునందు భేదమున్
గనుఁగొనఁజాల నిద్దఱును ♦ గాదిలిపుత్త్రులె నాకుఁ గావునన్. 3౪½ 297
చ. పతి యిపు డగ్రపుత్త్రునకుఁ ♦ బట్టము గట్టఁగలండటంచు స
మ్మతి విను నాకు నెంతయును ♦ మానిని సంతస మంకురించె నీ
వతిశయమైన నాప్రియము ♦ నందఁగఁజాలినదాన వొటచే
హితము ప్రియంబునై తగిన ♦ యిట్టి సువార్తను మించువార్తలన్. 3౫
తే. వేఱొకటి చెప్పఁజాలవో ♦ వెలఁది రామ
చంద్రు నభిషేకవార్తయె ♦ సంతసంబుఁ

* ఏతస్మై ప్రియ మాఖ్యాతుః కింవా భూయః కరోమి తే, రామేవా భరతే వాహం విశేషం నోపలక్షయే-అని మూలము. దీనిచే సింతదనుకఁ గైకకు రామునం దసూయ యిసుమంతయు లేదని తేలును. దేవతలు మంథరయం దావేశించినకతన దానిమాటలు నిష్కపటురాలగు కైకకు రుచించిన వనునర్థము దీనినుండి తేలును. నీసవతి యాత్మజుపై నిటు ప్రీతియేలొకో యన్నది యవతారికపుఁ బెనుఁగుఁగాని స్వకల్పితము గాదు.

గలుగఁజేయును గాన న♦ప్పలుకు పల్కి
తింతకంటెను ప్రియ మింక ♦ నేమిగలదు. ౩౯ 299

తే. అట్టివాక్యము జెప్పితి ♦ వబలకాన
గోరఁ దగినట్టిదుండినఁ ♦ గోరు మిత్తు
సంశయము లేదు నావిని ♦ చారునేత్రఁ
గైకఁ గనుఁగొని యోర్వక ♦ కడుఁ జవమున. ౪౦ 300

ఏడవ సర్గము సంపూర్ణము.

---

## ౮-వ సర్గము.

మంథర కైకకు దుర్బోధము సేయుట.

క. తనకామె ప్రీతిన్నొసఁగిన హారముఁ దీసివైచి ♦ చెప్పెను హితముల్
వినవయ్యో నవెడి కోపంబును గినుకను నన్న దుఃఖ♦మును మదిఁ దోఁపన్. ౧

చ. తెలివి యొకింతయేఁ గనవు ♦ తెల్లము దుఃఖమునొందు కాలమం
దెలమిని గాంచె దీవు తగు♦నే యిటు సంతసమంద నీకుఁ, దా
య్యలి తెలియంగఁజాలవు మ♦హా ఘోరశోకమహార్ణవంబులో
నాలయఁగ నున్న నిన్నుఁ గన♦వో మది రేఁచుట యేమిసేయుదున్. ౨ 302

సీ. సంతోషమును గన్న ♦ చందంబుఁ జూపుచున్ దుఃఖమ్ము పీడించు♦దోయి యకట
సమయమియ్యది సంత♦సము నొందఁ జేయునే యిట్టికాలమున నీ♦ విట్టులుంట
నేమనితలఁతునే ♦ యిట్టినీ యున్మాదమును గన్నమానస♦మ్మున జనించె
నవ్వ నీదుర్బుద్ధి ♦ నను దుఃఖపూరంబునను ముంచె; సవతికిఁ ♦ దనయుఁడున్న

తే. శత్రు వేగన ? తద్వృద్ధి ♦ శమనుపోల్కి
రాఁగ మతిమంతురాలగు ♦ [illegible]
సంతసము నొందు ? రాజ్యంబు ♦ సహజముగఁ గొన
నన్నవలె నీదుతనయుండె ♦ యధికృతుండు. ౪ 303

క. కనుకన్ రామునకున్ భయ, మనుజాతుండైన నీప్రి♦యాత్మజునకున్
గనునగు, భయమతనికి నా, తనయునకున్ లేనపకుమ ♦ తెలుపఁ వినుమా. ౫

క. మనలం గనినంతనె భీ,తిని బొందెడు వ్యాఘ్రముఖ్య ♦ దుష్టమృగము లే
కనఁజేయుభీతి మనలన్, గనుకం దద్విధము తలఁచి ♦ కడుఁ జింతిలుదున్. ౬

*క. అనుజులు లక్ష్మణశత్రుఘ్ననామకులు గలరు గాదె ♦ నాతనయునకే
గనునగు నాథ యనుట్టుల, యనుజులకిట్టివారకు రాదో ♦ యనుచు వయోమా. ౭

---

* ఈపద్యము వ్యాఖ్యలోని పాఠాంతరకవిగా వ్రాయఁబడినది. మూలము దీనికి లేదు. ఈ యర్థమును గోవిందరాజమహేశ్వరతీర్థు లిరువురును వ్రాసియున్నారు.

తే. గొప్ప విలుకాఁడు లక్ష్మణుఁ ♦ డెప్పుడన్ని
విధములను రామునే గొల్చి ♦ వెలయుచుండు
నట్లె శత్రుఘ్నుఁడును నీప్రి♦యాత్మజన్ము
నాశ్రయించిన వాఁ డట్టు♦లౌట నువిద. ౫½ 307

క. వారిరువురివలనఁ గనఁ,గారాదు భయంబు నెట్టి♦కాలమునందున్
శ్రీరామునకున్; భరతున, కోరనుణీ యింక విను మ♦ఱొక్క విధంబున్. ౬

క. జననక్రమంబుఁ గన భర,తుని జన్మమె యగ్రజునకుఁ ♦ దోఁచును దాఁపై
కనుకన్ రాజ్యప్రాప్తియు, ననుకూలము రామువెనుక ♦ నబ్భరతునకున్. ౬½

మ. అనుజాతద్వయ మింకనుం గలుగదే ♦ యన్నన్ నిజంబే యటై
నను వారల్ గడుఁ బిన్నవారు ధరణీ♦నాథత్వమో దూరమై
తనరున్, గావున నీదుపుత్రునకె యో♦తల్లీ భయంబంటు రా
మునివంకన్; వినుమింక నొక్కవచనం♦బున్ నిశ్చలస్వాంతవై. ౭ 310

క. తనయంతనె శ్రీరాముఁడు, ఘనబుద్ధియుతుండు మఱియుఁ ♦ గడుఁ బ్రాజ్ఞుండై
కనఁదగును రాజనీతిని, గనిచేయును సమయమెఱిఁగి ♦ కార్యములెల్లన్. ౭½

చ. మనభరతుండు రాముని స♦మానముగాఁ దల సద్గుణాళిఁ గా
వున భవదాత్మజన్ముఁ దల♦పోసిన యప్పుడు రామువంకనే
మనితర సాధ్యసాధ్వసమ♦వంటునొ యంచు వడంకుచుందు నో
వనితరొ యాభయంబడఁగు ♦ భంగియె ముందుగఁ జేయనొఁ గదా. ౮ 312

తే. వినుము కౌసల్యకొడుకు స♦ద్విజులచేత
నధికతరమైన యావరా♦జ్యంబునందుఁ
జెలఁగి పుష్యర్క్షమునందభి♦షిక్తుఁడగును
గానఁ గౌసల్య సౌభాగ్య♦మాను ఘనము. ౯ 313

సీ. యువరాజుగాఁ దస♦యుండు పొల్చుటచేత నతిశయసంతోష ♦ మంది రాము
తల్లి విఖ్యాతిని ♦ ధాత్రిఁ బెంపుగఁ గాంచి సవతులు లోనగు ♦ శత్రువితతి
నడఁచి చెలంగెడు ♦ నప్పుడామెను నీవు దాసిపోలికనె హ♦స్తములుమోడ్చి
సేవించెదవు సుమ్ము ♦ సేవనీ విబ్బంగిఁ జేయఁగ మేమెల్ల ♦ సేవచేయఁ

తే. దగినవారమె కౌసల్య♦కగుదు మిట్లె
త్వత్తనూజుఁడు రాముని ♦ దాసుఁడగును
[1]రాముఁ డభిషిక్తుఁ డగుడు, నా♦రామచంద్రు
నుత్తమస్త్రీలు ప్రమదంబు ♦ నొందువారు. ౧౧½ 314

[2]చ. భరతుఁడు రాముదాసుఁడయి ♦ భాగ్యవిహీనుఁడుకాఁగ నీస్నుషల్

1 హృష్టాః ఖలు భవిష్యంతి రామస్య పరమాః స్త్రియః - ఇచట రాముని ఏకపత్నీత్వము విషయమై వ్యాఖ్యాతలు విపులముగఁ జర్చించిరి. సారాంశము "సీతాసఖ్యః" అని తేల్చిరి. 2 స్నుషల్-అన్నచోటనుగూడ నట్లేయని గ్రహింపవలయును.

సీ. పెనుదుఃఖసాగరం♦బునయందు శోకవ్యసనవిస్తృతంబున ♦ మునుఁగుచుండి
యును నిన్నును దెలిసి♦కొనఁజాలకున్నావు రాఘవుండైనచో ♦ రాజువాని
వెనుకఁ దత్సూనుండె♦పృథివీశుఁడగుఁగాని భరతుండురాజ్యంబుఁ♦బడయఁజాలఁ
డొగి రాజవంశంబు♦నుండి నీతనయుండుతొలఁగింపఁబడినయ♦ట్టులెయగుఁజుమి

ఆ. రాజుతనయులెల్ల ♦ రాజ్యంబుఁ బాలింపఁ, బట్టభద్రులైనఁ ♦ బరమధర్మ
మంతరించు హాని♦యగుఁగాన నృపసుతు,లందఱెట్లు రాజ్య ♦ మందఁగలరు.

క. కనుకనె రాజులు గుణవ,త్తనయులు పెక్కండ్రు చెలఁగఁ ♦ దద్రాజ్యంపుం
బనులెల్ల నప్పగింతురు, తనయులలో జ్యేష్ఠుఁడెవఁడొ ♦ తగ నాతనికిన్. ౨౪

క. అనవద్యాంగీ! నీప్రియ, తనయునిపైఁ బ్రీతి నీకుఁ ♦ దనరునటే యే
మనియందు నింక భరతుం, డనాథుగతి భద్రహీనుఁ♦డై చనుఁ జుమ్మీ. ౨౪½

క. ధరణీశాన్వయగణనకుఁ, గరమునమీఁపమ్ము నొందఁ♦గలవాఁడు గదా
ధరణిం బూనఁగ జ్యేష్ఠుఁడు, పరఁగన్ భరతునకదెట్లు ♦ వచ్చుననెదవో. ౨౫

క. ఈమార్గ మెఱింగిననే, నోమానిని నీదుసుతున ♦ కురుతరరాజ్యం
బేమాడ్కిఁగలుగు నయ్యది, యే మేలుగఁ జెప్ప నిచటి ♦ కేతెంచితిఁ జూ.

తే. సవతి కభివృద్ధి గల్గ నా♦సమయమందుఁ
బారితోషికమిచ్చియుఁ ♦ బారితోషి
కాంతరము నియ్యఁగోరితి ♦ వకట! నన్నుఁ
దెలియుదువె "వచ్చె నాహితా♦ర్థిని" యటంచు. ౨౬ 330

క. అరిజనరహితంబగు నీ, ధరణిన్ రాముండు పొంది ♦ తమ్ముని దేశాం
తరమునకైనం బంపును, మరణము నే నొందఁజేయు♦మాట నిజమిదా. ౨౭

చ. భరతుని బాలుఁడైనతఱిఁ ♦ బంపితి మాతులునింటి కప్పుడే
త్వరపడి నీవు కీడొదవు ♦ దానవె; చెప్పెద నాలకింపుమీ
తరువులు లోనుగాఁగలుగు ♦ స్థావరజాతులయందునుం బర
స్పరయుతిరూపమౌ చెలిమి ♦ వర్ధిలు దగ్గఱనుంట నెన్నఁగన్. ౨౮ 332

ఉ. కావున నీకుమారు నృప♦కాంతునిచెంత వసింపకుండఁగా
నీవె యొనర్చి తండ్రిదగు ♦ నెయ్యముఁ బాడొనరించి తిట్లు స
ద్భావమునం ద్వదాత్మజునిఁ ♦ బాయక యేగె సుమిత్రపట్టియున్
భూవిభు నగ్రసూనుఁ బని ♦ పూనియె లక్ష్మణుఁ డాశ్రయించెఁ జూ. ౨౮½

తే. వినుము లక్ష్మణురీతి నీ♦తనయు గొల్చెఁ
గాదె శత్రుఘ్నుఁ డతఁడైనఁ ♦ గాని నృపుని
చెంతనుండిన నాతని ♦ స్నేహయుక్తి
నైన నృపునకు భరతుపై ♦ నలరుఁ బ్రీతి. ౨౯ 334

మునుపు నిరాకరించితివి ♦ మోదమునందిన యామె యిప్పుడే
తనపగఁ దీర్పకుండునె ని♦తంబిని నిన్నును దాసిగాఁ గొనున్. ౩౨ 342

సీ. సకలరత్నాకర ♦ శైలపట్టణముల రాజిల్లు భూమికి ♦ రాజు రాముఁ
డెప్పుడగునో తప్ప♦కప్పుడే నీవు నీ తనయుండు దుస్సహం♦బును నమంగ
ళంబునౌ నవమాన♦ముంబొందుదురు రాముఁ డెప్పుడు ప్రభువగు♦నప్పుడే త్వ
దాత్మజుండు నశించు♦ననుటయు నిశ్చయ, మస్లాట భరతున ♦ కవని రాజ్య

తే. మిపుడె గల్గుటకు న♦హితుఁడైన రామునిఁ, బట్టణమ్మునుండి ♦ పాఱఁదోలు
టకును దగు నుపాయ ♦ మకట యోజింపుమా, జాగు సేయరాదు♦సరసిజాక్షి.

ఎనిమిదవ సర్గము సంపూర్ణము.

౯ - వ సర్గము.

కైకేయి మంథరమాటలకు లోఁబడుట.

చ. అనవిని దాసినా యగుదు ♦ నంచు మదిం బ్రభవిల్లు పెన్ క్రుధన్
దనముఖ మట్టె మండెడు వి♦ధంబున నెఱ్ఱఁగఁ గ్రాల వేఁడి యూ
ర్పునిగుడ మంథరంగనుచుఁ ♦ బూన్కి వచించెను నేను వేగమే
పనిపెద రామునిన్ వనికి ♦ బాలకునిన్ సుఖయుక్తుఁ జేసెదన్. ౧౪ 344

తే. యావరాజ్యంబునకుఁ బట్ట ♦ మాదరమునఁ
దనయునకుఁ గట్టఁ జేసెదఁ ♦ దగినభంగి
మంథరా! యేయుపాయము ♦ మనభరతున
కిపుడు రాజ్యంబు రాఁదగు ♦ నెన్నుము మది. ౨౪ 345

క. రామునకీ గురురాజ్యం, బేమాడ్కిని లేకయుండు ♦ నిపుడే పూన్కిన్
నీమది నాలోచింపుము, నా మంథరపాపదర్శ♦ననిరత గానన్. ౩౪ 346

చ. ఘనుఁడగు రామచంద్రునకుఁ ♦ గాఁ దగు నయ్యభిషేకమెల్లనుం
దనఘనశక్తిచేఁ జెఱుపఁ ♦ దా నొగిఁ బూనివచించెఁ గైకతో
వినుము సెబాసు! నాపలుకుఁ ♦ బృథ్విని నీసుతుఁ డెట్లు పొందునో
యనువుగఁ దత్ప్రయోజనము♦నంతయుఁ జెప్పుదు వీవె పల్కుమున్. ౪౪ 347

ఆ. ఆప్రయోజనంబు ♦ నంతయు నానుండి
యే వినంగఁగోరె ♦ దిపుడు నీవు
మఱచితొక్కొ దాని ♦ మఱువక యుండియు
నేనె చెప్పవినఁగ ♦ నీకుఁ బ్రియమొ. ౬ 348

శా. నేనై చెప్పఁగ నో విలాసిని వినన్ ♦ నీకిచ్ఛయే గల్గెనే
మో నావాక్యము నాలకింపు మదియున్ ♦ యుక్తంబొ కాదో మనో

జ్ఞానం బచ్చువషం బరామరికశ్శో ♦ సాధింపుమా యన్న నా
సూనుఙ్ఞేనుకరంపుఁబల్కు-విని యా♦శుభ్రాంశుతుల్యాస్యయుణ్. ౭౪ 349

చ. ఒనరఁగ మెత్తఁగాఁ బఱచి ♦ యుండిన శయ్యఁ బరుండియుండి సుం
తసేలఁతలేచి దానిఁగని ♦ దా వచియించె నదెట్టియుక్తిఁ బ
న్నిన భరతుండు రాజ్యమును ♦ నెమ్మిని బొందునొ యెట్టి భంగి రా
మునకది రాకయుండునొ ప్ర♦మోదము మీఱఁగఁ జెప్పు మంథరా. ౯ 350

తే. పాపమునె చేయఁగాఁ జూచు ♦ నాసడంతి
కుబ్జ కై కేయి వచనముల్ ♦ గోర్కి విని చు
రాముసభిషేకమున కంత♦రాయ మొసరు
పఁగఁ దలంచి నచించె నా♦క్పటినుమెఱయు. ౧౦ 351

మ. మును దేవాసురదైత్యసంగరమునన్ ♦ భూపాలకోపేతుఁడై
నిను వెంటంగొని దేవనాయకునకున్ ♦ నీభర్త సాహాయ్యమున్
జనుఁజేయంగ నటంచు యామ్యదిశ నం♦చద్దండకారణ్యమున్
దునఁ జూపట్టెడు వైజయంతపురికిన్ ♦ దోరంపువేడ్కన్ జనెన్. ౧౧౪ 352

క. ఆనగరిఁ దిమిధ్వజుఁడను, దానవపతియుండు నతఁడె ♦ ధరవిఖ్యాతిం
దానొందె శంబరుండన, నో నెలఁతా వాఁడెఱుంగు ♦ నొగి శతమాయల్

చ. సురలఁ బరాభవించి రణ♦శూరుఁడు గావున నింద్రుతోడ సం
గరమొనరించె; నయ్యనిఁ బ♦గల్ శరశూలముఖప్రణంబులన్
బరశుగదాభిఘాతములు ♦ వర్షములెల్లఁ దపించుచుండఁగా
బురుషులు నిద్రవోవ నిశిఁ♦బోయి వధించిరి వారి రక్కసుల్. ౧౮ 354

క. ఆ రేయి మహాభుజుఁడగు, భూరమణుఁడు దశరథుండు ♦ పూనికఁ జేసెన్
వారలతో పని; యట దు,ర్వారాయుధవితతి తనువు ♦ వ్రయ్యలు సేసెన్. ౧౪

శా. సారథ్యం బొనరించుచుంటి వపుడో ♦ చంద్రాననా నీవుగం
డారితిన్ శకలీకృతాంగుఁడయి మూ♦ర్ఛాధీనుఁడైనంత నీ
వాజాజిన్ గొని యేగి యవ్వలికి న♦త్యంతోపచారంబులం
గారుణ్యంబునఁ జేసి కాచితివి సం♦గ్రామోర్వికిం దవ్వులన్. ౧౫ 356

చ. దనుజవరేణ్యు లచ్చటికిఁ ♦ దాగు వెసంజను దెంచి నీదుభ
ర్తను నిఖిలాయుధాళులను ♦ దగ్గయు నొంప మఱొక్కచోటికిన్
జనపతిఁ గొంచు నేగి యటఁ ♦ జల్లనివారి నొసంగి యాశ్రమం
బును వెసఁబాపి తప్పటికిఁ ♦ బోలిన సేవలఁ జేసి నేర్పునన్. ౧౬. 357

క. ఇరుమాఱులు రక్షించుటఁ, బరికించి మగండు నీకుఁ ♦ బద్మజనేత్రా
వరయుగ్మ మొసఁగె నెపుడవ,సరమో కోనుదాన నంటి ♦ జనపతితోడన్. ౧౭

క. నీవడిగినప్పు డిచ్చెద, నావరముల నిష్టమున్న ♦ యపుడడుగుమ నే
భూవర్యుఁ డప్పుహాత్ముం, డీవృత్తాంతంబు జరుగ ♦ నేనెఱుఁగను జూ. ౧౭ 359

క. మును నీవె నాకు దీనిని, వినిపించితి గాన నిట్టి ♦ వృత్తాంతము నా
మనమున నుంచితి నీయం,దునఁ దగు నెయ్యమును బట్టి ♦ తోయరుహాక్షీ.

క. రామాభిషేకమునకై, నీమగఁడు మనోజ్ఞవస్తు♦నిచయముఁ గూర్పం
గా మనసు నిల్పియున్నాఁ, డీమాడ్కి నొనర్పకుండ ♦ నిపుడొనరుప నౌ. ౧౯

క. నిలుపుము యత్నము మానఁగ, బలవంతంబుగనె యట్టి♦వరయుగ్మమునం
దల రెడు నీరాజ్యంబున, నిలుపుము మనభరతు; రాము♦నిఁ వనమునకున్.

క. పనుపుము పదునాలుగు హా,యనములు ప్రాణేశ! యనుచు♦నడుగుమ చంద్రా
నన! రాముఁ డంతకాలము, వనమున నివసించెనేని ♦ భరతుం డిచటన్. ౨౦

క. జనభావగతస్నేహం,బును గాంచి స్థిరత్వమొంది ♦ పొల్చును రాజ్యం
బున నింక నీయుపాయం,బును సాగించెడు ప్రకార♦ముఁ విను మబలా. ౨౧

తే. ఇపుడె కోపగృహంబున ♦ కేగి నీవు
కోపమూనినచందంబు♦దోఁప మలిన
వస్త్రమును గట్టుకొని యటఁ ♦ బఱుపులేని
కఠినభూమిఁ బరుండు నీ♦కడకు మగఁడు. ౨౨ 365

క. చను దెంచినఁ గని దుఃఖం,బున నేడ్చుచు నతనివంకఁ ♦ బొలఁతీ దృష్టిం
జననీయకుమా పల్కకు, ఘనతరశోకంబుఁ గనిన♦కరణి మెలఁగుమా. ౨౩ 366

చ. అనిశము నీమగండు నిను ♦ నర్మిలిఁ గాంచెడు నిందు సందియం
బను నదిలేదు నాకు, భవ♦దర్థ మతండు కృశానుఁ జొచ్చెడున్
నినుఁ గనలింపఁగా నతఁడు ♦ నేరఁడు కోపము నొందితేని నిన్
గనఁగలఁడే త్వదీయహిత♦కాంక్షను బ్రాణములం ద్యజించుఁ జూ. ౨౪ 367

సీ. నీమాట మీఱంగ ♦ నేరఁడు నీవెంతొ *మందబుద్ధివిగాన ♦ మానసీయ
తావకసౌందర్య♦తత్త్వమెఱుంగవు తెలియుమా యిపుడైన ♦ జలజనేత్ర!
యాతండు మణులము♦త్యములసువర్ణంబులను మేలివస్తువు♦లను వివిధము
లను నీకొసంగును ♦ మనసు నవ్వానియం దించుకేనియుఁ బోవ♦నీయకమ్మ!

తే. భాగ్యవతి! దేవ దైత్యాహ♦వమున రాజు
నీకొసంగిన వరముల♦నే కడంగి
తలఁపుమా నీవు పూనిన ♦ యలప్రయోజ
నమ్ము నిను మించి పోనీకు ♦ మన్న దాని. ౨౫ 368

* మందబుద్ధివిగాన అని తనమాట వినఁగోరుసమయమున మంథర పల్కినాయని శంక కలుగవచ్చు. "మందస్వభావే బుద్ధ్యస్య సౌభాగ్యబల మాత్మనః" అని మూ. కావున మరల నేమికైక ప్రమాదము నొందునో యని హెచ్చరించుచున్నదని గ్రహించుట సముచితము.

సీ. ప్రతికూలమైన య♦ర్థమ్ముల ననుకూలములుగ నమ్మంథర ♦ బోధ సేయ
నారీతి గ్రహియించి♦యాకైకమును సద్విషయములఁ జూచు నై♦జంబుగలది
యయ్యును గుబ్జవా♦క్యముల కచ్చెరువంది భ్రాంతినొందిన [1]బడ♦బావిధమున
నపమార్గమును ద్రొక్కి ♦ నంత నాబోధకు సంతసమంది కు♦బ్జనటఁ గాంచి
తే. పలికె నీవింత మేలైన ♦ పలుకుచెప్పు, దానవనియును మేలైన♦దానవనియు
నింతకాలమునుండి నే♦నెఱుఁగనైతిఁ, దెలిసె నిప్పుడు నీవగు♦తీరులెల్ల. 379

చ. ధరణిని గూనివారలకుఁ ♦ దక్కినవారలకంటె నెక్కుడై
పరఁగును బుద్ధితైక్ష్ణ్యమిఁక ♦ వారలలోపల నీవె మంథరా!
యరయఁగ బుద్ధినిశ్చయము♦నందుఁ బ్రధానపు మద్హితంబునే
నిరతము గోరుచుండుదువు ♦ నీకె మదర్థము సాగఁ గోర్కియా. ౩౯ 380

క. నీవే లేకుండినచో, భూవల్లభుఁ డిపుడు చేయఁ♦బూనుపనిని నే
నేవెఱవునఁ దెలియను జూ, భావింపఁగ గూనివారు ♦ పలువురు ధరణిన్. ౩౯½

సీ. వక్రంబులైన య♦వయవముల్ వికృతంబుగాఁ గూడుకొనిభయం♦కరముగాఁగ
గనుపట్టుచుండంగఁ ♦ గలరు నీవారీతి గాదు; వాయువు వీవఁ ♦ గమలమెట్లు
వంగునో యట్టులె ♦ వాతదోషంబునఁ దనువు వంగంగ సుం♦దరముగాఁగఁ
గనఁదగియున్నావు;♦కాంతనీయురముమూఁపులయున్నతింగాంచి♦పూన్కిమీఱ
తే. స్పర్థఁ బూనుచుఁ బ్రక్కల ♦ సమముగాఁగ
బలిసి స్కంధమ్ములవఱకు ♦ వ్యాప్తమయ్యె
దానిక్రింద సునాభము♦దరము ఱొమ్ము
నున్నతింగని చిక్కి సి♦గ్గొందినట్లు. ౪౧½ 382

క. వినునీ జఘనము విఱివిగఁ, గనుపట్టుఁ బయోధరములు ♦ కడుఁబీనములై
తనరారు నిమ్ముకొంక తు,హీనకరుభంగిన్ ముఖంబు ♦ నెంతయుఁ బొలుచున్.

క. కనుఁగొన్నవారలు సెబా,సని చెప్పెడునట్లుగాఁగ ♦ నలరారుదు విం
కను గాంచీదామము చ,క్కనిధ్వనులను జేయ నీజ♦ఘన మొప్పారున్. ౪౩

సీ. ఒండొంటికిం జాల ♦ యొద్దిక గాఁ దీఱి పిఱుఁదులు వెలసెడు♦బెడఁగు గాఁగ
నున్నది నీపాద♦యుగళంబు నిడుపుగా; నిడుదలై యూరులు ♦ నెగడఁ దెల్ల
పట్టుచీరను నీవు ♦ గట్టి నాముందఱ నలరాజహంసి య♦ట్లందముగను
దిరుగుచునున్నావు ♦ సురవైరియైన యాశంబరాసురునందు ♦ సహజములుగ
ఆ. నున్న వేయిమాయ ♦ లెన్నలోకంబునఁ, గలుగు నితరమాయ ♦ లొలసి వేన
వేలుగాఁగ నున్న ♦ వోలలనామణీ, యరయ నీశరీర♦మందు నిజము. ౪౬½

సీ. స్యందనచక్రంబు ♦ సన్నిధిఁ బొడవుగా ముక్కురీతినెసంగు ♦ నొక్కయవయ
వవిశేషమట్లు నీ♦వక్రతయందు నీమతులు క్షత్రియవిద్య ♦ లతిశయమ్ము

1 బడబ=ఆఁడుగుఱ్ఱము.

ఆ. బుడమి పైఁ బరుండి ♦ పొలఁతిని గనిపల్కెఁ, బతియు వచ్చి నాకు ♦ వాంఛఁదీర
వరము లీయఁడేని ♦ ప్రాణముల్ విడుతును, గాన మృతిని జెప్పఁ♦గలవు పతికి.

చ. పతి యసుదెంచి నాదయిన ♦ వాంఛను దీర్చునయేని భూమికిం
బతి భరతుండె యా నడవి♦పాలగు రాముఁడు, నిక్కమిద్ది భూ
పతి కనకంబు రత్నములు ♦ భాసురభూషణరాజి నిచ్చినన్
హితములు గావు నాకుఁ బృథి♦వీశుఁడు రాముఁడె యైనఁ జత్తుఁజూ. ౫౯ 396

చ. అనివచియించె మంథరయు ♦ నప్పుడు మిక్కిలి క్రూరవాక్యముల్
గనఁబఱుపందలంచి నృప♦కాంతను గైకను జూచిపల్కె రా
మున కహితంబు నామెకుఁ బ్ర♦మోదముఁ గల్గఁగఁజేయఁబూని; యిం
కను విను రాముఁడీక్షితికిఁ ♦ గాంతుఁడుగా నభిషిక్తుఁడైనచోన్. ౬౦ 397

తే. నీవు నీతనయుండును ♦ నిజముమిగులఁ
జింతలంబొందుదురు కానఁ ♦ జేయవలయు
నీకొడుకునకుఁ బట్టాభి♦షేకమెట్టు
లగునొ కల్యాణి యట్టి ప్ర♦యత్నమీవు. ౬౧ 398

సీ. అనినఁ గుబ్జావాక్య♦యంకరాశుగములఁ బలుమాఱుఁగొట్టంగఁ♦బడి క్షితీశు
మహిషి సంతప్తయై♦క్ష్మాపతినాకెంతొ ప్రియుఁడయియుండి య♦ప్రియమిదిట్లు
సేయునే యంచెదఁ ♦ జేతులు చేరిచి యచ్చెరువందుచు ♦ నట్టిపనికిఁ
బలుమఱుఁ గినియుచుఁ♦బలికెనో మంథరా! యిటనుండి యమపురి♦కేనుబోవు

తే. వార్తవిని నీవు నృపతి కి♦వ్వార్తఁజెప్పఁ
గలవు; కాదేని రాముండు ♦ కానకేగ
భరతుఁ డీరాజ్యసుఖముల ♦ బహుశరత్తు
లొందుచు సమృద్ధకాముఁడై ♦ యుండఁగలఁడు. ౬౩ 399

చ. విను మిటనుండి రాఘవుఁడు ♦ వేగమ కానలకేగఁడేని శ
య్యను శయనింపఁ బుష్పముల ♦ హారములం గొనఁ జందనంబుఁ బూ
యను, దలయంటుకోను, దిన ♦ నన్నముఁ, ద్రాగను నీరు, నేమియుం
గొన, నిఁక నాదుప్రాణములఁ ♦ గూడ భరింపఁగ నొల్ల మంథరా!. ౬౪ 400

చ. అనియిటు రాజకాంతయు భ♦యంకరరీతిని బల్కి వింతగాఁ
గనఁదగు నన్నిసొమ్ములను ♦ క్ష్మాస్థలి వైచుచు శయ్య లేనియు
ర్విని దనపుణ్యమెల్లఁ జెడ ♦ విచ్యుతయై దివినుండి కిన్నరాం
గన క్షితిఁ జేరినట్లు తన♦కాయము దూలఁ బరుండె నంతటన్. ౬౫ 401

చ. ఘనతరకోపమున్ తమము ♦ గ్రమ్మఁగ మోమున, మూల్య మెంతయో
యనివచియింపరాని మణి♦హారములం గుసుమస్రజంబులం

[1]తనకయిఁదీసివైచి మలి♦నంబగు చిత్తముగల్గియున్న య
వ్వనిత తమోవృతంబు [2]గత♦భంబగు నంబరరీతిఁగాఁ దగెన్. ౬౬ 402

తొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦ - వ సర్గము.

దశరథుఁడు కైకేయిని జూడ వచ్చుట.

ఆ. పాపచిత్తయైన ♦ భామిని విపరీత,ముగను బోధసేయ ♦ సొగసులాడి
విషశరంబు తగుల♦వే సడు కిన్నరి, వలెఁ బరుండెఁ గైక ♦ వసుధమీఁద. ౧

క. తనమదిఁ జేయుంగాఁ దగు, పనులను దగ నిశ్చయించి ♦ భామిని కుబ్జం
గని చెప్పఁబూనె మెల్లగఁ, దనకహితముఁ జెప్ప ననుచుఁ♦దాఁ దెలియక నే.

సీ. మఱియుఁ స్వకార్యమే♦మాడ్కి సిద్ధించునో యనుసంశయమునదీ♦నాస్యయగుచు
దాసిపల్కులకును♦దా మోహితయునౌట వేఁడినిట్టూర్పులు ♦ విడుచుచు ఫణి
కన్యకవోలె నా♦గ్రముహూర్తకాలంబు స్వసుఖావహంబగు ♦ పథము నెంచి
పరికించి నిశ్చయ♦భావంబుతోఁ బల్కె నీవు చెప్పినదెల్ల ♦ నిజ మటంచు

తే. కుబ్జ కైకకు మేలనే ♦ కోరునదియు
నామెపనులందుఁ బూనిక ♦ నందునదియుఁ
గానఁ దన్నిశ్చయము విని ♦ మానసమున
వాంఛ సిద్ధించినట్లుకాంచెఁ ♦ బరమముదము. ౪౫ 405

క. మనుజేశుపత్నికోపం,బును గని దాఁ జేయుకార్య♦మును మానక యుం
డను నిశ్చయించి మోమునఁ, గనుబొమ ముడివడఁగఁ జేసి ♦ కినుకను బరుండెన్.

తే. చిత్రమాల్యంబులును సురు♦చిరవిభూష
ణములుఁ జిమ్ముంగఁ బడియెఁ గి♦న్కను నరేంద్ర
పత్నిచేనంత నవి భూమిఁ ♦ బడియె నాల్గు
భాగములయందు విడివిడి♦గాఁగఁ దవరఁగ. ౬౫ 407

క. ఆలేమ పాఱవైచిన, పూలసరులు రత్నహార♦పుంజము వసుధం
జాల నలరించెఁ దారా,జాలము లంబరమురీతి ♦ స్వప్రభరుచిన్. ౭౫ 408

క. కురులెల్ల నేకవేణీ, కరణిన్ బంధించి గట్టి♦గా నతిమలినాం
బరము ధరియించి కుమ్మరం,దిరమునఁ బడియున్న కైక♦ తేజము దూలెన్. ౮

క. గతసత్వయైన కిన్నర, నితంబిని వలెన్ వెలింగె; ♦ నృపుఁ డచ్చట న
గ్రతనయు నభిషేకముసే,యు తలంపున నెల్లపనుల ♦ నొనరింపంగన్. ౯ 410

---

1 తనకయిన్=తనచేతితో. 2 గతభంబు=నక్షత్రములు మాసిపోఁగా.

చ. తనసచివాళి కాజ్ఞ యిడి ♦ తాను సదస్యుల యాజ్ఞ నొంది యా
త్మను దలపోసె నిప్పుడె క♦దా యభిషేకము సాగునన్న వా
ర్తను బురి విస్తరిల్లఁ దగు ♦ దానినిగా నొనరించినాఁడఁ గా
వున నిది యింతలోనఁ బువుఁ♦బోఁడికిఁ గైకకుఁ దెల్ప మెట్లగున్. ౧౦ 411

క. అని తలఁచి యట్టి ప్రియవా, ర్తను వినిపింపంగఁ గైక ♦ తగియుండును గా
[1]వున వానిఁ దెల్ప సౌధం,బున కరిగె స్వతంత్రుఁడగుట♦భూపతి తమితోన్.

మ. తనుఁ బ్రేమంగన్ గమనించు రాహువుదగన్ ♦ ధారాధరం బచ్ఛమై
కనుపట్టం దగియున్నయభ్రము నిశా♦కాంతుండు వేగంబ చొ
చ్చునటుల్ భూరియశుండు [2]బాధకసతీ ♦ శుభ్రాలయం బప్డు చొ
చ్చెను; క్రౌంచంబులు హంసపక్షులు ధ్వనుల్ ♦ సేయంగ రాణించుచున్.

సీ. శుకమయూరధ్వనుల్ ♦ శోభిల్లఁగాఁ జతుర్విధవాద్యముల ధ్వనుల్♦వివిధరీతు
లను జాల వ్యాపింప ♦ ననుకూలవాక్యంబులను మరుల్ గొలుపఁద♦గినవనితలు
కుబ్జలు వామనాం♦గులు నుల్లసిల్లంగఁ జంపకాశోకభూ♦జములతోడ
నలగు లతాగేహ♦ములుఁ జిత్రగృహములుఁ బొలుపారఁగా దంత♦ములనురజత

తే. కనకముల నిర్మితంబులై ♦ క్రాలునవుఁగు
లందముగ నొప్ప సతతపు♦ష్పాదికముల
నలరఁ జేసెడు దోహద♦మాచరింపఁ
బుష్పఫలముల భూరుహం♦బులు చెలంగ. ౧౩ 414

సీ. నవబావులందందుఁ ♦ గడుఁ జూడఁ దగియుండ దంతములన్ రజ♦తంబుచేత
బంగారమునఁ జేయఁ♦బడిన దివ్యాసనములునొప్ప మీఱంగఁ;♦బలువిధముల
నన్నపానీయంబు ♦ లెన్నోరీతులఁ జేయఁబడిన భక్ష్యంబులుఁ ♦ బ్రబలుచుండఁ
గా నమూల్యంబులై ♦కమనీయకాంతులఁ దగు భూషణంబులఁ♦దాల్చియున్న

తే. వనితలెల్లను జెలువార ♦ స్వర్గమెట్టుఁ
లప్సరసలను గూడిన♦దయి చెలంగు
నట్లు విలసిల్లి సంపద ♦ నతిశయిల్లు
కైకగృహమును జొచ్చె భూ♦కాంతుఁడపుడు. ౧౪ 415

చ. తనదగు మేలిపాన్పుపయిఁ ♦ దన్వి పరుండమిఁ గానఁడయ్యెఁ గై
కను; మనుజేశుఁ డందుఁ గనఁ♦గాఁదగు వస్తువులెల్ల మన్మథా
గ్నిని వెలయింపఁజేయుటయు ♦ నెమ్మికి నాసమయంబు నర్హమై
తనరుట దుస్సహంబయిన ♦ దర్పవికారము తన్నురేఁపఁగన్. ౧౫ 416

1 స్వతంత్రుఁడగుట=ఇది వ్యర్థపదముకాదు. మూలమున "వివేశాంతఃపురంవశీ" అనియు
న్నది. సర్వమస్య వశేవర్తత ఇతి వశీస్వతంత్రః అనివ్యాఖ్య. 2 బాధకసతీశుభ్రాలయము ఇందు
బాధకశబ్దప్రయోగమున కాధారము వ్యాఖ్యయే యని తెలియునది.

య్యనఁ జనుదెంచి కైఁదడవు♦నట్టులు నెయ్యము మీఱఁగాఁ బ్రియాం
గనను రఘుక్షితీశకుల♦కాంతుఁడు తాఁ దడవెన్ వగన్ వగన్. ౨౬. 424

క. కాముకుఁడౌ దశరథుఁడపు, డామానిని యేమిపలుకు ♦ నాతురము దగం
గా నేమిచేయునో యని, దామది భీతిల్లిపలికెఁ ♦ దామరసాక్షిన్. ౨౭ 425

క. కరయుగళిఁ దనువుఁ దడవుచుఁ, దరుణీ కోపంబురాఁగఁ ♦ దగునే నాపై
నరయఁగఁ దత్కారణమును, బరికింపఁగ నేరకున్న♦వాఁడం జుమ్మీ. ౨౭½ 426

చ. నినునెవరైనఁ దిట్టిరొకొ ♦ నీకవమానముఁ గల్గఁజేసిరో
వనితరో! చెప్పుమా సకల♦వార్తల మంగళమూర్తివైన నీ
వు నిటులు దుమ్మునన్ వ్యథను ♦ బూని పరుండఁగనేల? నిన్ను నేఁ
గనుఁగొన దుఃఖమయ్యెడి నిఁ♦కన్ వచియింపుమ సత్వరంబుగన్. ౨౮½ 427

తే. నీకు శుభములె కోరుచు ♦ నిన్నుఁ గనిన
సంతసించుచు నపకృతి ♦ జరుగకుండఁ
గాచు నేనుండ మదికి దుః♦ఖమును గల్గఁ
జేయుచుఁ గలంచుచును నిట్లు ♦ క్షితితలమున. ౨౯ 428

చ. తనువును బాఱవైచి పెను♦దయ్యము పట్టినఁ జిత్తమెట్టిటీ
రునఁ దగునట్లు నీవును బ♦రుండుఁగ నేమొకొ వ్యాధి నీకుఁ గ
ల్గినయదియే వచింపుమ స♦ఖీ వివిధామయరాజినిన్ క్షణం
బునఁ దొలఁగించు వైద్యులిటఁ ♦ బొల్తురు సత్కృతులంది తృప్తులై. 30

సీ. నీకున్న వ్యాధిని ♦ బోకార్చి సుఖమును గల్గఁజేయుదు రటు♦కానదాని
వినిపింపుమా, ప్రియం♦బును జేసె నీకెవ్వఁ డప్రియంబును నెవ్వఁ ♦ డాచరించె
బదులుగాఁ బ్రియము నె♦వ్వనికాచరింపఁగానగునొ యప్రియమున♦ట్లధికముగ నె
వనికాచరింపఁగా ♦ వలయునో చెప్పు మట్లే యొనర్చెద దీని ♦ కేడ్వవలదు

తే. తనువు నాయాసముం బొందఁ ♦ దగదు చేయఁ
జంపఁదగ నట్టివానినేఁ ♦ జంపఁదగునొ
వధ్యు నెవ్వని విడిపింప ♦ వలయునొక్కొ
చెప్పుమా యాప్రకారమే ♦ చేయువాఁడ. 3౨½ 430

చ. వనిత దరిద్రు నెవ్వనిని ♦ భాగ్యసమన్వితుఁ జేయఁగోర్కెయే
సనుపమ భాగ్యవంతునిగ ♦ నాతనిఁజేసెద; ద్రవ్యవంతు నె
వ్వనిని దరిద్రుఁజేయనగు ♦ వారికి చేసెద నింతయేల? నా
జనులును నేను నీదగువ♦శంబున నుందు, మొనర్తు మానతిన్. 33½ 431

క. నాయసువులు పోయెడు విధ, మేర్పైనను నీవుగోరు ♦ నిష్టముఁ జెఱుపన్
నీయాన యేఁ దలంపను, దోయజముఖి! ప్రాణమిత్తుఁ ♦ దొలఁగం జుమ్మీ. 3౪

క. తనపై నాకుం గలిగిన, యనురాగముఁ గనియు, నమ్మకయ్యారె! ప్రతి
జ్ఞను జేయింపంగోరెదు, నని యించుక నవ్వి సుస్మితాననఁ గైకన్. ౩౫

చ. కనుఁగొని కాముకుండగుటఁ గాంతశిరోజములట్టె మెల్లఁగాఁ
దనకయిఁబట్టి యంకమునఁ దన్విని జేర్చి వచించె జేల! నా
వనితలయందు నిన్నిగులు పాటి ప్రియాంగన యొక్తగల్గునే
కనఁ బురుషాళి రాఘవునికంటెఁ బ్రియుండొకఁడుండఁ బోలునే. ౪ 440

క. మనుజలలాముఁడు రాముఁడు, వనజేక్షణ తెలియవేమి వరపుత్త్రుం డె
వ్వనికేని గెలువరాకయె, తనరుఁ జుమీ మేటిబలుఁడు ధన్యాత్ముండున్. ౪౫

తే. ప్రాణములకంటెఁ బూజ్యుఁడై పరఁగు నాతఁ
డట్టి రాముని తోడని గట్టి బాస
చేయువాఁడను నీదైన చిత్తమందుఁ
గల్గువాంఛను దెల్పుమీ కంజనయన. ౬ 442

క. వనితా యొకక్షణమైన నె,వనినిం గనకున్ననాదు ప్రాణమ్ములు వే
చనునో నిజముగ నారా,మునితోడు త్వదీయవాక్యము నె యొనరింతున్. ౭

మ. తరుణీ నాతనువైనఁ దక్కఁగల పుత్త్రవ్రాతమున్ బాంధవో
త్కరముం గూడఁ ద్యజించియేనిఁ గొని మోదంబొంది యేనుండు న
ప్పురుషశ్రేష్ఠుఁడు సాక్షిగా నొనగుతుంబోనీదు వాక్యంబదె
వ్వరుసం గన్పడినం దొలంగ కని నే వాగ్దానముం జేసెదన్. ౮ 444

సీ. కల్యాణి ప్రాణాళికంటె నెక్కుండగు రామునితోడని ప్రతినసేయు
నట్టి నాహృదయంబు నైనఁ గనుంగొని చెప్పినమాటను దప్పననుచు
మది నిశ్చయించి నీమానసాభీష్టంబు నెఱిఁగించి కడతేర్పు మిట్టిదుఃఖ
ముననుండి; నీశోకమును జూచి యేరీతి బ్రదుకుదు నామనోవాక్యము లొక

తే. తీరుగా నుండుటను గాంచి తెలుపుమెద్ది
మంచిదని యెంతువో యట్టిమాట నింక
లలన నీపైనఁ గలప్రేమ బలమెఱిఁగియు
నన్ను శంకింపఁగా నీకుఁ జన్నె చెపుమ. ౯౫ 445

క. ఒనరించెద నీవాంఛిత,మును గూర్చెద నీకు మోదమును నాపుణ్యం
బును దీనికొడ్డి నేను బ్ర,తినచేయుదు ననుచు భూపతియు వచియింపన్. ౧౦

సీ. కుబ్జచెప్పిన పలుకులయందె తనచిత్త మాసక్తమైయుంట నవనిపతియుఁ
దాఁగోరిన ప్రతిజ్ఞ బాగుగఁ జేయుటఁ గని ప్రమోదమునొంది తనకుమారు
పైఁ గల్గియున్నట్టి పక్షపాతంబున మోమోటమును మాని భీమశత్త్రు
వులకైన నోటను బలుకంగరానట్టి పల్కుఁజెప్పఁగ నెంచెఁ బతియు నాత్మ

ఆ. వాంఛితంబు దీర్చు♦వాఁడనఁగ బలుకున
కెంతొ ప్రీతినొంది ♦ యింతి గనదు
పలుకొనర్తు నన్ను ♦ ప్రాణేశుఁడో నేడు
ర్పడిన మృత్యువట్లు ♦ భయదముగుచు. ౧౨ 447

క. వినరానిపలుకుఁ జెప్పం,గను బూని మహీశ నీవు ♦ కడునియమమునన్
దనుజాత సుకృతములమిాఁ,దను వడసఁగ నొట్టుపెట్టి ♦ తగఁ బల్కుటయున్.

క. వరమును నాకొసఁగుటయును, సురలగ్నిపురోగములును ♦ శుభదులు వినుచుం
దురుగాక యందఱిప్పుడు, ధరణీశా! నీనుభాషి♦తంబున కింకన్. ౧౩ 449

సీ. రవిచంద్రులునునక్క♦గ్రహములుసంబరమును రేయియునుబగ♦లును దెసలును
స్వర్గంబు పృథ్వియు ♦ సకలగంధర్వులు రాక్షసుల్ మఱియును♦రాత్రులందుఁ
జరియించు భూతముల్ ♦ సకలగృహాసురు లింకను గలభూత♦బృందమెల్ల
వినుచును సాక్షులై ♦ కనుచు నుందురుగాన సత్యసంధుఁడు నుహా♦శౌర్యశాలి

తే. ధర్మవేత్తయు మఱి ప్రమా♦దరహితుండు
నగు నితం డిచ్చుచున్నవాఁ ♦ డరసి వరము
నిట్టివరమును వింద్రుగా ♦ కెల్ల దివిజు
లనుచు నబ్బలువిలుకాని ♦ ననఘునుతిని. ౧౬ 450

చ. వరదుని గామమోహితుని ♦ వాక్పరిపాటని ధర్మగాఢసం
ధురవర పాశబద్ధునిగఁ ♦ దొయ్యలి తా నొనరించి శ్రావ్యసుం
దరవచనాళిచేఁ బొగడి ♦ దానికి దేవతలెల్ల సాక్షిగాఁ
బరఁగుదురంచుఁ జెప్పి, యిటు♦పల్కెను నాథునితోడ మెల్లఁగన్. ౧౭ 451

క. మును దేవాసురయుద్ధం,బున జరగినయట్టివార్త ♦ బుద్ధిఁ దలఁపుమా
మనుజేశ, రాత్రి యుద్ధం,బున నడుమన్ శంబరుండు ♦ పూనిక మిాఱన్. ౧౮

తే. నిన్ను మార్కొని యనువుల ♦ నిన్నుఁ బాప
కున్న మిగులఁ గలంచుచు ♦ నొగిని మూర్ఛ
మునుఁగఁగాఁ జేసె సారథ్య♦ము నొనరుచుచు
నట్టితఱి జాగరూకనై ♦ యత్నమూని. ౧౯ 453

క. నినుఁ జావకుండఁ గాచితిఁ, గనుకన్ వరయుగ్మమొసఁగి ♦ కరుణించితివో
మనుజేశ, వాని నీయొ,స్గన దాఁచినదానఁ గోరఁ♦దలఁచితి నిపుడే. ౨౦ 454

సీ. సత్యసంధుండవు ♦ జగతీశ! నీయొస్గ దాఁచినవరములఁ ♦ దలఁచి యడుగు
దానఁ గావున నిత్తు ♦ నానిసంచుఁ ప్రతిజ్ఞ సేసి ధర్మంబును ♦ బాసి గాయ
తున్నచో నవమాన♦మొంది యిప్పుడె నాదు ప్రాణముల్ విడుతుఁజూ♦ప్రాణనాథ
యనియె; దానిచ్చిన ♦ యవ్వరంబుల జ్ఞాపకముసేసి చెప్పిన ♦ కైకవాక్య

తే. మునకె భ్రమియించి పతి,మృగ♦యుని కపటపు
స్వనమునకు బేలువోవుచు ♦ వలనుబడిన
హరిణివిధమునఁ దాఁ జెడ ♦ నప్పు డిత్తు
నన్న ధర్మపాశంబున ♦ నతఁడు చిక్కె. ౨౨ 455

చ. తరుణియుఁ గాముమోహితుని ♦ దద్వరదాన నితాంతయత్ను భూ
వరుఁగని యప్పు డిత్తునని ♦ పల్కినదానిని వేఱువేఱ ని
త్తరుణమునందు నీఁదగువి♦ధంబును జెప్పెద నిప్పుడే విభూ
త్వరపడ కాలకింపుము ని♦తాంతము నెమ్మది నట్లు చేయుమా. ౨౩౪ 456

తే. జ్యేష్ఠపుత్రునిదా నభి♦షేకమునకు
నలసినటు కూర్చియున్నట్టి ♦ వస్తువులనె
భరతు నభిషిక్తుఁజేయఁగ♦వలయు నాకుఁ
గాఁగ నిది యొకవరము సం♦గరమునందు. ౨౪౪ 457

క. అనురాగంబున నీవి,చ్చిన రెండవవరముఁగోర ♦ సిద్ధించె నిదో
మనుజేంద్రా సమయము దా,నిని దెల్పెద దండకావ♦నికి రాఘవుఁడుర్. ౨౫౪

సీ. వని యందు వల్కలా♦జినముల ధరియించి జడలఁ దాలిచి మౌని♦సత్తముండు
వసియించురీతిని ♦ బదునాలుగేఁడులు వసియింపఁదగును స♦త్వరము గాఁగ
నతనిని వరమున ♦ కంపి నిష్కంటక మైనట్టి యావరా♦జ్యంబునందు
భరతుని నుంచుమా ♦ పరమాదరంబున వాంఛింపఁగాఁ దగు♦వరము లివియె

తే. మున్నొసంగిన వానినే ♦ ముదముమీఱ
నడుగుచున్నాను నూతన♦మైన దేది
యిందు లేదు రాముఁడు వని♦కేగుచుండ
నిపుడె చూడంగవలయు మ♦హీశ నేను. ౨౭ 459

మ. మనుజేంద్రుండవు, సత్యసంధుఁడవు నీ♦మాటల్ యథార్థంబుగాఁ
జను నిల్పం గులశీలజన్మములఁ ద♦త్సత్యంబునం గావఁగాఁ
జను మౌనుల్ పరలోకవాసమునకుల్ ♦ సత్యంబె యిష్టంబు దా
నిని మించందగు శ్రేష్ఠసాధనము గా♦న్పింపంగ రాదంద్రు సూ. ౨౭౪ 460

ఆ. తపమె ధనముగాఁగఁ ♦ దగు మౌనివర్యులు, చెప్పుచున్నమాటఁ ♦ జిత్తగించి
యున్నవారె మీఱ ♦ లుర్వీశ గావున, నాడినట్టిపలుకు ♦ నరయవయ్య. ౨౮

పదకొండవ సర్గము సంపూర్ణము.

---

౧౨ - వ సర్గము.

కైకమాటలకు దశరథుఁడు శోకించుట.

చ. ధరణివిభూత్తముండు తన♦దారవచించిన వజ్రపాతభీ
కరమగు వాక్యముల్ విని ని♦కామము చింతమునింగి మూర్ఛచే

చ. తనయునిఁ గాంచకున్నఁ జనుఁ ♦ దక్షిణమే యసుపంచకంబు; సూ
ర్యుని విడనాడి యిజ్జగము ♦ నుండునుగాక జలంబులేక స
స్యనిచయముండుఁగాక తను♦జాతుని రాముని బాసినంత నా
తనువునఁ బ్రాణముండ; దిది ♦ తథ్యము పాపమతీ! తలంపుమా. ౧౩½ 471

క. నీపాపనిశ్చయంబిది, నీపతి యసుహానిఁ జేయ♦నేర్చును వినుమా
యోపడఁతీ! యిఁకఁజాలును, నీపంతము విడువు నన్ను ♦ నిల్పుము ధరణిన్.

చ. తలయిది కైక నీదగుప♦దంబులు సోఁక నమస్కరింతు నా
కలఁకఁ ద్యజించి చూపు మను♦కంపను బాపమతీ యిదేలొకో
తలఁచితి విట్లుగాఁగ భయ♦దంబగు చింతితమిద్దియేమి? వే
కలరెడు నీదుపట్టిని బ్రి♦యంబునఁ గాంతునొ లేదొ చూచెదో. ౧౪ 473

చ. భరతునియందుఁ బ్రేమగల♦వాఁడనొ కానొ యెఱుంగఁగోర్కి నీ
కరుదుగ సంభవించినటు ♦ లైనను లెస్స; పరీక్షయందు నో
తరుణిరో! వాంఛయేని ప్రమ♦దంబునఁ బట్టముఁగట్టు మిప్పుడే
భరతునకంచు నీవడుగ ♦ వచ్చునుగాని మదగ్రసూనునిన్. ౧౪½ 474

సీ. వనమునకుం బంపు♦మని చెప్పఁజాలవు కనుకనే మున్ను రా♦మునిగుఱించి
చెప్పియుంటినిగదా♦ జ్యేష్ఠపుత్త్రుఁడు రాముఁ డగునాకు శ్రీమంతుఁ♦డతఁడుధర్మ
మందును జ్యేష్ఠుఁడం♦చని యట్టిమాటలు ప్రియవాదినివి గానఁ ♦ బ్రీతి నాకుఁ
గలుగుటకైనను ♦ గాని నీయందు నా కెలమి యెప్పుడు నుంట♦ కేని రాముఁ

తే. డలరి సేవలు నీకుఁ జే♦యంగ దానఁ
గాని చెప్పియె యుందువు ♦ కైక నీవు
ప్రస్తుతంబగు రామోత్స♦వంబు వినియు
దుఃఖసంతప్తవగుచు వృ♦ద్ధు ననుఁ బూని. ౧౬ 475

చ. కనికర మింతలేక యిటు ♦ కాఱియపెట్టుచు నున్నదాన వీ
వును బరబోధలం దగిలి ♦ పొంకము దప్పిన కోపసద్మమున్
జనరహితంబుఁ జొచ్చితివి ♦ చాన! పిశాచములేవొయంచు నిన్
గనఁబడకుండఁ గావునన ♦ కాఁదగు నీవిటులాడితేమనన్. ౧౭ 476

తే.- ఇంతకాలము నీతిచే ♦ నెసఁగుచుండు, నీకు నిక్ష్వాకువంశంబు ♦ నీవిధమున
ద్రోక్కియును విపరీతబు♦ద్ధులు జనించెఁ, గాన దీనికనర్థమే ♦ గలిగె మిగుల.

తే. ఓవిశాలాక్షి నీవు ము♦న్నొక్కమాటఁ
జేయ వింత యయుక్తంబుఁ ♦ జిత్తహితము
గానిదియు నిప్పు డప్రియ♦మే నహితము
గానిఁ జేయుదువనినమ్మ ♦ నేను జుమ్ము. ౨౦ 478

. గురుమతియై తనరారెడు, భరతునితో రాముఁడెల్ల ♦ భంగుల సముఁడై

పరఁగుఁగదా నీకో సుం,దరి పలుకులు సములె యనుచుఁ ♦ దలఁచెద ననుచున్.

తే. పలుకుచుందువు గాదె కు♦టిలమతివయి
చెప్పి తనుటకుఁ గారణం ♦ బొప్పదెన్ని
సారులో చెప్పితివి గాన ♦ స్వాంతపూర్వ
కముగఁ బలుకంగ లేదనఁ ♦ గాదు నుమ్ము. ౨౧ 480

క. దేవీ ధర్మంబును నీ,వేవిధమున నైన మీఱ ♦ నెంచవు భయమే
యూనహిలు నీకు నిత్తఱి, నావిధ మెటువోలెఁ జాఱు♦యటనిన్ రాముఁడ్.

చ. అతిశయధర్మచిత్తుని సు♦దాత్మజునిం బదునాలుగేండ్లు దు
ర్గతిఁ గనునట్లు గానలను ♦ గాపురముండఁగఁ బంప నెట్లు లో
హితముగఁ దోఁచె నీకు మది♦రేక్షణ యూనుకుమారు ధర్మసం
గతదృఢచిత్తు గాద్రమగు ♦ కానవసింపునటంచుఁ జెప్పఁగన్. ౨౨ 482

చ. మనమున కెట్లు తోఁచెనొకొ ♦ మంచిదిదంచు; శుభేక్షణా! మనో
జ్ఞుని రఘువంశభూషణునిఁ ♦ జొక్కపు సేవలు నీకుఁ జేయువా
నిని బురినుండి తోలుటకు ♦ నీవడుగన్ గతమేమి చెప్పు నీ
తనయునికంటె నెక్కువగఁ ♦ దానొగి సేవలు నీకుఁ జేయుఁగా. ౨౩ 483

క. కానన్ రామునికంటెన్, సూనుండగు భరతునందుఁ ♦ జూడ విశేషం
బే నేను; రాముఁడన నో, మానిని! సేవించు నధిక ♦ మర్యాదఁగనున్. ౨౪ 484

క. నినుఁ బూజించును నీచె,ప్పినపనులను జేయు మనుజ♦వృషభుని శ్రీరా
ముని విడిచిన నధికంబుగ, వనితా సేవించుచున్న ♦ వాఁ, డెవఁడొక్కొ. ౨౫

క. కలరెన్నివేలొ స్త్రీపురు,షులు సేవకపదమునందు ♦ శోధించిన వా
రలలో నొకరును సుతుపైఁ, గలతప్పును విప్పిచెప్పఁ ♦ గల్గిరె చెపుమా. ౨౬

క. పోనిమ్ము లేని నిందను,గానీ కల్పించి చెప్పఁ ♦ గల్గిరె; వినుమీ
మానిని పురుషలలామం,డై నెగడుచు నిర్మలాత్ముఁ ♦ డగు, రాఘవుఁడున్. ౨౭

సీ. సర్వభూతంబుల ♦ సాంత్వనోక్తుల నుపలాలించు దేశస్థు♦లను నభీష్ట
కార్యము ల్సేయుచుఁ ♦ గడుఁ బ్రీతి మన్నించు భూతహితాకృతిఁ ♦ బోలుచు సత్య
మునను స్వర్గాదుల ♦ మునుకొని దాను జయించును మఱియు స♦భీష్టదాన
ముల నొసరించి బీ♦దలను స్వాధీనులఁ జేసికొనున్ భక్తి♦ సేవ లెల్ల

తే. గురువులకు జేసి వారలు ♦ గూఢవిషయ,ములను దనకుపదేశింపఁ ♦ గలుగునట్లు
చేసికొను సంగరస్థలిఁ ♦ జేరినిల్చి, ధనువు నే మూపి శాత్రవు♦లను జయించు.

*సీ. సత్యము పరలోక♦సాధనదానముల్ తపమును నిజదేవ♦తా ప్రియంబుఁ
గనఁ జేయు త్యాగంబు ♦ జనసంఘమందెల్ల మంచిమనస్సున ♦ మించియుండుఁ

* "సత్యం దానం తపస్త్యాగో మిత్రతా శౌచ మార్జవమ్, విద్యా చ గురుశుశ్రూషా ధ్రువా ణ్యేతాని రాఘవే" అనియు. ఇందలి ప్రతిపదమునకు వ్యాఖ్యాతృనభిప్రాయము గొని యిది వ్రాయఁబడినదని యెఱుఁగవలయు.

చెలిమియు, లోపల ♦ వెలుపల శుద్ధియుఁ గపటరాహిత్యంబు ♦ గలిగియుంట
విద్యయు, గురుల సే♦వించుటయు నను నీ గుణములు తప్పక ♦ గూడియుండు

తే. రామునం దెప్పుడు; మఱియు ♦ భామ యార్జ
వమును నుత్తమసుగుణసం♦పన్నుఁ డగుచు
దివిజసముఁడయి ఋషివలెఁ ♦ దేజరిల్లు
నతని వనమునకుం బంపు ♦ మనెద దెట్లు?. ౩౧ 489

చ. వనికిని బంపుపాతకము ♦ వారకచేయ నదెట్లుగల్గెనో
మనము కుమారుఁడందఱకు ♦ మంచిగ సేవచియించునట్టి రా
మునకును విప్రియంబెటుల ♦ బుద్ధి స్మరింపఁగనేర్తు? వింక నా
తనయుని నీకుఁగాఁగ నహి♦తంబులు వల్కఁగనేర్తుఁ జెప్పుమా. ౩౨ 490

తే. క్షమయుఁ దమమును ద్యాగంబు ♦ సత్యధర్మ
ములుఁ గృతజ్ఞత ప్రాణిస♦మూహములకు
హింససేయమి యనునివి ♦ యెవనియందుఁ
గలవొ యాతఁడు దక్క నా♦గతి యిఁకేమి?. ౩౩ 491

క. విను కైకా! వృద్ధుఁడఁ జా,వునకుం సిద్ధముగ నుండుఁ♦బో దీనుఁడనై
నిను వేఁడి వేఁడి యడిగెద, నను దయకుం బాత్రుఁ గాఁ గొ♦నంగందగుఁజూ.

చ. ననుఁ గనఁ జాలి పుట్టును మ♦నంబున నెవ్వరికైన; నింకనుం
వనధులె యెల్లగాఁగలిగి ♦ భాసిలు భూస్థలి నాకు నేదివ
చ్చునొ యదియెల్ల నీకిడెదఁ ♦ జూడుము సత్కృప, రామచంద్రు నీ
మనమునఁ గ్రోధభూతమును ♦ మాత్రము చేరఁగనీకు వేఁడెదన్. ౩౫ 493

సీ. అంజలి చేసెద ♦ నభిమతంబేని నీ పాదమ్ములను గూడఁ ♦ బట్టుకొందు
రాముని రక్షింపు ♦ ప్రతిన దప్పి యధర్మమునకు వశుండనై ♦ చనఁగ నన్నుఁ
జేయకు; మనుచు నా♦క్షితిపతి దుఃఖాభిభూతుండై పలవించి ♦ తత్క్షణంబ [గ్ర
మూర్ఛమునుంగుచు ♦ భూమిపైఁ దొరలుచు శోకంబునమునుంగు♦చున్ మహా

తే. శోకవారాశితీరంబుఁ ♦ జూడఁగల్గఁ
జేయుమా యని పలుమాఱుఁ ♦ జేతులొగ్గి
ప్రార్థనము చేయుచుండ న♦ప్పార్థివేంద్రుఁ
గడుభయంకరరూపయై ♦ కైకయపుడు. ౩౭ 494

చ. కనుఁగొని చాల భీకరము♦గాఁ బలికెన్ క్షితిపా! వరద్వయం
బును మునుపిచ్చి యందులకు ♦ భూర్యనుతాపముఁ బొందెదేల? యిం
కను ధరలోన. వీరుఁడవు ♦ గాఁ గనుపట్టుచు ధార్మికుండ నే
నని యెటుపల్కనేర్తువు? ధ♦రాధిప! మానులు పొల్తురెందఱో. ౩౮ 495

క. వారెప్పుడైన నీతోఁ, జేరినచో నొకటిగాఁగఁ ♦ జెప్పెఱ ధర్మో

ద్వారప్రసంగ మ్మొత్తటి, నారంభము సేయునప్పు ♦ డా రాజస్సల్. ౩౯౪ 496

క. మనుజేశా! నీకుపకృతి, నొనరించినశ్శక కప్పు ♦ డొసఁగితి వరముల్
వనితకు నేగటి నుపకృతి, నొనరించితి వన్న నేమి ♦ యుత్తరనిడుదో?. ౪౦ 497

ఆ ధర్మవేత్తవగుటఁ ♦ దగవారలడిగిన, దానికుత్తరంబు ♦ దగినరీతి
నెట్లు చెప్పఁగలవొ ♦ "యేనుయుద్ధంబునఁ, దెలివి తప్పి రథమ♦వలికిఁ దోలి.

సీ. శిశిరోపచారముల్ ♦ చేసి కాపాడెనో యెవ్వతె కరుణింప ♦ నిపుడు నేను
బ్రదికి యున్నాఁడనో ♦ వనితకా యుపకారిణికిని ముదంబున ♦ నేనొసంగి
నట్టి యన్వరముల ♦ నలరుచు మిథ్యగావించితిగా" యుని ♦ మించుపూన్కి
నచియింతువే? నీవు♦ప్రతిన తప్పకుము గాతటి వరంబులనిచ్చి♦మఱియునిపుడె

తే. వేఱువిధమునఁ బల్కెదు ♦ పృథ్విపలివి, నీవె యిట్లాడు దేని గా♦భూవిభులకుఁ
గల్లలాడెడు వారను ♦ గాఢకిల్బిషంబుఁ గల్గింతు నూ యట్లు ♦ చనునె సేయ.

సీ. శైబ్యుని దానమే♦సరణియో యని పరీక్షింపఁగా నేఁగఁగా ♦ జిష్ణుఁడయ్యె
నగ్ని పావురమయ్యె ♦ నవి స్థిరముంబుగాని యొకదాని భక్షింప ♦ నొకటివెంట
నంటిరా నవిరెండు ♦ నపని శైబ్యునిచెంతఁ జేరఁ బావురమాది ♦ శిబినిగాంచి
శరణుచొచ్చె నతండు ♦ పరిరక్షణముసేయువాఁడ నటంచని ♦ పలికె నంత

తే. శ్యేన మరుదెంచి బ్రహ్మాసి♦శ్చితముమ్మి
నాకుఁ బావుర మాహార ♦ మీనిశ్చఁదగు
దాని నిమ్మన నాతండు ♦ దానినీయ
బదులుగా నస్యమాంసంబుఁ ♦ బడయఁగలవు. ౪౨౪ 500

చ. అనవిని నేఁగ యిట్లనియె ♦ నట్లయినట్ల ధనసంగమాంసమే
కొనఁగఁ దలంతు దాని నిటఁ ♦ గోసి యొసంగుము యన్న నాతఁడుల్
దనదు శరీరమాంసము ము♦దంబునఁ గోసి యొసంగి నేఁగ కా
ర్తిని బడియున్న పావురముఁ ♦ దృప్తినిఁ బొందఁగఁ గాచెనో విభూ. ౪౨౪

తే. మున్నలర్కాఖ్యవిప్రుండు ♦ కన్నులొక్క
బ్రాహ్మణున కిచ్చి తా నొందెఁ ♦ బరమగతిని
సమురు లఖ్గింపఁ దా సమ♦యంబు నేసి
నేలఁ దాఁటఁడు సింధువే♦వేళనైన. ౪౩౪ 502

సీ. శైబ్యుండు మొదలగు ♦ క్ష్మాపాలకులదైన వృత్తాంతముల స్మరి♦యించి యైన
శపథంబు వృథ సేయ ♦ నిపుడు పూనక నిర్వహింపుమా దుర్బుద్ధి♦నీవు ధర్మ
హానికి నొగ్గి రా♦జ్యంబున శ్రీరాము నభిషిక్తుఁగాఁజేసి ♦ యతనితల్లిఁ
గౌసల్యఁగూడి సు♦ఖంబుగఁ గ్రీడింపఁ గోరుచున్నావు నీ♦కోర్కి తెలిసె

తే. నిపుడు నేఁగోరినది ధర్మ♦మే నధర్మ
మేని మంచిది యేఁజెడ్డ♦దేని గాని

నాకు నిప్పుడు నీవిచ్చి♦న వరయుగము
సార్థకము చేయఁగాఁ దగు ♦ నవనిపాల. ౪౮ 503

క. దానికి వ్యతిరేకమ్మే, మేనియు జరగంగరాదు ♦ హితమగు శపథం
బో నరపాలక విడిచియొ, సూనున కుత్సవము చేయఁ♦జూతువ యేమో. ౪౮½

చ. పనివడి నీవు దాని జర♦పంగని యిప్పుడె నీదు మ్రోల నే
గనుఁగొనుచుండఁగా విషముఁ ♦ గ్రక్కున నెంతయుఁ ద్రాగిచత్తు; రా
ముని జనయిత్రి నాసవతి ♦ మోదమునన్ నృపుతల్లియాటచే
జను లొగిఁ జేతులొగ్గఁ గని ♦ సంతసమందుచుఁ బొంగుచుండఁగన్. ౪౯½

తే. ఒక్కదినమైనఁ జూతునే ♦ నుర్విమీఁద
బ్రదికి యుండుటకంటె నా♦మదికి మృతియె
మేలుగాఁ దోఁచుచున్నది ♦ మేదినీశ
వనములకు జ్యేష్ఠపుత్త్రునిఁ ♦ బనుపకీవు. ౫౦ 506

క. దానికి బదులుగ నీవే,మేని మహోపకృతిఁ జేయ♦నెంచిన నే న
ద్దానన్ దృప్తింగొనసని, సూనునితో డాత్మసాక్షి ♦ చొక్కపుఁ బ్రతినన్.

క. ఒనరించుచున్నదానన్, వినుమని యీరీతిఁ బలికి ♦ విలపించుచు న
జ్జనపతి వేఁడిన నుత్తర,మును జెప్పక యూరకుండె; ♦ భూపతి యంతన్.

సీ. వనవాసమునకు రా♦మునిఁ బంపుటయుఁ దనతనయున కభిషేక♦మునుజరపుట
యును దనకిష్టంబు♦లని కైక మిక్కిలి యశుభకరంబులై ♦నట్టి వరము
లడుగఁగావినియింద్రి♦యంబులువ్యాకులములయిమార్గముతప్పఁ♦బలుకకొక్క
గడియకాలంబుండి ♦ కడు నప్రియము లాడినట్టిప్రేయసిఁగేక♦యాత్మజఁ గను

తే. తెప్పవేయక కాంచుచు ♦ నప్పు డతివ
వనమునకు రామునింబంపు ♦ భరతుఁ బట్ట
భద్రునిం జేయుమనిన య♦ప్పలుకు శోక
దుఃఖములఁ గూర్చి వజ్రంబు♦తో, సమమయి. ౫౨½ 509

చ. మనమున కప్రియంబగుచు ♦ మర్మవిభేదన మాచరింపఁగా
విని సుఖమొందఁడయ్యె రఘు♦వీరుఁడు ఘోరతదీయ నిశ్చయం
బును దనదౌ ప్రతిజ్ఞను స్వ♦బుద్ధిఁ దలంచి మఱేమిచెప్పఁగాఁ
దనకు స్ఫురింపమిన్ సుకృత♦ధాముని రామయటంచుఁ బిల[illegible]గన్. ౫౩½

సీ. నిట్టూర్పు విడుచుచు ♦ నెఱినఱుకంబడినట్టి మహీరుహ♦మట్లు [illegible]లఁ
బడియెను; నష్టచి♦త్తుఁడగు నున్మాదిరీతిని రోగబలమునఁ ♦ దెలివి దప్పి
నట్టి రుగ్ణునిపోల్కి ♦ నహితుండికుని మంత్రబలమున వీర్యంబు ♦ వదలినట్టి
సర్పమ్ముతీరున ♦ జగతీశుఁడపుడయ్యె; నంత దీనోక్తుల ♦ నతివఁగాంచి

తే. తగని యీకార్యమును నీకుఁ ♦ దగిన దనుచుఁ
దోఁచునటు బోధసేసె నే♦దుర్జనుండు
భూతమొక్కటి పట్టె నీ♦బుద్ధిఁ జెఱుపఁ
బల్కినట్టులు నాయొద్దఁ ♦ బల్కు దీవు. ౫౧౧॥ 511

మ. వనితా సిగ్గొకయింత లేదె; మును నీ♦బాల్యంబునన్ నీదు వృ
త్తిని నీతీరునఁ జూడుగాఁగఁ గన నీ♦దేహంబు ప్రౌఢత్వముం
గనఁగానే విపరీతమైనపగిదిం ♦ గాన్పించె నావృత్తి రా
మునిఁ గానన్ వసియింపఁ బంపు; భరతుం ♦ బూన్పందగున్ రాజుగాన్.

చ. అని యిటు లేల క్రూరమగు♦నట్టి వరంబును గోరితీవు; నీ
మనమున నిట్టి భీతిదగె ♦ మానిని నీపతికిన్ నగన్ జగం
బునకును నీతనూజునకు ♦ బుద్ధిని మేలును గూర్పఁ గోరుదేఁ
దనయుని రాజుఁ జేయుటయు ♦ దాంతుని రామునిఁ గాననుండఁగాన్. ౫౧౩॥

క. పనుచుటయు ననెడి యీ యఘ, జనకంబగు తలఁపు మానఁ♦జను నీకు మదు
క్తిని వినుమా సద్బుద్ధిని, గనుమా దుష్కార్యమిద్ది ♦ గాన నుడుగుమా.

సీ. కరుణమాలినదాన ♦ వరయఁ గాఁబట్టియే కానకుఁబంపు రా♦ఘవునినంటి
వల్పబుద్ధివి గావె ♦ యక్లాట నీకిట్టి పాపంపుఁ దలఁపులు ♦ పట్టువడియెఁ
బ్రొగ్జన్మమందును ♦ బాపమొనర్చితి కాన నల్పపుబుద్ధి ♦ కలిగె నీకు
రాముండు నేను నీ♦ క్షేమప్రియముచేసి దుఃఖమ్ము నీమదిఁ ♦ దోఁపఁ జేసి

తే. తిమె యెఱుంగము, నీవు మ♦దిందలంచి
నట్లు రాముని విడిచి నీ♦యాత్మజుండు
రాజ్యమేలంగఁ బూను నా♦రాముమించు
ధర్మమున భరతుండని ♦ తలఁతు నేను. ౫౧౫॥ 515

క. వనములకుం జను మని నే, నన రాముని మోముకాంతి ♦ యప్పుడె యందం
బును దప్పఁగ రాహుగ్ర, స్తనిశాకరుఁ బోలియున్న ♦ తఱి నెటుచూతున్.

సీ. మంత్రులతోఁ గూడి ♦ మానుగఁ దలపోసి యేర్పఱించితి మఱి♦యెల్లహితుల
కును దెల్పి స్థిరముగాఁ ♦ గోరి నిశ్చయమును జేసి రాముని కభి♦షేకమొనరు
పంగ మంచిదియను ♦ భావంబుఁ గొంటిని దనసేనపగవారు♦తలఁపడి వధి
యించుచు నుండంగఁ ♦ గాంచినయట్టులు హర్షంబునన్ నిశ్చ♦యంబు చేసి

తే. నట్టి భావము తలక్రిందు♦లై చనంగ
నెట్లు చూతును ? రాముని ♦ కెలమి నుత్స
వంబు సేసెదనని పిల్వఁ♦బంప నృపులు
పలుదెసల నుండి వచ్చిరి ♦ వార లిపుడు. ౫౧౭॥ 517

క. ననుఁగని యేమందురు ? నీ,తనయుం డిక్ష్వాకుకుల ని♦ధానము రాజ్యం

బును జిరకాలము పాలించెనె బాలుండిపుడు వనికిఁ ♦ జేరఁగ జన్నే. ౬౪
సీ. "బుద్ధిమాలిన వృద్ధ♦భూపుండు చిరకాల మేలెనుగాని యే♦మేనిఁ దెల్వి
యున్నచోఁ బుత్రకు ♦ నురుతరాటవికిట్లు పంపునే? యక్కటా! ♦ పాపమనక"
యని యందురేకదా ♦ ఘనగుణవంతులు వృద్ధులు విద్యచే ♦ వెలయువార
లెందఱో యరుదెంచి ♦ యెచ్చట నున్నాఁడు రాముఁడటన్న వా♦రలకు నేమి
తే. యుత్తరము చెప్పఁజాలుదు ♦ నొక్కమాఱు
వరయుగము కైక కిచ్చితి ♦ భరతుని యువ
రాజు సేయంగ వనికిని ♦ రామునంప
వలయునని కైక పీడింప ♦ బడలి నేను. ౬౬ 519
చ. వనికిని రామునంపితిని ♦ వారక యంచని సత్యమాడినన్
మునులు వినంగ రామునకు ♦ మోదము మీఱఁగ యావరాజ్యమి
త్తు ననిన నాదువాక్య మది ♦ దోఁపదొకో, యనృతం బటంచు; స
భ్యనిచయమెల్లనున్ వినఁగఁ ♦ బల్కిటిఁగా సభలోన దుర్మతీ. ౬౬ 520
క. తనయుని వనమున కంపిన, విని యాకౌసల్య యెట్టి♦విధమునఁ బలుకున్
ననుఁజేరి యిట్టియపకృతి, నొనరిచి నేనేమి దాని♦కుత్తర మిత్తున్. ౬౭ 521
సీ. సతతంబు నాకుఁ గౌ♦సల్యప్రియంబునే కోరుచుండును, దన♦కొడుకునందుఁ
బ్రీతియుఁగలయది♦ప్రియభాషిణియుఁ గానఁ బరిచర్యలొనరించుఁ♦బరమనియతి
దాసిగా; మఱియు దూ♦త్మ్ము లోనగువినోదమ్ముల సఖివలెఁ ♦ దా నొనర్చు
ధర్మములను జేయు♦తఱి భార్యవలె సహాయము సేయునాకుహి♦తమును దెలుపు
ఆ. కాలమునఁ దోడఁబుట్టువు ♦ లీల నలరుఁ
దనువు పోషించుతఱిని దా ♦ జననిరీతి
నాదరము చూపుఁ బట్టంపు ♦ నతివ ననుచు
గర్వమును బూనియుండ దె♦క్కాలముననుు. ౬౮ 522
క. ఆయాయివిధంబుల నా,ప్రేయసి ననుఁ గొల్వఁదగిన ♦ విధమున నేనో
యాయా సత్కారంబులఁ, జేయఁగఁ దగువాఁడనయ్యుఁ ♦ జేయను జుమ్మీ,
క. నీమది కోపంబందునొ, యేమో యని సుంతయేని ♦ యేసత్కృతులం
గామిని నలరింపను గా,నే మును నీయందుఁ గలుగు ♦ నెమ్మికతమునన్. ౬౯
ఆ. తెలివిలేమి నీకుఁ ♦ దృప్తిగాఁ జేసిన, యుపకృతులు నవెల్ల ♦ నొగిఁ ద్వదుగ్ర
దుర్జనత్వమిపుడు ♦ తోఁచుట వ్యర్థంబు, లగుచుఁ దాపకరము ♦ లయ్యె నాకు.
ఆ. వ్యాధిపీడితునక♦పథ్యంబు లొ వ్యంజ,నాదు లొప్పు నున్న♦యన్న మెట్లు
బాధసేయునట్లె ♦ బాధించుచున్నవి, నమ్మదిఁక సుమిత్ర ♦ నన్ను నిజము.
చ. పలికినమాటఁ ద్రిప్పుటయుఁ ♦ బంతముపట్టినరీతి రాముఁ గా
నలకును బాఱఁదోలుటయు ♦ నాతి కనుంగొని ప్రీతిపాత్రుఁడై

చెలఁగెడు రామచంద్రు నిటు ♦ చేసె మదాత్మజు నేమిసేయఁగాఁ
గలఁడొ నో యన్నభీతి దన♦ధైర్యము మాపఁగ నమ్మునేననున్. ౨౧౪ 527

ఉ. ఏను సృజించినాఁట హృద♦యేశుఁడు కానల కేగి యుంటఁ దా
దీనతఁ దోఁప నొక్కతెకుఁ ♦ దీవ్రతరాప్రియవార్తలన్ వినున్
జానకి యక్కటా! తుహిన♦సానుసుదాయత పార్శ్వసుందు నెం
తేని మనోజ్ఞుఁ గిన్నరుని ♦ నెట్లొకొ పాసిన కిన్నరీగతిన్. ౨౩ 528

క. తనవిభు నేనెడఁబాపఁగ, వనితామణి సీత దుఃఖ♦వార్ధి మునుఁగుచున్
దనప్రాణంబులు వే విడుచును గా! యకటకట! యేమ్చు♦చున్ బతికొలుకై.

క. పురివెడలి రాముఁ డడవికి, నరుగుచు నుంతంగ నాస♦నుందుం జేయన్
ధరణిజ దానికి నేడ్వఁగఁ, జిరకాలము బ్రదుకఁ గలనె ♦ చెప్పుము కైకా.

తే. నేను జచ్చినతరువాత ♦ నీవు విధవ
వగుచుఁ బుత్రునితోఁ గూడి ♦ యవని నేలు
దువు; ప్రియాత్మజుఁ డడవిదా ♦ రోఁనఁ బట్టి
పోవఁగాఁ బ్రాణముల నెట్లు ♦ పూననేర్తు. ౨౨౬ 531

సీ. క్షణమైన బ్రదుక ని♦జంబిద్ది నిన్నుఁ జక్కనిదానవని మున్ను ♦ గాంచి యింత
దనుక సాధ్వివటంచుఁ ♦ దలఁచితి నీదుర్గుణములు బయల్పడ ♦ నాతి నీవు
దుష్టురాలి వటంచుఁ ♦ దోఁచె భ్రమమ్ముగాఁ; గన్నులకును బ్రీతి♦కరముగాఁగఁ
గన్పడు సుదృంబు ♦ గరళసంయుక్తంబుఁ బ్రాగి తర్వాతను ♦ దానిదుర్గ

తే. ణము ననుభవించు కుజనుచం♦దంబు నాకుఁ
బట్టియున్నది; నీవింత♦వఱకు మోస
పుచ్చుఁగాఁ జాలు మాటలు ♦ ముచ్చటించి
నన్ను లాలించుచుంటివో ♦ వన్నెలాడి. ౨౨ 532

చ. హరిణము మోసపోవఁ దగు♦నట్టి స్వరంబును బాడి దాన నా
హరిణము చెంతఁజేరఁ గుది♦యంగనుబట్టి వధించు వ్యాధుఁడే
కరణి; వధించితీవు నను ♦ గ్రామ్యసుఖార్థము పుత్రునిమ్మి దు
ష్టరమణిఁ గోరుచున్నఁ గని ♦ సజ్జనులందఱు రాజవీథులన్. ౨౭ 533

ఆ. ఇతఁ డనార్యుఁడంచు ♦ నెంతయుఁ దూషింత్రు
సురను ద్రావు భూమి♦సురుని నింద
సేయుకరణి; నిజము ♦ హా యేమిదుఃఖంబు
కష్టమిట్టి దెపుడు ♦ కలుగలేదు. ౨౭౪ 534

క. వనములకంపుము శ్రీరాముని నని నీవన్నమాట ♦ మునుకొని యోర్వం
గనుజాలితి నేనంవిధ, ఘనదుఃఖము పూర్వజన్మ♦షు ఫలవిధమునన్. ౨౮౪ 535

తే. అప్రతీకారమై నాకు ♦ ననుభవింపఁ, దగినదై సంభవించె; నో♦తన్వి! దుష్ట
చిత్త పాపాత్ముఁడను గానఁ♦జిరతరాబ్ద,ములు సుఖంబుగ రక్షింపఁ♦గలిగినాఁడ.

క. తెలియక తనుబంధింపం, గల యురిత్రాటిని జెలంగి ♦ కాపాడుగతిఁ
లలిఁగాచితి నారజ్జువు,వలెఁ జంపం జూచితివిగ ♦ పాపి కిదితగుఁ. ౮౦౪ 537

క. ఏతావత్పర్యంతము, నీతోఁ గ్రీడించుచుంటి ♦ నిను మృత్యువుగా
నే తెలియఁజాలనైతిని, నీతఱిఁ దెలిసితిని జండి ♦ వీపని మదిలోఁ. ౮౧ 538

క. తెలియక బాలుం డొంటిగ, నలరారుచుఁ గాలఫణిని ♦ నల్లనహస్తం
బులఁ బట్టురీతి నిన్నుం, జెలఁగి కరగ్రహణమేను♦సేసితి నకటా!. ౮౧౪ 539

సీ. ఆమహాత్ముఁడు రాముఁ ♦ డపితృకుఁడయ్యనే జీవించియుండుట ♦ చేతఁ బొందఁ
బడుసౌఖ్యములు లేమిఁ♦బాపాత్మునుఁగాంచి యిప్పురజనులుఁపృ♦థ్వీశుఁడితఁడు
మూర్ఖుండు మిగులఁగా♦ముకుఁడునంచునిజంబుగాఁగనాక్రోశింత్రు♦కైకమాట
లను విని యిట్టి పు♦త్రుని వనంబుల కంపుచున్నాఁడు గావున ♦ నువిద కితఁడు

ఆ. వశ్యుఁడయ్యె నంచు♦బహువిధంబుల నన్నుఁ,బలుకువార; లింత♦వఱకు రాముఁ
డఖిల సువ్రతముల ♦ నాచరించుచు బ్రహ్మ,చర్యనియతి గలిగి ♦ సాధువగుచు.

క. గురుశిక్షనొంది శ్రమపడి, నిరతము కాలంబుపుచ్చె ♦ నింతీ సుఖమం
దు రతిం గనియే యెఱుఁగఁడు, స్థిరసుఖముం గనెడువేళ ♦ జింతాశ్రమముల్.

తే. మరలఁ గల్గె నాపుత్త్రుండు ♦ మంచివాఁడు, గాన నడవికిఁ బొమ్మని ♦ నేను బలుక
బదులు రెండవమాటను♦బలుకకల్లై, చనెద మీయాజ్ఞ నను ని♦జంబుకైక.

క. వనమునకుం బొమ్మని నే, ననఁగా నతఁడట్లు పోక ♦ యాజ్ఞ కహితరీ
తిని నడచునేని నాకది, కనఁ బ్రియమగునట్లు సేయఁ ♦ గడఁగఁడతఁడు నూ.

క. తనయుఁడు శుద్ధమనస్కుఁడు, కనుకఁ నను నట్టివానిఁ ♦ గాఁ దలఁచి వనం
బున కేఁగు మన్నఁబోయెద, నను నాయది వేఱుభావ♦మని యెఱుఁగఁడుగా.

క. తనయుం డడవికిఁ బోయిన, జనులెల్లను ధిక్కరింత్రు ♦ చనునే యోర్వం
గనుదానిఁగడకుమృత్యువు, ననుఁగొనిచనుయమునిగ్రహము♦నకుశీఘ్రముగఁ.

తే. నేను మృతిఁగన సుతుఁడు వ♦నికి జనంగ
మిగిలినట్టి కౌసల్యలో♦నగు మదిష్ట
జనుల కిం కేమి కష్టంబు ♦ సరఁగఁ జేయఁ
దలఁచితివొ పాపచిత్తంబు ♦ గలిగియుంట. ౮౯౪ 546

చ. వనముల కాత్మజుం డరుగ ♦ వానిఁ దలంచుచుఁ దల్లిచచ్చు; రా
ముని నెడఁబాసి లక్ష్మణుఁడు ♦ మోహము గాంచఁడు గానఁబోవు నా
తని వెనువెంటనే వనికిఁ ♦ దప్రియసోదరుఁ డేగఁగాదె నీ
తనయునివెంట నింక న్వను♦తద్వయ మింటను లేకయుంటచేఁ. ౯౦ 547

తే. మిగుల దుఃఖించి నాతోడ సు♦మిత్ర వచ్చు
యమునిపురమున కీరీతి ♦ నాత్మజత్ర
యమును కౌసల్యను సుమిత్ర ♦ నల్లె నన్ను
దుఃఖమున ముంచి సుఖయింపు ♦ తలఁచినట్లు. ౯౭ 548

సీ. ఇక్ష్వాకువంశ సు♦క్షేమంగు రాజ్యంబును శాశ్వతము సుగుణ♦సత్కృతంబు
గలవిశాలాంకంగా♦ జేయుగానిదె తగు నేను రాముంపు ♦ దానివిడిచి
చనిన నాకులముగఁ ♦ దనయునితోఁ గూడి పాలించవవు నీవె ♦ ప్రభ్వివగుచు
ననవికి రాఘవుం ♦ డెడుగుట భరతున కిష్టమే యగునేని ♦ మృతుండనైన
తే. నాకుఁ బ్రేతకృత్యంబులు ♦ నీకొమరుఁడు
సేయఁగా రాదు; వినుము యో♦షీ! దురాత్మ
రాలు! కటకట! నాశత్రు♦రాలు! ఛీ క!
వాంఛితముఁ దీర్చుకొన నింక ♦ నవ్వు నీవు. ౯౮ 549

చ. పురుషవరేణ్యుఁడైన రఘు♦పుంగవుఁడుండఁ దనికేగ నేను భా
స్కరసుతపట్టణంబునకుఁ ♦ గాపురముండఁగ నిప్పుడిట్టు లి
చ్చరువుగ మంగళాకృతిని ♦ జెందిన నీవును భర్తృహీనవై
భరతుని గూడి రాజ్యమును ♦ బాగుగ నేలెదు లేవె రాక్షసీ!. ౯౯ 550

సీ. నృపపుత్రియును నొక♦నెపమున నాయింట నుండిన నీవె నా♦కుగురుతరాప
కీర్తి భువిని గ♦ల్గిన తిరస్కారంబు నీవె నీచంబయి ♦ నెగడునట్టి
యనవమానమును నీవె ♦ యిపి పాపమతివైన నాకుఁ గల్గించగి♦నవియొ,యగును
ప్రభువు నాపుత్రుండు ♦ రాముఁడు వలసినఁగుప్పాడు గధముల ♦ హస్తిఘోట
తే. కముల నెక్కియె యిష్టంబు ♦ కరణిఁ దిరుగు
నట్టివాఁ డిప్పు డత్యుగ్ర♦మైన యడవి
నడుగుఁ దమ్ములతో నెట్లు ♦ నడువఁగలఁడు
తలఁపుమా రాక్షసీ! వాఁడు♦గలుగకున్న. ౯౯ 551

సీ. ఎలమి రాముఁడు భుజి♦యించు వేళలఁ గుండలములు ద్రిప్పఁ బాచకు♦లనుగ వేళ్కఁ
నేముందు నేముందు ♦ నేను ముందనుచును సాత్త్వికాహారముల్ ♦ సరసపాన
కముల వడ్డింతురు♦గద యెట్టులా ముద్దుతనయుఁ డోగిరము జే♦యునకటు కము
నైన వన్యాహార ♦ మనుభవించఁగాఁ దిని బ్రదుకు నతిశ్లాఘ్య♦వస్త్రములను
తే. గట్టి చిరకాల సుఖములఁ ♦ గలుగఁజేయు
శయ్యలఁ బరుండి యుండి యిప్పు♦సమయమందుఁ
గానఁ గాషాయవస్త్రముల్ ♦ గట్టి కటిక
నేలపైఁ బవ్వళింపఁగ ♦ నేర్చునెట్లు. ౧౦౦ 552

క. వనమునకు రాముపంపుము, తనయున కీ రాజ్యమిమ్ము ♦ తగ నని ముందుల్
వెనుకయుఁ జక్కఁగఁ బరికింపని యాకొత్రంపుఁబల్కుఁ ♦ బల్కుమటంచున్.

క. నీకెవ రుపదేశించిరొ, నాకుం దెలియంగఁ జెపుము ♦ నారులు తలఁపన్
లోకమున స్వార్థపరతం, జేకొని గూఢముగఁ గీడు♦సేయుదు రన్నీ. ౧౦౨ 554

తే. వనితలెల్లను నిట్టివా♦రనుచుఁ జెప్ప
భరతుజననిని గూర్చియే ♦ పలుకువాఁడఁ
బరులకును నీకు నీయభి♦ప్రాయ మపకృ
తిని గలుగఁ జేయుచున్నది ♦ తెలియవేమి. ౧౦౩ 555

సీ. నీవు పూనినపని ♦ నెఱవేర్పఁ జూచెదు ఘాతకురాల దుః♦ఖములఁ బెట్టి
ననుఁ దపింపఁగఁ జేయఁ♦గను బూనితివె యిట్టి చెడుభావ మేనేమిఁ♦జెడ్డ నీకుఁ
జేసితి హితమునే ♦ చేయు రాముఁడు మాత్ర మే మపకృతిచేసె♦నిపుడు చెపుమ
జనకుల ప్రేమించు ♦ తనయుల విడిచిన విడఁతురు పురుషులు ♦ ప్రీతిపాత్ర

తే. లైన భార్యల మానిన ♦ మానుకొంద్రు
భార్యలును బ్రాణవిభులను ♦ బాయుదు రిది
లోకులకుఁ గోపకారణ ♦ మేకరణిని
గాక యుండునుగాని యో ♦ కైక! యిపుడు. ౧౦౪ 556

క. వని కేనంపఁగ దుఃఖం,బున రాముఁడు మునిఁగియుండఁ ♦ బోలంగనె నా
నిను స్థావరజంగమములు, గొనకొని యో మూర్ఖురాల! ♦ కోపించుఁ జుమీ.

సీ. అందఱికంటె నా♦కధికమాత్మజునందుఁ బ్రేమ కావున రఘు♦రాముఁ డొకటి
దేవకుమారుని♦తీరున సహజమౌ సౌందర్యమునఁ బొల్చి ♦ సకలరత్న
భూషణావళులను ♦ భూషితుండై మత్తవారణగతి మీఱ ♦ వచ్చుచుండ
మనసునఁ జూచిన ♦ మఱియు దవ్వులఁ జూచినను సంతసంబు నా♦కనుపమాన

తే. ముగఁ జెలంగుచునుండుఁ జ♦క్కఁగ సమీప
మున నె రాఁ గంటినేని నా ♦ తనువునందు
నపుడె తారుణ్యమొదవిన ♦ యట్టులగును;
ఇనుఁడు లేకున్న లోకప్ర♦వృత్తి గలుగు. ౧౦౫ 558

క. సురపతి భూస్థలి వృష్టిన్, గురియింపకయున్న బ్రదుకు ♦ గొనసాగునుగా
ని రఘువరుండు మహాటవి, కరుగుటఁ గనునేని లోక♦మందో కైకా!.

ఆ. ఒక్కజంతువేని ♦ యుర్విని మనఁజాల
దనుచుఁ దోఁచుచున్న ♦ దాత్మయందు;
నహితమే తలంచి ♦ యంతంబు నొందింపఁ
బూని పగతురాల ♦ వైన నిన్ను. ౧౦౬ 560

తే. మృత్యుదేవత కరణిని ♦ నిత్యమెలమిఁ
జూపుచున్ నాగృహమున నుం♦చుకొని యుంటెఁ

చెనువిషముగల ఫణివగు ♦ నినుఁ దెలియమి
నంకమున నిడుకొని ప్రీతి ♦ నరయుచుంటి. ౧౦౭ 561

క. ఆయుపకారమ్మునకై, యీయెడ ననుఁ గఱచి చంపి ♦ తిక నేనుందున్
నాయనుఁగుఁ బుత్త్రు రాఘవు, నాయనఘుని చిన్నితమ్ముఁ ♦ డగు లక్ష్మణునిన్.

చ. నను విడనాడి నీకొడుకు ♦ నాతిరొ! నిన్నునె గూడి యీపురం
బును బ్రియబంధుసంతతిని ♦ బూజ్యతరంబగు రాజ్యమున్ వధిం
చి నిఖిలసంపదల్ పొదలఁ ♦ జేయునుగాక ప్రజాభిరక్షణం
బును; నిటుచేసి మానుకరి♦పుప్రతతిన్ ముదమందఁ జేయుమీ. ౧౦౯ 563

సీ. వ్రణముపైఁ బ్రహరించు♦భంగి నీయూపద మునిఁగియుండఁగరా♦మునినిబంపు
వనమున కని నీవు ♦ పల్కుచుఁ బలుమారు కారించుచున్నావు ♦ కడఁగినాదు
స్త్రీలు స్వాతంత్ర్యంబుఁ♦బూని భార్యచరింపఁదగినపద్ధతి మాని♦దారుణంపుఁ
బల్కు వచించెదు ♦ పాపస్వభావ గాన నట్టి నీనోటియం ♦ దనూరియున్న

తే. దంతములు వేయి తునకలై ♦ ధరణి నేల
పడవొకో యీక్షణంబ రా♦ముఁడును నొంత
యప్రియాహితమైన నా♦క్యంబునొకఁడు
పల్కఁ డప్రియమును జెప్ప ♦ వాఁ డెఱుఁగఁడు. ౧౧౦ 564

చ. జనహితభాషణుండు గుణ♦సాగరుఁడు రాముఁడటంచు నిత్యమున్
వినుతులఁ గాంచుచున్న రఘు♦వీరునియందును దోషజాలముల్
కనఁబడునంచు నెవ్విధము♦గా వచియింపఁగఁ జాలు దక్కటా
జనకుని వంశముం జెఱుప ♦ సంభవమందిన దుర్మతి యిఁకన్. ౧౧౧ 565

తే. తాపమొందును, యతికోప♦దహన శిఖలఁ
బడను, నశియింపుమా, కాంచ♦నపు నుంచి
వేయితునకలుగాఁ జెడి ♦ పృథ్విఁ బడను
యింక నేమేని యైనను ♦ యింతి నేను. ౧౧౨ 566

క. పరుషము నప్రియమును నయి, పరఁగెడు నీపల్కు గిటిఁ ♦ బనిఁ జేయను జూ
తరుణీ తుషముపలెన్ భీకరచి త్తవు నీవు సర్వ♦కాలము నరయఁగన్. ౧౧౩ 567

సీ. మిథ్యాప్రియంబులు ♦ మేలుగఁ జెప్పెదు దుష్టస్వభావ వు♦త్కృష్టమైన
నాకులంబును గూల్పు ♦ నీకడఁ జేరితి నామనస్సును దహ♦నప్రకాశ
మటు తాపమును బొందు♦నటు చేయు దానవు హృత్ప్రాణములను ద హి♦యింపఁగోరు
చున్న నీవొక్కతె ♦ యొగిఁ బ్రాణములనుండఁగాఁ జూడనోప నె♦క్కరణినైనఁ

తే. బ్రాణములు నిల్పవింక నె♦బ్బంగి సుఖము
గలుగుఁ గొమరునితోఁ గూడి ♦ యలరుచుండఁ

జాలనేని జీవించియు ♦ నేల గలుగు
రతియు నీపైనఁ గాననో ♦ రమణి యింక. ౧౧౩ 568

చ. పతినగు నాకుఁ గీడొనరు♦పం దగదిప్పుడె నీపదంబులన్
మతి ననుమాననమేఁ గొనక ♦ మానుగఁ బట్టుకొనంగనెంతు న
న్నతిశయమైన కూర్మిఁగను ♦ మంతియెచాలు; నటంచు నేడ్చుచున్
బతి మరియాదమీఱి చను ♦ భార్యకుఁ జిత్తము చిక్కిపోవఁగన్. ౧౧౪ 569

ఆ. దిక్కులేనివాని♦తీరునఁ దప్పద,ములను బడియె రోగి ♦ కలఁగిపడెడు
భంగిఁ గైక యొండు♦వలనును జూచుటఁ, దా స్పృశింపకట్టె♦ధరణిఁ బడియె.

పండ్రెండవ సర్గము సంపూర్ణము.

---

౧౩ - వ సర్గము.

దశరథుఁడు పరితాపము నొంది శోకించుట.

క. మనుజేశుఁ డట్టిశోకం,బున కర్హుఁడు గాఁడు మఱియు ♦ భూస్థలిఁ బడియుం
డనుగాని పదములంటం, గను గాని యనర్హుఁడగును♦గా దలపోయన్. ౧ 571

చ. నరపతి యట్టిఁడయ్యు లల♦నావరపాశపరీతుఁడౌటచే
ధరణితలంబునం బడి ని♦తాంతము శోకమునొంది పుణ్యమున్
గరమునశింప భూవసతి♦కై దివినుండియె వచ్చుచున్న శ్రీ
కరుఁడగు నయ్యయాతివలెఁ ♦ గన్పడు నాతనిఁ జూచి కైకయున్. ౨ 572

సీ. తనకార్యమును దీర్పు♦కొనఁ జూచి యదివ్యర్థమాటయు చాని నె♦క్లైనఁగాని
సాధించుకొనుటకై ♦ జననిందకైన భయమ్మునొందక యన♦ర్థాకృతిఁ దగి
పతికిఁ గల్గినయట్టి ♦ భయముఁ దలంపక భయమునె కలిగింపఁ ♦ బట్టుపట్టి
ప్రాగ్దత్తవరమె, కా♦వలయును నాకని యతనికిఁ దెల్పుచు ♦ ననియె నిట్లు

ఆ. నృపవరేణ్య! నీవు ♦ నేఁ గల్లలాఁడను, నియతసద్వ్రతుండ ♦ నిశ్చయముగ
ననుచుఁ బొగడుకొనెద ♦ వట్లేని నాకిచ్చి, నట్టి వరమునీక ♦ పట్టుదలను. ౩

క. దానిని ఋణముగ నుంచం,గా నెంచెదవేల? యనినఁ ♦ గడు క్రోధంబున్
బూని మహూర్తము మూర్ఛా,ధీనుం డయినట్టులుండి ♦ తెలివొంది తగన్. ౪

క. నేను మృతింగన రాముఁడు, గానల కరుగంగ నోసి ♦ కైకా! దుష్టా!
సూనునితో సుఖముం గను,మో నారిపుభూతులార ♦ యొప్పినకోర్కెన్. ౫

చ. సురపురికేనుబోవఁ బ్రియ♦సూనుని క్షేమముఁ బ్రశ్నచేయు ని
ర్జరులిదియేమి పత్నికయి ♦ రాముని గానలకేగుమన్న భీ
కరవచనంబునెట్లు కడ♦కన్ వచియించితి వంచు దూషణ
స్ఫురణముగాఁగఁ బల్కివినఁ ♦ జొప్పడునేగతి నక్కటక్కటా. ౬ 576

చ. ఋతమున కేను గట్టుపడి ♦ యెంతయుఁ గైకకొసంగినట్టి వా
గ్వ్రతయము సార్థకంబు గను ♦ తీరునఁ జేయఁగఁ బంపినాఁడ నా
దుతనయు నందునేని దమి ♦ తో యువరాజుగఁ జేయువాఁడ రే
పె తనయునన్న సత్యమది ♦ యెట్లు లసత్యముగాదొ చెప్పుమా. ౭ 577

సీ. తనయులు లేకుండు ♦ టను బహుభంగుల శ్రమమొంది పూజ్యుని ♦ సాధు దీర్ఘ
బాహువౌ రామునిఁ ♦ బడసితిఁ బుత్త్రుగా నట్టి శ్రీరాముని ♦ నెట్టివిడుతు
సకలవిద్యలనేర్చి ♦ శౌర్యంబునం బొల్చి జితకోపుఁడై క్షమఁ ♦ జెందియున్న
కమలపత్త్రాక్షుని ♦ గారాబుకొమరు నెట్లడవికిఁ బంపుదు ♦ నతఁడు మఱియుఁ
తే. గనఁగ నిందీవరశ్యామ ♦ కాంతి వెలయు
బలయుతుఁడు దీర్ఘబాహువు ♦ లలితమూర్తి
యగుఁగదా యిట్టిఁడిని దండ ♦ కాటవులకు
నెట్లు పంపుదు చెప్పవే ♦ యింతినీవె. ౧౦ 578

చ. తనయుఁడు హాయిఁ జెందుటకె ♦ తాఁ దగి యుండునుగాని దుఃఖముల్
గనుటకు నష్టఁ డెట్లగును ♦ గాంతరొ సాధుమనీషుఁ డట్టి రా
మునకును దుఃఖముల్ గలుగఁ ♦ బోలఁ గనుంగొనఁజాలు దెట్లుగా
వినుమిఁక రామచంద్రు నట ♦ వీడ్వలవాసనితాంతదుఃఖముల్. ౧౧ 579

తే. కలుగఁజేయక నేనిఁకఁ ♦ గాయముడిగి
పోవుదునయేని సుఖమును ♦ బొందువాఁడ
నప్పటికి నౌదు, దుఃఖమ్ము ♦ నంద నతఁడు
తగఁడుగా సుఖములను బొం ♦ దంగఁదగును. ౧౨ 580

సీ. క్రూరాత్మురాల, యో ♦ ఘోరమతీ సత్యవిక్రముఁడైనాకుఁ ♦ బ్రియముగూర్చు
రాముని దండకా ♦ రణ్యములకుఁ బంపునట్టి యప్రియముఁ జే ♦ యునతఁ డేమి
తప్పొనరించె నే ♦ తత్కార్యమున నాకు నపయశమవమతి ♦ యగు నిజంబు
గానంచు వచియించె ♦ భూనాథుఁ డీగతి భ్రమమొందినట్టి చి ♦ త్తమున నేడ్చు
తే. చుండఁగాఁ గ్రుంకెఁ బద్మమి ♦ త్త్రుండు రాత్రి
యరుగుదెంచె నా రేయియు ♦ నమృతకిరణ
మండలాలంకృతంబయ్యు ♦ మనుజపతికి
నేడ్చుచుండుటఁ గాదయ్యె ♦ హితము సుంత. ౧౩ 581

సీ. వృద్ధభూపతి యంత ♦ వేఁడినిట్టూర్పుల విడిచి యభ్రము వంకఁ ♦ గనులుకొలిపి
దృష్టిరోగార్తుని ♦ తీరున వినువారి కట్టిదుఃఖము గల్గు ♦ నట్టులేడ్చి
తారాఘభూమణి ♦ యో రాత్రి నీవింకఁ దెల్లవాఱకు ప్రీతి ♦ యుల్లసిల్ల
నన్నుఁజూడుమయి దె ♦ నిన్నుఁ జేతులు మోడ్చి ప్రార్థించుచున్నాఁడ; ♦ రాత్రు లెకద
తే. వనితతోడి పొత్తు ♦ కనుక వేగమ తెల్ల
వాఱు మిట్టి యార్తి ♦ భయదమగుచు

నేవరివంకఁ గలిగె ♦ నెంతొ నిర్దయురాలు
ఘాతుకియును నైన ♦ కైకదాని. ౧౯ 582

క. కనుఁగొన నాకిష్టము లే,దనుచుఁ విలపించి యంత ♦ నంజలిబంధం
బున నొప్ప రాజు మఱియును, దనభార్యకుఁ గరుణఁగొలుపు♦తలఁపునఁబలికెన్.

క. విను దేవి! కల్యాణీ!, జననుతశీలంబు గలిగి ♦ శరణము నీవే
యని నమ్మి దీనుఁడనె నై,మనఁ గాలము సుంత గలిగి ♦ మనుజేశుఁడనై. ౨౦

తే. యౌవరాజ్యంబునం గూర్తు♦నంచుఁ బలుక
లేదుగద? యోసి! సుశ్రోణి! ♦ మోదమలర
నెల్లవారును వినుచుండ ♦ నేవచించి
తిని గదా! కృప మదిఁజొన్పి ♦ దీనునన్ను. ౨౧ 585

క. పరికింపుము మోదంబున, ధరణీశునిఁ బతిని గనుము ♦ తరుణీ నీవే
వరములవలనం బొందిన, ధరణీతల మవ్యయముగు ♦ దమిమీఱంగన్. ౨౨

సీ. రామునకిచ్చి ధ♦రాస్థలిసుయశంబు నొందుమా సుశ్రోణి ♦ సుందరాస్య
నయనాభిరామ, యో♦నారీమణీ యిట్లు చేసినచో నింకఁ ♦ జెప్పనేల
నాకును శ్రీరాము♦నకును లోకములకు గురులకు భరతున♦కు నిది ప్రియము
గాఁబొల్చు, నని యెని♦క్కరణిఁ బ్రలాపించి తామ్రేక్షణముల్లొప్పఁ♦దాపమొంది

తే. యశ్రుజలపూర్ణనయనుఁడై ♦ యధిపుఁడెంత
యేడ్చినను బెక్కుభంగుల ♦ నెంత వేఁడి
నను దురాత్మకురాలు గా♦వునను గ్రూర
మైన తలఁపులు గలదియు ♦ నొటఁ గైక. ౨౪ 587

చ. తనప్రియవాక్యముం గొనక ♦ తానపు డూరకయుండె; నంత న
జ్జనపతి యంతదాఁకఁ దన♦స్వాంతమురీతి మెలంగుచుం బ్రియాం
గనయుఁ బతివ్రతానియతిఁ ♦ గాంచియు నుండినకైక యప్డు రా
ముని వనికంపుమంచుఁ గడు ♦ మూర్ఖతచే వచియింపఁ జూచుచున్. ౨౫ 588

క. చిరపరిచితమౌ ప్రియమునఁ, దరుణీమణి ధిక్కరింపఁ ♦ దనప్రియసుతు, ని
ష్కరుణన్ విడువన్ నేరక, ధరణింబడె మూర్ఛ మరలఁ♦దనుముంచుటచేన్.

తే. శోకమున నిట్లు భూమిపై ♦ సోలియున్న
యమ్మనస్వి మహీశ్వరుఁ ♦ డతిభయంబు
గలుగునట్లు నిట్టూర్పులు ♦ వెలికిఁ బుచ్చు
చుండఁగా రాత్రి యంతంబు ♦ నొందె నంత. ౨౬ 590

తే. ప్రతిదినము నిద్ర లేపంగఁ ♦ బరఁగునట్టి
శంఖపటహాదివాద్యముల్ ♦ సరసగీత

తప్పకడిగినవారికిఁ ♦ దగువరముల
నిచ్చువాఁడ వుత్తముఁడవై ♦ యొసఁగు దీవు. ౮ 598

క. కనుకన్ ధర్మప్రతిపాలనమునకును, దానివృద్ధి ♦ లలినొందింపం
గను నేఁ బ్రేరించుటవల,నను నీసుతురామునిన్ వ♦నంబున కిపుడే. ౯ 599

క. పనుపుము త్రివారములు నీ,కును దీనిం జెప్పుదాన ♦ క్షోణీశ్వర! నీ
వనుపమ పూజ్యత్వమునం, దినవాఁడవు గనుక నీప్ర♦తిజ్ఞ నెఱపుమా. ౧౦

చ. పలికినమాటఁ దప్పి రఘు♦వర్యునిఁ గానకుఁ బంపవేని నా
పలుకు వృథాప్రయాసము గు ♦ భంగి నొనర్చిన నీదుత్రోల నే
నిలుతు నె ప్రాణముల్ విడుతు ♦ నిశ్చయమిద్ది యటంచుఁ బల్కె న
క్కలికి; యసంశయంబుగఁ ద♦గం దనుగూర్చియె ప్రశ్నచేయఁగన్. ౧౧ 601

మ. మును పింద్రానుజుఁడైన వామనుఁడు స♦మ్మోదంబు మీఱంగఁ బ
ల్కిన వైరోచను సత్యవాక్యమునఁ బం♦కేజాక్షుఁ డెంతో ముదం
బున బంధించెను వాక్యపాశమున స♦మ్మోదాంతరంగుం బలిన్
దను నింద్రానుజుఁ డిట్లు గట్ట బలియుం ♦ దాఁ బాశసంబద్ధుఁడై. ౧౨ 602

తే. వామనుఁడు గట్టినట్టి యా♦పాశములను
దాను విడిపించుకొనఁ డట్టి ♦ దనుజవిభుని
కరణి సత్యప్రతిజ్ఞుండు ♦ గాన నృపతి
సత్యపాశంబులను ద్రెంపఁ ♦ జాలఁడయ్యె. ౧౩ 603

సీ. కాఁడికి బండిచ♦క్రమునకు నడుమఁ జొచ్చిన వృషభంబురీ♦తిని మనంబు
సుడివడుచుండంగ ♦ సురుచిరముఖమట్టె వెలవెలఁబాఱఁగా ♦ విభుఁడు, కలఁత
నొందిన నేత్రంబు ♦ లొప్ప నంధునివలె నేమియుఁ గనుఁగొన♦కేయటుండి
యెట్టకేలకు ధృతి ♦ యించుక కలుగ క్షోభమునందు మనసును ♦ బట్టి నిల్పి

తే. కైకఁ జూచి వచించె; న♦ఘప్రలుబ్ధ
చిత్తురాలా! యిఁకేసుందు ♦ శిఖియెదుటను
మంత్రపూర్వమ్ముగాఁగొంటి ♦ మదిఁ దెలియక
నీకరము నిప్డు విడిచితి ♦ నేను దాని. ౧౪ 604

క. కనుకన్ భార్యవుగా విం,కను నాకు న్నీవు, నేను ♦ గన్నకుమారున్
నినుఁబోలె విడిచితిని, రే,చని యెడు, రవియుదయశిఖరి♦సరణికి రాఁగన్. ౧౫

చ. గురుజనులెల్ల రాఘవున♦కుం దమిచే నభిషేకమిప్పుడే
ధరణిప సేయఁగాఁ దగును ♦ దానికిఁగాను పదార్థసంచయం
బరుదుగ సేకరించితి మ♦టంచును దొందరపెట్టువార లో
తరుణి! ధ్రువంబు; నీవలన ♦ దానికి విఘ్నముగల్గె తీఱెనన్. ౧౬ 606

ఉ. ఏను యమాంతికంబునకు ♦ నేగుదుఁగాన మహోత్సవార్థమై
జానుగఁ గూర్చినట్టి శ్రమ♦సాధ్యపదార్థములన్ గ్రహించి నా

తే. శిష్యపరివృతుఁడై పురి ♦ చెంతనున్న
సరయువునఁ గ్రుంకి పురమున ♦ కరుగుదెంచె
సకలసంభారములఁగొని ♦ సంతసమునఁ
బట్టమును రామునకుఁ గట్టు ♦ పంతమునను. ౨౬. 617

సీ. సలిలంబులం జల్లి ♦ చక్కఁగ దుడిపించి ఘంటాపథంబులఁ ♦ గ్రాలఁజేసి
మేలైనపడగలఁ ♦ జాల శృంగారించి వివిధచిత్రసుమాళి ♦ వెలయఁజల్లి
బహువిధసుమహార ♦ పటలిని వెలయించి జనులు గైసేసిరా ♦ ఘనపురంబు
నంత నానగరంబు ♦ హర్షజనోపేత మయి యంగడులనెల్ల ♦ నఖిలవస్తు
తే. వులు చెలంగఁగ భాసిలి ♦ లలితరీతిఁ
దనరునుత్సవములనొప్పి ♦ మనుజవిభుఁడు
రాముఁడగునంచు ♦ నతనికై రచనజేయు
నుత్సవంబుల జనులెల్ల ♦ నొప్పఁ జెలఁగి. ౨౯ 618

సీ. సురుచిరచందనా ♦ గరుధూపవాసనల్ బుగులుకొనుచునుండ ♦ సొగసుమీఱి
దేవేంద్రునమరావ ♦ తిని బోలి యొప్పార నందుఁ బ్రవేశించి ♦ యమ్మునీంద్రుఁ
డల్లనఁ జనిచని ♦ యమరు నంతఃపురమును బ్రవేశించె స ♦ మ్మదము మీఱఁ
బలువన్నెలలరుప ♦ క్షులు చెన్నుమీఱంగ గుమిగూడికొలకొలఁ ♦ గూయుచుండఁ
తే. బురజనులు జానపదులు వి ♦ ప్రులును నిండి
యుండ నలరారి, మఱి సద ♦ స్యులును యజ్ఞ
వేత్తలు నగు ధరామరుల్ ♦ వెలయ నద్ది
యొప్పులకుఁ గుప్పయైయుండ ♦ నప్పుడెలమి. ౩౦ 619

క. మునివరుఁడు వసిష్ఠుండా, జనులఁగడచి ద్వారమునకు ♦ సన్నిహితంబై
మనుజేంద్ర నిర్మితంబౌ, ఘనతరవేదికను జేరఁగాఁ ♦ జనె నచటన్. ౩౧ 620

చ. పురుషవరేణ్యుఁడై తనరు ♦ భూపతికిన్ రథచోదకుండుగాఁ
బరఁగినమంత్రిసత్తముఁడు ♦ భవ్యమహోత్సవదర్శనార్థమై
సురుచిరభూషణావళుల ♦ శోభిలుచున్న సుమంత్రుఁ డప్పుడే
నిరుపమలీలలోనికి జ ♦ నెన్ మఱి యచ్చటనుండి యత్తఱిన్. ౩౨ 621

తే. ద్వారసీమకు రాఁగఁ బ్ర ♦ భావిరాజి
తుఁడు వసిష్ఠమహామునీం ♦ ద్రుఁడు విశార
దుని సుమంత్రుని గాంచి రా ♦ జునకుఁ జెపుమ
త్వరగ నే నిందు నున్నట్టి ♦ వార్త నీవు. ౩౩ 622

క. గంగోదక పూరితములు, బంగరుఘటములును జలధి ♦ వారినిబిడముల్
బంగారు కలశములును వి, భంగనియతి దేఁబడియెను ♦ భవ్యమనీషా. ౩౪ 623

తే. భద్రపీఠంబు రామునిఁ ♦ బట్టభద్రుఁ
జేయుటకు మేఁడిమ్రానునఁ ♦ జేయఁబడిన

దాని దెప్పించితిని సుగంధ♦ములు వివిధ
ధాన్యరత్నంబులెల్ల సి♦ద్ధంబులయ్యె. ౩౫ 624

సీ. పెరుగు నెయ్యియుఁ దేనె ♦ పేలాలు పువ్వులు పాలు సౌందర్యవ♦ద్భవము గల్గు
కన్యక లనమంత్రు ♦ కడునుదించినయట్టి గజములు రప్పింపఁ ♦ గాఁబడియెను
*జతురశ్వయుతమును ♦ చారుకాంతిందగి యున్నరథంబు న♦త్యుత్తమమగు
ఖడ్గంబు నుత్తమ♦కార్ముకంబును మోచు జనులతోఁ బల్లకి♦యును శశివలెఁ

తే. దెల్లనౌ ఛత్రమును మఱి ♦ తెల్లనైన
చామరయుగంబునుం బస్త♦చారుకనక
రచితపాత్రముఁ బెనుమూఁపు♦రములు గల్గి
కనకరశ్మినిబద్ధమ్ము♦లును నయి తగి. ౩౬ 625

క. సితకాంతులు గల వృషభ, ప్రతతియుఁ, గేసరములొప్పు ♦ బలము మఱియుఁగా
జతలేక నాల్గునంతములు తగఁ జెలువారు వాజు♦లుం దేఁబడియెన్. ౩౭

తే. వ్యాఘ్రచర్మంబు వసించిసిం♦హాసనంబు
నగ్నిహోత్రము సిద్ధంబు♦గాఁ జెలంగు
చున్నయది సర్వవాద్యంబు ♦ లొప్పె సిద్ధ
ములుగ భూషితలైన వే♦శ్యలును మఱియు. ౩౮ 627

క. ఇతరస్త్రీలును సంభూషితలై రాచార్యవరులు ♦ క్షితిసురవర్య
ప్రతతులును వచ్చియున్నా, రతిశయపయసుదగుగోవు ♦ లాయత్తములై. ౪౦

తే. ఇదిగో యున్నవి పుణ్యమ్ము ♦ లితరమృగము
లాయితమ్ములయ్యెఁ బక్షులు ♦ నలరుచున్న
వదిగో పురజనులును జాన♦పదులు వర్త
కులును గుంపులుగావచ్చి ♦ రెలమి మిగుల. ౪౧ 629

సీ. ఇంకను బెక్కండ్రు♦హితమతుల్ మేముతోడ్కొని రాఁగ నచ్చిరి♦కుతుకమలరఁ
బ్రియభాషణులు మఱి ♦ పృథివీశులును రాము నభిషేకమీక్షింప♦నరుగుదెంచి
యున్నారు, శుభదమ్మ♦యొప్పునీపగటియందునఁ బుష్యనక్షత్ర♦మున నెరాముఁ
డభిషిక్తుఁడగునట్లు ♦ లవనీశుఁ ద్వరపెట్టు మని యగ్నిహోత్రుఁడి♦ట్లాడుటయును

తే. విని సుమంత్రుఁడు రాజసిం♦హునిఁ బొగడుచు
సౌధమును జొచ్చె నీతని ♦ సాధుమతిని
నడ్డగింపఁగ వలదని ♦ యాజ్ఞసేసి
యుండె రాజేంద్రుఁడేగాన ♦ నిండువేడ్క. ౪౩ 630

క. అంతఃపురమును జొచ్చెను, శాంతు సుమంత్రునిని వృద్ధు ♦ సచివోత్తమున
భ్యంతరమునఁ బగు సుభటులు, సుంతయు వలదనక విమువఁ♦జొచ్చెనతండున్.

---

* గాయత్రి నాలుగవ యక్షరము ప్రారంభము. "చతురశ్వ" అనుచోటనున్న "చ" అను
నది.

తే. ద్వారపాలకు లెల్లను ♦ ధారణీశు
నకుఁ బ్రియంబగు కార్యంబు♦నన్ సమాహి
తులుగ దా వార లల్లాట ♦ పలుకకుండి
రంత నావృద్ధమంత్రి య♦భ్యంతరమున. ౪౪ 632

క. ధరణీశుం గని యాతని, పరిసరమున నిల్చి యతఁడు ♦ పడుచుండెడు నా
దురవస్థ నెఱుఁగమిని సుం,దరవాక్కులఁ బొగడఁ బూనె ♦ నరపతిని దమిన్.

తే. కరయుగము మోడ్చి యప్పటి ♦ కాలమునకుఁ
దగిన రీతిని రాజసౌ♦ధమున నృపుని
మనమునన్ సంతసముఁ దోఁపఁ ♦ గనె యొనర్పు
పల్కులను వినుతించె ని♦బ్బంగి నతఁడు. ౪౬ 634

[1]చ. నిరుపమ తేజ మొప్ప ఘన♦నీరధి, పూర్ణశశాంకుఁ డల్లె ప్రా
గ్ధరణి ధరంబునం బొదలఁ ♦ దత్కరముల్ తనయందు వ్రాల మో
దరతిని గాంచునట్లు ఘన♦తంగను నీవు స్వతః ప్రమోదముం
గరము భజింపు మో మనుజ♦కాంతవరా! రఘువంశపుంగవా!. ౪౭ 635

క. మాతలి యింద్రు నుతించెను, నీతరుణమునందె యాతఁ ♦ డెల్ల దనుసుత
వ్రాతము జయించెఁ గద య,ట్లీతటి మేల్కొల్పువాఁడ ♦ నేఁ బొగడినినున్.

తే. అంగభూతములైన శి♦క్షాదివిద్య
లను దగంగూడు వేదముల్ ♦ ఘనుఁడుఁ బ్రభువు
నగు విరించికి సృష్టికిఁ ♦ దగినయర్థ
ములను బోధించునటు నిన్ను ♦ వలయు పనుల. ౪౯ 637

[2]క. ఒనరించుటకై మేల్కొలు,పను వచ్చినవాఁడ నెల్ల♦ప్రాణుల ధరియిం
చిన శుభదధాత్రి శశియుత, వనజాప్తుం డిరుతటులను ♦ బ్రాణిహితముకై.

ఆ. మేలుకొలుపునట్లు ♦ మేలుకొలుపుదు ని,న్నేను రాజరాజ! ♦ యింకఁ ద్వరగ
నుత్సవార్థ మిప్పు♦డొప్పు నలంకార, ములను దాల్చి సజ్జ♦నులకు నెల్ల. ౫౦

సీ. నయనోత్సవము సేయ♦నైజభావిలసిత మగు దేహమునఁ గ్రొత్త♦సొగసు వెలయ
మేరువునుండి య♦నూరుసారథి యుదయించురీతిని లెమ్ము ♦ యినకులేంద్ర

1 యథానందతి తేజస్వీ సాగరో భాస్కరోదయే. ఇచ్చట భాస్కరశబ్దమునకు సూర్యుఁడర్థము గాదు. చంద్రుఁడర్థము. "భాసఙ్కరోతీతివ్యుత్పత్త్యా భాస్కరః పూర్ణచంద్రః" అనివ్యాఖ్య. "సాన్నిధ్యతః సిద్ధపదస్య బుద్ధాః" అన్న న్యాయము ననుసరించి యౌగికముగా భాస్కరశబ్దము నకుఁ జంద్రుఁడని యర్థము చెప్పవచ్చును.

2 ఆదిత్యస్సహచంద్రేణ యథాభూతధరాం శుభాం, బోధయ త్యద్య పృథివీం తథా త్వాం బోధయా మ్యహం. అని మూలము. రవిచంద్రులు రెండువేళల భూమిని మేలుకొలుపునట్లని యర్థము. ఇరుతటులను = రెండువేళల ననఁగా నుదయాస్తమయములయందని భావము.

క. మానవపతి దుఃఖంబునఁ, దానై మాటాడుశక్తి ♦ తఱిగి యటుండన్
దానపుడు మంత్రవేత్తయె, గానన్ సారథిని గాంచి ♦ కైక వచించెన్. ౬౧౪

సీ. క్షితిపతి రామాభి♦షేకసముత్సుకుం డయి రాత్రి మేల్కొని♦యలసి యిపుడు
నిద్రావశుండయ్యె ♦ నీవు వేగమపోయి యశముచే వెలయుచు♦న్నట్టి రాముఁ
దోడ్కొనిరమ్ము సం♦తోషంబు నీకగుఁగాక; నీవేమి యి♦క్కార్యమందు
యోజింపవలదని ♦ యొత్తిచెప్పినవిని శంకించుచున్నట్టి ♦ స్వాంతమందుఁ

తే. గైకమాటలు చొచ్చిన♦కారణమున
నింకఁ గల్యాణ మగు నని ♦ యెంచి సంత
సించి రాజానుమతి నిట్లు ♦ చెప్పె నీమె
యనుచు నుబ్బుచు వేగంబ ♦ యరిగె నతఁడు. ౬౮౪ 650

క. వనితయు రాముం దోడ్కొని, తనువేగమ రమ్మటంచుఁ ♦ ద్వరపెట్టుటయున్
మనమున ధర్మజ్ఞుఁడు రా, త్తనయుం డభిషేకమునకె ♦ తానిచ్చటికిన్. ౬౫౪

తే. ఇపుడె రాఁబోవుచున్నాఁడు ♦ హితముకాదె
యని మనంబునఁ జింతించి ♦ యమితమోద
మలర నష్టమహాబాహు సీ♦తాధిపతిని
గనుఁగొనఁగఁగోరి పురమధ్య♦మునఁ దనరుట. ౬౬౪ 652

సీ. జలనిధి మధ్యసం♦స్థంబగు మడుగునాఁ దగునంతిపురినుండి ♦ తాను వెడలి
జనసంకులంబుగాఁ♦గనుపట్టు తద్ద్వారమును ముందుఁజూచి దా♦నినిఁగడచుచుఁ
జని ద్వారమునుజేరి ♦ క్ష్మాపతులను గాంచి పెక్కుధనంబులఁ ♦ బెక్కుకాను
కలను గైకొని రాజు ♦ నెలమిని జూడంగఁ గోరుచున్నట్టి యా♦ద్వారతీర

తే. మందు నిలిచినపౌరుల ♦ నల్లె జాన, పదుల వణిజుల బహుదేశ♦వాసులైన
శ్రోత్రజనులను జూచెను ♦ గూర్మితోడ, వేడుకలు సల్పువారల ♦ వింతజనుల.

పదునాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౧౫ - వ సర్గము.

### పట్టాభిషేక సంభార వర్ణనము.

క. శ్రుతిసాగరపారగులయి, క్షితిఁ దగు నావిప్రవరులు ♦ క్షితివిభుని పురో
హితుఁ డగు వసిష్ఠసంయమి, పతితోఁ ం జేరిరట స♦భాభవనంబున్. ౧ 654

చ. మతి విభవంబునన్ దనరు ♦ మంత్రులు సైనికముఖ్యులల్లె పౌ
రతతులయందు మేటులును ♦ రాఘవునయ్యభిషేకదర్శనం
బతులముదంబుఁ గూర్చునను ♦ నాశల నచ్చటఁ జేరి భూసుర
ప్రతతిని గూడి; రంతటను ♦ భానుఁడు తోఁచెను నిర్మలాత్ముఁడై. ౨ 655

తే. గజవరం బొండు చెలువారెఁ ♦ గన్ను భూష
ణములఁ దాలిచి మంగళా♦ర్థము నియతము
గాఁగఁ గన్యక లెనమండ్రు ♦ కాచియుండి
రమలవీణాదివాద్యంబు ♦ లమరియుండె. ౧౨ 662

క. స్తుతిపాఠకులును మఱియును, నితరులునుం దమరుచేయు ♦ నెల్లపనుల నా
దృతిఁ గల్గి నిలిచియుండిరి, క్షితిపతులా రాఘవాభి♦షేకోత్సవముఁ. ౧౩

సీ. కనుఁగొను వేడ్క ని♦క్ష్వాకువంశ్యులకెల్లఁ బట్టాభిషేకోత్స♦వంబు జరగు
సమయంబులఁ దదా♦చారము చొప్పున నెట్టిట్టి వస్తువు ♦ లెల్లఁ గూర్ప
వలయునో యట్టి యా♦వెలలేని రత్నాది వస్తువులంగొని ♦ వారు రాజు
ననుమతి చొప్పున ♦ నంతఃపురద్వారమునఁ గూడి నరపతి ♦ కనఁబడమిని

తే. మనమువచ్చి యిందుండుట ♦ మనుజపతికిఁ
జెప్పువాఁడెవ్వఁడో యాతఁ ♦ డిప్పటికిని
గాన రాకున్నవాఁడు భా♦స్కరుఁడు పొడిచె
నింతకుఁ ముందె తల్లగ్న ♦ మిదిగో వచ్చె. ౧౫ 664

క. అని తమలోఁ దారనుకొను,చునుండ నృపసత్కృతుండు ♦ శుభ్రమనీషం
దనరారు సుమంత్రుం డా, మనుజేశులఁ గాంచి పలికె ♦ మర్యాద దగఁ.

క. నరపతి యాజ్ఞాపింపఁగ, నరిగెదఁ గొని తేర రాము ♦ నతివేగముగా
నరపతికి మీరు పూజ్యుల, రరయఁగ శ్రీరాఘవునకు ♦ నధికముగాఁగఁ.

తే. ఆయురభివృద్ధి గలిగిన ♦ యట్టిమీవ
చనము చొప్పున నేనిప్డు ♦ మనుజపతియు
మేలుకొని యుండుఁ గానఁ బోఁ♦జాలువాఁడ
నరిగి మీకుసుఖంబె యఁ♦చడుగువాఁడ. ౧౮ 667

తే. భూపతులకెల్ల దర్శనం♦బును దగంగ, నీయ బయటికి రాకుండు♦టేలొకో? య
నుచు నడిగెదను నేనని ♦ ప్రచురరాజ, పూర్వవృత్తాంతమెఱిఁగిన♦బుద్ధిశాలి.

సీ. అంతఃపురంబున ♦ కరిగి యడ్డములేక తాఁ బ్రవేశింపఁగా ♦ దగును గాన
నందుఁ బ్రవేశించి ♦ యవనీశునిం గాంచి యాతనివంశంబు ♦ నభినుతించి
శయనగేహము సొచ్చి ♦ సన్నికృష్టమునకు నరిగియు యవనిక ♦ కవలనృపుఁడు
పడుకొనియుండఁ నీ♦వలనిల్చి గుణవంతములగు సదాశిష♦ముల నతండు

తే. రాజు వినుతించి పలికెఁ దా♦రావిభుండు
పద్మమిత్రుఁడు శంకర ♦ వైశ్రవణులు
వరుణుఁ డగ్నియు దేవతా ♦ పాలకుండు
నీకు విజయంబు నిత్తురు ♦ గాక భూప. ౨౩ 669

రుముఖధూపాయత్త♦సుమహితవాసనాభూయిష్ఠమై మఱి ♦ పొలుచునట్టి
మంచివాసనలఁ గ♦ల్పించుగంధంబుల నలరారుచుండుట ♦ మలయగిరికి
దాపుననున్నట్టి ♦ దర్దురగిరిశిఖరాకృతిఁ గనుపట్టి, ♦ యతిమనోజ్ఞ
బర్హిసారసమ్మద♦స్వనరాజితంబయి ద్వారభిత్తులను స్తం♦భముల సొగసు
గాఁ జెక్కఁబడిన వృ♦కంబుల నొప్పుచుఁ జిత్రకారులు సూక్ష్మ♦చిత్రములను
జెక్కియుండుట సొంపుఁ♦జెందుచు సాంద్రమహా కాంతిచే నొప్పును♦గాన నెల్ల
ప్రాణులచూడ్కుల ♦ స్వాంతంబులంగడు నాకర్షణముచేయు ♦ నట్టులమరి
శశధరభాస్కర ♦ సదృశకాంతులమించి యింద్రకుబేరుల ♦ గృహములట్లు
సాటిలేకచెలంగి ♦ నీటుఁగుల్కుచు బహుపక్షియుతంబుగాఁ ♦ బరఁగి, మేరు
సానుమచ్ఛిఖరస♦మానమై తగియున్న రాముని దివ్యమహా ♦ ధామమును సు
మంత్రుఁడు గనియెను♦మఱియు నాసౌధంబు దాపున జనసము♦దాయమెల్లఁ
గరములు ముకుళించి ♦ కడుమోదమున నాల్గుదెసలఁ జూపట్టిరి ♦ దివ్యరామ
పట్టాభిషేకోత్స♦వంబగు నని జానపదులు ముఖంబులఁ ♦ బ్రమదమలర
నుత్సాహమధికమై ♦ యొప్పంగఁ గాన్కలఁ గైకొని సదమలా♦గారమునకు
నలుప్రక్కలందును ♦ నిలిచియుండిరి గాన సొంపారుచుండె నా♦శుభగృహంబు
భూరిమేఘమురీతిఁ ♦ బొలుపారి పొడవయి సమలంకృతంబయి ♦ సకలరత్న
లలితమై వెలసి, గు♦జ్జులు స్వల్పదేహులు లోనగు జనులును ♦ మానసములఁ

తే. బొదలుచుండ వినోదముల్ ♦ పూనిచూచు
చుండ నొప్పారె నామేడ ♦ నిండుమదిని
గాంచి యామంత్రియుం దురం♦గములఁ బూన్చి
మీఁదికప్పునఁ దగినయా♦మేటిరథము. ౮౦ 680

క. సరకులసంకులమగు రఘు,వరుగేహము వైపుఁదోలి ♦ పట్టణసుజనో
త్కరముల మనసులు రంజిల, వరుసగ నొనరించి మంత్రి♦వర్యుం డంతన్. ౮౧

చ. అనిశము విత్తవృద్ధి నల♦రారుచు బర్హిణముల్ మృగంబులుం
గనుఁగొనఁ జిత్రమై బలసి ♦ క్రమ్మఁగ శ్రేష్ఠపదార్థయోగ్యుఁడై
తనరెడు రామచంద్రవర♦ధామము నొంది సురేంద్రుమందిరం
బును గనినట్లు సంతసముఁ ♦ బొందుచు గగ్గురుపాటుఁ గాంచుచున్. ౮౨ 682

సీ. కైలాసగిరివలెఁ ♦ గడుఁదెల్లనై యలంకృతములై దేవతా♦యతగృహంబు
లట్లుగా మెఱసెడు♦నట్టి కక్ష్యలఁ బ్రవేశించి యాస్థలములఁ ♦ జెన్నుమీఱి
రామమతానుసా♦రంబుగ మెలఁగుచు నతనికిఁ బ్రియులగు♦నట్టి నరులఁ
జెక్కండ్రఁగని వారి ♦ వెసదాఁటి శుద్ధాంత సన్నికృష్టమునకుఁ♦జనియె నచట

తే. సంతసమ్మున రాము ను♦త్సవముఁ గూర్చి
యున్నవిధముల శుభముల♦య్యనఘుమతికిఁ

గలుగనలయు నటంచును ♦ బలుకుచున్న
జనులపల్కులు వినియెను ♦ సన్నుతమున. ౮౮ 683

చ. నృపసతిమందిరంబువలెఁ ♦ జూడ మనోహరమ్ము సుమేరుభూ
ధరశిఖరంబుభాతి వితతంబయి పక్షిమృగాకులంబుగాఁ
బరఁగి ప్రభావిశేషమున ♦ భాసిలి చూడఁగ నొప్పియున్న సుం
దరరఘువీరుమందిరముఁ ♦ దాఁ గనియెన్ సచివుండు పొంగుచున్. ౮౯ 684

చ. కరములు మోడ్చి భక్తిమెయిఁ ♦ గానుకలూని రథాళి డిగ్గి యాం
దరమున రాముని గనఁగఁ ♦ దత్తఱమందుచుఁ గోట్లసంఖ్యచే
వనుసఁ బరార్థసంఖ్యలను ♦ బాగుగ లెక్కడరానియట్లు మం
దిరమున ద్వారసీమను మతిస్థిరతం గనువారి నెంతయున్. ౯౦ 685

తే. ఉత్సవంబును గనువేడ్క ♦ నున్నవారి
జానపదులను జూచె నా ♦ స్థలమునందు
భూరిజలనంబురీతి పెన్ ♦ భూధరంబు
భంగిఁ గనఁదగి చాలదుర్ధరమునగుచు. ౯౧ 686

తే. అంకుశమ్మును సరకుసేయక మదించి
రాముఁ డెక్కంగఁ దగియుండి ♦ రమ్యమగుచు
నున్నతాంగంబు గ్రాలంగ ♦ నొప్పుగజముఁ
గాంచె శత్రుంజయంబును ♦ మించువేడ్క. ౯౨ 687

సీ. మఱియు నాస్థలిని సు♦మంత్రుఁడలంకారకలితులై వంద ♦ లఁ గొలిచియున్న
మంత్రిముఖ్యుల మహా♦మండలేశ్వరునకుఁ బ్రియులై సవారల ♦ వితతతురగ
గజరథకలితులై ♦ కడుముదంబునవచ్చి యొక్కటిగాఁగూడి ♦ యున్నవారి
నందఱిఁ గడచి భా♦గ్యంబులనిండిన యంతఃపురముఁ జేరి ♦ యద్రిశిఖర
మట్లు, చలింపని ♦ యంబుదరీతిని, గనఁగ నేడంతస్థులను గణింప
తే. వగిన మిద్దెలతోడను ♦ సొగసుమీఱి
యుత్తమగృహసమూహంబు ♦ లొప్పనున్న
దానినే యడ్డమును లేక ♦ తానుజొచ్చె
మహితరత్నాకరముఁజొచ్చు ♦ మకరమట్లు. ౯౩ 688

పదునైదవ సర్గము సంపూర్ణము.

---

౧౬ - వ సర్గము.

సుమంత్రుఁడు శ్రీరామునిఁ దోడ్కొని వచ్చుట.

క. ధరణీశపూర్వచరతల, నరిణి యొఱంగన సుమంత్ర♦సచివుండు జనో
త్కరసంకులమగు ద్వారము, నరగఁ గడచి యవలికత్య♦జనవినుతంబున్. ౧

క. జనసమ్మర్దము లేకయె, గనసొంపుగ నున్నదానిఁ ♦ గనఁబోవఁగనం
దును వయసుకాండ్రు పురుషులు, ఘనచాపప్రాసనియత♦కరులును నగుచున్.

తే. మంచికుండలములఁ దాల్చి ♦ చంచలించు
బుద్ధియె లేక పొరపాటు ♦ పొందకెప్డు
రామునందును గాఢాను♦రాగ మొలయ
ద్వారమును గాచుచుండఁగ ♦ వారిఁగనియె. ౨ 691

*సీ. రామునిమనసును ♦ రంజిలఁ జేయంగఁ గాషాయవస్త్రసం♦కలితులగుచు
నంతఃపురాంతర♦మందుండఁదగినట్టి పంచనవతి శర♦ద్వయసు గలిగి
ధనువురాముండొగిఁ♦దాల్చి లోకముఁ బ్రోచుకరణి వేత్రంబుల♦వరుసఁదాల్చి
యాతనిఁబ్రోవంగ ♦ నాదరంబున మీఱి జానకీపతికృత♦స్నానుఁడగుచు

తే. భోజనముచేసి తనయంతి♦పురికిఁ బోవు,తఱి నతని నెత్తి ముద్దాడి♦తలను బ్రీతి
చేత మూర్కొని విడుచుట♦చేత నతని, గంధసంస్పర్శమున నలం♦కార మలర.

క. పనికత్తెల కధ్యక్షులు,గ నియోగింపంగఁబడిన ♦ క్రమగుణులఁ గాం
చెను వారు రామునకుఁ బ్రియ,మును జేసెడువారు గాన ♦ ముఖ్యసచివునిన్.

ఆ. వచ్చుచున్నవాని ♦ ముచ్చట లూరంగఁ, గాంచి సంభ్రమించి ♦ కడురయమున
నాసనములవదిలి ♦ యాదృతి లేచిరి; యతఁడు నేర్పుగలిగి ♦ యలరుఁగాన. ౪

క. వినయమున వారలంగని, వినీతమతిఁ బల్కె మీరు ♦ వినిపింపుఁడు నే
నును వచ్చి ద్వారమందునఁ,గను వేడుకనుంట భూమి♦కాంతునితోడన్. ౫

చ. అనవిని ద్వారపాలకులు ♦ హర్షము తేనికిఁ గూర్చునట్టివా
నులను జేయునిచ్ఛగల♦వారలుగావున స్వామియొద్దకుం
జని వనితాసహాయుఁడయి ♦ సంతసమొప్పఁగనున్న రామునిం
గని సచివుండు ద్వారమునఁ ♦ గాచి వసించుట విన్నవింపఁగన్. ౬ 696

తే. వారివలన సుమంత్రుండు ♦ వచ్చుటెఱిఁగి
జనకునకు నంతరంగుఁడు ♦ గనుకఁ దనకు
నంతరంగుఁడె యానని ♦ యచటికే య
తనిని రప్పించె జనకమో♦దప్రియేచ్ఛ. ౭ 697

†సీసమాలిక. చనిసుమంత్రుఁడుకు బే♦రునివలెసమధికై శ్వర్యసంపన్నుఁడై ♦జాతరూప
మయమయి యొప్పి భ♦ర్మశిఖరినీలమేఘమునట్లు తనను బ్ర♦కాశయుక్తుఁ

* ఈపద్యమునకు "తత్ర కాషాయిణో వృద్ధాన్ వేత్రపాణీన్ స్వలంకృతాన్, దదర్శ విష్ఠితాన్ ద్వారి స్త్ర్యధ్యక్షాన్ సుసమాహితాన్" అని మూలము. దీనికి గోవిందరాజవ్యాఖ్య ననుసరించి ప్రతిపదమునకుఁ గల విశేషార్థములను జేర్చి యీపద్యము వ్రాయఁబడినదని తెలియవలయు. స్వకల్పిత మొండొక్కమాటయైనను లేదని గ్రహింపఁదగు. † "తంవైశ్రవణసంకాశం......చిత్రయాశశినం యథా" అను శ్లోకత్రయమునకు గోవిందరాజకృతవ్యాఖ్యలోని భావమును సంగ్రహించి యీసీసమాలికలోఁ జేర్పఁబడినదని భావింపవలయు.

బును గలదియు నోం గావున, మనుజేంద్రుని యాశయంబు♦మది నెఱంగినదై.

[1]క. భరతుండు రాకమును పే, ధరణీభారంబు మోయం♦దగు పనినాకు౯
ద్వరపడి యీయంగ రాజును, బురికొల్పుచు నున్నదిపుడు♦పూనిక మెఱయ౯.

క. నాయందుం బ్రీతి గలదియు, నాయకునే యనుసరించు ♦ నైజము మఱియు౯
బ్రాయికముగ లోకమునకుం, దా యశమును గోరునదియుం ♦ దామరసాక్షీ !.

క. కావునం గైకయు నాకై, భూవిభు నభిషేకకృత్య♦మును జేయంగ౯
దావింతగం బురికొల్పెడు, త్మావరుండు ప్రియాంగనయగు♦కైకయుం దాను౯.

క. నామేలుగోరు సచివుని, ధీమహితునిం బంపిరిటకుం ♦ దీవ్రంబుగ నో
కోమలగాత్రీ ! యిది యు, ద్దామాదృష్టమగునాకుం ♦ దలపోసినచో౯. ౧౫

తే. ఎట్టి సభ చేరియున్నదో ♦ యిందువదన
యందు నట్టిండు దూతయే ♦ యరుగుదెంచె
నాకు నిప్పుడె పట్టాభి♦షేక మెలమిం
జేయంగలండు మహీశుండు ♦ సిద్ధ మిద్ది. ౧౬ 707

క. ధరణీశుని గైకను స,త్వరముగ నేంబోయి చూతుం ♦ బరిజనములతోం
దరుణీ సుఖముండు మనో, హరగీతాదులను మోద♦మందుము మిగుల౯.

[2]సీసమాలిక. అనినన యోనిజ♦యైనయాజానకి ప్రియుండుకంఠంబున♦వెలయుచున్న
ముక్తికహారమా♦సక్తిచే నొసంగిత౯ గౌరవింపంగం దమిం ♦ గ్రాలుచుం దన
ప్రాణనాయకునకు ♦ బదులుగ సొగసగు నీలోత్పలాక్షులు ♦ [3]నిగుడుచుటను
గువలయమాలికం ♦ గొనరి యిచ్చినలేమ వాకిలివఱకుం దా ♦ భర్తవెంటం
జనియెను మగనిదా ♦ సౌందర్యమున కేమి హానివచ్చునోయని♦యరసి శుభము
గలుగంగం గోరుచుం♦గమలసంభవుం డింద్రునకుంబోలె ధరణీశ♦నాయకుండు
రాజసూయాఖ్యాధ్వ♦రములకు నభిషిక్తుండ వగు నట్లుగ నిన్ను♦జవమున నిపు
డలరుచు యౌవరా♦జ్యమును విప్రానుజ్ఞం గైకొని నియమయు♦క్తమగునట్టు
లభిషిక్తునింజేయ ♦ నగునంత నవనీతమునను నీవభ్యంగ♦మును బొనర్చి
కన్నులం గాటుక ♦ సన్నంగాం బెట్టి యయ్యాజమాన వేషంబు ♦ నంది మఱియు

1 భరతుండు రాకమును పే-అనునది మూలానుసారముగ వ్రాయంబడలేదని తోంచును. మూలమున ''సుదక్షిణా. లక్షయిత్వా హ్యభిప్రాయం''=అనుపదములకు వ్యాఖ్యాతలు వ్రాసిన భావము ననుసరించి వ్రాయంబడినదని తెలియవలయు.

2 ఈపద్యమునకు ''పతిసంమానితా సీతా భర్తారమసితేక్షణా, ఆద్వార మనువవ్రాజ మంగళాన్యభిదధ్యుషీ'' అని మూలము. పతిసమ్మానితా సీతా అసితేక్షణా అనుపదములకు గోవిందరాజకృత వ్యాఖ్య ననుసరించి యీపద్యము వ్రాయంబడినదిగాని స్వకపోలకల్పితముగాదని యెఱుంగవలయు.
3 నిగుడుచుటను=నిగుడుచుట అను అని పదవిభాగము. నల్లంగలువలను ప్రసరింపంజేయుట.

వ్రతనియమంబుల ♦ వదలక భజించుచు నమలమౌ కృష్ణాజి♦నమును దాల్చి
పరిశుద్ధమతివయి ♦ ధన్యకురంగశృంగంబును గరమునఁ ♦ గడఁగి తాల్చి
ఆ. యున్న నిన్ను నేను ♦ గన్నారఁ జూచుచుఁ
గొలుచుదాన నింద్రుఁ ♦ డొలమిఁ దూర్పు
నందు యముఁడు దక్షి♦ణందును బడమర
వరుణుఁ డుత్తరమున ♦ వైశ్రవణుఁడు. ౧౮ 709

క. నిను సంరక్షింతురు గా, కని మనమునఁ దలఁచుచుండె నా♦హార్ద మునన్
జనియెన్ వాకిలి వఱకును, వనితామణి సంత నిలిపెఁ ♦ బరమాదృతితోన్.

క. కృతకౌతుకమంగళుఁడై, సతి నిల్పి సుమంత్రుఁ గూడి ♦ జనకుని జూడన్
గుతుకమున నిల్లు వెలువడి, యతఁడా ద్వారమున నున్న ♦ యనుజుం గనియెన్.

చ. గిరిగుహలోవసించు ఘన♦కేసరి యచ్చటనుండి పోవున
ట్లురుదగు సౌధమున్ వెడలి ♦ యొనటఁ జేతులు మోడ్చియున్న భ
క్తిరతుని లక్ష్మణుం గనియె ♦ దేవసమానుఁడు రాముఁడంత సుం
దరుఁడగు మధ్యకక్ష్యఁ గని ♦ వైజనుహృజ్జనసంఘయుక్తుఁడై. ౧౯.౪ 712

చ. తనుఁ గనవచ్చియున్న గుణ♦ధాముల సంతతిఁ గాంచి వారిఁ జే
రసరిగి సాధువాక్యముల ♦ రంజిలఁ జేయుచు సన్నుతించి యం
తనతఁడు వహ్నిఁ బోలిన ర♦థంబున నెక్కెను వ్యాఘ్రచర్మసం
దు సలుపుచుండె రాజతము ♦ నూత్నమునై కనుపట్టు సద్దియున్. ౨౦ 713

[1]సీ. ఘననాదనమునౌ ♦ ధ్వనిఁ గల్గి విరివిగాఁ బోలుపారి మంచి హిమ♦భూషితంబు
కనుచున్నవారల ♦ కన్నులను హరించునట్లు గానంబరి ♦ యగ్గు కాంతి [మిగుల
యొప్పారగ, గున్నయే♦నుగులరీతిఁ దగుమేటి ఘోటకంబులఁ బూన్పఁ ♦ గోమును
నడఁ జనుచున్నట్టి ♦ సాజులఁ బూన్చిన యునదమెక్కెడు నింద్రు♦కరణి రాముఁ
తే. డారథంబెక్కె నంపద ♦ లలర వేగ, చనియె శ్రీమంతుఁ డాకాశ♦మున గభీర
రవముగల మేఘమట్లు త్వ♦రథరవంబు, దెసల శబ్దింపఁ జేయంగ ♦ నసదృశగతి.

సీ. పంకజారి మహేంద్ర♦పర్వతమ్మునుండి వెడలునట్లు గ్రహంబు ♦ వెడలెనంత
సౌమిత్రియొకచేత ♦ ఛత్రమ్ము వేఱొకకరమునఁ జాగుచా♦మరముఁ బట్టి
రథపృష్ఠముననిల్చి ♦ రామున కాతపాదులు తగులకయుండ ♦ నెలమిఁ గాచు
చుండె నిట్లా రాముఁ ♦ డొయ్యన వెడలంగ నంతటిజనులనౌ ♦ హాలహాలయను
తే. శబ్దములు చాల వ్యాపించె ♦ సాధుకులము
గలుగు నశ్వాళి నెక్కియు ♦ త్సాధరాధ

1 ఘననాదము = మేఘధ్వని. ఈపద్యమున మేఘధ్వని యని యందుపాదుల చెప్పఁబడుట మూలము ననుసరించియేగాని పునరుక్తి కాదని తెలియఁగవలయు.

కరులనెక్కియు నూర్లసం♦ఖ్యలుగ వేల,సంఖ్యగా భటవీరులు♦చనిరి వెనుక.

చ. అతనికి ముందుఁ జందనమ♦హాగరులిప్తశరీరముల్ దగన్
శితలసమానఖడ్గములు ♦ చేతులనొప్ప ధనుస్సులంది సం
తత శుభవృద్ధిఁ గోరుచు ము♦దంబున మైమఱువుల్ ధరించి శూ
రతఁ జెలువారు సద్భటులు ♦ రంజిలు మోములనేగి రెంతయున్. ౩౭ 716

తే. రాముఁ డివ్వీధి వెడల మా♦ర్గమున వాద్య
శబ్దములు వందిజనుల సం♦స్తవరవములు
వీరసింహనాదంబులు ♦ వినఁగఁబడియె
నంత భూషణభూషిత ♦ లగుచు సతులు. ౩౮ 717

తే హర్మ్యవాతాయనంబుల♦యందు నిలిచి
యతనిపైఁ బూలు చల్లంగ ♦ నరి నిషూద
నుఁడగు శ్రీరాముఁడందుండి ♦ వెడలిపోయె
నపుడు సర్వాంగసౌందర్య ♦ మలరుస్త్రీలు. ౩౯ 718

సీ. కొందఱు మేడల♦యందు భూమిని గొంద ఱరుదుగ నిల్చియు♦య్యనఘమతికిఁ
బ్రీతిని గల్పింపఁ ♦ బ్రియవచనంబుల స్తుతియించి రిట్లని ♦ శుభగుణాఢ్య
జననికి నెప్పుడు ♦ సంతసంబును గల్గఁ జేయువాఁడవు రామ♦నీయెడ నినుఁ
గౌసల్య కన్గొని ♦ కడుసంతసమునొందు నీప్రయాణము ఫలి♦యించు నీకుఁ

తే. దండ్రి రాజ్యంబుఁ బొందిన ♦ దైవసముని
నిన్ను జనులెల్లఁ జూతురు ♦ కన్నులలర
నని నుతించుచుఁ [1]దద్హృద♦యప్రియయగు
నవనిజను నంగనామణి ♦ యని తలఁచిరి. ౪౦ 719

శా. తారాధీశునిఁ బొందు రోహిణివలెన్ ♦ దాసీత పద్మాక్షునిన్
శ్రీరామున్ గుణగణ్యుఁ బొందెఁగద యా♦సీమంతినీరత్నమ
య్యారే చక్కఁగఁ బూర్వజన్మమునఁ బు♦ణ్యంబెంతయో చేసెఁగా
దే రాముండు లభించునే యనుచు నెం♦తేవేడ్క నాస్త్రీలొగిన్. ౪౧ 720

చ. పలికిరి సౌధవీథులను ♦ భాసిలుచున్ నరవర్యుఁడంత న
ప్పలుకుల రాజమార్గమున ♦ వైభవమొప్పఁగఁ బోవుచుండి తా
నెలమి యెసంగఁగా వినియె ♦ నెంతయుఁ బ్రీతిని వారుపల్కుటల్;
సులలితరీతిగాఁ జనుచు ♦ శూరశిఖామణి యాతఁ డంతటన్. ౪౨ 721

తే. వేడుకలు చూడవచ్చిన ♦ వింతజాన
పదులు హర్షంబునన్ గగు♦ర్పాటు నొందు

1 తద్హృదయప్రియ=రామునిమనస్సునకుఁ బ్రమోదము నిచ్చునది.

40

పౌరులును ద్రోవపొడుగునఁ ♦ బల్కుచున్న
పల్కులం దన్నుఁ గూర్చిన ♦ వాని వినియె. ౮౩ 722

క. తన యధికారము పెంపుం, గనవలయు నటంచు జనులు ♦ గౌరవమునఁ బ
ల్కినవాని వినియె మఱి యా, జను లిట్లని చెప్పుకొనిరి ♦ సంతోషములన్.

సీ. జనకు ననుగ్రహం♦బును బొంది యీతఁడు భూరిరాజ్యరమను♦బొందఁ బోవు
చున్నాఁడు మఱి యీతఁ♦డొప్పుగ మన పైనఁ బరిపాలకత్వంబుఁ♦బడయఁగలఁడు
కావున మనమన♦కాంక్షితములు సిద్ధి నందంగఁగలవు భూ♦వందితుఁ డయి
యితఁడును జిరకాల♦మీ రాజ్యమును బొందియుండుట పౌరుల♦యుగుతరమగు

తే. భాగ్యమే యనవచ్చు నీ♦భవ్యచిత్తుఁ, డిలకుఁ బాలకుఁడై యుండ ♦ నెవనికేని
యొప్పెడి నప్రియం బేని ♦ యెన్నదుఃఖ, మేని గలుగంగ నేరదొ♦కింతయైన.

సీ. అనిరంతటమతంగ♦జాశ్వముల్ ధ్వనిసేయ "జయజయ" యనుచును♦సంస్తుతించు
వందిజనంబులు ♦ వరుసగా సూతులు మాగధులును శ్రుతి♦మధురవాద్య
వాదకుల్ తనముందు♦గాఁ దమిఁ జనుచుండ గౌరవంబునను గు♦ణైకభంగి
నలరుచు శ్రీరాముఁ ♦ డరుగుచుఁ గరిణులుఁ గరిహయరథములు♦గ్రాలుచుండ

తే. జనులు ముంగిళ్లనిండుగాఁ ♦ దనను గనఁగ
నిలిచియుండఁగ రత్నాళి ♦ నిబిడమగుచుఁ
బణ్యసంచయములు గల్గి ♦ పరఁగుచున్న
రాజమార్గంబుఁ గనియె నా♦రాముఁ డపుడు. ౮౬ 725

పదునాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౧౭-వ సర్గము.

రాముఁడు పితృగృహమునకు వచ్చుట.

క. సిరి వెలయఁ దనదు నెచ్చెలు, లరుదుగ సంతోషమంద ♦ నగరంబు పయిం
బరఁగి పతాకాధ్వజముం, దరమయి యొప్పెడు పురవ♦తంసముఁ జూచెన్. ౧

క. మేలైన యగరుధూపము, లోలిన్ వ్యాపింప నగర ♦ ముత్సవ విలస
చ్ఛీలం గనవచ్చిన జన, జాలసమాకలితమగుచు ♦ సంతసమిడియెన్. ౨ 727

క. జలదాభంబులు పాండుర,ములు నౌ గేహంబు లలర ♦ ముఖ్యాగరుధూ
పలలితవాసనలోలయఁగ, విలసిల్లెడు వీథులం బ్ర♦వేశించెఁ దగన్. ౩ 728

సీ. మఱియు రాముఁడు రాజ♦మార్గమునం జందనాగరుశాఖల ♦ నరుదుగాఁగ
రాసులుగాఁ బోసి ♦ రమణీయతరసుగంధద్రవ్యముల విచి♦త్రముగ నెఱపి
తగినదుకూలవ♦స్త్రములను బట్టువసనములఁ బ్రోగుగా ♦ సంస్కరించి
వివరముల్ వేయని ♦ విమలమౌక్తికముల నచ్ఛస్ఫటికముల ♦ నందు నందుఁ

తే. గుప్పలుగఁ బోసి రుచులచే ♦ మెప్పుఁగాంచు
భక్ష్యములఁ బెక్కువిధములౌ ♦ పణ్యములను

సొంపుగాఁ గూర్చి యుండుటఁ ♦ జూడఁదగిన
యట్టు లున్నట్టి తావుల ♦ నందుఁ గాంచె. ౫ 729

చ. పెరుగును లాజలక్షతలు ♦ వేడుక నిచ్చు హవిస్సుఁ జందనా
గరుముఖధూపముల్ వివిధ♦కమ్రసువాసన లగ్గలంబుగాఁ
బరఁగెడు పుష్పమాలికలు ♦ బాగుగఁ జూడఁగ నొప్పుచున్న చ
త్వరములు గల్గి నిర్జరప♦థంబువలెన్ గనుపట్టె నద్దియున్. ౬ 730

తే. చెలఁగి మిత్రులుసేయు నా♦శిషములెల్ల
వినుచు వారలఁ దగినట్టి ♦ విధుల గౌర
వించుచున్ రాజమార్గంబు ♦ వింతగనుచు
జనకునిం జూడనేగె దా♦శరథి యంత. ౭ 731

క. ఈతఱి నభిషిక్తుఁడవై, తాతలు ముత్తాతలే వి♦ధంబున రాజ్యం
బాతతముగఁ బాలించిరొ, యా తెఱఁగున మమ్ముఁ బ్రోవు♦మాదృతిరామా!

తే. ఇతని తండ్రియుఁ దత్పూర్వు♦లెల్ల లాల
నముల మన కెంత యమలసౌ♦ఖ్యమును గల్గఁ
జేసిరో రాముఁ డితఁ డభి♦షిక్తుఁడైన
నంత కధికసుఖంబును ♦ గాంతుము గద. ౯ 733

[1]సీ. రాజ్యాభిషిక్తుఁడై ♦ రాముఁడు రాజమార్గంబునఁ జనుచుండఁ♦గాంతుమేని
దజ్జన్యసుఖమును ♦ దగఁ బొందుదుమయేని భుక్తి యేటికి? స్వర్గ♦ముఖములైన
పరమార్థములు దద్భ♦వములైన సుఖములు మన కేల? యమితకాం♦తిని జెలంగు
నట్టి శ్రీరాఘవుం ♦ డభిషిక్తుఁడగుట యేభంగిఁ బ్రియంబొ య♦వ్వరున నితర

తే. మెద్దియేనియుఁ బ్రియముకా ♦ దించుకేని
యనుచు నచ్చటఁ జేరిన♦జనులు శుభక
రముగఁ దన్ను నుతించుచుఁ ♦ బ్రమదమలర
నాడుమాటలు విని యుబ్బ ♦ కతఁడు చనియె. ౧౦ 734

[2]చ. ధరణి కుమారికాధవుఁడు ♦ తమ్మును దాఁటి యదెంత దూరమో
యరిగి ననుం దదాకృతి మ♦హత్త్వమునం బరిసక్తమై మహా
త్తరమగు సంతసంబున ని♦తాంతము దేలెడు స్వీయనేత్రహృ
త్సరసిరుహంబులన్ బురుష♦తల్లజుఁ డెవ్వఁడుగాని పూనియే
మరలుపఁ జాలఁడయ్యె నిఁక ♦ మానిను లెవ్విధిఁ ద్రిప్పనేర్తురో. ౧౩ 735

1 ఇందు జనులకు శ్రీరామచంద్రునందుఁగల పరమామోదము చక్కఁగా సూచింపఁబడుట తెలియునది.

2 నరశ్చక్షోత్యపాక్రష్టుమ్-అని మూలము. మానిను లెవ్విధిఁ ద్రిప్ప నేర్తురో యనునది "నార్యః కిముత" అను వ్యాఖ్యననుసరించి చేర్పఁబడినది.

## ౧౮ - వ సర్గము.

కైక రామునితోఁ దనయభిప్రాయమును జెప్పుట.

ఉ. వాడిన మోముతోడను శు♦భంబగు మంచముమీఁదఁ బ్రేయసిం
గూడి వసించి దీనుఁడయి ♦ కుందెడు తండ్రినిగాంచి భక్తితోఁ
గూడిన చిత్తమొప్ప రఘు♦కుంజరుఁ డెంతొ వినీతుఁడై వగం
దోడుగఁ గొంచు తండ్రిపద♦తోయజముల్ తలసోఁకునట్లుగన్. ౧॥ 741

తే. మొదట మ్రొక్కిడి కైకేయి♦పదసరోజ
ములకుఁ దర్వాత వందన♦ములు పొసఁగె
నంత రాజు రామా! యని ♦ యవల బాష్ప
జలకణాకులనయనుఁడై ♦ పలుకలేక. ౨ 742

క. తనయునిఁ జూచుటకేనియు, మన మలరఁగఁ బుత్రుతోడ ♦ మాటాడుటకే
మను జేశుఁ డశక్తుం డయ్యెను; రాముఁడు దుఃఖమునకు♦ హేతువెఱుఁగమిన్.

సీ. ఇంతకు మున్నెప్పు♦డేఁ గలుగని సాధ్వసావహదుఃఖమ ♦ ట్లప్పు డతని
మనమున నేల క♦ల్గెనో యంచు నరపతి క్రోధరూపముగాంచి♦యత్తఱిభయ
కంపితగాత్రుఁడై ♦ కాలసర్పముఁ గాలఁ ద్రొక్కినవిధమున ♦ స్రుక్కి రాముఁ
డింద్రియాళికలంగ♦ నెంతయు దుఃఖమ్ము సంతాపమును దన్ గ్రు♦శత్వమొందఁ

తే. జేయ నిట్టూర్పుఁబుచ్చుచుఁ ♦ జెదరి చిత్త
మెంతొ కలఁతను బుట్టింప ♦ నుంతయేనిఁ
గలఁపరానిది యయ్యును ♦ గలఁగి యార్మి
సంతతులనొప్పు సంద్రంబు♦సరణి నృపుఁడు. ౪॥ 744

క. తను రాహువు గ్రసియించిన, వనజాప్తుం డున్నరీతి ♦ భవ్యాత్ముం డ
య్యు నబద్ధములాడిన స,న్మునికరణి నచింత్యదుఃఖ♦మును బొందెఁ దగన్. ౫

తే. ఇట్టి దుఃఖము నొందుట ♦ కేమి కార
ణమొ యెఱుంగమి రామున ♦ కమితభయము
కలిగెఁ; దండ్రికి నట్టిశో♦కంబు గలుగ
నేల యంచు విచారించె ♦ జాలి నొంది. ౬॥ 746

సీ. పర్వకాలంబునఁ ♦ బాథోధిపోలికఁ గలవిలపాటొంది ♦ కడువిచార [చుఁగాన
మును బొంది యంతరా♦ముఁడు తండ్రి యిష్టంబు ఫలియింపఁ జేయంగఁ ♦ దలఁ
మనమునఁ జింతించె ♦ ననుఁగని యిప్పుడు సంతసమొందఁడు ♦ జనకుఁడేమొ
యతికోపమొందియు♦నపుడు నన్ జూచిన దాఁ బ్రసన్నుండగుఁ♦దనయునన్నుఁ

తే. గాంచి యిప్పు డాయాసంబుఁ ♦ గాంచుచున్న
వాఁడు కారణమేమొకో ♦ పలుకఁ డోఁప
డనుచు యోజించి శోకార్తుఁ ♦ డగుచు దీనుఁ
డగుచు ముఖకాంతి తఱుగంగ ♦ నాతఁడపుడు. ౭॥ 747

క. జనయిత్రికిఁ గైకకు వం, దనములు పొనరించి తెలివి♦తప్పి యపకృతిన్
జనకుని యెడ నే నేమియు, నొనరింపనుగద యిదేల ♦ యో కోపించెన్. ౧౦౪

క. ఆకారణంబుఁ దెలుపుము, యో కైకా! నీవె తండ్రి ♦ యురుమోదంబుం
గైకొనెడునట్లు చేయుము, గాకరణి నితండు నాగుల ♦ నేమొకొ చెపుమా.

క. నాయెడ వాత్సల్యము నితఁ, డేయెడలం గలిగియుండు ♦ నిట్టియితఁడ యి
ష్టే యంతరాత్మ కలఁగఁగ, నీయనువున మోముకాంతి ♦ యెల్లఁ దఱుగఁగన్.

[1]క. దీనుండై పలుకఁడు నా,తో నేమొకొ? తనువు వ్యాధి♦తోఁ గూడెనొకో?
మానస మాధిం గాంచెనొ?, నానాయస కివ్వి లేక ♦ నైజవిభూతిన్. ౧౨౪

క. అలరుచు నుండుంగద మను,జుల కెప్పుడు సుఖముఁ గల్గఁ♦జూచుట యరుదౌఁ;
బలుకుము ప్రియదర్శనుఁడై, చెలఁగెడు భరతుండు కీడు ♦ చెందఁడు గాఁడే.

క. ప్రకటబలుండగు శత్రు,ఘ్నకుమారున కేని మాతృ♦గణమం దేమే
మి కలుగదుగదా యశుభం,బొకఁడును నాతండ్రి యిట్టు♦లుండఁగ నేమో.

చ. జనకునిమానసంబునకు ♦ సంతసముం గలుగంగఁ జేయకేఁ
బని యతఁ డేమిచెప్పినను ♦ బాగుగఁ జేయకయేని నే క్షణం
బును బ్రదుకంగనొల్ల నిఁక ♦ భూపతివర్యుఁడు కోపమొందు నే
జనని! మదీయతాపమును ♦ జాలవచింపఁగ నుంతయేనియున్. ౧౫ 754

క. మనుజుఁడు తానీ లోకం,బునఁ బుట్టుట కెవఁడు మూల♦భూతుఁడని యెఱుం
గునొ సాక్షాద్దైవతమని, తనరారెడునట్టిఁడైన ♦ తండ్రికి వశుఁడై. ౧౬ 755

తే. ఎవఁడు నర్తింపనొల్లఁడో ♦ యెఱుఁగఁజాలఁ
గోపమునఁగాని గర్వంబు ♦ గూడఁగాని
నీవు నాతండ్రితోడఁ స♦ద్భావమొల్లఁ
గలఁతనొందఁగఁ బరుషముల్ ♦ పలుకవుగద. ౧౭ 756

క. ఎన్నఁడు లేని వికారం, బెన్నఁగ నూతనము దోఁచె ♦ నృపునం దేమో
యున్నది యున్నట్లుగ నా,కన్నియునుం జెప్పవమ్మ ♦ యడిగితిఁ గానన్. 757

[2]చ. అని యడుగన్ మహాత్ముఁడగు ♦ నా రఘువీరునితోడఁ గైక యి
ట్లనియె వచింపరాక హృద♦యప్రియుఁ గ్లేశమునొందఁజేయు ప
ల్కు నెటులు చెప్పుదాన నను♦కొంకును లజ్జయు నుంత లేకయే

1 "శారీరో మానసో వాపి కచ్చి దేనం న బాధతే, సంతాపో వాభితాపో వా దుర్లభం హి సదాసుఖమ్" అని మూలము. శరీరమునకుఁ గలుగు తాపము వ్యాధి. మనస్సునకుఁ గలుగు తాపము ఆధి. 2 "ఏవముక్తాతు కైకేయీ రాఘవేణ మహాత్మనా, ఉవాచేదం సునిర్లజ్జా ధృష్ట మాత్మహితం వచః" అని మూలము. 'సునిర్లజ్జా ధృష్ట మాత్మహిత' మనుపదములకు మహేశ్వరతీర్థులు వ్రాసిన యర్థము ననుసరించి యీపద్యము వ్రాయఁబడినది.

వనమున కేగుమీ వను న♦భవ్యపుఁబల్కులను జెప్పనెట్టులొ
నను గృపయింతలేక తన♦యాశయరీతిని బల్కె నివ్విధిన్. ౧౯ 758

క. మనుజేంద్రునకుం గోపం, బనునదియే లేదు వ్యసన ♦ మలవడదు; మతే
మనఁగలదు మనోభీష్టము, విని నీవేమందువో యను♦భీతి గలుగుటన్. ౨౦

ఆ. నీకుఁ జెప్పవెఱచి ♦ యీకరణిం గుందు,చున్నవాఁడు ప్రీతిఁ ♦ గన్న నీకు
నప్రియంబుఁ బలుక ♦ నాడమి నాలుక, యూరకున్నవాఁడు ♦ భూరమణుఁడు.

క. జనకుండేమి ప్రతిజ్ఞను, బొనరించెనో దానిఁ జేయఁ♦బోలును నీకున్
దనయా! తప్పక పితృహిత,మును జేయఁగవలయుఁగాదె♦మోదము మీఱన్.

చ. మును నను గౌరవించి వర♦ముందగనిచ్చి తదీయమౌఫలం
బును గనుకాలమందిపుడు ♦ భూపతి పామరురీతిఁ దాపముం
దనుఁ గుదియింప దుఃఖము ని♦తాంతమునొందెడు; నిచ్చితిన్ వరం
బు నని ప్రతిజ్ఞచేసి జల♦ముల్ చనినం దరువాత సేతుబం
ధనమును గట్టఁగోరుగతిఁ ♦ దా వెతఁగుందెడు స్వప్రతిజ్ఞకున్. ౨౩ 762

సీ. ధర్మమూలమ్ము స♦త్యము పెద్దలందఱు నిది యెఱింగియె పల్కి ♦ రీవిధమునఁ
గావున రాఘవా♦భూవిభుం డిపుడు నీకొఱకు నామీఁదనె ♦ కోపమొంది
సత్యము విడువక ♦ నిత్య మద్దానియం దాసక్తుఁడై యుండు♦నట్లు సేయు
మితఁడు చెప్పఁడు పల్కు ♦ లిప్పుడు నీకు శుభంబుగానీ యశు♦భంబుఁగాని
తే. నీవు చేయుదువేని నే ♦ నీకు దాని
విస్తరంబుగ వచియింతు ♦ విభునిపలుకు
లరయ నీయందు వ్యర్థంబు♦లయి చెడకయె
యలరు నే నట్లు చేయుదు ♦ నందువేని. ౨౫ 763

క. ఇతనికి బదులుగ నే వి,స్తృతముగ వచియించుదాన ♦ నిప్పుడు నీతో
నితఁ డమ్మాటను జెప్పఁ డ,హితమౌ నీకద్ది యనుచు ♦ నెఱుఁగుటకతనన్. ౨౬

చ. అనవిని నేను దండ్రిదగు ♦ నాజ్ఞను జేయుదునో యొనర్పనో
యను ననుమానముం గలుగు♦నట్టిది యయ్యెఁగదా ప్రవృత్తి నా
దని వ్యసనంబు నొంది నృపు ♦ నంతికమందె దయావిహీనఁ గై
కను గని యిస్సిరో! యనుచుఁ ♦ గానరుఁడై వచియించె నీవిధిన్. ౨౭ 765

క. జననీ! నన్నిటు పల్కం, జనదు సుమీ, రాజునాజ్ఞ ♦ జ్వలనునియందే
మనమునఁ గొంకకపడుదున్, దినువాఁడన్ విషము దెంత♦తీవ్రంబైనన్. ౨౮

క. గురుతరజలనిధి దుముకుదు, గురుఁడితఁడు తండ్రి మేలు ♦ కోరునృపుఁడు నాఁ
దరుణీ యాతఁడు చెప్పిన, కరణిం జేయుదు నదెట్టి♦కార్యంబైనన్. ౨౯ 767

క. ధరణీశుకోర్కె యేదో, పరికించి వచింపు, చేయు♦వాఁడఁ బ్రతినయున్
వరుస నొనర్తు రాముఁడు, స్థిరమతి తా నన్నమాట ♦ ద్రిప్పఁడు సుమ్మీ. ౩౦

చ. అనిన ననార్య కేకయనృ♦పాత్మజ నిష్ఠురవాక్యసత్త్వవా
దిని రఘురాముఁ గాంచి యతి♦ధృష్టముగా వచియించెఁ బుత్రకా
విను, మును దేవదైత్యులకు ♦ విగ్రహమైనపు డందులోన మీ
జనకుని దేహమంతయును ♦ సాయకబాధితమయ్యె నంతయున్. ౩౧॥ 769

*చ. శరములు దీసివైచి గురు♦సాధ్వసమెల్లను బాపి కాచితిన్
వరములు రెండొసంగె నర♦పాలుఁడు దానికిఁ గాఁగ నేను న
వ్వరములు నిన్ను గోరితిని ♦ బట్టము గట్టఁగ నొప్పు నీసహో
దరుఁడగు నాకుమారునకుఁ ♦ దప్పక కానకు నీవు పోఁదగున్. ౩౨॥ 770

తే. దండకారణ్యములకిప్డె ♦ తరలి నీవు, చనవలయు నంచు నడిగితి ♦ జనపతి; నిట
జనకుని న్నిన్ను సత్యంబు ♦ జరపువారిఁ,గా నొనర్పఁగఁ దలఁచితి♦నేని రామ!.

ఉ. నేను వచించు వాక్యమును ♦ నీవు వినంగఁ దండ్రియానతిం
బూని యొనర్పు మాతఁడును ♦ బూర్వము చెప్పినమాటఁ దీర్పఁగన్
గానలలోన నీవు పదు♦నాలుగువర్షము లుండఁగాఁ దగున్
జానుగ నీకుఁ గూర్చిన ప్ర♦శస్తపదార్థములన్ మదాత్మజున్. ౩౪॥ 772

తే. యౌవరాజ్యంబునన్ నిల్పి ♦ నేను నీవు
నరగునన్ దండకాటవి ♦ జడలుదాల్చి
యజినములఁ గట్టి వసియింప ♦ నేను రామ
[1]యిపుడు కాఁబోవు నుత్సవ♦మెలమిమాని. ౩౫॥ 773

సీ. పదునాలుగేండులు ♦ వనవాసమును నీవు జరపు నయోధ్యలో ♦ భరతుఁ డుండి
బహువిధరత్నసం♦భరితమై హయరథగజసంయుతంబయి ♦ ప్రాలుచున్న
యీరాజ్యమెల్ల న♦హీనమై భవమునఁ బాలించుఁగాక; యి♦వ్వరయుగంబు
నిచ్చియున్నందున ♦ నిపుడు కారుణ్యంబు ననుముంప, గాఢసం♦తాపమొలయ
తే. మొగము వెలవెలఁబాఱంగ ♦ మోహమొంది
నిన్నుఁ గనలేక నీతండ్రి ♦ యున్నవాఁడు
[2]రఘుకులాంభోధిచంద్ర, యా♦రాజువచన
మనుసరించి యొనర్పుమా ♦ యాదరమున. ౩౬॥ 774

* ఈయుద్ధకథ యిట సంగ్రహముగాఁ గైకచేఁ జెప్పఁబడినది. వరము లడిగినపద్ధతి చెప్పుటయే యామె కప్పటిపనిగాని జరిగినయుద్ధమును సాకల్యముగాఁ జెప్పుట కాదని బుద్ధిమంతు లూహింతురుగాక.

1 ఎలమిమాని - అనఁగా సంతోషమును మానుకొమ్ము. ఇట్లు చేయవలసివచ్చెఁగదా యని వగచుచుఁ జేయకుమని హెచ్చరించుచున్నది. కైక యని యిట సూచింపఁబడినది. 2 రఘుకులాంభోధిచంద్ర యని కైక రాముని సంబోధించుట పూర్వుల సత్యవాక్యపాలనత్వము స్మృతికి వచ్చునట్లు చేయుటకని గ్రహింపవలయు.

క. గురుతరసత్యవ్రతమును, బరిపాలన మొప్పఁ జేసి ♦ పార్థివుసత్యే
తరదోషరహితు నొనరిచి, తరింపఁగాఁ జేయవయ్య ♦ తగినదికానన్. ౪౦

*చ. అని జనయిత్రి క్రూరముగ ♦ నవ్విధిఁ బల్క నశోకచిహ్నముల్
గనఁబడవయ్యె రాముని ము♦ఖంబున లోపలనైన దుఃఖముల్
గనినటు గానరాక రఘు♦కాంతుని మోము వెలింగెఁ బార్థివుం
డును మహనీయుఁడయ్యును ద♦నూజునిఁ బాయుట యెట్టులన్న యా
ఘనతరదుఃఖతప్తుఁడయి ♦ కుంది వ్యథంగనె నంత రాముఁడున్. ౪౧ 776

పదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౯ - వ సర్గము.

--కైకతో రాముఁ డడవికిం బోయెదనని చెప్పుట.--

చ. అరినిచయాంతకుండగుట ♦ నప్రియమై తగి లోకదృష్టిచే
మరణసమానమైన యల♦మాటను గైక వచింప దుఃఖసా
గరమున మున్గ కిట్లనియె ♦ గారవ మొప్పఁ దదుక్తిరీతిఁగా
భరతుఁడు యావరాజ్యమున ♦ బద్ధుఁడుగాఁ దనరారుఁ గావుతన్. ౧౫ 777

క. జననాథునిదౌ ప్రతినను, మనసార ఫలింపఁ జేయ ♦ మానిని! కృష్ణా
జినమును జడలను దాలిచి, వనవాసముఁ జేయఁబోవు♦వాఁడను నేనున్. ౨

చ. అరిజనమర్దనుండయిన ♦ యట్టి మగండుగదా! మహీశుఁ డి
త్తరుణమునందు మున్నువలెఁ ♦ దానను నేలొకో గారవింప కి
క్కరణిఁ దపించు నాప్రకృతిఁ ♦ గానఁడొకో యిటులుండ నేలొకో
యరుదుగ నున్నదిద్ది తెలి♦యంగను గోరెద నంబ! చెప్పుమా. ౩ 779

సీ. దైన్యంబు నీవు పొం♦దఁగవలదోయంబ నీదు మ్రోల వచింతు ♦ నేను నార
చీరలు జడలును ♦ జెలువొందఁగాఁ దాల్చి యడవికిఁ బోయెద ♦ నధికముదము
నొంది నీవుండుమా♦యుర్వీశ్వరుఁడు నాకు నిష్టంబుఁ గోరెడి♦హితుఁడు గురుఁడు
తండ్రి [1]కృతజ్ఞుండు♦తానగుఁ గద యిట్టి యితఁడు నియోగింప ♦ నెట్టిదైనఁ

తే. దండ్రికది ప్రియమైనచో ♦ దానిఁ జేయ
కుందునే శంకలన్ మాని; ♦ సందియంబు
మాని నాతోడ నేలొకో ♦ మానవపతి
భరతు నభిషేకవిషయంబు ♦ పలుకలేదు. ౪౫ 780

క. నానైజ మెఱిఁగి యుండియుఁ, దానై వచియింపఁడనెడి ♦ దారుణదుఃఖం

* ఈపద్యము మహేశ్వరతీర్థకృత వ్యాఖ్య ననుసరించి వ్రాయఁబడినదని తెలియందగు.

1 కృతజ్ఞుఁడు=స్వకృతవరదానాభిజ్ఞుఁడు.

క. చేసినయత్నంబంతయు, నీసమయమునందు భంగ♦మేయగు ననుచున్
ఆసుదతి యెంచి రాముని,తో సరగునఁ బల్కె నిట్లు ♦ తొందరపడుచున్.

క. వనమునకుం బోవఁగ నీ,వును సంభ్రమ మొందుచున్న♦పోలిక గనన
య్యెను గాన జాగుసేయుట;యును నాకునయుక్తమనుచు♦నొయ్యనఁదోఁచెన్.

ఆ. కాన నడవికీవు ♦ కడు వేగమునఁ బోవ,వలయుఁ బురుషవర్య ♦ పార్థివుండు
తనదువచన మీవు ♦ తథ్యంబు చేయుదో, చేయవో కొ యనెడు♦సిగ్గుచేత.

చ. పలుకక యున్నవాఁడు రఘు♦వర్య మఱొక్కటి యేమిలేదు నీ
వెలమిఁ దృజించి చింతఁగొన ♦ నేల? విచారము మాని యిప్డు కా
నలకును బోవుటన్ మనుజ♦నాథుని లజ్జను దీనభావముం
దలఁగఁగఁ ద్రోయు; మీనగర♦త్పజమున్ విడనాడి కానకున్. ౧౫ 793

క. నీవరుగునంతదనుకన్, భూవల్లభుఁ డితఁడు స్నాన♦భోజనముల ని
చ్ఛావిధిని గొనఁడు సుమ్మని, యేవెఱపును లేక కైక ♦ యీవిధిఁ బలుకన్.

క. విని వృద్ధరాజు కట్టా!, యని నిట్టూర్పులను బుచ్చి ♦ యతిశోకమునన్
మునిఁగి కనకపర్యంకం, బునఁ బడియెను జైకొనియెడు ♦ మూర్ఛావశతన్.

చ. జనకుని లేవనెత్తి రఘు♦సత్తముఁ డప్డు సపత్ని తన్ను నే
వనమున కేగఁగావలయు ♦ వారకయుంచని తొందరింప నొ
య్యనఁ గశచేతఁ గొట్టఁబడి♦నట్టి హయంబువలెన్ జవంబునన్
వని కరుగంగ నెంచె; నిటు ♦ పాపమనీషయుఁ గ్రూరభావయై. ౧౮ 796

ఆ. అడవికేగు మనుచు ♦ నాడిన కఠినంబు, లప్రియములునైన ♦ యప్పలుకుల
వినియు రాముఁ డంత ♦ విగతవ్యథుండయి, కైకతోడఁ బలికెఁ♦గమ్రభణితి.

*సీ. భరతుఁ డయోధ్యకు ♦ నరుదెంచినట్లైనఁ దనకురాజ్యంబిచ్చు♦ననుచు రాముఁ
డెంచె నటంచు నూ♦హించెఁ గైకయుఁగాననామెసందేహంబు♦నణఁపఁదలఁచి
తల్లిరో; విను నాకు ♦ ద్రవ్యాశయే లేదు జనులను నావశం♦బుననె యునుపఁ
గాని లోకంబున ♦ నే నుండఁగాఁగాని యభిమత మొక్కింత♦యైన లేదు

తే. నేను ఋషిసమానుండను♦గాన ధర్మ
మునె సతంబవలంబించి ♦ జనహితంబు
నెంచి యున్నాఁడ నాతండ్రి ♦ కెద్ది హితమొ
కార్య మదియెట్టిదైన నేఁ ♦ గడుముదమున. ౨౦ 798

చ. ఒనరుపనెంచువాఁడ నది ♦ యొక్కపుడెంచఁగఁ బ్రాణపంచకం
బును విడనాడి చేయఁగను ♦ బోలునదైనను జేసి తీఱెదన్

* నాహ మర్థపరో దేవి లోకమావస్తు ముత్సహే, విద్ధి మా మృషిభి స్తుల్యం కేవలం ధర్మ మాస్థితం—అనిమూలము. నేను ఋషిసమానుఁడనను మొదలగు మాటలను రాముఁడు చెప్పుట యాత్మస్తుతిగాదు. కైకపుఁ డా నడవికిం బోవుటయందు నమ్మకము పుట్టించుటకై యని తెలియవలయు.

బనియుద్వేచుఁగాఁబడిరయ ♦ వారికి యంచుఁ దలంపుసేనలన్
జనకుఁడు సంతసంబుఁ గనఁ♦జాలెడునట్లు లొనర్చి భక్తిచేన్. ౨౧ 799

తే. అనఁడు చెప్పినపనిని జే♦యంగఁగలిగి
యుంట నీకార్యములు రెంటి♦కంటె నధిక
మైన ధర్మాచరణము లే♦దంట సుంత
యైన నొక్కట చెప్పెద ♦ నాలకింపు. ౨౨ 800

చ. తెనలుము కొనకొంచిపుడు ♦ తండ్రి వచింపక యున్ననేమి యీ
సరణిని నీవు నల్కనను ♦ జాలదె? యిప్పుడె నిర్జనంబుగాఁ
బరఁగు నరణ్యసీమలను ♦ వాసముచేయఁగఁ బోవువాఁడ నం
దు రసుణ నుండువాఁడను జ♦తుర్దశవర్షము లాజ్ఞతీరునన్. ౨౩ 801

*సీ. కైకేయి వినుము యొ♦క్కటి యిన్ని నక్కఱఁగా నన్ను నియమింపఁ♦గలుగుశక్తి
గలదాన వట్టి నీ♦పలుకును మీఱక చేయుట కేను సం♦సిద్ధయుత్నుఁ
డనయి యుండంగ నీ ♦ తనయుని నభిషేకమును జేయఁగా వల♦యునని నీవు
భూపతితోఁ జెప్పఁ♦బోలునే యిటు సేసితివి గాన నాయందు ♦ స్థిరసుగుణము

తే. గలవటం చినునంతయుఁ ♦ గలఁచివైతి;
వింక నాతల్లి ననుమతి ♦ నేను బొంది
సీత నొగనూఱడించి వ♦చ్చెదను గాన
నంతవఱ కనుమతి యిమ్ము ♦ యమ్మ యవుడు. ౨౪ 802

¹చ. వనమునకేగి దండకావ్హయము ♦ వాసముసేయఁగ నర్హమందు నొ
క్కనిముసమైన నిల్వకిటఁ ♦ గ్రన్ననఁ బోయెద నింక మీఁద నీ
తనయుఁడు రాజ్యభారమును ♦ దాల్చును, దండ్రికి సేవసేయున
ట్లనువుగఁ జూడఁగావలయు♦నట్లు లొనర్పుము నేర్పుమీఱఁగన్. ౨౫ 803

క. జనకునకు సేవసేయుట, యనుసర్గ సనాతనంబు ♦ నగు ధర్మనుటం
చనిన రాముని వచనం, బును విని దశరథుఁడు దుఃఖ♦మున మున్గి కడున్.

క. కన్నీరు నిలుపఁజాలక, మున్నీరుగ నద్దిపాఱ ♦ బోరున నేడ్చెన్
గ్రన్నన రాముం డపుడా, పన్నుండయి పడినయట్టి ♦ పార్థివపతికిన్. ౨౬ 805

ఆ. వందనమ్ము చేసి ♦ పాపాత్మురాలగు, కైకకల్లు యెఱఁగి ♦ కానకేగు
నట్టి పుణ్యమిచ్చ ♦ ననుముదంబునఁ దేజ, మునఁగుచుండె రాముఁ♦డిట్లు వెడలి.

క. జనకునకుం గైకేయికి, ఘనభక్తిఁ బ్రదక్షిణంబు ♦ గావించుచుఁ గై
కనివాసము వెడలి చనం, గనిరి యు స్నిజహితులు వేక్కఁ ♦ గ్రాలెడివారిన్.

* వనవాసమునకు గైకేయి...ప్పుడునడు అని మూలము. వ్యాఖ్యలయందలి సారము ఇం దిమిడియున్నది. 1 దండుఁడు ఇక్ష్వాకుపుత్త్రుఁడు. శుక్రశాపమున నతని దేశము నశించి యరణ్యమై దండకారణ్యమని పేరుపొందెను. ఈకథ యుత్తరకాండమునఁ జక్కఁగాఁ జెప్పఁబడినది.

సీ. సౌమిత్రి, తల్లికి ♦ సంతసంబును గూర్చు గుణశాలి రాముని ♦ గూడియున్న
వాఁడోట జరగిన ♦ వార్తలనెఱుఁగుట కతన బాష్పోదక ♦ కలితనయనుఁ
డయి చాలఁ గోపించి ♦ యన్నను వెన్నాడి యరిగెను; దేవాల ♦ యాదులకుఁబ్ర
దక్షిణముగఁ బోవ ♦ దగునన్న శాస్త్రంబు ననుసరించుచు రాముఁ ♦ డచటనున్న

తే. యట్టి యభిషేకవస్తువు ♦ లరసి వాని
కెల్లను బ్రదక్షిణముసేసి ♦ యుల్లమందు
నిచ్ఛలేమిని వానిపై ♦ దృష్టిపఱుప
కనుజుఁ డభిషిక్తుఁ డౌఁగాక ♦ యని తలఁచుచు. ౩౦ 808

క. సురసాన్నిధ్యము గల్గుట, మరియాద న్నిలుపు వేడ్క ♦ మదిఁ గలుగుట నా
తరణికులతిలకుఁ డవ్వలి, కరిగెను మెలమెల్ల నామ ♦ హాత్ముం డంతన్. ౩౧ 809

సీ. జగమునకెల్లను ♦ సంతోషముంగూర్చు నతనిమోమువికాస ♦ మసదృశంబు
నగుటను దఱుగని ♦ దగుటను రాతిరి యావరింపఁగఁ ద్రియా ♦ మాదినాథు
కాంతి తగ్గనియట్లు ♦ లెంతయు రాజ్యనాశము గల్గినను వికా ♦ సము నశింప
కలరారె; రాజ్యము ♦ నప్పుడె విడనాడి వనికేగఁదలఁచు రా ♦ మునకు లోక

తే. మండలిని మించి మానావ ♦ మానములను
లెక్కసేయని యోగియ ♦ ట్లోకరీతి
నంతరంగంబు తనరె నే ♦ మైన వికృతి
నొందినటు గానరాకయె ♦ యుండె నపుడు. ౩౩ 810

చ. అరదము మాని పౌరతతి ♦ నాత్మజనంబుల వీడుచున్ శుభ
స్కరమగు ఛత్రముల్ వదలి ♦ చామరయుగ్మ మలంకృతంబుగాఁ
బరఁగెడుదానినిన్ విడిచి ♦ స్వాంతమునన్ వెతలేకపోయినన్
బరులకుఁ గల్గు దుఃఖమును ♦ భావమునందె యడంచి యంతటన్. ౩౪ 811

చ. తనవగు నింద్రియంబుల యు ♦ దారగతిన్ దగ నిగ్రహించి తా
జననికి నప్రియంబయిన ♦ చర్య సపత్నియనుజ్ఞఁ దెల్పఁగాఁ
జనియెను దల్లి యింటికి వి ♦ శాలమనస్థిరతం జెలంగు రా
ట్తనయుఁడు నిర్వికారముగఁ; ♦ దత్ప్రకృతుల్ శుభచిహ్నాయుక్తులై. ౩౫

ఆ. సత్యసంధుఁడగుచు ♦ నరసలక్ష్మియుక్తుఁ,డగుచు వెలయు రాము ♦ నాస్యమందు
నెద కలంతఁ దెల్పు ♦ నెట్టివికారంబు, గానరైరి సుంత ♦ యైనఁగాని. ౩౬ 813

సీ. అప్పుడా మహీభుజుఁ డాత్మ ♦ హర్షంబు నైజంబు శారదరాత్రుల ♦ సముదితాత్మ
కాంతులఁ దగు నిశా ♦ కాంతుఁ డాత్మప్రభ విడువకుండినరీతి ♦ విడువఁడయ్యె
ధీరాత్ముఁడును భూరి ♦ దివ్యకీర్తియునగు నతఁ డంత మధురవా ♦ క్యముల జనుల
నలరించుచుం దల్లి ♦ యంతికమున కేగుచుండ సద్గుణగణ ♦ మండితుండు

తే. విపులవిక్రముఁడనుసయి ♦ వెలసియున్న
యా సుమిత్రాత్మజుఁడు, రాము♦నట్లు దుఃఖ
కలితుఁడై యుంట సన్నఁకుఁ ♦ గలిగినట్టి
వెతలఁ గుందుచు వానిని ♦ వెలిసఱుచక. ౩౯ 814

క. తనయగ్రజునిం గూడియె, చనియెను శ్రీరాముఁడంత ♦ జననీగృహముం
గని చొచ్చి యందు నుత్సవమును గాంచెడు కౌతుకమునఁ ♦ బొంగెడుజనులన్.

చ. కనుఁగొని రాఁగ సిద్ధనుఁడయి ♦ కన్పడు రాజ్యవినాశనాపదం
బనఘుఁ డెఱింగి తా నపుడు ♦ దాన వెతం గనినన్ సుహృజ్జనుల్
గనుడుసు దుఃఖమంచు మది ♦ గాఢముగాఁగ నెఱించి దానిని
న్మనమున నేవికారి పుణు♦మాత్రము తోఁపఁగనీక యేఁగెన్. ౪౦ 816

సందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౪౦ - వ సర్గము.

—కౌసల్యతో సమీపించి పోయెదనని రాముఁడు చెప్పుట.—

చ. పురుషవరేణ్యుఁడైన రఘు♦పుంగవుఁ డంజలిచేసి కైకనుఁ
ధరణిపతీంద్రు వీడ్కొనుచుఁ ♦ దాఁ బయనంబును సేయ నప్డు భూ
వరసుతరూపుల్ సుహృత్ఁగని ♦ పార్థివుచెంగట నేడ్వ నాక్రోశ
కరరవ ముప్పతిల్లె నట ♦ స్త్రీపతిభార్యలు పల్కిరివ్విధిన్. ౧ 817

చ జనకుఁడు చెప్పకున్న రఘు♦నాథుఁ డంతిపురంబునందు నే
వనులను జేసి తాన దయ ♦ వర్తిలఁగా మన కెల్ల దిక్కుగాఁ
గనఁబడుచుండెఁ గాద యల ♦ కన్నగుణాఢ్యుఁడు కాపురంబుఁ దా
వనమునఁ జేయఁబోయెఁ బితృ♦వాక్యమటంచని కైక పల్కఁగన్. ౨ 818

క. జననం బాదిగ నవ్విధి, జననికి శుశ్రూష సేయు ♦ నట్టి భక్తిని మా
కును జేయు సేవలన్నీ, యనుమానము లేక; యాతఁ ♦ డడవికి నేగెన్. ౩ 819

చ. పరుషములెవ్వరేఁ దనను ♦ బల్కినఁ గోపము నొందఁ డింతయే
ని రుషను జేయుకృత్యముల ♦ నేర్పునఁ జేయఁగ మానుఁ గ్రుద్ధులన్
దరగున మంచిమాటలఁ బ్ర♦సన్నులఁ జేయు మహాత్ముఁ డట్టి భూ
వరసుతుఁ డేగుఁ గానలకు ♦ వారని దుఃఖముగాదె యక్కటా!. ౪ 820

తే. సకలభూతంబులకును ర♦క్షకుఁడు గాఁగ
నలరు రాముని గానల ♦ కంపి జీవ
తతిని బొలియించుచున్నాఁడు ♦ ధరణివిభుఁడు
కాన నీతనిబుద్ధియుఁ ♦ గడు నశించె. ౫ 821

క. అని రాజపత్నులార్తే,శుని దూఱుచు దూడలెందొ ♦ చొచ్చిన వానిం
గనకున్న ధేనువులవలెఁ, బెనువగ నేడ్చిరిటు లేడ్వఁ ♦ బృథ్వీశుండున్. ౬

తే. పుత్రదుఃఖమ్మునం జాలఁ ♦ బొక్కుచున్న
వాఁడు గావున నార్తని♦స్వనము వినిన
యంతనే దుఃఖభారంబు ♦ నాపలేక
మూర్ఛ మునుఁగుచు నాసనం♦బున నె పడియె. ౭ 823

సీ. అంతఃపురంబునం ♦ దార్తనిస్వనమిట్లు భీకరంబుగఁ బుట్ట ♦ వినుచు రాముఁ
డధికతాపము నంది ♦ హస్తిచందంబున నిట్టూర్పు విడుచుచు ♦ నిఖిలములగు
నింద్రియంబుల నిగ్ర♦హించి తమ్మునిఁ గూడి జనని యంతఃపుర♦మునకుఁ జనియె
నందు మిక్కిలి పూజ్యుఁ♦డయి తండ్రిమన్ననఁ బడసిన ద్వారస్థ♦పాలకునిని

తే. వృద్ధపురుషునిఁ గాంచె న♦వ్వీరుఁ డచటఁ
గూరుచుండి భటావళిఁ ♦ గూడియుండె
నితరభటులందు నిలిచి స్వ♦కృత్యరతిని
బొందియుండఁగఁ గాంచె న♦ప్పురుషవరుఁడు. ౮ 824

క. వారందఱు వచ్చెడు నా, శ్రీరాముని విజయమహిత ♦ శీలుంగని పెం
పారఁగ దిగ్గున లేచి, మ,హీరమణా! "జయజయ" యని ♦ యెలమిఁబలుకుచున్.

క. దీవించిరి తొలి కక్ష్యను, భూవిభుతనయుండు దాఁటి ♦ పోయి యవల భూ
దేవుల వృద్ధుల శ్రుతివి,త్పావనమతులన్ నృపేంద్ర♦బహుసత్కృతులన్. ౧౧

క. కనుఁగొని వారికి వందన, మొనరిచి ద్వైతీయకక్ష్య ♦ నొగి దాఁటి ముదం
బున మూఁడవ కక్ష్యాంతర,మున ద్వారముఁ గాచు వృద్ధ♦ముగ్ధవనితలన్. ౧౨

క. పరికించె నంత నచ్చటి, తరుణులు దీవనల దశర♦థప్రియతనయున్
గరుణాత్మకు నలరించుచు, సరగున లోపలికి వేగ ♦ చని ప్రియవార్తన్. ౧౩

క. కౌసల్యకుఁ జెప్పిరి దమి, నాసాధ్వియు నిదురమాని ♦ యారేయి మనం
బాసగొనియుండ మేల్కొని, యాసప్తాశ్వోదయ పొడువ ♦ నాత్మనియతిమై.

క. తనయునకు హితముఁ గోరుచు, వనజాక్షునిఁ గొల్చెఁ దమిఁ బ్ర♦భాతమునందున్
వనితామణి నిరతవ్రత, యనుతాపము మీఱఁ దనయుఁ ♦ డరుదెంచు తఱిన్.

క. తమి మీఱ క్షౌమవస్త్రం, బమరఁగ ధరియించి మంగ♦ళాలంకృతి చి
హ్నములం గైకొని విధిహో,మమునుం జేయించుచుండె ♦ ద్విజాదివిజులచేన్.

తే. రాముఁ డప్పుడు క్షేమక♦రముగు తల్లి, యంతిపురమును జొచ్చి వి♦ప్రాళిచేత
హోమకృత్యముఁ జేయించు♦చున్నతల్లి, దేవకార్యార్థవస్తుత♦తినిని గనియె.

సీ. దధ్యక్షతలును మో♦దకములు ఘృతహవిస్సులును బేలాలును♦ దెలి సుమాఘ
హారముల్ కృసరపా♦యసములు సమిధలు జలపూర్ణకుంభముల్ ♦ వెలయుచుండ

నాదరంబున రాముఁ ♦ డవ్వానిఁ గాంచె నంతటఁ దెల్లపట్టువ♦స్త్రమును గట్టి
వ్రతనియమంబుల ♦ వపువెల్లఁ గృశియింప జలముల దేవత ♦ లెలమిఁ బొదలఁ
తే. దర్పణంబును సేయుచు ♦ దైవతంబు
వలె వెలింగెడు తల్లిని ♦ వన్యనియతిఁ
గనియె శ్రీరాముఁ; డామెయుఁ ♦ గనులు మూసి
ధ్యానయోగమునందుండెఁ ♦ గానఁ దనయు. ౧౮ 833

క. చిరకాలమునకుఁ గని యతఁ, డరయఁగఁ దను మోహనాంగు♦సత్కాంతునఁగా
ధర నవతరించెఁ గావునఁ, బరికించి కుమారుఁడాకఁ ♦ బ్రహసితముఖుఁడై. ౧౯

క. ఉల్లము రంజిలఁగాఁ దన, పిల్ల నెదుర్కొనెడు [1]బడబ♦విధమొప్పఁగ సం
ఫుల్లనయనాబ్జ యగుచున్, మెల్ల నెదుర్కొనియె; సుతుఁడు ♦ మేదురభక్తిన్.

తే. ఎదురువచ్చెడు తల్లికి ♦ నెఱఁగి నిలిచి
నామె కరములు సాఁచి శ్రీ♦రాముఁ గౌఁగి
లించి శిరమును మూర్కొని ♦ లీల నారి
పుత్రవాత్సల్య మెసఁగఁ ♦ బొలఁతి యంత. ౨౧ 836

క. అనుల కజయ్యునిఁ దనయునిఁ, దరణికులాంభోధిచంద్రుఁ ♦ డాఁ గని హితమై
పరమప్రియమ్ము తగఁ బల్కె, రమణ రాఘవునిఁ జీరి ♦ లీలానుగతిన్. ౨౨ 837

సీ. ప్రియకుమారా! నీవు ♦ వృద్ధులు ధార్మికులును మహాత్ములునయి ♦ తనరునట్టి
రాజన్యులెల్ల దీ♦ర్ఘంబగు నాయువు శాశ్వతకీర్తిని ♦ సమధికాన్వ
యోచితధర్మంబు ♦ నొందుమా! నీతండ్రి, సత్యప్రతిజ్ఞుండు ♦ సాధుశీలుఁ
డగుఁగాన నిన్నేఁ బ♦ట్టాభిషేకోత్సవమును జేయ మొదలిడఁ ♦ దనెడు సంశ
తే. యంబు లేల దాతఁడౌను ధ♦ర్మాత్ముఁ డిపుడె
యౌవరాజ్యాభిషేకంబు ♦ నారి చేయు
ననుచుఁ గుడువంగ నియమించి ♦ యాసనంబు
నీయఁ గరమున ముట్టెడు ♦ నాయనపుడు. ౨౩ 838

చ. తనుఁ బ్రియమారఁగాఁ బలుకు ♦ తల్లికిఁ గానకుఁ బోదునన్న వా
ర్త నెటులఁ జెప్పువాఁడనని ♦ తా నొకయించుక సిగ్గునొంది యిం
కను వచియింపకుండుటయుఁ ♦ గానిపనే యగు నంచు నంజలిం
బొనరిచి యామెయందుఁగల ♦ పూజ్యమతిన్ వినయంబు చూపుచున్. ౨౪

క. వినయంబె నైజముగ నొప్పినవాఁడగు నతఁడు ఘోర♦విపినంబులకున్
జనుటకు సెలవొందఁగ నిట్లని చెప్పంబూనెఁ దల్లి ♦ యార్తిం గనఁగాన్.

1 బడబ—ఆఁడుగుఱ్ఱము.

చ. జననీ! మహత్తరంబయిన ♦ సాధ్వసమొందు ధ్రువంబుగాను రాఁ
గను దలపెట్టియున్నదది ♦ గానవు నీవది చెప్పినంత నీ
కును సహజాతభూసుతల♦కున్ బెనుదుఃఖముఁ గల్గఁజేయునై
నను వచియించువాఁడను వ♦నంబులకేగెదఁ దండ్రియానతిన్. ౨౭ 841

క. విను మేను దండకాహ్వయ, వనమునకుం బోదునిపుడె ♦ వరమణిబహుళా
సనమిద్ది యేల? యిఁకమీఁఁ, దను మునులకు యోగ్యమైన ♦ దర్భాసనమే.

ఆ. నాకుఁ దగియె యుండు ♦ నాకాలమే యిపు
డరుగుదెంచియున్న ♦ దంబ! తేనె
మూలఫలములను బ్ర♦మోదంబునం దిని
పదియుమీఁద నాల్గు♦వత్సరములు. ౨౯ 843

క. మునివలె విజనంబగు న, వ్వనమున నివసింపఁబోవు♦వాఁడను మాంసం
బును వంటవాండ్రు పచనం, బును జేసినదానిఁ దినఁగఁ ♦ బోలదు సుమ్మీ!.

తే. యౌవరాజ్యంబు భరతున ♦ కవనినాథ
వర్యుఁ డొసఁగెను నన్నుఁ దా♦పసవిధమున
దండకాటవి నివసింపఁ ♦ దరలునట్లు
చేసె సత్యప్రతిజ్ఞుఁడై ♦ చెలఁగు కతన. ౩౦ 845

క. జనకాజ్ఞను వానప్రస్థుని కర్మమ్ములను జేయు♦చున్ వన్యఫలా
శిని మూలంబులఁ దిని ని, ర్జనవనమునఁ గడుపువాఁడ ♦ సమయముఁ గడఁకన్.

చ. అనినఁ గుఠారధారఁ దెగి♦నట్టివనస్థిత భూజయష్టి నా
మనుజవరేణ్యు జ్యేష్ఠసతి♦మాట యొకండును బల్కఁజాల కో
య్యన దివినుండి భూమిఁ బడు♦నట్టి సురాంగనభంగి గాఁగఁ జ
య్యన నవనీస్థలిం బడియె; ♦ నవ్విధి మూర్ఛిలియున్న తల్లినిన్. ౩౨ 847

తే. దుఃఖమొందంగఁ దగనియా♦తోయజాక్షిఁ
బతితకదళీవిధంబున ♦ క్షితితలమునఁ
బడినవిధమును గన్గొని ♦ పరమకరుణ
తనరఁగా లేవనెత్తె నా♦తండు వేగ. ౩౩ 848

సీ. భారంబు పూన్చుట ♦ బడలి యయ్యది పాపుకొనుటకై వేగంబ♦క్షోణిని బడి
పొరలాడి లేచి యు♦స్సురనుచు స్రుక్కిన యాఁడుగుఱ్ఱముభంగి ♦ నాదశరథు
రమణియు దుఃఖభా♦రమునకు నోర్వక క్షితిఁబడి పాంసుకుం♦ఠిత శరీర
యయి ప్రియాత్మజుఁడు త♦న్ననువున నెత్తఁగా మెలమెల్ల లేచెన♦మిత్రహరుఁడు

తే. తల్లిదేహము దీనతఁ ♦ దనకరమున, ధూళిపోయెడునట్లుగాఁ ♦ దుడిచె; నంత
సుఖమునే పొందుటకుఁ దగి♦క్షోణిదుఃఖ, భారపీడితయయి తన♦పరిసరమున,

క. పావనమతియై భక్తిని, సేవించుచునున్న పురుష♦సింహుని రామున్

దా వనికరుగంగఁ గోరెదు, భావంబున నొప్పవానిఁ ♦ బరికించి వెసన్. ౩౪

క. సౌమిత్రి వినఁగ నిట్లను, రామా! నినుఁ గనుట దుర్భ♦రంబగు శోకం
బే మహిఁ బొందితి నది లే, దే మహిళాజాతివంధ్య♦నే యగుదుఁగదా. ౩౫

తే. అట్టులైనను సంతతి ♦ నందలేక
పోతిఁగా యను దుఃఖంబుఁ ♦ బూనియుందుఁ
గాని మిక్కుటమైన శో♦కంబు నాకుఁ
గలుగకుండుఁ గదా; ప్రజఁ ♦ గననిసతికి. ౩౬ 852

క. తనయులు లేరను దుఃఖం, బనునది యొక్కండె మనను♦నందుండు నిటుల్
తనయు నెడఁబాసి దుఃఖం,బునఁ బొరలుచు నగచునట్టి ♦ భూరితరార్తిన్.

సీ. వేఱొకదాని నా♦వెలఁది పొందదు గదా; పుత్రకా! నావల్ల♦భుండు చాల
ననురాగమున నన్ను ♦ నలరింపవలసిన నతి జ్యేష్ఠపత్నికిఁ ♦ దగినయట్టి
యాభరణంబులు♦నైశ్వర్యమును మొదలగు నెట్టి శుభముఁ బ్రి♦యప్రమోద
ఫలభూతసమ్మాన♦కలితసుఖంబును గని యెఱుంగను నింత♦వఱకు నేను

తే. ప్రియతనూజుఁడు పుట్టిన♦పిదపనైనఁ
దద్బలంబున నవ్వానిఁ ♦ దమినిఁ బొందఁ
గలనటంచుఁ దలంచుచుఁ ♦ గడపితిఁ జుమి
యింతకాలంబు రాఘవా! ♦ యెట్లొకాని. ౩౭ 854

*సీ. ఇంతకాలము సుఖ♦మే యెఱుంగని నేను ప్రియునిమనస్సును ♦ ఛేదముఁ గను
నట్టులొనర్చుచు ♦ నరయఁగ నాకన్నఁ దక్కువవారలై ♦ తనయ! నాకు
నవతులైయొప్పెడి ♦ జలజాక్షులింతకు మునుగొన్నిపల్కుచుఁ♦బూన్కినిపుడు
పెక్కులు వీనుల ♦ విన ననహ్యములగు స్పష్టవాక్యంబులు ♦ పలుకుచుండ

ఆ. జ్యేష్ఠపత్నినయ్యుఁ ♦ జింతఁబూనుచు విన, నుస్నదానను గద ♦ నన్ను వారు
మగని యెదుట నిలిచి ♦ మరలపొమ్మింటికి, యిటకు రాకుమనఁగ♦నెట్టులోర్తు

చ. తరుణులకున్ సపత్నులు ని♦తాంతము కుత్సితవాక్యముల్ భయం
కరముగఁ బల్కఁగా వినుచుఁ ♦ గాలము పుచ్చుటకన్న నెక్కుడై
పరఁగెడి దుఃఖమింకొకటి ♦ పాపురె! కల్గునె? కానఁ బుత్రకా!
యరయ మదీయశోకమున ♦ కంతము లేదు సుమీ! నిజంబుగన్. ౩౯ 856

తే. నావిలాపంబునకుఁ బ్రమా♦ణంబుఁ జెప్పఁ
దరము గాకుండు మఱియు నం♦తంబు లేదు
పుత్ర! నాదగు శోకమే♦ద్దాని దలంపు
మపరిచింత్యములని, యవా♦చ్యములు ననియు. ౪౦ 857

* సా బహూన్యమనోజ్ఞాని వాక్యాని హృదయచ్ఛిదాం, అహం శ్రోష్యే సపత్నీనా మవరాణాం వరాసతీ-అనిమూలము. గోవిందరాజవ్యాఖ్యలోనిభావము లిట సంగ్రహింపఁబడినవి.

క. తనయా! బలవంతుఁడవై, తనరారెడు నీవె యిట్లు ♦ దగ్గఱనుండం
గనె నను దిరస్కరించుటఁ, గనినాఁడవు గాదె? నీవు ♦ కానలకరుగన్. ౪౦

క. ఏమి వచింపంగలదిఁక, భీమంబగు మృతియె కాని ♦ వేఱుగతియె లే
దీమాట నిక్కువము సుమి!, రామా! నీతండ్రిచే ని♦రాకృత నగుటన్. ౪౧

క. సతత మతంత్రితఁగా ననుఁ, బతిచేయుటఁ బత్నులందుఁ ♦ బరికింపఁగ నీ
చతనొందియుందుఁ గాన, క్షితిపుని ప్రియపత్ని కైక ♦ చెలఁగెడు వేడ్కన్.

క. తనదాసీజనములతో, ననుఁ దుల్యనుగానొ! మఱి య♦నాదృతిచే నిం
కను వారికన్నఁ దక్కువ, గనొ! చూచును మదిఁ దలంపఁ♦గా నిటులైతిన్.

చ. వనముల కీవు పోవ నిటఁ ♦ బార్థివుఁడై భరతుండు మీఱఁగా
నను నెవఁడేని గొల్చుటకొ ♦ నాపలుకుల్ గ్రహియించి నేను జె
ప్పిన యటు సేయఁగానొ, రఘు♦వీర! చెలంగిన నట్టి భాగ్యముం
గన నగు నేని కైకసుతుఁ♦గాంచి భయంబునఁ బల్కకుండుఁ జూ!. ౪౩ 862

చ. విను మల కైకయో యెపుడు ♦ ప్రీతిని బాసి క్రుధం జెలంగిన
న్ననిపరుషంబులే పలుకుఁ ♦ గావున నీగతి దిక్కుమాలి యా
వెనుకఁ దదీయవక్త్రమును ♦ వీరకుమారక! చూచి యెట్టులో
ర్తును వినరాని యానుడుల ♦ రూక్షములన్ విని యెట్లు తాళుదున్. ౪౪ 863

*సీ. నీవు నాకుక్షి జ♦నించినది మొదలుగాఁ బదునేడేండ్లు♦గాఁ గుమార!
యువరాజవై సిరి ♦ యొప్పఁగ నీవుందు వంత నాదుఃఖము ♦ నంతమొందు
నని మదిఁ గోరుచు ♦ దినములు గడిపితి నవతులకథలకు ♦ సరియగు వయ
సును బలంబును క్షీణ♦మును బొందిననుసపత్నులు చేయునవమతి♦వలనఁ బొందు

తే. నట్టి యక్షయఘోరదుః♦ఖామయంబు
నింకఁ జిరకాల మేను స♦హింపనొల్ల
రాఘవా! పూర్ణశశధర♦ప్రభల వెలుఁగు
నీదు మోమును జూడక ♦ నేఁ గుమార. ౪౫ 864

క. దీనతనొందుచు నేగతి, గానీ కృపణంపుబ్రతుకుఁ ♦ గలకాలమ్మున్
మానధననయ్యు బ్రతుకుదు, భానుకులాంభోధిచంద్ర! ♦ పరికింపుమిఁకన్. ౪౬

తే. మందభాగ్యను నేను రా♦మ నినుఁ బెక్కు
వ్రతములొనరించి మఱియుప♦వాసముండి
సురలను దలంచి పెంచిన ♦ సరణి యెల్లఁ
గష్టమును వ్యర్థమును గాంచెఁ♦గాదె యిపుడు. ౪౭ 866

* దశసప్తచ వర్షాణి తవజాతస్య రాఘవ-అనిమూలము. దీనికి మహేశ్వరతీర్థులు వ్యాఖ్య వ్రాయుచు వయఃకాలమును విస్తారముగా విమర్శించిరి. దానిసారము మీపద్యమున నున్నదని గ్రహింపవలయు.

సీ. వర్షర్తువున నాత్మ♦వారిప్రవాహంబు తాఁకినఁ బెనునదీ♦తటము భగ్న
మైనట్టు లిట్టి మ♦హాదుఃఖవార్తను వినినతోడనె నాదు ♦ మనము వేయి
శకలంబులుగఁ గాక ♦ యిఁకను యథారీతి నున్నది కాననే ♦ నూహసేయఁ
దాన నియ్యది బోయి♦యగానని; మృగరాజు వెతనొందు జింకను♦వెదకి యంత
తే. మొందఁ జేసెడు గతి నన్ను ♦ నుగ్రమూర్తి
యముఁ డిపుడె చంపకుండుట ♦ నరయ నాకుఁ
జావు లేకుంట నిజమగు ♦ శ్రాద్ధదేవు
నింట నన్నుంపఁ జోటు లే♦ దిద్ది ధ్రువము. ౫౦ 867

మ. తనుచిత్తంబులు రామ! యివ్విధిని బొం♦దన్ రానిదుఃఖంబునుం
గనియున్ భిన్నములై తృణాళిగతి భూ♦ఖండంబునం జేరకిం
కను బూర్వాకృతులొందియున్న వివిగో! ♦ కానన్ గుమారా! తలం
తును నేనియ్యవి [1]యాయసంబులని, యెం♦తున్ బాలఁగావిననిన్. ౫౦½ 868

తే. దైవనిశ్చితమగు తఱిఁ ♦ దప్ప మృతియుఁ
గలుగదనుటయు నిజమగుఁ ♦ గాదె; రామ!
సంతతిని గోరినే నొగి ♦ సలిపినట్టి
వ్రతములును ధ్యానదానముల్ ♦ ఫలము గనవు. ౫౧ 869

క. ఒనరించిన తపమెల్లను, దనయమణీ! చవుటినేలఁ ♦ దగనాటిన వి
త్తనముగతి మిగులవ్యర్థతఁ, గనియెంగదా యెట్టులోర్వఁ ♦ గల నీ వ్యథకున్.

మ. వినుదుఃఖంబు తపింపఁ జేయుతఱి నీ ♦ విశ్వంబునందెవ్వఁడై
న నకాలంబున స్వేచ్ఛగా మృతిని బొం♦దంజాలువాఁడేని న
త్తను జూడంగను లేని యీ వుపలెఁ బు♦త్రశ్రేష్ఠ నిన్ బాయఁజా
లని నేనేగుదుఁ [2]ప్రేతరాట్సభను గా♦లంబుం దగం బుచ్చఁగాన్. ౫౩ 871

సీ. ఈరీతిఁ జేయఁగా♦నేని శక్యముగాకయున్న దేమందునే ♦ నోకుమార!
కలుగకయున్న స♦కాలమృత్యువు రామ! చంద్రనిభానన♦చ్ఛవిని మించు
నినుఁ జూచుటయు లేక♦మనమునఁగుందుచుఁగుత్సితంబగు బ్రతు♦కునిటఁ గనుచు
నుంటచే నేలాభ ♦ మొనఁగూడుఁ; గావున మిగుల డస్సిన గోవు♦ మేదురకృప
తే. వత్సవెంబడిపోయెడు ♦ భంగి నేను, నిన్ను వెనుకొనివచ్చెద ♦ నిన్నుఁ బాసి
నిలువనోప; నటంచని ♦ నిబిడదుఃఖ,మునకుఁ దాళఁగఁజాలక ♦ మోముపంచి.

చ. వనితయు రాముఁ బాసిన స♦పత్నులవంకను గల్గఁ బోవు న
ప్పను వ్యసనంబునుం దలఁచి ♦ వెల్వలఁ బొలుచుఁ బాశబద్ధుఁ...

1 ఆయసంబులు=ఇనుముతోఁ జేయఁబడినవి. 2 ప్రేతరాట్సభ=యమునికొలువు.

తనయున కేడ్చు కిన్నరివి♦ధంబున సత్యసుమైకపాశబ
ద్ధునిఁ దనపుత్త్రునిం గనుచుఁ ♦ దోరపుదుఃఖమునన్ దపించెఁ దాన్. ౫౫

ఇరువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౨౧ - వ సర్గము.

### కౌసల్యను సౌమిత్రి యూఱడించుట.

క. ఈరీతి నాతలోదరి, శ్రీరాముని జనని యేడ్వఁ ♦ జిత్తము దూలం
గా రామసోదరుండా, నారీమణి దుఃఖమును న♦ణంపఁ దలఁచుచున్. ౧ 874

క. మోహమున దీనతతోఁ, బఁగ, నామాన్యుం డత్తఱిఁ దగి♦నట్లు పలికె; నా
ర్యా! మహిళావాక్యములకు, రాముఁడు లోనయి చనంగ♦రా దడవులకున్.

*క. ఘనతరరాజ్యేందిర మన,మున నెన్నక పాసి వనికిఁ ♦ బోవుట నీకే
నన నేల నాకు నొప్పునె, మనుజేశుఁడు వృద్ధుఁడగుట ♦ మతిహీనుఁడగున్. ౨

క. విను మతఁడు విషయలోలుఁడు, మనసిజవశుఁడై చెలంగు ♦ మతిసంపద లే
క నిరతముండును గావున, వనితయుఁ బ్రేరేపనేమి ♦ పలుకఁడు? చెపుమా. ౩

తే. ఇద్ది రామునిదగు దోష♦మే యగునని
యందువేమొ? యదియుఁగాదు ♦ సుందరమగు
రాజ్యమును మాని దుర్గమా♦రణ్యవాస
మునకుఁ బంపఁగఁదగు ద్రోహ♦మును మఱియును. ౪ 878

క. ఇతరములగు పాతకములు, వెతకిన మాయన్నయందు విను ♦ గానఁగ లే
క తపించుచున్నవాఁడను, సతీమణీ! కాన వనికిఁ ♦ జననేల యిఁకన్. ౫ 879

[1]ఆ. [చాలవృద్ధుఁడైన ♦ జనకుండు కామవి,కారములకుఁ జిక్కి ♦ కాంతఁగూడి
సిగ్గులేక యిట్లు ♦ చేయుట నేఁ జంపు,వాఁడ ధర్మహీన♦పార్థివుక్రియ.] 880

సీ. అధికశత్రువుగాని ♦ యపరాధమొనరించి రామునిచే నగౌ♦రవము చేయఁ
బడినయాతఁడు గాని,♦భామినీమణిరో! యెవ్వఁడుఁగాని రాముని♦పయినిదోష
మారోపణమును జే♦యఁగఁ బరోక్షమ్మునసేని నే వినలేదు ♦ గాన నింకఁ
బ్రత్యక్షమునఁ జెప్పు♦వాఁడుండునే లోకమున నట్టివానినే ♦ గనఁగలేదు

తే. సురసమత నొంది కుటిలత ♦ నరయ నించు
కంతయును లేక గురుశిక్ష ♦ నంది యరుల

---

* ఇందు లక్ష్మణుఁడు పితృదూషణము చేయుట కౌసల్య దుఃఖము నడఁపఁబూనియే కాని పితృభక్తి లేక కాదు. ఈసర్గారంభమున "తథా లసదృశం వచః" అత్తఱిఁ దగినట్లుపలికె అన్న మాటవలన నీయర్థము స్పష్టము. 1 ఈపద్యము "అహం హనిష్యే పితరమ్" అను నధికపాఠశ్లోకమునకు వ్రాయఁబడినది. దీనికి వ్యాఖ్య వ్రాయఁబడలేదు.

యందునుం బ్రేను నులరార ♦ నములు ధర్మ
మూర్తియై పొల్చువాఁడు రా♦ముండు గాన. ౪। 881

చ. తనయుని నట్టివానిఁ గుల♦తారకు నేయపరాధమేని చే
యని ఘనుఁ గారణంబొకటి ♦ యైనను లేక యిు పీడువాఁడు గ
ల్గునె? జనకుండు ధర్మమును ♦ గోరనివాఁడగు నట్టివాని ప
ల్కును గ్రహియింపరాదు; నృప♦కుంజరుఁ డెంతయు వృద్ధుఁడై ననున్. ౫ 882

తే. మరల బాల్యమునొందిన♦మాడ్కిఁ గాదు
పరవశుండయ్యెఁ గావునఁ ♦ బతి వచించి
నట్టిపల్కును నృపనీతి ♦ సగయునేని
యొకుమారుఁడు మది గ్రహి♦యించుఁ జెపుము!. ౬ 883

చ. అని వచియించి యున్నఁ గని ♦ యాంగుసుఁదైష్ట పచియించె లక్ష్మణుం
డినకులతారకా! వనికి ♦ నిప్పుడు నిన్నును బంపువార్త నే
మనుజుఁ డెఱుంగకుండఁగను ♦ నూనితరాజ్యమునుం గ్రహించి నీ
యనుమతి నుండఁ జేసికొను ♦ మంతట నన్నును గూడి రాఘవా. ౭ 884

క. ధనువును దాలిచి పార్శ్వంబున నేఁ గాపగచునుండ ♦ మునసినయము భం
గిని బొల్చెడు నీకంటెను, ఘనపౌరుషవర్యుండు ♦ గల్గునె? యెవఁడున్. ౮

తే. అట్టి నీమాట జవదాఁటు♦నట్టి వాఁడు
గల్గునే? పౌరులేదేని ♦ గాని నీకు
నపకృతినిఁ జేయఁబూనిన ♦ నాత్మతీక్ష్ణ
శరములం జంపి యిపుడె యి♦ప్పురవరమున. ౯। 886

క. మనుజులు లేకుండఁగ నే, నొనరించెదఁ బురుషవర్య! ♦ యొుగిఁ గైకేయిన్
తనయుని పక్షంబునఁ గల, మనుజుల వద్ధితముఁ గోరు ♦ మనుజుల నెల్లన్. ౧౦।

క. కనుఁగొని వధియించెద మె, త్తని వారిని గ్రందు సేయఁ ♦ దలఁతురు గానన్
మన మిఁకఁ దీక్ష్ణంబుగ నే,పని నొనరుపవలయు నాదు ♦ పలుకును వినుమా!.

క. మనతండ్రి కైక పురికొ,ల్పినఁ దద్వచనమునఁ జాల ♦ విశ్వాసంబుం
గని మన కరిదై యపకృతి, నొనరించునయేని యేమి ♦ యోజింపక యే.

క. అతనిం బట్టి వధింతము, మతిసంతతటి కటుతనొంద ♦ మనుజర్షభ గో
గతినైనఁ గూడదే న, ప్పతినిం బంధింత మిపుడె ♦ పాప పాసకుమా !. ౧౨

చ. జనకుని నిట్లు చేయుటకు ♦ శాస్త్రమదొప్పునె యందువేమొ? నే
వినినది చెప్పువాఁడ మృదు♦వృత్తము నూని మదించి యిద్దిచే
యను దగు నిద్దియుం దగద♦టంచు నెఱుంగక మేరమీఱిన
జనకుని కేని దండనము ♦ సల్పుట న్యాయము, శాస్త్రమొప్పెడిన్. ౧౩ 891

చ. పురుషవరేణ్య! ధర్మమునఁ ♦ బొందిన నీవగు రాజ్యలక్ష్మినే
వరుసను నిన్నుఁ బొందఁదగు ♦ బాహుబలోద్ధతి యున్నదంచు; రా
డ్వరుఁ డిఁక నేమి హేతువును ♦ బట్టి తలంచి భవద్ధితంబుగాఁ
బరఁగెడు నిట్టిరాజ్యమును ♦ భామిని కీయఁగఁ గోరువాఁడొకో?. ౧౫ 892

సీ. అరిశాసకుండవై ♦ యలరు నీతోడను నాతోడఁ బలుపగ ♦ నాతఁ డంది
భరతునకుం బ్రియ♦భార్యమాటలవిని పెనురాజ్య మీయఁ♦జాలిన సుశక్తి
గలవాఁడె? యని పల్కి♦కౌసల్యఁ గనుఁగొని భరతునిమాడ్కి నే♦నరయరాము
నకును దాయాదినై♦నను యథార్థంబుగా భావమందన్నపైఁ ♦ బరమమైన

తే. యట్టి యనురాగమే గల ♦ దంబ! నాకు
ననుచు నీరెండ్రాల ధనువు, స♦త్యమును దాన
దేవతార్చనముల నొడ్డి ♦ తీవ్రమైన
శపథమును జేయుచున్నాఁడ ♦ సంతసమున. ౧౬ 893

క. మండెడు నగ్నిని గానీ, దండకమను వనముఁగాని ♦ తండ్రి పలుక రా
ముండు ప్రవేశించిన నుద్దండతమును నేన చొత్తుఁ ♦ దప్పక తల్లీ!. ౧౭ 894

క. అని నీవు నిశ్చయింపుము, వనజాప్తుం డుదయమొంది ♦ స్వప్రభలఁ దమ
స్సు నశింపఁ జేయుగతి నో, జననీ! నీదుఃఖమణఁతు ♦ శౌర్యస్ఫూర్తిన్. ౧౮

ఆ. నాపరాక్రమమును ♦ నాజనయిత్రియు
సూర్యవంశమణియుఁ ♦ జూడ్కులలరఁ
జోద్యమంది యిపుడె ♦ చూతురు గాక యం
చనియె నంత నమ్మ♦హాత్ము పలుకు. ౧౯ 896

చ. విని జనయిత్రి యేడ్చుచును ♦ విస్తృతదుఃఖము తీఱునా యటం
చును మదిఁ గోరుచున్ దనయుఁ ♦ జూచి వచించెను బుత్రరత్నమా!
యనుజుఁడు లక్ష్మణుండనిన ♦ దంతయు వింటివిగాదె! యద్ది నీ
మనమున కొప్పునేని మతి♦మంతుఁడవౌటను గృత్యమీవిఁకన్. ౨౦ 897

క. ఒనరింపుము నాపై నీర్ష్యను గొని యున్నట్టి సవతి ♦ సత్యేతరవా
క్కును జెప్ప దాని విని నన్, బెనువగలం గుందుదాని ♦ విడిచి యడవికిన్.

క. చనరాదు నీకునున్ ధర్మనికరమును దెలియు దీవు ♦ రహివరధర్మం
బును బూన్కి నాచరింపఁగ, మనమునఁ గోరుదవయేని ♦ మామకసేవన్.

క. నిరతము సేయుచు ననదృశ, వరధర్మము దీనిసలుపు ♦ పరఁగును శాస్త్రో
త్కరమునఁ దల్లిని గొల్చుట, పరమంబని దానిమించు ♦ పాటిది గలదే?. ౨౧

క. మును కశ్యపమౌనీశ్వర, తనయులలో నొకఁడు భక్తిఁ ♦ దల్లికి శుశ్రూ
షను జేయఁగోరి దానినె, యొనరిచి యింటనె వసించి ♦ యురుతపముఁ గనెన్.

క. తరువాతఁ దత్ఫలంబున, సురలోకము నొందెఁ గాదె? ♦ శుభగుణనిలయా!
ధరణీశుఁ డెట్లు గౌరవ,సరణిం బూజ్యుండొ నేను ♦ జననిని నగుటన్. ౨౩౪

తే. నీకుఁ బూజింపఁదగుదాన ♦ నే కద? రఘు
వంశభూషణ! కావునఁ ♦ బార్థివేంద్రు
పలుకువలె నొప్పఁదగు నాదు ♦ పలుకు, వనికిఁ
బోవ నే సమ్మతింపను ♦ బో నిజమ్ము. ౨౮ 903

క. వనమున కిటనుండి చనం,గను రాదు కుమార! నిన్నుఁ ♦ గాననిచో నే
నును మననేలొకో సౌఖ్యం,బును బొందఁగ నేల; వనికిఁ ♦ బోయిన పిదపన్.

ఆ. ఇంటనుండి పుత్ర! ♦ యేనెల్ల సుఖముల, ననుభవించుచుండు ♦ నంతకంటె
నీదు వెంటవచ్చి ♦ నెమ్మిఁ దృణంబును, దినుచు నుంట మంచి♦ది యగు నాకు.

సీ. దుఃఖంబునం జాల ♦ దురపిల్లు సను నిట విడిచిపోయెదవేని ♦ విపినములకుఁ
బ్రాయోపవేశంబుఁ ♦ బాటించి యనశనవ్రతమున విడిచెదఁ ♦ బ్రాణములను
బ్రతుకలే నెంతమా♦త్రము; సీనిమిత్తము యసువుల విడుతు నే ♦ నఖిలనదుల
కధిపుఁడౌ సంబుధి ♦ యూస్యుఁడౌ పిప్పలాదమునికిఁ జేసిన ♦ దారుణాప

తే. కృతికిగా బ్రహ్మహత్యకు ♦ నీడయి తగు
పాతకము నొందినట్లు, వి♦శ్వమునఁ బేరు
గల్గునట్లుగ నీవు దు♦ర్గతిని బొందఁ
గలవనియొ; నిట్లు దీనయై ♦ కడుఁ దపించి. ౨౭ 906

క. విలపించెడు కౌసల్య న,ఖిలధర్మవిదుండు చూచి ♦ కేవల ధర్మా
త్మ లలితవచనము లలరఁగఁ, బలికెన్ రాముండు తల్లి♦బాధ నడఁపఁగన్. ౨౮

క. జననీ! నీవాక్యముచొ,ప్పున నడువఁగవలయు నైన ♦ భూపతివాక్యం
బును మొదటి దాటఁ బ్రబలతఁ, గనుఁ గావున దాని మీఱఁ♦గాఁ జాలను జూ!.

చ. జనకునిమాట మీఱుటకు ♦ శక్తియె లేదు శిరస్సు సోఁక వం
దనము నొనర్చి వేఁడెదను ♦ దావకచిత్తముసందు నేమియుం
దనయునిపైని నాగ్రహము ♦ దారుణదుఃఖము నుండకుండెడున్
వని కరుగంగ వేఁడెదను ♦ బంపుము దీవనలిచ్చి నన్నిఁకన్. ౨౯ 909

చ. వ్రతముల నాచరించుచును ♦ బండితుఁడై బహుధర్మవేత్తయై
క్షితిఁ దగు కండుమౌని పితృ♦కీర్తితమార్గముఁ బూని గోవును
గ్గతి వధియించెఁ గాదె? మును ♦ తల్లిరో! యస్మదుదారవంశమం
దతిశయవిక్రమక్రములు ♦ నై తగు సాగరులెల్ల నొక్కటన్. ౩౦౪ 910

చ. జనకునియాజ్ఞ భూమిని వి♦శాలఖనిత్రము లూని త్రవ్వి భీ
తిని గలిగించు మృత్యువునఁ ♦ దెల్లిరిగా; జమదగ్నిసూనుఁడున్

దన పితృనాజ్ఞ సేయఁదగుఁ ♦ దప్పకయంచును గన్నతల్లియై
తనరెడు రేణుకన్ నఱికెఁ ♦ దాను కుఠారమునన్ వనంబునన్. ౩౨ 911

చ. సురసములైన కండుముఖ♦సువ్రతులింకను బెక్కుమంది యే
వరుసగఁ దండ్రి యాశయము ♦ భంగి నొనర్చిరో? యట్లె నేనునున్
ధరణిపమౌళి కెంతయు, హి♦తంబుగ నాతని మాట వ్యర్థమై
పరఁగఁగఁ జేయఁ దద్ధితమె ♦ పంతమునన్ మఱి చేసితీఱదన్. ౩౩ 912

క. నేనొక్కఁడనే జనకుని, యానతి నొనరింపలేదు ♦ జ్యాస్థలి; నిపుడేఁ
బూని నచియించినట్టి మహానియతులు చేసియుండు ♦ టరయుము తల్లీ!. ౩౪

సీ. నేను శోకమ్మును ♦ నీకుఁ గల్గఁగఁ జేయవలెనని యింతటి♦వఱకు లేని
పూర్వుల యాచార♦పుంజవిరుద్ధమై తగిన యీసూతన♦ధర్మమిప్పు
డాచరింపఁగ వలె ♦ నంచుఁ బూనఁగలేదు తండ్రికంటెను దల్లి ♦ తలఁప నెన్ని
మడుఁగులో యెక్కువ♦మర్యాదఁ బొందఁగా నర్హయౌనైన ని♦యంత తండ్రి

తే. యాటఁ బూర్వులు సన్మతి ♦ ననుసరించి
నట్టి యీపితృవాక్య స♦మాచరణము
నెడి మహాపద్ధతిని నేను ♦ గడుముదమున
ననుసరించెద నని యెంచు ♦ మంబ! నీవు. ౩౫ 914

క. పితృవచన మవశ్యముగా, ఙ్కృతిఁ జేయందగును గానఁ ♦ జేయకయ యస
మ్మతి నూరకుండఁ జాలను, బితృహిత మొనరింప నెట్టి ♦ విప్రియమైనన్. ౩౬

క. కలుగదుగా! యని యీగతిఁ, బలుకుచు వాక్యవిదులందు ♦ బాణాసన ధా
రులయందు ముఖ్యుఁడౌ రఘుకులతిలకుం డనుజుతోడఁ ♦ గూరిమిఁ బలికెన్.

తే. లక్ష్మణా! నీకు నాపై న♦లరు చెలిమి యనుత్తమంబగు నీదు మ♦హత్తరప్ర
తాపదుర్భర తేజముల్ ♦ దారుణంపు, బలము లెఱుఁగుదు లే వితరులకు నివ్వి.

క. నాతల్లి సత్యశమముల, వౌ తెఱఁగుల నెఱుఁగ దట్టు♦లౌటను శోకం
బాతతముగఁ బొందెను నీ, వా తెఱఁగులఁ దెలిసి యిట్టు ♦ లాడెదవేలా?.

క. పురుషార్థావళి ధర్మము, పరమము భువి, ధర్మమందె ♦ పరఁగును సత్యం
బరయఁగ నుత్తమ పితృవా, క్పరిపాలనము నెడు నిద్ది ♦ పరికించినచోన్. ౩౯

తే. ధర్మమునె యాశ్రయించి ని♦తాంతమలరుఁ
గావునన్ ధర్మమూలమై ♦ క్రాలు దీని
వలన ధర్మము గలుగును; ♦ బరమధర్మ
ఫలమునే కోరునట్టి యొ♦వ్వండు గాని. ౪౦ 920

క. జనకునకున్ జననికి వి, ప్రున కిచ్చిన బాస తప్పఁ♦బోలునె వ్యర్థం
బును బొంద దానిఁ జేసినఁ, గన నగునే సత్ఫలంబు ♦ కప్రుగుణనిధీ!. ౪౧

క. విను మేనును జనకుని యాజ్ఞను దాఁటఁగఁజాలఁ బ్రతిన ♦ సల్పితిఁ గానన్

క. పెనుమూర్ఛ మున్గినవిధం, బున నుండియుఁ గొంతవడికి ♦ బుద్ధిభ్రంశం
బును వదలి రామచంద్రునిఁ, గని యిట్లని పల్కెఁ బుత్ర♦కా విను మింకన్.

ఉ. పిన్నటనాటనుండి నినుఁ ♦ బెంచెదు ధర్మముఁ బట్టి గాఢమై
యున్న సుహృద్విశేషమును ♦ నూల్కొనియున్ దలపోసి చూడ నా
యన్నరొ! నీకుఁ దండ్రియెటు ♦ లట్టులె నేనును బూజ్యరాలనై
యెన్నఁగ బెద్దనే యగుదు ♦ నిట్లగుటం బితృవాక్యరీతిగన్. ౩౦౪ 931

క. నామాట త్రోసివేయఁగ, రామా! ధర్మంబు గాదు ♦ రమణిపలుకులన్
ఈమాడ్కి నడవికేగఁగ, నే మది నంగీకరింప ♦ నీయ ననుజ్ఞన్. ౩౧ 932

క. ఘనశోకంబునఁ గుందెదు, నను నిటు విడనాడి పోవ ♦ న్యాయము గాదో!
తనయా! నీవే నాచెంతను లేకయెయున్న జీవి♦తంబిల నేలా ?. ౩౧। 933

క. పరలోకమేల? యింకఁ బితరులకు నాధారమగుచుఁ ♦ దగు పదమున నా
కు రహిన్ స్వధ లభియించిన, సురుచిరమగునే, యదేల? ♦ సుధ నాకింకన్.

ఆ. అమలమోదమిచ్చు♦నట్టి మహర్లోక
మాదియైన మీఁద ♦ నలరు లోక
తతిఁ జెలంగు ప్రాణి♦తతి ముందుఁ దోఁచిన
క్షణము నిన్నుఁ గన్న ♦ చందమగునె!. ౩౨ 935

*మ. ద్విరదగ్రాహులు సాధనంబులను బం♦ధింపంగఁ దామెంచి య
క్కరి వారింపఁగఁ బూన్కిమైఁ దనదు మా♦ర్గంబుం దగం బొందు కుం
జర మెల్లెంతొ తపించు తల్లి! కరుణా♦స్ఫారోక్తులాలించి భా
స్కరవంశాగ్రణి లొంగ పోక తనమా♦ర్గంబొందె సంరబ్ధుఁడై. ౩౩ 936

[1]చ. మనుజు లలాతముల్ గొనుచు ♦ మార్గముఁ దప్పఁగ నేఁచి యడ్డగిం
చినఁ దమమందుఁ జొచ్చి వెతఁ♦జెందు మహాగజమట్లు తమ్ముఁడున్
జననియు దీనవాక్యముల ♦ స్వాంతము దూలఁగఁ జెప్పి యేడ్వఁగా
వినియును జూచియున్ మదిని ♦ విహ్వలభావము నొంద కాతఁడా
ర్తిని గనకాత్మధర్మమునఁ ♦ దెంపున నిల్చెఁ దదేకనిష్ఠతోన్. ౩౩ 937

సీ. ఇంచుమించుగఁ బ్రజ్ఞ♦యే లేక శోకించు తల్లిని; దుఃఖాభి♦తప్తుఁడగుచు

* నర్షైరి వోల్కాభి రపోహ్యమానో మహాగజో ధ్వాన మనుప్రవిష్టః-అని గోవిందరాజులుగారి పాఠము ఉల్కాభి స్సాధనైః - ఉల్కలనఁగా సాధనములని వారియర్థము. దీని ననుసరించి యీపద్యము వ్రాయఁబడియె.

1 నర్షైరి వోల్కాభి రపోహ్యమానో మహాగజో ధ్వాంత మనుప్రవిష్టః-అని మహేశ్వరతీర్థులవారి పాఠము. 'ఉల్కాభిః అలాతైః' ఉల్కలనఁగాఁ గొఱువులు. గోవిందరాజులవారిపాఠమున 'అధ్వానం' మార్గమును అని. మహేశ్వరతీర్థపాఠమున, 'ధ్వాన్తం' చీకటిని అని సంబంధములేక రెండుపాఠము లున్నందున రెండుపద్యములు వ్రాయఁబడినవని యెఱుంగునది.

తే. అట్టులోనరింపఁ జాలకే ♦ నెట్టు లుండు
నా ప్రతిజ్ఞయుఁ బూర్ణత ♦ నందునట్లు
చేయువాఁడను నాయనా ♦ క్షితివిభుండు
భరతునకు నాకు నొడయఁ డు♦త్తరువుచేయ. ౫౮॥ 944

క. పెనిమిటి కౌసల్యకుఁ గా,వున నాజ్ఞను మీఱరాదు ♦ పోల జనని కా
తని తోడిదె గతి ధర్మము,తనితో సహవాసమనుచుఁ ♦ దలఁపుము వత్సా!.

సీ. ధర్మప్రవర్తక♦త్వము నొంది పూర్వులకన్న విశేషించి ♦ క్షమను దనకు
నియతమౌ పథమున ♦ నిల్పి దిక్కయియున్నయట్టి ప్రాణేశ్వరుం♦డిట్టు లిపుడు
బ్రదికియే యున్నాఁడు ♦ పట్టపురాణినై తనరారుచున్నది ♦ జనని యిట్టు
లుండ నీకౌసల్య ♦ యురుతరకరుణచేఁ దనయునితోఁ గూడి ♦ వనికినేగు

తే. దిక్కులేనట్టి విధవదా♦తీరున నెటు
నన్ను విడనాడలేక కా♦నలకు రాఁగఁ
గలుగుఁ? గావున నాకుఁ గా♦నలకు నేగఁ
దల్లిరో! యాజ్ఞయిమ్ము ని♦తాంతకరుణ. ౬౦॥ 946

క. వినుమిఁక దౌహిత్రుఁడు చెప్పిన సత్యమ్మున యయాతి ♦ విబుధపురమునొం
దెనొ మరల నట్లె నేనును, వనిఁ బదునాల్గేండ్లు గడపి ♦ వత్తుం బురికిన్. ౬౧॥

క. పురికి సుఖంబుగ వచ్చెదు, కరణిని మాకాశిషములు ♦ గావింపుము ధ
ర్మరతిన్ మాని ధరం గొన, నురుఫలదయశంబు విడున ♦ నోపం జుమ్మా!. ౬౨॥

తే. జీవితం బల్పకాలిక♦స్థితిని గాంచు
దానికొఱకు నధర్మంబుఁ ♦ బూని తుచ్ఛ
ధరణి నేఁ బొందఁగాఁ గోరఁ ♦ దలఁప ననుచుఁ
బలికి నరపుంగవుఁడు తల్లి ♦ కలఁక మాన్పి. ౬౨ 949

క. పినతల్లి ప్రేరణంబునఁ, బెనుదండకవనికిఁ బోవ ♦ వే నిశ్చయముం
గొని సోదరునకుఁ దనమత,మును జక్కఁగఁ దెలిపి దుఃఖ♦మును బోకార్చెన్.

తే. వారలిద్దఱు నీరీతిఁ ♦ బలికి యూఱ
డించి తల్లికి ముందు స♦ముంచితముగఁ
దాఁ బ్రదక్షిణమును జేయఁ ♦ దలఁచె మదిని
బయనమున కద్ది చాల శు♦భంబటంచు. ౬౩ 951

ఇరువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౨౨ - వ సర్గము.

లక్ష్మణుని రోషమును రాముఁడు పోఁగొట్టుట.

క. అంతట దుఃఖంబున న,త్యంతము దీనుఁడయి యతిశ♦యంబుగ రోషా
క్రాంతుఁడయి భయదపణివలె, నెంతయు నిశ్వాసవితతి♦నెసఁగ విడుచుచున్.

క. కోపంబున నేత్రంబులు, దీపింపుచు విఱివి గనఁగఁ ♦ దీక్ష్ణాకృతియై
తాపంబందు ప్రియానుజుఁ, బాపవిదూరుఁ గని రాము♦భద్రుం డెలమిన్. ౧½
చ. మనము విశుద్ధి నొందుచు స♦మానమశక్తి దగన్ సమగ్రమా
తనబలయుక్తి ధీవికృతిఁ ♦ దద్దయు నాపుచు ధైర్యయుక్తుఁడై
తనరు రఘూద్వహుండు తన♦తమ్ముని దిక్కు మొగంబుచేసి యి
ట్లనియెఁ గుమార! నాకొఱకు ♦ సందిన శోకము నింకఁ బాయుమీ. ౨ 954
క. జనకాదులయెడ నీకుం, గనుపట్టిన రోషమును ద♦గన్ విడిచి మనం
బున ధైర్యమొంది యుత్సవ,ము నిలిచెనను సమ్మతినిని ♦ బొందక యుంకన్.
క. ఉత్తమమగు హర్షముఁ గని, యిత్తఱిఁ బట్టాభిషేక♦మే యగు నిపుడీ
సత్తమమున నాకని నా,యత్తమతిం గూర్చినట్టి ♦ యాభరణములన్. ౩½ 956
చ. త్వరగఁ ద్యజింపు మేమని స♦పాయము లేకయె చేయవచ్చునో
కరమనురాగమొంది యలు ♦ కార్యము చేయఁగఁ బూనుమింక నే
నరుగఁగ స్వర్గమే యలస♦నట్టి మహాటవి కిప్డు పోవ నే
సరికరసంక్తి గానలసి ♦ నచ్చునొ దానిని గూర్చు మిత్తఱిన్. ౪ 957
క. నాయభిషేకమునకుఁ గా, నేదేవస్తువులఁ గూర్చ ♦ నీవొందిన నా
యాయుత్సాహంబుల నిట, నాయుత్సవమాపి, యడవి ♦ కరిగెడు పనికిన్. ౪½
క. అనువైన వల్కలాదుల, నొనఁగూర్చెడు కార్యమందు ♦ నొగి నిల్పుము; నా
కునగునొకో యభిషేకం,బని మదిఁ దపియించు తల్లి ♦ కలకైకకదన్. ౫½
¹తే. నేను నీతోడ యోజించి ♦ పూని రాజ్య
మును గ్రహింతునొ మరలసం♦చనెడు సంశ
యంబు గలుగక యుండఁ దీ♦యుని పలుకుల
ధైర్యమలవడునటు చెప్పఁ♦దగుఁ గుమార!. ౬ 960
*క. జననికిఁ గౌసల్యకుఁ బితృ,సనుమతి విషనాడరాని ♦ దగుట నపవికిం
జని వచ్చు రాముఁ డిచటికి, నని సందియమొందకుండ ♦నట్టులు చెపుమా. ౭
సీ. కౌసల్యకుంగాని ♦ కైకేయికిం గాని మనసులయందను♦మానమొందు
నంతదుఃఖము కల్గి ♦ నటులైన దానినే తృణముపేక్షింపఁగాఁ ♦ జాల నింత
వఱకెప్పుడైన న♦ల్పంబగు నపకారమైనఁ జల్లులకేని ♦ యట్లు తండ్రి
కేనియుఁ దెలిసియొ ♦ కాని యెఱుంగక కాని చేసినయట్లు ♦ నేనెఱుంగ
ఆ. నిజమె పలుకు, మాట ♦ నిలుకడ గలవాఁడు
సత్యశౌర్యయుతుఁడు ♦ జనకుఁ డిపుడు

1 మాతా మే సా యథా న స్యాత్ సవిశఙ్కా తథా కురు - అనిమూలము. దీనికి వ్యాఖ్యాతలిద్దఱు వేఱువేఱుగ నభిప్రాయము లిచ్చినందున నందుపద్యములు 1* ఈగుర్తులు గలవి వ్రాయఁబడినవి.

ప్రతినఁ దప్పునేని ♦ పరలోకమును బొంద
జాలననెడి సాధ్వ♦సంబు నొందె. ౮½ 962

క. కనుకన్ నా ప్రియజనకున,కునేమియు భయంబు గలుగఁ♦గూడదు వినుమో
యనుజా! యట్లగుఁ గాకి,ప్పని నిలుపకయున్న నతని ♦ స్వాంతంబునకున్. ౯

క. వరమొసఁగితిఁ గైకకు నా,వరమిటఁ జెడిపోయె సత్య♦వాక్యము పోయెన్
బరలోకముఁ గన నని మదిఁ, బరితాపము గలుగు నద్ది ♦ పరఁగునయేనిన్. ౧౦

తే. ఓర్వఁజాలక తపియింతు ♦ నుగ్రభంగిఁ
గాన సోదర! యీయలం♦కారవిధుల
విడిచి శీఘ్రమె యిటనుండి ♦ విపినములకు
నరుగఁ గోరుచు నున్నాఁడ ♦ నాత్మలోన. ౧౧ 965

చ. వనమున కేను బోవ నృప♦వర్యుని పుత్రిక కైక వ్యాకులం
బనునది లేకయే సఫలి♦తార్థయు నౌచుఁ బ్రియాత్మజాతు నా
యనుజునిఁ బట్టభద్రునిగ ♦ హర్షము మీఱఁగఁ జేయఁగల్గు; నిం
క నజినవల్కలంబులు ద♦గన్ జడలొప్పఁగ నేనుఁ గానకున్. ౧౨½ 966

చ. అరిగిన వెన్కఁ గైకసుది ♦ హాయిని బొందు నుపాయమెంతయో
యరసి మదుత్సవంబు చెడు♦నట్లుగఁ జేసినచుంథరాదు లే
కరణిని జిత్తతాపమును ♦ గాంచఁగ రాదు కృతప్రతిజ్ఞుఁడై
ధరఁ దగు తండ్రిచిత్త మను♦తాపము నొందఁగరాదు లక్ష్మణా!. ౧౩ 967

క. వనముల కరుగం దగు నిఁక, ననుబుద్ధియు నాకుఁ గలిగె ♦ నద్దానిని జే
సినవాఁడ దృఢతరంబుగఁ, గనుకన్ శ్రమపఱుప రాదు♦గా యాబుద్ధిన్. ౧౩½

క. త్వరితంబ యడవికేగెద, నరయుమ నీచిత్తమందు ♦ ననుజా! నన్నీ
పురవరమునుండి యడవికి, నరుగంగాఁ జేయ; దత్త♦మగు రాజ్యంబున్. ౧౪½

తే. మరలఁ ద్రిప్పించుటకును స♦మస్తశక్తు
లలరు దైవంబె హేతువే ♦ యగునటంచుఁ
గైక యిందులకుం గాదు ♦ కారణంబు
ననియుఁ దలపోయవయ్య! కు♦శాగ్రబుద్ధి!. ౧౫ 970

సీ. కాలచోదితమె యా♦కైకకీ భావంబు కాదేని నాయందుఁ ♦ గరుణ గలుగు
నామెకు నన్నిటు ♦ లాపదఁ గుందింప బుద్ధి యెవ్విధిఁగల్గు? ♦ బుద్ధికుశల
తన మార్దవంబునఁ ♦ దగువాఁడ పీవొట యోజింపు మనమునం♦దొక్కసారి
యింతకు మును పెప్పు♦డేఁ గాని తల్లులయందు భేదము నాదు ♦ నాత్మయందుఁ

తే. గల్గియుండిన యదియె? యా♦కైకకుఁ దన
తనయునందును నాయందుఁ ♦ దలఁచి చూడఁ
గ్రోధముండినయదియె? నె♦వ్వొకనెడు దైవ
యత్నమేగాని వేఱులే ♦ దని యెఱుఁగుమ. ౧౬ 971

ర్వరపైఁ బాయఁగఁ దూలిపోయిరిఁక దై♦వంబె సమర్థంబు సూ!. ౨౩ 977

క. ఆరంభించిన పనినీ, ధారణిలో మాని మున్ను ♦ దలఁపని పనియే
దో రహి నాకస్మికముగఁ, గోరనికోర్కెగ ఫలించి ♦ కొమరొందుఁగదా.

క. వినుమిద్ది దైవకృత్యం, బని యెఱుఁగుము నేను నీకు ♦ ననువుపడెడు భం
గిని జెప్పిన యీబుద్ధియె, యనుజ! యథార్థంబు దీని ♦ యవలంబమునన్.

తే. ఒకరి యుపదేశమే లేక ♦ యుద్ధతిఁ గన
కలగురీతిని నేనె నా♦యంత్మ నడఁచి
యున్నవాఁడను గాన నా♦యుత్సవంబు
నిలిచినను బరితాపంబు ♦ గలుగ దిపుడు. ౨౬ 980

క. కనుకన్ నే నుపదేశించిన యీబుద్ధి బలమీవు ♦ చెంది నితాంతం
బును బరితాపము విడిచియె, యనువున నామతము నొంది♦యనుజా!యింకన్.

సీ. అభిషేకమునకుగా ♦ నమరింపఁబడు నలంకారాదిబహుళకా♦ర్యముల నిలుపు
మభిషేకమునకయి♦యనువొందఁ గూర్చిన యీకుంభగతజల♦మెల్ల నాకుఁ
బట్టాభిషేకోత్స♦వస్నానమునకుఁ గాకున్నను మానుల ♦ కెన్నఁదగిన
వ్రతకర్మమునకుఁ గా♦వలసినస్నానార్థ మగుఁగాక, లక్ష్మణా ♦ యానృపార్హ
తే. ములగు ద్రవ్యంబులను గూడి ♦ వెలయు నిద్ది
జలము నాకిది యేల? నే ♦ జలకమాడఁ
గైక యేమేని యనుమాన♦కలితయగునొ
చేఁదుకొని నీట స్నానంబు ♦ చేయువాఁడ. ౨౮ 982

చ. జలకమొనర్చి మన్నియతి ♦ జానుగ సార్థకమొందఁజేయుదున్
గలఁగకు, వ్యత్యయంపు గతిఁ ♦ గాంచెను లక్ష్మియటంచు లక్ష్మణా!
యలరును రాజ్యపాలనము♦నందును ధర్మము; సిద్ధినొందుఁ గా
నల నిలువం దపంబును; గ♦నన్ సదృశంబులె యివ్విరెండునున్. ౨౯ 983

తే. దూరదృష్టి విచారింపఁ ♦ దోఁచు వనని
వాసమే సత్ఫలప్రద♦మై సమధిక
శాంతికరమగు నంచు; ల♦క్ష్మణ! యొనర్పఁ
బూనినట్టి యీకార్యముఁ ♦ బోనడంప. ౨౯ 984

క. పినతల్లియె కారణమని, యనుమానము నొందఁ గూడ ♦ దామెయు దైవం
బునఁ బ్రోత్సాహితయై కడు, ననిష్టములు పలుకుచున్న♦దని తెలియఁదగున్.

తే. అట్టి పినతల్లిఁ బురికొల్పి♦నట్టి దైవ
మునకుఁ దాదృశమాహాత్మ్య♦ములు చెలంగు

క. బలహీనులకే దైవము, గలిగించును నమ్మకంబు ♦ గావున వారే
లలి గ్రహియింతురు పౌరుష, ములమానుచు మఱియు దైవ♦ము సదానిరతిన్.
ఆ. తనయపేక్షఁ దీర్పఁ♦గొనుచుండు వేఱొక, మనుజు నాశ్రయించి ♦ కనుక నద్ది
మిగుల దీనమైన♦దగు శక్తిలేనట్టి, దాని నేల పొగడఁ ♦ బూనితీవు?. ౮ 995
క. పాపాత్ములైన కైకయు, భూపతియును బాపులనుచు ♦ బుద్ధిని రామా!
యేపారదొ యనుమానము, పాపులునగు వారిదైన ♦ పనుపు వదలినన్. ౮౪
* తే. ధర్మహానియు నెంతమా♦త్రంబు గలుగ;
దంబయును జనకుండు ధ♦ర్మాత్ములట్టి
వారి పాపాత్ములని యెట్టి♦భంగి సంశ
యించెదీవని యడుగుదు♦వేని? వినుము. ౯ 997
సీ. ధరణీతలంబున ♦ ధర్మంబు వెలుపల వ్యాజంబుగాఁ గనఁ♦బఱచి దానఁ
దముచెడుకార్యముల్ ♦తగునట్లు సాధించుకొనువారు, మఱి ధర్మ♦మునుసమాచ
రించెడు విధమున ♦ నంచితవేషంబు ధరియించి తమవగు ♦ తప్పులెల్ల
దాన నాచ్ఛాదింపఁ ♦ దలఁచి యట్లొనరించువారును, నెందఱో♦వఱలుచుంద
తే. రట్టి వీరును రాము, ప♦ట్టాభిషేక
మొగి నొనర్పఁగఁ బూనిన♦ట్లొప్పు మెఱయఁ
బైకి న్యాయంబుఁ జూపుచు ♦ వాస్తవమున
విప్రియము నీకుఁ జేసెడు ♦ వృత్తిగలిగి. ౯౪ 998
† క. నీయభిషేకము నిలుపఁగ, నే యెంచుచు నిట్టి దుష్ట♦వృత్తిం గనినా
రీయది తెలియదొకో? నీ,కోయనఘా! నాదుమాట ♦ నొక్కటి వినుమా!. ౯౪
సీ. అభిషేకమునకు ము♦న్నల తల్లిదండ్రులీ భంగి దుర్మంత్రము♦పాయముగను
జేయఁ బ్రయత్నించి♦యే యున్నవాఁగలు కాకున్నచో బహు♦కాలమునకుఁ
బూర్వమే వరమియ్యఁ♦బూని వచించెను గాన నాతండింత ♦ కాలమీయ
కుండునే? యిచ్చియే ♦ యుండు నీకైకయు నడుగకయుండునే?♦యరయ నిద్ది
ఆ. వరము నిప్పుడీయ♦వలసి వచ్చుటయును, గలుగదింక వీర♦త్మాతలమునఁ
బెద్దవానినిన్ను ♦ విడిచి నీతమ్మున, కతులరాజ్యమీయ ♦ ననువుపడునె?. ౧౦
ఉ. అన్నను మాని తమ్మునకు ♦ నాదృతి రాజ్యము నీయఁబూనఁగా
నెన్నట లోకులందఱును ♦ నెంతయు ద్వేషముఁ జూపువారు; వా
రున్నతి మీఱ నిట్టిపని ♦ కొప్పిన వారిది యెంతమాత్రమో
యన్నరొ! యోర్వఁజాలఁ గృప ♦ నారసి నన్ను క్షమింపఁగాఁదగున్. ౧౦౪
చ. జనకునివాక్యపాలనము ♦ చక్కనిధర్మము గాదె? యంచు నీ
వనుదువయేని? సాధుమతి♦వైనను ధర్మము దేనిఁ బట్టియో

---

* దీనియుత్తరార్థము వ్యాఖ్యాతల యవతారిక కని తెలియవలయు.

† ఈపద్యమునకు మూలము వ్యాఖ్యానాభిప్రాయమే యని తెలియఁదగు.

మునులభిషేకసంపదను ♦ బూనిన యస్మితి యిప్పు డివ్విధిం
వనములకేగుటాప్పునను ♦ భంగిని భేదము నొందియున్నదో ?. ౧౧ 1002
తే. ఏల మోహము చెంది నీ ♦ విట్టులున్న, వాఁడవో నాకుమాత్రము ♦ వసుమతీశ
వాక్యపాలనధర్మమే ♦ నరున కైన, ద్వేష్యముగనున్నదే కాని ♦ ప్రియముగాదు.
క. పౌరుషకృత్యంబునఁ బ్రతి, కారము సేయంగ శక్తి ♦ గలవాఁడవు తో
నేరమణుఁ డిపుడు స్వప్రియ, దారపరశంగతుండు గాన ♦ ధర్మముఁ బాసెన్.
తే. కాన నతినిందిత మధర్మ ♦ కారణంబు
నైన యాజ్ఞను జేసె న ♦ద్దాని నీవు
చేయఁబూనిన నెట్లొకో ? ♦ సిద్ధమిపుడు
చెందియే మోహమిట్లుగఁ ♦ జేయఁ జనుట. ౧౪ 1005
సీ. కపటవరంబులఁ ♦ గల్పించి యభిషేక విఘ్నమొనర్చి గి ♦ విధిని వార
లొనరించిరని నీదు ♦ మనమునఁ దోఁచక యున్నదే, వగ దీని ♦ కెన్న నిపుడు
కలుగుచున్నది నాకుఁ ♦ గాన ధర్మంబడియును లోకగర్హితం ♦ బనఁగఁదగును
గాని యనుష్ఠింపఁ ♦ గాఁ దగినది కాదు; కామలోలత నెపు ♦ గాని నీకు
తే. నపకృతిని గోరి తలిదండ్రు ♦ లనెడు పేరఁ
దాల్చియున్న యమిత్రులు ♦ ధర్మకీర్తిఁ
జెప్పఁగా దానిఁ దీర్ప నీ ♦ చిత్తమందు
నైన నెట్లు తలంపనో ♦ నరసి చెప్పుము !. ౧౫ 1006
చ. జనునికిఁ దండ్రికిప్పిధి న ♦ సంగతబుద్ధియుఁ బుట్టెనెట్లు నా
ఘనతర దైవయత్నముగుఁ ♦ గాని తదీయము గాదటందువో
వినుమటులైన వారివగు ♦ విప్రియభాషణముఁ గ్రకోసంగరా
దనఘ! విధిప్రమాణమును ♦ నారయ నాకు సహింప దంతయున్. ౧౬ 1007
తే. కాతరులు వీర్యహీనులు ♦ కడఁగి దైవ
మనుసరింతురు గాని, శౌ ♦ ర్యాధికులయి
చిత్తదార్ఢ్యంబుఁ జెందిన ♦ యుత్తమజను
లట్టి దైవముపాసింప ♦ రాత్మలందు. ౧౭ 1008
క. తమకార్యంబులఁ దాము, యుపమచే సాధించుకొంద్రు ♦ పౌరుషమున దై
వము నడఁగఁ ద్రొక్క నెవ్వఁడు, సమర్థుఁడగు వాఁడు దైవ ♦ సమ్మతిఁగోనుచున్.
క. తనపనులఁ జెఱుచుకొని నె,మ్మనమున శోకింపఁ డిపుడె ♦ మనుజులు దైవం
బున కెంతశక్తియో పురు,షునిశక్తి యదెంతో కనులఁ ♦ జూతురుగాదే?. ౧౯
తే. పురుషకారమె యధికమో ♦ పుడమి దైవ
యత్నమే బలవంతమో ♦ యని యిపుడిటఁ
దారతమ్యంబు రెండింటఁ ♦ దగిన దాని
స్పష్టముగఁ జేయువాఁడ నీ ♦ సమ్ముఖమున. ౨౦ 101

క. నీదగు నీయభిషేకము, నేదైవము మాన్పినట్టు ♦ లెంచెదవో? మదిన్
ఆదైవమె మత్పౌరుష, మేదిక్కునసుండకుండ ♦ నే చేయంగన్. ౧౯ 1012
క. జనులెల్లఁ జూడఁగలరిదె, మనమున భయదాంకుశంబు ♦ మాట సరకుగాఁ
గొనకయె మదబలగర్వం,బును గని నిగళములఁ ద్రెంచి ♦ పోయెడు గజమున్.
క. కరము చమత్కృతి మాపటి, మరలించెడురీతి నేను ♦ మరలించెద వి
స్ఫురదాత్మపౌరుషంబునఁ, బరికింపుము రామ! నాదు ♦ పౌరుషశక్తిన్. ౨౦
తే. ఎల్లదిక్పాలకులు వచ్చి ♦ రేని ముజ్జ
గములుఁ బైనెత్తివచ్చినఁ ♦ గడఁగి యిపుడు
జరగఁదగు రామునభిషేక ♦ గురుతరోత్స
వమును నిలుపంగఁ జాలవు ♦ పలుకులేల?. ౨౧ 1015
చ. జనకుని మాటయేటికిఁక ♦ క్ష్మాపతివైతివి నీవు రామ! యే
జనులు రహస్యచర్యల నె ♦ సంగి మహాటవి నుండుసట్లు నిన్
బనుపఁగ నెంచిరో వినుము ♦ వారె చతుర్దశవత్సరంబు ల
వ్వని వసియింపఁగాఁ గలరు ♦ పంతముమీఱ నొనర్తు నాక్రియన్. ౨౨
సీ. పట్టాభిషేకోత్స ♦ వము నీకుఁ గాకుండ భంగమొనర్చి, యె ♦ వ్వతె కుమారు
నకును రాజ్యము గట్టు ♦ టకుఁ గోరుచున్నదో యామెకుఁ దండ్రికి ♦ నాత్మలందుఁ
బొంగెడు పేరాసఁ ♦ బోకార్తు; నాపౌరుషమునకు ముందు దై ♦ వమును నిలువఁ
జాలదట్లాట నే ♦ జనుఁడైన నాతోడఁ బగఁగొనునేని య ♦ వ్వానికరయ
ఆ. నాదుపౌరుషమున ♦ నేదుఃఖమొనఁగూడు,నట్లు దైవమున సు ♦ ఖాప్తిలేదు
భయదరీతినాదు ♦ పౌరుషమలరారు, వినుమ! యింకమీఁద ♦ విశ్వమెల్ల. ౨౩
క. శతదశకవత్సరము లీ, వతులితగతి నేలి, పిదప ♦ నటవికిఁ జననీ
సుతులిద్ధరణిం బూనుదు, రితరులకీ రాజ్యసుఖము ♦ లేటికి గలుగున్. ౨౪
క. జనులను బాలించుచు న,మ్మనుజులఁ దనయాత్మభవుల ♦ మాడ్కిం గనఁగాఁ
దనయులకుఁ జెప్పి పిదపన్, మునుపటి రాజర్షివృత్త ♦ మునఁ గానలకున్. ౨౫
క. అరుగందగునని శాస్త్రో,త్కరమాదేశించుఁ గాదె? ♦ ధర్మాత్మా! రా
డ్వరుమనసు చంచలమ్ముగఁ, బరఁగెడు నిపుడట్టులౌటఁ ♦ బంతము మీఱన్.
సీ. రాజ్యంబు గ్రహియింప ♦ రాదు కైకొనినచో బహువిధభేదముల్ ♦ ప్రబలునందు
నని శంకనొంది రా ♦ జ్యమును గైకొనవేని వీరుండవీవు నే ♦ విక్రమమున
నీకును దోడయి ♦ నిలిచి సాగరమును జెలియలికట్ట పో ♦ రలకయుండఁ
గాపాడుగతి నెట్టి ♦ కలఁత నొందకయుండఁ గాచెద నిటుచేయఁ ♦ గల్గనేని
తే. వీరలోకంబునకును, ద ♦ ప్పినమనుష్య,వంటివాఁడనె యగుదునేఁ ♦ బ్రతిన నిట్లు
చేయువాఁడను; నీవు వ ♦ సిష్ఠముఖుల, నెల్లరం గూడి రాజ్యంబు ♦ నేలుపూన్కి.
సీ. మంగళద్రవ్యస ♦ మ్మానితజలముల నభిషిక్తుఁడ వగుమ! ♦ యప్పనికిని
బూనుమా? యెవరైన ♦ మానవనాథులు పైకెత్తివచ్చిన ♦ వారినెల్ల

వారించుటకు నేన ♦ బలమునఁ జాలుదు నా భుజాకరద్వయి ♦ నాశరీర
భూషణాగ్రముగాదు ♦ భూరిధనుస్సును బాహ్వాలంకృతిగఁ, దాల్పంగ లేదు
ఆ. నీరభూషణముగ ♦ నారిగ నడుమునఁ, గట్టినాఁడఁ గాను ♦ ఖడ్గదీని
శరములివ్వి యరుగుల ♦ స్తంభింపఁగాఁ జేయ, నమునుపంగ లే♦దహోగ్రధైర్య!. ౩౦౪
క. వినుమీ నాల్గాయుధములు, ననిలో శత్రువుల నెల్ల ♦ నణఁపఁగ ధరియిం
చిన వాఁట నట్టేననినే, యనువనుపఁగాఁ జాలియుండు ♦ నుగ్రతరశక్తీ!. ౩౦౫ 1023
చ. అరియుగు నాకనం బతని♦నట్లు సునంఘముఁగూడియుండ నీ
యు; గహీనతేజము వాసవుఁడే ♦ ద్యునను వాడినునం బెలంగి భీ
కరమయి విద్యుదాభమగు ♦ కాంతిని మీఱి మిణుంగురులు దగం
బరఁగఁగ నొప్పు ఖడ్గమున ♦ వ్యయ్యలు చేయక మాన నగ్రజా!. ౩౦౬ 1024
సీ. వితతమామకఖడ్గ ♦ హతులై దంతావళి హయనరనికుల క♦రాంఘ్రులూరు
వులు శిరస్సులు తెగి♦భూమిమీఁదఁ బొడిపొడియయి పడియుండఁగా♦నది భయంక
రాటవిగతిని ♦ సంతరం బేలేక సంచరింపఁగఁగూడఁ ♦ జాలకుండు
నిటుగో మాఁడుము రామ! ♦ యిప్పుడే నాఖడ్గధారాహతంబులు ♦ భూరిదీప్తి
తే. యుతమూర్తి శత్రువుల దంతి♦తతులు మండు
పర్వతములట్లు; విద్యుత్ప్ర♦భాయుతాంబు
దములరీతిని గనఁబడు ♦ ధరణిఁ గూలఁ
గలవు; వినుమింకనుగ్ర, నాదు ♦ కార్యగతుల. ౩౦౭ 1025
*సీ. ఉడుమను జంతువు ♦ యొక్క చర్మంబునఁ జేసినకవచంబు ♦ శింజినిదగు
త్రేటుతాఁకక యుండ ♦ ప్రేళ్లకుఁ దగిలించి బలువిల్లుదాల్చి నే♦నిలిచియుండఁ
బురుషుండు తానని ♦ బుద్ధిలోఁ దలఁచినవాఁ డెవ్వఁడు నదగ్ర♦భాగమందు
నిలువఁజాలడు?; మఱి ♦ నేలఁతేల తీరున నంపలుఁ బరగిడఁ♦నట్టివారె
తే. యొక్కబలవంతుని న్నేను ♦ బెక్కు సాయ
కములఁ బెక్కంత్రజనుల నొ♦క్క బలుబాణ
మును బ్రయోగించి యొగఁజిమ్ము♦చు నిటు ద్విరద
హయనరుల మర్మముల నాటు♦నట్లు నైతు. ౩౦౮ 1026
క. విను నాయస్త్రమహత్త్వం, బునిపుణమా తత్ప్రతాప♦ము విభూ! భూజా
నిని రిత్తవానిఁ జేయఁగ, నినుఁ బ్రభుతం గనఁగఁ జేయు♦నేర్పుం జూడ్మా!.
సీ. చారుచందనపంక♦చర్చకుఁ గేయూర ధారణంబులకు పి♦త్తము దాన
మొనరించుటకు మిత్ర♦జనులఁ బాలించుట కీనాభుజద్వయ ♦ ముంతె యర్హ
మయియుండ నిపుడిది ♦ యవాప్యని విడనాడి భవదభిషేకోత్స♦వమ్ముఁ జెఱుపఁ
గర్తలై తగువారి♦కర్మంబుఁ దొలఁగించు కార్యమునకుఁబూనఁ♦గలదు రామ!

* బద్ధగోధాంగుళిత్రాణ-అనుదానికి సీసపాదద్వయము తెనుఁగని తెలియఁదగు.

తే. యరి యెవఁడు నీకు నవ్వాని♦యశము మిత్ర
తతి నసువులను దఱుముదు ♦ ధరణియెల్లఁ
ద్వదభ్యశంబును గాఁజేయఁ ♦ దమి ననుజ్ఞ
యిమ్ము నీకింకరుండనె ♦ యేను జమ్ము!. ౨౦౹ 1028

చ. అనివచియింపఁగా రఘువ♦రాన్వయవర్ధనుఁడైన రాముఁడా
తనివచనంబుల న్వినుచుఁ ♦ దన్నయనాంబువులం గరాంబుజం
బున నెడఁబాపి తద్వచన♦ముల్ తనకిష్టము లేమిఁ జాలుసీవ
యనయన బాష్పపూరముల ♦ నట్టులె వాపి మృదూక్తులొప్పఁగన్. ౨౧ 1029

తే. లక్ష్మణా! మృదుచిత్తవి♦లాసయుతుఁడ, వేల యీరీతిఁ బల్కెద ♦ వేను దండ్రి
పలుకులందె స్థిరంబుగ ♦ నిలుతుఁగాని, దాని మీఱెడువాఁడను♦గాను నిజము.

క. తనయుండెప్పుడు గానీ, జనకుని యాజ్ఞలమెలంగఁ♦జను; పరధర్మం
*బననిదియే యని యెఱుఁగుమ, యనుజా! యీరీతినేల♦యాడితొ చెపుమా!.

ఇరువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౨౪ - వ సర్గము.

రాముఁ డడవులకుఁ బోవఁ గౌసల్య యంగీకరించుట.

క. జనకుని యాజ్ఞాపాలన,ముననే తనదృష్టి నిలిపె ♦ మురిపెపుఁదనయుం
డని నమ్మిన కౌసల్యయు, ఘనబాష్పోదకనిరుద్ధ ♦ కంఠస్వరయై. ౧ 1032

చ. తనయునిఁ గూర్చి యిట్లనియె ♦ ధర్మయుతంబుగ నింతదాఁకఁ జిం
తను గనకుండుఁ బ్రాణివిహి♦తంబుగఁ బల్కును ధర్మచింతతం
దనరు, మదీయగర్భమున ♦ ధారణిపాలమహేంద్రుఁడన్న కీ
ర్తినిగను ధర్మమూర్తికిని ♦ దేజునఁ బుట్టినవాఁడు చూడఁగన్. ౧౺ 1033

తే. ఇట్టి యీరాముఁ డెవ్విధి ♦ నిలను రాలి
నట్టి ధాన్యకణంబుల ♦ నరసి యేఱి
కొని యదెట్టులు జీవించుఁ ♦ గోరి యెవని
యనుచరులు భటులెల్ల మృ♦ష్టాన్నమెలమి. ౨౺ 1034

క. అనుదినముం దినుచుందురో, తనయుం డీరాముఁడు వన♦తలమున మూలా
ళిని బండ్లను దినియుండం,గను జాలును; మిగుల సుగుణ♦గణయుతుఁడితఁడో.

చ. మనమున కింపుఁ బెంపఁగల ♦ మాన్యుఁడు రాముఁడు పుత్త్రుఁ డిట్టివా
నిని నృపుఁ డివ్విధంబున వ♦నిన్ వసియింపఁగఁ బంపుచున్నవాఁ

---

* ఈపద్యచతుర్థభాగము మూలార్థసారభూతమని స్పష్టముచేయ వ్రాయఁబడినదని తెలియ
వలయు.

క. నీచెప్పినయట్టులుగా, నే చేసెద నేనటంచు ♦ హితముగఁ బలుకన్
[1]సూచకవిభేది, వినుత మ,హాచరితుఁడు ధార్మికప్ర♦జాగ్రేసరుఁడున్. ౧౪

క. కరుణానుతి రాముండా, పరమతపస్విని వచించు♦పల్కులను విని యా
తురముస నుతియుఁ దపించెదు, తరుణీరత్నమును గాంచి ♦ తగ నిటు పలికెన్.

క. నే నెట్లో నీవు నటులే, యానతి జవదాఁటకుండు♦నట్లుగఁ జేయం
[2]గా నౌ, నతండు భర్తయు, భూనాథుఁడు దేశికుఁడు ప్ర♦భువు శ్రేష్ఠుండున్.

ఆ. ఎల్లరకును ధర్మ ♦ మీరీతిఁ జేయఁగాఁ, దగునటంచుఁ జెప్పఁ♦దగును; గాన
నతని పంపుచేయు ♦ టర్హమే [3]యీనవ, పంచవత్సరములు ♦ వనమునందు. ౧౬

క. శ్రమముం బొందక విహరిం,చి మరలఁ గడుఁ దమిని నీవు ♦ చెప్పినయట్లే
సుమహితచరితా! నిలిచి సు,ఖముగన్ బురినుండు మనినఁ ♦ గౌసల్యమదిన్.

చ. తనయునియందు వత్సలత ♦ తద్దయుఁ గల్గినదాట మోమునం
గనుఁగవనీరుచిమ్మి పెను♦కాలువగాఁ బ్రవహింపఁ జాలనా
ర్తినిగని యాప్రియాత్మజుని ♦ దివ్యతనూరుచిఁ బొల్చువాని నో
య్యనఁగని శత్రుతంగనిన♦యట్టి సపత్నులయుండ నుండఁగన్. ౧౮ 1052

చ. అలవియెగాదు నాకు జన♦కానుమతిన్ వనికేగు నిశ్చయం
బొలయునయేని నీమదిని ♦ నొయ్యన వన్యమృగిన్ బలెన్ వన
స్థలముల నీకు సంతతము ♦ సంతసమే గలిగించు నన్ను భీ
తిలుదువటంచుఁ జెప్పకయె ♦ తెప్పునఁ దోడ్కొని పొమ్ము రాఘవా!. ౧౯

చ. అని వచియించి తన్నుఁగని ♦ యాతురయై కడునేడ్చుతల్లినిం
గని జననీమహార్తిని ద♦గన్ బెడవాపఁగ నెంచి ధీరుఁడై
తనరియు రాముఁడేడ్చుచును ♦ దల్లిరో! నాపలుకాలకింపుమా
వనితకదెంతదాఁక నను♦పంచకముండునో యంతకాలమున్. ౨౦ 1054

క. పెనిమిటియే దైవంబా, పెనిమిటియే ప్రభువు, కాన ♦ విభుఁడే నాకో
కన్యనికేకాక నియామకుఁ, డనఁ జనుఁగా నీకు నాకు ♦ నతఁడు సతతమున్. ౨౧

సీ. పార్థివుం డతఁడు ప్ర♦పంచమునకునెల్ల నధిపుఁడై మతిమంతుఁ♦డయి చెలంగ
మనకుమాత్రమె విభుం♦డనఁబడకుండునే?యతఁడుండు పర్యంత♦మంబ!మనము
నాథులమే కాము; ♦ నాథుఁడెట్టిండైన నవతులవలనిదా ♦ సాధ్వసంబు
సాయునే యందువో ♦ ప్రభువగు భరతుండు ధర్మాత్ముఁడగును భూ♦తప్రియంవ

1 సూచకవిభేది=దుష్టసంహారకుఁడు, వినుతమహాచరితుఁడు=పొగడఁబడుచు శ్రేష్ఠమునగు చరిత్రము గలవాఁడు.

2 రాజాభర్తా గురుశ్శ్రేష్ఠ స్సర్వేషా మీశ్వరః ప్రభుః-అనిమూలము. ఈవిశేషణములే పద మున ననుసరింపఁబడినవి గాని పద్యపూరణార్థము కావని యెఱుంగునది. 3 ఇమానితు మహారణ్యే విహృత్య నవపంచచ-అని మూలము. తొమ్మిదియైదు అనిచెప్పుట సంఖ్యకొలఁదిగఁ దోఁచుటకై యని యెఱుంగునది.

చ. వనములనుండి నే మరలి ♦ వచ్చినమీఁదట ధార్మికోత్తముం
డనఁబడు రాజు ప్రాణముల ♦ నంగమునన్ ధరియించియున్నచో
జనని! భవత్సుకాంక్షలను ♦ జాలఁగఁ బొందెద వీవటంచుఁ జె
ప్పిన యల రాము పల్కులను ♦ వీనులకింపగు వానినెంతయున్. ౩౧ 1067

చ. వినియును బుత్రశోకమున ♦ విహ్వలయై కడు బాష్పవారిచే
త నయనముల్ కలంగ గుణ♦ధాముని సూనునిఁగాంచి వీర! నీ
మనమున నిశ్చయించితివి ♦ మాటను దాఁటకపోవఁగాఁ దగున్
వనమునకంచు, దానినొక♦భంగిని ద్రిప్పఁగఁ జాలనే నిఁకన్. ౩౨ 1068

క. కాలప్రభావ మీయది, కాలంబు నతిక్రమింపఁ♦గా రాదుగదా?
యాలోచింపఁగ నిజమిది, యేల యిఁకం బలుకు లడవి ♦ కీవు చనఁదగున్.

క. ఏకాగ్రమానసుండవె, యై కానకుఁ బొమ్ము; పుత్ర! ♦ యఖిలశుభంబుల్
నీకగుఁ గాక ప్రభుత్వము, నీకలవడుఁగాక మరలి ♦ నీవిటురాఁగన్. ౩౩ 1070

క. శ్రమములు దీఱిన మఱి సౌ,ఖ్యముగానే నుందు; భాగ్య♦కలితుండవు నీ
వమలినబుద్ధిం బితృవా,క్యమునుం బాలించి తండ్రి ♦ యప్పు తొలఁగుటన్.

క. కృతకృత్యుఁడవై యిచ్చటి, కతిముదమున రాఁగఁ బరమ♦మగు సౌఖ్యంబున్
బ్రతిలేనిదాని నొందుదు, హితవచనా! రఘుకులాబ్ధి ♦ హిమకర! రామా!.

క. ధరణిని దైవముగతి యి,క్కారణిం దగునంచు నెంచఁ♦గా నెవ్వరికిం
దరమే గాదు కనుకనే, పరమహితంబయి మదీయ♦వాక్యమలరినన్. ౩౬ 1073

ఆ. దానిఁ ద్రెంచివైచి ♦ కానకుఁ బోవనిన్
బురికొలుపుచునున్న ♦ పరయుఁ బుత్ర!
భుజబలాఢ్య వనికిఁ ♦ బొమ్మిప్పుడే నీవు
మరలి రమ్ము క్షేమ ♦ మండనముగ. ౩౭ 1074

చ. పురి కరుదెంచి యింపయిన ♦ పొంకపుఁబల్కుల నాకు నీవొగిం
బరమముదంబుఁ గూర్పఁగల♦వాఁడవు; రామ! చతుర్దశాబ్దముల్
వరుసఁగ నేగఁగా జడలు ♦ వల్కలముల్ ధరియించి యింటికిన్
మరలి కుమార! రాఁగ నిను ♦ మానుగఁ జూచెదు కాలమిప్పుడే. ౩౮ 1075

ఆ. నాకుఁ గలుగుఁ గాక ♦ నాకుమారా! యని
వనికి నేగ దృష్టమ♦గనె తలంచి
యుండు టెఱిఁగి యాదరో♦న్నతి శుభలక్ష
ణునకు నీయఁగోరె ♦ ఘనశుభాళి. ౩౯ 1076

ఇరువదినాలవ సర్గము సంపూర్ణము.

సీ. అన్నితావుల భూరి♦యశమొందు దిక్కులుఁ దదధిపుల్ నాదుస్తో♦త్రములకలరి
నీవేగు వని నెప్డు ♦ నెమ్మిఁ గాపాడుచుందురుగాక కులభూమి♦ధరములెల్ల
సాగరంబులును య♦క్షప్రభుండును వారిపతియు నాకాశంబు ♦ క్షితియు నెల్ల
నదులును బహువిధ♦నక్షత్రములు కుజాదిగ్రహములు వాని♦దేవతలును
తే. బగలు రాత్రులు సంధ్యలు ♦ వానిదేవ
తలును వనినున్న నినుఁగాతు ♦ రెలమిమీఱ
బావనర్తువ్రధిదేవతల్ ♦ వర్షమాస
పతులు గలలును గాష్ఠలు ♦ వనమునందు. ౧౫ 1083

క. నిరతంబు శుభములొగి ని,త్తురుగాక; కుమార! నీకుఁ ♦ దోరపుఁ బ్రీతిన్
వరముని వేషంబున వనిఁ, దిరిగెడి నీకెలమి మీఱ ♦ దేవతలెల్లన్. ౧౬ 1084

క. దనుజులు శర్మదులయి ని, న్ననవరతము గాంచువార ♦ లాత్మజ! కోపం
బునఁ గ్రూరకృత్యములనే, యొనరించెడు రక్కసుల భ♦యోద్ధతినీకున్. ౧౭

ఆ. కలుగకుండుఁగాక! ♦ క్రౌర్యపిశాచభ,యంబు క్రూరమృగభ♦యంబు నీకుఁ
గలుగకుండుఁగాక! ♦ కానఁ గోఁతులుఁ దేళ్లు, నడవిమక్షికములు♦నంటకుండ.

తే. సర్పములు దోమలును గీట♦జాతులెల్ల
నంటకుండును గాక మ♦హాగజములు
సింహశార్దూలభల్లముల్ ♦ శితదశనల
నొప్పు మృగములు నీకుఁ గీ♦డొనరుప వీఁక. ౧౯ 1087

క. కొమ్ములచేతనె కడుభయ,దమ్ములుగానున్న మహిష♦తతులవలన క్షే
మమ్మె దగుఁగాని సుంత భ,యమ్ము పొసంగకయె యుండు ♦ నాత్మజ! నీకున్.

క. నరమాంసముఁ దినుచు భయం,కరముగఁ దగు నితరమృగని♦కరము మదర్చా
పరితుష్టములై వని నినుఁ, గరుణన్ హింసింపకుండుఁ♦గాతం! బుత్రా!. ౨౦

క. తనయా! మార్గంబులు నీ,కనుకూలఫలాదులొప్ప ♦ నమలశుభములై
తనరారుఁ గాక సిద్ధిం, గనుఁగాక పరాక్రమములు ♦ కలకాలంబున్. ౨౧

క. చనుమింక శుభము లందుచు, వనమునకుం బుత్ర! వ్యోమ♦వర్త్మచరులు గాఁ
దనరెడి దివిజులవలనన్, గనుచుందువుగాక శుభని♦కాయమ్మెపుడున్. ౨౨

క. ధరణీం గ్రుమ్మరు దేవో,త్కరములవలనన్ శుభమ్ము ♦ గలుగుంగాతన్
అరితతివలనం గూడన్, బరమశుభంబులె చెలంగు ♦ భవ్యమనీషా!. ౨౪

క. గురు, శశి, రవి, యమ, ధనదులు, వరమామకపూజలంది ♦ వనవాసిని నిన్
బరిరక్షసేయుదురు గాక; రాఘవా! స్నానమాదు♦కాలములందున్. ౨౩

తే. పవనుఁ డగ్ని తద్ధూమము ♦ పరమకరుణఁ
గౌశికుఁడు చెప్పినట్టి యా♦కమ్రమంత్ర

గణము రక్షించుచుండును ♦ గాక! నిన్ను
వనమునకుఁ బోయి రావయ్య ♦ జనకునాజ్ఞ. ౨౮॥ 1094

సీ. సర్వలోకేశుఁడౌ ♦ సరసిజభవుండును సకలభూతవిభుఁడౌ ♦ సరసిజాక్షుఁ
డఖిలమహర్షులు ♦ నఖిల దేవతలును వనవాసివగు నిన్ను ♦ ననయము రసి
కాపాడుచుండుత ♦ గాక యంచీరీతి నాయశస్విని యాయ♦తాక్షి యుగళ
కౌసల్య ప్రీతిని ♦ గారాబుసుతునకు నాశీర్వచనముల ♦ నలర నొసఁగి
తే. యఖిలసురలను గంధమా♦ల్యాదు లొసఁగి
యుచితవినుతుల నొనరించి♦యును గరంబు
పూజ సేసి యనంతరం♦బునఁ గుమారు
నకు శుభాప్తిని గోరి ధ♦నంజయు నట. ౨౯॥ 1095

క. కొని తేరఁ బంచి పిమ్మట, న్ననువగు బ్రాహ్మణునిచేత ♦ సుహితనియమ మొ
ప్పునటు యథావిధి చేయిం,చెను హోమము నంత హోమ♦సిద్ధికొఱకుగాఁ.
తే. శ్వేతమాల్యంబులను, ఘృత♦శ్వేతసర్ష
పములు సమిధల నాయను ♦ పరమభక్తి
తనరఁ దెప్పించె బ్రాహ్మణో♦త్తముఁడు విధిని
బాధలుడుగ నారోగ్యసం♦పత్తి గలుగ. ౩౧॥ 1097

తే. హోమమొనరించి శేషంగా ♦ నున్నయట్టి
యాహవిస్సునఁ జేసె బా♦హ్యబలికర్మ
మంత నాతఁడు దధిమధు ♦ నక్షతలను
నాదృతముగ బ్రాహ్మణుల కిచ్చి ♦ యుక్తరీతి. ౩౨॥ 1098

సీ. వారలచే స్వస్తి♦వచనముల్ చదివించి వనమున శ్రీరాఘ♦వునకు శుభము
లనుగూర్చు మంత్రంబు♦లను జదివించుచు యశమున నలరారు♦నట్టి రామ
జనని యావిప్రశ్రే♦ష్ఠునకు ఋత్విజునకుఁ దదభీష్టమునకును ♦ దగిన దక్షి
ణ నొసంగి శ్రీరాముఁ ♦ గనుఁగొని వచియించె; దివిజవందితుఁడైన ♦ దేవపతికి
తే. వృత్రదానవనాశార్థ♦మే శుభంబు
గలిగెనో యట్టి శుభములు ♦ గలుగుఁగాక
నీకు, నమృతంబుఁ దేఁగోరి ♦ నింగి కరుగు
గరుడునకుఁ దల్లి వినత ప్రా♦ర్థ్యాలపొందు. ౩౩ 1099

క. మనమునఁ బొంగుచు మంగళ,మును దేని ఘటించె సుగుణ♦ముల ప్రోగగు నీ
కును నట్టి మంగళమ్ములు, తనరారెడుఁ గాక; కీర్తి♦ధామా! రామా!. ౩౩॥
క. మునుపయ్యమృతోత్పాదన,మున నదితియు దనుజనికర♦ముం జంపెడు నిం
ద్రునకే మంగళమిడెనో, పొనరం గాకట్టి శుభము ♦ పూర్వము నీకున్. ౩౪॥
ఆ. తగఁ ద్రివిక్రమావ♦తారమ్మునం బద,త్రయముఁ గొలుచునట్టి ♦ తఱి నపార

తేజ మొప్ప విష్ణు♦దేవున కేశుభ,మలరె నట్టి శుభము ♦ గలుగుఁగాక. ౩౫½

*సీ. శుభమంగళములుగ♦శోభిల్లు ఋతువులు సాగరంబులు ద్వీప♦సమితి శ్రుతులు
స్వర్గాదిలోకముల్ ♦ సకలదిక్కులు నీకు సకలమంగళముల ♦ సతత మొసఁగు
గాక, యంచిరీతిఁ ♦ గా భామినీమణి యాయతనేత్ర య♦య్యాత్మజన్ము
నాశీర్వదించుచు ♦ నతనిశిరంబున నక్షతలునిచి దే♦హమున గంధ

తే. మలఁది సిద్ధార్థమై శుభ♦ఫలదమగుచుఁ
గ్రాలెడు [1]విశల్యకరణి వి♦ఖ్యాతమూలి
కను దమిన్ రక్షగాఁ బుత్రు♦కరమునందుఁ
గట్టి దానిని మంత్రించెఁ ♦ గరము పూన్కి. ౩౬½ 1103

చ. కరము యశంబునం జెలఁగు ♦ కామిని దుఃఖవశంగతాత్మయై
పరఁగియు రాఘవుండు వన♦వాసము చేయఁగఁ బోవువేళ దుః
ఖరతిని బొందరాదు గను♦కన్ మనమందుల నొప్పుకున్న ని
ర్భరమగు శోకయోగమునఁ ♦ బల్కులు తొట్రిలుపాటు నొందఁగన్. ౩౯

తే. నోటమాత్రము మోదంబు ♦ గాటముగఁ జె
లంగునట్లు గనంబడ ♦ లలితతనయ
శిరమువంచి మూర్కొని వని♦కరుగుననుచుఁ
గౌఁగిలించుకొనుచుఁ బల్కెఁ ♦ గరము వగను. ౪౦ 1105

క. తనయా! సిద్ధార్థుఁడవై, వనమునకుం బొమ్ము తండ్రి! ♦ వలసిన పనులె
ల్లను ఫలియింప నరోగం,బును గనుచున్ మరలి వేగ♦పురవరమునకున్. ౪౧

క. అరుదెంచి భూరిరాజ్యముఁ, బరిపాలించుచును రాజ♦పద్ధతి మీఱన్
స్థిరముగ నీవుండఁగ నేఁ, బరికింపం గలను నిన్ను ♦ భవ్యగుణనిధీ. ౪౧½ 1107

చ. వనమున రాముఁ డేసగిది ♦ వాసము చేయుచు నున్నవాఁడొకో?
యని మదినొందు దుఃఖతతు♦లన్నియు క్షీణతనొంద సంతసం
బున మొగమున్ వెలుంగఁ బరి♦పూర్ణసుధాకరుఁ డేగుదెంచు రీ
తిని వనినుండి రాఁగ నినుఁ ♦ దృష్టిగఁ జూచెదఁ బుత్రరత్నమా!. ౪౨½

క. జనకుని యానతిఁ దీరిచి, వనవాసము సేసి వచ్చి ♦ భద్రాసనమం
దునఁ గూరుచుండి యుండం,గను నినుఁ గనులారఁ జూడఁ♦గలను గుమారా!.

ఆ. అడవినుండి వచ్చి ♦ యవనీశ్వరార్హము, లైన భూషణాంబ♦రాదులను ద
నరుచు నెపుడు నీవు ♦ నాకోడలికి నాకు, వాంఛితముల నింప♦వలయుఁ జుమ్ము.

సీ. నేను బూజించిన ♦ నీలకంఠాదిదేవతలు మహర్షులు ♦ దితిజవితతి
భూతముల్ పెనుఫణి♦పుంజముల్ దిశలును సంతృప్తులై వన♦స్థలికిఁ బోవు

* "మంగళాని మహాబాహో దిశంతు శుభమంగళాః-అనిమూలము. శుభమంగళాః మంగళానామపి మంగళాః" అని వ్యాఖ్య. 1 విశల్యకరణి అనగా "అంతర్గతశల్యనిర్గమనకారిణీం మూలికామ్" అని వ్యాఖ్య. లోపలిశల్యములఁ దొలఁగించు నొకానొక యోషధివిశేషము.

ఆ. యవ్విధం బెఱుంగు♦నట్లాట రాముని, యభ్యుదయము గోఱకు♦నమరపూజఁ
దానె యాచరించి♦తమి పొంగ నవ్విభుఁ, డెపుడు వచ్చుననుచు♦నెంచుచుండె.

ఉ. రాముఁడు వార్త దీనిని గ♦రంబు విచారము పుట్టఁజేయు నే
నేఁపుని చెప్పువాఁడనొకొ ♦ యింతికటంచును లజ్జ దోఁపఁగా
మోమును వంచి గేహమును ♦ మోదమునం జెలువారు సేవక
స్తోమము లొప్పు భూషణవి♦శోభితమై తగఁ జొచ్చె మెల్లఁగన్. ౫ 1117

*చ. జనకజ లేచి యాత్రముగ ♦ సాధ్వసచంచలితాంగయై వగం
గని తపియించుచున్ దనదు ♦ కాయము చింతఁ గలంగుచుండ వ
చ్చిన నిజనాథుఁగాంచె; నృప♦శీతమయూఖుఁడు రాఘవుండు సీ
తను గనినంతనే వగను ♦ దాల్చఁగఁ జాలకయుండె నాత్మలోన్. ౬౪ 1118

ఆ. ధర్మచిత్తుఁడయ్యుఁ ♦ దన విచారముచేత, నెట్లు గడుపుకాల ♦ మీకళత్ర
మనుచు నెంచెఁ గాన ♦ నాతని దుఃఖము, బయలుపడియెఁ బొంగి♦వచ్చుకతన.

క. తనమొగము వివర్ణంబై, తనువెల్లఁ జెమర్పు వగకుఁ ♦ దాళఁగ నే చా
లని యట్టులున్న నాథుని, గని దుఃఖమునం దపించి ♦ కామిని పలికెన్. ౮

సీ. ప్రాణేశ! చెపుము యి♦ప్పట్టున నేమిది? తగ బృహస్పతి దేవ♦తాకమగుచుఁ
గార్యముల్ చేయఁగాఁ ♦ గడఁగిన నైశ్వర్య ఫలదమై యలరారు♦భవ్యపుష్య
తారవచ్చినదని ♦ ధరణీసురేంద్రులు ప్రాజ్ఞులు నాతోడఁ ♦ బలుకుచున్న
వారు నీవిట్టి శు♦భస్కారసమయంబునను గుందనేలొకో? ♦ మనమునందు
తే. తావకంబగు రుచిరప♦దనము [1] నూఱు
కమ్మలొప్పఁగ సలిలఫే♦నమ్ముతోడ
సమమయిన తెల్లగొడుగు ప♦ట్టమిని సొంపు
గలిగి యలరారదేమొకో ? ♦ కారణంబు. ౧౦ 1121

క. సరసిజపత్త్రేక్షణముగఁ, బరఁగెడు నీమోముపైనఁ ♦ [2]బరిపూర్ణసుధా
కరునివలె హంసవలె నుం, దరసిత చామరము లొలయఁ ♦ దనరవిదేమో ?.

[3]క. పలుకుల నేర్పుఁజెతనమునఁ, బొలుపారెడు వందిజనులు ♦ పూర్వచరిత్రం
బులఁ బలుకు సూతు లన్వయ,ములఁబొగడెడి మాగధజన♦ములు పురుషవరా!.

క. నిను మంగళవచనంబుల, వినుతింప రిదేమొ? వేద♦విద్విప్రులు శు
ద్ధిని బొంది స్నానమొనరించిన నీతలపైన శాస్త్ర♦సిద్ధపథమునన్. ౧౨౪

ఆ. తీర్థజలముతోడఁ ♦ దేనెయుఁ బెరుగును
హేతువేమొ? కాని ♦ యెఱుఁగఁ జాల

---

* అపశ్య చ్ఛోకసంతప్తం చింతా వ్యాకులితేంద్రియమ్-అనిమూలము.

1 నతే శతశలాకేన జలఫేన నిభేనచ-అని మూలము. శతశలాకములు = నూఱుకమ్మలని మార్పు 2 చంద్రహంసప్రకాశాభ్యామ్-అని మూలము. 3 సూతవందిమాగధశబ్దములకు వ్యాఖ్య లోనియర్థమే యీపద్యమునఁ జెప్పఁబడినది.

నార్యవర్య! యింక ♦ నభిషేక మొనరింప
నున్నవారో? తెలుప♦నుంపఁ దగునె?. ౧౩ 1125

సీ. ఆ మాగధసూతులు ♦ ముందున్నవారిలోఁ బ్రముఖులు మంత్రులు ♦ పౌరజాన
పదులు భూషితులయి ♦ పరమమోదంబున నేలొకో? నినుఁగూడి♦యిపుడు రారు
నగసంకాశములయి ♦ సితకాంచనభూషితములగు నాల్గు గుఱ్ఱములఁ బూన్చి
[1]యుత్సవమునకుఁగా ♦ నొగి సలంకృతమగు పుష్యరథంబేల ♦ పోకయున్న

తే. ఇపుడు నీముందుగా రాఘ♦వేంద్ర! వీర!
కృష్ణమేఘంబుకేతని ♦ గిరివలెఁ దగి
సకలశుభలక్షణములనె♦సంగు పట్ట
పేనుఁగు ముఖంబున ♦ నేల రాదో?. ౧౪ 1126

క. కనకఛత్రము నీదగుముందట, సహజముగఁ జనవలయుఁ గాదె? ♦ యది లేదేమో?
పరమప్రియమున్నన భాసురకాంచనచిత్ర మగుచు ♦ సొంపుగులుకుచున్.

క. తనరారెడు సింహాసన, మును మున్నిడుకొనుచు నీదు ♦ ముందటఁ జనుటొ
ప్పును గాదె? పౌరులెల్లను, గనఁబడ లేదేమి? చెపుమ ♦ కారణమేమో!.

ఆ. ఎంతసన్నాహమున ♦ నిపుడభిషేకోత్సవంబు సిద్ధమగుచుఁ ♦ బఱఁగుచున్న
దో యపూర్వమగుచు♦నొకవిధమగు వర్ణ, మంతదుఃఖముగఁ దన్వ♦దాస్యమందు.

క. కనఁబడుచున్నది మోదం, బనునది కనఁబడ దిదేమి? ♦ యని యేడ్చెడు సీ
తను జూచి రాముఁ డిట్లను, వనితా! పూజ్యమతి తండ్రి ♦ వనినుండుటకై.

క. ననుఁ బంపుచున్నవాఁ డిదె, యని తా వచియింపఁబోవు ♦ నప్రియవార్తన్
విని దుఃఖమొందు ధార్ష్ట్యము, గనఁజేయక నలయు సంయమఁ♦ గ్రమ్మఱఁ బలికెన్.

* తే. మంచికులమునఁ బుట్టి ధ♦ర్మము నెఱింగి
దానినే యాచరించుచుఁ ♦ దనరు దీవు
జానకీ! వనవాసమే ♦ చందమునను
గలిగెనో నాకుఁ దెల్పెదఁ ♦ గ్రమము దాని. ౨౦ 1132

క. తానాడిన పలుకింపుగ, మానిని యొకనాఁడు మహిశుఁ ♦ డీ దశరథుఁ డీ
నానాయనదో కైకకుఁ, దానిచ్చె వరద్వయంబుఁ ♦ దల్లికి మున్నే. ౨౧ 1133

క. జనకుఁడు నాకభిషేకం, బును జేయఁగ సిద్ధపడుటఁ ♦ బోలంగని నా
జనని యా వరయుగ మడిగెను, గనుకన్ సూనృతహితుండు♦గాఁ దనరుటచేన్.

క. ధర్మమునకున్ లోఁబడి, నిర్మలమతి యగుటఁ దండ్రి ♦ నేలఁతకుఁ జిక్కెం
గర్మాధీనము లోకము, ధర్మజ్ఞే యెఱుఁగుదుంగ ♦ దగుఁ గద? సాధ్వీ!. ౨౨

---

1 ముఖ్యః పుష్యరథో యుక్తః కిన్న గచ్ఛతి తే౽గ్రతః - అని మూలము. * కులే మహతి సంభూతే ధర్మజ్ఞే ధర్మచారిణీ - అని మూలము. ఇట్టి దుఃఖసమయమున సీతను స్తుతించుట వగ నొందకుండఁ జేయుటకని గ్రహింపఁదగు.

క. కానిమ్మట్లే యిపుడే, మైనది యని యడుగు దేమొ? ♦ యావరములలో
నేనుండవలయు దండక, కాననమున [1]మనుసమాబ్ద♦కాలము తరుణీ!. ౨౨

క. వరమిది యొక్కటి వేఱొక, వరమున భరతుండు పట్ట♦భద్రుండగు ని
క్కరణిని జనకుఁడు శాసిం,చె రమణి! జనకాజ్ఞఁ గనుట ♦ చే నే నిపుడే. ౨౩

క. మనుజవిహీనంబగు న, వ్వనమున కేఁ బోవఁ బూని ♦ వచ్చితి నిన్నుం
గనఁగా భరతుని కడ నీ, వినుతింపఁగ వల దదెట్టి ♦ వేళలనైనన్. ౨౪

[2]క. నిరుపమసంపదఁ గూడిన, పురుషులు తమ మ్రోలఁ బరులఁ ♦ బొగడంగ సహిం
పరు గాన నాగుణముల, భ్భరతుని యెదుటన్ నుతింప♦వలదు జనకజా!.

సీ. పదిమంది చుట్టాల ♦ పాటిగా నినుగూడఁ బోషించు భారంబుఁ ♦ బూనుఁగాని
భరతుఁ డండజికన్న ♦ బహుమానముగ భరియింపఁబూనఁడు వాని♦కెన్నఁనట్టి
భారంబు లేదు నీ♦వంటికోడండ్రను మించి పోషణమును ♦ మీననేత్ర!
కోరకుమీ, యను♦కూలమ్ముగా వాని కడనుండఁ దగు, నట్లు ♦ కాకయున్న
ఆ. నుండఁ దరముగాక ♦ యుండుఁ గదా యేల
యుండవలయు నతని ♦ యొద్ద నేను
దగ్గి యనెదవేమొ? ♦ ధరణీశ్వరుఁడు సనా
తనము యౌవరాజ్య♦మును దగంగ. ౨౬ 1140

క. భరతున కొసఁగెం గానన్, దరుణి! విశేషించి నాదు ♦ తండ్రిఁ గొలువుమా,
భరతున్ గనుచున్ నేర్పుగఁ, జరింపుమా వారిమనసు♦సరణి నెఱుఁగుచున్.

క. జనకుని యాజ్ఞం బాలిం,పనేనిదే వనికిఁ బోవు♦వాఁడఁ గనుక నీ
[3]వునుపుము స్థిరానురాగం,బును నాపై బుద్ధిదార్ఢ్య♦మునఁ దగుదువు గా.

క. మునిజనసేవితమగు న,వ్వని కేఁ గళ్యాణి! పోవ ♦ వ్రతములు నిరతం
బును సల్పుచు నుపవాసము, లొనరించుచు నుండవలయు ♦ నురుతరభక్తిన్.

క. ప్రతిదినము వేకువను లే,చి తగన్ దివిజులకుఁ బూజ♦చేసి విధిగ భూ
పతికిన్ దశరథునకు నా, పితకున్ వందనము సల్పు ♦ విమలస్వాంతా!. ౩౦

క. తన ధర్మమునే ముందుగ, ననిచికొనుచు వగల గ్రుక్కి ♦ యురు వార్ధక్యం
బున వెలసెడు కౌసల్యను, జననిన్ మర్యాదఁ జూడఁ♦జను నీకు సతీ!. ౩౧

ఆ. తక్కినట్టి నాదు ♦ తల్లులు నాయందు, నలరు నెయ్యమునను ♦ నధికమైన
ప్రేమయందు నన్ను ♦ వేడ్కఁ బాలించెదు, కార్యమందు సములు ♦ గాన నీవు.

క. వనితా! వారికి మ్రొక్కం, జనుఁ బ్రాణాధికులు భరత♦శత్రుఘ్నులు నా

1 మనుసమాబ్దకాలము-మనుశబ్దమునకుఁ బదునాల్గని యర్థము. అనఁగా మనుసంఖ్యతో సమమగు సంవత్సరములు. 2 పై పద్యార్థమునే యిందు తేరార్థమునమరలఁ జెప్పఁబడుట మూలానుసారముగనే యని యెఱుంగఁదగు. 3 స్థిరాభవమనస్వినీ-అని మూలము. ఈరెండు విశేషణములకు వ్యాఖ్యలలోనున్న యర్థమే యిటఁ జెప్పఁబడినది.

తే. నిశ్చయంబుగఁ దెలిసియు ♦ నేనుఁగూడ
వినినఁ బరిహాసమును జేయఁ♦గను దగు నిటు
వంటిమాట నదేమొకో? ♦ పల్కుచున్న
వాఁడ విదియేమి చిత్రమో ♦ పలుకఁ జాల. ౨ 1152

క. [వీరులు శస్త్రాస్త్రాఘవి,శారదులగు రాజపుత్ర♦సమితికనర్హం
బారయ నపకీర్తికరం,బౌ, రామా! వినఁగరాని♦దౌ నీనుడియున్.] 1153

ఆ. ఆర్యపుత్ర! తండ్రి ♦ యంబయుఁ దోఁబుట్టు
వాత్మజుండు స్నుషయు ♦ నాత్మపుణ్య
పాపజనితములగు ♦ ఫలములఁ బొందుచు
స్వస్వకర్మములను ♦ సలుపుచుంద్రు. 3 1154

తే. అవి శుభాశుభరూపమ్ము♦లగును జుమ్ము;
భర్తకర్ధశరీరమౌ ♦ భార్యయొకతె
భర్తృకృత భాగ్యఫలములఁ ♦ బడయుఁదానుఁ
గనుక వనినుండఁ దండ్రినిన్ ♦ బనిచె దాన. ర 1155

క. వనమున నీతో నుండం,గను నాకాజ్ఞ యిడినట్లు ♦ గాదే యయ్యెన్
వనితకు జననీజనకులుఁ, దనయసఖుల్ గతులుగారు ♦ దారుం దమకున్. ౮౪

క. కారు స్వతంత్రలు, స్త్రీలకు, నారయఁ బెనిమిటియె యిందు♦నందున్ గతియౌ
నోరామ! యెపుడు మఱి యె,వ్వారలునుం గతులు గారు ♦ పల్కులిఁకేలా.౫

క. ఓరామా! నీవిప్పుడె, ఘోరాటవి కరుగ మదిని ♦ గోరుదువేనిన్
భూరి ముదంబునఁ జనియెద, నేరుపునన్ నీకు ముందు ♦ నేను జవమునన్. ౫౪

తే. దర్భముండ్లను ద్రొక్కుచుఁ ♦ దగ నవి తమ
వాడి విడనాడి వెనుకనె ♦ వచ్చుచున్న
నీకు మెత్తగ నుండును; ♦ నీవు శూర
వరుఁడవౌటను నాబోఁటి♦వనిత వనికి. ౬ 1159

క. కొనిపోవ నెట్టులోయని, మనమున భయపడఁగరాదు ♦ మానిని యిది నే
నును వలదనఁగా వచ్చెడి,నని గానీ నన్నుఁ గొలిచి ♦ యతివ! యనిశమున్.౬౪

క. చరితార్థురాలె యగుచున్, బరఁగెడి ననిగాని యీర్ష్య♦వదలుము నాథా!
పరికింప కిది మదుక్తిని, నరుగంగాఁ దలఁచె వనికి ♦ నని రోషంబున్. ౬౪

ఆ. వదలవలయు నివ్వి ♦ వారక నీమనం,బునను గలిగియుండి♦నను మహాత్మ!
[1]భుక్తశిష్టహేయ♦భువనంబు వదలున;, ట్లటవి కేనువత్తు ♦ నార్యపుత్ర!. ౭

క. నను విశ్వసించి నీతోఁ, గొనిపొమ్మా! పాపవమము ♦ గూడన్ నాయం
దును గలుగకుండు; సౌధం,బున నుండుటకన్న మేలు♦పో వని నాకున్. 1163

1 భువనంబు=జలము.

సీ. అష్టసిద్ధులనొంది ♦ యాకసంబునఁ బ్రీతిగా సంచరించుట♦కంటె మఱి వి
మానసమూహంబు♦పై నెక్కి యుండుటకన్న నెన్నఁగరాని ♦ కష్టములను
బొందియైనను బ్రాణ♦ములకీశుఁడై తగు పతిపాదసేవయే ♦ పరమగతియు
నన్నింటిమించిన ♦ యదియునౌఁ బతికడ వర్తింపఁదగినట్టి ♦ భంగి నాకుఁ

తే. దల్లిదండ్రు లనేకవి♦ధములఁ జెప్పి, యున్నవారలుగాన నీ ♦ సన్నిధాన
మందు నెట్లెట్లు తిరుగంగ♦నగునొ దాని, నెవ్వగును నేర్పవలసిన♦దిపుడు లేదు.

క. జనవర్జితమయ్యుఁ జోరం,గను రానిదియయ్యు బహుమృ♦గగణంబుల నిం
డినదయ్యుఁ బులులు వృకములు, గనఁబడ భయదంబయినఁ♦గానసము తగన్.

క. చనుదెంచెద నీతోడను, వినుము త్రిలోకాధిపతిత♦వెలసినచో దా
నిని లెక్కచేయకే భ,ర్తను సేవించుటయె గొప్ప♦వ్రతమని తలఁతున్. ౧౧

క. జనకుని యింటన్ మెలఁగెడు, నను వున నీవెంట వచ్చి ♦ యడవులను సుఖం
బున వసియించెద రామా!, నిను సేవించుచునె యుండ ♦ నేనెంతుఁ జుమీ!.

సీ. ఇంద్రియనియమంబు ♦ నేపొంది కామభోగంబుల విడనాడి ♦ కస్తురిపుష్ప
రసము విజృంభించు ♦ రమ్యవనంబుల నినుఁ గూడి క్రీడించె♦దను మహాత్మ!
మర్యాదఁ గాపాడు ♦ మానిసివీవు, కానసముల శరణుసొ♦చ్చిన యితరుల
నైనఁ గాపాడెడు ♦ నట్టి మేటివి గాన నన్నుఁ గాపాడుట♦నంగ నెంత!

తే. వత్తు నీతోడ వనికి ల♦వంబు సంశ,యంబులేదిట్టి పూనిక ♦ నందియున్న
నన్నునిచ్చట నిలుపంగ ♦ నెన్నిగతుల, శక్యమే గాదు నీకు నో ♦ సాధుమాళి!.

చ. వనమునఁ బండ్లమూలముల ♦ బాగుగనే దినుచుండు సంశయం
బనునది లేదు భోజనము♦నందును బానమునందు నుంతయున్
నను శ్రమ మేను గల్గునటు ♦ నాథ! యొనర్పక నిన్నుఁ గూడి యుం
దును మతిమంతుఁడౌ ప్రియు ని♦నున్ దగ సాయము నొంది పూన్కి చేన్.

తే. భయము నొందక యందలి ♦ పర్వతములఁ
బల్వలంబుల సదులను ♦ వననికాయ
మును దమిం జూడఁ గోరెద; ♦ ఘనపరాక్ర
మమునఁ దగు నిన్నుఁ గూడి సు♦ఖమును గనుచు. ౧౬ 1170

క. వరుసఁగఁ జక్కఁగఁ బూచిన, సరసిజముల నెలసి హంస♦జలకుక్కుట సం
భరితముగ నొప్పు కొలఁకుల, గురుతరమోదమునఁ జూడఁ♦గోరెద నాథా!.

క. అనిశము నియతవ్రతనై, తనరుచు నా కొలఁకులందుఁ ♦ దమిస్నానము నే
నొనరింతుఁ బరమమోదం,బున నిన్నుం గూడి కేళిఁ ♦ బొనరింతు నటన్.

తే. ఇట్లు వనముల నినుఁ గూడి ♦ యేను గాల
మును జరపుకొంటినేని య♦బ్జనిచయ మది

శతసహస్రసమంబైన ♦ స్వాంతమునకు
నాకుఁ దెలియద యిఁకఁ బదు♦నాలుగెంత. ౧౮౪ 1173
క. నిను విడనాడిన స్వర్గం, బును నేనొల్లన్ సురేంద్ర♦పురవాసము నా
కును లభియించిన నొల్లన్, నినుఁ గూడకయుందునేని ♦ నిశ్చయమిది సూ!.
క. చొరరానిదైనను న్వా,నరములు కరిముఖ్య మృగగ♦ణములు వెలసినన్
గరుణాకర! మనమది భీ,కరమై యుండినను భీతిఁ ♦ గనకే వత్తున్. ౨౦౪ 1175
ఆ. నియమములర నేను ♦ నీపాదములనమ్మి
జనకునింటనుండు ♦ చందముననె
యుండుదాన వనిని ♦ ఖండితముగ నిన్నుఁ
దక్క నితరు నాత్మఁ ♦ దలఁపఁ జుమ్ము. ౨౧ 1176
సీ. రాఘవా! నాయను♦రాగమె నీయందె తనరారునట్లాట ♦ ననుఁ ద్యజించి
నీవు పోయితివేని ♦ చావనిశ్చయమును జేసినదానను ♦ సిద్ధమిద్ది
కావున నన్నును ♦ గానకుఁ గొనిపొమ్ము ప్రార్థనం బిద్ది నా♦వలన నీకు
భారము గలుగ దం♦చీరీతిఁ బల్కిన నరవరుండును ధర్మ♦పరుఁడుగానఁ
ఆ. గష్టములను లెక్కఁ♦గాఁజేయ కిటు వేఁడ
నాతఁ డొల్లఁడయ్యె ♦ నతివరాక
వనమునందుఁ గల్గు ♦ బహుదుఃఖములఁ జెప్పి
యామె నిలుపఁ దలఁచె ♦ నాత్మయందు. ౨౩ 1177

ఇరువదిఏడవ సర్గము సంపూర్ణము.

---

౨౮ - వ సర్గము.

సీతకు రాముఁడు వనవాసకష్టములఁ జెప్పుట.

చ. జనకజ యిట్లు వేఁడుకొన ♦ శాశ్వతధర్మవిదుండు ధర్మమం
దనవరతంబు ప్రీతి గల♦యట్టి మహాత్ముఁడు గాన నాత్మలో
వనమునఁ గల్గుదుఃఖముల ♦ వారక యెంచుచు నామెఁగూడఁ దో
డ్కొని చన నించుకేనియును ♦ గోరక యిట్లని పల్కె మెల్లఁగన్. ౧ 1178
సీ. ధర్మాత్ముఁ డట్లు సీ♦తయు బాష్పసంపూర్ణనయనయై యుంటచే♦నయమువీఁడ
నూఱడించుచు నందె♦యొయ్యన నిలుపంగఁ దలఁచిసీతా!గొప్ప♦కులమునందు
జననమొందితి వీవు ♦ సతతంబు ధర్మాభిపరత నొప్పినయట్టి ♦ భవ్యమతివి
నిలువుమిందే ధర్మ♦మెలమినసమాచరించుచు నెయుండుముమున♦స్సునకుసుఖము
తే. మాత్రమే తలపోయకు ♦ మామకమగు
వచన మెట్లెట్లు మెలఁగంగ ♦ వలయు నీవు;

---

ఇందు ౨౧-౨౨ శ్లోకములకు గోవిందరాజవ్యాఖ్యలోనిసార మిందు సంక్షేపరూపమునఁ గనవచ్చునని తెలియఁదగు.

ప్రేయసీ! నాదువచనంబు ♦ విడిచి యించు
కేని స్వాతంత్ర్యమును బొంద♦నోనె యెపుడు. ౩౪ 1179

చ. వినుము వచింతు నయ్యటవిఁ ♦ బెక్కు-శ్రమంబులు గల్గియుండు న
వ్వనమున నుండనో ననెక్కి ♦ వాంఛను మానుము దుష్ప్రవేశ్యమౌ
వనమునఁ జాలఁగష్టము ల♦వారిగఁ గల్గునటంచుఁ జెప్పుదుర్
జనులిది నీవెఱుంగవె? సు♦సాధ్వి! భవద్ధితమే తలంచుచున్. ౫ 1180

చ. వలికెదఁ గాని కావనిను ♦ భారము నాకని కాదు కానన
స్థలమునఁ జూడఁగా సుఖమె ♦ తప్పక కల్గు దుఃఖమొప్పుచుం
గలుగు నటంచెఱుంగుదును♦గా గిరినిర్ఝర సంభవధ్వనుల్
బలు గిరికందరంబులను ♦ వాసము చేసెడు సింహనాదముల్. ౬౭ 1181

చ. వినుట కశక్యమౌఁ గనుక ♦ వేయివిధంబులఁ గష్ట మవ్వనం
బున నివసించు, టోతరుణి! ♦ పూగుమవర్ధితమౌ మహావనం
బునఁ బలుతావులందు మద♦పూరితసింహతరక్షుముఖ్యముల్
మనములు నించుకేని యను♦మానము జంకును లేక స్వేచ్ఛఁగన్. ౮౯ 1182

చ. తిరుగుచు భీకరాకృతులఁ ♦ దెంపుమెయిన్ మనలం గనంగనే
యరుదుగ నంట భ్రాంతిపడి ♦ యాస్చుచుఁ జంప నెదుర్కొనుం గదా
తరుణిరో! కానఁ గష్టమగుఁ ♦ దద్వనవాసము; పెన్మొసళ్లు భీ
కరగతి గ్రాలఁగా నదులు ♦ కర్దమయుక్తని దుస్తరంబులై. ౧౦౪ 1183

క. కనఁబడు దానిం దాఁటన్, మనకెట్టులు సాధ్యమగును? ♦ మత్తగజంబుల్
కనుపట్టునందు నిత్యం,బును గానం గష్టతరము♦పో వసియింపన్. ౯ 1184

సీ. కాలుసాగక యుండఁ♦గాఁ జుట్టుకొనుతీఁగ లొంపులై వేధించు♦నట్టి ముండ్లు
నిండుగాఁ గనుపట్టు♦చుండఁగ వనకుక్కుటములు సంతతములో♦టనుభయంబు
గలుగఁజేసెడు రీతిఁ♦గాఁ గూయఁ గ్రోవలో దుఃఖకరంబులై ♦ దోఁచునందు
జలము గానఁగరాదు ♦ శక్యముగాకుండు నందుఁ బ్రవేశింప ♦ నట్లు గాన

తే. వననివాసంబు కష్టంబు ♦ పగలు పండ్లు
కై తిరిగి కష్టమునఁ గుంది ♦ కటికునేలఁ
బండి రాలినయాకులఁ ♦ బఱచుకొనుచు
రేయి యాశయ్యపై నిదు♦రింపవలయు. ౧౧ 1185

క. కావున వని కష్టము సుమ్మో! వనితా! రేయుఁ బగలు ♦ నుగు నియమమునన్
జేవచెడి వృక్షపతితము,లై వఱలెడు పండ్లఁ దినుచు ♦ నతిమోదమునన్. ౧౨

క. పొందఁగవలయుం గావున, నందుండుట కష్టమెయగు ♦ సతివా! వినుమా
యందుపవాసములుండం,గందగుఁ జూ శక్తికొలఁదిఁ♦గా నవుడపుడున్. ౧౩౪

తే. వల్కలంబులు ధరియించి ♦ వరుస జడలఁ
దాల్చి యుండఁగవలయు ని♦త్యమును దేవ
తలను బితరుల నపుడపు ♦ డెలమి వచ్చు
నతిథులను విధిఁబూజింప ♦ నగును దరుణి!. ౧౪ 1188

క. దినదిన ముదయము మధ్యం, దినమును సాయంతనంబు ♦ దిటవుచెడక సే
యనగుఁ స్నానత్రయమును, ఘననియమంబునఁ జరింపఁ♦గాఁ దగు సీతా!.

క. వనవాసము కష్టముగద, విను వానప్రస్థులైన ♦ విమలమునులు చే
యునటు తనంతనె పూవులఁ, గొని తెచ్చుచుఁ బ్రతిదినంబు♦కోమలి! నియతిఁ.

క. విను మగ్ని వేదికఁ బలి, దినదినమీయంగవలయుఁ ♦ దృప్తిగ నటుగా
వున వని దుఃఖకరంబగు;, వనవాసులు నియతములగు ♦ వన్యఫలాదుల్. ౧౬

క. తినుచుండవలయు మైథిలి!, కనుకఁ లభియించినన్ని ♦ కందఫలములఁ
గొని తృప్తినొందవలయుఁ, మనమున నెంచంగ వనము ♦ మాటయె కలికో.

సీ. గాలి యెప్పుడు హెచ్చు♦గా వీచుచుండును నిశలందుఁ దిమిరంబు♦నిండియుండు
నెల్లప్పుడాఁకలి ♦ హెచ్చుగఁ గన్పట్టు నిట్టివి పెనుభీతు ♦ లెన్నొ కలవు
కావున విపినంబు ♦ కష్టతరంబగుఁ; బెద్దదేహంబుల ♦ వెలయు కొండ
చిలువలు పెక్కులు♦బలిసి ప్రాఁకుచునుండుదిగులొందఁగాఁజేయ♦నగుఁగదవని

తే. నట్లుకావున నతికష్ట♦మగును గాదె;
నదులె యిండ్లుగ నొప్పంగ ♦ నదులఁ బోలి
వంకరగఁ బోవునట్టి స♦ర్పములు దారి
కడ్డముగఁ బండుకొనియుండుఁ ♦ గాన నటవి. ౨౦ 1193

సీ. శ్రమమీయఁగాఁజాలు;♦శలభముల్ తేళ్లునుబురుగులుదోమలు♦[1]ఖరమశకము
లెప్పుడు బాధించు ♦ నింతిరో! యోర్వంగఁజాలవీ వటుగాన ♦ శ్రమమె వనము
కంటకద్రుమములు ♦ కడునిండియుండును దర్భయు జెల్లును ♦ దమము గ్రమ్మఁ
బర్ణముల్ కలియఁగా ♦ బలిసియుండును గానఁ జరియింప సుంతయే♦సరిగ లేదు

తే. కాన మిగుల శ్రమమ్మగుఁ ♦ గాననంబు;
వని వసించెడువారికి ♦ ఘనశరీర
కష్టములు పెక్కుభయములు ♦ గానఁబడును
భయదమై కనుపట్టును ♦ వనము లేమ!. ౨౩ 1194

క. నిరతము క్రుధ లోభంబును, బరిత్యజింపంగఁ దగుఁ ద♦పంబున బుద్ధిం
బురికొల్పవలయు భయకృ,త్తరమృగముఖదర్శనమునఁ ♦ గాదు భయపడఁ.

క. కనుకఁ వనగమనంబిఁక, వనితా! చాలు నినుఁబోఁటి♦వారికిఁ దగ ద

1 ఖరమశకము=భయంకరమశకములు. ఇందు వనము అనుమాట పెక్కుతావులఁ గనుపట్టుట మూలానుసారమే యని యెఱుంగవలయు.

వ్వనమిందుఁ జాలయోజించినఁ గష్టతరంబె యగును ♦ సిద్ధము తన్వీ!. ౨౫
క. వనమునకుఁ దన్నుఁ దోడ్కొని, చనఁగ మహాత్ముఁడగు రామ♦చంద్రుండుమనం
బున నెంచకుంటఁ గని యా,తని వచనముఁ గొనక దుఃఖ♦తయయి వనితయున్.

ఇరువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౨౯ - వ సర్గము.

సీత రామునితో వనవాసము నకు తప్పనని పల్కి చెప్పుట.

క. తన ప్రాణేశుం డేలో, వనమునకుం దన్నురాఁగ ♦ వలదనియెఁ గటా
యని దుఃఖమొలయ నశ్రువు,లను మోము గ్రసింపఁ బల్కె♦లలితోక్తులచేన్.
క. వనమున నుండెడు విషయం,బున నేయే దోషములును ♦ భూమిపతీ! నీ
వనువాదముఁ జేసితివో, ఘనయున్నత్స్నేహమును జ♦గంబ గనునాకున్. ౧౪
తే. అవ్వియెల్లను గుణములై ♦ యగును గాని
దోషములు కావు తెలియుమా ♦ తోయజాక్ష!
మృగతతియు సింహవితతి యే♦నుఁగులుఁ బెద్ద
పులులు శరభంబులును బక్షి♦పూగములును. ౨౫ 1200
సీ. పెనుచమరంబులు ♦ వనినున్న తక్కిన మృగముఖంబులు పూర్వ ♦ మున్ను జేని
నీరూపమును బోలు ♦ నిర్మలరూపంబుఁ జూచియుండవు, నిన్నుఁ ♦ జూచినంత
భయపడి దవ్వగఁ ♦ బాఱిపోవునుగాని బాధింపఁజాలవు ♦ భయము గలుగ
నంతయు సాధ్వసం ♦ బందుదు రేకదా; నిశరగురునాజ్ఞయే ♦ తాను నన్ను
తే. వనికిఁ బొమ్మనిచెప్పెడి ♦ వచ్చుదాన
నిన్నుఁ దవిఁగూడి, నీవును ♦ నన్నువిడిచి
చనుదువేఁ బ్రాణపంచక♦మును వదలుదు
నిదియె సద్ధర్మమగు నాకు ♦ నింతనిజము. ౫ 1201
క. నీసన్నిధి నేనుండఁగ, వాసవుఁ డసురాధిపుండు ♦ వచ్చి ప్రతాపో
ద్భాసితుఁడయి ధర్షింపఁగఁ, దా సామర్థ్యంబుఁ గనఁడు ♦ తగ నూహింపన్.
చ. వనగమనంబు మాన్పఁగను ♦ వర్ణితమయ్యెను గాదె యింతకున్
మును మదిఁ దోఁచినట్లుగ వి♦భూ! యటులైనను నిన్ను జీవితే
శుని నెడఁబాసి నేఁ బ్రదుకు♦చొప్పు గనంబడ దింతవట్టు నేఁ
జనువునఁ బల్కితిన్ వినుము ♦ సారసలోచన! ప్రాజ్ఞపుంగవా!. ౭ 1203
చ. జనకునియింట నుండుతఱి ♦ సత్యవచస్కులు జ్యోతిషంబునే
ర్చిన ధరణీసురుల్ మునుపె ♦ చెప్పిరి నాకు నరణ్యవాసమా
నని యలపల్కు వింటి నది ♦ యాను యథార్థము; దేహరేఖలం
గనుఁగొని వానికిన్ ఫలని♦కాయముఁ జెప్పవలంతులౌ ద్విజుల్. ౮ 1204

తే. బలవిభాసిత! రామ! కా♦నలవసింప, వలయు నీవనిచెప్పిరి♦ప్పటి వఱకును
నాటఁగోలె నేప్రొద్దుచ♦సంగనౌనొ,యడవికంచునుత్సాహంబు♦నందుచుందు.
సీ. లక్షణవేత్త లి♦లాసురుల్ నాకాజ్ఞ యిడినట్లు వనమునం♦ దేను గొంత
కాలంబు నివసింపఁ♦గాఁ దగునే కదా యట్టి నే నినుఁగూడి♦ యడవి కేగఁ
జనుఁగాని వేఱుగాఁ♦ జన నెట్టులౌఁ బండితా దేశమును బట్టి♦ యడవి కిపుడు
వచ్చుదానను గాని♦ స్వాంతమ్మునకుఁ దోఁచినట్లుగా నిచ్చచే♦ నటకు వచ్చు
ఆ. దానఁగాను నేను♦ ధరణీసురోక్తిని, నిజముసేయవత్తు♦ నిన్నుఁ గూడి
దానికిప్పు డొదవెఁ♦ దగినట్టికాలంబు, సత్యమగును గాక♦ త్వాసురోక్తి.
మ. వనవాసంబునఁ బెక్కుకష్టములు రా♦వచ్చున్ యథార్థంబుగా
ననినాకుం దెలియుం జుమీ యయిన వీ♦రాగ్రేసరుండన్న కీ
ర్తిని బొల్పారెడి నీకుఁ గల్గవవియే♦రీతిన్ విచారించినన్
గననౌ నవ్వి విలోలచిత్తులకు ని♦క్కంబిద్ది శ్రీరాఘవా!. ౧౧ 1207
తే. కన్నెనై తండ్రియింట నే♦ నున్నయపుడు
శీలసంపన్నయౌ ముని♦ స్త్రీ యొకర్తు
కొంతకాలము వనవాస♦ మింతి యిద్ది
యనుభవించు నటంచన♦ వినినదాన. ౧౨ 1208
క. అత్తఱి జననికిఁ జెంతను, జిత్తము రంజిల్లుచుండి♦ చెప్పఁగ వింటిన్
అత్తాపససతివాక్కుల, నిత్తఱి స్మరియించుదాన♦ నేను మహాత్మా!. ౧౩
సీ. ఇచ్చటికే నేను♦ వచ్చినతర్వాత గంగాతటంబునఁ♦ గ్రాలుచున్న
యాతపోవనముల♦ నాధృతి నినుఁ గూడి కోరిక వసియింపఁ♦ గోరుచుందు
బహువిధంబుల నిన్నుఁ♦ బ్రార్థించి సుప్రసన్నునిజేసికొని నెమ్మిఁ♦గనుచునుందు
వనికిఁ బోవుట నాకుఁ♦ బండువుగా నున్నయది నీకు శుభమగు♦నఖిల శూర
తే. వరులలో మేటివగునిన్నుఁ♦ బరమముదము
నను దగం గూడి సేవచే♦యను దలంతు
నీవసూయాదులే లేని♦ నిర్మలాంత
రంగుఁడవు ప్రేమ భావంబు♦ పొంగనేను. ౧౪ 1210
క. జనవర! నీవెంబడి నేఁ, జనుదెంచి మదీయపాప♦సంతతిఁ జెండన్
మనమునఁ దలంతు; గేహం,బుననుండియె వంశదేవ♦పూజనముననే. ౧౫
క. పాపములఁ దొలఁగఁజేయఁగ, నోపవొ యని యందువేమొ♦యొప్పఁగఁబతియే
శ్రీపతి సముద్దైవంబౌ, నేపగిదిన్ భర్తవిడిచి♦ యేనిట నుందున్. ౧౬ 1212
క. పరలోకమందునున్ నా, కరయన్ నీతోడిపొందు♦ హర్షప్రదమై
పరఁగున్ జుమ్మా! సుమతీ!, కరుణాకర! వినుము మఱియుఁ♦ గాదిలిప్రేమన్.
సీ. ఈలోకమున నెట్టి♦ యింతి స్వపితరులచేతనే పురుషున♦ కాతతవిధి
తమతమ వర్ణాది♦ధర్మము రీతిగా నుదకపూర్వకముగ♦ నొసఁగఁబడునో

యామెకుఁ బరలోక♦మందు నాపురుషుఁడే పతియగునని నీ♦పావనమగు
వేదవాక్యంబును ♦ విశ్రుతయశులైన విప్రులుచెప్ప నే ♦ విన్నదాన
తే. సంగతుల్ విని యుంద్రు స♦దాచరణము
వెలయఁ బతియే వ్రతంబుగాఁ ♦ దెలఁగి యున్న
నను; సుఖపూర్వకంబుగఁ ♦ గొనిన దాని
వనికిఁ దోడ్కొనిపోనొల్ల ♦ ననెద వీవు. ౧౮॥ 1214

*క. దీనికిఁ గారణమేమో, యే నెఱుఁగఁ గకుత్స్థవంశ! ♦ హితకర! నీయం
దే నిరతభక్తి గల్గిన, దానఁ బతివ్రతను దుఃఖి♦తన్ బ్రియభార్యన్. ౧౯॥

సీ. సుఖదుఃఖములు గల్గు♦చో సమముగ వాని నెంచెడుదాని నీ♦వెట్లొ యల్లె
సుఖదుఃఖములఁబొందు♦చున్ దృష్టిగనుదానిననునిందువిడిచిపోఁ♦జనదుతోడు
కొని పోవుటయె నీకు ♦ నొసర ధర్మంబగు నిట్లు దుఃఖించు న♦న్నిండ విడిచి
వనికిఁ దోడ్కొని పోవ ♦ నూనమునఁ దలఁపక పోవుదువేని ని♦ప్పులను బడియొ
[1]ఆ. విషముఁ దినియొ నీళ్ల ♦ వెస దుముకియొ ప్రాణ
ములను విడుచుదాన ♦ మోహనాంగ!
యనుచుఁ బెక్కుతీరు♦లను నిట్లు వనికిఁ దో
డ్కొనుచుఁ బొమ్మటంచుఁ ♦ దనను వేఁడ. ౨౧॥ 1216

తే. ఆమహాబాహుఁడా సీత ♦ నడవికి విజ
నంబగుటఁ దోడుకొనిపోవ ♦ నైజబుద్ధి
సమ్మతింపకయుండె; భూ♦జాతయు నిటు
తనవిభుఁడు తోడుకొనిపోవ ♦ ననిన నుడికి. ౨౨ 1217

క. కనుదమ్ముల వెలువడి యిం, తనరారె మహోష్ణబాష్ప♦ధారల భూమిన్
దనతల్లిఁ దడుపునో యనఁ, దెను దుఃఖము నొందె నిట్టి ♦ విధమున నార్తన్.
క. పెనువగలఁ బొగులుచున్ [2]జెప, విని రక్తిమ పొదలనున్న ♦ వాలఁదిని రాముం
డును వనికి రాకయుండం, గను నిలుపుటకై మృదూక్తిఁ♦గడుఁ దనిఁబలికెన్.

ఇరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

* భక్తాం పతివ్రతాం దీనాం మాం సమాం సుఖదుఃఖయోః-అనిమూలము. ఈవిశేషణము లన్నియుఁ బద్యమునఁ జేర్పఁబడినవేకాని క్రొత్తవి కావని యెఱుంగునది. 1 ఇందు మోహనాంగ యనుసంబుద్ధి క్రొత్తఁగాఁ జేర్పఁబడినది. నీవు నన్ను వనములకుఁ దీసుకొనిపోవేని ప్రాణముల విడుతు నన్నమాట సిద్ధసాక్ష్యము చేయును గాన సమంజసమే యని తెలియఁదగు. 2 పెదవిని రక్తిమ పొదలనున్న వాలఁదిని అనుదానికి మూలమున "తామ్రోష్ఠీం సీతాం" అని యుండుటయే హేతువు.

## ౩౦ - వ సర్గము.

సీత రాము నాక్షేపించుట.

చ. జనకమహీశపుత్త్రిపతి ♦ సాంత్వనవాక్యములు పల్కుచుండఁ దా
వనమున కెట్టులైనఁ జని ♦ భర్తను గూడి వసించుటొప్పునం
చని పనిపూని యెంతయును ♦ సంగము కంపము నొంద శూరుఁడై
తనరి విశాలవక్షము సు♦దారమనంబును గన్న రామునిన్. ౧ 1220

క. కనుఁగొని స్నేహము పెంపునఁ, దనవాఁడను నాశయమున ♦ దానించుకయే
ననుమానింపక ప్రాణే,శుని దానుఁ దిరస్కరింపఁ ♦ జొచ్చెన్ గడఁకన్. ౨

*సీ. ప్రాణేశ! నీయందుఁ ♦ బరమసౌందర్యంబు గలదు; భ్రమింతురు♦గాంచిదానిఁ
గావున మిథిలేశుఁ ♦ డీవు నన్నొకతుకఁ గావనేరక వీడి ♦ కానకొకఁడ
వేగితి వని విని ♦ నే నిట్టి నిన్ను నాజామాత వనిత ని♦జంబు పైకిఁ [యు
బురుషవేషముఁదాల్చి♦తరుణిగ్రహించె నంచాత్మ నెంచకయున్నె♦యకటమతి
బురుషవిగ్రహమునఁ ♦ బొల్చెడు నిను రామ జామాతనొందియుం♦త్మావిభుండు
తే. స్త్రీయటంచును దలఁచె నే♦మాయెఁ గాని
నన్ను విడనాడి నీవు కా♦నలకు నేఁగి
యేల దుఃఖింపఁజేసెద ♦ వెల్లరఁ; గట
ప్రజ్వల త్తీక్ష్ణకిరణుని ♦ భంగి నీకు. 3 1222

* కింత్వామన్యత వైదేహః పితా మే మిథిలాధిపః, రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్-అనిమూలము. దీనికి గోవిందరాజు లిట్లు వ్యాఖ్యచేసియున్నారు. నన్ను వదలి పెట్టి వనములకరిగిన నిన్ను నాతండ్రి విన్నయెడల పురుషవేషమును ధరించిన యొకానొకవనిత నా పుత్త్రికను హరించెనని తలంచును. సౌందర్యమున నితరులకు భ్రాంతిని గల్పించువాఁడా (ఓరామా) విదేహకులమునఁ బుట్టి (అనఁగా నొకప్పుడైనను పత్నీవిరహము నెఱుఁగనివాఁడు) మిథిలాదేశాధిపతి యగునాతండ్రి (నన్నొకదానిని రక్షింపఁజాలని) నిన్నుఁ దెలిసికొని అంతస్స్త్రీస్వభావము గలిగి బహిఃపురుషవేషము గలజామాతనుగా తలంపఁడా, తప్పక తలంచునని తాత్పర్యము. అని యిట్లు పెక్కుభావముల వెలిపుచ్చిరి.

మహేశ్వరతీర్థులుగారు.

ఓరామా నిన్ను ఆకారమాత్త్రమునఁ బురుషుఁడవని యథార్థమున స్త్రీగానున్న యల్లునిగాంచి యేమితలంచును? తత్త్వమెఱుంగఁడు. తత్త్వమెఱింగినచో నన్ను నీకొఱ కిచ్చియేయుండఁడు. లేక 'సఏవ వాసుదేవోఽయం సాక్షాత్పురుష ఉచ్యతే, స్త్రీప్రాయ మేత త్తత్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్.' అను విష్ణుపురాణోక్తివలన వైదేహుఁడగు నాతండ్రి నిన్ను అల్లునిగాఁ బొంది లోకమున త్వద్వ్యతిరిక్తపురుషాకృతిని సర్వమును స్త్రీనిగాఁ దలఁచెనా యేమి? ఇట్టి భయస్వభావముగల నిన్ను అట్లు తలంచుచు భ్రాంతినొందెను. లేక రామజ! అమాతరం, ప్రాప్య, స్త్రియం, పురుష! విగ్రహమ్-అని పదవిభాగముచేసి రామజ=రమింపఁజేయుటకుఁ బుట్టినవాఁడా! పురుష=క్రీడార్థమవతరించిన పరమపురుషుఁడా! అమాతరం స్త్రియమ్ = సపత్నీమాతయైన కైకను, ప్రాప్య=ఉద్దేశించి, వైదేహో

నకు సమర్పించి భ్ర♦మకుమానివలె నీవె భరియింపఁగాఁ దగి ♦ పరమునుగుచుఁ
జిరకాలముగ వచ్చి♦చిఱుతప్రాయంబునఁ దగు నిన్నుఁ బొందఁగాఁ♦దగిన రాజ్య
ఆ. లలన వేషధారి♦వలె నోరులకు నీయఁ
దలఁచుచున్నవాఁడ; ♦ వెలమి నెవరి
కిని హితంబు సేయ ♦ నను నుండుమనియెదో ?
యెవరిసేవకొఱకు ♦ నిట నిలుపుదో ?. ౮౪ 1229

*సీ. అట్టి తల్లులకీవె ♦ యనుకూలుఁడవగుచుఁ జెప్పినవిధమునఁ♦జేయుచుండు
మేను వచ్చెద వెంట ♦ నెవరికీలాగున హితము బోధించెదో? ♦ యెవరికొఱకు
శ్రమపడియెదవో యా♦సాధ్వి నేనే కాన నామాట విని కాన♦నముల కిపుడు
కొనిపొమ్ము నాథ! యె♦వని విషయమునందు హితముగావర్తింపు♦సతతమనుచుఁ
తే. జెప్పుచున్నావో ? యే యభి♦షేకమునకు
నిగ్రహింపఁగఁ బడితివో ? ♦ నీవు రామ !
యట్టి భరతుని యనుమతి ♦ నంది యట్లె
చేయుమా ! నేను నీవెంటఁ ♦ జేరియుందు. ౯ 1230

ఉ. అంతియెకాని నాకు నిటు ♦ లయ్యయిరీతులఁ జేయుచుండు మం
చెంతయుఁ బ్రీతిఁ జెప్పకుము ♦ యిచ్చట నన్విడనాడి ఘోరమా
చింతఁ దపింపఁజేసి నని ♦ జేరుట యర్హముగాదు నీకు భూ
కాంతకుమారకా! తపమొ? ♦ కానయొ? స్వర్గమొ? యేదియో? యిఁక౯.

క. నినుఁగూడిన నాకగుఁగా,క; నీవు లేకున్న నేది♦గాని వలదు నీ
వెనుకనె వచ్చెదు నాకిటు, వనమార్గశ్రమము గల్గ♦వచ్చునె? చెపుమా!. ౧౦౪

క. ప్రమదావనముల విహరించు మాడ్కి సుమశయ్యఁ జేరు♦చొప్పుననే శ
ర్మము గనె యుందును నీతోఁ, బ్రమదంబున వనికి నేను♦వచ్చినయెడల౯.

సీ. దారిలో మొలచిన ♦ దర్భలు తెల్లును ముండ్లపొదలు మఱి♦ముండ్లచెట్లు
నినుఁ గూడి పోవుత♦ఱిని నాకు నజినము, లట్లు తూలముభంగి♦నగు సుఖముగ
స్పృశియింప వనమున ♦ నేగెడువేళలఁ బెనుగాలి నెగిరిన ♦ ఘనరజంబు
వాసనామిళిత వి♦భాసురచందన రజముగఁ దలఁచెద ♦ రామచంద్ర!
ఆ. బాలతృణము లలరు ♦ పట్టులఁ బండుట, కన్న నిచటఁ జిత్ర♦కంబళముల
నిరుపమానవస్త్ర ♦ నిర్మలశయ్యల, పైఁ బరుంట సుఖమొ? ♦ బాగొ? చెపుమ!.

చ. వనముల నీవు మూలములఁ ♦ బత్త్రఫలంబులఁ గొంచెమైన నే
గొనకొని గొప్పయేని మదిఁ ♦ గోరిక మీఱఁగఁ దెచ్చి యిత్తువో

* యస్య పథ్యంచ రామార్థ యస్య చార్థేఽవరుధ్యసే, త్వం తస్య భవవశ్యశ్చ విధేయశ్చ సదానఘ-అని మూలము. ఇందు యస్య అనుదానికి మాతృజనస్య అని భరతస్య అని యర్థము వ్రాయఁబడినది కాన నవి రెండును జేర్చి యీపద్యము వ్రాయఁబడియెనని యెఱుంగఁదగు.

విషము సుధారసంబువలె ♦ వేడ్క జనింపఁగఁ జేయుసత్త్వ య
వ్వని ఋతుమర్క్యనుండుఁ జెలు♦వంబుగఁ బ్రోచెడి పూర్వనాకృతిన్. ౧౫

క. ధరియించి ఫలములం దిని, యొసరగు మోదంబునొంది ♦ యాంబను జనకున్
స్మరియింపక్ర్పహాసునని సను, గరుణన్ దోడ్కొను మనుష్యుఁ♦గానరుఁ జనిరన్.

క. నీవచట నానిమిత్తం, బేవిధమున నైనఁ గష్ట♦మే శోకంబే
భావమున నైన నొందవు, గావున నన్ బ్రోచుటచటఁ ♦ గష్టంబెటులో. ౧౭

క. పలుమాటలేల నిను నేఁ, గలిసి వసించుటయె నాకుఁ♦గా స్వర్గము నిన్
గలియకయుంటయె నరకం, బాలరెడి నీయందు నాకు ♦ సద్గత ప్రీతుల్. ౧౮

ఆ. కాన నిన్ను విడువఁ ♦ గాఁ జాలనని సీత
యొక్కఁగి పలువిధముల ♦ నెప్పుడు ప్రీతి
ననుభవించుచుండు ♦ వాటులాట నుఁ దోడు
కొనిరయ యడవికేగఁ ♦ జను రఘువర!. ౧౯ 1239

క. వనికేగుదేర భయ మొుం,వని నను నిశ్చయముగన్న ♦ దాని నిపుడు తో
డ్కొని పోవవేని గరళం, బును త్రావి త్యజింతుఁ బ్రాణ♦ములఁ బ్రాణేశా!.

చ. గరళముఁ ద్రావియైన నను♦కాంతను వీడవఁగాని రాము! నే
యరులవశంబు నొంద నిపు♦డ నను నీవటకేగి నంతనే
న గహింతజీవ నొదును ఘు♦నంబగు దుఃఖముచేత నమ్మురీ
తగుణమునం దె చచ్చుటయె ♦ తథ్యము మంచిది నాతుమీవు నూ!. ౨౦ 1241

సీ. నినుఁబాసి యాదుఃఖ♦మును మహాదుర్గంబె ననహింపఁజాల ♦ సాధుచిత్త!
యాదినిఁ బడి దాని♦కవ్వల మూఁడను సర్వాత నొక్కటి ♦ వనుసగఁ బదు
నాల్గు వర్షములు వ♦నంబున నీవుండు నట నెట్లు వశమగు ♦ నేమి చెపుదు
నని సీత శోకంబు♦నను బురపురఁ బొక్కి కనుల గళ్లను గీతి♦గాఁగ నట్లు

తే. చాల విలపించి నాయకు ♦ సరస కేగి
దృఢతరాలింగనముచేసి ♦ దిగులుపుట్టు
నట్లు గట్టిగ నేడ్చె ని♦ట్లాడు విభుఁడు
పల్కుమాటలు శ్రుతి కటు♦త్వంబు గనుట. ౨౨ 1242

చ. తనువున నాటఁగా విషము ♦ తాపిన బాణము గ్రుచ్చుకొన్న భీ
తిని గను స్త్రీగజంబువలె ♦ దీనయునై యరణిన్ మథింపఁగాఁ
దనువున దాఁగియున్న శుచి ♦ దద్దయుఁ గ్రక్కినయట్లు మాటలన్
వినుటఁ బరాకునొందియును ♦ విస్తృతబాష్పజలంబుఁ గార్చెఁ దాన్. ౨3

తే. ఎడ తెగక కాఱు కన్నీటఁ ♦ దడుపఁబడియె
పంకజనం బటు గావున ♦ స్వచ్ఛమైన
స్ఫటికరీతిని దగు బాష్ప♦వారిజలజ
మునఁ బొడము మకరందరీ♦తిని దనర్చె. ౨౪ 1244

సీ. అకలంక శీతాంశు♦ననుకరించుచు విశాలాక్షుంబులం బోలు♦పారుచున్న
యాసీత నెమ్మొగం ♦ బధిక సంతాపాగ్ని జలములనుండి యీ♦వలికిఁ దీసి
నట్టి యబ్జముఁ బోలి ♦ యధికంబుగా వాడె; నప్పుడు రాఘవుం ♦ డవనిజాత
దుఃఖంబునన్ మూర్ఛ ♦ దొరలెడు నట్లున్నదాని బాహువుల నెం♦తేని గౌఁగి
తే. లించి విశ్వాస మెదకుఁ గ♦ల్పించు మృదుల,భాషణంబుల నిట్లని♦పల్కెఁ; దేవి!
నీకు దుఃఖమ్ము గల్గునే ♦ నాకు నొకట, స్వర్గము లభించినను నొల్ల♦సత్యమిద్ది.
ఆ. భూతసంఘములను ♦ బుట్టించి పాలించి, నడచుచున్న నాస్వ♦యంభువునకు
దేనివలన భయము ♦ లేనట్లు నాకును, భయము లేదు దేని♦వలన నైన. ౨౭
క. మంగళవదనా! నే భీ,తింగనకుండియును గానఁ ♦ దెంపున నిన్నున్
జెంగట మెలఁగుచు రక్షిం,పంగందగు శక్తివెలయు♦వాఁడనె యయ్యున్. ౨౭౹
క. నీదు మనోభావంబును, నేఁ దెలియక యుంటి వనికి ♦ నీ వరుదేరం
గాఁ దగ దంటిని మైథిలి!, నీదగు భావంబుఁ గంటి ♦ నిశ్చయము సుమీ!. ౨౮
చ. వనమున నన్నుఁ గూడి తమి ♦ వాసముచేయఁగఁ బుట్టితీవు కా
వున దృఢచిత్తుఁడెవ్విధిని ♦ బొల్పగు కీర్తిని వీడఁజాలన
ట్లె నినుఁ బురంబునన్ విడిచి♦యే వనికేనును బోవఁజాల నిం
కను వెఱపేల [1]హస్తికర♦కల్పమృదూరువిలాసినీ సతీ!. ౨౯ 1249
క. వానప్రస్థోచితమా, మానితధర్మంబు లోక♦మాన్యులు మును రా
జ్ఞ్యానులు సాధ్వీయుతులయి,యే నిర్మలమతుల సల్పి ♦ రిప్పుడు నేనున్. ౨౯౹
క. మునుపటి పెద్దల ధర్మం,బును బూనిక ననుసరించి ♦ పౌలఁతీ! నిన్నున్
వనికిం దోడ్కొని పోయెదఁ, గనుక సువర్చలయుఁ దీక్ష్ణ♦కరునిం బోలెన్. ౩౦
క. ననుఁ గూడి రమ్ము వనమున, కనుమానం బేల జనకు♦ననుఁగుఁ గుమారీ!
వనమునకేఁ బోకుండుట, యనునదియే లేదు పోదు ♦ నతివేగంబే. ౩౦౹ 1252
క. జనకుని వచనము సత్యం,బునఁ బొలుచును గాన నదియె♦పో లాగెదునన్
వనికిన్; సుశ్రోణీ! తన, జననీ జనకులకు లొంగి ♦ చను వర్తింపన్. ౩౧ 1253
క. నిరుపమ ధర్మంబదియే, పరఁగుంగద కానఁ, దండ్రి ♦ పలుకులు మీఱన్
మరియాదకాదు దానిన్, బరికింప కతిక్రమించి ♦ బ్రతుకం జాలన్. ౩౨ 1254
సీ. జనకాజ్ఞ సేయుట ♦ యననేల దైవముఁ గొలుచుచు నిందుండ♦వలయు ననెదొ
ప్రత్యక్షముగ నాజ్ఞఁ ♦ బల్కి యారాధనంబులఁ గొని వశ్యులై ♦యలరు తల్లి
దండ్రులు గురువను ♦ దైవము విడనాడి ప్రత్యక్షమే గాక ♦ వఱలుచున్న
దైవమ్మును స్వతంత్ర♦తం గన్నదాని నాయావిధంబుల నెట్టు ♦ లర్చనములఁ
ఆ. గొలువవచ్చుఁ జెపుమ ♦ కోమలాపాంగవి,భాసురా! వచించు♦వాఁడఁ దల్లి
దండ్రులట్లె గురువు ♦ తలఁపఁ ద్రిలోకముల్, వీరిసేవయెల్ల ♦ వారిసేవ. ౩౩౹

---

1 దీనికి మూలమున "గజనాసోరు" అనియున్నది.

క. వీరల సేవించిన సుర,వారము సేవించినట్టి ♦ ఫలము గలుగుఁ జు
మ్మారయఁగ వీరివలెనే, ధారుణిఁ బావనము వేఱు ♦ తనరదు తన్వీ!. 34 1256

ఉ. కావున వీరలం గొలిచి ♦ కాలముఁ ద్రోసెడివాఁడఁ దండ్రిదా
పావనసేవ యెట్లు బల♦వర్ధనమౌనొ? పదంబునందు న
ట్లో వరవర్ణినీ! యురర ♦ నొప్పెడు సత్యము దానమానముల్
భూవినుతాత్తదక్షిణలఁ ♦ బొల్చెడు యాగములెన్ని యేనియున్. 35 1257

క. ధన, ధాన్య, నాక, విద్యలు, తనయసుఖంబులును మఱి యి♦తర మేదైనన్
గన నగు గురుసేవను జేసిన; దాని లభింపనట్టి ♦ సిద్ధియుఁ గలదే. 36 1258

తే. దేవలోకము గంధర్వ♦ధేనులోక
ములను జక్కన సత్పదం♦బులను బొంది
క్రమముగా బ్రహ్మలోకంబుఁ ♦ గాంచఁగలుగ
జనని జనకునిఁ బూజించు ♦ సాధుసుతులు. 37 1259

తే. సత్యధర్మపథంబు ని♦శ్చలతఁ గొన్న
తండ్రి నాకాజ్ఞ యిడునెట్లు ♦ తదనుసార
ముగనె వర్తింపఁ దలఁచెద ♦ మగువ! యరయ
నది సనాతన ధర్మమై ♦ యలరుఁజుమ్ము. 38 1260

క. ననుఁ గూడి దండకాటవి,ని నివాసముసేయఁగోరి ♦ నిశ్చయమతిఁ జే
సినదానవౌట నినుఁ దోడ్కొని పోవఁగ బుద్ధిపుట్టె ♦ క్షోణీతనయా!. 39

క. అనవద్యాంగీ! మోహముఁ,గనఁజేయు కనుల్ చెలంగఁ♦గా నెనఁగు సతీ!
నిను సృజియించెను దైవము, వనమున ననుఁ గూడి తమి, ని♦వాసముచేయన్.

ఆ. భయముఁ బొందునట్టి ♦ భావంబుగను నీవు,నన్నుఁ గూడిరమ్ము♦నావలె బహు
ధర్మముల నొనర్ప♦దలఁపుము ననుఁగూడి, జానకీ! ప్రశస్త♦సరణి యిదియె.

క. పతిననుసరింపఁ దగు నను,మతి నిశ్చయ మొనఁగె నీకు ♦ మానిని! యిది స
న్నుతముగదా మాకులమున, కతిశుభ ఫలదంబు నీదు ♦ నవ్యయమునకున్. 40

సీ. కాంతరో! సుశ్రోణి! ♦ కానల వసియింపఁ దగినకార్యంబులఁ ♦ దగ నొనర్ప
మొదలిడుమా, యింక ♦ నెదుట నీవుండకపోయినచో స్వర్గ♦మేయయినను
నాకు రుచింపదు ♦ నలినాక్షి! విప్రుల కఖిలరత్నంబుల ♦ యతులకెల్ల
నన్నంబు నొసఁగుమా ♦ యర్థింతురెద్దాని నద్ది వారలకిచ్చి ♦ యతిజవమున
తే. సకలయత్నంబులను నీవు ♦ సలుపు, జాగు,వలదు విప్రులకిచ్చి యా♦స్వల నవర్ఘ
భూషణాంబరముల మంచి♦బొమ్మలను దగంగఁ గ్రీడింపఁదగు పరి♦కరములెల్ల.

క. పానుపులను రుచిరములగు, యానంబుల నావి నీవి ♦ నైనను మఱియే
వేని గనంబడు వానిని, మానక భృత్యుల కొసంగు ♦ మానిని! యనియెన్.

క. తన వనగమనము భర్తకు, ననుమోదం బౌటఁ దెలిసి ♦ యతిశయముదముం
గని వేగమ పెనిమిటి చెప్పినరీతిం జేయఁబూనె ♦ వెలఁది జవమునన్. ౪౬

చ. నిరుపమకీర్తిచే వెలసి ♦ నిశ్చితచిత్తమునం జెలంగు నా
తరుణియు భర్తృవాక్యము నె♦వం దలపోసి ప్రమోదమొంది ధ
ర్మరతిని గన్నవారలకు ♦ రత్నధనంబులఁ గోరినట్లు దా
ను రమణనీయఁగా నపుడు ♦ నూల్కొనియెం ద్వరహెచ్చుచుండఁగన్. ౪౭

ముప్పదియవ సర్గము సంపూర్ణము.

---

౩౧ - వ సర్గము.

రాముఁడు వనములకు రావలదని లక్ష్మణునకుం జెప్పుట.

తే. ముందుగా వచ్చి జానకీ♦మందిరమును
జేరి యందుండి సౌమిత్రి ♦ సీత కన్న
కచట జరిగిన సంవాద ♦ మంతయు విని
తనదు గతియింక నేమని ♦ తలఁచి తలఁచి. ౧ 1269

*మ. తన యర్ధాంగినె యెంతొకష్టముగ రాఁ ♦ దానొప్పినాఁడింక ర
మ్మనునే నన్నను దుఃఖభారమున బా♦ష్పాంభస్సులన్ నిండి వే
కనులెంతో శ్రమమొంద దుర్భరపు శో♦కం బాపఁగాఁ జాలకా
య్యన రామాంఘ్రులఁ బట్టి గాఢముగ న♦త్యార్తిన్ మనంబొప్పఁగన్. ౨

సీ. పృథుయశంబున భూమి♦వెలసిన సౌమిత్రి పురుష కారార్థము ♦ ధరణితనయఁ
గనుఁగొని యామెయే ♦ గతి తనకిఁక వేఱుగతి యట్టిదొక్కటి ♦ గానరామి
నిశ్చయించుచు దీన ♦ నిచయంబు రక్షింతునను మహావ్రతమునఁ ♦ దనరియున్న
రామచంద్రునిఁ గాంచి♦రయమున వచియించె; వనికి నీవేగుట♦యనభిమతము

తే. నాకుఁ గానలకేగంగ ♦ నీకు బుద్ధి
పుట్టునే నందు గజములు ♦ భూరిభయద
మృగములును బొల్చుచుండు ని♦న్నేను గొల్చి
ధనువు ధరియించి ముందేగు♦దును మహాత్మ!. ౩ 1271

క. ననుఁగూడి పక్షిమృగనిచ,యనినాదసమాకులంబు ♦ లగు వనవులలో
ననుదినముఁ దిరుగఁగల వీ, యనుజనిఁ దోడ్కొనుచుఁ జనుము♦యాశ్రితవరదా!

---

* సభ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః, సీతా మువా చాతియశా రాఘవం చ మహావ్రతమ్ - అని మూలము. దీని కీపద్యమును, బైని సీసపద్యములోఁ గొంతభాగమును వ్రాయఁ బడినది. ఈశ్లోకమునకు గోవిందరాజులు శరణాగతియే ప్రధానమని యర్థము సారాంశమని వ్యాఖ్య చేసినారు. ఆసారమే యిం దిమిడియున్నదని యెఱుంగవలయు.

చ. నిను విడనాడి యావిమల♦నిర్జరలోకనివాసమేని యిం
కను ద్రిదివత్వమేనిఁ గనఁ♦గా మది నిచ్ఛ జనింప దాశ్రితా
వనచణ! యీజగత్త్రయముఁ ♦ బాలనచేయుమటంచు నిచ్చినం
గొననిఁక ముక్తియేని దగఁ♦గోరను నీదగు సేవ దక్కఁగన్. 1273

చ. అని వచియించు లక్ష్మణుని ♦ యాశయమెల్ల నెఱింగి రాఘవుం
డనునయవాక్యముల్ పలికి ♦ యవ్విపినంబుల నుండరాకు మం
చన మరలన్ రఘూద్వహుని ♦ నాతఁడు గాంచి మహాత్మ! ముందె నే
వని కరుదేర నాజ్ఞను గృ♦పన్ దయచేసితి వీవు రూఢిగన్. ౬ 1274

క. మునుపవ్విధి నానతి యిడి,నను నిప్పుడు వనికి రాఁ జ♦నదని నిలుపఁగాఁ
గనఁజాల హేతువేమొకొ?, యనఘా! నీతోడఁ గాన ♦ కరుదేరంగాన్. ౭

చ. త్వరపడుచున్న నన్ను రఘు♦వర్య! యిదేటికి నిల్పఁబూనెదో
వరుసగ దీనికారణము ♦ బాగుగ నేనెఱుఁగంగఁ గోరెదన్
గరుణవచింపు మేమి యప♦కారముచేసితినో యటన్న ని
ర్భరమగు సంశయంబు మది ♦ వర్తిలుచున్నది గాన నిత్తఱిన్. ౮ 1276

క. అన నంత మహాతేజుఁడు, తనముందట నిలిచి మోడ్చి ♦ తనకున్ మున్నే
వనికేగఁ బూని తోడ్కొని, చనుమని ప్రార్థించు వీరు ♦ సౌమిత్రి ఘనున్. ౯

సీ. కనుఁగొని పలికె ని♦ట్లని నీవు నాపైని ఘనమగు స్నేహంబు ♦ గలుగువాఁడ,
వఖిలధర్మంబుల♦యందు నిష్ఠము గల్గువాఁడవు శూరైక♦వరుఁడ వెపుడు
సత్పథవర్తివి ♦ సఖుఁడవు తమ్ముండ వతిశయప్రియుఁడవై ♦ యలరువాఁడ
వరయఁ బ్రాణసముండ ♦ వగుదువు వశ్యుండ వట్లౌట నీరాక ♦ యగును శర్మ
ఆ. కరము నాకునైన ♦ గాదిలితమ్ముఁడా!, నాదువెంటఁ గాన♦నమున కీవు
వత్తువే సుమిత్ర ♦ బాగుగఁ గౌసల్య,నిట భరించువార ♦ లెవరొ చెపుమ?.

చ. జనపతియే భరింపఁగను ♦ జాలినవాఁడని యందువేని భూ
మిని దగ వృష్టిదేవతయు ♦ మిక్కిలివృష్టి నొసంగునట్లు కో
ర్కిని దగుభంగిఁగాఁ గురియు ♦ కీర్తిమనోజ్ఞుఁడు రాజు కైకదా
మనమునఁ జిక్కి యెంతయును ♦ మన్మథపాశవశంగతాత్ముఁడై. ౧౧ 1279

క. పరిచలితచిత్తుఁడై తగు, భరియింపఁ గలండె యట్టి ♦ పార్థివుఁ డనుజా!
[1]తురగపతిపుత్రి కైకయు, ధరాతలంబెల్లఁ బొంది ♦ తా నటమీఁదన్. ౧౨

క. తనసవతుల దుఃఖంబును, గనువారల కేమి మేలు ♦ గావించునొ? త [చ్చోన్
త్తనయుఁడు భరతుఁడు రక్షణ,మొనరింపఁడె యనెదవేమొ! ♦ యూహించిన
తే. యౌవరాజ్యము పొందిన♦యంతఁ గైక
పలుకురీతిని వర్తించు ♦ వాఁడు కాన

1 తురగపతిపుత్రి=అశ్వపతికూఁతురు.

నించుకేని స్మరింపఁ డెం♦తేని దుఃఖ
మొందు కౌసల్యను సుమిత్ర ♦ డెందమందు. ౧౪ 1282

క. నేనేగతి భరియింపఁగ, లానో యనఁ బోకుమా యి♦లాపతికరుణన్
జానుగ నొందెడి భరింపుము, కానవయే దాని నీవె ♦ కడు శ్రమపడుచున్. ౧౫

క. భరియింపుము కౌసల్యను, జరియింపుము నేను బలుకు♦చందంబున వే
సరియేమియుఁ బలుకకు సోదర! యని చెలువాఱఁ బలికి ♦ తమ్మునితోడన్.

*సీ. కైంకర్యమే నాకుఁ ♦ గావలయును గాని వేఱొండువలదని ♦ వేఁడఁబోదు
వేమొ ధర్మంబుల ♦ నెల్ల నెఱుంగుదు నాయాజ్ఞ చొప్పునఁ ♦ జేయుదేని
నీకు నాయందున్న ♦ నిర్మలభక్తిని గనఁబఱచినయట్లె ♦ గాఁ దగు మఱి
జనయిత్రి సేవించు♦టను మహాధర్మంబు గలుగును లక్ష్మణా! ♦ యలరి నీవు

ఆ. చేయుదేని యిట్లు ♦ క్షితిరఘుకులజులు
సంతసించువారు ♦ సాధువర్య!
కనుక నానిమిత్త ♦ మని యిట్లు చేయుమా
మనము లేకయున్న ♦ జనని పొగులు. ౧౬ 1285

క. ఆమెకు సుఖతతి యిచ్చుట, నేమాత్రము గలుగ దనియె; ♦ నిటు వాగ్విదుఁడా
రాముఁడు పల్కిన నవ్విధిఁ, గా మాటాడంగ నేర్పు♦గల లక్ష్మణుఁడున్. ౧౭

చ. తనమది కెక్కునట్లుగ ను♦దాహృతులెన్నియొ పల్కి చెప్పఁగా
విని రఘురాముఁ గాంచి యిల ♦ వీరుఁడ వీవు భవత్ప్రతాపముం
గని భయమంది నీజననిఁ ♦ గాచు మదంబను శ్రద్ధతోడ నీ
యనుజుఁడు సంశయం బిట ర♦వంతయుఁ గల్గదు చింతయేలొకో?. ౧౮ 1287

చ. [భరతుఁడు యౌవరాజ్యమున ♦ వర్తిలి దుష్టమనీష నేని గ
ర్వరతిని బొందియేని రఘు♦వర్య! భవజ్జననిన్ భరింపఁడే
గురుతరకోపమొంది యల ♦ క్రూరుని దుర్మతిఁ జంపువాఁడ నా
భరతునిపక్షమందుఁ దగు♦వారల నింకను ముజ్జగంబులన్. 1288

ఆ. ఇట్టి నాకుఁ గైక ♦ యేమాత్ర, మాకైక
యాజ్ఞ యనఁగ నెంత ♦ యార్యవర్య!
యిట్లు చేయువాఁడ ♦ నిందులకేమియు
సందియంబు లేదు ♦ సత్యమిద్ధి.] 1289

సీ. కౌసల్యకిల వేఱొ♦కరిపోషణం బేల యామెను సేవించు♦నట్టి వారు
వేలకొలందిని ♦ విశ్రుతగ్రామముల్ వడసియున్నారట్టి ♦ పడఁతి యిపుడు
ననుఁ బోంట్లు వేవురై♦నను గావఁదగుఁగాన సత్కీర్తిచేఁ దగు ♦ సాధ్వి తన్ను
నాతల్లిని సుమిత్ర ♦ నావంటివారల నెందఱనైనఁ దా♦నేభరించు

* ఏవం మమ చ తే భక్తిర్భవిష్యతి సుదర్శితా-అని మూలము. దీనివ్యాఖ్య ననుసరించి యీపద్యము వ్రాయఁబడినది. స్వకపోలకల్పనము లేదని యెఱుంగునది.

ఆ. నీదు పాదభక్తి ♦ నిరతము దగునను, ననుచరునిగఁ జేసి♦కొనుమ యిట్లు
చేయుదేని ధర్మ♦సిద్ధికి విపరీత,మేమి లేదు తలఁపు♦మా మనమున. ౨౧౪ 1290

క. నేనును గృతార్థుఁడ నగుదు, దానన్; ఫలమూలముల ని♦తాంతము శ్రద్ధం
బూని గొని తెచ్చియిచ్చుట,చే నీకుఁ బ్రయోజనంబు ♦ సిద్ధించుఁ జుమా!.

క. గురుఘాతుక మృగగణముం, బొరిపుచ్చన్ సశరచాప♦ముఁన్ మఱి మూలో
త్కరముఁ బెకలింప గుద్దలి, వరఫలములఁ దేరఁ బుటికె ♦ వరుసన్ గొనుచున్.

తే. నీకు ముందుగ మార్గంబు ♦ నేనుఁ జూపు
చును దగం బోవుచుందు, నీ♦కు ననిశమ్ము
ఫలములన్ మూలములఁ దప♦స్వులు గ్రహించు
తక్క వన్యంబులం దెచ్చి ♦ దమి నొసఁగుదు. ౨౮ 1293

ఉ. జానకిఁ గూడి నీవు రఘు♦సత్తమ! సంతసమొప్ప భూమిభృ
త్సానుతలంబులం దెపుడు ♦ సల్పుచు నుండఁగలావు. క్రీడలన్
జానుగ నీవు మేల్కొనినఁ ♦ జక్కఁగ నిద్రను బొందియున్న నే
నూనిన శ్రద్ధ నెల్లపను ♦ లొప్పుగఁ జేయుచు నుందునంచనన్. ౨౯ 1294

మ. అనుజన్ముం డిటు పల్క రాముఁడు ప్రమో♦దాయత్తచేతస్కుఁడై
యనుజా! లక్ష్మణ! యట్టులైనఁ జని మి♦త్రాళిం దమిం గాంచి వే
వనయాత్రన్ వచియించి యాజ్ఞఁగొని రా♦వచ్చున్ జలాధీశుఁడే
జనకక్ష్మాపతి యజ్ఞమం దొసఁగె స♦చ్చాపంబులన్ రెంటినిన్. ౨౬౪ 1295

తే. అవ్వి చూడఁగ భయదంబు ♦ లగుచునుండుఁ
గవచయుగ్మ మభేద్య, మ♦క్షయశరముల
నలరు తూణీరయుగ్మమ్ము ♦ హైమములగు
ఖడ్గయుగళంబు భాస్కరు♦కరణి మెఱయు. ౨౭ 1296

తే. వీని నెల్లను వరుణుఁ డ♦వ్వేళ నొసఁగెఁ
గాదె వీనిని బూజించి ♦ నేఁ దగ గురు
వౌ వసిష్ఠుని గేహంబు♦నందు నునిచి
తిని గదా ? నీవు పోయి, వా♦నిని గ్రహించి. ౨౯ 1297

క. చెలికాండ్రను వీడ్కొని రా,నలయును శీఘ్రంబె యనుచుఁ ♦ బలికిన విని య
త్యలఘుగతి నేగి లక్ష్మణుఁ, డల దివ్యమహాయుధముల ♦ నన్నిటిఁ గొనుచున్.

క. వనవాసనిశ్చితుండయి, తనమిత్రుల సమ్మతంబుఁ ♦ దానొంది వసి
ష్ఠుని యాజ్ఞనొంది రామునిఁ, గనవచ్చెన్ రాఘవుండు ♦ కడు ముద మొందన్.

క. క్షితిపతి శార్దూలకరా, ర్చితములు దివ్యములు వివిధ♦చిత్రసుమవిభూ
షితములు నగు నాయాయుధ, వితతుల రామునకుఁ జూపె ♦ వింతగ నంతన్.

క. ధనురాదికములఁ గొని తెచ్చిన లక్ష్మణుఁ గాంచి నృపతి♦శీతకిరణుఁ డి

ట్లనియెను జూచుచు నిలిచితి, ననుజా! వచ్చితివి వేళ ♦ యరుగకయుండన్.

సీ. ఓయి! పరంతపా! ♦ యీయెడ నినుఁగూడి మద్ద్రవ్యమంతయు ♦ క్ష్మాదివిజుల
కును దపస్వులకును ♦ గోరితి నీయంగ నిందుఁ బెద్దలయందు ♦ దృఢతమమగు
భక్తిచేఁ దగు విప్ర♦వర్యులు మఱి నన్నుఁ గొలిచియె జీవింపఁ ♦ గలుగువార
లెవ్వరున్నారొ వా♦రెల్లర కెప్పటికన్న నెక్కుడగ నీ ♦ నున్నవాఁడ

ఆ. క్షితిసురేజ్యు నవ్వ♦సిష్ఠపుత్త్రు సుయజ్ఞు
నార్యుఁ దోడి తెమ్ము ♦ యతని మఱియు
శిష్టులైన యట్టి ♦ క్షితిసురులను భక్తిఁ
గొలిచి వనికి నేగ♦వలయు మనము. ౩౫ 1302

ముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౩౨ - వ సర్గము.

—రాముఁడు దానములు సేయుట.—

చ. అన విని లక్ష్మణుండు శుభ♦మై ప్రియమై తనరారు రామునా
జ్ఞనుగొని వే సుయజ్ఞు శుభ♦సద్మముఁ జేరఁగఁబోయి యందున
గ్నిని బ్రణయించు గేహమునఁ ♦ గేవలభక్తి జపించుచున్న యా
తనిఁ గని మ్రొక్కి *మిత్త్ర! గుణ♦ధాముఁడు రాముఁడు కానకేగెడిన్. ౧

క. నీవిపుడు రామునింటికి,వే వచ్చి సుదుష్కరముగ ♦ వెలసెడుపని నేఁ
డావలచి చేయురాముని, భూవల్లభుఁ జూడు మనిన ♦ భూమీసురుఁడున్. ౨

సీ. సంధ్యనుపాసించి ♦ జవమున లక్ష్మణసహితుఁడై చని రమా♦సదనమట్లు
సిరిఁ దగు రాముమం♦దిరముఁ బ్రవేశించె నర్చింపఁబడినట్టి ♦ యగ్నికరణి
వెలయుచు వచ్చిన ♦ వేదవేత్తకు నాసుయజ్ఞునకా రాముఁ ♦ డతులభక్తి
నంజలి ఘటియించి ♦ యవనిజతోఁగూడి వలగొని హాటక♦విలసితముల

తే. నంగదంబుల సుందర♦మైన కుండ,లావళిని స్వర్ణసూత్త్రంబు ♦ లలర మెఱయు
రత్నహారంబులను రుచి♦రమ్ములైన, యట్టి కేయూరములనిచ్చె ♦ నతని కెలమి.

క. వలయంబుల రత్నాంచిత,ములగుచు మేలైన పెక్కు♦భూషణముల ను
జ్జ్వలమూర్తి కతనికిన్ మఱి, యలరుచు నొగి నిచ్చి రాముఁ♦డమ్మునితోడన్.

క. జనకసుతా ప్రేరణమున, ననియెం బ్రియమిత్త్ర! నీప్రి♦యాంగనకిన్ గో
రెను సీత హారమును మఱి, కనకపుసూత్త్రంబు, వానిఁ ♦ గైకొని ప్రీతిన్. ౫

క. చని నీ సాధ్వికి నిమ్మా, జనకజ వని కేగుఁగాన ♦ సంతసమున నీ
వనితకుఁ గా నీచేతికి, ఘనచిత్త్రాంగదములిచ్చుఁ ♦ గమనీయములన్. ౬ 1308

---

* మిత్త్రశబ్ద మిటఁ బ్రయోగింపఁబడుట "సఖేభ్యాగచ్ఛ" యను మూలము ననుసరించియే యని తెలియఁదగు.

తే. లలితకేయూరములనిచ్చు ♦ నెలమిఁ గొనుము
మంచిదుప్పటిపరుపున ♦ మించి వివిధ
మణివిభూషితమయి తగు ♦ మంచమును నొ
సంగఁ గోరెడి నీకును ♦ బొంగువేడ్క. ౯ 1309

క. మాతులుఁ డొసంగె నాకుఁ, ఖ్యాతము శత్రుంజయాంఖ్య ♦ గజముఁ దానిఁ
బ్రీతిని సహస్రనాగో,పేతంబుగ నిత్తు నీకు ♦ ద్విజవర! యిపుడే. ౧౦ 1310

చ. అని వచియింపఁగా విని సు♦యజ్ఞుఁడు వానిఁ బరిగ్రహించి రా
మునకు సుమిత్రపట్టికిని ♦ భూమితనూజకు మంగళాశిషం
బు నొసఁగె నంతటం బనులఁ ♦ బూని యొనర్చు ప్రియానుజన్మునిం
గని ప్రియవాది రాఘవుఁడు ♦ [1]కంజజుఁ డింద్రునిఁ బల్కురీతిగన్. ౧౧ 1311

తే. పలికె లక్ష్మణ! నీవేగి ♦ బ్రాహ్మణోత్తముల [2]నగస్త్యజుఁ గౌశిక♦మునితనూజుఁ
దోడుకొనివచ్చి రుచిరవ♦స్తువులనిచ్చి, పైరు జలమునవలె సల్ప♦వలయుఁబూజ.

సీ. మానధనా! వారి ♦ మఱియు ధేనుసహస్రముల రుచిరస్వర్ణ♦ములను రజత
ముల రత్నములధనం♦బుల నిచ్చి సంతృప్తమతులఁ గావింపుమా!♦క్షితిసురుండు
తైత్తిరీయాచార్యుఁ ♦ డుత్తమగుణుఁడు వేదవిదుండు బుధుఁడును♦దానునాదు
తల్లిని గొలుచుచుఁ ♦ దగుభంగి దీవించుచుండు నాతనికిని ♦ నురుమనమునఁ

ఆ. దృప్తి గలుగుదనుకఁ ♦ దెలిపట్టు వస్త్రముల్, యానములను సేవ♦కర్తలైన
దాసిజనులనొసఁగఁ♦దగుఁ, జిత్రరథుఁడన, సారథి యొకఁడలరు♦జనకసఖుఁడు.

క. చిరకాలము మనయింటన్, జరపినవాఁడొట మేటి ♦ చారుమణుల నం
బరధనసహస్రగోవుల, సురుచిరముల మఱియునుం బ♦శువులన్ మిగులన్. ౧౨

క. తనివిం బొందెడు నట్లా,తనికిమ్ము ముదంబు నొందఁ♦దగు నాతండున్
గను మల్లవారె కఠశా,ఖను జదివెడివారు మఱియుఁ ♦ గాలాపులునున్. ౧౩

ఆ. పెక్కుమంది గలరు ♦ పృథులపలాశదం,డములఁ దాల్చి యుందె ♦ మమతనున్న
వారు బ్రహ్మచారు ♦ లారయ వీరెల్ల, శ్రుతులఁ జదువువారు ♦ శుభగుణాఢ్య!.

సీ. కావున నింక నే♦కార్యముఁ జేయరు మఱియును గొంతసో♦మరులు రుచిర
ములగు స్వాద్వాహార♦ములఁ గోరుచుందురు వారిఁ బెద్దలు కూడ♦గారవించు
చుందురు కావున ♦ నొగి నెనుబదిబండ్లనిండ రత్నమ్ముల ♦ నిర్మలమగు
శాలిధాన్యము మోయఁ ♦ జాలిన నెద్దులవేయింటిఁ గృషివిధి ♦ చేయనర్హ

1 కంజజుఁడు=కంజమనఁగ మలము. దానినుండి వెలువడినవాఁడు బ్రహ్మ. 2 అగస్త్యజుని-అగస్త్యపుత్రుని అనియర్థము. మూలమున "అగస్త్యం కౌశికంచైవ" అనియున్నది. వ్యాఖ్యలో అగస్త్యపుత్రం అనియున్నది. ఇట్లే కౌశికం అన్నచోటను గ్రహించునది.

తే. ములగు నెల్ల నిన్నాటిని ♦ ముదముమీఱ
నిమ్ము; పాలును దధిఘృత♦మింకఁ గలుగు
వానిఁ గొఱకొక్క వేయింటి ♦ ధేనువుల నొ
సంగుమా వటువులునుఁ గౌ♦సల్యయింట. ౨౦॥ 1317

క. మెలఁగుదురా తరుణీమణిఁ, గొలుచుచు నా బ్రహ్మచారి♦కూటమునకు గో
వులవేయింటి నొకొక్కరి, కెలమి మెఱయనిమ్ము! వారి♦కింపగు దానన్. ౨౧॥

క. మన మొసఁగునట్టి దక్షిణఁ, గని యాకౌసల్యమదిని ♦ గరము ముదంబుం
గననగునట్టి తెఱంగున, ననుజా! పూజింపు భక్తి ♦ నార్యుల నెల్లన్. ౨౨॥

చ. అని పలుకంగ నంతట మ♦హాత్ముఁడు లక్ష్మణుఁ డన్నయాజ్ఞచొ
ప్పున ధరణీసురేంద్రులకు ♦ భూరితరంబగు తద్ధనంబు ని
చ్చెను ధనదుండొసంగునటు ♦ చేతులకింపుగ; నంత రాముఁడున్
దనయెదుటన్ వగం బొగిలి ♦ తద్దయు నేడ్వఁగలేక యార్తిచేన్. ౨౩॥ 1320

తే. బాష్పజలముల విడుచుచుఁ ♦ బాయలేక
యున్న తనయాశ్రితులఁ గాంచి ♦ యెన్ని వారి
జీవనమునకుఁ జాలిన ♦ దా విధి బహు
ధనము నొక్కొకనికి నిచ్చి ♦ తగ వచించె. ౨౪॥ 1321

క. నా గేహము నాతమ్ముని, దా గేహము శూన్యగృహము ♦ లట్లునుపక నా
యాగనునము దనుకన్ మీ, రీగతి రక్షింపవలయు ♦ నెల్లవిధములన్. ౨౫॥

క. అనియిట్లు దుఃఖమొందెడు, తన యుపజీవులకుఁ జెప్పి ♦ ధనరాశిపతిం
గని ధనముఁ దీసికొని ర,మ్మని యానతిచేసె నంత ♦ నాసేవకులున్. ౨౬॥

చ. చని ధనరాశిఁ దెచ్చి రది ♦ చాలమహత్తరమై కనుంగొనం
గను దగియుండె; నంత నర♦కాంతుఁడు లక్ష్మణుతోడఁగూడి యా
ధనమును బీదవారలగు ♦ ధాత్రిసురార్భకవృద్ధరాశికిం
గొనఁదగినంత నిచ్చెఁ దమ♦కోరికతీఱిన వారలేగినన్. ౨౭॥ 1324

*సీ. అంతట నొకవిప్రుఁ ♦ డరుదెంచె నాతఁడు గర్గవంశ్యుండు పిం♦గళతనుండు
త్రిజటనాముఁడు కానఁ ♦ దిరుగుచు ధాన్యపుగింజలనేఱి కు♦క్షిని భరించు
కొనుచుండు మఱియును ♦ గొడ్డలి గుద్దలి దోఁటియు ధరియించి♦యాటవికుగ
తినిగందమూలాదు♦లను ద్రవ్వికొనియుఁగాయలుపండ్లుగైకొని♦యతఁడు బ్రతుకు

ఆ. నతనిభార్య భవ్య ♦ యౌవనవతి బీద,తనము గుందఁజేయ ♦ వనటనొంది
బాలకులుగ నున్న♦వారలఁ దనయులఁ, గొని నిజేశుఁ గానఁ♦జని వచించె.

* అయోధ్యలో నింతబీదబ్రాహ్మణుఁ డుండునా యని శంకవలదు. ఈతఁ డయాచకుఁడు. ఉంఛవృత్తిచే జీవించువాఁడు. భార్య త్వరపెట్టి విధిలేక బాలురఁ బోషింపఁజాలక రామునొద్దకు భుక్తిముక్తులు రెండును గలవని యెఱింగియే పోయెనని తెలియవలయు.

క. నామాటను విను గొడ్డలి, నేమూలనొ పాఱవైచి ♦ యీ గ్రుద్దలి నీ
భూమిన్ స్థాపించుచు నా, రాముని ధర్మజ్ఞు దీన♦రంజకుఁ గనుమా. ౩౧ 1326

క. ఘనుఁడతఁడు గాన నిన్నుం, గనినంత నొసంగు ననినఁ ♦ గాంతాసూక్తిన్
విని [1]కప్పుకొన నవస్త్రం,బును శాటిని గప్పుకొని ప్ర♦భూతముదమునన్. ౩౨

తే. చనియె రాముని గృహమందు ♦ చక్కటికిని
జనసమూహంబునందు నా♦ఘనుఁడు భృగువు
భంగి నంగిరసుని మాడ్కి ♦ బ్రహ్మతేజ
మున వెలుంగుట నాగేహ♦మును జొరంగ. ౩౩ 1328

సీ. అయిదవ కక్ష్యకు ♦ నాతఁడు పోయిన దనుక వారింపరా♦తని నెవరును
గాన రామునిఁ జేరఁ♦గాఁ జని త్రిజటుండు రాజపుత్రా! నీవు ♦ రమ్యయశుఁడ
వై యలరారెద ♦ వవనీస్థలిన్ ధనహీనుఁడఁ బెక్కండ్రు ♦ సూనులు గల
వాఁడ నే నుంఛైక♦వర్తనమున నింతకాలంబు బ్రతికితిఁ ♦ గరుణ నన్నుఁ

తే. గనుఁగొనుము ! యంచుఁ బ్రార్థింప ♦ ఘనుని నతని
హాస్యయుక్తాస్యుఁడై పల్కె ♦ నార్య పెక్కు
వేల ధేనువులున్నవి ♦ వేయిమాత్ర
మీ యఁగోర నన్నింటి నీ♦కిత్తు నేను. ౩౪ 1329

క. ధరణీసుర! దండము నీ, కరమున ధరియించి విసరఁ♦గా నది యెందున్
ధరణిఁ బడు నంతదూరము, నరసి యటం బట్టగలిగి ♦ నన్నిటి నిత్తున్. ౩౫

చ. అన విని సత్వరంబుగ ధ♦రామరుఁ డాతురబుద్ధి వస్త్రముం
దనమొలకుం బిగించుకొని ♦ దండముఁ ద్రిప్పి స్వశక్తి యంతయుం
గనఁబడునంత పూన్కి వడి♦గాఁ దగవైచెను దత్కరచ్యుతిం
గని యలదండమల్లె చని ♦ గాఢముదంబున నెల్లరుం గనన్. ౩౬ 1331

క. సరయువు నవ్వలిదగు న,ద్ధరణిని గోవ్రజము సట్టె ♦ దాఁటి వృషముచెం
త రయమునం బడియెన్ ధ,ర్మరతిం గని వెలయు విమల♦మతి రాముండున్.

ఆ. త్రిజటుఁ గౌఁగిలించి ♦ దివ్యనదీతీర,మందు నతని దండ♦మెందుఁ బడియె
నచటనుండి యప్పు♦డావుల నన్నింటి, నతని యాశ్రమమున ♦ కతిముదమున.

సీ. గోపాలకుల నెల్లఁ ♦ గొనిపోయి తోలంగ నానతిచేయ వా♦రట్లు చేసి
రంత నారాఘవుం♦డా గార్గ్య గనుఁగొని యనునయించుచుఁ బల్కె ♦ నార్యవర్య!
క్రోధంబు నీవోంప♦కుమ పరిహాసంబు గా నిట్లు చేసితిఁ♦గాని వేఱు
కాదు; నీ తేజంబు ♦ కడు నసమానంబుగా వెల్గుటం జక్కఁ♦గాఁ దెలియఁగఁ

తే. జిత్తమునఁ గోరి యీపనిఁ ♦ జెప్పినాఁడ
నింక నేమేని గోరంగ ♦ నెంచువాఁడ

---

1 శాటీ మాచ్ఛాద్య దుశ్ఛదామ్-అని మూలము.

వేని నాయభిలాషను ♦ మాన కడుగు
మిచ్చెదం బరిహాసమిం♦దేమి లేదు. ౩౧౪ 1334

మ. వినుమీ! సత్యముగా వచింతు నిట నో♦విప్రోత్తమా! నీకు నా
ధనమం దర్థము లేక కోరుటకు స♦త్త్వంబున్నదీ మాట న
మ్మి నితాంతప్రియవస్తువుం గొనుమ భూ♦మి న్నాధనం బంతయున్
ఘనభూమీదివిజార్థమే పొనుపుగాఁ♦గం గూర్చ నయ్యెంగదా. ౩౨ 1335

క. మీవంటివారలందిది, యే వినియోగింపఁబడున♦యేని ప్రమోదం
బావహిలఁ జేసి కీర్తిద, మై విలసిలు నార్జితార్థ ♦ మపుడు ఫలించున్. ౩౨౪

ఉ. నాతిని గూడి నా త్రిజట♦నామ మహాముని గోసమూహమున్
బ్రీతిగఁ బుచ్చుకొంచు మది ♦ విస్తృతతృప్తిని బొంది యంతకే
ఖ్యాతయశోబలంబులు సు♦ఖంబును మోదముఁ గల్గుఁగాక యం
చాతఁడు రామచంద్రునకు ♦ నాశిషముల్ దగ నిచ్చె నంతటన్. ౩౩౪ 1337

సీ. రాముఁడెంతయు ధర్మ♦రతిని బాయక బలంబున సేకరించిన ♦ ధనము నెల్లఁ
బరిపూర్ణమతితోడ ♦ వాంఛానుసారంబు గాఁగ మిత్రులకెల్ల ♦ గౌరవమున
వారివారికిఁ దగు ♦ భంగి సమ్మాన వాక్యంబులు పల్కుచు ♦ నప్పుడొసఁగ
నానతియిచ్చె; బ్రా♦హ్మణుఁడును మిత్రుండు భృత్యుండు మఱియును♦బిచ్చమెత్తి
కొని జీవనము సేయు ♦ మనుసంభవుఁడు నింక నెవ్వఁడేగాని యా♦నృపకుమా [రు
తే. వలనఁ దగినట్లు సమ్మాన♦వాక్యదాన
ములను సంతృప్తిఁ జక్కఁగఁ ♦ బొందనట్టి
మనుజుఁ డొకఁడైన లేఁడయ్యెఁ ♦ గనుక నవ్వి
యించుకంతయుఁ గొఱఁతలే♦కే చెలంగె. ౩౫౪ 1338

ముప్పదిరెండవ సర్గము సంపూర్ణము.

## 33 - వ సర్గము.

సీతాలక్ష్మణులం దోడ్కొని పోవ నసుజ్ఞ వేఁడ రాముఁడు తండ్రికడకుఁ బోవుట.

చ. జనకమహీశనందనయు ♦ క్ష్మాపతి పుత్రులు రామలక్ష్మణుల్
ధనము యథేష్టరీతి ద్విజ♦తల్లజులుల్లములందుఁ బొంగ ని
చ్చిన పిదపన్ రఘూద్వహులు ♦ సీతను దోడ్కొని తండ్రిఁ గానఁగాఁ
జని రపుడా కుమారకులు ♦ చందనపంకవిలిప్తదేహులై. ౧ 1339

తే. పూలదండలు చుట్టి యెం♦తో లలితము
గాఁగఁ గనుపట్టు పరిమళ ♦ గంధమలఁది
గ్రాలఁ జేసినచాప ఖ♦డ్గప్రముఖము
లను ధరించిరి యవ్వీయు ♦ ఘనరుచులను. ౧౪ 1340

క. తనరారి తేటి చూడం, గను రానివి యగుచుఁ జెంత ♦ త్స్తానుతయుంటన్
ఘనముగ వెలిఁగెను; హర్మ్యము, లను బ్రాసాదముల మిద్దె♦లన్ జనులెల్లన్.

సీ. మార్గంబులెల్లను ♦ దుర్గమములు గాఁగ నుండుట నెక్కి- యెం♦తో మనములు
సంతుష్టి నొంవఁగాఁ ♦ జాలకయుండఁగ దీనులై చూచుచుఁ ♦ దృప్తిలేక
యుండిరి; శ్రీరాముఁ ♦ డొప్పగు ఛత్త్రంబు లేకయే కాల్నడ ♦ నీకరణిని
బోవుటఁ గని శోక♦పూరితచిత్తులై జనులెల్ల బహుభంగు♦లను బలికిరి

ఆ. యేకుమారరత్న ♦ మేగుచుండఁగఁ జతు
రంగబలము వెంబ♦డిం గదలునో
యట్టి రాముఁ డొకఁడె ♦ యరుగ లక్ష్మణుఁడును
జానకియును వెంటఁ ♦ జనెదరదిగో ?. ౬ 1342

క. కోరినవారలకోర్కుల, నేరుపునం దీర్పఁజాలి ♦ యెల్లెడ సంప
త్సారము నెఱింగి వెలసెడు, నీరాముం డిట్టి ప్రోడ♦యే యుర్విని టన్. ౬౫

క. గురుశుశ్రూషాధర్మో, త్కరమున గౌరవము మిగులఁ ♦ గలవాఁడగుటన్
గురుశపథ మనృతమగుటకుఁ, గరమిష్టము నొందకుండు♦గద యిపుడహహా.

క. సురపథమున స్వేచ్ఛారతిఁ, దిరిగెడు భూతములకే న♦దృశ్యయయిన యీ
తరుణిం బురమార్గంబులఁ, బరికింపుచు నున్నవారు ♦ పౌరులు పెలుచన్. ౮

తే. అంగరాగంబునకు న్వర్హ♦యగుచు రక్త
చందనముఁ బూసికొను భూమి♦జాతనింక
వర్షశీతోష్ణములు దేహ♦వర్ణమెల్ల
భేదతం గనఁ జేయును ♦ వేగ యకట. ౯ 1346

క. నరనాథుఁడు దశరథుఁ డి, త్తరుణమునఁ బిశాచమట్టె ♦ తనుఁ బొందిన య
ట్లరయక పలికెడు నిశ్చయ, మరయుఁడి యటు లేకయున్న♦నాత్మజుఁ బ్రియునిన్.

క. వనమునకుఁ బంపఁగోరునె, తనయుఁడు గుణహీనుఁడైనఁ ♦ దానడవికిఁ బొ
మ్మని చెప్పునెట్లు? వృత్తం,బుననే యీజగము గెలిచెఁ♦బో యితఁడౌరా !.

క. దానాదినిఖిలగుణసం, తానము మాటను వచింపఁ ♦ దరమే యిట్లీ
సూనునిఁ బంపుట యెట్లో, మానవపతియే యెఱుంగు ♦ మాటలికేలా ?.

ఆ. హింసచేయకుంట ♦ యెంతయుఁ గరుణయు
శమము విద్య శీల ♦ దమములనెడు
నాఱుగుణము లివ్వి ♦ యారాముఁ బురుషో త్త
ముని సలంకరించి ♦ తనరుచుండు. ౧౨ 1350

సీ. ఈయాఱుగుణముల ♦ నెసఁగు శ్రీరాముని కించుక హింసయే ♦ నిపుడు చేయు
టను గ్రీష్మకాలంబు♦నను జలమింకఁగా జలజంతువులు కల♦విలము గనెడు

గతిఁ బ్రజలందఱుఁ ♦ గడు భీతులే వైరి జగదధిపతియయి ♦ పొగడఁబడెడు
నీరామునకు వని♦ కేగుటయను పీడగలుగ, మూలము చెడఁ♦గాఁ బ్రసూన

ఆ. సత్ఫలములతోడ ♦ [1]శాఖ, క్షయంబందు, నట్లు లోకమెల్ల ♦ నార్తినొందె
ధర్మసారుఁ డితఁడు ♦ నిర్మలతేజస్వి, కనుకఁ బ్రాణివృక్ష♦మునకు వేఱు. ౧౮౪

క. జను లితరు లా మహాద్రుమ,మునకుం బత్రములు పండ్లుఁ ♦ బూవులు శాఖల్
కనుకం బత్నిబాంధవు,లను గూడియె మనము వేగ♦లక్ష్మణుఁడు వలెన్. ౧౯౪

క. శ్రీరాముఁ డరుగఁ బూనిన, దారిం బట్టుకొని పోవు♦దము వెంటనె; క్షే
త్రారామగృహములన్ విడి, యారాముని ధర్మచిత్తు ♦ నిపుడందఱమున్.

ఆ. ఏకదుఃఖసుఖుల♦మే యయిపోవుద, మిట్లు మనము వనికి ♦ నిండ్లు విడిచి
పోవ నంతమీఁద ♦ భూరినిక్షేపముల్, పెల్లగింపఁ బడి య♦వెల్లఁ బోవు. ౧౭౪

సీ. ముంగిళ్లు చెడిపోవు ♦ ముందు సంపాదించి యుంచిన ధాన్యముల్♦చంచలించు
శయ్యాసనాదిక ♦ సర్వపదార్థముల్ కొనిపోఁబడు, ధూళు♦లను గృహంబు
లెల్ల నిండును మఱి ♦ గృహదేవతలు వాని విడనాడి పోదు రి♦వ్విధిని సొంపు
చెడియున్నగృహములఁ♦జేరిమూషకములుబిలములఁద్రవ్విస్వే♦చ్ఛలనుదిరుగుఁ

తే. జిమ్మి కలయంపి చల్లుట ♦ చేయఁబడవు
వంటయే లేమిఁ గప్పుల♦పైన ధూమ
ములు కనంబడకుండును ♦ బలులు యజ్ఞ
మంత్రరవజపములును హో♦మములు చెడును. ౨౦ 1355

తే. క్షామకాలంబునన్ వ్యథఁ ♦ గన్నవాని
భంగిఁ గనఁబడి పగిలిన ♦ భాజనముల
నొప్పు దప్పిన మనయిండ్లఁ ♦ దప్పకుండఁ
గైక చేకొని సుఖముండుఁ♦గాక యింక. ౨౧ 1356

క. ఏవనమునకున్ రాముఁడు, పోవునొ యదియౌనుగాక ♦ పురము మనము నీ
పావనమూర్తియు విడిచియె, పోవఁగ వనమౌనుగాక ♦ పురమిది యింకన్. ౨౨

సీ. మనము రామునితోడ ♦ వనమును జేరంగ భయపడి యందున్న♦పన్నగములు
బిలముల నార్తిమె ♦ విడనాడిపోవును బక్షులు మృగములు ♦ పర్వతముల
సానువులనుమాని♦చను,నేనుఁగులుసింహములు వనములఁబాసి♦యలఘుగతులఁ
బాఱిపోవును, ఫణి♦పక్ష్యాదులీరీతి మనమేగి చేరిన ♦ వనములను వ

తే. దలి జవంబునఁ జనిః నితాం♦తవ్యధలను
మనము విడనాడినట్టి యా♦ఘనపురంబు
నందుఁ జక్కఁ బ్రవేశించి ♦ డెందమలర
నింక నివసించుఁగాక సం♦తృప్తి మీఱ. ౨౩౪ 1358

---

[1] శాఖి=వృక్షము.

క. మనమరిగిన పిదపఁ దృణం,బును మాంసముఁ బండ్లు దినెడి♦పూతమృగములన్
బెనుపులులుఁ బక్షులును నిం,కను గలవి వసించు, నిందుఁ;♦గైకయు నెలమిన్.

చ. తనప్రియపుత్రబంధువు, లు♦దారత నుందురుగాక; రాముఁడున్
మనమును గానలోన నస♦మానసుఖంబులఁ బొందియుండ; మిం
కననుచు నిట్లుగాఁ బ్రజలు ♦ క్రందుగఁ గూడి వచించుచుండఁగా
వినియును జిత్తమందు నొక♦వింతయు మార్పును బొందఁడయ్యెఁ దాన్. ౨౬

క. నిరుపమ ధర్మాత్ముఁడు మద, కరిగమనము గల్గు భూమి♦కాంతకుమారుం
డరిగి యట దూరమున శం,కరపర్వతశిఖరమట్లు♦గా శుభ్రంబై. ౨౭ 1361

క. తనరారు తండ్రిసౌధముఁ, గని చెంతకు నరిగె నందుఁ ♦ గడువీరులుగాఁ
గనఁబడుచు వినీతులు నౌ, మనుజులు కాపుండి రట్టి ♦ మానితగృహమున్.

తే. తాను సౌమిత్రియును భూమి♦తనయయును బ్ర
వేశమొగిఁ జేసి దీనుఁడై ♦ పృథ్వీపతికి
నించుకంత దూరమ్మున ♦ నిలను గనుచు
నున్న యలసుమంత్రునిఁ జూచె ♦ నుద్యమమున. ౨౮ 1363

చ. జనపతి యాజ్ఞ చేయఁ జను ♦ శాస్త్రహితంబుగ నంచుఁ బూని యా
తనిఁ గనఁగోరి మార్గమునఁ ♦ దన్నుఁ గనుంగొని పౌరులెల్ల నిం
తనివచియింపరాని వ్యథ♦నందినఁ దాను రవంతయేని చిం
తను గనకుండియే చనియె ♦ నవ్వుమొగంబునఁ దోఁచునట్లుగన్. ౨౯ 1364

సీ. దశరథుతనయుండు ♦ ధైర్యశాలి మహాత్ముఁడునగు శ్రీరాముండు ♦ వనికిఁ బోవ
నెంచి మహీశ్వరుం ♦ డేగుమా యడవికి నని చెప్పినది మొద♦లార్తుఁడగుచు
నున్న సుమంత్రుని ♦ నురుకరుణాచిత్తుఁ గని తనరాకను ♦ జనకునకును
జెప్ప వానిని బ్రతీ♦క్షించుచు నిలిచి ధర్మాత్ముఁ డౌటను దండ్రి♦యాజ్ఞ యట్లె
ఆ. యడవి కరుగ నిశ్చ♦యముచేసి యామంత్రిఁ,గాంచి తాను వచ్చి♦కాచియున్న
యట్లు రాజవరున ♦ కనువదింపుము, యని,పలికె నతనితోడ ♦ లలితభంగి. ౩౦

ముప్పదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౪ - వ సర్గము.

రాముఁడు మరలఁ దండ్రికడ సెలవు పుచ్చుకొనుట.

*చ. సరసిజపత్రనేత్రుఁడును ♦ శ్యామలదేహుఁడు సూక్ష్మమధ్యసుం
దరుఁడును బూజ్యుఁడౌ దశర♦థప్రియసూనుఁడు సూతుతోడ వే

* తతః కమలపత్రాక్షః శ్యామో నిరుదరో మహాన్-అనిమూలము. దీని ననుసరించియే యిందు విశేషణములు చేర్పఁబడినవి.

యరిగి వచింపుమా యనుచు ♦ నాడిన రాముని యాజ్ఞ రీతి దు
ర్భరమగు చింతచేఁ గలఁగఁ♦బాఱిన యింద్రియముల్ గనంబడన్. ౧ 136

తే. లోపలికిఁ బోయి నిట్టూర్పు♦లును విరతియె
లేకయుండఁగ విడుచుచు ♦ లీనమూర్తి
నున్నరాజు సుమంత్రుండు ♦ గన్నులశ్రు
పూర్ణములుగాఁగఁ గనియె; న♦ప్పుడు నృపతియు. ౨ 1367

ఆ. నివురు గప్పినట్టి ♦ నిప్పుపోలికఁ దమో, గ్రస్తుఁడైన భాను♦గతి నవాప్త
జలతటాకమట్లు ♦ వెలవెలపాఱంగ, నార్తుఁడగుచు సూతుఁ♦డచటఁ జూచి. ౩

క. పరమాకులచిత్తుండయి, విరతియె లేకుండ రాముఁ ♦ బేర్కొనుచు నిరం
తరచింత నొంది యున్న ద,శరథునిఁ గని ప్రాజ్ఞతముఁడు ♦ సారథియంతన్. ౪

చ. కరయుగ మొగ్గి సన్నిధికిఁ ♦ గ్రన్ననఁ బోయి జయంబు నొందుమీ
ధరణిప! యంచు దీవనలఁ ♦ దద్దయు నిచ్చి భయంబు నొందుటన్
సురుచిరవాక్కు లత్తఱిని ♦ సొంపును దక్కి తడంబడన్ మనో
హరముగ మెల్లఁగాఁ బలికె ♦ నార్య! వినందగు నాదుపల్కులన్. ౫ 1370

సీ. పురుషలలాముండు ♦ పుత్రుండు శ్రీరాముఁ డాత్మధనం బెల్ల ♦ నవనిసురుల
కును బరిజనముల♦కు నొసంగి నినుఁ జూడ ద్వారమ్మునందున్న♦వాఁడు; నీకు
శుభమగుఁగాత మా♦శూరున కిప్పుడు దర్శనమ్మొసఁగు మా♦తండు తనదు
[1]స్నిగ్ధబృందమునొద్ద ♦ సెలవంది నీయొద్ద సెలవందుటకు నిటఁ ♦ జేరి నిన్నుఁ

తే. గనుఁగొనం గోరుచున్నాఁడు ♦ క్ష్మాపతీశ!
[2]రశ్మిసంయుతుఁడౌ గ్రహ♦రాజు మాడ్కి
నఖిలరాజగుణంబుల ♦ నలరి యిప్పు
డడవి కేగఁగ నున్నట్టి ♦ యతనిఁ గనుమ!. ౬ 1371

క. [3]ఋతవాది ధర్మసంయుత, మతి యబ్ధిగభీరుఁ డమర♦మార్గముగతి వి
చ్యుతపంకుఁ డన్మహీపతి, యతనిం గని యోసుమంత్ర! ♦ యతివేగమునన్. ౭

ఆ. ఇప్పు డిచటనున్న ♦ యెల్లర నాభార్య
లను గడంకఁ దోడు♦కొనుచు రమ్ము
దారయుతుఁడనగుచు ♦ ధార్మికు నారాముఁ
గనుఁగొనంగఁ దలఁతు ♦ ననిన నతఁడు. ౧౦ 1373

1 స్నిగ్ధబృందము=మిత్రులగుంపు. 2 ఇట్లు రాముగుణము లిట వర్ణించుట యౌవరాజ్యపదమునకుఁ దగినరాము నడవులకుఁ బంపుచున్నావే యని సుమంత్రుఁడు తనమనోవ్యథను వెలిపుచ్చుకొనుట సూచితమని గ్రహించునది 3 ఈవిశేషణములు దశరథునకుఁ గల్పించుట అతనికిఁ దెలియక కాదనియు, సత్యపాశబద్ధుఁడై యాయకార్యమున కంగీకరించెననియు వాల్మీకిభావమని గ్రహింపవలయు.

సీ. అంతఃపురంబులఁ ♦ నప్పుడు గడచి వే చని రాజపత్నులఁ ♦ గని నరపతి
యమ్మలారా! మిమ్ము ♦ నందఱఁ బిలిచెడు నతివేగముగఁ బోవ♦నౌను జాగు
వలదన రాజాజ్ఞ ♦ గల సుమంత్రునిపల్కు లాలించి రాజాజ్ఞ ♦ నౌదలలను
ధరియించి నృపతి మం♦దిరమున కేగిరి మున్నూటయెనుబండ్రు ♦ సన్నుతవ్ర
తే. తలును నగు వారఁ; లారాముఁ ♦ డల నృపాజ్ఞ
నడవి కేగుటకై యేడ్చి ♦ యరుణనేత్ర
లగుచుఁ గౌసల్యతోఁగూడి ♦ యల్ల నల్ల
న నట కరిగిరి; వారు వ♦చ్చిన నృపుండు. ౧౩ 1374

క. ఓయి సుమంత్రా! రాముని, నాయనుఁగుఁ గుమారుఁ బిలువు♦మన నాతండుఁ
వే యరిగి వారిఁ దోడ్కొని, యాయవనీపాభిముఖుఁడు♦నై చనె నంతన్. ౧౪

క. నరపతి దూరమునుండియె, కరములు జోడించుకొనుచుఁ ♦ గడువినయముతో
నరుదెంచు పుత్త్రుఁ గని ని,ర్భరదుఃఖమునొంది తనదు ♦ రమణులతోడన్.

ఆ. ఆసనమున నుండి ♦ యపుడు చివుక్కున
లేచె నట్లు నృపతి ♦ లేచి రాముఁ
గనుచు వేగ యెదురుఁ♦గాఁ బరుగెత్తెను
గాని బహుళదుఃఖ♦కలితుఁ డగుట! ౧౬ 1377

క. తనయునిఁ జేరఁగనే లే,క నడుమనే మూర్ఛమునిఁగి ♦ క్షమపైఁ బడియెన్;
ఘనదుఃఖమొంది తద్వశ,మునఁ జిక్కి విసంజ్ఞుఁడైన ♦ ముదుసలిఁ దండ్రిన్.

క. కనుఁగొనుచు మహారథుఁడై, తన రెడు రాముండు నతని♦తమ్ముండు జవం
బున లేవనెత్తఁ బాఱిరి, జనపతి పరిసరమున కల♦సౌధమునందున్. ౧౮

క. ధరణీశుని పత్నులు వే,వురు భూషణరవములొప్ప ♦ బోరున నయ్యో!
వరమతి రాముం డడవికి, నరుగు నటంచేడ్చి, రప్పు ♦ డత్యంతార్తిన్. ౧౯

తే. రామలక్ష్మణ భూసుత ♦ లామహీశుఁ
గరములం ద్రుచ్చి యెత్తి ని♦కామదుఃఖ
మున మునుంగుచు నాసనం♦బునను గూరు
చుండఁ బెట్టిరి; యొక్కము♦హూర్తమునకు. ౨౦ 1381

క. ఉపగతసంజ్ఞుండౌ ధర,ణిపతిని శోకాబ్ధిమగ్ను♦నిం గని కైమో
డుపు వెలయ రాముఁ డిట్లను, [1]విపులేశా! నీవు మాకు ♦ విభుఁడవు సుమ్మా!.

క. నీయనుమతి వేఁడెద ని,మ్మా! యనుమతి నేను దండ♦కాటవి కరుగం
గా యుష్మదంతికంబున, నీయెడ సెలవందఁగోరి ♦ యే వచ్చితిఁ జూ!. ౨౨

క. మంగళదృష్టిని నన్నుఁ ద,గం గనుమా! లక్ష్మణుండుఁ ♦ గానకు నాతో

1 విపులేశా=భూపాలా.

షం గదలు సీతయును వచ్చుం గావున సెలవు కరుణ ♦ శోభిలనిమ్మా!. ౨౨

సీ. తగినట్లుగా యథా♦ర్థములగు కారణంబుల నెన్నొ చెప్పితి ♦ నిలుపవలయు
వీరలనని; యెంత ♦ వారించినను వీర లిచ్చట నిలువంగ ♦ నిచ్చగింప
రైరి మాకును నీవె ♦ గౌరవప్రదుఁడవు గావున శోకంబుఁ ♦ గాంచకింక
నాకు లక్ష్మణునకు ♦ నీకోడలికిఁ గూడ బ్రహ్మాయుఁ బ్రజలకు♦వలె ననుజ్ఞ
ఆ. నొసఁగుమా యటన్న ♦ నుర్వీశుఁ డతివేగ
మున వనంబునకును ♦ జని వసింపఁ
దనయనుజ్ఞఁ గాంచఁ♦గను వేచియున్నట్టి
రాము సుగుణసంఘ♦ధాముఁ గాంచి. ౨౩ 1385

చ. కనులను నీరు కాలువలు ♦ గట్టఁగ నిట్లని పల్కె రాఘవా!
వనితకు నేవరంబిడుట ♦ వంచితచిత్తుఁడ నైతి నిప్డు నీ
వును నను నిగ్రహించి యిదె ♦ భూపతి వియ్యెడఁ గ మ్మయోధ్యకున్
జను నిటు చేయ; నన్న విని ♦ చక్కఁగ ధర్మవిదుండు గావునన్. ౨౬ 1386

చ. జనకునిఁ గాంచి యిట్లనియెఁ ♦ జయ్యనఁ బ్రాంజలియై మనోజ్ఞవా
క్యనిచయచాతురిం దనరు♦నట్టి రఘూద్వహుఁడో మహీశ! భూ
మిని బహువత్సరంబులు సు♦మీ! పరిపాలన మొప్పఁ జేసి తీ
వె నిను నసత్యవంతునిగ ♦ నిప్పుడు చేయఁగ నెంచ ధర్మమే. ౨౭ 1387

క. నేనును సత్యముఁ దప్పం, గా నినుఁ జేయుటయుఁ బాడి♦గాదు మహాత్మా!
కానం గానలకరిగెద, నే నటఁ బదునాలుగేండ్లు ♦ నిలిచి సుఖముగాన్.

తే. ప్రతిన తీఱిన తరువాత ♦ వచ్చి యిచట
నాశ్రయించెద మీపాద♦నాంఘ్రియుగము
ననిన దృఢసత్యపాశబ♦ద్ధాత్ముఁ డగుట
దశరథుం డేడ్చె దీనుఁడై ♦ తనయుఁ గాంచి. ౨౯ 1389

సీ. ఏమియుఁ జెప్పఁగాఁ ♦ బోయిన నోరాడ కప్పుడె కైక ర♦హస్యముగ భ
వత్కుమారుని నిప్డు ♦ వనమునకుం బంపుమని పురికొల్పఁ బ్రి♦యాత్మజన్ముఁ
గాంచి యోనాయనా! ♦ కానకుఁ బొమ్ము దానం బరలోకంబు♦నం గలిగెడి
ఫలము నైహిక వర♦ఫలమున మరల నీపురికి నీరాకయు ♦ నరిగఁ గలుగుఁ
ఆ. గాక; సుఖములొసఁగఁ♦గాఁ దగి యే జంతు
భయము లేకయున్న ♦ పథమునందె
పొమ్ము; రఘుకులాబ్ధి ♦ పూర్ణసోముఁడవు స
త్యాత్మకుఁడవు నీవె ♦ యమలమతివి. ౩౦ 1390

క. ఇట్టిఁడవు కాన నీకుం, బుట్టిన యీవననివాస♦బుద్ధి మరలుపన్
ఎట్టును సాధ్యము గా దిఁకఁ, బట్టీ! నామాటయొకటి ♦ వలయు వినంగన్.

తే. ఏవిధంబున నేఁ గాని ♦ యీ దినమున
మాత్ర మరుగంగఁ దగదిదె ♦ రాత్రి వచ్చు
సమయ మయ్యెను గనుక ని♦శను మదంతి
కమునఁ గడుపుము యటులైనఁ ♦ గడుము దమున. ౩౨ 1392

క. దిన మొకటైన నిన్నుం, గనుచుఁ సుఖరీతి నుందుఁ ♦ గానఁ గుమారా!
జననిని నన్నుం గనుచుం, జను నీనిశ నిచటఁ గడుపఁ ♦ జక్కఁగఁ దండ్రీ!.

సీ. నీకోరికలఁ దీర్చి ♦ నిన్నుఁ దృప్తింబొందఁగాఁ జేయుదుము రేపు ♦ కాలమందె
పయనంబు చేయఁగా♦వచ్చుఁ బుత్రా! నాకుఁబరలోకహితము నీ♦వరసిప్రియము
లగువానిని ద్యజించి ♦ యటవి నిర్జన మని యెఱిఁగియుఁ బోవంగ♦నిష్టపడితి
విట్టి కృత్యంబుల ♦ నెట్టివారికి నైనఁ జేయఁదరము గాదు ♦ చేయఁబూని
తే. తివి గదా నిన్నుఁ గానల♦ను వసియింపఁ
బంపు టిష్టముగాదు నా♦స్వాంతమునకు
సత్యమును జూపి చేసెద ♦ శపథ మేను
వినుము! చెప్పెద నిందలి♦విషయ మెల్ల. ౩౪ 1394

ఆ. నివుఱు గప్పినట్టి ♦ నిప్పువలెం దన, మనసునఁ గల క్రౌర్య♦మును దెలుపక
కప్పియున్న దుష్ట♦కామిని చలియింపఁ జేసి నామనంబు ♦ మోసపుచ్చె ౩౬

క. ఆమోసమ్మును గూడన్, నీమదిని దలంప కిపుడు ♦ నిర్మలవృత్తం
బీమాడ్కిఁ బాడుసేసిన, యీమగువ వచించినట్టు ♦ లెల్లన్ వినుచున్. ౩౭

క. దాని నొనఁగూర్చి తీర్పం, గా నెంచితి వద్భుతంబు ♦ గాదే రామా!
యీ నీసుగుణము స్తుత్యము, గానగు; జ్యేష్ఠాత్మజుఁడవు ♦ గావున నీకున్.

క. జనకు ననుఁ జెప్పి యటు చేయని వానిగఁ జేయకయె య♦థార్థవచనుఁ జే
యనె కోరుట మంచిదియే, యని పలికిన నార్తమూర్తి♦యగు జనకుఁడిటుల్.

క. కనుల శ్రువుల మునుంగన్, దనుఁ గాంచి వచింపఁగ విని ♦ తమ్ముఁడుఁ దానున్
మనములు చింతలఁ బొగులఁగ, జనకునితోఁ బలికె రామ♦చంద్రుఁడు భక్తిన్.

ఉ. కోరికలెల్ల నిప్పు డొనఁ♦గూరఁగఁ జేయుచుఁ దృప్తిఁగూర్తుమం
చీరు వచించినారు సరి♦యే తమరిచ్చిన సద్గుణాఢ్యమా
చారుత రేష్టసంతతిని ♦ జాలఁగఁ బొందెద నైన రేపు నా
కే రొనఁగం దలంతురొకో? ♦ యెన్నఁగ వ్యర్థమె గా యిదంతయున్. ౩౯

తే. వీనికెల్లను మాఱుగ ♦ నే నవతలి
కేగుటయె మంచి దద్దాని♦నేఁ దలంతు
జనపదాన్వితమయి మహా♦జనయుతమయి
ధనము ధాన్యంబు గలుగు ని♦ద్ధర వదలెద. ౪౦ 1401

క. దీనిని భరతున కొసఁగుము, కానల వసియించునట్లు ♦ గా నిశ్చితమా
మానసవాంఛ చలింపదు, మానధనా! వరదుఁడవు స ♦ మస్తవిధములన్.

క. మును నీవు సంతసంబునఁ, గొను మిచ్చెదనంటి కైక ♦ కున్ వరముల వా
నిని బూర్ణంబుగ నిమ్మా, జననాయక! నీవు సత్య ♦ సంధుఁడవగుమా!. ౨౨॥

మ. జనకా! మీఁదగునాజ్ఞ నించుకయు, నే ♦ చందంబునన్ లోటుపొం
దని యట్లేనును గాచుచున్, మునులతోఁ ♦ దథ్యంబుగా నుండుఁ జె
ప్పినరీతిన్ బదునాలుగేండ్లడవిలో ♦ విశ్వంభరాధీశ! రా
జును గమ్మంటివి నిగ్రహించి నిను నీ ♦ చొప్పున్ విడన్ బాడియా. ౨౩॥ 1404

క. అనుజునకిమ్మా రాజ్యము, మనమునకున్ సుఖము నేని ♦ మఱి దేనినినై
నను దలఁచి రాజ్యమును గోరను నీ వచియించినట్లు ♦ రఘువర! చేయన్.

సీ. తలఁచువాఁడను నాదు ♦ తలఁపట్టిదియె,యిట్టి పెనుదుఃఖమును ద్రోసి ♦ వేయుమింక
విను బాష్పముల దేహ ♦ మును దడుపందగ దఖిలనదీనాథుఁ ♦ డగుచు నెవ్వ
రెదిరింపఁగా సాధ్యుఁ ♦ డే గాకయుండెడు నబ్ధినాథుఁడు క్షోభ ♦ మందఁడట్లె
యట్టివాఁడవుగదా ♦ యార్తినొందఁగరాదు రాజ్యంబు సుఖము నీ ♦ రమణి సీత

తే. స్వర్గలోకంబు నీకామ్య ♦ వస్తువితతి
జీవితంబును మఱి దేని ♦ నేవసుంధ
రాధిపా! కోరఁ జుమ్ము నా ♦ యాశయ మిది
కావలయు నాకు సత్యమొ ♦ క్కండె యెపుడు. ౨౪॥ 1406

క. అనృతముఁ గోరంజుమ్మీ, యనఘా! ప్రత్యక్షదైవ ♦ మగు నీయెదుటన్
ఘనసత్యసుకృతముల మీఁదను నేశపథంబుఁ జేసె ♦ దన్ దృఢమతితోన్.

క. మనుజలలామా! క్షణమైనను శక్యముగాదు నిలువ ♦ నాకుఁ గనుక నీ
దినమిందు నిలువఁగాలే, దని నీ వీశోక మొంద ♦ నగునె తలఁపుమా. ౨౭॥

క. నాసంకల్పమునకు నే, యేసరణినినైన మాఱు ♦ పే గలుగదు సు
మ్మీ! సాధ్వి కైక కానల, కే సరగునఁ బొమ్మటంచు ♦ నిటఁ బ్రార్థించెన్.

చ. వనముల కేగువాఁడనని ♦ పల్కితిఁ గావున నిట్టి సత్యమున్
జనవర! గాచుకొంటయును ♦ సత్యవచస్కుని గాఁగ నిన్ను నే
నొనరుపఁ బూనియుంటయును ♦ నొప్పుఁగదా? యిఁక నీమనంబునం
గనకుము దీనికై వ్యథను ♦ గానల కేగెద నాజ్ఞనీఁ గదే. ౩౦॥ 1410

చ. సురుచిరపక్షినాదముల ♦ సొంపుతనర్చుచు శాంతచిత్తతం
బరఁగెడి జింకలెల్లఁ జెలు ♦ వంబుగఁ గ్రిక్కిరియంగ నొప్పి సుం
దరముగఁ జూడనౌ వని ని ♦ తాంతము వేడుక నొందియుందుమో
ధరణిపతీ! సురాళికిని ♦ దండ్రియె దైవము శాస్త్రరీతిగన్. ౩౧॥ 1411

చ. మనుజులమాట యేటికిఁక ♦ మానసతృప్తిగ దైవతం బగున్
జనకుఁడె యంచు నెంచి పితృ ♦ శాసనముం దమిఁ జేయువాఁడఁ గా

ననమున శాంతరీతిఁ బదు♦నాలుగు వర్షము లేగ వత్తు న
న్ననుమరుగాక యిచ్చటనె ♦ క్రమ్మఱ నిప్పటి యట్లె యో విభూ!. ౨౨
క. సంతాపంబును దీనిని, జెంతకురాకుండ నింకఁ ♦ జేయు నరవరా!
యెంతయు వ్యథచే నేడ్చెడి, కాంతల వీరినిఁకఁ దేర్పఁ♦గలుగుదు వీవే!.
క. భారము దీనింబొందియు, నారయ నీవే వ్యథాత్ముఁ♦డవె యైతి విటం
గారణమేమో యిఁక నే, నీరాజ్యముఁ బురము భూమి♦నిప్పుడె విడుతున్.
చ. భరతునికిమ్ము వీని నర♦పాలక! నే భవదాజ్ఞఁ గాచుచున్
ధరణిని సోదరుంగలిసి ♦ తల్లి వనంబున కేగువాఁడఁ దాం
దరపడిరాను జెప్పిన వి♦ధంబున నుండెద శైలసంతతుల్
పురము లరణ్యముల్ వెలయఁ ♦ బొల్పగు సీమల నొప్పి వెండియున్. ౨౫
క. సురుచిరమై తనరి శుభ,స్కరమయి యలరారుచున్న ♦ క్ష్మాస్థలి నేనుం
బరమముదంబున విడిచెద, నరిగెదఁ గానకటమీఁద ♦ ననుజుఁడు దీనిన్.
క. కైకొని యంతయు మనిచెదఁ, గాక యిదంతయు మదిచ్ఛఁ♦గా దొనరుచుటో
భూకాంత! నీవుచెప్పిన, యాకరణినె జరగు నిశ్చ♦యం బిది సుమ్మా!. ౨౭
మ. అనఘా! శిష్టజనాదృతంబయిన నీ♦యాజ్ఞం దగం గావ నా
మనమేరీతి దృఢంబుగాఁ దగునొ య♦మ్మాడ్కిన్ మనోమోదముం
గనఁగాఁ జేసెడి కోర్కులందు నయినం ♦ గాదట్లు చిత్తంబు కా
వున నేఁ గానకు నేగువాఁడ నిఁక నీ♦వున్ శోకమున్ మానుమా. ౨౮ 1418
సీ. అనృతదోషంబు ని♦న్నంటఁ జేయుచు దానఁ గలుగుసమస్తసు♦ఖములుఁ గామ
ములు నాకుఁ బ్రీతిని ♦ గలుగంగఁ జేయవు భార్యను నాప్రాణ♦పంచకంబు
నఖయరాజ్యంబు ♦ నైన నొల్లను నీదు సత్యవ్రతమున కే ♦ చందమునను
హానిలేకుండ న♦య్యవి గల్గఁగాఁ దగు నాకు దుఃఖము గాన♦నమునఁ గల్గు
తే. ననుచు వెతనొందకుము ఫలా♦ళిని మనోజ్ఞ
మూలములఁ దిని చిత్రవృ♦త్తాళి నొప్పు
వనమునం జేరి నదులను ♦ బర్వతముల
సరసులం గాంచుచు వసింతు ♦ శర్మ మలర. ౨౯ 1419
క. జనకా! సుఖముగ నుండఁగఁ, జనుఁగాకని పలుక రాజ♦చంద్రుఁడు కష్టం
బునఁ బడి పెనుశోకంబునఁ, దనువుఁ దపింపంగఁ బెన్వ♦తన్ మది గలఁగన్.
చ. తనయునిఁ గౌఁగిలించుకొని ♦ తద్దయుఁ బ్రజ్ఞ నశింప మూర్ఛచే
మునిఁగి శరీరచేష్టలును ♦ బోవఁ జలింపకయుండెఁ; గైక త
ప్ప నితరపత్నులెల్ల నొక♦భంగిగ నేడ్చిరి యాసుమంత్రుఁడున్
బెనుపగ నేడ్చి మూర్ఛఁగి నెఁ ♦ బెల్లుగ సిండెను నార్తనాదముల్. ౩౧ 1421

ముప్పదినాలవ సర్గము సంపూర్ణము.

## ౩౫ - వ సర్గము.

సుమంత్రుఁడు కైకను నిందించుట.

కవిరాజవిరాజితము:—

ఘనతరకోపము ♦ గల్గ సుమంత్రుఁడు ♦ గంపమునం గనఁ♦గా స్వశిరం
బును వడిఁ ద్రిప్పుచు ♦ భూరిరవంబునఁ♦బుచ్చుచు నూర్పుగ♦ముల్ గయిఁగై
బెనుచుచు నార్తిని ♦ భీరుతఁబండ్లను ♦ వింతగగీటుచు ♦ భీమరుషం
గను లరుణంబులు ♦ గా వెలయం దన♦గాత్రము నెఱ్ఱని♦కాంతిఁ గనన్. ౧౪

సీ. కోపంబు వేగంబ ♦ గూడి తన్ బైకొననతితీవ్రసంతాప ♦ మంది యధిపు
మనసును గైకయం ♦ దనురాగ రహితమాటరసి తీక్ష్ణములైన ♦ యట్టి శరము
లను బోలువాక్యంబు♦లను గైక హృదయంబు వడఁకునట్లానరించు♦వానికతి.
వజ్రసమానమహా ♦ వాగ్బాణవితతి నాకైక మర్మంబులఁ ♦ గడఁగి యపుడు
తే. తాను భేదించుగతిఁ బల్కెఁ ♦ దన్వి, యితఁడు
ప్రభువు స్థావరజంగమ ♦ ప్రాయమైన
జగమునకు నెల్ల భర్త, యీ♦జనపతీంద్రు
నిచ్చ కొలఁదిసి విడిచితి♦వే, కుబుద్ధి!. ౫ 1423

క. లోకమునఁ జేయరానిది, నీకిట్టి దురాత్మ కొండు ♦ నిజముగఁ గలదే
లేకుండు టబ్రమే యిఁక, నోకైకా! దశరథేంద్రుఁ ♦ డూహింపంగన్. ౫౪

క. శతనుఖురీతి నజయ్యుఁడు, క్షితిధర మట్లుగఁ జలింపఁ ♦ జేయఁ దగఁడు వి
శ్రుతవార్ధిపోల్కి నిశ్చలుఁ, డితనిం దపియింపఁజేసి ♦ తీ చెడుపనులన్. ౬౪

తే. కాన నీవు పతిఘ్నివే♦గాక కులము
నెల్ల నశియింపఁజేయుదు ♦ విపుడు నాకు
స్పష్టముగఁ దోఁచుచున్నది ♦ సరణి; మఱియు
నితఁడు నెల్లరఁ బోషించుఁ ♦ బతియు నీకు. ౭ 1426

క. కానన్ భర్తను నీ వన, మానింపకు మాత్మజులను ♦ మగువలు పూన్కిన్
మానియె యైనను బతిదగు, మానసమునె యనుసరించి ♦ మసలఁగ వలయున్.

ఆ. అద్దియే విశేష♦మగు రాజు సుగతికి
నరుగఁ బిదప నతని ♦ యాత్మజులోగి
వయసు క్రమముఁ బట్టి ♦ వపయు వారలు గదా
రాజ్యరమ; నిపుడు ధ♦రావరునకు. ౮౪ 1428

క. తొలికొడుకు రామచంద్రుం, డిలఁ బొందఁగ నర్హుఁడుగద! ♦ యిక్ష్వాకుమహా
కులపతి యీతఁడు ప్రాణం,బులతో నుండఁగనె ధర్మ♦మును నద్దానిన్. ౯

క. మాయింపఁగఁ దలఁచితివే, యీయెడనో కైక! భరతుఁ♦డే నీతనయుం
డే యానుగాక భూపతి, యీయుర్విని నేలుఁగాక ♦ యేమందఱమున్. ౯౪

క. ఎచ్చటి కేగునొ రాముం, డచ్చటికే పోవువార ♦ మతివా! వినుమా
సచ్చరితుఁడైన విప్రుం, డిచ్చట నొకఁడైన నుండఁ ♦ డీఁక నిజము సుమా.

తే. నీవు మర్యాద విడనాడి ♦ భూవిబుధులు
కాపురము లేచి పోఁదగు ♦ కార్య మిపుడు
చేయఁగాఁ బూని యున్నావు ♦ మాయలాడి
యిట్టి మర్యాదహీనమా ♦ వృత్తి నీవు. ౧౧ 1432

క. ఒనరింపఁ బూనియున్నం, దున కిప్పుడె భూమిపగిలి ♦ తునకలు గావ
చ్చును గాకున్నది యట్టులు, కనఁబడె నిది చిత్రమగుచుఁ ♦ గన్నుల కిచటన్.

మ. కనఁగా భీతిజనింపఁజేయుచు ద్విజ♦క్ష్మాధీశ మానీంద్రులై
ఘనులై పొల్చు వసిష్ఠముఖ్యు లిసిరో ♦ కైకా! వినాశంబు వే
గనుమా యంచు వచింప వారలయమో♦ఘస్ఫారవాగ్దండముల్
వనికిన్ రాముని బంపనున్న నినునో♦పం బూనవేమో యిటన్. ౧౩ 1434

క. జ్వలనాభంబులు నగునవి, కలవిలపాటొందఁ జేయఁ♦గా నేలొకొ లోఁ
దలఁపకయున్నవి; కట్టా, యిల నెవఁడే ఘనరసాల♦వృక్షముఁ బూన్కిన్. ౧౪

తే. నైజతీక్ష్ణకుఠారంబు♦నను దెగంగ
నఱికి నింబద్రుమంబును ♦ నెఱిఁ బెరుగఁగఁ
బాదులను గట్టి పెంచుచుఁ ♦ బాలుపోసి
తడుపునే? మంచిఫలములా ♦ తరువొసఁగునె?. ౧౫ 1436

చ. ఇలఘనవంశమందు జని♦యించియు నీజననీస్వభావమె
ట్లలఘుజనప్రదూష్య మగు♦నట్లుగ నొప్పెనొ నీస్వభావమ
ట్లలవడె నంచెఱింగితి మ♦దాత్మను నింబమునుండి యెందునే
సలలితమైన తేనె యొక♦సారియు జాఱుట విన్నవారమే. ౧౬ 1437

క. ఆరీతి దుష్టమతియగా, నారికి సత్పుత్రి యెటు జ♦ననమగుఁ గైకా!
ధారణిఁ ద్విజ్ఞనీకృత, భూరితరాఘములు తెలియుఁ♦బో యందఱికిన్. ౧౭

క. మేమెఱిఁగితి మిపుడట్లే, నీమానసవృత్తి నెల్ల ♦ నీతండ్రికి ను
ద్దామవరదాతయగు నొక, భూమీసురుఁ డుత్తమవర♦మును దగ నిచ్చెన్. ౧౮

సీ. అద్దానివలననే ♦ యతఁడెల్ల ప్రాణుల పలుకులు చక్కఁగాఁ ♦ దెలిసికొనియెఁ
గానఁ దిర్యగ్జంతు♦కాండములుంగూడఁ జెప్పుకొనెడు నుడుల్ ♦ తప్పకెఱుఁగఁ
జాలియుండె నదొక్క♦సమయంబునన్ భూరివర్చస్వియైన యా♦వ్వసుమతీశుఁ
డాత్మశయ్యాస్థల♦మందుఁ గ్రిందుగ జృంభమను నొకజాతిఁ జే♦రిన పిపీలి

తే. కంబు పలికినపలుకుఁ జ♦క్కఁగ నెఱింగి
దానిభావమ్ముఁ దెలిసి యా♦శంఢు నవ్వెఁ

బెక్కుసారులు దాన నీ♦ ప్రియజననియుఁ
దన్నుఁగాంచియె నవ్వె నా♦తండటంచు. ౧౮ 1440

క. మృతిఁగోరునంత కోపో,ద్ధతిఁ బొంది నిజేశుతోడ ♦ ధాత్రీవర! శాం
తత నొప్పువాఁడ వీ వి,ట్లతిశయముగ నవ్వఁ గార♦ణాంతరమేమో. ౧౯ 1441

క. తెలియంగఁ గోరెదను నాఁ, గలభాషిణిఁ జూచి హాస♦కారణమును నేఁ
బలికితి నే మరణంబిటుఁ, గలుగును నిస్సంశయముగ ♦ క్షణమాత్రములోన్.

చ. అనవిని కేకయాధిపతి ♦ నాగ్రహమొప్పఁగఁ జూచి పల్కె నీ
జననియు, నీవు చచ్చినను ♦ జావకయున్నను నాకునేల న
వ్వినది పుడేలయో చెపుమ ♦ వేగమె కారణ మంత నీవు న
న్నని యపహాస్యమున్ సలుపఁ♦గా మదినెన్నని యట్టులెంచెదన్. ౨౩ 1443

సీ. అన విని కేకయా♦వనిపాలకుఁడు తన కష్టంబులఁ దలంచి ♦ కడఁగి తనకు
విషయ మద్దాని మున్ ♦ వివరించి చెప్పిన యతనికిఁ జరగిన♦దంత తెలిపె
నంతట వరదాత ♦ యా కేకయాధిపుఁ గని రాజ! యద్ది చ♦చ్చినను జావ
నీయట్లు గాకయే ♦ నిన్నుఁ ద్యజించి పోఁదలఁచినఁ దలఁపనీ ♦ తా నిఁకేమి

తే. చేసిన నిదెంతమాత్రము ♦ చెప్పవలదు
సుమ్ము యన నిర్మలాత్ముఁడై ♦ క్షోణివిభుఁడు
గురువుచెప్పిన చొప్పునఁ ♦ దరుణి విడిచి
ధనపతి విధంబునన్ సుఖ♦మునఁ జెలంగె. ౨౪ 1444

క. వనితా నీవును బాపం,బున దృష్టిని నిలుపు తల్లి♦పోలిక మోహం
బున దుర్విషయములందు ని,తనిఁ జొన్పియె పాడుచేయఁ ♦ దలఁచెదు కట్టా!.

*క. జనకునివలెనే తనయులు, జననివలెం బుత్రికలును ♦ జనియింతురు వా
రిని బోలు గుణములం గని, యని లోకులు పలుకుచుందు ♦ రది యాతతినిన్.

ఆ. ఎన్న సత్యమనుచు ♦ నిప్పుడు తోఁచును, నున్న దట్టి దాన♦వో కృశాంగి
కాకు మింకనీదు ♦ కాంతుని సద్భావ, మెఱిఁగి యనుసరించి♦యే చెలంగు.

క. జనపతి రేపే శ్రీరా,మున కభిషేకంబు జరగు ♦ ముఖ్యంబుగ నం
చును జెప్పినట్టి మాటకు, ననుకూలింపుము; మహోగ్రు♦లగు మనుజులకున్.

క. శరణమగుము పాపాత్ములు, పురికొలుపఁగ నింద్రురీతి ♦ బొల్చెడు లోకే
శ్వరు భర్తఁ జిన్నిసుతునకుఁ, బురమిడి జ్యేష్ఠు వనికంపఁ ♦ బూనుటవలనన్.

ఆ. శాస్త్రహీనమగు న♦సద్ధర్మమునకుఁ బ్రా,ల్పడినవానిఁ జేయఁ ♦ గడఁగ కమ్మ!
పాపదూరుఁ డగుచుఁ♦ [1]బద్మాక్షుఁడైన యీ, దశరథుండు భూమి♦ధవవరుండు.

క. శ్రీమంతుఁ డొటఁ దానపు, డేమాటను జెప్పె దాని ♦ నిప్పు డనృతముం
గా మానిని! చేయండిఁక, నేమాడ్కిని నైనఁ దీర్పు ♦ నిది నిజముసుమా !.

---

* పితౄన్ సమనుజాయంతే నరా మాతర మంగనాః-అని మూలము. 1 పద్మాక్షుఁడైన-ఇది
"దేవిరాజీవలోచనః" అను మూలము ననుసరించి వ్రాయఁబడినది.

సీ. రాముండు జ్యేష్ఠపు♦త్రకుఁడు సదాచారపరుఁ, డుదారుఁడు భూమి♦పాల ధర్మ
మును సముచితరీతిఁ ♦ గనె నెఱవేర్చు వాఁ, డెల్ల జీవులఁ గావ♦నెంచువాఁడు
బలవంతుఁ డిట్టిఁడై ♦ యలరు రామునకుఁ బట్టాభిషేకమును జే♦యంగనిమ్ము;
పృథివీశుఁ దండ్రిని ♦ విడిచి రాముఁడు కాన కరుగునే లోకమం♦దురుతరాప
తే. వాదము జనించు నీకు య♦శోదయాస
మన్వితుండగు రాముఁడీ ♦ యవని నేలుఁ
గాక నీవును మనమునఁ ♦ గలుగు ఖేద
మును దగం బాయుమీ నాదు ♦ మనవివినుమ. ౩౧॥ . 1452
క. వనమున కీరాముండే, చనునే నిష్ఠురమునందు ♦ శక్తుఁడు లేఁ డా
తనికంటె నొరుఁడు కావున, ననుమానంబేల యితఁడె ♦ యర్హుఁడు సుమ్మా.
క. తనప్రియపుత్త్రుఁడు రాముఁడు, ఘనతరమగు [1]యౌవరాజ్య♦కమల ధరింపన్
వనికేగు మేటి చాపం,బును దాల్చిన దశరథుండు ♦ పూర్వుల భంగిన్. 33
ఆ. ఇట్టు లానుమంత్రుఁ ♦ డట్టి మహాసభ, సాంత్వవచనములను ♦ జాలఁ గఠిన
ములగు వాక్యములను♦నలయించి కైకేయి, నవలఁగేలు మోడ్చి♦యట్టులుండె.
క. కలఁగకయె నొచ్చుకొనకయె, యలకైకయు నెట్టులైన ♦ నభ్యర్థింపన్
బలుకకయుండె ముఖోగ్రత, తలఁపఁగ నిసుమంతయేని ♦ తగ్గకయుండెన్.

ముప్పదియైదవ సర్గము సంపూర్ణము.

---

౩౬ - వ సర్గము.

దశరథుఁడు రాముని సపరివారముగా నడవికి బంపఁ దలంపఁ గైక కూడదనుట.

ఉ. కైకయు నిట్లనమ్మతిని ♦ గన్పడఁ జేయఁగ వృద్ధరాజు తా
నేకపటంబులేక మును♦పిచ్చిన తద్వరయుగ్మపాశసం
ఘాకలితాంతరంగుఁడయి ♦ యార్తిమునుంగుచుఁ బీడనొంది యెం
తో కఠినాత్మయైన ప్రియ ♦ నొక్కటఁ గాంచి యుదగ్రచిత్తుఁడై. ౧ 1457
తే. వేఁడి నిట్టూర్పులను బుచ్చి ♦ విహ్వలించి
సారథి సుమంత్రునిం గాంచి ♦ చేరఁ బిలిచి
మాటిమాటికిఁ బలికె సు♦మంత్ర! రాము
ననుసరించియె చనుటకై ♦ యతిజవమున. ౧॥ 1458
క. చతురంగబలాన్వితసై,న్యతతియు బహురత్నములును ♦ నర్హపదార్థ
ప్రతతియు సంపూర్ణముగా, నతులితముగ నిచ్చి పంప ♦ నగు నడవులకున్.
సీ. వెలయాండ్రు పరచిత్త♦ముల సమాకర్షించు పలుకులసొగసుగఁ♦బలుకుచుండ్రు
మితిలేని ధనముల ♦ మించువైశ్యులు శిబిరములచెంతనె వస్తు♦సముదయంబుఁ

1 యౌవరాజ్యకమల=యౌవరాజ్యలక్ష్మిని.

బఱచియుంతురు కాన ♦ వరుస వీరందఱు శ్రీరాము సేనను ♦ జెలఁగునట్లు
చేయుచుందురు గాక ♦ నాయనుంగుఁ గుమారు సేవించి యెవ్వరు♦జీవనంబు
తే. చేయుచుందురో, రాముఁడు ♦ స్వీయబలప
రీక్షకయి యేరితో నుర♦రీకృతాభి
లాషఁ గ్రీడించుచుండునో ♦ లలితరత్న
కనకవస్త్రాదులను వారిఁ ♦ దనిపి పిదప. ౪ 1460

క. వారందఱు వేడుకమై, శ్రీరామునిఁ గూడి పోవఁ ♦ జేయుమ! యాజ్ఞన్
సారతరాయుధధరులగు, వారును, దైలాదులుండు ♦ బండ్లును బొసఁగన్. ౪½
క. వనమునకు న్నాతనయుని, వెనువెంటనె పోవవలయు ♦ వెస బోయలు న
వ్వనమార్గంబులఁ జూపఁగఁ, జనఁదగు; శ్రీరాముఁడిట్లు ♦ సైన్యాన్వితుఁడై.
చ. వనమున సంచరించు మద♦వారణపంక్తిని జెండి వన్యమై
తనరు మధుస్రవంతిఁ దమిఁ ♦ ద్రాగుచుఁ బెక్కునదీనదంబులం
గనుఁగొనుచుండు శర్మమునఁ ♦ గావున రాజ్యముఁ గూర్చినట్టి చిం
తను గనకుండు నాకుఁ గల♦ధాన్యతతుల్ ధనరాశియంతయున్. ౬½ 1463

క. జనహీనమగు మహావనమున నుండును గాన నంపు ♦ ముద్దుకుమారుం
డు నటం బుణ్యక్షేత్రంబున యాగమ్ములనొనర్చి ♦ పొంగెడు కాంక్షన్. ౭½
క. అనుపమదక్షిణలన్ విప్రనిచయమునకిచ్చి మౌని♦వరయుతుఁడై కా
నను సుఖముగను నివాసంబును జేయంగలఁడు; భూరి♦భుజుఁడు భరతుఁడున్.
క. పురవరమైన యయోధ్యను, బరిపాలించెడిని సిరుల ♦ భాసిలు రాముం
డురుకామితార్థవస్తూత్కరుఁడై చనునట్లు చేయఁ♦దగుఁ బయనమిఁకన్. ౯
క. అనిపలికె నిట్లు జనపతి, తనసారథితోడఁ జెప్పఁ ♦ దాఁ గైకయు వే
విని భయమునొందెఁ దన్ముఖమును శోషిల్లెను, నిరోధ♦మును స్వరమొందెన్.
తే. మఱియు నాకైక మిక్కిలి ♦ వెఱపునొంది
దుఃఖమున మోము శోషిల్లఁ ♦ దొందరపడి
పలికె నృపుదెస మొగమెప్పఁ ♦ బరమసాధు
సత్తమా! యిట్లు చెప్పంగఁ ♦ జనునె నీకు. ౧౧ 1468
క. గతసారమైన సురవలెఁ, బ్రతిలేని పదార్థవితతి ♦ పాడగుటను ని
ర్గతజనమగుటను మిగుల నహితమగు నీరాజ్యమేల ♦ యిఁక భరతునకున్.
క. వినుమిా! భరతుఁడు దీనిం, గొనునే? యని లజ్జవిడిచి ♦ కొంకువదలి కై
క నరేంద్రునితో మిక్కిలి, వినరాని గతిన్ వచింప; ♦ విహ్వాలమతియై. ౧౨½
క. ఆయతలోచనయగు కైకేయిని గని దశరథుండు ♦ ఖిన్నతఁ బలికెన్
మోయఁగఁ జాలని బరువును, నీయెడ నెక్కించి మోయ♦నెంచుచునుండన్.
తే. అహితకారిణి వగుట నీ♦వరయక నను

మిగులఁ బీడించుచున్నావె ♦ తగునె నీక
నాఁట్యరాలా! రఘూత్తము♦నకు సహాయ
ముగను సేనను బంప నేఁ ♦ బూనుకొంటిఁగి. ౧౮ 1472

సీ. ముం దడ్డగింపక ♦ మునుకొని తరువాత వలదనుచున్నావు ♦ వరము నడుగు
కాలమందే యడు♦గక యుంటి వేలొకో? యడుగనిదాని నే♦పుడు మరలను
నేనీయఁ గోరను ♦ నీకంచుఁ గ్రోధంబు పొంగ నాతండు చె♦ప్పుటయుఁ గైక
విని వరాంగనయె య♦య్యనుదనవాంఛితమును వేఱు కారణం♦బునఁ జెఱుపఁగ
ఆ. నితఁడు పూనె నంచు ♦ నెంచి యద్దానిచే
ద్విగుణమగుచుఁ గోప♦ము గడుఁ జెలఁగ
రాజుఁ గాంచి పలికె ♦ రాజ! నీవంశమ్ము
నందె సగరుఁడనెడు ♦ నతఁడు మున్ను. ౧౯ 1473

క. తన పెద్దకొడుకు నసమంజుని నడవికిఁ బంపినట్టి ♦ చొప్పుఁ దెలియుమా
తనిఁ బంపునపుడు సేనలఁ, గొనిపొమ్మని చెప్పలేదు ♦ క్షోణీశ్వరుఁడున్. ౨౦

క. వనమున కేగుట యనఁగా, ధనహీనునె యంచుఁ దెలియఁ ♦ దగునట్లే పు
త్రుని నిర్ధనునిగఁ బంపుము, మునుపటి యాచారమె గద♦ముఖ్యము మనకున్.

చ. అనవిని ఛీ యటంచు మను♦జాధిపుఁ డామెను ధిక్కరించి యిం
కను బలుకంగ నెంచకయె ♦ కన్నులనీరు స్రవింప నుండె; న
జ్జనములు దానికిన్ వగచి ♦ చాల నసహ్యము గల్గియుండి ర
వ్వనితయు లేశమైనఁ దన♦వల్లభుభావము నెంచకుండెఁ దాన్. ౨౨ 1476

సిద్ధార్థుఁడు కైకకు నీతిఁ జెప్పుట.

సీ. అప్పుడు సిద్ధార్థుఁ ♦ డనుమంత్రివర్యుండు పార్థివు మన్ననఁ ♦ బడయు నతఁడు
వృద్ధుఁడు పరిశుద్ధ♦వృత్తిని దగువాఁడు తద్గోష్ఠి వినుచుండి ♦ తరుణిఁ గైకఁ
గనుఁగొని పల్కె నో♦కాంతరో! యసమంజుఁ డధికదుర్బుద్ధియై ♦ యర్భకులను
మార్గంబులను బ్రీతి ♦ మసలుచు నాడుచునుండఁగాఁ గని సర♦యూనదీజ
తే. లములఁ బడవైచి వారలం♦దు మునుఁగ నట
బుగ్గలొకకొన్నిపుట్టినఁ ♦ బొంగి నగుచు
నిట్లు క్రీడించుచుండిన ♦ నెఱిఁగి పౌరు
లాతనిం గాంచి మిక్కిలి ♦ యాగ్రహించి. ౨౩ 1477

చ. సరగున లేచి యోసగర! ♦ క్ష్మాస్థలి వర్ధిలఁ జేయువాఁడ వీ
వరయుమ యొక్కనీతనయు ♦ నైన గ్రహించుచు మమ్ముఁ బాయుమా
వరమతి! మమ్మునుంచుకొని ♦ వాని వెసన్ విడనాడుమా యనన్
ధరణిపుఁ డంత నిట్లనియెఁ ♦ దత్పురవాసులతో విధిజ్ఞతన్. ౨౪ 1478

ఆ. పౌరులార! యిట్లు ♦ భయమేల గల్గె మీ, కనిన వారలెల్ల ♦ నచటఁ గూడి

పలికిరిట్లు రాజ♦వర! యసమంజుండు, బుద్ధిమోహమొంది ♦ పౌరులవలన. ౨౭౪

క. బాలకులెల్లరుఁ ద్రోవలఁ, జాలఁగఁ గ్రీడింపఁగాంచి ♦ సరయూనదిలో
లీలఁ బడవైచి వారలు, దేలుచు మునుఁగుచును గుక్క♦త్రిప్పఁగ లేమిన్.

క. పలుబాములఁ బొందఁగ వా,రలఁ గని మూర్ఖుండు గాన ♦ రాజోత్తమ! మి
క్కిలి సంతసమ్ముఁ గాంచుచు, నలరుచు నున్నాఁ డసంగ ♦ నాతఁడువినితాన్.

చ. మనమున నెంచి పౌరజన♦మండలికిం బ్రియమెన్ని చేయఁగాఁ
దనయుని వేగమే విడిచె ♦ తద్ధరణీపతి భార్యతోడ నా
తని పరిచారసంగతిని ♦ ద్రవ్యముతోడను వాహనంబునన్
దనయుని జీవితాంతమును ♦ దత్పురిఁ జూడక కాననుండఁగన్. ౨౮ 1482

ఆ. ఆజ్ఞచేసె నంత ♦ నతఁడు పాపాత్ముని
భంగి దెసలఁ దిరిగి ♦ ఫాలపిటక
ములను బూని గోత్ర♦మున దుర్గములయందుఁ
గందమూలములను ♦ గడఁగి త్రవ్వి. ౨౮౪ 1483

క. తినుచున్ జీవించెను; ధ,ర్మనిరతమతియైన సగర♦రాడ్వరుఁడు కుమా
రుని విడిచె నతని పాపము, కనుఁగొని యభ్భంగి రాముఁ ♦ గానలకనుపన్.

ఆ. ఏమి పాపమీతఁ ♦ డిపుడొనరించె నో, యవగుణంబు నితని ♦ యందు మేము
చూడలేదు నిజము ♦ సుంతయు మాలిన్య, మబ్జరిపునియందు ♦ నమరునట్లు.

క. రామునియందుఁ గనంబడ, దేమాత్రము దోషలేశ ♦ మిపుడో దేవీ!
రామునియందే దోషం,బేమేఁ గనఁబడినఁ దెలుపు ♦ మిప్పుడె దానిన్. ౨౯౪

క. వనమునకుం బంపుద మీ,తని; దుష్టుఁడు గాక సత్ప♦థంబున నాస
క్తిని గొనురాముని విడుచుట, యనునది ధర్మేతరంబ♦యగుఁ గద! తలఁపన్.

ఆ. చేయరాని యిట్టి ♦ చెడుకార్యమును జేయ, నింద్రునకును దేజ♦మెల్లఁ జెడును
రాము సిరిని జెఱుప ♦ నీమదినెంచుట, యింకఁ జాలు శుభస♦మృద్ధవదన!.

సీ. జగమునఁ గలుగు వి♦స్తారాపవాదంబునైన రాకుండెడు ♦ నట్లు నీకు
రక్షింపఁ దగుఁ గాదె ♦ రాజానన! యని సిద్ధార్థుఁ డీరీతిఁ ♦ జెప్ప, రాజు
నెలుఁగు రాల్పడుచుండ ♦ నెంతయు శోకోపహతవచనుండయి♦యతివఁ గాంచి
పాపవృత్తి! యీతఁ♦డీ పగిదిం జెప్పినట్టి మాటలు మంచి♦వనుచు వాని

తే. నొప్పుకొనఁ జాలవా, నాకు ♦ నొప్పుమేలు
నీకుమేలును దెలియవు ♦ కేకయాత్మ
జాతవయ్యును గుపథంబు ♦ నీతఱిఁ గొని
యీకుచేష్టలు చేసెద ♦ వేమియందు. ౩౦౪ 1489

క. వనితా! కుత్సితచేష్టయె, యనుమానంబేల సాధు♦హర్షితమార్గం
బున కది దూరమె యగుఁ గద, ధనసుఖరాజ్యముల మాని♦తరలెద వనికిన్.

చ. తనయుని వెంటఁ బోయెదను ♦ ధారణికిం బతివైనయట్టి నీ
తనయునితోడఁ గూడ సుఖ♦ధామము రాజ్యము వాంఛితార్థరీ
తిని జిరకాల మెంతయును ♦ దృప్తిగ నీవె భుజించుచుండుమా
వనమున రామునిం గలిసి ♦ వాసముచేసెద నీకుఁ దృప్తిగన్. 1491

ముప్పదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౩౭ - వ సర్గము.

రామాదులు కైక యిచ్చిన నారచీరలు ధరించుట.

క. వినయవిదుండగు దశరథ, తనయుఁడు సిద్ధార్థువాక్య♦తతి విని వినయం
బునఁ దండ్రితోడఁ బలికెన్, జననాథా! త్యక్తభోగ♦జాలుఁడ నగుచున్.

చ. వనమునఁ గందమూలము ల♦వారిగఁ దించు మనంగ నెంతు నిం
కను జనులందు భోగములు ♦ కార్శ్యము నొందిన సంగ ముండు నే
వినుము సమస్తసంగముల ♦ వీడినవాఁడను గాన నాకు నీ
వనుపఁ దలంచుసైన్యముల ♦ నారయ నేమి ప్రయోజనంబొకో?. ౨ 1493

చ. అనుపమకుంజరం బొసఁగి ♦ యాగజమధ్యమునందుఁ గట్టుమో
కున మనసుంచువాని కల♦కుంజరవర్యము నే త్యజించుచుం
డ నిఁకఁ దదీయరజ్జువు లి♦డంగను జాలక దాన నాసఁ గై
కొన ఫలమేమి? సత్పురుష♦కుంజర! ధారణినాయకోత్తమా!. ౩ 1494

[1]చ. కరిని ద్యజించు వాని కది ♦ కట్టుటకుం దగు త్రాటితో ఫలం
బరయఁగ లేనియట్లు భవ♦దర్పితరాజ్యసుఖాదికంబులం
బొరి విడనాడు నాకు ఫల♦ముం గలదే యిసుమంతసేనతో
భరతున కిచ్చువాఁడ నిదె ♦ భవ్యమతిన్ సకలంబు భూవరా!. ౪ 1495

తే. నారచీరలు మాత్రమే ♦ నాకు వలయుఁ
గానఁ దెప్పింపుమా వేగ ♦ వాని నిటకుఁ
గానఁ బదునాలుగేండ్లు నేఁ ♦ గాపురంబు
చేయఁదగుఁ గాన నాహార♦సిద్ధికొఱకు. ౫ 1496

సీ. కందమూలాదులఁ ♦ గావలసినయప్డు త్రవ్వి తెచ్చుకొనఁగఁ♦దగు ఖనిత్ర
పిటకంబుల నిటఁ దె♦ప్పించి యిప్పించుఁడీ; యన విని కైక స్వ♦యముగ నేగి
జనసంఘ మం దుండఁ♦గనియు లజ్జయు లేక వల్కలాదులఁ దెచ్చి♦వానిఁ జూపి
ధరియింపు రాఘవా! ♦ వనుస వీని నటన్న నాపురుషోత్తముం ♦ డామె యొద్ద

---

1 తథా మమ సతాం శ్రేష్ఠ-అని మూలము. తథా యనుదానియర్థమే యిట వివృతమని గ్రహింపఁదగు.

తే. నుండి యవ్వాని రెంటిని ♦ నిండుమదిని
గైకొనుచుఁ బూర్వమున్న సూ♦క్ష్మవసనముల
విడిచి మునిధార్యములవాని ♦ వే ధరించె;
నచటనే లక్ష్మణుఁడు తండ్రి ♦ యంతికమున. ౭॥ 1497

క. సురుచిరవస్త్రములన్ విడి, ధరియించెను వల్కలములఁ ♦ దాపసులెల్లన్
ధరియించు వానిరెంటిని, ధరణీపుత్త్రికయు నంతఁ ♦ దత్ప్రభయందున్. ౮

తే. పట్టువస్త్రంబు రుచిరంబుఁ ♦ గట్టియున్న
దాటఁ దనకయి తెచ్చిన♦యట్టి నార
చీరఁ గనుఁగొని భీతిని ♦ జెందె వలనుఁ
గాంచి దిగులొందు మృగిభంగిఁ ♦ గఠినముగుట. ౯ 1499

సీ. శుభలక్షణంబుల ♦ శోభిల్లు జానకి సాధ్వీధర్మంబుల ♦ సరణి నెఱుఁగు
నదియును; దాఁ జేయు♦నట్టి కృత్యంబుల వనితల కెల్లను ♦ బరమధర్మ
మైన పాతివ్రత్య ♦ మూని తెల్పెడునదియును గాన ఖేదంబుఁ ♦ గను నుదిగల
యది యయ్యు నత్తయు ♦ నప్పుడిచ్చిన నారచీరల మిక్కిలి ♦ సిగ్గునొంది
తే. యును గ్రహించి ధరించుచుఁ ♦ గనులనీరు
గ్రమ్ముచుండఁగ గంధర్వ♦కాంతుఁ బోలెఁ
బరఁగు భర్తను గని వన♦వానులైన
మానులెట్లు ధరింతురో ♦ వీనిఁ జెపుము. ౧౧॥ 1500

క. అనిపలికి చీర ధరియిం,పను నేరక తోఁపకాత్మఁ ♦ బలుమాఱును దా
నిని గని మ్రాన్పడియుండెను, జనకజఁ గనుఁగొనెడువారు♦సంకటపడఁగన్.

సీ. మఱియు నాసీత య♦మ్మౌనిధార్యములగు చీరలలో నొక్క♦చీరఁ గంఠ
మున వైచుకొని కరం♦బునను వేఱొకచీర గ్రహియించి దానిని♦గట్టుకొనఁగఁ
జాలక సిగ్గొంది ♦ సాంద్రఖేదమునొందు మనసుతో నిలుచుండఁ♦గని సుధార్మి
కుండగునట్టి రా♦ముండు శీఘ్రమవచ్చి పట్టువస్త్రముపైన ♦ వల్కలమును
తే. దానె కట్టెను; ధార్మికో♦త్తముఁడు చీరఁ
గట్టుచుండఁగఁ గాంచిన ♦ ఖ్యాతలేంద్రు
కాంతలెల్లను గన్నీరు ♦ గాఱ మిగుల
వగల నొందుచు నతనితోఁ ♦ బల్కిరిట్లు. ౧౨॥ 1502

క. జ్వలితప్రభ! వత్సా యీ, లలనామణి బుద్ధివిభవ ♦ లక్షణవతి కా
నల కేగవలయు నను నాజ్ఞ లేదుకద! నీకకాదె ♦ కావున వినుమా !. ౧౩

చ. జనకుని యాజ్ఞరీతి జన♦సంతతిశూన్యవనస్థలంబునం
దున వసియింప నీవు చనఁ ♦ దోయరుహానన నీవు వచ్చుదాఁ

కను నినుఁ గాంచినట్టులె త♦గం గనుచున్ సఫలంబు గాఁగ మా
కనులను జేసికొందుము వ♦గన్ లవమైనను బాసి పుత్రకా!. ౧౭ 1504

క. అనుజునితోడుగఁ జేకొని, వనమునకుం బొమ్ము మాని♦వలె నీకళ్యా
ణి నివాసము చేయ వనం,బునఁ దగదు కుమార! గేహ♦మున భూజాతన్.

తే. ఉనుపఁ దగునని వేఁడెద ♦ మో సుపుత్ర!
వేఁడికోలిద్ది సఫలమై ♦ వెలయునట్లు
చేయుమా! నిన్నుఁగూడ వ♦సింపవలయు
ననుచు వేఁడుదుమే గాని ♦ యనఘ! నీవు. ౧౮ 1506

చ. నిరతము ధర్మమార్గమున ♦ నిల్చి చలింపని యట్టి బుద్ధిచేఁ
బరఁగుదు వట్టులౌట నిట ♦ వాసము చేయఁగ నిప్పుడొప్ప వి
త్తరుణిని నైన నుంచుమను ♦ తల్లులమాటల నాలకించి య
బ్బరతుని తల్లి యొప్పుకొను♦భంగిని గాంచని కారణంబునన్. ౧౯ 1507

ఉ. ఊరక యాలకింపుచునె ♦ యుండి తనంతట శీలమొప్పు నా
ధారణిపుత్రి కంబరము ♦ దానిని గట్టెను; సీత యట్టులా
చీరను దాల్పఁగాఁ గని వ♦సిష్ఠుఁడు రాజగురుండు కట్టుకో
కూరకయుండుమా! యనుచు ♦ నుర్వితనూజను హెచ్చరించుచున్. ౨౧

సీ. కైకేయిఁ గని పల్కెఁ ♦ గడుఁగోపము దరంగ మర్యాదమీఱి దు♦ర్మతిని బూని
వర్తించుదానవు ♦ వంశవినాశనీ! క్షితిపతి మోసంబుఁ ♦ జెందఁ జేయు
టయె కాక శాస్త్రంబుఁ ♦ గయికొన కిచ్చచే దిరుగుచున్నావు శీ♦లరతిలేని
దానవు భూజాత ♦ కానలకేఁగఁగా వలదు రామునకని ♦ వైభవముల

తే. సిద్ధమై యున్న పీఠంబు ♦ సీతయెక్కఁ
గలదు స్త్రీరాజ్యపాలన ♦ మలరునె యని
యందువేమొ గృహస్థుల ♦ కందఱికిని
[1]భార్యయే యాత్మయనిగాదె ♦ పల్కు శ్రుతులు. ౨౪ 1509

చ. క్షితిసుత రామచంద్రునకు ♦ సిద్ధముగాఁ దగు నాత్మగాన నీ
క్షితి నతఁడేలునట్లు మతి♦సిద్ధిని బొందిన సీతయేలు న
య్యతివయు రాజ్యమొల్లకయె ♦ యాత్మవిభుం దమిఁ గూడి యేగినన్
గతి యిటు యేమటంచు విను ♦ కైకరో! మేమును బోదు మిప్పుడే. ౨౫

చ పురమునఁ గల్గు నెల్లరును ♦ బోయెద రెక్కడ రాముఁడుండునో
తరుణిని గూడి యచ్చటికి ♦ దండపతుల్ చనువారలింకనున్
ధరణిపుఁ, డాతనిం గొలిచి ♦ ద్రవ్యముఁ దాను గణించు సేవకో
త్కరమును రాజ్యమందుఁ బుర♦తల్లజమం దలరారు నెల్లరున్. ౨౬ 1511

1 అర్ధోవా ఏష ఆత్మనో యత్పత్నీ-అని శ్రుతి.

తే. దాసదాసులు లోనగు ♦ తనదు పరిక
రములతోఁ గూడఁ బోదురు ♦ రామువెంట
భరతశత్రుఘ్ను లిరువురు ♦ వల్కలములఁ
గట్టుకొని వనవాసైక♦కాంక్షఁ బూని. ౨౬ 1512

క. వనమున వసించు శ్రీరా,ముని దమయన్నను బ్రియంబు ♦ మునుకొనుచుం గం
గను గొలిచి సంచరింతురు, జనసంఘాహితము నీవు ♦ సలుపఁ దలఁచుటన్.

తే. అతిదురాచారవగుట నీ♦వందఱుఁ జనఁ
బాడుపడియుండు నీపృథ్వి ♦ బాదపముల
తోడఁ గూడఁ బాలింపుమో ♦ దుర్మతీ ! యె
చటను రాముండు కాఁడో? భూ♦జాని యద్ది. ౨౮ 1514

క. కాదో? వనితా! రాజ్యము, శ్రీదయితుఁడు రాముఁడెట వ♦సించునొ వనమే
నౌ దివ్యరాజ్య మద్దియు, నీదగు తనయుండు భూపు♦నికె సుతుఁడైనన్. ౨౯

క. తనకుం దండ్రి మనఃప్రియ,మునఁ దగనీయని ధరిత్రి ♦ ముదమునఁ బాలిం
పను దగదు వినుము నీయం,దును బుత్రునిరీతి నడువఁ ♦ దొడరుటతనికిన్. 30

సీ. పాడిగాదని నొక్కి ♦ పలుకంగ వలయునే భూమినుండియె నీవు ♦ పోయియాక
సమునకుఁ దూఁకిన ♦ స్వజనకవంశము వారివర్తనమును ♦ భరతుఁ డెఱుఁగుఁ
గావున నీవలె ♦ నేవిధమున నైన మఱియొకరీతి ధ♦ర్మంబు దప్పి
నడుచుకొనండు శ్రీ♦నాథుని సాటియౌ రాముని నియతితో ♦ భూమినెందు
తే. ననుసరించి వర్తింపని ♦ యట్టివాఁడు
కలుగఁ డీకఁ బుత్రునందు మి♦గులుప్రియంబు
నను రఘూద్వహు నెడఁబాపి♦కొనిన రాజ్య
మిది కుమారున కహితంబె ♦ యిప్పుడగును. 1517

క. కనుకం గొడుకున కప్రియ,మునె జేసిన దానవీవు ♦ బుద్ధివిహీనా!
కనుఁగొందు విపుడె రాముని, వెనుకొని చను పశుకరిమృగ♦విహగవితతులన్.

క. తరువులు రఘువీరవరుం, డరిగెడు దెస మొగముగాఁగ ♦ నాతని వెంటన్
గరమర్థిఁ జనెడు తెఱఁగునఁ, బరఁగంగాఁ జూతువీవు ♦ పాపస్వాంతా!. 33

చ. తరుణిరో! నీదు కోడలి కు♦దారతరాభరణంబులిమ్ము నీ
వరుసను వల్కలంబు లిడఁ ♦ బాడియె గాదిటువంటి చీరలీ
ధరణిజ కీయనౌ ననెడు ♦ ధర్మమునుం గనుపించలేదు నా
కరసిన నంచు నమ్మునియు ♦ నావసనంబులఁ దీయఁ బంచుచున్. ౩౪ 1520

చ. మరల వచించెఁ గైకకిటు ♦ మానధనుండగు రాముఁ డొక్కఁడే
తరుణి! వనిన్ వసింపఁదగు ♦ దానినె కోరితి వీవు, సీతయున్

వపుని విధంబునఁ బొదలి ♦ వల్కలముల్ ధరియింప వేడ్కవై
తి రహిఁ నలంకరించుకొని ♦ తృప్తిగ నుండఁగ నీమె యర్హయా. ౩౪॥ 1521

చ. కనుక నలంకరించుకొని ♦ కానల రామునితోడ నుండుఁగా
క నృపకుమారి నీమెను ని♦కామమనోహరవాహనావళిన్
దనపరిచారికాళి వివి♦ధప్రియవస్తుమనోజ్ఞవస్తురా
జిని గొని పోవనిమ్ము సర♦సీరుహలోచనయున్ వనంబునన్. ౩౫॥ 1522

చ. పెనిమిటితోడ నుండఁదగుఁ ♦ బెంపుదొఱంగఁగనంచు నీవు భూ
పుని వరదానకాలమునఁ ♦ బూనిక వేఁడఁగ లేదు సుమ్మటం
చనియెను; సాటిలేని మహి♦మాఢ్యుఁడు రాజగురుండు [1]బ్రాహ్మణౌ
ఘనముచిసూదనుం డిటుల ♦ గట్టిగఁ జెప్పుచునున్న సీతయున్. ౩౬॥ 1523

తే. భర్తవేషాదులనె తానుఁ ♦ బరిఢవిల్లి
యతని తోడనె వనమున ♦ కరుగఁ గోరు
నట్టిదియె కాన నామె క♦య్యంబరంబు
గట్టుకొను భావమేమియుఁ ♦ గదలదయ్యె. ౩౭ 1524

ముప్పదియేడవ సర్గము సంపూర్ణము.

## ౩౮ - వ సర్గము.

దశరథుఁడు సీతకు నారచీరలు వలదని కైకను వేఁడుట.

చ. జనకజ లోకనాథుఁడగు ♦ చక్రధరుండు రఘూత్తముండు నా
థునిగఁ జెలంగుచుండియును ♦ దోరపుఁజింత ననాథరీతిఁ జీ
రను మునిసంఘధార్యమును ♦ రాముఁడు చూడ ధరించుచుండ స
జ్జనములు రాజుఁ గాంచుచు వి♦సంజ్ఞనిరీతి నిటుండనేలొకో?. ౧ 1525

క. ఛీ నీయీ బ్రదుకేలని, భూనాథుని దూఱి రాత్రిఁ ♦ బొగులుచు జనని
స్వానమును దాని విని భూ,జానియుఁ దన ప్రాణధర్మ♦సద్యశసులపై. ౧॥

క. తనకుండిన మునుపటి శ్రద్ధను దుఃఖమ్మునఁ దపించి ♦ తా విడనాడెన్
మనుజేశుఁ డంత భార్యను, గనుఁగొనుచున్ వెచ్చనూర్చి ♦ కడువగఁ బలికెన్.

సీ. ఈసీత వల్కల ♦ మిట్లులు ధరియించి పోఁగఁ దగ దిట్టి ♦ పూవుఁబోడి
సుకుమార, బాలిక ♦ సుఖముగ నెప్పుడు నుండంగఁ దగినది♦యుఁ గద యట్టు
లౌట నీబాలిక ♦ యడవి నుండఁగరాదు మద్గురుం డిపుడన్న♦మాట నిజము
భూజాత జనకవి♦భుప్రియకన్యక యిట్టి దుఃఖంబుల ♦ నిప్పుడొంద

తే. నెవరికే నపకారమ్ము ♦ నెపుడుచేసె
నీమె వల్కలమును దాల్చి ♦ యిట్లు జనుల

---

1 బ్రాహ్మణౌఘనముచిసూదనుండు=బ్రాహ్మణేంద్రుఁడు.

నడుమ నొక బీదమాని క♦న్యక విధమున
నిలిచి యున్నదిఁ కేమందు ♦ నేను నకట!. ౪ 1528

చ. జనకమహీశకన్య యిఁక ♦ సత్వర మీకరినంపుఁజీర వి
చ్చి నృపకుమారికార్హమృదు♦చేలములన్ ధరియించుఁగాక యీ
వనితయు వల్కలంబులనె ♦ వారక దాల్చి వనంబుఁ జేరఁగాఁ
జనునని మున్ను నేఁ బ్రతిన ♦ సల్పినవాఁడను గాను దుర్మతీ!. ౫ 1529

క. కావున వస్త్రాలంకృత, యై వైభవములర మంచి♦వగు వస్తువులన్
దా వలచినన్ని గైకొని, పోవుంగాకడవి కింకఁ ♦ బొలఁతీ! వినుమా!. ౬ 1530

సీ. బ్రతుకంగఁ దగదేను ♦ వసుధ నాకున్ మృతిచెంతఁ జేరినది యీ♦స్థితిని గన్న
నేను నీకోరిక ♦ నియమంబుగాఁ జేయువాఁడ నంచును జేసి♦నాఁడఁ బ్రతినఁ
గ్రూరంబుగా నీవు ♦ కోరితి వజ్ఞతచే రాము నడవికిఁ ♦ జేర్పునట్లు
భరతున కభిషేక ♦ వైభవంబును జేయునట్లు నింకేమిచే♦యంగఁ గలను
తే. వెదురుఁ దత్పుష్పమే కాల్చు♦విధిని మాను
క ప్రతిజ్ఞయె కాల్చెడుఁ♦గద నిజంబు
పాపబుద్ధీ! కుజాతి! నా♦పట్టి రాముఁ
డించుకే మపకృతిఁ జేసె♦నేని మున్ను. ౭ 1531

క. జనకజ నిట్లడవికి బంపు నది యొనర్చిన యఘంబు ♦ వనితా! యేమై
నను దొరకినదే? చెప్పుము, ఘనమృగలోచన యుగాభి♦కాంతయిది సుమీ!. ౮

సీ మృదుశీల జనకజ ♦ మిక్కిలి పతిభక్తి గలది యీలాంటి యి♦క్కాంత నీకు
నే యపకారంబు ♦ నిచటఁ జేయుచు నున్నదో పాపమతి నీకు ♦ నొక్కరాము
నడవికిం బంపిన ♦ యంతనె చాలదే? యిద్దియె నీయాత్మ ♦ యెంతదనుక
నుండునో యందాఁక ♦ నురుతరనరకంబు లనుభవింపఁగఁ జాలు ♦ నధికదుఃఖ
తే. కరములగు పాపముల నింకఁ ♦ గడఁగి చేయ
నీకు నేమి ప్రయోజనం♦బో కదా యిఁ
కేమి యనుభవమునఁ గాంచ ♦ నెంచితొక్కొ?
యెఱుఁగఁజాలను నేనింక ♦ నేమి యందు. ౧౦ 1533

సీ. అభిషేకమునకయి ♦ యప్పుడిచ్చుటకి నాతనయుఁడు రాఁ జూచి ♦ తరుణి! నీవు
నారచీరలఁ బదు♦నాలుగేండ్లుండుమా వనమున నంటివే♦మునుఁ ద్వదీయ
వచనము విని యేమి ♦ పలుకకుంటిని గాన నంగీకరించిన ♦ యట్టులయ్యెఁ
గాని సీతను గూడఁ ♦ గానలకుం బంప నీవును గోరలే ♦ దేను నొప్ప
ఆ. కొనఁగ లేదు సీత ♦ గూడ వల్కలములఁ, గట్టుకొనుచునుండఁ ♦ గన్నులారఁ
గాంచె దీవు నేను ♦ గావించిన ప్రతిజ్ఞ, దాఁటి సీతనిట్లు ♦ తగని పనుల. ౧౧

క. శ్రమపెట్టుచు నీగతిఁ బాపమునకు నొడిగట్టి నరక♦ఫలముం గనఁగా

మమతం గోరెదవని న్యాయము చెప్పుచు భూవరుఁడు మహాత్ముండంతన్. ౧౨౪

క. పెనువగ నేడ్చుచు దుఃఖంబునకంతము సుంతయైనఁ బొందక మఱియుం
దనయుని దుఃఖముపైఁ గ్రమ్మిన సందున్ మునిఁగి పడియె మేదిని నార్తిన్.

మ. తనపత్నిం బ్రతిమాలుచున్ శిరమునుం దావంచి కూర్చున్న య
జ్జనకుం గాంచి రఘూత్తముండు వనవాసంబున్ దగం జేయనెం
చిన చిత్తంబున నిట్లుపల్కెఁ గడఁకన్ శ్రీమద్ధరాధీశ ! నా
జననిం గాంచుము వృద్ధురాలు మఱియున్ సాధుస్వభావాఢ్యయున్. ౧౪౪

క. మిక్కిలి కీర్తిం గాంచిన, దికౌసల్య యటుగాన నేమాత్రము ని
న్నక్కఱ మాలిన పల్కుల, నిక్కడనే నిందచేయ కిట్లున్నది సూ!. ౧౫౫ 1538

చ. వరదుఁడ వీవు కావునన వాంఛిత మియ్యది నాది తీర్పఁగా
వరము నొసంగు జ్యేష్ఠసతి వర్ణితసద్గుణశీల యీమాట నో
ధరణిప! నీదుమన్ననను దాను గనందగుఁ గాదె కానకే
నరుగఁగ నన్నుఁ బాసి శ్రమనంది నిరంతరశోకవార్ధిలోన్. ౧౫౪ 1539

క. మునుఁగుచునుండును మునుపీ, పెనుదుఃఖమ్మెఱుఁగ దనుభవించియెఱుఁగదో
జననాథ! మిక్కిలియుఁ బ్రేమను జూపుచు నేలవలయు మత్ప్రార్థనచేన్.

సీ. పూజ్యుఁడవగు నీవు పూర్ణకృపం జూపఁ దగిన యీకౌసల్యఁ దనయదుఃఖ
మొందకుండెడు రీతి నురుతరసన్మానమునఁ జూతువేని నన్నును దలంచు
కొనుచు నీప్రాపునఁ గను జీవితంబును శక్రసమానరాజవర ! నీవు
తనపుత్రునిం గనుఁగొనఁ గోరు నీమెను వనికేను బోయిన బహుళదుఃఖ

తే. మునఁ గృశించి యసువులును బోవ యముని
పురికిఁ బోకుండునట్టులు కరుణఁ గావఁ
దగును నాప్రార్థనమ్ము సార్థకము గాఁగఁ
జేయఁ దగునంచుఁ జెప్పెను న్యాయరీతి. ౧౮ 1541

ముప్పదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౩౯ - వ సర్గము.

రాముని వనగమనమునకు దశరథుఁ డనుమతించుట; సుమంత్రుఁడు రథమును దెచ్చుట.

క. మనుజాధీశుఁడు రాము వచనములు విని తానుఁ దనదుసతులును సుతుఁ డ
మ్మునివేషంబున నుండుటఁ, గని మూర్ఛమునింగి రట్టి క్ష్మాపతివరునిన్. ౧

చ. పెనువగలొంది రాఘవుఁడు ప్రీతి చెలంగఁగఁ జూడఁడయ్యె నే
ర్పునఁ గనియున్ మనంబు వగపుం గని తల్లడమందుచుంట నా
తని వెతపోవునట్లు తగు ధర్మముఁ జూపెడు మాటఁ జెప్పఁడ
య్యెను ధరణీశుఁ డొక్కక్షణమిట్లు విసంజ్ఞత నంది యంతలోన్. ౨౪ 1543

క. తనయుని నే తలఁచుచు నిం, తనరాని వెతం గలంగి ♦ యతులభుజుఁ డతం
డనుకంప మీఱ నేడ్చెను, దనకృత్యమ్ములఁ దలంచెఁ ♦ దద్దుఃఖమునన్. ౩

సీ. నేను మున్నెన్నియో ♦ ధేనువులకు వత్సములకు సంబంధము ♦ గలుగకుండఁ
జేసియుందును; లేక ♦ క్షితిఁ బ్రాణికోటిని హింసించి యుందు న♦ట్లేను జేసి
యుండుట నాకిప్పు ♦ డొదవెను బుత్రదుఃఖంబంచుఁ దోఁచెడిఁ♦గాయమెన్నఁ
దన్నుఁ గల్పించిన ♦ దైవకర్మము నశించినఁగాని తాను న♦శింపఁడట్టి
తే. కాలమే రాకయుండినఁ ♦ గాయమును ద్య
జించి ప్రాణాళి పోవదు ♦ సిద్ధమిద్ది
కానఁ గైకేయి యివ్విధిఁ ♦ గాఱియఁగనఁ
జేసినను మృత్యువేమొ నన్ ♦ జెందదకట. ౫ 1545

చ. అసలునిరీతి వెల్గెడు ప్రి♦యాత్మజుఁ డీతఁడు సూక్ష్మవస్త్రముల్
మనమున నించుకేని యను♦మానము లేక త్యజించి కానలో
మునులు ధరించు చీరలను ♦ మోదమునన్ ధరియించి ముందున
న్నను గని ప్రాణపంచకము ♦ నన్నెడఁ బాయదిదేమి చిత్రమో. ౬ 1546

తే. ఇట్టి మోసంబు పన్ని తా ♦ నెంచినట్టి
కార్యమును సార్థకము చేయఁ ♦ గడఁగుచున్న
కైకకొఱకయి మాత్రమే ♦ కడు వ్యథలను
వీరె ప్రజలిటఁ గాంచుచు♦న్నార లకట! ౭ 1547

చ. అని వినిపించి బాష్పపిహి♦తాక్షియుగుండయి రామ! యంచు న
జ్జనపతి యొక్కమాటె యని ♦ సాంద్రతరంబగు దుఃఖమొంది ప
ల్కనె యటమీఁద నించుకయుఁ ♦ గానక శక్తిని నూరకుండె నొ
క్కనిముస మట్టులుండియుఁ ద♦గం దెలివొంది సుమంత్రుఁ గాంచుచున్. ౮

కవిరాజవిరాజితము:—

కనులను బాష్పము ♦ గ్రమ్మఁగ నిట్లను ♦ గాఢరయంబుఁ ద♦గం జనున
శ్వనికరమొప్పెడు ♦ చారురథంబును ♦ సంతసమీయఁగఁ ♦ జాలిన దా
నిని గొనితెమ్మిఁక ♦ నీవె వెసం జని ♦ నిశ్చలభాగ్య వి♦నీతుని వే
కొని చని చక్కఁగఁ ♦ గోసలదేశపుఁ ♦ గుంభిని కవ్వలఁ ♦ గూర్పఁదగున్. ౧౦

సీ. జననియు జనకుండు ♦ సాధువు వీరుఁడౌ తనయుని వనమున ♦ కనుపుచున్న
వారు గదా గుణ♦వత్పురుషులకిట్టి ఫలము న్యాయమొకో? యీ♦ఫలమెవారి
కగునంచునెంచెద♦ను గనుక గుణములే వలదని పల్కెఁ; న♦వ్వేల సుమంత్రుఁ
డతనియాజ్ఞను గొని♦యతిశీఘ్రమునఁబోయి యరదంబుఁ గైసేసి♦యశ్వములను
ఆ. బూన్చి తెచ్చి కనక♦భూషితమై మేటి
ఘోటకములఁ బూన్చి ♦ కొమరు మిగులు

నట్టి యరద మిదియె ♦ యాయత్తమయ్యె నం
చతఁడు కైమొగిడ్చి ♦ యర్హారీతి. ౧౩ 1550

క. మనుజేశు తనయునకుఁ జె,ప్పెను; దశరథుఁ డంత వేగ ♦ పిలిపించెను గో
శనిచయగృహమున నలరెడు, ధననాయకు దేశకాల♦తత్త్వప్రవిదున్. ౧౪

క. వెలుపల లోపల శుద్ధం, బలఘుగుణాన్వితుఁడు నగుచు ♦ నాతఁడు పురిన్
వెలయు సమస్తపదార్థం,బుల మూల్యము లింత యనుచుఁ ♦ బోల వచింపన్.

చ. నరపతి వానిఁ జూచి నృప♦నందన సీత యరణ్యసీమఁ గా
పురమును జేయఁగాఁ దగిన♦భూరిభయంకరకాలమెన్ని య
త్తరుణికి నుత్తమాంబరవి♦తానము మేలగు భూషణంబులన్
ద్వరఁగ నొసంగుమా వని ని♦వాసముచేయఁ జతుర్దశాబ్దముల్. ౧౬ 1553

క. అనిపలికె; రాజు నానతి, ధనగృహమున కేగి యతఁడు ♦ తగిన విధమునన్
గొని తెచ్చి యంతకాలం,బునకుం జాలిన సువస్తు♦వుల నామెకిడెన్. ౧౭ 1554

తే. ఆసుజాతయు వనికిఁ బ♦యానముచేసి
శాస్త్రరీతినిఁ దగు తన ♦ సకలగాత్ర
ములను బహువిధభూషణ♦ముల నలంక
రించెఁ జిత్రంబుగాఁ దమి♦మించునట్లు. ౧౮ 1555

సీ. కాలంబునన్ దీక్ష్ణ♦కరుఁ డుదయించుచుఁ దనమయూఖాళి గ♦గనము నలరఁ
జేయుచందంబున ♦ సీతభూషణములఁ గై చేసికొని చక్కఁ♦గాఁ దదీయ
కాంతుల నలరించెఁ ♦ గమ్రసౌధంబును; దరువాతఁ గౌసల్య♦తనదుస్నుషను
నల్పకార్యంబుల ♦ నాచరింపని దానిఁ గరముల బిగిమీఱఁ ♦ గౌఁగిలించి

తే. శిరము మూర్కొని కులటలౌ ♦ స్త్రీలు భర్త
లడిగినవి యెల్ల నిచ్చి య♦త్యంతమెలమి
గారవించుచు నుండినఁ ♦ గష్టకాల
మరుగుదెంచి యాపదవియు ♦ నణఁగిపోవ. ౧౯ 1556

క. పెనిమిటుల లెక్కచేయక, మనములఁ గోపంబుఁ బూని ♦ మాటలఁ దూలం
గను జేయుదు రాదినిసుఖ,మునుగాంచుచు మగలఁ బ్రీతిఁ♦బూనికొలుచుచున్.

క. అదనున నిస్వాదులు నా,పద లినుమంతలుగ నైన ♦ వచ్చినచో వా
రి దిగన్ విడుతురు వనితల,కిది నైజ మసత్యమాడు♦టే తద్ధితమా. ౨౧ 1558

సీ. మనసులు పలుమాఱు ♦ మాఱుచు నుండును వారిమనస్సుల♦పద్ధతి యిది[ద్రు
యని యెఱుంగుటకష్ట♦మఘుదాయకములగు కార్యంబులని చేయఁ♦గడఁగుచుం
తలఁపులట్టివి యయి ♦ తగ నుండువారల ప్రేమయు స్థిరముగా ♦ దేమొకాని

క్షణము లోపల మాఱిపసమసి పోవును; [1]గొప్పవంశంబుగాని యేపనసనైన

తే. మునుపు చేసిన యుపకారము మఱి విద్య
యగ్నిసాక్షిగ గ్రహియించినట్టి మాట
యంబరాదుల నిచ్చుట యాదియైన
వేవియేగాని వారల హృదయములకు. ౨౨౹ 1559

తే. ఇంపు గూర్పంగఁజాల విం కేమటన్న
ధనమె వారికి హితము హృదయములెంతొ
చపలములు సుమ్ము; వంశార్హ సాధుశీల
మునఁ జెలంగుచు సూనృతమును బలుకుచు. ౨౩ 1560

క. గురువుల యుపదేశమ్మును, వరుసం బాటించి శాంతి భాసిలి తగు స
త్తరుణులకుఁ బతివ్రతలకుఁ, బరమపవిత్రమగునట్టి వస్తువు పతియే. ౨౪ 1561

క. ఒరులెవ్వరు గారు సుమా, వరమతి నాపుత్త్రుఁడితఁడు ప్రవ్రాజితుఁడై
పరఁగెనని సంశయింపకు, తరుణీ! గతధనుఁడెయైన ధనయుతుఁడైనన్. ౨౫

క. నీవితనిఁ జూడుము పర, దైవముగా ననుచు మిగుల ధర్మార్థహితం
బై వఱలునట్లు పల్కిన, నావసుధాతనయ యెన్ని యత్తె మనసునన్. ౨౫౹

క. తనయెదుట నున్న యత్తకుఁ, దనకరములు మోడ్చి పలికెఁ దమినార్యా! మీ
రనుమతి యిడినట్టులె నే,నొనరించెద సంశయంబు నొందకుఁ డింకన్. ౨౬౹

క. పెనిమిటి యెడల నదెవ్విధి,గ నడుచుకొనవలెనో తెలియఁ గల్గితి మున్నే
వినియున్నదాన, దుర్మతి, వనితలతో సాటిచేయ వలదిఁక నార్యా!. ౨౭౹

క. జలజారినుండి తత్ప్రభ, తొలంగి పోకుండునట్లు తొలఁగను ధర్మం
బులనుండి నేను సుంతయుఁ, బలుమాటలిఁకేల నాకుఁ బతియే హరి సూ!.

సీ. వాయింపనేరదు వల్లకితంత్రులు లేనిచోఁ జక్రంబు లేకయున్న
నరదంబు పోవ దష్టాత్మజ శతమున్నఁ గాంతుఁడే లేనిచోఁ గలుగదుసుఖ [ము
మంగనకుందండ్రి యైహికమునుసుంతయొసఁగుఁదల్లి యునట్లె యొసఁగుమతుఁ
మితముగా నొసఁగు నమితముగా నైహికాముష్మికంబులనిచ్చు మోదమలర

తే. భర్త, కావున నెవ్వతె పతిని పూజ
నలరఁ జేయకయుండు నియ్యమలపథము
ననుసరించియె యున్నదానను మఱియును
ధర్మములను బతివ్రతా తతులవలన. ౩౦౹ 1567

---

1 నకులం నకృతం విద్యా నదత్తం నాపి సంగ్రహం, స్త్రీణాం గృహ్ణాతి హృదయ మనిత్య హృదయా హితాః-అనిమూలము. దత్తమనఁగా సమ్మానపూర్వకవస్త్రాభరణాదిదానము. సంగ్రహ మనఁగా నగ్నిసాక్షిక పాణిగ్రహణము ఈయర్థమే పద్యమున సంగ్రహముగ నున్నదని యెఱుం గఁదగు.

క. విని యున్నదాన శ్రేష్ఠం, బని పేరుం బొందినట్టి ♦ యాయాధర్మా
ళిని నెఱిఁగి యున్నదానను, గనుక న్నేనేల భర్తఁ ♦ గాంతు నవమతిన్. ౩౬

క. పరదైవము ప్రాణేశుఁడె, తరుణులకగుఁగాదె? యనినఁ ♦ దాశాంతమునన్
బరిపూర్ణయౌట దశరథ, వరపత్ని మహీజ యిట్టి ♦ భంగి హితముగన్. ౩౬½

చ. పలికిన పల్కులన్ వినుచుఁ ♦ బట్టిచనుంగద కౌనకంచు ను
జ్జ్వలముగ నున్న దుఃఖమున, ♦ జానకిదా పతిభక్తి యిట్టిదే
సులలిత మన్నమోదమునఁ, ♦ జొక్కుచుఁ గన్నుల నీరునించె; మి
క్కిలియగు ధర్మచిత్తము న♦కృత్రిమభావము గల్గు రాముఁడున్. ౩౭½ 1570

సీ. [1]ఎల్లతల్లులు గొల్వ ♦ నెసఁగు తల్లిని వలగొని యంజలిని బట్టి ♦ యనియె నిట్లు
తల్లి! దుఃఖింపకు ♦ ముల్లమునందు, నా [2]తండ్రిని జూడుము ♦ త్వరగఁ గాన
వసియించు కాలంబు♦పరిణతమౌ, నీవు నిదురించుచుండఁ దొ♦మ్మిదియునైదు
సంవత్సరంబులు ♦ చను నివన్నియు నొకరాతిరిదైన ని♦ద్రవలెఁ బోవు
తే. నంత నిచ్చటి కరుదెంచి ♦ యాప్తయుతుఁడ
నయి సమగ్రమనోరథం ♦ బలర నున్న
నన్నుఁ జూడంగఁ గలవని ♦ యన్నివిషయ
ములను గుప్తముగాఁ దెల్పు ♦ పలుకుఁ బలికె. ౩౮½ 1571

ఆ. ముదముమీఱ నతఁడు ♦ మున్నూటయేఁబది,మంది తల్లులను వి♦మర్శనముగ
వేఱువేఱఁ జూచె; ♦ వెలఁదు లవ్వారును, దనజననిని బోలి ♦ వనటఁ గుంద.

క. కనుఁగొని రాముఁడు వారల, కనియెం బ్రాంజలియు నగుచు ♦ నతిశయధర్మం
బునఁగూడ నట్లు మీరలు, వినుఁడీ నా ప్రార్థనమును ♦ వితతప్రేమన్. ౩౯

సీ. ఒక్కచోటనె కూడి ♦ యుండి యాడుచునుంటఁగాని యజ్ఞతచేతఁ♦గాని యెద్ది
యే నపరాధంబు ♦ నేను జేసితినేని యద్దాని క్షమియింప ♦ ననుమతింప
వలయు నే సెలవందు♦వాఁడ నీఁకంచనె; ధర్మయుక్తంబుగఁ ♦ దగినవిషయ
మును గూర్చి యాడిన ♦ ముద్దుపల్కుల విని శోకోపహతచేత♦సులను వారు
తే. కుంది; [3]రంతటఁ గ్రౌంచశ♦కుని గళస్వ
నమునకున్ సాటియౌ గళ♦నాద మడర
వారలేడ్చిరి యాతని ♦ పల్కులు విని
వనికి నీఁకఁ బోవుఁగద యీతఁ ♦ డనుచుఁ దలఁచి. ౪౦ 1574

ఆ. మురజపణవమేఘ♦ములు మొదలగు వాద్య
నిస్వనముల వెలయు ♦ నృపుని సౌధ

---

1 మాతృమధ్యేఽతిసత్కృతామ్ - అనిమూలము. అతిసత్కృతామ్ మాతృభిరితిశేషః అని మహేశ్వరతీర్థులు. 2 పశ్యత్వం పితరంమమ-అనిమూలము. 3 తాసాం సన్నాదః క్రౌంచీనామివ **నిస్వనః-అనిమూలము.**

మప్పుడయ్యె జనము ♦ లతిదుఃఖమున నేడ్చి
కైకఁ దిట్టఁ దత్పురీ♦నాకులంబు. ౪౧ 1575

ముప్పదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౦ - వ సర్గము.

రాముఁడు వనవాసమునకుఁ బ్రయాణమగుట.

క. తరువాత రామలక్ష్మణ, ధరణీజలు కై మొగిడ్చి ♦ దశరథపృథివీ
వరు పదములఁ బట్టి నమస్కరణముఁ గావించి జనని♦జనకునిఁ గొలువన్. ౧

చ. తరుణము గాకపోయెనని ♦ తద్దయు దీనత దోఁపఁ జుట్టునుం
దిరిగిరి ధర్మవేత్తయు మ♦తిస్థిరతంగను రాముఁడంత నా
ధరణిజ లక్ష్మణుల్ వనికిఁ ♦ దాఁ గొనిపోవఁగఁ దండ్రి వేఁడి యా
తురపడు తల్లినిన్ విడిచి ♦ దూరము పోవఁగ వచ్చె నంచెదన్. ౧౪ 1577

క. ఘనదుఃఖమొంది దానన్, గని మోహము నంతమొ్రక్కఁ ♦ గడుదీనత న
జ్జననికిఁ దోడనె యాతని, యనుజుండును మ్రొక్కి పిదప ♦ నాత్మజననికిన్.

క. చరణములం బట్టి నమస్కరణముఁ గావించె; మ్రొక్కు ♦ గారాబుసుతున్
దరుణి కని దీర్ఘబాహుని, శిరంబు మూర్కొనుచు నేడ్పు♦చే వెతఁ గనుచున్.

*చ. అతనికి మేలు కోరినది ♦ యాట వచించెను; రాముతల్లి లో
కతతిని గాచుపొంటెఁ దన♦గాదిలి పుత్త్రకు నెట్లు గాంచెనో
హితమతియైన రాఘవున ♦ కెంతయుఁ గూర్చెడు నిన్ను నన్నసం
గతి వనికేగ నట్టులనె ♦ గంటిని నేనును బుత్త్రరత్నమా. ౫ 1580

---

* 'సృష్టస్త్వం వనవాసాయ స్వనురక్తస్సుహృజ్జనే, రామే ప్రమాదం మాకార్షీః పుత్త్ర భ్రాతరిగచ్ఛతి' అని మూలము. 'భ్రాతరిగచ్ఛతి' యనుచో సీతతోఁగూడ రాముఁడు పుష్పితకాననములఁ జూచుచు నాపారవశ్యమునఁ బోవుచుండ అనియు; 'ప్రమాదం మాకార్షీః' రామగమనసౌందర్యము నీచిత్తము నాకర్షింప నీ వతని రక్షించుపనియందుఁ బ్రమాదము నొందకు మనియు లేక రాముఁ డడవికిఁ బోవుచుండ నతఁడు పోనీయని పరాకున నయోధ్యయందే యుండకుమా యనియు నర్థాంతరమని గోవిందరాజులు వ్యాఖ్యలో సూచించిరి.

'సృష్టస్త్వం' రామ కైంకర్యార్థమే పుట్టింపఁబడినవాఁడవు. 'వనవాసాయ' రామసహాయ ప్రయోజనమునకే నాకడుపున నీవు పుట్టితివి. అట్టి నీ విపుడడవికిఁ బోదువేని నీపుట్టుకకుఁ బ్రయోజనము సిద్ధించిన దగును. 'రామే ప్రమాదం మాకార్షీః భ్రాతరిగచ్ఛతి' రాముఁడు పోవుచుండ నాతని గమనవిశేషమందే చూపు నుంచితివేని దాన నేదియేని కీడుమూడి యతనిని బోఁగొట్టుకొనవలసివచ్చును గాన ప్రమాదమొందకుమా యని తనిశ్లోకి.

ఈయర్థములు వచ్చునట్లు ఇందు మూఁడుపద్యములు చెప్పఁబడినవని పాఠకులు గ్రహింపవలయు.

ఆ. దీనికొఱకె నిన్ను ♦ దేవుఁడు పుట్టించెఁ
గాన రాముఁ డటవిఁ♦గల విచిత్ర
ములను గనుచుఁ దనదు ♦ లలనతోఁ బరవశుఁ
డగుచుఁ బోవుచుండు ♦ నతని సేవ. ౮౪ 1581

క. కనుచుఁ దద్గతి సౌందర్యనిహితమతివగుచు నద్రి ♦ యాకర్షింపం
గ నతని గాచెడు పనిలోఁ, దనయా! యేమఱకు మొక్క♦తఱినే నీవున్. ౫

క. అనఘా! రాముఁడు రాజ్యాదినిఖిల సంపదలుపోయి ♦ దీనతఁ గనినన్
ఘనసంపదలన్ జెలఁగిన, విను మీతఁడె శరణమగును ♦ విధిగా నీకున్. ౫౪

క. అనుజుం డన్నకు లోఁబడు, టనయము సత్పురుష సముద♦యాచరితంబై
తనరారు ధర్మ మిజ్జగ,మున నింతియకాదు దాన♦మును మఖరతియున్. ౬

క. అనిలో దేహము వదలుట,యు నివన్నియు మీకులమున♦కొగి యోగ్యములై
తనరు సనాతనకాలం,బున నుండియె వచ్చు ధర్మ♦ములె పుత్రమణీ!. ౭

క. తనువే వదలఁగ వలసిన, పని యొక్కటఁ బ్రాప్తమైనఁ ♦ బరమప్రీతిం
గని యట్లు చేసి శ్రీరా,ముని గావుమటంచుఁ బలికి ♦ ముద్దుతనయుఁడున్. ౭౪

క. తనయున్నతప్పు నెద్దియుఁ, దనకప్రియమనుచు నాత్మఁ ♦ దలఁచు టెఱిఁగి యా
తనితోడఁ బొమ్ము పొమ్మిఁక, నని పలుమఱు పల్కి మరల ♦ నాతనితోడన్. ౮

*క. తనయుని మనస్సు చంచల,తను గాంచునొ వననివాస♦తరుణమ్మునఁ ద
న్నను దండ్రిని నగరంబును, దనమది స్మరియించియనుచుఁ♦దగనిటుపల్కెన్.

†క. కనుమా రాముని దశరథుఁ, గనుమా మేల్ తెల్వి న జన♦కప్రభుపుత్రిన్
గనుమా యయోధ్యను నటవిఁ, జనుమయథాసుఖముగసుత♦సత్తమయింకన్.

---

* సుమిత్రాగచ్ఛ గచ్ఛేతి;పునఃపున రువాచ తమ్-అని మూలము. గచ్ఛగచ్ఛేతి వీప్సయా సుమిత్రాయా అపి రామానుగమనే మహానాదరోద్యోత్యతే. వనవాసే పితృమాతృనగరస్మరణే మనశ్చాంచల్యం భవిష్యతీతి ధియా తత్రైవ పిత్రాది ప్రతినిధిం కల్పయతి. అనువ్యాఖ్య ననుసరించి యీపద్యము వ్రాయఁబడినదని యెఱుంగునది.

† రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజాం, అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్-అని మూలము. దీనికి గోవిందరాజాది వ్యాఖ్యాతలు పెక్కు అర్థములు వ్రాసిరి. ఈ పద్యమున శబ్దనిష్ఠములగు నాయర్థము లన్నియు నిమిడి యున్నవని యెఱుంగవలయు. ఎట్లనఁగా: రామునిన్=రామచంద్రుని, దశరథున్=దశరథుని గా-నన:గాఁదండ్రినిగా,కనుమా=తెలిసికొనుమా. జనకప్రభుపుత్రిన్=సీతను, నన్=నన్నుగా, మేల్ తెల్విన్=చక్కని తెలివితో, కనుమా=తెలిసికొనుమా అటవిన్=అడవిని, అయోధ్యను=అయోధ్యనుగా (భోగస్థానముగా), కనుమా=తెలిసికొనుము సుతసత్తమ = ముద్దులకొడుకా! ఇంకన్, యథాసుఖముగన్=సుఖముగా, చనుమ=పొమ్మా నాయనా! రాముఁడే నీకుఁ దండ్రి. సీతయే తల్లి. అడవియే అయోధ్య కాఁగలదు. కాఁబట్టి మనస్సున దుఃఖమొందక రామునివెంటఁ బొమ్మని తాత్పర్యము. మఱియు దశశబ్దమునకు పక్షి యని యర్థము. "దశః పక్షీ విహంగమః" అని హలాయుధనిఘంటువు. ప్రకరణబలమున నిచటఁ

క. అనియె సుమంత్రుం డప్పుడు, వినయవిదుండు గాన నెంతొ ♦ వినయంబున నిం
ద్రునకున్ మాతలిభంగిని, దనకరములు మోడ్చి పలికె ♦ దశరథసుతుతోన్.

చ. అరదము నెక్కు మియ్యదె మ♦హాయశముంగను రాజపుత్ర! శ్రీ
కరశుభసంపదల్ వొదలుఁ♦గాక రఘూద్వహా! నీకు నింక ని
య్యరదము నెందుఁ దోలుమని ♦ యానతి నిత్తువొ యందుఁ జేర్తు స
త్వరముగ నిన్ను; నాల్గుపది♦వర్షములేకద కాననుండనౌ. ౧౧౪ 1591

---

బక్షి యనఁగా గరుడుఁడు దశరథుఁడనఁగా విష్ణువు. రాముని శ్రీవిష్ణువుగా నెఱుంగుము. సీతను మా=లక్ష్మిగా, కను=ఎఱుంగుము, కనుమా-అనుచోట కను-మా. అని పదవిభాగము. కనుము అనుచో మువర్ణము హల్లుపరమౌట లోపించును. మాను అనుచో గ్రుతము లోపించును. కాన సీతను గొప్ప తెలివితో లక్ష్మిగా భావింపుమా. అటవిని అయోధ్యను-అనఁగా భగవంతునకు నివాసయోగ్యమైన పరమపదముగా భావింపుము. ఐత్సా! నీవు కడుం జిన్నవాఁడవు. కాఁబట్టి భగవత్తత్త్వము నీకంతగాఁ దెలియదు. రాముఁడనఁగా అన్నయని యూహించి యిష్టానుసారముగఁ బ్రవర్తింతువేమో? అను శంక నాకుఁ గలదు. దానిచే నేనీ కీవాక్యము నుపదేశించుచున్నాను. రాముఁడు శ్రీమహావిష్ణువు, సీత శ్రీదేవి. అటవి ఏకాంతసేవ చేయుట కర్హమగు పరమపదము. కావున నిట్టిభావనతో సుఖముగాఁ బొమ్మా యని దీనితాత్పర్యము. మఱియు,

రాముని-దశరథున్-కనుమా=ఈయిరువురకుంగల తారతమ్యము నెఱుంగుము. నన్ - జనక ప్రభుపుత్రిన్-కనుమా=గుణములయందు మాయిరువురకుంగల తారతమ్యము నెఱుంగుము. అయోధ్యను-అటవిన్-కనుమా = వానిరెండింటికింగల తారతమ్యము నెఱుంగుము. అనఁగా దండ్రిని, దల్లినగునన్నును, సుఖధామమగు పురమును వదలిపోవుచున్నవాఁడనే యని చలింపకుము. తండ్రికంటె శ్రీరామమూర్తి మిన్న. నాకంటె సీతాదేవి నీమేలుగోరునది. అయోధ్యకన్న నడవియే చక్కనికైంకర్యమునకు నేకాంతస్థానము. మఱియు,

చిన్నికుమారా! లక్ష్మణా! దశరథున్=నీతండ్రిని, రాముని=ఉడిగినవానినిగా, కనుమా. నన్= నన్ను, జనకప్రభుపుత్రిన్=ప్రభువగుతండ్రికిఁ బుత్త్రికగా, అనఁగా కైకేయిపెట్టు బాధపెట్టి పుర. మునుండి వెడలనంపఁగా భర్తయు నుండకపోగాఁ దండ్రియింటికేగి యటనుండుదానినిగా నెఱుంగుము. అయోధ్యను, అటవిన్ - కనుమా. ఈపట్టణము రాముఁడు వెడలఁగనే నిర్జనమై యడవికాఁగలదు. అని తెలియుము. అనఁగా రాముఁడు పురము దాఁటగనే నీతండ్రి మృతినొందును. నేను దండ్రియింటికిం బోవుదును. ఈపురిలో నెవ్వరు నుండరని తాత్పర్యము. ఇంతియకాదు.

రాముని, దశరథున్, కనుమా. నాయనా! అన్న రాముఁడు, తండ్రి దశరథుఁడు. ఈయిద్దఱిని తెలిసికొనుము. తండ్రియొద్ద నిచ్ఛానుసారము ఉండవచ్చును. అన్నయొద్ద నట్లుండరాదు. ప్రమాదం పడుదువేమో జాగ్రత్త. నన్, జనకప్రభుపుత్రిన్, కనుమా. నేను దల్లిని, సీత వదినె. మాయిద్దఱిని దెలిసికొనుము. నాయొద్దఁ బ్రవర్తించిన ట్లన్నభార్యయొద్ద నడుచుకొందువేమో. దేహమునందెల్లఁ గన్నులుగా నడుచుకొనుమా. ఏమాత్రము ప్రమాదము నొందకుము. అయోధ్యను, అటవిన్ కనుమా. నీవున్నది పురము. మనయధికారమునకు లోఁబడినది. అరణ్యమో భయంకర మృగరాక్షసభూయిష్ఠము. తండ్రీ! జాగరూకుఁడవై ప్రవర్తింపుమా.

*ఆ. కైకయాజ్ఞ యిట్టు♦లేకద చేసెన, ట్లాట జాగెఁ కేల ♦ యందు నొక్క
దినము గడచిపోయి♦నను లాభమేగాన, నిపుడె దానిఁ దీర్ప ♦ నేగవలయు.

క. అనె సీత యత్త యిచ్చిన, ఘనవస్త్రాభరణములను ♦ గైకొనుచుం దా
ల్చినదాట నదిఁ దమింగని, యినకాంతినెసంగు నరద♦మెక్కెం దొలుతన్.

చ. కనకవిభూషితం బనల♦కాంతిసమాన మయూఖమైన స్యం
దనమును దాని రాముఁడును ♦ దమ్ముఁడు నెక్కిరి వేగ; మామ యా
జనకజకాననస్థితిని ♦ జక్క గణించుచు భూషణాళి వ
స్త్రనిచయ మంతకుం దగిన♦చందమునం దగ నిచ్చె నామెకున్. ౧౫౯౪ 1594

క. తనయుల కాయుధజాలం,బును గవచంబులను నిచ్చెఁ ♦ బూనిక నట్లే
మనుజేశుఁ; డంత సారథి,యును మంత్రియునౌ సుమంత్రుఁ♦డుద్యమమలరన్.

సీ. భూజాతకిచ్చిన ♦ భూషణాంబరముల రామలక్ష్మణుల యు♦ద్దామకవచ
ములను దివ్యాయుధం♦బులఁ, బుట్ట, గుద్దలి రథమధ్యముననుంచి ♦ రమణితోడ
సహజులిద్దఱు లస♦త్స్యందనమెక్కినఁ గని వాయువేగంబు♦గాఁ జనియెడు
శ్రేష్ఠాశ్వముల నద♦ల్చి యతండు గట్టిగాఁ దోలె రాముండును ♦ జాలకాల
తే. మటవి వసియింపఁ బయనమై ♦ యరుగ నప్పు
డాయయోధ్యయు ఘోటక♦హస్తిముఖ్య
ములును జానపదులుఁ బెను♦మూర్ఛ మునిఁగి;
రంత నప్పురమున నున్న ♦ యఖిలజనులు. ౧౫౯౬ 1596

క. మనసులు కలంగఁజేయం,గనేమియును దోఁపకుండఁ♦గా నింద్రియముల్
వనటం గుందఁగ శ్రీరా,ముని వెంటఁ జనంగ నప్పు ♦ ఘూనిరి త్వరతోన్. ౧౫౯౭

సీ. మదకరుల్ చాల న♦నర్ఘ ఘీంకారముల్ చేయంగఁ బరితపిం♦చెడు మనసుల
నటు నిటు పరుగెత్తు♦హయములభూషణంబులు మ్రోగుచుండన♦ప్పురముభూరి
శబ్దమయం బయ్యె; ♦ సత్వర మాపౌరు లర్భక వృద్ధము♦ఖ్యముగ రాము
నెడఁబాసి దుఃఖమ♦దెంతయుఁ బీడింప ఘర్మార్తు లెవ్విధి♦గా జలముల

---

ఇట్లు రామదశరథులను పదములను, మాశబ్దజనకప్రభుపుత్రీశబ్దములను ఎన్నెన్నిరీతులనో మార్చిమార్చి యర్థములు చెప్పియున్నారు. అన్నియర్థములు ఆపదములనే యిటఁ జేర్చితినిగాన నూహించుకొనవచ్చును. కనుమా-అనుచో లక్ష్మీపరమగు నర్థము కావలసినపుడు, కను-మా-అని పద విభజనము చేసికొన్నయెడల సరిపడును. మేల్ తెల్విన-అనుచో చక్కనిజ్ఞానముచేతనే అని యవ ధారణార్థము చెప్పుకొనవలయు. నన్ను అనుచో మేల్ తెల్విన్ - నన్-అని పదముల విభజింప వలయు. ద్రుతము లోపించును. కవిచంద్రుఁడగు వాల్మీకి అవేహిత్యాదిధాతువులం బ్రయోగింపక విద్ధి అనుదానిం బ్రయోగించుట చక్కనిజ్ఞానముతో తెలిసికొనుమను నర్థము తోఁచుటకై యని యెఱుంగునది. దానిచేతనే పద్యమున మేల్ తెల్వి నని ప్రయోగింపఁబడియె ననియు నెఱుంగునది.

* తాన్యుపక్రమితవ్యాని-అనిమూలము. చతుర్దశవర్షేషు ఏకదివసాపనయనమపి మహాన్ లాభఇతి-అను వ్యాఖ్యననుసరించి యిది వ్రాయఁబడినదని యెఱుంగవలయు.

తే. కొలఁకుఁ బోదురో యభ్ఛంగిఁ ♦ గొమరుమిగుల
రామునింగూర్చి పరుగెత్తి ♦ రాము నరజ
మునకుఁ బార్శ్వములం గొంద♦ఱును బిఱుందఁ
గొందఱును బట్టుకొని వ్రేలు♦చుం దమిమెయి. ౨౦ 1598

చ శిరముల నెత్తి యానృపుని ♦ జ్యేష్ఠకుమారుని మోముఁ జూచుచుఁ
గరమనురాగభారమునఁ ♦ గన్నుల నీరు ముఖంబు నిండఁగా
నరదము దోలుసూతుని మ♦హాస్వనమొప్పఁగఁ గాంచి పల్కిరో
పరమకృపాత్మ! గుఱ్ఱముల ♦ పగ్గములన్ బిగఁబట్టుమా యిఁకన్. ౨౧ 1599

చ. అరదము మెల్లఁగా నడుపు ♦ మందఱముఁ గనువారమీ మనో
హరరఘువర్యవక్త్రము మ♦హాత్మక! యిప్పుడు తప్ప నింకనే
తరుణమునందుఁ జూతుమొకొ ♦ దాని వచింపఁగలేము మేము ని
ర్జరసుతుసాటియౌ తనయ♦రత్నము రాముఁడు కాన కేగఁగాన్. ౨౨ 1600

చ. జనని మనం బదెట్టిదొకొ? ♦ సత్వరమేలొకొ చూర్ణితంబుగా
క నిలిచియున్నదీ మనసు♦కాదగు నాయసకల్పితంబె; యి
జ్జనకజ యేగుచున్నయది ♦ ఛాయగతిం బతితోడఁ గూడి కా
వునఁ గృతకృత్యయైన దిదె ♦ పూని పతిప్రియధర్మ మెంతయున్. ౨౩ 1601

ఆ. అట్టి ధర్మమునె య♦హర్నిశమును బూని, యున్నదార! భాను♦నుగ్రకాంతి
స్వర్ణపర్వతమును ♦ బాయని యట్టులో, యనఘ లక్ష్మణా! మ♦హాత్మ! నీవు.

క. నిరతము ప్రియవాదియు ని,ర్జరతుల్యుఁడు నైన యట్టి ♦ భ్రాతకుఁ బ్రీతిం
బరిచర్య చేయుచుందువు, పరికింపఁ గృతార్థుఁడ వనఁ ♦ బరఁగుదు వౌరా!.

క. ఇతనిన్ వెనుకొని పోవుట,యె తపస్సు మహాఫలంబు ♦ నిదె యభ్యుదయం
బు తలంప స్వర్గమార్గము, కృతార్థుఁడవు సుమ్ము వేయు ♦ నేలా పలుకుల్. ౨౬

చ. జనహితుఁడై చెలంగు రఘు♦సత్తముఁ దత్కులనందనున్ బ్రియం
బును గలిగించునాతనిని ♦ బూనికమీఱఁగ వెంబడించి య
జ్జనులొగిఁ బోవుచుండి తమ♦స్వాంతమునం గల భావమంతయుం
గనఁబడఁ బల్కుచున్ మరలఁ♦గా మనసొప్పమి నేడ్చిరందఱున్. ౨౭ 1605

చ. మనమునఁ గుందుచుం దనదు♦మానినులెల్లను దుఃఖితాత్మలై
తన వెనువెంట రాఁగ గుణ♦ధామునిఁ బుత్రునిఁ జూచువాఁడ నే
నని నృపుఁ డంతటం గదలి ♦ హర్మ్యమునుండి ప్రయాణమయ్యె; నా
తనికి వినంబడెన్ వ్యధ ని♦తాంతముగుందు సతీనినాదముల్. ౨౮ 1606

క. ద్విరదము బంధించినచోఁ, గరేణువులు రోదనంబు ♦ గావించుగతిన్
దరుణులు రాముఁడు కానల, కరుగుట గనరామి నేడ్చి♦రని దశరథుఁడున్.

క. మనమునఁ దలంచి యట శ్రీ,ఘనుఁ డాతఁడు [1]రాహుఖగము♦ గ్రసియించిన చం
ద్రునిరీతిఁ గుండె వారలు, వనరుట నాలించి శోక♦వార్ధి మునుఁగుచున్. ౩౦
క. శ్రీమంతుఁడైన దశరథ, రాముం డసమానధైర్య♦రాజితుఁ డగుటన్
దా మానిను లేడ్చుటఁ గని, యేమియుఁ గలఁగక యెపల్కె ♦నిటు సూతునితోన్.
క. త్వరితముగ రథముఁ దోలుము, తరుణులు వెనువెంట రాఁగఁ♦దగదని సూతుం
బురికొలుపుచుండ నందఱు, నరదము వేగంబ పోవు♦నని యార్తిమెయిన్. ౩౧
క. నిలుపుము నిలుపుమ యని వా,రలునుం దోల్తోలు మనుచు ♦ రాముండును వే
పలుకుట సూతుండపు డ,ప్పలుకుల రెండింటి నొనరు♦ప నశక్తుండై. ౩౨
తే. మార్గమున నేమితోఁచకే ♦ మాడ్కిఁ జేయఁ
జాలకుండె; మహాబాహు♦శాలి రాముఁ
డరుగ రథగమనంబున ♦ నడరు ధూళి
జనుల బాష్పాంబుసిక్తమై ♦ శాంతినొందె. ౩౩ 1612

సీ. రాముండు బయలు దే♦రంగఁ బౌరులు దుఃఖమున నేడ్చుచుం బాష్ప♦ముల విడుచు
నార్తిహాహాకార♦మప్పుడు సేయుచు స్పృహ తప్పి పోయిన♦ట్లెంతొ సొమ్మచు
సిల్లిరి; యటునిటు ♦ చేఁపలు క్షోభింపఁ గదలుఁ దమ్ములనుండి♦ కమ్రమధువు
కాఱుచందంబునఁ ♦ గాంతల దృష్టులనుండి దుఃఖజమయి ♦ యొప్పు జలము
తే. పాఱె; శ్రీమంతుఁడౌ నృప♦వరుఁడు నగర
మంతయును రాముఁడేగుట ♦ కార్తినొంది
యేకచిత్తంబునం గుందు♦టెఱిఁగి వగను
బడియె హతమూలవృక్షంబు♦భంగి నిలను. ౩౪ 1613

క. రాముని వెనుకొని జనులా, భూమీశుని దుఃఖమొంది ♦ పొగిలెడు వానిం
దాము గని కటకటా! యని, భీమంబుగ నేడ్చి రపుడు ♦ పెను దుఃఖమునన్.
క. హా రామా! యని కొందఱు, హా రాముని గన్నతల్లి! ♦ యని కొందఱునుం
బేరుకొని యార్చి యేడ్చిరి, పౌరులు శుద్ధాంతజనులుఁ ♦ బరమార్తులునై. ౩౬
తే. జనుల యాక్రోశముల విని ♦ వెనుకఁ దిరిగి
భ్రాంతచేతస్సునం గుంది ♦ వచ్చుచున్న
తల్లిదండ్రులఁ గనియె న♦ద్దాశరథియు
వారిముందుగ వచ్చెడి ♦ పౌరవితతి. ౩౭ 1616

ఆ. పాశబద్ధమైన ♦ వాజిశిశువు తల్లిఁ, గాంచుచున్నరీతిఁ ♦ గాఁగ ధర్మ
పాశబద్ధుఁడౌట ♦ స్పష్టముగాఁ దల్లి, జనకుఁ గనక కాంచెఁ ♦ గను తుదలను.
ఉ. యానములెక్కి రాఁదగిన ♦ యంతటివారలె యయ్యు నార్తిమై
సూనునిఁ గాంచఁ గాల్నడక ♦ సొక్కుచు వచ్చుచు నున్నవారిఁ దా

1 రాహుఖగము=రాహుగ్రహము.

జానుగఁ గాంచె శర్మమును ♦ సంతతముం గనఁజాలి దుఃఖమే
కానని వారలయ్యు నది ♦ గాసిలఁ జేయఁ దపించు వారలన్. ౪౧ 1618

క. జననీ జనకుల నివ్విధిఁ, గనుఁగొని యోసూత! నీవు ♦ కడువేగము స్యం
దనమును బోనిమ్మా యని,యనుజ్ఞ నిడెఁ బూరుషేజ్యుఁ♦డౌ రఘువరుఁడున్.

మ. బరిగోలం గొని ప్రేయ దానికి సహిం♦పన్ లేని దంతీంద్రమ
ట్లురుదుఃఖార్ధితులైన యప్పితరు ల♦య్యో. యంచు దుఃఖించుచుం
ద్వరతోవచ్చెడు రీతిఁగాంచి యపు డ♦వ్వారిం గనన్ దుఃఖమున్
భరియింపంగను జాలఁడయ్యెఁ గరుణా♦వారాశి తానొటచేన్. ౪౩ 1620

సీ. దూడయం దతిదయఁ ♦ గూడియుండుట నావు తద్బంధనాగార♦తల్లజమున
కతివేగ యరుదెంచు♦నట్లు కౌసల్యయుఁ దనయునిపైఁ గల్గు ♦ దయ నరదము
పోవుదిక్కునకు వా♦పోవుచుఁ బనువెత్తె హారామ! హాసీత! ♦ హాసుమిత్ర
తనయ! యటంచు నెం♦తయు నేడ్పుతో, వారికొందిన దుఃఖమ్ము ♦ నోర్వలేక

ఆ. కనులనుండి నీరు ♦ కాఱఁగా నటునిటు, తిరుగుచున్నతల్లి ♦ మరలి చూచె
సారెసారె కపుడు ♦ భూరిదుఃఖమ్మున, రాఘవుండు; పిదప ♦ రాజవరుఁడు.౪౪

క. నిలునిలు మని బిగ్గఱగాఁ, బిలిచెను రాముండు రథము ♦ వే పోనిమ్మా!
వలదిఁక నాలస్యమ్మని, పలికెన్ సూతుండు వారి♦పలుకులు వినుచున్. ౪౫

ఆ. నిలువఁ బోవఁ దోఁప ♦ కల చక్రముల యంత
రమున నున్నకరణి♦ని మనమూఁగు
చుండ నప్పు డూర♦కుండె రాముఁడు పల్కె
నతనితోడ నిట్లు ♦ హితముమీఱ. ౪౬ 1623

చ. మరలి పురంబుఁ జేర నిను ♦ మామకవాక్యమురీతిఁ జేయక
య్యరదముఁ దోలితే మనుచు ♦ నానృపవర్యుఁడు నిందసేసినన్
సరభస మొప్పఁ బౌరజన♦సంతతి చేయు మహాధ్వనిన్ మహీ
శ్వర! భవదుక్తి నేను వినఁ♦జాలకపోతి నటంచుఁ బల్కుమా!. ౪౭ 1624

ఆ. ఇట్టి యనృతమైన ♦ నీవాడవచ్చును
గాని యిపుడు వారు ♦ గాంచు దుఃఖ
మును సహింపరాదు ♦ కనుఁగొనఁగారాదు
సూతయంచుఁ జెప్పు♦చొప్పు తెలిసి. ౪౮ 1625

క. సారథి యంతఃపురజన,వారము రామాజ్ఞనొందు ♦ భంగిం జేసెన్
వారువములు చనుచున్నను, శ్రీరాముని యాజ్ఞనూని ♦ శీఘ్రము తోలెన్.౪౯

సీ. అవరోధజనులంత ♦ నారామువలగొని వెనుకకు మరలిరై ♦నను మనుష్య
మాత్రు లెవ్వారికి ♦ మహనీయు విడిపోవఁ దరము గాకుంటచేఁ♦దనువులెట్లొ

మరలినవేగాని ♦ మనసులు గన్నీరుమాత్రము నుంతయు ♦ మరలవయ్యె
నంతమంత్రులు రాజు♦నటఁగాంచియెవ్వఁడు సత్వరముగ రాఁగఁ♦జనునటంచు
తే. నీవు వాంఛింతువో యట్టి ♦ నీకుమారు
దవ్వు వెనువెంటఁ జనరాదు ♦ ధరణినాథ!
యనిరి; రాజును దీనుఁడై ♦ యార్తినొంది
యంతఁ బ్రస్విన్నగాత్రుఁడై ♦ యప్పలుకులు. ౫౦ 1627

క. సకలవిధంబులచేఁ బొం,దికఁ గని యుండుటను వినుచు ♦ దివిరి కొడుకుయా
త్రకు భంగమేల యని నిలి,చి కనుంగొనుచుండెఁ దనయు ♦ స్త్రీపరివృతుఁడై.

నలువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౪౧ - వ సర్గము.

—రాముని వనగమనమునకై యంతఃపురస్త్రీలు శోకించుట.—

చ. పురుషలలాముఁడైన రఘు♦పుంగవుఁ డివ్విధి మాతృయుక్తుఁడై
పరఁగెడి తండ్రికంజలిని ♦ బట్టి వనంబున కేగ రాజుతో
మరలిన కాంతలెల్ల నొక♦మాటుగ నేడ్చిరి సౌధమెల్ల న
త్తరుణుల యార్తనాదములఁ ♦ దద్దయు ఘూర్ణిలె; నంతఁ గాంతలున్. ౧

సీ. దిక్కులేకయె యతి♦దీనతఁ గని దుర్బలులగు నీయాజన♦ముల కెవండు
గతియు రక్షకుఁడునై ♦ క్రాలునో యానాథుఁ డలరాముఁ డవ్వన♦మందు నిప్పు
డెటుపోవుచున్నాఁడొ♦యితరులు తనమీఁదమిథ్యాపవాదముల్♦మిగులఁజెప్పి
నను గోపమందక ♦ జనులకుఁ గోపంబు గలిగించునట్టి ప♦నులను జేయ
తే. కెవ్వరైనను గోపించి♦రేని వారి
కలఁకఁ దేర్చుచుఁ దాను బ్ర♦జలవితతికి
సమముగాఁ గష్టములనొందు ♦ సరసధిషణుఁ
డెచటికోపోవుచున్నవాఁ ♦ డేమిఁకగతి. ౩ 1630

క. తన జననియెడల నెవ్విధ,మున వర్తిలుచుండునటు మ♦ముంగని వర్తిం
చును రాముఁ డమ్మహాత్ముఁడు, చనుచున్నాఁ డెచటికో, వి♦చారము గాదే?. ౪

తే. కైక బాధింపఁగా భూమి ♦ కాంతుఁ డటవి
కరుగుమని యానతీయ న♦య్యాజ్ఞ నెన్ని
మనకు జనులకు రక్షకుం ♦ డనఘుఁ డాతఁ
డెటకుఁ బోవుచునున్నాఁడొ ♦ యిప్పు డకట!. ౫ 1632

తే. ఎంతమతిహీనుఁడో మేది♦నీశుఁ డౌర!
జీవలోకప్రియుండేయి ♦ చెలఁగి ధర్మ

నిరతుఁడయి సూనృతవ్రత♦పరుఁడయి తగు
తనయు వనికంపు చున్నాఁ డి♦తఁ డిపు డకట!. ౬ 1633

క. అని యందఱు నృపపత్నులు, తనయుని శ్రీరాముని న్ని ♦ తా మేడ్చిరి వ
త్సను బాసిన గోతతివలెఁ, బెనువగ ఘోషించి రొక్క♦పెట్టున నందుఁ. ౭

తే. పుత్రశోకాభితప్తుఁడౌ ♦ భూవరుండు
నప్పు డంతఃపురంబున ♦ నతిభయంక
రముగ గల్గిన యారోద♦నమును విని ని
తాంతదుఃఖితుఁ డయ్యె న♦త్తఱిని మఱియు. ౮ 1635

సీ. అడవికా రాఘవుం ♦ డరిగిన చింతచే నపుడు హోతలు వేల్వ♦రైరి జ్వలను;
నగ్ను లదృశ్యంబు ♦ లయ్యె, గృహస్థులు వండుట మానిరి ♦ ప్రజలు పనుల
విడిచిరి; సూర్యుండు ♦ కడువ్యసనము నంది ముందుగనస్త్రాద్రిఁ♦జెందెఁ;గరులు
నాహారకబళంబు ♦ లందుకొనఁగ నెంచవయ్యె; గోవులును బ♦యస్సు దూడ
తే. లకుఁ గుడుపవయ్యెఁ [1]ప్రథమపు♦త్రకుఁడు చెంత
కేగుదెంచినను దల్లి ♦ యిట్టిరాముఁ
డడవిపాలయ్యె నిఁకనేమ♦టన్న చింత
సంతసంబందదయ్యెను ♦ స్వాంతమందు. ౧౦ 1636

సీ. ఇక్ష్వాకుకులజుఁడై ♦ ఋక్షస్వరూపుఁడై యలరు త్రిశంకువు ♦ నవనిపుత్రుఁ
డైన యంగారకుం ♦ డల్లి బుధగురువు లితరపాపగ్రహ ♦ వితతి, కొన్ని
సంగంబునం, దృష్టి ♦ సంగతిఁ గొన్నియు వక్రగతిం గొన్ని ♦ వనజవైరిఁ
బొందియుండినవప్డు ♦ పుష్కరమునఁ దారకలు కాంతులం బాసి♦వెలుఁగకుండె
తే. గ్రహములును గాంతిదూలంగఁ ♦ గాసినొందె
మఱియు నిక్ష్వాకువను రాజ♦మండనుఁడు [2]వి
శాఖయందు జనించె న♦క్షత్రమద్ది
ధూమసంవృతమయినట్లు ♦ తోఁచె నింగి. ౧౨ 1637

క. ఘనసంవృత పవనజవం,బునఁ బెనుసాగరము పొంగు♦పోలిక రాముం
డును వని కేగ నయోధ్యయుఁ, బెనుచలనమునొందె దిశలు ♦ వితతతమనులఁ.

ఆ. ఆవరింపఁబడిన♦యట్లు కనంబడి, యాకులంబులయ్యె ♦ నపుడు ఖేచ
రములుఁ దారకాళి♦లు మఱేది యైనను, గాంతిలేనియట్లు ♦ కాననయ్యె.

చ. పురజనులెల్లఁ గారణము ♦ పోలఁగలేకయె దుఃఖమొంది రె
వ్వరికిని భోజనంబునను ♦ భవ్యవిహారమునందుఁ జిత్తమా

1 పుత్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనందత-అని మూలము.

2 విశాఖ యను నక్షత్రము ఇక్ష్వాకుదేశనక్షత్రము. అది పొగతోఁగూడినదనుటచే రానున్న రాజమరణము సూచింపఁబడినది.

తురతను గాంచనయ్యెఁ గడు♦దుఃఖపరంపరచేతఁ బొక్కుచున్
బురజను లెల్లవేళలను ♦ భూపతిఁ జేర్కొని మాటిమాటికిన్. ౧౫ 1640
క. ఎఱతెఱఁగక యూర్పులను వే, విడుచుచు దుఃఖించిరిట్టి ♦ విధమున జనుల
య్యెడఁ గన్నీరుముఖంబులఁ, దడుపఁగఁ బెను వీథులందుఁ ♦ దత్తఱపడుచున్.
క. తిరుగుచునుండిరి యందె,వ్వరికైనను గలుగకుండెఁ ♦ బరికించిన మో
దరతియె; శోకపరాయణ, పరులై యుండి రల గంధ♦వహుఁడుం బురిలోన్.
సీ. చల్లఁగా వీచుటఁ ♦ జాలించె; నింపుగా శశి కానరాఁడయ్యె ♦ సరసిజాప్తుఁ
డెండకాయుట మాని♦యుండెను;జగమెల్లఁ గలఁగినట్లుండెఁ,బు♦త్రులుజననుల
చనుఁబ్రాలు గోరక ♦ చనుచుండి రతివలయందు భర్తలు తమ♦కలరుచున్న
యనురాగమును మాని ♦ రన్నదమ్ములు తమ నెయ్యము విడిచిరి ♦ నిఖిలజనులు
తే. నొండొరులపైని దమకు ముం♦దున్నప్రీతి
విడిచి రామునినే పలు♦విధములను ద
లంచుచుండిరి. మఱియు స♦మంచితమతు
లయిన శ్రీరాఘవుని [1]స్నిగ్ధు ♦ లందఱపుడు. ౧౮ 1643
చ. అతిశయశోకభారమున ♦ నాక్రమితాత్ములు గాన నొక్కటన్
మతివిభవంబు పోవుటను ♦ క్ష్మాధరవర్యముపైన వ్రాలనే
గతిఁ జలియింపఁ జాలక ని♦కామము తాపము నందువారొ యా
గతిశయనంబులన్ విడువఁ♦గా నటఁ జాలకయుండి రంతటన్. ౨౦ 1644
చ. సురపతిలేనిచో నెటుల ♦ క్షోణి సపర్వతయయ్యెఁ బ్రాపులే
కరహిఁ దొఱంగి వ్యాకులతఁ ♦ గాంచు మహాత్ముఁడు రామచంద్రుఁ డొ
క్కరుఁడట లేమి దుఃఖభయ♦కంపితమై కరివాజిసైనికో
త్కరముగఁ జంచలించి పుర♦తల్లజమెల్ల ధ్వనించె నవ్విధిన్. ౨౧ 1645

నలువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౪౨ - వ సర్గము.

### దశరథుని విలాపము.

చ. వనమున కేగుచున్న రఘు♦వర్యుని స్యందనచక్రఘట్టనం
బున జనియించి పెల్లెసఁగు ♦ భూరిరజం బదియెంత దాఁకఁగా
ననగుచునుండెనో మనుజ♦నాయకుఁ డాతఁడు నంతదాఁక దృ
ష్టిని మరలింప కాత్మజుని ♦ శ్రీగుణమాన్యునిఁ జూచుచుండెఁ దాన్. ౧ 1646
క. తనప్రియసుతు నతిధార్మికు, మనుజేశుఁడు మిగుల ధూళి ♦ మార్గమ్మునఁ దాఁ

1 స్నిగ్ధులు=మిత్రులు. స్నేహితులని వాడఁబడుపదము దుర్వికారము నొందింపఁబడినయా పదమే.

గనుచుండు దాఁక ధూళియుఁ, గనఁబడుచునెయుండెఁ బ్రీతిఁ♦గలిగించువిధిన్.
తే. అంత రాముని రథధూళి ♦ యక్షి గోచ
రంబు గాక యడంగిన ♦ రాజు నార్తుఁ
డయి విషణ్ణుండునై యప్పు ♦ డవనిఁ బడియె
నతని నెత్తెంగఁ గౌసల్య ♦ యతిజవమున. ౩ 1648
క. కుడిచేయిఁ బట్టుకొనియెం, దడయక; దా భరతునందె ♦ తమి గలదాటన్
ఎడమకయిఁ గైక బట్టక, పుడమిఁ గనుచు బార్శ్వమందుఁ♦బొందుగనిలిచెన్.
సీ. నీతిధర్మమ్ము వి♦ఖ్యాతసదాచార మతిశయమ్ముగఁ గల్గు♦నట్టి రాజు
తన సవ్యపార్శ్వంబు♦నను నిలుచున్నట్టి కైకను గనుఁగొని ♦ వ్యాకులేంద్రి
యుండయి వచియించె ♦ నోదుష్టచారిణీ! కైక మదంగాళిఁ ♦ దాఁకవలదు
నినుఁ జూడ నేనొల్ల ♦ నీవు భార్యవుగావు మనకు బంధుత్వంబు ♦ గనఁగ లేదు
తే. నినుఁ దమిం గొల్చి జీవించు ♦ జనులకేను
బ్రభువుఁ గానట్టి వారు సే♦వకులు గారు
నాకుఁ; గేవలమర్థాశ ♦ నీకుఁ గలదు
ధర్మరతిలేదు గాన నిన్ ♦ ద్వరవిడిచెద. ౭ 1650
చ. పరిణయమాడితీవు ననుఁ ♦ బావకుసాక్షిగఁ గాన భార్య నే
నరయఁగ నెట్లు కాననుచు ♦ నందువొ యేమొ దురాత్మురాల! నీ
కరము గ్రహించుటగ్నికిఁ ద♦గన్ బ్రియమారఁ బ్రదక్షిణంబుగాఁ
దిరిగెడునట్లు చేయుటయుఁ ♦ దెంపునఁ జేసితినైన నే నికన్. ౭౪ 1651
ఆ. వీనివలన నాకు ♦ జానుగఁ గల్గిన, యిహపరములకెల్ల ♦ నిపుడ విడిచి
నాఁడ నైహికంబు ♦ బోడిగ విడుచుట, వలనఁ గ్రీడలెల్ల ♦ వదలినాఁడ. ౮
క. ఆముష్మికంబుఁ వదలుట,చే మహిఁ బరమార్థమొకటి ♦ సిద్ధింపఁగ నే
నేమమునఁ జేయఁదగు శుచి, హోమాదులఁ జేయనిన్ను♦నొగిఁగూడియిఁకన్.
క. భరతుం డక్షయముగ నీ, ధరణీరాజ్యంబు నొంది ♦ దా ముదితుండై
పరగునయేఁ బిత్రర్థము, భరతుం డొనరించు కృత్య♦పటలంబెల్లన్. ౯ 1654
క. ననుఁ జేరకుండుఁ గాకని, మనుజేశుఁడు పలుకఁ బట్ట♦మహిషి మహార్తిం
గని స్రుక్కి ధూళి బ్రుంగిన, మనుజాధిపు లేవనెత్తి ♦ మరలె నతనితోన్.
క. అనుతాపము నొందెను విప్రుని దానై చంపినట్లు ♦ పూని జ్వలను దాఁ
కినరీతిఁ గరమునన్ ధర్మనిబద్ధాత్ముండు సుతుని ♦ మానిఁ దలఁచుచున్. ౧౧
సీ. అడుగడుగునకుఁ బ్రి♦యాత్మజు నరదంబు వడి నేగినట్టి త్రో♦వలను మరలి
మరలి చూచుచు రాజ♦మండనుఁ డెంతయు స్రుక్కుచు గ్రస్తుఁడౌ♦సూర్యురీతి
భాసిల్లకుండె రూ♦పంబున మిక్కిలి తన ప్రియపుత్రునిఁ ♦ దలఁచి దుఃఖ
మున నార్తుఁడయి యేడ్చె♦మనుజేశుఁడప్పుడు తనయుండుపురమును♦దాఁటిపోవు

ఆ. టాత్మనెంచి పలికె ♦ నాత్మజుఁ గొనిపోయి
నట్టి హాయపరముల ♦ యడుగులెల్లఁ
గనఁబడియెడిఁ ద్రోవఁ ♦ గానరాఁడు మహాత్ముఁ
డతఁడు మాత్రమేమొ ♦ యక్కటకట. ౧౪ 1657

చ. సురుచిరచందనం బలఁది ♦ సొంపలరారఁగ నుత్తమాంగనల్
కరముల వీవనల్ గొని సి♦కామము వీవ సుఖప్రదంబులై
పరఁగు మృదూపధానముల ♦ భాసిలునట్టి మదాత్మజన్ముఁ డి
త్తరుణమునం దదెక్కడనొ ♦ తాఁ దరుమూలతలంబునం దొగిన్. ౧౫॥

క. తరుశాఖగాని యొకని,ర్ఝరపాషాణమ్ము గాని ♦ పదిలంబుగఁ దాఁ
గరముపధానము గాఁగం, బరుండఁ గలఁ డిద్ది నిజము ♦ పల్కులికేలా. ౧౬

తే. కటకటా! దీనుఁడై పాంసు♦కలితదేహుఁ
డగుచు నిట్టూర్పు పుచ్చుచు ♦ సొగసు దూల
నొక్కసెలయేటి దాపున ♦ నుండి లేచు
వరగజమురీతిఁ దా లేచు ♦ వసుధనుండి. ౧౭ 1660

క. వనచరులు దీర్ఘభుజు లో,కనాయకు ననాథురీతిఁ ♦ గా లేచి వనం
బున కేగువాని నిజముగఁ, గనుఁగొనఁగాఁ గలరు నాడు ♦ గారాబుసుతున్.

చ. జనకుని కూర్మిపుత్రికయు ♦ శర్మము నే సతతంబు నొందఁజా
లినయది యట్టులయ్యు వల♦లేను వనంబునఁ గంటకాళిపైఁ
దనపదసారసంబు లిడి ♦ తద్దయుఁ గ్రుచ్చుకొనంగ నద్ది బా
ధను గనుచున్ జనంగలదు ♦ దైవకృతంబని నిశ్చయంబుగన్. ౧౯ 1662

క. వనముల నెప్పుడెఱుంగదు, కనకాంగి గభీరమగుచు ♦ గగురుం బుట్టిం
పనుజాలు క్రూరమృగముల,ధ్వనివినిభయమొందఁగలదు♦స్వాంతమునందున్.

క. ఫలితమనోరథవగు మా, కులపాంసకురాల! యింకఁ ♦ గోరికతో నీ
యిల విధవవగుచు నేలుము, ఖలహృదయుని విడిచి బ్రతుకఁ ♦ గా నేఁ జాలన్.

క. నేనెంతమాత్రమును బ్రియ,సూనుని విడనాడి బ్రతుకు ♦ చోపొల్లనటం
చానృపుఁడు పలికి యివ్విధి, మానవపతి వెంట రా వి♦మనసుం డగుచున్.

సీ. జానకి భయమొందు ♦ దానిమూలంబుగా నాపదవచ్చుఁ బ్రి♦యాత్మజునకు
నద్దానివలననే ♦ యాత్మవినాశనమును గల్గునని తన♦మనమునందు
శంకించి నీదుని♦ష్టముఁ దీర్పఁ గా యని కైకతోఁ బల్కు యా♦కారణమునఁ
దనచావు శంకించి ♦ దానిని విధవను గమ్మని తిట్టుచు ♦ నమ్మహీశుఁ

తే. *డశుభముగ నున్న యాయయో♦ధ్యాపురంబు
నట మృతస్నానమును జేసి ♦ నట్టివాని

---

* అపస్నాతఇవారిష్టం ప్రవివేశ పురోత్తమమ్-అని మూలము. ఇట నశ్లీలదోషములేదు. ఏలన దశరథునకుఁ బ్రపంచమే వెగటుఁగఁ దోఁచినది. తా భయమునొందుటవలన సీతారాములకు

భంగిఁ దానుఁ బ్రవేశించెఁ; ♦ బట్టణమది
శూన్యచత్వర వేశ్మమై ♦ సొంపు దూలి. ౨౨౹ 1666

సీ. సంవృతాపణ దేవ ♦ సద్మకవాటమై బహిలి దుర్బలులగు ♦ ప్రజలు దుఃఖ
మొందఁగానశుభమై♦యురుమార్గములయందుకొలఁదిమనుష్యులే♦కూడియుంట
నిశ్శబ్దమై తన ♦ నీటుపాడగుటచే నశుభకరంబుగ ♦ నప్పుడుండఁ
గనుఁగొని రామునే ♦ కలవిలపాటొందియును దలంచుచు నేడ్చు♦చును దినేశుఁ

తే. డంబుదంబుఁ బ్రవేశించు♦నట్లు రాజు
తనదు సౌధంబుఁ జేరె; సౌ♦ధమదియపుడు
పెనుమడుగు సర్పముంట క్షో♦భింపఁబడక
యలరి పాము గరుత్మంతుఁ ♦ డపహరింప. ౨౪౹ 1667

క. చొరఁగూడినదై యుండెడు, కరణిఁ రాముండు భూమి ♦ కన్య సుమిత్రా
వరసుతుఁడును లేకుండుటఁ, బరులకునుం జొరఁగఁ దగిన♦భంగిఁ గనఁబడెఁ.

క. తరువాత నృపుఁడు కంఠ,స్వరమతి హీనత్వమొందఁ ♦ బలవించుచు న
శ్రులముల పెక్కుండియు నం, దరయఁగ నర్థంబుఁ గొలఁది ♦ యై తగుపలుకుల్.

క. వినరాని యట్టి స్వరమునఁ, బెనుదైన్యము దోఁపఁబలికె ♦ వేగమె శ్రీరా
ముని తల్లి యింటికి న్ననుఁ, గొనిపోదురుగాక యిచటఁ♦గూడదు నిలువన్.

తే. మఱి యెచటనైన నిప్డు నా♦మదికి నూఱ
టయె కలుగదని పల్క; మా♦ట విని నంత
ద్వారదర్శకు లారాము♦తల్లి సౌధ
మునకుఁ గొంపోయి చేర్చి ర♦మ్మనుజవిభుని. ౨౮౹ 1671

క. అతఁ డందు వినీతునివలె, నతిశయదుఃఖముననుండి ♦ యాసద్మమునన్
వితతశయనంబు నొందియు, మతిశాంతియె లేక మిగుల♦మ్రాన్పడియుండెన్.

క. తనయద్వయమును గోడలుఁ, గన రాముని సౌధమద్ది ♦ గతశశిభంబై
గనుపట్టు నాకసమువలెఁ, గనఁబడఁగా నతఁడు చూచి ♦ కలవిలమందెన్.

క. ఆమందిరమును గనుచు, ద్దామపరాక్రమము గల్గు ♦ ధరణీశుఁ డయో
రామా! ననువిడి చనుదే, యీమాడ్కి నటంచుఁ జేయి ♦ యెత్తికడఁ ధ్వనిన్.

క. విలపించి మఱియు నిట్లని, పలికెన్ రాముండు రాఁగఁ ♦ బౌరజనశ్రే
ష్ఠులు కన్నులారఁ జూడం, గల రప్పటిదాఁక సుఖము♦గా మనుఁడు తగన్.

తే. మరలి వచ్చిన రాముని ♦ మది ముదమునఁ
గౌఁగిలించి పరస్పరాం♦గములఁ గన్న
లలరఁగాఁ జూడఁ గలరట్టి ♦ యెలమి నాకుఁ
గలుగునే మందభాగ్యుండఁ♦గద కటకట! ౩౨ 1676

---

మరణము కల్గునని శంకించినాఁడు. కాఁబట్టి మృతస్నానము చేసినవానివలెనని వాల్మీకి చెప్పుట సముచితమే.

క. అనియేడ్చి ప్రళయకాల ని,శిని బోలి భయంకరముగఁ ♦ జిత్తమునకుఁ దోఁ
చిన రాత్రిరాఁగ దశరథ, జనపతి యాయర్ధరాత్ర♦సమయమునందున్. ౩౩

*సీ. కౌసల్యఁ గని పల్కెఁ ♦ గాంతామణీ! సుగుణాబ్ధియౌ రాముని♦ననుసరించి
చనిన నాదృష్టి యిం♦కను రాకయున్నది యాతనిఁ గనెడు భా♦గ్యంబులేక
యున్నను దన్మాత ♦ నిన్నును దర్శింపఁ దగు సమయంబయ్యె ♦ మగిడి రాక
యున్నది కనఁజాల♦కున్నాఁడ నిను సతీ! చక్కఁగా నన్ను హ♦స్తమున నంటు
మింద్రియావళులుంట♦యే లేకయుండుటయే వానిపనుల నే♦యెఱుఁగఁ దగును
తే. గనుక మన్నేత్రమిట రూప♦మును గ్రహించు
శక్తిలేకుంటఁ దెలిసెడి ♦ సమసెననుచు
నీకఁ ద్వగింద్రియమున్నదో ♦ యే గనో యని
యెఱుఁగఁ జక్కఁగఁ దాఁకుమా ♦ యిపుడు వేగ. ౩౪ 1678

చ. అనుచును శయ్యపైని బడి ♦ యాత్మజునే తలపోసికొంచుఁ బో
క్కు నృపతిఁ జూచి దాపుననె ♦ కుందుమనంబునఁ గూరుచుండి యా
తనిసతి వేడియూర్పుల ని♦తాంతము పుచ్చుచు నార్తరూపయై
కనుఁగొనరాని యంతవెతఁ ♦ గంది విలాపముచేసె దీనయై. ౩౫ 1679

నలువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౪౩ - వ సర్గము.

కౌసల్య విలపించుట.

క. తనయాత్మజన్ము శోకం,బున బొక్కు సతీవతంస♦ము పతిని దుఃఖం
బునఁ బాన్పునఁ బడి కుందఁగఁ, గని యిట్లని పల్కె నాథ!♦కైక కుమతితోన్.

క. తనదగు కౌటిల్య విషం,బును బురుషవరేణ్యుఁడైన ♦ పుత్త్రున కిడియెం
గనుక నీక ముక్తకంచుక, ఘనపన్నగురీతిఁ దిరుగఁ♦గలదు గద తమిన్. ౨

ఆ. సొగసుగత్తెయైన ♦ మగువ రామునిఁ గాన, పాలుచేసి లబ్ధ♦వాంఛ యగుచు
స్థిరత నొందె నింటఁ ♦ జేరినదుష్టాహి, కరణి నాకుభీతిఁ ♦ గలుగఁజేయు. ౩

---

* రామం మేనుగతా దృష్టి రద్యాపి ననివర్తతే, నత్వాం పశ్యామి కౌసల్యే సాధు మాపాణినా స్పృశ-అని మూలము. దీనికి గోవిందరాజ మహేశ్వరతీర్థు లిరువురును శబ్దముల ననుసరించి చక్కని యర్థమును వ్రాసిరి. కౌసల్యా నీచేతితో నన్ను స్పృశింపుము. అని దశరథుఁడు పల్కుటచేఁ ద్వగింద్రియ మున్నదో లేదో యని సంశయించె నని భావ మూహింపఁబడినది. తనిశ్లోకిలో నాకాశమున మేడకట్టినట్లు ప్రతియక్షరమునకు నొకయర్థము కల్పింపఁబడినది. ఆయర్థము నీపద్యమునుండి కూడఁ జెప్పవచ్చును. దీనికి ముఖ్యార్థము, దానిమీఁద జమత్కారమునకై కల్పింపఁబడిన యర్థము ఇందుఁ గనఁబడునని గ్రహింపవలయును.

చ. భరతుఁడు రాజ్యమేలుట య♦వశ్యమయేని మదాత్మజన్ముని
భ్భరతుని దాసుగా నొనరు♦పం జగు నన్నముఁ బెట్టకంచు న
త్తరుణియుఁ గోరు లే వరము ♦ తాఁ గొడుకప్పుడు భైక్షుజీవియై
పురమున నిచ్చటం దిరుగుఁ ♦ బొలుపుగ నింట వసించియుండుగా. ౪ 1683

సీ. వానిపదవినుండి ♦ పడఁద్రోసి రాముని నిచ్చచొప్పునఁ గైక ♦ కిచ్చితీవు
రాజ్యభాగమును ధ♦రానాథ! విను మాహితాగ్నిపర్వంబుల ♦ నమరతతికి
నీయఁగాఁ దగినట్టి ♦ దే యగునాహవిర్భాగంబు నసురుల ♦ భాగముగనొ
సంగినట్లిది న్యాయ♦సరణియే; గజరాజగమనుఁడై వీరుఁడై ♦ కార్ముకంబుఁ
తే. దాల్చి దీర్ఘభుజంబులు ♦ తనర వెలుఁగు
రాముఁ డనుజుని లక్ష్మణు ♦ రమణి సీతఁ
గూడి వనిఁ జొచ్చుచున్నాఁడు ♦ నేఁడు నిజము
కైకమాటనె పాటించి ♦ క్ష్మాతలేంద్ర!. ౬ 1684

క. వనవాసకష్టముల నెఱుఁగనివారలఁ బంపితీవు ♦ కాన వసింపం
జనునంచు నేమిగతి యవ్వనమున నగునో తలంప ♦ వచ్చునె మదిలోన్. ౭

క. ఎలప్రాయంబున భోగంబులఁ బొందఁగఁ దగినకాల♦మున రత్నాదుల్
తొలఁగ వనికీవు పంపఁగ, ఫలమూలంబులను దినుచు ♦ వసియింతురెటో. ౮

తే. దీనులై వారలెట్టి రీ♦తిని బ్రతిజ్ఞఁ
గడుపుదురో? నాకుమారుండు ♦ కాంతఁ గూడి
తమ్మునిం గూడి యిట రాఁగఁ ♦ దగు శుభంబు
లొప్పు నాశోకము నశింప ♦ నొప్పు తనర. ౯ 1687

క. వానిం గన్నారఁగ నేఁ, గానందగునట్టి మహిత♦కాలంబిపుడే
భూనాథ! కలుగునా? నా,సూనులు కోడలును నొక్క♦చో లీలమెయిన్. ౧౦

తే. చెలఁగి నిదురించి లేచి వ♦చ్చినటు నడవి
నుండి వీరులు వచ్చుట ♦ నొగి నెఱింగి
యిప్పురంబునఁ గలవార ♦ లెల్లఁ దమిని
ధ్వజములెత్తి యలంకృతిఁ ♦ దగనొనర్ప. ౧౧ 1689

క. తనరారు నీయయోధ్యకుఁ, జనుదెంతురొ? వారలెపుడు; ♦ సరగున రాఁగా
మనుజవ్యాఘ్రుల మరలం, జనుదెంచినవారిఁ బౌర♦సంతతి గనుచున్. ౧౨

క. రాకానిశిఁ బెనుసాగర, మేకరణిం బొంగునట్టు ♦ లెప్పుడు మదిలోఁ
బ్రాకట మోదము చెలఁగఁగ, వీకన్ గ్రాలెడినొ యెఱుఁగఁ♦బృథ్వీశవరా!.

తే. ఆమహాబాహు వావీరుఁ ♦ డారఘుప్ర
వర్యుఁ డాఁబోతు గోవుతో ♦ వచ్చునట్లు

జనకపుత్త్రిని మున్నిడు♦కొని రథమున
నీయయోధ్యఁ బ్రవేశించు ♦ టెప్పుడొక్కొ?. ౧౨   1692

క. అరిమర్దనులౌ నాదు కొ,మరు లిప్పురిఁ జొరఁగ రాజ♦మార్గంబున ని
ప్పురజనసహస్రములు నే, తరుణమ్మునఁ జల్లుదురొకొ ♦ తమిమై లాజల్. ౧౩

సీ. శుభకుండలంబుల ♦ సొంపుగా ధరియించి కార్ముకఖడ్గముల్ ♦ కరము వెలుఁగ
శిఖరాన్వితములగు ♦ క్షితిధరంబులఁ బోలి యెప్పుడీప్పురమున ♦ కేగుదేరఁ
గాంతునో; బ్రాహ్మణ♦కన్యకలకుఁ బుష్పముల విప్రులకు ఫలం♦బుల నొసఁగుచు
ముదమున నిప్పుర♦మునకు నెప్పుడు ప్రదక్షిణ మొనర్తురొ; శేము♦షీవిశేష

తే. మందు వృద్ధుఁడు నిర్జరు♦లట్టు లిరువ
దైదు వత్సరములవయ ♦ స్సలరువాని
భంగిఁ దగుపట్టి ధర్మత♦త్పరుఁడు వచ్చు
నెపుడు మూఁడేండ్ల శిశువట్టు ♦ లింపుమీఱ. ౧౬   1694

చ. మునుపటి జన్మమందు రఘు♦ముఖ్య! పరాక్రమధుర్య! దుష్టబు
ద్ధిని వహియించి నేనుఁ దమి ♦ తీఱఁగ బిడ్డలు పాలుద్రావనె
న్న నడరి వారితల్లుల స్త♦నంబులఁ గోసినదాన సంశయం
బనునది లేదు; వత్సగల ♦ యావువలెన్ దనయప్రమోదతన్. ౧౭   1695

చ. చెలఁగెడు నన్ను నో పురుష♦సింహమ! సింహము గోశిశూత్కరం
బుల వధియించి గోవులను ♦ బోల వివత్సలఁ జేసినట్లు కై
క లలితపుత్త్రహీనఁగను ♦ గావలె నంచును జేసె నక్కటా
యిలఁగల భద్రసద్గుణము ♦ లెల్లఁ గలాఁడు మదీయపుత్త్రుఁడో. ౧౮   1696

ఆ. సకలశాస్త్రవేత్త ♦ సాధుమనీషుండు
నగుట నేకపుత్త్ర ♦ నగుట నేను
నట్టి కొడుకు విడిచి ♦ యసువుల ధరియింప;
నొల్ల నిడుదభుజము ♦ లొప్ప నతఁడు. ౧౯   1697

క. బలశాలి యగుచు నిలలో, వెలయఁగ నా ప్రియకుమారు ♦ వేడుకఁ జూడం
గల భాగ్యము లేకుండిన, నిలపై జీవించు శక్తి ♦ నేమాత్రంబున్. ౨౦

తే. నాకుఁ గలిగింపఁ జాలదు ♦ ప్రాకటంపు, శక్తిగల దైవమైనను ♦ జండకరుఁడు
సకలశక్తియుతుండు వే♦సవిని రుచుల,చేత భూమిని దపియింపఁ ♦ జేయునట్లు.

క. వర పుత్త్రదుఃఖజుం డీ, పరితాపహుతాశనుండు ♦ ప్రజ్వరిలి నన్న్
బరితాప మొందఁజేసెడుఁ, దరమే ధరియింప ననుచుఁ ♦ దగ విలపించెన్.

నలువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

## ౪౪ - వ సర్గము.

### కౌసల్యను సుమిత్ర యూఱడించుట.

మ. వనితారత్నము చింత మీఱ విలపిం♦పంగాంచి ధర్మస్వరూ
పునిగా నెవ్వని నార్యులెన్నుదురొ యా♦పుణ్యాత్ముఁడౌ రామునం
దు నిబద్ధాత్మ సుమిత్ర యాటఁ బలికెన్ ♦ దుఃఖించు కౌసల్యతో
ఘనమై పొల్చు విశిష్టధర్మము తగం♦గా నిట్టు లార్యామణీ!. ౧ 1701

సీ. అనితరసాధ్య క♦ల్యాణగుణంబుల నలరు నీపుత్త్రకుం ♦ డఖిలలోక
సుప్రసిద్ధుండయి ♦ శోభిల్లు సత్పురుషోత్తముండౌట నీ♦వాక్కు మొగిని
విలపింపనేల యి♦ట్లలసి దీనముగాఁగ నేడ్చిన ఫలమేమి ♦ యిప్పుడమ్మ
హాబలుండగు నీదు ♦ నాత్మజుండెల్ల శిష్టులు పూన్కి నాచరిం♦చుచు నెసంగు
తే. నదియుఁ బరలోకమునను మ♦హాఫలంబుఁ
గలుగఁ జేసెడునదియునై ♦ క్రాలుధర్మ
మును దృఢంబుగఁ బూని దం♦డ్రిని మహాత్ము
ననృతదోషంబు పొందని♦యట్లు చేయ. ౩౹ 1702

క. ఋతవాదిని జేయఁగ నీ, క్షితిరాజ్యము విడిచి యడవి♦కిం జనియె మహా
మతి రాముఁ డట్టి ధర్మని,రతిఁగను నాతనికి నేడ్వ♦రాదు సుశీలా!. ౪ 1703

సీ. పాపరూపంబయి ♦ పరఁగు ప్రమాదంబు గావున నద్ది లే♦కయె సమస్త
జీవదయాళువై ♦ చెలఁగు లక్ష్మణుఁ డతిశయపరమార్థైక♦సాధనమగు
కైంకర్యవృత్తి నె♦క్కాలమందును దా సమాచరించుచు నన్న ♦ కధికభక్తి
శుశ్రూషలను సల్పు♦చును గాన *వర్తింపఁజనె నద్దియె సుబుద్ధి♦కిని నతనికి
తే. నధికలాభంబు గాన నీ ♦ వతని గుఱిచి
చింత నొందఁగఁ బనిలేదు ♦ సీత సుఖము
లనుభవింపంగఁ దగినది ♦ యడవిఁ గలుగు
కష్టములనెల్ల నెఱిఁగియుఁ ♦ గడుముదమున. ౫౹ 1704

క. పతియే దైవంబనుచున్, మతిఁ దలఁచిన సాధ్వియగుట ♦ మహనీయంబై
క్షితిఁ దనరు ధర్మమున నే,రతిఁ గల్గు భవత్కుమారు ♦ రామునిఁ గనుచున్.

క. వెనుదగిలి పోవుచున్నది, వనితా కోడలిని గుఱిచి ♦ వంతఁ గనఁగరా
దనితరలభ్యయశంబు భు,వనమున ధ్వజమట్లు త్రిప్పి ♦ పర్వఁగఁ జేసెన్. ౬౹

ఆ. అట్టి ప్రభువు రాముఁ ♦ డతిశయధర్మస,త్యవ్రత ధనుఁడౌట ♦ నతనికెట్టి
మేలు గలుగకుండు ♦ నోలలనామణీ!, యతనిఁగూర్చి శోక♦మందవలదు. ౭

---

*౫ శ్లో. "వర్తతే చోత్తమాం వృత్తిం" అనుశ్లోకమున నున్నవకారము గాయత్రి యైదవ యక్షరము.

సీ. త్రికరణశుద్ధియు ♦ దివ్యమహత్వంబు రామునియందు దల♦రంగ నెఱిఁగి
కమలమిత్రుఁడు రాము♦కాయంబుఁ గిరణాళిఁ దపియింపఁ జేయఁడు♦తగినరీతి
శీతోష్ణములఁ గల్గఁ ♦ జేయుచు నెప్పుడు సుఖముగ శుభముగ ♦ శుభ్రములగు
కాననములనుండి ♦ గంధవహుం డరుదెంచి వీవఁగలండు ♦ తృప్తిమీఱ
తే. జనకుఁ డాలింగనము చేయు ♦ సరణి సీత
కరములను దాఁకుచుఁ సుధా♦కరుఁడు పాప
వర్జితుని రాము రాత్రులఁ ♦ బండుకొనిన
వాని నాహ్లాదయుతుఁ జేయు ♦ వారిజాక్షి !. ౧౦ 1708

*సీ అనిలోఁ దిమిధ్వజు ♦ నాత్మజుదనుజేంద్రు రాముఁడు చంపంగ♦బ్రహ్మఁగాంచి
యానుహౌజసునకు ♦ నఖిలదివ్యాస్త్రంబు లిచ్చెఁ గాదే? మును♦పెన్నతఁడు
మనుజపంచాస్యుం డ♦మానుషవిక్రముం డాత్మబాహుబలంబు♦నాశ్రయించి
యలరుచుండును గాన ♦ నడవినున్నను భయంపడక గృహమ్మున ♦ గడపినట్లు
తే. కాలమెల్ల సుఖంబుగ ♦ గడుపుఁజుమ్ము
భరతుఁ డెల్లర ప్రీతికిఁ ♦ బాత్రుఁడైన
రామునకు నెట్లు దక్కను ♦ రాజ్యమనుచు
నందువేమొకో! యాసంది♦యము వదలుము. ౧౨ 1709

క. రామాస్త్రపథమునకు గుఱి, యై మహినేశత్రువైన ♦ యంతముఁ గనునా
రాముని యాజ్ఞకు లోనుగ, నేమాడ్కిం గాకయుండు ♦ నీరాజ్యమిఁకఁ.

తే. సకలకల్యాణలక్షణ♦సహితుఁడైన
రాము తనుకాంతి శూరతల్ ♦ ప్రబలబలముఁ
గాంచ నటవీనివాసంబు ♦ గడపి వచ్చి
ధరణిఁ బొందఁ గలండని ♦ తలఁచుదాన. ౧౪ 1711

సీ. సూర్యున కాతఁడు ♦ సూర్యుఁ, డగ్నికినగ్ని,ప్రభువుల కెల్లఁదాఁ♦బ్రభువువినుము
సంపదలకు నెల్ల ♦ సంపత్తు, కీర్తికిఁ గీర్తి, యోర్పున కోర్పు, ♦ కేవలంబు
దేవతలకుఁ జూడ ♦ దేవత, భూతాళి కాదిభూతము, దేవి! ♦ యట్టి రాము
నకు దేశమునఁగాని♦నగరంబునం గాని యేగుణమ్ము లెట్లు క♦లుగునో తలఁపు
తే. మెవఁడు వనికేగఁగాఁ జూచి ♦ యిచటిజనులు
వెతలఁ బడి బాష్పపూరంబు ♦ విడుచుచున్న
వారొ యాపురుషవరుండు ♦ వరుస [1]భూమి
ధరణిజా లక్ష్మణులఁగూడి ♦ తగు విభూతి. ౧౫ 1712

---

* ఇందలికథ పూర్వము చెప్పఁబడకున్నను ప్రసక్తినిబట్టి యిటఁ జెప్పఁబడియె నని గ్రహింపఁదగు 1 భూమిధరణిజాలక్ష్మణులఁగూడి-దీనికి "పృథివ్యాసహ వైదేహ్యా శ్రియాచ పురుషర్షభః" అని మూలమున్నది గాన భూమిశబ్దము వ్యర్థముగాదని యెఱుంగఁదగు.

క. తరుణీ! యభిషేకంబును, స్థిరముగఁ బొందంగఁగలఁడు ♦ చీరలును గుశా
స్తరణమును దాల్చి శ్రీరఘు,వరుఁ డపరాజితుఁడు ప్రీతి ♦ వనముల కరుగన్.

[1]క. సీతారూపంబున వి,ఖ్యాతమహీరాజ్యలక్ష్మి ♦ యాతనివెంటన్
బ్రీతిగఁ జనియెను వానికి, భూతలమున దుర్లభంబు ♦ పొలంగలదే. ౧౯

చ. ధనువులఁ బట్టు వీరులను ♦ దాను బురోగనునుండు లక్ష్మణుం
డనుచరుఁడై కటారుఁ గొని ♦ యంబకముఖ్యములన్ ధరించి తా
వనమున కన్నతోడ నిజ♦బాహుబలం బడరంగ ముందుగాఁ
జనియెడు నట్టి రామునకు ♦ సాధ్వి! యిఁకెయ్యది దుర్లభంబిలన్. ౨౦ 1715

క. వనవాసంబు యథాక్రమ,మునఁ దీర్చి యతండు రాఁగ ♦ మోదంబునఁ జూ
డను గలవు దేవి! మోహం,బును శోకము వదలు సత్య♦మును వచియింతున్.

సీ. కల్యాణి! యపకీర్తిఁ ♦ గానని సాధ్వివి వనినుండి రాముఁడు ♦ వచ్చి నీదు
చరణాంబుజములకు ♦ శాస్త్రోక్తవిధి నమస్కారంబు గావించు ♦ కాలమందు
నుదయచంద్రుని పోల్కి♦నున్న రామునిఁ జూడఁగలవు శీఘ్రంబె మ♦రలియతండు
వచ్చి యిప్పురమున ♦ వైభవంబున నభిషిక్తుఁడై మిగులు రు♦చిన్ వెలుంగఁ
తే. గాంచి యానందబాష్పంబు ♦ లంచిత గతి
విడువఁ గలవట్టి రాముని ♦ విషయమందు
నశుభ మింతయు గలిగెడు ♦ నని తలంపఁ
జనదు కనరావు దానిల♦క్షణము లెవ్వి. ౨౩ 1717

*క. కానన్ శోకము దుఃఖముఁ, బూనుట సరిగాదు దేవి! ♦ పుత్త్రుఁ డనుజుతో
జానకితో వేగమ రాఁ,గా నీవే చూడఁగలవు ♦ కడు నెయ్యమునన్. ౨౪

క. అనఘమతి వీవు దేవీ, నిను నీవే కాక పౌర♦నిచయము శోకం
బును బొందకుండఁ జెప్పుట, చను నిక్కాలమున వగవఁ ♦ జనునే నీకున్. ౨౫

క. తనయుని శ్రీరాముని గాఁ, గను భాగ్యము గల్గె నీకుఁ ♦ గావున శోకం
బును బూనఁదగదు సత్పథ,మున వర్తిలువాఁడు లోక♦మున నెవఁడైనన్.

క. రాముని కన్నను గలఁడే, తా మిత్త్రులఁగూడి సుతుఁడు ♦ తమి వందనముల్
కామిని నీకుం జేయం,గా మనుతం గాంచి శతమ♦ఖప్రతిమానున్. ౨౭

క. ఆనందబాష్పసంతతి, వానతతిన్ మేఘపంక్తి ♦ వారివిడుచు న
ట్లో నారీమణి విడుతువు, నూనుఁడు పాదముల వ్రాలి ♦ శోభిలుచుండన్. ౨౮

క. వరదుఁడు రాముఁ డయోధ్యా,పురి మరలంబొంది మృదుతఁ♦బూనిపృథువులై
పరఁగెడు తనచేతుల నీ, చరణంబులఁ బిసుకఁగలఁడు ♦ స్వాంతమలరఁగన్.

1 సీతే వానుగతా లక్ష్మీః-అని మూలము. సీతాత్మనా అని మహేశ్వరతీర్థులభావ మిట వ్యక్తము. * మాశోకో దేవి దుఃఖం వా-అని మూలము.

సీ. శూరుఁడై నఖులతో♦శ్రీరాముఁ డరుదెంచి ప్రవరపూర్వకముగఁ♦బ్రణతిసేయ
నంబుదావళియెట్టు ♦ లద్రిని దడుపునో యట్లు దడుపుదు; వ♦య్యాత్మజన్మ
నానందవారి నం♦చయ్యనవద్యాత్మ, వాక్యోపచార భ♦వ్యప్రవీణు
రాలగు నాసుమి♦త్రా లలనామణి పలుభంగులైన వా♦క్కులు వచించి

ఆ. యామె నూఱడించి ♦ యంత నూఱకయుండె;
నవ్వచనములఁ దగ ♦ నాలకించు
చున్న రాజపత్ని ♦ కొగి దేహజనితమై
యధికమైన దుఃఖ ♦ మయ్యదనున. ౩౦ 1724

ఆ అల్పజలము గలిగి ♦ యలరి శరత్తున
నంబుదంబు వేగ ♦ యంతమొందు
నట్టు లతిజవమున ♦ నంతయు నశియించె
నంత నచట రాముఁ ♦ డరుగుచుండ. ౩౧ 1725

నలువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౪౫ - వ సర్గము.

రాముఁడు తన వెంటవచ్చు పౌరుల నూఱడించుట.

సీ. సత్యపరాక్రము ♦ సరసచిత్తుని రాము ననురాగమునఁ బౌర♦జనపదనరు
లనుసరించిరి వనం♦బున కేగుచుండంగ మఱియు రాముని మిత్ర♦మండలంబు
నంతఃపురజనంబు ♦ నధిపతియును బలాత్కారంబున మరల్పఁ♦గాఁ బడి చని
రంతియకాని య♦య్యరదంబు వెంటనె చనుచున్న మానవ♦సంఘమతని

ఆ. వదలి మరలరైరి; ♦ వరకీర్తి సద్గుణ,యుతుఁడు రాముఁ డయ్య♦యోధ్యనున్న
జనులకెల్లఁ బూర్ణ♦చంద్రుని భంగిని, బ్రియుఁడుగాఁ జెలంగి♦వెలయుచుండె.

చ. తన ప్రజలెల్లఁ బోవలదు ♦ దండకకాననసీమ కంచుఁ ద
న్ననుపమయుక్తివాక్యముల ♦ నాదృతి వేఁడినఁ గన్నతండ్రి స
త్యనియతుఁ జేయఁ బూని తన♦యంగనయుఁ సహజుండు వెంటరాఁ
జనియెను రాముఁ డవ్వనికె ♦ సత్యధనుండయి యొప్పుచుండుటన్ ౧ 1727

*చ. తనరథయుక్తివచ్చు పుర♦తల్లజవాసుల స్నేహయుక్తిమైఁ
గనులభిత్రుప్తినొందఁ దన♦కన్న కుమారులభంగిఁ జూచి యి
ట్లని వచియించె స్నేహమున ♦ నాతఁ డయోధ్యయె కాపురంబుగాఁ
దనరెడు వారికెంత ప్రమ♦దం బలరాఘనో నాపయిం దగన్. ౨ 1728

---

* అవేక్ష్యమాణ స్సస్నేహం, ఉవాచ రామ స్స్నేహేన-అని మూలమున రెండుసారులు స్నేహశబ్ద ముపయోగింపఁబడుట యర్థభేదమునకని యెఱుంగునది.

తే. ఎట్టి బహుమానబుద్ధియు ♦ నెనఁగుచుండు
నో యవెల్లను మత్ప్రీతి♦కై యధికము
గాఁగ భరతునియం దుంచు♦గాఁ దగు నిఁక
నతఁడు కళ్యాణశీలుఁడై ♦ యలరువాఁడు. ౬ 1729

సీ. జనయిత్రి కానంద♦మును వృద్ధి చేసెడువాఁడు కావున మీకు ♦ వలసినట్లు
ప్రియముల హితముల ♦ వేగ న్యాయమురీతిఁ జేయఁగలండు నేఁ ♦ జెప్పనేల
వయసున బాలుఁడై ♦ వఱలిన భరతుండు జ్ఞానవృద్ధుఁడు మృదు♦మానసుండు
వీర్యగుణాఢ్యుఁడై ♦ వెలయును గావున మీభయంబులఁ బాపి♦మీకుఁ దగిన
ఆ. రాజు కాఁగలండు ♦ రాజులకుం దగు
నఖిల సద్గుణముల ♦ నమరియుండు
రాజుచేతను యువ♦రాజుఁగా నొనరింపఁ
బడినవాఁడు గాఁడె? ♦ భరతుఁ డిపుడు. ౭ 1730

క. నేనును మీరు సుమిత్రా, సూనులు దశరథుని యాజ్ఞ♦చొప్పున నడువం
గా నగుఁ గాదే? యిప్పుడు, భూనేతగ భరతు నొప్పఁ♦బోలును సుండీ. ౮

క. వనవాసము చేయఁగ నేఁ, జనినపిదప మీరలద్ద♦శరథక్షోణీ
పుని దాప మొందకుండం,గను వర్తింపంగ వలయుఁ♦గా నాకొఱకై. ౧౦

క. నామేలు చేయఁ గోరిన, నీమాడ్కి నొనర్పుఁ డనియె; ♦ నిటు ధర్మరతిన్
రాముం డొందినకోలఁదిని, భూమీశుఁడు నిన్నె మొదటఁ♦బూన్కి దలిర్పన్.

తే. మాకు యువరాజుగాఁ జేసె ♦ నీకు మాకుఁ
బ్రభువు నానతిఁ జేయుట ♦ పాడియె యని
రాముఁడే తమకున్ యువ♦రాజుగాఁగ
వలయునని యెంతయేఁ గోరి ♦ రెలమి మిగుల. ౧౧ 1734

చ. కనుల జలమ్ము గ్రమ్మ ముఖ♦కాంతు లడంగఁగ దీనులౌచు న
జ్జను లల రామలక్ష్మణులు ♦ చాల వచించిన నాదరింపకే
వినకయె వెంటఁ బోవుటది ♦ వింతగ వారి గుణాళిపాశముల్
తనువులఁ బట్టి యీడ్చిన వి♦ధంబునఁ జూడఁగనయ్యె నయ్యెడన్. ౧౨ 1735

తే. జ్ఞానవయసుల బ్రహ్మవ♦ర్చస్సునను ద్రి
విధములను వృద్ధులైన యా♦విప్రవరులు
వార్ధకంబున శిరసులు ♦ వడఁక దూర
మునను నిలుచుండి పల్కిరి ♦ వనటఁ గుంది. ౧౩ 1736

సీ. సత్కులంబునఁ బుట్టి♦జవమునఁ బేరొంది యరదంబునన్ రాముఁ♦డధివసింపఁ
గొనిపోవుచున్న యో♦ఘోటకరత్నంబులార! మరలుఁ డింక ♦ దూరమేగ
వలదు వినుండు మీ ♦ ప్రభువున కెంతయు హితులు కండు! ధరిత్రి♦నెన్న జంతు

వులనెల్ల ఘోటక♦ములకుఁ గర్ణంబులు మిగులఁ గలవు గాన ♦ మేము చేయు
తే. యాచనలు వినవచ్చుఁ గ♦ర్ణాంతరముల
కట్లు గావున మరలుఁ డ♦త్యంతధర్మ
విదుఁడు శుద్ధాంతరంగుఁడు ♦ వీరుఁడు శుభ
తమదృఢవ్రతుఁ డగును మీ♦ధరణివిభుఁడు. ౧౪ 1737

క. కనుకన్ రాముండు పురం,బునకుం గొనిపోవఁ దగును ♦ బురినుండి వనం
బునకుఁ గొనిపోవఁ దగఁడని, వనటం బలవించి పల్కు ♦ బ్రాహ్మణవరులన్.

క. కనఁగొని యావృద్ధుల స్యం,దనమ్ము నుండియె జవంబు♦నం దిగియె మహీ
తనయాపతి తద్వచనము, విని రథమున నేగఁ గల్గు ♦ వితతాఘుంబుల్. ౧౬

క. అని తలఁచి విప్రవర్యుల, మనముల నూఱడిలఁ బలుక ♦ మరలినచో నాఁ
దనవ్రతభంగ మటం చతఁ, డనుజునితో సీతతోడ ♦ నంప్రీగతులచేన్. ౧౭

క. వారలు తనదు సమీపము, చేరెడు గతి మెల్లమెల్ల ♦ క్షితి నడుగుల గం
భీరమతిఁ బెట్టుచుండెను, జారిత్రప్రియుఁడు రామ♦చంద్రుం డంతన్. ౧౮

క. కరుణాదృష్టి యగుటచే, నరదంబుననుండి తాను ♦ వ్యథచే నడుగుల్
ధరణిం బెట్టుచు వచ్చెడు, ధరణీసురపుంగవులను ♦ దగు వాక్యములన్. ౧౯

ఆ. ఊఱడింపఁ జాల ♦ కొగిఁ గాలినడకలఁ
దానుఁ బోవుచుండె; ♦ ధరణిసురులు
రాముఁ డేగుచుండ ♦ భ్రాంతచిత్తంబులఁ
గాంచి మిగులఁ బొక్కి ♦ కలఁగి యనిరి. ౨౦ 1743

సీ. శ్రీరామ! బ్రాహ్మణ♦సేవ చక్కఁగఁ జేయువాఁడవు కాన వి♦ప్రవరులెల్ల
నిను వెంబడించిరి ♦ విను మరణులయందు నారోపితములగు ♦ నగ్నులెల్ల
నివ్వారి మూఁపుల ♦ నెక్కి నీవెంటనె వచ్చుచున్నవి శర♦ద్వారిదముల
మాడ్కిఁ దెల్లగనుండు♦మాఛత్రములువాజపేయమునందుఁబ్రా♦ప్తించినవియె
తే. యగు నివియుఁ గూడ నీవెంట ♦ నరుగుదెంచు
చున్న విటు చూడు ఛత్రసం♦పన్నుఁడవయి
యరుగ కీవెండబాధల ♦ నందు నపుడు
కాంచి యోర్వఁగఁ జాలము ♦ కాన మేము. ౨౨ 1744

క. విను వాజపేయసత్క్రతు,వున లబ్ధము లైన యిట్టి ♦ భూరిసితచ్ఛ
త్రనికరముల వలనన్ నీకును ఛాయను గల్గఁ జేయఁ♦గోరితిమి సుమీ!. ౨౩

తే. ఇంతదాఁక నేచింతయు ♦ నెఱుఁగకుండ
శ్రుతుల వర్తించుచుండు మా♦మతి యిపుడొగి
నిన్నుఁ బట్టియె వనినుండ ♦ నెన్నికొన్న
దయి చలించెను భూపవ♦రాత్మజన్మ!. ౨౪ 1746

చ. ధనముగు మీకు వేదతతి ♦ దానిని దారలనం ద్యజించి సఙ
వెనుకొని వచ్చు టొప్పునొకొ? ♦ విప్రశిఖామణులార! యంచు నీ
వనుదువయేమొ! శ్రేష్ఠధన♦మా శ్రుతిబృందము మామనంబులం
దునె యలరారుc గాచెడిని ♦ దొయ్యలులం దదుదారశీలమే. ౨౪½ 1747

క. కనుకఙ దారలు గృహముల,నె నివాసముచేయుచుండు ♦ రింకను మత్పా
ర్థన ననుసరించి మరలుం, డనుదువయేమో! మహాత్మ! ♦ యదిపొసఁగదిఁకఙ.

చ నిను మరలించి తోడుకొని ♦ నెమ్మి గృహంబుల కేగ మేము మా
మనసుల నిశ్చయించితిమి ♦ మానితచిత్త! వనిం జొరంగ నిం
కను దలపోయఁగాఁ జనదు ♦ కావున నేగుట తండ్రియాజ్ఞయఙ
ఘనతరధర్మరక్షణము ♦ గావున మాన నటంచుఁ బోయినఙ. ౨౫½ 1749

సీ. మాకిందు నింక ధ♦ర్మమును బాలింపంగఁ దగు నిమిత్తంబుండఁ♦దగునె కాన
ధర్మంబు విడువఁగఁ♦దగియుండుఁగద! విప్రసంప్రార్థనముచేయఁ♦జనునది యగు
ధర్మంబు దానిని ♦ ధర్మపరుఁడవగు నీవె తలంపవే♦ని యిఁకఁ గోర
నింతకంటెను ధర్మ♦మే మధికంబుండు నియతధర్మంబునె ♦ నీవుచేయు

తే. చుండువాఁడవు; హంసల ♦ పిండుగతిని
శ్వేతములగు శిరోజముల్ ♦ వెలయనున్న
†మాశిరస్సులు క్షితిసోఁక ♦ మన్నుగప్పు
నట్లు మ్రొక్కి ప్రార్థించెద ♦ మనఘ! నిన్ను. ౨౬ 1750

క. మరలుమ యిఁకనైనను భూ,సురు లిదె నీవెంట వచ్చు♦చుఙ ఘనశోకా
తురులైన వారనేకులు, గురుతరయజ్ఞములఁ జేయఁ ♦ గోరికమీఱఙ. ౨౬½

క. పరికరములఁ గూర్చిరి య,ధ్వరములు వని కరుగకున్నఁ ♦ దప్పక సాగుఙ
గరుణింపక నీవరిగిన, జరగవు కావునఁ బురంబుఁ ♦ జనుఁ జేరంగఙ. ౨౮

సీ. మావలెనే జంగ♦మములైన యట్టి తిర్యగ్జంతువులు స్థావ♦రంబులైన
భూరుహాదులుఁ భక్తిఁ ♦ బూని యున్నవిగాన నీరాకఁ గోరెడు♦నిశ్చయముగఁ
గానఁ బ్రార్థించు భ♦క్తవ్రాతమునస్నేహమునుజూపినఫలంబు♦గ నొనరుపుము
వృక్షంబులును నీదు ♦ వెంబడి రాఁ బూనెఁ గాని తదంఘ్రులై♦క్రాలు మూల

తే. ములు చలింపని కారణ♦మున హతజవ
ములయి పవనజవంబునఁ ♦ జెలఁగి లేచి
నట్టి కొమ్మలతో మ్రోయు♦టరయఁ గరము
లెత్తి మొఱపెట్టుకొను చంద ♦ మిపుడు తోఁచె. ౩౦ 1753

† బ్రాహ్మణోత్తములు క్షత్రియకుమారునకు నమస్కరించుట పరత్వబుద్ధిచే నని గోవింద రాజులు.

చ. పతగములున్ స్వచేష్టలను ♦ బాసి చరించుట మాని భుక్తికై
జతనము చేయుటే విడిచి ♦ క్ష్మారుహశాఖల నెందొయుండి జీ
వతతిపయిన్ దయాపరత ♦ భాసిలు నిన్నదె వేఁడుచున్న వీ
గతి వనికేగరాదనుచుఁ ♦ గ్రమ్మఱుమా యని పెక్కురీతులన్. 1754

క. అని రాముని మరలింపం, గను మొఱలిడు నాద్విజన్మ♦గణముంగని *తా
నును రాము నాపునట్లుగఁ, గనఁబడెఁ దమసాఖ్య నిమ్న♦గామణి యచటన్.

తే. అంత సారథి బడలిన ♦ యశ్వవితతి
నరదమున నుండి విప్పి య♦య్యలపుదీఱ
నిలను వే పొరలించి స♦లిలముఁ ద్రాగ
వానిఁ గడిగి మేయఁగఁ ద్రిప్పె ♦ దానిచెంత. 1756

నలువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౬ - వ సర్గము.

-- రాముఁడు తమసానదియొడ్డున విశ్రమించుట. --

క. తరువాత రమ్యతమసా, తరంగిణీ తీరమొంది ♦ ధాత్రీతనయం
బరికించుచు ననుజునితోఁ, దరణికులోద్దీపకుండు ♦ తా నిట్లనియెన్. ౧ 1757

క. వనినుండఁ దగినకాలం,బునఁ దొలిరాత్రి యిదె! విపిన♦మునఁ దోఁచెడినో
యనుజా! నీవు గృహాదుల, మనమున స్మరియించికాని, ♦ మగువన్ దీనిన్. ౨

క. వనవాసమ్మునఁ గుందెడు, ననికాని తలంచి ఖేద♦మందకు మిదిగో
కనుమా యడవుల; రాతిరి, చనుదెంచుట మృగపతత్రి♦సంఘము లెల్లన్. ౩

తే. ఎల్ల దిక్కులనుండి తా ♦ మేగుదెంచి
స్వస్వనిలయంబులం జొచ్చె ♦ వరుసఁ గాన
నీవనులు శూన్యములయి యా♦మృగపతత్రి
శబ్దముల రోదనముచేయు♦సరణిఁ దోఁచు. ౪ 1760

చ. అని మఱియున్ వచించెఁ బుర ♦ మప్పుడు జ్ఞప్తికి రాఁగ నిప్డు నా
జనకుని రాజధాని యను♦జన్మ! వనంబున నుండఁ గోర్కిచే
మనమిటు రాఁగ స్త్రీపురుష♦మండలి చెన్నుతొఱంగి యేడ్వఁ దా
నును వెత నొందుచుండును గ♦నుంగొనరాని తెఱంగు తోఁపఁగన్. ౫ 1761

మ. అనుమానం బొకయింత లేదు పురుష♦వ్యాఘ్రా! తలంపంగ నా
జనముల్ పెక్కుగుణంబులన్ భరతునిన్ ♦ శత్రుఘ్ను నిన్నున్ ననున్
జననాథున్ గనుచుందు రెంతయుఁ జుమీ ♦ సాంద్రానురాగంబునన్
జననిం దండ్రినిఁ గీర్తిరాజితుల నా♦స్వాంతంబునం దిత్తఱిన్. ౬ 1762

* [illegible]

తే. తలఁచు చున్నాఁడఁ గాన నెం♦తయును దుఃఖ
మావరించె మనంబున ♦ నచట వార
లధికముగ నేడ్చి గ్రుడ్డివా ♦ రగుదు రేమొ?
యైన నూఱట తోఁచె నా♦యాత్మ నిపుడు. ౬ 1763

క. భరతుఁడు ధర్మాత్ముఁడు గద, పరికింప నతండు ధర్మ♦భంగిని గామా
ర్థరతింగను వాక్యములఁ బి,తరులం దమి నూఱడించుఁ♦దగు సమయములన్.

క. అనుజా! భరతుఁడు క్రూరతఁ, గొనఁడని పలుమాఱుఁదలఁచు♦కొనఁగా నాకున్
జననీజనకుల విషయం,బున దుఃఖము కలుగ దిపుడుఁ ♦ బురుషవరేణ్యా!. ౮

క. నను ననుసరించి వచ్చుట, ఘనకార్యము చేసితీవు ♦ కానకు నీవే
చను దేరవే సహాయం,బును వెదుకవలసియె యుండ ♦ భూసుతఁ గావన్. ౯

సీ. వనవాసమునకు ను♦పక్రమించిన దినమిది తమసాతీర ♦ మిద్ది యాటఁ
బావనక్షేత్రంబు ♦ కావున నుపవాస మొనరింపఁగాఁ దగి♦యుండు నట్టు
లౌట నీరాత్రియం ♦ దంభస్సులం ద్రాగియుండెద నీవని ♦ నొగి సమస్త
వన్యఫలంబులు ♦ పరిఢవిల్లును గాని జలమె రుచించె నీ♦సమయమునకు
తే. ననుచుఁ దమ్మునకుం జెప్పి ♦ యల సుమంత్రుఁ
గాంచి సౌమ్యా! పతాకులే♦కయె మెలంగు
మశ్వముల విషయంబున ♦ ననియె; సూర్యుఁ
డస్తమింప సుమంత్రుఁ డ♦శ్వాళిఁ గట్టి. ౧౦ 1767

క. సురుచిర తృణాళి వేయుచుఁ, దనువాతం జేయఁదగిన♦దానిఁ దెలిసి భూ
వరపుత్రుచెంత నుండెను, హరిదశ్వుండరుగ రాత్రి ♦ యరుదేరంగన్. ౧౧

సీ. సతతమంగళదయా ♦ సంధ్య నుపాసించి సౌమిత్రినిం గూడి ♦ రామచంద్రు
నకు రాత్రికై శయ♦నంబును నిర్మించెఁ దమసాతరంగిణీ ♦ తటమునందుఁ;
బాదపపత్రని♦వహముల నిర్మింపఁబడిన యాశయ్య రా♦ముఁడు కనుఁగొని
భ్రాతతోడను దన♦భార్యతోడను దానియందుఁ బరుండె; న♦ట్లన్న యతని
తే. యనుఁగుఁ బత్నియు నిదురింప ♦ నపుడు గాంచి
రామునకుఁ గల సద్గుణ♦రాజినెన్ని
తగ సుమంత్రునితో సుమి♦త్రాతనూజుఁ
డమలరీతి వర్ణించె స♦త్యము హితముగ. ౧౨ 1769

క. ఆనదిగట్టున సారథి, కానరవరు సద్గుణాళి ♦ నటు చెప్పుచుఁ దా
నానిశి మేల్కొనియె సుమి,త్రానందనుఁ డుండఁదోఁచె ♦ రవి తూరుపునన్.

క. తనవెంటం జనుదెంచిన, జనములతోఁ గూడ రామ♦చంద్రుఁడు గోవ్యా
హానిబిడమౌ [1]తమసాప్ర,దిని చెంత వసించె రాత్రి ♦ తృప్తిగ నంతన్. ౧౪

[1] తమసాప్రదిని=తమసానది.

సీ. అమ్మహాతేజుఁ డో♦య్యనఁ బాన్పు విడనాడి లేచి యా జనులను♦జూచియనుజుఁ
బుణ్యలక్ష్మణుఁడయి♦పొలుచు లక్ష్మణుఁగాంచి పలికెను దమ్ముఁడా!♦ప్రజలుస్వీయ
సదనంబులందు నా♦శనుమానిమనయందుఁగలయపేక్షను వృక్ష♦ములకుఁగ్రింద
నిప్పుడు నిద్రపో♦యెడు వారు చూడుమా! మనల మరల్ప నీ♦జనులు పూని
తే. యున్న నియమంబుఁ బరికింపఁ ♦ గ్రన్ననఁ దమ
యసువులనునైన వదలుదు ♦ రంతెకాని
వదల రేమాత్రమైనను ♦ బట్టుదలను
గాన వీరలు నిద్రను ♦ బూనియుండ. ౨౦ 1772
చ. అరదము నెక్కి చుల్కఁగ భ♦యంబను మాటయె లేని దారినిం
దరుగుట లెస్స, యట్లయిన ♦ నందఱు వీరలు నన్నుఁగూర్చి భూ
మిరుహకఠోరమూలముల ♦ మించిన యార్తిఁ బరుండకుందు రీ
తరుణమునందుఁ బోలెను, ని♦తాంతము నాపయిఁ గల్గు ప్రీతిచేఁ. ౨౧ 1773
క. తమవలనఁ జనులకు దుఃఖము కల్గునయేనిఁ బాపఁ♦గాఁ దగుఁగా రా
కొమరులకుఁ, బౌరులకుం, దమదుఃఖము గల్గఁజేయఁ ♦ దగ దెప్పటికిఁ. ౨౩
క. అన సాక్షాద్ధర్మాకృతి, యనఁదగు నారాముఁ గాంచి ♦ యనుజుఁడు నీచె
ప్పినదెల్ల నాకు నిష్టమె, యనుమానంబేల? యెక్కు ♦ మరదము ప్రాజ్ఞా!.
తే. అనియె నంత శ్రీమంతుఁడా ♦ యర్కకులుఁడు
పలికె సారథితో నీవు ♦ బలుసమర్థుఁ
డవు గదా తేరు వే సిద్ధ♦మవుగతిఁ దగ
నొనపుపుము యెక్కిపోయెద ♦ వనములకును. ౨౫ 1776
చ. చనఁదగు నిందునుండి యిఁక ♦ సత్వరమే యని చెప్ప స్యందనం
బునకు హయోత్తమంబులను ♦ బూన్చి జవంబున నాయితంబుగా
నొనరిచి దోసిలొగ్గి రథి♦కోత్తమ! దీర్ఘభుజా! మహాత్మ! స్యం
దన మిదె సిద్ధమయ్యె నిఁకఁ ♦ దమ్ముని సీతను గూడి యెక్కుమా!. ౨౬
క. తనరుంగాక శుభోత్కర, మని యె; సుమంత్రుండు పలిక♦రావళితో స్యం
దన మెక్కి రాముఁ డతిజవ,మునుసుడులును వెలయమిగులఁ♦బొల్చెడుతమసన్.
ఆ. దాఁటె నంత సిరిని ♦ దనరారు నమ్మహా,భుజుఁడు రథమునుండి ♦ పూజ్యతటిని
దాఁటి యవలఁ జేరి ♦ తగ శుభస్కరమయి, కంటకములు లేని♦కమ్ర పథము.
సీ. కనుఁగొని పోవుచుఁ ♦ దనవెంట వచ్చిన జనములకెల్లను ♦ దనదు సంగ
తిని గల్గు నానంద♦మును గాంచి యద్దియున్నస్తకమైనచో ♦ మరల వారి
కునికియే లేకుండు♦నొగి సుసాత్మ్యానుభవముఁ గూర్పఁగాఁదగు♦వరుస ననుచు
వనవాసమును వ్యాజ♦మునను విశ్లేషంబుఁ గలిగింప నెంచుచుఁ ♦ బలికె నపుడు
తే. సూత! నీవొక్కఁడవె యెక్కి ♦ శుభరథంబు
నుత్తరంబునకుం బొమ్మ♦యోధ్య కేను

బోయితినటంచు నెంతురు ♦ పురజనులటు
గడియమాత్రమె పోయి, వే♦గముగ నీవు. ౩౭ 1789

క. అరదము మరల్చుకొని యెవ్వరు నెఱుఁగని వేఱుత్రోవ ♦ వచ్చి మముఁ జ
త్వరముగఁ గలిసికొనుము నే, నరుగుట జను లెఱుఁగకుండు♦నట్టులు గాఁగన్.

క. పని దీని సమాహితమనమునఁ జేయుమటన్న రాము ♦ శుభవచనములన్
విని యట్లె యాసుమంత్రుం, డొనరిచి యరదంబుఁ దెచ్చి♦యునుగతివిూఱన్.

ఆ. అప్పనంబు చేసె ♦ నంతట రఘుకుల, వర్ధనులును జనక♦వంశమౌక్తి
కంబనంగ నొప్పు♦ధాత్రీపుత్రికయు నెక్కి; రంతటన్ సుమంత్రుఁ♦డా రథమును.

క. మునులు తపం బొనరించెడు, వనమునకుం బోవు దారిఁ♦బట్టి హయములన్
జనునటు తోలెఁ బ్రయాణం,బునశుభశకునములఁ గాంచు♦పొంటెన్ ద్వరగన్.

తే. ఉత్తరమునకుఁ బోనిచ్చి ♦ నొక్కకొంత
దవ్వు నంతమహారథుఁ ♦ డవ్విభుండు
రథము నద్దాని నెక్కి సా♦రథిని గూడి
చనియెను దపోవనంబున♦కును మునమున. ౩౮ 1785

నలువదియగువ సర్గము సంపూర్ణము.

---

౪౧ - వ సర్గము.

పౌరులు రాముని గానక యయోధ్యకు మరలి పోవుట.

చ. పురజనులంత రాఘవుని ♦ పోకడఁ గానక తెల్లవాఱ ని
ర్భరమగు శోకవహ్నిహతి ♦ [1]స్వాంతకుజంబులు స్రుక్కి స్రుగ్గి యే
వరునను రాముజాడఁగను ♦ భంగి మనంబులఁ దోఁచకుంట నం
దరయుచు మూఢచిత్తములఁ ♦ నార్తిఁ జరించుచు నుండి యవ్వలన్. ౧ 1786

క. ఘనశోకంబునఁ గన్నీ,టను దోఁగుచు నంత నలుఁగ♦డలఁ గాంచుచు రా
ముని గుర్తుఁ దెలుపురథరజ,మునైనఁ గనకెంతొ దుఃఖ♦మును గని పిదపన్.

సీ. ధీశాలి రాముండు ♦ దిగనాడి పోవుటవలన వారాతని♦పయి మనంబు
గలవారు గాన దుఃఖమున మోములువాడి కాంతిదప్పఁగ నెంతొ♦కరుణగల్గఁ
గాఁ జేయు పలుకులఁ♦గడఁగి యొండొరులతోఁబలుకఁగాఁ జొచ్చి; రి♦ప్పాడునిద్ర
యక్కటా! మనసుల♦హరియించె నిస్సిరో! నిద్రాపహృతమతి♦నిపుణులమయి

ఆ. యవ్విశాలవక్షు ♦ నామహాబాహుని
గనఁగఁ జాలమైతి ♦ మనఘుఁ డతఁడు
సార్థకక్రియుండు ♦ నయ్యు భక్తులమగు
మనల విడిచి యెట్లు ♦ వనికి నరిగె. ౨ 1788

---

1 స్వాంతకుజంబులు=మనస్సులను వృక్షములు.

క. జనకుం డౌరసపుత్త్రునిఁ, గనికరమునఁ గాచురీతిఁ ♦ గా మమ్మును గా
చునతం డా రఘువర్యుఁడు, వనికరిగెనొ యెట్లు మమ్ముఁ ♦ బాసి కటకటా. ౬

క. ప్రాయోపవేశ మొనరిచి, యీయెడఁ బ్రాణముల విడువ♦మే కాకున్నన్
న్యాయముగ మరణ దీక్షం, జేయుచు నుత్తరముఁ బట్టి ♦ స్థిరబుద్ధులమై. ౭

క. అరుగుదమే; కాకున్నన్, వరగుణ రత్నమగు రాముఁ ♦ బాసి యిఁక నిలన్
మరణింపక మననేలొకొ, వరుసఁగ శుష్కేంధనములు ♦ వని నిటఁ గననొ. ౮

ఆ. వలసినన్ని తెచ్చి ♦ వానితోఁ జితిఁ బేర్చి
యగ్ని రగులఁ జేసి ♦ యందు మనము
పవ్వళించి వేగ ♦ ప్రాణాళి విడుతమా;
మనము పురికిఁ బోవ ♦ జనులు మనల. ౯ 1792

క. రాముని వార్తల నడిగిన, నానుహితభుజాఢ్యు నప్రి♦యంవదు ననసూ
యామాన్యు విడిచి వచ్చితి, మేమందఱ మవ్వని నని ♦ యెటు చెప్పనగున్.

క. మనమా రాముఁడు లేకయె, చన స్త్రీ శిశు వృద్ధ ముఖ్య♦జను లార్తిమెయిన్
వనటం గుందుట నిజమగు;, ననయము విజితేంద్రియుఁడగు♦ నారాఘవునిన్.

సీ. కలిసియే పురము వె♦డలితి మిప్పుడు రాము విడనాడి నగర మె♦ట్విధిని జొత్తు
మెభ్భంగిఁ జూతుమం ♦ చివ్విధిఁ బలుకుచు వత్సలఁ బాసిన ♦ భవ్యధేను
వుల చందమునఁ గరం♦బులను బైకెత్తి దుఃఖార్తులై పలవించి! ♦ రంత వార
లరద మేగిన జాడ ♦ నరయుచు నొకకొంతకాలంబు పోయి మా♦ర్గంబుగానఁ

తే. బడమి కెంతయుఁ జింతిల్లి ♦ పౌరులెల్ల
దారి యెటు పోయె నిఁకఁ జేయు♦వారమేమి
మనము దైవోపహతులమే ♦ యనుచు నేడ్చు
చును మరలి రాత్మ లెల్లఁ గుం♦దినకతమున. ౧౨ 1795

క. అరుదెంచిన త్రోవలనే, మరలి యయోధ్యాపురో త్త♦మముఁ జేరిరి స
త్పురుషులు దుఃఖింపఁగ న,ప్పురమలరారకయె యుండెఁ♦బొంకము చెడుటన్.

సీ. సమ్మార్జనాది సం♦స్కారవిహీనమౌ పురమును గని గత♦బుద్ధులగుచు
హ్రాదమున నున్న స♦ర్పమును గరుత్మంతుఁ డపహరింపఁగ లఘు♦వైనయట్లు
రాముండు లేమిఁ బు♦రంబిద్ది శోభావిహీనమైన దటంచు ♦ నెంచి వగలఁ
బొగిలి కన్నీటను ♦ భూమిని దడిపిరి; యానందరహితమై ♦ యప్పురంబు

తే. శోకహతచిత్తమౌ పౌర♦లోకమునకుఁ
జంద్ర పరిహీనమౌ నాక♦సంబు పోల్కి
జలవిహీనసముద్రంబు ♦ సరణిఁ గాన
నయ్యె వారలు దుఃఖ ము♦త్యధికమగుట. ౧౪ 1797

చ. మనమునఁ గల్గు సంతసము ♦ మాయువిధంబునఁ బోవ సంతతా
ధనపరిజుష్టమౌ గృహవి♦తానము నెట్టులొ చొచ్చుచున్ మహా
ర్తిని గనుచుంటచే నెదుట ♦ దీనత నిల్చినవారు స్త్రీయులౌ
జనులొ మఱెవ్వరో యెఱుఁగఁ ♦ జాలక పోయిరి చూచుచుండియున్. ౧౯

నలువదిఏడవ సర్గము సంపూర్ణము.

---

## ౪౮ - వ సర్గము.

—రాముని గూర్చి పౌరులు దుఃఖించుట.—

చ. పురజను లివ్విధిన్ మరలి ♦ భూపతి పుత్త్రుని గానమిన్ నిరం
తరగురుదుఃఖపీడల ని♦తాంతము నొందుచు బాష్పవారియున్
దొరుఁగఁగ నేడ్చుచున్ మృతిని ♦ దొందరఁగాఁ గనఁగోరుచున్ మతి
స్థిరత దొలంగఁ బ్రాణవిత♦తిన్ విడినట్లుగఁ ద్రెళ్లి రుర్విపై. ౧ 1799

సీ. ఆమీఁద వారు గృ♦హంబులకుం బోయి కొడుకుల భార్యలఁ ♦ గూడి బాష్ప
పిహితాస్యులై చాల♦విధముల నేడ్చిరి స్నిగ్ధు లట్లరుగుదెం♦చినను వారిఁ
గని ప్రమోదంబును ♦ గాంచక, యపురూప వస్తుసంతతి లభిం♦పఁగ నలరక
యుండిరి; వణిజులు ♦ నుపయుక్తవస్తువుల్ పఱచి యంగళ్లను ♦ బయలుపఱుప
తే. రైరి, పుణ్యవ్రతంబుల ♦ నాచరింప
రైరి, గృహమేధులున్ బచ♦నాదికములఁ
జేయమానిరి మణిసము♦దాయ మెంతొ
కాలమున నుండి ♦ దొరకక కానఁబడిన. ౨ 1800

క. పరిహృష్టమనస్కులు గా, కురునిధిలాభంబు గలుగ ♦ నుండిన మోద
స్ఫురణను బొందక యుండిరి,తరుణులు తొలికొడుకురా ము♦దంబూనరునూ!.

సీ. ప్రతిగేహమున స్త్రీలు ♦ వితతదుఃఖము నొంది భర్తలింటికి రాఁగ♦వారణముల
నంకుశమ్ములఁ గ్రుచ్చు♦నట్లు రూక్షోక్తులఁ బల్కి నిందించి; రా♦ప్రమద లెల్ల
భర్తలఁ గని రఘు♦వర్యుఁ జూడఁగ లేనివారల కిండ్లేల ♦ భార్యలేల
ద్రవ్య ముండిన నేల ♦ తనయు లుండిన నేమి శర్మ మేటికి? వన♦స్థలమునందు
తే. జనకజాయుక్తుఁడౌ రామ♦చంద్రునకును
భక్తిఁ బరిచర్యచేయ వెం♦బడిని జనిన
యల్ల లక్ష్మణుఁ డొక్కఁడే ♦ యగును లోక
మందు సత్పురుషుండు, ధ♦న్యమతి యతఁడె. ౪ 1802

క. వని రాముం డేయే నదు,లను [1]దామరకొలఁకులం గో♦లంకులఁ దిగి యం

---

1 పద్మిన్యశ్చ సరాంసిచ-అనిమూలము. పద్మిన్యః=తామరపూవులుగల కొలఁకులు. సరాంసిచ=సామాన్యసరస్సులు అర్థమని గ్రహించునది.

దనుపమశుచి వారి మునుంగునొ యవికృతపుణ్యములై య♦గుఁ సత్యముగన్.

చ. మనమున కింపుఁ బెంచెడు ద్రు♦మంబులు గల్గు నరణ్యసీమలున్
ఘనజలధారలన్ శుచితఁ ♦ గ్రాలుఁ నదుల్ వరసానుసంతతుల్
దనరఁగ నొప్పు పర్వతవి♦తానము రాముని సంతసంబునున్
గనునటు చేయఁగాఁ గలవు♦గా, యతఁడాదృతి మీఱునట్లుగన్. ౧౦ 1804

క. వని కేనియు భూమిధరం,బున కేనియుఁ బోవ నవియుఁ ♦ బొంగెడు కాంక్షన్
జనుదెంచు ప్రియాతిథివలెఁ, గని యర్చన చేయకుండఁ♦గలవే తమితోన్. ౧౧

*చ. సురుచిరచిత్రపుష్పపరి♦శోభితశీర్షములౌచుఁ గొమ్మలం
దరుదుగఁ బుష్పమంజరుల ♦ నందముగా ధరియించి షట్పదో
త్కరము ధ్వనించుచుండ గుణ♦ధామునకుం గనుపట్టి యాతనిం
బరునిగ నెంచి యర్చనల ♦ బాగుగఁ జేయు మహీజముల్ వనిన్. ౧౨ 1806

సీ. రామునందలి యాద♦రమున నకాలంబునను బువ్వులన్ ఫలా♦ళిని మహీధ
రము లాతనికిఁ జూపి♦రమణఁ బుట్టఁగఁ జేయు; మఱియుఁ గోరినతఱి♦మమతఁ బుట్టఁ
గాఁ జేయు సెలయేళ్లఁ♦గడువిచిత్రమ్ముగఁ గనఁబఱచుచుఁ దీయఁ♦దనమునిర్మ
లతయుఁ గల్గిన సలి♦లంబు నీయంగల వాభూధ్రశిఖరాళి♦యందుఁ జెలఁగు.
ఆ. పాదపములు రామ♦భద్రునకుం బ్రీతి,వఱలఁ జేయఁ గలవు ♦ భయముగలుగ
దాతఁడుండుచోట ♦ నవమానముండదు, రాముఁ డెచటనుండు ♦ రాజమౌళి.

క. శూరుండు మహాబాహువు, శ్రీరాముఁడు సుమ్మతండు ♦ చెచ్చెఱఁ బోవున్
దూరముగఁ గానఁ బోవుద, మా రామునిచెంత కిపుడె ♦ యతిజవమొప్పన్.

తే. ఆమహాత్ముఁడు ప్రభువగు ♦ నతనిపాద
సేవ శర్మప్రదమ్మని ♦ చెప్ప నేల ?
యతఁడె నాథుఁడాధారంబు ♦ గతియు, మేము
జనకజం గొల్వ మీరు రా♦మునిఁ గొలువుఁడు. ౧౫ 1809

సీ. అనుచుఁ బౌరాంగన ♦ లధికదుఃఖార్తలై పతులతో నివ్విధిఁ♦బల్కి మఱియుఁ
గాన రాముండు యో♦గక్షేమముల మీకు జనకజ మాకును♦నొనరఁ గూర్చు
జానకీపతి లేమిఁ♦చే నివాసార్హముగాక శోకంబునఁ ♦ గ్రందుచున్న
జనుల సంగతిఁ గాంచి♦యనురాగ మొదవింప కాత్మదూలించెడు♦నట్టియాయ
తే. యోధ్యయందు వసింపఁగ ♦ నొప్పుఁ బ్రీతి
యెవనికిందున ధర్మంబు ♦ నెసఁగుచుంట

---

* విచిత్రకుసుమాపీడా బహుమంజరిధారిణః, రాఘవం దర్శయిష్యంతి నగా భ్రమరశాలినః- అనిమూలము. అయంభావః నగాః రామం పరమాత్మానం మత్వా స్వనిష్ఠభ్రమరఝంకారరూపమంత్రోచ్చారణపూర్వకం స్వశాఖాకరోద్ధృత మంజరీరూపపుష్పాంజలిభిః రాఘవమర్చయిష్యంతీతి- అని మహేశ్వరతీర్థులు. దీనిభావమే యిట సూచితమని తెలియందగు.

నిది యనాథయువలెఁ గైక♦యదియె యయ్యొ
నేని మాకేల ప్రాణమ్ము ♦ లేల సుతులు. ౨౧ 1810

క. ధనమేటికిఁ దనకొడుకును, ధనకారణముననె భర్తఁ ♦ దగ విడిచినయా
వనితయు దుర్మతి కులపాం,సని కైక త్యజింపకుండు ♦ క్షమ మఱియెవరిన్. ౨౨

ఆ. కైక రాజ్యమందుఁ ♦ గైకేయి జీవించి, యుండ మేన నసువు ♦ లుండువఱకు
మేము భృత్యులవలె ♦ మెలఁగ మొకప్పుడు, సేవసించియుండ ♦ మిద్ది నిజము.

క. తనయులపై శపథంబును, నొనరిచి వచియింతు మిట్టు ♦ లుండ మనుచు, జ్యే
ష్ఠుని రాముఁ గరుణ లేకయె, వనికంపుచునున్న దేమి ♦ వచియింప నగున్.

సీ. దుష్టచారిణియు వి♦శిష్టధర్మత్యాగచిత్తయు నగు కైక ♦ చెంతఁ జేరి
బ్రతుకఁగాఁ గలరొ యె♦వ్వరుసుఖంబుగ;నింకనీరాజ్యమాధార♦హీనమగుచుఁ
బతిలేని దగుచు ను♦పద్రవముల నొందియున్న దీకైకయే ♦ యొక్క హేతు
వగుట వినాశంబు♦నంద సిద్ధంబయియున్నదీక్షితి యెల్ల ♦ నుఱుగుణాఢ్యఁ

తే. డైన రాముఁడు వనికేగ ♦ నవని బ్రతుకఁ
జాలఁడు గదా తలంప ద♦శరథుఁ డతఁడు
చనిన నంతయు నశియించు ♦ ననుట స్పష్ట
మేగదా సుకృతమెల్ల క్షయించె మాకు. ౨౬ 1814

సీ. మీరు తలంపఁగా ♦ మిగుల దరిద్రులు గాన నీవిషయంబుఁ ♦ గడఁగి యెంచి
విషమైనఁ ద్రావుఁడు ♦ వెస రామునైనను జేరఁబొం డివ్విధిఁ ♦ జేయఁ జేతఁ
గాదేని మీపేరు ♦ గాని వినంబడనట్టి దేశంబున ♦ కరుగుఁ డింక
జనకు నాజ్ఞను గైక♦యనుమతిఁ గొనిపోయె నాతఁడు దోషమే♦మందు రేమొ

తే. కపటమతి యీచు దశరథ♦త్మావరుండు, జనకజాలక్ష్మణులతోడఁ♦దనయునంపె
వనికి; బోయని చెంతకుఁ ♦ బశువు లనుపు,నట్లు మనలను భరతున♦కప్పగించె.

సీ. పూర్ణశశాంకునిఁ ♦ బోలు మొగమువాఁడు గూఢజత్రువు, శత్రు♦కూటహంత
శ్యామలదేహుఁ, డా♦జానుబాహుఁడు పంకజాక్షుండు సౌమిత్రి♦కన్న,యెందు
ముందు తానే మాట♦లందముగా నాడు సుందరాంగుఁడు నిత్య♦సూనృతవచ
నుండును భూరిబ♦లుండును లోకులకందఱికనుకూలుఁ ♦ డై మెలంగు

తే. వాఁడు శశిరీతిఁ గన్నుల ♦ పండువగుచుఁ
గానఁబడువాఁడు మత్తనా♦గంబు పోల్కిఁ
దనరు నడకలు గలవాఁడు ♦ మనుజసింహుఁ
డరయ రాముండు చెలఁగు మ♦హారథుండు. ౩౦ 1816

క. వినుఁ డల రాముఁడు తిరుగుట, వనములు శోభిల్లఁ గలవు ♦ పలుకిది నిజమే
యని నాగరకాంతలునే,ద్పునఁబల్కుచుఁబలువిధములఁ♦బొగడుచుమఱియున్.

చ. మృతిఁ గను వేళయందు వలె ♦ మిక్కిలి దుఃఖము తమ్ముఁ జేర న
య్యతివలు భూరినాదముల ♦ నార్తిని బొందుచు నేడ్చి రిట్టు గే
హాతతులం గాంతలెల్లఁ గరు♦ణాత్ముని రాముని గూర్చి చింతలన్;
గృతదినకృత్యుఁడై తపనుఁ ♦ డేగెను బశ్చిమశైలసీమకున్. ౩౩ 1818

చ. అరుణగభస్తి యస్తగిరి ♦ నందఁగ రాత్రియు వచ్చెఁ బౌరుల
త్తరుణమునందు నగ్నులను ♦ దా రొనరించెడు నిత్యకృత్యముల్
జరపుట మాని రెల్లెడల ♦ సస్వర వేదరవంబు నత్పురా
ణరవముగాని యించుక వి♦నంబడకుండె నయోధ్యయందొగిన్. ౩౪ 1819

తే. కటికిచీఁకటి గ్రమ్మిన ♦ కరణి నుండె
వర్తకులు నంగడులఁ బెట్టు ♦ వాంఛఁ బూన
రైరి సంతోషమే సున్న ♦ యయ్యె నందు
దిక్కు తోఁచకయుండె నా ♦ తీరుఁ గనుట!. ౩౫ 1820

సీ. ఆయయోధ్యాపుర ♦ మపగత నక్షత్రమైన యాకాశంబు ♦ నట్టులుండెఁ
గాంతలు తమసుతుఁ ♦ గాని తోఁబుట్టువుఁ గాని వనంబునఁ ♦ గాపురంబు
చేయఁ బంపిన నెట్లు ♦ చింతింతురో యట్లు, యాతురులై పార్థి♦వాత్మజన్ము
శ్రీరాముని గూర్చి ♦ చిత్తంబు లార్తిచేఁ దపియింప దీనత ♦ ధైర్య మెడల
తే. నేడ్చి రెన్నఁగ రాముఁ డ♦య్యింతులకును
సుతులకంటెను సహజాత ♦ వితతికంటె
నధికుఁడై యుండె; మఱి యయో♦ధ్యాపురమున
నాటపాటలు దేవోత్స♦వాదులెల్ల. ౩౬ 1821

క. ఒనరింపఁ బడక వాద్య, ధ్వను లే వినఁబడక యుండె ♦ వరుసఁగ నంగ
ళ్లును మూఁతలు పడియుండెను, దనరదు సంతోష మట్టి ♦ తఱి నెందేనిన్.

క. సలిలంబు క్షీణమైనన్, జలనిధి గన్పడెడు నట్టి ♦ చందంబున ను
జ్జ్వలనగర మద్ది యత్తఱిఁ, గలవిలపాటొంది వెతలఁ ♦ గంది కనఁబడెన్.

నలువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౯ - వ సర్గము.

వేదశ్రుతి, గోమతు లను నదుల రాముఁడు దాఁటుట.

చ. పురుషవరేణ్యుఁ డాజనక♦భూపతియల్లుఁడు రాముఁ డంత న
ప్పురజనులెల్లఁ దన్విడిచి ♦ పోయినరాత్రి విశిష్టభాగమున్
ద్వరపడి చాలదూరము ని♦తాంతము నెమ్మదిఁ దండ్రియాజ్ఞ నే
స్మరణము చేయుచుం జనియె ♦ జానకియున్ సహజుండు వెంటరాన్. ౧

క. వని నతఁడటు చనుచుండం, గనె శుభముగ రాత్రియెల్ల ♦ గడిచె శుభదమై

తనరెడు సందె నుపాసిం,చెను రాముండంత సహజ♦సీతలతోడన్. ౨ 1825

సీ. మమత నుత్తరకోస♦లము నంతమును జేరె మార్గంబునందు గ్రా♦మములచుట్టుఁ
బొలముల విత్తనం♦బులు చల్లుటకు సరిహద్దుల గొనదాఁక ♦ ననువుమీఱ
సజ్జీకృతంబులై ♦ చక్కఁగాఁ గనఁబడె వనములు పుష్పించి ♦ వఱలె రాముఁ
డవ్వాని గాంచుచు ♦ నతిముదమందుచుఁ [1]బెనుగ్రామములఁబల్లె♦లనువసించు

తే. జనులు పలికెడు మాటల ♦ వినుచు ఘోట
కములు వే పోవుచున్నఁ ద♦ద్గతివిలాస
మునను దత్తద్విశేషంబు♦లను గనుటను
మందగతినలె దూరంబె ♦ చెందె నతఁడు. ౩ 1826

చ. అరుగుచునున్న రాముఁ గని ♦ యచ్చటి మానవులెల్ల నిస్సిరో
ధరణివరుండు వృద్ధుఁడయి ♦ తా విషయేచ్ఛకు లొంగినాఁడయో
యరయ నృశంస కేకయనృ♦పాత్మజ పాపమనీష యెప్పుడున్
గురుతరపాపకృత్యములఁ ♦ గోరికఁ జేయుచు నుండుగా, కటా !. ౪ 1827

చ. అనవరతంబు ధర్మమతి ♦ యై కరుణాపరుఁడౌచుఁ బ్రాజ్ఞుఁడై
తనరి జితేంద్రియుండగుచు ♦ ధాత్రిఁ జెలంగెడు రాముఁ డట్టిఁడౌ
తనయునిఁ గానలం దుసుపఁ ♦ దా మదిఁ గోరి పురంబు వెల్వడం
బనిచెను క్రూరురాలు గద ♦ పాపమతిన్ మరియాదఁ బాసెఁగా. ౫ 1828

క. అనయము క్రూరంబగు న,ప్పనియందె మెలంగు; నింక ♦ భాగ్యాతిశయం
బున నలరి యధికసౌఖ్యం,బునఁ దగి యున్నట్టి జనక♦భూవరపుత్రిన్. ౬

తే. కఠినవనవాసజనిత దుః♦ఖంబు నొందఁ
జేసె నాతన్వి యేరీతిఁ ♦ జెందు నిడుమ
నెట్లనుభవించు నక్కటా ♦ యీముదుసలి
నృపుఁడు స్నేహంబెఱుంగఁ డో♦కించు కేని. ౭ 1830

క. కనుకనె ప్రజలకుఁ బ్రియుఁడై, యనఘుండగు తనకుమారు ♦ నడవులకుం బం
పినవాఁడు రాముసంగతి, జననాథుఁడు విడువఁగోరె ♦ సత్యం బిదియా. ౮

చ. అని యిటులాడు వారి వచ♦నాళిని వీరుఁడు కోసలేశుఁడై
యనఘమతిం జెలంగు దిన♦పాన్వయవార్ధిశశాంకుఁ డెంతయున్
వినుచును గోసలంబనఁగ ♦ విస్తృతమై తగు దేశమంతలోఁ
జనియెను దాఁటి యవ్వలను ♦ స్వచ్ఛజలంబుల నొప్పు నిమ్నగన్. ౯ 1832

క. వేదశ్రుతి యను దానిని, వే దాఁటి యగస్త్యమౌని♦వీరనివాసం
బౌ దక్షిణమున కభిముఖుఁ, డై దా రాముండు చనియె ♦ నతిశయగతితోన్.

---

[1] గ్రామసంవాసవాసినాః-అని మూలము. గ్రామాః మహాగ్రామాః సంవాసాః స్వల్పగ్రామాః-అని వ్యాఖ్య. దీని ననుసరించి చెప్పఁబడినది.

తే. కొంతసేపిట్లు పయనమై ♦ గోమతియను
శైవలిని గాంచె నయ్యది ♦ స్వచ్ఛజలము
గలిగి యలరారు నద్దాని ♦ కడను జవుకు
నేలలన్ గోవులు వసించు ♦ వేలకొలఁది. ౧౧ 1834

క. వననిధిగామినియగు నా, ఘననది హయవేగమునఁ ద♦గన్ దాఁటి మయూ
రనినాదములను హంస,ధ్వనులం దగు స్యందికాఖ్య♦తటినిని దాఁటెన్. ౧౨

సీ. ఇక్ష్వాకునకు మను ♦ విచ్చె నద్దానిని మునుపు, విశాలమై ♦ జనపదముల
నలరారు కోసలం♦బను దాని రాముండు చూపెను జనకుని ♦ సుతకుఁ బ్రీతి
శ్రీమంతుఁడౌ నర♦సింహుఁడు మదహంస సమనినాదంబున ♦ సత్వరముగ
సూతా! యటంచుఁబి♦ల్చుచు సుమంత్రునిజూచియింకెప్డుసురలి, నే♦నేగుదెంచి

తే. తల్లిదండ్రులతోఁ బుష్పి♦తవనములను
వెలయు సరయూతటంబున ♦ వేఁటలాడు
చును విహారంబు చేయఁగ♦లనొ? యెటుంగ
వేఁటలాడుట పెద్దల ♦ విధమె యనెదొ. ౧౩ 1836

చ. వనమున వేఁటలాడుట నృ♦పప్రకరంబున కీజగంబునం
దనుపమమోదముం గలుగు ♦ నట్లుగఁ జేయును గాదె యింక స
జ్జనులొగి శ్రాద్ధముఖ్యముల ♦ స్వాదుఫలార్థము వేఁట గోరుటన్
వినమె ధనుర్ధరుల్ సతము ♦ వేఁటఁ దలంతురు లక్ష్యశుద్ధికై. ౧౪ 1837

చ. అనయము నేను దీనినె మ♦హత్తర మంచును గోరకీ సరి
ద్వనమున నించుకే సలుపు ♦ వాంఛను బూనినవాఁడ నెప్డు, చే
సిన జనియించుపాతకము ♦ చెందదొకించుక వేఁటసల్ప నిం
కను దగునట్టి వేళల మృ♦గవ్యవిహారము సమ్మతంబె యా. ౧౫ 1838

తే. ఇద్ది రాజర్షి సమ్మతి ♦ నెసఁగు దీని
వంటి క్రీడ మఱొక్కటి ♦ వారి కుండ
దనియె నాయాయి విషయంబు♦లను మృదూక్తు
లను వచించుచు సూతుతోఁ ♦ జనియె నతఁడు. ౧౬ 1839

నలువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౦ - వ సర్గము.

రాముఁడు గంగాతీరముఁ జేరుట.

సీ. ధీమంతుఁడైన [1]యా♦సౌమిత్రిసోదరుం డభిరమ్యములు విశా♦లావనీత
లములగు నాకోస♦లములను దాఁటి యక్కడ నిల్చి తాఁ బూను♦కాననప్ర

1 లక్ష్మణపూర్వజః-అని మూలము.

తము విఘ్నములను బొం♦దక సాగుటకుఁ బెద్ద లనుసరించెడు పద్ధ♦తినిబు రాధి
దేవతలకుఁ జేయఁ♦గావలసిన నమస్కారమప్పుడు చేయఁ ♦ గార్యసంక

ఆ. టములవలన నిలుచు♦టను దాని నిప్పుడు
చేయఁ దలఁచి సాధు♦చిత్తమలర
నాయయోధ్య దిక్కు ♦ నతిభక్తిఁ జూచుచుఁ
గరయుగంబు మోడ్చి ♦ క్రమ్రభణితి. ౧ 1840

క. నిరతము కాకుత్స్థులచేఁ, బరిపాలిత మగుచు వెలయు ♦ పత్తన వరమా!
వరుసగ నిను నీదేవో,త్కరమును బౌరుల ననుజ్ఞఁ♦ గాంక్షింతుఁ దమిన్. ౨

క. వనవాసనియతి గడుపుచు, జనకునిదౌ ఋణముఁ దీర్చి ♦ జననిం దండ్రిన్
మనమలరఁ గూడి మరలన్, నినుఁ జూచెదనంచు వేఁడి ♦ నృపసుతుఁ డంతన్.

సీ. తనుఁ జూడవచ్చిన ♦ జనపదవాసులు రథవేగమునను దూ♦రస్థులగుటఁ
దలపోసికొని రక్త♦తామ్రాక్షుఁడై వారిఁ బిలువఁ గోరిక పుట్ట ♦ లలితమైన
దక్షిణహస్తంబుఁ ♦ దానెత్తి వారల కనుల నీటిని గనుఁ♦గొనుచుఁ దనదు
వక్త్రంబునన్ దుఃఖ♦వారి వ్యాపింపఁగ దీనుఁడై వారితో ♦ మాననీయ

తే. వచనములఁ బల్కె నేను మీ♦స్వామి నగుట
కును దగినయట్లు నాయెడ♦లను మహాద
రమును దయయును జూపితి ♦ రమలచిత్తు
లార! ననుఁ జూడ నిఁక మీగ♦భీరమతులు. ౪ 1843

చ. పెనువగ వృద్ధినొందు దుర♦పిల్లుట మంచిది గాదు గావునం
జనుఁడిఁక మేముఁ గృత్యమును ♦ సల్పఁగఁ బోయెద మింకనుజ్ఞ నా
విని తమి నమ్మహాత్మునకు ♦ విశ్రుతభక్తిఁ బ్రదక్షిణంబులం
బొనరిచి మ్రొక్కి వారు వగఁ ♦ బూని విలాపముచేసి యార్తులై. ౫ 1844

ఆ. నిలిచి నిలిచి యతని ♦ నిర్మలరూపంబుఁ, గనుచుఁ గనుచుఁ బోవఁ♦గాళ్లురామి
మెల్లమెల్లఁ బోయి ♦ రుల్లముల్ దపియింప, నిట్లు తనివిలేక ♦ యెల్ల జనులు. ౬

క. తనుఁ గనుచున్ విలపించుచుఁ, జనుచుండఁగ నంతరామ♦చంద్రుఁడునూర్యుం
డు నిశి పొడసూపఁ గ్రుంకెడు, ననువున దూరముగ నేగె ♦ నతిజవమొప్పన్.

సీ. ధనధాన్యసంపత్తిఁ ♦ దనరారి దాతలౌ జనములచేఁ దగి ♦ సతతమంగ
ళములచే నొప్పుచు ♦ రమణీయమై దేనివలన భయములేక ♦ భవ్య దేవ
తాలయసంతతి ♦ యాగపశువులను గట్టు యూపస్తంభ♦కముల నావృ
తంబయి, యుద్యాన♦తతులచే నలరుచుఁ జూతవనంబుల ♦ సొంపు గనుచు

ఆ. జలసమృద్ధి గలుగు ♦ సలిలాశయంబులు
వెలయఁ బుష్టిఁ దుష్టి ♦ గలుగు జనులు

నిండియుండ, ధేను♦మండలములు నొప్పు
గోసలములు సొంపుఁ ♦ గూర్చుచుండు. ౯ 1847

చ. పురములు పోలె గ్రామములు ♦ పొల్పుగఁ గన్పడుచుండఁగా ధరా
వసులకుఁ జూడ యోగ్యమయి ♦ భాసిలు, వేదనినాదమెల్లెడం
బరఁగుఁ; దదీయగ్రామములు ♦ బాగుగఁ జూచుచు దాఁటిపోయె న
ప్పురుషలలాముఁ డప్డు రథ♦భూరిగతిన్ క్షణమాత్రమట్లుగన్. ౧౦ 1848

మ. పరమామోదమునం జెలంగి యధిక♦ప్రాగల్భ్యముం గాంచి సుం
దర రమ్యద్రుమముఖ్య భూషితమహో♦ద్యానంబులన్ నిండి భూ
వరయోగ్యంబయి యొప్పు కోసలములన్ ♦ భాసిల్లు మధ్యాధ్వమం
దు రయం బొప్పఁగ నేగుచుం దలఁపఁడం♦దుం గల్గు శర్మంబులన్. ౧౧ 1849

క. ధీరవరుండగుటన్ రఘు,వీరుఁడు తత్తద్విశేష ♦ విసరము మదిలో
నారయ కరిగెన్ దక్షిణ,తీరంబున వెలయు నట్టి ♦ త్రిపథగఁ గనియెన్. ౧౧౪

ఆ. పాఁచిలేక స్వచ్ఛ♦పయసుల దివ్యమై
పావనమయి మాని ♦ వారిసేవి
తమయి త్రిజగములను ♦ దగఁ జరింపఁగఁ జాలి
క్రాలుచున్న గంగఁ ♦ గనియె నతఁడు. ౧౨ 1851

క. దానికి దాపున ధర్మ, శ్రీనియతములగుచు మౌని ♦ జిష్ణ్వాశ్రమముల్
జానుగ వెలయున్ నిర్ఝర, మానినులందున్న పెద్ద♦మడుఁగుల నీటన్. ౧౩

క. ఆయాయి కాలములఁ గ్రీ,డాయత్తత వచ్చి యందు ♦ నాడుదురు దమిన్
బాయక సురగంధర్వ ని,కాయము కిన్నరులు దనుజ♦గణ ముం దలరన్. ౧౩౪

క. పలుతెగల నొప్పు గంధ,ర్వుల భార్యలు వచ్చి యందుఁ ♦ బొలుపుగ జలకే
ళులఁ దేలుచుందు రది ని,ర్మలజలమై శుభదమగుచు ♦ మహిమం దనరున్.

చ. సురతతి కేళి సల్పఁదగు ♦ సుందరశైల శతంబులందునుం
బరఁగును దద్విహార్యవన♦వారము చెన్నలరారుచుండు ని
ర్జరులను బూజసేయుటకె ♦ సంతత మయ్యది నింగి యందు సం
చరణము చేయుచుండును వి♦శాలయశంబును గాంచి యొప్పెడున్. ౧౫

క. సురపూజార్థము సుందర, సరసీజములందు లో నె♦సంగుచు నుండున్
బరుషశిలలపైఁ బడు జల,మె రహిన్ వెస నవ్వుగాఁగ♦నొసఁగెడి నొకచోన్.

**సీసమాలిక:—**

అండలి ఫేనమే ♦ యతినిర్మలంబగు హాసమ్ముగాఁ దగి ♦ యలరుచుండు
నొక్కచో మిట్టల ♦ నుండి పల్లమునకు దిగి పాఱు జలధార ♦ సొగసు మీఱు
జడలపోలికనుండు;♦నుడు లొక్కయెడ సొంపు నింపుచునుండు నొ♦క్కెడగభీర
ముగ నిశ్చలంబయి♦పొగడొందఁ దగియుండు; నొక్కెడజలధార♦లురవడిఁజను

చుండు; మఱొక్కచో ♦ నురు మర్దళములట్లు గంభీరశబ్ద సం♦కలితమగును;
వేఱొక్కచోటను♦బిఱుగులగతి భయంకరముగ మ్రోగు; నొ♦క్కయెడ దేవ
తలు జలంబులఁ గ్రుంక♦లలితమైతగియుండు; నిర్మలోత్పలములు♦నెగడుచుండు
నొక్కచోఁబరిపూర్తి♦నొప్పెడుపులినముల్ కనఁదగియుండు; నొ♦క్కయెడవిమల
సైకతము చెలంగు ♦ సారసపక్షులు హంసలు స్వనముల ♦ నలరి చేయు
చుండును; చక్రవా♦కోరునినాదముల్ చెలువారుచుండును ♦ లలిత గతులఁ
బరఁగి మత్తిల్లిన ♦ పక్షు లందందు నిస్వనములు చేయుచుఁ ♦ బ్రబలుచుండు;
నొక్కచో నానది♦యొడ్డుల వరుసఁగా నలరారు భూరుహం♦బులఁ జెలఁగుటఁ
గుసుమమాలల వేసి♦కొన్నట్లు కనఁబడుచుండు; నుత్పలపంక్తి♦యొక్కచోటఁ
బుష్పించి తజ్జలం♦బునుగప్పియుండునొక్కెడఁ బద్మవనములు ♦ బెడఁగుఁ జూపు
చుండు; నొక్కెడ మనో♦జ్ఞోన్నతిఁ దగు తెల్లఁగలువల కుట్మల♦ములుచెలంగు;
నందొక్కతావున ♦ నన్ని తెఱంగులపుప్పొడు లెల్లెడఁ ♦ బొలయుచుంట
వర్ణాంతరమునొంది ♦ భయదరక్తచ్ఛాయఁ గని మదించిన దాని♦కరణి నుండు
మలినమన్నది లేక♦చెలఁగుట వైదూర్యమణిభంగి నెంతొ ని♦ర్మలముగాఁగఁ
గనుపట్టుచుండుఁ; ద♦ద్గంగాతటంబున నలరు వనాంతర♦ములను మత్త
దిగ్గజంబులు వన♦స్థితగజేంద్రంబులు దేవోపవాహ్య దం♦తివ్రజంబు
పలుమాఱుఘీంకృతి♦ధ్వనులు చేయఁగఁ బ్రతిధ్వని చేయువనరాజి♦పరఁగుచుండు
ఫలపుష్ప కిసలయ ♦ లలిత భూషణముల నలరుట మంచిసొ♦మ్ముల ధరించి
నట్టి కామిని పోలె♦నందమ్ముగాఁ గనఁదగియుండు; మఱియు న♦ద్దాని లతలు
చివురు జొంపమ్ములు ♦ చిత్రపతత్త్రులు గప్పియుండును; భుజం♦గములు నీరు

తే. కోఁతులు మొసళ్లు, సతతంబు ♦ కొమరు మిగులు
చుండు; హరిపాదకమలంబు ♦ నుండి యద్రి
దిగిన యది కాన నాకృతి ♦ దివ్యమగుచు
ననఘమై పాపదూరయు ♦ నగుచుఁ బొలుచు. ౨౪½ 1857

క. [అనుపమ భగీరథుని తపమున నీశ జటాసమూహ♦మున నుండి ధరి
త్రిని బొంద నవతరించెను, ననుపమ విఖ్యాతి మెఱయ ♦ నానది తనరున్.]

తే. సారసక్రౌంచముఖపక్షి ♦ సరసనాద
ముఖరితంబయి భూభాగ♦మునఁ బ్రవాహ
ముగఁ జెలంగుచుఁ బాఱె స♦ముద్రపత్ని
యగుచు నాదేవగంగ ప్ర♦ఖ్యాతి నందు. ౨౫ 1859

క. అరదమున శృంగిబేర న,గరమునకుం జనుచుఁ జెంతఁ ♦ గనుపట్టెడు నా
సురనది జేరెను శ్రీరఘు,వరుఁడు మహాబాహువెంతొ ♦ భక్తి చెలంగన్. ౨౫½

క. కని యంత నమ్మహారథుఁ, డనయమ్మూర్మికల నుడుల ♦ నత్యుచ్ఛ్రియమై

కనుపట్ట నిప్పు డిచ్చట,నె నివాసము చేయుదమని♦యోర్ సూతునితోన్. ౨౫
క. ఈనది చెంతనె బహుపు,ష్పానూనసుపల్లవాళి ♦ నలరుచు నదిగో
గాననగు గారచెట్టొకఁ,డా నిర్మలవిటపిచెంత ♦ నరదముతోడన్. ౨౬ 1862
క. నివసించి యుందమో మం,త్రివరా! గంధర్వదనుజ ♦ దేవమృగపత
త్రివితతికే యుదకము గౌ,రవింపఁగాఁ దగినదియగు ♦ రమ్యము శివమౌ. ౨౭
క. కనుకనె యీసరిదుత్తమ,మును గనుఁగొందమని పలికె ♦ మోదంబున నా
యనుజుఁడు సారథి వల్లే,యని ఘోటకములను దోలి ♦ స్యందనవరమున్. ౨౮
క. కొనిపోయి రింగుదీతరు,వు నికటమున కంత రాఘ♦వుఁడు సూర్యకులం
బునకున్ సంతసమిడు నా,ఘనుఁడా రమ్యద్రుమంబు ♦ కడ రథము దిగెన్. ౩౦
క. అనుజునితో జానకితోఁ, గన రమ్యముగా నెసంగు ♦ త్స్థాస్థలి విడియం
గని సూతుఁడు తానును దిగి, ఘనఘోటకములను విప్పి ♦ కట్టె జవమునన్.
క. తరుమూలగతుండగు రఘు,వరుచెంతకుఁ బోయి భక్తి ♦ బద్ధాంజలియై
పరమాత్మునిగాఁ దలఁచుచుఁ, బరాకు లేకుండెను; జన♦పదమున నందున్. ౩౨
చ. అలరు గుహుండు నా వినుతి ♦ నందిన రాజు నిషాదవంశ్యుఁడున్
బలయుతుఁడా నిషాదులకుఁ ♦ బార్థివుఁ డుత్తముఁడౌచు నెంతయుం
జెలఁగు నతండు రాముసకు ♦ క్షేమము గోరెడి ప్రాణమిత్రుఁ డు
జ్జ్వలతరకీర్తి యప్పురుష♦వర్యుఁడు రాముఁడు వచ్చెనం చొగిన్. ౩౩ 1868
క. విని తన దేశము పావన,మని తలఁచుచు వృద్ధవితతి ♦ నాత్మసచివులం
దనజాతిఁ గూడి శ్రీరా,మునికడ కేతెంచె భక్త♦ముఖ్యుఁడు గానన్. ౩౪
సీ. అంత నిషాదేశుఁ♦డరుగుదెంచుట దూరమున నుండియే గాంచి♦యనుజుతోడ
రాముఁడా బోయభూ♦రమణున కెదురుగాఁబోయియాతనిఁగూడె;♦బోయరాజు
వల్కలధారియై♦వఱలు రాముని గాంచి యార్తుఁడై బిగియార♦నతనిఁ గౌఁగి
లించి యోరాఘవా!♦యెంచ నయోధ్యయట్లగు నాపురమిది♦యగును స్వీయ
తే. మింక నేఁ జేయవలసిన ♦ దేమి నీకు
నో మహాభుజ! యతిథిప్రి♦యుండు దొరఁకు
నిట్టిఁ డెవ్వని కని యంత ♦ నింపుఁగులుకు
బహువిధాన్నాదులను దెచ్చి ♦ భక్తిమెఱయ. ౩౫ 1870
సీ. అర్ఘ్యంబు వేగంబ ♦ యచటికిఁ దెప్పించి నీకు స్వాగతము లో♦కైకవీర!
యస్మదీయంబగు ♦ నటవి రాజ్యంబిద్ది యంతయు నీదియే ♦ యగును మేము
నీకు సేవకులము ♦ నీవు మాయొడయుండ వింక నీయిచ్చనె ♦ యీవిశాల
రాజ్యంబుఁ బాలింపు ♦ రమణీయగతి నీవె పిండివంటలు నతి♦ప్రియములైన
తే. యన్నపానకములు రసా♦యన ముఖంబు
లైన లేహ్యాదులెల్ల నిం ♦ దమరుచున్న

వారగింపుము; శయనము♦ఖ్యంబు లివిగో
యిదిగో గుఱ్ఱములకు గడ్డి ♦ సదమలాత్మ!. ౩౯ 1871

చ. అని వచియించు నాగుహుని ♦ నాదృతిఁ గాంచి వచించె రాఘవుం
డనఘమతీ! ప్రియంబు తగు♦నట్లడుగుల్ ధరమోపి నీవు వ
చ్చినయది చాలదే! మఱియుఁ ♦ జెప్పితి పీవు మదీయరాజ్యముం
గొనుమని స్నేహభావమును ♦ గూడను జూపితి వింతచాలదే!. ౪౦౺ 1872

తే. ఇంతమాత్రంబునకె మాకు ♦ నెల్లరీతు
లను సమర్చనమును జేసి ♦ లలితభంగి
నలరఁ జేసిన యట్లయ్యె ♦ నని బలాఢ్య
బాహువులఁ గౌఁగిలించి యి♦ప్పగిదిఁ బలికె. ౪౧ 1873

క. వినుమ యదృష్టవశంబునఁ, గనఁ గల్గితి నిన్ను బంధు♦కలితుని శర్మం
బున నున్నవాని నోగుహ!, ధనమును రాజ్యంబు గుశల♦తం గనఁ గాదే!.

క. చెలికాండ్రు కుశలయుక్తిని, నలరారెడు వారె; ప్రీతి ♦ నందుచు నేదే
ని లలి సమకూర్చితివో మిత్రలలామా! నాకు గా ము♦దంబున నేనుౘ.

తే. అన్నియును జక్కఁగా నబ్బె ♦ నంచుఁ దలఁచి
మరల నిచ్చెద నీకె యి♦త్తరుణమందు
మానినాఁడఁ బ్రతిగ్రహం ♦ బేను హేతు
వనువదించెద వినుము నె♦య్యమున దాని. ౪౩ 1876

చ. జనకుని యానతి న్నెఱప ♦ స్వాంతము ధర్మమునం జెలంగు న
ట్లునిచి కుశాత్తమేఖలము ♦ నొప్పుగఁ దాలిచి నారచీరలం
గొని ఫలమూలముల్ దినుచుఁ ♦ గొండలయందు వనాళినుండుచుౘ
ఘనతపమేను జేయుటకుఁ ♦ గాఁ దగువాఁడ నటంచు నెంచుమా!. ౪౪

క. తురగములకు ఘాసమె యీ, తరుణమునం గోరువాఁడ ♦ దాని వదలి యే
పరికరములఁ గోరను జూ!, పరికింపఁగ నింతమాత్ర ♦ పరమాదృతిచేౘ. ౪౪౺

క. నను నీవు సత్కరించిన, ఘనమతివే యగుదు ఘోట♦కము లివ్వియు నా
జనకునకుం బ్రియములు గా,వున వీనిం దనుపుట ననుఁ ♦ బూజించుటయే.

సీ. అనియె నంతట గుహుం ♦ డప్పుడె తన సేవకులఁ బిల్చి వేగంబ♦ఘోటకముల
[1]కనువగు పాలు నీ♦రును మీరుత్రాగించియాహారమొసఁగుఁడీ♦యనుచు నాజ్ఞ
యిడె రాముఁ డామీఁద ♦ గడుదమి నారచీరనె యుత్తరీయమ♦ట్లునిచినియతిఁ
బశ్చిమ సంధ్యను♦పాసించి తమ్ముఁడు తా నేగితెచ్చిన ♦ మానసీయ

1 అశ్వానాం ప్రతిపానంచ ఖాదనం చైవ సోఽన్వశాత్-అని మూలము. ప్రతిపానం క్షీరాదికంచ-అని వ్యాఖ్య.

తే. గాంగవారిని గొని పద♦క్షాళనంబు
చేసికొని వార్చి నేలపై ♦ సీతతోడఁ
బవ్వళింపఁగ సౌమిత్రి ♦ యవ్వనపతి
యున్న కడ కేగి తరుమూల ♦ మొంది యుండె. ౪౯ 1880

క. వనరాజ్యపతియు సూతుఁడుఁ, దస చెంగటనుండ రాము♦తమ్మునిచే రా
ముని గుణములఁ జెప్పించుచు, ధనువుంగొని జాగరూక♦తన్ నృపుఁ గావన్.

*తే. రాత్రియంతయు మేల్కొని ♦ రాము ననుజు
నందు సంశయమును గాంచి ♦ యాతఁడుండె;
నామహాత్ముఁడు మతిమంతుఁ ♦ డతులకీర్తి
యైన రాముఁడు శయ్యపై ♦ నటఁ బరుండె. ౫౦ 1882

క. కలలోనైనను గష్టం,బుల నెఱుఁగక సుఖసమృద్ధిఁ ♦ బొందఁగఁ దగన
ట్లిలఁ బవ్వళించుటన్ నిశ, యలఘువుగన్ గడచినట్టి ♦ దయ్యె నతనికిన్. ౫౧

ఏఁబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౫౧ - వ సర్గము.

గుహుఁడు లక్ష్మణునితో సంభాషించుట.

క. తన యన్న నకుటిలంబగు, మనమునఁ గావంగఁ బూని ♦ మానితచాపం
బును దాల్చి లక్ష్మణుఁడు మే,ల్కొనియుంటకువగఁదపించి♦గుహుఁడిట్లనియెన్.

చ. నరపతిముద్దుకుఱ్ఱఁడవు ♦ నాయన! నీకయియే సుఖంబుగాఁ
బరఁగెడు శయ్య యియ్యదియె ♦ బాగుగ నిందమరింప నయ్యె నిం
దు రమణఁ బవ్వళించి ప్రవి♦ధూతపథశ్రము రూపశర్మ మి
త్తరుణమునందుఁ బొందుము, ప♦థశ్రమ మెన్నఁగ దుస్సహంబు సూ!. ౨

సీ. ఇందున్నయట్టి మే♦మందఱ మాటవికులము గావునఁ గష్ట♦ముల సహించు
వారము; సుఖమునే ♦ పడయంగఁ జాలినవాఁడవు నీవెన్న ♦ వసుమతీశుఁ
గావ నీరాత్రియుఁ♦గడచను దనుక మేల్కొనియుందు మేమెల్ల♦వినుము నాకు
త్క్షొస్థలి రాముని♦కంటెను బ్రియతముం డెవఁడును లేఁడు సు♦మ్మిద్ది సత్య

ఆ. మిట్టి వార్త సత్య♦మే తోడుగాఁ జెప్పు,చున్నవాఁడ నీకు ♦ నొక్క రాము
సుప్రసాదముఁ గొని ♦ క్షోణి వితతయశో, ధర్మధనములొందఁ♦దలఁచుచుందు.

క. ఆ నేను రాముఁ బ్రియసఖు, జానకితోఁ బవ్వళించు ♦ సరసమతిని గైఁ
బూని ధనుస్సును బంధుల,తో నెల్లెడఁ గాచుచుండు♦దున్ సౌమిత్రీ!. ౪

చ నిరతము నీవనంబున నె ♦ నేఁ జరియించుచు నుంటఁ గ్రొత్త దె

* రామ మప్రమత్తో ధనుర్ధరః-అని మూలము. ధనుర్ధర ఇత్యనేన లక్ష్మణే ప్యతిశంకా గుహ స్య ద్యోత్యతే-అని వ్యాఖ్య. దీనిననుసరించియే సంశయమును గాంచి అని తెనిఁగింపఁబడినది.

క్కరణిని గల్గు? నంతయుఁ ద♦గం గని నద్దియె కాన శత్రువె
వ్వరునను వచ్చునే నతని ♦ భంగి నెఱుంగఁగ వచ్చు నింక న
య్యరిచతురంగసైన్యతతి ♦ యంతయు వచ్చిన నోర్తు మే మొగిన్. ౭ 1888

చ. అన విని లక్ష్మణుండనియె ♦ నార్యవరా! యనఘాత్మ! ధర్మమే
కనుఁగొనఁ జాలుదీవు కను♦కన్ వని నిందు భవత్సురక్షణం
బును గను మాకు సాధ్వసముఁ ♦ బొందుట యెట్లు పొసంగు నద్ది లే
మిని నిదురింపవేల యని ♦ మిక్కిలిప్రేమను బ్రశ్నసేయుదో. ౮ 1889

క. విను దశరథు ప్రియపుత్త్రుం, డనఘుం డీతండు భూమి ♦ నవనిజతోఁ బం
డినవాఁడు చూచి యీతనిఁ, గనఁ జాలుదు నెట్లు నిద్రఁ ♦ గడునెయ్యుండా.

క. నిలుచునె యీఱటఁ బ్రాణం,బులు శర్మం బెట్లు గల్గుఁ ♦ బోరఁ ద్రిదశదై
త్యులు నెవనిఁ దాఁకి నిల్వరో, య౦రాముఁడు సీతతోమ♦హాశ్రమ మొప్పన్.

క. పచ్చికనేలను సుఖముగ, నిచ్చటనె పరుండి యుండు ♦ టిదె చూడుము చం
చచ్చటులమంత్రతపములు, సచ్చరితుఁడు దశరథుండు ♦ సలుపుచు భక్తిన్.

ఆ. అధ్వరాదులైన ♦ యఖిలశ్రమములను
బొంది యెవనిఁ గాంచెఁ ♦ బోలఁ దంత్రి
సాటి లక్షణముల ♦ జాలంబు గలిగి పు
త్త్రులను మేటియగుచుఁ ♦ జెలఁగు నెవఁడొ. ౧౧ 1893

క. అతఁడీ రాముఁడు వనికిని, జతనంబుగఁ బోవనింక ♦ క్ష్మాపతి ప్రాణ
ప్రతతింగని చిరకాలము, క్షితి బ్రతుకం డిల యనాథ ♦ శీఘ్రమె కానొ. ౧౩

క. ఋత మిది రాజగృహంబున, నతివలు గురునాద మొప్ప♦నక్లేడ్చుచు ని
ర్గతశక్తులగుచు నలయుచు, గతియేది వినాథలగుచుఁ ♦ గడు నార్తిమెయిన్.

తే. ఊరకుందురు సౌధంబు ♦ నొప్పు దప్పి
యుండు నిశ్శబ్దముగ నంచు ♦ నూహసేయు
వాఁడఁ గౌసల్యయును జన♦వరుఁడు నాదు
తల్లియుం బ్రాణములఁ బాయఁ ♦ దలఁచి యుంద్రు. ౧౫ 1896

క. మృతినొందకుందురనియే, మతిఁ దలఁపను నేను, వారు ♦ మఱి బ్రతికినచో
క్షితిపా! యీరాత్రియె జీవితములఁ గనువారు గాని ♦ పిదపఁ గనరు సూ!.

సీ. శత్రుఘ్నుఁడను నాత్మ♦జన్ముఁడింకొకఁడుంటనతనియందున్న నె♦య్యమున నాదు
జనని సుమిత్ర యా♦తని మఱిమఱి చూచుకొనుచు జీవింపవ♦చ్చును; రఘుప్ర
వీరునంతటి సత్కు♦మారుని గన్నట్టి కౌసల్య బ్రతుకదు ♦ గాన నాకు
నీదుఃఖమే సహిం♦యింపరాకున్నది యధిపునందనురక్తు♦లైన ప్రజలు

తే. బలసియుండఁ బ్రియంబుగ ♦ నలరి చూడఁ
దగి సుఖాస్పదమయి యొప్పి ♦ సొగసు గులుకు

నయ్యయోధ్య నృపుం డంత ♦ మంద దుఃఖ
మంది నశియింపఁ గలదని ♦ యాత్మ నెంతు. ౧౬ 1898

క. జనపతియు మహాత్ముండగు, తనపెద్దకుమారు రాముఁ ♦ డాఁ గానక యుం
డిన నతని ప్రాణములు త, త్తనువున నెట్లుండఁ గలవు ♦ ధరణీనాథా !. ౧౭

క. నరవరుఁడు మృతిని గాంచిన, నరుసగఁ గౌసల్య విడుచుఁ ♦ బ్రాణంబుల న
త్తరుణమున నాదుజననియుఁ, బరలోకముఁ జేరుఁ జుమ్ము! ♦ పార్థివవర్యా !.

తే. మించిపోయెను గార్యంబు ♦ మించిపోయె
రామునకుఁ బట్టముం గట్టి ♦ రాజు తనదు
వాంఛ నీడేర్చుకొనకయె ♦ పరమగతికి
నేగఁ గలఁడికఁ జింతింప ♦ నేమిఫలము?. ౧౯ 1901

చ. జనకుఁడు చచ్చుచో నపుడు ♦ శక్తికొలందిని ప్రేతకృత్యముల్
తనయులు చేయనోను గద ♦ ధన్యులుగాఁ దగు రాజపుత్రుల
ప్పని నొనరింపఁగాఁ గలుగు ♦ భాగ్యముఁ గాంతురు; మేము యట్టి భా
గ్యనియతిఁ గానమైతి మకృ ♦ తార్థులమౌటను బల్కలేటికిఁ. ౨౦ 1902

సీ. రమ్యచత్వరములు ♦ రంజిల్లఁ జక్కఁగఁ బెనురాజమార్గముల్ ♦ వెలయుచుండ
ధనికుల హర్మ్యముల్ ♦ ధరణీశ సౌధముల్ వెలయుచునుండంగ ♦ విమలరూప
వతులగు వెలయాండ్రు ♦ పరిఢవిల్లఁగ, రథహయగజసముదాయ ♦ మతిశయిల్ల
బహువిధతూర్యధ్వనుల్ ♦ ప్రతినాదములఁ బుట్టఁజేయ, భవ్యోత్సవ ♦ సిద్ధులలర

తే. హృష్టపుష్టజనవ్యూహ ♦ మెసఁగుచుండ
నలరు క్రీడావనోద్యాన ♦ ములు తగంగ
జనుల సంఘంబు లెప్పు డు ♦ త్సవము లలరి
చేయ నలరారుచుండుఁ జు ♦ మ్మా యయోధ్య. ౨౧ 1903

ఆ. అట్టి రాజధాని ♦ యందు సుఖాత్ములౌ, వార లుండఁగలరు ♦ గారవమునఁ
దండ్రి బ్రతుకునేని ♦ తగ వనవాసంబు, గడపి మరలి వచ్చి ♦ కడుముదమున.

తే. అమ్మహాత్ముని సువ్రతు ♦ నపుడు చూతు
మిట్టి భాగ్యంబు గలుగునే ♦ యెలమి నతనిఁ
గాంచఁ జాలుదుమే; ప్రతి ♦ జ్ఞను దగంగ
జరపు మాతండ్రి కుశలియై ♦ పురి వసింప. ౨౩ 1905

క. వనవాసంబును జరపిన, వెనుకఁ మేమెల్ల నల్ల ♦ పృథ్వీశునితో
డను గూడి యాయయోధ్యను, బెనువేడుకఁ జేరఁగలము ♦ పెంపెసలారఁ.

క. నిరుపమమగు భాగ్యంబిది, నరుసఁ లభియించు టెపుడొ ♦ పార్థివ! యని యి
క్కరణి మహాత్ముండగు భూ, వరతనయుఁడు లక్ష్మణుండు ♦ పలుకుచు వగతోఁ.

క. విలపించుచు మేల్కొని యే, యల గుహునింగూడి యుండ ♦ నారాత్రి చనఁ

విలసిల్లి గుణాళిని మనుజులకు హితుండైన రాజ♦సూనుఁ డిటు వలెన్. ౨౬
క. తనయన్నయందు నట్లే, జనకునిపైఁ గల్గు స్నేహ♦సరణిఁ బలుకు చ
క్కనిపలుకుల విని యప్పుడు,వనరాజ్యవిభుండుగుహుఁడు♦వ్యసనముగనుచున్.
తే. వగవఁ బొగులుచు జ్వరబాధ ♦ తగులఁ గ్రాఁగు
హస్తిచందంబునన్ రాము♦నందుఁ గల్గు
స్నేహభావాధికమునఁ గ♦న్నీరు విడిచె
నిట్టి కష్టంబు రావచ్చు♦నే యటంచు. ౨౭ 1910

ఏఁబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౫౨ - వ సర్గము.

—రాముఁడు గంగను దాఁటఁ బ్రయత్నించుట.—

సీ. తెల్లవాఱినతఱి ♦ నుల్లసత్స్థిరయశుండురు పృథువక్షుఁడై ♦ యొప్పు రాముఁ
డఖిలమంగళచిహ్నుఁ♦డౌ సుమిత్రాపుత్రుఁగని పల్కె-వత్స! భా♦స్కరుని యుదయ
కాలమియ్యదియె భ♦గవతి రాత్రి గతించెఁ బికభరద్వాజాఖ్య♦విహగములవె
కూయుచున్నవి; యవె♦కూయు మయూరారవంబులు వినవయ్యె♦వనములందు
తే. సౌమ్య! యతిశీఘ్రగామిని ♦ సాగరంగ
మయగు గంగను దాఁటుద♦మొ! యని పల్క
మిత్రసంతోషదుఁడగు సౌ♦మిత్రి యతని
పల్కువిని తన్నిగూఢ భా♦వం బెఱింగి. ౩౪ 1911
క. ఏదేని సాధనముఁ గొని, యే దీనిని దాఁటనౌను ♦ హితముగ ననుచున్
సోదరుఁడు చెప్పెనని మదిఁ, దాఁ దలఁచి సుమంత్రు, గుహుని♦ధరణీశ్వరునిన్.
క. రాముని యాశయ మెఱిఁగితి; రే! మానితులార! యనుచు ♦ నింపు దగంగాఁ
దా మాటలాడి యన్నను, నేమంబునఁ గొలిచియుండె♦నృపుఁడుగుహుండున్.
తే. రామునానతి విని దా శి♦రంబునం బ
రిగ్రహించుచు గుహధరి♦త్రీవిభుండు
సచివులం బిల్వఁ బంచి యా♦జ్ఞ యిడె నిట్టు
లఖిలసాధనములతోడ ♦ నమరఁ జేసి. ౫ 1914
సీ. కర్ణధారునిఁ గూడి♦గడు సులభంబుగాఁ దరియింపఁ జేయఁగాఁ♦దగి దృఢమగు
నోడ నొక్కటిని దెం♦డొప్పఁగ రేవున కతివేగమున, నన ♦ నమలబుద్ధు
లగు వారలాతని ♦ యానతి చొప్పున నతిసుందరంబుగ ♦ నమరు నౌక
నొకదాని రేవున ♦ నుంచి తెల్పిరి ఱేని కవ్వార్త నంతట ♦ నతఁడు కరయు
తే గంబు ముకుళించి రాముని♦గాంచి దేవ!
నౌక యిదె వచ్చె నింకేమి ♦ నాకు నాజ్ఞ

పురుషపుంగవ! నిర్జర♦వరకుమార
సన్నిభా! సువ్రతా! సాధు♦జనగణనుత!. ౮ 1915

క. సాగరగామిని యయి తగు, నీగంగానదిని దాఁటు ♦ మీ నౌకపయిన్
వే గూరుచుండు మనఁగా, నాగుహునిం గాంచి యమ్మ♦హా తేజుండున్. ౯

చ అలరి వచించె నిట్టు లిపు ♦ డాదృతి నాదగు వాంఛఁ దీర్చి తీ
వల వనసాధనంబులను ♦ నంగన యాభరణాంబరంబులన్
గలిగిన తక్కువస్తువులఁ ♦ గ్రన్నన నౌకను జేర్పు మంచొగిం
బలికె ననంతరంబ యల ♦ భానుకులీనులు రామలక్ష్మణుల్. ౧౦ 1917

-ఁఁ సుమంత్రునికిఁ జెప్పఁదగు సందేశముల రాముండు చెప్పుట. ఁఁ-

సీ కవచంబులను దాల్చి ♦ ఖడ్గతూణీరముల్ ధనువులు వెలయ సీ♦తయును రాఁగ
గంగానదికిఁ బోవఁ♦గాఁ దగు త్రోవను బట్టి పోయిరి తరు♦వాత సూతుఁ
డాత్మభృత్యుల ధర్మ ♦ మరసి పొల్చెడు నట్టిరామునిఁ జేరి క♦రద్వయంబు
ముకుళించి యడఁకువ♦ముందు నే నేమి చేయందగు నని పల్కె♦నంత రాముఁ

తే. డాత్మదక్షిణకరమున ♦ నతనిఁ దడవి, సూత! శీఘ్రమ మరలి రా♦జుకడ కరుగు
మప్రమత్తుఁడవై యుండు ♦ మతని చెంత, నీరథంబునఁ దెచ్చితి ♦ వింతదనుక.

క. పరమముదంబును బొందితి, నరదము విడనాడి యింక ♦ నరిగెద వనికిన్
ద్వరితముగఁ గాలి నడకనె, పురమున కీవింకమీఁదఁ ♦ బొమ్మా యనినన్. ౧౨

క. తన కథిపునొద్ద కరుగుట, కనుమతి యిడె రాముఁడంచు ♦ నతఁ డెఱిఁగి వనం
బునకుం దోడ్కొని పోఁడ, య్యెనని విచారంబునొంది ♦ యిట్లని పలికెన్. ౧౩

చ. పురుషలలామ! సోదరుని ♦ భూమితనూజను గూడి క్షుద్రుఁడౌ
పురుషునిభంగిఁ గానలకుఁ ♦ బోయి వసించుట యన్నవార్త యె
వ్వరికి ననన్మతంబె యిల ♦ వారక నాకని చెప్ప నేల? యె
వ్వరుసను దీనిఁ దీర్పఁదగు ♦ వారలు లేరుగదా జగంబులన్. ౧౪ 1921

సీ. బ్రహ్మచర్యంబును ♦ బాటించి వేదాళిఁ బఠియించి దయయను♦భవ్యగుణము
గలిగి యార్జవమున ♦ నలరారు నీకిట్టి వ్యసనంబు వచ్చునే ♦ బ్రహ్మచర్య
ముఖములఁ బాటింప♦ముజ్జగంబులయందు ఫలముగల్గునటంచుఁ♦దలఁప నెంత
మాత్రము; నోవీర♦మండన! సీతను దమ్మునిఁ గూడి వ♦నమ్మునందు

తే. వాసమును జేయుచు న్నీవు ♦ వరయశమ్ము
ముజ్జగంబులఁ గనఁగల ♦ విజ్జగములఁ
దగ జయించుచు సద్గతి♦ని గనఁగలవు
వినుము మాదురవస్థ వి♦వేకధుర్య!. ౧౫ 1922

సీ. అభిషేకవిఘ్నంబు ♦ నాచరించిన కైక యొకతె వచించె మ♦మ్మొక్కసారి
యంచుఁ జెప్పఁగనేల? ♦ యాదృతి నీవెంటఁ జనుదేరఁగాఁ బుర♦జనుల నమ్ము

నిదురించుచుండంగ ♦ నేర్పున విడనాడి వంచించితివి నీవు ♦ వనికిఁ దోడు
కొనిపోవునట్టు ల♦భినయించితివి గదా యిఁక దుఃఖభాగుల♦మే యయి యల

తే. పాపమతియైన కేకయి♦పాలఁ జిక్కి
యుండఁ గలవార మంచని ♦ యొక్కరీతి
బాష్పములు రాలుచుండంగఁ ♦ బలికి యంతఁ
బ్రాణతుల్యుని శ్రీరఘు♦రాముఁ గాంచి. ౧౯ 1923

తే. చాలదూరంబునకు నేగఁ ♦ జనుఁ గదయని
యెఱిఁగి దుఃఖాబ్ధి మునుఁగుచు ♦ నేడ్చెఁ జాల
సేపు; బాష్పోదకము విడి♦చిన కతమున
సూతుఁ డప్పుడు వార్చి సం♦శుద్ధుఁడయ్యె. ౨౦ 1924

చ. కనుఁగొని సూర్యవంశ్యనృప♦కాంతుఁడు తీయని పల్కులొప్ప ని
ట్లనువుగ సారెసారె కతి♦హర్షము మీఱ వచించె నిట్టు లో
యనఘమనీష! నీసదృశుఁ ♦ డౌ సుహృదుత్తము నస్మదన్వయం
బునఁ గల రాజసంతతిని ♦ బోలఁగ నేఁ గనలే దదెప్పుడున్. ౨౧ 1925

క. జనపతి యాదశరథుఁడాత్మను ననుఁ దలపోసికొని వ్య♦థం గనకుండన్
అనుదినము చేయుమా! యన్నను జేశుఁడు వగలఁ బొగులు♦మదిఁ దల్లడిలున్.

క. తలపోయఁగ వృద్ధుఁడు మిక్కిలి కామవశంగతుం డ♦కృత్రిముఁడును నై
జెలఁగును గావునఁ జెప్పఁగ, వలసె న్నీతోడ నింత♦వట్టు హితమతీ!. ౨౩

క. తన ప్రియపత్నికిఁ గైకకు, మన మలరఁగఁ జేయఁగోరి ♦ మహితాత్ముం డ
జ్జనపతి యేమేమిగ నాజ్ఞను జేసిన నదులు పల్క♦కయె చేయఁదగున్. ౨౪

తే. మనుజనాయకు లెల్లఁ గా♦నుమునఁ గ్రోధ
కలన నెట్టెట్టి పనులఁ ద♦గులునో చిత్త
మవ్వియన్నియుఁ దమవాంఛ ♦ కప్రతిహత
ముగ లభించుటకే రాజ్య♦మును మనుచుట. ౨౫ 1929

క. ఏకార్య మెట్లు చేసిన, భూకాంతుం డప్రియమును ♦ బొందఁడొ, మఱి దుః
ఖాకలనఁ దపింపఁడో నీ,వాకరణిని జేయవలయు ♦ నార్యవతంసా!. ౨౬

ఆ. ఇంతదనుక దుఃఖ♦మెఱుఁగక వృద్ధుఁడై, నిర్జితేంద్రియుఁడయి♦నిఖిలపూజ్యుఁ
డయిన నృపతి దుఃఖ ♦ మందినవాఁ డిప్డు, గాన నాకుమాఱు♦గా సుమంత్ర!.

క. నీ వభివాదన మొనరిచి, యీవిధమునఁ బల్కు మయ్య! ♦ యీపురివిడువం
గా వలసె నంచుఁ గానీ, యీవనముల నుండవలసె♦నే యని గానీ. ౨౭

క. నేనును సౌమిత్రియు నీ, జానకియును వెతలఁ గనము; ♦ సరగునఁ బదియుం
బై నాలుగేండ్లు చనఁగా, జానకి సౌమిత్రి నేను ♦ సన్మన మలరన్. ౨౮

క. ఒక్కింత తడవుచేయక, యిక్కడకుఁ ద్రాఁగ మమ్ము ♦ నింపుగఁ బలుమా
ఱిక్కడనె చూపఁగలవని, మ్రొక్కి వచించితినటంచు ♦ ముదమునఁ జెపుమా!.

సీ. ఈరీతి నమ్మను ♦ జేశ్వరునకు నాదు తల్లికిఁ దక్కిన ♦ తల్లులకును
గైకకుఁ బలుమాఱు ♦ గారవంబునఁ బల్కి తరువాత నేనును ♦ ధరణిజాత
యును [1]నార్యుఁడైన నా ♦ యనుజుండునుం బల్కినటులఁ గౌసల్యకు ♦ నస్మదీయ
మైన యారోగ్యవా ♦ దాభివందనములఁ జెప్పుము నృపతితో ♦ శీఘ్రముగనె
తే. భరతుఁ బిలిపించి యాతఁడు ♦ వచ్చినంత
నీదు నభిమతరీతిని ♦ నెమ్మి యావ
రాజ్యపదమున నిల్పి భ ♦ రతుని గాఁగి
లింపుమా! శర్మమునఁ గను ♦ పింపదు వ్యథ. ౩౭॥ 1935

చ. వనముల మేము బాధపడు ♦ వారమటంచని నీకుఁ దోఁచు న
ప్పనువెత దోఁపకుండు; నని ♦ ప్రీతి వచించితి మంచుఁ బల్కుమా;
యనుజునితోడ రాజువిష ♦ యంబున నెట్టులు సంచరింతువో!
జనులయం దభేదగతి ♦ జానుగ వర్తిలుమంచుఁ జెప్పుమా!. ౩౮ 1936

సీ. కైక నీకెవ్విధి ♦ గారవింపఁగఁ దగు శత్రుఘ్నునందున్న ♦ సంతసమును
బట్టి సుమిత్రయు ♦ నట్టులె మన్నింపఁ దగుఁ గాదె? నాకును ♦ దల్లి యగుటఁ
బట్టి కౌసల్యయుఁ ♦ బరమాదరంబున గారవింపందగు ♦ క్ష్మాపతి హిత
కాముఁడవై నీవు ♦ గైకొనుదువు గద యావరాజ్యము నట్టు ♦ లౌట నైహి
తే. కమున నాముష్మికమ్మునఁ ♦ గలుగు సుఖము
జనులకును రాజునకుఁ గూర్పఁ ♦ జాలుదెప్పు
డంచుఁ జెప్పితి మను మని ♦ యతఁడు పల్కె;
నంత సారథి తన్నయో ♦ ధ్యకుఁ జను మన. ౩౯ 1937

మ. పెనుశోకంబున స్రుక్కి రాముని వచో ♦ బృందంబు నాలించి యి
ట్లనియెన్ రామునితోడ; స్నేహమున శం ♦ కాతంకముల్ మాని, యే
మని నేఁ జెప్పుదునో యదెల్ల విను స్నే ♦ హంబూనియే పల్కుదుం
గనుక న్నీ వపచార మంచుఁ దలఁపం ♦ గారాదు శ్రీరాఘవా!. ౪౦॥ 1938

తే. భయము మాని సేవాధర్మ ♦ పద్ధతులను
దప్పి నేఁ జెప్పుమాటలఁ ♦ దమిని భక్తుఁ
డని తలంచియె మన్నింప ♦ వయ్య నిన్ను
విడిచి పురికెట్లు పోవుదు ♦ విమలహృదయ. ౪౧॥ 1939

---

1 సీతాయా మమచార్యస్య వచనా ల్లక్ష్మణస్యచ-అనిమూలము. ఇటఁ దమ్మునివిషయమున నుపదేశించిన యార్యశబ్దము విధివిహితజ్యేష్ఠానువర్తనరూపపరమధర్మమును దెలిసినవాఁడని తెలుపుట కని గోవిందరాజులు.

క. నిను విడనాడుటచేఁ బుత్త్రునిఁ బాసి వగం దపించు ♦ తొయ్యలి పోల్కిం
గనుపట్టు నాయయోధ్యకుఁ, జనువాఁడ నదెట్లు! నీదు ♦ సంగతిలేమిన్. ౩౯

క. జనులును బురిఁ గల పశుపక్షినికరము నరామరథముఁ ♦ జెందిన వేడ్కం
గని యిష్టరామమగు స్యందనమును గని నంతనే న్య♦థం [1]బగులు నొకో?.

క. హతవీరంబగు తమసై,న్యతతిం గని దుఃఖమొందు ♦ నటు నీలేమిన్
హిత మెడలి సూతశిష్టము, శతాంగమును దీనిఁ జూచి ♦ జనులు వగవరే?.

క. వినవయ్య! యిపు డయోధ్యా, జను లెల్లన్ దూరభూమిఁ♦జను నిన్నపుడున్
మనములఁ దలఁచుటఁ దమచెం,తనెయున్నటులెంచి భోజ♦నమువిడుతురు సూ.

చ. వనమున కీవు పోవఁదగు ♦ భంగిఁ బ్రయాణముచేసి నప్పుడ
జ్జనులు త్వదీయమైన సుఖ♦సంగతిఁ బాయుట దుఃఖమొందు నె
మ్మనముల నెట్టి క్షోభమున ♦ మ్రాన్పడి యుండిరొ చూచినాఁడ నీ
వును గనులార నెవ్విధిని ♦ బోవుదు, నొంటిగ నేను జెప్పుమా. ౪౩ 1914

క. వని కీవు వెడలుతఱిఁ బుర, జనులెల్లం జేయు నార్త♦శబ్దము లెట్టుల్
వినఁబడెనొ శతగుణంబులఁ, గని యీశూన్యరథ మట్టె♦గావింపఁబడున్. ౪౪

సీ. ఏను మీతల్లితో ♦ నేమని చెప్పుదు మానినీ! తనమేన♦మామయింట
నీకొమరుని నుంచి ♦ నే వచ్చితిని గాన సంతాప మొందఁగఁ ♦ జన దటంచు
నందునా! యీయస♦త్యపుఁ బల్కునుం దగ నేను జెప్పుట కెట్లు♦నేర్తు? నడవి
విడిచి వచ్చితి నని ♦ వెలఁదితో సత్యంబు వచియింతునా? తలం♦పంగ నిద్ది

ఆ. యప్రియంబు గాదె? ♦ యనృతంబు గాకున్న
నప్రియంబుఁ బలుక ♦ నొ నదెట్లు
పలికినంత నామె ♦ ప్రాణముల్ విడుచునే
యేమిచేయువాఁడ ♦ నింక రామ!. ౪౫ 1946

క. నిను నీబంధువులగు సీ,తను లక్ష్మణునిన్ వహించి ♦ తగ నాయాజ్ఞం
గని పోవు నీవరాశ్వము, లనువుగ నీవిచట నుండ ♦ నాతురపడుచున్. ౪౬

క. ఈరథమును నేఁ దోలిన, నేరీతిగ నీడ్వఁ గలవొ ♦ యెఱుఁగ మహాత్మా!
శ్రీరామా! పురి కేగఁగ, నేరఁ జుమీ! నిన్ను విడిచి ♦ నే నెబ్బంగిన్. ౪౭

క. నినుఁ గూడి వని వసించుట, కనుమతి యిమ్మిట్లు నేను ♦ యాచించినను
ననుఁ దోడ్కొని పోవకయే, చనియెదవే నంతమాత్ర ♦ నరథుఁడ నగుచున్.

క. అనలునిలోఁ బడియెద ని,వ్వనమున నే నిశ్చయమిది; ♦ త్వత్త్రపమున కీ
వని నంతరాయమును జే,యునిఖిల జంతువుల నేమ♦హోద్ధతి మీఱన్. ౪౯

క. అరదంబును సాధనమునఁ, దిరుగాడుచుఁ జంపువాఁడ ♦ దినదినమును; నీ

1 విదీర్యేత సాపురీ-అనిమూలము.

*కరదము నభిషిక్తుఁడవై, పరఁగం దోలఁగల యట్టి♦భాగ్యము నాకున్. ౫౦

తే. కలుగ దిద్ది లేకుండినఁ ♦ గానలందుఁ
దిరుగఁ గల నీకు నే సార♦థినిగ నుండి
సేవచేయంగలట్టి య♦ప్పావనసుఖ
మైనఁ గలుగు నటంచును ♦ నేను దలఁతు. ౫౧ 1952

సీ. ఈకులంబునఁ బుట్టు♦దీనని తెలిసియే యరదంబుఁ దోలుభా♦గ్యంబు నాకుఁ
గలుగు నంచని యెంచి ♦ కడు నింద్యమైన నీసారథికృత్యమ్ము ♦ భూరిముదము
నను మంత్రిసత్తముం ♦ డనయియుఁ దగ నేను గైకొంటి నీసేవ♦గలిగె నాకు
నిఁక వనములనుండి♦యే సేవల నొనర్చి యాసుఖముం బొంద ♦ నభిలషింతు

ఆ. నడవి నీసమీప♦మందు వర్తింపంగ, నిచ్ఛయింతు నేను ♦ నిద్ది నాక
నుగ్రహింపుమీ న♦నుం జెంతనుండుమా!,యని దమినివచింప♦వినఁదలఁచెద.

క. తురగము లివ్వియు వనవా,సరతిం గనుచున్న నీకు ♦ సతతము సేవల్
పరఁగం జేసినఁ బొందును, బరమగతి; న్నేనుఁ గాన ♦ వఱలెడు నీతోన్. ౫౩

క. వనమున వసియించుచు నే,వను శిరసునఁ దాల్చి చేయు♦వాఁడ; వినుమయో
ధ్యను గాని స్వర్గలోకం,బును గానీ నేనుఁ బొందఁ♦బూన నిజముగన్. ౫౪

క. నిను విడిచి నే నయోధ్యకుఁ, జనఁ జాలన్ ఘోరకర్మ♦సముదయమును జే
సినవాఁడు స్వర్గపురికిం, జనఁజాలని యట్లు రామ! ♦ సద్గుణధామా!. ౫౫

క. వనవాసము తీఱిన పిద,ప నిను న్నే నీరథంబు♦పైఁ గూర్చుండం
గను జేసి మరలఁ బురికిం, గొనిపోఁదగునంచునాకుఁ♦గోరిక సుమ్మీ!. ౫౬

క. వినుమీ పదునాల్గేండ్లును, వని నీతోనుందునేని ♦ స్వల్పప్రాయం
బని తోఁచి గడచు లేకు,న్న నవే నూఱేంతలగును ♦ నాపాలిటికిన్. ౫౭ [త్య

సీ. భృత్యవాత్సల్యంబు♦వెలయువాఁడవు భక్తుఁడనుభృత్యుఁడను నేను♦గనుక భృ
మర్యాదఁ దప్పక ♦ మత్ప్రభుతనయుఁడవౌ నిన్నుఁ గూడి రా ♦ నభిలషించు
వాఁడ ననపరాధిఁ ♦ గూడు నే నన్నిట్టి వానిని విడుచుట ♦ సూనృతాత్మ!
యన భృత్యవత్సలుం ♦ డగు రాముఁ డిట్లను బెక్కువిధంబుల ♦ దిక్కులేని

ఆ. వాని యట్లు వేఁడు♦వాని నాతనిఁగాంచి, భర్తృవత్సలతను ♦ బరఁగు దీవు

---

* త్వత్కృతేన మయా ప్రాప్తం రథచర్యాకృతం సుఖం, ఆశంసే త్వత్కృతే నాహం వనవాసకృతం సుఖమ్-అని మూలము. దీనికి మహేశ్వరతీర్థులు "అస్యాయంభావః. త్వ మస్మిన్ కులే అవతరిష్యసీతి జ్ఞాత్వైవ మంత్రిప్రధానోప్యహం త్వద్రథచర్యాసేవాభాగ్యం మమ భవిష్యసీతి నింద్యమపి సూతకృత్యం మయా అంగీకృతం. తేన భాగ్యవశాత్ త్వత్సేవాసుఖం ప్రాప్తమేవ. ఇతఃపరం వనవాసకృతం సుఖం వనవాసేపి త్వత్సేవాకృతం సుఖం ఆశంసే ప్రార్థయే" అని విశేషార్థమును వ్రాసిరి. ఈయర్థము రామావతారమహిమను దెలుపును గాన వదలఁజాలక మూఁడు పద్యములలో వ్రాయఁబడినదని పాఠకు లాదృతి నంగీకరింపఁదగు.

భక్తి నునిచితీవు ♦ ప్రభువగు నాయందు నెఱుఁగు దేను దీని ♦ నింక వినుము

క. నిను నిప్పుడు పురి కంపుట, కనువగు కారణము దేమి! ♦ యన నీవు పురం
బున కేగఁ గేకయేశ్వరు, తనయామణి నాదు పిన్న♦తల్లి మనమునన్. ౬౦॥

క. అడవులకుం జనియెను రా,ముఁడనుచు సన్మకము నొంది ♦ ముదమందును జు
మ్మడవుల కేనుం బోవుట, దడయక నీవలన వినిన ♦ తరువాత మదిన్. ౬౧॥

ఆ. ధర్మచిత్తుఁడైన ♦ దశరథునింగూడి, కల్లలాడఁ డనుచు ♦ నుల్ల మలర
సందియంబు మాను ♦ సరసాత్మ! సారథీ!, పిన్నతల్లికొడుకు ♦ పృథ్వినేల. ౬౨॥

క. స్ఫీతంబగు రాజ్యంబును, బ్రీతిగఁ బొందుటయె నీకు ♦ వివరించెద నా
కీతఱి ముఖ్యంబనియే, చేతంబున నెంచువాఁడ ♦ సిద్ధము సుమ్మా!. ౬౩ 1963

తే. క్ష్మాపతికి నాకునుం బ్రీతి ♦ గల్గుటకయి
యరదమును గాంచు; నీవిపు ♦ డా యయోధ్య
కేగు మేయేవిషయముల ♦ నెట్టులెట్లు
చెప్పుమంటినో యట్లట్లె ♦ చెప్పుమీవు. ౬౪ 1964

క. ధీరుండగు శ్రీరాముం, డీరీతి సుమంత్రుతోడ ♦ హితము పలికి యా
సారథి యూఱడిలం బలు,సారులు నోదార్చి గుహుని ♦ సరసమనీక్షన్. ౬౫

చ. కనుఁగొని యుక్తియుక్తముగఁ ♦ గ ప్రవచోభణితిన్ వచించె నీ
వనుదిన మిందె యుండుమని ♦ యంటివి నేను జనంబులుండు ని
వ్వనమున నుండుటన్నయది ♦ బాగుగ లేదు సదాశ్రమంబులం
దె నిలువనౌను దండ్రియపు♦డేర్పడఁ బల్కిన యాజ్ఞ యట్టిదే. ౬౬ 1966

సీ. జనకుని యిట్టి యా♦జ్ఞను గలవాఁడను గావున మునిజన♦కాంతులకును
దగినట్టి సాధువ్ర♦తంబును బూని నాతండ్రికి మఱియు నా♦తమ్మునకును
సీతకు మేలుకై ♦ చిత్తహితము వారికౌటనే జటల నె♦య్యమునఁ దాల్చి
వనమున కేగెదఁ ♦ గనుక నీవును మఱ్ఱిపాలను దెమ్మని ♦ పలుక గుహుఁడు
ఆ. వానిఁ దెచ్చియిచ్చె ♦ వడి రాజసుతునకు, నంతఁ దమ్ముఁడా ప♦యస్సుతోడ
జటలు దాల్పఁ జేసి ♦ జటలఁ దాను ధరించె, నస్సమహాభుజుండు ♦ హర్షమలర.

క. ఈరీతి జటలఁ దాలిచెఁ, బూరుషసింహుండు పిదపఁ ♦ బూనిక జటలన్
[1]చీరాంబరములఁ దాలిచి, వారలు సోదరులు మునుల♦వలె భాసిలఁగాన్. ౬౮

ఆ. సంతసించె గుహుఁడు ♦ సరగున శ్రీరాముఁ
డాటవికులు పూను♦నట్టి వ్రతము
పూని యాసుమిత్ర ♦ పుత్రునితోఁ గూడి
పలికె సాయపడిన ♦ వ్యాధపతికి. ౬౯ 1969

1 తా తదా ' -చీరవసనౌ- అని మూలము.

క. వనరాజ్యనాథ! రాజ్యం,బును నేలుట మిగులఁ గష్ట♦ము సుమీ యటుగా
వున దుర్గకోశబలములఁ, గనుచుండు ప్రమాదమొంద♦కయె నీ వెపుడున్. ౨౨

మ. అని యిక్ష్వాకుకులాభినందనుఁడు నె♦య్యంబొప్ప మాటాడి యా
తని వీడ్కొల్పి విచారమొందకయె సీ♦తన్ లక్ష్మణుంగూడి పో
యెను వేగంబ సురాపగం గనఁగ న♦ల్లంతో త్వరంబోయి గం
గను భక్తిం గని దానిదా తటమునం♦ గాంచెన్ మహానౌకనున్. ౨౩ 1971

క. ఆనది వడిగాఁ బాఱెడుఁ, గానం దన్నౌక నెక్కి ♦ గంగను దాఁటం
గా నెంచి లక్ష్మణుని గని, తా నిట్లనిపల్కె ♦ గుణని♦దానా! వత్సా!. ౨౪ 1972

క. ఇదె యోడవచ్చి యిచ్చటఁ, గదలక నిలుచున్న దింకఁ ♦ గడువడి నెక్కం
గఁ దగున్ నీకు, భయంపడు, ముదితం గైకొని బట్టి చేర్పు♦ము గదలకుండన్. ౨౫

చ. అనియెను; లక్ష్మణుండు తన♦యగ్రజునాజ్ఞను నాలకించి సీ
తను దొలిఁజేర్పు నావపయిఁ ♦ దమ్ముఁడ! యంచని చెప్పినట్లె స
న్నననున నొప్పువాఁడగుట ♦ మానుగ నెంచి తదాజ్ఞయెట్లొ యు
ట్లనువుగ నావపైకి జన♦కాత్మజఁ జేరిచి తాను బిమ్మటన్. ౨౬ 1974

ఆ. ఓడనెక్కె నంత ♦ నురుతర తేజస్వి, యైన రాముఁ డెక్కె ♦ నచటి యోడ;
నంత గుహుఁడు బంధు♦సంతతితో నౌక, నవలిగట్టుఁ జేర్ప ♦ నాజ్ఞ చేసె. ౨౭

సీ. అతుల తేజంబున ♦ నలరారు శ్రీరాముఁ డయ్యోడపై నెక్కి ♦ యవల విప్ర
భూవరులకు జపం♦బుం జేయ నర్హమౌ నట్టి "దైవీంనావ" ♦ మనెడి మంత్ర
మాత్మహితార్థమై ♦ యప్పుడు జపియించి సీతతోఁ గూడ వా♦ర్చి పరమముద
మున మేను పొంగ వి♦ధిని నమస్కారంబు గంగకుఁ జేసె; ల♦క్ష్మణుఁడు విమల
తే. తనురుచిస్ఫూర్తిఁ డట్లె వం♦దనము చేసె
నధిపుఁడంత సుమంత్రుని ♦ నఖిలబలము
తోడ గుహునిని బ్రీతిమై ♦ వీడుకొలిపి
నౌక నడప నాజ్ఞాపించె ♦ నావికులకు. ౨౮ 1976

క. తరువాత నావికులు హెచ్చరికలతో మంచితెడ్లు ♦ సారించుచుఁ ద్రో
యు రయంబున నదిజలములఁ, దరించి దరిఁజేరె నౌక ♦ తత్సమయమునన్.

ఆ. నిష్కళంకకీర్తి ♦ నెగడు జానకి నౌక, గంగ నడుమఁ జేరఁ♦గానె భక్తిఁ
గరయుగంబు మోడ్చి♦గంగానదిని గాంచి, పలికె నిట్లు లలిత♦భంగి మెఱయ.

సీ. జ్ఞానియై తగిన ద♦శరథభూకాంతుని తనయుఁడీ శ్రీరాముఁ ♦ డనఘచిత్తుఁ
డో జాహ్నవీ! ప్రీతి ♦ నొగి నీవు రక్షింపఁ బదునాలుగేడులు ♦ గొదువపడక
యుండఁ గాననముల ♦ నుండి జనకునాజ్ఞ నంతరాయము నొంద♦కట్లు తీర్చి
యనుజుని నన్నుఁగూడి ♦ యంబ! యిచ్చటికిని మరల వచ్చినయప్డు♦మంగళము

తే. వచ్చినందులకయి మదిఁ ♦ బ్రమదమంది
సర్వకామసమృద్ధినీ! ♦ చారుకీర్తి
శాలినీ! నిన్నుఁ బూజింతు ♦ సాంద్రభక్తిఁ
ద్రిపథగవు గావె? సతతంబు ♦ దేవి! నీవు. ౮౫ 1979

చ. కనుకనె బ్రహ్మలోకమును ♦ గాంచిన దానవె నీవు భూస్థలం
బునను సముద్రపత్నివయి ♦ పొల్చిన దానవు మంగళాంగి! నీ
కు నెలమి వందనం బిడెదఁ ♦ గోర్కి నుతించెదఁ బూరుషేజ్యుఁడై
తనరు నితండు క్షేమముగఁ ♦ దా నిటఁ జేరి స్వరాజ్యమొందినన్. ౮౭ 1980

క. నే నీకుఁ బ్రియముఁ గోరుచు, ధేనువు లొకలక్ష సంఖ్య ♦ దివ్యాన్నము మే
లైనట్టి వస్త్రములు ధా,త్రీనిర్జరవరుల కిత్తు ♦ దేవీ! మఱియున్. ౮౮ 1981

సీ. పురవర్యమునకు నే♦మరలవచ్చిన యంతఁ బ్రియతచిత్తముతోను♦రాఘటముల
వేయింటి నొసఁగెద ♦ విపులమాంసంబన్నమునకు మాఱుగ నిచ్చి♦నినుసమర్చ
నము చేయుదాన; నీ విమలతీరంబున వసియించునట్టి దే♦వతల నెల్లఁ
బూజింతుఁ ద్వత్తటం♦బునఁ గల మణికర్ణికాప్రయాగాది స♦కలసుతీర్థ
తే. ములను గాశ్యాది సురగేహ♦ములను భక్తిఁ
బూజలం దన్పుదాన; నో♦పుణ్యనిలయ
యనఘుఁడీ దీర్ఘబాహువు ♦ వని వసించి
దాని విడిచి ననుం గూడి ♦ తమ్ముతోడ. ౯౦౪ 1982

క. మరలం గుశలంబున న,ప్పురవరముం జేరుఁగాక ♦ పొంగుచు; నని యా
కరణి ననిందిత; యగుచుం, గరణీయములందు నేర్పు♦గల జానకియున్. ౯౧౪

క. సురశైవలినిం బలుకుచుఁ, ద్వరగా దక్షిణతటంబుఁ ♦ దాఁ జేరఁగ న
ప్పురుషలలాముఁడు శత్రుని, కరభయదుఁడు రాముఁడంత ♦ గంగాతటమున్.

ఆ. చేరి నంత నౌకఁ ♦ జెచ్చెఱ విడిచి య,న్వలి తటంబు నొంది ♦ భ్రాతతనదు
పత్నివెంట రాఁగఁ ♦ బయనమ్ము చేయుచు, నమ్మహాభుజుండు ♦ ననుజుఁ గాంచి.

చ. విను జనులుండు చోట జన♦బృందము లేని మహిన్ సురక్షణం
బునఁ బ్రయతాత్మతన్ మెలఁగఁ ♦ బోలును నీకు నదృష్టపూర్వని
ర్జనవనముంగనంగ నిఁక ♦ సత్వరఁ బోవుచునున్నవార మం
దునను ప్రమాదముం గనక ♦ తోరఁపుశక్తిని గాచుటొప్పుఁజూ. ౯౮౪ 1986

క. అనుజా! ముందుగ నీవును, జనుమా! నీవెంట వచ్చు ♦ జానకి నిను సీ
తను గాచుచు మీయిద్దఱి, వెనుకనె నే వచ్చువాఁడ ♦ విధ మిది చనఁగన్.

క. పురుషలలామా! మనమొ,క్కరి కొక్కరు గాచుచుండఁ♦గాఁ జను నిఁకనే
వరుస నదే పనిగా నీ, తరుణము గడచనిన మరల ♦ దానిం గూర్పన్. ౯౬౪

క. సులభంబు గాదు; గావున, నలయక తగినట్టి కాల♦మందెచ్చరికం

గలిగియె యుండందగు; నీ, యిలాత్మజయుఁ గష్టమొందు ♦ నీవనభూమిన్.

సీ. విజనసమ్మర్దమై ♦ విగతసస్యక్షేత్రపుష్పవనంబయి ♦ పొలుపు దప్పి
విషమమార్గంబయి ♦ పెనులోఁతుగల్గిన స్థలములు గల యీ♦విశాలవనము
సీత యిద్దియె ప్రవే♦శించెడుఁ గనుక నీ వనవాసదుఃఖంపు♦భంగి నెఱుఁగఁ
గలదని రాముండు ♦ పలికిన విని సుమిత్రానందనుఁడు ముందు ♦ తాను బోయె
తే. నతని వెనుకనె సీతయు ♦ నామె వెనుక
రఘుకులానందదుండగు ♦ రాముఁ డరిగె
జాలిఁ బుట్టింపఁదగిన ద♦శను గను నల
సారథియు రాముఁ డద్దరిఁ ♦ జేరుదనుక. ౯౯ 1990

క. కనుఱెప్ప వేయకాదృతిఁ, గనుచునె నిలుచుండి దూర♦గతుఁడై యంతం
జనుటన్ రాముఁడు తనకుం, గనఁబడమిన్ దృష్టినురలఁ♦గాఁ జేసి వగన్.

క. మనమునఁ గుందుచు విడిచెన్, గనుగవ గలఁగంగ బాష్ప♦కణముల నంతన్
దనమహిమ లోకపాలుర,కు నిభంబై చెలఁగ నెల్ల♦కోర్కు లొసఁగుచున్.

సీ. మహితాత్ముఁడై జన♦మండల హితుఁడునౌ రాముఁడాసురనది♦రయమువీఱ
దాఁటి ప్రయాణమై ♦ తగు సస్యములు గల్గి సంతసంబిడుచున్న ♦ జనపదంబు
వత్సనామకమును ♦ వరుసఁ జేరెను నటవార లాఁకలి గొని ♦ వారిజాక్షి
నొకచోటఁ జక్కఁగ♦నునిచి వేఁటకుఁ జని మనుఁబోతుఁ బంది దు♦ప్పినిని నల్ల
తే. చాఱలలరారు చుప్పి నీ♦జంతువులను
జంపి తచ్ఛుద్ధమాంసంబు ♦ సంగ్రహించి
జానకిం గూడి శీఘ్రమ ♦ మ్మానుకడకు
నిలువఁ బోయిరి రవిక్రుంకఁ ♦ గలతఱిఁ దగ. ౧౦౨ 1993

ఏఁబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౫౩ - వ సర్గము.

రాముఁడు పరితపించుచు లక్ష్మణుని నింటికిఁ బొమ్మనుట

క. మనసుల రంజిలఁ జేసెడు, మనుజులలో మేటి రాజ♦మండనుఁ డగు న
జ్జనపతి కుమారచంద్రుఁడు, చని తరుమూలమున రాత్రి ♦ సంధ్యను భక్తిన్.
తే. తగ నుపాసించి తనముద్దు♦తమ్మునిఁ గని
పలికె నాత్మీయరాజ్యంబు ♦ వెలుపలను సు
మంత్రు విడనాడి యడవుల ♦ మనము జరపు
రాత్రులం దిద్దియే తొలి♦రాత్రి సుమ్ము. ౧౪ 1995

క. దీనిం గుఱించి దుఃఖముఁ, బూనం దగ దింక నేఁడు ♦ మొదలుగ నిశలం
ధూనిన శ్రద్ధన్ మేల్కొ,నఁ, గానే తగు వినుము దాని ♦ కారణమెల్లన్. ౨౪

క. సీతాయోగక్షేమము, లీతఱి మన యిరువురందు ♦ నే యేర్పడియెం
గా తమ్ముఁడ! యీరాత్రిని, నేతీఱునవో శ్రమించి♦యే గడుపఁదగున్. ౩½

క. తొలితేయి కానఁ గష్టం,బులనే సూచించు నైనఁ ♦ బుత్త్రమెటులో యీ
యిల గుడిసె వేసికొని యి,మ్ముల నిద్రింపంగఁ గాల♦ము గడిచి చనియెన్. ౪

క. మునుపే తృణపర్ణాదులఁ, గొనిపఱచి పంరుడి యెట్లొ ♦ ఘోరంబగు రే
యిని దీనిఁ బుత్త్రమని మె,త్తనిశయ్యఁ బరుండ మిగులఁ ♦ దగు నాతండున్.౪½

చ. ధరణిఁ బరుండి లక్ష్మణునిఁ ♦ దాఁ గని మంగళవాక్కులొప్పఁగాఁ
గరుణ చెలంగఁగాఁ బలికె ♦ క్ష్మాపతివర్యుఁడు తండ్రి చింత ని
త్తరుణమునందె నిద్రఁగనఁ ♦ దానుఁ బరుండును గాని నిద్ర యె
క్కరణిని బట్టు? నిద్దురను ♦ గానకయే యతఁడుంట సత్యమా. ౫½ 2000

చ. తనదగు వాంఛయే ఫలముఁ ♦ దద్దయుఁ గాంచెను గానఁ గైక తు
ష్టినిఁ గనఁజాలియుండుఁ దన♦చిన్నికుమారుఁడు రాఁగఁ గాంచి యా
తని కభిషేకమున్ జరపఁ ♦ దద్గతరాజ్యము సుస్థిరంబుగాఁ
దనర నొనర్పఁగోరి యల ♦ తండ్రిని జంపకయుండునే కదా. ౬ 2001

*సీ. పురుషార్థనిస్పృహుం♦డరయ మహాత్ముఁడై ♦ క్రాలియుఁదా రాజ్య♦కారణమునఁ
గైకను నిందింపఁ ♦ గడఁగుట న్యాయము గాదని యెఱిఁగియు ♦ గాదిలి యను
జాతు నయోధ్యకుఁ ♦ జనుమని మునుముందుఁ జెప్పఁగఁ బూని త♦చ్చిత్తకోప
మును శాంతి నొందించి ♦ పనుపఁగా నెంచుచు నాతని మతము నె♦యనుసరించి

తే. నింద చేయుచు మఱియును ♦ నేర్పుమీఱఁ
బలికెఁ దండ్రి యనాథుఁడు ♦ వార్ధకమునఁ
బీడితుఁడు నైనవాఁడు, నే ♦ విడిచి వచ్చి
తినిగదా లక్ష్మణా! యెట్టి♦తీరుఁ గనునొ. ౭½ 2002

క. విను మాతఁడు కామాత్ముఁడు, గనుకన్ గైకేయి వశముఁ ♦ గని యుండునిఁకే
పని చేయఁగలండాతఁడు, మన యిప్పటి శ్రమము రాజు♦మది విభ్రమమున్.

క. కనఁగా ధర్మార్థములను, ఘనమై కామంబె మించఁ♦గాఁ జాలును సు
మ్మని నాకుఁ దోఁచుచున్నది;, విను. లక్ష్మణ! యెవ్వఁడే న♦విద్వాంసుండున్. ౯

చ. తనదగు నిచ్ఛరీతి సత♦తంబుఁ జరించు కుమారు నొక్కకాం
తను బ్రియమొందఁ జేయ ననుఁ ♦ దండ్రి త్యజించినయట్లు భూస్థలం
బున విడనాడునే విడువఁ ♦ బూనఁడు సుమ్మల కైకయీసుతుం
డనుదిన మొక్కఁడే క్షితిపుఁ♦డై తగఁ గోసలదేశమంతయున్. ౧౦½ 2005

* అనాథశ్చ హి వృద్ధశ్చ మయాచైవ వినాకృతః-అనిమూలము. దీనికి గోవిందరాజవ్యాఖ్య ననుసరించి సీసపద్యము వ్రాయఁబడినది గాని స్వకల్పితము గాదని తెలియందగు.

తే. అలరుచుండఁ బాలింపఁగాఁ ♦ గలఁడు వాఁడె
భార్యతోడ సుఖంబుండు♦వాఁడు సుమ్ము
కటకటా! యీడుచెల్లిన ♦ కాలమునిటు
దంద్రి పొంద నే నడవులఁ♦దగ వసింప. ౧౦ 2006

క. అతఁ డొక్కండె సర్వక్షితికొక్క మొగంబె యగుచుఁ ♦ జెలువారుఁ గదా
క్షితి నర్థధర్మముల విడిచి తగం గామంబు నెవఁడు ♦ చెందునొ మదిలోన్.

తే. అతఁడు దశరథుపోలిక ♦ నాపదలను, నిట్లు పొందు శీఘ్రంబుగ; ♦ నింటఁ గైక
పతి మృతికి నాదు వనసన్ని♦వాసమునకు, భరతునకు రాజ్యసిద్ధికి ♦ వచ్చిచేరె.

క. అని నాకుఁ దోఁచుచున్నది, విను సౌమ్యా! కైక తనకు ♦ వెలసిన సౌభా
గ్యనిరతిమదమోహితయై, కనికరమును విడిచి యిపుడు ♦ కౌసల్యను దాన్.

క. ననుఁ బట్టి సుమిత్రను బాధను బొందఁగఁ జేయకున్నె ♦ తమ్ముఁడ! వారిన్
దనచేతనైన దనుకన్, వనటం బొందించు నేమి ♦ పలుకుదు నింకన్. ౧౩

క. ననుఁ గూర్చి సుమిత్రాంబయు, ఘనకష్టము లొందకుండుఁ♦గాక; యిటకుఁ జెం
తనె యున్న దయోధ్యాపుర,మనుజా! వేకువనె లేచి ♦ యరుగుము పురికిన్.

క. నేనొక్కఁడనే పోయెద, జానకితో నడవి కింక ♦ సద్మమున వగం
బూని యనాథగ నుండిన, మానిని నాతల్లిఁ గనుము ♦ మంజులహృదయా!.

క. నీ వామెకుఁ బెనుప్రాపై, పావనరీతులను దేర్పు ♦ వగఁ గుందని య
ట్లో వరహృదయా! కైకయు, భావింపఁగ నీచకర్మ♦పరమతి సుమ్మా!. ౧౬

క. తనకుం గల పగఁ దీర్పఁగ, ననువు పడెంగా యటంచు ♦ నవమతి నేదే
నొనరింపవచ్చు నా ప్రియ,జననికి నటుచేయకుండఁ ♦ జయ్యనఁ జనుమా! ౧౭

క. భరతుఁడు ధర్మజ్ఞుండగు, నరగున నీవరిగి నాదు ♦ జననీ రక్షా
పరతంత్రుఁడౌ విధంబున, భరతునకుం జెప్పి యతని ♦ వశమున నుండన్. ౧౮

చ. జననికిఁ జెప్పి యప్పనము ♦ సల్పుము; లక్ష్మణ! నాదు తల్లి యే
జననమునందొ యెవ్వరినొ ♦ చానల వారి తనూజసంతతిం
గనుఁగొనకుండఁ జేసె ననఁ♦గా నది యబ్బురమే నిజంబయాఁ
గనుకనె యిట్టి యాపదలఁ ♦ గాంచెను దప్పునె యిద్ది యేరికిన్. ౧౯ 2016

తే. చాలకాలము నన్నుఁ గౌ♦సల్య కరుణఁ
గష్టముల కోర్చి పెంచె నిఁ♦కను మదీయ
సేవలోనగు ఫలములఁ ♦ జెందఁదగిన
తఱిని విడనాడి వచ్చితిఁ ♦ దల్లి నేను. ౨౦ 2017

ఆ. ఇట్టి నాదు జన్మ♦మేటికి లక్ష్మణా!, యేను గన్నతల్లి ♦ కిటు లనంత
శోక మొసఁగినాఁడ ♦ క్షోణి నేకాంతకుఁ, బుట్టకుండుఁ గాక ♦ యిట్టికొడుకు.

*సీ. అంబ రక్షించు తి♦ర్యగ్జంతు వొనరించునంతమాత్రము మోద♦మైనఁగలుగఁ
జేయంగఁ బడదు నా♦చేతనంచుఁ దలంచి యప్పుడు పల్కెఁబ్రి♦యానుజన్మ
మదపేక్షచే నధి♦కదయావిశిష్టయాఁ బోషిత శారిక ♦ పూజ్యజనని
యందంచుఁ దలఁచెద ♦ నమలమతీ! దానినుండి వినంబడు♦చుండును "శుక
పాదమరేర్దశ♦పరమప్రయత్నతో" యని యట్టి సద్వాక్య♦మునను దోఁచు

తే. నర్థము లమూల్యములు గావె ♦ యట్టివాక్య
మునను నాతల్లికిం గల్గు ♦ ముదములో ర
వంతయేని యొసంగలే♦నైతిఁ గాన
నిష్ఫలంబగు నాజని ♦ నిశ్చయమిది. ౨౭ 2019

సీ. అని తలంచెదను బ్రి♦యానుజా! మందభాగ్యమ్మున నొప్పుచు ♦ నాత్మజన్ముఁ
గనియు గార్యములేక ♦ కడువగఁ గుందుచు నున్న నాతల్లికి ♦ నొక్కకొంత
యేనుపకారంబు ♦ నిపుడు చేయని నన్నువంటికుమారుని ♦ వలన నేమి
యుపయోగముండునో♦యూహింపఁగాఁజాల; నదిలేకయున్న నే♦మాయెఁగాని

ఆ. మందభాగ్యయగుట ♦ మానిని కౌసల్య,ననుఁ దొఱంగి దుఃఖ♦మునఁగృశించి
పడియె శోకజలధిఁ ♦ బరజనమర్దనా!, నేను గోపగింతు ♦ నే నొకఁడనె. ౨౮

చ. కడఁగి యయోధ్యయన్ పురినె ♦ కాదు దురాస్థలినెల్లఁ దూపులన్
వడివడి నాక్రమింపఁగల♦వాఁడనె; యైన నహేతుశౌర్యముం

---

* మన్యే ప్రీతివిశిష్టా సా మత్తో లక్ష్మణశారికా, యస్యా స్తమ్మాచ్ఛ్రియతే వాక్యం శుక పాద మరే ర్దశ-అనిమూలము. నాతల్లిచే రక్షింపఁబడిన తిర్యగ్జంతు వామెకుఁ గల్గించినంత ప్రీతి నైనను నేఁ గల్గింపలేకపోతిఁగదా యని చెప్పుచున్నాఁడు. అని ప్రారంభించి శ్రీగోవిందరాజులు విశేషార్థములు వ్రాసిరి. నాతల్లియగు కౌసల్య పెంచిన శారిక సమీపముననున్న చిలుకను గాంచి యోశుకమా! శత్రువగు పిల్లి పాదము కొఱుకుము. అని చెప్పఁగా నామె యందులకు సంతసిల్లి నది. తిర్యగ్జాతియగు నాపిట్ట తన్నుఁ గాపాడిన నాతల్లికిఁ జేసినంత ప్రీతినిగూడ నామెకుఁ బుత్రుఁ డనై మనుష్యుఁడనైన నేను జేయఁజాలక పోతినే. కాఁబట్టి యాపిట్టయే యీవిషయమున నా కంటె మేలని తలంచెదను. అని సారాంశము. విశేషార్థసారాంశ మేమనఁగా: యస్యాః-అనునది పంచమీవిభక్తి. యస్మాత్-అని లింగపరిణామము గావించి యేయాచార్యునినుండి వాక్యం=రహస్య మంత్రరూపవాక్యము, హేశుక=శుకసమానవర్ణుఁడవగు నోభగవానుఁడా! అరేః=విరోధిభూతమగు సంసారముయొక్క, పాదం=ఆధారమును (సంసారబీజభూతాహంకారమమకారములను), దశ=నివర్తింపఁజేయుమా. అనునది శ్రూయతే=వినఁబడుచున్నదో; అని యిట్లు ప్రకరణబలమున నర్థముల వ్రాసిరి. ఈయర్థమును దెనుఁగున వ్రాయుచు నాపదములనే యనుకరణముగా నుంచితి. ఇంత కన్నఁ బెంచి వ్రాసినచో రసమొదవదని నాకుం దోఁచినది. తక్కినవ్యాఖ్యాత లీ విషయమును వదలిరి. కాన పైవ్యాఖ్య కిది ఛాయవంటిదగునని నాభావము పాఠకులు గ్రహించి మన్నింపఁ దగు.

గడువెలయింపరాదుగద? ♦ కాన నధర్మజలోకనింద క
ప్పుడు పరలోకహానికిని ♦ భూరిభయంబును గంటి లక్ష్మణా!. ౨౫॥ 2021

తే. కాన నభిషేకకృత్యంబు ♦ నేనుఁ బూన
కున్నవాఁడనటం చని ♦ యొగిని విజన
మైనయట్టి వనంబున ♦ నాస్యమందు
బాష్పములు గ్రమ్మ మఱి యెన్నొ ♦ పలికి మఱియు. ౨౬॥ 2022

క. ఆరాత్రి యంత వగచుచు, నారాముఁడు పలుక నాల్క ♦ యాడక యట్లే
యూరకయుండె; ననంతర, మారాముఁడు తనకుఁ దానె ♦ యట్లుండుటచేన్.

ఆ. మంటలేని యగ్ని♦మాడ్కి నిర్వేగాబ్ధి, వలెఁ జెలంగఁ గాంచి ♦ లలితభణితి
నతని నూఱడించు ♦ చనియె లక్ష్మణుఁ డిట్లు, ట్లస్త్రధరులమేటి ♦ వరయరామ!.

క. నరపతివి నీవయోధ్యా,పురమును విడనాడి రాఁగఁ ♦ బొంక మెడలఁ జం
ద్రరహితరాత్రివలెన్ రుచి, విరచితమై యుంట నిజము ♦ వినుమో రామా!.

చ. పురుషవరుండవయ్యు నిటు♦పోలని పద్ధతిఁ దాపమొందఁగాఁ
దరుణమె యిద్ది యుక్తమొకొ ♦ తావకచింతయు నన్ను జానకిన్
బురికొలిపెన్ విచారమున ♦ మున్గఁగఁ జేయఁగఁ గాన నిప్పుడి
క్కరణి విచారముం గొనుట ♦ కార్యము గాదని యెన్నుమా మదిన్. ౩౦

సీ. తెల్లవాఱఁగనె న♦న్నల్లనఁ జనుమంటి వయ్యయోధ్యకు విన♦వయ్య మనవి
నినుఁ బాసి జానకి ♦ నిల్వఁ జాలదు, సీతవలె నేను నిన్నెడఁ ♦ బాయఁజాల
జలములనుండియె ♦ వెలువరించిన మత్స్యములపోల్కి నిద్దఱ♦మునుముహూర్త
కాలమైనను మనఁ ♦ జాలము జనకాదులను గావఁ జనునని ♦ యనువదించి

తే. తీవు శత్రునిషూదనా! ♦ యిఁపుడు నిన్ను
వదలి జననీజనకులను ♦ భ్రాత, మఱియు
స్వర్గమును నైనఁ జూడంగఁ ♦ జనుట కొల్ల
ననియె; నంతట నాస్థాన♦మందె యతఁడు. ౩౨ 2027

చ. జనకజఁ గూడి నెమ్మదికి ♦ శర్మముగాఁ దగఁ గూరుచుండి చెం
తనె వటమూలమందు సుఖ♦ధామముగాఁ గయిచేసినట్టి శ
య్యను గని చిన్నతమ్ముని న♦హాయనిమెచ్చుచు నందుఁ జేరి యా
జనకజతోడ ధర్మమతి ♦ చక్కఁ బరుండె ననంతరంబునన్. ౩౩ 2028

*సీ. అరినిషూదనుఁడగు ♦ నారాముఁ డవ్విధి వనవాసమును గూర్చి ♦ తనకు నాదృ
తిని న్యాయరీతిని ♦ ననుజుఁడు చెప్పిన వచనంబులన్ విని ♦ పలుకకుండి

* సమా స్సమస్తా విదధే పరంతపః ప్రపద్య ధర్మం సుచిరాయ రాఘవః-అని మూలము. రాముఁడు లక్ష్మణోక్తమగు నాదరోక్తిని విని చాల యోజించి తమ్మునకుఁ దనతో నన్నిసంవత్సరములు వనవాసముచేయ ననుమతి యిచ్చెనని మహేశ్వరతీర్థాభిప్రాయము.

చాలసేపటికి యో♦జనచేసి ధర్మంబుఁ బూని లక్ష్మణుఁ దన♦తోన యన్ని
వత్సరంబులు వన♦వాసంబుచేయుట కాజ్ఞనొసంగె న♦య్యవసరమున
తే. రఘుకులార్ణవచంద్రులా ♦ రామలక్ష్మ
ణులు విజనమైన వని మహా♦బలము మీఱి
గిరుల సానుతటంబులఁ ♦ దిరుగు సింగ
ములవలెఁ గనరైరి తో♦ట్రిలుట భీతి. ౩౫ 2029

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౪ - వ సర్గము.

రాముఁడు భరద్వాజాశ్రమమున కరుగుట.

క. ఈరీతి మువ్వురా శుభ,మా రాత్రి మహాద్రు,మూల♦మందె గడిపి యా
నీరజబంధువు పొడుఁవఁగ,నే రయమునఁ దరలి రడవి♦ కేగు తలఁపుమై. ౧ 2030

చ. సురుచిరకీర్తిఁ గన్న యల♦శూరులు జానకితో మహావనం
బరుదుగఁ దోఁపఁ జొచ్చి, వని ♦ నచ్చట నీవఱకెన్నఁడేని దృ
క్సరణిఁ గనంగరాని వన♦సంధుల మంజులదేశసంతతిన్
బరమముదంబునం గనుచు ♦ స్వర్ధునియున్ యమునాప్రవాహమున్. ౨ 2031

ఆ. ఒక్కచోటఁ గూడి ♦ యుండుస్థలంబున, కరిగిరంత రాముఁ ♦ డడవిఁ గష్ట
ములను గాంచరాని♦లలితమార్గంబునఁ, జనుచు వివిధతరులఁ♦గనుచుఁ బోయి.

క. సురపథమధ్యస్థలి భా,స్కరుఁ డల్లన దాఁట ననుజుఁ ♦ గని యిట్లనియెన్
ధరనిందె ప్రయాగాహ్వయ, పరమక్షేత్రంబు గలదు ♦ పరికింపు మిదే. ౪

తే. దీనిచుట్టును భగవంతుఁ♦డైన యగ్ని
ధ్వజము ధూమము లేచె ను♦జ్జ్వలముగాఁగఁ
జూడుమా! భరద్వాజుఁడు♦న్నాఁడు చెంత
ననుచుఁ దలఁచెద జాహ్నవి ♦ యమునయు నిట. ౫ 2034

క. కలిసెను గావున సంగ,స్థలమునకున్ వచ్చితిమి ని♦జంబుగ నదిగో
సలిలము లురవడిఁ దాఁకుట, వలనం గల్గెడు రవంబు ♦ వరుసఁగ వినవో. ౬

క. వినుమా! యాశబ్దంబును, వనమున జీవించునట్టి ♦ వారు నఱికివై
చిన దారువులంతటఁ గ,న్గొనవయ్యె మునీంద్రచంద్రు ♦ [1]కువలయసీమన్. ౭

క. చెలువారెడు వివిధద్రుమ,ములు గన్పడుచున్నవనియె; ♦ మోదంబున న
వ్విలుకాండ్రిద్దఱును సుఖము,గ లలితమార్గమ్మునడచి ♦ [2]గ్రహపతి వ్రాలన్.

---

1 కువలయసీమన్=భూభాగమునందు. 2 గ్రహపతి=సూర్యుఁడు.

తే. జాహ్నవీనది యమునయు ♦ సంగమించు
నెచట నందున్న మునిదగు ♦ నుచితపర్ణ
శాల కంతికమునఁ దగు ♦ సాధువనముఁ
జేరి, రయ్యాశ్రమముఁ బ్ర వే♦శింపఁ దలఁచి. ౮ 2038

సీ. తనుఁ జూచి మృగపక్షి♦తతులు భీతిల్లంగ గడియ సేపేగి య♦ప్పుడమిసురుని
చెంత కేగఁగఁ దన ♦ చిన్నితమ్ముఁడు సీతయును వెంటనడచిరి ♦ ముని వనంబు
చేరి మానిని జూడఁ ♦ గోరుచు సాయాహ్నమగుటచే నగ్నికృ♦త్యంబుఁ దీరు
టను బ్రతీక్షించుచు ♦ మునికి దూరంబుననే యుండి రమ్మౌని ♦ యెంతో తీవ్ర
తే. నియమమున నొప్పి యోగ్నిక♦నిరతిఁ గాంచి
తపము బలిమిని జ్ఞాననే♦త్రంబుఁ బడసి
కృత్యములఁ దీర్చి శిష్యసం♦కీర్ణుఁ డగుచు
నుండ నంతట నతని రా♦ముండు గాంచి. ౧౧ 2039

చ. కరములు మోడ్చి లక్ష్మణుఁడు ♦ కాంతయు నంజలులొప్ప రాఁగ మా
నిరమణుఁ జేరి మ్రొక్కి రతి♦నిశ్చలభక్తుల; నంత రాముఁడా
ధరణిసురేంద్రుతోఁ బలికెఁ ♦ దమ్మెఱిఁగింపఁగఁగోరి యోమునీ
శ్వర! రఘువంశజాతులము ♦ వచ్చితి మీవనికిప్పుడే తగన్. ౧౨ 2040

సీ. దశరథభూజాని ♦ తనయులమగు మేము రామలక్ష్మణులను ♦ నామకులము
కల్యాణి యగు నిది ♦ కాంత నాకగు సీతయని పిల్వఁబడుచుండు♦జనకపుత్రి
యిది యనిందితశీల♦యే గాన విజనమౌ వనమున కేతెంచె ♦ నను గుఱించి
దృఢనియముండయి♦యొనఁగు నాప్రియసోదరుఁడుపీడెయీలక్ష్మ♦ణుఁడునునేను
తే. దండ్రిపంపున వనికేగఁ ♦ దలఁపఁ దాను
వచ్చినాఁడు మహాత్మ! యా♦వసుమతీశ
చంద్రునాజ్ఞఁ దపోవన♦స్థలికి మేము
పోవుదుము; తండ్రియాజ్ఞఁ, ద♦పోవనమున. ౧౫ 2041

క. ఫలమూలంబులఁ దినుచున్, గలుషహరంబైన వ్రతముఁ ♦ గాంచి జనకునా
జ్ఞ లలిన్ బాలించుచు ని,మ్ముల ధర్మముఁ బూని యుందు♦ము మునీశ! తగన్.

చ. అని రఘురాముఁ డాత్మవిధ♦మంతయుఁ జెప్పఁగ ధర్మచిత్తుఁడౌ
మునియును బుద్ధివైభవముఁ ♦ బూనిన రామున కాతిథేయముం
గొనకొని చేయ శీఘ్రముగ ♦ గోవును నర్ఘ్యజలంబుఁ బ్రీతిఁ దె
చ్చెను ఫలమూలకల్పితవి♦చిత్రరసాన్నము నిచ్చి వారలన్. ౧౭ 2043

తే. గారవింప నివాసంబు ♦ క్రమ్మరీతి
నేర్పఱించెను; దర్వాత ♦ నెలమిఁ బక్షి
మృగములెల్లను దనచుట్టు ♦ మిగులు తనదు
శక్తి రామునిశక్తిని ♦ నరగఁ గొలువ. ౧౮ 2044

క. మునులను గూడియె శ్రీరా,ముని రాకకు నలరి మౌని♦ముఖ్యుఁడు ప్రీతిం
గనిపూజించుచు స్వాగత,ము నడిగె రాముండు దమిని ♦ మునిపూజం గొనెన్.

సీ. తనపూజ గ్రహియించి ♦ తగఁ గూరుచున్న రా
మునిఁ గాంచి యమ్మౌని ♦ యనియె ధర్మ
సంయుక్తముగ రామ♦చంద్ర! నీవిచటికిఁ
జిరకాలమునకు వ♦చ్చితివి చూడఁ
గలిగితి నిన్ను ని♦ష్కారణంబుగ వన
మునకుఁ బంపుటయును ♦ వినినవాఁడ
మనమున ధ్యానించు♦చునె యుంటిఁ గన్నుల
నెదుట నిప్పుడు కంటి ♦ నేమి చెప్ప
తే. వాఁడ, నాభాగ్య మియ్యది ♦ భవ్యపుణ్య
నదులు కలిసెడు స్థలము జ♦ననికరవిర
హితము రమణీయమునగు నీ♦విందు సుఖము
గా వసింపుము రామ! శ్రీ♦కలితధామ!. ౨౨ 2046

క. అనుచు భరద్వాజుఁడు చెప్పిన వాక్యము నాలకించి ♦ వితతజనహితం
బును గోరు రాముఁ డమ్ముని, కనియెన్ శుభవాక్కులొప్ప♦నటుమహితాత్మా!.

*క. పురజనపదవాసులకీ, ధరణీస్థల మంతికముగఁ ♦ దనరారెడు ని
త్తరుణిన్ ననుఁ గనఁ గోరెడు,పురుషులునులభముగఁజూడఁ♦బోలునటంచున్.

*ఆ. తలఁచి వత్తురనుచుఁ ♦ దలఁచెద నిచటికిఁ, గాన నిందు నుంట ♦ మానసమున
కింపుగాదు జనుల ♦ కేరికిఁ దెలియని,దౌ రహస్స్థలంబు♦నందె యెలమి. ౨౫

*క. జనకజ సుఖమునె పొందం,గను జాలినదౌట సుఖము♦గా విహరింపం
గను దగిన యాశ్రమస్థల,మును జెప్పుము మదిని నెన్ని ♦ మునిగణతిలకా!. ౨౬

సీ. సకలమెఱింగిన ♦ జాణవు రావణుఁ జంప గూఢమ్ముగ ♦ క్షమ జనించి
నట్టి నారీతుల ♦ నందఱకుం దెల్పితేని విష్ణువుగ న♦న్నెఱిఁగి సీతఁ
బద్మజగానెంచి ♦ పరికింప వత్తురు కానఁ బ్రసిద్ధంబు♦గా వసింప
నొల్లను; గావున ♦ నురుతరమహిముఁడనైన నాయందు నీ♦జానకి తగు
జగముల కాధార♦ముగ నొప్పి బ్రహ్మరుద్రాదులకంటె న♦త్యధికతఁ దగి
ఆ. యున్న నన్ను నీవ ♦ యెక్కుఁడవే యతి
ప్రియుఁడ వగుట నొంట♦రిగనె దెలిసి
కొనుము భూసురేంద్ర! ♦ గుహ్యరూపమ్మును
దెలియపఱపఁ బూన♦వలదు సుమ్ము!. 2051

* ౨౪, ౨౫, ౨౬ శ్లోకములకు. మహేశ్వరతీర్థులవారు సామాన్యార్థమును వ్రాసి "వాస్తవార్థస్తు" అని వ్రాసినందునఁ బ్రత్యేకముగా నిట సీసపద్యము చెప్పఁబడినదని యెఱుంగవలయు.

క. అనియె, భరద్వాజుఁడు రా,ముని శుభవచనముల విని ప్ర♦మోదంబున రా
మునితో నర్ధగ్రాహక,మునయి తగం బల్కె విను సు♦ముఖముగ వత్సా! ౨౮
సీ. మునిజన సేవితం♦బును బవిత్రమునయి కనుఁగొనఁగ సుఖదం♦బునయి యిచటి
కిని బదిక్రోసులఁ ♦ గనఁబడు గిరియొండు చిత్రకూటాహ్వము♦చేఁ జెలంగుఁ
గోఁతు లెలుంగులుఁ ♦ గొండముచ్చులు నందు గల వమ్మహాగిరి ♦ గంధమాద
నాద్రికిఁ దుల్యమై ♦ యలరారునది నీకు వాసయోగ్యంబయి♦వఱలు, నరుఁడు
ఆ. చిత్రకూటశిఖరి♦శృంగంబులను నెప్డు
గనునొ యప్పుడె యతని♦మనము పాప
చింతఁ బూనకుండుఁ; ♦ జెచ్చెఱ శుభకార్య
మందె యతనిబుద్ధి ♦ యలరుచుండు. ౩౦ 2053
క. మునివరులెందఱొ యచ్చట, మన మలరం గ్రీడ సల్పు♦మాడ్కిఁ బెనుతపం
బును శతవత్సరములు భ,క్తిని సల్పి తదీయమహిమ ♦ దీపించుటచేన్. ౩౦
తే. పట్టుదలచేఁ గపాలాఖ్యఁ ♦ బరఁగు నాస
నమును వేయుటఁ జర్మకే♦శములు వీడి
యొక కపాలమె మిగుల, గా♦త్రకలితులయి
స్వర్గమును జేరినారు పా♦వనమునీశ!. ౩౧ 2055
క. జనసంకుల విరహితమై, కనుపట్టును జుమ్మి! యద్రి♦గావున నట నీ
వు నివాసము చేయఁగ వ,చ్చునని మదిన్ నాకుఁ దోఁచె ♦ శుభగుణనిలయా!
తే. ఇందునైనను నాతోడ♦నే వసించి
నీదు వనవాసనియమంబు ♦ నిశ్చలముగఁ
దీర్చుకొనుమని పల్కె యా♦దివ్యమౌని
ధర్మవిదుఁడౌట రామభూ♦తనయులకును. ౩౨ 2057
క. అతని ప్రియానుజునకు వే, యతిథి ప్రియకృత్యవితతి ♦ నాదరమునఁ జే
సి తగన్ వారల వశ్యుల, నతిముదితులఁ జేసికొనియె ♦ నాక్షేత్రమునన్. ౩౩
క. ముని చెంత వసించియె య,జ్జనకసుతాభర్త మిగులఁ ♦ జతురకథలనె
ల్లను జెప్పుచుండఁగాఁ బా,వననిశ యరుదెంచె నంత ♦ వారలు మువురున్.
క. అనిశము సుఖమునె పొందం,గను దగియున్ బడలి మిగులఁ ♦ గాంతం బగున
మ్మునియాశ్రమమున నారా,త్రిని సుఖముగఁ బుచ్చి రెంతొ♦తృప్తివరఁగన్.
చ. పురుషలలాముఁడైన రఘు♦పుంగవుఁ డంతటఁ దెల్లవాఱఁగా
ధరణిసురర్షి తేజున ని♦తాంతము వెల్గఁగఁ గాంచి మౌనిదా
పరిసరమొంది యిట్లనియెఁ ♦ బావనశీల! మహాత్మ! మీకృపం
బరమసుఖంబుగా నిశను ♦ వాసముచేసితి మిందుఁ జక్కఁగన్. ౩౬ 2061
క. మునివర! మీరానతి ని,చ్చిన నింకను వసతి నిపుడె ♦ చేరెద మాజ్ఞన్

గొనుదు మొసంగుమయనఁగా, మునియును నిశయరుగ భవ్య♦మూర్తిని రాముఁడ.

సీ. కనుఁగొని పల్కెఁ దీ♦యని ఫలంబులు మూల
　　　ములును దేనెయు నందు ♦ నలరుచుండుఁ
గాన నీవచటికి♦క్కడ నుండి పోమ్ము మ
　　　హాబలా! వాసమ♦య్యదియె నీకుఁ
దగియుండఁ గలదని ♦ తలఁచెద నయ్యద్రి
　　　బహువృక్షయుక్తమై ♦ పరఁగు; గిన్న
రోరగ సేవ్యమై ♦ యొప్పి మయూరని
　　　స్వనములఁ దనరారి ♦ సామజేంద్ర
తే. సేవితంబయి ధరలోనఁ ♦ బావనమయి
రమ్యఫలమూలయుక్తమై ♦ రాజిలుఁ గదు
నట్టి యాచిత్రకూటాద్రి ♦ కరుగవయ్య
రామ! సుగుణాభిరామ! శ్రీ♦రమ్యధామ!. ౪౦½ 2063

చ. అతిరమణీయ భూధరవ♦నాంతరసీమలఁ గుంజరావళుల్
సతతము సంచరించు మృగ♦జాలములుం దిరుగాడుచుండు సం
తతమును జూడఁగాఁ గలవు ♦ తద్గతి వైఖరులెల్ల నిర్ఝర
ప్రతతి, ప్రవాహముల్ చఱులు ♦ బండలు కూడెడు పట్టు లొప్పెడుఁ. ౪౧
తే. గుహలు పాషాణసంధులు ♦ కొమరు మీఱి
యుండు జానకితోఁగూడి ♦ నిండుమదిని
దిరుగుచుం జూచునప్పుడు ♦ దివ్యశిఖరి
వైభవము నీదు మదికిని ♦ భవ్యమగును. ౪౨½ 2065

చ. విను మటఁ గొక్కెరల్ సమద♦వృత్తినెసంగు పికంబు లట్టె ని
స్వనములు చేయఁగా బహుళ♦సామజముల్ మృగముల్ చరించి సొం
పును గలిగింప నొప్పు శుభ♦భూధరవర్యముఁ జేరి యందు సీ
తను ననుజన్ముఁ గూడి సుఖ♦ధాముఁడవై వసియింపు రాఘవా!. ౪౩½ 2066

ఏఁబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౫౫ - వ సర్గము

—చిత్రకూటాశ్రమ గమనము, యమునానదిని దాఁటుట.—

క. అరిదర్పభంజనులు భూ,వరపుత్రులు వారు రాత్రి ♦ వసుధామరు మం
దిరమున వసించి వేగిన, తరుణమ్మున మునికి మ్రొక్కి ♦ తద్గిరిఁ గనఁగన్. ౧
క. అరిగిరి మహర్షి మంగళ, కరవాక్యుల నాశిషములఁ ♦ గావించి ప్రయా
ణరతిని వారలు పొందఁగఁ, బరికించి ముదంబు పేర్మి ♦ వారలతోడన్. ౧½

క. తనయులను వెంబడించెడు, జనకునిగతి వెంటఁబోయె ♦ సమధికతేజం
బున నలరు భరద్వాజుం, డనియెన్ సార్థకపరాక్ర♦మాఢ్యులతోడన్. 3 2069

సీ. మనుజసింహములార! ♦ మహితగంగానదీ యమునలు గలిసియు♦న్నట్టి చోటి
కరుగుఁడు తొలుదొల్త ♦ నచ్చటనుండి మీరలు జహ్నుపుత్రికా ♦ సలిలవేగ
మునఁ ద్రోయఁబడినంత♦వెనుకకుఁబర్చి యమునకుఁబాఱెడుయము♦నను దగంగ
ననుసరించుచుఁ బోయి♦యమున వేగమ్ముగఁ బ్రవహించుచున్నట్టి ♦ వసుధకేగి

తే. జనులు పూర్వమునుండి య♦మునను దాఁటు
చుండు తీరంబుఁ జేరి యం♦దొక్క తెప్పఁ
గట్టుకొని దాఁటుఁడీ! రఘు♦కాంతులార!
యవలనందొక్క వటవృక్ష ♦ మలరుచుండు. ౬ 2070

సీ. పచ్చనియాకులఁ ♦ బరిఢవిల్లుచుఁ బెక్కుపాదపంబులు చుట్టు ♦ బలిసియుండ
సిద్ధసేవితమయి ♦ చెలఁగు శ్యామాహ్వయమున నొప్పు నయ్యది♦ఘనతరంబు
సీత యద్దానికిఁ ♦ జేతులు ముకుళించి వాంఛాప్రపూర్తికై ♦ ప్రార్థనములు
సలుపఁగాఁ దగు; సీత ♦ యలసి యుండునయేని యందు వసింప నొ♦నట్లు లేక

తే. పోయినన్ మీరలవ్వలఁ ♦ బోవనచ్చ
నచ్చటికిఁ గ్రోశమాత్రంబు ♦ నరిగినంత
నచటఁ గన్పడు నల్లని ♦ యడవి యొండు;
మోదుగులు రేఁగుచెట్లును ♦ మొనసియుండు. ౭ 2071

క. వినుఁడీ యమునాతీరం,బునఁ బుట్టిన వెదురుజొంప♦ములు ముచ్చటగాఁ
గనఁబడుచుండును బర్వత,మునకేగెడు మార్గమదియె ♦ ముఖ్యము సుండీ!. ౯

క. పలుసారులు నేఁ బోయితి, నలమార్గము నాశ్రయించి ♦ యద్రికడకు ని
మ్ములఁ జూడ రమ్యమై తగు, సులలితమై యుండు నడువఁ♦జొచ్చినవేళన్. ౧౦

క. వనవహ్నిబాధలుండవు, చనుఁ డమ్మార్గమున నంచు ♦ సాధుమునియు రా
మునకున్ మార్గముఁ జెప్పుచుఁ, దనయాశ్రమమునకుమరలఁ♦దాఁగనిభక్తిన్.

క. మునిపతికి మ్రొక్కి యింటికిఁ, జనుఁ డర్లే పోదమనుచుఁ ♦ జతురోక్తులతో
ననుపఁగ ఘూనియుఁ జనఁగా, ననుజునిఁగని రాముఁడిట్టు♦లనియె మనమిఁకన్.

తే. పుణ్యచిత్తులమే మాని ♦ భూవిభుండు
మనల దయనాదరించెఁగా ♦ యనియె నిట్లు
మానసస్థైర్యమున నొప్పు ♦ మనుజపుంగ
వులగు వారలు యోచించి ♦ యలఘుగతిని. ౧౨ 2076

చ. జనకజ ముందుఁ బోఁ బనిచి ♦ సాధ్వివిఱుందనె పోయి సూర్యపు
త్రిని గని భూరివేగమునఁ ♦ దేఁకువ మీఱఁగఁ బాఱుచుండుఁ గా

వున నీకె నెట్లు దాఁటనగుఁ ♦ బొంకముగా ననుచింత దోఁప రా
ట్తనయులు వారలిర్వురును ♦ దారువులం గొని వచ్చి వానితోఁ. ౧౩౹ 2077

తే. ఎండిన వెదుళ్లనుం గూర్చి ♦ యెట్లు కట్ట
నగునో యని వట్టివేళ్లతో ♦ నపుడు గట్టి
పెద్ద తెప్ప నిర్మించిరి ♦ వీర్యవంతుఁ
డైన సౌమిత్రి మదిలోన ♦ నరసియంత. ౧౪౹ 2078

క. చని ప్రబ్బలితీగలనుం, గొని నేరెడు చెట్ల లేఁత♦కొమ్మలఁ గొన్నిం
టిని నతికి తెచ్చి పఱచుచు, జనకజకు సుఖాసనంబు ♦ సమకూర్చె నటన్.

క. సరసీజాలయవలె ని,ర్భరలావణ్యమున వెల్గు ♦ భార్యను దనదా
కరమూఁతఁగ గొనమందా, తురతన్ సుంతగొనుదానిఁ ♦ గని రాముండున్.

క. మానినిని దెప్పపయికిన్, దా నెక్కించెను దదీయ♦శతభూషణముల్
భూనాథుఁడు వస్త్రమ్ముల, జానకి పార్శ్వమున నునిచెఁ ♦ జతురత దోఁపన్.

తే. మఱియు గుద్దలి, మేకచ♦ర్మమునఁ గప్పఁ
బడిన పుటికను నాయుధ♦వారములను
సీతచెంతనె యునిచె; నా♦భూతలాధి
పాత్మజులు వీరులగుట నో♦య్యనఁ బ్లవంబు. ౧౮ 2082

ఉ. చక్కఁగఁ బట్టి దానిపయి ♦ జానకి నెక్కఁగఁజేసి యంతఁ దా
మెక్కి ప్రయత్నమొప్పనటు ♦ లేర్పడఁగా నడిపించి దానిఁ; దా
రక్కడ నొడ్డుఁజేరిరి యి♦లాత్మజ యానదిమధ్యభాగమం
దక్కటికంబుతో నదికి ♦ నంతట వందనముల్ పొనర్చుచున్. ౧౯ 2083

సీ. యమునాంబికా! నేను ♦ సుమహితవౌ నిన్ను దాఁటుచున్నాను నా♦దైవతమగు
పతి వనవాసన♦వ్రతముఁ దీరుచునేని చక్కఁగా నిక్ష్వాకు♦సాధునృపులు
పాలించినట్టి యా♦పత్తనంబును క్షేమముగఁ జేరనంత నే ♦ మోదమొప్ప
గోసహస్రము నిత్తుఁ ♦ గుంభినీసురులకు శతఘట మద్యంబు ♦ సమధికమగు
తె. భక్తి నైవేద్యముగ నిచ్చి ♦ ప్రణుతిచేయు
దాన నిన్నని ప్రార్థించి ♦ తనకరములు
మోడ్చి మ్రొక్కుచు దక్షిణ♦మునఁ జెలంగు
గట్టుఁ జేరెను మిగుల సు♦ఖముగ నంత. ౨౦౹ 2084

క. అతివేగంబునఁ బాఱుచు, నతులితభంగములమించి ♦ యవనీజములు
ద్ధతి నిరుగట్టులఁ దగను,న్నతి మించెడు యమునఁ బ్లవము♦నన్ దాఁటి రొగిన్.

ఉ. వారలు సూర్యపుత్త్రిక న♦భంగవిలాసము మీఱ దాఁటి త
త్తీరమునం బ్లవంబు నిడి ♦ ద్వీపవతీవనసీమలం బ్రియం

బారఁ బ్రయాణమై చనుచు ♦ శ్యామ మనం జను మఱ్ఱివృక్షముఁ
హరితరంబు శీతలము ♦ నై తగు దానిని జేరి రంతటన్. ౨౩౪ 2086
తే. హరితపర్ణంబులం బెక♦గారుదాని, చెంతకుం బోయి భక్తిచే ♦ సీతపలికె
నో మహావటవృక్షమా! ♦ నేనుమలర, నా నమస్కారములఁ గైకొ ♦ నంగవలయు.
క. వనవాసవ్రతమును నెమ్మిని నాపతి జరుపుఁ గాక ♦ మిగులఁ దమిని నే
నును గౌసల్య సుమిత్రను, ఘనకీర్తిని ద్వరఁగఁ గాంతుఁ ♦ గాక సుఖముగన్.
క. అని కైమోడ్చి ప్రదక్షిణ,మును జేసెను దాని; కంత ♦ మునుకొని తనయా
జ్ఞను మీఱక మెలఁగెడు సీ,తను సన్నుతచరిత వాంఛి♦తముఁ గోరుసతిన్.
చ. కనుఁగొని రాముఁ డాదయిత ♦ కాననసీమలఁ గష్టమొందెనో
యని పరికించి లక్ష్మణున ♦ కయ్యెడ నిట్లని చెప్పెఁ దమ్ముఁడా!
వనితను వెంటఁ బెట్టుకొని ♦ భవ్యగతిం దగ ముందు పొమ్ము మీ
వెనుకనె సాయుధుండనయి ♦ వేగమ వచ్చెదఁ బూరుషోత్తమా!. ౨౭౪ 2090
క. జనకజ ఫలంబుఁ బుష్పం,బును దేనిని గోరునొక్కొ ♦ పొలఁతి మనసు దే
నిని జూడ నింపుఁ గనునో, యనుజా! యద్దానిఁ దెచ్చి ♦ యాదృతి నిమ్మా!.
క. అనియె నట వారలిద్దరు, చనుచుండఁగ వారినడుమ ♦ జనకాత్మజ యొ
ప్పెను మదగజముల నడుమన్, గనుపట్టు శుభద్విపేంద్ర♦కామిని వోలెన్.
సీ. జానకి ముందెప్డు ♦ తాను జూడని వృక్షమును గాని, చిఱువృక్ష♦ములను గాని
పుష్పంబులం జాలఁ ♦ బొలుపొందు లతఁగాని చూచినయప్పుడు♦సొక్కి రాము
నదియేమి? యిదియేమి? ♦ యనుచుఁ బ్రశ్నించును జానకి కోరిన♦దాని నెల్ల
వెంటనే సౌమిత్రి ♦ విమలపుష్పోత్కట బహుభూజశాఖలఁ ♦ బరమముదము
తే. మీఱఁగాఁ దెచ్చి యిచ్చును ♦ మించుఁ బూన్కి
వారుపోవుచునుండఁ ద♦త్తీరముననె
చిత్రసికతాజలంబులఁ ♦ జెలఁగి హంస
సారసస్వనముల నొప్పు ♦ శైవలినిని. ౩౨౪ 2093
క. కనుఁగొని సీతయు మోదముఁ, గనుచుండెను సోదరు లిటు♦గడువడి యమునా
[1]వనమున నొకక్రోశంబును, జని [2]మేధ్యమృగాళిఁ జంపి ♦ జానకితోడన్.
చ. తిని రిటు తీవ్రకష్టవిత♦తిం గనుచుండియు దీనభావముం
గనని మొగంబు లొప్ప శిఖి♦కమ్రరవంబులు మ్రోయఁ గోఁతులున్
ఘనగజముల్ తగం దిరుగఁ♦గాఁ గనపట్టు వనిన్ జరించి య
జ్జనకజ మెప్పుఁ బొందఁదగు ♦ చక్కని భూమి వసించి రొక్కటన్. ౩౮౪

ఏఁబదియైదవ సర్గము సంపూర్ణము.

---

1 వనము=నీరు. 2 మేధ్యమృగాళిని=పవిత్రమృగసంఘములను.

౫౬ - వ సర్గము.

-రామాదులు వాల్మీకి యాశ్రమమునకుం బోవుట.-

క. ఆరేయి గడువ నంతట, శ్రీరాముఁడు నిద్ర లేచి ♦ చెచ్చెఱఁ జెలుని
ద్రారతుని ననుజు మెల్లఁగ, నేరుపునన్ మేలుకొలిపి ♦ [1]నిఖిలరిపుహరా!. ౧

క. వినుమా [2]శుకపికశారికె,లను వన్యపతత్త్రులెల్ల ♦ హాయిగఁ గూయం
గను దొడఁగెఁ బయనమున కిది, యనుకూలముగాన నింక♦నరుగుదమనియెన్.

ఆ. నిద్ర వోవుచుండి ♦ నెమ్మిని రాముండు, కాలమగుటఁ దన్ను ♦ మేలుకొలుపఁ
దెలిసి లక్ష్మణుండు ♦ గలిగిన ప్రాల్మాలి,కను సుషుప్తిశ్రమను ♦ గడఁగి విడిచె. 3

సీ. తరువాత నారలం♦డఱు లేచి యమునా శుభజలంబులను బ్రొద్దు♦నజరపఁదగు
స్నానాదులం దీర్చి ♦ సాధు భరద్వాజముని చెప్పినట్టి త్రో♦వను దగంగఁ
జిత్రకూటమునకుఁ ♦ జేరంగఁ బోయిరి; తగినకాలమ్మునఁ ♦ దాను రాముఁ
డరుగుచు ననుజుతో♦నబ్జాక్షి సీతతోఁ దొలిబుతువునను మో♦దుగులునాల్గు
తే. తట్ల నెఱ్ఱఁగఁ బూచి ని♦తాంతవహ్ని
తమ్ముఁ దగులంగ మాడు చం♦దమున నొప్పి
స్వీయపుష్పంబులనె పూన్కి ♦ చెలఁగ హార
ములను ధరియించి యున్నట్లు ♦ చెలఁగెఁ గనుమ!. ౬ 2099

చ. కనుమవె జీడిచెట్లు సుమ♦కాండములెల్లెడ నిండనొప్పి యే
జనులకు దుర్గమంబులయి ♦ సారఫలావళి పత్త్రభార యు
క్తిని దగ వంగి యున్నయవి ♦ తెల్లముగా నివియన్ని యీస్థలం
బునఁ గననయ్యె నాకు నిటఁ ♦ బొందుగ జీవిక సాగుఁ గోమలీ!. ౭ 2100

క. అనుమానమె లేదని తన, యనుజుం గని పల్కె నోప్రి♦యానుజ! యిదిగో
కనుమా! [3]నలుదూములకొలఁదిని మించుచునున్న తేనె♦తెట్టె లలరెడున్.

తే. తేనెటీఁగలు గూర్చె ని♦వ్వాని నివ్వి
ప్రతిమహీరుహమందును ♦ బలసి వ్రేలు
చున్నయవి, పుష్పములు రాలి ♦ యొప్పు మీఁఱఁ
బరపువలె నుండ నలరు నీ♦వనతలమున. ౯ 2102

తే. వానకోయిల కూసెడు ♦ దానికిఁ బ్రతి
గాఁగ నెమిలియుఁ గూసెడుఁ ♦ గనుమ! యదిగొ
యిద్దియే చిత్రకూట మి♦దేనుఁగుల స
మూహ మెల్లెడ వ్యాపించెఁ ♦ బోలుఁ గనఁగ. ౧౦ 2103

1 ప్రస్థానస్య పరంతప-అనిమూలము. 2 వన్యానాం విల్గు వ్యాహరతాంస్స్వనమ్-అనిమూలము. వన్యానాం శుకపికశారికాదీనాం-అనివ్యాఖ్య. 3 పశ్యద్రోణప్రమాణాని-ద్రోణమ్ ఆఢకచతుష్టయం అని వ్యాఖ్య.

క. కలవరము లొప్పఁ జేయుచు, విలసిల్లెడు పక్షిగముల ♦ విను మున్నతిచేఁ
జెలఁగెడు నీగిరిశిఖరము, శిలాతలం బిందు సమమె♦యే యయి తనరెన్. ౧౦౪

సీ. అతిరమ్యమయి యొప్పు♦వితతభూధరమున బహువిధవృక్షముల్ ♦బలసియుండుఁ
బావనంబును నగుఁ ♦ గావున మన మందు విహరించుచుందము ♦ వింతగాఁగ
ననియె; నంతట వార ♦ లవనిజతోఁ గూడఁ గాల్నడఁ జనుచును♦గాంతమమల
మునగు నగ్గిరిఁ జేరి ♦ రనఘమహా భూద్రుమయ్యాది బహుపక్షిగ♦ణాన్వితమయి
తే. వివిధఫలమూలములతోడ ♦ వెలసి రమ్య
మగుచు సంపన్నమయి సర♦సాంబువు నయి
తనరుచుండును, సహజులు ♦ ధాత్రిపుత్రి
యును బ్రవేశించి రందు నె♦మ్మనము లలర. ౧౩ 2105

క. ఈగిరి చూడం జూడన్, బాగై కనుపట్టె నిందు ♦ బహుభూమీరు [త్రన్.
ట్పూగము లతలును బెడఁగై, మూఁగెన్ ఫలమూలములును♦మొనయురుచిర

క. ఈగతిని మనోజ్ఞతమము,గాఁ గనుపట్టెడిని సుఖము♦గా నిందే నిం
పౌగతి వసనవచ్చునుగా?, యోగా దిలి లక్ష్మణా! మ♦దుద్యమ మిదియే. ౧౮

క. విను మఱియు నీమహీధ్రం,బున మహితాత్ములయి పొల్చు♦మునులు గలరు కా
వున మన కిద్ది నివాసం,బునకుం దగి యుండఁ జాలుఁ♦బో మనమింకన్. ౧౭

తే. క్రీడసేయుచు నుంద మీ♦గిరివనముల
ననుచు నొండొరులకుఁ జెప్పు♦కొనుచు ముగురు
నచట [1]వాల్మీకి మునియున్న ♦ యాశ్రమమున
కరిగి చేమోడ్పులను మ్రొక్కి ♦ రతని కెలమి. ౧౬ 2109

చ. అతఁడును ధర్మవేత్తయు సు♦హార్దియుఁ గావున వారి రాక కు
న్నతముదమొంది వారలను ♦ నైజవిభూతికి నీడుగాఁగ న
ర్చితులును జేసి స్వాగతము ♦ చెప్పి యొనర్చెను గూరుచుండఁగా;
నతివృఢదీర్ఘబాహుఁడగు ♦ నారఘువీరుఁడు నంత మౌనితోన్. ౧౨౪ 2110

మ. తనవృత్తాంతము నెల్ల సక్రమముగాఁ ♦ దాఁ జెప్పి సౌమిత్రినిం
గని సౌమ్యా! దృఢవృక్షశాఖలఁ దగం♦గాఁ దెమ్ము, శ్రేష్ఠంబులై
కనుపట్టం దగు నవ్వి సద్మముసయిం ♦ గాంక్షల్ చెలంగెన్ జవం
బున నవ్వానిని దెచ్చి గట్టుము గృహం♦బుం గాపురం బుండఁగన్. ౧౯ 2112

చ. అరినికరాంతకుండయిన ♦ యట్టి సుమిత్రకుమారుఁ డన్న య
క్కఱణిని జెప్పఁగా విని త♦గం బలుమ్రాకులఁ గొట్టి తెచ్చి కా
పురమున కెంతొ యోగ్యమయి ♦ పొల్చు మనోహరపర్ణశాలనుం

---

1 వాల్మీకి తొలుతఁ జిత్రకూటమున నుండెను. తర్వాతఁ దమసానదీతీరమున నివసించెనని వ్యాఖ్యాతలభావము.

గరమరుదైన పద్ధతిని ♦ గట్టెను రాఘవుఁడంత నాకృతిన్. ౨౦ 2112
సీ. వర్ష వాతాదికో♦పద్రవములఁ గూడ నచలమై యావర♦ణచయ మలరఁ
గడుమనోహరమయి ♦ కన్పడు నాపర్ణశాలను గని పరి♦చర్య సేయు
చుండియుఁ దనకన్న ♦ యుత్తరు వేమిచ్చునో యన్న శ్రద్ధయు ♦ నుల్లసిల్ల
నలరు లక్ష్మణుఁ జూచి♦యనియె; నైణేయమాంసముఁ దెచ్చియీపర్ణ♦శాలనున్న
తే. దేవతలనెల్ల నర్చింత ♦ మావిధమును
జేయఁగాఁ బూనుచుం జిరం♦జీవితఁ గనఁ
గోరువారలు గృహమును ♦ జేరకమును
వాస్తుశాంతిఁ జే♦యఁదగుఁ జుమ్ము. ౨౨ 2113
తే. ఓశుభేక్షణ! లక్ష్మణా! ♦ యురుజవమునఁ
బోయి యానల్ల యిఱ్ఱిని ♦ బూని చంపి
తెమ్ము పశువధసేయ దో♦షమ్మటంచు
శంకఁ బూనకు మెద్ది శా♦స్త్రము విధించు. ౨౨½ 2114
క. ఆపని చేయుట లెస్సయె, వే పల్కులిఁకేల శాస్త్ర♦విధిధర్మము సు
మ్మాపద్ధతికిం దగు శాస్త్రము,నే పరికింపుమని పల్క ♦ నింపు దనరఁగన్. ౨౩
క. పరవీరకాలుఁడగు రఘు,వరు ననుజుం, డన్న యప్డు ♦ పల్కినరీతిన్
ద్వరపడి నల్లని యిఱ్ఱిని, బరిమార్చి యొసంగె; రామ♦భద్రుఁడు మరలన్. ౨౩½
క. అనుజున కిట్లను మాంసం,బును బచనము సేయు దీని♦మునుకొని గృహముం
గనిపెట్టి యుండుదివిజుల, మన మొగి సేవింత మిద్ది ♦ మంచి సమయమా. ౨౪½
క. స్థిరమైన ముహూర్తము సు,స్థిరమైనది యీదినంబు ♦ చెచ్చెఱఁ బచనం
బు రమణఁ గావింపుము నాఁ, బరాక్రమసమగ్రుఁ డతఁడు♦బాణౌఘములన్.
తే. భక్ష్యమృగపంక్తిఁ జేరిన ♦ పావనమగు
నల్లయిఱ్ఱిని వధియించి ♦ యుల్లమలర
దాని మాంసముఁ బ్రజ్వల♦ద్దహనునందు
వైచి వండెను దత్పాత్రఁ ♦ బలలమెల్ల. ౨౬ 2119
క. విరహితరక్తంబై మఱి, పరిపక్వంబౌట నెఱిఁగి ♦ భ్రాతను బురుషో
త్కరవర్యుఁ గాంచి యిట్లను, సురసన్నిభ! రామచంద్ర!♦శుభగుణసాంద్రా!.
తే. *అవయవంబులతో దీని ♦ నగ్నివైచి
పచనముం జేసినాఁడ న♦వయవపంక్తిఁ
గలిసి పాకంబునన్ నల్ల♦గాఁ జెలంగు
ట నిది కృష్ణమృగాభమై ♦ కనఁబడియెడి. ౨౭½ 2121
క. నీవింక వాస్తునిర్జర, సేవ యొనర్పంగవలయు ♦ శ్రేష్ఠుండవు త

* అయంకృష్ణ స్సమాప్తాంగః-అని మూలము

త్పావనకృత్యము చేయఁగ, నీవే యన సుగుణశాలి ♦ నియమము మీఱన్.

సీ. జపియింపఁదగు మంత్ర♦సమితి నెఱింగిన పండితుండగుటచేఁ ♦ బరమభక్తి
స్నానంబొనర్చి త♦చ్ఛాంతికర్మము సమాప్తము నొనట కనువగు♦భవ్యమంత్ర
గణము సంక్షేపమ్ము♦గా జపించుచు వాస్తుకర్మమ్ములం జేసెఁ; ♦ గడఁగి యిట్లు
వాస్తుదేవతలను ♦ వరుసగాఁ బూజించి పరిశుద్ధుఁడై చేరెఁ ♦ బర్ణశాల
తే. నమితతేజంబునన్ వెల్గు ♦ నతని మదికి
దానివలననె గలిగె సం♦తసము; పిదప
వైశ్వదేవంబునం దగు ♦ బలిని రుద్ర
బలిని మఱి వైష్ణవం బగు ♦ బలినొనర్చి. ౩౨ 2123

సీ. వాస్తుశాంతికి గ్రహో♦పద్రవశాంతికిఁ దగి శుభకరములై ♦ తనరునట్టి
పుణ్యాహవాచనం♦బుల శాంతిజపముఖముల నొనర్చుచుఁ గ్రమ♦మ్ముగనుభక్తి
మంత్రంబుల జపించి ♦ మరల యథావిధి నదికేగి యందు స్నా♦నం బొనర్చి
సకలపాపౌఘప్ర♦శాంతికై సర్వభూతవిషయమైన యు♦త్తమ బలినొగి
తే. నాచరించుచు బలిహర♦ణాదులైన
వేదికల దేవతాస్థాన♦వితతి నగ్ని
మందిరంబుల నాయాశ్ర♦మమునకుండఁ
దగినరీతిగఁ జేయించెఁ ♦ దరణికులుఁడు. ౩౩ 2124

చ. అలరెడు సాధులక్షణగ♦ణాంగులు రాఘవు లిద్దఱంతటన్
ఫలములఁ గందమూలముల ♦ వన్యసుమాయతహారపంక్తి ని
చ్చలుఁ బరిపక్వమాంసముల ♦ సాధుతరామృతతర్పణంబులన్
సలలితవేదమంత్రజప♦సంగతిఁ జారుసమిత్కుశాదులన్. ౩౪ 2125

క. న్యాయము తప్పక యుండఁగ, నాయాభూతములఁ దృప్తి ♦ నందించుచు సీ
తాయుతులై తచ్ఛాలను, గేయంబును జేరి రదియుఁ ♦ గేవల మింపై. ౩౫

సీ. అవనీజ పర్ణస♦మాచ్ఛాదితంబయి యతిమనోజ్ఞంబయి ♦ యర్హరీతి
శాస్త్రోక్తముగఁ బాక♦శాలాదు లేర్పఱుపఁబడుట నందమై ♦ పవనుబాధ
నందకుండందగి ♦ యలరారు నాపర్ణశాల సుధర్మయన్ ♦ సభను దేవ
తలు ప్రవేశించు చం♦దమున వసింపంగ వారు చొచ్చిరి; తరు♦వాటి నిర్జి
తే. తేంద్రియులగు నామువ్వురు ♦ హితబహువిధ
పక్షిసంకులమై చిత్ర♦భవ్యకుసుమ
గుచ్ఛ రాజద్ద్రుమంబులఁ ♦ గూడి కరిమృ
గస్వనంబుల మ్రోయుచుఁ ♦ గ్రాలు దాని. ౩౬ 2127

క. ఆయుత్తమమగు వనమున, న్యాయంబగు రీతి సుఖవి♦హారంబులచే
నాయన్నదమ్ములును మఱి, యాయతివయు ముదము నొందిరి♦రల రాముండున్.

తే. అందమగు చిత్రకూటంబు♦నందుఁ జేరి
మంచి రేవున మించు న♦మ్మాల్యవతిని
గనుచు ముదమంది పురివిడి♦చిన వగలను
బాసి విహరించుచుండెను ♦ భార్యఁ గూడి. ౩౮ 2129

ఏఁబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౫౭ - వ సర్గము.

-- సుమంత్రుఁ డయోధ్యఁ జేరుట. --

సీ. భాగీరథీ యామ్య♦భాగంబు రాముండు
చేరఁగ మిక్కిలి ♦ చింతనొంది
రాముండు చూపుమే♦రను దాఁటి చనుదాఁక
నందె యుండి రఘూద్వ♦హామలగుణ
ములను సుమంత్రుతో ♦ ముచ్చటించుచు వానిఁ
దోడ్కొని గుహుఁడును ♦ దుఃఖముననె
యిలు సేరె; రామము♦ఖ్యులు భరద్వాజుని
యాశ్రమంబున కేగి ♦ యాప్రయాగ
తే. యందు నమ్మునితోఁ గూడి ♦ యలరుచుండు
టాదిగాఁ జిత్రకూటమ♦హాద్రికడకు
నరుగువఱకును జరగిన ♦ యఖిలవిషయ
ములను వేగులు నతనికిఁ ♦ దెలిపి రందు. ౨ 2130

క. తరువాత సుమంత్రుఁడు గుహు, పరిసరమున సెలవునొంది ♦ వాజులనపుడా
యరదమ్మునకుం బూనిచి, పురమునకుల్లంబు వగలఁ ♦ బొందం జనియెన్. ౩

క. కనుచుం ద్రోవను సుమవా,సనలం జెలువారు వనుల ♦ శైవలినుల, గ్రా
మనికరములఁ బురములఁ జ,ల్లని నీటఁ జెలంగు సరసు♦లం గనుఁగొనుచున్. ౪

*క. వానిని దాఁటి సుమంత్రుఁడు, తానా గుహునగరి విడిచి ♦ తరలినపిదపన్
గానంజనియె నయోధ్య ని,రానందఁ దృతీయదినప♦రార్ధమునందున్.

చ. కనుఁగొని యాత్మయందున వ♦గన్ గడుఁగుందినవాఁడుగాన ని
స్వనరహితంబుగాఁ గనఁగఁ ♦ బాడుపడం దగియున్న యప్పురం
బునకు మఱింతగా వగచి ♦ బుద్ధిఁ దలంచె; గజాశ్వయుక్తమై

---

*మొదటినాఁడు గంగాసంతరణము, రెండవనాఁడు భరద్వాజాశ్రమ నివాసము. మూఁడవ నాఁడు యమునాతీరనివాసము. నాల్గవదినమునఁ జిత్రకూటగమనము. ఐదవదినమున చారులువచ్చి వార్తలను దెల్పుట యని సంబంధము.

జన జననాథయుక్తమగు ♦ సాధుపురం బిది రామదుఃఖసం
జనితమహార్తిశోకశుచి♦శాఖల దగ్ధముగాక యుండునే. ౮ 2134

క. అని చింతించుచు నీప,త్తన మివ్విధి శబ్దవిరహి♦తం బయి కనుప
ట్టెను రాజేమయ్యెనో? యని, తనమదిఁ దలపోసి వేగ ♦ దా గుఱ్ఱములన్. ౯

ఆ. నడుచునట్లు తోలి ♦ నగరపరద్వార,మునను జేరి వేగ♦ముగఁ బ్రవేశ
నంబు చేసె నచటి ♦ నరు లాతఁడిటు రాఁగఁ, గాంచి వేలకొలఁది♦గాఁగఁ జేరి.

సీ. శ్రీరాముఁ డెక్కడఁ ♦ జెలఁగె నంచడుగుచు నతనికి నెదురుగ♦నంద ఱొక్క
మొగిఁ బరుగెత్తిరి; ♦ తగ వారితో నాతఁ డిట్లని పల్కె నే♦నేమి చెప్ప
వాఁడ జాహ్నవియొద్ద ♦ వరగుణచిత్తుని రాముని ధర్మని♦రతుని వీడు
కొని యామహాత్ముని ♦ పనుపున వచ్చితి మరలి యన్నన్ విని ♦ మనుజులెల్ల

ఆ. గంగ దాఁటిపోయెఁ ♦ గద రాముఁ డని విని
కనుల నీరు మోము♦లను దగంగ
నావరింప నిసిరో ♦ యయ్యయో యని యూర్పు
లెసఁగ రామచంద్రు ♦ నెన్నికొనుచు. ౧౧ 2137

క. పలువిధముల నేడ్చిరి వా,రలు గుంపులుగాఁగఁ గూడి ♦ రథమున నిందున్
జెలువారు రాముఁ గాంచం, గల భాగ్యము లేకపోయెఁ♦గా మన కింకన్.

సీ. అతనిఁ జూడఁగ నోచ♦కందఱముం జచ్చినట్టివారమె యైతి ♦ మరయ నింక
యజ్ఞదానంబుల♦యందు, వివాహంబునన్ గొప్పసభలందు ♦ నైజబుద్ధి
వైభవంబున వచ్చి ♦ పనులవ్వి చక్కఁగా జరపునాతని నొక్క♦సమయమందుఁ
గనుఁగొనమేమొ? యా♦తని నట్టిపనులందు మన కాజ్ఞ చేసియి♦మ్మాడ్కిఁ జేయఁ
దగునంచుఁ దెలుపంగఁ ♦ దనివితీఱఁగఁ జూడఁ జాలమేమో? మఱి♦జనుల కేది

ఆ. మంచి దెద్ది ప్రియము ♦ మఱి యేది సుఖదంబు
నౌనటంచు మదిని ♦ నరసి తండ్రి
సుతులఁ గాచునట్లు ♦ హితముగ నీపురిఁ
గాచుచుండె నెపుడు ♦ కరుణ మెఱయ. ౧౩ 2139

క. అని యొండొరులకుఁ జెప్పుచుఁ, గనుఁగవ నీటన్ మునుంగఁ♦గా నేడ్చెడు న
జ్జనములవచనావళులన్, వినియె సుమంత్రుండు, జాత♦విస్మయుఁ డగుచున్.

క. అరుగుచు నంగడివీథుల, నిరుపార్శ్వములందు మగువ♦లెల్లను దుఃఖా
తురతన్ దపించి యేడ్చుచు, గురువాతాయనములందుఁ♦గూడుటఁ గనియెన్.

క. తనుఁ గాంచి యిట్టులేడ్చెడు, వనితలదుఃఖారవముల ♦ వనరుచు వినుచున్
జనులన్ దుఃఖార్తులఁ దాఁ, గనుఁగొన లేకతఁడు తనమొ♦గము నటువంచెన్.

క. తనమోము నాజనంబులు, గనఁ జాలనియట్లు చేసి ♦ కడువడిఁ బెను వీ
థినడుమఁ దానేగుచు నృజ్జనపతి నివసించు గృహము♦చక్కటి కరిగెన్. ౧౭

చ. అరదము డిగ్గి శీఘ్రముగ ♦ నంత సుమంత్రుఁడు లోనఁ జొచ్చి భూ
వరునిఁ గనుంగొనంగ నర♦వారము మూఁగిన యేడుకక్ష్యలన్
ద్వరపడి దాఁటె నంత నృపు♦దారలు హర్మ్యవిమానముఖ్యమం
దిరములనుండి సారథిని ♦ దీనుని గాంచిరి తోట్రుపాటునన్. ౧౭ 2144

క. శ్రీరామునిఁ గానక యా, నారీమణులెల్ల వేద♦నం బొక్కుచు హా
హారవములు చేసిరి మఱి, యారమణులు దుఃఖబాధ♦నందుచు మిగులన్. ౧౮

ఆ. అతివిశాలములగు ♦ నత్తెలిగన్నులు
బాష్పవారిఁ దడిసి ♦ బడలియుంట
నొండొరులను జూడ ♦ నోపక చక్కఁగ
నెటులొ చూచుచుండి ♦ రెంతొ వగల. ౧౯ 2146

సీ. అంతసుమంత్రుఁ డ♦య్యవనీశదారలు ప్రాసాదములనుండి ♦ పరమదుఃఖ
పరితప్తహృదయలై ♦ పలుకులు తిన్నగా నమర "సుమంత్రుఁడీ♦యరదమున నె
రామునితోఁ గూడి♦రయమునఁబోయెఁగా నిపుడు రామునిఁ బాసి♦యిచటఁ జేరెఁ
గొడుకుశోకంబునఁ ♦ గుందు కౌసల్యతో నేమని చెప్పునో ♦ యీతఁడింకఁ

తే. దనయుఁ దరిగినఁ గౌసల్య ♦ తాన దెట్లొ
బ్రదికియున్నది కష్టమై ♦ పరఁగునిద్ది
యిట్టి కష్టంపు బ్రదుకు మ♦ఱెవ్వరికిని
దరము గాదని తోఁచె స♦త్యముగ నాకు." ౨౨ 2147

చ. అని మెలమెల్లఁ జెప్పుకొను♦నట్టి మహాకఠినంపుఁబల్కులన్
విని యవి సత్యవాక్యములె ♦ వింతలు గావని లోఁ దలంచుచున్
వనితలశోకవహ్నివగు ♦ జ్వాలల మండుచు నున్నయట్లుగాఁ
గనఁబడు వేంద్రమా మనుజ♦కాంతుని సౌధముఁ జొచ్చె వేగమే. ౨౩ 2148

తే. ఎనిమిదవ కక్ష్యఁ జేరి తె♦ల్లనగు సౌధ
మందు సుతదుఃఖమునఁ గడుఁ ♦ గుంది దీనుఁ
డగుచు నారాటమొందెడు ♦ నవనిపతినిఁ
గాంచి కూర్చున్నయాతని ♦ కడకు నేగి. ౨౪ 2149

చ. వలగొని మ్రొక్కి రాఘవుఁడు ♦ పల్కినదంతయుఁ ద్రోసిపుచ్చకే
కలఁగుచుఁ జెప్పె; నమ్మనుజ♦కాంతుఁడు మిన్నక వించునుండి య
ప్పలుకుల కుత్తరం బిడక ♦ భ్రాంతిని బొంది సుతవ్యథన్ మహా
కులమతియౌచు మూర్ఛఁ గని ♦ క్షోణిపయింబడె నంతఁ దత్సతుల్. ౨౫

క. పతి మూర్ఛ మున్గినంతనె, వితతంబగు దుఃఖమొంది ♦ పృథ్వీపయిన్ భూ
పతి పడినఁ జేతులెత్తి వి,గతధీరత నేడ్చిరంతఁ ♦ గౌసల్య త్వరన్. ౨౬ 2151

క. తనకు సుమిత్రయుఁ దోడ్పడఁ, దనపతి భూపతితు నెత్తి ♦ తగ నిట్లనియెన్

మనుజేశ! మహాభాగా, ఘనతరదుష్కార్య మొనరఁ♦గా జేసి వనిన్. ౨౮

తే. కాపురంబుండ నీచేతఁ ♦ గడఁగి పంపఁ, బడిన నీతనయుండు పం♦పంగ నతని
కాస్పదంబగు వనినుండి ♦ యరుగుదెంచి,నట్టి యీదూతతో మాట♦లాడ వేల.

క. నీతనయుని వని కంపితి, నీతిం దప్పితివి దాన ♦ నీవిటు లజ్జం
జేతంబునఁ బొందెద విది, యీతఱిఁ దగ దింక లెమ్ము ♦ పృథ్వీనాథా!. ౨౯

తే. పలికి బొంకని పుణ్యంబుఁ ♦ గలుగుఁ గాక
నీకు; నేలాటి లాభ మీ♦శోకమునను
గలుగ, దో దేవ! యెవతెకు ♦ నులికిపాటు
నొంది నీపుత్త్రవృత్తాంత ♦ మొక్కటైన. ౩౦ 2155

క. ఇతనింగని యడుగకయే, వెతలం బడుచుంటివో సు♦వృత్త యల కృపా
మతి కైక యిందు మెలఁగదు, గతసంశయమునను బలుకఁ♦గాఁ జనునింకన్.

క. అని పలికి శోకభారం,బునఁ గన్నుల నీరు గ్రమ్మఁ ♦ బొంకమెడలు వా
క్యనిచయము చెప్పి భూపతిఁ, గనుచున్ భూస్థలికి నొఱగెఁ ♦ గౌసల్య త్వరన్.

క. విలపించుచు ధరకొఱగిన, లలనన్ మూర్ఛిల్లి భూస్థ♦లంబునఁ దగు భూ
పలలామముఁ గాంచి తత్కాం,తలు పేరెలుఁగొప్ప రోద♦నము చేసి రొగిన్.33

తే. అంతిపురమున నేడుపు ♦ లట్లు కలుగ
విని పురింగల తరుణులు ♦ వృద్ధులైన
పురుషులును స్త్రీలు రోదనం♦బుల నొనర్చి
రప్డు పురమెల్ల దుఃఖమ♦యంబ యయ్యె. ౩౪ 2159

ఏఁబదియేఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౮ - వ సర్గము.

రాముని వార్తల సుమంత్రుఁడు దశరథునకుఁ జెప్పుట.

క. వనితోపచారముల న,మ్మనుజేశుఁడు మూర్ఛఁ దేఱి ♦ మమత సుమంత్రుం
గని యతని దిక్కు మొగమై, తనసుతువృత్తాంత మడుగఁ♦దలఁచి యతనితోన్.

సీ. పలుకుట కుంకించి♦పిలిచె సూతుని; నంతఁ దనయుని శ్రీరాముఁ♦దలఁచుకొనుచు
నేడ్చుచు దుఃఖంబు♦నే పొంది క్రొత్తగా బంధింపఁబడిన ద్వి♦పంబు భంగిఁ [గు
బరితాపమొందుచుఁ♦బలుమాఱునిట్టూర్పులనుబుచ్చుచున్ ధ్యాన♦మునఁ జెలం
నట్టు లేమియు దోఁప♦ కార్తినొందిన హస్తివిధమున వ్యాకుల♦వృత్తిఁ గనిన

తే. వృద్ధ నరపతిచెంతకు ♦ నేగుదెంచి
కరయుగము మోడ్చి నిలుచుండె ♦ నరపతియును

ధూళిగప్పిన యంగమ్ము ♦ తోడ బాష్ప
కలితముఖమున దీనతఁ ♦ గన్నయతని. ౭½ 2161

క. నిలుచున్నవాని సూతుని, గలవిలపాటొంది చూచి ♦ కడుఁ బూన్కి తగం
బలికె సుమంత్రా! విను సుఖ,ముల నెంతయుఁ బొంది ధర్మ ♦ ప్రార్థనుతియునై

క. తనరారుచున్న రాముఁడు, వనమున నేచెట్టక్రింద ♦ వాసముచేసెఁ
దినుచున్నవాఁడు వేనిని, విను మాతఁడు దుఃఖమనుభ ♦ వింపఁ దగఁడుగా!. ౮

సీ. తగినశయ్యఁ బరుండఁ ♦ దగినవాఁడాతండుగద, యట్టి భూమీశ ♦ కాంతసుతుఁడు
తా ననాథునిఁ బోలి ♦ ధరణిపై నెవ్విధి శయనించుచున్నాఁడు? ♦ శత్రుదమనుఁ
డెవ్వఁడు చనుచుండ ♦ నెల్లపదాతులు గజరథంబులు వెన్కఁ ♦ గదలి చనునొ
యట్టి రాముండిప్పు ♦ డానిర్జనాటవి నెట్లున్నవాఁడు? నా ♦ కెఱుఁగఁజెపుము!

తే. కొండచిలువలు నల్లని ♦ ఘోరఫణులు
సింహముఖఘోరజంతువుల్ ♦ చెలఁగి తిరుగు
నవ్వనమ్మున కెట్లు నా ♦ యాత్మజన్ము
లిరువురును సీతతోఁ గూడి ♦ యేగిరిపుడు. ౯ 2164

క. వినుము సుమంత్రా! భూమీ, తనయయు సుకుమారురాలు ♦ దానిఁ దలంపం
గనె జాలికలుగు నెవ్వరి,కిని, దానిం దోడుకొనుచుఁ ♦ గృపణత తోఁపఁన్. ౯½

క. ఇరువురు నాప్రియపుత్రకు, లరదము దిగి నడచి యెట్టు ♦ లరిగిరో? సూతా!
పరికింప మందరాచల, మరుదుగ నశ్వినుకులొందు ♦ నట్లు కుమారుల్. ౧౦½

క. వనమధ్యభాగమొందం, గనులలరఁగ నీవు చూడఁ ♦ గలిగితి వటు కా
వున నె కృతార్థుండవుగా; వనిఁ జేరిన పిదప రామ ♦ భద్రుఁడు సీతోఁన్. ౧౧

తే. ఏమిచెప్పెను లక్ష్మణుం ♦ డేమి పలికె
సీత యప్పుడు నేమేమి ♦ చెప్పె నెందు
నెందుఁ గూర్చుండె రాఘవుఁ ♦ డెందు నెందుఁ
బండుకొనెఁ దినె నేమేమి ♦ వచుసమీరుఅ. ౧౧½ 2168

క. అవియన్నియు వర్ణించుచు, వివరింపుము నాకు మును ది ♦ విని బాసి యయా
తి, వసుధపైఁ బడఁ తఱిఁ ద్రిద,శవిభుంగని సజ్జనాళి ♦ సహవాసంబున్. ౧౨

క. తనకీయవలయునని ప్రా,ర్థనమొగి నొనరించి దానఁ ♦ దా స్వర్గభ్రం
శన దుఃఖమ్మును బాసెను, గనుక న్నేనట్లె రాముఁ ♦ గానని వెతలన్. ౧౨

తే. పొందియున్నను రాముని ♦ పుణ్యచరిత
మును వినెడుభాగ్యమును, బొంది ♦ వనటఁ బాసి
దాని వినుచునె ప్రాణాళిఁ ♦ దాల్చియుందు
ననియె; రాజిట్లు పలుకంగ ♦ నాలకించి. ౧౨½ 2171

క. కన్నుదోయి సలిలపూర్ణం,బున నిండఁగఁ దొట్రుపాటు ♦ బూను పలుకులన్

మనుజేశుఁ గాంచి సారథి, యనియె మహారాజ నీప్రి♦యాత్మజుఁ డచటన్.

క. నిను మదిని దలఁచి ధర్మం,బును పాలింపంగఁ దానుఁ ♦ బూని కరయుగం
బును మోడ్చి శిరము సోఁకం,గ నమస్కారంబుచేసి ♦ క్రమ్మ ఱ మూర్తిన్.

క. ననుఁ గాంచి పలికె సూతా!, వినుమా! నాజనకుఁ డాత్మ♦వేత్త సుమీ! కా
వున శిరము సోఁక మ్రొక్కం,గను దగు నే మ్రొక్కినట్లు♦గాఁ జెప్పు తగన్.

తే. అమ్మహాత్ముని పావనాం♦ఘ్ర్యంబుజాత
యుగమునకు నీవు నాబదు♦లుగ శిరంబు
సోఁక మ్రొక్కంగ వలయు; నో♦సూత! యంతి
పురమునంగల యంబలఁ ♦ నరసి నీవు. ౧౫ 2175

క. నా వచియించినరీతిగ, నీ వచ్చటఁ బలికి వారి♦కెల్లఁ దెలియఁగా
నా [1]వర్ష్మారోగ్యము సరి,గా వర్ణింపంగవలయుఁ ♦ గడుఁ దమిమీఱన్. ౧౬

తే. వారివారికిఁ దగినట్టి ♦ గౌరవమున
కుం దగినరీతి నాదు మ్రొ♦క్కును వచింపు
క్షేమమును మ్రొక్కు నాతల్లి♦చెంతఁ జేరి
యేప్రమాదంబు నొందక ♦ యెఱుఁగఁ జెపుము!. ౧౭ 2177

సీ. పతియందు ధర్మత♦త్పరతయం దప్రమాదము నొందఁదగు నంచుఁ♦దల్లితోడ
వచియించి యివ్విధిఁ ♦ బల్కుమా దేవి! నీవెప్పుడు ధర్మంబు ♦ నేమఱకయె
కాలంబులకు సరి♦గా నగ్నిగృహముల కుపచారములు చేయు♦చుండు మెలమిఁ
బతిపాదములకు దై♦వమునకువలెఁ బరిచర్య సేయుము నీకు ♦ సవతులైన

తే. నాదు తల్లులయెడ నోజ♦నని [2]కులాభి
మానమునుగాని, నేనె కా ♦ మహిషి ననెడు
నున్నతిం గాని వదలి నీ♦వొక్కరీతి
గానె వర్తించుచుండుమా! ♦ కడు వినీతి. ౧౮ 2178

చ. ధరణిపతీంద్రుఁ బూజ్యయగు ♦ తత్ప్రియకాంతను గైకనెంతో యా
దరమునఁ గాంచుచుం దిరుగ ♦ ధర్మము; భూపతివెన్కఁ గైకయే
పరఁగును బూజ్యయై యనుచు ♦ భావమునం దలపోసి యట్టులే
జరపుము మానసంబునను ♦ శాంతము నూని చరింపు తల్లిరో!. ౧౯ 2179

క. తనయుండగు భరతుండని, మనమునఁ దలపోయ కతని ♦ క్ష్మాపతి యని యా
తనియెడల నడుచుకొనవల,యును ధనమునఁ బెద్దలగుదు ♦ రుర్వీనాథుల్.

తే. అంతేకాని వయస్సున ♦ నధికులౌట
జగమునన్ లేదు; భరతుండు ♦ జగదధిపుఁడు

---

1 వర్ష్మారోగ్యము=దేహారోగ్యము. 2 అభిమానంచ మానంచ త్యక్త్వా-అనిమూలము.

ధనసమృద్ధిని రాజగు♦ననుచు రాజ
ధర్మమును స్మరియింపుము ♦ తల్లి! నీవు. ౨౧ 2181

చ. అని వచియించి నన్నుఁ గని ♦ యంతటనే వచియించినట్లు రా
ట్తనయునితోడఁ బల్కుమని ♦ తా వచియించెను రామచంద్రుఁడే
మనిన; సుమంత్ర! నాకుశల ♦ మాదృతి మీఱఁగఁ జెప్పు కైక పు
త్రునకు నభేదరీతిఁగని ♦ తొల్లిఁటి పద్ధతిఁ దల్లులం దొగిన్. ౨౨ 2182

సీ. న్యాయము చొప్పున♦నడుచుచుండుము యని వచియింపు మిక్ష్వాకు♦వంశమెల్ల
నలరింపఁ జేయు మ♦హాభుజుండగు భరతునితోడ మఱి నెయ్య♦మునను బల్కు
యువరాజవై యుండి♦యునురాజ్యమందుఁ బ్రధానమ్ముగాఁ దండ్రి♦దలఁచియతని
యాజ్ఞను బాలింపు ♦ మమ్మహీధవునాజ్ఞ దాఁటరా దతఁడు వా♦ర్ధకము గన్న
తే. వాఁడు కావున నాతని♦పలుకు మీఱఁ
జన దదెప్పుడు, యావరా♦జ్యమున నుండి
తండ్రి యానతి జరుపుచుఁ ♦ దగిన భోగ
ముల ననుభవించి బ్రదుకుము ♦ సులలితగతి. ౨౩ 2183

చ. అని వచియించి యో దశర♦థావనినాయక! నన్నుఁ గాంచి యిం
కను వచియించె బాష్పములు ♦ క్రమ్మెడు కన్నులతోడఁ దమ్ముఁడా
తనయునియందు మిక్కిలి ము♦దంబును గల్గిన నాదుతల్లి నీ
జననిని బోలెఁ జూచుకొను ♦ సంతతముం దమి నాకు మీఱఁగన్. ౨౪

క. అని పలికి మహారాజా!, ఘనకీర్తియుతుం డతండు ♦ కడువగఁ గనులె
ఱ్ఱని దామరలవలెం దగ, ననుచుం గన్నీరు విడిచె ♦ నత్యధికముగన్. ౨౫

సీ. అంతట నాసుమి♦త్రాత్మజన్ముఁడు మాత్రమెంతయుఁ గ్రుద్ధుఁడై ♦యెసఁగు వేఁడి
నిట్టూర్పులను బుచ్చి ♦ నిలిచి యిట్లనియె; నీరాట్సుతుండే యప♦రాధమూని
యొనరించినాఁడని ♦ యూరినుండి వెడలఁగొట్టఁగాఁ బడియెనో♦క్షోణిపతియు
నతినీచమగు కైక ♦ యాజ్ఞకు లోఁబడి యీయకృత్యము గార్య♦మేయటంచు
తే. జేసినాఁడు గదా దీని♦చేత మేము, బాధలను బొందుచున్నాము♦వనములందు
నవనినాథుఁడు తాఁ జేసి♦నట్టి ప్రతిన, సార్థకము చేసె నెట్లు త♦ప్పందు వేని.

తే. కైక రాజ్యలోభంబున ♦ భూకళత్రుఁ
డాత్మజుని రాము నడవికి ♦ నంపునట్లు
చెప్పె నాతండు నట్టులె ♦ చేసెఁ గానఁ
బాపకార్యమిదంచని ♦ పలుకఁ జనదె. ౨౭ 2187

క. తన పత్నికి వరదానం,బును జేయుటఁ బట్టి యట్లు ♦ భూపతి యొనరిం
చిన నెన్నిభంగులం గని, నను దుష్కార్యంబె కాని ♦ నయమెట్టులగున్. ౨౮

క. వనములకు రామునిం బ, త్తనముననే భరతు ననుప♦దగు నునుపఁగ నా

నను నియమము లేదుగదా, కనుకన్ దుష్కార్యమొయగుఁ♦గా యెట్లైనన్.

*సీ. రాముని విడువఁ గా♦రణమేదియును గానరాక యున్నది కాన♦రాజు తాను
ప్రభువని తలపోసి ♦ స్వాతంత్ర్యమున మించి యిచ్ఛవచ్చినరీతి♦నిపుడు చేసె
నీకార్యమును; మఱి ♦ యిట్లు నమ్మఁచుట దైవసంప్రేరితుం♦డై విభుండు
కావించెఁ దగ యథా♦కామంబుగా నని యన్న దైవప్రేర♦ణాయతమతి
తే. యైన దోషమ్ము ముందుగా ♦ మానసమునఁ
దలఁచి కనులారఁ జూచియె ♦ త్యాగమొనరఁ
జేయఁ దగు నిప్పుడీలాగు ♦ చేయుటకును
గారణం బిసుమంతయుఁ ♦ గానరాదు. ౩౨ 2190

క. వనములకు రాముఁ బంపుట, యనునదియె విరుద్ధకార్య♦మైనను మతిలే
మిని దలపోయక భూపతి, యొనరిచె ననుతాప మాతఁ♦డొందె నిపుడు సూ!.

క. జనకుని దూఱుట తప్పని, యనుదువో నాకింక రాజు♦నందుఁ బితృత్వం
బనునది కనఁబడకున్నది, జనకుఁడు బంధువును భ్రాత♦స్వామి యితఁడె సూ!.

సీ. సర్వలోకహితుండు ♦ సకలలోకప్రియుండగు రాము విడిచితి♦విగద యిట్టి
క్రూరకర్మంబున♦కుం గడంగినయట్టి నీయందుఁ దలపోయ ♦ నీతనూజుఁ
డగు భరతునివంటి ♦ యల్పబుద్ధికిఁ దక్కఁ దక్కిన మనుజవి♦తతి నెవరికిఁ
గాని పుట్టదు ప్రీతి ♦ కడు సర్వజనహితుఁ డభిరాముఁడును నయ♦యుతులధర్మ
తే. చిత్తుఁడగు రాము నడవికిఁ ♦ జేర్చి యెల్ల
వారితోడ విరోధించి ♦ వసుధకెట్లు
రాజుగా నుండఁగలవో యో♦రాజ! యనుచుఁ
జెప్పు నాతండ్రితోనని ♦ చెప్పెఁ జుమ్ము!. ౩౩ 2193

చ. జనకజయందు లక్ష్మణుని♦చందము లేవియు లేవు గాని నె
మ్మనమునఁ గల్గు శోకమున ♦ మానిని యూర్పులుపుచ్చి చిత్తశు
ద్ధిని దగుఁగాన భూతము మ♦దిన్ వసియించినయట్లు నిల్కడన్
మును గని విస్మయంబుననె ♦ పోలఁగఁ జూచుచు నూరకుండెఁ జూ!. ౩౪

సీ. దుఃఖ మెప్పుడెఱుంగ♦దు మహీశపుత్రిక యపుడైనఁ గైక నే♦మనని మాన
వతి యశస్విని సీత ♦ భర్తదుఃఖముఁ గాంచి తనకు దుఃఖముగల్గఁ♦దాను నేడ్చు
చుండెను; నాతోడ ♦ నొకమాటయైనను బలుకదు తనదు నీ♦శ్వరుని జూచు
చుండి మహాతాప ♦ మొందుట మోమెల్లవాడ నేఁ బయనమై♦వచ్చుచుంటఁ

---

* ఇదం తావ ద్యథాకామ మీశ్వరస్య కృతే కృతమ్, రామస్య తు పరిత్యాగే న హేతు ముపలక్షయే-అనిమూలము. దీనివ్యాఖ్యలోనున్న యర్థమంతయు సంగ్రహించి యీసీసపద్యము వ్రాయఁబడినదని యెఱుంగవలయు.

తే. గానఁబడినంతనే పోయెఁ ♦ గా రథంబు
పతియుఁ కెవ్విధి నడుచు నం ♦ చతిశయార్తి
బాష్పజలముల విడిచె; న ♦ ప్పడిది ననుజుఁ
డలరి సేవలుచేసి త ♦ న్నరయుచుండె. ౩౬ 2195

క. శ్రీరాముఁ డాస్యమునఁ గన్నీరొలుకఁగ నూరకుండె ♦ నిజ దివ్యకరాం
భోరుహముల ముకుళించియె, యీరథమును నన్నుఁ గనుచు ♦ నింతియు నగచేన్.

ఏఁబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౯ - వ సర్గము.

సుమంత్రుఁ డయోధ్యాపురజనులచింత రాజునకుం జెప్పుట.

[చ. ననుఁ గని దుఃఖమొందుచునె ♦ నాతి మతేమియుఁ బల్కకుండె నం
చని సచివోత్తముండు విన ♦ యంబునఁ బల్కఁగ నాలకించి యిం
కను గల వార్తలన్నిఁటిఁ ద ♦ గన్ వచియింపు సుమంత్ర! యంచు న
జ్జనపతి పల్క దాని విని ♦ సంతతబాష్పపరిప్లుతాస్యుఁడై. 2197

క. మరలన్ రాముని వార్తల, ధరణీశున కెఱుఁగఁ జెప్పెఁ ♦ దా సారథి వి
స్తరముగ రాజా! విను మ,య్యిరువురు రాఘవులు జడల ♦ నే తాల్చి తగన్.

తే. నారచీరలు గట్టి జా ♦ హ్నవిఁ దరించి
పోయిరంతఁ బ్రయాగముఁ ♦ బోవుదారిఁ
బట్టి; లక్ష్మణుఁ డప్పుడుఁ ♦ భ్రాత నరయు
చుం జనియె ముందు,వెన్క, భూ ♦ సుతయు నరిగె. 2199

క. వారలవెనుకం జనియెన్, శ్రీరాముం డిట్లు వారు ♦ చెలఁగుచుఁ జనఁగా
భూరమణ! పరాధీనుఁడ,నై రామునివెంటఁ బోక ♦ యరుదెంచితిఁ జూ!.]2200

చ. వనికిటు రాముఁ డేగఁగనె ♦ వచ్చితి బుద్ధిమరల్చికొంచు నే
జనవర! నాదుగుఱ్ఱములు ♦ సంతతరాఘవశోకభారముం
గనుచునె వేఁడిబాష్పములు ♦ గన్నులనుండి స్రవింపఁ ద్రోవఁ జ
క్కనిగతి రాక తొట్రుపడె; ♦ క్ష్మాపతిపుత్త్రులకేను బ్రీతితోన్. ౧౪ 2201

*క. అంజలిఁ గావించి రథం,బుం జయ్యన నెక్కి దుఃఖ ♦ ముఁ మ్రింగుచు రాఁ

---

* గుహేన సార్ధం తత్రైవ స్థితోఽస్మి దివసాన్ బహూన్-అని మూలము. ఇట దివసాన్ బహూన్-అను బహువచనమునకు మూఁడుదినములే యర్థమని చర్చచేసి గోవిందరాజమహేశ్వరతీర్థులిరువురును సిద్ధాంతము చేసిరి. రామవియోగముచే నొక్కొక్కదినమే కల్పముగఁ దోఁచినందున దివసాన్ బహూన్ అని సుమంత్రుఁడు చెప్పెనని గోవిందరాజులును, రాముఁడు గంగను దాఁటిన దినము మొదలు చారులు వచ్చినదినముదాఁక మూఁడుదినము లగును. ఇదియే యిట బహూన్

గంజాలక దివసత్రయ,ముం జరపితి శృంగిబేర♦మున గుహునింటన్. ౨౹ 2202

క. చాపల మూలంబుననే, యారాముఁడు మరలఁ బిలువ♦నంపునొ యను న
ప్పేరాశనుంటి; నోరఘు,వీరా! కైకేయికొఱకు ♦ విమలాత్మ సుతున్. 3

చ. వనమున కంపినాఁడ విది ♦ వారకసర్వజగత్ప్రితాపకం
బని యెఱుఁగంగఁబోలు నెటు♦లన్నను దావకదేశమందు వృ
క్షనికరమున్ రఘూద్వహుఁడు ♦ కానలకేగె నటన్న చింతచే
తను బ్రసవాంకురాదిసహి♦తంబుగ మ్లానతనొందె నెంతయున్. ౪ 2204

క. మనుజుల మాటను జెప్పం,గను వలెనే నదులయందుఁ ♦ గమ్రసరసులం
దును బల్వలములఁ గల [1]జీ,వనమెల్లం గ్రాఁగి పోయె ♦ వసుధాధీశా!. ౪౹2205

సీ. ఉద్యానములయందు ♦ నొగి నాకులెల్లను శుష్కంబులై పోయె ♦ శోభదప్పి
వనములు నల్లయ్యె ♦ విను మడవులయందు జంతువుల్ దిరుగుట ♦ సన్నగిల్లెఁ
గ్రూరమృగమ్ము లా♦హారమ్ము గూర్పంగనైనఁ జరించుట ♦ మానియున్న
వల రాము దుఃఖమ్ము♦వలన వనంబెల్ల నిర్గతశబ్దమై ♦ నిలిచియున్న;
తే. దింకనున్ వినవయ్య! రా♦జేంద్ర! పద్మ
పత్రములు నీట మున్గఁగ ♦ వారి చెడియెఁ
బద్మములు వాడెఁ జేఁపలు ♦ వారిపక్షు
లెల్లఁ దిరుగమిఁ గొలఁకులు ♦ నెల్లఁ గలఁగె. ౫ 2206

క. జలములఁ బూచెడి పుష్పం,బులు బుడమిని గలుగునట్టి ♦ పూవులు మఱియున్
ఫలములు లఘువాసనలం, గలిగి ప్రకాశింప విట్టి ♦ కాలమునఁ గటా!. ౬

క. ఈనగరంబునఁ గల యు,ద్యానములున్ శుకపికాది ♦ హారిరవములన్
హీనములై శూన్యములై, కానంబడె మనుజవర్య! ♦ కాంతివిరహితన్. ౬౹

క. ఏయుద్యానములైనను, నీయెడఁ గనరావు నాకు ♦ నెలమిఁ గలుగఁగాఁ
జేయుచు నే నిప్పురిఁ జొర,నేయెడ సంతుష్టుఁడగుచు ♦ నెవఁడుండఁడు సూ!.

క. జనులెల్లరు శ్రీరాముని,ఁ గనమిన్ దుఃఖమున మున్గి ♦ కడు నిట్టూర్పుల్
జననాథ! విడుచుచున్నా,రనియతగతిఁ బెక్కుసారు ♦ లార్తముఖములన్. ౧౦

క. విను దేవా! శ్రీరఘురా,ముని విడి యిట వచ్చిన రథ♦ముం గని, పెను త్రో
వను నిలిచిన మనుజులకా,ర్తిని మోముల బాష్పజలము♦తీవ్రతఁ గమ్మెన్. ౧౧

తే. వనితలెల్ల విమానంబు♦లను సులలిత
హర్మ్యసౌధంబులను నెక్కి ♦ యరద మొంటి

---

దివసాన్ అని చెప్పఁబడియె నని మహేశ్వరతీర్థులును జేసిన వ్యాఖ్యానసారము ఆసారతరార్థము ననుసరించియే యిట దివసత్రయమని తెనిఁగింపఁబడియె నని యెఱుంగఁదగు.

1 జీవనము=జలము.

గాఁగ రాముఁడు లేకయె ♦ రాఁగఁ గాంచి
యార్తి నాహాకృతులఁ జేసి ♦ రధిపమౌళి!. ౧౨ 2212

క. పెనువగఁ గుందుచు వనితలు, కనులఁ బాష్పములు వేగ ♦ గ్రమ్ముటచే సం
జనమెల్లఁ గరఁగి పోవుట, ఘనములు నిర్మలములునగు ♦ గనుదమ్ములతోన్.

క. కనఁజాలక స్పష్టంబుగఁ, గనుచుండిరి యొకరినొకరు ♦ గాఢవ్యథ నే
మిని బలుక కూరకే; రా,ముని విషయము గుఱిచి దుఃఖ♦మ్ముం బొందుతఱిన్.

క. అరిజనులయందు మిత్రో,త్కరమందును దలఁపఁగా న♦దాసీనులయం
దరయఁగ భేదము కన్పడ,దు రాజవర! యొక్కరీతి ♦ దుఃఖించిరి సూ!. ౧౪

సీ. సంతోషవిరహిత ♦ జనసంకులంబయి యతిదీనదంతావ♦శాశ్వమగుచు
నార్తస్వరమ్లాన♦మై [1]వినిశ్వసితనిస్వనమౌచు నిర్గత♦సమ్మదంబు
నై రామవనగమ♦నాతురంబయి యోమహారాజ! యీయయో♦ధ్యాపురంబు
గన్పడుచున్నది♦గద? పుత్త్రుఁబాసిన కౌసల్యపగిది; దుః♦ఖమున ననుచుఁ

తే. బలుక సూతుని దీనవా♦క్కులను వినుచు
బాష్పసలిలోపహత దీన♦భాషణముల
నతనిఁ గని పల్కె దశరథుం ♦ డార్తుఁడగుచుఁ
గైక తలఁపెల్లఁ బాపని♦కాయ్య మకట!. ౧౬ 2216

క. జననస్థలంబు పాపం,బున కిల్లయియుంట దానిఁ♦బోలు స్వభావం
బున నొప్పఁ గైక సూతా!, వనమునకుం దనయుఁ బంపఁ♦బ్రార్థించుతఱిన్.

ఆ. మంత్రకుశలులైన ♦ మహితాత్ములం గూడి
యపుడు నేను వనికి ♦ నంపు పనిని
దగినరీతిగాఁగఁ ♦ దలపోయనైతి మి
త్రులను సచివపురజ♦నులను జేర్చి. ౧౮ 2218

చ. తనయునిఁ బంపుకార్య మిది ♦ ధర్మవె చేయఁగ నిట్టులంచు నె
మ్మనమున నెంచనైతి; నొక♦మానిని మోహమునం బెనంగి యే
మనితలపోయ కాతురము♦నంది యొనర్చితిఁ గాకయున్న నా
యొనరిచినట్టి పాపమున ♦ నుద్ధతదైవము నెంచురీతిగన్. ౧౯ 2219

ఆ. ఇట్లు జరగవలసి♦యే యుంట నీదుఃఖ, మితరకారణమ్ము ♦ లేవిలేక
తనకుఁ దానె వంశ♦మును బాడుచేయంగ, వచ్చియుండుఁ జుమ్ము ♦పలుకులేల.

క. నే నీ కెపుడైనను నే,దే నుపకారంబు చేసి♦యే యుండినచో
దానిని బాటించియె నా, సూనునికడఁ జేర్పు నన్ను ♦ సూతా! త్వరగన్.

చ. తనువును బాసి ప్రాణములు ♦ తా రరుగం దగినట్టు లున్న వ
వ్వె ననుఁ ద్వరం గనంగ నిపు♦డే యొనరించెడు నాదునాజ్ఞ యు

1 వినిశ్వసితనిస్వనా-అని మూలము.

ర్వ నిపుడు సాగు నేని రఘు♦వీరు మరల్చియె తోడి తెమ్ము. రా
ముని నెడఁబాసి యొక్క క్షణ♦మున్ బ్రదుకంగను జాల నేనిఁకన్. ౨౨ 2222

తే. ఆమహాబాహుఁడగు రాముఁ ♦ డడవిఁ జాల
దవ్వు చని యుండవచ్చు సూ♦త! రథమందు
[1]నన్నె యెక్కించుకొని వే వ♦నమున కరిగి
చూపుమా రామమూర్తికి ♦ శుభనిధికిని. ౨౩ 2223

తే. కుందకుట్మలరదనుండు ♦ కూర్మిసుతుఁడు
పెద్దవిలుకాఁడు శ్రీరఘు♦వీరుఁ డిప్పు
డెచట నున్నాఁడు? వానిని ♦ నింతి సీతఁ
గనఁగఁ గలనేని బ్రదుకంగఁ ♦ గలను నేను. ౨౪ 2224

సీ. లోహితాక్షుని మహా♦బాహుని భాసుర మణికుండలుని నాకు♦మారు రాముఁ
గనక యుండితినేని ♦ గాలుని వీటికి నతిథిగాఁ బోవుదు ♦ నకట! యిట్టి
యధికదుఃఖావస్థ ♦ ననుభవించెడు నేను నిక్ష్వాకుకులవారి♦ధీందుతుల్యు
రామునిఁ గన్నులా♦రంగఁ జూడకయున్నవాఁడనే నావంటి ♦ వానికింత

తే. కన్న దుఃఖమ్ము మఱియు నే♦మున్న దింక
నయ్యయో! రామ! లక్ష్మణా! ♦ యధికతాప
మందుచున్నట్టి జానకీ! ♦ యధికదుఃఖ
మున ననాథునివలె మృతిఁ ♦ గనెడు వాఁడ. ౨౫ 2225

క. ఇది మీకెల్లను తెలియదు, గద యని విలపించి భూమి♦కాంతుఁడు వగచే
మది తత్తఱిల్లుచుండఁగఁ, దుదలేని వ్యథాంబురాశిఁ ♦ దోఁగుచు నంతన్.

సీ. కౌసల్యఁ గని దేవి! ♦ కడు రామదుఃఖ మహాభోగమై వసు♦ధాత్మజా వి
యోగపారగమయి ♦ యురుతరశ్వసితోర్మి వితతతరావర్త♦విస్తృతమయి
బాష్పఫేనోదక ♦ బహుమలినంబయి హస్తవిక్షేప మీ♦నాళియగుచు
నాక్రందనస్వనా♦త్యంతనిస్వనమయి ప్రవికీర్ణకేశశై♦వాలమగుచుఁ

1 మామేవ రథ మారోప్య శీఘ్రం రామాయ దర్శయ-అని మూలము. ఇట నాకు రామునిం జూపుమా యనక నన్ను రామునకుం జూపుమా యనుటచే నాప్రాణములుండునో లేదో కాఁబట్టి వేగముగా రథముపై నెక్కించుకొని పొమ్ము. ప్రాణములున్నచో నన్ను రాముఁడు చూచి మాటలాడఁగలఁడు. లేనిచో నాదేహమునైనను రాముఁడు చూడఁగలఁడని దశరథుని భావముని గ్రహింపవలయు. లోపల రాజుభార్యయగు కైకతో నింక నీవు నాకు భార్యవు గావు. భరతుఁడు నాకుఁ బారలౌకికక్రియలు చేయ నర్హుండు గాఁడని చెప్పుట యీయర్థమునకు మూలమని గ్రహింపవలయును. "నహి త్వాం ద్రష్టుమిచ్ఛామి నభార్యా నచ బాంధవీ. ॥ భరతశ్చే త్ప్రతీతస్స్యాద్రాజ్యం ప్రాప్యైద మవ్యయమ్, యన్మే సదద్యా త్పిత్రర్థం మాం మాత ద్దత్త మాగమత్." ॥ అయోధ్యాకాండము - ౪౨ వ సర్గము.

తే. బాపమతియుత కేకయ♦పాలకాత్మ
జా మహాబడబాగ్నియై ♦ [1]సాధ్వసావ
హాస్యకుబ్జావచోగ్రాహ ♦ మగుచు మామ
కాశ్రువేగప్రభూతమై ♦ యతిశయిల్లి. ౩౦½ 2227

తే. పాపమతియైన కైకేయి ♦ వరమె సలిల
వృద్ధిగా నొప్పి, శ్రీరాము ♦ వెడలనంపు
టయె విరివిగాఁ జెలఁగిన క♦ట్టడి వగయను
సంద్రమున మున్గినాఁడఁ గౌ♦సల్య! నేను ౩౧½ 2228

క. తనయుఁడు రాముఁడు లేకే, ఘనమగు నీదుఃఖవార్ధిఁ ♦ గడవంజాలన్
వనితా! రాముని లక్ష్మణుఁ, గనఁగోరియు వారిఁ గాంచఁ♦గాఁజాల సుమీ!.

తే. ఇంతకంటె నమంగళ ♦ మెద్ది కలదు
చెప్పుమా యంచుఁ బలికె నా ♦ క్షితివిభుండు;
భూరియశుఁడైన దశరథుం ♦ డారఘూత్త
ముని దలంచుచు నేడ్చుచు ♦ మూర్ఛపోయి. ౩౩ 2230

ఆ. శయ్యపైనఁ బడియె ♦ క్ష్మాపతి సుతుఁ గూర్చి
కరుణఁ గలుగ నేడ్చి ♦ విరహితాత్మ
భూతి యగుచు మూర్ఛ♦పోయినఁ బట్టపు
దేవి యప్పలుకులు ♦ భావ మేఁచ. ౩౩½ 2231

తే. వాని నాలించి సుతునకే♦మేని ముందు
భయము గలుగునో యని చింత♦వలనఁ గుంద
చుండియును భర్తకేమి యు♦ద్దండభీతి
కలుగునో యిప్పుడని భీతిఁ ♦ గాంచె మరల. ౩౪ 2232

ఏఁబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - వ సర్గము.

కౌసల్య శోకింపఁగా సుమంత్రుఁ డూఱడించుట.

క. తరువాతం గౌసల్యయు, ధరణిం బడి మరల మరల ♦ దయ్యము సోఁకన్
బొరలెడు మాడ్కిం బొరలుచు, విరహితచేతనయుఁ బోలె ♦ వే మూర్ఛిల్లెన్.

క. స్మృతినొంది యంత సూతుని, నతిదుఃఖముతోడఁ గాంచి♦యనియెన్ భూమీ

1 కుబ్జావాక్యమహాగ్రాహః-అని మూలము. ఇట సాధ్వసావహాస్యకుబ్జావచోగ్రాహమని తెనిఁగింపఁబడినది. భయముఁ బుట్టించు మోముగలది, యనునది హెచ్చుగాఁ జేర్పఁబడుట మంథరయందుఁగల క్రోధాతిశయమును దెలుపుటకని గ్రహించి మన్నింపఁదగు

సుతయును రాముఁడు లక్ష్మణుఁ, డితరులు గననట్టి వెతల♦నే గడుఁ గనుచున్.

క. ఎందున్నవారొ? యచ్చటి,కిం దగ ననుఁ గొంచుఁ బొమ్ము ♦ కృత్రిమమనఁగా
డెందములం దెలియనివా,రిం దమి లేకేను విడి పు♦రిన్ క్షణమైనన్. ౨ 2235

క. నిలువం గలనే బ్రదుకం, గలనే యరదము మరల్చి ♦ కడువడి నక్కా
నలకుం దోడ్కొని పొమ్మా, యల వారలచెంతఁ జేరు♦నటు నీవు ననున్. ౨½

క. కొనిపోవవేని నేనా, తనయులఁ గోడలినిఁ జూడఁ ♦ దగు పుణ్యముఁ జే
యనయేని [1]యమునిలోకం,బున కేగుదు నన్న మంత్రి♦ముఖ్యుఁడు కరుణన్. 3

క. కరయుగము మోడ్చి బాష్పో,త్కర వేగహతస్వవాక్య♦తతులొప్పఁగ ని
ర్భరదుఃఖ మాపుకొని యా, తరుణీమణి నూఱడించి ♦ దగ నిట్లనియెన్. ౪

క. తనయున కట నే మగునో, యను మోహము శోకసంభ్ర♦మాదుల దుఃఖం
బునఁ గల్గువాని నెల్లను, జను విడువఁగ దేవి! నీకు ♦ సంతాపంబున్. ౪½

క. వని సంతాపము లేకయె, యనఘుఁడు శ్రీరామచంద్రుఁ ♦ డతిసుఖములచేఁ
దనరారువాఁడు సుమ్మా, తనధర్మమెఱింగినట్టి ♦ ధన్యుఁడు గానన్. ౫½ 2240

తే. లక్ష్మణుం డింద్రియసుఖంబు♦లం దగులక
యన్నపాదార్చనము సేయు♦చున్నవాఁడు
దానఁ బరలోకసాధన ♦ మూని చేయు
చున్నవాఁడు తలోదరీ! ♦ యుర్విసుతయు. ౬ 2241

క. జనరహితంబయి యొప్పెడు, వనమున యందైన దివ్య♦భవనమున వలెన్
మనమున భీతిలకయె ప్రీ,తిని గని మది రాముఁ జేర్చి ♦ తిరిగెడుఁ గానన్. ౭

క. వనవాసదుఃఖమించుక,యును సీతకుఁ గలుగ దట్టు♦లొప్పటఁ దోఁచెన్
వనవాసమునకుఁ దగినదె, వనితామణియంచు నాదు ♦ స్వాంతంబునకున్. ౮

క. వనితయు మున్నిటఁ బ్రమదా, వనమునఁ గ్రీడించుచుండు ♦ భంగి నిపుడు ని
ర్జనవనములఁ గ్రీడించెడు, వినుమా పూర్ణేందువదన ♦ విభ్రమ మలరన్. ౯

క. పతివశగతమానసయై, హితమతియగు సుందరాంగి ♦ యెందు మనుజసం
తతిలేని వనుల శిశువుల, గతి నాటల మరిగియుండఁ♦గాఁ జూచితిఁ జూ!. ౧౦

క. రాముఁడె సీతకుఁ గననా, రామము వనినుండిన, నల ♦ రామునియందే
తా మనసునిలుపుటన్ వగ,యేమాత్రమునొంద;దామె♦హృదయమసువులున్.

తే. పతి యధీనంబులే కాన ♦ భర్తలేని,యెడల నీయయోధ్యాపురి♦యే వనంబు
సీత పాలిటికగు; వన♦సీమలందుఁ, బోవునప్పుడు సీతయుఁ ♦ బొంగు వేడ్క. ౧౧

క. పురికిం దీనికిఁ గ్రోసున, వరమతి విహరించుచుండు♦భంగి ముదమునం

---

1 గమిష్యామి యమక్షయమ్-అని మూలము, క్షయ మనఁగా గృహము. ఇట లోకశబ్దము తత్సాదృశ్యముచేఁ బ్రయోగింపఁబడినది.

బరఁగుచు గ్రామనగరములఁ, దరువుల నానావిధములఁ ♦ దాఁగనుఁగొనుచున్.

క. ఏమిది యేమది యనుచున్, రామునినో లక్ష్మణునినో ♦ రమణ నడుగుచున్
దామదిఁ దెలిసికొనుం ద,న్నామములను వేఱు వేఱు ♦ నారీమణియున్. ౧౩

*సీ. ఈచెప్పినంతయే ♦ యిపుడు జ్ఞప్తికి వచ్చుచున్నది నాకప్పు ♦ డుర్వీతనయ
కైకేయిఁ గూర్చి యా ♦ కస్మికముగ నొకవాక్యము చెప్పె న ♦ వ్వచన మిపుడు
స్మృతికిరాకున్నది ♦ యేమొ యంచు సుమంత్రుఁ డటఁ బ్రమాదంబున ♦ ననువదింపఁ
బూనిన యావాక్య ♦ మును జాఱవిడిచి కౌసల్య మనస్సున ♦ సంతసంబుఁ

తే. గలుగఁ జేయుచు మధురమై ♦ క్రాలునట్లు
చెప్పె నీరీతి; వినవమ్మ ♦ సీత దారి
నడచినను వాతవేగము ♦ నన్ బడలిన
వ్యాఘ్రముఖమృగములఁ గని ♦ భయపడినను. ౧౪ 2250

క. ఆతపమునఁ గడుబడలిన, శీతాంశుని కాంతి సమతఁ ♦ జెందు మహీపు
త్రీ తనుకాంతియు నంతయు, నేతఱి నే మార్పు నొంద ♦ దిది యబ్బురమా.

చ. సరసిజసామ్యమొంది రుచి ♦ జాలసమగ్రత నొప్పు చంద్రుతో
సరియయి చెల్వుమీఱు సర ♦ సప్రియభాషిణియైన సీత సుం
దరవదనంబు కష్టములఁ ♦ దాఁ గనినన్ నిజసుందరత్వయు
క్తిరహిం వెలుంగుచున్నయది ♦ దివ్యపతిప్రియదర్శనంబునన్. ౧౭ 2252

సీ. లత్తుకరసమట్లు ♦ లలనపాదంబులు సాంద్రారుణచ్ఛాయఁ ♦ జానుమీఱు
నవ్వి లత్తుకపూఁత ♦ నందక యిపుడున్న నడవిలోఁ దిరిగిన ♦ నబ్జకుట్మ
లాభంబులై సొంపు ♦ నందుచు నున్నవి; యడవిలోఁ జరియించు ♦ నపుడునతివ
భూషణావళిపైనఁ ♦ బోలుపారు నాశచే నందెలు లోనగు ♦ నఖిలభూష

తే. ణములఁ దాల్చుచుఁ దన్నిస్వ ♦ నముల ననుస
రించు దానివలెన్ లీల ♦ సంచరించు
చున్న దాత్మేశునిం గూడి ♦ యొప్పుమీఱ
నతివ పతిభక్తి నేమని ♦ యనువదింతు. ౧౯ 2253

---

* ఇదమేవ స్మరా మ్యస్యాః స్సహసై వోపజల్పితమ్, కైకేయీ సంశ్రితం వాక్యం నేదానీం ప్రతిభాతిమా. ధ్వంసయిత్వాతు తద్వాక్యం ప్రమాదా త్పర్యుపస్థితం, హ్లాదనం వచనం సూతో దేవ్యా మధుర మబ్రవీత్-అని మూలము. దీనికి గోవిందరాజులు పెంచి వ్యాఖ్య వ్రాసిరి ప్రమాదమునఁ దోఁచిన యామాటను జాఱవిడిచి యనఁగా నేమాట తోఁచినది? అని ప్రశ్నించుకొని "సకామాభవ కైకేయి హతోఽయం కులనందనః" అని ముందుకాండమునఁజెప్పఁబోవు శ్లోకార్థమును సీత యిట సూచించియుండఁగా దానిని జెప్పక సుమంత్రుఁడు తత్కాలోచితముగాఁ జెప్పెనని సూచించిరి. ఆయర్థము నిటఁ జెప్పఁగూడనిది గాన మాని శ్లోకార్థము మాత్రమే చెప్పఁబడినదని తెలియునది.

చ. వనమున సీత రాఘవుని ♦ బాహువులం దగ నాశ్రయించి చూ
చిన భయమొందఁగా నెపుడు ♦ చేయుశరీరముగల్గు హస్తినో
ఘనమృగనాథునో మిగుల ♦ ఘాతుకమౌ పులినో తనంతటం
గనినను భీకరాటవులఁ ♦ గాంచినను౯ భయమొంద దాత్మలో౯. ౨౦ 2254

తే. జనకవాక్యపాలనరూప♦చరిత మిద్ది, జగతి శాశ్వతమై ప్రతి♦ష్ఠలఁ జెలంగుఁ
గాన లక్ష్మణ రాఘవ♦జానకులను, మనల నృపుఁ గూర్చి కాని త♦గు నె వగవఁగ.

చ. పెనువగఁ బాఱఁదోలి ముని♦వృత్తములం గడు సంగ్రహించి నె
మ్మనముల మోదముం బొదల ♦ మానితవన్యఫలాళిఁ దించు న
వ్వనముల సంచరించుచును ♦ బాగుగఁ దండ్రియొనర్చినట్టి య
ప్పెనుశపథంబుఁ గాచుచును ♦ బెంపు తగం జరియించు వారొగి౯. ౨౨

చ. వనితయుఁ బుత్రశోకమున ♦ వందురుట౯ సచివోత్తముండు నే
ర్పునఁ దగ నెంతయూఱడిలు ♦ పోల్కి వచించిన నాప్రియాత్మజా!
యినకులవార్ధిశీతకర! ♦ యీగతిఁ గానలనుండినాఁడవే
యని నిరతంబు నార్చుచు నె ♦ యార్తిని బొందుచునుండె నాత్మలో౯. ౨౩

అఱువదియవ సర్గము సంపూర్ణము.

---

౬౧ - వ సర్గము.

-రామవనవాసమును గూర్చి కౌసల్య భర్తతోఁ జెప్పి దుఃఖించుట.-

క. పరులను రంజించుచు ధర్మరతింగని చెలఁగునట్టి ♦ రాముఁడు వని క
ట్లరుగుట కెంతయుఁ బొక్కుచుఁ, దరుణీమణి యేడ్పుతోడఁ♦దాఁ బతికనియె౯.

సీ. రఘువంశ్యుఁడగు దశ♦రథుఁడు దయాళువు దాతలలో శ్రేష్ఠ♦తముఁడుమఱియుఁ
బ్రియవాది యనెడు నీ♦పెనుకీర్తి ముజ్జగంబులఁ బ్రథితంబయి♦పొలిచియున్న
దైన నేమాయె న♦ద్దానికన్నను వపయశమొసంగెడు కార్య ♦ మరయకీవు
చేసితివే రాజ♦శీతకరా! సుఖసంపదల్ వెలయఁగా ♦ సదనమందుఁ

తే. బెరిగినట్టి కుమారులు ♦ వెలఁదియు నిపు
డార్తిఁ బొందుచు వనముల♦యందుఁ గలుగు
కష్టముల నెట్టులోర్వంగఁ ♦ గలరొ చెపుమ
చేయరానట్టి కార్యంబుఁ ♦ జేసితీవు. 3 2259

మ. ధరణీశా! సుకుమారి యౌవనవపుమ♦ధ్యస్థానముం బొంది ని
ర్భరభోగోచితయై వెలుంగుసతి యా♦రాజాస్య ఘోరాటవిం
జరియింపం జని యుష్ణశీతముల కే♦చందంబునం దాళు? మం
దిరమం దవ్విపులాక్షి నంజుకొనఁ దృ♦ప్తిం గొల్పు వస్త్వాళితో౯.౪ 2260

క. అలరెడు దివ్యాన్నంబుల, నెలమిం దినుచుండి యడవిఁ ♦ దృణధాన్యాన్నం
బుల నెట్లు దినఁగఁ గలుగుదు, దలమే నాకింక దుఃఖ♦తతి భరియింపన్. ౫

చ. వినుతచరిత్ర సీత శుభ♦వృద్ధి నొసంగెడు గీతవాద్య ని
స్వనముల వించునుండి యిఁక ♦ సాంద్రతరాటవులందు నెవ్విధిన్
వినఁగలదెంతయున్ భయద♦వృత్తిఁ జెలంగెడు క్రూరసింహము
ఖ్యనిఖిలసత్వనాదముల ♦ క్ష్మాపతివర్య! యమంగళంబులన్. ౬ 2262

సీ. ఇంద్రధ్వజముభంగి♦నెసఁగు మహాభుజుండతిబలుండగు రాముఁ♦డాయసమగు
పరిఘసంకాశమై ♦ పరఁగు భుజంబునేయుపధానముగఁ దానె ♦ యొనరిచికొని
శయనించినాఁడో యే♦స్థలమున నడవిలోఁ బద్మపత్రాక్షముల్ ♦ భాసిలంగ;
సురుచిరకేశముల్ ♦ శోభిల్ల నింపైన నెత్తమ్మివాసనల్ ♦ నిగుడఁ బద్మ
తే. వర్ణ మెంతయు వెలయంగఁ ♦ బ్రబలుచున్న
రాము నుత్తమవదన మో ♦ రాజచంద్ర!
యెపుడు చూడంగఁగలను నా♦హృదయ మతనిఁ
దనివిఁదీరఁగఁ గనకున్న♦తఱిని నిపుడు. ౭ 2263

క. ఇలఁ బగులదేమొ వేయి శకలములుగా వజ్రసార♦కలితమ్ముగ ని
మ్ములఁ జేయఁబడియె ననుటకుఁ, గలదే సంశయము చూడఁ♦గా ధరణీశా!. ౮

ఆ. శర్మ మనుభవింప ♦ జన్మించినట్టి నా, బాంధవులగు పుత్ర ♦వరులు సీత
యును భవత్తిరస్కృ♦తిని గని పురిఁబాసి, దీనులగుచు వనులఁ♦దిరుగుచుండ్రు.

సీ. రఘురాముఁ డురుతరా♦రణ్యసీమలనుండి పదునయిదవయేట ♦ వచ్చున నెదొ
యిచటికి వచ్చిన ♦ నింతకాలము కైకతనయుండు స్వేచ్ఛఁ దా ♦ ననుభవించి
నట్టి కోశంబు రా♦జ్యంబును వదలునంచని నాకుఁ దోఁపలే ♦ దల్ల రాముఁ
డీరాజ్యకోశంబు ♦ లిన్నేండ్లు తనతమ్ముఁ డనుభవించినవని ♦ యాత్మనెంచి
తే. వానిఁగొనకుండుఁ; గొందఱు ♦ బ్రాహ్మణులును
శ్రాద్ధకృత్యంబు సాగించు ♦ సమయమందు
సాధుభూసురులున్నను ♦ స్వజనులకె యొ
సంగు దక్షిణ లందఁ♦జేయంగ నెంచి ౧౦ 2266

క. వరమతుల విడిచి బంధూ, త్కరమునె భుజియింపఁ జేయఁ♦దలఁచెదరు గదా
తరువాత నిష్టపంక్తికి, వరవిప్రులఁ బిలిచి కుడువఁ ♦ బ్రార్థింతురు నూ!. ౧౧

సీ. వారిలో సద్గుణ♦భాసురుల్ విద్వాంసు లమరసంకాశులు ♦ నైన విప్రు
లట్లిష్టపంక్తిలో ♦ నమృతమ్మొసంగిన నైన ముందుగ వార ♦ లాచరించి
నట్టి యవమతిచే ♦ నద్దానికై సమ్మతింపరు; తొలిపంక్తిఁ ♦ దిననివారు
ధరణీసురులె యైనఁ♦దరువాతి విప్రోత్తములు, వృషభేంద్రముల్♦పొలుచునాత్మ

తే. శృంగభంగమ్మునకు సహి♦యింపనట్లు
పిదప భుజియింప నెంచరు ♦ పిన్నతమ్ముఁ
డిట్లనుభవించు రాజ్యంబు ♦ నెల్ల సుగుణ
గణుఁడు జ్యేష్ఠుఁడు రాముఁ డో♦క్ష్మాతలేశ !. ౧౮॥ 2269

క. ఏటికి నిరాకరింపఁడు?, సాటి మృగంబొండు తినిన ♦ సరసాహారం
బేటికని శిష్టమగుటను, బాటించి త్యజించుఁ జుమ్ము ♦ వ్యాఘ్రము భూపా!.

క. పురుషోత్తముండు రాముఁడు, పరులాస్వాదించినట్టి ♦ వైభవమును దాఁ
బరికించి వెలికిఁ బుచ్చక, పరిగ్రహించునె యుదార♦భావుఁడు కాఁడే?. ౧౬[దు

సీ. క్షితిఁ బురోడాశముల్ ♦ఘృతహవిస్సులుఁగుశల్ ఖాదిరయూపముల్ ♦క్రతువునం
నొకసారి యెచటనే ♦ నుపయోగపడుచుసంగఁ బడెనేని మరల న♦వ్వాని నితర
యాగంబులఁ గని♦యోగింప రట్టులే రాముండు మరల నీ♦రాజ్యము తన
పాలికి వచ్చిన ♦ నోలి సారముగొన్న సురవలెఁ బరపీత ♦ సోమమైన

తే. యాగమట్లింతమాత్ర మ♦య్యనఘచిత్తుఁ
డిచ్ఛగింపఁ జాలండు మ♦హీతలేశ !
[యాతఁడెంతయు నాగ్రహ ♦ మందునేని
యల తిరస్కృతియే పొందఁ ♦ దపుడు సుమ్ము !. ౧౭ 2271

క. అతఁడే కోపించినచో, శితశరముల మందరాద్రిఁ ♦ జెండుఁ బగులఁగాఁ
బితృగౌరవంబునఁ గన్, స్మృతియూట నినుఁ గ వధింప ♦ నుది నెంచఁడు సూ !.

చ. తనయుఁడు కోపమొందినవె ♦ తారలతో గ్రహరాజితోడ న
య్యనతుహినాంశుయుక్తముగ ♦ నెన్నఁగరాని మహత్వయుక్తితోఁ
గనఁబడు నాకసంబు సుర♦కాంతనివాసమునా దివంబు నా
య్యనఁ బడఁద్రోయఁజాలును శ♦తాచలయుద్ధరణిం గలంపనా. 2273

ఆ. మఱియు భూమినతఁడు ♦ మహితశక్తిని నరి,కట్ట నేర్చునట్టి ♦ జెట్టి నిన్ను
మాత్ర మాత్మనున్న♦మరియాద మీఱఁగాఁ, జాలకున్నవాఁడు♦క్ష్మాతలేంద్ర.]

క. బలవంతమగుచుఁ దగు బె,బ్బులివాలస్పర్శనంబుఁ ♦ బోలె సహింపం
డల రాముఁ డిట్టి యవమతి, కలుగఁగ నినుమంతయైనఁ ♦ గాని నిజముగన్.

సీ. నేనేమి చేయుదుఁ ♦ దాని పౌరుషధర్మహీనుఁడై చనియెను ♦ గానక నెదొ
జగములన్నియుఘోర♦సమరంబునందొక్కటిగఁగూడివచ్చి తాఁ♦కఁగ నతండు
భయమునొందఁడు ధర్మ♦పథమున వర్తించుఁ గాన నధర్మమా♦ర్గమునఁ బోవు
జగమును ధర్మైక♦సరణిఁ బ్రవర్తింపఁ జేయుచు నున్నాఁడు ♦ క్షితితలేంద్ర !

తే. కానఁ బౌరుషధర్మముల్ ♦ మానిపోయె
ననుట యొప్పదు; వీర్యవ♦దగ్రగణ్యుఁ

డమ్మహాబాహుఁడు యుగాంత♦మందుఁ గాలుఁ
డై దమభూతంబులం గాల్చు♦నట్లు చెలఁగి. ౨౦ 2276

చ. నిరుపమధర్మబాణముల ♦ నీరనిధిప్రకరంబునైన ని
ర్భరనిజపౌరుషంబునను ♦ భస్మము సేయుఁ జుమా నరర్షభుం
డురుభుజుఁడై మృగేంద్రబల♦మొప్ప వృషాయత నేత్రశోభలం
బరఁగెడు నాతనిం దనయ♦వర్గము మత్స్యము చంపునట్లుగన్. ౨౧ 2277

క. జనకుండె తనంతన చం,పెను; ధర్మపరాయణుఁడగు ♦ ప్రియపుత్రకునిన్
వనికిం బంపితివే నీ, వనుమానము లేక భూత♦లాధిప! పూన్కిన్. ౨౨ 2278

ఆ. ఇట్టి నీకు విప్రు♦లెల్ల నాదృతిఁ జేయు,నదియు శాస్త్రవిహిత♦మైన యదియు
నగు సనాతనంబు♦నైన ధర్మము గల,దా? యదెట్లు గలుగు ♦ నకట! నీకు.

సీ. పతియె కాంతకు ముఖ్య♦గతి తొలుదొల్త రెండవగతి సుతుఁడు మూఁ♦డవగతియగు
జ్ఞాతులు నాల్గవ♦దై తగు స్వాతంత్ర్యమనుగతి, యిజ్జగ♦మందు లేదు
తొలిగతియగు నీవు ♦ దుష్టమునీమయా నానపత్నికి లొంగి♦నావు గాన
నాకు లేని విధంబ♦యే కాదె; రెండవగతియైన రాముండు ♦ కాన కేగ

తే. భర్తకలదానఁ గాన, నిన్ ♦ వదలి తనయు
వెంట వని కేగఁ దలఁపరా ♦ దింట నుండ
వలయు, జ్ఞాతులు దవ్వగా ♦ నలరుచుంట
వారు లేనట్టె తలఁపంగ ♦ వచ్చు నాథ!. ౨౪ 2280

తే. అన్నివిధముల నాశన ♦ మందఁ జేసి,తివి నను న్నీవు; నన్నొక్క♦తెనె నశింపఁ
జేసినాఁడవు కావు సం♦సిద్ధవిభవ, మైన యీరాజ్య మితరరా♦జ్యములనెల్ల.

క. పనిఁ బూని నాశమొందం, గను జేసితి నఖిలసచివ♦కాంతుల నాశం
బును గనఁ జేసితి నిన్నే, వినాశమును జేసికొంటి♦వి గద మహీశా!. ౨౬

—— దశరథుఁడు మూర్ఛపోవుట. ——

సీ. నన్ను నాపుత్రుని ♦ నశియింపఁ జేసితి పురజనముల నెల్లఁ ♦ బొలియఁ జేసి
తివి నీదు ప్రియసుతుం♦డు వనితయుం గడుసంతసంబుననున్నఁ ♦ జాలునల్లె
యున్నవారలటంచు♦నొగిఁ బల్కెఁ గౌసల్య; యిట్లుదారుణరీతి♦నెనఁగుచున్న
యమ్మాటలన్ విని ♦ ధరారాజు దుఃఖితుఁడై మూర్ఛ మున్గి శ♦య్యను బరుండి

ఆ. కొంతవడికిఁ దెలిసి ♦ యంతటఁ దద్దుఃఖ
కారణమగు పూర్వ♦కర్మ దుష్కృ
తమును దలఁచుకొనుచుఁ ♦ దా మరలన్ శోక
మొంది పడియెఁ బాన్పు♦నం దతండు. ౨౭ 2283

అఱువదియొకటవ సర్గము సంపూర్ణము.

౬౨ - వ సర్గము.

కౌసల్య భర్త నూఱడించి మన్నింపుమని వేఁడుకొనుట.

చ. అతిశయకోపమొంది యిటు ♦ లాతరుణీమణి దుఃఖితాత్మయై
సుతవిషయంబుగాఁ బలుక ♦ క్షోణివిభుం డల దారుణాంబక
ప్రతతివిధంబుగాఁ జెలఁగు ♦ పల్కులు వీనుల సోఁక దుఃఖమొం
ది తగ విచారమొందె నటు ♦ దీనతఁ బొందుచుఁ జింతసేయుచున్. ౧½ 2284

తే. ఆపరంతపుఁ డాత్మేంద్రి ♦ యములు కలఁగఁ
బాఱ మూర్ఛిలి యొకకొంత ♦ వడికిఁ దెలిసి
వేఁడి నిట్టూర్పులను జాల ♦ విడుచుచుఁ దన
ప్రక్కనిలుచున్న కౌసల్యఁ ♦ బాఱఁ జూచి. ౩ 2285

క. మరలం దలఁచెన్ మదిలో, నురుదుఃఖము నిట్లు పొంద ♦ నొక్కొ మ్మడి దు
ష్కరపాపమేమి చేసితి, నరయంగాఁ జాలననుచు ♦ నతఁడు తలంపన్. ౩½

క. మును లక్ష్యము తెలియక పో,యినన్ శబ్దమును బట్టి ♦ యే గుఱిగానే
యును గాన నట్టి కౌశల, మునఁ జేసిన పాపకృత్య ♦ ము మదిం దోఁచెన్. ౪

తే. ఎట్టికృత్యంబుఁ జేసెనో ♦ యెఱుకపడిన
నతఁడు తచ్ఛోకమును దన ♦ యాత్మజన్మ
విషయశోకంబు రెండును ♦ వేఱువేఱఁ
బైకొనం దాపమందెను ♦ స్వాంతమందు. ౫ 2288

క. మనుజేంద్రుఁడు శోకద్వయ,మునఁ బురపురఁ బొక్కి వడఁకి ♦ మోమును మెల్లం
గను వంచి మోడ్చి కరముల, ననుగ్రహముఁ గోరి యతివ ♦ కని యెన్ వగతోన్.

ఉ. ఇంతి! ప్రసన్నురాలవగు ♦ మెట్టులొ యాగతి వేఁడువాఁడ నొ
క్కింత మరల్పు చూడ్కి నిట ♦ కేర్పడఁ జేతులు మోడ్చినాఁడ నీ
వెంతయు [1]దాయలందుఁ గృప ♦ నే తగఁ జూపెడుదాన వెంతొ సు
స్వాంతవు; దేవి! ధర్మమును ♦ జక్క విమర్శ మొనర్చువారికిన్. ౭ 2290

క. గుణవంతుండైనను మఱి, గుణహీనుండైనఁ బతియె ♦ కోమలులకిలన్
గణుతింప దైవతం బని, గుణవంతులు పల్కువారు ♦ కోరి మృగాక్షీ!. ౭½

ఆ. ధర్మములఁ బరీక్షఁ ♦ దగఁ జేయుదానవు
దైవతములు గాంచఁ ♦ దగరు భువిని
ప్రాణనాథుఁడన్నఁ ♦ బ్రత్యక్షదైవతం
బిద్దియెఱుఁగు దీవు ♦ హితము మెఱయ. ౮ 2292

చ. అనవరతంబు ధర్మమున ♦ యుండె ప్రియంబును గన్నదాన విం
కను ధర హెచ్చుతగ్గులను ♦ గన్గొనుచుందువుగాన నిట్టి నీ

---

1 దాయలందున్=శత్రువులయందుఁ గూడ.

కును వగ యెంత గల్గినను ♦ గోమలి! మిక్కిలి దుఃఖమొందున
న్ను నిటుల నప్రియంబులను ♦ నొంపఁ దలంచుట న్యాయమౌనొకో!. ౯

చ. అని వచియించెః దీనుఁడయి ♦ యన్నరనాథుఁడు జాలిపుట్టఁ జె
ప్పిన వచనంబులన్ విని సు♦వృత్తయె కావున నీరుపాఱఁగా
నసువుగఁ గట్టినట్టి సలి♦లాధ్వము నూతనవృష్టివారి నొ
య్యన వెలిఁబుచ్చునట్లు నయ♦నాంబువులం గురిపించెఁ జింతతోన్. ౧౦

సీ. పతి నిట్లు బెడిదంపుఁ♦బలుకుల నొంచితి నని ధర్మమునకు భ♦యంబు నొంది
యేడ్పుతో రాజుచే♦మోడ్పును బద్మంబు వలెఁ జేతులం బిగఁ♦బట్టి శిరము
పై నుంచుకొనుచు సం♦భ్రమమునఁ గలగుండఁపడినపల్కులతోడఁ♦బలికె నిట్లు
నాథ! దేవా! ప్రస♦న్నతఁ గనవయ్య నిన్ దలసోఁక ధరఁబడి ♦ దండమిడుచు
తే. వేఁడుచున్నాను నాప్రాణ♦విభుఁడవైన
నీవు నను వేఁడఁ జేసితిఁ ♦ గావున నఘు
శీల నైతినిగాన దా♦సివలె నేను
దండనము సేయఁగాఁ దగు♦దాన నైతి ౧౨ 2295

సీ. శ్లాఘనీయుండయి ♦ సరసచిత్తుండగు పతి తన్నుఁ బ్రార్థించి ♦ భావమలరఁ
జేయు నట్లైవ్వతె ♦ చేసికొనునొ యానితంబిని రెండు లో♦కంబులకును
గొఱగాదు సుమ్ము; నే ♦ నెఱుఁగుదు ధర్మము ధర్మజ్ఞ! వీర! స♦త్యంబె పలుకు
వాఁడ వంచెఱుఁగుదు ♦ వరపుత్రశోకసంపీడితనై యేమొ ♦ వెఱ్ఱివెఱ్ఱి
తే. పలుకులాడితి మన్నింప♦వలయు నన్ను
శోకమున ధైర్యమెల్లను ♦ శూన్యమగును
విద్యయుం జెడు నన్నియు ♦ విపులశోక
హతములౌఁ గానఁ [1]దత్సమా♦నారి లేదు. ౧౩ 2296

క. తనదాయ తటాలున వేసినదెబ్బను నోర్వవచ్చు ♦ సిద్ధము శోకం
బనునది తటాలునం బైకొనెనా లఘువైన నోర్వఁ♦గూడదు దానిన్. ౧౬

తే. [ధర్మవేత్తలు వేదవే♦త్తలును సుంత
యైన సంశయమే లేక ♦ యఖిలధర్మ
ముల నెఱింగినవారునౌ ♦ మునులుగూడ
మోసపోదురు శోకస♦మ్మోహు లగుచు.] 2298

సీ. నాముద్దుసుతుఁడు వ♦నంబునం జరియింపమొదలిడియయ్యె [2]న♦యిదుదినములు
దుఃఖమునం దమి ♦ దూలియున్నట్టినాకవ్వి యైదేండ్లుగా ♦ నగపడియెడి

---

1 తత్సమానారి=ఆశోకముతో సమానమగు శత్రువు.

2 ఇట నైదుదినము లనుటకు వ్యాఖ్యాతలు వేఱువేఱుగాఁ జర్చచేసిరి. ఆసారము సుమం త్రుఁ డయోధ్యను బ్రవేశించినపుడు వ్రాయఁబడినది. అట్టిదే యిదియునని తెలియవలయు.

వానిఁ దలఁచుచుండఁ ♦ గానె నదీవేగమున నబ్ధిజలరీతి ♦ మనమునందు
నాశోకమే వృద్ధి ♦ నందుచున్నది యని కౌసల్య యూఱట ♦ గలుగునట్టి
తే. లలితవాక్యంబులం దగఁ ♦ బలుకుచుండఁ
గనె సరోజాక్షుఁ డస్తాద్రి ♦ గాననేగె
రాత్రియును వచ్చె నంతట ♦ రాజు తచ్ఛ
భోక్తులం దేఱి వగచియు ♦ నొందె నిద్ర. ౨౦ 2299

అఱువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౬౩ - వ సర్గము.

{ రాజు కౌసల్యతోఁ దాను మున్ను మునికుమారునిం బ్రమాదంబునం జంపినవార్తఁ జెప్పుట. }

క. ఒకగడియకు మేల్కని దుఃఖకలనమది దల్లడిల్లఁ ♦ గా దశరథుఁడా
సుకుమారు రాముఁ గూఱిచి, యకటా! యని చింతనొందె ♦ నతివలతోడన్.

క. సురపతితుల్యుండగు భూవరుఁడా రాఘవుల వనికిఁ ♦ బంపుటచే భా
స్కరుఁడు తమోగ్రస్తుండగు, కరణి నుపద్రవమునొందెఁ ♦ గడుశోకమునన్. ౨

క. తరుణీయుతుఁడై రాముం, డరణ్యముల కరుగఁ గోస ♦ లాధిపుఁడు స్వదు
ష్కరపాపము నసితాపాం,గరమ్యయగు సతికిఁ జెప్పఁ ♦ గా మదిఁ దలఁచెన్. 3

క. వనికిన్ రాముం డరిగిన, దినమాదిగ నాఱవదగు ♦ దినమున నడిరే
యిని రాజు మున్నుఁ దాఁ జేసినపాపముఁ దలఁచుకొనుచుఁ ♦ జింతిలుచుండెన్.

క. మనుజేంద్రుఁడు సుతశోకంబునఁ బొక్కుచుఁ బూర్వపాప ♦ మును దలఁచుచుఁ బు
త్రునకయి పొక్కెడు కౌసల్యను గని యిట్లనియె గద్గ ♦ దార్తధ్వనితోన్. ౫

సీ. కల్యాణి! యెవఁడైనఁ ♦ గాని యితరులకునశుభమో శుభమొ, యే ♦ దైనకర్మ
మును జేయునో యిత ♦ రునకుఁ దత్కర్మంబువలనఁ గలుగునట్టి ♦ ఫలముఁ దానె
పొందుఁ; గార్యంబులఁ ♦ బూని చేయఁగనున్నతఱి నెవ్వఁ డవ్వాని ♦ తగ్గుహెచ్చు
లను గాని యట్టిఫ ♦ లములఁ బుట్టెడుదుఃఖమునుసుఖంబునుగాని ♦ మనమునందుఁ
తే. దెలియఁడో మూఢుఁ డవ్వాఁడె ♦ లలన! వినుము
యెంతపూవుండునో ఫల ♦ మంతె యుండు
ననుచుఁ బుష్పంబుఁ గని ఫలం ♦ బున దురాశ
గన్నవాఁ డెవ్వఁడైనను ♦ గలుగునేని. ౬ 2305

*సీ. వాఁడును జూతపు ♦ ష్పంబు సూక్ష్మంబును వర్ణహీనముగాన ♦ ఫలము గూడఁ
జిన్నదిగానె యౌ ♦ చెట్టునఁ బుట్టునంచును, పెద్దవియు వర్ణ ♦ మున ఘనత్వ

---

* పుష్పం దృష్ట్వా ఫలే గృధ్నుః స్సశోచతి ఫలాగమే-అని మూలము.

మొందినవియు నయి ♦ సుందరములు నగు మోదుగుపూలను ♦ దాఁ దలంచి
కని దానిఫలములు ♦ ఘనతరాకృతులను గల్గియె యుండును♦గా, యటంచు

తే. నెంచి మామిడితోఁట ఛే♦దించి ప్రీతి
మోదుగులకు జలంబును ♦ బోసి పెంచు
నేని ఫలకాలమునఁ దాను ♦ నెన్నినట్టి
ఫలముఁ గానక శోకించు ♦ వెలఁది! నిజము. ౮ 2306

తే. ఎవఁడు రాఁగలఫలముల ♦ నెఱుఁగ కాత్మ
సంస్ఫురించినరీతిని ♦ నరగఁ గార్య
ముల నొనర్చునో; వాడు మా♦వులను నఱికి
తాఁ బలాశంబులం బెంచఁ ♦ దలఁచి పెంచి. ౯ 2307

క. ఫలకాలంబున సురుచిర, ఫలములఁ గనఁజాలనట్టి ♦ వాని విధమునన్
ఫలము లభియించు వేళల, లలనా! దుఃఖమును గనఁగ♦లఁడు వాఁడు సుమీ!.

క. తనయుని నభిషేకింపక, వనమునకుం బంపి చిన్న♦భార్యకును బ్రియం
బును జేయు నేను మామిడి, వనము నఱికి మోదుగులను♦వారిఁ దడుపుచున్.

తే. ఫలము గాంచని మనుజుని ♦ వంటివాఁడ
నైతి మతి చెడిపోయె నో♦యతివ కాన
దుష్కృతము నేను జేసినం♦దులకుఁ దగిన
చెడుఫలముఁ బొందుచున్నాఁడఁ ♦ జెప్పనేల!. ౧౦ 2310

క. వినుమో కౌసల్యా! నే, మును కౌమారంబునందు ♦ మొనగాఁ డితఁడే
ఘనుఁడు ధనుష్మంతులలో, నని పిలువంబడుచు ఖ్యాతి ♦ నలరుచు నుంటిన్.

తే. శబ్దమే గుఱిగాఁ గొని ♦ శరము నేయు
[1]నీకుమారుండు నాఖ్యాతి ♦ నెసఁగి యుంటి
నట్టిదశఁ జేసినాఁడ నీ♦యఘము; కర్మ
ఫలమదెప్పుడో తప్పక ♦ గలుగుఁ గాన. ౧౧ 2312

క. బాలుం డజ్ఞానంబున, నీలోకమునన్ విషంబ♦దెట్టులొ తినినే
బాలున కది యపుడే దుః,ఖాలయమయి ఫలము నిచ్చు♦నట్టులు నాకున్.

క. తెలియక నాయంతట ని,మ్ముల నే నొనరించినట్టి ♦ మునివధపాపం
బలఘుతర మాట దానికి, ఫలముగ నీదుఃఖ మిపుడె ♦ పైకొనె నన్నున్. ౧౨

*సీ. జగమునసామాన్య♦జనుఁడొక్కఁడును మాళివలెనె ఫలంబులు♦వఱలుచుండు
నని యెంచి కింశుకా♦వనిజాతసుమములు సొగసుగ నుండుటఁ ♦ జూచి వాని

1 కుమారశ్శబ్దవేధీతి-అని మూలము. * యథాన్యః పురుషః కశ్చి త్పలాశై ర్మోహితో భవేత్, ఏవం మయాప్య విజ్ఞాతం శబ్దవేధ్యమయం ఫలమ్-అనిమూలము. దీనియర్థము నిట విస్తృతముగా వ్రాయఁబడియెనని తెలియునది.

ఫలములు నట్టులె ♦ వెలయు నంచని భ్రాంతి నంది నట్లేను మృ♦గాళి శబ్ద
ములనె లక్ష్యంబుగాఁ ♦ దలఁచి బాణంబుల వాని వధించుట♦వలనఁ గలుగు

తే. ఖ్యాతినిం గాంచి తత్ఫల ♦ మట్లె లోక
హితముగా నుండునని మది ♦ నెంచి దానఁ
గలుగునట్టి యనర్థంబుఁ ♦ దెలియనైతి
దేవి ! యప్పటికిం గన్య♦వీవు సుమ్ము!. ౧౩ 2315

క. నే నప్పుడు యువరాజును, గా నుంటిని నంత ముదముఁ ♦ గామంబును బెం
పూనఁగఁ జేయంగాఁ దగి, జానగు వర్షర్తువలరె ♦ జగతీస్థలిపై. ౧౪ 2316

ఆ. భానుఁ డాత్మకిరణ♦వారంబునన్ భూర, సంబునెల్లఁ జక్క ♦ సంగ్రహించి
యిలఁ దపింపఁజేసి ♦ [1]యలప్రేతసంచార, భయదయామ్యదిశను ♦ బరిఢవిల్లె.

చ. ఖరకిరణుండు యామ్యమునఁ ♦ గన్పడ వేఁడిమి యంతరించె [2]వా
ర్ధరములు చల్లనై యలరె ♦ రమ్యమయూరములంతఁ జాతకో
త్కరమును గప్పలుం బొదలి ♦ గాఢరవంబులు చేయసాగె; నం
బరమునఁ దిర్గు పక్షులును ♦ వానకు ఱెక్కలపైని భాగముల్. ౧౬ 2318

క. తడియుట స్నానము చేసిన, వడువునఁ గన్పడుచుఁ గురియు ♦ వానకు ఘనమా
ఱెడిదపుగాలికిఁ గొనలుం, గడుఁ గదలెడు చెట్లపైకిఁ ♦ గారొక్కను పూనిక్కెన్.

తే. ఎవ్విధంబుననో చని ♦ యెట్లొ వ్రాలెఁ
గురిసియుం గురియుచునున్న ♦ ఘోరవృష్టి
ధారలం గప్పఁబడి మత్త♦దంతు లూర్మి
గణవిహీనసముద్రంబు ♦ కరణిఁ దనరె. ౧౮ 2320

తే. సలిలపూరంబులెల్ల స్వ♦చ్ఛములె యైన
క్షోణిధరధాతుగణములఁ ♦ గూడియుంటఁ
బాండురారుణములుగఁ గ♦న్పడుచు భస్మ
సంయుతిం బెక్కురంగుల ♦ సర్పవితతి. ౧౯ 2321

తే. అనుకరించుచు, వంకర♦గనె స్రవించు,చుండె, [నదులెల్ల స్వచ్ఛత♦నొందినట్టి
వైన వృష్టిని దామెల్ల♦నైక్య మొంది, యెట్టనై మిట్టభూముల♦కెక్కిపాఱె.]

చ. అతిసుఖమిచ్చు తత్సమయ♦మందును నేనును వేఁటలాడ ని
శ్చితమతినై శరాసనవి♦చిత్రశరంబులఁ దాల్చి యంత సా
యితమగు తేరునెక్కి మన♦మెంతయు మోదము నొందుచుండఁ బో
యితి సరయూతటంబునకు♦నింతిరో! నే [3]నజితేంద్రియుండఁ జూ!. ౨౦ 2323

క. కనుకన్ జలపానము చే,యను వచ్చిన తటిని రేయి♦యందు నరసి నే

1 పరేతచరితాం భీమాం-అని మూలము. 2 వార్ధరములు=మేఘములు. 3 జిఘాంసు రజితేంద్రియః-అనిమూలము.

నెనుఁబోతుఁ గరిని మఱియుం,కను గలవానిఁ వధింపఁ♦గాఁ గోరితిఁ బా!.

సీ. [సరయువుగట్టున ♦ జలముఁ ద్రావఁగనున్న యట్టి రేవుననే ర♦హస్యముగను
ధనువు నెక్కిడి రాత్రి♦తగఁ బొంచియుండి శ్రోత్రంబులఁజడినశ♦బ్దంబువినుచు
గుఱిచేసి వన్యమా ♦ క్రూరమృగంబును జంపితిఁ బిదప హిం♦స్రమగు నన్య
వన్యమృగంబును ♦ వసుధపైఁ బడనేసితిని శబ్దవేధన♦మునఁ దరుణిరో!]
ఆ. యంధకారమందు ♦ నఘులు గనరాని, యట్టిచోట నొక్క♦హస్తి గర్జ
నమ్ముఁ బోలె నీట ♦ నదిని గుండను ముంచు, శబ్ద మొండు వింటి♦నారసాక్షి!.

చ. విను నుటమీఁదఁ బాముపలె ♦ వెల్గుశరంబును నెత్తి దానిఁజం
పనుగలకోర్కెఁ దర్ప్రివము ♦ వచ్చినజాడను బట్టి యింతలో
వనగజముండునం చెఱిఁగి ♦ బాగుగ లక్ష్యముచేసి యేసితిఁ
ఘనశర మేగినట్టి దెస ♦ గాఢతరంబుగ మర్మమేఁచుటన్. ౨౬॥ 2326

చ. మునితనయుండొకండు వగఁ ♦ బూని నదీజలమందు వ్రాలుచున్
బెనురవ మయ్యయో! యనుచు ♦ వీనుల నిండఁగ నార్చుచున్ వచిం
చిన పలుకుల్ ప్రభాతమునఁ ♦ జెచ్చెఱ నామదిఁ జింతనొందఁగా
వినఁబడె; నేను బాణమును ♦ వేయఁగనే యది తాఁక నంతటన్. ౨౭॥ 2327

సీ. ఆతఁ డిట్లనియె నే♦మన్యాయ మిది నేఁ దపస్వినే నాకిలఁ ♦ బగతుఁ డెవ్వఁ
డుండు? శత్రువె లేక♦యుండు నాపైని నీ కఠినరూపంబు మా♦ర్గణ మిదివ్వ
డేరీతిఁ బడియెనో ♦ యే నర్ధరాత్రమం దెవ్వఁడైనను లేని ♦ యిప్పుడిటకు
జలమును గొనిపోవఁ ♦ జనుదెంచినాఁడ నన్నెవ్వఁడు మార్గణ♦మేసి కొట్టె
తే. నెవరికే యపకారమ్ము ♦ నేను జేసి
తిని? మనోవాక్తనుత్రయ♦మునఁ బరులకు
హింసచేయక వనమందు ♦ నేమి గలవొ
యట్టివానిని దినుచు నే ♦ యడవియందు. ౨౮ 2328

సీ. వాసంబుచేయుచు♦వరుసఁగాలముఁబుచ్చునను బోఁటిబుషిని బా♦ణమునఁజంపు
టిల నెట్లు గలిగె? జ♦టలసమూహంబును ధరియించి వల్కల ♦ ధారణంబు
చేసి యొక్కెడఁ బ్రీతి♦జింకతోళ్లను గట్టుకొనియున్ననునుఁ జంపి♦జనుఁడెవండు
కార్య మెద్దానిని ♦ గాంక్షించెఁ బొందంగ; నవ్వాని కేనేమి♦యపకృతి నొన
తే. రించితిని? జెడ్డపనియు జ♦రిగిన దిట్లు, దీన వాని కనర్థమే♦గాని యితర
ఫలమ దెద్దియు నిసుమంత♦గలుగ దరయ, నిట్టివాని నుతింతురే♦యెవ్వరైన.

చ. గురుసతిఁ బొందినట్టి యల♦క్రూరమతిన్ గురుపాపచిత్తు నెం
తురు గద మేనఁ బ్రాణములు ♦ తూఁగుచునున్నవి నిల్వ వింక నే
మరణము నొందఁగా వెఱవ ♦ మాతయుఁ దండ్రియు నేను జావఁగా
ధరణిని దిక్కులేక వగఁ ♦ దల్లడమందుదురంచు నేర్చెదన్. ౩౦॥ 2330

క. చిరకాలం బీవృద్ధుల, నరయుచుఁ బోషించినాఁడ ♦ నకటా! నే నీ
తరుణమునకు మృతినొందిన, ధరనెవ్విధి బ్రదుకఁ గలరు ♦ తలిదండ్రు లిఁకన్.

సీ. తెలివియించుకలేక ♦ తీవ్ర బాల్యము గన్న యెవ్వఁ డొక్క శరంబు ♦ నేసి నన్ను
నతివృద్ధులైన నా ♦ యనుఁగుఁ దండ్రిని దల్లి వధియించె? నను నొక్క ♦ పలుకు నాకు
వినఁబడె; నతికరు ♦ ణను గల్గఁ జేయు నా వాక్యంబు విని నేను ♦ బరమధర్మ
కాంక్షుండఁ గావునఁ ♦ గరము దుఃఖించితి నంత నా చేతుల ♦ నలరుచున్న
తే. సశరచాపము పడిపోయె ♦ క్ష్మాతలమున
బహువిధంబుల దీనత ♦ ప్రబల రేయి
నట్లు విలపించు [1]మునిపుత్రు ♦ నప్పలుకులు
విని మహాదుఃఖమున, మది ♦ వివశమగుట. ౩౨ 2332

క. స్మృతిచెడి యుండితి నంతట, నతివా! దీనతను గన్న ♦ యాత్మ వగపునం
దతిశయముగఁ దల్లడిలన్, జతనంబునఁ బోయినాఁడ ♦ సరయూనదికిన్. ౩౩

ఆ. అరిగి దాని చెంత ♦ నమ్మున నిహతుఁడై
భూమిఁ బండియున్న ♦ మునికుమారుఁ
గంటి; జడలగుంపు ♦ క్షమపైని జెదరి వ్యా
పింపఁ గుండ నీరు ♦ వెలికిఁ బాఱ. ౩౪ 2334

సీ. పాంసుశోణితములు ♦ బహుఘోరభంగి నంగమ్ముల నెంతయుఁ ♦ గ్రమ్మియుండ
బాణాగ్రమున మేను ♦ బాధింపఁ బడుచుండ నాతండు పడియుండె; ♦ నంత నేను
నచటికిఁ బోయిన ♦ నమ్మునితనయుండు భయపడి మదిలోనఁ ♦ బరితపించు
చున్న నన్నుం గాల్చ ♦ నున్నవాఁడుం బోలెఁ దేజంబునను వెల్గు ♦ తీవ్రదృష్టు
తే. లరుదుగాఁ బర్వఁ జూచుచు ♦ నతికఠినము
గా వచించె ధరాధిపా! ♦ పావనజల
ములను దలిదండ్రుల నిమిత్త ♦ ము గొని చనఁగ
వచ్చినట్టి ననుం దీవ్ర ♦ బాణమేసి. ౩౫ 2335

క. ధరణిం బడఁగూల్చితివే, సరియేనా యిద్ది నీకు ♦ సాంద్రాటవిలోఁ
దిరుగుచుఁ గాలము పుచ్చుచు, వరవృత్తిని నున్నవాఁడ ♦ వసుధాధీశా!. ౩౬
తే. ఇట్టి నే నీకు నపకార ♦ మేమి చేసి
తిని? గఠోరాంబకము మర్మ ♦ మునను నాఁట
నేను జచ్చుటయే గాక ♦ మాననీయు
లగుచు వృద్ధులునయి యంధు ♦ లగుచు నున్న. ౩౭ 2337

కవిరాజవిరాజితము:—

జననియుఁ దండ్రియుఁ ♦ జత్తురు వారలు ♦ చాలఁగ నిర్గత ♦ శక్తులునై

1 మునిపుత్రు నప్పలుకులు=మునికుమారుని యామాటలను.

గనులును బోవుటఁ ♦ గాఱియ నొందుచు ♦ గాఢపిపాసను ♦ గాంచుచునే
వనములఁ గైకొని ♦ వత్తునొ యెప్పుడు ♦ వారికయంచని ♦ వాంఛతొగం
దనయుఁడు వారిని ♦ దాఁ ద్వరఁ దెచ్చును ♦ ద్రావుక నుంచను♦తాపముననౌ.

ఆ. ఓర్వరాని దప్పి ♦ నొక్కవిధంబున
నోర్చియుండు రిచట ♦ నుర్విని బడి
నేను బొరలుచుంట ♦ నానాయనకు నెట్లు
తెలియఁగలదు? చెపుమ? ♦ దృప్తచిత్త!. ౪౦ 2339

తే. చదువు చదివియుఁ దపమును ♦ సలిపియు నిటఁ
దండ్రికిఁ దెలియ నట్లుగ ♦ ధరణిఁ గూలి
యున్నవాఁడను గానసే ♦ నొగిఁ దెలిసితి
ఫలము లేదని విద్యఁ ద♦పంబున నిఁక. ౪౧ 2340

సీ. నడువంగఁ జాలని ♦ నాతండ్రి నాగతి నెఱిఁగియుఁ దానేమి ♦ యిపుడు చేయఁ
గలఁడు? వాతాదుల ♦ నిలభూరుహంబొండు పడఁజూచినను నన్య♦పాదపంబు
దానిఁ గాపాడంగఁ ♦ దా సమర్థంబగు నే కాదుకద; రాఘు♦వా! కడంగి
త్వరగ నాతండ్రియో♦ద్దకు నీవె చని నాదు గతినెల్లఁ జెప్పుమా♦కడు జ్వలించు

ఆ. దావవహ్ని యడవి ♦ దహియించుగతి నిన్నుఁ
గ్రుధరహింపఁడతఁడు ♦ క్షోణినాథ!
యట్లుచేయ వేని ♦ యాతఁడు నినుఁ గాల్చు
నిదియొ దారి, పోయి♦ తేని యిపుడె ౪౩ 2341

చ. జనకుని యాశ్రమంబునకుఁ ♦ జక్కఁగఁ బోఁగలవట్లు పోయి యా
యనను గలంకఁ దేర్పు మతఁ ♦ డాగ్రహమూని శపింపకుండునా
తనువున నున్నబాణమును ♦ దక్షణమే వెడలింపవయ్య యో
ర్వను గడుఁ జాలనేనిఁకఁ బ్ర♦వాహము సైకతమార్దవస్థలం
బును బొడవైనదాని, జవ♦ముం దగఁ గోసెడునట్టు లేఁచెడిన్. ౪౪ 2342

చ. అన విని యేను నీతఁడు శ♦రాగ్రముతోడనె యుండెనేని బా
ధనుగను శల్యముం బెఱుకఁ ♦ దాను నశించునటంచు నెంచి దా
నిని వెడలించుచో మదిని ♦ నేర్పుతొలంగుట నేమితోఁప కా
త్మను బెనుచింతనొందితిని ♦ దారుణకృత్యముఁ జేసియుండుటన్. ౪౫ 2343

తే. ఆత్మదుఃఖించి బ్రహ్మహ♦త్యయుఁ గలుగునొ
యనెడుశోకంబు మీఱంగ ♦ నాతురుండ
నగుచుఁ జింతించుచుండుట ♦ నమ్మునీంద్ర
తనయుఁ డూహించుకొనియె నో ♦ వనజనయన!. ౪౬ 2344

చ. విను మతఁడెంతయే నలసి ♦ వేయివిధంబుల బాధనొందుచున్

దనతనువెల్ల స్రుక్కఁ బెను♦తాపము పైకొన నంగరాశియె
ల్లను దగ ప్రాస్వతం గని వి♦లాసముఁ బాయఁగ భూమిఁ దొర్లుచున్
దనమృతికాల మప్పటికి ♦ దాపునఁ జేరుట నిశ్చయించుచున్. ౪౫ 2345

చ. ననుఁ గని ధైర్యమూనుచు ఘ♦నంబగు దుఃఖము లో నడంచి నె
మ్మనమును దాయిగాఁగఁ దగు♦మాటల నిట్లనియెన్ నరేశ్వరా!
బెనువగఁ బొఱఁదోలితిని ♦ విచ్యుతధైర్యము నిల్పుకొంటిఁగా
వున నిఁక నీవు ధైర్యమును ♦ బూనుము చింతను బొఱఁదోలుమీ, ౪౬

క. ననుఁ జంపినందులకు నీకును బ్రాహ్మణహత్య యిదియె ♦ కూడెఁగదా యం
చనుమానమొందకుము నా, జననము వినిపింతు వినుము ♦ క్ష్మాతలనాథా!.

సీ. బ్రాహ్మణుండను గాను ♦ వైశ్యునకున్ శూద్రతరుణికిఁ బుట్టిన ♦ కరణుఁడ నిఁకఁ
దాప మొందకు మని♦దారుణబాణంబు తనమర్మములఁ గ్రుచ్చు♦కొనుటబాధ
నంది యేమాటయు ♦ ననఁ నేరకయె యుండియును గష్టముననిట్టు♦లొప్పఁబల్కి
గడగడవడఁకుచుఁ ♦ గడుస్మృతిఁ దప్పుచు భూమిమీఁదం బడి ♦ పొందరాని
బాధల నందుచు ♦ బాణప్రవేదన నవయవముల నెల్ల ♦ ప్రాస్వములుగఁ
తే. జేసికొని యార్చుచును మదిఁ ♦ జింతనొందు
చును మునీంద్రకుమారుఁడు ♦ సొరిదిఁ గాంచు
బాధలం గని యేనును ♦ బాణ మూడఁ
దీసితిం దత్తనువునుండి ♦ తెంపుచేసి. ౫౧ 2348

క. శరమూడఁదీసినంతనె, తరుణీ! సంతప్తుఁడగుచుఁ ♦ దపమె ధనముగాఁ
బరఁగు నతఁడు ననుఁ గనుచునె, పరలోకము నొందె నేమి♦పల్కఁడు నింకన్.

ఆ. వ్రణితమర్మ్యుఁడగుచుఁ ♦ బలవించి శ్రమముచే
బడలి నిశ్శ్వసనము ♦ లడలివిడిచి
తనువు నీటఁ దడియఁ ♦ దత్తీరమున నేలఁ
బడిన యతనిఁ జూచి ♦ వ్యథలఁ గంటి. ౫౩ 2350

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౬౪ - వ సర్గము.

దశరథుఁడు రామునిం దలఁచుకొనుచు మృతినొందుట.

తే. ధర్మమతియైన దశరథ ♦ ధరణిపతియు
నమ్మునికుమారు నెవరు చే♦యనివిధమున
దా వధించుటఁ దలఁచుచు ♦ దనయుఁ దలఁచు
కొనుచుఁ బలవించి కౌసల్య ♦ కనియె నిట్లు. ౧ 2351

క. మనమునఁ దెలియక యట్లా, పెనుబాపము చేసి యంత ♦ వెస నాహృదయం
బును వగలఁ బొగుల నేనే, పనిచేసినఁ బుణ్యమబ్బు ♦ బాగుగ ననుచున్. ౧
క. ఆలోచించితి నొంటిగ, నాలో నేనంత నతఁడు ♦ నాతో ననిన
ట్లాలస్యము చేయకయే, మేలుగదా చేయుటనుచు ♦ మించిన ప్రాన్కిన్. ౨
క. పరమోదక పూర్ణఘటం,బు రహిన్ నేనెత్తికొనుచు ♦ మునితనయుని యు
త్తరువును దలఁచుచుఁ జెప్పిన, సరణిం జని వారి పర్ణ♦శాలం గంటిన్. ౩
చ. కని యట దుర్బలాకృతులఁ ♦ గన్నులఁ గానక, చేయిపట్టి తో
డ్కొని చనువారు లేమికిని ♦ గుందుచు ఱెక్కలుపోవఁ బక్షులే
యనువున నుండునట్టు లట ♦ నాతురతం దగువారిఁ దండ్రినిన్
జననిని గాంచితిన్; నడువఁ ♦ జాలరు గావున వార లొక్కెడన్. ౪ 2355
చ. తనయునిఁ గూర్చి ముచ్చటలఁ ♦ దారె ముదంబునఁ జెప్పుకొంచు నా
తనికయి కూరుచుండుటయె ♦ తప్ప మఱొక్క ప్రయత్నమించుకే
నొనరుపలే, కనాథులటు ♦ లుండిరి; కొంతరొ. యేమియందు నిం
కను విను నానిమిత్తమున ♦ గాదిలిపుత్త్రుఁడు వచ్చునంచుఁ బా
వనసలిలంబుఁ దెచ్చునని ♦ వారికి నాశయు లేక యుండెఁ జూ!. ౫ 2356
చ. తొలుతనె బాలుఁ జంపుటకు ♦ దుఃఖము నామది మీఱుచుండె ని
మ్ముల భయమంకురించుటయు ♦ బుద్ధియుఁ జింతలఁగుందుచుండె నే
గలఁగుచుఁ బోయి వారలను ♦ గాంచఁగనే ఘనశోక మట్టె మి
క్కిలి నను నొంచె నేమనుదుఁ; ♦ గేవలవృద్ధులు వారు కోసలీ!. ౬ 2357
*క. ముని యంత నాపదధ్వని, వినఁగానే నాదుపట్టి! ♦ వెస రాకయె యే
ల నదిన్ జా గొనరించితి, వనుమానం బేల తెమ్ము ♦ యంబువుల వెసన్. ౭
తే. నాయనా! యింత కాలమా ♦ నదిని నీట
నేల తమిమీఱుచుండఁగ ♦ నీఁదులాడు
చుంటివో చెప్పవయ్య! యిం♦దొప్పు నీదు
నంబ నీరాకకై యిదె ♦ యాత్రపడెడు. ౮ 2359
క. చనుదెమ్మా! లోపలికిన్, జనకుఁడనగు నేనుఁ గాని ♦ జననియుఁ గానీ
తనయా! యప్రియ మపకృతి,యు నేమిచేసినను మదిని ♦ నుంపకు మింకన్.
తే. నీవు తాపసివౌట దా♦ని నిసుమంత, యైనఁ దలపోయవలదు ది♦క్కనఁగ నీవె
యగతికులమైన మాకు; న♦యనవిహీను,లమగు మాకక్షులన నీవె♦విమలశీల!.
క. మాయసువులు నీయందే, పాయక యున్నయవి యేల ♦ పలుకవు మాతో
నాయన! యనఁగా నమ్ముని, నాయకు నేఁ గాంచి భయము♦నన్ మతిచెడఁగన్.

* ఇందు వెసరాక, వెసన్-అని రెండుపర్యాయములు ప్రయోగింపఁబడుట "కించిరాయవి మే పుత్ర పానీయం క్షిప్ర మానయ" అనుమూలము ననుసరించియే యని తెలియవలయు.

క. పలుకులు తొ ట్రిల నక్షరములు స్పష్టముగాక యుండ ♦ మునుకొని వినఁగాఁ
గలిగినఁ దెలియని మాటల, బలవంతముగా మనస్సుఁ ♦ బట్టి నిలుపుచున్. ౧౨

సీ. ఆలోచనయు మది ♦ నంకురింపఁగఁ జేసి చేష్టలఁ జక్కఁగఁ ♦ జేసికొనుచు
నతనికి మదిని భ♦యంబును గల్గించు తనయ మరణవిప♦త్తును వచింపఁ
బూని యిట్లంటి నే ♦ భూపాలకుండను దశరథుండను పేరఁ ♦ దనరువాఁడ
నో మహాత్మక! నీకు♦నురు మోద మీఁజాలు తనయుఁడఁగాను బ్రా♦హ్మణునొనర్చి
ఆ. నట్టికర్మముననె ♦ యార్యనిందితమైన, యట్టి దుఃఖమిద్ది ♦ యలముకొనియె
జలముఁ ద్రావునట్టి ♦ స్థలమున కరుదెంచు, దంతిఁగాని శ్వాప♦దమును గాని.

క. మృతినొందఁ జేయఁగోరుచు, జతనంబునఁ జాపమూని ♦ సరయూతీరం
బతిజవమునఁ బొందితి సంయతచిత్తా! యంత నేను ♦ నానదిలోనన్. ౧౪

చ. జలమునఁ గుండముంచు నొక♦శబ్దము వింటిని దన్నినాదముం
గలయది యేన్గు గావలయుఁ ♦ గాకని యెంచి శరంబు నేసియ
వ్వల నది చెంతకేగి కన♦బాణము వక్షము వ్రక్కలింపఁగా
నిల గతజీవుఁడై పడిన ♦ హీనతరాయుషుఁ గంటిఁ దాపసున్. ౧౫ 2366

తే. శబ్దవేధనశక్తిచే ♦ సామజమును
జంపఁ దలపోసి నే నీట ♦ శరము విడువ
దాన నీపుత్త్రుఁ డొందె నం♦తము మహాత్మ;
యంత నచ్చోటికేగితి ♦ నచట నతఁడు. ౧౬ 2367

క. శరవేదనంబు దుస్సహ, తరమౌటం దాళలేక ♦ తపియించెడు నీ
వరసుతుఁడు చెప్పఁగా విని, శరమున్ మర్మముననుండి ♦ సరగున నేనున్. ౧౭

క. వెడలించి నంతనే యాతఁడు వగపున నాదుతల్లి ♦ దండ్రులు వృద్ధుల్
గడు నంధులింక వారల, నుడుగక పోషింతు రెవ్వ ♦ రుర్వి నటంచున్. ౧౮

క. విలపించుచు దివినొందెను, దెలియమి మీకొడుకు నేనుఁ ♦ దెగటార్చితి ని
ట్టులు వేగమె; యిఁకఁ జేయంగలకృత్యముఁ జేయుఁ డిట్లు♦ కార్యము జరగెన్.

క. శాపంబొ యనుగ్రహమో, యేపని చేయంగఁ దగునొ ♦ యిఁక దయసేయుం
డో పరమతపస్వీ! యని, యీపగిదిం బలుక నమ్ము♦నీశుండంతన్. ౨౦ 2371

తే. ఇట్లు నా దుఃఖమును వేగ ♦ యెఱుకపఱుపఁ
గ్రూరవాక్యంబు వినుచుఁ బై ♦కొనెడు దుస్స
హమగు నాయాసమును నిల్ప ♦ నతఁ డశక్తుఁ
డయ్యె; నురుతేజుఁడౌ ముని ♦ యంత నార్తి. ౨౧ 2372

సీ. బాష్పపూర్ణాస్యుఁడై ♦బహుళనిశ్వాసముల్ పుచ్చుచు వగపునఁ♦బొక్కుచుఁ గర
ములు మోడ్చితనముందు♦నిలుచున్న ననుఁగూర్చి పలికె; రాజా! నీవె♦ తెలుపవేని

మఱియొకరీతి ని♦మ్మాటయే తెలియునే భవదీయశిర మురివ్రీఁ ♦ బడును లక్ష
శకలంబులై; ధరా♦శాసకుఁడగు రాజు తాను వానప్రస్థు ♦ నేని నైనఁ
తే. దెలియకయె చంపునేనియు ♦ దేవనాథుఁ
డైన విచ్యుతపదుఁడగు ♦ ననినఁ దెలిసి
యట్లు చంపునయేని య♦య్యదను నందె
కలుగుఁ బదనాశనంబు ని♦క్కంబు సుమ్ము!. ౨౭ 2373

సీ. బ్రహ్మవిదుఁడయి త♦పము సల్పు మునిపైని [1]జ్ఞానంబునన్ సాయ♦కంబునైచు
నట్టివాని శిరంబ♦దప్పకే బహుశకలంబులై పడును గా♦ర్యంబు దీనిఁ
దెలియకయే చేసి♦తివి నీవు కావున బ్రదికియున్నాఁడ వి♦ప్పటికి; దెలిసి
యే చేసియుంటివ ♦ యేని నీకులమెల్ల నిపుడు లేకయె యుండు♦నేకద యిఁక
ఆ. నీవనంగ నెంత ♦ నృప! నాదుతనయునిఁ
గనుట కిదియె కట్ట♦కడ యిఁక సుతుఁ
గాంచలేము మేము ♦ కావున నిప్పుడ
మమ్ముచటికిఁ గొంచుఁ ♦ బొమ్ము నీవు. ౨౮ 2374

చ. తను విల నెత్తుటం దడిసియుఁ ♦ దా నజినాంబర మెట్లొచిమ్మ జీ
వనిచయహీనుఁడై ధరణి ♦ వ్రాలి కృతాంతు వశంబునందుఁ జి
క్కిన ప్రియపుత్రు, రక్షకునిఁ ♦ గేవలభక్తునిఁ జూడఁగోర్కి యో
మనుజపతీ! జనించెడిని ♦ మ మ్మలచోటికిఁ జేర్పు మం చనన్. ౨౯ 2375

సీ. అంత నే నొక్కండ ♦ నయ్యె మిక్కిలి గుందువారి నిద్దఱి నదీ♦తీరమునకుఁ
గొనిపోయి వారికిఁ ♦ గనులు గన్పడకుండుఁ గనుక నేనే తప♦స్విసికి మౌని
కిని వారి కొడుకుఁ దాఁ♦కించితి వారిద్ద ఱాతని స్పృశియించి ♦ యంతికమున
కరిగి యాపఁగరాని♦యా ర్తి నాతని శరీరము పైని బడి; రందు♦మమతమీఱఁ
తే. దండ్రి కొమరునిఁ గరములఁ ♦ దడవి యిట్లు
పలికె వత్సా! ననుం గని ♦ పరమభక్తి
వందనము చేయవేమి? యే♦పలుకు పలుక
వేమి? నాపైనఁ గోపమా ♦ యేమి? నీకు. ౩౦ 2376

క. ఏమిలఁ బడుకొన్నావే, యీమాడ్కిన్; ధర్మచిత్త! ♦ యెంతయు నాపైఁ
బ్రేమము లేదే జూడకు, మీ, మాతను జూడు మిచట♦నే యున్న దిదో!.

క. మమ్మెల కౌఁగిలింపవు?, నెమ్మది భాషింపు మింక ♦ నీవు హితముగాఁ
గమ్మని తేనియపల్కుల, సమ్మదమున నర్ధరాత్ర♦సమయమునందున్. ౩౧

---

1 ఇందు "జ్ఞ" అనుదానికి "క" యతిగాఁ జెప్పఁబడుట విశేషయతి యను నప్పకవిమత
ము ననుసరించి యని యూహింపనగు. "జ్ఞానికి నుపదేశవిధిప్రకాశము చేయన్" అని కవిబ్రహ్మ
యగు తిక్కనసోమయాజి ప్రయోగించెను.

తే. ఎవ్వఁ డింక లేచి శ్రుతులనో ♦ స్మృతిపురాణ
ములనొ శాస్త్రంబులనొ తగఁ ♦ బలుకుచుండు
మదికి నింపైనయట్టి య♦మ్మధురనినద
మేను వినఁగల? నింకమీఁద ♦ నెవఁడు నియతి. ౩౩ 2379

సీ. స్నానం బొనర్చి సం♦ధ్యను గొల్చియగ్నిహోత్రంబుల హోమకృ♦త్యంబుసల్పి
నా చెంతఁ గూర్చుండి♦ననుఁ బుత్రదుఃఖంబునఁ దిగులొంది మ♦నంబుగలఁగఁ
బాఱిన వానిని ♦ బరిచర్య యొనరించి సంతోషపఱచు? నే♦జనుఁడు కర్మ
ముల ననుష్ఠింపంగఁ ♦ గలిగిన శక్తి లే కల తృణధాన్యము♦ఖ్యములఁ గూర్పఁ
ఆ. నలవిగాక కఱ్ఱ♦నైనఁ జేతులఁ బట్టి, ననుఁ గొనిచను దిక్కుఁ ♦ గనకయున్న
యట్టి నాకు నింక ♦ నల కందమూలఫ,లాళిఁ బెట్టుఁ దినఁగ ♦ నతిథికివలె. ౩౫

మ. తనయా! నీపయిఁ బ్రీతిగల్గి జరచే♦తం జిక్కి యంధత్వముం
గని దైన్యంబును గాంచి పుత్రమృతిచే ♦ గాసిల్లుచుఁ దుస్థితిం
గనియున్నట్టి త్వదంబ నెవ్విధి నికన్ ♦ గావంగ నేర్తున్ జవం
బునఁ బోవం జనదింక నన్గుఱిచియే ♦ పోఁగూడ దీ వాగుమా!. ౩౬ 2481

చ. జననియు నేనుఁ గూడ నిదె ♦ సంయమినిం గనవత్తు మెల్లి నీ
వును మముఁ గూడి పోవఁదగుఁ ♦ బుత్రక! యీవని నిన్నుఁ బాసి చిం
తను గని దీనతం బడలి ♦ తాళఁగఁజాలము సుంతయైన ది
క్కనునది లేదు నిన్గలిసి ♦ యా యమువీటికి వత్తు మిప్పుడే. ౩౭ 2382

చ. శమనునిఁ గాంచి యీసుతుఁడు ♦ చక్కఁగ దల్లిని దండ్రిఁ గాచువాఁ
డమలమనీషుఁ డంచు మరి♦యాదను గన్గొనువాఁడటంచు వా
క్యము నిదె చెప్పెదన్; దగ మ♦దాత్మజుఁ డించుక జాగొనర్చిరా
యముఁడు క్షమించుఁ గాక సుమ♦హాయశుఁ డాతఁడు ధర్మచిత్తుఁడౌ. ౩౮

చ. కనుకనె నాకనాథునకు ♦ గారవముం దగ నక్షయాకృతిం
గను నభయప్రదానము నొ♦కం డొగి దక్షిణగా నొసంగనౌఁ
దనయ! దురాత్ముఁడై తగుని♦తం డఘకర్ముఁడు నిన్నుఁ జంపెఁగా
ననె భవదీయపాతకము ♦ నాశముఁ గాంచెను నిశ్చయంబుగన్. ౪౦ 2384

క. తనయా! నాసత్యము బల,మున యుద్ధము సేయు వీర♦ముఖ్యుల కే లో
కనివాన మబరు దానిని, గనుమా! వేగంబ; వీర♦కాండ మని మొనన్. ౪౧

క. వెనుకకు మరలక మార్మ్రోగ,ము నిడకయే మాఱుకొనుచుఁ ♦ బొంగెడుశౌర్యం
బునఁ బోరుచుండి మృత్యువుఁ,గన నేగతి దాని కబ్బుఁ ♦ గనుమా సుగతిన్.

సీ. సగరశైబ్యదిలీప ♦ జనమేజయులు దుందుమారుఁడు నహుషుఁడే♦మహితగతిని
బొందిరో యాగతిఁ ♦ బొందుము నీవును; సుజనవర్యులకును♦శ్రుతులఁ జదువు

వారికి మునులగు ♦ వారికి నేగతులలరునో; భూదాన ♦ మాచరించు
వారికి యజ్వల ♦ కారయ నేకపత్నీవ్రతులకును సి♦ద్ధించు నెట్టి
తే. గతులు, మఱి వేయియావులఁ ♦ గడఁగి యిచ్చు
వార లేగతిఁ గొందురో, ♦ భక్తి గురువు
లకును సేవలఁజేయు వా♦రికి నదెట్టి
గతియొ యాగతినే నీవు ♦ కనుము తనయ!. ౮౮½ 2387
క. గంగాయమునాతటినీ, సంగమమునఁ గాని యట్టి ♦ స్థలముల మఱి య
గ్నింగాని నియమ మొప్పఁగ, నంగము విడువారి గతియో♦యగు నీకు సుతా!.
క. మనకులము తపోనిష్ఠలఁ, గనువారిది గాన నిందుఁ ♦ గల్గిన యూన
జ్జనుఁ డెవఁడు గాని దుర్గతిఁ, గనఁడు గదా; నాకుఁ దార♦కంబగు నిన్నున్.
క. అతితీక్ష్ణసాయకంబున, మృతిఁ గనఁ జేసిన యతండు ♦ మిక్కిలియున్ దు
ష్కృతిగాన నతఁడుమాత్రము,గతి దానింబొందుననుచుఁ♦గడునార్తిమెయిన్.
క. దీనముగ మాటిమాటికి, మౌని యతం డేడ్చి నంత ♦ మౌనినితోడన్
సూనున కుదకక్రియ లా,మౌని యొనర్పంగఁ బూనె ♦ మానస మగులన్. ౮౯
తే. ధర్మవిదుఁడగు నమ్ముని♦తనయుఁడు తన,పుణ్యకర్మవశంబున ♦ బుధనుతమగు
దివ్యతనువును ధరియించి ♦ దేవవిభుఁడు, వెంటఁ జనుదేర సురపురి♦వేగ చేరె.
క. సురపతితో మునితనయుఁడు, నరుగుచు వృద్ధులగువారి ♦ నమ్మునిని సతిన్
బరికించి యొకముహూర్తము, సరసోక్తుల నూఱడించి ♦ చంచచ్ఛోతిన్. ౮౯½
తే. మిమ్ముఁ గొలుచుటచేత సు♦ఖమ్ముగు స్థితిఁ
బొందితిని మీరునున్ శీఘ్ర♦ముగనె నాని
వాసమును జేరఁగలరని ♦ పలికి నిర్జి
తేంద్రియుండగు నతఁడు దే♦వేంద్రుఁగూడి. ౯౦ 2394
క. తలిదండ్రుల కివ్విధమునఁ, బలుకుచు నసమానరూప♦భాసురమగు ని
స్తుల దివ్యవిమానము నెక్కి, లలిన్ దివమొందె సురలు ♦ గీర్తింపఁ దవ్వరన్.
తే. నిరుపమానప్రభావంబు ♦ నెగడు మునియు
భార్యతో నాత్మజునకుఁ ద♦ర్పణము చేసి
కరయుగము మోడ్చి తనచెంతఁ ♦ బరఁగు నన్నుఁ
గాంచి యిట్లని పలికె; నో ♦ త్యాతలేంద్ర!. ౯౧ 2396
క. ననుఁ జంపు మిపుడె చచ్చిన, యనూనమగు నిట్టిబాధ ♦ యాత్మ గనదు; నా
తనయుని నొక్కని బాణం,బునఁ జంపి యొనర్చితీ వ♦పుత్రకు నన్నున్. ౯౩
క. ఈదుఃఖంబును మించం,గాఁ దగు బాధయు నికొండు♦గలదే? మాశ్వం
బూది వధించితి నాసుతు, మేదిని లేఁ డట్టి విమల♦మృదుచిత్తుఁడు సూ!. ౯౩½

క. కనుకన్ నిను నే భస్మం,బును జేయుట మాని దుఃఖ♦మును మిక్కిలి పొం
దను జేయఁజాలి దారుణ,మును నగు శాపమ్ము నిడుదు ♦ మునుకొని వినుమా.

సీ. అంత్యకాలమ్మున ♦ యందున నాత్మజస్మృతిచేత నాకును ♦ స్మృతిని గల్గఁ
గను జేయఁజాలు దుః♦ఖమును గల్గించితి కావున నీవు ని♦ష్కారణేఁ బుత్ర
మరణదుఃఖమ్మున ♦ మరణింతు వోభూప క్షత్రియుఁడవయియుఁ ♦ జంపితి విటఁ
దెలియక నాపుత్రు ♦ లలితగుణాఢ్యునిఁ దాననె బ్రహ్మహ♦త్యకు సమాన

తే. మైన పాపము గల్గ దీ♦యంతకరము
నయిన యీయవస్థను నాకు ♦ నందఁ జేసి
తివి గదా దక్షిణలనిచ్చు ♦ నెవఁ డతండు
ప్రతిఫలంబును సరిగాఁగఁ ♦ బడయునట్లు. 24 0

మ. అతిఘోరంబగు నీయవస్థనె మను♦ష్యాధీశ! యీజన్మనుం
డె తగం బొందఁగలావటంచుఁ గ్రుధచే ♦ నిట్లాడి శాపంబు ను
ద్ధతి నాయందిడె; నంత నయ్యిరువురున్ ♦ దాపంబు పుట్టించు న
ట్లతిదైన్యంబున నేడ్చి యొక్కటిగ, దే♦హద్వంద్వముం బ్రాభులన్.

తే. కట్టుకొని చితిపై నెక్కి ♦ గాఢవహ్ని
శిఖల భస్మంబునై యంతఁ ♦ జేరిరి సుర
పురిని; దేవీ! మహాఘోర♦తరమునైన
యిట్టి శోకమునకు హేతు♦వేది యనుచు. 2402

చ. మనమున నెంచుచుండ మును ♦ మానక బాల్యమునందు శబ్దవే
ధనమున నేర్పునం జెలఁగి ♦ దర్పమునం దగు కాలమందు న
మ్మునిసుతుఁ జంపినట్టి యఘ♦ముల్ తగఁ దోఁచెఁ గృతాఘరూప మా
పనికి ఫలంబు గల్గిన ద♦భవ్య సుదుస్సహ దుఃఖరూపతన్. 2403

ఆ. విను మపథ్యవస్తు♦వితతితో నన్నంబు, దినిన వ్యాధివచ్చు ♦ తీరున నిపు
డిట్టి దుష్ఫలంబు ♦ నింతిరో ప్రాప్తించెఁ, బడఁతి! చావనున్న♦వాఁడ దాన.

క. ఘనుఁడగు నమ్ముని వచియిం,చిన శాపవచఃఫలంబు ♦ సిద్ధంబుగఁ గ
ల్గినయది నాకిప్పుడు కా,వున నీసుతశోకముననె ♦ పోయెద దివికిన్. 2405

క. విను! కంటిచూపు తప్పిన,ది నేత్రములఁ గానలేను ♦ దేవీ! నిన్నున్
ననుఁ జక్కఁగా స్పృశింపుమ!,యనిపలుకుచు భయముగదుర♦నార్తివగచుచున్.

క. మరలన్ భార్యను గన్గొని, నరపతి వచియించెఁ బుత్రు♦నకుఁ జేసిన దు
ష్కారకార్యము నాకుం నగు, గురుపాతకబుద్ధినోటఁ ♦ గోమలి! కంటే.

చ. తనయుఁడు నాదునాజ్ఞను ము♦దంబున నేమియుఁ బల్కకేగె న
వ్వనముల కద్ది యాతనికె ♦ బాగుగ నర్హము; సాధుచిత్తుఁడై

తనరుట దుష్పథంబున ని♦తాంతము పోవుచునున్నఁ బుత్త్రకుఁ
జనకుఁ డెవండు పండితుఁడు ♦ చానరొ! పాయును భూస్థలంబునన్. ౬౩౪

క. జనకుఁడు వెడలం బంపఁగఁ, దనయుం డెవఁ డతనిపై ని ♦ దానీర్ష్యను వే
కనఁ బఱుపకుండు? రాముఁడు, నను నిపుడు స్పృశించునేని ♦ నాకగపడునే.

క. జీవింతును; యమపురిలో, నావాసము చేయఁజనిన ♦ యవ్వల నెవరేఁ
గావలసిన బంధువుల న, దేవిధముననైనఁ గనుదు♦రే యెవ్వైనన్. ౬౫ 2410

క. కనుకన్ బ్రాణములుండం, గనె రాముని జూడఁ దలఁతుఁ ♦ గౌసల్యా! నిన్
గనులారఁ జూడఁజాలను, విను; స్మృతియును నశలఁజొచ్చె ♦ వింతగ నాకున్.

క. లలనా! వీరే యమదూతలు వే రమ్మనుచు నను ని♦తాంతము చిత్తా
విలతం గనఁజేయుచు నిమ్ములఁ బిల్చుచునున్నవారు ♦ మోములఁ గ్రుధచే.

సీ. మరణకాలమున ధ♦ర్మజ్ఞుఁడు సత్యపరాక్రముండును నగు ♦ రాముఁ జూడ
కున్నాఁడ నేనింత♦కన్న దుఃఖము మఱి యేమున్నదా రాముఁ ♦ డెట్టిపనిని
బూనిన దానికి ♦ భూమి నష్టముచేయఁ జాలరెవ్వరు నిట్టి ♦ సత్కుమారుఁ
గనలేమి నాకిప్డు ♦ గల్గిన పెనుదుఃఖ మెండ యల్పోదక ♦ మెట్లు పీల్చు

ఆ. కొనునొ యట్లు వేగ ♦ వనితామణీ! నాదు
ప్రాణపంచకమును ♦ వరుసఁ బీల్చు
చున్న దింకనేమి ♦ యొనరుతుఁ బదునాల్గు
హాయనములు దాఁట ♦ నవలఁ దమిని. ౬౭ 2413

చ. సురుచిరమంగళాకృతుల ♦ శోభిలు కుండలముల్ చెలంగ సుం
దరగమనంబు మీఱఁగను ♦ దా రఘురాముఁడు రాఁగఁ దన్ముఖం
బరుమగఁ జూడఁ గల్గుదురొ ♦ యాసుకృతుల్ నరులే తలంపఁగా
నరులుగ నుండఁ జాల రిది ♦ నాతిరొ! నిశ్చయ మంచు నమ్ముమీ!.౬౮ 2411

సీ. పద్మపత్త్రాక్షముల్ ♦ భాసిల్ల నందమౌ కనుబొమజంట త♦గంగ దంత
పంక్తియు నొప్పఁగా ♦ భవ్యనాసికమెంతొ వింతగ నలరార ♦ విమలరూప
మలరఁజంద్రునిఁబోలి♦యానందమొసఁగురాముని మోముధన్యులౌ♦మనుజులె
గలరు; శరత్కాల♦కమ్రచంద్రునిరీతిఁ బూచినతామర♦పువ్వుభంగి [కనఁ

తే. నలరి హారినువాసనల్ ♦ చెలఁగనున్న
నాకు దిక్కగు శ్రీరఘు♦నాథు మోము
గాఢపుణ్యులె చూడంగఁ ♦ గలరు; వనని
వాసనియమంబుఁ దీరిచి ♦ వాసిమించి. ౭౦ 2415

క. మరలి యయోధ్యకు వచ్చిన, వరగుణధాముననిని రాము ♦ భానుని చెంతం
దిరుగుచు గతతేజుండై, వరుసన్ మార్గమున కేగు ♦ భార్గవుభంగిన్. ౭౧

ఆ. వెలయుచున్నరాము ♦ వీక్షింపఁ గలుగుదు
రెంతొ సుఖముగన్న ♦ యిద్ధచరితు;
లింతి! వినుము చిత్త ♦ మెంతయు మోహంబు
గనెడి దాన హృదయ♦గరిమ తొలఁగె. ౭౪ 2417

సీ. వెలఁది నాయింద్రియం♦బులతోడ శబ్దము స్పర్శము రసము సం♦బంధమునను
దగియున్న నిపుడు శ♦బ్దస్పర్శరసము లింద్రియములు చెడుటచేఁ ♦ దెలియరాక
యున్న వింద్రియరాశి♦యొగిఁ జెడుటకు గారణంబును వినుము తై♦లంబుపోవ
దీపంబుతో నెడ♦తెగక సంబంధించి యున్న కిరణము లె♦ట్లొప్పఁ బాసి
ఆ. యంత మొందునట్టు ♦ లస్మచ్ఛరీరసౌ,ఖ్యవము తప్పఁ జెడియె ♦ స్వాంత;మంత
నింద్రియములు చెడియె♦నిం కేమి పల్కుదుఁ, జాన కర్మఫలము♦గానవయ్యె.

క. వినుము నదీరయమే గట్టును గోసెడురీతిగాఁ గొ♦డుకు శోక మనా
ఘుని నప్రజ్ఞుని నను వే, దనఁ బొందఁగఁ జేయు నిపుడు ♦ దారుణరీతిన్. ౭౬

సీ. హా మహాబాహూ! సు♦దాత్మజా! హా రామ! హా శోకనాశనా! ♦ హా పితృప్రి
యా! మద్గతీ! యిపు ♦ డరిగితి వెచ్చటి కయ్యో నితంబినీ! ♦ హా తపస్వి
నీ! సుమిత్రా! శత్రు ♦ నృపకుమారీ! క్రూరమానసా! కైక! య♦స్మత్కులంబు
నశియింపఁ జేయ జ♦ననమందితివె? యని కౌసల్యను సుమిత్రఁ ♦ గనుఁడు వారి
ఆ. సన్నిధానమందె ♦ క్ష్మాపతి యేడ్చుచుఁ
గార్యదృష్టి మిగులఁ ♦ గలిగియు సుతు
వనికిఁ బంపి దాన ♦ వనట నొందుచు దీనుఁ
డగుచు మృతిని గాంచె ♦ నార్తుఁ డగుచు. ౭౭ 2420

ఆ. అర్ధరాత్రమరుగ ♦ నతిదీనుఁడై దుఃఖ
మాత్మ వనటనొందు♦నట్లు చేయ
నోర్వలేక రాము ♦ నొగిఁ దలంచుచుఁ బ్రాణ
ములను వదలె నాత్మ ♦ గలఁగుచుండ. ౭౮ 2421

అఱువదినాలవ సర్గము సంపూర్ణము.

---

## ౬౫ - వ సర్గము.

రాజపత్నులు దశరథుమృతికై విలపించుట.

సీ. అంతఁ ద్రియామయు ♦ నల్లనఁ జన మఱుదినము ప్రొద్దున వంది♦జనులు వంశ
చరితంబుఁ గీర్తింపఁ ♦ జాలు సూతులు, శుభ పాఠకులగుచు నా♦బాలగోప
విదితమా గాంధర్వ♦విద్యయం దుత్తీర్ణులైన గాయకులు ని♦ట్లంద ఱొకట
వ్యాకరణాదిక ♦ భవ్యసంస్కరణంబు లొందు స్తోత్రంబుల ♦ నొగి రచింపఁ

తే. జాలుచును వచ్చి వేర్వేఱ ♦ సహితకృత్య
ములను జేయుచుఁ బార్థివ♦ముఖ్యు సౌధ
మునను జేరిరి వారప్డు ♦ జనవరుఁ దగ
స్తోత్రములఁ జక్కఁగా నుతిం♦చుచును వేఁకు. ౨ 2422

క. ప్రచురధ్వనితో నాశీ,ర్వచనంబులు చేయుచుండ ♦ వారలదౌ స్తో
త్రచయనినాదము రాసౌ,ధచతుర్భాగముల మించి ♦ తనరిన దయ్యెన్. 3

ఉ. అంతట సూతులా దశర♦థావనిపాలు నుతింపుచుండఁగా
సంతస మొప్పఁ దాళముల ♦ సాధుచమత్కృతి మీఱ వేయు వా
రెంతయుఁ బూర్వరాజులు జ♦నేశుఁడు చేసిన మంచికార్యముల్
వింతగ నెత్తి చెప్పుచును ♦ వేసిరి తాళము లింపుమీఱఁగన్. ౪ 2424

చ. నరవరు సౌధమం దుపవ♦నంబున భూరుహశాఖలందుఁ బం
జరములనున్న యావిహగ♦సంతతి తద్ధ్వని మేలుకాంచి చ
క్కరవము లొప్పఁ జేసె; ద్విజ♦కాండనుతాయత పుణ్యపూరుషో
త్కరవరకీర్తనంబులును ♦ క్ష్మాపతివంశచరిత్రగానముల్. ౫ 2425

క. చారువిపంచీనాదము, లారాజగృహంబునందు ♦ నంతట బెడఁగై
పూరించె; నంత విమలా,చారులు సేవైకకృత్య♦చతురులు నగుచున్. ౬

క. పరఁగెడు సేవకులంతః,పురమునఁ జరియించుచున్న ♦ పొలఁతులతోడన్
దరుణీపురుషాకృతులం, గరమరుదుగఁ గల్గు షండ♦గణములతోడన్. ౭ 2427

క. కలిసికొని ముందువలె న,య్యిలాధిపుని గొల్వవచ్చి ♦ రెంతయుఁ బూన్కిన్
లలితంబగు స్నానవిధిన్, గలిగిన పాండిత్య మలరఁ ♦ గాఁ దగు భృత్యుల్.

క. తరుణంబున విధియుతముగ, హరిచందనయుక్తజలము ♦ హాటకకలశో
త్కరములఁ గొని తెచ్చిరి; పెక్కురు వయసున నలరుచున్న♦కోమలు లచటన్.

సీ. నలుఁగుఁబిండులు తైల♦ములు మున్నుగాఁగల శుభ లేపనమ్ముల♦స్తోమములును
దంతధావనమైన ♦ తరువాత గండూషమునకు యుక్తంబగు ♦ ముఖ్యవస్తు
వులును, సమ్యక్పిష్ట♦తిల నారికేళ జీరాదికౌషధముల ♦ నద్ద మాభ
రణములు మంచివ♦స్త్రములు లోనగు నలంకారపరికరమ్ము ♦ లారసి, కొని

తే. తెచ్చి; రంతట నృపునకుఁ ♦ దెల్లవాఱె
నతఱి మంగళార్థంబుగ ♦ నయము మీఱఁ
దేఁదగిన వస్తువులవెల్ల ♦ దివ్యలక్ష
ణాభియుక్తములై యథా♦ర్హముగ నలరి. ౧౦ 2430

సీ. ఎక్కువగుణముల ♦ నెసఁగి ప్రకాశించె నాపరిజనులెల్ల ♦ నవనినాథుఁ
గొలువ నుత్సుకులయి♦యలరుచు నచట సూర్యోదయపర్యంత♦ముండి యంత

పర్యంత మాజన♦పతి రాకయుంటచే నేమి యాపదగల్గె♦నింకనేల
రాక యున్నాఁడో? యీ♦రా జని శంకించుచుండిరా భూమిపా♦లోరుశయ్య

తే. కనతిదూరమ్మునందున్న ♦ యంతిపురిని
గల్గు స్త్రీలేగుదెంచి యా♦కాంతుని మృదు
వినయభాషణములను మె♦ల్లనఁ దగంగ
మేలుకొల్పిరి వారట్లు ♦ మేలుకొలుప. ౧౨ 2431

చ. జనపతి లేవకుండుటను ♦ జానలు నప్పటి కర్హరీతిగా
నొనరుపఁ జాలుకృత్యముల ♦ నొయ్యనఁ జేయుచు యుక్తిమీఱఁగా
వినయముతోడ శయ్యనొగి ♦ వేయివిధంబులఁ దాఁకి నిద్రలోఁ
గనఁబడు జాడలేవియును ♦ గానమి నంతట [illegible]రు పూన్కితోన్. ౧౩ 2432

తే. స్వప్నశీలజ్ఞు లౌట నా ♦ జనపతీంద్రు
నందుఁ గరపదచలన చే♦ష్టాదికముల
యందు నెద్దానిఁ గనఁజాల ♦ కతని ప్రాణ
ములు గలవొ? లేవొ? యనెడు శం♦కల వడంకి. ౧౪ 2433

తే. వారిపూరంబునం దెదు♦ర్పడినయట్టి
ప్రబ్బలియె లోనుగాఁ గల ♦ బాధకతృణ
ముల కొనలు వోలెఁ జూపట్టి ♦ లలనలెల్ల
నార్తిఁ గని; రంత వడఁకుచు♦న్నట్టి స్త్రీల. ౧౫ 2434

క. జననాథుని యునికిని దగఁ, గనుఁగొనఁగా రాజు మృతిని♦గనె నని యచటన్
జనులకు మును గలిగిన యా,యనుమానము నిశ్చయంబె♦యనిదృఢపడియెన్.

తే. తనయదుఃఖమ్మునం జాలఁ ♦ దాపమంది
యున్న కౌసల్యయు సుమిత్ర♦యును వివశత
నంది నిదురించియుంటచే ♦ నంతమొంది
నట్లు మేల్కొనకుండి రా ♦ యదనునందు. ౧౬ 2436

మ. తనుకాంతుల్ తఱుఁగంగ వర్ణము నితాం♦తం బన్యరీతిం గనన్
ఘనదుఃఖంబునఁ జిక్కి నమ్రతను నా♦కార్శ్యంబునం గాంచి ప్రా
ణినికాయంబును ద్రుంచువేళఁ గననౌ ♦ నిర్ణిద్రధూమంబు గ
ప్పిన భాసిల్లనితారకాకృతిని నొ♦ప్పెం జూడఁ గౌసల్య తాన్. ౧౭ 2437

సీ. తొలుత భూవిభుఁడు మృ♦తుండౌటభాసిల్లకుండెఁ; గౌసల్యాంబ♦యుం బిఱుందఁ
దరువాత నాసుమి♦త్రయును గన్నుల నీళ్లు వర్షింప మోముల ♦ బాగు దప్పి
యుంటఁ బ్రకాశింప ♦ కుండి; రా కాంతల ట్లలసి నిద్రించు న♦య్యంగనామ
ణుల నిద్దఱిని జూచి ♦ విలపించి నిదురించుచునె గతాసువుఁడగు ♦ మనుజపతిని

తే. గాంచి కాంతామణులు వారు ♦ కాన యూథ
మును ధొలంగిన స్త్రీగజ♦మువలె దీన

లగుచుఁ గంతము లెత్తి య♦త్యంతరవము
లష్టె వ్యాపింపనేడ్చిరి ♦ యార్తలగుచు. ౨౦॥ 2438

క. వారల రోదననిస్వన, మారీతిఁ దగంగ నిద్ర♦నందిన కౌస
ల్యారమణియును సుమిత్రయు, బోరని నిద్రం దొఱంగి ♦ పొరలెడు వగచేఁ.

క. పతినిం జూచియుఁ దాఁకియు, మృతుఁడయ్యె నటంచుఁ దెలిసి♦మిక్కిలి వగచే
మతిచెడ హానాథా! యని, క్షితిఁ బడి రేడ్చుచు నె యంతఁ♦జిత్తము కలఁగన్.

సీ. కోసలేంద్రుని ముద్దు♦కొమరిత యారీతి ధరఁ బడి పొరలుచుఁ ♦ దనువునందు
నెల్ల దుమ్మొలయఁగా ♦ నిలపైకి దివినుండి పడిన తారాకృతి ♦ బాగు దప్పి
యుండె; దేహంబున ♦ నుష్ణాదిగుణములు నశియించి మరణంబు♦నరపతి గన
ధరపైని బడిన యా♦తరుణి హతంబయి పుడమిపైఁ బడినట్టి ♦ భూరినాగ
తే. తరుణినిం బోలెఁ గాంచిరా ♦ తరుణులు; నృపు
భార్యలందఱు కేకయ♦పార్థివేంద్ర
పుత్రికాదులు పతిమృతిఁ ♦ బోల నెఱిఁగి
శోకసంతప్తలై వగ♦చుచుఁ బొరలుచు. ౨౫॥ 2441

క. గతచేతనలై పడి రా, యతివలు కౌసల్యయాది♦యగు వారల యు
ద్ధతరోదన నిస్వన మొక్క, తెఱంగునఁ బూర్వనృపతి♦కాంతల రోదతన్.

ఆ. కలిసి కుదురుకొనుచు ♦ నలసౌధమెల్లను
నిండి ప్రబలమగుచు ♦ నిర్భరప్ర
తిధ్వనులను జేసె; ♦ దివ్యమై యుత్సాహ
భరితజనము నగుచుఁ ♦ బరఁగు గృహము. ౨౭ 2443

సీ. నరపతి మృతినొంది♦న పిఱుందనే కడు సంభ్రాంతజనమును ♦ సతతతాప
భరితజనాలాప♦భరితమ్మునయి తుమురాక్రందనము నయి ♦ యార్తబాంధ
వంబయి గతసమ్మ♦దంబయియుండె నెవ్వరిని జూచిన దీన♦భావమె కనఁ
బడుచుండె; సద్యశో♦భరితుఁడౌ భూకాంతుఁడంతమొందుట యెఱింగి♦నంతనతనిఁ
ఆ. జుట్టుముట్టి సతులు ♦ శోకమునన్ మున్గి, జాలిపుట్ట నేడ్చి ♦ స్థ్వాస్థలిఁ బడి
పొరలి లేచి యొకరొ♦కరి చేతులం గొని, యేడ్చి రపుడనాథ♦లెటులొయట్లు.

అఱువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౬ - వ సర్గము.

కౌసల్య విలపించుట.

చ. నరపతి యట్లు మృత్యువద♦నంబునఁ జిక్కి పయోవిహీనసా
గరమటు నిష్ప్రభానలుని♦కైవడి కాంతివిహీనుఁడైన భా

స్కరుని తెఱంగునన్ విగత♦కాంతిని గన్పడుచుంటఁ జూచి ని
ర్భరమగు శోకమొందుచును ♦ బాష్పజలావిలనేత్రయుగ్మయై. ౧౪ 2445

క. కడునడిఁ బతిశిరమును దొడ, నిడుకొని కౌసల్యచెంత ♦ నిలిచిన కైకన్
బెడిదపుఁ జూపులఁ గని యో, పడఁతీ! పాపమతి! దుస్వ♦భావా! కైకా!.

సీ. నీవు సకామవై ♦ నెగడుము కడుఁ బూన్కి నీప్రతిజ్ఞను దగ ♦ నెఱపితి విఁక
భర్తను విడిచితి ♦ బహుసస్యదంబుల విగతకంటకమయి ♦ వెలయు రాజ్య
మనుభవింపుము రాముఁ♦డడవికి నను దిగ విడిచిపోయెను బ్రాణ♦విభుఁడుస్వర్గ
మున కేగెఁ జెడుమార్గ♦మును బొంది కూడవచ్చిన బిడారును విడి♦చిన సతివలె

తే. దుష్టచారిణులున్న య♦నిష్టమైన, వ్యాఘ్రదేశంబునందుఁ బ్రా♦ణేశు సుతుని
బాసి బ్రదుకంగ నే నొల్లఁ;♦బాపచిత్త, త్యక్తధర్మయునగు కైక♦తప్ప జగతి.

తే. మఱి యిఁకెవ్వతె దైవస♦మానుఁడైన
భర్త విడనాడి బ్రదుకంగ ♦ వాంఛనొందు?
విషఫలంబును దినఁగోర్కి ♦ వెలయువాని
కందువలని దోషము తెలి♦యని విధమున. ౫౪ 2448

తే. లుబ్ధుఁడగు వానికిం దన♦లోభగుణము
వలన రానున్న దోషముల్ ♦ తెలియ వొక్క
గూని దానిని బట్టి యె♦గ్గును దలంప
కీనువంశముఁ గైకయే ♦ యిపుడు కాల్చె. ౬ 2449

చ. వరముల మున్నొసంగు తఱి ♦ వానివిధంబును నిశ్చయింప కి
త్తరుణమునం దదర్థముగ ♦ దారయుతంబుగ రామచంద్రు స
త్వరముగఁ గానకుం బనిపి ♦ ధారణికిం బతిచేయఁగా దగున్
భరతుని నంచుఁ గైక నృప♦వర్యుని కాజ్ఞ యిడంగ నాతఁడున్. ౬౪ 2450

మ. తనవాక్యంబుఁ దలంచి రాము వనికిం ♦ దాఁ బంపె నీవార్త న
జ్జనకక్ష్మాపతి విన్న నావలెఁ గనున్ ♦ సంతాప మిందుండమిన్
వని జీవించియు రామచంద్రుఁడు గత♦ప్రాణుండె యయ్యెన్ గదా
గనుకన్ ధార్మికుఁ డబ్జనేత్రుఁడగు నా♦ గారాబుపుత్రుం డెదన్. ౭౪ 2451

ఆ. ఇపుడు నే ననాథ♦నే కాక విధవతఁ, గనుట నెఱుఁగఁడు గద! ♦ వనములందు
వగలఁ బొందఁదగిన ♦ వనజాక్షి నాస్నుష, వాని బాఱిని బడి♦వనట నొందు.

సీ. బాహుజపుత్రి త♦పస్వినియై భయమొందుచుండంగల ♦ దుత్పలాక్షి
రాత్రులందు భయంక♦రధ్వను లొనరించుమృగపశులఱవ,దా♦నిఁగడు వినుచు
భయమొంది ప్రాణేశు♦ప్రక్కకు నొదుగఁగాఁ గలదు నిక్కము;జన♦కక్షితీశుఁ
డును జాల వృద్ధుఁడై ♦తనయులు లేకుండు వాఁడు గావున సీత♦వనటఁ దలఁచు

తే. కొని నితాంతము శోకము ♦ తనను ముంపఁ
బ్రాణములఁ బాయకుండునే; ♦ పతిని బాయఁ

జాలఁ గావున నేను నీ ♦ సమయమందె
ప్రాణములఁ బాయుదాన నె♦ప్పగిదినైన. ౧౧॥ 2453

క. పతితనువుఁ గౌఁగిలించుకొని తగఁ బాతపహునియందు ♦ నేఁ జొచ్చెద నం
చతిశయముగఁ బలవింపఁగ, నితంబినులు వచ్చి సుదతి♦నిం బట్టి వెసన్. ౧౨॥

తే. తొలఁగఁ దీసిరి ప్రేమచే ♦ నలమృతపతి
తనువునుం బట్టికొని యార్త♦నినద మడర
నేడ్చుచుండంగ దవ్వున ♦ కెంతొ పూన్కి;
నంతిపురమును గావ న♦య్యతివలుంట. ౧౩ 2455

సీ. అంతమంత్రులు వసి♦ష్ఠాదుల యానతి భూపుకళేబరం♦బును దగంగఁ
దైల పూరితపాత్ర♦తలమున నుంచి యా పిదపఁ జేయందగు ♦ వివిధరాజ
కార్యంబులను యథా♦క్రమమున జరపుచు నుండిరి; ధర్మాళి ♦ నొగి నెఱింగి
నట్టివారలు గాన ♦ నా సచివేంద్రులు తనయుఁడు లేకుండఁ ♦ దండ్రికి దహ

తే. నాదికృత్యంబులను జేయ ♦ ననువుపడమి
నెంచి యవ్వానిఁ జేయక♦యే శరీర
మెట్టిరీతిని జెడకుండు ♦ నట్టిభంగిఁ
గాచుచుండిరి; దశరథు♦కాయ మచట. ౧౪ 2456

రాజపత్నుల విలాపము.

క. తైలద్రోణిం బెట్టుట, నాలలనలు చూచి భూత♦లాధీశుఁడు తాఁ
గాలుని వీటికిఁ జనె నే, యీలాగున నంచు నంద ♦ ఱేడ్చిరి మిగులన్. ౧౫

చ. కరములు పైకినెత్తి వెతఁ♦గాంచుచు దీనతఁ గంటినీరు వే
వరుసలఁ గాఱుచుండ బహు♦భంగుల నేడ్చుచు హా క్షితీశ్వరా!
పరమకృపాత్ముఁడై ప్రియము ♦ పల్కెడు రాముఁడు సత్యవాది యి
త్తరుణమునందుఁ బాసిచనెఁ ♦ దమ్ముల మమ్ము వనాళి కక్కటా! ౧౬॥ 2458

తే. ఏల విడిచెద వీభంగి ♦ నిట్టి మమ్ము
వనికి రాముండు పోవ నీ♦వును దివంబు
నకుఁ జనంగ నిఁకన్ ప్రాణ♦నాథఘాతు
కియును దుష్టాత్మయునగు కై ♦ కేయి చెంత. ౧౭॥ 2459

క. పతిహీనలమై యెంతయు, వెతలంబడియుండు టెట్లు! ♦ వివిధసుగుణసం
తతినొప్పు రాముఁడెంతయు, గతి నీకును మాకుఁ బ్రభువు♦గా దలపోయన్.

సీ. ఆత్మవిజ్ఞానంబు ♦ ననువొందఁ గలవాఁడు శ్రీమంతుఁ డల రామ♦శీతరశ్మి
రాజ్యలక్ష్మిని బాసి ♦ రమణిఁ గానలకేగెఁ గాదె యవ్వీరునిఁ ♦ గాంతు నిమ్మఁ
బాసి యీఘోరమౌ ♦ వ్యసనంబుచేత మైమఱచియున్నారమి♦మ్మాడ్కినుండి
యును రాజ్యగర్వంబు♦ననుఁ గైకదూపింప నెట్లుండఁగలమొ? యు♦వెల్లనోర్చి

తే. పతిని వీరైకవీరులై ♦ పరఁగు రామ
లక్ష్మణుల భూమి గారాబు♦లలన నెవతె
తాఁ ద్యజించెనో యట్టిదా ♦ తరుణి యిఁక నె
వరిని ద్యజియింప? దని యేడ్చి ♦ పలికె రాత్రి. ౨౨ 2461

క. మనుజేంద్రపత్నులెల్లను, గనుఁదమ్ముల నీరు గ్రమ్మ ♦ ఘనశోకము త
మ్మును ముంప గతానందత, వనరుచుఁ బొర్లాడి రవనిఁ ♦ బడి యొక్కుమొగిన్.

చ. పురుషుఁడు లేని నాతివలెఁ ♦ బూర్ణశశాంకుఁడు లేని రాత్రి రీ
తి రమణుఁడౌ మహాత్ముఁడు క్షి♦తిప్రభుఁడుండమి నాయయోధ్య య
త్తరుణమునందు భాసిలక ♦ తత్తతిలెన్ జనులెల్ల నందు భూ
వరమృతికై విచారమున ♦ బాష్పములం గడునించి రశ్రులన్. ౨౪ 2463

క. కులకాంతలు హాహారవ,ములు సేయుచు నుండి; రంత ♦ ముంగిళ్లును లో
పలిభాగంబులు శూన్యం,బులుగాఁ గనుపట్టెఁ గాన ♦ బురవర మదియున్.

క. మునుపటిరీతి వెలుంగక, యనూన శోకమున మున్గి♦నట్లుండెను; బు
త్త్రునికై శోకించుచు న, మ్మనుజేంద్రుఁడు స్వర్గమొంద ♦ మానినులెల్లన్.

చ. ధరఁబడి యేడ్చుచుండ రుచి♦ధాముఁడు భానుఁడు నైజతీవ్రభో
త్కరమును జేరఁదీసికొని ♦ క్రన్నన నస్తమయంబు నొందె, రా
తిరియుఁ దమఃప్రభావమును ♦ దిక్కులఁ బిక్కటిలంగఁ జేయుచున్
బరఁగెను; గొంద ఱచ్చటికి ♦ వచ్చి నరేంద్రుని గాంచి యార్తులై. ౨౫

సీ. దశరథునకు బల♦దర్పసముగ్రులౌ తనయులున్నను నొక్క♦తనయుఁడైన
నిత్తఱిఁ జెంత లేఁ ♦ డిటు మనమూరక యుండుట తలపోయ ♦ నుచితమగునె
యేరీతిగానైన ♦ నిప్పృథ్వీశునకు సంస్కారమ్ము చేయుట ♦ కార్యమనుచు
యత్నింప బంధువు♦లాత్మజుండును లేక సంస్కారములు చేయఁ♦జనదటంచుఁ

తే. బలికె రామాటయే సత్య♦వాక్యమయ్యె;
నంతట నచింత్య దర్శనుం♦డైన రాజు
తనువు నుంచిరి తైలపా♦త్రంబునందు;
రాజు మరణంబు నొందఁ బు♦రంబు కుందె. ౨౬ 2467

క. అరుణుని బాసి వికాంతిం, బరఁగెడు నాకసమురీతి ♦ భగణరహితమై
యరుదుగ వెలుఁగని రాతిరి, కరణిని బతిమృతిని బొందఁ♦గాఁ బురమంతన్.

తే. చదుకములయందుఁ ద్రోవల ♦ జనులు నిండి
వెతలఁ గుందుచు నుండంగ ♦ వెలయకుండెఁ
బురుషులును స్త్రీలు గుమిగూడి ♦ భరతు తల్లిఁ
దిట్టి రూఱటఁ జెందక ♦ దీనవృత్తి. ౨౯ 2469

అఱువదియాఱవ సర్గము సంపూర్ణము.

## ౬౭ - వ సర్గము.

మార్కండేయులు వసిష్ఠునితో నరాజకమును జెప్పి వేఁడుట

చ. పురజనులెల్ల దుఃఖమునఁ ♦ బొక్కుచు సంతస మింతలేక ని
ర్భర నయనాంబుపూరగళ ♦ రావము క్రుంగఁగ నేడ్చుచుండ రా
త్రిరి కడు దీర్ఘమై పురస ♦ తీసుతికిన్ నగఁ గూర్చుచున్ జనెన్
సరసిజమిత్రుఁ డయ్యుదయ ♦ శైలము నెక్కెను రాత్రి యేగఁగన్. ౧౪ 2470

సీ. రాజాభిషేక క ♦ ర్తలు విప్రులరుదెంచి సభయందు జేరి రా ♦ సభఁ జెలంగు
చున్న మార్కండేయుఁ ♦ డున్నతమహిముతో మౌద్గల్య వామన ♦ మానులట్లె
గౌతమ కాశ్యప ♦ కాత్యాయనులుమహాయశుఁడై నజాబాలి ♦ యను మునియును
రాజకర్తలు వీరు ♦ బ్రాహ్మణోత్తములు మంత్రులఁ గూడివచ్చియం ♦ దలరుచున్న

తే. యవ్వసిష్ఠుఁ బురోహితు ♦ నగ్రుఁ గాంచి
యతని కభిముఖులై యిట్టు ♦ లనిరి వేఱు
వేఱ మనరాజు మృతిఁబొందె ♦ విపులపుత్ర
శోకమున దానిచేతనే ♦ యాకరణిని ౮ 2471

క. మనకీ రాత్రి శతాబ్దము, లనువుగ గడచినటులగుచు ♦ నతికష్టముగాఁ
గనుపట్టి యెట్లొ చనియెన్, జనపతి దివికరిగె రామ ♦ చంద్రుం డన్నన్. ౨

క. వనముల కేగెను దేజో,ఘనుఁడగు లక్ష్మణుఁడు నిల్వ ♦ కయె రామునితోఁ
జనియెఁ బరంతపుఁడగుచుం, దనరెడు భరతుఁడు సుమిత్ర ♦ తనయునితోడన్.

క. చనియెను గేకయదేశం,బున కా రాజగృహమనఁగఁ ♦ బొల్చెడు పురిలోఁ
దనమేనమామ గేహం,బున నున్నాఁ డిపుడు లేఁడు ♦ భూపతి యిచటన్. ౩

క. విను మిక్ష్వాకుకులంబున, జనియించినవారిలోనఁ ♦ జయ్యన, నెవనే
ని నృపునిఁ జేయఁగవలయును, జనపతిలేకున్నఁ జెడదె ♦ జనపదమెల్లన్. ౮ 2475

సీ. జనపతిలేని రా ♦ ష్ట్రంబున విద్యుద్వ్రజంబునఁ దగి మహా ♦ స్వనము నిగుడ
జలదము దివ్యస ♦ లిలముల వర్షింప; దింక శిలావృష్టి ♦ నే యొసంగు
క్ష్మాపతి లేమిని ♦ సస్యముల్ ఫలియించినను జోరజనులపా ♦ లను పెనుభయ
మున విత్తనములను ♦ మనుజులు చల్లరు నృపతి లేకున్నఁ దం ♦ డ్రికి సుతుండు

తే. గాని పతికిని వనితయె ♦ గాని వశత
నుండి వర్తింప నొల్లరా ♦ యుర్విపతియు
లేనితావున దొంగపా ♦ లౌను గాన
ధనము గలుగదు మఱి బంధు ♦ తయును లేదు. ౧౦౪ 2476

క. కలుగదు భార్యయుఁ; బెనుభీ,తులు పుట్టు నవేవియున్నఁ ♦ దొలుతనె సస్యం
బులఁ గొనుట నమ్ముట యనం, జెలఁగెడు సత్య మలభూమి ♦ సిద్ధించుటెటో.

క. దీనికి మించిన భయమే, మే మున్నదె? స్వస్థమనసు ♦ లేపారంగా
మానవులుండమి సభలన్, మానుగఁ గూడరిఁక జనులు ♦ మర్యాద చెడన్.

సీ. పడఁగూల్తురను పెను♦భయమున సుందరోద్యానమ్ములను నిల్పఁ ♦ దలఁపరెవరు
దుష్టమతుల్ డాఁగ ♦ దుర్గములగునని దేవాలయాది మం♦దిరముల నతి
పుణ్యమ్ములను గట్టఁ ♦ బూనరు తమిమీఱ; రాజు లేకున్నను ♦ గ్రతువులెపుడు
చేయఁబూనరుగదా ♦ క్షితిదేవతలు వేదపఠనంబు సేయరు ♦ వ్రతము లాచ
రింపరునుతిజితేం♦ద్రియులయిమహనీయులగుభూసురశ్రేష్ఠు♦లొగిఁ బ్రియమున
తే. నంతరాయభయంబున ♦ నమ్మహాక్ర
తువులఁ జేయరు; మఱియుఁ గ్ర♦తువులఁ జేయు
బ్రాహ్మణులుఁ జాల విత్తసం♦పన్నులైన
దండన భయమ్మునన్ మహా♦ధ్వరములందు. ౧౩ 2479

క. ఈయరు దక్షిణలను శ,క్త్యాయతులై యుండియును, మ♦హాత్మా! విను భూ
నాయకుఁడు లేని క్షితిలో, నీయెడ నటనర్తకాదు♦లెల్లఁ జెలఁగియున్. ౧౪

క. ధనమిచ్చువార లుండమిఁ, దనరవు సుమ్ముత్సవములు ♦ ధాత్రిని వృద్ధిం
గనఁ జేయ సమర్థముల,య్యును యాత్రలు నమసిపోవ ♦ కుండునె యింకన్.

సీ. ఏదియేఁ గార్యంబు ♦ నెంచి వాదించెడువారికి మఱియు వ్యా♦పారజీవ
నులకు నియంతయు♦లలేఁదీర్పరియునౌనుజనుఁడుండమిఁనిబ్రయో♦జనముగలుగ
దితిహాసముఖకథ♦లెల్లఁ జెప్పెడువారు వానిని వినువారుఁ ♦ బూనువారి [డ
కవిచెప్పి బహుమతు♦లమరఁ బొందెడునట్లు చేయురాజులు లేమిఁ♦జెలఁగియుం
తే. రింక నేమని చెప్పుదు ♦ మిలను రాజు
లేకయుండినఁ దస్కరా♦నీకభీతిఁ
గలిగి యుంటను గన్నెలు ♦ కనకభూష
ణాలిఁ దాలిచి సాయాహ్న♦మందు నెలమి. ౧౬ 2482

క. ఆడుకొనం జేడియలం, గూడి మహోద్యానతతుల♦కుం బోరుసుమీ
కీడొనరింతురు కుజనులు, కూడి యటం జెంచి కాము♦కులు పురుషవరుల్.

క. తమతమకాంతామణులం, దమిఁ గూడి జవంబునఁ జనఁ♦దగు రథములపై
గమనము చేయరు విహరిం,ప మహోద్యానముల కవని♦పతి లేకున్నన్. ౧౮

తే. ధనము గల్గిన వైశ్యులు ♦ తస్కరభయ
మునను గాలికిగాఁ దల్పు♦లను దగంగఁ
దెఱచుకొని సుఖముగను, రా♦త్రిరులయందుఁ
బండుకొన నేర రేమని ♦ పలుకవచ్చు. ౧౯ 2485

తే. విను మరాజకదేశంబు♦నను మనోజ్ఞ
దంతములు వన్నెచూప బ♦ద్ధవరఘంట

లలరి మ్రోయంగ నఱువది ♦ హాయనముల
కరులు రాజ్మార్గములయందుఁ ♦ దిరుగ వెలమి. ౨౦ 2486

సీ. విను మరాజకమగు ♦ విషయంబునం దమంత్రకసమంత్రకములై ♦ తనరు నిషువు
లను బాణములఁ దగ ♦ నలవాటు చేసికొనుతఱి వానిని వేయు ♦ వితతశూర
వరుల జ్యానిర్ఘోష ♦ మురసిన వినఁబడదట్టిదేశమునఁ గ్ర♦యార్థ వస్తు
వితతిని గొని దూర♦విషయంబునకుఁ బోవు వణిజులకెల్లను ♦ బథము కుశల
తే. ముగఁ గనంబడకుండును; ♦ బ్రొద్దుక్రుంకు
నెచట నద్దియె వాసమా ♦ నెవనికట్టి
[1]వశికి ముని కన్నమిడఁ దగు♦వారు లేమి
నాత్మ నాత్మఁ దలంచుచు ♦ నరుగరాదు. ౨౩ 2487

క. మునివర్యా! యాదేశంబున యోగక్షేమములును ♦ బొలుపొందవు; సై
న్యనిచయమరుల జయింపదు, ఘనశక్తిఁ జెలంగు సైన్య♦కాంతుఁడు లేమిన్.

చ. మనముల సంతసంబలర ♦ మానవు లంబరభూషణాదులం
దనువు నలంకరించుకొని ♦ తారు రథంబుల నుత్తమాశ్వసం
క్తిని దమి నెక్కి వేచన మ♦దిం దలపోయరు చోరభీతిచే;
జనులట దుష్టభీతి ఘన♦శాస్త్రవిదుత్తములయ్యుఁ దారొగిన్. ౨౫ 2489

క, మునులుండు వనంబుల నెన్నిన శాస్త్రార్థములనెల్ల ♦ నేర్పునఁ జేయం
గను బూన, రుపవనంబులఁ, గనఁజాలరు దుష్టు లచటఁ ♦ గనఁబడుచుంటన్.

సీ. అంతరాయము గల్గు♦నను భీతి జనులందు నమరుల నియతులై ♦ యర్చనముల
నలరింపఁగోరి మా♦ల్యముల మోదకదక్షిణలను సంపాదింప♦రెలమి మిగులఁ;
జందనాగరువుల ♦ సంతసమునఁ బూసికొని వసంతర్తువు♦నను మహీజ
ములపోల్కి రాజసు♦తులు ప్రకాశింపరు; జలములేనట్టి న♦దులును దృణము
తే. లేని వనములుఁ గాపరి ♦ లేని ధేను
వులును రంజిల్లనట్లుగఁ ♦ బుడమిఱేఁడు
లేని రాష్ట్రము వెలుగొంద ♦ లేదు సుమ్ము
స్యందనజ్ఞాపకాంకమా ♦ ధ్వజము, మౌని!. ౨౮ 2491

క. అనలున కరయఁగ ధూమం, బనునద్ది ప్రకాశకాంక♦మగు నారీతిన్
మనకెల్ల రాజు ధ్వజమగుఁ, గనుక నిటన్ రాజు స్వర్గ♦గతి నొందెఁ గదా!.

చ. జనపతి లేనిదేశమున ♦ సాధుమునీశ్వర! యేరికేని యా
తని ధనమెల్ల భద్రముగ ♦ దాఁపఁ దరంబును గాకయుండు; మ
త్స్యనికరరీతి నొండొరులఁ ♦ జంపుకొనం దగి యుందు రెల్లరున్
మనుజులు నాశ్రమోచిత స♦మస్తవిధుల్ విడనాడి యెంతయున్. ౩౦ 2493

1 వశికి=జితేంద్రియునకు.

తే. విగతసందేహులై యెందు ♦ విధియె లేద
నుచు నచింపుచుఁ దగఁ దిరు♦గుచుఁ జెలంగు
నాస్తికులు భూపుఁడుండ దం♦డనభయంబు
వలన సాధువులుగను గాఁ♦గలరు సుమ్ము. ౩౨ 2494

క. తనువున కహితచ్ఛేదన,మున హితమును గూర్చి కనులు ♦ ముదమునఁ దగురీ
తిని సత్యధర్మముల న,న్నను జేయుఁడు ప్రబలఁ జేయు ♦ మహిని సతతమున్. ౩౩

సీ. సత్యంబు ధర్మంబు ♦ జనపతియే సుమ్ము సత్కులమునఁ బుట్టు ♦ జనులకెల్ల
సత్కులాచారముల్ ♦ సతతంబు వర్ధిల్లఁ జేయువాఁ డాతఁడే ♦ సిద్ధబుద్ధి
జనపతియే తల్లి ♦ జనకుఁ డాతఁడె హితకరుఁ డతండే ముని♦కాంత! యముఁడు
దండించు నక్కుబే♦రుండు ధనంబిచ్చు సురపతి పాలించు ♦ వరుణుఁడు తగ
తే. మంచి యాచారముల నేర్పు ♦ మనుజపతియె
యిన్నిఁటిని గూర్చుఁ గావున ♦ నిందటికిని
గలఁప నధికుండె యగుఁ; జెడుఁ♦గులను మంచి
నేర్పఱించెడు ఘనతమ♦నృపుఁడు క్షితిని. ౩౪ 2496

ఆ. లేకయున్న నకట! ♦ లోక మిదంతయుఁ
దమసు గ్రమ్మినట్లు ♦ తనరుగాని
తగిన దిద్ది యిదియె ♦ తగదని యేదియుఁ
దెలియ దిదియు మీకుఁ ♦ దెలిసినదియె. ౩౫ 2497

క. జననాథుఁడు జీవితమును, గని యున్నపుడేము తావ♦కంబగు నాజ్ఞన్
వననిధి వేలోల్లంఘన,మును జేయనిరీతి దాఁట♦ముగదా మానీ!. ౩౬ 2498

ఆ. ఇంక నిప్పుడట్టు♦లే యుందుమని వేఱ, చెప్పనేల? వేగ ♦ క్షితిసురేంద్ర!
పతిని నిలుపఁ దగిన♦పని మనదని యెంచి, నిలుపు మొకని నెంచి♦నృపుని నీవు.

క. జనపతి లేఁడే మాకుం, గనుపట్టు ననర్థములను ♦ గడునెంచి మదిన్
వనతుల్యమగును రాజ్య, మ్మనియును దలపోసి, భూత♦లాధిపు నిపుడే. ౩౯

క. ముని! యీయిక్ష్వాకుకులం,బునఁబుట్టిన రాజపుత్ర♦ముఖ్యుని నొకనిం
గనుఁగొని యభిషేకింపుము, చనదిఁక నాలస్య మీవు ♦ సల్పుట యనుచున్.

అఱువదియేడవ సర్గము సంపూర్ణము.

---

౬౮ - వ సర్గము.

భరతునిఁ దోడ్కొనివచ్చుటకై వసిష్ఠుని దూతలం బంపుట.

క. వినయమున వారు వచియిం,చిన పలుకుల వినుచుఁ దగ వ♦సిష్ఠమునియు వే
తన మిత్రులైన సచివుల, మునివర్యుల వారిఁగాంచి ♦ మునుకొని పలికెన్. ౧

సీ. భరతుఁ డిప్పుడు సహో♦దరుని శత్రుఘ్నుని గలిసి రాజగృహాఖ్య♦వెలయుపురిని
మాతులగృహమున ♦ మమతసుఖంబున నున్నాఁడు వీరుల ♦ నన్నదమ్ము
లనువారినిపుడుదో♦డ్కొనిరాఁగవేగంబచనుదూతలనుదర్వఁ♦జనెడు హయము
లను నెక్కి పొండింక ♦ నని పంచెదను; రాజె భరతున కిచ్చు నీ♦ధరణి నింక
తే. మనము యోజింపఁ దగినదే♦మనియె; నంత
సచివముఖ్యులు మీయాజ్ఞఁ ♦ జనెడు వారు
దూతలని పల్కి, రాముని♦తోడ; నతఁడు
వారు పల్కిన మాటల♦భంగి వినుచు. ౪ 2503
*తే. పిలిచె దూతల సిద్ధార్థ♦విజయులను జ
యంతుని నశోకు, నందను ♦ నపుడె వారు
వచ్చి నిల్చిరి వారితోఁ ♦ బలికె నేమి
చేయవలయునొ వినుఁడు నేఁ ♦ జెప్పువాఁడ. ౫ 2504

క. రండిట వేగమ చనఁగల, గండుఁ దురంగముల నెక్కి ♦ కడువడి భరతుం
డుండెడు రాజగృహపురికి, దండివగ మాని పోయి ♦ తగ భరతునితోన్.

క. నాయాజ్ఞఁ బల్కుఁ డివ్విధి, "మీయనుఁగుఁబురోహితుండు♦మీమంత్రులు మ
న్నీయెడఁ బంచిరి వారల, వా యోగక్షేమములను ♦ నాదృతిఁ దెలుపన్.

తే. మించిపోయెడుఁ గాలంబు ♦ మిగులకుండ
నొక్కకార్యంబు మీరిపు ♦ డొనరుపఁ దగి
యున్న దాలస్యమును జేయ♦కుండ నిపుడె
రమ్మనుచుఁ జెప్పె" ననుఁడు, భ♦రతునితోడ. ౮ 2507

చ. వనములకేగె రాఘవుఁడు ♦ పార్థివుఁ డంతము నొందెనంచు నిం
కను రఘునాథవంశమున ♦ గాఢముగాఁ దగినట్టి యీక్షయం
బును వచియింపఁ బోకుఁ డల ♦ భూపతికిన్ రఘురామువిన్నత
మ్మునకును బట్టువస్త్రములు ♦ ముఖ్యవిభూషణరాజిఁ గాన్కగాన్. ౯ 2508

చ. త్వరపడి కొంచుఁ బొండనుచు ♦ దారికి బత్తెము లిచ్చి పంపఁగా
ధరణిసురేంద్రునాజ్ఞఁ గొని ♦ తత్క్షణమే పయనంబుచేసి స
త్తురగములన్ బ్రయాణమునఁ ♦ దోరపువేగమునం జనంగ నే
ర్చి రహిఁ జెలంగు వానిఁగొని ♦ చేరిరి దూతలు గేహసీమలన్. ౧౦ 2509

సీసమాలిక:—

తరుణీసుతాదుల ♦ కరుగుటకుం దగు కారణములఁ దెల్పి ♦ కావలసిన
పాథేయముల నెల్ల ♦ బాగుగ సమకూర్చుకొని కార్యశేషంబు♦లను గనుఁగొని

* సిద్ధార్థాదయో మంత్రిసమాన నామానో దూతాః నమంత్రిణః-అని వ్యాఖ్య. సిద్ధార్థాదులు దూతలు. మంత్రులపేరులుమాత్రము వీరికిం గలవని యెఱుంగఁదగు.

యవ్వసిష్ఠునిచెంత ♦ కరుదెంచి యనుమతి నంది సత్వరముగ ♦ నరిగి; రంత
*వారయోధ్యకు ముందు ♦ బడమరదెసయందు దక్షిణోత్తరముగ ♦ దనరుచున్న
యపతాల పర్వత ♦ మద్దానికిం బశ్చిమమునఁ బ్రలంబశై ♦ లమది దక్షి
ణోత్తరవ్యాప్తమై ♦ యొకరీతి వంపుగాఁ దిరిగి ప్రాక్పశ్చిమ ♦ దిశలఁ జెంది
యుండుటఁ బయనమై ♦ యురుగతిఁ బడమరగా నపతాలశి ♦ ఖరికిఁ బశ్చి
మముగఁ బోవుచుఁ బశ్చి ♦ మమునందుఁ దగు ప్రలంబాద్రికి దీనికి ♦ నంతరమున
మాలినీ తీరస్థ ♦ మార్గమునం గొంత దారినుత్తరముగఁ ♦ దరలిపోయి
యంతట నాప్రలం ♦ బాద్రికుత్తరమందె పడమరఁగాఁ బోయి ♦ వారు హాస్తి
నాఖ్యపురప్రాంత ♦ మందు గంగను దాఁటి పడమరదెసఁ గూర్చి ♦ పయనమగుచుఁ
జనిచని కురుదేశ ♦ మునకు జాంగలదేశమునకు మధ్యమమునఁ ♦ దనరు త్రోవ
నాశ్రయించుచుఁ బోయి ♦ యందలరారెడు పాంచాలమగు జన ♦ పదముఁ జేరి
యందు సరస్సుల ♦ నంభస్సుపూర్ణంబులను, నిర్మలోదక ♦ లలితనదులఁ
గాంచుచుఁ గార్యవే ♦ గమున నాలస్యంబు చేయక పోయిరి ♦ శీఘ్రగతుల;
నంతవారలు నిర్మ ♦ లాంభస్సులం బొల్చి బహుపక్షి సేవ్యమై ♦ పరఁగి భక్త
జననిబిడంబయి ♦ తనరారు దివ్యమా శరదండయనునట్టి ♦ శైవలినిని
గనఁబోయి యట నిల్వ ♦ కయె దానినిఁ దాఁటి తత్పశ్చిమంబగు ♦ తటమునందు
దివ్యమై కోర్కుల ♦ భవ్యరీతి ఫలింపఁ గను జేయుచుండుటఁ ♦ దనకుఁ గల్గు
సత్యోపయాచన ♦ సాధునామము సార్థకము చేయుచున్న వృ ♦ క్షమును జేరి
వందనీయంబగు ♦ పాదపంబును గాంచి వలగొని మ్రొక్కి య ♦ వ్వలఁ గుళింగ
యనుపురినిం జేరి ♦ యద్దాని కవ్వల నభికాళమను గ్రామ ♦ మందు నున్న
యా బోధిభవన నా ♦ మాద్రి సంభవమైన యిక్షుమతీనది ♦ నెలమి దాఁటి
దశరథవంశ్యులౌ ♦ ధరణినాథులచేతఁ దండ్రి తాతలనుండి ♦ తగినభంగి
ననుభవింపంబడు ♦ నట్టి గ్రామంబులఁ గనుఁగొని యీయేటి ♦ కడల నొక్క
యంజలి జలమునే ♦ యాహారముగఁ గొని తపము సల్పుచును వే ♦ దముల పార
ముల నెఱింగిన భూసు ♦ రులఁ గాంచి, బాహ్లీక జనపదమధ్యమ ♦ మునఁ జనుపథ
మునెయాశ్రయించుచుఁ ♦ జనిసుదామమహీధ్ర ♦ మునకుఁ బోయిరివారు ♦ కనకచే
డగు విష్ణుమూర్తి పా ♦ దాంకితమైనట్టి పుణ్యస్థలంబును ♦ భూధ్రనికట [లుఁ
మందు విపాశాహ్వ ♦ యంబగు నదిని నందలిశాల్మలీవృక్ష ♦ తల్లజంబుఁ
గనుచు నయ్యెతావు ♦ లను గల్గు నదులను వాపీతటాకప ♦ ల్వల సరస్సు
లను బహుభంగులఁ ♦ గనుపట్టు సింహశార్దూలాదికమృగసం ♦ దోహములను

* న్యంతేనాపరతాలస్య ప్రలంబస్యోత్తరంప్రతి, నిషేవమాణా స్తే జగ్ము ర్నదీం పధ్యేన మాలినీం-అనిమూలము. దీనివ్యాఖ్యలో నున్నభావము ననుసరించి యీపద్యము వ్రాయఁబడినదియే కాని కల్పితవిషయము లిందు లేవని యెఱుంగవలయు.

గజబృందముల వేడ్కఁ ♦ గనుచు రాజాజ్ఞచే నతిదూరమార్గంబు♦నరిగి; రంతఁ
గడుదూరమార్గంబు ♦ నడచుట గుఱ్ఱముల్ బడలిక నొందఁగా ♦ వారు శీఘ్ర
మున గిరివ్రజనామ♦మునఁ దగు కేకయ రాజపురంబును ♦ రమ్యతమముఁ
జేరిరి భరతుని ♦ శీఘ్రంబ తోడ్కొని వచ్చి భూపతికిని ♦ బారలౌకి

తే. కక్రియలనెల్లఁ జేయించి ♦ కమ్రపదముఁ
గలుగఁజేయుటకును రాజ♦కులమునెల్లఁ
గాచుటకు భూపవంశ్యులై ♦ క్రాలు భరత
ముఖులు నృపులౌటఁ దగు నను♦మోదమునను. ౨౧½ 2510

తే. త్వరగ వారలు చిత్తమో♦దంబు మీఱఁ
బ్రొద్దు గ్రుంకిన మానక♦పోయి రాత్రి
యందు దూరంబు నడుచుచు ♦ నా[1] త్రియామ
యందె యారాజగేహంబు ♦ నొందిరెట్లొ. ౨౨ 2511

అఱువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౬౯ - వ సర్గము.

భరతుఁడు తనదుస్స్వప్నమును మిత్రులతోఁ జెప్పుట.

క. ఏరాత్రి గిరివ్రజపురిఁ, జేరిరొ సందేశహారులు ♦ చిత్తభయదమై
యారేయి భరతునకుఁ జేకూరెఁ స్వప్నంబు దానఁ ♦ గొందలపడుచున్. ౧

క. తెలతెలవేగిన నప్రియ,ములఁ గూర్పంజాలు స్వప్న♦మును దాని మదిం
దలఁచుచు రాట్పతిపుత్రుఁడు, ఫలించునేమొ యిపుడనుచు♦బలువిడి వగచెన్.

క. భరతుని మిత్రులు ప్రియవా, దరతు లతం డేమొ మిగులఁ♦దపియించెడు నం
చరసి తదీయక్లేశం, బు రహిం బాపంగఁ గథల ♦ మొదలిడిరి సభన్. 3 2514

తే. పలువిధంబుల గాథలఁ ♦ బలికి; రందుఁ
గొందఱు విపంచికల మీటఁ ♦ గొందఱు తగ
నాడిరింకను గొందఱు ♦ హాస్యనాట
కములఁ జదివిరి భరతుని ♦ కలఁతఁ జెఱుప. 3½ 2515

క. స్మితమును బుట్టించెడు వా, క్తతులం గొందఱు వచింపఁ ♦ దరణికులభవుం
డతఁడు ప్రియవాది మిత్రు లు,చితగాథల హాస్యములను ♦ జెప్పుచు నుండన్.

తే. సంతసము నొందఁడయ్యె నొ♦క్కింతయైన
మిత్రపరివృతు భరతుని ♦ మిగుల వగచు
వానిఁ గని ముఖ్యమిత్రుండు ♦ పలికె నొకఁడు
ప్రాణమిత్రుఁడ! సఖులిట్లు ♦ బహువిధముల. 4½ 2517

1 త్రియామయందె=ఆరాత్రియందే.

క. కొలుచుచు నింపు జనింపఁగఁ, బలుకుచునున్నను ముదంబుఁ♦బడయక యుండం
గల కారణమేమో యిటఁ, బలుకుమనన్ వానికిట్లు ♦ భరతుం డనియెన్. ౬౪
క. దేనన్ నాకి త్తఱి నీ, దీనత చేకూరెఁ దద్వి♦ధిని వచియింతున్
మానక, రాతిరి కలలో, నానాయనఁ గంటిని మలి♦నముగు తనువుతోన్. ౭౪
తే. కేశపాశంబు వదల నా ♦ క్షితివిభుండు
కలుషమౌ పేఁడమడుఁగున ♦ క్ష్మాధరశిఖ
రమున నుండియె పడుచుండ ♦ రాత్రిఁ గంటి
స్వప్నమున నేమిచెప్పుదుఁ ♦ ప్రాణమిత్ర!. ౮ 2520
సీ. మఱియునాతండుగో♦మయమయమగుమడుఁగునఁగప్పవలెఁ దేలు♦చునుదనదగు
నంజలిఁ దైలంబు ♦ ననువునఁ ద్రావుచుఁ బలుమాఱు వికృతి న♦వ్వంగఁగంటిఁ
దైలసిక్తాంగుఁడై ♦ తైలమ్మునందు నె తలక్రిందుగా మున్గెఁ ♦ దిలలు గలిసి
నట్టి యన్నముఁ దించు♦నతఁ;డేమి చెప్పుదు నాస్వప్నమునయందె♦యబ్ధియెండి
తే. పోవుటయు శీతకిరణుండు ♦ భూమిపైనఁ
బడుటయుం జీఁకటులు గ్రమ్మఁ ♦ బుడమి యెల్ల
నగపడకయుండుటయు భద్ర♦హస్తి దంత
మెల్ల శకలంబులగుటయు ♦ నేను గంటి. ౧౧౪ 2521
క. హుతవహుఁడు ప్రజ్వరిలుచుం,డి తటాలున శాంతమొంద ♦ నేఁగంటి సఖా!
క్షితి బ్రద్దలు వాఱుట వివి,ధ తరుప్రకరంబు లెండి ♦ ధరకొరగుటయున్.
చ. ధరణిధరంబు లన్నియును ♦ ధ్వంసమునొంది తమస్సమావృతిం
బరఁగుచు నుంటఁ జూచితిని ♦ బార్థివుఁడున్ ధృతనీలచేలుఁడై
తరుణులు కృష్ణపింగళ ని♦తాంతరుచుల్ తగి నన్నుఁ జూచి న
వ్వ రహితతేజుఁడై మొగము ♦ వంచియె యాయసపీఠసంస్థితిన్. ౧౮ 2523
ఆ. చింతచేయఁ గంటి ♦ క్షితిపతి ధర్మాత్ముఁ
డతఁడు మఱియుఁ గలప ♦ మలఁది రక్త
కుసుమముల ధరించి ♦ వెస యమదిశకేగ
గార్దభాఢ్యరథముఁ ♦ గడఁగి యెక్కి. ౧౫ 2524
సీ. అరుణాంబరముఁదాల్చి♦యతివికృతాస్యమైతరుణిరాక్షసియొర్తు♦దారుణముగ
నవ్వుచు నాభూమి ♦ నాయకునిం బట్టి యీగి నీడ్చుకొనిపోవు♦చుండఁ గంటి;
నీరీతి నీరాత్రి ♦ నిట్టి భయంకరమైన స్వప్నముఁగంటిఁ ♦ గాన నాకొ
రాజేంద్రునకొ లేక ♦ రామలక్ష్మణులకొ చావుగల్గుటయె ని♦శ్చయము మిత్ర!
తే. కలను నెవ్వఁడు ఖరములఁ ♦ గట్టినట్టి
యరదమున నెక్కి పోయిన ♦ యట్లు గానఁ
బడునొ చితిఁ ద త్తనువునుండి ♦ వాడి ధూమ
శిఖలు వెడలుట కన్పడు ♦ శీఘ్రముగనె. ౧౦ 2525

క. కానన్ మిము నలరింపం, గానైతిని దీనుఁడనయి ♦ కడుఁ గుందుట; మి
త్రా! నాకంఠము శుష్కం,బౌ నిపుడని తోఁచుచున్న ♦ దాత్మకు నాకున్. ౧౮

తే. స్వప్న మనునదియే లేదు ♦ భయముఁ గలుగఁ
జేయఁ గారణ మేమియుఁ ♦ జిత్తమందుఁ
గనఁబడదు నాకు లోఁబడ♦కయె భయంబె
మించి గళరవ మట్టె నశించె నిపుడు. ౧౯ 2527

క. తనుకాంతి చెడియె నన్నే, కని నేనె యసహ్యపడెదు ♦ గతినున్నది యే
మని దీనిహేతువెన్నఁగఁ, గనఁబడదు మనంబునందు ♦ గాదిలిమిత్రా!. ౨౦

చ. కలయిది దుష్టమే యగును♦గా యిఁక దీని విధంబు పెక్కుత్రో
వలఁ దగు; నెప్పుడిట్టికల ♦ బాగుగ యోజన చేయలేదు; క
న్నులకును విందుగా నృపుఁ గ♦నుంగొనఁగోరెద లోఁదలంప నా
కలవియె గాని భీతి మది ♦ నాతురపెట్టుచు నున్నదెంతయున్. ౨౧ 2529

అఱువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౭౦ - వ సర్గము.

### భరతుఁ డయోధ్యకుఁ బ్రయాణమగుట.

సీ. భరతుఁడు సఖునితో ♦ స్వప్నవృత్తాంతంబుఁ జెప్పుచుండఁగ దూత♦లప్పు డధిక
విశ్రాంతిఁ గొనఁదగు ♦ విపులాశ్వములతోడ వచ్చి దాఁటఁగరాని ♦ పరిఘపంక్తి
రమణీయమైనట్టి ♦ రాజగృహాభిఖ్య పురముఁ బ్రవేశించి ♦ ధరణిపతిని
క్షితిపపుత్త్రుని యుధా♦జిత్తు నెదుర్కొని వారి మన్ననలంది ♦ భరతుకడకు

తే. నరిగి పాదములకు మ్రొక్కి ♦ యతని కిట్టు
లనిరి; నీతోఁ బురోహితుం ♦ డాత్మకుశల
మును దగం జెప్పుమనె మంత్రు♦లును దమతమ
క్షేమములఁ జెప్పుమనిరి యో ♦ క్షితిపతనయ!. ౨ 2530

క. కాలము మించుచునున్నది, యాలస్యంబేల కార్య♦మది, యొక్కటి నీ
పాలఁ బడియున్న దొనరుపఁ,గా లెమ్మా! రమ్ము వేగ ♦ కదలుము పురికిన్. 3

తే. ఓవిశాలాక్ష! మేలైన ♦ యావసనము
లాభరణరాజిఁ గైకొని ♦ యావృతిఁ దగఁ
దాతకును మేనమామకుఁ ♦ దగినరీతి
వేగ యిప్పింపుమా విను ♦ విన్నపంబు. ౪ 2532

సీ. నీకు మాతామహుం ♦ డౌ కేకయేశునకిచ్చు కానుకలెల్ల♦ నివె యిరువది
కోట్లు విలువఁదగి ♦ కొమరారు, నీమేనమామకుఁ బదికోట్ల ♦ మంచికాను

కలఁ దెచ్చినారము ♦ కాన లోపంబనకీవె యొసఁగవచ్చు ♦ నింకననుచుఁ
బలికి రంత సుహృజ్జ♦నుల కనురక్తుఁడౌ భరతుండు కాన్కల ♦ భవ్యమతిని
తే. దీసికొని వారలకు నిచ్చి ♦ తృప్తిమీఱ
నభిమతములైన యట్టి ద్ర♦వ్యాదు లిచ్చి
దూతలను దన్పి వారల♦తో మదీయ
జనకునకు క్షేమమే కద ♦ సంతతంబు. ౬౪ 2533

క. శ్రీరాముఁడు సౌమిత్రియు, నారోగ్యము గల్గువారె ♦ యతిశయమతి యా
శ్రీరామునికిం దల్లియు, నారూఢసుధర్మవేత్త ♦ యై పూజ్యయు నై. ౭౪

సీ. ధర్మపరాయణా♦త్మయునైన కౌసల్యప్రజల నెప్పుడు ధర్మ♦పథమునందె
వర్తింపఁగాఁ జేయు ♦ వనితామతల్లిక యారోగ్యభాగ్యంబు ♦ నందియున్నె
లక్ష్మణశత్రుఘ్ను♦లకుఁ దల్లి ధర్మజ్ఞయగు సుమిత్రాదేవి ♦ యామయరహి
తగ నున్నదే కదా ♦ తనకార్యమే ముఖ్యమని తలంచుచు నుగ్ర♦మనసు తనర
తే. కోపభూషితయై యెప్డు ♦ కోరి తనను
బ్రాజ్ఞురాలుగ నెంచుచుఁ ♦ బరిఢవిల్లు
చున్న నాతల్లి కైకేయి ♦ యున్నది కద!
యామయములేక నాకేమి ♦ యనువదించె. ౧౦ 2535

క. అని యెల్లవారి కుశలం,బును నారసి తల్లి యేమొ ♦ బుధగర్వ్యంబౌ
పని చేసియుంట దూతలు, చనుదెంచుటవలన నరసి ♦ స్వాంతమునందున్.

తే. అమ్మహాత్ముఁడు భరతుఁ డ♦త్యాదరమునఁ
బలికె నమ్మాటల విని దూ♦తలు వినీతు
లగుచుఁ బురుషవతంసమా! ♦ యనఘ! యెవరి
కుశలమును గోరుదువొ వారు ♦ కుశలులె సుమి!. ౧౧౪ 2537

ఆ. పద్మహస్త యగుచు ♦ భాసిల్లు శ్రీదేవి
నిను వరించుచున్న ♦ దనిరి రాజె
యగును భరతుఁ డనెడు ♦ నాశయమున వారు
తనదు వినుతి యనుచుఁ ♦ దలఁచె నతఁడు. ౧౨ 2538

క. అనువుగ దూతలు భరతున, కని రరదముఁ బన్నఁ బంపు ♦ మనఁ గేకయభూ
పునితో దూతలు నను ర,మ్మని తొందఱ చేయువార ♦ లని తెల్పి వెసన్.

క. చనుదెంతునని వచింపుచుఁ, జన మాతామహుని సన్ని♦ధానమ్మునకున్
జని దూతల ప్రేరణమున, జనకుని కడనుండి యిపుడె ♦ సందేశహరుల్. ౧౮

ఆ. వచ్చి పిలుచుచున్న♦వారు నన్నిపుడేను, దండ్రి చెంతకరుగఁ ♦ దలఁతు మీరు
ననుఁ దలంతు రపుడె ♦ చనుదెంతు మీకడ, కనిన భరతునుడుల ♦ నాలకించి.

క. ఆరఘువంశ్యుని శిరమును, మూరుకొనుచుఁ బల్కెను శుభ♦ముల్ తగునుడులన్

వైరి నిషూదన! వత్సా!, గారవమునఁ బోయి మరలఁ ♦ గడువడి రమ్మా!. ౧౬

క. సెలవిచ్చితి నీ వరుగఁగ, నల కైక సుపుత్రవతియె ♦ యగు నినుఁ గనుటన్
లలితగుణా! క్షేమంబును, దలిదండ్రులతోడఁ జెప్పఁ♦దగు నీవింకన్. ౧౭ 2543

క. మునికిం బురోహితునకిం,కను గల భూసురవరులకుఁ ♦ గడు విలుకాండ్రై
తనరారు రామలక్ష్మణు,లను నీభ్రాతలకు క్షేమ ♦ మాదృతిఁ జెపుమా. ౧౮

చ. అని వచియించి కేకయధ♦రాధిపుఁడాతని కెంతొ సత్కృతిం
దనరఁగఁ జిత్రకంబళ వి♦తానము సాధుమహాజినంబులన్
ఘనకరులన్ ధనంబు నిడి ♦ కైకకుమారుని సత్కరించి యా
తనికి నురస్థనలోచిత సు♦తప్తహిరణ్మయభూషణంబులన్. ౧౯ 2545

క. ఇచ్చెను సహస్రయుగ్మము, ముచ్చట షోడశశతాశ్వ♦ముల ద్రవ్యంబుల్
బెచ్చుగ నిడి సేవకులన్, సచ్చరితుల రాజభక్తి♦ సాంద్రుల నిచ్చెన్. ౨౦

ఆ. వారు సుగుణరాశి ♦ వర్ధిలి నమ్మంగఁ, దగి శుభోక్తు లలరఁ ♦ శత్రుమారు
వెంటఁ జనిరి; మఱియు ♦ వేడుక భరతుని, మేనమామ యతనిఁ ♦ గానవచ్చి.

సీ. ఇంద్రశిరంబున ♦ నెసఁగు నిరావంతమను కొండయందు బు♦ట్టినవియుఁ గన
నందంబులై తగు ♦ హస్తివరంబుల, శీఘ్రగతుల్ దగఁ ♦ జెలఁగి బరువు
మోయఁగ నలవడి ♦ కాయముల్ బలసి యున్నట్టి *గాడిదలను ♦ నధికవిత్త
ము నొసంగె; నంతిపు♦రిని బెంపఁగాఁ బడి వ్యాఘ్రవీర్యబలంబు♦లలరుచుండ

తే. దంష్ట్రలే యాయుధములుగఁ ♦ దనర దీర్ఘ
కాయముల నొప్పియున్న కు♦క్కలను గాన్క
గా నొసంగెను భరతుండు ♦ గమనవేగ
మునను వానికిఁ గనఁడయ్యె ♦ ముదమునపుడు. ౨౨ 2548

క. దూతలు త్వరపడుచుండుటఁ, జేతము దుస్స్వప్నభీతిఁ ♦ జెందుటఁ బురినే
దో తగనిపనియె జరగెను, గా తప్పకయని యతండు ♦ కలవల మందెన్. ౨౩

సీ. హస్త్యశ్వనరయుత ♦ మైనట్టి స్వగృహము వెడలి పెద్దది యయి ♦ విమలమైన
రాజమార్గమున భ♦రతుఁడు శ్రీమంతుఁడు చని దానిగడచి కాం♦చెను సమీప
మందలి రాడ్గేహ ♦ మంత నాసుతిమంతుఁ డడ్డము లేక యా♦యంతిపురము
శత్రుఘ్నుతోఁ జొచ్చి♦సత్వరముగఁ దాత మేనమామను గొల్చి♦మిగులు ప్రీతి

తే. వారి యాశిషముల నంది ♦ వారలనుప
నరద మెక్కి ప్రయాణమై ♦ యరుగుచుండ
మండలాకారచక్రముల్ ♦ గండు మిగుల
నలరు రథముల బహుశతం♦బులను గొనుచు. ౨౪ 2550

* ఖరాన్ శునశ్చోపాయనం దదౌ-అని మూలము.

తే. వృషభముల లొట్టియల నశ్వ♦వితతి నరద
ములకుఁ బూనిచి యతని భృ♦త్యులు వెనుకొని
చనిరి మహితాత్ముఁడైన యా♦త్మాపతిసుతుఁ
డంబజనకుండు పంపు సై♦న్యములు గావ. ౨౯ 2551

క. అనుజుఁడు తనవంటి సహా,యనికరములు వెంటరాఁగ ♦ నపగతరిపుఁడై
ఘనసిద్ధుఁడు దివి వెడలెడు, ననువున గృహసీమ వెడలె ♦ నతివేగమునన్. ౩౦

డెబ్బదియవ సర్గము సంపూర్ణము.

---

## ౭౧ - వ సర్గము.

భరతుఁ డయోధ్యఁ జేరి తండ్రియింటికిఁ బోవుట.

సీసమాలిక:—

అంత నిక్ష్వాకువం♦శాభినందనుఁడును గాంతిమంతుఁడును శ్రీ♦మంతుఁడు నగు
భరతుఁడా గేహంబు♦వదలి తూర్పునకేగి యందుసుదామాహ్వ♦యమునఁదనరు
తటినిఁ గనుంగొని ♦ దాఁటి యద్దాని కవ్వలితట్టు దవ్వునఁ ♦ బరఁగి పొడవు
గానున్న హ్లాదినిఁ ♦ గడుభక్తి సేవించి యద్దానిఁ దరియించి ♦ యవలఁ బశ్చి
మాభిముఖంబుగా ♦ నరుగు శతద్రూనదిని గాంచి దానిచెం♦తను జెలంగు
నట్టి యేలాధాన♦మను గ్రామమునకుఁ జెంతను దాని దరియించి♦తనదుమార్గ
కష్టముల్ దొలఁగింపఁ ♦ గా నెంచి యపరపర్వటమను గ్రామంబు♦రమ్యతరముఁ
జేరి యామీఁదట ♦ శిలల నాకర్షించు నాశిలావహయను ♦ నమలనదిని
దరియించి యాగ్నేయ♦ధరణిని నున్నట్టి శల్యకర్తన మనఁ♦జను పురంబుఁ
గనుఁగొని యాగ్నేయ♦మను పురమును జూచి పరిశుద్ధమతియున♦త్యరతుఁడౌట
నచ్చటివారల ♦ యార్తి వాసెడురీతిఁ బలుకుచు భూరిప♦ర్వతనికాయ
మును దాఁటి యవ్వలఁ♦జని చైత్రరథమను వనమును గని సర♦స్వతియు సింధు
శైవలినియు నెందు♦సంగమించునొ యందుఁ జని వీరమత్స్యాఖ్య♦జనపదముల
కుత్తరభాగమం♦దున్న భారుండమన్ వనమును జేరె; న♦వ్వలజవమునఁ
బ్రవహించుచున్ భూరి♦పర్వతావృతమయి సంతసంబుల నీయఁ♦జాలి యలరు
చున్న కుళింగాఖ్య ♦ నొప్పెడు నదిఁ గని యమునాసమీపంబు♦నందు దానిఁ
దరియించి భాస్కరా♦తపమున కలసిన సైన్యంబు విడియ నా♦జ్ఞ యొసఁగంగ
నందు సైన్యము దిగి ♦ యశ్వమ్ములకు శ్రమమును బాపి శీతవా♦రిని దడుపుచు
విశ్రాంతి నొందించి ♦ విమలోదకంబులఁ దారు స్నానముచేసి ♦ తజ్జలములఁ
ద్రాగి గంతవ్యమా ♦ స్థలము నిర్జలమౌటఁ దత్సలిలంబులఁ ♦ దగిన యంతఁ
గైకొని; రంత మం♦గళశీలయుక్తుఁడౌ భరతుండు భద్రకుం♦జరము నెక్కి

మనుజసంచారంబుఁ♦గనని యాపెనువనమును వాయువాకాశ♦మును నతిక్ర
మించెడు గతిఁ దరి♦యించి యంతట నంశుధానపురంబు చెం♦తను మహాన
దియగు నాభాగీర♦థిని దాఁట రాకుంటఁ బ్రాగ్వటపురికడఁ ♦ బరఁగు గంగఁ
దరియింప సాధ్యమా ♦ టరసి యప్పురి దానికయి ప్రసిద్ధంబుగఁ♦గ్రాలుచుంట
నచ్చటికిం బోయి ♦ యద్దాని నట దాఁటి కుటికోష్ఠికానదిఁ ♦ గోర్కిఁ జేరి
సబలుఁడై యానది ♦ సరఁగునఁ దరియించి ధర్మవర్ధన మనఁ ♦ దనరు గ్రామ
మును జేరి యట నుండి♦చని తోరణగ్రామమునుగాంచిదక్షిణం♦బునకుఁ బోయి
యందు జంబూప్రస్థ♦మను గ్రామమును దాఁటి యట వరూథంబను♦నందమైన
గ్రామమునకుఁ బోయి♦రమణీయవనమొండు దాని చెంతఁ జెలంగఁ♦దానురాత్రి
వసియించి వేకువఁ ♦ బ్రాఙ్ముఖుండయి పోయి యుజ్జిహానాపురి ♦ యుపవనంబుఁ
దాను బ్రవేశించి ♦ దానియందలి కదంబావనీజంబుల ♦ నరసి యింక
రాఁబోవు జనపద♦రాజి స్వదేశంబె కావున భయము లే♦కయె శ్రమంబు
తొలఁగించుకొనుచు మీ♦రలయిక మెల్లఁగాఁ జనుదెండటంచు స్వ♦జనులకెల్ల
నాజ్ఞ చేయుచు వడి ♦ నరుగు గుఱ్ఱంబుల గట్టిన రథమెక్కి ♦ కడువడిఁ జనె
నంతట భరతుఁడా ♦ చెంతనుండెడు సర్వతీర్థమను పల్లి రా♦తిరి వసించి
యుత్తానికానది♦నొయ్యనఁ దరియించి యవ్వల బహువిధా♦హ్వయములొప్పఁ
బరఁగెడు నదులను ♦ బర్వతదేశీయ గంధర్వములనెక్కి ♦ కడచి పోయి
గంభీరమా కుటి♦కానది మెల్లఁగ హస్తిపృష్ఠము నెక్కి ♦ యంత దాఁటి
నరవస్యుఁడై నట్టి ♦ భరతుఁడు లౌహిత్యమను నగరము చెంత ♦ ఘనకపీవ
తీనదినిం దాఁటి ♦ దివ్యమై తగు నేకసాలమను గ్రామంబు ♦ లీలఁ గాంచి
స్థాణుమతీనది ♦ సరగునఁ దరియించి వినతాఖ్య నగరంబు♦నను జెలంగు
నట్టి గోమతినది ♦ నాతండు తరియించి యశ్వముల్ బడలిక♦లంది యుంటఁ
గనుచు గళింగ న♦గరము చెంతం దగు సాలవనంబు వి♦శ్రాంతి కొఱకుఁ
గాఁ జేరి యటనల్ప♦కాలంబె వసియించి వడిఁబోవఁదలఁచి సూ♦ర్యుఁడుదయగిరిఁ
జేరు తరుణమునఁ♦జేరె వైవస్వత మనునిర్మితంబయి ♦ ఘనతరంబు
నగు నయోధ్యాపురి ♦ నాతఁడు సప్తరాత్రములు మార్గంబునఁ♦దగ వసించి
యెనిమిదవదినమం♦దేయయోధ్యను ముందుఁగనుపట్టుచుండంగఁ♦గాంచి తనదు

తే. సారథిం గాంచి పలికె నో♦సారథీ! ప
విత్రములగు నుద్యానముల్ ♦ వెలయ ఖ్యాతిఁ
గన్న సితపుష్పత్రికయు వింత ♦ వన్నెలొసఁగ
నదిగొ కనఁబడుచున్నది ♦ యతులరీతి. ౧౯ 2553

క. సురుచిరశమాదియుతు ల,ధ్వరముల నొనరించి మిగుల ♦ ధనవంతులునై
పరఁగు మహీసురు లిట దు,స్తరవేదాంభోధిపార♦పారజ్ఞులుగాఁ. ౨౦ 2554

క. తనరారుచు నుందురు సు, మ్మనయము రాజర్షి వర్యు ♦ లాదృతిఁ బాలిం
ప నెగడుచుండును వీనిని, గన నిందలి నరుల కిపుడు ♦ గడుమోదంబుల్. ౨౦

క. కలిగిన యటుగాఁ దోఁపదు, నలుఁగడలను మున్ను పురుష♦నారీకృత ని
స్తులనాదము తుములంబై, చెలఁగుచునుండు నిపుడద్ది ♦ చెవులఁ బడదు సూ!

క. మును మనుజులెల్ల సాయం,తనమున నుద్యానములకుఁ ♦ దమి వచ్చి యటన్
మనమారఁ గ్రీడసల్పుచుఁ, జనుదురు చీఁకటులు గ్రమ్మ ♦ సద్మములకునా.

క. వనవితతు లవ్వి యొకవిధ,మున వెలయుచునుండుఁ బ్రమద♦మునఁ గాముకులె
ల్లను రామి నేడ్చుచున్న వి,ధి నిప్పుడూహింపనయ్యెఁ ♦ దెలియం జాలన్ ౨౩

ఆ. అడవిరీతి నగర ♦ మగపడుచున్నది, నాకు నిపుడు; సార♦థీ! కలంత
గలుగఁ జొచ్చె మదిని ♦ గడఁగి మున్నరదంబు, లను గజాళినెక్కి ♦ లలితరీతి.

క. తురగముల నెక్కి చనువా, రరుదుగఁ బురిఁ జేరువార ♦ లకటా యిపుడె
వ్వరు గానరారు కారణ, మరయంగాఁ దోఁపదయ్యె ♦ నాత్మను నాకున్. ౨౫

క. విను ముద్యానంబులు తగ, మును ఫలములఁ దిని కిసలయ♦ములమెక్కిముదం
బునఁ దేనెఁ ద్రావి మత్తతఁ, గని తగు శుకశారికాది ♦ కాండము లలరన్.

తే. సొంపుగాఁ గనుపట్టుచు ♦ సురతకేళి
నల్ప వచ్చెడు కాముక♦జనులకెల్లఁ
బూలపందిరుల నొసంగి ♦ పొలుచుచుండు
నట్టి యెల దోఁట లిత్తతి ♦ నంద మెడలి. ౨౭ 2562

క. చ్యుతపర్ణములై యేడ్చెడు, గతిఁ దగు వృక్షముల నాల్గుఁ ♦ గడల నిరానం
దత నాకుఁ గానఁబడియెడుఁ, గతమే మొ యెఱుంగరాదు♦గా సూతవరా!.

క. అరుణోదయ మయ్యెడు నీ, తరుణము నందైన జనులు ♦ తమిఁ బెంచుమృగో
త్కరము పతత్త్రులు మత్తతఁ, గరమనురాగమునఁ జేయు ♦ కలనిస్వనముల్.

క. వినరాకున్నవి; మును చం,దనాగరు సువాసనా త్త♦తత ధూపములం
గను పవమానుఁడు వీచెడుఁ, గన నతఁ డిపుడేల వీవఁ♦గా నూల్కొనఁడో.

క. [1]కరముఖముల వాయింపం, బరఁగెడు భేరీమృదంగ ♦ వరవీణాభీ
కరమృదునినదం బిత్తతి, విరతిం గనె నిట్టులౌట ♦ వింతయు గాదే. ౨౯

ఆ. కన ననిష్టసూచ♦కములుఁ గ్రూరములునై
పగలఁ గల్గఁ జేయు ♦ బహువిధావ
శకునము లివె పెక్కు♦చందములం గనఁ
బడెడు దాన మనసు ♦ వగలఁ గనియె. ౩౦ 2567

ఉ. కారణమింత లేదు వెత♦గల్గఁగ నైనను నాదుచిత్త ని
ట్లూరక యార్తిఁ బొందెడి న♦యో యెటులైనను నాదుబంధువుల్

1 కరముఖముల=చేతులచేతను, కొయ్యలచేతను.

వారక క్షేమమునుం గనెడు ♦ భంగియె దుర్లభమంచుఁ దోఁచె నం
చా రఘువీరుఁ డార్తుఁడయి ♦ యాత్మయు నెంతయుఁ దల్లడిల్లఁగన్. ౩౧

క. వికలేంద్రియుఁడై యిక్ష్వాకుకులమహీశాళిచేతఁ ♦ గొమరుగ ధర్మ
ప్రకటితమతిఁ బాలింపఁగ, నకలంకఖ్యాతి వెలయు ♦ నప్పురిఁ జొచ్చెన్. ౩౨

క. దూరము నడుచుటచే వెతఁ, గూరిన తనయుత్తమకుల♦ఘోటకములతో
నారఘువీరుఁ డయోధ్యను, జేరెన్ హృదయంబు కలఁతఁ♦జెందుచునుండన్.

ఆ. వైజయంతి యనెడు ♦ ద్వారమ్మునం బురి, నృపవ*రేణ్యుఁ డొంది♦యెల్లద్వార
పాలకులును లేచి ♦ భవ్యవిజయముల, నడిగి వెంబడింప ♦ నరిగె నంత. ౩౩

క. మనసొకచోటన్ నిలువమిఁ, దనమననునఁ గూర్చునట్టి ♦ తత్సారథినిం
గని పల్కె నచట భరతుం, డనుమానమున న్మనింగి ♦ యాతురపడుచున్.

ఆ. ద్వారపాలకులను ♦ దగురీతి మన్నించి, యనఘ! యన్వసిష్ఠుఁ ♦ డాతురముగఁ
గారణంబు లేక ♦ యీరీతిఁ బిలిపింప, నేల? యశుభవార్త ♦ యేమియొయని.

చ. మనసున శంక దోఁచెడిని ♦ మామకశీలము దూలుచున్నయ
ట్లనువుగఁ దోఁచెఁ బూర్వము న♦రాధిపు లంతము నొందువేళలం
గనఁబడు నెట్టి గుర్తులు వి♦కారముగాఁ దగునంచు వింటిమో
కనఁబడుచున్న విప్పుడవి ♦ కన్నులకున్ గడు నాకు సారథీ!. ౩౬ 2574

సీ. ఇందు గృహస్థుల ♦ గృహములు సమ్మార్జనంబు చేయమిఁ బరు♦షంబు గాఁగ
నగపడుచున్నవి ♦ యవ్వానితలుపులుమూయఁగాఁబడవేమి♦మాయ యొక్కొ
యెందుఁ జూచిన శ్రీవి♦హీనంబులై యున్న వెచ్చోట బలికర్మ♦మే యొనర్చి
నట్లుగాఁ గనఁబడ ♦ దక్కట! ధూపవాసనలెవ్వి వ్యాపింప ♦ వనఘ! యెందు

తే. నెవరినిం జూచినను భుక్తి♦యే యెఱుంగ
నట్లు కనఁబడుచున్నవా ♦ రమలకాంతి
చెడిన ముఖములు నాకుఁ గ♦న్బడియె సిరియు
తొలఁగినట్లుగ గృహములు ♦ తోఁచె నిపుడు. ౩౯ 2575

సీ. సురగృహద్వారముల్ ♦ సుమమాలికాశోభ నందకున్నవి వాని ♦ ముందుభాగ
ములు విసమ్మార్జన♦ములుగ నున్నవి పూజకులు పరిచారకు ♦ లలరకుంటఁ
బాడుగృహంబుల♦భంగి నున్నవి మును పిట్టులుండునె యెన్నఁ♦డేనిఁ గనఁగ
దేవపూజలు యజ్ఞ♦పావనసభలును నిలిచి పోయినవి పూ♦వులను నమ్ము

తే. నంగడులయందు సత్సుమ♦హారములును
భాసిలకయున్న విందలి♦వర్తకులును
జింతలేక మనస్సులు ♦ స్థిరతఁ దప్పఁ
గ్రయము విక్రయమును జేయు ♦ క్రమము మాని. ౪౧ 2576

* "రే" అను అక్షరము గాయత్రి యా ఆవశ్యకము.

క. ఎంచఁగ సంకోచముఁ గని, రించుకయే మోములందు ♦ నే శుభకాంతుల్
మించవు మునుపటివలెఁ గా, న్పించరు కారణమిదేమొ ♦ విధికృతమేమో.

సీ. అమరాలయములఁ జై ♦ త్యములనుండిన పక్షులతిదీనముఖముల ♦ నార్తినొగులు
చున్నవి పురియందు ♦ నున్న స్త్రీపురుషులు మలినగాత్రములఁ గ ♦ న్నులనునిండ
జలము స్రవింప దీ ♦ నులయి చింతిల్లుచుఁ గృశియించి కలవర ♦ మేర్పడు ముఖ
ముల నుండుటం బురి ♦ నలుఁగడలం జూచుచున్నాఁడనని చెప్పి ♦ యొగిఁ బురమునఁ
తే. గానఁబడు నవశకునాళిఁ ♦ గని కలంగి
దీనమానసుఁ డయి, సార ♦ థికిని గానఁ
బడు గుఱుతులను జూపుచుఁ ♦ బార్థివేంద్రు
సౌధమున కేగె ముందేమి ♦ జరగునో యని. ౨౪ 2578

సీ. అమరావతినిఁ బోలు ♦ నాయయోధ్యాపురమపుడు చత్వరములు ♦ నాలయములు
రాజమార్గములుని ♦ ర్జనములై సంస్కారములు లేమినరుణధూ ♦ ళులను బ్రుంగు[చె
ద్వారకవాటయం ♦ త్రములుగల్గియునుండ నతఁడు దుఃఖాక్రాంతుఁ ♦ డగుచుఁ గాం
చమ్మహాత్ముండు ము ♦ న్నరయని యాలక్షణముల నప్రియముల ♦ నన్నిచోట్లఁ
తే. బలువిధంబులఁ గని తల ♦ వాంచి మనసు
కలవరము నొంద దీనతఁ ♦ గానుపింపఁ
దండ్రిగృహమున కేగె స ♦ త్వరముగాఁగ
సారథియుఁ దోలె రథము వి ♦ చారపరత. ౨౫ 2579

డెబ్బదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౭౨-వ సర్గము.

కైక భరతునితో జరగిన వృత్తాంతముం జెప్పి రాజ్యమును బూనుమనుట.

క. జనకుని సౌధంబున నిజ, జనకునిఁ గానకయె త్వరగ ♦ జనని గృహమునుం
గనఁ జని కైకేయిని జూ, చెను భరతుం; డంత నామె ♦ చిత్తము పొంగన్. ౧

క. పరదేశంబున కేగిన, వరతనయుఁడు రాఁగఁ జూచి ♦ వనితామణి య
బ్బురపడి దిగ్గున లేచెను, హిరణ్మయాసనమునుండి ♦ యెంతయుఁ బ్రీతిన్. ౨

తే. ధర్మమతి భరతుండు గ ♦ తప్రకాశ
సంపదలనున్న తల్లిదా ♦ సదనమునకుఁ
బోయి శుభజననీపదాం ♦ భోజములను
బట్టుకొని వందనము చేసె ♦ భక్తి మెఱయ. ౩ 2580

క. ఆనారీమణి కీర్తిని, జానుగఁ గనిపట్టి భరతుఁ ♦ జయ్యనఁ జేరం
గా నెమ్మి దిగిచి కౌఁగిట, వానిన్ బంధించి [1]తొడల ♦ పై నిడుకొనియెన్. ౪

---

1 అంకే భరత మారోప్య ప్రష్టుం సముపచక్రమే-అని మూలము.

తే. శిరము మూర్కొని వార్తలఁ ♦ జెప్పు మనుచు
నడుగ మొదలిడె; నాయనా! ♦ యార్యవర్యుఁ
డైన మాతామహుని యిల్లు ♦ మాని యింత
దనుక గతియించెఁ గొన్నిరా♦త్రములు త్రోవ. ౮½ 2584

చ. అరదము నెక్కి వేగముగ ♦ నధ్వపరిశ్రమ మొంది వచ్చితే
వరతనయా! పథశ్రమము ♦ బల్విడిఁ గల్గఁగ లేదె? తాతయుఁ
గరుణఁ జెలంగు మాతులుఁడు ♦ గాఢసుఖంబులఁ బొందువారె సో
దరుఁడును నీవు నెమ్మదిని ♦ దాతగృహంబున నుందురే కదా. ౯ 2585

క. వినుపింపు మెల్లవార్తల, నన భరతుండనియెఁ; దాత ♦ యాశీస్సులనేఁ
గని బయలువెడల నేఁటికి, జననీ! త్రోవను గతించె ♦ సప్తాహంబుల్. ౯½

సీ. మాతామహుఁడు మేన♦మామయుఁ గుశలులే
కేకయేంద్రుఁడు నాకుఁ ♦ గేరి యొసఁగి
నట్టి ధనంబు ర♦త్నాదికంబులఁ గొని
వచ్చువాహనములు ♦ బంట్లు బడలి
యుండుటచే దారి ♦ నునిచి ముందుగ నేను
వచ్చినాఁడను; రాజ♦వాక్యములను
గొనివచ్చినట్టి దూ♦తనికరములు నన్నుఁ
ద్వర చేయ నిచటికి ♦ వచ్చినాఁడ

తే. నంబ! నావిన్నపమునకు ♦ నర్హమైన
యుత్తరం బీయఁగాఁ దగు ♦ నున్నతంబు
[1]హైమమగు శయనీయంబు ♦ నైన నీదు
శయ్య పాడ్వడియెడి నాదు ♦ జనకవిరతి. ౧౦½ 25-7

క. జనకుని జనులెల్లను బ్రీతిని గాంచకయుండునట్లు ♦ తెల్లం బయ్యెఁ
మను జేశ్వరుఁ డిచ్చట, నో, జననీ! నివసించియుండుఁ ♦ జాలదినంబుల్. ౧౧½

క. అని తలఁచి తండ్రిఁ జూడం,గను గోరిక నిచటి కేను ♦ గడు వడి మీఱం
జనుదెంచినాఁడ నిచ్చటఁ, గనఁ జాలం దండ్రి నేమి ♦ కారణమంబా!. ౧౨

చ జనకుని పాదపద్మములఁ ♦ జక్కఁగఁ గొల్వ నమస్కరింపఁ గో
ర్కిని నిటు ప్రశ్న చేసెదను ♦ క్షిత్యధిపుండెటనుండు జ్యేష్ఠప
త్నినిఁ గనఁగోరి నాజనని ♦ దివ్యగృహంబున నున్నవాఁడొ నా
విని యల రాజ్యలోభమున ♦ విభ్రమమొందిన దాటఁ గైకయుఁ. ౧౩½

1 శాన్త్యోఽయం శయనీయ స్తే పర్యంకో హేమభూషితః-అనిమూలము. శాన్తః=పితృ
శూన్యః. అని వ్యాఖ్య. దీనినను సరించియే "జనకవిరతి" అని తెనిఁగింపఁబడియెనని యెఱుంగఁ

తే. దారుణం బప్రియమునగు ♦ తత్ప్రవృత్తిఁ
బ్రియముగా నెంచి రాజ్యప్ర♦వృత్తి నెఱుఁగ
నట్టి తనయునిఁ గాంచి యి♦ట్లనియె; సర్వ
భూతములు తప్పకేగతిఁ ♦ బొందుచుండు. ౧౪ 2591

తే. యజ్ఞములఁ జేసి సాధుజ♦నాళికి గతి
యయి మహాత్ముఁడు రాజేంద్రుఁ ♦ డైనయట్టి
నీదు జనకుండు తద్గతి♦నిఁ గనె ననఁగ
. ధర్మమతి సత్కులుండును ♦ నిర్మలుండు. ౧౫ 2592

క. జనకునియెడ భక్తిం దగు, ననఘుఁడు భరతుండు వార్త ♦ నద్దాని వినం
గనె పితృశోకబలంబున, మనము గలఁగ వేగ పడియె ♦ మహిపై నంతన్.

తే. అమ్మహాబాహువతుల వీ♦ర్యాన్వితుండు
[1]'చచ్చినాఁడ, నయో! యని ♦ వెచ్చనూర్చి
దీనవాక్యంబుఁ బలుకుచుఁ ♦ డెల్లవోయి
కరములు విదుర్చుచుం బడె ♦ క్ష్మాతలమున. ౧౬ 2594

క. జనకుని మృతిశోకముపై, గొన దుఃఖించుచు మనంబు ♦ కుందఁగఁ దబ్బి
బ్బున నిటు లేడ్చె శరన్నిశి, వనజారిప్రభవిమల ది♦వము వెలయుగతిన్. ౧౭

తే. మున్ను నాతండ్రి శయనించి ♦ యున్నపాను
పిది ప్రకాశించుచుండె న♦య్యది యతండు
ధీయుతుఁడు లేమి గగనంబు ♦ తోయజారి
లేక వెలుఁగని గతినున్న♦దీ కరణిని. ౧౮ 2596

క. జలహీన సాగరము న,ట్టులు సొంపును దూలుటం గ♦డుం బాడయిన
ట్టులు గనఁబడుచున్నది యని, విలపించెను బాష్పజలము♦వెసఁ బ్రవహింపన్.

సీ. జయశాలురగు శూర♦జనులందు మేటియౌ భరతుండు గొంతెత్తి♦పరమదుఃఖ
పీడితుండై యేడ్చి ♦ వింతగ భాసిల్లువక్త్రంబుపై గుడ్డ ♦ వైచుకొనుచుఁ
గలవిలపడుచుండె; ♦ నిలఁబడియుండిన యమరసన్నిభు మద♦హస్తితుల్యు
భరతునిఁ దనయునిఁ ♦ బరశుధారాహత భూజప్రకాండంబు ♦ వోలె నున్న

ఆ. వాని లేవనెత్తి ♦ భాస్కరశీతాంశు, సముని నతని దుఃఖ♦శరధిమగ్నుఁ
గాంచి పలికె నిట్లు; ♦ క్ష్మాపతిపుత్ర! మ, హాయశా! విచార ♦ మందనేల. ౨౩

*క. లేలెమ్ము కుమారా! యిల, నీలీలఁ బరుండియుండె ♦ దిప్పుడు నిన్నుం
బోలు సభాపూజ్యులు స,చ్ఛీలురు శోకింపరిద్ది ♦ సిద్ధము సుమ్మీ!. ౨౪ 2599

క. మతిమంతా! నీమది స,త్క్రతువుల దానముల మిగుల ♦ రంజిలు శీల

---

1 హా హతోఽస్మీతి కృపణాం దీనాం వాచ ముదీరయన్-అని మూలము.

* సంత స్వదసి సమ్మతాః-అని మూలము.

శ్రుతివాక్యములను వర్తిలు, నతిశయరవిరుచులు మంద♦రాద్రిపయివలెన్. ౨౪

చ. అనియె నతండు కొంతవడి ♦ నార్తి విలాపము చేయుచున్ ధరన్
వనటను దూలుచుండియె య♦వార్యమనోవ్యథ లెన్నియేని పై
కొనఁగ వచించెఁ దల్లిఁ గని; ♦ క్షోణివిభుం డిటు పిల్వనంపె రా
మున కభిషేకముం జరప ♦ మోదమునొందెనొ యంచు నెంచితిన్. ౨౬

క. తానే యజ్ఞము చేయం,గా నెంచెనొ యంచుఁ దలఁచి ♦ గాఢప్రమదం
బూని ప్రయాణంబయి యిపు, డేనిటకున్ వచ్చినాఁడ ♦ నిట నిటు లయ్యెన్:

క. ఆనాయూహలు మాఱిన, వే నేమందు నికఁ దండ్రి ♦ నిటఁ జూడనినా
మానసము పగులకున్నది, నేనేమని చెప్పువాఁడ ♦ నీకుం దల్లీ!. ౨౮॥ 2603

క. అనవరతము ప్రియము నెనా,కును గూర్చుచు హితము జేయఁ♦గోరుచుఁ దగు నా
జనకుఁడు మృతుఁడయ్యెను నా,తనిఁ గను భాగ్యంబు లేదు ♦ తల్లీ! నాకున్.

సీ. ఏను రాకున్నప్పు ♦ డేవ్యాధిచేఁ దండ్రి మరణింపఁ దారె రా♦మప్రభృతులు
సంస్కారములు చేయఁ♦జాలు భాగ్యముఁ గాంచిరటుగాన పుణ్యాత్ము♦లై రివార
లతిశయముగ ధన్యు ♦ లగుదురు కీర్తిచేఁ దనరారు భూపాల ♦ తల్లజుండు
నే నిట వచ్చియు♦న్నానని యెఱుఁగఁడు నిజమిది యెఱుఁగు నే♦ని జవమొప్ప
ఆ. నరుగుదెంచి వంచి ♦ యాదృతి నాశిర,మును దగంగ మూరు♦కొనును గాదె
పాపరహితకార్య♦పరుఁడైన నాతండ్రి, ధూళిఁ బెనఁగు నన్నుఁ♦దుడుచుఁ గాదె.

క. అతులసుఖస్పర్శంబై, యతని కరం బలరునట్టి ♦ హస్తమిపుడు పెం
పు తగంగా నెటనున్నది, మతిదూలెడుఁ జెప్పవమ్మ! ♦ మానితశీలా!. ౩౧ 2606

సీ. ఎవఁడు తండ్రియును బం♦ధువు భ్రాత నాకగు; నెవనికి దాసుండ♦నేనగుదునా
యక్లిష్టకర్ముఁడై ♦నట్టి యారామున కస్మదాగమన మి♦య్యదనునందె
తెలుపుమా! ధర్మముల్ ♦ తెలిసినయార్యునకగుఁగద జ్యేష్ఠుండె♦యరయఁదండ్రి
కావునఁ దత్పాద♦కమలంబులం బట్టుకొని వందనముచేయఁ ♦ గోరువాఁడ
తే. నిపుడు గతి నాకు నాతండె ♦ యిది నిజమ్ము
ధర్మనిత్యుండు ధర్మవే♦త్తయును సత్య
సంధుఁడు దృఢవ్రతుండును ♦ సత్యశౌర్యుఁ
డార్యుఁడు నగు నాతండ్రి యే ♦ మనుచుఁ జెప్పె. ౩౪ 2607

క. నరపతి నన్నుం గూరిచి, మరణించెడు తఱి నదెట్టి♦మాట పలికెనో
కర మద్దానిన్ విన నా,తుర మొందుచు నున్నవాఁడఁ ♦ దోడ్తోఁ జెపుమా.

చ. అన విని పుత్త్రుమానసము♦నందుఁ జెలంగెడు తాతమైత్రి మె
ల్లనఁ దొలఁగింప నెంచుచు ని♦లాపతి [1]సద్గతికాళివర్యుఁడై

1 గతిమతాం వరః-అని మూలము.

తనరు మహాత్ముఁ డాతఁడు, ని♦తాంతము హా! రఘురామ, లక్ష్మణా,
యనియును భూమిజా! యనియు ♦ నార్తి విలాపముఁ జేయుచుం జనెన్. ౩౫

*క. తనయా! విను పరలోకం,బున కేఁగుచు నిన్నుఁ దలఁపఁ♦బోఁడు; మఱి నీ
జనకుండు పాశవశమా, ఘనసుదగజమట్లు, కాల♦గతి పైకొనఁగన్. ౩౬॥ 2610

తే. సీతతోఁ గూడి మరలి వ♦చ్చినరఘుప్ర
వీరు రాముని నెవ్వరు ♦ శూరు లక్ష్మ
ణుని గనుంగొనఁగలరో పు♦ణ్యులుఁ గృతార్థు
లట్టివారే యటంచు నీ♦యయ్య పలికె. ౩౭॥ 2611

ఆ. మరణకాలమందు ♦ మాట నిద్దానినె, మందలించె వేఱు ♦ మాట లనఁడు
నాఁగ నన్నపట్ట♦ణంబున లేఁడను, నాద్వితీయవార్త ♦ నప్రియంబు. ౩౮॥

క. వినుటన్ మొగము విషణ్ణతఁ, గన వనటం గుంది మరలఁ ♦ గైకను గని యి
ట్లనియెం గౌసల్యకు న,త్యనుపమసంతోష మిచ్చు ♦ నారాఘవుఁడున్. ౩౯॥

తే. ధర్మమతి తాను సీతను ♦ దమ్మునిఁ దగఁ
గూడి యెచటికిఁ బోయి యు♦న్నాఁడు చెపుమ
యిప్పు డన విని యప్రియ ♦ మే యనంగఁ
దగిన యామాటనుం బ్రియ♦ముగ భ్రమించి. ౪౦॥ 2614

క. జరగిన వృత్తాంతంబును, జరగిన యటులే వచింపఁ ♦ జాన తలఁచి యా
భరతున కనియెన్; దనయా!, ధరణీశకుమారుఁ డనుజుఁ♦దరుణిం గొనుచున్.

తే. నారచీరలు గట్టి దం♦డకవనంబు
నకుఁ జనియె నంచుఁ గైక ప♦లికిన యంత
స్వకులమునకు సదాచార♦పరతవలనఁ
గలిగినట్టి మాహాత్మ్యంబుఁ ♦ దలఁచి యతఁడు. ౪౨॥ 2616

క. తనయన్న యేమితప్పును, గనఁజాలక చేసినాఁడొ ♦ కానలపాలై
చనుట కని యతనిదౌ చరి,తను దలఁచుచు సందియమునఁ ♦ దత్తరపడుచున్.

క. భీతుండై మఱి యడిగెను, నోతల్లీ! రాముఁడేమి ♦ యుర్వీసురు సొ
మ్మాతఱి హరింపఁడే గద, పాతక మేమేని చేయఁ ♦ బాల్పడఁడు గదా. ౪౩॥

క. ధనికుఁడు దరిద్రుఁ డేయఘ,మును జేయనివాఁడు రాము♦మూర్తి నిహతుఁడై
తన ప్రాణంబులఁ గోల్పో,యెనె యిట్టి యఘంబుఁ జేయు♦నెటురాఘవుఁడున్.

క. పరదారను గోరఁడు కద, ధరణీశ సుతుండు చెపుము ♦ తల్లీ! వేదో
త్కరశాఖాధ్యాయిని వే, మరణము నొందించువాని ♦ మాడ్కి రఘువరున్.

---

* భరతంప్రతి త్వాం రాజాన స్మృతవాన్ కింతు రామమేవ స్మరన్ స్వర్గ మగాత్-అను వ్యాఖ్యననుసరించి యీపద్యపూర్వార్థము వ్రాయఁబడినది.

తే. దండకారణ్యమున కేల ♦ తండ్రి పంపె?
ననుచు వెతఁ గుంది యడిగిన ♦ నామె చపల
చిత్తగావున మును రాజుఁ♦జేరి వరము
లడుగుతఱి నున్న వృత్తినే ♦ యాశ్రయించి. ౪౫। 2621

క. తనకృత్య మెల్లఁ జెప్పం,గను దలఁచుచు నున్న దున్న♦కరణి వచింపం
బనిఁ బూని పలికె నిట్లని, తనయుండు మహాత్ముఁ డట్లు ♦ తనుఁ బ్రశ్నింపన్.

తే. తాను బండితురాలని ♦ తలఁచుచుండు
గావునన్ మూఢురాలును ♦ గాన సంత
సమునఁ గైకేయి చెప్పె నీ♦సరణి రాముఁ
డే మహీసురువిత్తంబు♦నేని గొనఁడు. ౪౬। 2623

సీ. ధనికునింగాని ని♦స్స్వనిగాని యేపాపమును జేయనట్టి యే♦మనుజుఁగాని
హింసింప లే డాతఁ ♦ డెవరి భార్యను గాని కనులారఁ గనుఁగొనఁ♦గాఁ దలంప
లేదు; కుమారకా! ♦ భూదయితుఁడు నీదు తండ్రి రాఘవునకు♦ధాత్రి నొసఁగి
యభిషేకమును జేయ ♦ నాదృతి నుండుట విని నీకురాజ్యమి♦మ్మనియు, రాము

ఆ. వనికిఁ బంపుమనియు ♦ వరముల నీరెంటి, వేఁడితిని బ్రతిజ్ఞ ♦ వెలయఁ జేయు
తనదువృత్తిఁ బూని ♦ ధాత్రీశుఁ డట్లె నే, నడిగినట్లు చేసె♦[1]ననుఁగుఁగుఱ్ఱ!.

చ. జనకుని యాజ్ఞఁ బూని రఘు♦సత్తముఁ డింతిని గూడి తమ్మునితో
వనములకేగ సద్యశము ♦ భాసిల నొప్పు మహీశ్వరుండు రా
మునిఁ బ్రియపుత్రుఁ గానక స♦ముద్రముతో సరివచ్చు దుఃఖమును
గని యట మగ్నుఁడై మృతిని ♦ గాంచెఁ దపించుచు రాము నెన్నుచున్. ౫౧।

ఆ. నీవు నిఖిలరాజ♦నీతుల నెఱిఁగిన, వాఁడవౌటఁ గొనుము ♦ పార్థివత్వ
మిపుడె నీకయి కద♦యే నిదంతయు నిట్లు, చేసితిని గుమార!♦క్షితిని గొనుము.

క. తనయా! శోకింపకుమా, మనమున సంతాపమంది ♦ మ్రాన్పడకుమ నీ
వును ధైర్య మూనుమా! ప,త్తన మిది వశమయ్యె నీకుఁ ♦ దనకుం దానే.

క. నిరుపద్రవ మీరాజ్యము, కరగతమయ్యె నిట నీకుఁ ♦ గాన వసిష్ఠా
ద్యురుమానుల శాస్త్రజ్ఞులఁ, బరమాదృతిఁ బిల్వఁ బంచి ♦ వారియనుమతిన్.

క. జనకున కదీనసత్త్వన, కనువగు శాస్త్రప్రకార ♦ మతివేగమ నీ
వొనరిచి సంస్కారమ్ములఁ, దనయా! యభిషేకమొందఁ♦దగు మోదమునన్.

డెబ్బదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౭౩ - వ సర్గము.

భరతుఁడు కైక నాక్షేపించుట.

క. జనకుని మరణము భ్రాతల, వనవాసము విన్నయంత ♦ భరతుఁడు దుఃఖం

---

1 అనుఁగుఁగుఱ్ఱా-ఇది కైక కప్పటియుత్సాహముఁ దెలుపు నట్లుంచఁబడియె.

బునఁ దపియించుచుఁ బల్కెను, జనకునిఁ దత్సముని రామ♦చంద్రుని నన్నున్.

క. విషనాడి దూరగతభా,గ్యుఁడనయి శోకించునాకు ♦ నూహింపఁగ నీ
పుడమి యిఁక నేమిపనికో, తడయక విభుఁ జంపి రాముఁ♦దాపసిగాఁ గన్. ౩॥

సీ. ఒనరించితివె దుఃఖ♦మున మీఁది దుఃఖమ్ముఁ గల్గించితివె పుండు♦కలఁచుచుండ
లవణంబునుం జల్లి♦న వడువునను నీవు మాయన్వయము పేరు♦మాపఁ బ్రళయ
కాలోత్థితంబగు ♦ కడుదుష్టశక్తియ ట్లరుగుదెంచితివె నా ♦ యయ్య నిన్నుఁ
గాఁగిటనిడె నగ్నిఁ♦గాఁగిలించుకొనిన కరణి; నేమియు నెఱుం♦గఁడు మహీశుఁ
డో పాపదర్శినీ! ♦ యుర్వీశుఁ జంపితే కులపాంసనీ! నాదు♦కులము నిట్టి

ఆ. గతిని బొందఁజేసి ♦ కడుమోహమున నిందు
సుఖమె లేకయుండు♦చొప్పు వెదకి
యట్లు చేసితివె ధ♦రాధీశుఁ డతియశుఁ
డధికసత్యసంధుఁ♦డౌ నతండు. ౪॥ 2632

క. నినుఁ బెండ్లియాడి కద మృతిఁ, గనియెన్ దుఃఖమునఁ బొగిలి♦కందుచువినునా
జనకుండు ధర్మవత్సలుఁ, డనుపమగుణుఁ జంపితేల ♦ యతనిం బూన్కిన్. ౫॥

క. ఏటికి రామునిఁ బురముం, దాఁటించితి వడవినుండు ♦ తాపసిగా ని
ట్లేటికిఁ జేసితి వకరుణ, నోటక్కరి! తల్లి వగుచు ♦ నొగి నీవిచటన్. ౬ 2634

తే. బ్రదికి యుండఁటఁ గౌసల్య ♦ పరమనియత
యైన యాసుమిత్రయు సుతా♦త్యంతశోక
ములను గుందుట బ్రదుకరు ♦ దలఁప నొక్క
వేళ బ్రతికిన వెతల జీ♦వింత్రు వారు. ౭ 2635

క. గురువృత్తివేత్త, యార్యుం, డురుధర్మవిదుండు రాముఁ ♦ డొక్క తెఱఁగునన్
బరికించి తల్లియందె, క్కరణిన్ వర్తిల్లునట్లు♦గా నీయందున్. ౮॥ 2636

క. అనుపమశుశ్రూషావృ,త్తిని బూనియె నడచుఁగాదె ♦ తెలియదె నీకున్
విను ముందుగ రాఁదగు న,య్యనర్థముల నెఱుఁగునట్టి♦దయి గుణమణియై.

క. అలరెడు నా పెదతల్లియు, నలఘులసద్ధర్మమూని ♦ యుత్సాహధృతిచేఁ
జెలియలివలె నినుఁ గనుఁ గద, తెలియదె నీకీ విధము మ♦దిన్ దుష్టమతీ!.

ఆ. అట్టి న్యాయబుద్ధి ♦ కాత్మజుం డగు బుద్ధి,మంతు రామచంద్రు ♦ మానివృత్తి
వల్కలములఁ గట్టి ♦ వనినుండఁ బంపి పా,పాత్మురాల! శోక♦మందవెట్లు. ౧౧

ఉ. రాముఁ డపాపదర్శనుఁడు ♦ రమ్యయశోధనుఁ డాత్మవేత్త యీ
భూమిని శూరవర్యుఁడయి ♦ పొల్చెడువాఁడుగదా తలంప కీ
వా మహితాత్ముఁ జీరవస♦నాంగునిగా నొనరించి పంపితే
యేమి సుహేతు విందులకు ♦ నింపుగ నీమదిఁ దోఁచె? నక్కటా!. ౧౨ 2

తే. ఏమిఫల మబ్బె దీన నీ♦కిపుడు రామ
చంద్రునెడ నెప్డు నే నెట్టి♦సరణి నడచు

వాఁడనో లుబ్ధవోటఁ బా♦పమతి! నీకుఁ
దెలిసియే యుండదని మదిఁ ♦ దలఁచువాఁడ. ౧౫ 2641

క. కనుకనె రాజ్యము నాకుం, దనివారఁగఁ గల్గుటకు మ♦నంబునఁ దలపో
యని నీవు పూనుకొంటివి, ఘనమైన యనర్థమునకుఁ ♦ గడు నింద్యమతీ!.

*క. పురుషవ్యాఘ్రుల వారిరు,పురనుం జూడకయె భూమిఁ♦బూనుదుఁ దాల్పన్
వరశక్తి యెద్ది గల్గుటఁ, దరమే పాలింప నాకు ♦ ధర్మవిహీనా!. ౧౬ 2643

ఆ. ఒక్కనాకె యాశ్ర♦యుఁడు కాఁడతండు మ,హాబలుండు; భూత♦లాధిపుండు
మేరు వాత్మవనముఁ ♦ గోరికచే నాశ్ర,యించునట్టు లాశ్ర♦యించు రాము.

క. బలవంతుఁడౌట రాముం, డిలాధిపునకైన నాశ్ర♦యింపందగు వాఁ
డలఘుభరంబును మోవం, గల వృషభము పూనిమోయఁ♦గల భారంబున్.

తే. తరుణవత్సంబులై మోపఁ ♦ దలఁచినట్లు
ప్రబలుఁడౌ రాజుచేఁ దాల్పఁ♦బడిన రాజ్య
భారమును దీని నేశక్తి ♦ బాలుఁడనగు
నేను భరియింపఁగలను? నీ♦వే వచింపు. ౧౭ 2646

†సీ. గ్రహణధారణముఖాం♦గప్రయుక్తంబగుమతిబలంబుననుసా♦మము మొదలగు
చతురుపాయంబుల ♦ క్ష్మాపతితనయుండ నౌటను భూపాల ♦ నాదికముల
యందు నాకొక వేళ♦నలరు సామర్థ్యంబు గలిగినఁ గొడుకునం♦దలి ప్రమోద
మున నిమ్మహానర్థ♦మును జేసినట్టి నీవాంఛితమును నే స♦ఫలముగాఁగఁ

తే. జేయనీయను వ్యర్థంబె ♦ చేయువాఁడ
జననిపైఁ బోలె శ్రీరామ♦చంద్రునకును
భక్తిపూర్వకదృష్టి నీ♦పైఁ జెలంగ
దేని పాపమనీషను ♦ బూను నిన్ను. ౧౮ 2647

తే. విడువఁ గోరిక గలిగి యె♦ప్పుడు చెలంగు
నతఁడు నీయందు నునిచిన ♦ యాదరమును
బట్టి విడువంగఁ జాలక ♦ యిట్టులున్న
వాఁడనో పాపదర్శినీ! ♦ పాపచిత్త!. ౧౯ 2648

క. అరయఁగ సజ్జనవర్ణిత, చరితము విడనాడి తీవు ♦ సరగున నస్మ
ద్వరవంశపూర్వవిలస, ద్ధరణీశవినిందితాత్మ ♦ తగ నెటు లబ్బెన్. ౨౦ 2649

క. మాయిూకులమున జ్యేష్ఠుని, కే యర్హము రాజ్య మిద్ది ♦ యొప్పు నతనికే
చేయుదురభిషేకంబటు,లే యాచారమగు నతని ♦ యెల్ల సహజులున్. ౨౧

* అహంహి పురుషవ్యాఘ్రౌ నపశ్యన్ రామలక్ష్మణౌ, కేనశక్తిప్రభావేన రాజ్యం రక్షితుముత్సహే-అని మూలము. † అథవా మే భవేచ్ఛక్తి ర్యోగై ర్బుద్ధిబలేనవా-అనిమూలము. వ్యాఖ్యకర్త వ్రాసినయర్థము ననుసరించి యిది వ్రాయఁబడినదని యెఱుఁగఁదగు.

వాఁడనో లుబ్ధవౌటఁ బాపమతి! నీకుఁ
దెలిసియే యుండదని మదిఁ దలఁచువాఁడ. ౧౩ 2641

క. కనుకనె రాజ్యము నాకుం, దనివారఁగఁ గల్గుటకు మనంబునఁ దలపో
యని నీవు పూనుకొంటివి, ఘనమైన యనర్థమునకుఁ గడు నింద్యమతీ!.

*క. పురుషవ్యాఘ్రుల వారిరు,వురనుం జూడకయె భూమిఁ బూనుదుఁ దాల్పన్
పరశక్తి యెద్ది గల్గుటఁ, దరమే పాలింప నాకు ధర్మవిహీనా!. ౧౪ 2643

ఆ. ఒక్కనాకె యాశ్రయుఁడు కాఁడతండు మ,హాబలుండు; భూతలాధిపుండు
మేరు వాత్మవనముఁ గోరికచే నాశ్ర,యించునట్టు లాశ్రయించు రాము.

క. బలవంతుఁడౌట రాముం, డిలాధిపునకైన నాశ్రయింపందగు వాఁ
డలఘుభరంబును మోవం, గల వృషభము పూనిమోయఁగల భారంబున్.

తే. తరుణవత్సంబులై మోపఁ దలఁచినట్లు
ప్రబలుఁడౌ రాజుచేఁ దాల్పఁబడిన రాజ్య
భారమును దీని నేశక్తిఁ బాలుఁడనగు
నేను భరియింపఁగలను? నీవే వచింపు. ౧౬ 2646

†సీ. గ్రహణధారణముఖాంగప్రయుక్తంబగుమతిబలంబుననుసామము మొదలగు
చతురుపాయంబుల క్ష్మాపతితనయుండ నౌటను భూపాల నాదికముల
యందు నాకొకవేళ నలరు సామర్థ్యంబు గలిగినఁ గొడుకునం దలి ప్రమోద
మున నిమ్మహానర్థమును జేసినట్టి నీవాంఛితమును నే సఫలముగాఁగఁ

తే. జేయనీయను వ్యర్థంబె చేయువాఁడ
జననిపైఁ బోలె శ్రీరామచంద్రునకును
భక్తిపూర్వకదృష్టి నీపైఁ జెలంగ
దేవి పాపమనీషను బూను నిన్ను. ౧౭ 2647

తే. విడువఁ గోరిక గలిగి యెప్పుడు చెలంగు
నతఁడు నీయందు నునిచిన యాదరమును
బట్టి విడువంగఁ జాలక యిట్టులున్న
వాఁడనో పాపదర్శినీ! పాపచిత్త!. ౧౮ 2648

క. అరయఁగ సజ్జనవర్ణిత, చరితము విడనాడి తీవు సరగున నస్మ
ద్వరవంశపూర్వవిలస, ద్ధరణీశవినిందితాత్మ తగ నెటు లబ్బెన్. ౧౯ 2649

క. మాయిాకులమున జ్యేష్ఠుని, కే యర్హము రాజ్య మిద్ది యెప్పు డతనికే
చేయుదురభిషేకంబటు, లే యాచారమగు నతని యెల్ల సహజులున్. ౨౦

* అహంహి పురుషవ్యాఘ్రౌ వపశ్యన్ రామలక్ష్మణౌ, కేనశక్తిప్రభావేన రాజ్యం రక్షితు ముత్సహే-అని మూలము. † అథవా మే భవే చ్ఛక్తి ర్యోగై ర్బుద్ధిబలేనవా-అనిమూలము. వ్యాఖ్యకర్త వ్రాసినయర్థము ననుసరించి యిది వ్రాయఁబడినదని యెఱుఁగఁదగు.

క. అనువర్తింతురు జ్యేష్ఠుని, మనమెఱిఁగి సమాహితాత్మ ♦ మండితులగుచున్
జననింద్యచిత్తురాలా!, మనుజేశ్వర ధర్మ మొక్క ♦ మాఱును మదిలోన్.

సీ. పరికించునట్టి స్వ ♦ భావమే లేకుండునట్టి దానవనియు ♦ నఖిలరాజ
వరులకనాదిగా ♦ వచ్చు ననుల్లంఘ్య మగు సదాచారమి ♦ ట్లనియు నెఱుఁగ
నట్టి దానవనియు ♦ నాత్మకు నాకిప్డు తోఁచుచున్నది శ్రద్ధ ♦ తోఁ దలంప
జ్యేష్ఠుఁడే రాజ్యాభి ♦ షిక్తుఁడై వెలయును గద యిద్ది సమమెయా ♦ త్మావిభులకు
తే. నందఱకు నందు విఖ్యాతి ♦ నలరుచున్న
యట్టి యిక్ష్వాకుకులజులై ♦ యమరు రాజు
లకు విశేషించి యిద్ది యి ♦ లం జెలంగుఁ
గాదె వీరల చరితవి ♦ ఖ్యాతమె కద. ౨౨ 2652

సీ. ధర్మంబె తమకు సం ♦ తతరక్షణంబుగా గ్రహియించి వంశప ♦ రంపరాగ
తమగు చరిత్రంబుఁ ♦ దృజియింపకయె యాచరించువారలు కద ♦ యంచితముగ
నట్టివారలకు స ♦ దాచారగర్వము నీవు వచ్చుటఁ జేసి ♦ పోవసాగెఁ
గద యస్మదన్వయ ♦ క్రమమిటులుండంగ నీవుపుట్టిన యింటి ♦ భూవిభులును
తే. జ్యేష్ఠతనయునకే యభి ♦ షేకకృత్య
మొనరిచెడువారు మహితాత్ము ♦ లురుతరయశు
లట్టివారి వంశంబునఁ ♦ బుట్టినట్టి
నీకు నిటు లేల నింద్యమ ♦ నీష గలిగె. ౨౩ 2653

సీ. పాపనిశ్చయురాల ♦ వై పరఁగెడు నీదు వాంఛితమేను దీ ♦ ర్పంగఁ దలఁప
బ్రాణాంతకరమగు ♦ వ్యసనమ్ము నీవు నా కిట్లు గల్గఁగఁ జేయ ♦ నెంచి దాని
మొదలుపెట్టితివి నీ ♦ మదిఁ గలదానిని జేయకుండుటె కాక ♦ పాయకిపుడ
నీకు ననిష్టంబు ♦ నేఁ జేయఁ బూనెద నిదిగో యిప్పుడె చని ♦ యెందునున్న
తే. స్వజనహితుఁ బాపరహితుని ♦ భ్రాతరాము
నడవినుండి మరల్చెద ♦ నట్లు తెచ్చి
దీప్తతేజున కతనికి ♦ [1] స్తిమితమతిని
దాసభూతుఁడనై యుందుఁ ♦ దత్పరతను. ౨౪ 2654

చ. అనుచు మహాత్ముఁడౌ భరతుఁ ♦ డాజనయిత్రిని నప్రియోక్తులన్
మనమగులంగఁ బల్కి వగ ♦ మానసమంతయు వ్రయ్యలింప న
య్యనఘుని రాముని దలఁచి ♦ యద్రిగుహాందగు సింహమట్టు లా
ర్తనినద మొప్ప నేడ్చె రఘు ♦ రాముని నే స్మరియించుచుం గడున్. ౨౫ 2655

డెబ్బదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

1 స్తిమితమతిని=నిశ్చలమనస్సుతో. 'సుస్థితేనాంతరాత్మనా' అనిమూలము.

## ౭౪ - వ సర్గము.

భరతుఁడు కైకను నిందించుట.

క. భరతుండిటు జనయిత్రిని, బరుషేతరభాషణములఁ ♦ బలికి యిట్టి! యం
చురుతరరోషము పైకొన, నురలం గై కేయిఁ జూచి ♦ మది తత్తఱిలన్. ౧

సీ. ఓదుష్టచారిణీ! ♦ యోక్రూరమతి! సమంచితధర్మమున్ విడి♦చితివిగాన
నీతల్లి విధమున ♦ నీవు [1]రాజ్యభ్రష్టురాలవు గమ్ము నీ♦వేళ నన్నుఁ
జచ్చినవానిఁగా ♦ స్వాంతంబునం దెంచి యేడ్చుచుండుము పృథి♦వీశ్వరునకు
మరణంబు శ్రీరఘు♦వరునకు వనవాసమును సమానముగఁ జే♦సిన కఠోర

తే. హృదయవు గదా ధరాధీశుఁ♦డేని పరమ
ధార్మికుఁడు రాముఁడే రవం♦తయును నిన్ను
నిందచేసిరె? వినుమిఁక ♦ నీవె యీకు
లము నశింపఁగఁ జేసితి ♦ విమతబుద్ధి!. ౩½ 2657

చ. కనుకనె భ్రూణహత్యయును ♦ గాఢతరాఘముఁ జేసినంతఘా
ఘనతరపాతకంబు నినుఁ ♦ గాఱియపెట్టెడుఁ గాన నారకం
బునకె చనంగ నీకుఁ దగుఁ ♦ బూజ్యము భర్తృసమానలోకమున్
గనుఁగొనఁ జాలవింక నది ♦ గల్గదు నీకెటుభంగిఁ జూచినన్. ౪ 265

తే. ఘోరకర్మంబునకుఁ బూని ♦ యారఘువరుఁ
గానకుం బంపునంత య♦ఘుంబుఁ జేసి
తీర్చితివిగద! కైకేయి! ♦ దీనివలన
నపకృతియు నాకెయయ్యె నే♦మంటివేని. ౪½ 2659

తే. సర్వలోకప్రియుండగు ♦ సరసమతిని, భ్రాతనెడఁబాసి యాతని ♦ ప్రాపులేమి
భయము నాకును గల్గె నీ♦వలననైన, ఫలమిదే గాని రాజ్యలా♦భంబు గాదు.

క. నినుఁ బట్టి తండ్రి మృత్యువుఁ, గనియెన్ రాముండు చనియెఁ♦గానకు; నాకున్
జననిందితమగు నయశము, జననీ! నీవలన నిపుడు ♦ సంప్రాప్తించెన్. ౬ 2661

తే. తల్లిరూపంబునన్ నాకు ♦ దాపరించి, నట్టి యోశత్రువా! క్రూర♦మైనబుద్ధి
గల్గి దుర్వృత్తి యమరంగఁ ♦ గాంతుఁ జంపి, నట్టి పాపమతీ! యింక♦నైన నీవు.

క. నాతోడఁ బలుకవలదిట, నీతటి రాజ్యైకకాంక్ష ♦ యెనఁగెఁగదా నీ
చేతస్సున నామాటను, నీతనయుఁడనంచుఁ దలఁప ♦ నీకుఁ జనదునూ!. ౭

క. కులదూషిణివై తగు నీ, వలనం గౌసల్య వెతలఁ♦బడియె సుమిత్రా
లలనయుఁ దక్కినరాజన,నులు దుఃఖముఁ గనిరి నేను♦నుం గనినాఁడన్. ౮

సీ. ధర్మముఖ్యుండయి ♦ తగి మతిమంతుఁడౌ కేకయభూపతి♦కిన్ జనించి.
నట్టిదానవు గావు ♦ నెట్టన నచ్చటఁ బుట్టి తత్కులమును ♦ బూదిచేయ

1 రాజ్యాద్భ్రంశస్వ-అనిమూలము. నీతల్లివలె నీవు నడవులపాలు కమ్మనిభావము.

నెంచిన రాక్షసి ♦ వీవు నిశ్చయ మిద్ది కావున సత్యసం♦కల్పు రాము
నడవికిఁ బంపితి♦వా దుఃఖమున నాదు జనకునిఁ బరలోక♦మునకు సాగ
తే. నంపితివి నీవుఁ బాపకా♦ర్యంబె ముఖ్య
మద్ది యొనరించినందుల♦కైన ఫలము
నాకుఁ బ్రాప్తించె నేను జ♦నకునిఁ జంపు
కొని సహోదరులెడఁబాయ ♦ జనులు దిట్ట. ౧౦౪ 2665

క. జనవితతి కప్రియుఁడనై,తిని నీవో యఘముఁ జేసి ♦ తీరెదు భావం
బున నొప్పుదానవౌటను, జనుదువు నరకమునకెన్ని ♦ సరణులఁ గనినన్. ౧౧౪

తే. ధర్మమతికిఁ గౌసల్యకుఁ ♦ దనయవిరహ
మును గలుగఁజేసి యేలోక♦మును గనెదవొ
దుష్టురాలా! సమస్తబం♦ధువుల కాశ్ర
యుఁడని పరిశుద్ధసద్వర్త♦నుఁడని రాము. ౧౨౪ 2667

క. కనఁ జాల వేమొకో జ్యేష్ఠుని నాకుం దండ్రివోలె ♦ శుభదుండని నీ
మనమున నొకమాత్రైనను;, బెనుపాపమె నీదు చిత్త♦వృత్తియగుఁ జుమీ!.౧౩

సీ. తనయుండు జననివ♦క్త్రగళవక్షఃకుక్షి పాదంబులను నాసి♦కాదులైన
ప్రత్యంగములను సం♦భవమందుటయెగాక ప్రత్యగాత్మకు సదా♦వాసమునయి
యనురాగసంస్థాన♦మునగు హృదయముననుండియుఁ బుట్టిన ♦ట్లొప్పువాఁడు
కనుక నే యందఱి♦కంటెను దల్లికిఁ దనయుండు ప్రియతముం ♦ డనఁగఁబరఁగు
తే. బంధువుల్ ప్రియులగుదురు ♦ బహుళధర్మ
ముల నెఱిఁగి దేవతల సత్కృ♦తులను బడసి
ఖ్యాతిగను కామధేను వొ♦క్కపుడు మున్ను
వృషభయుగళంబుఁ గాంచెను ♦ బృథివియందు. ౧౪౪ 2669

క. తనకులమున జనియించుటఁ, దనయులునై హలము మోసి♦ధరదున్నుచు మూ
ర్ఛను బొందియున్నవానిని, గనె నవి మధ్యాహ్నము దను♦కన్ హలభరమున్.

ఆ. మోసి దున్ని బడలి ♦ మూర్ఛిల్లుటం గాంచి
పుత్రదుఃఖమునను ♦ బొగిలి బాష్ప
జలసమాకులాక్షి ♦ జలజాతయగుచు రో
దనము చేసె నట్టి ♦ తరుణమందు. ౧౬ 2671

క. దానికిఁ గ్రిందుగ విబుధవి,తానాధిపుఁ డింద్రుఁ డేటకో ♦ తాఁ జనుచుండం
గా నతని తనువుసోఁకెను, దానికనుల నీళ్లు బిందు♦తతిగా నంతన్. ౧౬౪ 2672

క. సురుచిరగంధములై యీ, కరణిం దద్బాష్పసలిల♦కణములు పడఁగా
సురపతి పావనసురభియె, కరమున్ దుఃఖించె ననుచు ♦ గ్రహియించె మదిన్.

సీ. నాలుగుప్రక్కల ♦ నాకాధిపతిచూచి యాకసంబున దీన♦యై కరంబు
వెతలఁగుందుచుఁ బలు♦విధముల నేడ్చుచు నున్నయాసురభిని ♦ నొకటఁగాంచి
వజ్రపాణియగుచు ♦ వాసవుఁ డార్తినిఁ గుందు యశస్వినిఁ ♦ గోర్కె లొసఁగు
నాకానుధేనువు ♦ నవ్విధినుండంగ నుద్విగ్నుఁడై కర♦యుగము మోడ్చి
తే. పలికె నీరీతి మావారి♦వలన నీకుఁ, బెనుభయము గల్గలేదుగా ♦ వెతలఁబడియె
దేల? నీవిట్టులందటి ♦ మేలు కోరు,దానవుగదా వచింపుమా! ♦ మానకింక.

క. అని మతిమంతుఁడు సురపతి, యనుకంపం బల్కినట్టి ♦ యప్పలుకులకున్
మనమలర వాగ్విశారదుఁ, డనఁదగు నింద్రునకు ధీర♦యై యా వనియెన్.

క. అనఘా! యిట్టి యమంగళ, మనునది లేకుండుఁగాక ♦ యసురసమూహం
బున నెవరివలననున్ భయ, మనునదియే కల్గదెప్పు♦డైన సురేశా. ౧౩

క. తనయులు కష్టావస్థం, గనుచుండుట ధరణియందుఁ ♦ గాంచితి దానం
గనియెద శోకము తెలిపెద, వినుమా కర్షకుఁడు పూన్కి ♦ వివిధవిధములన్.

క. పీడించుచుండఁగాఁ బై, వేఁడివెలుఁగు నాతపమ్ము ♦ వెలయఁగ దానన్
వాడి కృశించుచు వెతలం, గూడిన నాయీ కుమార♦కులకు వగచెదన్. ౧౪

క. ఈయిద్దఱు పుట్టిరి నా,కాయమ్మునసుండి యట్లు ♦ కావున బరువున్
మోయఁగఁ జాలక పీడితు,లై యార్తిని బొగులుచుంట ♦ కాత్మఁ దపింతున్.

క. తనయునకు సమముగాఁ బ్రియుఁ, డనఁదగువాఁడెవ్వఁడు గలఁ ♦ డపనినిజంబం
చును బల్కెఁ; బెక్కువేలగు, తనయులు లోకమున నిండఁ♦దాఁ గనియందున్.

తే. కొడుకు లిద్దఱు కష్టముల్ ♦ గుడుచువార
లని తపించుచు నేడ్చు న♦య్యావుచర్యఁ
గాంచఁగాఁ బుత్రకునికంటె ♦ నెంచ నధికుఁ
డితరుఁ డెవ్వఁడు లేఁడని ♦ యింద్రుఁ డెంచె. ౧౫ 2681

సీ. అసమశీలంబున ♦ నలరి సమృద్ధిచేఁ దనరి శాశ్వత సుగు♦ణనికరమున
నొప్పి సృజింపంగ ♦ నూహించినంతనె యర్థానిఁ జేయు శ♦క్త్యతిశయమున
నమరిన యా నిర్జ♦రార్చితధేనువు భామినీపురుషస్వ ♦ భావమైన
వ్యాపారమున జగ♦ద్వ్యాపారమును గోరి వేనవేలుగఁ దాను ♦ సూనులఁగని

తే. ఫరఁగునది యయ్యు నాత్మజ♦ద్వయము వెతఁ
బడుటఁగని యేడ్చుచున్నదే ♦ పరమనుగుణ
ఖనియయిన రామచంద్రు నొ♦క్కసుతుఁ గనిన
యట్టి కౌసల్యసుతుఁ బాసి ♦ యడలకున్నె? ౧౬ 2682

క. ఇది చెప్పవలెనె వేఱుగ, సుదతీమణి నామె విగత♦సుత నొనరిచితీ
వదయతఁ గావునఁ గైకా!, యిది వినుమా! వెతలఁగందు♦విహాపరములలోన్.

క. నాయన్నను రాముని నా, నాయన నీరీతిఁ బూజ♦నములఁ దనుపుచున్
వే యశము వర్ధిలంగాఁ, జేయుదు నే నింకమీఁద ♦ సిద్ధమిది సుమీ!. ౩౦
క. [1]విను పూజావిధిఁ జెప్పెద, వనికిం జని రాము మహిత♦బలుఁ గౌసల్యా
తనయునిఁ దోడ్తెచ్చెద నా,తని మాఱుగ మునినిషేవి♦తము వనిఁ జొత్తున్.
తే. పాపసంకల్పురాల! యీ ♦ పౌరులెల్ల
నశ్రుకంఠంబులన్ నన్ను ♦ నార్తిఁ జూడ
నిట్లు నీవొనరించిన ♦ యిన్మహాఘ
మును భరించుచు నుండంగ♦లనె పురమున. ౩౨ 2686
తే. అగ్నియందైనఁ బడు దండ♦కాటవికిని
జను మటులు కాకయున్న గొం♦తునకుఁ ద్రాడుఁ
గట్టుకొని మృతిఁ బొందు మిం♦క నివి తప్ప
వేఱు గతిలేదు చూడఁ బా♦పివగు నీకు. ౩౩ 2687
క. నేనో సత్యపరాక్రముఁ,డౌ నాయన్నరఘురాముఁ ♦ డననిం బొందం
గా నపగతపాపుఁడనై, నానిశ్చయసిద్ధిని మ♦నంబునఁ గాంతున్. ౩౪ 2688
చ. అని వచియించి యాతఁడు మ♦హాత్తరకోపమునొంది యూర్పులన్
ఘనముగఁ బుచ్చుచున్ భుజగ♦కల్పుఁడుగాఁ గనుపట్టి యంతటన్
వనమునఁ దోమదాంకుశవి♦బాధితమై ఘనగర్తపాతముం
గను గజమట్లు నేలఁబడి ♦ క్ష్మాపతిపుత్త్రుఁడు రక్తనేత్రుఁడై. ౩౫ 2689
తే. అంబరమువీడ నాభర♦ణంబులెల్ల, నవనిపైఁ బడ నుత్సవ♦మైన వెనుక
క్షమను ద్రెళ్లెడు నింద్రధ్వ♦జంబురీతి, నవనినుండెఁ బరంతపుఁ♦డౌ భరతుఁడు.

డెబ్బదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౭౫ - వ సర్గము.

భరతశత్రుఘ్నులు కౌసల్యను జూడఁబోవుట.

శా. ఎంతోసేపటి కెట్లొ తెల్విఁగని యిం♦కేమందునం చశ్రుసం
క్రాంతాక్షుండయి వీర్యవంతుఁడగు నా♦క్ష్మానాథపుత్త్రుండు న
త్యంతంబున్ వెతఁబొంది [2]దీనయగుచుం ♦ దానున్న కైకన్ క్రుధా
స్వాంతుండై కని [3]మంత్రులెల్ల వినఁగాఁ ♦ బల్కెన్ గఠోరోక్తులన్. ౧
ఉ. కోరఁగలేదు రాజ్యమును ♦ గోర్కి నొకప్పుడు, నేను రాజ్యముం
జేరఁగ యోజనల్ జనని♦చెంత నొకప్పుడు సేయలేదు త

---

1 విను పూజావిధిఁ జెప్పెద - అనునది 'భ్రాతురపచితిమాహ' అను వ్యాఖ్యకుఁ దెనుఁగని యెఱుఁగనలయు. 2 దీనా ముద్వీక్ష్య మాతరమ్-అని మూలము. 3 భరతాగమనమును విని యచ్చటికి సుమంత్రాదులు వచ్చిరనుట వ్యాఖ్యానాభిప్రాయమని తెలియఁదగు.

దుర్భరమణుండు రాజ్యభరము ♦ బొందెడు నట్లుగ నన్నుఁ జేయఁగా
సారవిచారమేకరణి♦నల్పెనొ దానినెఱుంగ నేమియున్. ౨ 2692

చ. అనుజునితోడ దూరమగు♦నట్టి యొకానొక దేశమందు నుం
టను దమరే యెఱుంగుదుర♦టన్ వసియించుటయే మహాత్ముఁడై
తనరెడు రామచంద్రునకు ♦ దారుణకాననవాస మబ్బుటల్
మనమున నేనెఱుంగ నొక♦మాటును నిశ్చయ మిద్ది చెప్పెదన్. ౩ 2693

క. సీతకు లక్ష్మణునకు నే, రీతిగ వనవాసమబ్బె ♦ రీతిం దానిన్
జేతస్సున నేఁ దెలియను, నీతల్లియె కారణమగు ♦ నిన్నిటి కిచటన్. ౪ 2694

చ. అని మహితాత్ముఁడౌ భరతుఁ ♦ డార్తి విలాపముచేయుచుండఁ ద
త్స్వనమును రామమాత విని ♦ సాధ్వి సుమిత్రను గాంచి యిట్లనున్;
వినుమదె క్రూరకృత్యమును ♦ వింతగఁ జేసిన కైకపుత్త్రుని
స్వనమును, వచ్చినాఁడతఁడు ♦ వాఁడు తలంపఁగ దీర్ఘదర్శియా! ౫ 2695

క. కనుఁగొనఁ గోరెద నాతని, ననుచున్ వ్యథ నన్నె మాజె ♦ యతిమలినాంగం
బునఁ జిక్కియున్న రాముని, జనని సుమిత్త్రకును జెప్పి ♦ చయ్యన [1]వడఁకెన్.

తే. వడవడవణంకుచున్ దన♦స్వాంత మట్టె
సొమ్మసిల్లఁగఁ దాఁ బయ♦నమ్ము చేసె
నపుడు శత్రుఘ్నుతోడ రా♦మానుజుండు
చనియెఁ గౌసల్యయింటికి ♦ సత్వరముగ. ౭ 2697

సీ. భరతశత్రుఘ్నులు ♦ పరమదుఃఖార్తులై క్షితిపైనిఁ బడి నష్ట♦చేతనయయి
విలపించు నమ్మన♦స్విని నార్యఁ గౌసల్యఁ గని చేరఁబోయి దుః♦ఖమునఁగుంది
యేడ్చుచు నాభ్రాత ♦ లిద్దఱు కౌఁగిటఁ బొదిగి రా కౌసల్య ♦ పొగులుచుండి
భరతుని గని యిట్లు♦పల్కె రాజ్యముఁగోరితత్ప్రాప్తికై మదిఁ♦దాపమొందు

ఆ. నీకు రాజ్యమిదిగొ ♦ నిష్కంటకంబయి, కైకదైన క్రూర♦కర్మమునను
శీఘ్రకాలముననె ♦ సిద్ధించె నక్కటా!, క్రూరకృత్యము గనఁ ♦ గోరు కైక.

క. శ్రీరాముని నాప్రియసుతుఁ, జీరాంబరముల ధరింపఁ ♦ జేసి యెలమితోఁ
గ్రూరారణ్యములం దగఁ, జేరం జేసె నిఁక ఫలము ♦ చెప్పుమ దానన్.

క. ఈపని చేయకయుండియు, నీపగిదిన్ రాజ్యమొంద ♦ నేల దగదొ? వ
న్నేపగిదినైన నటవికి, [2]వే పంపం దగును నృపత ♦ వెలయుటకతనన్. ౧౨

క. కనకమయాంగుఁడు సుయశం, బునఁ దనరెడు నాసుతుండు♦పొదలు నెచటన
వ్వనికిన్ ననుఁ బంపందగు, విను నేనె సుమిత్త్రఁగూడి ♦ వెడలెద వనికిన్.

1 వేపమానా-అనిమూలము. రామవిషయకదుఃఖమునను, కైకవలనిభయమునను, ముందేమి భరతునివలనఁ జేటు వాటిల్లునో యనువిచారమునను వడఁకెనని భావము. 2 వే-వేగ-అనునివి ద్రుతాంతములు గావని యెఱుంగఁదగు. ఇప్పటివారిలోఁ గొందఱు ద్రుతాంతము లనుచున్నారు.

*తే. దశరథేశుని యగ్నిహో♦త్రములఁ దనువు
వారక గ్రహించి సుఖముగఁ ♦ జేరఁబోదుఁ
దనయుఁ డున్నట్టి చోటికిఁ ♦ దడయ కిపుడె
యనుచు భరతునకధిపు దే♦హంబునందు. ౧౪ 270

క. ఏమే నధికారము లే, దేమాడ్కిం గనిన నంచు ♦ నీయర్థమ్మున్
దా మనసులోనఁ దలఁచుచు, నీమాడ్కిం బల్కి మఱియు ♦ నిట్లని పల్కెన్.

క. పురుషవ్యాఘ్రము రాముం, డరణ్యముల నెందుఁ దపము ♦ నతినిష్ఠం జే
యు రతిఁ గని యున్నవాఁడో, భరతా! నీవైనఁ జేర్పు ♦ వని నద్దానిన్. ౧౫

క. వితతంబై ధాన్యసమం,చితమై హస్త్యశ్వరథవి♦చిత్రతరంబై
యతిశయమగు నీరాజ్యము, హితముగఁ గైకేయి నీకు ♦ నిప్పించెఁ జుమీ!.

మ. అని యీలాటి కఠోరవాక్యతతి నా♦యాసంబునన్ దూఱఁగా
విని యేపాపమెఱుంగకుండుటను వే♦వే దుఃఖవార్తావళిన్
వినుటన్ దుఃఖితుఁడైన వాఁడగుట ను♦ద్వృత్తవ్రణాగ్రంబు [1]సూ
చిని నొక్కంబడినట్టు లప్పలుకులన్ ♦ జిత్తమ్ము శోషిల్లఁగన్. ౧౭ 2706

క. మనమున నేమియుఁ దోఁపమిఁ, జని యల కౌసల్యపాద♦సరసిజములపై
వనటం బొందుచుఁ బడి [2]చే,తన తప్పట నల్లె యుండి ♦ తనకుం దానే.

తే. తెలివి వచ్చుటచే నంతఁ ♦ దెప్పిఱిల్లి
బహువిధంబుల నేడ్చు న♦ప్పావనమతిఁ
గాంచి కైమోడ్పు నుదుటఁ గీ♦లించి యార్తిఁ
బలికె నిట్లని తల్లితో ♦ వ్యసనపడుచు. ౧౯ 2708

తే. ఆర్య! రామునియందు నా♦కధికభక్తి
ప్రీతియును గల్గుటెఱుఁగవే ♦ యీతఱి నభి
షేకమును నేనెఱుంగనేఁ ♦ జేయనేమి
పాపము నిఁకేల నిందించె ♦ దీ పగిదిని. ౨౦ 2709

భరతుఁడు శపథములు చేయుట.

చ. వనమునకున్ రఘూత్తముఁడు ♦ పండితవర్యుఁడు సత్యసంధతం
దనరెడువాఁడు పోవఁగ నె♦దన్ దగ నెవ్వఁడు సమ్మతించెనో
జననీ! యతండు దేశికుని ♦ సన్నిధి సద్విధి నేర్చినట్టి బు
ద్ధిని దగువాఁడు గాక కుమ♦తిం దగువాఁ డగుఁగాక యెప్పుడున్. ౨౧ 2710

* ఇందు నగ్నిహోత్రము పెద్దభార్య యధీనమున నుండఁదగినది. భరతునితోఁ గౌసల్య సంస్కారముకూడ నీవు తండ్రికిఁ జేయఁగూడదని చెప్పుట కైకసంబంధముచే భరతుఁడుగూడఁ బాపాత్ముఁడే యగునని సూచించుట కని తెలియనగు. 1 సూచిని=సూదితో. 2 చేతన (ఇది యాకారాంత స్త్రీలింగము)=తెలివి.

సీ. ఎవఁడు రాముఁడు వని♦కేఁగ సమ్మతి నొందె నాతఁడెంతయు నీచ♦జాతులకును
సేవకుండును; సర♦సీరుహామిత్రున కభిముఖుఁడై మూత్ర♦మటు పురీష
మును విడిచినవాఁడుఁ;♦[1]దనపదంబున నావు నిదురించుచుండఁద♦న్నినదురాత్ముఁ
డునగుఁ గాక; యెవండు♦మనమున రాముని వనవాసమున కాదృ♦తినిగనునతఁ
తే. డాత్మభృత్యునిచేఁ బెద్ద♦దైన పనిని
జక్కఁ జేయించుకొని భృతి ♦ సరిగ నియ్య
కతని కష్టంబు వ్యర్థమా♦నట్లు చేయు
భర్తకగు పాపముం బొందుఁ ♦ బల్కులేల. ౨౩ 2711

సీ. మనుజులనెల్లను ♦ దన పుత్రకులభంగి మనుచు పతికి ద్రోహ♦మును నొనరుచు
వానికిఁ గల్గు పా♦పము గల్గుఁగాక; షడ్భాగము కప్పముఁ♦దాఁ గొని మను
జులఁ గావకుండు రా♦జునకుఁ గల్గెడునట్టి యఘము గల్గుంగాక;♦యజ్ఞమందు
సాధువ్రతోపవా♦సములఁ జేసెడు ఋత్విజులకు దక్షిణ లియ్యఁ♦గలనటంచు
తే. శపథమును జేసి కార్యంబు ♦ జరగిన తరు
వాత లేదని చెప్పెడు ♦ వానికొదవు
నఘము గలుగును గాక; యో♦యంబ! రాముఁ
డడవి కేగుట కెంచిన ♦ యతని కిపుడ. ౨౬ 2712

క. కరిహయరథ సంకులమై, శరవితతుల నాకులమగు ♦ సమరంబున నే
పురుషుండు వీరధర్మ, స్ఫురణము విడి పాఱునతనిఁ ♦ బోలు నితఁడు నూ!.

మ. మతిమంతుండగు దేశికుండు వరసూ♦క్ష్మస్ఫారతాత్పర్యసం
యుతవేదాంతరహస్యశాస్త్రము శ్రమం♦బొప్పంగ బోధింప నిం
దితచిత్తంబున దానిమానెడు కుబు♦ద్ధింబోలు, నేవాఁడు రా
ముఁనితుఁ డిప్పట్టునఁ గానకుం జనఁ దలం♦చుఁ దా వాఁడు నిక్కంబుగన్. ౨౮

సీ. ఎవఁడు రాముఁడు వని♦కేగఁదలంచునోయతనికిఁబృథులబా♦హాంసుఁడగుచుఁ
జంద్రార్కతుల్యతే♦జస్కుఁడై రాజ్యంబుఁ గైకొని పేరోల♦గమున యందు
సింహాసనంబునఁ ♦ జేరిన శ్రీరామచంద్రునిఁ గను నదృ♦ష్టంబు గలుగ
కుండునుగాక; యె♦వ్వండుపాయసమును నువ్వులాన్నముఛాగ♦మాంసగుడము
తే. లను బితరులకు దేవత♦లకు నతిథుల
కును సమర్పణముం జేయఁ♦గోరకె తను
వ్యర్థముగ నిర్దయుండయి ♦ వరుసఁ దినెడు
వానికిం గల్గునట్టి పా♦పంబు గలుగు. ౨౯ 2715

క. తలిదండ్రులు లోనగు పెద్దల నవమానించినట్టి ♦ దారుణపాపం
బులఁ బొందు రామునిం గానలకేగఁ దలంచునట్టి ♦ నరుఁడు జననిరో!. ౩౦

1 తనపదంబునఁ జక్కఁ ట్టికేయుస్థలమున.

సీసమాలిక:—

అడవికి రాఘవుం ♦ డరుగుట కెవ్వాఁడు సమ్మతించునొ యట్టి ♦ జనుఁడు ధేను
వులఁ బాదమునఁ దన్ను ♦ బుద్ధిహీనునివంటివాఁడును; దానయి♦స్వగురువులను
నిందఁ జేసినయట్టి ♦ నీచసముండును, [1]స్నిగ్ధులకుం జెడ్డ♦చేయఁ దలఁచి [న
నట్టివాఁడునగుఁగా; ♦కంబరో! మఱియునుదనతోడఁ బ్రియపుత్త్రుఁ♦డనునయము
విశ్వాసమున నొక్క ♦ విషమాపవాదంబు నేకతంబునఁ జెప్ప ♦ నేర్పడంగ
దానిని వెలిపుచ్చు ♦ దారుణకర్మునివంటివాఁడగు; మఱి ♦ పరులుచేయు
నుపకారమునకుఁ బ్ర♦త్యుపకృతి నొనరింప నట్టివాఁడును; బరు♦లరసి చేయు
నుపకృతి మఱచిన ♦ యురుపాపి సముఁడును; సజ్జనవర్జిత♦జనునివంటి
వాఁడును; దుర్మతిఁ ♦ బడసిన యట్టిఁడౌ మనుజసముండును; ♦ ఘనతరాఘ
మాచరించియు దాని♦కయిన ప్రాయశ్చిత్తమును జేసికొనక, సి♦గ్గును ద్యజించి
చరియించు నరునకు ♦ సముఁడును నయి, యెల్లవారిచే ద్వేషింపఁ♦బడినవాఁడు
నగు; మఱియును స్వగే♦హమునఁ బుత్త్రకళత్త్ర భృత్యయుతుండయి♦ప్రీతినిడక
తాను మాత్రమె సమృ♦ద్ధంబగు నన్నంబుఁదినునొయవ్వానికిఁ♦గనఁదగునఘ
మొందు; సద్వంశంబు♦నందుఁ బుట్టిన కన్యకను బెండ్లియాడక♦ఘనతరాగ్ని
హోత్త్రాదిధర్మకా♦ర్యోన్నతి మానుచు ననపత్యుఁడయి మృతుం♦డగునుగాక;
మఱియును భూమిజా ♦ మండితుండౌ రాముఁ డడవికిఁబోవంగ ♦ నాత్మనెవ్వఁ
డాదృతిఁ గనునట్టిఁ♦డల్పాయువును బొంది కడుదుఃఖితుండయి♦కాంతయందు
సంతతిం బడయఁగాఁ ♦ జాలకుండును గాక; పార్థివు వనితను ♦ బాలు వృద్ధు
నెవ్వనిఁ జంపిన ♦ నే పాపమొదవునో సేవకుఁ బోషింప♦కే విడిచిన [ను
నేయఘమంటునో♦యాయఘమ్మును బొందుఁగాక; మాంసము లత్తు♦కను,విషము
మద్యలోహాదిస♦మస్త దుర్వస్తువులను నమ్మి యాద్రవ్య♦మునఁ గుటుంబ
పోషణమును జేయు ♦ భూరిపాపాత్ముని వంటివాఁడగుఁగాక; ♦ పగతురదగు
పక్షమ్మునం గడు♦భయదయుద్ధముచెల్ల భయపడి తానొగిఁ ♦ బాఱునపుడు
చంపంగఁ బడుఁగాక; ♦ సారహీనంబగు తలపుర్రెఁ గరమునఁ ♦ దాల్చి మలిన
జీర్ణవస్త్రముఁ గట్టి ♦ క్షితిపయి నున్మత్తువలె బిచ్చమెత్తుచు ♦ నెలమి దూల
సంచరించును గాక; ♦సారాయిఁ ద్రావుచుఁ గామాదులకుఁ జిక్కి♦కాంతలందు
సతతంబు లోలుఁడై ♦ సాధ్వసమ్మతమగు జూదమాడుచుఁ బరి♦శుద్ధవృత్తి
హీనుఁడై చనుఁగాక; ♦ మానితధర్మంబునను మది నిలుపక ♦ యనుదినంబు
ధర్మంబుఁ జేయుచుఁ ♦ దగిన ప్రతిగ్రహీతలకు నీయక యపా♦త్త్రులకు భూరి
దానమ్ము చేయుచుఁ ♦ దానుండువాఁడగుఁ గాక; శ్రీరాముండు ♦ కానకేగ

---

1 స్నిగ్ధులు=మిత్త్రులు. ఈస్నిగ్ధశబ్దమే యిపుడు స్నేహితుఁ డనుపేరఁ బరఁగుచున్నది. దీనిని సాధించుటకుఁ గ్రొత్తపాణిని ధరణిఁ బుట్టవలయునేమో.

సమ్మతించినవాని ♦ సకలవిత్తంబులు చిరసమార్జితములు ♦ చిత్తతృప్తి
కరములు చోరుల ♦ కరగతములు నగుఁగాక; సూర్యోదయ♦కాలమందు
నస్తమించెడు తఱి ♦ నాదృతి నిద్రించు నట్టివానికిఁ గల్గు ♦ నఘము గలుగుఁ
గాక; గేహంబులు ♦ గాల్చినవానికి గురుకళత్రంబును ♦ గూడువాని,
నత్యంతమిత్రుని ♦ నపకృతిఁ జేసిన వానికిఁ, గలుగు పా♦పంబు గలుగుఁ
గాక; దేవతలకుఁ ♦ గడుభక్తిఁ బితరుల కంబకుఁ దండ్రికి ♦ నరసి సేవఁ

ఆ. జేయనట్టి జనున♦కే యఘమబ్బునో, దానిఁ బొందుఁగాక; ♦ తాను వేగ
సాధుజనులచేత ♦ సంత్యజింపంబడుఁ, గాక; సాధువినుతిఁ ♦ గనక యతఁడు.

క. సుమతులు చేసెడు సత్కర్మములకు దూరుండు నగుచు ♦ మహి నుండుంగా
క; మఱియు దీర్ఘభుజుండయి, సుమహితవత్సుఁడగు రాము♦శుభగుణనిలయున్.

క. వనికిం బంపఁగ సమ్మతిఁ, గనునో యవ్వాఁడు తనను ♦ గనుతల్లికి సే
వను మాని యధర్మంబును, గనుచుండుంగాక పృథ్విఁ ♦ గడుదూష్యుండై.

చ. తనయులఁ బెక్కురం గనుచు ♦ ద్రవ్య మొకించుక లేకయే జ్వరా
దినిఖిలరోగయుక్తుఁడయి ♦ తెల్లముగా సతతంబు దుఃఖముం
గనుచుఁ గృశించుఁగాక; మఱి ♦ కమ్రమహాసనమందునుండి త
న్ననులను బైకి నెత్తికని ♦ గాఢనుతుల్ దగఁజేసి దీనతం
గనుచును వేఁడుయాచకుల ♦ కాంక్షల వ్యర్థముచేసి నట్టిఁడై. ౫౦ 2720

చ. అనిశ మధర్మమార్గమున ♦ యందుఁ జెలంగుచు దుష్టుఁడౌచు వం
చనమున నొప్పి శీలమును ♦ జయ్యనఁ బాసి నృపాలభీతితో
మనము వగం గనం బ్రదుకు ♦ మర్త్యునితో సముఁడౌ; రఘూద్వహున్
వని కనుపంగ నెంచునో యె♦వండు నిజంబుగ నాతఁ డంబరో!. ౫౧ 2721

క. అతివ ఋతుస్నాత పతివ్రత ఋతునియమముల నెన్ని ♦ వచ్చి నిలువ దు
ర్మతి నెవఁడు కలయికం ద,త్సతిఁ దన్పఁడొ యమ్మనుష్య♦సముఁడౌ నితఁడున్.

ఆ. ధర్మనిరతి మాని ♦ తా మూఢుఁడై ధర్మ
పత్ని మాని యొరుని♦పత్నిఁ గూడు
నట్టి వాఁడె యగు మ♦హాత్ముఁడు రాముఁడు
వనికిఁ బోవఁ బ్రీతిఁ ♦ బరఁగునతఁడు. ౫౩ 2723

తే. నష్టసంతానుఁడౌ విప్ర♦నకును గలుగు
పాపముం బొందు శ్రీరాము♦వననివాస
మునకు సమ్మతి నొందిన♦మనుజుఁ; డమల 2724
పానయోగ్యజలంబులఁ ♦ బాడుచేయ. ౫౪

క. ఒరులకు విషముం బెట్టఁగ, నురుతరపాప మెది యబ్బు ♦ నొగిదానింబొం
దు; రఘూద్వహుండు వనముల, కరుగుటకున్ సమ్మతించు♦నట్టి కుమతియున్.

క. కలుషేంద్రియుఁడై సద్విప్రులకుం జేయుటకుఁ దగిన ♦ పూజఁ జెఱచును
జ్జ్వలపాపియగును బదిదినములు వెళ్లని దూడయావు ♦ మోదము తనరన్.

ఆ. పట్టి పాలు పిదుకు ♦ పాపాత్ముఁడౌ; నంబ!
తన గృహంబునందుఁ ♦ ద్రాఁగఁ దగిన
జలములుండి దప్పిఁ ♦ గలవిలపడువాని
కిడక మోసపుచ్చు ♦ జడుఁడగుఁ జుమి!. ౫౮ 2727

క. ఇరువురు వాదించెడు తఱి, సరిగాఁ దత్కాలహామార్పు ♦ శక్తి గలిగి య
త్తరుణమున దానిఁ దీర్పని, పురుషుఁడు పొందెడునఘంబుఁ ♦ బొందెడుఁజుమ్మీ!.

క. అని పలికి రాజపుత్త్రుఁడు, తనయుని నెడఁబాసి పతిని ♦ దాఁ బాసి తగన్
వనటం గుందెడు కౌసల్యను దేర్చుచునే మహార్తి ♦ నవనిం బడియెన్. ౫౯

ఆ. ఆతఁ డిట్లు దుస్స ♦ హములగు శపథంబు
లాడుచున్ మహార్తి ♦ నలజడిఁబడి
చేతనంబులేక ♦ క్షితినుండఁ గౌసల్య
భరతుఁ గాంచి యిట్లు ♦ పలికె నపుడు. ౬౦ 2730

క. భరతా! శపథంబుల నీ, కరణిన్ నీవొనరుపంగఁ ♦ గనుచుండిన నా
కురుతర మయ్యెను దుఃఖ, [1]మ్మరిగెడు ప్రాణముల నిల్పి ♦ యలరెద వీవున్. ౬౧

తే. భాగ్యవశమున నీదగు ♦ స్వాంత మిప్పు
డన్ననే యనువర్తించు ♦ నట్టి సాధు
ధర్మముననుండి చంచల ♦ తం బొరయదు
సత్యశపథుండవీవు ల ♦ క్ష్మణుని భంగి. ౬౨ 2732

క. కనుకన్ సత్పురుషులకగు, ఘనలోకము నొందఁగలవు ♦ గాదిలిపుత్రా!
యని పలికి భ్రాతృవత్సలుఁ, దనయు మహాబాహు నంక ♦ తలమునఁ జేర్చెన్.

తే. అంకమునఁ జేర్చి కౌఁగిట ♦ నదిమి పరమ
దుఃఖమొందుచు నేడ్చె నా ♦ తోయజాక్షి;
యిట్లు శపథంబులాడుచు ♦ నెంతొ శోక
మునఁ దపించుచు నేడ్చు నా ♦ ఘనమతి కటం. ౬౩ 2734

తే. శోకసంరోధమున మూర్ఛ ♦ నాకరణిని
గనుటవలనను జిత్తంబు ♦ కలఁతనొందె
నతఁడు పలవించి స్పృహతప్పి ♦ యాత్మశక్తిఁ
బోవ క్షితిఁబడి వగఁ గుందఁ ♦ బోయె రాత్రి. ౬౪ 2735

డెబ్బదియైదవ సర్గము సంపూర్ణము.

---

1 ప్రాణానుసరణార్ధ్నమే-అనిమూలము. పోవు ప్రాణముల నిలుపుచున్నానే యనిభావము.

## ౭౬ - వ సర్గము.

—భరతుఁడు తండ్రికి సంస్కారము చేయుట.—

*క. పలికెడు వారలలో నే,ర్పలవడ శుభవాక్యములను ♦ బలుకు వసిష్ఠుం
డల భరతు శోకతాపం,బులఁ బొగిలెడు వానిఁ గాంచి ♦ పూజ్యభణితులన్.

చ. పలికె మహాయశా! మనుజ♦పాలకపుత్ర! నితాంతచింతచేఁ
[1]బొలుపడనేల చాలు నిటు♦పోలునె, దుఃఖముఁ బాయవయ్య మం
గళ మగుఁగాక నీకు; నృప♦కాంతుఁడు స్వర్గముఁజేరుదేన ని
ర్మలతరతత్క్రియావితతి ♦ మానితరీతిని జేయు మీవికన్. ౨ 2737

చ. అనియె సమస్తధర్మవిదుఁ♦డౌ భరతుండు వసిష్ఠుపల్కులన్
విని మది ధైర్యమొంది పృథి♦వీపతి కంతటఁ బ్రేతకృత్యముల్
మునివరు నాజ్ఞఁ జేసె; నృప♦ముఖ్యుని నంతట నూనెతొట్టినుం
చినకతనన్ యథాస్థితిని ♦ జెందినవానిని నెత్తి భూమిపై. ౩౹ 2738

చ. ఉనిచిరి నూనెనుంచుటనె ♦ యొప్పుగఁ బచ్చనిచాయమోముతోఁ
గనఁబడి దేహభాగములు ♦ గాఁటియ నొందకయుంట నిద్రవో
యినగతినుండఁగా నతని ♦ నెంతయు రత్నము లొప్పు పాన్పునం
దునిచిరి భృత్యు; లాజనకు ♦ నొయ్యనఁ గాంచి నితాంతచింతచేన్. ౫ 2739

చ. భరతుఁడు దుస్సహార్తిఁ గని ♦ పల్కెను రోదనవాక్కులొప్ప భూ
వర పరదేశముం గనఁగఁ ♦ బంపిన నే నటనుండి యిప్పురీ
వరమును జేరకుండఁగనె ♦ భావుకధర్మవిదున్ రఘూత్తమున్
గురుబలశాలి లక్ష్మణుని ♦ గూడ వనంబుల కంపి యివ్విధిన్. ౬ 2740

క. సురపురి కేఁగఁగ నీవును, గరణీయంబంచు పూను ♦ కారణమేమో
ధరణీశా! శుభకార్యము,ల రతిం గను పురుషసింహు ♦ లలితమనస్కున్. ౬౹

తే. రామచంద్రుని విడిచి ని♦ర్భరవిచార
మగ్నులమయి తపించెడి ♦ మమ్ము నెల్ల
విడిచి యెటుపోయితివి? తండ్రి ♦ విశ్వపతివి
గాఁ జెలంగెడి నీవు స్వ♦ర్గమున కరుగ. ౭ 2742

క. వనములకున్ శ్రీరాముఁడు, చన యోగక్షేమములను ♦ సంతత మిప్ప
త్తనమునఁ గనుఁగొనువార లిఁ,క నెవ్వరున్నారు? నిన్నుఁ ♦ గానమి నిచటన్.

క. ధరణి యిది విధవయై యే,కరణిని రంజిలక చూడఁ♦గాఁదగ, దీపూ
ర్వరమును శశిఁ బాసినరా,తిరివలె నినుఁ బాసియున్న♦ది యనుచుఁ దోఁచెన్.

క. అని విలపించుచు దీనతఁ, గను మనమున నున్న భరతుఁ ♦ గని పల్కె మహా

* ఉవాచ వదతాం శ్రేష్ఠో వసిష్ఠ శ్శ్రేష్ఠవా గృషిః-అనిమూలము. 1 పొలుపడనేల=తఱుఁగనేల అని యర్థము.

మునియా వసిష్ఠుఁ డిట్లని, ఘనబాహూ! యిపుడు రాజ♦కాంతునకీవున్. ౧౦

తే. ప్రేతకార్యంబు లెవ్వెవ్వి ♦ విధిహితముగఁ
జేయఁగాఁ దగునో వానిఁ ♦ జింతమాని
త్వరగ నేమఱకయ చేయఁ ♦ దలఁపు మనిన
నట్లె యని వానిఁ బాటించి ♦ యాతఁ డంత. ౧౭ 2746

సీ. వేగంబు మీఱ ఋ♦త్విక్పురోహితులనాచార్యులఁ గృత్యముల్ ♦ జరపుఁడంచుఁ
ద్వరపెట్టె రాజసౌ♦ధంబున లోపల శవముంట వెలుపలి ♦ స్థలమునకును
దెచ్చి యుంపంబడు ♦ దివ్యాగ్నిహోత్రమ్ములను గార్హపత్యాదు♦లను బురోహి
తులును ఋత్విజులును ♦ విలసిల్లు విధిరీతిఁ గొనితెచ్చి రంతఁ జే♦తనములేని
తే. భూమిపాలకు సేవకుల్ ♦ పూన్కి శిబిక
యందు నునిచి మనస్సులు ♦ కొందలపడ
బాష్పకంఠంబులొప్ప నె♦ప్పటివిధంబు
గాక యేడ్చుచు మోసిరి ♦ కడుఁ బడలుచు. ౧౮ 2747

క. జనులొగి రాజతసుమములఁ, గనకపుఁ బుష్పముల వివిధ♦కమ్రాంబరరా
జిని జల్లుచుఁ బ్రోవల భూ,పుని ముందుగ నగలుమిగులఁ♦బోయిరిమఱియున్.

సీ. కొందఱారీతిని ♦ జందనాగరుచూర్ణముల గుగ్గిలమును స♦రళమనఁబడు
నట్టి ధూపముఁ బద్మ♦కాహ్వయపరిమళ దారువు మఱి దేవ♦దారువులను
జల్లుచు నడిచిర♦చ్చటతరంబులౌ ధూపనద్వస్తువులఁ జాల ♦ జనులు కొంద
ఱల్లనఁ జల్లుచు ♦ నరిగి; రచ్చటికేగినతఱి ఋత్విజులు భూ♦నాథు తనువు
ఆ. శిబికనుండి యెత్తి ♦ చితిపయిని బరుండఁ,బెట్టి రంత భరతుఁ ♦ డుట్టిపడెడు
చింతఁ బూని రాజ♦శేఖరునకును ద్రే,తాగ్ను లిచ్చె వారి ♦ యనుమతిఁగొని.

క. జనకున కిట్లగ్నుల ని,చ్చినఁ బైతృకమేధమను వి♦శేషంబుల నా
ఘనులు జపించిరి సామగు, లనూనవిధి గానములను ♦ నట సల్పి రొగిన్. ౧౯

చ. సరగున వృద్ధులైన పరి♦చారకులెల్లను జుట్టురాఁగ నా
ధరణిపు భార్య లర్హవిధిఁ ♦ దారుపురిన్ విడనాడి వాహనో
త్కరముల నట్లె చారుశిబి♦కంబుల నచ్చటికేగి రంత దు
ర్భరమగు చింతఁ బూను నృపు♦పత్నులు ఋత్విజులక్కుమారుఁడున్. ౨౦

. అఖిలయాగములను ♦ నగ్నిచయనమును, జేసినట్టి నృపతి ♦ శేఖరునకు
నప్రదక్షిణముల ♦ నపుడు ప్రదక్షిణ,ముల నొనర్చి; రంత ♦ వెలఁదు లెల్ల.

చ. మునుకొని క్రౌంచిరీతి నృప♦ముఖ్యుఁ జితాస్థితుఁ గాంచి జాలినే
డ్చినఁ బెనునాద మొక్కమొగిఁ ♦ జేరువనుండినవారికెల్లనున్
వినఁబడె నిట్టులేడ్చుచును ♦ వేయివిధంబుల వాహనాళిపైఁ
జని సరయూతటంబునను ♦ స్నానముచేయఁగ నిల్చి రార్తలై. ౨౨ 2753

క. నరవరు పత్నులు మంత్రులుఁ, బురోహితుల్ భరతుఁ గూడి ♦ భూపతికా త్రి
స్స్ఫురణమున నుదకదానము, సరిగా నొనరించి వగలఁ ♦ జాలఁ బొగులుచున్.

తే. పట్టణముఁ జేరి కన్నులు ♦ బాష్పపూర్ణ
ములుగ నుండఁగ నేడ్చుచు ♦ నిలఁ బరుండు
చును దశాహము లాశౌచ♦మున గడపిరి
పనుల వేనిని జేయక ♦ వగలు మిగుల. ౨౩ 2755

డెబ్బదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౨౨ - వ సర్గము.

### —భరతుఁడు శ్రాద్ధములఁ జేయుట.—

సీ. అంతటఁ బదునొకం♦డవ దిన మరుదేరఁ బుణ్యాహవాచనం♦బుల నొనర్చి
నాఁ డొనర్పఁగ దగి♦న పనుల నొనరించి యాశౌచముం దీర్చి♦యవల ద్వాద
శాహమ్మునం జేయ♦నైన షోడశమాసికముల నెల్లను యథా♦క్రమముగాఁగ
నొనరించి భూమిసు♦రోత్తములకు రత్నముల ధనంబుల నన్న♦మును నమూల్య

ఆ. వస్త్రములను మేటి♦వస్తువులను, మేఁక, గుంపు, రజతరాశి ♦ గోశతముల
దాసజనుల నుఱియు ♦ దాసీజనంబుల, వాహనాలయముల ♦ వసుధ నిచ్చె. ౧

క. జనకుని గుఱించి భరతుం, డనూనవిధి వలసినట్టు ♦ లవనీసురులో
య్యనఁ దృప్తినొంద నిచ్చెను, దనివిం గని వారు పోవఁ ♦ దా నామీఁదన్.

క. పదుమూఁడవదివసంబున, నుదయంబున నస్థిజాల ♦ మొగి గ్రహియింపం
గఁ దగం దత్స్థానమునకు, మది తల్లడ మంద వచ్చె ♦ మానియుతుండై. ౨

క. చనుదెంచి శోకమున మూర్ఛను గని యటు తెప్పిరిల్లి ♦ చాలస్వనంబున్
వినఁబడ నేడ్చెను; మఱియున్, జనకుని చితిఁ జేరి దుఃఖ♦నరణిం బలికెన్.

క. జనకా! నను నెవ్వరి కీ, వనునయమున నప్పగించి ♦ యరుగవలయునో
ఘనుఁ డన్న యతఁడు చనియెన్, వని కీవును నన్ను శూన్య♦వసుధ విడిచితే.

తే. విను మనాథకుఁ గౌసల్య♦కును గతియగు
నట్టి రాముని నడవికి ♦ నంపితీవు
తనయునిం బాసి దిక్కులే♦ని నెలఁతవిడి
యెందుఁ బోయితివో తండ్రి ♦ యిపుడు నీవు. ౬

క. అని తండ్రిశరీరము కాల్చినదయి యెఱ్ఱనయి భూతి♦చేఁ దగి దగ్ధా
స్థినికరముల నొప్పిన స్థలమును గని బిగ్గఱఁగ నేడ్చి ♦ మోము కలంగన్.

తే. అంతఁ జితిఁ గని దీనుఁడై ♦ యతఁడు రోద
నంబు చేయుచుఁ దంతుసం♦తతిని బైకి

నెత్తఁబడుతఱి సడలుట ♦ నింద్రుధ్వజము
ధరణిఁ బడునట్లు పడియెను ♦ ధైర్యమెడల. ౯ 2763

ఉ. ఆతనిపాటుఁ జూచి సుకృ♦తాంతమునం బడు నయ్యయాతివి
ఖ్యాతునిఁ [1]బుత్త్రికాతనయు♦లైన మునీశులు లేవనెత్తు న
ట్లాతఱి జ్ఞాతులందఱును ♦ నాతని లేపఁగఁ జెంతఁజేరి; రా
భూతలనాథపుత్త్రకుఁడు ♦ పొక్కుచు నేలను వ్రాలఁగాంచుచున్. ౧౦ 2764

[2]తే. ధైర్యమొప్ప శత్త్రుఘ్నుఁ డిం♦తవఱకుండి
యన్నశోకంబునం బ్రుంగి ♦ యట్లుపడుటఁ
గని మహీశునిఁ దలపోసి♦కొనుచుఁ బరవ
శత్వమున భూమిఁ బడియె, వి♦సంజ్ఞుఁ డగుచు. ౧౧ 2765

క. భరతుని తమ్ముఁడు జనకుని, యరుదగు సద్గుణగణంబు ♦ నవయవముల సం
స్మరియించుచు నున్మత్తుని, కరణిన్ దుఃఖమునఁ బల్కెఁ ♦ గళవళపడుచున్.

సీ. అక్షోభ్యమై మంథ♦రాంగంబునం బుట్టి కైకయన్ దుర్గ్రాహ♦కలితమగుచు
వరదానజలముల ♦ వర్ధిలి లోఁతును గల దుఃఖభూరిసా♦గరము మమ్ము [డు
ముంచెఁ; దండ్రీ! యెప్డు♦ముదమున లాలించుసుకుమారుఁడును బాలుఁ♦డకుటిలుం
నగు భరతుఁడు చాల ♦ వగఁ గుంది యేడ్వంగ నాతని విడిచి నీ ♦ వరిగితి వెట

ఆ. కయ్య! భోజ్యపాన♦కాంబరాభరణాది, వస్తువులను మాకు ♦ వలయుదాని
లలి గ్రహింపుఁడనుచు ♦ బలవంత పెట్టి చే,కొనఁగఁ జేయుదీవు♦కోర్కిమమ్ము.

క. జనకా! యిఁక నెవ్వరు మ, మ్మనునయమున నట్లు చేయ ♦ నర్హులు? ధర్మ
జ్ఞుని మహితాత్ముని నిను విడిచిన యీధర పగుల కిట్లు ♦ స్థిరతం గనునే!. ౧౬

ఆ. కనుక నిద్ది ప్రళయ♦కాలంబునం గూడఁ, బగుల కుండునేమొ; ♦పరమపదముఁ
దండ్రి పొంద నన్న ♦ దారుణాటవి కేగ, [3]నేమి బ్రతుకశక్తి ♦ యింక నాకు.

క. కనుక హుతాశనుఁ జొచ్చెద, జనకభ్రాతలను మాని ♦ సమధికలక్ష్మిం
గన నిక్ష్వాకుసుపాలిత, మనఁబడు నీపురము శూన్య♦మై యిట్లుండన్. ౧౮

క. నేనెంతమాత్ర మియ్యెడ, దీనిం జొరఁబూన ననుచు ♦ దీనత నేడ్చెన్
భూనాథతనయు లిద్దఱు, మానక పలవింపఁ గాంచి ♦ మనసులు కలఁగన్.

[illegible] వచ్చిన, వారందఱు మరల దుఃఖ♦వార్ధి మునిఁగి రీ
తిరున [illegible]రు, భూరితరాత్రిం దపించి ♦ పొంగెడు వగచేన్. ౨౦

క. పలవించుచుఁ గడు[illegible]ని, నలసి ధరంబడిరి కొమ్ము ♦ లల్లన విఱుగన్

1 దౌహిత్త్రమ్ముషయో [illegible]-అని మూలము. ఋషయః దౌహిత్త్రభూతాః-అని వ్యాఖ్య. [illegible] ననుసరించియే వ్రాయఁబడినది. 2 భరతపతనావధి శత్త్రుఘ్నస్య ధైర్యం స్థితం-అని వ్యాఖ్య. 3 కిం మే జీవితసామర్థ్యమ్-అని మూలము.

క. వసువుఁడు కొందఱు మనవెంట నేఁగుదు రని యుపదంచుచు వగ నెమ్మనమున; రాముని విషయంబున భక్త్యనురాగము లనుఁ బూని పలుకుచుండన్.

క. తన రెడు భరతుని శుభవచనముని గని సభవారు లెల్ల నుత్సాహంబునఁ బల్కి రిట్లు జ్యేష్ఠుని, మనసున నెన్నుగారు నృపుని సమ్మతం జేయన్.

క. భరతా! మనమునఁ గోరితి, వరముగ నిట్టుండ పాట ననయము [1]పద్మాకరయగు శ్రీదేవియు ని,న్నరయుచు నివసించుఁగాక యని రాపిదపన్. ౧౫

సీ. రామునిఁ గొనివచ్చి రాజ్యంబొసంగెదనను విషయంబున నాభరతుఁడు పల్కిన యాశుభవాక్యముల్ విని యాత్యలా మంత్రులెంతయు నలరి రంత వారికన్నులనుండి పరమసంతోషాశ్రుజలములు దొరిఁగె నాసచివముఖ్యులాతఁడు చెప్పినయవల దుఃఖము మాని పల్కి; రో పూరుషవర్య! నీదు

తే. నాజ్ఞ చొప్పున నృపభక్తులైన భృత్యు లెల్ల మార్గము రక్షింప నెందుఁ ద్రోవ లరసి చక్కఁ [illegible]ంగ నియ్యదనుసంద దిట్టపఱచితి [illegible] మందిం జెలంగె. ౧౭ 2823

నూటపదియేడవ సర్గము సంపూర్ణము.

---

౮౦ - వ సర్గము.

వనమార్గమును జక్కఁబఱచుట.

సీ. తదనంతరంబున ధరణిభాగస్వభావముల నెఱింగిన ప్రజలు, కూప వాపీజలంబులఁ బడయంగఁదగుసూత్రముల నెయుతంతువాయులును, స్వీయ కార్యమా మార్గరక్షణము చేయంగను వలంతులౌ శూరులు వసుధఁ ద్రవ్వువారలు, యంత్రజీవనులును భృతిజీవనులు శిల్పు లధ్యక్షకులగు రాజ

తే. పురుషు లోడలు నడుపంగఁ బూనఁదగిన యంత్రములు చేయ నేర్పరులైనవారు [2]వర్ధకులు మార్గరక్షణపరులు వృక్షములను దెగఁగొట్టువారును ముందు చనిరి. ౨ 2824

తే. బావులం ద్రవ్వువారును వైణకార్య తత్పరులు సున్నమును బూయఁ దగినవారు తక్కుపనులందు నేర్పునఁ దగినవారు చనిరి ముందుగ మార్గముల్ చక్కఁజేయ. 3 2825

1 పద్మాశ్రీ రుపతిష్ఠతామ్-అని మూలము. 'పద్మా=పద్మాలయా' యని వ్యాఖ్య. 2 వర్ధకులు=డ్రంగులు.

క. జను లవ్వారలు లెక్కిం, పను శక్యముగాక రామ♦భద్రునిఁ గను వే
డ్కను వెలసి [1]రతని కానన, మునకై పోవుతఱిఁ బర్వ♦మునఁ గంథివలెన్. ౪

సీ. మార్గముల్ సరిచేయ ♦ మంచినేర్పును గల్గువారలెల్లను దమ♦భాగములను
నిర్ణయించుకొనుచు ♦ నియతిచేఁ బరికరములను గైకొని చని♦ రెలమి ముందు;
వారు మార్గమ్మున ♦ ఘోరమ్ముగా నడ్డపడియుండు కొమ్మల ♦ వల్లులఁ దగ
గుల్మంబులను శూన్య♦కుజముల జాల నిక్కను బెక్కు వృక్షంబు♦లను గుఠార
తే. ధారలం ద్రుంచి పోవంగఁ ♦ దగనిపట్ల
నేర్పఱిచిరి మార్గంబుల ♦ నేగి కొంద
ఱందుఁ జెట్లు లేకుండునో ♦ యందు వానిఁ
జక్కఁగా నాటి కైచేసి ♦ రొక్కమొగిని. ౬-౭ 2827

సీ. అందందు దారుల ♦ కడ్డంబుగానున్న చెట్లు మున్నగువానిఁ ♦ జెలఁగి తీవ్ర
తమకుఠారముల ఱం♦పములఁ బాఱలఁ గొని త్రుంచిరి; కొందఱం♦దుర్బలాఢ్యు
లగువారు బలముగా ♦ నగపడు నవురుగంటలను గాల్చి, పోవ ♦ నలవిగాని
విషమస్థలంబుల ♦ విమలరీతులఁ జక్కపఱిచిరి కొందఱు ♦ [2]పద్ధతికిని
తే. నడ్డముగనున్న బావుల ♦ నతివిశా
రంధ్రముల మృత్తికం ద్రోసి ♦ రః మార్గ
ములను జేసిరి; నిమ్నభూ♦ముల సమాన
తలములుగఁ జేసి కైస్సేనః♦ రలఘుగతుల. ౮ 2828

క. సేనలు దాఁటుట కనువుగ, వే నదులకు వంతెనలను ♦ వెలయించిరి రా
ట్సూనుఁడు వచ్చెడు త్రోవను, బానుగఁ బాషాణములర♦జంబుగఁ బూన్కిన్.

క. ఒనరించి జలములూఱుట, గనుపట్టెడు చోటులందుఁ ♦ గడఁగి జలము పో
వను జేయఁ ద్రవ్విరంతట, జను లవ్వారలొగి నల్ప♦జల[3]నిమ్నగలన్. ౧౦

ఆ. అచిరకాలముననె ♦ యధికజలంబులు, గలుగఁ గట్టలను ద♦గంగఁ గట్టి
దిగుట కనువుగాఁగ ♦ సొగనుగ రేవులు, మెట్లు గలిగి కడలి ♦ మించఁ జేసి.

సీ. వెలయించి యంతట ♦ సలిలంబులే లేని స్థలముల నరులకు ♦ సామజముల
కశ్వాదులకుఁ ద్రావ ♦ ననువగు తీరున నడబావులం ద్రవ్వి ♦ బడలివచ్చి
సలిలంబులం ద్రావి ♦ శ్రమవాయునట్లుగ విశ్రమించుటకయి ♦ వేదికలను
నిర్మించి; రంతట ♦ నిఖిలసేనలు వచ్చుఁ ద్రోవల నున్నంబు♦తోడ జాలఁ
తే. బఱచి గట్టనచేసి, రం♦భస్సు లెపుడు
పాఱుచుండుట వృక్షముల్ ♦ బహుళకుసుమ
యుతములై యప్పుడొప్పారెఁ; ♦ బతగములును
బలసి కూయుచునుండెను ♦ లలితరీతి. ౧౨-౧౩ 2832

1 అతనికాననము=ఆరాముఁడుండువనము. 2 పద్ధతి=మార్గము. 3 నిమ్నగలు=నదులు.

